అనువాదకులు :

ఆదిపూడి సోమనాథరావు (౧౦ సముల్లాసములు)
ఆదిపూడి గోపాలరావు (౧౧ సముల్లాసములు)
ధూళిపేట రాజరత్నమాచార్యులు (౧౨, ౧౩, ౧౪ సముల్లాసములు)



సంశోధకులు :

పండిత గోవర్ధన్ (దార్శనికులు)
వద్దమూడి వెంకటరత్నము గారు ఉ. శాస్త్రప్రవీణ
మదనమోహన విద్యాసాగర వేదాలంకార్

ప్రకాశకులు :

ఆర్య ప్రతినిధి సభ ఆంధ్ర ప్రదేశ్ హైదరాబాదు-500 195

# ప్రాక్కథనము

ఋషి దయానందస్వామి విరచిత సత్యార్థప్రకాశ గ్రంథము నవ యుగారంభమునకు నాంది. దీని ప్రకాశకిరణాలు ఆధునిక యుగమునకు ప్రశస్తమైన మార్గమును చూపుననుటలో అతిశయోక్తి యేమాత్రము లేదు. లౌకిక విజ్ఞానాగ్నిలో సంతప్తమగుచున్న పాశ్చాత్యదేశములకు మతకట్టడ ములకు లోనై దీనత్వమువలె నున్న ప్రాచ్యదేశములకు నవయుగవిధాత యగు ఋషి దయానందుడు నవచైతన్య సందేశమును ప్రసాదించెను.

ఈ అమరగ్రంథము ప్రప్రథమముగా క్రీ. శ. 1875 లో ఆర్యభాష (హిందీ) లో ముద్రింపబడెను. దీనిని సవరించి క్రీ. శ. 1884 లో రెండవ పర్యాయము ప్రచురింపబడి నేటిదియే ప్రామాణికగ్రంథముగ నమ్మబడు చున్నది. నేటివరకు సుమారు పదిలక్షల ప్రతులు ముద్రింపబడెను. గత 90 సంవత్సరములనుండి రామాయణము గీత పిదప అధికసంఖ్యలో హిందీభాషలో ప్రచురింపబడిన ఈ గ్రంథముకంటె అన్యగ్రంథము లేవియు యింత అధిక సంఖ్యలో ముద్రింపబడలేదు.

ఇందాశ్చర్యమేమనగా ప్రపంచములోని ఏ యితరభాషలలోకూడ కాదావు ఈ వంద సంవత్సరముల వ్యవధిలో ఇంత అధికసంఖ్యలో ప్రచురింపబడిన మరియొకగ్రంథ మేదియును లేదు. నేటివరకు అన్యభాషలలో అధికసంఖ్యలో యీగ్రంథమువలె మరియే యితరగ్రంథము అనువదించ బడలేదు.

ఈ యుగప్రవర్తకగ్రంథము సంస్కృత పంజాబి, గురుముఖి, ఉర్దూ పారసీ, సింధీ, గుజరాతీ, మరాఠీ, బెంగాలీ, ఒరియా, కన్నడ, తమిళ, మలయాళం, చైనీ, బర్మా, నేపాలీ, ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మనీ మున్నగు భాషలలో అనువదింపబడెను.

ఈ సత్యార్థప్రకాశ గ్రంథ ప్రభావ మేమనగా :—

౧. పాశ్చాత్యదేశములందలి మాక్సుముల్లర్ ప్రభృతులగు విద్వాంసుల వేదములను పరిశోధించు నెపమున ఆర్యుల ధర్మమును కించపఱచి క్రైస్తవమతమే సర్వోత్కృష్టమని ప్రచారము చేయుచున్న పాషండులందఱు బ్రద్దలయ్యెను. తుదకు మాక్సుముల్లర్ కూడ తన యభిప్రాయములను మార్చుకొనవలసి వచ్చెను.

౨. ధార్మికజగత్తులో మహాసంక్షోభముద్భవించెను. తత్ఫలితముగా భారతీయుల ధార్మికదృష్టివి. పరంపరా గతాభిప్రాయములను మార్పుచేయుటయే గాక విశ్వములోని అన్య వివిధమతసంబంధులు కూడ తమతమ మతగ్రంథములకు నూతనవ్యాఖ్య చేయసాగిరి.

౩. విద్యాసంపన్నులైన మానవులకు యీ గ్రంథము స్వతంత్రచింతనకు ఒక దృఢాధారమగుటయేగాక నూతనోత్సాహము, నవీనప్రేరణను కలిగించెను.

౪. భారతీయుల ప్రజాజీవితములోను సాంఘిక రాజకీయ నైతిక ధార్మికదృష్టియందు విప్లవాత్మకమైన మార్పు లంకురించెను.

ఈ గ్రంథము మానవజీవిత వికాసమునకు తోడ్పడుటయేగాక పర విషయములకును జ్ఞాననిధి. అనేకపర్యాయములు దీనిని పఠించినవారు లాభము పొందుటయేగాక ఇతరులకుగూడ పాఠకులవలన బోధ కలుగును.

భారతదేశ భాషలలోనేగాక విశ్వవిఖ్యాత భాషలన్నింటిలో నీ గ్రం వాద ములభ్యము.

ప్రస్తుత మీ గ్రంథము తెనుగుభాషలోని పంచమ ప్రచురణము. ప్రథమముగా తెనుగుభాషలో క్రీ. శ. 1940 పూర్వము రెండుసార్లు ముద్రింపబడినది. క్రీ. శ. 1906 లో శ్రీ పం॥ ఆదిపూడి సోమనాథరావుగారిచే నాంధ్రభాషలో పదుల సముల్లాసములవరకును క్రీ. శ. 1912 లో వారి సోదరులు పం॥ గోపాలరావుగారిచే పదునొకండవ సముల్లాస మనువదింపబడి దక్షిణ హైదరాబాద్ ఆర్యసమాజమువారిద్వారా ప్రచురింపబడెను. క్రీ. శ. 19[illegible] లో

శ్రీ పం॥ డా. రాజరత్నమాచార్యులుగారిచే కరపటి పన్నెండు, పదమూడు, పదునాలుగు సమూల్లాసముల యనువాదము నొనర్పబడి మరల దక్షిణ హైదరాబాద్ ఆర్యసమాజముద్వారానే రెండవసారి ముద్రింపబడెను.

క్రీ. శ. 1940 పిదప హైదరాబాద్ ఆర్యప్రతినిధిసభ ద్వారా సమాచారకులైన శ్రీ పండిత మదనమోహన విద్యాసాగరుగారితో తెలుగు సత్యార్థ ప్రకాశమును సవరించి మరల తృతీయ ప్రచురణ చేయించవలయునని విజ్ఞపించితిని.

నా ప్రార్థనను అంగీకరించి శ్రీ పం॥ మదనమోహన విద్యాసాగరుగారు యీ గ్రంథమును సవరించు బాధ్యతను వహించిరి. ఈ గ్రంథ సవరణమునకు తోడ్పడుటకు శ్రీ పం॥ రుద్రదేవుగారిని ఈ సభవారు తెనాలికి పంపిరి.

సంస్కృతాంధ్రాంగ్ల హిందీ భాషాకోవిదులైన కీర్తిశేషులగు మనన శీలురైన శ్రీ వల్లూరి వెంకటరత్నముగారు, ఆర్యనిష్ఠాగరిష్ఠులగు, యోగాభ్యాసరతుడు శ్రీ పం॥ గోపదేవ దార్శనికులుగారు మరియు ఆర్యసిద్ధాంత ప్రవృత్తి వ్యాఖ్యాకారుడగు వేదవిదులైన శ్రీ పం॥ మదనమోహన విద్యాసాగర వేదాలంకారుగారు యీ ముగ్గురు మహనీయులు కలిసి చింతనపూర్వకముగ చేసి అనువాదభాషను పరిష్కరించి తెనాలిలో నాలుగుమాసములలోనే మూడవ కూర్పును సిద్ధపరచిరి.

తదుపరి నాల్గవకూర్పుగూడ శ్రీ పం॥ గోపదేవుగారు పం॥ మదనమోహన విద్యాసాగరుగారు యీ యుభయ పండితవర్యులచే హైదరాబాదులో [illegible]ము చేయబడినది.

నాల్గవసారి ముద్రింపబడిన యీ తెలుగు సత్యార్థప్రకాశము ఎన్నియు అనతికాలములోనే విక్రయమయినవి. విద్వాంసులు చూపిన కొన్ని సవరణ మార్పులను గ్రహించి మరల దీనిని పంచమ ప్రచురణ చేయుమని నేను కోరగానే యీ యుభయపండితు లాకార్యమును వహించి, క్రమముగ తమ అమూల్య సమయమును వినియోగించి ఐదవ కూర్పును సిద్ధపరచినందులకు వారి కరవుడ పేరిత నా కృతజ్ఞత. అధికశ్రద్ధ వహించి సముచితమైన సలహాలనిచ్చి ఈ

కార్యములో సహకరించినందులకు విశేషించి పం॥ మదనమోహన విద్యాసాగర్ గారికి సభవారు హృదయపూర్వకముగ కృతజ్ఞత వ్యక్తపరచుచున్నారు

ఈ పంచమప్రచురణలోని ముద్రణదోషములను దిద్దు కార్యభారమును శ్రీ. వీరభద్రశాస్త్రిగారు వహించినందులకు మా కృతజ్ఞత.

సాధ్యమైనంతవరకు ముద్రణ దోషరహితంగా ఉండేటట్లును సర్వాంగ సుందరంగా నీ గ్రంథమును సిద్ధపరచుటకు ప్రయత్నించితిమి.

ఆంధ్రలోక మీగ్రంథమును పఠించి జీవితవికాసమును పొందుటేగాక అచిరకాలమునందే ఆఱవకూరి ముద్రణకై ప్రోత్సహించగలదని మా ఆకాంక్ష.

నరేంద్ర
ప్రధాన్, ఆర్యప్రతినిధిసభ మధ్యదక్షిణ
హైదరాబాదు. ఆంధ్రప్రదేశ్.

# సంశోధకుల విన్నపము

తృతీయ ప్రచురణము క్రీ.శ. 1940 : పండిత గోపదేవ్ (దార్శనిక్)

తెలుగు భాషలో సత్యార్థప్రకాశమున కిది మూడవ కూర్పు. మొదటి రెండు కూర్పులను నిజామ్ హైదరాబాదు ఆర్య ప్రతినిధి సభవారిచే ప్రకాశింపజేయ బడినవి. అందు మొదటికూర్పు కంటె రెండవకూర్పు చాలవరకు సంస్కరింపబడి యున్నదనుటలో సందియములేదు. కాని దీని నింకను సంస్కరింప దగుననియు, లేక మరియొక యనువాదము చేయింపదగుననియు పాఠకులు పెక్కురు పలుమారు కోరుచుండిరి. ఉపర్యుక్త సభాధికారులలో గొందఱు సజ్జనులు ఈ చివరి యభిప్రాయమును పెక్కుసారులు ప్రకటించి యుండిరి.

ఇట్లనేక విధముల ప్రేరింపబడియు గ్రంథమహత్వమును గుర్తించుచు నీ మహాకార్యమును సరిగా నిర్వర్తింపజాలనేమోయను భయమున రెండు మూడు సంవత్సరముల నుండి గడిపితిని. గాని తప్పక పోవుటచే నీ సంవత్సరము ఎట్టులైనను నీ కార్యము గట్టెక్కింప నిశ్చయించితిని. నాకు మిత్రులును ఆప్తులు సంస్కరణ శీలురు. ఉభయభాషా ప్రవీణుడు నగు శ్రీ పండిత వల్లూరి వెంకటరత్నము గారి ద్వారా యీ కార్యము నిర్వర్తింపనెంచి వారి నడుగ నాయందు, తెలుగుభాషయందు, ఆర్యసమాజము నందుగల యను రాగముచే నంగీకరించిరి.

అటుపై పూర్వానువర్తుల యమూల్య పరిశ్రమఫలము మెఱుగుపెట్టుట కు కృపుగింపని వారమై ఏ లైదంతవరకు దానినే మెఱుగుపెట్టి నిశ్చయించి దినమున తేరెడిమిది గంటల చొప్పున నెం నాళ్లలో నీపని నేటికి యొక విధముగ ముగించితిమి. దీనిని హిందీ సత్యార్థ ప్రకాశముతో పరిశీలించుచు పదాపదముగ సరిచూచితిమి. భాషా సారళ్యమునకు, శైలీమాధుర్యము నకు యథాశక్యముగ ప్రయత్నించితిమి. అన్నిదినములును చూచు సమ్మాన పూర్వకముగ నాతిథ్య మొసగుచు నీ కార్యమున సర్వవిధములందోడు పడిన శ్రీ పండిత మదనమోహన విద్యాసాగర్ గారికి ధన్యవాదములు. ఈ గ్రంథ మీ రూపముగ నగుటకు తోడుపడిన వారికి కృతజ్ఞుడను.

పదునేడవ ప్రచురణము క్రీ.శ 1948 : పండిత గోపదేవ (శాస్త్రి)

ఈ తెలుగు సత్యార్థ ప్రకాశమును నేను హైదరాబాదు నందుండి పండిత మదనమోహన విద్యాసాగర్ వేదాలంకార్‌గారితో సంప్రదించి మరల సంశోధనము చేసితిని. ఈ ప్రచురణ సమయమున శ్రీ వల్లమూరి వెంకట రత్నముగారు స్వర్గస్థులైనందులకు మాకు చాల విషాదము కలిగెను. పండిత విద్యాసాగర్‌గారు పాంచాల ప్రాంత వాస్తవ్యులు. కాంగడీ గురుకుల స్నాతకులు. గురుకులమున విద్యా వ్రతమును పూర్తిచేసి క్రీ. శ. 1937 నుండి ఆంధ్ర ప్రాంతమున వేదమతమున ప్రచార మొనర్చు నిమిత్తము సార్వదేశిక ఆర్య ప్రతినిధి సభ (ఢిల్లీ) అధికారులచే ప్రచారకులుగా నియుక్తులై నేటి వరకు ఇట ప్రచారము చేయుచున్నారు. ఈమధ్య కతిపయవత్సరములు ఆఫ్రికా మున్నగు విదేశములందును ఆర్యధర్మ ప్రచారముచేసి యున్నారు. వారు ఈ సత్యార్థప్రకాశమును అనువదించుటకు తృతీయ సంస్కరణమునుండియే నన్ను ప్రేరేపించుటకు కారణమగుట వారిని గుర్తించుటలో నానాకాలములందు నాకు మిక్కిలి సహకృతి నొనర్చియున్నారు.

పదునెనిమిదవ ప్రచురణము క్రీ.శ. 1970 : పండిత మదనమోహన విద్యాసాగర్

ఆంధ్రప్రదేశ్‌లో ఆర్యధర్మ ప్రచారమునకొరకు సత్యార్థప్రకాశ గ్రంథమును తెలుగు అనువాద మత్యవసరమని క్రీ. శ. 1940 లో ఆంధ్రప్రదేశ్ లోని కూచిపూడి (తెనాలి) వాస్తవ్యులగు శ్రీ పం॥ గోపదేవ ప్రభృతుల కొరకు మొదట కలిగెను. అంతకుపూర్వమే హైదరాబాదు (నిజామురాజ్యము)లో తెలుగు సత్యార్థప్రకాశము వెలువడినది. కాని అంతర్ధానమయినది. ఆర్యప్రతినిధి మహాసభవారు తెనాలినుండి హైదరాబాదునకు వెంచేసినపుడు యీ సత్యార్థ ప్రకాశము మరల ప్రచురణ చేయవలయునని పండిత నరేంద్రజిగారిద్వారా విదితమయ్యెను. మద్రాసునకు చెందిన ఆంధ్రప్రాంతమునకు, నిజాంరాజ్యము లోని తెలంగాణాప్రాంతమున కనుగుణ్యంగా ఉండునట్లు నా సంపాదనమనుసరించి నా పై అనువాదమును పరిష్కరించి ప్రచురించుటకు నిశ్చయించబడెను.

శ్రీ పం॥ ఘరేంద్రగారు ఈ కార్యమును నాపై మోపగా తెనాలి వాస్తవ్యులగు స్వర్గీయ శ్రీ వల్లమూడి వెంకటరత్నముగారు, శ్రీ పం॥ గోప దేవుగారు (దార్శనికులు) మరియు నేను ముగ్గురము కలిసి తెనుగు అను వాదమును పరిష్కరించి నాలుగు మాసములలోనే మూలసహితమ్మును సిద్ధపర చితిమి.

తదుపరి దీని చతుర్థప్రకరణమును కూడ పం॥ గోపదేవు గారును నేనును సిద్ధపరచితిమి.

గోవిందరామ్ హాసానంద (నయీసడక్) వారి హిందీలో లభ్యమైన ప్రామాణిక సత్యార్థప్రకాశము తెలుగులోని తృతీయ చతుర్థ ప్రకరణముల కాధారము.

శ్రీమతి పరోపకారిణీ సభ అజ్మీరువారి ప్రకరణ, శ్రీ స్వామి వేదా నందులవారి, శ్రీ పం॥ భగవద్దత్తుగారి హిందీ ప్రామాణిక ప్రకరణముల ఆధారమేగాక ముఖ్యముగా హిందీ ప్రథమసంస్కరణమునుండి తీసిన ఫోటో కాపీల ఆధారముపై ఈ తెలుగు పంచమ ప్రకరణ సిద్ధపరచబడెను.

ఈ అనువాదములో హిందీ తెలుగులోని సమానార్థములు గల సంస్కృత తత్సమ శబ్దములకు తగు ప్రాధాన్య మొసగబడెను.

అనువాదము చేయుట మహా కష్టసాధ్యము. మూలగ్రంథభాషలోనున్న భావము లోపముగాకుండ అనువాదములో అవిచ్ఛిన్నభావప్రకటన, తద్వాక్య భాషాపదములయందు సంప్రదాయము శైలి భావవ్యక్తత మొదలగునవన్నియు అనువాదకర్తదృక్పథములో అనుపేక్షణీయములు. కావున దయానందవిరచిత గ్రంథములలోని ప్రతి ప్రదము ప్రతి వాక్యము ప్రతి అనుచ్ఛేదము (పైరా) గూఢార్థసమన్వితమై విలసిల్లుచున్నది. కనుక వీరి గ్రంథములు అనువాదము చేయుట మహాకష్టతరము. వీరి సమస్తగ్రంథములు బ్రహ్మనుమొదలు కొని వ్యాస, జైమిని, విరజానంద పర్యంతము ఋషుల వేదానుకూలమైన అభిప్రాయ పారగర్భ పరిపూరితము.

అయినప్పటికిని మా యథాశక్తిగా శ్రద్ధతో దీనిని సవరించి అధునాతన రూపము నిచ్చుటకు ప్రయత్నించితిమి.

ప్రస్తుతము ఈ పంచమ ప్రచురణమును ఆంధ్రపాఠకులకు అంద చేయుచున్నందులకు ఆంధ్రలోకము మాకు సదవకాశము కలిగించినందుకు చాల సంతోషము.

ఈ గ్రంథమందెక్కడనేనియు లోపములేవైన నున్నయెడల విద్వాంసులు మాకు సూచించిన రాబోవు ఆరవ ప్రచురణమున సవరించి ముద్రింపగలము.



ఓమ్

# మహర్షి శ్రీమద్దయానంద సరస్వతి

(యుగవిధాత తత్త్వవేత్త)

మూలము:- శ్రద్ధానందస్వామి    అనువాదము:- పండిత గోపదేవ్

విక్రమ శకం ౧౮౮౧ (క్రీ. శ. ౧౮౨౪)లో ఒకానొక తిథియందు మోర్వీరాజ్యమున (సౌరాష్ట్ర-గుజరాత్) టంకారాగ్రామవు సామవేదీయ ఔదీచ్య బ్రాహ్మణకులమున నొక బాలకుడు పుట్టెను. ఆ బ్రాహ్మణుడు ధనాఢ్యుడు. భూస్వామి జమేదార్ అనగా రచ్చరాజ-కర్మచారి. తనకు బుట్టిన బాలకునకు మూలశంకరుడని పేరుపెట్టెను. అతడు శైవుడు. తనపుత్రుడు ఐదువేండ్ల ప్రాయము కలవాడు అగుటయే తడవుగ దేవనాగరీ అక్షరాభ్యాసము లిపి నేర్ప నారంభించెను. కులధర్మము ననుసరించి శ్లోకములు మంత్రములు స్తోత్రములు నేర్పదొడగెను. ఎనిమిదేండ్లు రాగానే ఉపనయనముచేసి గాయత్రీ మంత్రముతోపాటు సంధ్యావందనాదుల నలవరచెను. రుద్రాధ్యాయము కంఠస్థము చేయించి యజుర్వేద సంహిత నభ్యసింపజేసెను. శివభక్తియందు ప్రేమకలిగించుటకు పార్థివపూజ నుపదేశించెను. పదియేండ్ల ప్రాయమున మూలశంకరుడు పార్థివపూజ నొనర్చుటకు సాధారణ వ్రతమును గ్రహించెను.

పదునాలుగేండ్ల ప్రాయమున (వి.శ. ౧౮౯౪) (క్రీ.శ. ౧౮౩౮) తండ్రి కుమారుని శివరాత్రి వ్రతము చేయసిద్ధముచేసెను. పగలంతయు శివపురాణమునుండి రుచికరములైన శివుని కథలు వినిపించెను. మూలశంకరుడా కథలు విని మోహితుడై తల్లి వారించినను వినక యుపవసినాలుగు గంటలు ఉపవాసముచేయ పట్టుదలవహించెను. రాత్రివేళ శివాలయమున భక్తులెల్లరు చేరిరి. పూజచేసి క్రమముగా నెల్లరు నిద్రించిరి. మూలశంకరుని సామవేదియగు తండ్రియు కునుకుపాట్లకులోనయ్యెను. కాని పదునాలుగేండ్ల బాలుడు మూలశంకరుడు మాత్రము శ్రద్ధాప్రేరితుడై కనులు మూతపడుచుండ నీటితో ముఖము కడుగుకొనుచు మెలకువతోనుండెను.

అపుడర్ధరాత్రివేళ జరిగిన విషయమును మూలశంకరుడు దయానందుడైన తరువాత వర్ణించిన శబ్దములనే యిక్కడ వ్రాయుట యుచితము.

"ఆలయముగల బిలమునుండి యొకయొకటి బయటికివచ్చి శివలిం
గమునకు నలువైపుల తిరుగజొచ్చెను. ఎగిరిలింగముపై నెక్కెను. భక్తుల
ర్పించిన నైవేద్యాదులను తినదొడగెను. అప్పుడు చిత్తమున పరివిధములగు
వాలోచనలు రేకెత్తెను. "నేనెవని కథలు వింటినో యా మహాదేవుడేనా యీ
పురుడు"? అని ప్రశ్నమదయించెను......కథలలో విన్నమహాదేవుడు పర
బ్రహ్మమగునెడల నతని శిరస్సుపై ఎలుకలెట్లు పరుగువిడును......పాశు
పతాస్త్రముతో దైత్యులను సంహరించినవాడుకదా! అతడీ క్షుద్రజంతువును
తనపై గంతులిడకుండ జేయలేడా?"

అంతటనాబాలుడు తండ్రిని లేపెను. వ్యాకులుడై తన ప్రశ్నలను తం
డ్రికి వినిపించెను. తండ్రి పుత్రుని తరబుద్ధిని కుంఠితముచేసి యతని సంద
శ్యానునిగ్రహింప యత్నించెను. బాలుడు కదిరుచియుంపక యతడు కల్యాణ
కరుడగు నిజమైన శివుని దర్శనముచేసికొననంతవరకు ఆహారపానీయములంత
టిని విడువ సంకల్పుడయ్యెను. ఆ బాలుడు పరమేశ్వరుని సాక్షాత్కా
రము తలగాంచునంతవరకు అన్నపానములను తలయొగ్గి యొసంగడు. ఆశివరాత్రి
నాడే యీ విచిత్రబాలకుని యాత్మికజన్మము కలిగినదనవచ్చును. కావుననే
యతని జన్మదినము తెలియకపోయినను శివరాత్రినాడతని జన్మదినోత్సవము
జరుపుట యుచితముగా నెంచబడెను.

మూలశంకరుడు విద్యార్జనమున తత్పరుడయ్యెను. అతడు పదునా
ల్గేండ్లవాడుగా నతనికంటె రెండేండ్లు చిన్నదియైన యతనిచెల్లెలు మరణిం
చెను. తలిదండ్రులెంత ప్రయత్నించినను లాభములేక నాల్గుగంటలలో నామె
మృత్యువాతబడెను. దాంతటనైన మూలశంకరునకదియంతయు వింతగా
దోచెను. చెల్లి అన్నతో మాటలాడదు. అతనివంక చూడదు. ఇదియేమియ్యో ప్రాణ
ప్రియ నేలవిస్మరించినదో యతని కర్థముకాదు. విస్మితుడై చిత్రలిఖితుడైవలె
నిలబడి పోయెను. ఇల్లంతయు రోదనముతో నిండిపోయెను. కాని యతని
కన్నుల నుండి అశ్రుకణములైనను రాలవు. చూచువారి కతడు పాషాణహృద
యుడనిపించెను, కాని యతడాలోచనలో మగ్నుడైయుండెను.

"ఒకనాడు నేనుకూడ మృత్యువు నెదుర్కొనవలసినవాడనేనా? నాడు
మృత్యుముఖమునుండి తప్పుకొన మందునెక్కడ వెదకగలను? ముక్తికొరకు

“ఆలయమునఁగల బిలమునుండి యొకయెలుక బయటికివచ్చి శివలిం గమునకు నలువైపుల తిరుగఁజొచ్చెను. ఎగిరిలింగముపై నెక్కెను. భక్తు లర్పించినవై నైవేద్యాదులను తినఁదొడఁగెను. అప్పుడు చిత్రమైన పలువిధములగు నాలోచనలు రేకెత్తెను. “నేనెవని కథలు వింటినో యీ మహాదేవుఁడేనా యీ దేవుఁడు”? అని ప్రశ్నమువచ్చెను......కథలో విన్నమహాదేవుఁడు పర బ్రహ్మమగునెడల నతని శిరస్సుపై ఎలుకలెట్లు నడుగువిడును? ......పాశు పతాస్త్రముతో దైత్యులను సంహరించినవాఁడుకదా? అతఁడీ తుచ్ఛజంతువును తనపై గంతులిడకుండ చేయనేరఁడా?”

అంతదినదాఁకను తండ్రిని లేపును. వ్యాకులుఁడై తన ప్రశ్నలను తం డ్రికి వినిపించును. తండ్రి పుత్రుని తరబుద్ధిని కుంఠితముచేసి యతని సంద ర్శ్వాసమునుసుస్థిరముచేయ యత్నించును. బాలునకదిరుచింపక యతఁడు కల్యాణ కరుఁడగు నిజమైన శివుని దర్శనముచేసికొనునంతవరకు బాహ్యపూజలవంక బోనని దృఢ సంకల్పుఁడయ్యెను. ఆ బాలుఁడు పరమేశ్వరుని సాక్షాత్కా రము పొందఁగోరెనట అన్వేషణ చెన్నఁడును తలయొగ్గి యొడఁగఁడు. ఆశివరాత్రి నాఁడే యీ విచిత్రబాలుని యాత్మికజన్మము కలిగినదనవలెను. కావునచే యతని జన్మదినము తెలియకపోయినను శివరాత్రినాఁటిని జన్మదినోత్సవము జరుపుట యుచితముగా నెంచఁబడెను.

మూలశంకరుఁడు విద్యార్జనమున తత్పరుఁడయ్యెను. అతఁడు పదునా లేండ్లవాఁడుగా నతనికంటె రెండేండ్లు చిన్నదియైన యతనిచెల్లెలు మరణిం చెను. బంధువులెంత ప్రయత్నించినను రోగముచే నాల్గుగంటలలో నామె మృత్యువాతఁబడెను. బాలుఁడైన మూలశంకరునకదియంతయు వింతగా దోఁచెను. చెల్లి అన్నతో మాటలాడదు. అతనివంక చూడదు. నిష్ఠురయ్యె భ్రాతృ ప్రేమ నేలవిస్మరించినదో యతని కర్థముకాదు. విస్మితుఁడై చిత్రలిఖితుఁడై నట్లు నిలఁబడిపోయెను. ఇల్లంతయు రోదనముతో నిండిపోయెను. కాని యతని కన్నుల నుండి అశ్రుకణమొక్కటైనను రాలదు. చూచువారి కతఁడు పాషాణహృద యుఁడనిపించెను. కాని యతఁడాలోచనలో మగ్నుఁడై యుండెను.

“ఒకనాఁడు నేనుకూడ మృత్యువు నెదుర్కొనవలసిన వాఁడనేనా? నాకు మృత్యుముఖమునుండి తప్పుకొను మందునెక్కడ వెదకఁగలను? ముక్తికొఱకు

నంశీఘ్రము ప్రసిద్ధికాయెను నాటికి మూలశంకరునకు ౨౪ ఇరువదినాలుగేండ్లు.

సంన్యాసియై యోగుల సత్సాంగత్యము కొఱకు రాజపుతానా, మాలవా రాష్ట్రాగములకు చెందిన పర్వతములందును, అరణ్యములందును సంచరించెను. లభించిన యోగుల వద్దనుండి యోగమునభ్యసించెను. ఇట్లు ౧౯౦౩ నుండి ౧౯౧౧ వి. శ. వరకు భ్రమణమొనర్చె. ౧౯౧౨ వి. శ. నలుగురు కుంభ మేళలో హరిద్వారముచేరి సాధు-సంన్యాసుల సత్సంగము చేసెను. అటను వ్నంతరపు చండీ పర్వతమున యోగాభ్యాసమునొనర్చెను. కుంభ మేళా నంతరము ఋషికేశము. టిహరీ, గఢవాల్, శ్రీనగర్ మున్నగు పర్వత ప్రాంతములందు చరించుచు, కేదారఘాట్, రుద్రప్రయాగ, గుప్తకాశి, గౌరీ కుండ్, త్రియుగీనారాయణ్, తుంగనాథుని శిఖరమునెక్కి రమణీయములు, భయాకరములునగు ప్రాకృతిక దృశ్యములనవలోకించుచు, కొన్ని దినములు "ఊఖీమఠము" న విశ్రాంతి తీసికొనెను. కేదారనాథుని యున్నత శిఖరము నధిరోహించి, రెండవవైపు నున్న జోషి మఠమును చూచుకొనుచు బదరీ నాథుని పర్వతశిఖరము గూడ నధిరోహించెను. జోషిమఠమునందును రావల్‌జీ మిక్కిలి విద్వాంసుడు. అతని వలన తెలిసికొనిన మహాత్ముల సాంగత్యము చేయుటకు ప్రయత్నమొనర్చెను. అలకనందా నదీ ఉద్గమ స్థానమును చూచను కొన్ని నాళ్లు, పాండవుల స్వర్గారోహణ మార్గమున కొన్ని దినములు స్వామికి గడచిపోయెను. మంచు మీద నడుచుటవలన పాదములు పగిలి రక్తము ప్రవహించెను. ఎక్కడను అమృతత్వమునకు ఔషధమును పొందజాలక క్రోధ సాగరమున శరదృతువు గడపెను. సర్వ విధముల ప్రయత్నించి నిరాశుడై స్వామి హిమాలయపు శిఖరములందెటనేని దేహత్యాగ మొనర్చిన బాగుండు నని సంకల్పించి కటకటలు గడపలేదు. అదేసమయమున ప్రథమమున జ్ఞాన ప్రాప్తి యావశ్యకమని యతని యంతరాత్మనుండి ప్రేరణ కలిగెను.

వి.శ. ౧౯౧౭ న మిర్జాపురము గుండ కాశీచేరియట స్వామి కొన్ని దినములుండెను. ౧౯౧౪ చైత్ర మాసమున మధ్య ప్రదేశమున ప్రవహించు నర్మదా నది ఉద్గమ స్థానాన్వేషణమునకు బయలుదేరెను. అంటవందా ఉద్గమ స్థానమును చేరుకొనుటలో యోగులనన్వేషించుట స్వామికి ముఖ్యోద్దేశ

మైనట్లు నర్మదా తీరప్రదేశోద్దేశము నందున యోగుల దర్శనమే ముఖ్యముగా నుండెను. ఇట్లు మూడు సంవత్సరములు అరణ్యము నంతటిని గాలించెను. శరీరమంతయు కొండల కంటకములచే గ్రుచ్చబడి రక్తసిక్తమయ్యెను. లక్ష్యసాధనకు గురుచు ధీరులకిదియొక లెక్కయా? క్రీ. శ. 1912 వ మథురచేరి విరజానందస్వామి పాదములకు మ్రొక్కి యనార్ష గ్రంథముల నన్నింటిని గురువుల యానతి ననుసరించి యమున పాలొనర్చి ఆర్ష విద్యాధ్యానమున దీక్షితుడయ్యెను. శిష్యుని గుణకర్మలు గురువున కనుకూలములయ్యెను. ప్రాచీన ఆర్ష గ్రంథములకు ప్రకాండ పండితుడును, వ్యాకరణవేత్తయగు ప్రజ్ఞాచక్షువయిన విరజానందస్వామి బహుకాలమునుండి ప్రతీక్షించుచున్న శిష్యరత్నము లభించెను. దయానందుడు గురువుల యాశయమును గ్రహించి యుక్తమార్గమున వర్తించుచు గురువుల యాజ్ఞలు పాలింపసాగెను. సాగ్నివటామున లేచి యమునా జలముతెచ్చి వానితో గురువులకు స్నానము నిర్వర్తింపజేయుట దయానందునకు నిత్యవిధి యయ్యెను. అఖండ బ్రహ్మచర్యపాలనతోబాటు గురువుల దండనము ఔషధముగా స్వీకరించుట దయానందున కభ్యస్త విద్యయయ్యెను. ఇట్టి ముముక్షుసంపదయే గురువగు విరజానందుని హృదయమున శిష్యునియెడ ప్రేమ ప్రవాహముదయింప జేసెను. కావుననే . ఆ ఋషివరులిట్లనెను:—

"శిష్యతో ఐసా చాహియే గురుకో సబ్ కుచ్ దేయ్
గురుకో ఐసా చాహియే శిష్యసే కుఛ్ నా లేయ్"
గురువునకు శిష్యుడంతయు నియ్యవలె.
శిష్యునినుండి గురువేమియు గ్రహింపరాదు!

అధ్యయనము సమాప్తమయ్యెను. శిష్యుడు గురువును సమీపించి యంజలి ఘటించి సెలవడిగెను. గురువునెదుట దక్షిణగా దోసెడు లవంగములుంచెను. గురువు "వత్సా! ఈ కానుక కొఱకేనా నేను పెక్కై శ్రమించినది! అనెను. భగవన్! ఈ శరీరము, మనస్సు మీ యధీనము. ఆజ్ఞాపించుడు. ప్రాణముల నర్పించి మీ యాజ్ఞపాలింతును" అని దయానందుడు తన శిరస్సును గురుపాదములపై నుంచెను. అంతట విరజానందుడు ఇట్లు

బోధించెను. "దేశమున ఉపకారము చేయుము. సత్యశాస్త్రముల నుద్ధరింపుము. మత మతాంతరముల యవిద్యను నశింపజేయుము. వైదిక ధర్మమును జగమున వ్యాపింపజేయుము. ప్రస్తుత మార్యావర్తమున నార్యత్వము నశించి యధర్మమంతట వ్యాపించియున్నది. మిథ్యాచారములను, అంధవిశ్వాసములను దూరమొనర్పుము." దయానందుడా యాదేశమును శిరసావహించెను. గురువు ప్రేమభరిత వాక్కులతో నాశీర్వదించెను. "వత్స! దయానంద! మనుష్య కృత గ్రంథములందు పరమేశ్వరుని నిందయు, ఋషులనిందయు గలదు. ఋషి కృత గ్రంథముల నదియుండదు, ఈ యొరపిడిరాయిని విస్మరింపకు." అని చెప్పుచున్న శిష్యునకు చివరి మాటలుగా విరజానందు లాదేశించెను.

వి. శ. ౧౯౨౦ వైశాఖమాసమున మథురయందు వెడలి దయానందుడు ఆగ్రా చేరి, అచటనుండియే ధర్మోపదేశము నారంభించెను. సంధ్యోపాసన, యోగాభ్యాసవిధి శిష్యులకు నేర్పుచు బ్రహ్మచర్య వ్రతమును సదాచారమునకు ముఖ్యాంగముగా చెప్పుచుండెను. ఇట్లు ప్రచారము చేయుచునే మూలవేదముల నన్వేషింప స్వామి ప్రారంభించెను.

స్వామి ధవల్‌పూర్, అజ్మీర్, గ్వాలియర్, కరౌలి, జయపూర్ నగరములలో ప్రచారమొనర్చుచు ౧౯౨౧ చైత్రమున పుష్కర సమావేశములందు భాగవతమును విగ్రహారాధనను ఖండించిరి. అటుపై అజ్మీర్ వెళ్ళి యచట పదా దినములు నివసించిరి. అక్కడ క్రైస్తవ పాదిరీలు మరియు మహమ్మదీయ మౌల్వీలతో ప్రేమపూర్వక వివాదములు జరిపిరి. గోరక్షణ విషయమున నిటనుండియే కొంతకూడ స్వామిగారు వ్రాయదొడగిరి. గోవధను ఆపవలసినదిగా ఆంగ్లేయ ఉద్యోగులను ప్రేరేపించిరి.

వి. శ. ౧౯౨౪ సం॥ న గంగా పుష్కరోత్సవము జరుగు కుంభమేళాకు ఒక మాసము పూర్వమే హరిద్వారముచేరి సప్తస్రోతస్సున స్వామి తన డేరా వేసికొనెను. "పాషండఖండిని పతాక" నొకదానిని స్థాపించెను. అప్పుడు స్వామివెంట కొందరు బ్రహ్మచారులు సన్న్యాసులుకూడ నుండిరి. స్వామివెంట పుస్తకములుకూడ మిక్కిలిగా నుండెను. అతిశయేద ప్రచురము వారికి లభించెను. విగ్రహారాధనమున్నగు దురాచారముల ఖండనకూడ మిక్కిలి

మయ్యెను. 'మేలా' లో అంతట స్వామి పేరు వెల్లడియయ్యెను. ఎందరో సంప్రదాయకులు స్వామిని ఆదరింపసాగిరి. మఠాధిపతులైన సన్యాసులను స్వామి సత్యప్రచారమున కాహ్వానింపగా వారు "గంగ యెన్నడైన పశ్చిమ మునకు ప్రవహించినదా? ఉన్నయతిధర్మము కొలగించినచో గృహస్థుడు ఒక్కడు చెంబెడు "భాంగ్" (మత్తు పదార్థము) కూడ పొదువుల కియ్యరు" అనిరి. ఆ మాటలు విని సత్యమార్గారూఢుడైన దయానందుని హృదయము చలించి పోయెను. అవిద్యా గ్రస్తులైయున్న సంప్రదాయకులంజూచి యూసం ప్రదాయముల నన్నింటిని భిన్న భిన్న మొనర్ప స్వామి నడుముకట్టెను. అక్కడి చివరి ఉపన్యాసమున స్వామి నోటినుండి 'సర్వం వై పూర్ణం స్వాహా' అను నార్త నాదమొకటి వెలువడుటయే కాక, తన దగ్గరనున్న పుస్తకములను, వస్త్రములను, ఇతర పాత్రాదుల నన్నింటిని ఎల్లరకు పంచియిచ్చి కౌపీనము మాత్రము ధరించి సత్యప్రచారార్థ మొంటరిగా బయలుదేర సిద్ధపడెను. ఎల్లరు చకితులైరి. స్వామితో మిక్కిలి మైత్రి కలిగిన యొక విద్వాంసుడడుగగా నిట్లు సమాధానము చెప్పెను. "నేను సత్యమును స్పష్టముగా చెప్పదలచినాను. అందులకే యావశ్యకతలన్నియు బాధకములు. ఏమి త్యజింపకున్న నిస్సందిగ్ధుడను గాజాలను. నా యుద్దేశ్యమునుగూడ పూర్తిచేయజాలను."

హరిద్వారమునుండి ఋషికేశము చిన్నగావచ్చి స్వామి గంగా తీర ప్రాంతములలో యాత్రచేయుచు స్వామి ఏడు సంవత్సరముల శ్రమము మొనర్చెను. ఎన్నియో పర్యాయములు ఎన్నియో దినములు నిరాహారులై యుండియు ప్రచారము చేసెను. చలికాలమునందును కౌపీనము మాత్రము ధరించి దేహమున భస్మమునలము కొనెడివాడే కాని స్వామి యితర వస్త్రము లను ధరించి తిరుగడు. గంగయొడ్డున సికతాతలమున తలక్రింద రాళ్లను తలగడగా నుపయోగించుకొని రాత్రులు గడుపుచుండెడువాడు. నిద్రా సమయ మున నెవరేని కంబళి కప్పిపోయిన మరునాడది యటనే పడియుండెడిది. స్వామి యెటకేగనో తెలిసెడిదికాదు. యజ్ఞోపవీతమున కధికారులగు వారికి యది యొసంగుచు సంధ్యావందనాదులు నేర్పుచు పౌరాణికుల మూఢాచార ముల నుండి ప్రజలను దప్పించుట స్వామికి నిత్యవిధులు. అనూపశహర్

శకోన్, రామపూర్, అతరౌలి, చలేసర్, సొరో, కాసగంజ్, ఫర్రుఖాబాద్, కన్నౌజ్, కాన్‌పూర్ నగరములం బ్రచారమొనర్చి కాశీ చేరుకొనెను. అక్కడ కాశీనరేశుని సంరక్షణక్రింద మున్నదిరెండు మంది భారత విఖ్యాత విద్వాంసు లతో స్వామి శాస్త్రచర్చ నొనర్చెను. ఆశాస్త్రార్థమునుగూర్చి నాటి సమా చార పత్రములలో ముఖ్యమైన ఆంగ్లేయ పత్రిక 'పయనీయర్' దయానంద స్వామి "హిందుస్థానీ లూథర్' అను ఉపాధినొసంగెను కాశీ పండితులు గృహస్థులగు బ్రహ్మణులకు తగినంత అధ్యయనావకాశము లేదని యంగీక రించిరి. అక్కడి విద్వాంసులేదో యొక శాస్త్రమునే విశేషముగ పఠింపంచెడి వారు. సన్యాసులలో వేదములు ఉపనిషత్తులు చదివినవారు కొంద ఱుండెడివారు. దయానందస్వామి ప్రతివాదిగా 'ఇది వేదమునలేదు. ఇయ్యది వేద విరుద్ధము. కావున ప్రమాణముకాదు'. అని వెంటనే ప్రత్యుత్తర మిచ్చు చుండెడివారు. కావున స్వామికి వేదశాస్త్రములు, మన్వాదిస్మృతులు బాగుగ స్మరణలోనున్నట్లు తెలియుచున్నది'. (ధర్మనిర్ణయం 32 పు.)

(దయానందస్వామి ఋషి: తత్త్వదర్శి "ఋషిః దర్శనాత్" అని నిరుక్తి. దయానందస్వామి కాశీ ఆరవపర్యాయము వెళ్ళెను. అట నుండియే వైదిక పాఠశాలా క్రమమును ప్రారంభించెను. వేదభాష్యమునచట ఇక్కడనే 'లాజరస్' ముద్రణ యంత్రాలయమున ముద్రింప నారంభింప జేసెను. కాశీనుండి ముంగేర్ భాగల్‌పూర్‌లలో ప్రచారముచేయుచు (అప్పటి భారతదేశపు రాజధానియగు కలకత్తాస్వామి చేరుకొనెను.) అక్కడ బ్రహ్మ సమాజ పండితులను చూచిరి. అంతవరకు స్వామి సంస్కృతముననే యుపన్యసించు చుండెడివారు. ఒక ఉపన్యాసమును పండిత మహేశచంద్ర "న్యాయరత్న" అనువదించుచు తప్పుగా ననువదించిరి. నాటినుండి దయానంద స్వామి హిందిలో భాషింప నిశ్చయించుకొనెను. హుగ్లీపట్టణములో పం. తారానాథ తర్కవాచస్పతితో శాస్త్రార్థమునుచేసి, భాగల్‌పూర్, పట్నా, ఛపరా, అరా, డుమ్‌రావ్ నగరములలో ప్రచారమొనర్చుచు స్వామి కాన్‌పూర్ చేరెను అక్కడ వారి యుపన్యాసముల ప్రభావమున పెక్కరో విగ్రహములను

సోరోన్, రామఘాట్, అతరౌలి, ఛలేసర్, హేరో, కాసగంజ్, ఫర్రుఖాబాద్, కనోజ్, కాన్‌పూర్ నగరములం ప్రచారమొనర్చి కాశీ చేరుకొనెను. అక్కడ కాశీనరేశుని సంరక్షణక్రింద ముప్పదిరెండు మంది భారత విఖ్యాత విద్వాంసులతో స్వామి శాస్త్రచర్చ నొనర్చెను. ఆశాస్త్రార్థమును గూర్చి నాటి సమాచార పత్రములలో ముఖ్యమైన ఆంగ్లేయ పత్రిక 'పయనీయర్' దయానంద స్వామి "హిందుస్థానీ లూథర్' అను ఉపాధినొసంగెను కాశీ పండితులు గృహస్థులగు. బ్రాహ్మణులకు తగినంత అధ్యయనావకాశము లేదని యంగీకరించిరి అక్కడి విద్వాంసులేదో యొక శాస్త్రమునే విశేషముగ పఠించెడివారు. సంన్యాసులలో వేదములు ఉ ప ని ష త్తు లు చదివినవారు కొందరుండెడివారు. దయానందస్వామి ప్రతివాదిగా 'ఇది వేదమునలేదు. ఇయ్యది వేద విరుద్ధము. కావున ప్రమాణముకాదు'. అని వెంటనే ప్రత్యుత్తర మిచ్చుచుండెడివారు. కావున స్వామికి వేదశాస్త్రములు, మన్వాదిస్మృతులు బాగుగ స్మరణలోనున్నట్లు తెలియుచున్నది'. (ధర్మనిర్ణయం 32 పు.)

(దయానందస్వామి కాశి: తత్త్వదర్శి "ఋషి దయానంద్" అని నిరుక్తి. దయానందస్వామి కాశీ ఆరుపర్యాయములు వెళ్ళెను. అటనుండియే వైదిక పాఠశాలా క్రమమును ప్రారంభించెను. వేదభాష్యములు కూడ అక్కడనే 'లాజరస్' ముద్రణ యంత్రాలయమున ముద్రింప నారంభింపజేసెను. కాశీనుండి ముంగేర్ భాగల్‌పూర్‌లలో ప్రచారముచేయుచు (అప్పటి భారతదేశపు రాజధానియగు కలకత్తా స్వామి చేరుకొనెను.) అక్కడ బ్రహ్మసమాజ సంచాలకులను చూచిరి. అంతవరకు స్వామి సంస్కృతమునందే యుపన్యసించు చుండెడివారు. ఒక ఉపన్యాసమును పండిత మహేశచంద్ర "న్యాయరత్న" అనువదించుచు తప్పుగా ననువదించిరి. నాటినుండి దయానంద స్వామి హిందిలో భాషింప నిశ్చయించుకొనెను. వారాగ్లపత్రములలో సం. తారానాథ తర్కవాచస్పతితో శాస్త్రార్థముచేసి, భాగల్‌పూర్, పట్నా, ఛపరా, అరా, డుమ్‌రావ్ నగరములలో ప్రచారమొనర్చుచు స్వామి కాన్‌పూర్ చేరెను అక్కడ వారి యుపన్యాసముల ప్రభావమున నెందరో విగ్రహములను

స్థాపకులనంతే విల్‌నామా వ్రాసి స్వామి రిజిష్టర్ చేయించిరి. దాని ననుసరిం చియే అజమేర్‌లో పరోపకారిణీ సభ స్థాపింపబడినది.

ఉదయపురమున మహారాణా సజ్జన సింహానకు శాస్త్ర శిక్షణ నొసంగి శాహపురా నరేశుడైన శ్రీనాహర్‌సింహునిచే స్వామి మనుస్మృతి చదివింప జేసెను. క్రీ. శ. 1883 మే 1 (సంవత్ 1940 జ్యేష్ఠము)న జోధపూర్ మహారాజా ఆహ్వానింపగా స్వామి యటకువెళ్ళిరి. ఆమహారాజునకు శారీరిక వ్యాయామమునుగూర్చియు, సదాచారమును గూర్చియు ఉపదేశించిరి. విధర్ము లైన మత ప్రచారకులు రాజవేశ్యకు తమ సానుభూతిని ప్రకటించుచు మహర్షి దయానందస్వామి దగ్గర పాచకుడుగా పనిచేయుచున్న జగన్నాథుడను బ్రాహ్మణుని లోబఱచుకొని యతనిద్వారా దయానందునకు విషపానము చేయించిరి. విషము లోపలజేరి పనిచేయనారంభించి తదుపరి స్వామికి విష యము తెలిసెను. స్వామి శాంతి, సహనమునకును మూర్తి కావున వెంటనే జగన్నాథునకు ధనమునిచ్చి యతనిని మృత్యువాత బడకుండ నేపాల్‌దేశము నకు బంపివైచెను. తరువాత ఐదు దినములు విషజనితములయిన ఘోర కష్టములను సహించి స్వామి తన యత్యంత సహనశీలతను వెల్లడించిరి. సంవత్ 1940 కార్తిక అమావాస్య దినమున సాయం 6 గంటలకు ఈశ్వర ప్రార్థనచేసి ప్రసన్నముఖుడై గాయత్రీ జపమొనర్చి సమాధిస్థుడై కొంత తడవునకు నేత్రములు తెరచి యిట్లనెను.:—

"ఓదయామయ! సర్వశక్తిమన్! ఈశ్వరా!

నీకోరిక యిదియేనా నీకోరిక యిదియేనా? అయినచో నెరవేరుగాక! ఆహా! నీ లీల నేమనగలను, అని ప్రక్క కొరిగి శ్వాసనుబంధించి ప్రాణ మొక్కసారి విడిచెను:—

## దయానందుడు ఆదర్శ పురుషుడు

ఆన్యదార్శనిక సంస్కర్తలవలె దయానందుడు కేవలము ఒక ఐతి హాసిక పురుషుడేకాదు. అతడు కోట్లకొలది స్త్రీ పురుషుల యెదుట ప్రత్యక్ష ముగ తన కార్యమును సాగించిన మహనీయుడు. అతని చరితము నెరిగిన నాటి మనుష్యులెందరో ఉన్నారు. వారిలో నే లేఖకుడొకడు. అతనిని యెరో

—

స్థాపకునందే విల్‌నామా వ్రాసి స్వామి రిజిష్టర్ చేయించిరి. దాని ననుసరించియే ఆజమేర్‌లో పరోపకారిణి సభ స్థాపింపబడినది.

ఉదయపురమున మహారాజా సజ్జన సింహానకు శాస్త్ర శిక్షణ నొసంగి శాహపురా నరేశుడైన శ్రీనాహర్‌సింహునిచే స్వామి మనుస్మృతి చదివింప జేసెను. క్రీ. శ. 1883 మే 1 (సంవత్ 1940 జ్యేష్ఠము)న జోధపూర్ మహారాజా ఆహ్వానింపగా స్వామి యచటకువెళ్ళిరి. ఆమహారాజునకు శారీరిక వ్యాయామమునుగూర్చియు, సదాచారమును గూర్చియు ఉపదేశించిరి. విదర్శులైన మత ప్రచారకులు రాజవేశ్యకు తమ సానుభూతిని ప్రకటించుచు మహర్షి దయానందస్వామి దగ్గర పాచకుడుగా పనిచేయుచున్న జగన్నాథుడను బ్రాహ్మణుని లోబఱచుకొని యతనిద్వారా దయానందునకు విషపానము చేయించిరి. విషము లోపలజేరి పనిచేయనారంభించి తదుపరి స్వామికి విషయము తెలిసెను. స్వామి శాంతి, సహనములకును మూర్తి కావున వెంటనే జగన్నాథునకు ధనమ్మొసిచ్చి యతనిని మృత్యువాత బడకుండ నేపాల్‌దేశమునకు బంపివైచెను. తరువాత బహు దినములు విషజనితములయిన ఘోర కష్టములను సహించి స్వామి తన యత్యంత సహనశీలతను వెల్లడించిరి. సంవత్ 1940 కార్తిక అమావాస్య దినమున సాయం 6 గంటలకు ఈశ్వర ప్రార్థనచేసి ప్రసన్నముఖులై గాయత్రీ జపమొనర్చి సమాధిస్థులై కొంత తడవునకు నేత్రములు తెరచి యిట్లనెను:—

"ఓదయామయ! సర్వశక్తిమన్! ఈశ్వరా!

నీకోరిక యిదియేనా నీకోరిక యిదియేనా; అయినచో నెరవేరుగాక! అహా! నీ లీల నేమనగలను, అని ప్రక్క కొరిగి శ్వాసనుబంధించి ప్రాణ మొక్కసారి విడిచెను:—

## దయానందుడు ఆదర్శ పురుషుడు

అన్యధార్మిక సంస్కర్తలవలె దయానందుడు కేవలము ఒక యైతిహాసిక పురుషుడేకాదు. అతడు కోట్లకొలది స్త్రీ పురుషుల యెదుట ప్రత్యక్షముగ తన కార్యమును సాగించిన మహనీయుడు. అతని చరితము నెరిగిన వారి మనుష్యులెందరో ఉన్నారు. వారిలో నీ లేఖకుడొకడు. అతనిని యురో

కంపితుడైన ఆ రాజపుత్రుని చేతినుండి వారి ఖడ్గము క్రిందపడి పోయిన యపుడు గంభీరనాదమిట్లు నభలో ప్రతిధ్వనించెను "క్షత్రియుని కృపాణము అధర్మమును చూడక యొరనుండి బయటికి వెలువడదు. చూచి వెలువడిన నాడది దుష్టులను సంహరింపక యొరలో చొరపడదు."

దయానందుని విశాల వీర హృదయము ఎన్నియోసారులు సాంసారిక పురుషుల ఆక్రమణల నెదుర్కొనవలసి వచ్చినది. ఆ హృదయము గండశిల వలె నెన్నడు చలించి యెరుగదు. అట్టి యుదాహరణముల నెన్నింటినిట లెక్కించగలము. అతని హృదయ కోమలత నేమని కొనియాడగలము? పౌరాణిక మత ఖండనము నోర్వజాలక యొక బ్రాహ్మణుడు విషము కలిపిన మిఠాయి దయానందునకు భక్తితో సమర్పించెను. స్వామి పరీక్షించి సత్యమును గ్రహింపగా బ్రాహ్మణుడది గుర్తించి భయపడసాగెను. దయార్ద్ర హృదయు డగు స్వామి యతని కుపదేశమిచ్చి పంపివేసెను. కాని స్వామి భక్తుడైన మహమ్మదీయాధికారి యొకడా బ్రాహ్మణుని బంధించి యన్యాపరాధమతనిపై మోపి ఆరు మాసముల కారాగారశిక్షను విధించి స్వామి మన్ననను బడయు టకు రాగా స్వామి యతనికి పెడమొగము పెట్టెను. ఆ యధికారి ప్రార్థింపగా స్వామి "నేను మనుజులను బంధింప జేయరాలేదు; అవిద్యాంధకార రూప కారాగారము నుండి వారిని విడిపింప వచ్చిన వాడనని" చెప్పెను. ఈ యుదా హరణమును బట్టి దయానందుడొక యుత్తమ మహాపురుషుడని బోధపడును. అతడొనర్చిన ప్రచారమునుబట్టి యతడొక తత్త్వవేత్త యనియు ఉత్తమ శిక్షకుడనియు తెలియును. అతడు వర్తమాన యుగ నిర్మాతయనుట నిస్సందిగ్ధము.

## యుగవిధాత దయానందుడు

ఒక యూరోప్ ఆలోచకుడిట్లు వ్రాసియున్నాడు:—

"ఒకానొక యుగమునకు చెందిన ఆదర్శ మతవ్యవస్థ సంస్కర్త తన సమకాలీన పురుషులలో అధిక సంఖ్యాకుల దృష్టిలో అవశ్యము జనులను వెనుకకు తీసికొని పోవు వ్యక్తిగా ప్రతీతుడగును. ఇందులకనేక కారణములు కలవు. కాని ముఖ్యకారణ మొక్కటియే. అది వివిధ దృష్టులతో జూడబడును.

కంపితుడై న ఆ రాజపుత్రుని చేతినుండి జారి ఖడ్గము క్రిందపడి పోయిన ఋషి గంభీరనాదమిట్లు సభలో ప్రతిధ్వనించెను "క్షత్రియుని కృపాణము అధర్మమును చూచక యొరనుండి బయటికి వెలువడదు. చూచి వెలువడిన నాడది దుష్టులను సంహరింపక యొరలో దూరపడదు."

దయానందుని విశాల వీర హృదయము ఎన్నియోసారులు సాంసారిక పురుషుల ఆక్రమణల నెదుర్కొనవలసి వచ్చినది. ఆ హృదయము గండశిల వలె నెన్నడు చలించి యెరుగదు. అట్టి యుదాహరణముల నెన్నింటినియో లెక్కింపగలము. అతని హృదయ కోమలత నేమని కొనియాడగలము? పౌరాణిక మత ఖండనము నోర్వజాలక యొక బ్రాహ్మణుడు విషము కలిపిన మిఠాయి దయానందునకు భక్తితో సర్పించెను. స్వామి పరీక్షించి సత్యమును గ్రహింపగా బ్రాహ్మణుడది గుర్తించి భయపడసాగెను. దయార్ద్రహృదయుడగు స్వామి యతని కుపదేశమిచ్చి పంపివేసెను. కాని స్వామి భక్తుడై న మహమ్మదీయాధికారి యొకడా బ్రాహ్మణుని బంధించి యన్యాపరాధమతనిపై మోపి ఆరు మాసముల కారాగారశిక్షను విధించి స్వామి మన్ననను బడయుటకు రాగా స్వామి యతనికి పెడమొగము పెట్టెను. ఆ యధికారి ప్రార్థింపగా స్వామి "నేను మనుజులను బంధింప జేయరాలేదు: అవిద్యాంధకార రూప కారాగారము నుండి వారిని విడిపింప వచ్చిన వాడనని" చెప్పెను. ఈ యుదాహరణలను బట్టి దయానందుడొక యుత్తమ మహాపురుషుడని బోధపడును. అతడొనర్చిన ప్రచారమునుబట్టి యతడొకతత్త్వవేత్త యనియు ఉత్తమ శిక్షకుడనియు తెలియును. అతడు వర్తమాన యుగ నిర్మాతయనుట నిస్సందిగ్ధము.

యుగవిధాత దయానందుడు

ఒక యూరోపు ఆలోచకుడిట్లు వ్రాసియున్నాడు:—

"ఒకానొక యుగమునకు జెందిన ఆదర్శ మర్యాద సంస్కర్త తన సమకాలీన పురుషులలో అధిక సుబోధకుల దృష్టిలో అవశ్యము జనులను వెనుకకు తీసికొని పోవు వ్యక్తిగా ప్రతీతుడగును. ఇందులకనేక కారణములు కలవు. కాని ముఖ్యకారణ మొక్కటియే. అది వివిధ దృష్టులతో జూడబడును.

క్రొత్తసత్యమును సర్వదా ఉద్బోధింపజేయుట యసంభవము కపిలముని గొప్ప దార్శనికుడు. అతని దర్శనము "అజా మేకాం లోహిత శుక్ల కృష్ణ రూపామ్" అను ఉపనిషద్వాక్యమునకు వ్యాఖ్యానము మాత్రమే. యూరోపు వికాసవాది డార్విన్, హెర్బర్టు స్పెన్సర్, విలియమ్సన్ తత్త్వవేత్తలనబడుదురు వారు కూడ వాస్తవమున కపిలముని పరిణామవాదమునకు వ్యాఖ్యాతలే కాక మరియెవరు? ఇట్లు తత్త్వవేత్తల కార్యము సత్యసిద్ధాంతముల నెన్నుకొను టయో వ్యాఖ్యానము చేయుటయో జరుగుచున్నది. ఈదృష్టితో జూచినపుడు (దయానందుడు వేదాది సత్యశాస్త్రములందు నిగూఢముగ దాగియున్న రత్న ములనేరి జనుల యెదుటనుంచిన వాడగును. వానిని జూచినపుడు దయానం దుని బుద్ధి చమత్కారము మనకు గోచరించును

దయానందుడు కార్యక్షేత్రమున నడుగిడినపుడు ఎన్నియో సంప్రదాయ ములు పనిచేయుచుండెను. కాని యన్నియు తమ పురాతన ఆదర్శములకు దూరములై యుండెను. విచార స్వాతంత్ర్యము లోపించియుండెను. అది యెన్నడు మరల తలయెత్తు స్థితిలోనే లేదు. ధార్మిక, సామాజిక, రాజనైతిక పరాధీనత భారత సంతానమును నిర్జీవము చేసియుండెను. ఏక్షేత్రమున జూచి నను ౘరత వాసులలో తమ దాస్య శృంఖలములను ఖండించు సాహసము కని పింపదు. దయానందస్వామి అన్యసంస్కర్తలవలె బాహ్యకురీతులను దొల గించుటకు యత్నించుటయేకాక భారతీయుల పతనమునకు కారణములైన వాని మూలమును గుర్తించి జాతియందు ప్రాణసంచారము జేయ సాహసించెను.

ధార్మిక సంస్కరణ క్షేత్రమున మాయావాదము, ప్రకృతి వాదము నైష్కర్మ్యవాదము, శూన్యవాదమువకు సంబంధించిన వలలను చిన్నభిన్న మొనర్చి వాని స్థానమున దయానందుడు కర్మవాదమును, త్రిత్వవాదమును స్థాపింపవలసిన వాడయ్యెను. సమకాలీన సంప్రదాయికన్యూనతలను పూర్తి జేసెను. విగ్రహారాధన, అద్వైతవాదము, మృతక శ్రాద్ధము, పాపములను క్షమించుట, అవతారవాదము మున్నగు నంధవిశ్వాసముల నెదుర్కొని వానిని రూపుమాపుటకు దయానందుడు ఒక్క యితరుడెవరు సాహసింపగలడు? పండితులు, మౌల్వీలు, పాదరీలు మున్నగువారి దాస్యమునుండి జనులకు

క్రొత్తసత్యమును సర్వదా ఉద్భవింపజేయుట యసంభవము. కపిలముని గొప్ప దార్శనికుడు. అతని దర్శనము "అజా మేకాం లోహిత శుక్ల కృష్ణ రూపామ్" అను ఉపనిషద్వాక్యమునకు వ్యాఖ్యానము మాత్రమే. యూరోపు వికాసవాది డార్విన్. హర్బర్టు స్పెన్సర్. వింటమేన్ తత్త్వవేత్తలనబడుదురు వారు కూడ వాస్తవమున కపిలముని పరిణామవాదమునకు వ్యాఖ్యాతలే కాక మరియెవరు, ఇట్లు తత్త్వవేత్తల కార్యము సత్యసిద్ధాంతముల నెన్నుకొనుటయో వ్యాఖ్యానము చేయుటయో యగుచున్నది. ఈదృష్టితో జూచినపుడు దయానందుడు వేదాది సత్యశాస్త్రములందు నిగూఢముగ దాగియున్న రత్నములనేరి జనుల యెదుటనుంచిన వాడగును. వానిని జూచినపుడు దయానందుని బుద్ధి చమత్కారము మనకు గోచరించును

దయానందుడు కార్యక్షేత్రమున నడుగిడినపుడు ఎన్నియో సంప్రదాయములు పనిచేయుచుండెను. కాని యన్నియు తమ పురాతన ఆదర్శములకు దూరములై యుండెను. విచార స్వాతంత్ర్యము లోపించియుండెను. అది యున్నను మరల తలయెత్తు స్థితిలోనే లేదు. ధార్మిక, సామాజిక, రాజనైతిక పరాధీనత భారత సంతానమును నిర్జీవము చేసియుండెను. ఏక్షేత్రమున జూచినను భారత వాసులలో తమ దాస్య శృంఖలములను ఖండించు సాహసము కనిపింపదు. దయానందస్వామి అన్యసంస్కర్తవలె బాహ్యకురీతులను తొలగించుటకు యత్నించుటయేకాక భారతీయుల పతనమునకు కారణమైన వాని మూలమును గుర్తించి జాతియందు ప్రాణసంచారము చేయ సాహసించెను.

ధార్మిక సంస్కరణ క్షేత్రమున మాయావాదము. ప్రకృతి వాదము నైష్కర్మ్యవాదము, శూన్యవాదమునకు సంబంధించిన వలలను ఛిన్నభిన్నమొనర్చి వాని స్థానమున దయానందుడు కర్మవాదమును. త్రిత్వవాదము స్థాపింపవలసిన వాడయ్యెను. సమకాలీన సంప్రదాయికన్యూనతలను పూర్తి జేసెను. విగ్రహారాధన, అద్వైతవాదము, మృతక శ్రాద్ధము, పాపములను క్షమించుట, అవతారవాదము మున్నగు నంధవిశ్వాసముల నెదుర్కొని వానిని రూపుమాపుటకు దయానందుడు ఒక్క యితరుడెవడు సాహసింపగలడు, పండితులు, మౌల్వీలు, పాదిరీలు మున్నగువారి దాస్యమునుండి జనులకు

“లోకైవిలం”నుండి ప్రపంచమును రక్షించుటయేకాక మరియొక వంశప్రాకృత నియమములకు విరుద్ధముగ స్థాపింపబడిన జాతిబంధన రూపశృంఖలములను ఖండించి సామాజిక స్వతంత్రతకు పునాదులు వేసియున్నారు. శతాబ్దముల నుండి అంధవిశ్వాసములతో బంధింపబడియున్న హిందూ సమాజము తామస వృత్తితో నిద్రాణమై యుండగాంచి స్వామి దానిని జాగృత మొనర్ప యత్నించెను. హిందూ సమాజము స్వామి యుపకారమెన్నడు గుర్తించునో తెలియదు.

ఇట్లు సామాజిక ధార్మిక క్షేత్రములలో నవయుగము నారంభింప జేయుటయేకాక స్వామి రాజనైతిక క్షేత్రమునందును గొప్ప పరివర్తనము గలిగించియున్నాడు. స్వదేశ భక్తి, స్వరాజ్యము, సామ్రాజ్యము, ప్రజా తంత్రము ననుపదములు నేడు సర్వత్ర వినబడుచున్నవి. కాని దయానందు డెన్నడో కాంగ్రెస పుట్టుటకు మున్నే రాజనైతిక శాస్త్రము నారంభించియుం డెను. ఏకసత్తాత్మక రాజ్యమును ప్రతిపాదించి ప్రజల దాస్యమును బోధించు నని యెంచబడు ఆర్యశాస్త్రములనుండియే ఏకసత్తాక రాజ్యము ప్రాకృతిక నియమములకు విరుద్ధమని స్వామి ప్రమాణీకరించియుండెను. సత్యార్థ ప్రకా శపుటారవ సముల్లాసమున విద్యార్యసభ ధర్మార్యసభ రాజార్యసభ యనెడి మూడు సభలకు పునాదులువేసి శతపథ బ్రాహ్మణ ప్రమాణముతో ఏకసత్తా త్మక రాజ్యమెన్నడు నేర్పడరాదని సిద్ధపరచెను. రాజసభాధ్యక్షుడు, సభ్యులు ననువారి పరస్పర సంబంధములను నిరూపించి రాజ్యప్రబంధమంతయు స్వదేశీయాధికారుల వశమున నుండవలెనను విషయమును బలపరచెను.

రాజకర్మచారులు లక్ష గ్రామముల వర్తమానము ప్రతిదినము రాజ సభకు నివేదింపవలెననియు, అట్లే చక్రవర్తి రాజసభలో సమస్త భూగోళ వార్త లందజేయవలెననియు చెప్పుచు దాని ననుగుణముగ అంతరరాష్ట్రీయ సభలకు సంబంధించిన సూత్రము లార్యశాస్త్రములందున్నట్లు స్వామి ప్రమా ణీకరించియున్నాడు.

రాజనైతిక-ఉన్నతి నభిమానించు యూరోపుదేశమునకు కేంద్రము బ్రిటన్ అందురు. ఇంగ్లండులో ప్రవేశింపగానే బానిస స్వతంత్రుడగు నం దురు. ప్రజాతంత్ర రాజ్యమునకు బ్రిటన్ ఆదర్శమందురు. అది రాష్ట్రి సభ

"శోషైవిలం"నుండి ప్రపంచమును రక్షించుటయేకాక పరియొక వంక ప్రాకృతిక నియమములకు విరుద్ధముగ స్థాపింపబడిన జాతిబంధన రూపశృంఖలములను ఖండించి సామాజిక స్వతంత్రతకు పునాదులు వేసియున్నారు. శతాబ్దముల నుండి అంధవిశ్వాసములతో బంధింపబడియున్న హిందూ సమాజము తామస వృత్తితో నిద్రాణమై యుండగాంచి స్వామి దానిని జాగ్రుత మొనర్ప యత్నించెను. హిందూ సమాజము స్వామి యుపకారమెన్నడు గుర్తించునో తెలియదు:

ఇట్లు సామాజిక ధార్మిక క్షేత్రములలో నవయుగము నారంభింపజేయుటయేకాక స్వామి రాజనైతిక క్షేత్రమునందును గొప్ప పరివర్తనము గలిగించియున్నారు. స్వదేశ భక్తి, స్వరాజ్యము, సామ్రాజ్యము, ప్రజాతంత్రము ననుపదములు నేడు సర్వత్ర వినబడుచున్నవి. కాని దయానందు డెన్నడో కాంగ్రెస్ పుట్టుకకు మున్నే రాజనైతిక శాస్త్రము నారంభించియుండెను. ఏకసత్తాత్మక రాజ్యమును ప్రతిపాదించి ప్రజల దాస్యమును బోధించు నని యెంచబడు ఆర్యశాస్త్రములనుండియే ఏకసత్తాక రాజ్యము ప్రాకృతిక నియమములకు విరుద్ధమని స్వామి ప్రమాణీకరించియుండెను. సత్యార్థ ప్రకాశపుటారవ సముల్లాసమున విద్యార్యసభ ధర్మార్యసభ రాజార్యసభ యనెడి మూడు సభలకు పునాదులువేసి శతపథ బ్రాహ్మణ ప్రమాణముతో ఏకసత్తాత్మక రాజ్యమెన్నడు నేర్పడరాదని సిద్ధపరచెను. రాజసభాధ్యక్షుడు, సభ్యులు ననువారి పరస్పర సంబంధములను నిరూపించి రాజ్యప్రబంధమంతయు స్వదేశీయాధికారుల వశమున నుంచవలెనను విషయమును బలపరచెను.

రాజకర్మచారులు లక్ష గ్రామముల వర్తమానము ప్రతిదినము రాజసభకు నివేదింపవలెననియు, అట్లే చక్రవర్తి రాజసభలో సమస్త భూగోళ వార్త లందజేయవలెననియు చెప్పుచు దాని కనుగుణముగ అంతరరాష్ట్రీయ సభలకు సంబంధించిన సూత్రము లార్యశాస్త్రములందున్నట్లు స్వామి ప్రమాణీకరించియున్నాడు.

రాజనైతిక-ఉన్నతి నభిమానించు యూరోపుదేశమునకు కేంద్రము బ్రిటన్ అందురు. ఇంగ్లండులో ప్రవేశింపగానే బానిస స్వతంత్రుడగు నందురు ప్రజాతంత్ర రాజ్యమునకు బ్రిటన్ ఆదర్శమందురు. అది రాష్ట్రీ సభ

వర్షము పతనమొంద నారంభించెను. దీనికితోడు విదేశీయులు భారతము నాక్రమింప దొడగిరి. కొన్ని శతాబ్దములపూర్వ మీ భా ర త ము క్రింద పేర్కొనబడిన నాలుగు విధములగు భిన్న భిన్న పరిస్థితులలో చిక్కు కొనెను.

1. ఆర్యజాతియందు వివిధమతములు వ్యాపించెను. ప్రతి మతము వేరు వేరుగా తనస్థితి నేర్పరుచుకొనెను. అందువలన ధర్మక్షేత్రమున నరాజకత యేర్పడెను.

2. భారత వర్షమున మహమ్మదీయమత మనుగు పెట్టుటతోడనే యటనొక విచిత్రపరిస్థితి యేర్పడినది. హిందూజాతి కది విశేష హాని కారకమయిన దనుట కెట్టి సందియమును లేదు.

3. కొందికాలమునకు తరువాత క్రైస్తవులును విని కరుదెంచి తమ సంప్రదాయజాలమును ప్రసరింపసాగిరి. వీరే విరముగానైనను హిందు వులను క్రైస్తవులగునట్లు చేయ నుద్దేశించిరి.

మహమ్మదీయ మత ముత్తర భారతమున నె ల వు చే సి కొనెను. క్రైస్తవ మతము దక్షిణమున విజృంభించెను. ఈ రెండు ధర్మములు భారతవర్షమును దిగ్భ్రమింగి భారతీయ ధర్మమును, భాషను, సభ్యతను, నష్టమొనర్ప బూనెను.

4. ఆంగ్లేయులు భారతమునకు వచ్చినదాదిగా విట నొకక్రొత్త వ్రివాహము బయలుదేరెను. భారతీయులు తమ గృహములందే విదే శీయులు కాజొచ్చిరి. పాశ్చాత్య శిక్షపద్ధతి భారతీయుల మ న స్సు న దాసత ప్రసాదింప జేసినది. క్రమముగా భారతీయులు మాతృభూమిని సభ్యతను, భాషను, సేవగింప మొదలిడిరి. అందువలన నన్ని విరముల భారతమున వైదేశికత ప్రవేశించినది. పాశ్చాత్య శిక్షవలన భారత నవయువకులు తమ శాస్త్రములను విజ్ఞానమును విరోధింప నారంభించిరి.

ఇదిగాక యార్యజాతియం దనేకములగు నాంతరిక భేదభావము లను రోగములు విరివిగా వ్యాపించెను. దాని సద్ధర్మమును ముక్క

వర్షము పతనమొంద నారంభించెను. దీనికితోడు విదేశీయులు భారతము నాక్రమింప దొడగిరి. కొన్ని శతాబ్దములుపూర్వ మీ భారతము క్రింద పేర్కొనబడిన నాలుగు విధములగు భిన్న భిన్న పరిస్థితులలో చిక్కుకొనెను.

1. ఆర్యజాతియందు వివిధమతములు వ్యాపించెను. ప్రతి మతము వేరు వేరుగా తనస్థితి నేర్పరుచుకొనెను. అందువలన ధర్మక్షేత్రమున నరాజకత యేర్పడెను.

2. భారత వర్షమున మహమ్మదీయమత మడుగు పెట్టుటతోడనే యిటనొక విచిత్రపరిస్థితి యేర్పడినది. హిందూజాతి కది విశేష హాని కారకమయిన దనుట కెట్టి సందియమును లేదు.

3. కొంతకాలమునకు తరువాత క్రైస్తవమును ఇట కరుదెంచి తమ సంప్రదాయజాలమును ప్రసరింపసాగిరి. వీరే విధముగానైనను హిందువులను క్రైస్తవులగునట్లు చేయ నుద్దేశించిరి.

మహమ్మదీయ మత ముత్తర భారతమున నెలవు చేసికొనెను. క్రైస్తవ మతము దక్షిణమున విజృంభించెను. ఈ రెండు ధర్మములు భారతవర్షమును దిగమ్రింగి భారతీయ ధర్మమును, భాషను, సభ్యతను, నష్టమొనర్ప బూనెను.

4. ఆంగ్లేయులు భారతమునకు వచ్చినదాదిగా నిం నొకక్రొత్త ప్రవాహము బయలుదేరెను. భారతీయులు తమ గృహములందే విదేశీయులు కాజొచ్చిరి. పాశ్చాత్య శిక్షాపద్ధతి భారతీయుల మనస్సున దాసత ప్రసాదింప జేసినది. క్రమముగా భారతీయులు మాతృభూమిని సభ్యతను, భాషను, నేవగింప మొదలిడిరి. అందువలన నన్ని విధముల భారతమున వైదేశికత ప్రవేశించినది. పాశ్చాత్య శిక్షవలన భారత నవయువకులు తమ శాస్త్రములను విజ్ఞానమును విరోధింప నారంభించిరి.

ఇవిగాక యార్యజాతియం దనేకములగు నాంతరిక భేదభావములను రోగములు విరివిగా వ్యాపించెను. దాని సర్వమును ముక్క

వైదికధర్మమును పునరుద్ధరించుటకు ధర్మముపేరిట ప్రచలితము లగు నధర్మములను ఖండించుటయు, అసత్యమతముల దూరమొనర్చి వాని స్థానమున వైదికమతమును స్థాపించుటయు నవసరమని ఋషికి తోచెను. అందువలననే దయానంద మహర్షి భారతమున నేమి, ప్రపంచమున నేమి, ప్రబలిన మత మతాంతరములలోగల లోటులను జూపి వానిని ఖండించెను. ప్రపంచమునకు వైదికధర్మమే నిత్యధర్మమనియు. విశ్వశాంతికి ముఖ్యకారణమనియు బోధించెను. ఈ ప్రచారక్షేత్రమున తన నర్థగించు విరోధుల నెదుర్కొనుట కతడొక్కడే నిర్భయుడై సిద్ధపడెను. తన విశ్వాసములను వెలిబుచ్చుటలో విరోధి సంఘముల మధ్యగూడ వెనుకంజ వేసి యెరుగడు.

ప్రపంచమున ధర్మశబ్దార్థ మతిసంకుచితముగా గ్రహింపబడు చుండెను. జనులు కొంతకాలమునుండి తమ వంశమున పరంపరగా వచ్చుచున్న యాచారములను గుడ్డితనముగా ననుసరించుటయే ధర్మ మని యెంచుచుండిరి. భారతమున ననేకులు "హ రే రా మ: హరేరామ"......... (గంగా గంగేతి యో బ్రూయాత్") మున్నగు వానిని పఠించిన మాత్రమున ధర్మపాలనమగునని భావించుచుండిరి. కొందఱు సాంసారిక ధర్మములను విడచుటయే పరమధర్మమని యుల్లుచేయసాగిరి.

వీరలకు జన్మధాత్రియగు భారత భూమియొక్క పవిత్రవాయు మండలమున ప్లావితుడయి యున్నత దేశభక్తుడైన యాదయానంద యతీశ్వరుడు తనసాధనాబలమునకు నార్యావర్తమునందొక గొప్ప పరివర్తనముగలిగించెను. ఆదిత్యబ్రహ్మచారియగు నా మహామహుని దివ్య సందేశము దేశమున నలుగడల వ్యాపించెను. "ఉత్తిష్ఠత జాగ్రత" లెండు మేలుకొనుడను ప్రాచీన వైదిక శంఖనాదము భారతాకాశమున ప్రత్యణువునందను వ్యాప్తమయ్యెను.

(శతరావముల వలన నేర్పడిన నానామతములచే గలుగుసాంసారిక దుఃఖములనుండి మానవజాతి నుద్ధరింప దలచి పరోపకారము పరమ వ్రతముగా ననుష్ఠించు నాదయానంద మహర్షి వైదిక సామ్యవాద

వైదికధర్మమును పునరుద్ధరించుటకు ధర్మముపేరిట ప్రచలితము లగు నధర్మములను ఖండించుటయు, అసత్యమతముల దూరమొనర్చి వాని స్థానమున వైదికమతమును స్థాపించుటయు నవసరమని ఋషికి తోచెను. అందువలననే దయానంద మహర్షి భారతమున నేమి, ప్రపంచముననేమి, ప్రబలిన మత మతాంతరములలోగల లోటులను జూపి వానిని ఖండించెను. ప్రపంచమునకు వైదికధర్మమే నిత్యధర్మమనియు, విశ్వశాంతికి ముఖ్యకారణమనియు బోధించెను. ఈ ప్రచారక్షేత్రమున తన నడ్డగించు విరోధుల నెదుర్కొనుట కతడొక్కడే నిర్భయుడై సిద్ధపడెను. తన నిశ్చయములను వెలిబుచ్చుటలో విరోధి సంఘము మధ్యగూడ వెనుకంజ వేసి యెరుగడు.

ప్రపంచమున ధర్మశబ్దార్థ మతిసంకుచితముగా గ్రహింపబడుచుండెను. జనులు కొంతకాలమునుండి తమ వంశమున పరంపరగా వచ్చుచున్న యాచారములను గుడ్డితనముగా ననుసరించుటయే ధర్మమని యెంచుచుండిరి. భారతమున ననేకులు "హరే రామ: హరేరామ"......... (గంగా గంగేతి యో బ్రూయాత్" / మున్నగు వానిని పఠించిన మాత్రమున ధర్మపాలనమగునని భావించుచుండిరి. కొందఱు సాంసారిక కర్మములను విడచుటయే పరమధర్మమని యట్లుచేయసాగిరి.

వీరలకు జన్మదాత్రియగు భారత భూమియొక్క పవిత్రవాయు మండలమున ప్లావితులయి యున్నత దేశభక్తుడైన యాదయానంద యతీశ్వరుడు తనసాధనాబలమునకు నార్యావర్తమునందొక గొప్ప పరివర్తనముగలిగించెను. ఆదిత్యబ్రహ్మచారియగు నా మహామహుని దివ్య సందేశము దేశమున నలుగడల వ్యాపించెను. "ఉత్తిష్ఠత జాగ్రత" లెండు మేలుకొనుడను ప్రాచీన వైదిక శంఖనాదము భారతాకాశమున ప్రత్యణువునందును వ్యాప్తమయ్యెను.

(భేదభావముల వలన నేర్పడిన నానామతములచే గలుగుసాంసారిక దుఃఖములనుండి మానవజాతి నుద్ధరింప దలచి పరోపకారము పరమ వ్రతముగా ననుష్ఠించు నాదయానంద మహర్షి వైదిక సామ్యవాద

కాని "పరోపకారాయ సతాం విభూతయః" అను నాదర్శము మూర్తీభవించవ దోయన నామహర్షి దయానందుడు కష్టముల నెదుర్కొనియూ తన జ్ఞానవిభూతిని లోకమున కర్పించెను. దయాసముద్రుడగుటచేత తనను వాప్పించిన శత్రువులను నిర్వికారుడై క్షమించెను. నిరంతరముగా నిరువదియేడు సంవత్సరముల కాలము నిద్రాణమై యున్న భారతమును మేల్కొల్పుటకై వైదిక సందేశమును జనుల శ్రోత్రముల ప్రతిధ్వనింపజేసెను.



# సత్యార్థ ప్రకాశ సూచీ పత్రము

## 12. సముల్లాసము

### 13. సముల్లాసము



### 14. సముల్లాసము





ఓ ౩ మ్.

సచ్చిదానందేశ్వరాయ నమో నమః.

# భూమిక

నేనీ సత్యార్థ ప్రకాశమను గ్రంథమును రచించు నప్పుడును. తత్పూర్వమును. సంభాషణ యందును పఠనపాఠనము లందును సంస్కృత మునే వాడుచుండి నందునను. నా జన్మభూమియొక్క భాష గుజరాతి యగుట చేతను. ఈ ఆర్యభాష అనగా హిందీ భాషయందు నాకు విశేష పరిజ్ఞాన ముండలేదు. గనుక భాష అశుద్ధమగుట తటస్థించెను. ఇప్పుడీ భాషయందు వ్రాయుటకును మాటలాడుటకు నభ్యాసమైనది. కనుక నీ గ్రంథము భాషా వ్యాకరణాను సారముగ సవరింపఁబడి రెండవ పర్యాయము ముద్రింపఁబడినది. అక్కడక్కడ శబ్దవాక్య రచనలను మార్చక భాషాశైలిని సవరించుట కఠినము గనుక నవి మార్చబడినవి. అర్థము మాత్రము మార్చబడలేదు. కాని కొన్ని విషయములు మాత్రము పెంచి వ్రాయఁబడుటయే గాక మొదటి కూర్పు నందలి పొరబాటులుగూడ సవరింపఁబడినవి.

ఈ గ్రంథము (౧౪) పదునాలుగు సముల్లాసములు గలది. అందు పది సముల్లాసములు పూర్వార్ధము. నాలుగు సముల్లాసములు ఉత్తరార్ధము. కడపటి రెండు సముల్లాసములును, స్వసిద్ధాంతములును స్వమంత వ్యామంతవ్య ప్రకాశము గొన్ని కారణములచే మొదట ముద్రింపలేదు. ఇపుడవియును ముద్రింపఁబడినవి.

ప్రథమ సముల్లాసమునందు పరమేశ్వరుని ఓంకారాది నామముల వ్యాఖ్యయు;
రెండవ సముల్లాసమునందు సంతానమును గూర్చిన శిక్షయు;
మూడవ సముల్లాసమునందు బ్రహ్మచర్య విధియు. పఠనపాఠన వ్యవస్థయు. సత్యాసత్య గ్రంథముల పేర్లునువానిఁపఠన పాఠన రీతియు;
నాల్గవ సముల్లాసమునందు వివాహ. గృహాశ్రమ వ్యవహారమును;

అయిదవ సముల్లాసమునందు వానప్రస్థ సన్న్యాసాశ్రమ విధులును;
ఆఱవ సముల్లాసమునందు రాజధర్మమును;
ఏడవ సముల్లాసమునందు వేదేశ్వర విషయములును;
ఎనిమిదవ సముల్లాసమునందు జగత్తుయొక్క ఉత్పత్తి, స్థితి ప్రలయములును;
తొమ్మిదవ సముల్లాసమునందు విద్య, అవిద్య, బంధ, మోక్షముల వ్యాఖ్యయు;
పదవ సముల్లాసమునందు ఆచారానాచార, భక్ష్యాభక్ష్యవిషయములును;
పదునొకండవ సముల్లాసమునందు ఆర్యావర్తీయ మత మతాంతర ఖండన మండన విషయములును;
పండ్రెండవ సముల్లాసమునందు చార్వాకబౌద్ధ జైనమత విషయములును;
పదమూడవ సముల్లాసమునందు క్రైస్తవ మత విషయమును;
పదునాల్గవ సముల్లాసమునందు మహమ్మదీయుల మతవిషయమును;

అంతమందు ఆర్యులయొక్క సనాతన వేదవిహిత మతమును గూర్చిన విశేషవ్యాఖ్యయు వ్రాయఁబడినది. ఈ వేదవిహిత మతమును నేనును సత్యమని ఉన్నదన్నట్లు నమ్ముచున్నాను.

సత్యమగు నర్థమును ప్రకాశపఱచుటయే ఈ గ్రంథమును రచియించుట యందలి నా ముఖ్య ప్రయోజనము. సత్యమును సత్యముగను, మిథ్యను మిథ్యగను ప్రతిపాదించుట సత్యార్థప్రకాశము. సత్యమును అసత్యముగ గాని, అసత్యమునుసత్యముగఁగాని ప్రకాశపఱచుటసత్యమనఁబడజాలదు. పదార్థమును ఉన్నదున్నట్లు చెప్పుటయు, వ్రాయుటయు, నమ్ముటయు సత్యము. పక్షపాతము గలవారుతన అసత్యమునుగూడ సత్యమనియు, విరుద్ధ మతస్థుల సత్యమును గూడ నసత్యమనియు సిద్ధపఱచుటకు ప్రయత్నించును. గనుక సత్యమతమును గాంచఁజాలరు.

కాఁబట్టి ఉపదేశముచేఁగాని లేంచేఁగాని అందఱియెదుట సత్యాసత్య స్వరూపమును సమర్పించుట విద్వాంసులగు నాప్తులకు ముఖ్య కర్తవ్యము. పిమ్మట జనులే స్వయముగ తమతమ హితాహితములను గుర్తెఱింగి సత్యా

పరోపకార మొనర్చుటయందు ఉదాసీనులయి సత్యార్థమును ప్రకాశపఱచు టయం దెన్నటికిని వెనుదీఁయరు. "యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్" అను నిది గీతా వచనము. విద్యను ధర్మమును బొందఁ జేయు కర్మలు ప్రారంభమందు విషమునకు సమానముగ దోచినను పిమ్మట అమృతోప మానమగుచున్నవని దీని యభిప్రాయము. ఇది గొప్ప దృఢ నిశ్చయము. కాఁబట్టి ఇట్టి వానిని నా మనస్సునందుంచి ఈ గ్రంథమును రచించినాఁడను. ఈ గ్రంథమును వినువారును జదువువారును మొదట ప్రేమ దృష్టితో వీక్షించి దీనియందలి సత్య తాత్పర్యమును గ్రహించి, పిమ్మటఁ దమ యిచ్ఛానుసారము వర్తిల్లుదురుగాక. సమస్త మతములలోని సత్యములందఱికి నవిరుద్ధములుగనుక వానిని స్వీకరించి మత మతాంతరముల యందలి మిథ్యలను ఖండింప వలెననుటయే యీ గ్రంథముయొక్క యభిప్రాయము. ఇది గాక మత మతాంతరముల యొక్క లోపలి వెలుపలి దోషములను ప్రకాశపఱచి పండితులనకయు, పామరులనకయు నందఱియెదుట బెట్టిన పక్షమున అందఱితోను నందఱు విచారించి పరస్పరము ప్రేమించి ఒక్క సత్య మతము కాగలరనియు గూడ నీ గ్రంథముయొక్క తాత్పర్యము. నే నీయార్యావర్తమందుఁబుట్టి యిచ్చటనే వసియించుచున్నను. ఈ దేశపు మత మతాంతరముల దోషములను గూర్చి పక్షపాతముఁ జూపక యున్నదున్నట్లు ప్రకాశపఱచు చున్నాను. అట్లే విదేశ, విమతస్థులతోను వర్తిల్లెదను. మనుష్యజాతి యొక్క యున్నతి విషయమై స్వదేశస్థులతో వలెనే విదేశస్థులతోడను వర్తిల్లుచుందును. అట్లు వర్తిల్లుటయే సజ్జనులందఱికిని యోగ్యము. నేనును ఏదేని యొకదానియందు పక్షపాతము గలిగి యుందునేని ఎట్లు ఇప్పటివారలు స్వమతమును స్తుతియించుట యందును, సమర్థించుటయందును, ప్రచారము చేయుటయందును, అన్యమతములను నిందించుటయందును, వానికి హాని కలిగించుటయందును, వాని నాపుటయందును తత్పరు లగుచుందురో నేను నట్లే వర్తిల్లి యుందును. కాని అది మానుష ధర్మమునకు దూరము. పశువు బలిసి దుర్బలులకు దుఃఖమును గలిగించుటయేగాక వానిఁ జంపియు వేయును. మనుష్య శరీరమును దాల్చియు నట్టి కర్మయే యొనరించిరేని వారు మనుష్య స్వభావయుక్తులు గాక కేవలం పశుతుల్యగుదురు. ఎవఁడు బలవంతుఁడై దుర్బలులను రక్షించునో అతఁడే మనుష్యుఁడు. స్వార్థవశుఁడై పరహాని మాత్ర మొనరించువాఁడు పశువులకుఁ బెద్దన్న యనఁదగును.

ఆర్యావర్తీయుల విషయమై విశేషించి పదునొకండు సముల్లాసముల వఱకు వ్రాయఁబడినది. ఈ సముల్లాసముల యందుఁ బ్రకాశింపఁబడిన సత్య మతము వేదోక్త మనుటచే నాకు సర్వథా మంతవ్యము. నవీనములగు పురాణములు తంత్రములు మొదలగు గ్రంథములందు జెప్పఁబడిన విషయములు ఖండింపఁబడినవి. అవి త్యక్తవ్యములు. ౧౨ వ సముల్లాసమునందు దర్శింపఁబడిన చార్వాకమతము ప్రస్తుతము క్షీణించి అస్తమానమయినట్లు తోచుచుండినను అనీశ్వర వాదాదులయందు బౌద్ధ జైనులతో మిక్కిలి సంబంధము గలిగియున్నది. ఇది అన్నింటిలో గొప్ప నాస్తికమతమై యున్నయది. కాఁబట్టి దాని చేష్ట నడ్డగించుట యావశ్యకము. అసత్యము నడ్డగింపయది సంసారమునం దనేకానర్థములు ప్రవర్తిల్లును. ఈ చార్వాక మతమును గూర్చియు బౌద్ధజైన మతముల గూర్చియు ౧౨ వ సముల్లాసమునందు సంక్షేపముగ వ్రాయఁబడినది. బౌద్ధజైన మతములు చారవాకమతముతో సంబంధించియున్నను కొన్ని విషయములలో కొంత విరోధము కలిగి యున్నవి. జైన మత మనేకాంశముల యందు చార్వాక బౌద్ధులతో సంబంధించి యున్నను కొంది విషయములందు భేదించుచున్నయది. కాఁబట్టి జైన మతము భిన్నశాఖగా గణింపఁబడు చున్నది. ౧౨ వ సముల్లాసమునందు ఈ (చారవాక బౌద్ధ జైనమతములును, వాని పరస్పర) భేదములును వ్రాయఁబడినవి. అచ్చట నాయా విషయములు యథాయోగ్యముగ గ్రహింపనగును. వీనిలో బౌద్ధుల దీపవంశాది ప్రాచీన గ్రంథములలోని బౌద్ధమత సంగ్రహము సర్వదర్శన సంగ్రహమున జూపబడినది. దానినుండి యిటనది వ్రాయబడినది. ఈ క్రిందఁగనుపఱుపఁబడినవి జైనుల సిద్ధాంత గ్రంథములు. వానిలో :—

౪. మూల సూత్రములు:— ౧. ఆవశ్యక సూత్రము ౨. విశేషావశ్యక సూత్రము, ౩ దశవైకాలిక సూత్రము, ౪. పాక్షిక సూత్రము.

౧౧. అంగములు:— ౧. ఆచారాంగ సూత్రము. ౨. సుగడాంగ సూత్రము. ౩. ఠాణాంగ సూత్రము. ౪. సమవాయాంగ సూత్రము. ౫ భగవతీ సూత్రము. ౬. జ్ఞాతాధర్మకథా సూత్రము. ౭. ఉపాసకదశా సూత్రము. ౮. అంతగడదశా సూత్రము. ౯. అనుత్తరోప్తవాయి సూత్రము ౧౦. విపాక సూత్రము. ౧౧. ప్రశ్నవ్యాకరణ సూత్రము.

౧౨. ఉపాంగములు:—౧. ఉపవాయీ సూత్రము. ౨. రాయపసేనీ సూత్రము. ౩. జీవాభిగమ సూత్రము. ౪. పన్నవణా సూత్రము. ౫. జంబుద్వీప పన్నతీ సూత్రము. ౬. చందపన్నతీ సూత్రము. ౭. సూరపన్నతీ సూత్రము. ౮. నిరియావలీ సూత్రము. ౯. కప్పియా సూత్రము. ౧౦. కపబడీసయా సూత్రము. ౧౧. పూప్పియా సూత్రము. ౧౨. పుప్పచూలియా సూత్రము.

౫ కల్ప సూత్రములు:—౧. ఉత్తరాధ్యయన సూత్రము. ౨. నిశీథ సూత్రము. ౩. కల్ప సూత్రము. ౪. వ్యవహార సూత్రము. ౫. జీత కల్ప సూత్రము.

౬. ఛేదములు:—౧. మహానిశీథ బృహద్వాచనా సూత్రము. ౨. మహానిశీథ లఘువాచనా సూత్రము. ౩. మధ్యమవాచనా సూత్రము. ౪. పిండనిరుక్తి సూత్రము. ౫. ఓ ఘనిరుక్తి సూత్రము. ౬. పర్యూషణా సూత్రము.

౧౦. పయన్న సూత్రములు:— ౧. చతుస్సరణ సూత్రము. ౨. పంచఖాణ సూత్రము. ౩. తదుంవైయాలిక సూత్రము. ౪. భక్తి పరిజ్ఞాన సూత్రము. ౫. మహాప్రత్యాఖ్యాన సూత్రము. ౬. చందావిజయ సూత్రము. ౭. గణివిజయ సూత్రము. ౮. మరణ సమాధి సూత్రము. ౯. దేవేంద్ర స్తవన సూత్రము. ౧౦. సంసార సూత్రము. ఇవిగాక నందీ సూత్రమును, యోగోద్ధార సూత్రమునుగూడ ప్రామాణికముగ నమ్ముచున్నవారు:—

౫. పంచాంగములు:—౧. పైఁజెప్పఁబడిన యన్ని గ్రంథములయొక్క టీక. ౨. నిరుక్తి. ౩. చరణీ. ౪. భాష్యము. అను నీనాల్గింటికి నవయవము లని పేరు. ఈ యవయవములును మూల గ్రంథములును గలసి పంచాంగము లనఁబడును. వీనియందు ఢూంఢియలు అవయవములను నమ్మరు. జైనులు నమ్మనవి యివియేగాక వీనికంటె భిన్నములగు గ్రంథము లనేకము లున్నయవి. వీరి మతమును గూర్చిన విశేష విచారము ౧౨ వ సమోల్లాసమునందుఁ జూడుఁడు. జైనుల గ్రంథములయందు లక్షలకొలఁది పునరుక్తదోషము లున్నయవి. తమగ్రంథ మితర మతస్థులచేత నున్నను, ముద్రింపఁబడియున్నను వానిని అప్రమాణమని చెప్పుటకూడ వీరి స్వభావము.

ఎవరు నమ్మినను, ఎవరు నమ్మకుండినను ఆ గ్రంథము మాత్రము జైనమత గ్రంథమునుండి వేరు కాఁజాలదు. కాఁబట్టి యీ గ్రంథము ప్రమాణము కాదని వారు చెప్పుట సత్యముకాదు. ఎవ్వరును నమ్మక యున్నను జైనుఁలును నమ్మనిది యయ్యెనేని యది అగ్రాహ్యము కాఁగలదు. కాని వానిలో నెవ్వరును నమ్మకుండునట్టి గ్రంథమేదియు లేదు. కాఁబట్టి యెవ్వరే గ్రంథమును నమ్ముచున్నారో ఆ గ్రంథస్థ విషయక ఖండన మండనములను వారిని గూర్చిన వేయని తెలియనగును. వీరిలోఁ గొందఱు ఏదేని ఒక గ్రంథమును దాము తెలిసియుండినను, నమ్ముచుండినను సభయందును సంవాదములందును మారిపోవుటకూడఁ గలదు. కావుననే జైనులు తమ గ్రంథములను దాచిపెట్టుదురు. మరియు ఇతర మతస్థులకీయరు, వినుపింపరు, చదివింపరు. ఎందు కనఁగా జైనులలో నెవ్వరు నుత్తర మీఁజాలని యసంభవములందు నిండియున్నవి. అసత్య విషయమును వదలుటయే యుత్తరము.

౧౩వ సముల్లాసమునందు క్రైస్తవుల మత విషయమై వ్రాయఁబడి యున్నది. వీరు బైబిలును తమ ధర్మపుస్తకమని నమ్ముచున్నారు. వీరి మత విశేషముల నా ౧౩వ సముల్లాసముననే జూడుఁడు. ౧౪వ సముల్లాస మందు ముసల్మానుల మతవిషయమై వ్రాయఁబడియున్నది. వీరు కురానును తమ మతమునకు మూలపుస్తకమని నమ్ముచున్నారు. వీరి విశేష వ్యవహారములను ౧౪వ సముల్లాసమునఁ జూడుఁడు. పిమ్మట వైదిక మతవిషయమై వ్రాయఁబడి యున్నది.

ఎవరి గ్రంథకర్త యొక్క తాత్పర్యమునకంటె విరుద్ధమగు నభిప్రాయముతో జూతురో వారి కభిప్రాయమేమియుఁ దేటపడఁ జాలదు. ఏలననఁగా వాక్యార్థ బోధమందు నాలుగు కారణములుండును. ఆకాంక్ష. యోగ్యత, ఆసత్తి, తాత్పర్యమునని. ఏదేని విషయమందు వక్తయును వాక్యస్థపదములును పరస్పరమందు సంబంధమునకు "ఆకాంక్ష," అని పేరు. వీటితోఁ జల్లడనువలె దేనితో నెద్దిగాఁగలదో దానితో నదియే గ్రహించుట "యోగ్యత." దేనితో నేపదమునకు సంబంధమున్నదో దాని సమీపమున నా పదమును చెప్పుటయు వ్రాయుటయు "ఆసత్తి." దేనికొఱకు వక్తృద్వారమును జేసెనో లేక లిఖించెనో దానితో నావచనములను, ఆ లేఖను గూర్చుట "తాత్పర్యము." ఈ నాలుగు విషయములందును ధ్యానముంచి యే పురుషుఁడు గ్రంథమును జదువునో అతనికి గ్రంథాభిప్రాయము యథాయోగ్య

ముగ విశదముకాగలదు. హఠులును దురాగ్రహులునగు నసేతులు వక్తయొక్క యభిప్రాయమునకంటె విరుద్ధమగు దానిని దాము కల్పించుకొందురు. ప్రాయశః ఇట్లు చేయువారు మతావేశము కలవారు; ఎందుకనఁగా వారిబుద్ధి మతమందలి దురాగ్రహముచేత నంధకారములోఁజిక్కి నష్టమై పోయియుండును. కాఁబట్టి ఎట్లు నేను పురాణములను, జైనుల గ్రంథములను, బైబిలును, కురానును మొదట నే కుదృష్టితోఁజూడక వానియందలి గుణములను గ్రహించి దోషములను బరిత్యజించి అన్యమనుష్య జాతియొక్క యున్నతి కొఱకుఁ బ్రయత్నించు చున్నానో, అట్లే యందఱు నాదరించుట యోగ్యము. కనుక ఈమతముల యొక్క కొన్నికొన్ని దోషముల మాత్రమే ప్రకాశపఱచి యున్నాఁడను. వానినిఁజూచి మనుష్యులు సత్యాసత్య మతమును నిర్ణయింపఁ గలిగి సత్య గ్రహణమును అసత్యత్యాగమును జేయుటకును జేయించుటకును, సమర్థుల గుదురుగాక. ఒక్కటేయగు మనుష్యజాతియందు భ్రమను, విరుద్ధబుద్ధిని గల్పించి పరస్పర శత్రువులుగ నొనర్చి జగడమాడఁజేసి, మోదుకొనునట్లు చేయుట విద్వాంసులయొక్క స్వభావమునకు దూరము. ఈ గ్రంథమునుజూచి విద్వాంసులుకానివారు వేరుగా నెంచినను బుద్ధిమంతులు యథా యోగ్యముగ దీని యభిప్రాయమును గ్రహింపఁగలరు. కాఁబట్టి నాయొక్క పరిశ్రమ సఫలమని యెంచి నా యభిప్రాయమును సజ్జను లందఱి యెదుటఁ బెట్టుచున్నాను. దీనిని బాచియుఁజూపియు నా పరిశ్రమను సఫలపఱతురు గాక। మఱియు పక్షపాతము చేయక ఈ ప్రకారము సత్యార్థమును ప్రకాశపఱచుట నా యొక్కయు సమస్త మహాశయుల యొక్కయు ముఖ్యకర్తవ్యమై యున్నయది. సర్వాత్ముఁడును, సర్వాంతర్యామియు, సచ్చిదానందుఁడు నగుపరమాత్మ తనకృపచేసీయాశయమును విస్తృతపఱచి చిరస్థాయిగ నొనర్చునుగాక.

అలమతి విస్తరేణ బుద్ధిమద్వర శిరోమణిషు.

ఇతి భూమికా॥

స్థానము: మహారాణాగారి ఉదయపురము.<br>
భాద్రపదశుక్లపక్షము. విక్రమశకము ౧౯౩౯

స్వామి<br>
దయానంద సరస్వతి

ఓమ్

సచ్చిదానందేశ్వరాయ నమోనమః

# సత్యార్థప్రకాశము

## ప్రథమ సముల్లాసము

ఓమ్ శన్నో మిత్రః శం వరుణః, శన్నో భవత్వర్యమా ।
శన్న ఇన్ద్రో బృహస్పతిః, శన్నో విష్ణు రురుక్రమః ॥ ఋ. ౧-౯౦-౯

నమో బ్రహ్మణే, నమస్తే వాయో, త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి । త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి, ఋతం వదిష్యామి, సత్యం వదిష్యామి । తన్మామవతు, తద్వక్తారమవతు, అవతు మామవతు వక్తారమ్॥ ఓం శాన్తిః శాన్తిః శాన్తిః॥ తై. ఆ. ౭-౧॥

అర్థము:—(ఓమ్) ఓంకారశబ్దము పరమేశ్వరుని సర్వోత్తమనామము. ఇందలి అ, ఉ, మ్, అను మూ డక్షరములు కలిసి యొక (ఓమ్) సముదాయ మైనది. ఈ నామమునుండి పరమేశ్వరుని యనేకనామములు పొడముచున్నవి. ఎట్లనఁగా - అకారము విరాట్, అగ్ని, విశ్వాదినామములకును; ఉకారము హిరణ్యగర్భ, వాయు, తైజసాది నామములకును; మకారము ఈశ్వర, ఆదిత్య, ప్రాజ్ఞాది నామములకును వాచకములును గ్రాహకములునై యున్నవి. ఇట్లే వేదాది సత్యశాస్త్రములు స్పష్టముగా వ్యాఖ్యానించి యున్నవి. కాన ప్రకరణానుకూల మీ నామము లన్నియుఁ, బరమేశ్వరునివే.

ప్రశ్న:— విరాడాది నామములు పరమేశ్వరునికంటె భిన్నమగు నర్థముల కేల వాచకములు గావు? బ్రహ్మాండమునకును, పృథివ్యాది భూతములకును, ఇంద్రాది దేవతలకును, వైద్యశాస్త్రమందు శుంఠ్యాది ఔషధములకును ఈ నామము లున్నవా? లేవా?

ఉత్తరము:— ఉన్నవి కాని పరమాత్మకును ఉన్నవి.

ప్రశ్న:— ఈ నామములనుండి కేవలము దేవతలనే గ్రహించెదరా లేదా?

ఉత్తరము:— మీరట్లు గ్రహించుట కేమి ప్రమాణము :

ప్రశ్న:— దేవతలు ప్రసిద్ధులు, సత్తములును కనుక వారినే గ్రహింతుము.

ఉత్తరము:— ఏమి పరమేశ్వరుఁ డప్రసిద్ధుఁడా? అతనికంటె సత్తములు గలరా? మఱి యీ నామములన్నియును పరమేశ్వరునికిఁ గూడఁ గలవని యేల నమ్మరు? పరమేశ్వరుఁ డప్రసిద్ధుడుగాక అతనితోఁ దుల్య మేదియు లేనప్పుడు, అతనికంటె సత్తము లెట్లుండగలరు? కాబట్టి మీరు చెప్పునది సత్యముకాదు. మీరిట్లు చెప్పుటచే ననేక దోషములు గలుగుచున్నవి. ఎట్లనఁగా "ఉపస్థితం పరిత్యజ్యాను పస్థితం యాచత ఇతి బాధితన్యాయః" ఒకఁడొకనికి భోజనపదార్థములను బెట్టి భోజనము చేయుఁడనినప్పుడు, అతఁడు దానిని వదలి అప్రాప్త భోజనముకొఱ కిక్కడ నక్కడ తిరుగునేని యతనిని బుద్ధిమంతుఁడని యెంచరాదు. అతఁడు సమీపమందుఁ బ్రాప్తించిన పదార్థమును వదలి, లేనిదాని కొఱకు శ్రమపడుచున్నాఁడు. కాఁబట్టి అతఁడెట్లు బుద్ధిమంతుఁడు కాఁడో అట్లే మీరు చెప్పినదియునగును. తమరు ఆ విరాడాది నామములచేతఁ బ్రసిద్ధుఁడును బ్రమాణసిద్ధుఁడునగు పరమేశ్వరుని, బ్రహ్మాండము మొదలగు ఉన్న పదార్థములను వదలి అసంభవములై లేని దేవాదులను గ్రహించుటయందు శ్రమఁ జేయుచున్నారు. ఇందులో నేమియుఁ బ్రమాణమును యుక్తియును లేదు. ఎక్కడ దేని ప్రకరణమో యక్కడ దానిని గ్రహించుట యోగ్యము. ఎట్లనఁగ నొకఁడు తన సేవకునిఁగూర్చి "ఓరీ! సైంధవముఁ దెమ్ము" అన్నప్పుడా సేవకునకు సమయము (ప్రకరణము) విచారించుట యావశ్యకము. ఏలయనఁగా (సైంధవమను పేరు రెండుపదార్థములకున్నది. ఒకటి గుఱ్ఱమునకు, రెండవది లవణమునకు.) తన యజమానుని గమనసమయ మయ్యెనేని గుఱ్ఱమును, భోజన కాలమయ్యెనేని లవణమును దెచ్చుట యుచితము. గమన సమయమునందు లవణమును, భోజనసమయమునందు గుఱ్ఱమును దెచ్చెనేని యతనిస్వామి యతనిమీఁద క్రుద్ధుఁడై, "నీవు నిర్బుద్ధివి. గమనసమయమందు లవణమును, భోజన సమయమందు గుఱ్ఱమును దెచ్చుటచే నేమి ప్రయోజనము? నీవు ప్రకరణజ్ఞుఁడవు కావు. నీకు బుద్ధియేయున్న నేసమయమందేది తేవలయునో, అదియే తెచ్చియుందువు. ప్రకరణము విచారించుట యుచితము. నీవు దానిని జేయలేదు.

కాఁబట్టి నీవు మూర్ఖుఁడవు. నా యొద్దనుండి వెడలిపొ" మ్మనెనుగదా! కాన నెక్కడ దేనిని గ్రహించుట యుచితమో, అక్కడ నా యర్థమునే గ్రహింపవలయును. ఆ రీతినే మీరును, మేము నందఱమును నమ్మవలయును, చేయవలయును.

## మంత్రార్థము

౧. ఓమ్ ఖమ్ బ్రహ్మ॥ యజుః అ. ౪౦ మం-౧౭.

చూడుఁడు, వేదములందు నిట్టి ప్రకరణములలోఁ బరమేశ్వరునకు "ఓమ్" మొదలగు నామములు వాడఁబడియున్నవి.

౨. ఓమిత్యేతదక్షర ముద్గీథ ముపాసీత॥ ఛాందోగ్య ఉప-అ-౧. మం-౧౧.

౩. ఓమిత్యేతదక్షరమిదగ్ం సర్వం తస్యోపవ్యాఖ్యానమ్॥ మాండూక్య-మం-౧॥

౪. సర్వే వేదా యత్పదమామనన్తి. తపాగ్ంసి సర్వాణి చ యద్వదంతి। యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి. తత్తే పదం సంగ్రహేణ బ్రవీమ్యోమిత్యేతత్.
కఠ.వల్లీ-౨. మం-౧౫.

౫. ప్రశాసితారం సర్వేషా మణీయాంస మణోరపి।
రుక్మాభం స్వప్నధీగమ్యం విద్యాత్తం పురుషం పరమ్॥మను.అ-౧౨.శ్లో-౧౨౨.

౬. ఏతమేకే వద న్త్యగ్నిం మను మన్యే ప్రజాపతిమ్।
ఇంద్రమేకే పరేప్రాణ మపరే బ్రహ్మ శాశ్వతమ్॥ ౧౨౩॥

౭. స బ్రహ్మా స విష్ణుః స రుద్రస్స శివస్సోఽక్షరస్స పరమః స్వరాట్।
స ఇంద్రస్స కాలాగ్నిస్స చంద్రమాః॥ కైవల్య ఉపనిషత్. ౧-౮॥

౮. ఇంద్రం మిత్రం వరుణమగ్ని మాహురథో దివ్యస్స సుపర్ణో గరుత్మాన్।
ఏకం సద్విప్రా బహుధా వద న్త్యగ్నిం యమం మాతరిశ్వానమాహుః॥
ఋ.మం ౧।సూ-౧౬౪।మం. ౪౬.

౯. భూరసి భూమిరస్యదితిరసి విశ్వధాయా విశ్వస్య భువనస్య ధర్త్రీ।పృథివీం యచ్ఛ పృథివీం దృగ్ంహ పృథివీం మా హిగ్ంసీః॥ యజు.అ-౧౩।౧౮.

౧౦. ఇంద్రో మహ్నా రోదసీ పప్రథచ్ఛవ ఇంద్రః సూర్యమరోచయత్।
ఇంద్రే హ విశ్వా భువనాని యేమిర ఇంద్రే స్వానాస ఇందవః॥
సామవేద ఉత్తరార్చికే ప్రపా-౭। త్రిక-౮। మం-౨।

౧౧. ప్రాణాయ నమో యస్య సర్వమిదం వశే। యో భూతః సర్వస్యేశ్వరో యస్మిన్ సర్వం ప్రతిష్ఠితమ్॥ అథర్వవేద ముకాం-౧౧।అ-౨।సూ-౪।మం-౧।

ఇట్టి ప్రకరణముల యందు ఓంకారాది నామములచే, పరమాత్మ గ్రహింపఁబడి నాఁడని తెలుపుటకు నిక్కడ నీప్రమాణములు వ్రాయఁబడినవి. ఇదిగాక లోకమందు దరిద్రునికి కుబేరుఁడు మొదలగు నామము లున్నట్లు పరమేశ్వరునికి అర్థరహితము లగు నామము లుండవు. దీనిచేఁ గొన్ని పరమేశ్వరుని గుణమును, గొన్ని కర్మమును, గొన్ని స్వభావమును బోధించు చున్నవని తేటపడుచున్నది. "ఓం" మున్నగు నామములు సార్థకములు. అవెట్లనగా – ౧ 'ఓమ్ ఖం' (అవతీత్యోమ్), (ఆకాశమివ వ్యాపకత్వాత్ ఖమ్), (సర్వేభ్యో బృహత్వాత్ బ్రహ్మ) రక్షించుటచేత 'ఓమ్' అనియు, ఆకాశమువలె వ్యాపకుఁడగుటచేత 'ఖం' అనియు, అన్నిటికంటె గొప్ప వాఁడగుటచేత 'బ్రహ్మ' అనియు ఈశ్వరునకు నామములు. ౨. ఓమిత్యేతత్ :– ఓమ్ ఎవని నామమో, యెవఁడెన్నటికిని నశింపఁడో అతని నుపాసించుటయోగ్యము. కాని అన్యోపాసన యోగ్యము కాదు. ౩. ఓమిత్యే:– వేదాది శాస్త్రము లందంతటఁ బరమేశ్వరుని ప్రధాననామము ఓమ్ అని చెప్పఁబడియున్నది. తక్కిన వన్నియు గౌణనామములు. ౪. సర్వేవేదా:–అన్ని వేదములును, సమస్తధర్మానుష్ఠానరూప తపశ్చరణయు నెవనినిఁ జెప్పుచు గౌరవించుచున్నవో, ఎవనిని బొందఁగోరి (విద్వాంసులు) బ్రహ్మచర్యాశ్రమమునఁ జరించుచున్నారో, అతని నామము 'ఓమ్.' ౫. ప్రశాసితారం:– ఎవఁ డందఱికి శిక్షకుఁడో, ఎవఁడు సూక్ష్మమునకంటె సూక్ష్ముఁడో, ఎవఁడు స్వప్రకాశస్వరూపుడో, ఎవఁడు సమాధిస్థబుద్ధిచేతఁ దెలిసికొనుటకు యోగ్యుఁడో, అతనినే పరమపురుషుఁడని తెలియవలయును. ౬. ఏతమగ్నిం:– స్వప్రకాశకుఁడగుటచే 'అగ్ని'. విజ్ఞానస్వరూపుఁడగుటచే 'మనువు' అందఱను బాలించుటచేత 'ప్రజాపతి' పరమైశ్వర్యవంతుఁడగుటచేత 'ఇంద్రుఁడు' అందఱకు జీవన మూలమగుటచే 'ప్రాణము' నిరంతర వ్యాపకుఁడగుటచే 'బ్రహ్మ' అని పరమేశ్వరునకు నామములు. ౭. స బ్రహ్మ:– జగత్తు నంతటిని సృష్టించుటచే "బ్రహ్మ" సర్వత్రవ్యాపకుఁ డగుటచే "విష్ణువు," దుష్టులనుదండించి యేడ్పించుటచే "రుద్రుఁడు," మంగళమయుఁడును అందఱకును కల్యాణకర్తయు నగుటచే "శివుఁడు," (యః సర్వమశ్నుతే న క్షరతి న వినశ్యతి తదక్షరమ్)సర్వత్రవ్యాపించి యవినాశి యగుటచే "నక్షరుఁడు," (యః స్వయం రాజతే సస్స్వరాట్) స్వయం ప్రకాశకుఁడగు

టచే 'స్వరాట్టు' (యోఽగ్నిరివ కాలః కలయితా ప్రలయకర్తా స కాలాగ్ని రీశ్వరః) ప్రలయమందెల్లరకును కాలుఁడయి కాలమునకును కాలుఁడగుటచే 'కాలాగ్ని' అని పరమేశ్వరునకు నామములు. ౮. ఇంద్రం మిత్రం:- అద్వితీయమును: సత్యమునగు బ్రహ్మ వస్తువునకే ఇంద్రాది సమస్త నామములు. (ద్యుషుశుద్ధేషు పదార్థేషు భవోదివ్యః) ప్రకృత్యాది దివ్య పదార్థములలో వ్యాపకుఁడగుటచే "దివ్యుఁడు." (శోభనాని పర్ణాని పాలనాని పూర్ణాని కర్మాణి వా యస్య స సుపర్ణః) ఉత్తమ పాలనమును పూర్ణకర్మములు గలవాఁడగుటచే "సుపర్ణుఁడు"(యో గుర్వాత్మా స గరుత్మాన్)గొప్ప స్వరూపము గలవాఁడగుటచే గరుత్మంతుఁడు."(యో మాతరిశ్వా వాయురివ బలవాన్ స మాతరిశ్వా)వాయువు వలె అనంతబలవంతుఁడగుటచే "మాతరిశ్వుఁడు." కాఁబట్టి పరమాత్మకు దివ్యుఁడు. సుపర్ణుఁడు. గరుత్మంతుఁడు, మాతరిశ్వుఁడునను నామములు కలిగినవి. తక్కిన (ఇంద్ర, మిత్ర, వరుణ, అగ్ని, యమ) నామములకు నర్థము ముందు వ్రాయఁబడును. ౯. భూరసి భూమిరసి:-(భవంతి భూతాని యస్యాం సా భూమిః)దేని యందు సమస్త భూతప్రాణులు కలుగుచున్నవి, గనుక ఈశ్వరునకు 'భూమి' యని పేరు. తక్కిన (భూ ఆది, నామములకు నర్థము ముందు వ్రాయఁబడును. ౧౦. ఇంద్రో మహ్నే:—. ఈ మంత్రమందు ఇంద్రశబ్దము పరమేశ్వరునిదే నామమయి యున్నది. కాబట్టి యిది ప్రమాణముగా నీయఁబడినది. ౧౧. ప్రాణాయ:- ఎట్లు ప్రాణవశమందు శరీరమును, ఇంద్రియములు, నుండునో అట్లే పరమేశ్వరుని వశమందు జగత్తంతయు నుండును. ఇత్యాది ప్రమాణములకు సరియైనయర్థము విచారింపఁగా ఈనామములచే పరమేశ్వరుఁడే గ్రహింపఁ బడుచున్నారు. ఓమ్, అగ్ని మొదలగు నామములు ముఖ్యార్థముచేఁ బరమేశ్వరునే గ్రహించుచున్నవి. వ్యాకరణము, నిరుక్తము, బ్రాహ్మణములు సూత్రాది గ్రంథములు, ఋషిమునుల వ్యాఖ్యానముంద్వారా (యీ నామములు) పరమేశ్వరునకే గ్రాహకములని తెలియుచున్నది. అట్లే గ్రహించుట అందఱికిని యోగ్యము. కాని 'ఓమ్' అనునది కేవలము పరమాత్మకే నామమై యున్నది. అగ్న్యాది నామములచేతఁ బరమేశ్వరుని గ్రహించుటకు ప్రకరణమును, విశేషణమును నియమకారకములు. కాఁబట్టి ఎక్కడెక్కడ స్తుతి, ప్రార్థన, ఉపాసనలును, సర్వజ్ఞ, వ్యాపక, శుద్ధ, సనాతన, సృష్టికర్త్రాది విశే

షణములను వ్రాయఁబడి యున్నవో అక్కడ ఈ నామములను బట్టి పరమేశ్వరుని గ్రహింపవలెను.

> తతో విరాడజాయత. విరాజో అధిపూరుషః॥ యజుః ౩౧।౫॥ శ్రోత్రాద్వాయుశ్చ ప్రాణశ్చ ముఖాదగ్నిరజాయత॥ యజుః ౩౧।౧౨॥ తేన దేవా అయజన్త॥ యజుః ౩౧।౯॥ పశ్చాద్భూమిమథో పురః॥ యజుః. అ ౩౧। ౫॥

తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః। ఆకాశాద్వాయుః। వాయోరగ్నిః। అగ్నేరాపః। అద్భ్యః పృథివీ। పృథివ్యా ఓషధయః। ఓషధిభ్యోఽన్నమ్। అన్నాద్రేతః। రేతసః పురుషః। స వా ఏష పురుషోఽన్నరసమయః॥(తై. ఉప. బ్ర. వ. అను ౧.)

ఇది తైత్తిరీయోపనిషత్తు బ్రహ్మానందవల్లి ప్రథమానువాక వచనము. ఇట్టి ప్రమాణములందు [ప్రకరణములందు] విరాట్, పురుష, దేవ, ఆకాశ, వాయు, అగ్ని, జల, భూమి మున్నగు నామములు లౌకికపదార్థ బోధకములు. ఏలయనఁగా ఎక్కడెక్కడ ఉత్పత్తి, స్థితి, ప్రలయములును, అల్పజ్ఞ, జడ, దృశ్యాది విశేషణములను వ్రాయఁబడి యున్నవో అక్కడ పరమేశ్వరుఁడు గ్రహింపఁ బడజాలఁడు. అతఁడు ఉత్పత్త్యాది వ్యవహారములకు దూరమైన వాఁడు. పై మంత్రములయం దుత్పత్తి మొదలగు వ్యవహారములున్నవి. కాఁబట్టి ఇక్కడ విరాడాది నామముల చేతఁ బరమాత్మ గ్రహింపఁ బడక ప్రాకృతిక పదార్థములు గ్రహింపఁ బడును. కాని ఎక్కడెక్కడ సర్వజ్ఞాది విశేషణము లుండునో అక్కడ పరమాత్మయు, ఎక్కడెక్కడ ఇచ్ఛా, ద్వేష, ప్రయత్న, సుఖ, దుఃఖాల్పజ్ఞాది విశేషణము లుండునో అక్కడ జీవుఁడును గ్రహింపఁ బడునని సర్వత్ర తెలియవలయును. పరమేశ్వరునకు జన్మ మరణము లెన్నటికినిఁ గలుగఁజాలవు. కాఁబట్టి విరాడాది నామములచేత జన్మాది విశేషణములచేత జీవులను, జగత్తులోని జడపదార్థములను గ్రహించుట యుచితము. కాని పరమేశ్వరుని గ్రహించుట యుచితము కాదు. ఇక విరాడాది నామములచేతఁ బరమేశ్వరుఁడు గ్రహింపఁబడురీతి నీ క్రిందఁ దెలియనది.

ఓంకారార్థము :– (విరాట్) 'వి' ఉపసర్గ పూర్వకముగు రాజృదీప్తౌ అను ధాతువుతో 'క్విప్' ప్రత్యయము చేరుటచే "విరాట్" శబ్దము సిద్ధమగుచున్నది. ( యో వివిధం నామ చరాచరం జగద్రాజయతి ప్రకాశయతి స

విరాట్) వివిధ-బహు ప్రకాశమగు జగత్తును ప్రకాశ పఱచుటవలన విరాట్ నామముచేఁ బరమేశ్వరుఁడు గ్రహింపఁబడును. అగ్నిః:— అఞ్చు గతి పూజన యోః; అగ, అగి, ఇణ్ గత్యర్థక ధాతువులు. వీనినుండి "అగ్ని" శబ్దము సిద్ధమగుచున్నది. (గతేస్త్రయోఽర్థాః, జ్ఞానం గమనం ప్రాప్తిశ్చేతి. పూజనం నామ సత్కారః. యోఽఞ్చతి అచ్యతేఽగత్యం గత్యేతివా సోఽయమగ్నిః) అతఁడు జ్ఞానస్వరూపుఁడును సర్వజ్ఞుఁడును, తెలియుటకును బొందుటకును బూజింపఁబడుటకును యోగ్యుఁడును గనుక పరమేశ్వరునకు "అగ్నిః" యని పేరు. విశ్వుఁడు:— (విశ ప్రవేశనే) అను ధాతువునుండి విశ్వశబ్దము సిద్ధమగుచున్నది. (విశన్తి ప్రవిష్టాని సర్వాణ్యాకాశాదీని భూతాని యస్మిన్. యో వాఽఽకాశాదిషు సర్వేషు భూతేషు ప్రవిష్టః స విశ్వ ఈశ్వరః) అతనియందు ఆకాశాది సమస్త భూతములు ప్రవేశించుచున్నవి లేక అతఁడు వీనియందు వ్యాప్తుఁడై ప్రవిష్టుఁ డగుచున్నాఁడు గనుక ఆ పరమేశ్వరునకు విశ్వుఁడని పేరు. ఇత్యాది నామములకారమాత్రముచే గ్రహింపఁబడును.

హిరణ్య గర్భుఁడు:— (జ్యోతిర్వై హిరణ్యం, తేజో వై హిరణ్యమిత్యైతరేయే శతపథే చ బ్రాహ్మణే. యో హిరణ్యానాం సూర్యాదీనాం తేజసాం గర్భ ఉత్పత్తినిమిత్త మధికరణం స హిరణ్యగర్భః) అతనియందు సూర్యాది తేజోవంతములగు లోకము లుత్పన్నములై అతని యాధారమం దుండును. లేక అతఁడు సూర్యాది తేజస్స్వరూప పదార్థముల గర్భము. అనఁగా ఉత్పత్తి స్థానము, నివాసస్థానము, గనుక నా పరమేశ్వరునకు హిరణ్యగర్భుఁ డని పేరు. ఇందులకీ యజుర్వేద మంత్రము ప్రమాణం.

హిరణ్యగర్భః సమవర్తతాగ్రే, భూతస్య జాతః పతిరేక ఆసీత్। స దాధార
పృథివీం ద్యాముతేమాం. కస్మై దేవాయ హవిషా విధేమ॥ యజు॥ అ-౧౩। మం-౪॥

ఇత్యాది స్థలములయందు "హిరణ్యగర్భ" శబ్దముచేఁ బరమేశ్వరుఁడే గ్రహింపఁబడును.

వాయువు:-(వా గతిగంధనయోః) అనుధాతువునుండి వాయుశబ్దము సిద్ధమగుచున్నది. (గంధనం హింసనం. యో వాతి చరాచరం జగద్ధరతి బలినాం బలిష్ఠః స వాయుః) అతఁడు చరాచర జగత్తును ధరించి జీవింపఁజేసి లయింపఁ

చేయువాఁడును. బలవంతులకంటె బలవంతుఁడు నగుటచే నా యీశ్వరునకు "వాయు"వని పేరు. తైజసుఁడు:—(తిజ నిశానే) అను ధాతువునుండి "తేజః" శబ్దమును దీనిని తద్ధితముచేయుటచే 'తైజస' శబ్దము సిద్ధమగుచున్నది. అతఁడు దాను స్వయంప్రకాశకుఁడై సూర్యాది తేజోవంతములగు లోకములను ప్రకాశపఱచువాఁ డగుటచే నా యీశ్వరునకు "తైజసుఁ" డని పేరు. ఇత్యాది నామార్థము ఉకార మాత్రముచే గ్రహింపఁబడును.

ఈశ్వరుఁడు:—(ఈశ ఐశ్వర్యే) అను ధాతువునుండి "ఈశ్వర" శబ్దము సిద్ధమగుచున్నది. (య ఈష్టే సర్వైశ్వర్యవాన్ వర్తతే స ఈశ్వరః) అతనికి సత్యవిచార శీలజ్ఞానమును, అనంతైశ్వర్యమును గలదు. గనుక నా పరమాత్మను "ఈశ్వరుఁడు" అని పేరు. ఆదిత్యుఁడు:—(దో అవఖండనే) అను ధాతువునుండి 'అదితి' యు దీనిని తద్ధితాంతము చేయుటచే 'ఆదిత్య' శబ్దమును సిద్ధమగుచున్నది. (న విద్యతే వినాశో యస్య సోఽయమదితిః ... అదితిరేవ ఆదిత్యః) ఎవనికెన్నటికిని వినాశము కలుగదో ఆ యీశ్వరునకు 'ఆదిత్య' సంజ్ఞ. ప్రాజ్ఞుఁడు:—(జ్ఞా అవబోధనే) 'ప్ర' పూర్వకమగు నీ ధాతువునుండి ప్రజ్ఞయు దీనిని తద్ధితాంతము చేయుటచే "ప్రాజ్ఞ" శబ్దమును సిద్ధమగుచున్నది. (యః ప్రకృష్టతయా చరాచరస్య జగతో వ్యవహారం జానాతి స ప్రజ్ఞః, ప్రజ్ఞ ఏవ ప్రాజ్ఞః) అతఁడు నిర్భ్రాంతుఁడును, జ్ఞానయుక్తుఁడును, సమస్త చరాచర లోకవ్యవహారము నున్నదున్నట్టు తెలియువాఁడు నగుటచే నీశ్వరునకు ప్రాజ్ఞుఁ డని పేరు. ఇత్యాది నామార్థములు మకారముచే గ్రహింపఁబడును.

ఒక్కొక్క మాత్రచే మూడేసియర్థము లిట వ్యాఖ్యానింపఁ బడినట్లు అన్య నామార్థములును ఓంకారముచే దెలియనగును. "శన్నో మిత్రః శం":— ఈ మంత్రములోని మిత్రాది నామములును బరమేశ్వరునివే. ఏల యనఁగా స్తుతి, ప్రార్థన, ఉపాసన శ్రేష్ఠులను గూర్చియే చేయఁబడును. గుణకర్మ స్వభావముల యందును, సత్య వ్యవహారముల యందును అందఱికంటె నధికుని శ్రేష్ఠుఁ డందురు. అట్టి శ్రేష్ఠులందఱిలో నత్యంత శ్రేష్ఠుఁడు పరమేశ్వరుఁ డనఁబడును. అతనితో సమానుఁ డెవఁడును కాలేదు; లేరు; కాఁబోరు. సమానుఁడే లేనప్పు డధికుఁ డెట్లుండఁగలఁడు ; సత్యము, న్యాయము, దయ, సామర్థ్యము,

సర్వజ్ఞత్వాద్యనంత గుణములు పరమేశ్వరున కున్నట్లు ఏ జడపదార్థమునకుఁ గాని జీవునకుఁగాని లేవు. ఏ పదార్థము సత్యమో దాని గుణకర్మ స్వభావము లును సత్యములే. కాఁబట్టి పరమేశ్వరుని స్తుతిప్రార్థనోపాసనలే మనుష్యులకు యోగ్యము. అతనికంటె భిన్నమగువాని నెన్నఁడు నుపాసింపఁగూడదు. బ్రహ్మ, విష్ణు, మహాదేవ నామకులగు పూర్వపు మహాశయులును, విద్వాంసులును, దైత్యదానవాది నికృష్ట మనుష్యులును, అన్య సాధారణ మనుష్యులునుగూడ పరమేశ్వరునియందే విశ్వాసముంచి అతని స్తుతి, ప్రార్థన, ఉపాసనలే చేసిరి. అతనికంటె భిన్నమగువానిని గూర్చి చేయలేదు. అట్లే మనమందఱమును జేయుట యోగ్యము. దీనిఁగూర్చి ముక్తి, ఉపాసనా విషయములందు విశేష ముగా నాలోచింపఁబడును.

ప్రశ్న :—మిత్రాది నామములకు సఖుఁడని, ఇంద్రాదిదేవతలని ప్రసిద్ధ వ్యవహారముండుట చూచుచున్నాము గనుక వారినే గ్రహింపవలయును.

ఉత్తరము :— ఇక్కడ వానిని గ్రహించుట యోగ్యముకాదు. ఒకనికి మిత్రుఁడగువాఁడే మఱొకనికి శత్రువుగను, ఇంకొకనికి నుదాసీనుఁడుగనుండుట చూచుచున్నాము. కాఁబట్టి ముఖ్యార్థమందు సఖుఁడు మొదలగువానిని గ్రహింప లేము. పరమేశ్వరుఁ డెవ్వనికి శత్రువు కానీ ఉదాసీనుఁడు కానీ కాక జగత్తున కంతకు నిశ్చిత మిత్రుఁడైన ట్లాతనికంటె భిన్నుఁడగు జీవుఁ డెవ్వఁడును గాఁజాలఁడు. కాఁబట్టి యిక్కడ పరమాత్మనే గ్రహింపవలయును. గౌణార్థ మందు మిత్రాది శబ్దముంచే సుహృదాది మనుష్యులు గ్రహింపఁబడుదురు. మిత్రుఁడు:— (ఞిమిదా స్నేహనే)అను ధాతువునకు ఔణాదిక క్త్రప్రత్యయము పరమగుటచే 'మిత్ర' శబ్దము సిద్ధమగుచున్నది. (మేద్యతి స్నిహ్యతి స్నిహ్యతే వా స మిత్రః) అందఱను ప్రేమించువాఁడును, అందఱ ప్రేమకు యోగ్యుఁడు నగుటచేఁ బరమేశ్వరునకు "మిత్రుఁ"డని పేరు. వరుణుఁడు:—(వృఞ్ వరణే, వర ఈప్సాయామ్) అను ధాతువులకు ఉణాది 'ఉనన్' ప్రత్యయము పరమగు టచే 'వరుణ' శబ్దము సిద్ధమగుచున్నది. (యః సర్వాన్ శిష్టాన్ ముముక్షూన్ ధర్మాత్మనో వృణో త్యథవా యః శిష్టైర్ముముక్షుభిర్ధర్మాత్మభిర్ర్వియతే వర్యతే వా స వరుణః పరమేశ్వరః) ఆత్మయోగులను, విద్వాంసులను, ముక్తిని గోరు

వారిని, ధర్మాత్ములను స్వీకరించును గనుకను, లేక శిష్టులచేతను ముముక్షువుల చేతను ధర్మాత్ములచేతను గ్రహింపఁబడును గనుకను, ఈశ్వరుఁడు 'వరుణ' సంజ్ఞకుఁడు. లేక (వరుణో నామ వరః శ్రేష్ఠః) ఎల్లఱికంటె శ్రేష్ఠుఁడగుటచే నతనికి 'వరుణుఁడని' పేరు. అర్యముఁడు:—(ఋ గతి ప్రాపణయోః) ఈ ధాతువునకు 'యత్' ప్రత్యయము పర మగుటచే 'అర్య' శబ్దము సిద్ధమగుచున్నది. అర్య పూర్వకమగు 'మాఙ్ మానే' అను ధాతువుతో 'కనిన్' ప్రత్యయము చేర్చుటచే 'అర్యమా' శబ్దము సిద్ధమగుచున్నది; (యోఽర్యాన్ స్వామినో న్యాయాధీశాన్ మిమీతే మాన్యాన్ కరోతి సోఽర్యమా) సత్యముగా న్యాయము చేయు మనుష్యులను సమ్మానించు వాఁడును, పాపపుణ్యములను జేయువారికి వానికిఁదగిన ఫలములను నియమించువాఁడు నగుటచే పరమేశ్వరునకు 'అర్యముఁడు' అని పేరు. ఇంద్రుఁడు:— (ఇది పరమైశ్వర్యే) ఈ ధాతువుతో 'రన్' ప్రత్యయము కూర్చుటచే 'ఇంద్ర' శబ్దము సిద్ధ మగుచున్నది. (య ఇన్దతి పరమైశ్వర్యవాన్ భవతి స ఇన్ద్రః = పరమేశ్వరః) అఖిలైశ్వర్య యుక్తుఁడగుటచేఁ బరమాత్మకు ఇంద్రుఁ డని పేరు. బృహస్పతి:—'బృహత్' శబ్దపూర్వకమగు 'పా రక్షణే' అను ధాతువునకు 'డతి' ప్రత్యయమును, 'బృహత్'యొక్క తకారమునకు లోపమును, సుడాగమము నగుటచే 'బృహస్పతి' శబ్దము సిద్ధమగుచున్నది. (యో బృహతామాకాశాదీనాం పతిః స్వామీ పాలయితా స బృహస్పతిః) గొప్పవారి కంటెను గొప్పవాఁడును గొప్పవగు ఆకాశాది బ్రహ్మాండములకు స్వామియు నగుటచేఁ బరమేశ్వరునకు 'బృహస్పతి' అను పేరు. విష్ణువు:— విష్ౢ వ్యాప్తౌ) ఈ ధాతువుతో 'ను' ప్రత్యయము చేరి, 'విష్ణు' శబ్దము సిద్ధ మగుచున్నది. (వేవేష్టి వ్యాప్నోతి చరాచరం జగత్ స విష్ణుః) చరాచరమగు జగత్తునందు వ్యాపకుఁ డగుటచేఁ బరమాత్మకు 'విష్ణు' వని పేరు. ఉరుక్రముఁడు:— (ఉరుర్మహాన్ క్రమః పరాక్రమో యస్య స ఉరుక్రమః)అనంతపరాక్రమ యుక్తుండగుటచేఁ బరమాత్మకు ఉరుక్రముఁడనిపేరు.

(ఉరుక్రమః) మహాపరాక్రమ యుక్తుఁడును, (మిత్రః) అందఱకు సుహృదుఁడు అనఁగా అవిరోధియును, (శమ్) సుఖకారకుఁడును, (వరుణః) సర్వోత్తముఁడును, (శమ్) సుఖస్వరూపుఁడును, (అర్యమా) న్యాయాధీశుఁడును, (శమ్) సుఖ ప్రచారకుఁడును, (ఇంద్రః) సకలైశ్వర్య వంతుఁడును,

(శమ్) సకలైశ్వర్య దాయకుఁడును, (బృహస్పతిః) అందఱకు నధిష్ఠాతయు, (శమ్)విద్యాప్రదుఁడును,(విష్ణుః)అన్నిటియందు వ్యాపకుఁడును పరమేశ్వరుఁడు నగు నా పరమాత్మ (నః) మాకు కల్యాణకారకుఁడు (భవతు) అగుగాక ।

బ్రహ్మ:— (వాయో తే బ్రహ్మణే నమోఽస్తు) (బృహ బృహి వృద్ధౌ) ఈ ధాతువులనుండి 'బ్రహ్మ' శబ్దము సిద్ధ మగుచున్నది. (అన్నిటిని మించి విరాజమానుఁడును, అన్నిటికంటె గొప్పవాఁడును, అనంతబల యుక్తుఁడును నగు పరమాత్మకు-బ్రహ్మమునకు మేము నమస్కరించు చున్నాము.) ఓ పరమేశ్వరా ! (త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి) నీవే అంతర్యామి రూపముచేఁ బ్రత్యక్ష బ్రహ్మమవు. (త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి) నేను నిన్నే ప్రత్యక్ష బ్రహ్మ మని చెప్పుచున్నాను. ఏలయనఁగా నీవే అంతట వ్యాప్తమై అందఱకు నిత్యప్రాప్తుఁడవు. (ఋతం వదిష్యామి) వేదస్థము, యథార్థమునైన నీయాజ్ఞ నందఱకు నుపదేశము చేయుచూ నాచరించెదను. (సత్యం వదిష్యామి) సత్యమే చెప్పెదను; సత్యమే నమ్మెదను; సత్యమే చేసెదను. (తన్మామవతు) అట్టి నన్ను నీవు రక్షింపుము. (తద్వక్తారమవతు) అట్టి ఆప్తుఁడను, సత్యవక్తయునగు నన్ను రక్షింపుము. నీయాజ్ఞ యందు నా బుద్ధి స్థిరమై, ఎన్నటికిని విరుద్ధము గాకుండునుగాక। ఏలయనఁగా నీ యాజ్ఞయేధర్మము. దానికి విరుద్ధమే అధర్మము (అవతు మామవతు వక్తారమ్) ఈ రెండవపర్యాయపాఠ మధికార్థము.(కశ్చిత్ కంచిత్ ప్రతివదతి త్వంగ్రామం గచ్ఛ గచ్ఛ)ఇందు రెండు పర్యాయములు క్రియనుచ్చరించుటచేత నీవు శీఘ్రమే గ్రామమునకుఁ బొమ్మని సిద్ధ మగుచున్నది. అట్లే యిక్కడను నీవు అవశ్యముగా నన్ను రక్షింపుము. అనఁగా ధర్మము నందు సునిశ్చితుఁడనై యధర్మమును సదా తిరస్కరించు చుండునట్లు నా యందుఁ గృపఁజేయుము; గొప్ప ఉపకారముగా నెన్నెదనని యర్థము. (ఓం శాంతిశ్శాంతి శ్శాంతిః) దీని యందు మూఁడు పర్యాయములు శాంతి పాఠ ముండుటకుఁ బ్రయోజనమే మనఁగా సంసారమందు మూడు విధములగు దుఃఖము లున్నవి. ఒకటి ఆధ్యాత్మికము : అనఁగా ఆత్మ యందును శరీరమందును అవిద్య, రాగము ద్వేషము, మూర్ఖత, జ్వరము మొదలగు వానిచేఁ గలుగునది ; రెండవది ఆధిభౌతికము : అనఁగా శత్రు, వ్యాఘ్ర, సర్పాదులచేఁ గలుగు నది ; మూడవది ఆధిదైవికము : అనఁగా

అతివృష్టి, అతిశీతము, అత్యుష్ణము, మనస్సు యొక్కయు, ఇంద్రియముల యొక్కయు అశాంతిచే( గలుగునది. ఈ క్లేశములనుండి నీవు మమ్ము దూరము(జేసి కల్యాణ కారకమగు కర్మములయందు సదా ప్రవర్తింప( జేయుము. నీవే కల్యాణ స్వరూపు(డవు. ప్రపంచమున కంతకు( గల్యాణ కర్తవు. ధార్మికులైన ముముక్షువులకు( గల్యాణము నిచ్చువా(డవు. కాఁబట్టి నమస్త జీవులను అధర్మమును వదలి, ధర్మము నాచరించి, దుఃఖములనుండి దూరులై పరమానందమును బొందునట్లు నీవే నీకరుణచే సమస్తజీవుల హృదయమందును బ్రకాశింతువుగాక!

సూర్యు(డు :—(సూర్య ఆత్మా జగత స్తస్థుషశ్చ) ఈ యజుర్వేద వచనముచేత జగత్తనగా ప్రాణికోటి : అన(గా చేతన, జంగమములు. 'తస్థుషః' అన(గా అప్రాణులు—స్థావరజడములు—పృథివ్యాదులు. వీనికన్నిటికి నాత్మయు, స్వప్రకాశ స్వరూపు(డును, అన్నిటిని బ్రకాశపఱచువా(డు నగుటచే, బరమేశ్వరునకు సూర్యు(డని పేరు. ఆత్మ :—(అత సాతత్యగమనే) ఈ ధాతువు నుండి ఆత్మశబ్దము సిద్ధమగుచున్నది. (యోఽతతి వ్యాప్నోతి స ఆత్మా) నమస్త జీవులయందు, జగత్తునందు నిరంతరము వ్యాపకు(డగుటచే, బరమేశ్వరునకు ఆత్మయని పేరు. పరమాత్మ :—(పరశ్చాసావాత్మా చ య ఆత్మభ్యో జీవేభ్యః సూక్ష్మేభ్యః పరోఽతి సూక్ష్మః స పరమాత్మా) అత(డు నమస్త జీవాదులకంటె నుత్కృష్టు(డును, జీవప్రకృ త్యాకాశములకంటె నతిసూక్ష్ము(డును సమస్త జీవులకు నంతర్యామి యగు నాత్మయు నగుటచే నీశ్వరునకు( 'బరమాత్మ' యని పేరు. ఈశ్వరు(డు :— సామర్థ్యవంతున కీశ్వరు(డని పేరు. పరమేశ్వరు(డు :—(య ఈశ్వ రేషు సమర్థేషు పరమః శ్రేష్ఠః స పరమేశ్వరః) ఈశ్వరులలో నన(గా సమర్థులలో సమర్థు(డై తనతో సమాను(డెవ(డును లేనివానికి( 'బరమేశ్వరు(డు' అని పేరు. సవితా :—(షుఞ్ అభిషవే, షూఙ్ ప్రాణిగర్భ విమోచనే) ఈ ధాతువులనుండి 'సవితా' శబ్దము సిద్ధమగుచున్నది. (అభిషవః ప్రాణిగర్భ విమోచనం చోత్పాదనం యశ్చరాచరం జగత్ సునోతి సూతే వా ఉత్పాద యతి స సవితా పరమేశ్వరః) సమస్త జగత్తును ఉత్పన్నము చేయుచున్నా(డు గనుక పరమేశ్వరునకు 'సవితా' యని పేరు.

దేవుఁడు :— (దివు క్రీడా విజిగీషా వ్యవహార ద్యుతి స్తుతి మోద మద స్వప్న కాంతి గతిషు) ఈ ధాతువునుండి 'దేవ' శబ్దము సిద్ధమగుచున్నది. (క్రీడా) శుద్ధమగు జగత్తును క్రీడింపఁ జేయువాఁడును. (విజిగీషా) ధార్మికుల జయింప వలయునను నిచ్ఛగలవాఁడును. (వ్యవహార) అన్ని ప్రయత్నములకు సాధనోప సాధనముల నిచ్చువాఁడును. (ద్యుతి) స్వయంప్రకాశస్వరూపుఁడును అన్నిటికిఁ బ్రకాశకుఁడును. (స్తుతి) ప్రశంసకు యోగ్యుఁడును. (మోద) తాను ఆనంద స్వరూపుఁడై యితరులకు నానందము నిచ్చువాఁడును. (మద) మదోన్మత్తులను తాడించువాఁడును. (స్వప్న) అందరి శయనార్థము రాత్రిని, ప్రలయమును జేయువాఁడును. (కాంతి) కామించుటకు యోగ్యుఁడును. (గతి) జ్ఞాన స్వరూపుఁడు నగుటచేఁ బరమేశ్వరునకు 'దేవుఁడు' అని పేరు. లేక :— (యో దీవ్యతి క్రీడతి స దేవః) తన స్వరూపమందుఁ దానే ఆనందముతోఁ గ్రీడించు వాఁడు; లేక పరసహాయము లేక సహజ స్వభావముచే క్రీడవలె సమస్త జగత్తును జేయువాఁడు; లేక సమస్త క్రీడలకు నాధారమగువాఁడు దేవుఁడు. (విజిగీషతే స దేవః) అందఱను జయించువాఁడు; తానజేయుఁడు అనఁగా నతని నెవరును జయింపలేరు. (వ్యవహారయతి స దేవః) న్యాయాన్యాయ రూపవ్యవహారములను దెలియువాఁడును ఉపదేష్టయు. (యశ్చరాచరం జగద్ద్యోతయతి స దేవః) అన్నిటికిఁ బ్రకాశకుఁడు. (యస్స్తూయతే స దేవః) ఎల్లఱ ప్రశంసకు యోగ్యుఁడు; నిందింపఁ దగనివాఁడు. (యో మోదయతి స దేవః) స్వయమానంద స్వరూపుఁడు, ఇతరుల కానందముగలుగ జేయువాఁడు, దుఃఖము లేశమును లేనివాఁడు (యో మాద్యతి స దేవః) సదా హర్షితుఁడు, శోకరహితుఁడు, ఇతరులను హర్షింపఁ జేయువాఁడు, దుఃఖములనుండి దూరముచేయువాఁడు. (యః స్వాపయతి స దేవః) ప్రలయసమయమున అవ్యక్తమందు సమస్త జీవులను నిద్రింపఁ జేయువాఁడు. (యః కామయతే కామ్యతే వా స దేవః) సత్య కాముఁడు, శిష్టుల కామమునకు లక్ష్య మగువాఁడును. (యో గచ్ఛతి గమ్యతే వా స దేవః) అన్నిటియందును వ్యాప్తుఁడై తెలియుటకు యోగ్యుఁడగు వాఁడు. కాబట్టి యా పరమేశ్వరునకు దేవుఁడని పేరు. కుబేరుఁడు:— (కుబి ఆచ్ఛాదనే) ఈ ధాతువునుండి కుబేర శబ్దము సిద్ధమగుచున్నది. (యః సర్వం కువతి స్వవ్యాప్త్యాచ్ఛాదయతి స కుబేరః) తన వ్యాప్తిచే సమస్తము నాచ్ఛాదించు వాఁడు. కాఁబట్టి పరమేశ్వరునకు కుబేరుఁడని పేరు.

పృథివి :— (ప్రథ విస్తారే) ఈ ధాతువునుండి 'పృథివీ' శబ్దము సిద్ధమగుచున్నది. కాబట్టి యాపరమేశ్వరునకు పృథివియని నామము. (యః ప్రథతే సర్వజగద్విస్తృణాతి స పృథివీ) సమస్తమగు విస్తృత జగత్తును విస్తారము చేయువాఁడు. (జలము:- జల ఘాతనే) ఈ ధాతువునుండి 'జల' శబ్దము సిద్ధమగుచున్నది. (జలతి ఘాతయతి దుష్టాన్, సంఘాతయతి అవ్యక్తపరమాణ్వాదీన్, తద్ బ్రహ్మ జలం) దుష్టులను తాడించువాఁడు, అవ్యక్తములగు పరమాణువులయన్యోన్యసంయోగ వియోగములనుజేయువాఁడు. అందువలనపరమాత్మ జలసంజ్ఞకుడు. ఆకాశము:-(కాశృ దీప్తౌ) ఈ ధాతువునుండి 'ఆకాశ' శబ్దము సిద్ధమగుచున్నది. (యః సర్వతః సర్వం జగత్ ప్రకాశయతి స ఆకాశః) అన్నివైపులనుండి జగత్తునకు ప్రకాశకుఁడు. అందువలన పరమాత్ముని నామము ఆకాశము. అన్నము.-(అద భక్షణే) ఈ ధాతువునుండి 'అన్న' శబ్దము సిద్ధమగుచున్నది.

అద్యతేఽత్తి చ భూతాని తస్మాదన్నం తదుచ్యతే ॥౧॥ అహమన్న మహమన్న మహమన్నమ్ । అహమన్నాదోఽ హమన్నాదోఽ హమన్నాదః ॥ తైత్తి. ఉప. ౨-౧౦॥ అత్తా చరాచర గ్రహణాత్॥ వేదాంత అ. ౧। పా. ౨। సూ. ౯॥

అన్నిటిని తన లోపల నుంచుకొనువాఁడు, అందఱకు గ్రహించుటకు యోగ్యుఁడు, చరాచర జగత్తును గ్రహించువాఁడు నగుటచే పరమేశ్వరునకు అన్నము, అన్నాదుడు, అత్తఅనునామములు. అన్న, అన్నాదశబ్దములు ఇందు మువ్మారు పఠించుట ఆదరము కొఱకు. మఱియందు నందుఁ బుగు బుత్పన్నములయి యుండి, నష్టమగుచుండునట్లే పరమేశ్వరుని యందు జగత్తుస్థితియై యుండును. వసువు:- (వస నివాసే) ఈ ధాతువునుండి 'వసు' శబ్దము సిద్ధమగు చున్నది. (వసంతి భూతాని యస్మిన్నథవా యః సర్వేషు వసతి స వసు రీశ్వరః) ఆతనియందు సమస్తాకాశాది భూతములు వసించు చున్నవి; ఆతఁడు సమస్తమందును వసించుచున్నాఁడు. అందువలన పరమేశ్వరుని నామము వసువు. రుద్రుడు:-(రుదిర్ అశ్రువిమోచనే) ఈ ధాతువునకు "ణిచ్" ప్రత్యయము పరమగుటచే 'రుద్ర' శబ్దము సిద్ధమగుచున్నది. (యో రోదయత్యన్యాయకారిణో జనాన్ స రుద్రః) దుష్టకర్మముఁ జేయు వారి నేడ్పించువాఁడు.

యన్మనసా ధ్యాయతి, తద్వాచా వదతి । యద్వాచా వదతి, తత్కర్మణా కరోతి । యత్కర్మణా కరోతి, తదభి సంపద్యతే॥

ఇది యజుర్వేద బ్రాహ్మణ వచనము. "జీవుఁడు మనస్సుతో తలఁచు దానిని వాక్కుతో జెప్పును. వాక్కుతో జెప్పుదానిని జేయును; చేయుదానిని బొందును దీనివలన జీవుఁ డెట్టి కర్మమును జేయునో అట్టి ఫలమును బొందునని సిద్ధమగుచున్నది. దుష్టకర్మ మొనర్చు జీవులు ఈశ్వరుని న్యాయరూపమగు వ్యవస్థచే దుఃఖరూప ఫలమును బొందునపుఁడే డ్రురు. ఈ ప్రకారమీశ్వరుఁడు వారి నేడ్పించువాఁడు కావున పరమేశ్వర నామము రుద్రుడు.

ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః ।
తాయదస్యాయనం పూర్వం తేన నారాయణః స్మృతః॥ మను. అ.౧ శ్లో.౧౦.

నారాయణుఁడు :— జలము, జీవులు వీనికి 'నారా' యని పేరు. అవి యతని కయన మనఁగా నివాస స్థానము కాఁబట్టి సమస్తజీవులయందు వ్యాపకుఁడగు పరమాత్మని నామము నారాయణుఁడు.

చంద్రుఁడు :— (చది ఆహ్లాదే) ఈ ధాతువునుండి 'చంద్ర' శబ్దము సిద్ధమగుచున్నది. (యశ్చందతి చందయతి వా స చంద్రః) ఆనందస్వరూపుఁడు; అందఱకు నానందము నిచ్చువాఁడు. అందువలన నీశ్వరుని నామము చంద్రుడు. మంగళుఁడు : — (మగి గతౌ) ఈ ధాతువునుండి (మంగేరలచ్) సూత్రముచే 'మంగల' శబ్దము సిద్ధమగుచున్నది. (యో మంగతి మంగయతి వా స మంగలః) తాను మంగలస్వరూఁపుడు; సమస్తజీవుల మంగలమునకుఁ గారణుఁడు. అందువలన పరమేశ్వరునికి మంగళుడని నామము. బుధుఁడు:— (బుధ అవగమనే) ఈ ధాతువునుండి 'బుధ' శబ్దము సిద్ధమగుచున్నది. )యో బుధ్యతే బోధయతి వా స బుధః) స్వయం బోధస్వ రూపుఁడు; సమస్తజీవుల బోధకుఁ గారణుఁడు. కావున నాపరమేశ్వరుని నామము బుధుఁడు. శుక్రుఁడు:— (శుచిర్ పూతీభావే) ఈ ధాతువునుండి శుక్రశబ్దము సిద్ధమగు చున్నది. (యః శుచ్యతి శోచయతి వా స శుక్రః) అత్యంత పవిత్రుఁడు; అతని సంగతిచే జీవులును బవిత్రులగుదురు. కావున ఈశ్వరుని నామము శుక్రుడు. శనైశ్చరుఁడు:— (చర గతి భక్షణయోః) ఈ ధాతువునకు 'శనైస్' అవ్యయము ఉప

పదమై 'శనైశ్చర' శబ్దము సిద్ధమగుచున్నది. (యః శనైశ్చరతి స శనైశ్చరః) అన్నిటియందును సహజముగా ప్రాప్తించిన ధైర్యవంతుడు కావున పరమేశ్వరుడు శనైశ్చరుఁడు. రాహుఁవు:— (రహ త్యాగే) ఈ ధాతువునుండి 'రాహు' శబ్దము సిద్ధమగుచున్నది. (యో రహతి పరిత్యజతి దుష్టాన్ రాహయతి త్యాజయతి వా స రాహురీశ్వరః) ఏకాంత స్వరూపుఁడు, తన స్వరూపమందు నితర పదార్థ సంయోగము లేనివాఁడు, దుష్టులను దాను వదలి యితరులను వదలించువాఁడు. కావున ఈశ్వరునికి నామము రాహువు. కేతువు:—(కిత నివాసే రోగాపనయనే చ) ఈ ధాతువునుండి "కేతు" శబ్దము సిద్ధమగుచున్నది. (యః కేతయతి చికిత్సతి వా స కేతురీశ్వరః) సమస్త జగత్తునకు నివాసస్థానము; సమస్త రోగరహితుఁడు; ముముక్షువులను ముక్తి సమయమందు సమస్త రోగములనుండి వదలించువాఁడు; కావున పరమాత్మని నామము కేతువు. యజ్ఞుఁడు:—) యజ దేవపూజా సంగతికరణదానేషు) ఈ ధాతువునుండి 'యజ్ఞ' శబ్దము సిద్ధమగుచున్నది. (యజ్ఞో వై విష్ణుః) ఇది బ్రాహ్మణ గ్రంథ వచనము. (యో యజతి విద్వద్భిరిజ్యతే వా స యజ్ఞః) సమస్త జగత్పదార్థములను సంయుక్తము చేయువాఁడు, సమస్త విద్వాంసులకుఁ బూజ్యుఁడు, బ్రహ్మాది సమస్త ఋషిమునులకుఁ బూజ్యుఁడు. ఏలయనఁగా నతఁడు సర్వత్ర వ్యాపకుఁడు. హోత:—(హు దానాదనయోః, ఆదానే చేత్యేకే) ఈ ధాతువునుండి హోతృశబ్దము సిద్ధమగుచున్నది. (యో జుహోతి స హోతా) జీవులకు నీయఁదగు పదార్థముల నిచ్చువాఁడు, గ్రహింప యోగ్యులగు వారికి గ్రాహకుఁడు. కావున పరమాత్మని నామము యజ్ఞము. బంధువు:— (బన్ధ బన్ధనే) ఈ ధాతువునుండి బంధు శబ్దము సిద్ధమగుచున్నది. (యః స్వస్మిన్ చరాచరం జగద్ బధ్నాతి బంధువద్ధర్మాత్మనాం సుఖాయ సహాయో వా వర్తతే స బంధుః) తనయందు సమస్త లోకలోకాంతరములను నియమముచేత బంధించువాఁడు, సహోదరునివలె సహాయకుఁడు. అందుచే నవి తమతమ పరిధినిగాని నియమమునుగాని ఉల్లంఘింప జాలవు. తోఁబుట్టువు తోడఁబుట్టువునకు సహాయకారి యగునట్లు పరమేశ్వరుఁడును పృథివ్యాది లోకములను ధరించి రక్షించి వానికి సుఖమునిచ్చు చున్నాడు. కావున నీశ్వరుడు బంధువు. పితా:— (పా రక్షణే) ఈ ధాతువునుండి పితృశబ్దము సిద్ధమగుచున్నది. (యః పాతి సర్వాన్ స పితా)

అందఱకు రక్షకుఁడు. తండ్రి తన సంతానముపై సదా కృపాళువయి వారి యున్నతిని గోరునట్లే పరమేశ్వరుఁడు సమస్తజీవుల యున్నతిని గోరును. కావున నీశ్వరుని నామము పిత.

పితామహుఁడు:—(యః పితౄణాం పితా స పితామహః) తండ్రులకుఁ దండ్రి. ప్రపితామహుఁడు:— (యః పితామహానాం పితా స ప్రపితామహః) తండ్రుల తండ్రులకును దండ్రి. కావున పరమేశ్వరుని నామము పితామహుండు. మాతా:— (యో మిమీతే మానయతి సర్వాన్ జీవాన్ స మాతా) పూర్ణకృపాయుక్తురాలైన జనని తన సంతానసుఖమును, ఉన్నతిని గోరునట్లు పరమేశ్వరుఁడు సమస్తజీవుల వృద్ధి గోరువాఁడు. కావున పరమేశ్వరుడు మాత. ఆచార్యుఁడు:—(చర గతి భక్షణయోః) ఆఙ్ పూర్వకమగు నీ ధాతువునుండి 'ఆచార్య' శబ్ద మేర్పడుచున్నది. (య ఆచారం గ్రాహయతి సర్వా విద్యా వా బోధయతి స ఆచార్య ఈశ్వరః) సత్యాచారమును గ్రహింపఁ జేయువాఁడు సమస్తవిద్యల ప్రాప్తికి హేతువై సమస్త విద్యలను ప్రాప్తింపఁ జేయువాఁడు. కావున ఈశ్వరుడు ఆచార్యుడు. గురువు:— (గౄ శబ్దే) ఈ ధాతువుచే 'గురు' శబ్ద మేర్పడినది. (యో ధర్మ్యాన్ శబ్దాన్ గృణాత్యుపదిశతి స గురుః.)

స పూర్వేషామపి గురుః కాలేనానవచ్ఛేదాత్॥ యోగ॥ సమాధిపాదము. సూ. ౨౬

సత్యధర్మ ప్రతిపాదకుఁడు, సకల విద్యాయుక్తమగు వేదములను ఉపదేశించువాఁడు. సృష్టికి ఆరంభమందు అగ్ని, వాయువు, ఆదిత్యుఁడు, అంగిరుఁడు, బ్రహ్మ మొదలగు గురువులకు గురువై యెన్నటికి నాశనము నొందని వాఁడు. కావున నీశ్వరుడు గురువు. అజుఁడు:— (అజ గతిక్షేపణయోః, జని ప్రాదుర్భావే) ఈ ధాతువులనుండి 'అజ' శబ్ద మేర్పడుచున్నది. (యోఽజతి సృష్టిం ప్రతి సర్వాన్ ప్రకృత్యాదీన్ పదార్థాన్ ప్రక్షిపతి జానాతి వా కదాచిన్న జాయతే సోఽజః) సమస్త ప్రకృతి అవయవములగు ఆకాశాది భూత పరమాణువులను యథాయోగ్యముగఁ జేర్చువాఁడు. శరీరముతో జీవులను సంబంధ పఱచి జన్మమిచ్చుచుఁ దానెన్నఁడును జన్మము నొందనివాఁడు. కావున పరమాత్ముఁడు అజుఁడు. బ్రహ్మ:—(బృహ, బృహి వృద్ధౌ) ఈ ధాతువునుండి 'బ్రహ్మ' శబ్ద మేర్పడుచున్నది. (యోఽఖిలం జగన్నిర్మాణేన బృంహతి వర్ధయతి స బ్రహ్మ)

సంపూర్ణమైన జగత్తును రచించి వర్ధిల్లజేయువాఁడు. కావున పరమేశ్వరుడు బ్రహ్మ యనబడును. (సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ), ఇది తైత్తిరీయో పనిష ద్వచనము.(సంతీతి సంత స్తేషు సత్సు సాధు తత్సత్యమ్; యజ్జానాతి చరాఽచరం జగత్ తద్జ్ఞానమ్;న విద్యతేఽన్తోఽ వధిర్మర్యాదా యస్య తదనన్తమ్;సర్వేభ్యో బృహ త్త్వాద్బ్రహ్మ) ఉన్న పదార్థములకు 'సత్' అని పేరు. అట్టి వానిలోనెల్ల సాధువు కాఁబట్టి పరమేశ్వరుని నామము సత్యము; సమస్తజగత్తును దెలియు వాఁడగుటచేఁ పరమేశ్వరునకు 'జ్ఞాన'మని పేరు; అంతము-అవధి-మర్యాద అనఁగా వింత నిడుపు వెడల్పు పొట్టి పొడవు అని పరిమాణములేదు. కాఁబట్టి పరమేశ్వరునికి 'అనంత'మని పేరు. అనాది:-(దుదాఞ్ దానే)ఈ ధాతువునుండి ఆఙ్ పూర్వకమై 'ఆది'శబ్దమును,'నఞ్'పూర్వకమై 'అనాది'శబ్దమును ఏర్పడు చున్నవి. (యస్మాత్ పూర్వం నాస్తి పరం నాస్తి స ఆదిరిత్యుచ్యతే. వ్యాక. మహా భాష్య. ౧.౧.౨౧.) (న విద్యతే ఆదిః కారణం యస్య సోఽనాదిరీశ్వరః)దేనికిఁ మొందేదియు లేక పర మందుండునో దాని కాదియని పేరు. అతని కాది కారణ బూర్వమేమియు లేదుకాఁబట్టి పరమేశ్వరునకు'అనాది'అని పేరు.ఆనందుఁడు:-(టునది సమృద్ధౌ) ఆఙ్ పూర్వక మగు 'నది' ధాతువునుండి 'ఆనంద' శబ్ద మేర్పడుచున్నది. ('ఆనందంతి సర్వే ముక్తా యస్మిన్ యద్వా యః సర్వాన్ జీవానానందయతి స ఆనందః) ఆనందస్వరూపుండగుట చేత, సమస్త ముక్త జీవుల నతనియందానం దించుటచేత, ధర్మాత్ములగు జీవులనందఱ నానందయు క్తులఁగఁ జేయుటచేత బరమేశ్వరుఁ డానందుఁడు. సత్:-(అసభువి)ఈ ధాతు వునుండి 'సత్'శబ్ద మేర్పడుచున్నది.(యద స్తి త్రిషు కాలేషు న బాధ్యతే తత్స ద్బ్రహ్మ) ఎల్లప్పుడు నుండువాఁడు :- భూత భవిష్యద్వర్తమాన కాలములచే బాధింపఁబడఁడు కాఁబట్టి సత్తు. చిత్:-(చితీ సంజ్ఞానే)ఈ ధాతువునుండి 'చిత్' శబ్ద మేర్పడుచున్నది. (యశ్చేతతి చేతయతి సంజ్ఞాపయతి సర్వాన్ సజ్జనాన్ యోగిన స్తచ్చిత్పరం బ్రహ్మ)వై తన్య స్వరూపుఁడై సమస్త జీవులను దెల్పితోఁ, గూర్చి సత్యాసత్యములను దెలుపు వాఁడగుటచే పరమేశ్వరుడు చిత్తు. ఈమూడు విశేషణములు కలవాఁడగుటచేఁ బరమేశ్వరుఁడు సచ్చిదానందస్వరూపుఁడు. నిత్యుఁడు:- (యో నిత్యధ్రువోఽచలోఽ వినాశీ స నిత్యః) నిశ్చలుఁడు అవి నాశియు నగుటచే పరమేశ్వరుడు 'నిత్య' శబ్దవాచ్యుఁడు. శుద్ధుడు:- (శుంధ

శుద్ధౌ) ఈ ధాతువునుండి శుద్ధశబ్ద మేర్పడుచున్నది. (యః శుంధతి సర్వాన్ శోధయతి వా స శుద్ధ ఈశ్వరః) స్వయముగా పరిశుద్ధుఁడును, సమస్తకల్మషముల నుండి వేరైనవాఁడును, అందఱను బరిశుద్ధులనుగాఁ జేయువాఁడు నగుటచే పరమేశ్వరుడు శుద్ధుఁడు. బుద్ధుఁడు:-(బుధ అవగమనే)అను ధాతువు 'క్త' ప్రత్యయముతోఁ గూడిన 'బుద్ధ'శబ్ద మేర్పడుచున్నది. (యో బుద్ధవాన్ సదైవ జ్ఞాతాఽస్తి స బుద్ధో జగదీశ్వరః)సర్వదా అన్నిటిని దెలియువాఁడగుటచేఁ పరమేశ్వరుని నామము 'బుద్ధుఁడు'. ముక్తుఁడు:-(ముచ్ ॡ మోచనే) అను ధాతువు నుండి 'ముక్త' శబ్ద మేర్పడుచున్నది. (యో ముంచతి మోచయతి వా ముముక్షూన్ స ముక్తో జగదీశ్వరః) సర్వకల్మషములనుండి వేరైన వాఁడును ముముక్షువుల నందఱను క్లేశములనుండి తొలగించువాఁడు నగుటచే పరమేశ్వరుడు 'ముక్తుఁడు.' (అత ఏవ నిత్యశుద్ధబుద్ధ ముక్తస్వభావో జగదీశ్వరః) కాఁబట్టి పరమేశ్వరుఁడు నిత్యశుద్ధబుద్ధ ముక్తస్వభావుఁడు. నిరాకారుఁడు:-'నిర్' ఆఙ్ పూర్వకమగు (డుకృఞ్ కరణే) అను ధాతువువలన 'నిరాకార' శబ్ద మేర్పడుచున్నది. (నిర్గత ఆకారాత్స నిరాకారః) అతనికి ఏయాకారమును లేదు, అతఁడెన్నఁడును శరీరమును ధరింపఁడు; కాబట్టి ఈశ్వరుడు 'నిరాకారుఁడు'. నిరంజనుఁడు:—(అఞ్జూ వ్యక్తి మ్లక్షణకాంతిగతిషు) ఈ ధాతువువలన 'అంజన' శబ్దమును 'నిర్' ఉపసర్గ యోగముచే 'నిరంజన'శబ్దము నేర్పడుచున్నవి. (అఞ్జనం వ్యక్తిర్మ్లక్షణం కుకామ ఇంద్రియైః ప్రాప్తిశ్చే త్యస్మాద్యో నిర్గతః పృథగ్భూతః స నిరంజనః) వ్యక్తి అనఁగా ఆకృతి నుండియు, మ్లేచ్ఛాచారము నుండియు, దుష్టకామంబునుండియు, చక్షురాది ఇంద్రియవిషయముల మార్గము నుండియు వేరైన వాఁడగుటచే పరమేశ్వరుఁడు నిరంజనుఁడు. గణపతి, గణేశుఁడు:—(గణ సంఖ్యానే)ఈ ధాతువునుండి 'గణ' శబ్ద మేర్పడుచున్నది. దీనికి 'ఈశ' శబ్దముగాని 'పతి' శబ్దముగాని చేర్చుటచే 'గణేశ' శబ్దమును, 'గణపతి' శబ్దమును ఏర్పడుచున్నవి. (యే ప్రకృత్యాదయో జడా జీవాశ్చ గణ్యంతే సంఖ్యాయంతే తేషామీశః స్వామీ పతిః పాలకో వా) ప్రకృత్యాది జడములు, సమస్త జీవులు అను ప్రసిద్ధ పదార్థములకు స్వామియు పాలకుఁడు నగుటచే "గణేశుఁడును" 'గణపతి'యు పరమేశ్వరుని నామములు. విశ్వేశ్వరుఁడు:—(యో విశ్వమీష్టే స విశ్వేశ్వరః) సంసారమున కధిష్ఠాత యగుటచే విశ్వేశ్వ

రుఁడు. కూటస్థుఁడు:-(యః కూటేऽనేకవిధవ్యవహారే స్వస్వరూపేణైవ తిష్ఠతి స కూటస్థః పరమేశ్వరః) సమస్త వ్యవహారముల యందు వ్యాప్తుఁడు. వానికి నాధారుఁడు నై యుండియు నే వ్యవహారము నందును దన స్వరూపమును మార్పఁడు కాఁబట్టి పరమేశ్వరుడు 'కూటస్థుఁడు.' (దేవ)శబ్దమునకున్న యర్థ మంన్నియు "దేవీ" శబ్దమునకున్నవని గ్రహింపవలెను. పరమేశ్వరుని నామ ములు మూడు లింగములందును గలవు. (బ్రహ్మ చితిరీశ్వరశ్చేతి: (ఇందు బ్రహ్మము నపుంసకము. చితి స్త్రీలింగము. ఈశ్వర శబ్దము పుంలింగము).దేవ శబ్దము ఈశ్వర శబ్దమునకు విశేషణ మయినపుడు దేవుఁడనియు. చితి శబ్దము నకు విశేషణ మయినపుడు దేవి యనియు వాడఁబడును. శక్తి:-(శక్ ॥ శక్తౌ) ఈ ధాతువునుండి "శక్తి" శబ్దమేర్పడినది. (యః సర్వం జగత్ కర్తుం శక్నోతి స శక్తిః) సమస్త జగత్తును జేయుటయందు సమర్థుడు కాబట్టి శక్తి. శ్రీ :– (శ్రిఞ్ సేవాయామ్) ఈ ధాతువునుండి 'శ్రీ' శబ్దమేర్పడు చున్నది. (యః శ్రీయతే సేవ్యతే సర్వేణ జగతా విద్వద్భిర్యోగిభిశ్చ స శ్రీరీశ్వరః)అతని సేవ సమస్త జగత్తును, విద్వాంసులును, యోగులును జేయుచున్నారు కాఁబట్టి పర మేశ్వరునకు 'శ్రీ' యని పేరు. లక్ష్మి :- (లక్ష దర్శనాఙ్కనయోః) ఈ ధాతు వునుండి 'లక్ష్మి' శబ్ద మేర్పడుచున్నది. (యో లక్షయతి పశ్యత్యఙ్క్తే చిహ్న యతి చరాచరం జగదథవా వేదైరాప్తైర్యోగిభిశ్చ యో లక్ష్యతే స లక్ష్మీః సర్వ ప్రియ ఈశ్వరః)చరాచరమగు సమస్త జగత్తును జూచువాఁడు. దృశ్యముగాఁ జేయువాఁడు. శరీరమందుఁ గన్ను ముక్కు మొదలైన వానిని, వృక్షములందలి పత్ర పుష్పఫల మూలములను,భూజలముల నలుపు ఎఱుపు తెలుపులను.మృత్తికా పాషాణ చంద్రసూర్యాది దృశ్యములను జేయువాఁడును, అన్నిటిని జూచు వాఁడును. అందములకంటె నందము, వేదాది శాస్త్రములకును, ధార్మికులు విద్వాంసులునగు యోగులకును లక్ష్యము-చూచుటకు యోగ్యుడు-నగుటచే పర మేశ్వరునకు "లక్ష్మి" యని పేరు. సరస్వతీ:- (సృ గతౌ) ఈ ధాతువునుండి 'సరస్'శబ్దమును, దీనితో 'మతుప్' 'ఙీప్'ప్రత్యయములను గూర్చుటచే సరస్వతీ శబ్దమును ఏర్పడుచున్నవి. (సరో వివిధం జ్ఞానం విద్యతే యస్యాం చితౌ సా సర స్వతీ) అతనికి వివిధ విజ్ఞానము అనఁగా శబ్దార్థ సంబంధ ప్రయోగముల జ్ఞానము యథాతథంగా ఉన్నది. కాఁబట్టి పరమేశ్వరునకు 'సరస్వతి'యని పేరు

సర్వశక్తిమంతుఁడు:— (సర్వాః శక్తయో విద్యంతే యస్మిన్ స సర్వశక్తిమానీశ్వరః) తన కార్యమును జేయుటయం దన్యుల సహాయమును గోరఁడు; తన సామర్థ్యము చేతనే తన సమస్త కార్యములను పరిపూర్ణముగ జేయుచున్నాఁడు; కాఁబట్టి పరమేశ్వరునకు 'సర్వశక్తిమంతుఁ' డని పేరు. న్యాయకారీ:- (ణీఞ్ ప్రాపణే) ఈ ధాతువునుండి 'న్యాయ' శబ్ద మేర్పడుచున్నది. (ప్రమాణై రర్థపరీక్షణం న్యాయః) ఇది న్యాయ సూత్రములకు వాత్స్యాయన భాష్య వచనము. (పక్షపాత రాహిత్యాచరణం న్యాయః) ప్రత్యక్షాది ప్రమాణములచే సత్యమని తేలినది, పక్షపాత రహితమగు ధర్మరూప ఆచరణము న్యాయము. (న్యాయం కర్తుం శీలమస్య స న్యాయకారీశ్వరః) న్యాయము-పక్షపాతరహితము అయిన ధర్మమొనర్చుటయే ఇతని స్వభావము కాఁబట్టి న్యాయకారి. దయాళువు:- (దయ దానగతి రక్షణహింసాదానేషు) ఈ ధాతువునుండి 'దయా' శబ్ద మేర్పడుచున్నది. (దయతే దదాతి జానాతి గచ్ఛతి రక్షతి హినస్తి యయా సా దయా బహ్వీ దయా విద్యతే యస్య స దయాలుః పరమేశ్వరః) అభయము నిచ్చువాడు, సత్యాసత్యములను సమస్త విద్యలను దెలియువాఁడు, సమస్త సజ్జనులను రక్షించు వాఁడు, దుష్టులను యథాయోగ్యముగ దండించువాఁడు నగుటచే బరమాత్మకు 'దయాళు' వని పేరు. అద్వైతము:—(ద్వయోర్భావో ద్వాభ్యామితం సా ద్వితా ద్వీతం వా సైవ తదేవ వా ద్వైతమ్. న విద్యతే ద్వైతం ద్వితీయేశ్వరభావో యస్మింస్తదద్వైతమ్. అర్థాత్ సజాతీయ విజాతీయ స్వగతభేద శూన్యం బ్రహ్మ) రెండు గాఁగాని రెంటితోఁ గలసిగాని యుండుట ద్వీతము. ద్వీతము లేక ద్వైత మనఁబడును. ఇది కానిది అద్వైతము. మనుష్యునకు మనుష్యుఁడు సజాతీయము. మనుష్యునికంటె భిన్నమగు వృక్షపాషాణాదులు విజాతీయములు. శరీరమందుఁ గన్ను, ముక్కు, చెవి మున్నగు నవయవ భేదము స్వగతము; ఇట్లు రెండవ స్వజాతీయేశ్వరుఁడు కాని, విజాతీయేశ్వరుఁడు కాని, తన ఆత్మయందు తత్త్వాంతరవస్తువగు స్వగతభేదము కాని లేక పరమేశ్వరుఁ డొక్కఁడే కాఁబట్టి పరమాత్మకు 'అద్వైత' మని పేరు. నిర్గుణుఁడు:—(గణ్యంతే యే తే గుణా వా యైర్గణయంతి తే గుణాః' యో గుణేభ్యో నిర్గతః స నిర్గుణ ఈశ్వరః) సత్త్వ రజ స్తమములు, రూపరస స్పర్శ గంధాదులు జడగుణములు; అవిద్య, అల్పజ్ఞత, రాగము, ద్వేషము, మున్నగు క్లేశములు జీవగుణములు; వీనినుండి వేరైనవాఁడు ఈశ్వ

రుఁడు. దీనికి "అశబ్దమస్పర్శమరూపమవ్యయమ్" ఇత్యాది ఉపనిషద్వచనములు. ప్రమాణములు:- శబ్దస్పర్శరూపాది గుణరహితుఁ డగుటవలన పరమాత్మకు 'నిర్గుణుఁ'డని పేరు. సగుణుఁడు:-(యో గుణైః సహ వర్తతే స సగుణః) సర్వజ్ఞత్వము, సర్వసుఖము, పవిత్రత, అనంతబలము, మొదలగు గుణములచే యుక్తుఁడు కాఁబట్టి పరమేశ్వరునకు 'సగుణుఁ' డని పేరు. పృథివి గంధాది గుణములతోఁ గూడి సగుణమును, ఇచ్ఛాది గుణములచే రహితమైనందున నిర్గుణము నగునట్లు జగత్తు యొక్కయు జీవునియొక్కయు గుణములు లేకుండుట వలన పరమేశ్వరుఁడు నిర్గుణుఁడును, సర్వజ్ఞత్వాది గుణము లుండుటవలన సగుణుఁడునయి యున్నవాఁడు. సగుణమును, నిర్గుణమునుగాని పదార్థ మేదియు లేదు. చేతన గుణములు లేకుండుట వలన జడపదార్థము నిర్గుణమును, తన గుణములతో కూడి యుండుట వలన సగుణము నగునట్లు జడ గుణములు లేకుండుటచే జీవుడు నిర్గుణుడున్ను. ఇచ్ఛాదులగు తన గుణములతోఁ గూడి యుండుటచే సగుణుఁడునై యున్నాఁడు. అట్లే పరమేశ్వరుని విషయమందును దెలియవలయును. అంతర్యామి:- (అంతర్యంతుం నియంతుం శీలం యస్య సోఽయమంతర్యామీ) సమస్తమైన ప్రాణిరూపమును, అప్రాణి రూపమునగు జగత్తునందంతటను వ్యాపకుఁడయి, అన్నిటిని నియమించువాఁడు కాఁబట్టి పరమేశ్వరునకు 'అంతర్యామి'అని పేరు ధర్మరాజు:-(యో ధర్మే రాజతే స ధర్మరాజః) ధర్మమందే ప్రకాశమానుఁడును, అధర్మ రహితుఁడును, ధర్మమునే ప్రకాశపరచువాఁడును నగుటచేఁ బరమేశ్వరునకు 'ధర్మరాజని' పేరు. యముఁడు:- (యము ఉపరమే) ఈ ధాతువునుండి "యమ" శబ్ద మేర్పడుచున్నది. (యః సర్వాన్ ప్రాణినో నియచ్ఛతి స యమః) సమస్త ప్రాణులకు కర్మ ఫలముల నిచ్చుటకుఁ దగిన వ్యవస్థ చేయువాఁడును, ఎల్ల అన్యాయములకు దూరమయినవాఁడు నగుటచేఁ బరమాత్మకు 'యముఁ' డని పేరు. భగవంతుఁడు:-(భజ సేవాయామ్) ఈ ధాతువునుండి 'భగ' శబ్దమును, దీనితో 'మతుప్' కలిసి 'భగవాన్' శబ్దమును ఏర్పడుచున్నవి. (భగః సకలైశ్వర్యం సేవనం వా విద్యతే యస్య స భగవాన్) సమగ్రైశ్వర్య యుక్తుఁడును, భజించుటకు యోగ్యుఁడు నగుటవలన ఈశ్వరునకు 'భగవంతుఁడని' పేరు. మనువు:- (మన జ్ఞానే) ఈ ధాతువునుండి 'మను' శబ్ద మేర్పడుచున్నది. (యో మన్యతే స మనుః)మనువనఁగా విజ్ఞానశీలుఁడును.

నమ్ముటకు యోగ్యుఁడు నగుటవలనఁ బరమేశ్వరునకు 'మను'వని పేరు. పురుషుఁడు:- (పౄ పాలనపూరణయోః) ఈ ధాతువునుండి 'పురుష' శబ్ద మేర్పడు చున్నది.(యః స్వవ్యాప్త్యా చరాచరం జగత్ పృణాతి పూరయతి వా స పురుషః) జగత్తునందంతటఁ బూర్ణుఁడై యున్నాఁడు కాఁబట్టి పరమేశ్వనకుఁ 'బురుషుఁ' డని పేరు. విశ్వంభరుఁడు.-(డుభృఞ్ ధారణ పోషణయోః) 'విశ్వ' పూర్వక మైన ఈధాతువునుండి 'విశ్వంభర' శబ్ద మేర్పడుచున్నది. (యో విశ్వం బిభర్తి ధరతి పుష్ణాతి వా స విశ్వంభరో జగదీశ్వరః) జగత్తును ధరించి పోషించుచున్నాఁడు కాఁబట్టి పరమేశ్వరునకు 'విశ్వంభరుఁ'డని పేరు.

కాలుఁడు:— (కల సంఖ్యానే) ఈ ధాతువునుండి "కాల" శబ్ద మేర్పడు చున్నది. (కలయతి సంఖ్యాతి సర్వాన్ పదార్థాన్ స కాలః) జగత్తు నందలి సమస్త పదార్థములను,జీవులను ఎంచుచున్నాఁడుగనుక పరమేశ్వరునకు "కాలుఁ" డని పేరు. శేషుఁడు:—(శిష్ఌ విశేషణే) ఈ ధాతువునుండి 'శేష' శబ్ద మేర్పడు చున్నది.(యః శిష్యతే స శేషః)ఉత్పత్తి ప్రలయములకు మిగిలి యుండువాఁడు కనుక పరమాత్మకు 'శేషుఁ' డని పేరు. ఆప్తుఁడు: — (ఆప్ఌ వ్యాప్తౌ) ఈ ధాతువునుండి 'ఆప్త' శబ్ద మేర్పడుచున్నది. (యః సర్వాన్ ధర్మాత్మన ఆప్నోతి వా సర్వైర్ధర్మాత్మభి రాప్యతే ఛలాది రహితః స ఆప్తః)సత్యోపదేశకుఁడును, సకల విద్యాయుక్తుఁడును, సమస్త ధర్మాత్ములకు లభించువాఁడును, ధర్మాత్ములు పొందుటకు యోగ్యుఁడును, ఛలకపటాదులు లేనివాఁడు నగుటవలనఁ బరమాత్మకు 'ఆప్తుఁ'డని పేరు. శంకరుఁడు: — (డుకృఞ్ కరణే) 'శమ్' పూర్వక మైన ఈ ధాతువునుండి "శంకర" శబ్ద మేర్పడుచున్నది.(యః శం కల్యాణం సుఖం కరోతి స శంకరః) కల్యాణము-సుఖము గలుగఁ జేయువాఁడు గనుక ఈశ్వరునకు "శంకరుఁడని" పేరు. మహాదేవుఁడు:— 'మహత్' శబ్ద పూర్వక 'దేవ' శబ్దముచే 'మహాదేవ' శబ్ద మేర్పడుచున్నది. (యో మహతాం దేవః స మహాదేవః) గొప్ప దేవుల కందఱకును దేవుఁడు, విద్వాంసులకు విద్వాంసుఁడును, సూర్యాది పదార్థములకుఁ బ్రకాశకుఁడు నగుట వలనఁ బరమాత్మకు 'మహాదేవుఁ' డని పేరు. ప్రియుఁడు:— (ప్రీఞ్ తర్పణే కాంతౌ చ) ఈ ధాతువునుండి 'ప్రియ' శబ్ద మేర్పడుచున్నది. (యః పృణాతి ప్రీయతే వా స ప్రియః) సమస్త ధర్మాత్ములను, ముముక్షువులను, శిష్టులను ప్రసన్నులఁ జేయువాఁడును,

ఆందఱకును గామించుటకు యోగ్యుఁడును నగుటవలన ఈశ్వరునకుఁ 'ప్రియుఁ డని' పేరు. స్వయంభువు:—(భూ సత్తాయామ్)"స్వయం"పూర్వకమగు భూ ధాతువునుండి 'స్వయంభువు' శబ్ద మేర్పడుచున్నది. (యః స్వయం భవతి స స్వయంభూరీశ్వరః) తనంతటనే యున్నవాఁడు, ఎవనినుండిగాని యెన్నఁడు గాని యుత్పన్నమైన వాఁడు కాఁడు; కాఁబట్టి పరమాత్మకు 'స్వయంభు' వని పేరు. కవి:— (కు శబ్దే) ఈ ధాతువునుండి 'కవి'శబ్ద మేర్పడుచున్నది. (యః కౌతి శబ్దయతి సర్వా విద్యాః స కవిరీశ్వరః) వేదముల మూలముగా సమస్త విద్యలను ఉపదేశించువాఁడును, సమస్తము నెఱుంగు వాఁడును, కాఁబట్టి పర మేశ్వరునకుఁ 'కవి' యని పేరు. శివుఁడు:— (శివు కల్యాణే) ఈ ధాతువునుండి 'శివ' శబ్ద మేర్పడుచున్నది, 'బహులమేత న్నిదర్శనమ్' దీనిచే శివు ధాతువెన్నఁ బడును. కల్యాణ స్వరూపుఁడును, కల్యాణకారియు నగుటచేఁ బరమేశ్వరునకు 'శివుఁ' డని పేరు. పరమేశ్వరుని ఈ నూరుపేర్లు వ్రాయఁబడినవి. ఇవిగాక పరమాత్మకు మఱియు నసంఖ్య నామములున్నవి. ఏలయనఁగా పరమేశ్వరుని గుణకర్మ స్వభావము లనంతములు. అట్లే నామములును అనంతములు. వాని యందు ప్రతి గుణకర్మ స్వభావమునకు నొక్కొక్క నామమున్నది. కాఁబట్టి ఇప్పుఁడు నేను వ్రాసినది సముద్రమున బిందువువలెనున్నది. వేదాది సత్య శాస్త్రములయందు పరమాత్ముని యసంఖ్య గుణకర్మ స్వభావములు వ్యాఖ్యా నింపఁ బడియున్నవి. వానిని జదువుట చేతను, జదివించుటచేతను బోధపడఁ గలదు. అట్లే అన్యపదార్థముల జ్ఞానమును వేదాది శాస్త్రములు చదువువారికిఁ బూర్ణముగఁ గలుగఁ గలదు.

ప్రశ్న:— అన్య గ్రంథకారులు ఆది మధ్యాంతములలో మంగళాచరణ మొనర్చునట్లు మీరు వ్రాయనులేదు; చేయనులేదు.

ఉత్తరము:— అట్లు చేయుట యోగ్యముకాదు. ఏలయనఁగా ఆదిని మధ్యమునను, అంతమునను మంగళ మొనరించిన నా గ్రంథమందలి ఆది మధ్యాంతములకు నడుమనుండు వ్రాఁత అమంగళముగానే యుండును. "మంగ ళాచరణం శిష్టాచారాత్ ఫలదర్శనాచ్ఛ్రుతి తశ్చేతి" అది సాంఖ్యదర్శన పంచ మాధ్యాయ ప్రథమ సూత్రము. న్యాయమై, పక్షపాతరహితమై, సత్యమై వేదోక్త

మైనది ఈశ్వరాజ్ఞ. దానినే యున్నదున్నట్లు అంగట నెల్లప్పు డాచరించుట మంగళాచరణ మనఁబడును. గ్రంథముయొక్క ఆరంభము మొదలు సమాప్తి వఱకు సత్యాచరణ మొనర్పుటయే మంగళాచరణము. కాని ఒకచోట మంగళము మఱియొకచోట అమంగళము వ్రాయుట మంగళాచరణము కాదు. మహాశయులగు మహర్షుల వ్రాఁతలను జూడుఁడు:- "యాన్యనవద్యాని కర్మాణి తాని సేవితవ్యాని నో ఇతరాణి" ఇది తైత్తిరీయోపనిషత్తు ౧వ ప్రపాఠకము- ౧౧వ అనువాకము. 'బిడ్డలారా ! (అనవద్యాని) అనింద్యములు, ధర్మయుక్తములైన కర్మములఁ జేయుట మీకు యోగ్యము, అధర్మ యుక్తములఁగాదు' అని యున్నది. కాఁబట్టి యిటీవలి గ్రంథములందుఁ జూడఁబడు 'శ్రీగణేశాయ నమః' "సీతారామాభ్యాం నమః" 'రాధాకృష్ణాభ్యాం నమః' 'శ్రీగురుచరణార విందాభ్యాం నమః' "హనుమతే నమః" దుర్గాయై నమః' 'వటుకాయ నమః' "భైరవాయ నమః" 'శివాయ నమః' 'సరస్వత్యై నమః' 'నారాయణాయ నమః' ఇత్యాదులు వేదశాస్త్ర విరుద్ధములగుటచే బుద్ధిమంతులు వీనిని మిథ్యయని తెలియఁదగును. వేదమందును ఋషుల గ్రంథములందును. ఇట్లు మంగళాచరణ మొనర్చినట్లు కనఁబడదు. ఆర్ష గ్రంథములందు 'ఓమ్' 'అథ' శబ్దములు గనఁబడుచున్నవి చూడుఁడు:—

> "అథ శబ్దానుశాసనమ్" అథేత్యయం శబ్దోఽధికారార్థః ప్రయుజ్యతే॥(వ్యాకరణ మహాభాష్యే)॥ "అథాతో ధర్మజిజ్ఞాసా" అథేత్యానన్తర్యే. వేదాధ్యయనానంతరమ్॥(పూర్వమీమాంసాయామ్)॥ "అథాతో ధర్మం వ్యాఖ్యాస్యామః" అథేతి ధర్మ కథనానంతరం ధర్మలక్షణం విశేషేణ వ్యాఖ్యాస్యామః॥ (వైశేషిక దర్శనే)॥
>
> "అథయోగానుశాసనమ్". అథేత్యయమధికారార్థః॥ (యోగశాస్త్రే)॥
> "అథ త్రివిధదుఃఖాత్యన్త నివృత్తిరత్యన్తపురుషార్థః." "సాంసారికవిషయభోగానంతరం త్రివిధదుఃఖాత్యంతనివృత్త్యర్థః ప్రయత్నః కర్తవ్యః॥(సాంఖ్యశాస్త్రే)॥
> "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" 'చతుష్టయ సాధన సమ్పత్త్యనంతరం బ్రహ్మజిజ్ఞాస్యమ్'॥ (ఇదం వేదాంత సూత్రమ్)॥
>
> 'ఓమిత్యేత దక్షరముద్గీథముపాసీత'॥ (ఛాందోగ్యోపనిషద్వచనమ్)॥
> "ఓమిత్యేతదక్షరమిదగ్ం సర్వం తస్యోపవ్యాఖ్యానమ్"॥(మాండూక్యోపనిషద్వచనమ్)॥

(ఇవి యున్నియు నాయా శాస్త్రముల యారంభ వచనములు.) ఇట్లే అన్య ఋషిమునుల గ్రంథములయందును "ఓమ్" 'అథ' శబ్దములు వ్రాయఁబడియున్నవి. అట్లే అగ్నిమ్. (ఋ.వే.) ఇట్. (య.వే.) అగ్న. (సా.వే.) యేత్రిషప్తాః పరియంతి (అ.వే.) ఈ శబ్దములు నాలుగు వేదముల ప్రారంభమందు వ్రాయఁబడియున్నవి. "శ్రీగణేశాయ నమః" ఇత్యాది శబ్దము చెప్పుటను లేవు. వైదికులు వేదమున కారంభమందు 'హరిః ఓమ్' అని వ్రాయుటయుఁ జెప్పుటయుఁ గలదు. ఇది పౌరాణికులయు తాంత్రికులయు అసత్యకల్పనచే నేర్చుకొనినది. వేదాది శాస్త్రములందు 'హరి' శబ్ద మాదియందెచ్చటను లేదు. కాఁబట్టి గ్రంథాదియందు "ఓమ్" అనికాని "అథ" అనికాని వ్రాయవలయును. ఇప్పటి కొలఁదిగా ఈశ్వరుని విషయమై వ్రాయఁబడెను. ముందు శిక్షనుగూర్చి వ్రాయఁ బోవుచున్నాము.

శ్రీమద్దయానంద సరస్వతీస్వామి కృతమగు, సుభాషా
విభూషితమగు సత్యార్థప్రకాశమునందు
ఈశ్వరనామ విషయమున ప్రథమసముల్లాసము
సంపూర్ణము



# ద్వితీయ సముల్లాసము

## శిక్షనుగూర్చి చెప్పఁబోవుచున్నాము

" మాతృమాన్ పితృమానాచార్యవాన్ పురుషో వేద "

ఇది శతపథ బ్రాహ్మణ వచనము. వాస్తవముగ ఉత్తమ శిక్షకులు ముగ్గురు. తల్లి, తండ్రి, ఆచార్యుఁడు. వీరి వలననే మనుష్యుఁడు జ్ఞానవంతుఁ డగుచున్నాఁడు. ఏవని తల్లియుఁ దండ్రియు ధార్మికులగు విద్వాంసులో ఆ కులము ధన్యము! ఆ సంతానము మిక్కిలి భాగ్యవంతము! తల్లినుండి సంతానమునకుఁ గలుగునంత బోధయు, ఉపకారమును మఱి యెవ్వరినుండియుఁ గలుగదు. సంతానముమీఁదఁ బ్రేమయు, సంతానమునకు హితము సేయ వలయునని కోరికయుఁ దల్లి కున్నంత యితరులకుండదు. (ప్రశస్తా ధార్మికీ మాతా విద్యతే యస్య స మాతృమాన్) అనఁగా గర్భాధానము మొదలుకొని సంపూర్ణ విద్య యలవడువఱకు సంతానమునకు సుశీలతనే యుపదేశించునట్టి తల్లియే ధన్యురాలు.

గర్భాధాన మపుడును, అంతకు మునుపును, బిమ్మటనుగూడ మాదక ద్రవ్యములను, మద్యమును, దుర్గంధ పధార్థములను, రూక్షమును, బుద్ధినాశకమునగు పదార్థములను మాని, కాంతి, ఆరోగ్యము, బలము, బుద్ధి, పరాక్రమము, సుశీలత యను వాని ద్వారా సభ్యతను గలిగించునట్టి పాలు, నేయి, పంచదారతోఁ గలసిన శ్రేష్ఠమైన అన్నపానాదులను సేవించుట తల్లిదండ్రుల కుచితము;) అందువలన రజో వీర్యములును దోషరహితములయి యత్యుత్తమ గుణయుక్తములగును.

ఋతుగమన విధి:— రజోదర్శనమయిన అయిదవదినము మొదలుకొని పదియాఱవ దినమువఱకు ఋతుకాలము. ఋతు దినములందు మొదటి నాలుగు దినములు త్యాజ్యములు, మిగిలినవి ౧౨ దినములు, అందు ఏకాదశి, త్రయోదశి రాత్రులు వదలి తక్కిన పదిరాత్రులలో గర్భాధానము చేయుట యుత్తమము. రజోదర్శనము మొదలుకొని పదియాఱు రాత్రులకుఁ బిమ్మట సమాగమము చేయఁగూడదు. పైన చెప్పినట్లు మరల ఋతుసమయము వచ్చు

వఱకును. గర్భము కలిగిన పిమ్మట నొక సంవత్సరము వఱకును సంయోగము కూడదు. స్త్రీ పురుష లిద్దఱు శరీరమారోగ్యముగ నుండి పరస్పరము ప్రసన్నచిత్తులై యేవిధమగు శోకము లేనప్పుడు సంయుక్తులు కావలయును. ఇంతియకాక చరకసుశ్రుతములు చెప్పునట్లు భోజనాచ్ఛాదనము లొనర్పవలయును. మనుస్మృతి చెప్పునట్లు ప్రసన్నత కలిగి వర్తిల్లవలయును. గర్భాధానమునకుఁ బిమ్మట స్త్రీ మిక్కిలి జాగరూకతతో భోజనాచ్ఛాదనములను జేయవలయును. పిమ్మట నొక సంవత్సరమువఱకు స్త్రీ పురుషునితో సంగమముఁ జేయఁ గూడదు. సంతానము జనించువఱకు బుద్ధి, బలము, రూపము, ఆరోగ్యము, పరాక్రమము, శాంతి మొదలగు గుణములను గలిగించు ద్రవ్యములనే స్త్రీ సేవించుచుండ వలయును.

పుట్టగానే బిడ్డను మంచి సుగంధ యుక్తమగు జలముచే స్నానముఁ జేయించి నాడీ ఛేదనము అనఁగా బొడ్డుఁ గోయించి సుగంధ యుక్తమగు నెయ్యి మొదలగువానిచే హోమ మొనరించి * స్త్రీకి స్నాన భోజనములకు యోగ్యమగు నేర్పాటు-మాతా శిశువుల శరీరము క్రమముగ ఆరోగ్యమును బొంది పుష్టమగునట్లు చేయవలయును. బిడ్డకు పాలిచ్చు తల్లి కాని, దాదికాని పాలయందుత్తమ గుణములు గలిగించు పదార్థములను భుజింపవయును. దాలింతపాలు ఆఱుదినముల వఱకు బిడ్డకుఁ ద్రాగింప వలయును. పిమ్మట దాదిచేఁ బాలిప్పింప వలయును. ఆ దాదికిఁ దల్లిదండ్రులు భోజనపానములకు నుత్తమ పదార్థముల నొసంగవలయును. దాదినిబెట్టి పాలిప్పింపలేనంత దరిద్రులుగానుండిరేని ఆవుపాలయందుగాని మేకపాలయందుగాని బుద్ధిని, పరాక్రమమును గలిగించు ఉత్తమ ఔషధములను శుద్ధజలమందు నానఁబెట్టి, దంచి, శోధించి ఆ సారమును పాలకు సమభాగముగఁ గలిపి బిడ్డకుఁ ద్రాగింప వలయును. కన్నపిమ్మట బిడ్డను, దల్లిని గాలిశుద్ధముగానుండు స్థలమందుంచవలయును. అచ్చట సుగంధ పదార్థములను దర్శనీయ పదార్థములను ఉంచవలయును. వాయువు శుద్ధముగానుండు చోటనే వారు విహరించునట్లు చూడవల

* శిశువు జన్మించినప్పుడు, జాతకర్మ సంస్కారమును హవనాదులతో వేదోక్తరీతిని జేయవలయును. సంస్కార విధియందీవిషయము సవిస్తరముగ వ్రాయఁబడియున్నది.

యును. దాదిగాని, మేకపాలుగాని దొరకనప్పుడు ఉచితమని తోచినట్లు చేయ వలయును. ప్రసూత స్త్రీ శరీరాంశమునుండి బిడ్డ శరీర మేర్పడుచున్నది. కావున ప్రసవ సమయందు స్త్రీ దుర్బలురాలయి పోవుచున్నది. కనుక ప్రసూత పాలియ్యగూడదు. పాలనాపుటకు స్తన రంధ్రము మీఁద, పాలు స్రవింప నీయని లేపనమును బట్టింప వలయును. అట్లు చేయుటచే స్త్రీ రెండవనెల యందే మరల యువతియగును. అంతవఱకుఁ బురుషుఁడు బ్రహ్మచర్యముచే వీర్యమును నిగ్రహించి యుంచవలయును. స్త్రీ పురుషులిట్లు చేయుచుందు రేని వారికి నుత్తమ సంతానమును దీర్ఘాయువును, బలపరాక్రమముల పెంపును కలు గును. అట్లే ఉత్తరోత్తర సంతానము ఉత్తమ బలపరాక్రమములును, దీర్ఘా యువు, ధర్మముగల దగును. స్త్రీ తాను యోని సంకోచమును, శోధనమును, బురుషుఁడు వీర్య స్తంభనమును జేయునేని మరల కలుగు సంతానమంతయు నుత్తమముగా నుండును.

సంతానము సత్యముగా నుండునట్లు ఏ యంగముచేతను గుచేష్ట చేయ కుండునట్లు సర్వదా తల్లి యుత్తమశిక్ష నొసంగుచుండ వలయును. మాటలాడను నారంభించునపుడు బిడ్డల జిహ్వ కోమలమై, స్పష్టముగ నుచ్చరించుటకుఁ దగి నట్లు ప్రయత్నింప వలయును. ప్రతివర్ణము నుత్పత్తిస్థానము ప్రయత్నమును నేర్పవలయును. 'ప' వర్ణమున కుత్పత్తి స్థానము ఓష్ఠము. ప్రయత్నము స్పృష్టము గనుక రెండు పెదవులు చేర్చి చెప్పవలయును. ఇదిగాక హ్రస్వ. దీర్ఘ ప్లుతములను దగినట్లు చెప్పుటకును, మధురము, గంభీరము, సుందరము నగు స్వరములో అక్షరము, మాత్ర, పదము, వాక్యము, సంహిత, అవసానము ఇవి స్పష్టముగ వినఁబడునట్లు బిడ్డల నుచ్చరింపఁ జేయవలయును. కొంచెము మాటలాడఁ గలిగి గ్రహింపసాగఁగానే పెద్దలు, చిన్నలు మాన్యులు, తల్లి, తండ్రి, రాజు, విద్వాంసులు మొదలగు వారితోడ సంభాషింప వలసినరీతిని, వర్తింపవలసిన తెఱఁగును గూర్చుండ వలసిన విధమును నేర్పవలయును. అందువలన వారికి ఎల్లయెడల ప్రతిష్ఠ కలిగి అగౌరవమునకు పాత్రులుగాకుం దురు. బిడ్డలు జితేంద్రియులును, విద్యాప్రియులును, సత్సంగమందు రుచికం వారునగునట్లు ప్రయత్నింప వలయును. బిడ్డలకు వ్యర్థక్రీడ, ఏడుపు, హాస్యము, జగడము, హర్షము, శోకము, ఏదేని పదార్థమందు పేరాస, ఈర్ష్య, ద్వేషము

మొదలగునవి కూడవు. ఉపస్థేంద్రియమును స్పృశించుట చేతను, మర్దించుట చేతను, వీర్యక్షీణత నపుంసకత్వము కలుగుటయేగాక చేతికి దుర్గంధమును అంటునుగనుక దానిని తాక నీయరాదు. సర్వదా సత్యభాషణము, శౌర్యము, ధైర్యము, ముఖప్రసన్నత మొదలగు గుణములు కలిగి చరించునట్లు చూచుకొనవలయును. కొమరునికిఁగాని, కొమార్తెకుఁగాని అయిదవయేఁడు రాఁగానే దేవనాగరి యక్షరములను, అన్యదేశీయ భాషాక్షరములను నేర్పవలయును. తరువాత మంచిశిక్షను, విద్యను, ధర్మమును, పరమేశ్వరుఁడు, మాత, పిత, ఆచార్యుఁడు, విద్వాంసులు, అతిథి, రాజు, ప్రజలు, బంధువులు, తోఁబుట్టువులు, భృత్యులు మున్నగువారితో వర్తిల్లవలసినరీతిని బోధించు మంత్ర శ్లోక సూత్ర గద్యపద్యములను అర్థసహితముగఁ గంఠస్థము చేయింపవలయును. అందువలన సంతానము ఏధూర్తుని దురుపదేశమందుఁ జిక్కకుండును. మరియు విద్యాధర్మ విరుద్ధములై భ్రాంతి జాలమందుఁ బడవేయు వ్యవహారముల బొంత పోకుండునట్లును తెలిపి హెచ్చరించి యుంచవలెను. అందువలన భూతప్రేతాది మిథ్యా వార్తలు విశ్వసింపకుందురు.

గురోః ప్రేతస్య శిష్యస్తు పితృమేధం సమాచరన్।
ప్రేతహారైః సమం తత్ర దశరాత్రేణ శుద్ధ్యతి॥ మను ॥అ-౫. ౬౫॥

గురువు ప్రాణమును వదలినపుడు ప్రేత నామముగల ఆ మృతశరీరమును దహనముచేయు శిష్యుఁడును, (ప్రేఁతహారులు) ఆ మృత శరీరమును మోయువారును బదియవదినమందు శుద్ధులగు చున్నారని దీని యర్థము. కాఁబట్టి ప్రేతమనఁగా మృతశరీరము. ఆ శరీరము దహనము కాఁగానే దానికై గతించినది అను నర్థమున "భూతము" అని వారుదురు. అనఁగా "వాఁడు ఉండెను". అన్నమాట. పుట్టినవి కొంతకాలముండి నశించినపుడు అవి భూతకాలమునందుండుటచే వానిని భూతములందురు. బ్రహ్మ మొదలుకొని నేఁటివఱకు విద్వాంసుల సిద్ధాంతమిదియే. ఈ జ్ఞానములేక సందేహము, దుస్సంగతి, కుసంస్కారము గలవారికి భయశంకా రూపములగు భూతములు, ప్రేతములు, శాకినీ, డాకినీ మున్నగు ననేకములయిన భ్రమజాలములు దుఃఖములను గలిగించుచున్నవి (ప్రాణి చావగానే వాని జీవుఁడు పాపపుణ్యవశుఁడై పరమేశ్వరుని వ్యవస్థచే సుఖదుఃఖ రూపఫలముల ననుభవించుటకు జన్మాంతరమును ధరించును.

పరమాత్మని నాశ రహితమగు నీ వ్యవస్థ నెవరు నాశముచేయఁగలరు ? అజ్ఞానులు వైద్యశాస్త్రమునుగాని, పదార్థవిద్యనుగాని చదువకయు, వినకయు విచారింపకయు, సన్ని పాతజ్వరాది శారీరిక రోగములకును, ఉన్మాదాదిమానసిక రోగములకును భూతప్రేతాది నామములను బెట్టుచున్నారు. వానికిఁ దగిన ఔషధసేవనమును, ఉచితమగు పథ్యపానముల నాచరింప ధూర్తులు, పాషండులు, మహామూర్ఖులు, అనాచారులు, స్వార్థులు, మాలమాదిగలు, మ్లేచ్ఛులు మొదలగు వారిని గూడ విశ్వసించి అనేకములగు టక్కులకు గపటములకుఁ జిక్కి ఉచ్ఛిష్టమును గూడ భుజించుచుఁ బనికిమాలిన మంత్రములు వేయించుచుఁ దోరములు, యంత్రములు, తాయెతులు గట్టించుచుఁ దిరుగుచుందురు. తమ ధనమును బాడుచేసి, సంతానమును దుర్దశలోముంచి రోగములనుబెంచి, దుఃఖములోమునిఁగి త్రిమ్మరుచుందురు. ధనవంతులగు మూఢులు ఆ దుర్బుద్ధులును బాపులును స్వార్థులునగు వారియొద్దకు (రోగియగు) కొడుకునో కూతురునో స్త్రీనో పురుషునో తీసికొనిపోయి చూపి "అయ్యా! ఈ రోగికి ఏమో తెలియకున్నది దయచేసి చెప్పుఁడు" అందురు. అనఁగానే వారు ఈ రోగిమీఁద భూతమో, ప్రేతమో, భైరవుఁడో, శీతలా దేవియో ఆవేశమం యున్నది; దీనికి సదుపాయము జేయువఱకు వదలదు; ప్రాణము తీసినను దీయును. దీనికికొంత నైవేద్యము సమర్పింప వలసివచ్చును. మీ కిష్టమేని మేము మంత్రము పురశ్చరించి తక్షణమే దానిని తఱిమి వేయుదుము" అందురు. అనఁగానే బుద్ధిలేని ఆ గృహస్థుఁడును, వాని బంధువులును "అయ్యా ! మా సర్వస్వము పోయినను సరే వీనిని మాత్రము స్వస్థము చేసితిరా చాలును" అందురు. అనఁగానే తమ కోరిక గట్టెక్కినట్లెంచి ఆధూర్తులు ఆ వచ్చినవానిని గూర్చి "మంచిది: ఆయా సామగ్రి, ఇంత దక్షిణ సమర్పింపుఁడు. ఈ దేవతకు నైవేద్యమును, గ్రహదానమును ఇప్పింపుడు" అని చెప్పుచు నా రోగి యెదుట డోలు, మద్దెల, తాళము వాయింపఁ దొడఁగుదురు. వారిలో నొక పాషండుఁడు పిచ్చివానివలె గంతులు వేయుచు "వీని ప్రాణము నే తీసికొందును" అనును. అప్పుడా తెలివిలేని గృహస్థు లామాల మాది గల కాళ్ళ మీఁదఁబడి "మీకుఁ గావలసినది పుచ్చుకొనుఁడు. ఈరోగిని మాత్రము రక్షింపు" దందురు. అనఁగానే ఆ ధూర్తుఁడు "నేను హనుమంతుఁడను. తెండు పంచి మిఠాయి, నూనె, సిందూరము, ఎఱ్ఱనిగోచి, ఒక మణుగుంబావు రొట్టె" అని

కానీ, "నేను దేవిని; ళై రపుఁడను, రెండు ౫ సీసాల సారాయి, ౨౦ కోళ్ళు, ౫ మేకలు, మిఠాయి, వస్త్రములు" అని కాసె, అనును. అప్పు డా తెలివి మాలిన గృహస్థులు "తమకుఁగా వలసినవంతయుఁ బుచ్చుకొనుఁ" డందురు. అప్పుడా దూర్తుఁడు మరల గంతులు వేసి యాడ నారంభించును. ఇవి యన్నియు నా దూర్తులు ధన మపహరించుటకై పన్నిన టక్కుటమారములు. కాఁబట్టి ఆ సమయమందు బుద్ధిమంతుఁ డెవ్వఁ డేని ఆ ధూర్తుని కై దు చెప్పుదెబ్బలు, రెండుబెంప దెబ్బలు, నాలుగు తన్నులు, సమర్పించెనేని ఆ దేవీ ళై రవులు తక్షణమే ప్రసన్నులై పాఱిపోవుదురు.

అక్కడనుండి బుద్ధిమాలిన యీ గృహస్థులు రోగిని, గ్రహగ్రస్తుడును, గ్రహరూపుఁడునగు జ్యోతిర్విదాభాసుని యొద్దకుఁ గొనిపోయి "స్వామీ! ఇతని కేమో దయచేసి సెలవిండు" అందురు. అనఁగానే ఆ జ్యోతిర్విదాభాసుఁడు "వీఁ రోగికి సూర్యాది గ్రహములు క్రూరములయి యున్నవి. మీరు శాంతి, పూజ, దానము చేయించితిరేని ఇతనికి సుఖమగును. లేకున్న పీడ యతిశయించి మృతి చెందుటయు నాశ్చర్యముకాదు" అని తనచేతనైన ధన మపహరింపఁ బ్రయత్నించును.

## అట్టి జ్యోతిర్విదాభాసునితో బుద్ధిమంతుఁడు చెప్పవలసినవిధము

బుద్ధిమంతుఁడు :— అయ్యా ! (వీఁ పృథ్వివలెనే సూర్యాది గోళములు జడములు. ఉష్ణము, ప్రకాశము తప్ప మఱేమియు నియ్యజాలవు.) కోపించి దుఃఖమును, శాంతించి సుఖము నిచ్చుటకు నవి యేమి చేతనములా ?

జ్యో :— ఏ మండీ! ఈ సంసారమందు రాజును ప్రజలును సుఖదుఃఖములను బొందుచున్నారే, అది గ్రహములయొక్క ఫలము కాదా ?

బుద్ధిమంతుఁడు :- కాదు, (అది అంతయుఁ బాపపుణ్యముల ఫలము)

జ్యో :— ఏమి ! జ్యోతిశ్శాస్త్రము మసత్యమా ?

బు :— (అందలి అంక బీజ రేఖాగణిత మంతయు సత్యమే కాని ఫలముల లీల లన్నియు నసత్యములు.)

జ్యో :— అయిన జన్మపత్రము నిష్ఫలమా ఏమి?

బ్ర :— దానిని- జన్మపత్రము- కాదు; శోకపత్ర మనవలయును. ఏల యనఁగా సంతానము జన్మించినపుడు అందఱకు నానందము కలుగును. ఆయానందము జాతకము సిద్ధమయి గ్రహముల ఫలము వినసంత వఱకే యుండును.

ఇఁక జన్మపత్రిక వ్రాయు పురోహితుల విషయము ;-

పురోహితుఁడు జాతకము వ్రాయింపుఁడని నపుడు. "అయ్యా ! తమరు మా చిన్నవానికి మంచి జాతకము వ్రాయవలయును సుమా" అని మాతాపితరులు అందురు. వారు ధనాఢ్యులయి రేని ఎఱ్ఱని పచ్చని రేఖలచేఁ జిత్ర విచిత్రము గను, బీదవారేని సాధరణముగను వ్రాసి పురోహితుఁడు వినిపింపఁ దెచ్చును. అప్పుడు తల్లిదండ్రులు పురోహితుని యెదుట గూర్చుండి, "చిన్నవాని జాతకము బాగుగా నున్నదా?" అని యడుగుదురు. అప్పుడు పురోహితుడు వారితో "ఉన్నదేమో వినిపించెదను, వినుఁడు. ఈ చిన్నవానికి జన్మ గ్రహములును, మిత్ర గ్రహములును మిక్కిలి ప్రశస్తములై యున్నవి. వీని ఫలమత్యుత్తమము. ఈ చిన్న వాఁడు ధనాఢ్యుఁడును, ప్రతిష్ఠా వంతుఁడు నగును. ఏ సభలోఁ బోయికూర్చున్నను ఇతని తేజస్సు అందఱి మీఁదఁ బడును. ఆరోగ్యవంతుఁడును రాజసన్మానియునగును" అనును. ఇవి విని తల్లిదండ్రులు పురోహితునితో "అయ్యా! తమరు చాల మంచివారు" అందరు. ఈ పొడిమాటలతోఁ దనకార్యము సిద్ధింపదని తెలిసి జ్యోతిష్కుఁడు వారితో "ఇదియంతయు బక్కఁగనే యున్నది కాని. ఫలానా గ్రహములు మాత్రము క్రూరములుగా నున్నవి. ఆ గ్రహయోగము చేత నీ చిన్నవానికి నెనిమిదవయేఁట మృత్యుయోగము కలుగునని చెప్పును. ఇది వినఁగానే తల్లిదండ్రులు పుత్రని జన్మానందమును వదలి శోకసాగరమందు మునిగి జ్యోతిష్కునితో. "స్వామి! ఇప్పుడు మేమేమి చేయవలయు" నందురు. అప్పుడు పురోహితుఁడు. "ఏదేని యుపాయము చేయవలయు" ననును. అప్పుడు ఆ గృహస్థులు "స్వామి! ఏమి యుపాయము చేయవలయునో సెలవిం" డందురు. అప్పుడు జ్యోతిష్కుఁడు వారితో "ఫలానా ఫలానా దానములుచేయుఁడు; నవగ్రహ మంత్రములను జపము చేయింపుఁడు; నిత్యము బ్రాహ్మణ సంతర్పణము చేయింపుఁడు. బహుశః నవగ్రహముల విఘ్నము దూరము కావచ్చును." అని ప్రస్తా

వించును. ఆ చిన్నవాఁడొకవేళ గతించెనేని "మనమేమి చేయఁగలము. పరమేశ్వరుని మీరిన వారెవరు? మేము చాల ప్రయత్నించితిమి. మీరును ప్రయత్నించితిరి. వాని కర్మము" అనును? బ్రతికెనేని "చూచినారా! మా మంత్రములయు దేవతలయు బ్రాహ్మణులయు శక్తి ! మీ పుత్రుని బ్రతికించి వేసినవి!" అని చెప్పుటకు 'ఢహంశః' అనుమాట జ్యోతిష్కుఁడు మొదటనే వేసియుంచును. ఆ జ్యోతిష్కునకు బుద్ధి వచ్చునట్లు గృహస్థుఁడుఁగూడ తన పుత్రుఁడు బ్రతికెనేని "అయ్యా! తమరు సెలవిచ్చినట్లే నా పుత్రుఁడు తన కర్మముచేతను, పరమేశ్వరుని నియమము చేతను బ్రతికెనేగాని మీ చేతలవలగాదనియు" నొకవేళ పుత్త్రుఁడు గతించెనేని, 'అయ్యా! మీ జపాదులవలన నేమియుఁ బ్రయోజనము గలుగలేద'నియుచెప్పి, యాథార్థ జ్యోతిష్కునినుండి చిన్నవాఁడు బ్రతికినను జచ్చినను కూడ ఇచ్చిన దానికంటె నిబ్బడి, మువ్మడి ధనమును లాగుకొన వలయును.

ఇఁక గురువులు మొదలగువారు:-- వీరు పుణ్యము పేరుపెట్టి దానము చేయించి తాము గ్రహించు చున్నారు. వీరికి జ్యోతిష్కునకిచ్చిన యుత్తరమునే యియ్యవలయును.

(ఇఁక శీతలా(అమ్మవారు)మంత్రతంత్రములు:-ఇవియును బూటకములే.) కొందఱు 'మేము మంత్రము జపించి దోరమునుగాని.తాయెతులనుగాని కట్టితిమేని ఆ మంత్ర ప్రభావముచేత నా దేవతలును పీరులును వారికే యిబ్బందియు గలుగనీయ' రందురు. వారితో 'మీరు మృత్యువును, పరమేశ్వరు నియమమును. గర్మఫలమును దప్పింపగలరా? మీరిట్లు తాయెతులను దోరములను గట్టుచున్నను నెందఱు చచ్చుచున్నారుకారు? మీయింటను జచ్చుచున్నారే. ఏమి మీరుచానరా?' అని యడుగవలయును. అప్పుడు వారేమియుఁ జెప్పజాలక 'ఇక్కడ తమ పప్పుడుత' దనుకొందురు.

కాఁబట్టి యిట్టి మిథ్యావ్యవహారముల నన్నిటిని మాని ధార్మికులును. సమస్త దేశమునకు నుపకార కర్తలును, నిష్కపటముగా నెల్లఱకు విద్య నేర్పువారునగు నుత్తమ విద్వాంసుల కుపకార మొనర్పవలయును. వారు చేయునట్టి జగదుపకారమగు కార్యము నెప్పుడు వదలిపెట్టగూడదు. రసాయనము, మారణము, మోహనము, ఉచ్చాటనము, వశీకరణము మొదలగు లీలలన్నియు

మహాపామరములని యెంచవలయును. ఏ భ్రమజాలమందును చిక్కుకొని మోస పడకుండునట్లు ఇట్టి యసత్య విషయములను గూర్చి బాల్యావస్థయందే సంతానమున కుపదేశము చేయవలయును. 'వీర్యరక్షణచే నానందమును, వీర్యనాశముచే దుఃఖము ప్రాప్తించు' నదియు తెలుపవలయును. 'శరీరమందు వీర్యమును బాగుగ రక్షించుకొన్నవారికి ఆరోగ్యము, బుద్ధి బలము, పరాక్రమము వర్ధిల్లి సుఖము కలుగును. బ్రహ్మచారులు కామసంబంధమగు కథలనువినరాదు. విషయాసక్తుల సహవాసమునుండియు, కామవిషయమగు తలంపులనుండియు, స్త్రీదర్శనము, ఏకాంతసేవనము, సంభాషణము, స్పర్శములనుండియు దూరము నుండి ఉత్తమశిక్షణను, పూర్ణ విద్యను గ్రహింపవలయును. వీర్యమును రక్షించుకొనుట కిదియే మార్గము. శరీరమందు వీర్యము లేనివాఁడు నపుంసకుఁడును దుర్లక్షణములు గలవాఁడు నగును. ప్రమేహాది రోగములు గలవాఁడు దుర్బలుఁడు, నిస్తేజుఁడు, నిర్బుద్ధియునై ఉత్సాహము సాహసము ధైర్యము బలము పరాక్రమము లేక నశించును. (మీరీ సమయమందు సుశిక్షను విద్యను గ్రహించి వీర్యమును రక్షించుకొనక పోయితిరేని మరల నీ జన్మమందిట్టి అమూల్యసమయము మీకు దొరకజాలదు.) గృహకృత్యముల జరుపువారము మేముండినంతవరకు మీరు విద్యను శరీరబలమును వృద్ధిపఱచుకొనుచుండవలయును.' అని తల్లిదండ్రులు తమ సంతానమునకిట్టే యితర నీతులుపదేశింపవలయును. తల్లిదండ్రులు తమబిడ్డల కిట్టిశిక్ష నియ్యవలయునను ఉద్దేశముతోనే 'మాతృమాన్ పితృమాన్' శబ్దములు గ్రహింపఁబడినవి. బిడ్డలకు అయిదవ యేఁటివఱకుఁ దల్లియు, ఆఱవయేడు మొదలు ఎనిమిదేండ్లవఱకుఁ దండ్రియు శిక్ష నొసంగి తొమ్మిదవ యేఁటి ప్రారంభమందు ద్విజులు తమ సంతానమున కుపనయన మొనర్చి పూర్ణవిద్వాంసుఁడు శిక్షకుఁడుగా నుండు గురుకులమునకుఁ బుత్రులను బంపవలయును. శూద్రాది వర్ణస్థులు ఉపనయనము చేయకయే విద్యాభ్యాసము కొఱకుఁ దమబిడ్డలను గురుకులమునకుఁ బంపవలయును. విద్యావిషయమందు లాలింపక, తాడించువారి సంతానమే విద్యయు, సభ్యతయు గలిగి సుశిక్షితమగును. ఈ విషయమందు మహాభాష్యము యొక్క ప్రమాణము :—

> సామృతైః పాణిభిర్ఘ్నంతి గురవో న విషోక్షితైః ।
> లాలనాశ్రయిణో దోషాస్తాడనాశ్రయిణో గుణాః ॥ వ్యాక.మ.౮।౧।౮॥

అర్థము:- సంతానమును శిష్యులను దాడించునట్టి మాతాపితరులు, ఆచార్యులు వారికి చేతులార అమృతమును ద్రావించుచున్నారు. లాలించు వారు విషమును ద్రావించి పాడుచేయుచున్నారని తెలియవలెను. సంతానమును, శిష్యులును లాలనచే దుష్టులగుదురు. తాడనచే గుణవంతులగుదురు. కాఁబట్టి బిడ్డలును శిష్యులును లాలనకు సంతోషింపక తాడనమునకును ప్రసన్నులు గావలయును. కాని తల్లియు దండ్రియు నధ్యాపకుడును ఈర్ష్యా ద్వేషములచేఁ గొట్టఁ గూడదు. పైకి భయమును జూపుచు లోపల కృపాదృష్టి యుంచవలయును. ఇతర శిక్షణముతోపాటు చౌర్యము, జారత్వము, అలస్యము, ప్రమాదము, మాదక ద్రవ్య సేవనము, మిథ్యాభాషణము, హింస, క్రూరత, ఈర్ష్య, ద్వేషము, మోహము, మొదలగు దోషములను వదలి సత్యాచారమును గ్రహింపవలసిన శిక్షయు నిచ్చుచుండవలయును. ఎవ్వని యెదుట నేని, ఒక్క తూరియేని చౌర్యముకాని, జారత్వముకాని మిథ్యా భాషణముకాని చేసెనేని అతని యెదుట వానికి మృత్యు పర్యంతము ఇంకఁ బ్రతిష్ఠ కలుగఁజాలదు. ప్రతిజ్ఞా భంగము చేయువానికిఁ గలుగునంత హాని మఱి యెవనికిని గలుగఁజాలదు. కాఁబట్టి యెవరికేమి ప్రతిజ్ఞ చేయుదురో వారికది పూర్తిచేయ వలయును. మీరునాతో ఫలానా సమయమందుఁ గలియుఁడు; మీకు ఫలానా వస్తువు ఫలానా సమయమందిచ్చెదను'. అనిప్రతిజ్ఞఁ జేసినప్పుడు అట్లే పూర్తిజేయ వలయును; లేకున్న నతని నెవ్వరు నమ్మరు. కాఁబట్టి ఎల్లరును సర్వదా సత్యభాషణులుగను, సత్యప్రతిజ్ఞా యుక్తులుగను ఉండవలయును. అభిమాన మెవరికినిఁ గూడదు. ఛలకపట కృతఘ్నతలచేతఁ దమ హృదయమే దుఃఖించునపుడు ఇతరుల విషయమై చెప్పవలసిన దేమియున్నది. ఛలకపటమనఁగా మనస్సునందొకటియు వెలుపల నొకటియుఁ బెట్టుకొని యితరులను మోసపుచ్చి, పరులకుఁగలుగు హానిని లెక్కసేయక తన ప్రయోజనమును నెరవేర్చుకొనుట; కృతఘ్నత అనఁగా ఇతరులుచేసిన యుపకారము నెంచకపోవుట; ఇదికూడదు. క్రోధాది దోషములను గటువచనములను మాని శాంతమగు మధుర వచనములను బలుకవలయును. అధిక ప్రసంగము చేయరాదు. ఎంత చెప్పవలయునో అంతేకంటె నెక్కువకాని, తక్కువ కాని చెప్పతగదు. పెద్దలను గౌరవింప వలయును. వారు రాఁగానేలేచి 'నమస్తే' అని చేతులుమోడ్చి యున్నతాసన మందుఁ గూర్చుండఁ బెట్టవలయును. వారి

యెదుట నుత్తమాసనమందుఁ గూర్చుండ గూడదు. సభయందు ఇతరులువచ్చి నన్ను అక్కడనుండి లేపని, తనకు యోగ్యమగు నాసనమందుఁ గూర్చుండ వలయును. విరోధ మెవ్వరితోడను గూడదు. సంపన్నుఁడై గుణములు గ్రహించి దోషములు ద్యజింపవలయును; దుష్టులనువదలి సజ్జనులతో సహవాసము చేయ వలయును; తల్లికిని, తండ్రికిని, ఆచార్యులకును శరీరముచే మనస్సుచే, ధనా ములచే, ఉత్తమోత్తమ పదార్థములచే ప్రీతిపూర్వకముగ సేవజేయవలయును; అనితల్లియుఁ, దండ్రియు, నా చార్యులును బిడ్డలకు శిష్యులకును సర్వదా సత్యో పదేశము జేయుటయే గాక.

యాన్యస్మాకగ్ం సుచరితాని తాని త్వయోపాస్యాని ।
నో ఇతరాణి॥ తైత్తి-ప్ర ౭-అను-౧౧॥

'మీరు ధర్మయుక్తములగు మా యాచరణములు గ్రహింపుఁడు ; మా దుష్టకర్మములను వదలివేయుఁడని చెప్పవలయును. 'సత్యమని తెలిసిన దానిని ప్రకటించి ప్రచారము చేయుఁడు. పాషండులను దుష్టాచారులను నమ్మకుఁడు. తల్లియుఁ దండ్రియు నాచార్యుఁడు నే యే యుత్తమ కార్యమున కాజ్ఞయొసంగె దరో వానిని వారి యిష్టానుసారము చేయుఁడు' అని బోధింప వలయును. ధర్మము విద్య సదాచారములనుగూర్చి కంఠస్థముచేసిన శ్లోకములయు 'నిఘంటువు' 'నిరుక్తము' 'అష్టాధ్యాయి' ఇతర సూత్రములయు, వేద మంత్రములయు నర్థము స్మరించునట్లుచేయవలయును. ప్రథమ సముల్లాసమందుఁ బరమేశ్వరుని వ్యాఖ్యా నించిన రీతిని నమ్మి యతని నుపాసించునట్లు చేయవలెను. ఆరోగ్యము, విద్య, బలము, కలుగురీతిని భోజనాచ్ఛాదన వ్యవహారములను జేయుఁడు; అనఁగా నాఁకలికంటె గొంచెము తక్కువగా భుజింపుఁడు. మద్యమాంసాది సేవనలనుండి దూరముగా నుండుఁడు. తెలియనిలోతు నీళ్ళలోఁ బ్రవేశింపకుఁడు. ఏలయనఁగా జలజంతువులచేఁ గాని, అన్య పదార్థములచేఁ గాని దుఃఖము కలుగవచ్చును. ఈఁతరాకున్న మునిఁగియుఁ బోవచ్చును. (నావిజ్ఞాతే జలాశయే) మనువు. [౪-౧౯౬] అవిజ్ఞాతమనఁగా తెలియని జలాశయమందు, అనఁగా నావి యందుఁ బ్రవేశించి స్నానము సేయఁదగదు.

దృష్టిపూతం న్యసేత్పాదం వస్త్రపూతం జలం పిబేత్ ।
సత్యపూతాం వదేద్వాచం మనఃపూతం సమాచరేత్॥ మను౬. ౪౬॥

'క్రింద దృష్టియుంచి యెగుడు దిగుడులనుజూచి నడువ వలయును. వస్త్రముచే శోధించిన నీటినిఁ ద్రాగవలయును. సత్యముచేఁ బవిత్రమగు వచనముఁ జెప్పవలయును. మనస్సుచే విచారించి యాచరింపవలయును' అని యీరీతిఁ జక్కఁగాఁ దల్లిదండ్రులు సంతానమున కుపదేశింప వలయును.

> మాతా శత్రుః పితా వైరీ యేన బాలో న పాఠితః ।
> న శోభతే సభామధ్యే హంసమధ్యే బకో యథా॥ చాణక్యనీతి. అ-౨-శ్లో ౧౧॥

విద్య నేర్పఁబడని బాలుఁడు విద్వాంసుల సభయందు హంసల నడిమి కొంగవలెఁ దిరస్కృతుఁడయి శోభింపఁడు; కాఁబట్టి విద్యనేర్పని తలిదండ్రులు సంతానమునకు ప్రబలవైరులు. కనుక తమ శరీరముచేత మనస్సు చేతఁ దమ సంతానమును విద్యావంతులుగ ధర్మాత్ములుగ సభ్యులుగ, ఉత్తమ విద్యావంతులుగ జేయుటయే తల్లిదండ్రులకు ముఖ్య కర్తవ్యమును బరమధర్మమును గీర్తి దాయకము నయి యున్నది.

బాలశిక్ష విషయమై యింతమాత్రము సంక్షేపముగ వ్రాయఁ బడెను. దీనినిబట్టి బుద్ధిమంతులు విశేషముగ గ్రహింపగలరు.

శ్రీమద్దయానంద సరస్వతీస్వామి కృతమును,
సుభాషావిభూషితమునగు సత్యార్థప్రకాశమునందు
బాలశిక్షావిషయమున ద్వితీయసముల్లాసము
సంపూర్ణము.



# తృతీయ సముల్లాసము

## అధ్యయనాధ్యాపన విధులు

ఇఁకతృతీయసముల్లాసమునందుఁ బఠనపాఠన విధానము వ్రాయఁబడును. సంతానమును ఉత్తమవిద్య, ఉత్తమశిక్ష, ఉత్తమగుణ కర్మస్వభావములను ఆభరణములచేనలంకరించుట తల్లిదండ్రులకును ఆచార్యులకును బంధువులకును ముఖ్య కర్తవ్యమైయున్నది. బంగారము, వెండి, మాణిక్యము, ముత్యము, పచ్చ మొదలగు రత్నములచేఁ జేయఁబడిన ఆభరణములను ధరించుటచే మనుష్యుని యాత్మ యెన్నటికిని సుభూషితము కాఁజాలదు. ఆభరణములను ధరించుటచేఁ గేవలదేహాభిమానమును, విషయాసక్తియు, దొంగలభయమును గలుగుటయే గాక మృత్యువును గలుఁగవచ్చును. ఈ నగలమూలమున బిడ్డలకు దుష్టులనుండి మృత్యువు గలుగుచుండుట లోకమందుఁ జూచుచున్నాము.

విద్యావిలాస మనసో ధృతశీలశిక్షాః సత్యవ్రతా రహిత మానమలాపహారాః।
సంసారదుఃఖదళనేన సుభూషితా యే ధన్యా నరా విహితకర్మ పరోపకారాః॥

విద్యా విలాసమునందుఁ దత్పరమైన మనస్సుకలవారై సుందరశీల స్వభావయుక్తులై సత్యభాషణాదినియమములను బాలించుచు అభిమానమునుండియు అపవిత్రతనుండియు దూరులై, ఇతరుల మాలిన్యమును బోఁగొట్టువారై సత్యోపదేశము, విద్యాదానము సంసారులదుఃఖభంజనము చేయుటచేతను బ్రకాశించుచు వేదవిహితకర్మములచేఁ బరోపకారమే యొనర్చు స్త్రీలును పురుషులును ధన్యులు; కాఁబట్టి యెనిమిదేండ్లు నిండఁగానే బాలబాలికలను బాలబాలికాపాఠశాలలకుఁ బంపి వేయవలయును. దుష్టాచారులగు గురువుల యొద్ద శిక్షనిప్పింపఁగూడదు పూర్ణవిద్యాయుక్తులగుధార్మికులే చదువుచెప్పుటకును, శిక్షించుటకును యోగ్యులు. ద్విజులు తమయింట మగబిడ్డలకు యజ్ఞోపవీతమును, కన్యలకును యథా యోగ్యమగు సంస్కారమును జేయించి గురుకులమునకు- వారివారి పాఠశాలలకుఁ-బంపివేయవలయును. పాఠశాల యేకాంత ప్రదేశమందుండ వలయును, బాలబాలికా పాఠశాలలకు రెండుక్రోసుల యెడముండవలయును. గురువులు, భృత్యులు, అనుచరులు, పురుషుల పాఠశాలలందుఁ బురుషులను స్త్రీలపాఠశాల

లందు స్త్రీలును ఉండవలయును. బాలికా పాఠశాలలకు అయిదేండ్ల మగబిడ్డ లనుగాని, బాలుర పాఠశాలలకు అయిదేండ్ల ఆఁడు బిడ్డలనుగాని పోనియ్యఁ గూడదు. బ్రహ్మచర్యమందుండునపుడు బాలబాలికలు పరస్పరము, దర్శనము, స్పర్శనము, ఏకాంతసేవనము, భాషణము, విషయకథ, పరస్పరక్రీడ, విషయ ధ్యానము, సంగము అను నీయెనిమిది విధములగు మైథునములనుండి దూరముగా నుండవలయును. విద్యార్థులు ఉత్తమవిద్యాశిక్ష స్వభావయుక్తులై శరీరమును, ఆత్మయు బలిష్ఠమైనిత్యానందము వర్ధిల్లునట్లు ఈయష్టవిధమైథునములనుండి వారిని దూరముగానుంచి గురువులు రక్షింపవలయును. పాఠశాల గ్రామము లేక పట్టణమునుండి ఒక యామడదూరముగ నుండ వలయును. రాజుల బిడ్డలకు దరిద్రులబిడ్డలకు సమానములైన వస్త్రములును, అన్నపానములును, ఆసనములు నీయవలయును. అందఱుతపస్వులుగా నుండవలయును. లౌకికచింతారహితులై కేవలము విద్యయందే ధ్యానముంచవలయును. బిడ్డలు తల్లిదండ్రులనుగాని, తల్లిదండ్రులు బిడ్డలనుగాని కలియగూడదు. పరస్పరము ఉత్తర ప్రత్యుత్తరములు గూడ జరుపఁగూడదు; వారిలో సోమరితనము, అజాగ్రత దుశ్చేష్టలు కలుగకుండు నిమిత్తము విద్యార్థులు వెలుపలతిరుగుటకుఁ బోయినపుడు అధ్యాపకులు వెంటనుండవలయును.

విద్యానాం సంప్రదానం చ కుమారాణాం చ రక్షణమ్॥ మను-అ-౭-శ్లో.౧౫౨॥

అయిదు లేక యెనిమిదేండ్లు వచ్చినవెనుక నెవ్వఁడును దన కొమారునిగాని కొమార్తెనుగాని యింట నుంచుకొన గూడదని రాజనియమమును, జాతినియమమును గావలయును. వారి నవశ్యముగ పాఠశాలకుఁ బంపవలెననియు, అట్లు పంపనివారిని దండింప వలెననియు, ఈశ్లోకాభిప్రాయము. బాలురకు యజ్ఞోపవీతము ఇంటను, బిమ్మటఁ పాఠశాలలో గురుకులమందును జేయవలయును. (బిడ్డలకు తల్లిదండ్రులుగానీ, అధ్యాపకులుగానీ, గాయత్రీ మంత్రము నర్థసహితముగ నుపదేశింప వలయును.)

## గాయత్రీ మంత్రము

ఓం భూర్భువః స్వః తత్స వితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి।
ధియో యో నః ప్రచోదయాత్॥ యజు॰ అ॰ ౩౬। మం॰ ౩॥

ఈ మంత్రమున మొదట(ఓమ్)కలదు. దాని కర్థము ప్రథమ సముల్లాసమునందు వ్రాయఁబడి యున్నది. అక్కడినుండి గ్రహింపుఁడు. ఇక్కడ మూఁడు మహావ్యాహృతుల యర్థము సంక్షేపముగ వ్రాయఁబరును.('భూరితివై ప్రాణః'. 'యః ప్రాణయతి చరాచరం జగత్ స భూః స్వయంభూరీశ్వరః') సమస్తజగత్తునకు జీవనాధారుఁడై, ప్రాణమునకంటె, ప్రియుఁడై స్వయంభు వగుటచేఁ బ్రాణవాచకమగు 'భూః'పరమేశ్వరుని నామము. ('భువరిత్యపానః' యః సర్వం దుఃఖమపానయతి సోఽపానః)తాను సమస్త దుఃఖరహితుఁడయి, తన సంగతిచే జీవులను సమస్త దుఃఖములనుండి విడివడఁ జేయును గనుక బరమేశ్వరునకు 'భువః' అని పేరు. ('స్వరితి వ్యానః' యో వివిధం జగత్ వ్యానయతి వ్యాప్నోతి స వ్యానః) నాన విధమగు జగత్తునందంతట వ్యాపించి యన్నిటిని ధరించియున్నాఁడు కాఁబట్టి పరమేశ్వరునకు 'స్వః' అని పేరు. ఈ మూఁడు వచనములను తైత్తిరీయ ఆరణ్యకపు ౫వ ప్రపాఠకములోని అయిదవ అనువాకమునంద లివి. (సవితుః — 'యః సునోత్యుత్పాదయతి సర్వం జగత్ స సవితా తస్య') సర్వజగ దుత్పాదకుఁడును సమస్తైశ్వర్యము నిచ్చువాఁడును. (దేవస్య:-'యో దీవ్యతి దీవ్యతే వా స దేవః) సమస్త సుఖముల నిచ్చువాఁడును, అందఱిచేత, గామింపఁ బడువాడునగు ఆ పరమేశ్వరుని యొక్క-(వరేణ్యమ్:- వర్తుమర్హమ్) స్వీకరించుటకు యోగ్యమును, అతి శ్రేష్ఠమును(భర్గః-శుద్ధస్వరూపమ్)శుద్ధము, పవిత్రతరమునగు(తత్)అ పరమాత్ముని చేసిన బ్రహ్మస్వరూపమును మేము(ధీమహి-ధరేమహి)ధరింతుముగాక. ఎందుల కనఁగా(యః-జగదీశ్వరః) సవితయు, దేవుడునగు ఆ పరమాత్మ (నః-అస్మాకమ్)మా (ధియః-బుద్ధీః)బుద్ధులను(ప్రచోదయాత్-ప్రేరయేత్)ప్రేరేపించును గాత! అనఁగా దుష్టకార్యములనుండి వదలించి సత్కార్యములయందు బ్రవర్తిల్లఁ జేయును గాత: (పరమేశ్వర! సచ్చిదానంద స్వరూప! నిత్యశుద్ధబుద్ధ ముక్తస్వభావ! అజ నిరంజన నిర్వికార! సర్వాంతర్యామిన్! సర్వాధార! జగత్పతే! సకల జగదుత్పాదక! అనాదే! విశ్వంభర! సర్వవ్యాపిన్! కరుణామృత వారిధే! సవితుర్దేవస్య తవ యదోం భూర్భువః స్వర్వరేణ్యం భర్గోఽస్తి తద్వయం ధీమహిధరేమహి ధ్యాయేమ వా. కస్మై ప్రయోజనాయేత్యత్రాహ: హే భగవన్! యః సవితాదేవః పరమేశ్వరో భవానస్మాకం ధియః ప్రచోదయాత్ స

ఏవాస్మాకం పూజ్య ఉపాసనీయ ఇష్టదేవో భవతు నాతోన్యం భవత్తుల్యం భవతోఽధికం చ కంచిత్ కదాచిన్మన్యామహే') మనుష్యులారా! మన ఆత్మలకు బుద్ధులకు సంతర్యామి యగుటచే మనలను దుష్టాచారముల నుండి అధర్మ మార్గమునుండి తొలగించి శ్రేష్ఠాచారమందు, సత్యమార్గమందు బ్రవర్తింపఁ జేయుటకు సమర్థులలో సమర్థుడును, సచ్చిదానంద స్వరూపుఁడును, నిత్యశుద్ధ బుద్ధ ముక్తస్వభావుఁడును, కృపా సాగరుఁడును, చక్కఁగ న్యాయము చేయువాఁడును, జన్మమరణాది క్లేశరహితుఁడును, ఆకార రహితుఁడును, సమస్తముఁ దెలియువాఁడును, అన్నిటినుత్పన్నము చేసి ధరించు తండ్రియు, అన్నిటులచే విశ్వమును పోషించు వాఁడును, సకలైశ్వర్య యుక్తుఁడును, జగన్నిర్మాతయు, శుద్ధస్వరూపుఁడును,పొందఁగా మించుటకు యోగ్యుఁడును, శుద్ధమైతన్య స్వరూపుఁడునగు ఆ పరమాత్మను మనము ధరింతుముగాక! అతనితో సమానుఁడుకాని అతనికంటె నధికుఁడుగాని లేఁడు కాఁబట్టి అతఁడే తండ్రి, అతఁడే రాజు, అతఁడే న్యాయాధీశుఁడు. సమస్త సుఖముల నిచ్చువాఁడు. అతనిని వదలి యితర వస్తువును ధ్యానింప కుందురు గాక!

ఈ రీతి గాయత్రీ మంత్రము నుపదేశించి సంధ్యోపాసనలకు సంబంధించిన స్నాన ఆచమన ప్రాణాయామాది క్రియలను నేర్పవలయును. శరీర బాహ్యావయవముల శుద్ధిచేత నారోగ్యాదులు గలుగుచున్నవి కాఁబట్టి మొదట స్నానము చెప్పఁబడినది.

అద్భిర్గాత్రాణి శుద్ధ్యంతి మనః సత్యేన శుద్ధ్యతి ।
విద్యాతపోభ్యాం భూతాత్మా బుద్ధిర్ జ్ఞానేన శుద్ధ్యతి॥ మను అ.౫। శ్లో-౧౦౯॥

నీటిచే శరీర బాహ్యావయవములు, సత్యాచరణముచే మనస్సు, అన్ని విధముల కష్టములకోర్చి ధర్మమునే యనుష్ఠించుటచేత జీవాత్మ, జ్ఞానముచేత-పృథివి మొదలుకొని పరమేశ్వర పర్యంతముగల పదార్థముల వివేకముచే దృఢనిశ్చయము- బుద్ధియు పవిత్రములగు చున్నవి. కాబట్టి స్నానము భోజనమునకుఁ బూర్వమవశ్యముగఁ జేయవలయును.

యోగాంగానుష్ఠానాదశుద్ధిక్షయే జ్ఞానదీప్తిరా వివేకఖ్యాతేః ॥
(యోగ. సాధనపాదము. సూ। ౨౮)

మనుష్యుఁడు ప్రాణాయామము చేయఁ దొడఁగగానే ప్రతిక్షణము ఉత్త రోత్తర కాలమున- అశుద్ధి నశించుచు జ్ఞానము ప్రకాశింపసాగును. ముక్తిని బొందువఱకు నతనిజ్ఞానము నిరాటంకముగ వర్ధిల్లుచుండును.

దహ్యంతే ధ్మాయమానానాం ధాతూనాం హి యథా మలాః ।
తథేంద్రియాణాం దహ్యంతే దోషాః ప్రాణస్య నిగ్రహాత్॥ మను॥౬-౭౧॥

అగ్నియందు గాచుటచే సువర్ణాది ధాతువుల యొక్క- మలము నష్టమై పరిశుద్ధమగుచున్నట్లు ప్రాణాయామ మొనరించుటచే మనస్సు మొదలగు ఇంద్రియముల దోషములు క్షీణించి నిర్మలమగుచున్నవి.

## ప్రాణాయామవిధి

ప్రచ్ఛర్దనవిధారణాభ్యాం వా ప్రాణస్య॥యోగ-సమాధిపాదము. సూ. ౩४॥

వమనమం దత్యంతవేగముగ నన్నజలములఁ గ్రక్కు-నట్లు ప్రాణవాయువును మిక్కి-లి బలముతో వెలుపలికి వదలి శక్తికొలఁది వెలుపలనే ఆపవలయును. వెలుపలికి వాయువును వదలునపుడు మూలేంద్రియమును పైకాకర్షింపవలయును. అట్లుండువఱకుఁ బ్రాణవాయువు వెలుపలనే యుండును. ఇవ్విధముగనే ప్రాణవాయువు వెలుపల నెక్కు-వసేపు నిలువఁగలదు. కష్టముగాఁ దోఁచినపుడు మెల్లమెల్లగా లోపలికి వాయువును పీల్చుకొని మరలనట్లే శక్తికొలఁది యొచ్చుకొలఁది చేయుచుండవలయును. అప్పుడు మనస్సునందు (ఓమ్) అని * జపించుచుండవలయును. ఈ ప్రకారము చేయుటచే నాత్మయు మనస్సును బవిత్రములై స్థైర్యమునుబొందును.

ప్రాణాయామము నాల్గు విధములు :— మొదటిది 'బాహ్యవిషయము' అనఁగా వాయువును వెలుపల నధికముగా నాఁపుట. రెండవది 'అభ్యంతరము' అనఁగా లోపల ఆపఁజాలినంత ప్రాణవాయువు నాఁపుట. మూడవది 'స్తంభవృత్తి' అనఁగా ఉన్నదున్నట్లు నెక్కు-డివాయువు నక్కు-డ శక్తికొలఁది నాఁపుట. నాల్గవది 'బాహ్యాభ్యంతరాక్షేపి' అనఁగాఁ బ్రాణవాయువు వెలుపలికి రాఁదొడఁగినపుడు దాని నాపుటకుఁ దద్విరుద్ధముగ వెలుపలనుండి వాయువును లోపలికిఁ బీల్చవలయును; వెలుపలినుండి లోపలికి రాదొడగినపుడు లోపలినుండి వెలుప

* జపమనఁగా అర్థవిచారము.

లికి ప్రాణవాయువును ద్రోసియాఁపవలయును. ఇట్లు అన్యోన్య విరుద్ధక్రియలు చేయుటచే రెంటియొక్కగతి ఆఁగి ప్రాణము వశమగుచున్నది. దీనివలన మనస్సును, ఇంద్రియములును స్వాధీనములై బలమును బురుషార్థమును వర్ధిల్లి, బుద్ధి తీవ్రమును సూక్ష్మమునయి మిక్కిలి కఠినమును సూక్ష్మమునగు విషయమునుగూడ త్వరలో గ్రహింపఁ గలుగును. దీనివలన శరీరమందు వీర్యము వర్ధిల్లును. స్థిరమైన బలపరాక్రమములు, జితేంద్రియత్వముగలిగి సమస్త శాస్త్రములం స్వల్ప కాలములోనే నేర్చి మరువకుండునట్లు చేసికొనఁగలరు. స్త్రీయు నిదేరీతి యోగాభ్యాసము చేయవలయును. పిమ్మట భోజనము, వస్త్రధారణము, లేచుట, కూర్చుండుట; మాటలాడుట, చరించుట, పెద్దలతోఁ జిన్నలతోఁ దగినట్లు వర్తించుట అను వీనిఁగూర్చి యుపదేశింప వలయును.

సంధ్యోపాసన:—దీనిని బ్రహ్మయజ్ఞ మనియు నందురు. ఆచమనము:- కంఠమునుండి హృదయమువఱకుఁ దడుపునంత మాత్రమే నీటిని అఱచేతిలోఁ బోసికొని, అఱచేతి మొదటను నడుమను పెదవులనుంచి పీల్చవలయు. దీనివలనఁ గంఠమునందలి కఫమును, పిత్తమును గొంత నివర్తించును. పిమ్మట 'మార్జనము' అనగా నడిమివ్రేలు అనామిక (ఉంగరపు వ్రేలు) కొనలతో నీటిని గన్నులు మొదలగు నంగములమీఁద జల్లుకొనుట. దీనివలన బద్ధకము దూరమగును. బద్ధకముగాని, నీరుగాని లేనపుడు దీనిఁజేయ నవసరములేదు. పిమ్మట మంత్రపూర్వకముగఁ బ్రాణాయామమును, మనసా పరిక్రమమును, ఉపస్థానమును దరువాతఁ బరమేశ్వరుని స్తుతి ప్రార్థనోపాసనలరీతియు నేర్పవలయును. అఘమర్షణము - పాప మొనరించు నిచ్ఛయే కూడదు. ఈ సంధ్యోపాసన మేకాంతమందేకాగ్ర చిత్తములోఁ జేయవలయును.

అపాం సమీపే నియతో నైత్యకం విధిమాస్థితః ।
సావిత్రీమప్యధీయీత గత్వారణ్యం సమాహితః ॥ మను. ౨-౧౦౪॥

అడవియం దేకాంతదేశమందు సావధానులై జలసమీపమునఁగూర్చుండి నిత్యకర్మ మొనర్చుచు సావిత్రి-గాయత్రీ మంత్రము నుచ్చరించుచు అర్థమును గుర్తెఱుంగుచు దాని ననుసరించి నడువ వలయును. ఈ జపము మనసుతో చేయుట యుత్తమము.

లికి ప్రాణవాయువును ద్రోపియాఁపవలయును. ఇట్లు అన్యోన్య విరుద్ధక్రియలు చేయుటచే రెంటియొక్కగతి ఆఁగి ప్రాణము వశమగుచున్నది. దీనివలన మనస్సును, ఇంద్రియములును స్వాధీనములై బలమును బురుషార్థమును వర్ధిల్లి, బుద్ధి తీవ్రమును సూక్ష్మమునయి మిక్కిలి కఠినమును సూక్ష్మమునగు విషయమునుగూడ త్వరలో గ్రహింపఁ గలుగును. దీనివలన శరీరమందు వీర్యము వర్ధిల్లును. స్థిరమైన బలపరాక్రమములు, జితేంద్రియత్వముగలిగి సమస్త శాస్త్రములం స్వల్ప కాలములోనే నేర్చి మరువకుండునట్లు చేసికొనఁగలఁడు. స్త్రీయు నిదేరీతి యోగాభ్యాసము చేయువలయును. పిమ్మట భోజనము, వస్త్రధారణము, లేచుట, కూర్చుండుట; మాటలాడుట, చరించుట, పెద్దలతోఁ జిన్నలతోఁ దగినట్లు వర్తించుట అను వీనిఁగూర్చి యుపదేశింప వలయును.

సంధ్యోపాసన:–దీనిని బ్రహ్మయజ్ఞ మనియు నందురు. అచమనము:- కంఠమునుండి హృదయమువఱకుఁ దడుపునంత మాత్రమే నీటిని అఱచేతిలోఁ దీసికొని, అఱచేతి మొదటను నడుమనుబెదవులనుంచి పీల్వవలయు, దీనివలనఁ గంఠమునందలి కఫమును, పిత్తమును గొంత నివర్తించును. పిమ్మట 'మార్జనము' అనగా నడిమివ్రేలు అనామిక (ఉంగరపు వ్రేలు) కొనలతో నీటిని గన్నులు మొదలగు నంగములమీఁద జల్లుకొనుట. దీనివలన బద్ధకము దూరమగును. బద్ధకముగాని, నీరుగాని లేనపుడు దీనిఁజేయ నవసరములేదు. పిమ్మట మంత్రపూర్వకముగఁ బ్రాణాయామమును, మనసా పరిక్రమమును, ఉపస్థానమును దరువాతఁ బరమేశ్వరుని స్తుతి ప్రార్థనోపాసనంరీతియు నేర్పవలయును. అఘమర్షణము - పాప మొనరించు నిచ్ఛయే కూడదు. ఈ సంధ్యోపాసన మేకాంతమందేకాగ్ర చిత్తముతోఁ జేయవలయును.

అపాం సమీపే నియతో నైత్యకం విధిమాస్థితః ।
సావిత్రీమప్యధీయీత గత్వారణ్యం సమాహితః ॥ మను.౨-౧౦౪॥

అరివియం దేకాంతదేశమందు సావధానులై జలసమీపమునఁగూర్చుండి నిత్యకర్మ మొనర్చుచు సావిత్రి-గాయత్రీ మంత్రము నుచ్చరించుచు అర్థమును గుర్తెఱుంగుచు దాని ననుసరించి నడువ వలయును. ఈ జపము మనసుతో చేయుట యుత్తమము.

పిమ్మట నాకాఁచిన నేతిని బాగుగఁ జూచి ఈ మంత్రములతో హోమము చేయ వలయును.

ఓం భూరగ్నయే ప్రాణాయ స్వాహా ॥ భువర్వాయవేఽపానాయ స్వాహా ॥
స్వరాదిత్యాయ వ్యానాయ స్వాహా ॥ భూర్భువః స్వరగ్ని ర్వాయ్వాదిత్యేభ్యః ।
ప్రాణాపానవ్యానేభ్యః స్వాహా॥

మున్నగు ఒక్కొక్క అగ్నిహోత్ర మంత్రము నుచ్చరించుచు నొక్కొక్క ఆహుతి నీయవలయును. ఎక్కువగ నాహుతు లీయవలయునేని :—

విశ్వానిదేవ సవితర్దురితాని పరాసువ యద్భద్రం తన్న ఆసువ॥యజు॥౩౦-౩॥

ఈమంత్రము చేతను, బూర్వోక్తమైన గాయత్రీ మంత్రము చేతను ఆహుతు లీయవలయును. 'ఓం' 'భూః' 'ప్రాణః' ఈ మొదలగు నామము లన్నియుఁ బరమేశ్వరునివే. వీని అర్థమునుఁ జెప్పఁబడినది. స్వాహాయనఁగా ఆత్మయందలి జ్ఞానము నున్నదున్నట్లు తెలుపుట. సమస్త ప్రాణుల సుఖము కొఱకు జగత్తునందలి సమస్త పదార్థములను బరమేశ్వరుఁడు రచించినట్లు మనుష్యులును బరోపకార మొనర్పవలయును.

ప్రశ్న:— హోమమువలన నేమి లాభము ?

ఉత్తరము:— దుర్గంధ యుక్తమగు జలవాయువుల వలన రోగమును, రోగములవలన ప్రాణులకు దుఃఖము కలుగుచున్న దనియు, సుగంధయుక్తమైన జలవాయువులవలన ఆరోగ్యమును, ఆరోగ్యమువలన సుఖముగలుగు చున్నదనియు నందఱకుఁ దెలియునుగద.

ప్రశ్న:— గంధముఱుగఁదీసి యితరులకుఁ బూయుటచేతను, వృతాదు లను భుజింప నిచ్చుటచేతను మిక్కిలి ఉపకార మగును; నిప్పులోఁబోసి వృథాగా పాడుచేయుట బుద్ధిమంతుల పనికాదు.

ఉత్తరము:— పదార్థ విజ్ఞానము దెలిసియుండిన మీరిట్లు చెప్పియుండరు. ఏలయనఁగా నే ద్రవ్యమును అభావము గాఁజాలదు. హోమము జేయుచుండు నపుడు చూడుఁడు; దూరముగా నుండు పురుషులు తమ ముక్కులతో సుగంధ మును పీల్చుచుందురు. కాఁబట్టి అగ్నియందు వేయఁబడిన పదార్థము సూక్ష్మమై, వాయువుతోఁ గలసి, దూరము వ్యాపించి దుర్గంధమును నివర్తింపఁ జేయు చున్నదని తెలియుఁడు.

ప్రశ్న:— అలాగేని కుంకుమపూవు, కస్తూరి, పరిమళ యుక్తములగు పుష్పములు, అత్తరువు మొదలగు వానిని ఇండ్లయం దుంచుటచే వాయువు సుగంధ యుక్తమై సుఖకారక మగుచున్నదిగదా.

ఉత్తరము:— ఇట్టి సుగంధమునకు గృహము నందుండు వాయువును వెలివఱచి, శుద్ధవాయువును లోనఁ బ్రవేశింపఁజేయు సామర్థ్యము లేదు. ఏల యనఁగా ఈ సుగంధమందు భేదకశక్తి లేదు. వాయువును, దుర్గంధపదార్థములను వేఱుచేసి తేలికపఱచి వెలుపలికి వెడలఁగొట్టి పవిత్రమైన వాయువును ప్రవేశింపఁజేయు సామర్థ్య మగ్నియందే యున్నది.

ప్రశ్న:— సరియే కాని మంత్రములను జదువుచు హోమము చేయుటచే నేమి ప్రయోజనము ?

ఉత్తరము:— ఆ మంత్రములలో హోమలాభములను విశదపఱచు వ్యాఖ్యానమున్నది. మంత్రములను వల్లించుటచే నవి గంఠస్థమగు చున్నవి. వేదముల పఠనపాఠవములును, రక్షణము నగుచున్నవి.

ప్రశ్న:— హోమముచేయకున్నఁ బాపము కలుగునా ?

ఉత్తరము :— కలుగును. ఏలయనఁగా— ఏ మనుష్యుని శరీరమునుండి యెంత దుర్గంధ ముత్పన్నమయి వాయు జలములను జెడిపి రోగోత్పత్తికి నిమిత్తమై ప్రాణుల కెంత దుఃఖమును గలిగించునో అంత పాపమా మనుష్యునకుఁ గలుగుచున్నది. కాఁబట్టి ఆ పాపనివారణార్థమై అంత కాని, అంతకంటె నధికముగఁ గాని సుగంధమును వాయు జలములందు వ్యాపింపఁ జేయవలయును. కాని ఒకఁడు తినఁగలిగిన నేతిని, సుగంధ పదార్థములను హోమము చేయుటచే లక్షలకొలఁది మనుష్యుల కుపకారమగుచున్నది. అవి యొక్కఁడనుభవించినచో నా యొక్కనికే సుఖము కలుగును. (ఘృతము మొదలగు ఉత్తమ పదార్థములను దినకున్న మనుష్యుల యొక్క శరీరాత్మల బలము వృద్ధిఁ బొందదు. కాఁబట్టి మంచిపదార్థములను దినిపింప వలయును; త్రావింప వలయును;) కాని, అంతకంటె నెక్కువగ హోమ మొనర్చుట యుచితము. కాన హోమ మొనర్చుట యుచితము. కాన హోమము చేయుట యత్యావశ్యకము.

ప్రశ్న:— ప్రతి మనుష్యుఁడు ఎన్ని ఆహుతు లీయ వలయును ?

[illegible]

ఉత్తరము:— ప్రతి మనుష్యుఁడు పదునాఱాహుతు లీయవలయును. నేయి మొదలయిన వానితోఁ గూడిన ప్రతి ఆహుతి కనీసమారు మాషల (అరతులము) యెత్తుండవలయును. ఇంతకంటె నధికముగాఁ జేసిన మఱింత మంచిది. కాఁబట్టియే ఆర్యవరశిరోమణులగు మహాశయులును, ఋషులును, మహర్షులును, రాజులును, మహారాజులును, విశేషముగ హోమములను జేయుచును, జేయించుచునుండిరి. ఈ హోమముల జేయు ప్రచారముండువఱకు ఆర్యావర్తదేశము రోగరహితమై, సుఖపూరితమై యుండెను. ఇప్పుడును హోమప్రచారము కలిగెనేని యట్లే కాఁగలదు.

ఈ రెంటిలో నొకటి " బ్రహ్మ యజ్ఞము " అనఁగా చదువుట, చదివించుట, ఈశ్వరస్తుతి ప్రార్థనోపాసనా రూపమగు సంధ్యోపాసన చేయుట. రెండవది "దేవయజ్ఞము" అనఁగా అగ్నిహోత్రము మొదలుకొని అశ్వమేధపర్యంతరములగు యజ్ఞము లొనర్చుట; విద్వాంసులను సేవించుట; వారితో సంగతి సేయుట. కాని బ్రహ్మచర్యములోఁ గేవలము బ్రహ్మయజ్ఞమును, అగ్నిహోత్రమును జేయనగును.

> బ్రాహ్మణస్త్రయాణాం వర్ణానా ముపనయనం కర్తుమర్హతి । రాజన్యో
> ద్వయస్య । వైశ్యో వైశ్యస్యైవేతి । శూద్రమపి కులగుణ సంపన్నం
> మంత్రవర్జ మనుపనీత మధ్యాపయే దిత్యేకే॥

ఇది సుశ్రుత సూత్రస్థాన మందలి ద్వితీయాధ్యాయపు వచనము. బ్రాహ్మణుఁడు మూడువర్ణముల కనఁగా బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకును, క్షత్రియుఁడు క్షత్రియ వైశ్యులకును, వైశ్యుఁడు వైశ్యవర్ణమునకును యజ్ఞోపవీత మొసంగి చదివింపనగును. శూద్రుఁడు కులీనుఁడును శుభలక్షణ యుక్తుఁడయ్యెనేని అతనిని మంత్ర సంహితను వదలి తక్కిన సమస్త శాస్త్రములను జదివింప వచ్చును. శూద్రుఁడు చదువనువచ్చును. కాని అతని కుపనయనము చేయఁగూడదని అనేకాచార్యుల మతము. ఈయుపనయనవిధి పిమ్మట అయిదవ లేక యెనిమిదవయేఁట మగబిడ్డలు తమతమ పాఠశాలలకును ఆడుబిడ్డలు తమతమ పాఠశాలలకును బోయి యీ క్రిందిరీతిని నియమ పూర్వకముగ నధ్యయనము చేయుట ప్రారంభింప వలయును:—

షట్త్రింశదాబ్దికం చర్యం గురౌ త్రైవేదికం వ్రతమ్ ।
తదర్ధికం పాదికం వా గ్రహణాంతిక మేవ వా ॥ మను. ౩-౧॥

ఎనిమిదేండ్ల వయస్సునుండి ముప్పది యాఱేండ్లు- ఒక్కొక్క వేదమును సాంగోపాంగముగఁ జదువుటకు పన్రెండేండ్ల చొప్పున మూఁడు వేదములకు- ఎనిమిదేండ్లను గలసి నలుబది నాల్గేండ్ల వఱకుఁ గాని, పదునెనిమిదేండ్ల బ్రహ్మచర్యమును మొదటి ఎనిమిదేండ్లను గలపి యిరువదియాఱేండ్ల వఱకుఁగాని, తొమ్మిదేండ్లుగాని, విద్యపూర్తిగా గ్రహించువఱకు గాని బ్రహ్మచర్య మొందవలయును.

పురుషో వావ యజ్ఞస్తస్య యాని చతుర్విగ్ంశతివర్షాణి తత్ప్రాతః సవనం, చతుర్విగ్ంశత్యక్షరా గాయత్రీ గాయత్రం ప్రాతఃసవనం, తదస్య వసవోఽన్వాయత్తాః ప్రాణా వావ వసవ ఏతే హీదగ్ం సర్వం వాసయంతి ॥౧॥
తంచేదేతస్మిన్ వయసి కించిదుపతపేత్స బ్రూయాత్ప్రాణా వసవ ఇదం మే ప్రాతః సవనం మాధ్యందినగ్ం సవనమనుసంతనుతేతి మాహం ప్రాణానాం వసూనాం మధ్యే యజ్ఞో విలోప్సీయేత్యుద్ధైవ తత ఏత్యగదో హ భవతి ॥౨॥

అథ యాని చతుశ్చత్వారిగ్ంశద్వర్షాణి తన్మాధ్యందినగ్ం సవనం చతుశ్చత్వారిగ్ంశదక్షరా త్రిష్టుప్త్రైష్టుభం మాధ్యందినగ్ం సవనం తదస్య రుద్రా అన్వాయత్తాః ప్రాణా వావ రుద్రా ఏతే హీదగ్ం సర్వం రోదయంతి ॥౩॥
తంచే దేతస్మిన్ వయసి కించిదుపతపేత్స బ్రూయాత్ప్రాణా రుద్రా ఇదం మే మాధ్యందినగ్ం సవనం, తృతీయసవన మనుసంతనుతేతి మాహం ప్రాణానాగ్ం రుద్రాణాం మధ్యే యజ్ఞో విలోప్సీయేత్యుద్ధైవ తత ఏత్యగదో హ భవతి ॥౪॥

అథ యాన్యష్టాచత్వారిగ్ంశద్వర్షాణి తత్తృతీయసవన మష్టాచత్వారింగ్ంశదక్షరా జగతీ జాగతం తృతీయసవనం తదస్యాదిత్యా అన్వాయత్తాః ప్రాణా వావాదిత్యా ఏతే హీదగ్ం సర్వమాదదతే ॥౫॥
తంచేదేతస్మిన్ వయసి కించిదుపతపేత్స బ్రూయాత్ప్రాణా ఆదిత్యా ఇదం మే తృతీయసవన మాయు రనుసంతనుతేతి మాహం ప్రాణానా మాదిత్యానాం మధ్యే యజ్ఞో విలోప్సీయేత్యుద్ధైవ తత ఏత్యగదో హైవ భవతి ॥౬॥

ఇవి ఛాందోగ్యోపనిషత్తు ౩ వ ప్రపాఠకమునందలి ౧౬ వ ఖండము లోని వచనములు. బ్రహ్మచర్యము:— కనిష్ఠము మధ్యమము ఉత్తమము నని

మూడువిధములు. అందుఁ గనిష్ఠము— పురుషుఁడు- అన్నరసమయ మైన పురి అను దేహమునందు శయనించు జీవాత్మ. ఈజీవాత్మయజ్ఞుఁడు. అనఁగా అత్యంత శుభగుణములతో. సత్కర్తవ్యములతో యుక్తుఁడు కాఁదగును. ఇతడు ౨౪ ఏండ్ల పర్యంతము జితేంద్రియుఁడు- బ్రహ్మచారిగా- నుండి వేదాది విద్యను. సుశిక్షను గ్రహించి వివాహము చేసి కొన్నను లంపటుఁడు గాకుండిన ఇతని శరీరమందుఁ బ్రాణములు బలము కలవై సమస్త శుభగుణములను వసింపఁ జేయును.॥౧॥ ఈ ప్రథమవయస్సున నతనిని విద్యాభ్యాసమందు సంతప్తపఱచు నాచార్యుఁడు నిట్లే ఉపదేశింపవలయును. బ్రహ్మచారియు తాను ప్రథమవయస్సు నందు సరియైన బ్రహ్మచారిగా నుండిన తన శరీరాత్మలు బలారోగ్యములఁబొంది ప్రాణములు శుభగుణములను వసింపఁజేయును. అని నిశ్చయించుకొన వలెను. మనుష్యులారా: మీరును ఇట్లే సుఖమును విస్తరింపఁ జేసికొనుఁడు. ౨౪ఏండ్ల వఱకు బ్రహ్మచర్యమును లోపముచేయక పిమ్మట గృహాశ్రమము స్వీకరించితి రేని రోగరహితులరై ౪౦, ౮౦ ఏండ్ల ప్రాయమువఱకు జీవించి యుండగల రని యితరుల కుపదేశింపవలయును. ॥౨॥

మధ్యమ బ్రహ్మచర్యము:—౪౪ ఏండ్ల పర్యంతము బ్రహ్మచారిగా నుండి వేదాభ్యాసము చేయునతని ప్రాణేంద్రియాంతఃకరణములును. ఆత్మయు బలయుక్తములై అతఁడు దుష్టులందఱి నేడ్పించుచు శిష్టులను పాలించు వాఁడగునని ఆచార్యుఁడుపదేశింపవలయును.॥౩॥ "నేను ఈ ప్రథమవయస్సునందుఁ గొంత తపశ్చర్యచేయుదునేని నారుద్రరూప ప్రాణయుక్తమగు మధ్యమ బ్రహ్మచర్యము సిద్ధించునని బ్రహ్మచారి నిశ్చయించుకొని బ్రహ్మచారులారా! మీరు ఈబ్రహ్మచర్యమును వృద్ధిచేయుఁడు. నేనెట్లు బ్రహ్మచర్యమును లోపముచేయక యజ్ఞరూపుఁడనై గురుకులమునుండి వచ్చి రోగరహితుఁడనయి సత్కార్యము లొనర్తునో అట్లుమీరును జేయుఁ"డని తోడిబ్రహ్మచారుల కుపదేశింపవలయును. ఇది మధ్యమ బ్రహ్మచర్యము. ॥౪॥

ఉత్తమ బ్రహ్మచర్యము :— ౪౮ అక్షరముల జగతీ ఛందస్సువలె ౪౮ ఏండ్ల పర్యంతము సరియైన బ్రహ్మచర్య మొనర్చునతనికి ప్రాణ మనుకూలమయి యతఁడు సమస్త విద్యలను గ్రహించును. ॥౫॥ ఆచార్యుఁడును దల్లియు

దంౘ్రియు దమ బిడ్డలకు ప్రథమ వయస్సునందు విద్యానుగుణము లలవరు నట్లుపదేశము చేయవలయును. వారుకూడ మూఁడవదగు నీయుత్తమ బ్రహ్మ చర్యమును సేవించి పూర్ణాయుష్మను, అనఁగా నాలుగువందల సంవత్సరముల యాయువు నెట్లు వృద్ధిపఱుపఁ గలుగుదురో మీరుగూడ నట్లే వృద్ధి పఱుచు కొనుఁడు. బ్రహ్మచర్యమును లోపము చేయనినవారు రోగము నెఱుఁగక ధర్మార్థ కామమోక్షములను బొందుదురు. ॥౬॥

> చత్వారోఽవస్థాః శరీరస్య వృద్ధిర్యౌవనం సంపూర్ణతా కించిత్పరిహాణిశ్చేతి।
> ఆ షోడశాద్వృద్ధిః । ఆ పంచవింశతేర్యౌవనం।
> ఆ చత్వారింశతః సంపూర్ణతా। తతః కించిత్పరిహాణిశ్చేతి॥
> పంచవింశే తతో వర్షే పుమాన్ నారీ తు షోడశే।
> సమత్వాగతవీర్యౌ తౌ జానీయాత్కుశలో భిషక్॥

ఇది సుశ్రుత సూత్రస్థానపు ౩౫ వ అధ్యాయమందలి వచనము. శరీరమునకు నాలుగవస్థలు:— మొదటిది:- (వృద్ధి) ఇది పదునాఱవ యేఁడు మొదలుకొని ఇరువది యైదవ యేఁటి పర్యంతము. ఇందు ధాతువులన్నియు వృద్ధి పొందును. రెండవది:—(యౌవనము) ఇది ఇరువదియైదవ యేఁటి అంతమున ఇరువదియాఱవయేఁటి మొదట ప్రారంభమగును. మూఁడవది:- (సంపూర్ణతా) ఇది ౨౫ ఇరువది యైదవయేడు మొదలుకొని నలువది యేండ్లవఱకు నుండును. ఇందు ధాతువు లన్నియుఁ బుష్టినొందును. నాల్గవది:—(కించిత్పరిహాణిః)సాంగో పాంగముగ శరీరమందలి సమస్త ధాతువులకుఁబుష్టియు పూర్ణత్వమును గలి గినపిదప వృద్ధియగు ధాతువు శరీరమందుండదు. స్వప్నమందో చెమట మొద లగువాని మూలముననో వెలుపలికి వచ్చితీరును. ఈ నలువదియవ సంవత్సరమే వివాహమునకు నుత్తమ నమయము. అనఁగా నలువది యెనిమిదవయేట వివాహము చేసికొనుట యుత్తమోత్తమము.

ప్రశ్న:— ఈ బ్రహ్మచర్య నియమము స్త్రీ పురుష బిడ్డలకు సమానమా,

ఉత్తరము:— కాదు; పురుషుఁడు ౨౫ ఏండ్లవఱకు బ్రహ్మచర్యము పాలించిన స్త్రీ ౧౬ సంవత్సరముల వఱకు బ్రహ్మచారిణిగా నుండ వలయును. పురుషుఁడు ౩౦ ఏండ్లవఱకుండిన స్త్రీ ౧౭ ఏండ్లవఱకును, పురుషుడు ౩౬

ఏండ్లవఱకుండిన స్త్రీ ౧౮ ఏండ్లవఱకును, పురుషుడు ౪౦ ఏండ్లవఱకు నుండిన స్త్రీ ౨౦ ఏండ్లవఱకును, పురుషుఁడు ౪౪ ఏండ్లవఱకు బ్రహ్మచారిగా నుండిన స్త్రీ ౨౨ ఏండ్లును, పురుషుఁడు ౪౮ ఏండ్ల బ్రహ్మచర్యము చేసిన స్త్రీ ౨౪ ఏండ్ల పర్యంతమును బ్రహ్మచర్య సేవన చేయవలయును. అనఁగా ౪౮ ఏండ్లఁమీదఁ బురుషుఁడును ౨౪ ఏండ్లమీద స్త్రీయును బ్రహ్మచర్యము పాలింపరాదు; కాని; ఈ నియమము వివాహము చేసికొను స్త్రీపురుషులకే. వివాహము కోరనివారు మరణ పర్యంతము బ్రహ్మచారులుగా నుండగలిగి రేని సంతోషముగా నుండవచ్చును. కాని యీపని పూర్ణ విద్వాంసులును, జితేంద్రియులును, నిర్దోషులు,యోగులునగు స్త్రీ పురుషుల చేయవలసినది. కామవేగము నాఁపి యింద్రియములను దమవశమునందుంచుకొనుట మిక్కిలి కఠినము.

> ఋతం చ స్వాధ్యాయ ప్రవచనే చ। సత్యం చ స్వాధ్యాయ ప్రవచనే చ।
> తపశ్చ స్వాధ్యాయప్రవచనే చ। దమశ్చ స్వాధ్యాయప్రవచనే చ। శమశ్చ
> స్వాధ్యాయ ప్రవచనే చ। అగ్నయశ్చ స్వాధ్యాయప్రవచనే చ। అగ్ని
> హోత్రంచ స్వాధ్యాయప్రవచనే చ। అతిథయశ్చ స్వాధ్యాయప్రవచనే చ।
> మానుషం చ స్వాధ్యాయప్రవచనే చ। ప్రజా చ స్వాధ్యాయప్రవచనే చ।
> ప్రజనశ్చ స్వాధ్యాయప్రవచనే చ। ప్రజాతిశ్చ స్వాధ్యాయప్రవచనే చ॥
>
> ఇది తైత్తిరీయోపనిషత్తు[౭-వ ప్రపా ౯-వ అను]నందలివచనము.

ఇవి విద్యార్థుల-గురువుల నియమములు:—

(ఋతం...) యథార్థమైన ఆచరణలోఁ జదువుచుఁ జదివించుచు నుండవలయును.

(సత్యం...) సత్యాచారముతో సత్యవిద్యలను జదువుచుఁ జదివించుచు నుండవలయును.

(తపః...) తపస్వి-ధర్మానుష్ఠాన మొనర్చుచు వేదాది శాస్త్రములను జదువుచుఁ జదివించుచు నుండవలయును.

(దమః...) బాహ్యేంద్రియములను దుష్టాచారములనుండి తొలఁగించి చదువుచుఁ జదివించుచు నుండవలయును.

(శమః...) మనోవృత్తిని సమస్తదోషములనుండి తొలఁగించి చదువుచుఁ జదివించుచు నుండవలయును.

(అగ్నయః...) ఆహవనీయాద్యగ్నులను, విద్యుత్తు మొదలగు నగ్నులను ఎఱుంగుచుఁ జదువుచుఁ జదివించుచు నుండవలయును.

(అగ్ని హోత్రం...) అగ్నిహోత్రము చేయుచుఁ జదువుచుఁ జదివించుచు నుండవలయును.

(అతిథయః...)అతిథుల సేవచేయుచుఁ జదువుచుఁ జదివించుచు నుండవలయును.

(మానుషం ...) మనుష్య సంబంధమగు వ్యవహారములను యథా యోగ్యముగఁ జేయుచుఁ జదువుచుఁ జదివించుచు నుండవలయును.

(ప్రజా...) సంతానమును, రాజ్యమును బాలించుచుఁ జదువుచు జదివించుచు నుండవలయును.

(ప్రజన...) వీర్యమును రక్షించుచు, వృద్ధిపఱచుచు చదువుచుఁ జదివించుచు నుండవలయును.

(ప్రజాతి...) తమ సంతానమును శిష్యులను బాలించుచుఁ జదువుచుఁ జదివించుచు నుండవలయును.

యమాన్ సేవేత సతతం న నియమాన్ కేవలాన్ బుధః ।
యమాన్ పతత్యకుర్వాణో నియమాన్ కేవలాన్ భజన్॥ మను అ.౪-౨౦౪॥

యమములు ౫ విధములు.

తత్రాహింసా సత్యాస్తేయ బ్రహ్మచర్యాపరిగ్రహా యమాః ॥యోగ-సాధ-౩౦॥

(అహింసా) వైరత్యాగము, (సత్యం) సత్యమే నమ్ముట, సత్యమే చెప్పుట సత్యమేచేయుట (అస్తేయం) మనోవాక్కాయములచే చౌర్యము చేయకుండుట (బ్రహ్మచర్యం) ఉపస్థేంద్రియ సంయమము (అపరిగ్రహః)లోభము పూర్తిగ వదలి స్వత్వాభిమాన రహితుఁడగుట. ఈ యయిదు యమములను సర్వదా సేవింపవలయును,

ఇఁక నియమములు-అనఁగా :—

శౌచసంతోషతపః స్వాధ్యాయేశ్వర ప్రణిధానాని నియమాః ॥
యోగ-సాధనపాదము సూ-౩౨॥

(శౌచః) స్నానాదులచేఁ బవిత్రత, (సంతోషం) ప్రసన్నుఁడై సోమరిగ నుండక శక్తికొలఁది పురుషార్థముచేయుచు హాని లాభములయందు శోక హర్షములు లేకుండుట, (తపః) కష్టములకోర్చియు ధర్మానుకూలములగు కార్యము లనుష్ఠించుట, (స్వాధ్యాయః) చదువుట చదివించుట, (ఈశ్వర ప్రణిధానం) ఈశ్వరునియందలి భక్తివిశేషముచే ఆత్మనర్పించి యుంచుట. ఇవి యయిదును నియమము లనఁబడును. యమములను వదలి కేవల మీనియమములను మాత్రమే సేవింపఁగూడదు. ఈ రెంటిని సేవింప వలయును. యమములను వదలి నియమములను మాత్రమే సేవించువాఁడు ఉన్నతిని బొందక అధోగతిపాలయి సంసారమందు హీనుఁడై పడియుండును.

కామాత్మతా న ప్రశస్తా న చైవేహాస్త్యకామతా।
కామ్యో హి వేదాధిగమః కర్మయోగశ్చ వైదికః॥ మను. అ. ౨-౨॥

అత్యంతకామాతురతకాని; నిష్కామముకాని యెవరికిని శ్రేష్ఠముకాదు. కామమే లేకున్న వేదజ్ఞానమే కలుగక వేదవిహిత కర్మముల నెవఁడును జేయ లేఁడు. కాఁబట్టి:—

స్వాధ్యాయేన వ్రతైర్హోమైస్త్రైవిద్యేనేజ్యయా సుతైః।
మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః॥ మను అ. ౨-౨౮॥

(స్వాధ్యాయేన) సకల విద్యలను జదువుటచేత, జదివించుటచేతను (వ్రతైః) బ్రహ్మచర్యము, సత్యభాషణము మొదలగు నియమములను బాలించుటచేతను (హోమైః) అగ్నిహోత్రాదిహోమము, సత్యగ్రహణము, అసత్యత్యాగము, సత్యవిద్యల దానము వీనిచేతను (త్రైవిద్యేన) వేదస్థమగు కర్మ, ఉపాసన, జ్ఞానవిద్యలను గ్రహించుటచేతను (ఇజ్యయా) పక్షేష్ట్యాదులను జేయుటచేతను (సుతైః) సుసంతానోత్పత్తిచేతను (మహాయజ్ఞైః) బ్రహ్మ, దేవ, పితృ, వైశ్వ దేవాతిథిసేవారూపమగు పంచమహాయజ్ఞములచేతను (యజ్ఞైః) అగ్నిష్టోమాదులు, శిల్పవిద్యా జ్ఞానాదులను యజ్ఞములను సేవించుటచేతను ఈ శరీరము (బ్రాహ్మీయం) వేదములయు, పరమేశ్వరునియు భక్తికి నాధారరూపమగు బ్రాహ్మణుని శరీరముగా జేయఁబడును. ఇన్ని సాధనములు లేక బ్రాహ్మణ శరీరము కాఁజాలదు.

ఇంద్రియాణాం విచరతాం విషయేష్వపహారిషు।
సంయమే యత్నమాతిష్ఠే ద్విద్వాన్ యంతేవ వాజినామ్॥మను.అ. ౨-౮౮॥

తెలివిగల సారథి గుఱ్ఱములను నియమములో నుంచునట్లు విద్వాంసుఁడు మనస్సును, ఆత్మను చెడుపనులకు లాగు విషయములందుఁ జరించు నింద్రియములను నిగ్రహించుటకు అన్ని విధములఁ బ్రయత్నింప వలయును. ఏల యనఁగా:—

ఇంద్రియాణాం ప్రసంగేన దోషమృచ్ఛ త్యసంశయమ్।
సన్నియమ్య తు తాన్యేవ తతః సిద్ధిం నియచ్ఛతి॥మను.అ. ౨-౯౩॥

జీవాత్మ ఇంద్రియములకు వశుఁడై నిశ్చయముగ గొప్పగొప్ప దోషములను పొందుచున్నాఁడు. ఇంద్రియములను దనవశము చేసికొన్నపుడే సిద్ధిని బొందుచున్నాఁడు.

వేదాస్త్యాగశ్చ యజ్ఞాశ్చ నియమాశ్చ తపాంసి చ।
న విప్రదుష్టభావస్య సిద్ధిం గచ్ఛంతి కర్హిచిత్॥ మను. అ. ౨-౯౭॥

దుష్టాచారుఁడు, అజితేంద్రియుఁడు నగు పురుషునకు వేదము, త్యాగము, యజ్ఞము, నియమములు, తపస్సు తక్కిన మంచిపనులు నేవియు సిద్ధింపనేరవు.

వేదోపకరణే చైవ స్వాధ్యాయే చైవ నైత్యకే।
నానురోధో ఽ స్త్యనధ్యాయే హోమమంత్రేషు చైవ హి॥౧॥
నైత్యకే నా స్త్యనధ్యాయో బ్రహ్మసత్రం హి తత్ స్మృతమ్॥
బ్రహ్మాహుతిహుతం పుణ్యమనధ్యాయ వషట్కృతమ్ ॥౨॥
మను. అ. ౨-౧౦౫-౧౦౬॥

వేదములను జదువుటకు చదివించుటకు, సంధ్యోపాసనాది పంచ మహాయజ్ఞములను జేయుటకు, హోమమంత్రములకు అనధ్యాయము లేదు. ॥ ౧ ॥ నిత్య కర్మములందు అనధ్యాయ ముండఁజాలదు; ఉచ్ఛ్వాస నిశ్వాసములవలె నిత్య కర్మములు ప్రతిదినమును జేసి తీరవలయును. ఎప్పుడును మానఁగూడదు. అనధ్యాయమందు చేయఁబడిన అగ్నిహోత్రాద్యుత్తమ కర్మలును పుణ్యరూపము లగుచున్నవి. అబద్ధము చెప్పుట ఎల్లప్పుడు నెట్లుపాపమో, సత్యము చెప్పుట ఎల్లప్పుడు నెట్లు పుణ్యమో అట్లే చెడుకర్మలొనర్చుట సర్వదా అనధ్యాయమును, మంచికర్మ నొనర్చుట సర్వదా స్వాధ్యాయము నగును. ॥౨॥

అభివాదనశీలస్య నిత్యం వృద్ధోపసేవినః ।
చత్వారి తస్య వర్ధంత ఆయుర్విద్యా యశో బలమ్॥ మను-అ. ౨।౧౨౧।

సర్వదా నమ్రుఁడును, సుశీలుఁడును, విద్వాంసులను, వృద్ధులను సేవించు వాఁడును నగునతనికి ఆయుస్సును, విద్యయుఁ, కీర్తియు, బలమును వర్ధిల్లును. అట్లు చేయనివానికి ఆయువు మొదలగు నీ నాలుగును వర్ధిల్లవు.

అహింసయైవ భూతానాం కార్యం శ్రేయోఽనుశాసనమ్ ।
వాక్చైవ మధురా శ్లక్ష్ణా ప్రయోజ్యా ధర్మమిచ్ఛతా॥
యస్య వాఙ్మనసే శుద్ధే సమ్యగ్గుప్తే చ సర్వదా ।
స వై సర్వ మవాప్నోతి వేదాంతోపగతం ఫలమ్॥మను. అ. ౨.౧౫౯-౧౬౦॥

వైరబుద్ధిని వదలి అందఱకును కల్యాణ మార్గము నుపదేశించుట విద్వాంసులకును, విద్యార్థులకును యోగ్యమయి యున్నయది. ఉపదేష్ట-ఉప దేశము చేయువాఁడు నిరంతరము మధురముగను, సౌశీల్యముతోడను మాట లాడ వలయును. ధర్మోన్నతిని గోరువారు సంతతము సత్యమందే వర్తిల్ల వల యును. సత్యమే యుపదేశింపవలయును. ఎవని వాణియు, మనస్సును శుద్ధము గను, సురక్షితముగను సదా యుండునో అతఁడే సమస్త వేదాంతము-వేదముల సిద్ధాంత రూపఫలమును బొందును

సమ్మానాద్బ్రాహ్మణో నిత్యముద్విజేత విషాదివ ।
అమృతస్యేవ చాకాంక్షేదవమానస్య సర్వదా॥ మను అ. ౨-౧౬౨॥

ప్రతిష్ఠను సంతతము విషమువలె భయపడుచు, అపమానము నమృత మునువలె వాంఛించునట్టి బ్రాహ్మణుఁడే సమగ్రవేదమును,పరమేశ్వరుని దెలిసి కొనువాఁడు.

అనేన క్రమయోగేన సంస్కృతాత్మా ద్విజః శనైః ।
గురౌ వసన్ సంచినుయాద్బ్రహ్మాధిగమికం తపః॥ మను. అ. ౨-౧౬౪॥

ఇట్లే కృతోపనయనులు- బ్రహ్మచారులునగు ద్విజకుమారీ కుమారులు మెల్లమెల్లగా వేదార్థజ్ఞాన రూపమగు నుత్తమ తపస్సును వృద్ధిపఱచుకొనుచుఁ బోవలయును.

యోఽనధీత్య ద్విజో వేదమన్యత్ర కురుతే శ్రమమ్ ।
స జీవన్నేవ శూద్రత్వ మాశు గచ్ఛతి సాన్వయః॥ మను. అ. ౨-౧౬౮॥

అభివాదనశీలస్య నిత్యం వృద్ధోపసేవినః ।
చత్వారి తస్య వర్ధంత ఆయుర్విద్యా యశో బలమ్॥ మను-అ. ౨।౧౨౧॥

సర్వదా నమ్రుఁడును, సుశీలుఁడును, విద్వాంసులను,వృద్ధులను సేవించు వాఁడును నగునతనికి ఆయుస్సును, విద్యయుఁ, గీర్తియు, బలమును వర్ధిల్లును. అట్లు చేయనివానికి ఆయువు మొదలగు నీ నాలుగును వర్ధిల్లవు.

అహింసయైవ భూతానాం కార్యం శ్రేయోనుశాసనమ్ ।
వాక్చైవ మధురా శ్లక్ష్ణా ప్రయోజ్యా ధర్మమిచ్ఛతా॥
యస్య వాఙ్మనసే శుద్ధే సమ్యగ్గుప్తే చ సర్వదా ।
స వై సర్వ మవాప్నోతి వేదాంతోపగతం ఫలమ్॥మను. అ.౨.౧౫౯-౧౬౦॥

వైరబుద్ధిని వదలి అందఱకును గల్యాణ మార్గము నుపదేశించుట విద్వాంసులకును, విద్యార్థులకును యోగ్యమయి యున్నయది. ఉపదేష్ట - ఉపదేశము చేయువాఁడు నిరంతరము మధురముగను, సౌశీల్యముతోఁడును మాట లాడ వలయును. ధర్మోన్నతిని గోరువారు సంతతము సత్యమందే వర్తిల్ల వలయును. సత్యమే యుపదేశింపవలయును. ఎవని వాణియు, మనస్సును శుద్ధము గను, సురక్షితముగను సదా ఉండునో అతఁడే సమస్త వేదాంతము-వేదముల సిద్ధాంత రూపఫలమును బొందును

సమ్మానాద్బ్రాహ్మణో నిత్యముద్విజేత విషాదివ ।
అమృతస్యేవ చాకాంక్షేదవమానస్య సర్వదా॥ మను అ. ౨.౧౬౨॥

ప్రతిష్ఠకు సంతతము విషమువలె భయపడుచు, అవమానము నమృత మునువలె వాంఛించునట్టి బ్రాహ్మణుఁడే సమగ్రవేదమును,పరమేశ్వరుని దెలిసి కొనువాఁడు.

అనేన క్రమయోగేన సంస్కృతాత్మా ద్విజః శనైః ।
గురౌ వసన్ సంచిను యాద్బ్రహ్మాధిగమికం తపః॥ మను. అ. ౨.౧౬౪॥

ఇట్లే కృతోపనయనులు- బ్రహ్మచారులునగు ద్విజకుమారీ కుమారులు మెల్లమెల్లగా వేదార్థజ్ఞాన రూపమగు నుత్తమ తపస్సును వృద్ధిపఱచుకొనుచుఁ బోవలయును.

యోఽనధీత్య ద్విజో వేదమన్యత్ర కురుతే శ్రమమ్ ।
స జీవన్నేవ శూద్రత్వ మాశు గచ్ఛతి సాన్వయః॥ మను. అ. ౨.౧౬౮॥

నైషాం త్వయాసనేన ప్రశ్వసితవ్యం।శ్రద్ధయా దేయమ్ అశ్రద్ధయాదేయమ్।
శ్రియాదేయమ్। హ్రియాదేయమ్। భియాదేయమ్। సంవిదా దేయమ్।
అథ యది తే కర్మవిచికిత్సా వా వృత్తవిచికిత్సా వా స్యాత్॥ ౩॥ యే తత్ర
బ్రాహ్మణాః సమదర్శినో యుక్తా అయుక్తా అలూక్షా ధర్మకామాః స్యుర్యథా తే తత్ర
వర్తేరన్। తథా తత్ర వర్తేథాః । ఏష ఆదేశ ఏష ఉపదేశ ఏషో వేదోపనిషత్।
ఏతదనుశాసనమ్। ఏవముపాసితవ్యమ్। ఏవము చైతదుపాస్యమ్॥౪॥
(తైత్తిరీయ-ప్రపా. ౭. అను. ౧౧. క. ౧. ౨. ౩. ౪.)

ఆచార్యుఁడు శిష్యునకు, [ఆచార్యాణి] శిష్యురాలికి "సదాసత్యము చెప్పుము. ధర్మము నాచరింపుము. ప్రమాద రహితుఁడవై చదివి, చదివించి బ్రహ్మచర్యముచే సమస్త విద్యల గ్రహించి యాచార్యులకుఁ బ్రియధనమొసగి వివాహము చేసికొని సంతానముఁ గనుము. ప్రమాదముచే నెప్పుడును సత్యమును వదలకుము. ప్రమాదముచే ధర్మమును త్యజింపకుము, ప్రమాదముచే నారోగ్యమును చాతుర్యమును వదలకుము. ప్రమాదము చేను త్తమైశ్వర్యవృద్ధిని వదలకుము. ప్రమాదముచేఁ జదువుట జదివించుట వదలకుము. దేవతల-విద్వాంసులయు, తలిదండ్రులయు సేవ యందుఁ బ్రమాద పడకుము. విద్వాంసులను సత్కరించునట్లు మాతాపితలను, ఆచార్యుల నతిథులను సర్వదా సేవింపుము. అనిందితములగు సత్యభాషణాది ధర్మకృత్యము లొనర్పుము. వాని కంటె భిన్నములగు నసత్యభాషణాది కృత్యము లొనర్పకుము. మా సుచరిత్రమును-ధర్మయుక్త కర్మమును గ్రహింపుము. మా పాపాచరణముల నెన్నడును గ్రహింపకుము. ధర్మాత్ములునగు బ్రాహ్మణుల సమీపమందుఁ గూర్చుండుము. వారినే విశ్వసింపుము. శ్రద్ధచే నీయవలయును; అశ్రద్ధచే నీయవలయును. ప్రసన్నతతో నీయవలయును. లజ్జతో నీయవలయును: భయముతో నీయవలయును; ప్రతిజ్ఞతో నీయవలయును. నీ కెప్పుడేని కర్మ విషయమునఁ గాని: శీలవిషయమునఁగాని, ఉపాసనా విషయమునఁగాని, జ్ఞానవిషయమునఁ గాని యెట్టి సంశయము కలిగినను, సమదర్శులును పక్షపాత రహితులును, యోగులును, అయోగులును, (ఆసక్తులు) ఆర్ద్రచిత్తులును, ధర్మకాములగు ధర్మాత్ము లేరర్థ మార్గమందు వర్తించుచున్నారో ఆ మార్గమున నీవును

వర్తింపుము. ఇదే ఆదేశము—ఆజ్ఞ. ఇదియే యుపదేశము; ఇదియే వేదోపనిషత్తు. ఇదియే శిక్ష. ఈ ప్రకారమే వర్తించి నీనడతను సవరించుకొనవలయును." అని ఉపదేశింప వలయును.

అకామస్య క్రియా కాచిద్దృశ్యతే నేహ కర్హిచిత్।
యద్యద్ధి కురుతే కించిత్ తత్తత్కామస్య చేష్టితమ్॥ మను. అ. ౨-౪॥

"నిష్కామ పురుషునియందు నేత్ర సంకోచ వికాసములు గలుగుటయు సర్వవిధముల యసంభవము. కావున నతఁడెయ్యది చేసినను నయ్యది కామచేష్టితము; కామములేక కలుగదు" అని సిద్ధించుచున్నట్లు మనుష్యులు నిశ్చయింప వలెను.

ఆచారః పరమో ధర్మః శ్రుత్యుక్తః స్మార్త ఏవ చ।
తస్మాదస్మిన్ సదా యుక్తో నిత్యం స్యాదాత్మవాన్ ద్విజః॥
ఆచారాద్విచ్యుతో విప్రో న వేదఫల మశ్నుతే
ఆచారేణ తు సంయుక్తః సంపూర్ణఫలభాగ్భవేత్॥ మను. ౧. ౧౦౮-౧౦౯॥

వేదములందు, వేదానుకూల స్మృతులందుఁ బ్రతిపాదితమగు ధర్మము నాచరించుటయే చెప్పుట వినుట వినుపించుట చదువుట చదివించుట ఫలము. కాఁబట్టి సర్వదా ధర్మాచారపరులు గావలయును. ॥౧॥ ధర్మాచరణ రహితుఁడు వేదప్రతిపాదిత ధర్మజన్యమగు సుఖరూప ఫలమును బొందఁజాలఁడు. విద్యను జదివి ధర్మాచరణ మొనర్చువాఁడే సంపూర్ణ సుఖమును బొందగలఁడు ॥౨॥

యోఽవమన్యేత తే మూలే హేతుశాస్త్రాశ్రయాద్ద్విజః।
స సాధుభి ర్బహిష్కార్యో నాస్తికో వేదనిందకః॥ మను. అ ౨-౧౧॥

వేదములను, వేదానుకూలముగ నాప్తపురుషులు రచించిన శాస్త్రములను అవమానపఱచు వేదనిందకుఁడగు నాస్తికుని జాతి, పంక్తి, దేశములనుండి వెలివేయవలయును.

శ్రుతిః స్మృతిః సదాచారః స్వస్య చ ప్రియమాత్మనః।
ఏతచ్చతుర్విధం ప్రాహుః సాక్షాద్ధర్మస్య లక్షణమ్॥ మను. ౨-౧౨॥

వేదము, స్మృతులు - వేదానుకూలములైన ఆప్తోక్తములగు మనుస్మృత్యాది శాస్త్రములు, సత్పురుషుల ఆచారము - సనాతనమగు వేదము ద్వారా పరమేశ్వర ప్రతిపాదితమగుకర్మ, తనయాత్మకు ప్రియమయినది-ఆత్మ

కోరునట్టి - సత్యభాషణము మొదలగునవి ఈనాలుగును ధర్మలక్షణములు. వీని చేతనే ధర్మాధర్మముల నిశ్చయము కలుగును. పక్షపాతరహితన్యాయము, సత్యగ్రహణము, సర్వదా అసత్య పరిత్యాగము, అను నీ ఆచారమే ధర్మము. దీనికి విపరీతము-పక్షపాత సహితమగు అన్యాయాచరణము, సత్యత్యాగము అసత్యగ్రహణము. అను నీ కర్మయే అధర్మ మనఁబడును.

అర్థకామేష్వసక్తానాం ధర్మజ్ఞానం విధీయతే।
ధర్మం జిజ్ఞాసమానానాం ప్రమాణం పరమం శ్రుతిః॥మను.అ. ౨-౧౩॥

సువర్ణాది రత్నములయందును, స్త్రీ సేవనాదుల యందును దగులు కొనని వానికే ధర్మజ్ఞానము కలుగుచున్నది. ధర్మజ్ఞానమును గోరువారు వేదము ద్వారా ధర్మమును నిశ్చయించు కొనవలయును. ధర్మాధర్మముల నిశ్చయము వేదమువినా యథార్థిగాఁ గలుగఁజాలదు. అని యాచార్యుఁడు తన శిష్యున కుపదేశింప వలయును. విశేషించి రాజు ఇతరక్షత్రి యులకును, వైశ్యులకును, ఉత్తమ శూద్రులకును విద్యాభ్యాస మవశ్యము చేయింప వలయును. బ్రాహ్మణులు మాత్రము విద్యనభ్యసించి తక్కిన క్షత్రియాదులు విద్యావంతులు కాకుండు రేని విద్య, ధర్మము, రాజ్యము, ధనము మొదలగునవి యెన్నటికిని వృద్ధిఁ బొందఁజాలవు. బ్రాహ్మణుఁలు కేవలము పఠనములచే క్షత్రియాదులవలన జీవి కను సంపాదించుకొనుచు జీవింప గలుగుదురు. (వారు)జీవిక కధీనులై యుండి క్షత్రియాదులు ఆజ్ఞాదాతలు మరియు సరియైన పరీక్షకులును, దండదాతలును కాకపోయిరేని బ్రాహ్మణాది సమస్త వర్ణములు పాషండము లగును. క్షత్రి యాదులు విద్వాంసులయి రేని బ్రాహ్మణులును అధిక విద్యావంతులై ధర్మ మార్గమందు నడువఁ గలుగుదురు. విద్వాంసులగు నాక్షత్రియాదుల యెదుట పాషండతను, అసత్య వ్యవహారమును జేయఁజాలకుందురు. క్షత్రియా దులు విద్వాంసులు కారేని బ్రాహ్మణులు తమయిచ్చవచ్చినట్టు చేయు దురు. కాఁబట్టి బ్రాహ్మణులు తమకల్యాణము గోరుదురేని క్షత్రియాదులకు వేదాది సత్యశాస్త్రములను అధిక ప్రయత్నముతో నేర్పవలయును. క్షత్రియా దులే విద్య, ధర్మము, రాజ్యము, లక్ష్మి, వీనిని వృద్ధిపరుపఁ దగినవారు.వారెప్ప టికిని భిక్షావృత్తి నవలంబింపరు, కాఁబట్టి విద్యా వ్యవహారములయందుఁ పక్ష

కోరునట్టి - సత్యభాషణము మొదలగునవి ఈనాలుగును ధర్మలక్షణములు. వీని చేతనే ధర్మాధర్మముం నిశ్చయము కలుగును. పక్షపాతరహితన్యాయము, సత్యగ్రహణము, సర్వదా అసత్య పరిత్యాగము, అను నీ ఆచారమే ధర్మము. దీనికి విపరీతము-పక్షపాత సహితమగు అన్యాయాచరణము, సత్యత్యాగము అసత్యగ్రహణము. అను నీ కర్మయే అధర్మ మనఁబడును.

> అర్థకామేష్వసక్తానాం ధర్మజ్ఞానం విధీయతే।
> ధర్మం జిజ్ఞాసమానానాం ప్రమాణం పరమం శ్రుతిః॥మను.అ. ౨-౧౩॥

సువర్ణాది రత్నములయందును, స్త్రీ సేవనాదుల యందును దగుల కొనని వానికే ధర్మజ్ఞానము కలుగుచున్నది. ధర్మజ్ఞానమును గోరువారు వేదము ద్వారా ధర్మమును నిశ్చయించు కొనవలయును. ధర్మాధర్మముల నిశ్చయము వేదమువినా యథారీతిగఁ గలుగఁజాలదు. అని యాచార్యుఁడు తన శిష్యున కుపదేశింప వలయును. విశేషించి రాజా ఇతరక్షత్రి యులకును, వైశ్యులకును, ఉత్తమ శూద్రులకును విద్యాభ్యాస మవశ్యము చేయింప వలయును. బ్రాహ్మణులు మాత్రము విద్యాసభ్యసించి తక్కిన క్షత్రియాదులు విద్యావంతులు కాకుండు రేని విద్య, ధర్మము, రాజ్యము, ధనము మొదలగునవి యెన్నటికిని వృద్ధిఁ బొందజాలవు. బ్రాహ్మణుఁలు కేవలము పఠనములచే క్షత్రియాదులవలన జీవికను సంపాదించుకొనుచు జీవింప గలుగుదురు. (వారు)జీవిక కధీనులై యుండి క్షత్రియాదుల ఆజ్ఞాదాతలు మరియు సరియైన పరీక్షకులును, దండదాతలును కాకపోయిరేని బ్రాహ్మణాది సమస్త వర్ణములు పాషండమూ లగును. క్షత్రియాదులు విద్వాంసులయి రేని బ్రాహ్మణులును అధిక విద్యావంతులై ధర్మ మార్గమందు నడువఁ గలుగుదురు. విద్వాంసులగు నాక్షత్రియాదుల యెదుట పాషండతను, అసత్య వ్యవహారమును జేయఁజాలకుందురు. క్షత్రియాదులు విద్వాంసులు కారేని బ్రాహ్మణులు తమయిచ్చవచ్చినట్టు చేయుదురు. కాఁబట్టి బ్రాహ్మణులు తమకల్యాణము గోరుదురేని క్షత్రియాదులకు వేదాది సత్యశాస్త్రములను అధిక ప్రయత్నముతో నేర్పవలయును. క్షత్రియాదులే విద్య, ధర్మము, రాజ్యము, లక్ష్మి, వీనిని వృద్ధిపరుపఁ దగినవారు.వారెప్పటికిని భిక్షావృత్తి నవలంబింపరు. కాఁబట్టి విద్యా వ్యవహారములయందుఁ పక్ష

శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములతో శ్రోత్ర, త్వక్, చక్షు, జిహ్వా ఘ్రాణములకు అవ్యవహితము - ఆవరణరహితమగు సంబంధము కలిగి ఆ ఇంద్రియములతో మనస్సునకు, మనస్సుతో నాత్మకును సంయోగము కలుగుటచే నుత్పన్నమగు జ్ఞానము ప్రత్యక్షము. కాని అది వ్యపదేశము సంజ్ఞ సంజ్ఞి సంబంధమువలన నేర్పడు జ్ఞానముగ నుండఁగూడదు-అనగా జలము తెమ్మని యొకఁడన్నపుడు వాడు తెచ్చి సమీపమందుంచిన జలనామముగల పదార్థమునే ప్రత్యక్షముగా నెంచవలయును; కాని, 'జ-ల' అను నీ రెండక్షరముల సంజ్ఞను గాదు. శబ్దముచే నుత్పన్నమగు జ్ఞానము శబ్దప్రమాణవిషయము. మరియు అవ్యభిచారి అనగా వ్యభిచారిగా నుండఁగూడదు అనఁగా నెవఁడేని రాత్రి స్తంభమును జూచి పురుషుఁడని నిశ్చయించు కొనినను నేని పగటియందు దానిని జూచినపుడా రాత్రియందలి పురుషజ్ఞానము నష్టమై, స్తంభజ్ఞానము కలుగునుగద; అట్టి వినాశజ్ఞానమునకు 'వ్యభిచారి' అని పేరు. కాఁబట్టి అది ప్రత్యక్షముకాదు. ప్రత్యక్ష మిట్టి వినాశజ్ఞానముగా నుండఁగూడదు. మఱియు (వ్యవసాయాత్మకమ్) అనఁగా ఒకఁడు దూరముగానున్న యేటి యిసుకను జూచి 'అక్కడ వస్త్రము లెండుచున్నవా? జలమా? లేక మరియేదైననా?' అనిగాని, 'అక్కడ నిలుచున్న వాఁడు యజ్ఞదత్తుఁడా? లేక దేవదత్తుఁడా?' అనిగాని సంశయముగా పలికినది ప్రత్యక్షముకాదు. ప్రత్యక్ష మిట్టి సంశయ జ్ఞానముగా నుండఁగూడదు. కాఁబట్టి అవ్యపదేశ్యమును, అవ్యభిచారియు, నిశ్చయాత్మకమునగు జ్ఞానమే ప్రత్యక్షము.

(౨) అనుమానము :—

అథ తత్పూర్వకం త్రివిధమనుమానం పూర్వవచ్ఛేషవత్సామాన్యతో దృష్టంచ॥
(న్యాయ. అ. ౧. ఆ. ౧. సూ-౫)

ప్రత్యక్షపూర్వకము అనఁగా నొక పదార్థముయొక్క భాగము (ఏకదేశము) కాని సంపూర్ణముగఁ గాని ఎక్కడనో, ఏకాలమందో ప్రత్యక్షమై యుండి, పిమ్మట మఱొక స్థలమందు ఆ పదార్థముయొక్క సహచారి యేకదేశము ప్రత్యక్షమైనపుడు ఆ కనఁబడని (అవయవి) పదార్థజ్ఞానము కలుగుట అనుమానము. ఎట్లనఁగా:- పుత్రునిఁ జూచి తండ్రిని, పర్వతాదుల యందుఁ బొగను జూచి అగ్నిని, జగత్తునందలి సుఖదుఃఖములను జూచి పూర్వజన్మమును తెలిసికొనుట. ఈ అనుమానము మూడు విధములు.

(౧) 'పూర్వవత్':- కారణమును జూచుట వలనఁ గార్యజ్ఞానము కలుగుట:- మేఘమునుజూచి వర్షమును. వివాహమునుజూచి సంతానోత్పత్తిని. చదువుచుండు విద్యార్థినిజూచి విద్వాంసులగునని నిశ్చయించుట.

(౨) 'శేషవత్' :- కార్యమును జూచుటవలనఁ గారణజ్ఞానము కలుగును:- నదీ ప్రవాహమును జూచి కురిసిన వర్షమును. కుమారునిఁ జూచి తండ్రిని. సృష్టినిఁజూచి అనాదికారణమునుఁ. తత్కర్తయగు ఈశ్వరుని. సుఖదుఃఖములనుజూచి పాపపుణ్యాచరణములను ఊహించుట.

(౩) 'సామాన్యతో దృష్టము' :- కొంతొకటి కొంతొకదానికి కార్యముకానీ. కారణముకానీ కాదు; కాని. ఒక దానితో మఱియొకదానికిఁ గల కొంతొక సమానధర్మము:- ఎట్లనఁగా:-ఎవఁడును నడువక యితర స్థానమునకు జేరఁజాలఁడు కద. దీనినిబట్టి యిట్లే యెవ్వఁడును బయలుదేరి పోక అన్యస్థానమును చేరఁజాలఁడని తెలియుట. ( అను అర్థాత్ ప్రత్యక్షస్య పశ్చాన్మీయతే జ్ఞాయతే యేన తదనుమానమ్) ప్రత్యక్షమునకుఁ బిమ్మటఁ గలుగునదని 'అనుమాన' శబ్దమున కర్థము. ఏలయనఁగా పొగను ప్రత్యక్షముగాఁ జూడకున్నచో కానరాని అగ్నిజ్ఞానము కలుగఁజాలదు. కాఁబట్టి కొంత ప్రత్యక్షమైన పిమ్మటనే అనుమానము కలుగుచున్నది.

(౪) ఉపమానము :-

ప్రసిద్ధసాధర్మ్యాత్ సాధ్యసాధన ముపమానమ్॥న్యాయ.అ.౧.ఆ.౧.సూ-౬॥

ప్రసిద్ధ ప్రత్యక్షసాధర్మ్యముచే సాధ్యమును-సిద్ధపఱుపఁదగిన పదార్థము యొక్క జ్ఞానమును సిద్ధపఱచు సాధనము ఉపమానము. (ఉపమీయతే యేన తదుపమానమ్) ఒకఁడు తన భృత్యునితో 'విష్ణుమిత్రుని బిలుచుకొని రమ్ము' అనిన భృత్యుఁడు 'నేనతని నెన్నఁడును జూడలే' దనెనేని యజమానుఁడు 'ఈ దేవదత్తునివలె నా విష్ణుమిత్రుఁడుండు'నని చెప్పును. అపుడతఁడు పోయి దేవదత్తునివలెనుండు నతనిఁ జూచి యితఁడే విష్ణుమిత్రుఁడని పిలుచుకొనివచ్చును. ఆవువలెనే అడవియావు నుండునన్నప్పుడు అడవికిఁ బోయి ఆవువలెనుండు పశువునుజూచి యిదే యడవియావని నిశ్చయించును. దీని కుపమానమని పేరు.

(౪) శబ్దప్రమాణము:—

ఆప్తోపదేశః శబ్దః ॥న్యాయ॥ అ-౧ ఆ. ౧. సూ-౮॥

పూర్ణ విద్వాంసుఁడును, ధర్మాత్ముఁడును, పరోపకారప్రియుఁడును, సత్యవాదియు, పురుషార్థియు, జితేంద్రియుఁడును, తాను దేనివలన సుఖమును బొందెనో దానిఁ జెప్పవలయునను కోరికచేఁ బ్రేరితుఁడై తనకు దెలిసినట్లు సమస్త మనుష్యుల కల్యాణార్థము బోధించువాఁడును, పృథివి మొదలుకొని పరమేశ్వర పర్యంతముగం పదార్థముల జ్ఞానము గలిగిన వాఁడును అగు ఉపదేష్ట ఆప్తుడు. ఇట్టిపురుషుని యుపదేశమును, పూర్ణాప్తుఁడగు పరమేశ్వరుని యుపదేశమగు వేదమును శబ్ద ప్రమాణమని యెఱుఁగఁదగును.

(౫) ఐతిహ్యము:—

న చతుష్ట్వ మైతిహ్యార్థాపత్తి సంభవాభావప్రామాణ్యాత్॥

న్యాయ॥అ. ౨. ఆ ౨. సూ-౧॥

ఇతిహ అనఁగా 'ఇట్లుండెను; అతడిట్లుచేసెను' అని చెప్పఁబడు కొందరు పురుషుని జీవనచరిత్ర. దీనికి ఐతిహ్యమని పేరు.

(౬) అర్థాపత్తిః:—

(అర్థాదాపద్యతే సా అర్థాపత్తిః) 'కేనచిదుచ్యతే సత్సు ఘనేషు వృష్టిః, సతి కారణే కార్యం భవతీతి కిమత్ర ప్రసజ్యతే, అసత్సు ఘనేషు వృష్టి రసతి కారణే చ కార్యం న భవతి', మబ్బువేసిన వర్షము వచ్చునని యు, కారణముండిన కార్యము కలుగునని యుఁ జెప్పిన మబ్బులేక వర్షము కాని, కారణము లేక కార్యముకాని ఎప్పుడును గలుగఁ జాలదని యెవ్వఁడును గద. దీనికి 'అర్థాపత్తి' యని పేరు.

(౭) సంభవము:—

(సంభవతి యస్మిన్ ససంభవః) ఎవఁడేని 'తల్లిదండ్రులులేక సంతానము కలిగెను; చచ్చినవాని బ్రతికించెను; పర్వతము నెత్తెను; సముద్రముపై రాలను దేల్చెను; చంద్రుని ముక్కలు చేసెను; పరమేశ్వరుఁడవతారమెత్తెను; మనుష్యుని కొమ్ములు చూచితివి; గొడ్రాలికుమారునకును కొమారితకును వివాహమయ్యెను, అని చెప్పెనేని ఇవి యన్నియు ససంభవములని తెలియవలయును.

ఏలయనఁగా నివి యన్నియు సృష్టిక్రమమునకు విరుద్ధములు. సృష్టి క్రమమున కనుకూలమైనది సంభవము.

(౮) అభావము :-

'న భవన్తి యస్మిన్ సోఽభావః' ఎవఁడేని 'ఏనుగును దెమ్ము' అనినపుడు అక్కడ గజాభావమును గుర్తించి యెక్కడ నేనుఁగుండునో అక్కడ నుండి తెచ్చును. ఇవి ఎనిమిది ప్రమాణములు. వీనియందు శబ్దములో నైతిహ్యమును, అనుమానములో నర్థాపత్తి సంభవాభావములను గలిపి గణించితిమేని నాలుగే ప్రమాణములగును. ఈ యైదువిధములయిన పరీక్షలచే మనుష్యుఁడు సత్యాసత్యములను నిశ్చయింపఁగలఁడు. ఇది తప్ప వేరు మార్గము లేదు.

ధర్మవిశేష ప్రసూతాద్ద్రవ్యగుణకర్మసామాన్య విశేషసమవాయానాం
పదార్థానాం సాధర్మ్య వైధర్మ్యాభ్యాం తత్త్వజ్ఞానాన్నిఃశ్రేయసమ్॥
వై॥ అ. ౧. ఆ. ౧. సూ-౪॥

మనుష్యుఁడు యథాయోగ్యముగ ధర్మానుష్ఠాన మొనర్చుటచేఁ బవిత్రుఁడై, పృథివీజలములలోని జడత్వము-వాని సాధర్మ్యము-అనఁగా సమాన ధర్మము అన్నియు, పృథివీ జలములలోని కఠోరతయు, కోమలత్వమును వాని వైధర్మ్యములనియు, నిట్లు ద్రవ్య, గుణ, కర్మ, సామాన్య, విశేష సమవాయములను ఆఱు పదార్థముల తత్త్వజ్ఞానము-స్వరూప జ్ఞానముచే "నిఃశ్రేయసమ్" మోక్షమును బొందుచున్నాఁడు.

పృథివ్యాపస్తేజో వాయురాకాశం కాలో దిగాత్మా మన ఇతి ద్రవ్యాణి॥
వై॥ అ. ౧. ఆ. ౧. సూ. ౫॥

పృథివి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశము, కాలము, దిక్కు, ఆత్మ, మనస్సు ఇవి తొమ్మిది ద్రవ్యములు.

క్రియాగుణవత్సమవాయికారణమితి ద్రవ్యలక్షణమ్॥ వై॥ అ.౧.ఆ.౧. సూ.౧౫॥

(క్రియాశ్చ గుణాశ్చ విద్యన్తే యస్మింస్తత్ క్రియా గుణవత్) క్రియలు, గుణములు, లేదా కేవలగుణములు కలది ద్రవ్యము. పృథివి, జలము, తేజస్సు, వాయువు, మనస్సు, ఆత్మ ఈ యాఱును క్రియాగుణములు గల ద్రవ్యములు. ఆకాశము, కాలము, దిక్కు- ఈ మూఁడును క్రియారహితమైన

గుణములుగం ద్రవ్యములు. (సమవాయి:-సమవేతుం శీలం యస్యతత్ సమవాయి, ప్రాగ్వృత్తిత్వం కారణం, సమవాయి చ తత్కారణం సమవాయి కారణమ్. లక్ష్యతే యేన తల్లక్షణమ్)కలియు స్వభావము గలది సమవాయి.కార్యమునకు బూర్వమందుండునది కారణము. కార్యమునకు పూర్వముండి, కార్యమునందు సమవేత మగు నది సమవాయి కారణము; అదియే ద్రవ్యము. కంటితో రూపము గ్రహింపఁబడునట్లు దేనిచే లక్ష్యము గ్రహింపఁ బడునో అది లక్షణము.

రూపరసగంధస్పర్శవతీ పృథివీ ॥వై॥ అ-౨.ఆ-౧.సూ-౧॥

రూపరసగంధస్పర్శములు గలది పృథివి. అందలి రూప, రస, స్పర్శము లు అగ్నిజలవాయువులు కూడికచేఁ గలిగినవి.

వ్యవస్థిత: పృథివ్యాం గంధః ॥వై॥ అ-౨.ఆ-౨.సూ-౨॥

పృథివియందు గంధగుణము స్వాభావికము. అట్లే జలమందు రసమును, అగ్నియందు రూపమును, వాయువునందు స్పర్శమును, ఆకాశమునందు శబ్దమును స్వాభావికములు.

రూపరసస్పర్శవత్య ఆపో ద్రవాః స్నిగ్ధాః ॥ వై ॥ అ. ౨. ఆ. ౧. సూ. ౨॥

రూపరసస్పర్శవంతమును ద్రవీభూతమును కోమలము నయినదిజలము. వీనిలో రసము జలమునకు స్వాభావికగుణము. రూపస్పర్శములు అగ్నివాయువుల కూడికచేఁ గలిగినవి.

అప్సు శీతతా ॥ వై ॥ అ. ౨. ఆ. సూ. ౫॥

జలమందు శీతలత్వమున్ను స్వాభావిక గుణము.

తేజో రూపస్పర్శవత్ ॥వై॥ అ. ౨. ఆ. ౧. సూ-౩॥

రూపస్పర్శములు గలది తేజము. తేజమునకు రూపము స్వాభావికము; స్పర్శము వాయువు కూడికచేఁ గలిగినది.

స్పర్శవాన్ వాయుః॥వై॥ అ. ౨. ఆ. ౧. సూ-౪॥

స్పర్శగుణముగలది వాయువు. దీనియందలి ఉష్ణశీతములు తేజో జలముల కూడికచేఁ గలిగినవి.

త ఆకాశే న విద్యంతే॥వై॥ అ. ౨. ఆ. ౧. సూ. ౫॥

రూప, రస, గంధ, స్పర్శములు, ఆకాశమునందు లేవు. శబ్దము మాత్రమే ఆకాశగుణము.

నిష్క్రమణం ప్రవేశన మిత్యాకాశస్య లింగమ్ ॥ వై॥ అ.౨.ఆ.౧.సూ.౨౦

ప్రవేశించుటకును వెలువడుటకును అవకాశమిచ్చున దాకాశము. కాఁబట్టి ప్రవేశ ప్రనిష్క్రమణము లాకాశలింగములు.

కార్యాంతరాప్రాదుర్భావాచ్చ శబ్దః స్పర్శవతామగుణః॥ వై॥ అ.౨.ఆ.౧.సూ.౨౫॥

శబ్దము, పృథివ్యాది కార్యములచేఁ బ్రకటము కానందున స్పర్శ గుణములు గల భూమ్యాదుల గుణము కాదు. కేవలమాకాశగుణము.



అపరస్మిన్నపరం యుగపచ్చిరం క్షిప్రమితి కాలలింగాని॥ వై॥ అ.౨.ఆ.౨.సూ.౬॥

దేనియందు ముందు, వెనుక, ఒకేపర్యాయము, విలంబము శీఘ్రము మొదలగు ప్రయోగములు గలుగునో అది కాలము.



నిత్యేష్వభావాదనిత్యేషు భావాత్కారణే కాలాఖ్యేతి॥ వై॥ అ.౨.ఆ.౨.సూ.౯॥

నిత్యపదార్థములయందు లేక అనిత్యపదార్థములందు కలదు గనుక కారణమందే కాలసంజ్ఞ.



ఇత ఇదమితి యతస్తద్దిశ్యం లింగమ్ ॥ వై॥ అ.౨.ఆ.౨.సూ.౧౦॥

ఇక్కడనుండి యిదిపూర్వము, దక్షిణము, పశ్చిమము, ఉత్తరము, మీఁద, క్రింద, అను వ్యవహారములు దేనియందుఁ జెల్లునో అది దిశ యనఁబడును.

ఆదిత్యసంయోగాద్ భూతపూర్వాద్ భవిష్యతో భూతాచ్చ ప్రాచీ॥

వై॥ అ.౨.ఆ.౨.సూ.౧౪॥

ఏవైపు ప్రథమమున సూర్యునితోఁ గూడునో కూడగలదో అది పూర్వదిశ. ఏవైపున సూర్యుఁడస్తమించునో అది పశ్చిమము. పూర్వాభిముఖునకుఁ గుడివైపు దక్షిణము, ఎడమవైపు ఉత్తరము.

ఏతేన దిగంతరాళాని వ్యాఖ్యాతాని ॥ వై॥ అ.౨.ఆ.౨.సూ.౧౬॥

పూర్వదక్షిణముల నడిమిదిశ ఆగ్నేయము. దక్షిణపశ్చిమముల నడిమదిశ నైరృత్యము, పశ్చిమోత్తరముల నడిమిదిశ వాయవ్యము, పూర్వోత్తర

(ఇచ్ఛా) రాగము, (ద్వేషః) వైరము, (ప్రయత్నమ్) పురుషార్థము. సుఖము. దుఃఖము (జ్ఞానమ్) తెలివి. యీ గుణములు గలది జీవాత్మ.

ప్రాణాపాననిమేషోన్మేష జీవనమనోగతీంద్రియాంతర్వికారాః।
సుఖదుఃఖేచ్ఛా ద్వేషప్రయత్నాశ్చాత్మనో లింగాని ॥వై॥ అ.౩.ఆ.౨.సూ. ౪॥

వైశేషికమున నిది విశేషము. (ప్రాణః) వాయువును వెలుపలి నుండి లోపలికిఁ దీయుట (అపానః) వాయువును లోపలినుండి వెలుపలికి విడుచుట (ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములు) (నిమేషః) కంటిఱెప్పలు వాల్చుట (ఉన్మేషః) ఱెప్పలెత్తుట. (జీవనమ్) ప్రాణమును ధరించుట. (మనః) మననమనఁగా ఆలోచించుట (జ్ఞానము) (గతి) యథేష్టగమనము. (ఇంద్రియమ్) ఇంద్రియములను విషయములందుఁజేర్చి వానిని గ్రహించుట. (అంతర్వికారః) ఆఁకలి. దప్పి. జ్వరము. పీడ మొదలగు వికారములఁ బొందుట. సుఖము. దుఃఖము. ఇచ్ఛ. ద్వేషము. ప్రయత్నము. ఇవియన్నియు నాత్మలింగములు అనఁగా ఆత్మ గుణకర్మములు.

యుగపజ్జ్ఞానానుత్పత్తిర్మనసో లింగమ్॥న్యాయ॥అ.౧.ఆ.౧.సూ.౧౬॥

దేనివలన నాత్మకు ఒకేకాలమందు రెండుపదార్థముల జ్ఞానము కలుగదో అది మనస్సు. ఇట్లు ద్రవ్యస్వరూపలక్షణములు చెప్పఁబడినవి. ఇఁక గుణములు చెప్పఁబడును.

రూపరస గంధస్పర్శాః సంఖ్యాపరిమాణాని పృథక్త్వం సంయోగవిభాగౌ పరత్వాపరత్వే బుద్ధయః సుఖదుఃఖే ఇచ్ఛాద్వేషౌ ప్రయత్నాశ్చ గుణాః॥ వై॥అ.౧.ఆ.౧.సూ.౬॥

రూప, రస. గంధ. స్పర్శములు సంఖ్యా పరిమాణములు, పృథక్త్వము. సంయోగ విభాగములు, పరత్వ అపరత్వములు, బుద్ధులు. సుఖదుఃఖములు. ఇచ్ఛా ద్వేషములు. ప్రయత్నములు, గురుత్వ. ద్రవత్వ. స్నేహ. సంస్కార. ధర్మ అధర్మ. శబ్దములను నీయిరువది నాలుగును గుణములు.

ద్రవ్యాశ్రయ్యగుణవాన్ సంయోగవిభాగేష్వకారణ మనపేక్ష ఇతి గుణలక్షణమ్॥
వై॥ అ. ౧. ఆ. ౨. సూ. ౧౬॥

ద్రవ్యము నాశ్రయించి. (మఱియొక గుణమున కాశ్రయము గాక) సంయోగ విభాగములకుఁ గారణముకాక యొకటి మఱియొక దాని నపేక్షింప కుండునది గుణము.

శ్రోత్రేంద్రియంద్వారా గ్రహింపఁబడునది శబ్దము. ప్రయోగేదా విశ్వాసిత ఆకాశదేశంగల్దు. మహారాష్ట్ర చెవినిటొంది. బుద్ధికి గ్రహింపయోగ్యమై ప్రయోగముచేఁ ప్రకాశమై ఆకాశము దేశముగాఁగలది కాలము. నేత్రముచే గ్రహింపఁబడునది రూపము. జిహ్వచే గ్రహింపఁబడు తీపి మొదలగునది రసము. ముక్కుచే గ్రహింపఁబడునది గంధము. త్వక్కుచే గ్రహింపఁబడునది స్పర్శము. ఒకటిరెండు మొదలగు గణన కాధారమగునది సంఖ్య. దేనిచేఁ దూనిక అనఁగా బరువు. తేలిక విదితమగునో అది పరిమాణము. ఒకటి మరియొకదాని నుండి వేరగుట పృథక్త్వము. ఒకటి మరియొకదానితోఁ గూడుట సంయోగము. పరస్పరము కలిసి యుండున దనేక భాగములగుట విభాగము దీనికిది ముందు అనునది పరము; దీనికిది వెనుక అనునది అపరము. దేనివలన నుంచి చెడుగుం జ్ఞానము కలుగుచున్నదో అది బుద్ధి; సుఖమనఁగా ఆనందము. దుఃఖమనగా క్లేశము. ఇచ్ఛ అనఁగా రాగము. ద్వేషమనఁగా విరోధము. ప్రయత్నమనఁగా అనేక ప్రకారములగు బలము. పురుషార్థము. గురుత్వమనగా భారము ద్రవత్వమనఁగా కఱఁగుట. స్నేహమనఁగా ప్రేమ, జిడ్డు. సంస్కారమనఁగా ఇతర వస్తుయోగముచేఁగలుగు వాసన. ధర్మ మనఁగా న్యాయాచరణము. కఠినత్వాదులు. అధర్మమనఁగా అన్యాయాచరణము. కఠినత్వమునకు విరుద్ధమగు కోమలత ఈ యిరువదినాలుగును గుణములు.

ఉత్క్షేపణ మపక్షేపణమాకుంచనం ప్రసారణం గమనమితి కర్మాణి॥

వై॥అ.౧.ఆ.౧.సూ.౭॥

(ఉత్క్షేపణమ్) పై కెత్తుట (అవక్షేపణమ్) క్రిందికి దించుట (ఆకుంచనమ్) ముడుచుట (ప్రసారణమ్) వ్యాపింపఁజేయుట (గమనమ్) వచ్చుట. పోవుట తిరుగుట మొదలగునవి కర్మములు.

కర్మలక్షణము:—

ఏక ద్రవ్యమగుణం సంయోగవిభాగేష్వనపేక్ష కారణమితి కర్మలక్షణమ్॥

వై॥ అ. ౧. ఆ. ౧. సూ. ౧౭॥

(ఏకం ద్రవ్యమాశ్రయ ఆధారో యస్య తదేకద్రవ్యం, న విద్యతే గుణో యస్య యస్మిన్ వా తదగుణం సంయోగేషు విభాగేషు చాపేక్షా రహితం కారణం తత్కర్మలక్షణమ్; అథవా యత్క్రియతే తత్కర్మ, లక్ష్యతే యేన తల్లక్షణమ్,

కర్మణో లక్షణమ్ కర్మలక్షణమ్) ద్రవ్యము నాశ్రయించిగుణరహితమైనసంయోగ విభాగములకు అపేక్షారహిత కారణమైనది కర్మము.

ద్రవ్యగుణకర్మణాం ద్రవ్యం కారణం సామాన్యమ్॥ వై॥ అ.౧.ఆ.౧.సూ. ౧౮॥

ఏది కార్యద్రవ్యములకు. గుణములకు. కర్మములకు కారణద్రవ్య మై యది సామాన్యద్రవ్యము.

ద్రవ్యాణాం ద్రవ్యం కార్యం సామాన్యమ్॥ వై. అ.౧.ఆ.౧.సూ.౨౩॥

ద్రవ్యములకు కార్యద్రవ్యము కార్యభావముచే నన్నికార్యములో సామాన్యము. (కారణద్రవ్యములకు కార్యద్రవ్యము సామాన్యకార్యము)

ద్రవ్యత్వం గుణత్వం చ సామాన్యాని విశేషాశ్చ॥ వై ॥అ.౧.ఆ.౨.సూ.౫॥

ద్రవ్యములయందు ద్రవ్యత్వము. గుణములయందు గుణత్వము. కర్మములయందుఁ గర్మత్వము ఇవియన్నియును సామాన్యములనియు, విశేషములనియుఁ జెప్పఁబడును. ఏలయనఁగా ద్రవ్యములలో ద్రవ్యత్వము సామాన్యము; గుణత్వకర్మత్వములను బట్టి ద్రవ్యత్వము విశేషము. ఇట్లే అంతట నూహింపవలయును.

సామాన్యం విశేష ఇతి బుద్ధ్యపేక్షమ్॥ వై ॥అ.౧.ఆ.౨.సూ.౩॥

సామాన్య విశేషములు బుద్ధినిబట్టి యేర్పడుచున్నవి. ఎట్లనగా మనుష్యులలో మనుష్యత్వము సామాన్యము; పశుత్వాదులనుబట్టి విశేషము. స్త్రీత్వ పురుషత్వములలో బ్రాహ్మణత్వ క్షత్రియత్వ వైశ్యత్వ శూద్రత్వములుగూడ విశేషములు. బ్రాహ్మణులలో బ్రాహ్మణత్వము సామాన్యము క్షత్రియాదులను బట్టి విశేషము. ఇట్లే అంతట నూహింపనగును.

ఇహేదమితి యతః కార్యకారణయోః స సమవాయః॥ వై ॥అ.౭.ఆ.౨.సూ.౨౬॥

కారణములు-అవయవములయందు అవయవి-కార్యము, క్రియ క్రియావంతము, గుణము గుణి, జాతి వ్యక్తి, కార్యము కారణము, అవయవము అవయవి వీనికిఁ బరస్పరముగల నిత్యసంబంధము సమవాయము. వేరువేఱ

*నిత్యమైనదియు, ఏకమును, అనేకములయందుండునదియు, సామాన్యమనఁబడును. నిత్యద్రవ్యములయందుండునదియు, ఏకవ్యక్తియందుండునదియు, వ్యావర్తకమునైనది విశేషమనఁబడును

సదితి యతో ద్రవ్యగుణకర్మసు సా సత్తా ॥ వై॥ అ.౧.ఆ.౨.సూ.౭॥

ద్రవ్య గుణకర్మములయందు సత్ శబ్దము అన్వితమయి యుండును. అనఁగా (సద్ద్రవ్యమ్ సద్గుణః సత్కర్మ) సద్ద్రవ్యము, సద్గుణము, సత్కర్మ మని వర్తమాన కాలవాచక సత్ శబ్దము అన్నిటితో నన్వయించును.

భావోఽనువృత్తేరేవ హేతుత్వాత్సామాన్యమేవ ॥ వై॥ అ.౧.ఆ.౨.సూ.౪॥

అన్నిటితో ననువర్తమానమగు నీ సత్తారూపభావము మహాసామాన్యము. ఈ క్రమము భావరూప ద్రవ్యములయందుమాత్ర ముండును. అభావ మయిదు విధములు:—

మొదటిది :—

క్రియాగుణవ్యపదేశాభావాత్ ప్రాగసత్ ॥ వై॥ అ.౯.ఆ.౧.సూ.౧॥

క్రియాగుణముల విశేషనిమిత్తముల లేకుండుటచే (ప్రాక్) అనఁగా (ఉత్పత్తికి) పూర్వము (అసత్) లేనియుండెను. ఎట్లనఁగా ఘటవస్త్రాదుల ఉత్పత్తికి పూర్వముండవు. ఈ యభావము ప్రాగభావము.

రెండవది:—సదసత్ ॥ వై॥ అ.౯.ఆ.౧.సూ.౨॥

ఉండి లేకుండునది. ఎట్లనఁగా ఘటముత్పన్నమయి నశించిన(సదసత్) ప్రధ్వంసాభావమందురు.

మూడవది :—సచ్చాసత్ ॥ వై॥ అ. ౯. ఆ. ౧. సూ. ౪॥

ఉండియు లేకుండునది. ఎట్లనఁగా 'అగౌరశ్వోఽనశ్వో గౌః' ఇది గుఱ్ఱము ఆవు కాదు. ఇది ఆవు. గుఱ్ఱము కాదు; అనఁగా గుఱ్ఱమునందు ఆవు యొక్కయు ఆవునందు గుఱ్ఱముయొక్కయు, అభావమును. ఆవునందు ఆవు యొక్కయు గుఱ్ఱమునందు గుఱ్ఱముయొక్కయు భావమును ఉన్నది కాన ఇది అన్యోన్యాభావ మనఁబడును.

నాల్గవది:—

యచ్చాన్యదసదతస్తదసత్ ॥ వై॥ అ. ౯. ఆ. ౧. సూ. ౫॥

పైనఁ జెప్పిన మూఁడు అభావములకును భిన్నమైనది అత్యంతాభావము ఎట్లనఁగా (నరశృంగమ్) అనఁగా మనుష్యుని కొమ్ము(ఖపుష్పమ్) ఆకాశ పుష్పము (వంధ్యాపుత్రః) గొడ్రాలి కొమారుఁడు ఇత్యాదులు.

సదిత యతో ద్రవ్యగుణకర్మసు సా సత్తా ॥ వై౦ అ. ౧. ఆ. ౨. సూ. ౭॥

ద్రవ్య గుణకర్మములయందు సత్ శబ్ద మన్వితమయి యుండును. అనగా (సద్ద్రవ్యమ్ సత్ గుణః సత్కర్మ) సద్ద్రవ్యము, సద్గుణము, సత్కర్మ మని వర్తమాన కాలవాచక సత్ శబ్దము అన్నిటితో నన్వయించును.

భావో౽నువృత్తేరేవ హేతుత్వాత్సామాన్యమేవ॥ వై॥ అ. ౧. ఆ. ౨. సూ. ౪॥

అన్నిటితో అనువర్తమానమగు సత్తాయాభావము మహా సామాన్యము. ఈ క్రమము భావరూప ద్రవ్యములయందుమాత్ర ముండును.

అభావ మయిదు విధములు:-

మొదటిది :—

క్రియాగుణవ్యపదేశాభావా త్ప్రాగసత్ ॥ వై ॥ అ. ౯. ఆ. ౧. సూ. ౧॥

క్రియాగుణముం విశేషనిమిత్తములు లేకుండుటచే (ప్రాక్) అనగా (ఉత్పత్తికి) పూర్వము (అసత్) లేకయుండెను. ఎట్లనగా ఘటవస్త్రాదుల ఉత్పత్తికి పూర్వముండవు. ఈ యభావము ప్రాగ భావము.

రెండవది:—సదసత్॥ వై ॥అ. ౯. ఆ. ౧. సూ. ౨॥

ఉండి లేకుండుసది. ఎట్లనగా ఘటముత్పన్నమయి నశించిన(సదసత్) ప్రధ్వంసాభావమందురు.

మూడవది :—సచ్చాసత్ ॥ వై॥ అ. ౯. ఆ. ౧. సూ. ౪॥

ఉండియు లేకుండునది. ఎట్లనగా 'అగౌరశ్వో౽నశ్వో గౌః' ఇః గుఱ్ఱము ఆవు కాదు. ఇది ఆవు, గుఱ్ఱము కాదు; అనగా గుఱ్ఱమునందు ఆః యొక్కయు ఆవునందు గుఱ్ఱముయొక్కయు, అభావమును, ఆవునందు ఆః యొక్కయు గుఱ్ఱమునందు గుఱ్ఱముయొక్కయు భావమును ఉన్నది కాన ది అన్యోన్యాభావ మనబడును.

నాల్గవది:—

యచ్చాన్య దస దత స్తదసత్॥ వై॥ అ. ౯. ఆ. ౧. సూ. ౫॥

పైన జెప్పిన మూడు అభావములకును భిన్నమైనది అత్యంతా భావః ఎట్లనగా (నరశృంగమ్) అనగా మనుష్యుని కొమ్ము(ఖపుష్పమ్) ఆకా పుష్పము (వంధ్యాపుత్రః) గొడ్రాలి కొమారుడు ఇత్యాదులు.

వ్యాప్తి:—

నియతధర్మసాహిత్య ముభయోరేకతరస్య వా వ్యాప్తిః। నిజశక్త్యుద్భవ మిత్యా చార్యాః॥ ఆధేయశక్తియోగ ఇతిపఞ్చశిఖః ॥సాంఖ్య॥ అ. ౫. సూ. ౨౯. ౩౧. ౩౨॥

సాధ్యసాధనములు అనఁగా సిద్ధపఱుపఁబడుటకు యోగ్యమైనదియు, దేనిచే సిద్ధిచేయఁబడునో అదియు నను నీరెంటి సాహచర్యముగాని, లేక సాధన మాత్రపు నిశ్చితధర్మ సాహచర్యముగాని 'వ్యాప్తి' యనఁబడును. ధూమము నకును అగ్నికిని సాహచర్యమున్నట్లు. ॥౨౯॥ అట్లే వ్యాప్తమైన ధూమము, తన నిజశక్తిచే నుత్పన్నమగుచున్నది. అనఁగా ఈ ధూమము దేశాంతరము నకు దూరముగాఁ బోయినపుడు అగ్నిసంయోగము లేకయే స్వయముగా నుండును; దీనికే వ్యాప్తి యనిపేరు. ఛేదన భేదనరూపమగు అగ్నిసామర్థ్య ముచే జలాదిపదార్థము ధూమరూపముగాఁ బ్రకటమగుచున్నది.॥౩౧॥మహత్త త్త్వాదులయందలి ప్రకృత్యాదుల వ్యాపకతా ధర్మమునకు బుద్ధ్యాదుల యందలి వ్యాప్యతాధర్మమునకుఁగల సంబంధమునకుఁ 'వ్యాప్తి' యందురు ఆధేయరూప మగు శక్తికిని, ఆధారరూపమగు శక్తిమంతునకును సంబంధమున్నట్లు.॥౩౨॥ ఇత్యాది శాస్త్రప్రమాణాదులచేఁ బరీక్షించి చదువవలయును, చదివింపవలయును. ఇట్లుగాక వేరువిధముగా విద్యార్థులకు సత్యబోధ యెన్నటికినిగాఁజాలదు. ఏ గ్రంథమును జదివించినను పూర్వోక్తప్రకారము పరీక్షించి సత్యమని తెలి సప్పుడే చదివింపవలయును. ఈ పరీక్షచే విరుద్ధమని తెలిన గ్రంథములను జది వింపఁగూడదు, ఏలయనఁగా:—

లక్షణప్రమాణాభ్యాం వస్తుసిద్ధిః॥

లక్షణముచేత — "గంధవతీ పృథివీ" [న్యా. వా. భా. ౩।౧।౨౮] గంధముగలది పృథివి, అనునిట్టి లక్షణములచేతను, ప్రత్యక్షాది ప్రమాణముల చేతను సమస్త సత్యా సత్యముల - పదార్థముల నిర్ణయమగును. ఇది లేక యేమియుఁ గాఁజాలదు.

## పఠన-పాఠన విధి

ఇకఁ జదువవలసినవిధియుఁ జదివింపవలసిన విధానమును వ్రాయఁ బడును. మొదట పాణిని మునికృత మాత్రరూపమగు శిక్షను అనఁగా ఈ యక్షర

మునకు నిది స్థానము. ఇది ప్రయత్నము. ఇది కరణము అని నేర్పవలయును. ఎట్లనఁగా 'ప'దీనికి ఓష్ఠము స్థానము, స్పృష్టప్రయత్నము. నాలుకతోఁ జేయ వలసిన క్రియ కరణము. ఇట్లు యథాయోగ్యముగా నక్షరములన్నిఁటి యుచ్చా రణమును దల్లియుఁ దండ్రియు నాచార్యులు నేర్పవలయును. పిమ్మట వ్యాకర ణము: అనఁగా మొదట అష్టాధ్యాయి సూత్రములను (వృద్ధిరాదైచ్) ఇట్లు కంఠస్థము చేయింపవలయును. దీనిని సూత్రపాఠమందురు. పిమ్మట 'వృద్ధిః 'ఆత్ ఐచ్ వా అదైచ్' ఇట్లు పదచ్ఛేదముమ 'అచ్చ ఐచ్చ అదైచ్' ఇట్లు సమాసమును. 'అదైచాం వృద్ధి సంజ్ఞా క్రియతే', అనఁగా ఆ, ఐ, ఔ, వీనికి వృద్ధిసంజ్ఞ అని యిట్లర్థమును. పిమ్మట 'తః పరో యస్మాత్స తపర స్తాదపి పర స్తపరః.' తకారమునకుఁ బరమందేదియుండునో తకారము దేనికిఁ బర మందుండునో ఆరెంటికిని తపరసంజ్ఞ యగును. కాఁబట్టి ఆకారమునకుఁ బర మందుండు తకారమును, తకారమునకుఁ బరమందుండు ఐచ్ ఇవి రెండు తపర ములవియు హ్రస్వప్లుతములకు వృద్ధిసంజ్ఞ లేదని తెలుపుటయే యీ తపర ప్రయోజనమనియుఁ జూపవలయును. తరువాత ఉదాహరణము అనఁగా(భాగః) 'భజ్' ధాతువునకు 'ఘఞ్' ప్రత్యయము పరమై ఈ ప్రత్యయమున కిత్సంజ్ఞ కలిగి లోపముకాఁగా 'భజ్ అ' అను రూపమేర్పడి, ఇందు జకారమునకుఁ బూర్వమందుండు భకారోత్తర అకారమునకు వృద్ధిఅనఁగా ఆకారమయి 'భాజ్' రూపమేర్పడి. దీని జకారమునకు గకార మాదేశమై అది అకారముతోఁ గూడు టచే 'భాగః' అను రూపమేర్పడును. (అధ్యాయః) అధిపూర్వక 'ఇఙ్'ధాతువు నకు 'ఘఞ్' ప్రత్యయము పరమయినపుడు ధాతువులోని 'ఇ'కారమునకు వృద్ధి యయి 'ఐ' అగును. అది 'ఆయ్' అయి ప్రత్యయ-అకారముతోఁ జేరి 'ఆయః' అయి పిమ్మట (అధి + ఆయః) అధ్యాయః అగును. (నాయకః) 'ణ్వుల్' ప్రత్యయము పరమైనపుడు 'నీఞ్'ధాతు ఈకారమునకు వృద్ధియగు ఐకారమును దానికి 'ఆయ్' యునై నాయక, అని యేర్పడుచున్నది. (స్తావకః) 'స్తు' ధాతు వునకు 'ణ్వుల్' ప్రత్యయము పరమయి ధాతువులోని హ్రస్వ ఉకార స్థానమందు వృద్ధియయి దానికి ఆవ్ ఆదేశమయి అకారముతోఁ గలసి 'స్తావకః' అనురూప మేర్పడుచున్నది. (కారకః)కృఞ్ ధాతువునకు 'ణ్వుల్' ప్రత్యయము పరమయి. లకారమునకు ఇత్సంజ్ఞ కలిగి లోపమయి. ఋకారస్థానమందు 'ఆర్'ఆదేశమును.

ఋకారస్థానమందు 'అర్' వృద్ధియనయి 'కారకః' శబ్దమేర్పరుచున్నది. అవి ఉదాహరణములచే దెలుపవలయును. ప్రయోగమున ముందు వెనుకల నేయే సూత్రములు వాడఁబడునో వాని కార్యములన్నియుఁ జూపవలయును. కాతి పంక్తి మీఁదఁగాని క్రిందిపంక్తి మీఁదగాని మొదట మూలరూపము 'లక్' వ్రాసి పిమ్మట 'ఘఞ్' 'సు' ప్రత్యయములు గలసిన 'లక్ + ఘఞ్ + సు' రూపమును తరువాత మొదట ఘకారమును పిమ్మట ఞకారమును లోపము కాఁగా నేర్పడిన లక్ + అ + సు రూపమును, అవల అకారమునకు వృద్ధియు, ఐకారమునకు గకారమునయి యేర్పడిన 'లాగ్' అ. సు. రూపమును తరువాత అకారముతోఁ గలసి యేర్పడిన 'లాగ' + సు రూపమును, పిమ్మట ఉకారమునకు ఇత్సంజ్ఞయు, సకారస్థానమందు రుకారముకలిగి మరల ఉకారమునకు ఇత్సంజ్ఞచే లోపము కలిగి యేర్పడిన 'లాగర్' రూపమును, ఈ రూపముతో నుండు రేఫమునకు (ః) విసర్జనీయమయి యేర్పడిన 'లాగః' రూపమును సిద్ధమయినట్లు వ్రాసి చూపవలయును. ఏయే సూత్రముచే నేయే కార్యమగుచున్నదో దానినిఁ జదివించుచు నాయా కార్యములు స్పష్టమగునట్లు వ్రాయించుచుఁ జదివించిరేని బహు శీఘ్రముగా దృఢబోధ కాఁగలదు. ఒక పర్యాయ మీరీతిని అష్టాధ్యాయి చదివించి పిమ్మట సర్వ సహితముగ ధాతుపాఠమును, దశలకారముల రూపమును ప్రక్రియా సహితముగ సూత్రముల ఉత్సర్గము అనఁగా సామాన్య సూత్రమును, ఎట్లనఁగా 'కర్మణ్యణ్' కర్మఉపపదముగాగూడియుండు ధాతుమాత్రమునకు అణ్ ప్రత్యయమగుననియు, (ఉ: కుంభకారః) పిమ్మట అపవాదసూత్రము అనఁగా 'ఆతోనుపసర్గేకః' ఉపసర్గరహితమగు కర్మఉపపదముగా నున్నపుడు ఆకారాంతధాతువునకు 'క' ప్రత్యయమగు ననియును; కర్మోపపదముతోఁ గూడియుండెడి ధాతువు లన్నిటికి 'అణ్' ప్రత్యయమగు ననుమాత్రము బహువ్యాపకమై యుండఁగా ఈ పూర్వసూత్రవు విషయమునుండి–దానికంటె విశేషము ననఁగా నల్పవిషయమును–ఆకారాంతధాతువులకు 'క' ప్రత్యయమగు ననునది గ్రహించును. ఎట్లు చక్రవర్తి రాజ్యమందు మాండలికరాజులకును, భూమియందలి వారికందఱికిని ప్రవృత్తి గలిగి మాండలిక రాజ్యమందుఁ జక్రవర్తికి ప్రవృత్తి కలుగదో, అట్లు ఉత్సర్గమందు అపవాద సూత్రమునకుఁ బ్రవృత్తికలిగి, అపవాదసూత్ర విషయమందు ఉత్సర్గసూత్రమునకుఁ బ్రవృత్తికలుగదు అనియును నేర్పవలయును. ఈరీతిని

పాణినిమహర్షి వేయి శ్లోకము (సూత్రము) లలో నఖిలశబ్దార్థ సంబంధమైన విద్యను ప్రతిపాదించి యున్నవాఁడు. ధాతుపాఠమునకుఁ బిమ్మట ఉణాదిగణ మును జదివించుచు సర్వసుబంతముల విషయమును జక్కఁగా నేర్పి మరల రెండవ పర్యాయము శంకాసమాధానము వార్తిక, కారిక, పరిభాషలను లక్ష్య పూర్వకముగా నష్టాధ్యాయి ద్వితీయానువృత్తి చేయింపవలయును తరువాత మహాభాష్యమును జదివింప వలయును. అనఁగాఁ జదువువారును, జదివించు వారును బుద్ధిమంతులును, పురుషార్థులును, నిష్కపటులును, విద్యావృద్ధిని గోరు వారును నయి నిత్యము చదివి–చదివించిరేని పదునెనిమిది మాసములలో నష్టా ధ్యాయియు,పదునెనిమిది మాసములలో మహాభాష్యమును జదివి మూఁడేండ్లలోఁ బూర్ణవైయ్యాకరణులై, లౌకిక వైదికశబ్దముల ప్రయోగములు గ్రహించి అన్యశాస్త్రములను సహజముగాఁ ద్వరలోఁ జదువ-చదివింపఁ గలుగుదురు. కాని వ్యాకరణమందుఁ జేయవలసినంత విశేషశ్రమ తక్కిన శాస్త్రములందుండదు. అష్టాధ్యాయి మహాభాష్యములఁ జదువుటవలన మూఁడేండ్లలోఁ గలుగునంత బోధకుగ్రంథములు అనఁగా సారస్వతము, చంద్రిక, కౌముది, మనోరమాదు లను జదువుటచే నేఁబది సంవత్సరములలోను గలుగఁజాలదు. ఏలయనఁగా మహాశయులగు మహర్షులు సహజముగాను గొప్పగొప్ప విషయములను దమ గ్రంథములందుఁబ్రకాశపఱచినట్లు క్షుద్రాశయులగు నీ మనుష్యుల కల్పితగ్రంథ ములఁ దెట్లుండఁ గలుగును? మహర్షుల ఆశయము వీలయినంతవఱకు సుగమ ముగను, స్వల్పకాలములో గ్రహింపఁ దగినదిగను ఉండును. క్షుద్రాశయులకు వీలయినంతవఱకుఁ గఠినముగా రచింపవలెనను ఆశయముండును. కాఁబట్టి వారి గ్రంథములను మిక్కిలి పరిశ్రమచేసి చదువుటవలనఁ గొండనుద్రవ్వి యెలుకను బట్టినట్లు అల్పలాభమే కలుగును. ఆర్షగ్రంథములను జదువుటయో ఒక్కమును కతో అమూల్యములగు ముత్యములను బొందినట్లుండును. వ్యాకరణమును జదివిన పిమ్మట యాస్కమునికృత నిఘంటు నిరుక్తములను, ఆఱుమాసములలోఁగాని, యెనిమిది మాసములలోగాని అర్థసహితముగ చదువవలయును; చదివింపవల యును. నాస్తికకృతములగు అమరకోశాది-ఇతర గ్రంథములయందుఁ గాలము వ్యర్థపుచ్చకూడదు. పిమ్మటఁ బింగలాచార్యకృతమగు ఛందోగ్రంథమును జదివి వైదిక లౌకికచ్ఛందముల పరిజ్ఞానమును నవీనరచనయు శ్లోకరచనారీతిని జక్కగా

నేర్వవలయును. ఈ గ్రంథమును, శ్లోకరచనయుఁ, ప్రస్తారమును నాలుగు మాస
ములలో నేర్చి, చదివింపఁగలుగుదురు. వృత్తరత్నాకరము మొదలగు అల్ప
బుద్ధి ప్రకల్పిత గ్రంథములందు అనేక వర్షములు వృథాచేయఁగూడదు. పిమ్మట
దుర్వ్యసనములను దూరముచేసి యుత్తమ సభ్యతను గలిగించునట్టి మనుస్మృతి,
వాల్మీకీయ రామాయణము, మహాభారతమందలి యుద్యోగ పర్వాంతర్గత విదు
రనీతి మొదలగు మంచి ప్రకరణములను గావ్యరీతిని అనఁగా పదచ్ఛేద పదార్థో
క్త్యన్వయ విశేష్య విశేషణ భావార్థములతో నధ్యాపకులు నేర్పవలయును. విద్యా
ర్థులు నేర్వవలయును. ఒక సంవత్సరములో వీనిఁ జదివి పిమ్మటఁ బూర్వమీ
మాంసా వైశేషిక న్యాయ సాంఖ్య వేదాంతములను వీలయినంతవఱకు ఋషికృత
వ్యాఖ్యాన సహితముగ- లేనియెడల ఉత్తమ విద్వాంసుల సరళ వ్యాఖ్యాన యుక్త
ముగఁ జదువవలయును. కాని వేదాంతసూత్రములను జదువుటకుముందు ఈశ,
కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, ఐతరేయ, తైత్తిరీయ, ఛాందోగ్య,
బృహదారణ్యకములను పది యుపనిషత్తులను జదివి, షట్ఛాస్త్రముల భాష్యము
లను, వృత్తిసహిత సూత్రములను రెండుసంవత్సరములలోఁ జదువవలయును;
చదివింపవలయును. తరువాత నాలుగు సంవత్సరములలో నాలుగు బ్రాహ్మ
ణములు— ఐతరేయ, శతపథ, సామ, గోపథము లనెడి బ్రాహ్మణములతో
నాలుగు వేదములను స్వర, శబ్ద, అర్థ, సంబంధ, క్రియాసహితముగఁ జదువ
వలయును. దీనికిఁ బ్రమాణము:—

> స్థాణురయం భారహారః కిలాభూదధీత్య వేదం న విజానాతి యోఽర్థమ్ ।
> యోఽర్థజ్ఞ ఇత్సకలం భద్రమశ్నుతే నాకమేతి జ్ఞానవిధూతపాప్మా ॥ నిరు. ౧-౧౮ ॥

వేదమును స్వరముతోఁ బాఠముమాత్రముఁ జేసి అర్థమెఱుంగని వాఁడు
కొమ్మలతోను, ఆకులతోను, పూలతోను, పండ్లతోను గూడు కొన్న వృక్షము
వలెను, ధాన్యాదులను మోయు పశువువలెను భారవాహుఁడు—బరువును మోయు
వాఁడు. వేదమును జదివి యథారీతిని అర్థముగూడ తెలిసినవాఁడే సంపూర్ణా
నందమును బొంది జ్ఞానముచేఁ బాపమునుండి విడివడి ధర్మాచరణబలమువలన
దేహాంత మైనపిమ్మట సర్వానందమును బొందుచున్నవాఁడు.

> ఉత త్వః పశ్యన్న దదర్శ వాచముత త్వః శృణ్వన్న శృణోత్యేనామ్ ।
> ఉతో త్వస్మై తన్వం౧ విసస్రే జాయేవ పత్య ఉశతీ సువాసాః ॥
> ఋ॥ మం-౧౦।। సూ-౭౧।। మం-౪ ॥

విద్వాంసుఁడు కానివాఁడు వినుచుండియు వినఁడు; చూచుచుండియు జూడఁడు; చెప్పుచుండియుఁ జెప్పఁడు. అనగా విద్వాంసులు కాని వారు ఈ విద్యావాణి రహస్యముఁ దెలియఁజాలరు. కాని శబ్ద, అర్థ, సంబంధములను దెలియు విద్వాంసులకు విద్య, సుందర వస్త్రభూషణములను ధరించి తన పతినిఁ శరీరమును గామించునట్టి స్త్రీ తన స్వరూపమును బ్రకాశపఱచు చఱియెదుట నట్లు తన స్వరూపమును బ్రకాశపఱచును; అవిద్వాంసులకుఁ గాదు.

ఋచో అక్షరే పరమే వ్యోమన్ యస్మిన్ దేవా అధి విశ్వేనిషేదుః ।
యస్తన్నవేద కిమృచా కరిష్యతి య ఇత్తద్విదుస్త ఇమే సమాసతే ॥

ఋ॰ మం౧।సూ౧౬౪।మం౩౯॥

వ్యాపకుఁడు, అవినాశియు సర్వోత్కృష్టుఁడు నగు నేపరమేశ్వరుని యందు సమస్త విద్వాంసులును, పృథివీ సూర్యాది సమస్త లోకములు నున్నవో, ఎవనియందు వేదముల ముఖ్యతాత్పర్యమున్నదో, అట్టిబ్రహ్మను దెలియని వాఁడు ఋగ్వేదాదులచేత సుఖ మేమయినను బొందఁగలడా? పొందలేడు. కాని వేదములను జదివి ధర్మాత్ములును, యోగులునయి యాబ్రహ్మను దెలిసినవారే పరమేశ్వరునియందు స్థితులై ముక్తిరూప పరమానందమును బొందుదురు. కాఁబట్టిఅంతయు సర్వజ్ఞాన సహితముగఁ జదువవలయును, చదివింపవలయును. ఈ ప్రకారము వేదముల నన్నటినిఁ జదివి ఆయుర్వేదము అనఁగా ఋషిముని ప్రణీతములగు చరకసుశ్రుతాది వైద్యశాస్త్రమును, అర్థ, క్రియా, శస్త్రభేదన, లేపన, చికిత్సా, నిదాన, ఔషధ, పథ్య, శరీర, దేశ, కాల, వస్తువుల గుణ జ్ఞాన పూర్వకముగ నాలుగు సంవత్సరములలోఁ, జదువవలయును, చదివించ వలయును. పిమ్మట ధనుర్వేదము— రాజ సంబంధమయిన విద్య. దీనియందు రెండు విధము లున్నవి. ఒకటి: రాజ పురుష సంబంధ మయినది, రెండవది: ప్రజా సంబంధమయినది. రాజకార్యమందు సమస్త సేనాధ్యక్షులు అనఁగా శత్రువులతో యుద్ధము చేయుట కవసరమగు శస్త్రాస్త్ర విద్యను — ఈ కాలమందు 'కవాయతు' అనఁబడు నానావిధములగు వ్యూహరచనాభ్యాస మును యథారీతిని నేర్చి, ప్రజలను పాలించు రీతిని వారు అభివృద్ధికి వచ్చు విధమును గుర్తెఱింగి ప్రజలనందఱిని న్యాయ పూర్వకముగఁ బ్రసన్నతతో నుంచుటను, దుష్టులను యథాయోగ్యముగ దండించి శ్రేష్ఠులను

పాలించు ప్రకారముల నన్నివిధముల నేర్వవలయును. ఈ రాజవిద్యను రెండు సంవత్సరములలో నేర్చి తరువాత గానవిద్య యనఁబడు గాంధర్వవేదమనఁగా స్వర, రాగ, రాగిణీ, సమయ, తాల, గ్రామ, తాన, వాదిత్ర, నృత్య, గీతాదులను నేర్వవలయును. కాని ముఖ్యముగ సామవేద గానమును వాదిత్రవాదన పూర్వకముగ నేర్వవలయును. ఈ విషయమందు నారదసంహిత మొదలగు ఆర్ష గ్రంథములను జదువవలయునేకాని విషయాసక్తి కారకములగు వేశ్యలయు. వైరాగులయు గార్దభ స్వరమువంటి వ్యర్థాలాపనల నెప్పుడును జేయఁగూడదు. తరువాత శిల్పవిద్యయనఁబడు అర్థవేదమనఁగా పదార్థ, గుణ, విజ్ఞాన, క్రియా కౌశలములను, నానావిధ పదార్థముల నిర్మాణమును, పృథివి మొదలుకొని ఆకాశ పర్యంతపువిద్యను యథారీతిని జదివి అర్థమును - ఐశ్వర్యమును వృద్ధిపఱచు విద్యను నేర్వవలయును. పిమ్మట రెండేండ్లలో సూర్యసిద్ధాంతాది జ్యోతిష శాస్త్రమునందలి బీజగణిత, అంకగణిత, భూగోల, ఖగోల, భూగర్భ విద్యలను నేర్వవలయును. తదనంతర మన్నివిధముల చేతిపనుల, యంత్రపరిశ్రమాదులను నేర్వవలయును. కాని గ్రహ, నక్షత్ర, జాతక, రాశి, ముహూర్తాదులఫలములను విధించు గ్రంథములన్నియు నసత్యములని తెలియవలయును. వీనినెన్నఁటికిని జదువఁగూడదు; చదివింపనుగూడదు. ఇఱువదిలేక ఇఱువదియొక్క సంవత్సరములలో సమగ్ర విద్యను, ఉత్తమ శిక్షను పొంది కృతకృత్యులై సదా యానందమునొందఁ గలుగునట్టి ప్రయత్నమును జదువువారలును జదివించు వారలును జేయవలయును. ఈ రీతి ఇఱువది, ఇరువదియొక్క సంవత్సరములలోఁ గలుగునంత విద్య అన్యవిధముగా నూఱుసంవత్సరములలోను గలుగఁజాలదు. ఋషులు విద్వాంసులును, శాస్త్రవేత్తలును, ధర్మాత్ములు నయియుండిరి: కాఁబట్టి ఋషిప్రణీత గ్రంథములనే చదువవలయును. ఋషులు కానివారు పక్షపాత సహితమగు నాత్మఁ గలిగి అల్పశాస్త్రములను జదివియుందురు; కాఁబట్టి: వారు రచించిన గ్రంథములును అట్టులే యుండును; కనుక వానినిఁ జదువఁగూడదు.

ఋషిప్రణీత గ్రంథములు:— పూర్వమీమాంస: దీనిపై వ్యాసముని వ్యాఖ్య: వైశేషికము. దీనిపై గౌతమముని భాష్యము: న్యాయసూత్రములు: దీనిపై వాత్స్యాయనముని భాష్యము; పతంజలిముని యోగసూత్రములు:

వీనిపై వ్యాసముని భాష్యము; కపిలముని సాంఖ్యసూత్రములు: వీనిపై భాగురి ముని భాష్యము; వ్యాసముని వేదాంతసూత్రములు: వీనిపై వాత్స్యాయనముని భాష్యము లేక బోధాయనముని భాష్యము వృత్తి సహితముగ చదువవలయును; చదివింపవలయును. పూర్వ మీమాంసాది సూత్రములను కల్పాంగములందు గణింపవలయును. ఋక్, యజుస్, సామ, అథర్వములను నాలుగు వేదములు ఈశ్వరకృతము లయినట్లు ఐతరేయము, శతపథము, సామము, గోపథము అను నాలుగు బ్రాహ్మణములును, శిక్ష కల్ప వ్యాకరణ నిరుక్త ఛందో జ్యోతిషములను నాఱు వేదాంగములును; ఉపాంగములగు మీమాంసాది ఆఱు శాస్త్రములను; ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వవేదము, అర్థవేదము, అను నాలుగు ఉపవేదములును ఋషిమునికృత గ్రంథములు. వీనిని జదువవలయును చదివింపవలయును. వీనియందును వేదవిరుద్ధమని ప్రతీతమయిన వానిని ద్యజింపవలయును. ఏలయనఁగా వేద మీశ్వరకృత మగుటచే నిర్భ్రాంతమును, స్వతః ప్రమాణమును. అనఁగా వేదమునకుఁ బ్రమాణము వేదమే. బ్రాహ్మణాది తక్కిన గ్రంథములన్నియుఁ బరతః ప్రమాణములు. అనఁగా వీని ప్రమాణత వేదాధీనము. వేదవిషయమగు విశేషవ్యాఖ్య ఋగ్వేదాది భాష్యభూమిక యందుఁ జూచుఁడు. ఈ గ్రంథమందును ముందు వ్రాయఁబడును. ఇంకఁ బరిత్య జించుటకు యోగ్యమగు గ్రంథ పరిగణనము సంక్షేపముగ వ్రాయఁబడును:— అనఁగా ఈ క్రింద వివరింపఁబడు గ్రంథములు కల్పిత గ్రంథములని తెలియ వలయును.

వ్యాకరణము :- కాంత్రత, సారస్వత, చంద్రిక, ముగ్ధబోధ, కౌముది, శేఖర, మనోరమాదులు.

నిఘంటువు:-అమరకోశాదులు.

ఛందస్సు:-వృత్తరత్నాకరాదులు.

శిక్ష:-'అథ శిక్షాం ప్రవక్ష్యామి పాణినీయమతం యథా' ఇత్యాదులు.

జ్యోతిషము:—ముహూర్త చింతామణి, శ్రీబ్రహ్మబోధాదులు.

కావ్యము:—నాయికాభేద, కువలయానంద, రఘువంశ, మాఘ, కిరాతార్జునీయాదులు.

మీమాంస:—ధర్మసింధు, వ్రతార్కాదులు.

వైశేషికము:—తర్కసంగ్రహాదులు.

న్యాయము:—జాగదీశ్యాదులు.

యోగము:—హఠప్రదీపికాదులు.

సాంఖ్యము:—సాంఖ్యతత్త్వకౌముద్యాదులు.

వేదాంతము:—యోగవాసిష్ఠ, పంచదశ్యాదులు.

వైద్యము:—శార్ఙ్గధరాదులు.

స్మృతులు:—మనుస్మృతి యందలి ప్రక్షిప్తశ్లోకములు. తక్కిన యన్ని స్మృతులు.

సకల తంత్ర గ్రంథములు, పురాణములు, ఉపపురాణములు, తులసీదాస రామాయణము, రుక్మిణీమంగలాది భాషాగ్రంథములు. ఇవి యన్నియు గపోలకల్పిత మిథ్యాగ్రంథములు.

ప్రశ్న:—ఈ గ్రంథములందు సత్యమేమియు లేదా?

ఉత్తరము:— కొంచెము సత్యమున్నది. కాని అసత్యము లనేకము లున్నవి కావున (విషసంపృక్తాన్నవత్త్యాజ్యాః) అత్యుత్తమమయినను విషము గలిసిన యన్నమువలె వీనిని వదలుట యోగ్యము.

ప్రశ్న:—మీరు పురాణేతిహాసములను నమ్మరా?

ఉత్తరము:—సత్యమైనవానిని నమ్ముదుము: అసత్యమును నమ్మము.

ప్రశ్న:—సత్యమేది? మిథ్యయేది?

ఉత్తరము:— (బ్రాహ్మణానీతిహాసాన్ పురాణాని కల్పాన్ గాథా నారాశంసీరితి) ఇది గృహ్యసూత్రాదుల వచనము. పై, జెప్పఁబడిన ఐతరేయ శతపథాది బ్రాహ్మణములకే ఇతిహాస, పురాణ, కల్ప, గాథానారాశంసులని యయిదు పేళ్ళు. శ్రీ భాగవతాదులు పురాణములుగావు.

ప్రశ్న:—త్యాజ్య గ్రంథములయందలి సత్యము నేల గ్రహింపరు?

ఉత్తరము: — దానియందలి సత్యము వేదాదిశాస్త్రముల యందలిది; మిథ్యయంతయు కర్తలది. వేదాది సత్యశాస్త్రములను స్వీకరించుటచే సత్యమంతయు గ్రహింపఁబడుచున్నది. ఎవఁడేని ఈ మిథ్యా గ్రంథములనుండి

సత్యమును గ్రహింప నెంచెనేని మిథ్యయు నతని కంఠమునఁ జుట్టుకొనును. కాఁబట్టి (అసత్యమిశ్రం సత్యం దూరతస్త్యాజ్యమ్) విషయుక్తమగు నన్నము వలెనే అసత్యయుక్తమగు గ్రంథస్థ సత్యమును గూడ వదలిపెట్టవలయును.

ప్రశ్న:—మీ మతమేది?

ఉత్తరము:—వేదము; అనఁగా వేదము విధించినవానిని యథావిధిగఁ జేయుటయు, నిషేధించినవానిని వదలుటయు నమ్ముచున్నాము; వేదము మాకు మాన్యము; కాఁబట్టి మా మతము వేదము. ఇట్లు నమ్మి మనుష్యులందఱు ముఖ్యముగ నార్యు లేకమతులై యుండఁదగును.

ప్రశ్న:—ఇతర గ్రంథములలో, సత్యాసత్యములలో పరస్పర విరోధ మున్నట్లు అన్యశాస్త్రములలోను గలదు. ఎట్లనఁగా షట్ఛాస్త్రములయందు సృష్టి విషయమునఁ బరస్పర విరోధమున్నది చూడుఁడు:— మీమాంసయందుఁ గర్మము చేత, వైశేషికమందుఁ గాలముచేత, న్యాయమందుఁ బరమాణువులచేత, యోగ మందుఁ బురుషార్థముచేత, సాంఖ్యమందుఁ బ్రకృతిచేత, వేదాంతమందు బ్రహ్మ చేత ప్రపంచోత్పత్తి వ్రాయఁబడి యున్నది. ఏమి? ఇది విరోధముకాదా?

ఉత్తరము:—సాంఖ్య వేదాంతములయందుఁ దప్ప తక్కిన నాలుగు శాస్త్రములయందు ప్రపంచోత్పత్తి ప్రసిద్ధముగా వ్రాయఁబడి యుండలేదు; ఉండినను విరోధములేదు, మీకు విరోధావిరోధజ్ఞానము లేదు. విరోధ మెట్టి స్థలమునఁ గలుగుచున్నదో తెల్పుఁడు. విరోధము ఏక విషయమందా భిన్న విషయమందా?

ప్రశ్న:— ఏకవిషయమం దనేకుల పరస్పర విరుద్ధ కథనము విరోధము. ఇక్కడను ఏకవిషయమగు సృష్టియందే విరోధము.

ఉత్తర:—విద్య యొక్కటా రెండా? ఒకటే యయ్యెనేని వ్యాకరణము వైద్యము, జ్యోతిషము మొదలగునవి వేలయున్నవి? ఒకే విద్యయందుఁ అ విద్యయొక్క పరస్పర భిన్నములగు ననేకావయవములు ప్రతిపాదింపఁబడు చున్నట్లే సృష్టి విద్యయొక్క భిన్నభిన్నములగు నాఱవయవముల నాఱు శాస్త్రములు ప్రతిపాదించుటవలన వానియందు విరోధమేమియులేదు. కుండ చేయుటయందు కర్మ, కాలము, మన్ను, ఆలోచన, సంయోగవియోగాది

ప్రయత్నము, ప్రకృతి గుణము, కుమ్మరియు కారణము లైనట్లే సృష్టికిఁ గారణమగు కర్మము మీమాంసయందును, సమయము వైశేషికమందును, ఉపాదానము న్యాయమందును, పురుషార్థము యోగమందును, తత్త్వముల క్రమానుసారియగు పరిగణనము సాంఖ్య మందును, నిమిత్తకారణమగు పరమేశ్వరుని వ్యాఖ్య వేదాంతమందును ఉన్నది. వీనియందు విరోధ మేమియు లేదు. వైద్యశాస్త్రమందు నిదానము, చికిత్స, ఔషధము, పానము, పథ్యము, వీని ప్రకరణములు భిన్నములుగాఁ జెప్పబడియున్నను అన్నిటియొక్క సిద్ధాంతము రోగనివృత్తి. అట్లే సృష్టికిని ఆఱు కారణములున్నవి. వీనియందు ఒక్కొక్కదాని వ్యాఖ్య ఒక్కొక్క శాస్త్రకారుఁడు చేసియున్నాఁడు. కాఁబట్టి వీనియందు నేమియు విరోధములేదు. దీనిఁగూర్చిన విశేషవివరణములు సృష్టి ప్రకరణమందుఁ జెప్పుదుము.

విద్యఁ జదువుటయందును జదివించుటయందును గలుగు విఘ్నములను వదలిపెట్టవలయును. ఆ విఘ్నము లెవ్వియనఁగా:—

దుస్సహవాసము:—దుష్టులయు, కాముకులయు స్నేహము, దుర్వ్యసనము-మద్యాదిసేవనము,వేశ్యాగమనాదులు.బాల్యవివాహము-పురుషుఁడు ఇఱువదియైదవయేటికిఁ బూర్వమును, స్త్రీ పదునారవయేటికిఁ బూర్వమును వివాహమాడుట; పూర్ణ బ్రహ్మచర్యము నడుపకపోవుట: రాజు, తల్లి, తండ్రి విద్వాంసుల ప్రేమ, వేదాదిశాస్త్రముల ప్రచారమున లేకపోవుట; అతిభోజనము, అతిజాగరణము, పఠనపాఠనములందును బరీక్షల నిచ్చివుచ్చుకొనుటలో అలసత్వ కపటములు చేయుట, విద్యాలాభము సర్వోత్తమమని గ్రహింపకుండుట; బ్రహ్మచర్యముచే బలము, బుద్ధి, పరాక్రమము, ఆరోగ్యము, రాజ్యము, ధనము, వృద్ధియగునని నమ్మకుండుట; ఈశ్వరుని ధ్యానమును వదలి పాషాణాది జడమూర్తుల దర్శన పూజలయందు వ్యర్థముగాఁ గాలముఁ బుచ్చుట; తల్లి, తండ్రి, అతిథి, గురువు, విద్వాంసులను సత్యమూర్తులుగా భావించి సేవింపకుండుట, ఉపదేశము గ్రహింప కుండుట, వర్ణాశ్రమ ధర్మములను విడిచి ఊర్ధ్వపుండ్రము త్రిపుండ్రము, మాలలు తిలకము, ధరించుట, ఏకాదశి త్రయోదశ్యాది వ్రతము లొనర్చుట; కాశ్యాదితీర్థములచేతను, రామ, కృష్ణ, నారాయణ, శివ, భగవతీ, గణేశాది నామస్మరణచేతను పాపములు దూరమగునని నమ్ముట; పాషండుల

యుపదేశముచేత విద్య చదువుటయందు అశ్రద్ధ వహించుట. విద్య. ధర్మము. యోగము. పరమేశ్వరోపాసనమును వానిచేతఁగాక మిథ్యాపురాణములగు భాగవతాదుల కథాదులచే ముక్తికలుగునని నమ్ముట; లోభముచే ధనాదులయందుఁ బ్రవృత్తులై విద్యయందుఁ బ్రీతి యుంచకపోవుట; ఇక్కడ నక్కడ వ్యర్థముగాఁ దిరుగుచుండుట; ఇత్యాది మిథ్యా వ్యవహారములందుఁ దగులబడి విద్య, బ్రహ్మచర్యముల లాభము నొందక రోగులును. మూర్ఖులునై పోవుచున్నారు. ఇప్పటి సాంప్రదాయకులు స్వార్థులునగు బ్రాహ్మణాదులు ఇతరులను విద్య సత్సంగములనుండి తొలఁగించి తమ వలలయందుఁ జిక్కించుకొని. వారి శరీరమును మనస్సులను ధనమును నష్టపఱచుచున్నారు. క్షత్రియాది వర్ణస్థులు జదివి విద్వాంసులై రేని తమపాఖండమను వలలనుండి విడివడి తమ మోసమును దెలిసికొని తమ కవమానమును గలిగింతురని తలంచుచున్నారు. కాఁబట్టి పై నుదహరించిన విఘ్నములను రాజును, ప్రజలును దూరముచేసి తమ పుత్రులను. బుత్రికలను విద్యావంతులుగాఁ జేయుటకు నన్ని విధములఁ బ్రయత్నము చేయవలయును.

ప్రశ్న:--స్త్రీలును శూద్రులునుగూడ వేదమును జదువవచ్చునా, వీరును జదివిరేని మేము చేయవలసిన దేమి, ఇంతియకాదు; వీరు చదువ వచ్చునను టకుఁ బ్రమాణమును లేదు.

(స్త్రీశూద్రౌ నాధీయాతా మితి శ్రుతేః) స్త్రీలును శూద్రులును జదువ కుందురు గాక, అని నిషేధించునట్టి శ్రుతికూడ నున్నది.

ఉత్తరము:—స్త్రీపురుషులందఱకు అనఁగా మనుష్యమాత్రునకుఁ జదువుట కధికారమున్నది. మీరుపోయి బావిలోఁబడుఁడు. ఈశ్రుతి మీ కపోలకల్పితము. ఏ ప్రామాణిక గ్రంథములందునులేదు. మనుష్యులందఱకు వేదాది శాస్త్రములను జదువుటకును. వినుటకును బ్రమాణము యజుర్వేదము ఇరువది యాఱవ అధ్యాయమునందలి రెండవ మంత్రమందున్నది చూడుడు:—

యథేమాం వాచం కల్యాణీ మావదాని జనేభ్యః । బ్రహ్మరాజన్యాభ్యాగ్ం శూద్రాయ చార్యాయ చ స్వాయ చారణాయ ॥యజు॥ అ. ౨౬. మం. ౨॥

(యథా) ఎట్లునేను (జనేభ్యః) మనుష్యు లందఱునాఱకు, (ఇమామ్) ఈ, (కల్యాణీమ్) కల్యాణము నసఁగా సంసారసుఖమును, ముక్తి సుఖమును

ఇచ్చునట్టి (వాచమ్) ఋగ్వేదాది చతుర్వేదవాణిని, (ఆవదాని) ఉపదేశించు చున్నానో అట్లు మీరును జేయవలయును. స్మృత్యాది గ్రంథములయందు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకే వేదపఠనాధికారము వ్రాయఁబడి యున్నదనియు, స్త్రీ శూద్రులకు లేదనియు, ఇక్కడ జన శబ్దముచే ద్విజులను మాత్రము గ్రహింపవలెననియు, కొందఱు ప్రశ్న చేసిరేని ఉత్తరము పరమేశ్వరుఁడే యిచ్చియున్నాఁడు, చూడుఁడు:—

"బ్రహ్మరాజన్యాభ్యామ్" నేను బ్రాహ్మణ క్షత్రియుల కొఱకును, (అర్యాయ) వైశ్యుల కొఱకును, (శూద్రాయ) శూద్రుల కొఱకును (స్వాయ) వారి భృత్యుల కొఱకును, స్త్రీల కొఱకును (అరణాయ) అతిశూద్రుల కొఱకును వేదములను ప్రకాశపఱచితిని. అనఁగా మనుష్యులందఱును వేదములను జదివియుఁ జదివించియుఁ వినియు వినిపించియు, విజ్ఞానమును వృద్ధిపఱచుకొని, మంచి వానిని గ్రహించి, చెడువానిని వదలి దుఃఖములనుండి దూరులై ఆనందమును బొందుదురుగాక, అని భగవానుఁ డుపదేశించియున్నాఁడు. మీ మాట నమ్మవలయునా? పరమేశ్వరునిదా? అవశ్యముగ మాననీయమయినది పరమేశ్వరుని మాటయేకదా! ఇఁకనిట్లుండు దానిఁగూడ నమ్మనివాఁడు నాస్తికుఁడగును. ఏల యనఁగా (నాస్తికో వేదనిందకః) వేదములను నిందించువాఁడును, నమ్మనివాఁడును నాస్తికుఁడు. ఈశ్వరుఁ డేమి శూద్రుల మేలు గోరఁడా? వేదములఁ జదువుటను వినుటను శూద్రులకు నిషేధించి ద్విజులకు విధించుటకు ఈశ్వరుఁడు పక్షపాతియా? శూద్రాదులకుఁ జదివింపను వినిపించను గూడదని పరమేశ్వరుని యభిప్రాయమేని వారి శరీరములందు వాక్కును, శ్రోత్రేంద్రియమును ఏల రచించెను? పృథివి, జల, అగ్ని, వాయు, చంద్ర, సూర్య అన్నాది పదార్థములను పరమేశ్వరుఁడు అందఱికొఱకు సృజించి యుండునట్లు వేదమును అందఱి కొఱకే ప్రకాశపఱచి యున్నవాఁడు. ఎక్కడనేని నిషేధింపఁబడి యుండునేని దాని అభిప్రాయ మేమనఁగా :— చదివియుఁ జదివింపఁ బడియు నేమియు నేఱుంగఁ జాలని బుద్ధిహీనుఁడగు మూర్ఖునకు శూద్రుఁడని పేరు. వాఁడు చదువుటయు, వానిఁ జదివించుటయు వ్యర్థమన్నమాట.

స్త్రీలు చదువఁ గూడదని మీరు నిషేధించుట మీమూర్ఖతా స్వార్థతా బుద్ధిహీనతల ప్రభావము తప్ప వేఱుకాదు. కన్యలు చదువవలయు ననుటకు వేదమందుఁ బ్రమాణమున్నది చూడుఁడు.

బ్రహ్మచర్యేణ కన్యా యువానం విందతే పతిమ్॥
అథర్వ ౧౧కాం. ౨౧. ప్ర. ౨౪ అ. ౩. మం. ౨౮॥

ఎట్లు కౌమారులు బ్రహ్మచర్య సేవనచే బూర్ణ విద్యను, సుశిక్షనుబొంది యువతులును, విద్వాంసు రాండ్రును, దమ కనుకూలురును, ప్రియులును, సదృశులునగు స్త్రీలను వివాహము చేసికొందురో యట్లే (కన్య)కొమా ర్తెయు (బ్రహ్మచర్యేణ)బ్రహ్మచర్య సేవనచే వేదాది శాస్త్రములను జదివి పూర్ణ విద్యను, ఉత్తమశిక్షనుబొంది పూర్ణ యువావస్థయందుఁ దనతో సదృశుఁడును, ప్రియుఁడును, విద్వాంసుఁడునునగు (యువానమ్) పూర్ణ యువావస్థాయుక్త పురుషుని (విందతే)పొందును గాక, అని యర్థము. కాఁబట్టి స్త్రీలును అవశ్యముగ విద్యా బ్రహ్మచర్యములను గ్రహింపవలయును.

ప్రశ్న:— స్త్రీలు వేదమునుగూడఁ జదువవచ్చునా ?

ఉత్తరము:— అవశ్యముగఁ జదువవచ్చును. చూడుఁడు శ్రౌత సూత్రములు. ("ఇమం మంత్రం పత్నీ పఠేత్") అనఁగా స్త్రీ యజ్ఞ మందు ఈ మంత్రమును జెప్పవలయునని యున్నది. వేదాది శాస్త్రములను జదువకయే యుండి రేని యజ్ఞమందు స్వరసహితముగ మంత్రముల యుచ్చారణను, సంస్కృత భాషణమును ఎట్లుచేయఁగలుగుదురు? భారత వర్షపు స్త్రీలకు భూషణములగు గార్గి మొదలగువారు వేదాదిశాస్త్రములను జదివి పూర్ణ విద్వాంసు రాండ్రయి యుండిరి. ఈ విషయము శతపథ బ్రాహ్మణమందు స్పష్టముగా వ్రాయఁబడి యున్నది. పురుషుఁడు విద్వాంసుఁడుగాను, స్త్రీ మూర్ఖురాలుగాను లేదా స్త్రీ విద్వాంసురాలుగాను, పురుషుడు మూర్ఖుడుగాను నుండి రేని ప్రతిదినమును ఇంటియందు దేవాసురసంగ్రామముతప్ప మఱేమియు నుండఁజాలదు. అట్టి గృహమందుసుఖ మెక్కడిది? ఇదిగాక స్త్రీ చదువకపోయేనేని కన్యా పాఠశాలయందు అధ్యాపిక యుఁగాఁజాలదు. రాజకార్యములు, న్యాయాధీశత్వాదులు, పతిని స్త్రీయు, స్త్రీనిఁ బతియుఁ బ్రసన్నులుగానుంచు గృహకార్యములు, స్త్రీ యధీనమైయుండవలసిన సమస్తగృహకార్యములు మున్నగునవి విద్యలేక యెప్పటికిని బాగుగా నడువఁజాలవు.

ఆర్యావర్తపు క్షత్రియవనితలు ధనుర్వేదమందు–యుద్ధవిద్యయందు విశారదలై యుండిరి. అట్లు గాకుండి రేని కైకేయి మొదలగువారు దశరథా

దులవెంట యుద్ధమునకెట్లు పోఁగలిగి యుందురు! ఎట్లు యుద్ధము చేయఁగలిగి యుందురు! కాఁబట్టి బ్రాహ్మణ క్షత్రియ స్త్రీలు సమస్త విద్యలను, వైశ్య స్త్రీలు వ్యవహార విద్యను, శూద్ర స్త్రీలు పాకాది సేవావిద్యను అవశ్యముగ చదువవలయును. పురుషు లెట్లు కనీసము వ్యాకరణ, ధర్మ, స్వవ్యవహారాదివిద్యలను అవశ్యముగ చదువవలయునో అట్లే స్త్రీలును వ్యాకరణ, ధర్మ, వైద్య, గణిత శిల్ప విద్యల నవశ్యముగ నేర్వవలయును. ఏల యనఁగా వీనిని ఁ బడువక సత్యాసత్యముల నిర్ణయము, పతి మొదలగువారితో ననుకూలమైన వర్తనము, యథాయోగ్యమైన సంతానోత్పత్తి, ఆ సంతానపాలన వర్ధన శిక్షణములు, గృహ కృత్యములను చక్కఁగ చేయుట చేయించుట, గృహమందు రోగము లెవ్వటికి రాక అందఱు నానందముగ నుండఁగల్గునట్లు వైద్యవిద్యచే నౌషధప్రాయముగ నన్నపానాదులు చేయుట చేయించుట అనునవి జరుగఁజాలవు. శిల్పవిద్య తెలియ దేని ఇల్లు కట్టించుట, వస్త్రాభరణములు చేయించుట, చేయింపఁజేయుట అను నివి సరిపడవు. గణితవిద్య రాకున్న లెక్క పెట్టలేరు, లెక్కఁజూపలేరు. వేదాది శాస్త్రముల నెఱుఁగక శాము ఈశ్వరుని, ధర్మమును దెలియఁజాలనివారై అధర్మము నుండి తప్పించుకొనలేరు. కాఁబట్టి బ్రహ్మచర్యమునఁ బడి విద్యలద్వారా శమసంతతిని శారీరక ఆత్మికబలములఁ బూర్ణముగ వృద్ధిఁబొందఁ జేయువారే ధన్యవాదమున కర్హులు. వారే కృతకృత్యులు. దీనిచే బిడ్డలు, తల్లి, తండ్రి, భార్య భర్త, అత్త, మామ, రాజు, ప్రజలు, ఇరుగు పొరుగువారు, ఇష్టులు మిత్రులు మొన్నగువారితో యథాయోగ్యముగ వర్తిల్లఁగలుగుదురు. ఈ విద్యయే అక్ష యమగు నిధి. ఇది వ్యయము చేసినకొలది వృద్ధియగుచుండును; తక్కిన నిధు లన్నియు వ్యయమగుచుండునేఁదగ్గును. దాయభాగులును దమతమ భాగములను గొందురు; కాని విద్యాధనమును చోరులుగాని దాయ భాగులుకాని పొందఁజాలరు. ఈ ధనమును రక్షించి వృద్ధి చేయవలసినవారు విశేషించి రాజును ప్రజలునై యున్నారు.

కన్యానాం సంప్రదానం చ కుమారాణాం చ రక్షణమ్॥ మను. ౭.౧౫౨

కుమారీ కుమారుల నందఱను నియమిత సమయమువఱకు బ్రహ్మ చర్యమును పాలింపఁజేసి విద్వాంసులనుగాఁ జేయుట రాజధర్మము. ఎనిమి దేండ్లకుఁ బిమ్మట ఆఁడుబిడ్డలనుగాని మగబిడ్డలనుగాని యింటనుంచక గురు

కులమునకు బంపవలయునని రాజు నియమింపవలయును. ఈ నియమమును. పాలింపని తలిదండ్రులను రాజు దండింపవలయును. సమావర్తన సమయము వచ్చు వఱకు వివాహము కాఁగూడదు.

> సర్వేషా మేవ దానానాం బ్రహ్మదానం విశిష్యతే।
> వార్యన్నగోమహీ వాస స్తిలకాంచన సర్పిషామ్॥మను.౪.౨౩౩॥

ప్రపంచమందలి జలము, అన్నము, గోవు, పృథివి, వస్త్రము, తిలలు సువర్ణము, ఘృతము మొదలగు సమస్త దానములలో వేదవిద్యా దానము అతిశ్రేష్ఠము. కాబట్టి శక్తికొలఁది శరీరము చేతను, మనస్సు చేతను ధనము చేతను- అన్ని విధములచేత విద్యను అభివృద్ధిపఱుపవలయును. ఏదేశమందు బ్రహ్మచర్యము, విద్య, వేదోక్తధర్మము తగినట్లు ప్రచారమునందుండునో ఆదేశమే సౌభాగ్యవంతము. ఇంతవఱకు బ్రహ్మచర్యాశ్రమమును గూర్చిన శిక్షణము సంక్షేపముగ వ్రాయఁబడినది. ఇఁక నాల్గవ సముల్లాసమందు సమావర్తన, గృహాశ్రమ శిక్షణములు వ్రాయఁబడును.

శ్రీమద్దయానంద సరస్వతీస్వామి కృతమును;
సుభాషావిభూషితమునగు సత్యార్థ ప్రకాశమునందు
శిక్షావిషయముగల తృతీయ సముల్లాసము
సంపూర్ణము

# చతుర్థ సముల్లాసము

## సమావర్తన వివాహ గృహాశ్రమవిధులు

వేదానధీత్య వేదౌ వా వేదం వాపి యథాక్రమమ్।
అవిప్లుతబ్రహ్మచర్యో గృహస్థాశ్రమమావిశేత్ ॥మను. ౩.౨॥

యథారీతిని బ్రహ్మచర్యమందు నాచార్యున కనుకూలముగ వర్తించి ధర్మముతో నాల్గు వేదములనుగాని, మూడింటినిగాని, రెంటిని గాని, ఒకటిని గాని సాంగోపాంగముగఁ జదివి, బ్రహ్మచర్యము ఖండితము కానట్టి పురుషుఁడు లేక స్త్రీ గృహాశ్రమయందుఁ ప్రవేశింపనగును.

తం ప్రతీతం స్వధర్మేణ బ్రహ్మదాయహరం పితుః।
స్రగ్విణం తల్ప ఆసీన మర్హయేత్ప్రథమం గవా॥ మను. ౩. ౩॥

స్వధర్మముతో - విద్యుక్తమగు గురుశిష్యధర్మముతోఁ గూడిన జనకునినుండి కాని, అధ్యాపకుని నుండికాని, బ్రహ్మదాయము - విద్యారూపదాయ భాగము గ్రహించి యేతెంచిన బ్రహ్మచారి పుష్పమాలికను ధరించి మంచము మీదఁ గూర్చుండి యున్నట్టి ఆచార్యుని మొదట గోదానముచే సత్కరింప వలయును. అట్టి లక్షణ యుక్తుఁడగు విద్యార్థిని గూడ కన్యాజనకుఁడు గోదానముచే సత్కరింపవలయును.

గురుణానుమతః స్నాత్వా సమావృత్తో యథావిధి।
ఉద్వహేత ద్విజో భార్యాం సవర్ణాం లక్షణాన్వితామ్ ॥మను. ౩.౪॥

గురువునాజ్ఞనుబొంది స్నానముచేసి అనుక్రమపూర్వకముగ గురుకులము నుండి వచ్చిన బ్రాహ్మణుఁడు, క్షత్రియుఁడు లేదా వైశ్యుఁడు దమ వర్ణమున కనుకూలమగు సుందరలక్షణయుక్తురాలయిన కన్యను వివాహమాడవలయును.

అసపిండా చ యా మాతురసగోత్రా చ యా పితుః।
సా ప్రశస్తా ద్విజాతీనాం దారకర్మణి మైథునే ॥మను. ౩. ౫॥

తల్లి కులమున దాఱుతరములలో నిదియుఁ దండ్రి గోత్రమునందలిదియు కాని కన్యను వివాహమాడుట యుచితము; దీని ప్రయోజనము.

పరోక్షప్రియా ఇవ హి దేవాః ప్రత్యక్షద్విషః ॥శతపథ॥

పరోక్ష పదార్థమునందుఁ బ్రీతియుండునట్లు ప్రత్యక్షపదార్థమందుండ దనుట నిశ్చయము. పంచదార గుణమునుమాత్రము విని తినకయుండు నతని

మనస్సు దానియందే తగిలియుండును. కాఁబట్టి పరోక్ష వస్తు ప్రశంసను విని యది యబ్బవలెనను కోరిక విశేషముగ నుండునట్లే దూరస్థ వివాహమునందు నుండును. కావున తన గోత్రమునకుఁ జేరక తల్లి కులమునకు సమీపసంబంధము లేని కన్యను వరుఁడు వివాహమాడవలయును.

### సమీపదూర సంబంధముల వివాహమందుఁ గలుగు గుణ దోషములు:—

౧. సమీపమందుండు ఆఁడు మగబిడ్డలు బాల్యావస్థయందుఁ గలిసి యాడుకొనియు, జగడమాడియుఁ, బ్రేమించియుఁ, బరస్పర గుణ దోష స్వభావముల గుర్తెఱింగియు, బాల్యావస్థయందలి విపరీతాచరణములఁ దెలిసియు, నొకరొకరిని నగ్నముగాఁ జూచియు నుందురు గనుక వారల కన్యోన్య ప్రేమ యున్నంతకిని గలుగఁజాలదు.

౨. నీటితో నీరుచేరిన విలక్షణత గలుగనట్లే ఏకగోత్రమందు- పితృకులమందుఁగాని మాతృకులమందుఁగాని, వివాహమగుటచే ధాతువులకు మార్పు లేదు గనుక ఉన్నతి కలుగఁజాలదు.

౩. పాలయందుఁ బంచదార కాని, శొంఠి మున్నగు ఔషధములు కాని చేర్చుటవలన నుత్తమగుణము కలుగునట్లే మాతృపితృ కులములకంటె భిన్న గోత్రములలో స్త్రీ పురుషులు వివాహమాడుటవలన నుత్తమ సంతానము కలుగును.

౪. ఒక దేశమందలి రోగి మఱొక దేశమునకు బోవుటచే అన్న. జల. వాయువులు మారుటవలన నిరోగి యగును. కాఁబట్టి దూరదేశ వివాహము యుత్తమము.

౫. సమీపసంబంధమునందు-సామీప్యమువలన-పరస్పర సుఖదుఃఖము తెలుకపడుటయు· విరోధము గలుగుటయు సంభవము. దూరసంబంధమం దట్లుండదు. దూరసంబంధమందుఁ బ్రేమలత పెంపొందును. సమీప సంబంధమందుఁ బెంపు కాజాలదు.

౬. దూర సంబంధముచే దూరదేశము నందుండువారును· పదార్థములను సులభముగ సంప్రాప్తమగును. నికట వివాహమువలన నట్లు కాదు.

దుహితా దుర్హితా దూరే హితా భవతీతి ॥నిరు ౩.౪॥

కన్యకు వివాహము దూరదేశమం దయినచో హితకారిణియగుచున్నది; సమీపమం దట్లుకాదు; గాన కన్యకు దుహితయని పేరు.

౬. సమీపమం దగుటవలనఁ గన్యయొక్క పితృకులమునందు దారిద్ర్యము కలుగుటయు సంభవమే. ఏలయనఁగా కన్య పుట్టినింటికి వచ్చినపుడెల్ల యేమైన నీయవలసి యుండును.

౭. సమీపమందు వివాహమగుటవలన స్త్రీకిఁ బుట్టినింటిసహాయ మబ్బునను నభిమానము(గర్వము)కలుగును. పురుషునితో గొంచెమేని వైమనస్యము కలిగిన తక్షణమే పుట్టినింటికి వెళ్ళి కూర్చుండును. తఱుచుగా స్త్రీల స్వభావము తీక్ష్ణముగను, మృదువుగను ఉండును. గనుక పరస్పర నిందయు, విరోధము నధిక మగును.

ఇత్యాది కారణములచేఁ దండ్రి గోత్రమందుఁగాని, తల్లి కులమున ఆఱు తరములందుఁగాని,సమీపదేశమందుఁగాని వివాహమగుట మంచిదికాదు.

మహాన్త్యపి సమృద్ధాని గోఽజావిధన ధాన్యతః ।
స్త్రీసంబంధే దశైతాని కులాని పరివర్జయేత్ ॥మను. ౩.౬॥

ధనము, ధాన్యము, గోవులు, మేఁకలు, ఏనుఁగులు, గుఱ్ఱములు, రాజ్యము, మొదలగువానిచే నెంత సమృద్ధముగా నుండినను వివాహ సంబంధమందు నీ క్రింద వ్రాయఁబడిన పదికులములు త్యాజ్యములు.

హీనక్రియం నిష్పురుషం నిశ్ఛన్దో రోమశార్శసమ్ ।
క్షయ్యామయావ్యపస్మారి శ్విత్రికుష్ఠికులాని చ ॥మను. ౩.౭॥

సత్క్రియా హీనము, సత్పురుష రహితము, వేదాధ్యయన విముఖము, శరీరమందుఁ బెద్ద వెంట్రుకలు కలదియు, మూలవ్యాధి, క్షయ, ఉబ్బసము, దగ్గు, ఆమాశయము, సొమ్మరోగము, శ్వేతకుష్ఠువు, గలితకుష్ఠువు, గలిగిన కులములందలి కన్యలతోఁగాని వరులతోఁగాని వివాహసంబంధ మొన్నటికినిఁ గూడదు. ఏలయనఁగా ఈ రోగములు వివాహము చేసికొన్న వారి యింటను బ్రవేశించును. కాఁబట్టి ఉత్తమకులమందలి కన్యావరులతే వివాహము కావలయు.

నోద్వహేత్కపిలాం కన్యాం నాధికాంగీం న రోగిణీం।
నారోమికాం నాతిరోమాం న వాచాటాన్న పింగలామ్ ॥మను ౩. ౮॥

కపిలవన్నె గలదానిని, అధికాంగిని - పురుషునికంటె నెక్కువలావును, బొరవును, బలమును గలదానిని, రోగవతిని, వెంట్రుకలు లేని దానిని, మిక్కిలి వెంట్రుకలు గలదానిని, అధిక ప్రసంగము చేయుదానిని పిల్లికన్నుల దానిని.

నక్షత్రవృక్షనదీనామ్నీం నాంత్యపర్వతనామికాం ।
న పక్ష్యహిప్రేష్యనామ్నీం న చ భీషణనామికాం ॥మను. ౩.౯॥

(నక్షత్రము నామములు—అశ్విని, భరణి, రోహిణి, రేవతి, చిత్ర మొదలగు నక్షత్రనామములు గల దానిని; తులసి, చేమంతి, గులాబి, చంపక, మొల్ల మొదలగు చెట్ల పేరులు గలదానిని; గంగ, యమున మొదలగునదుల పేరులు గలదానిని, చండాలి మొదలగు నంత్యనామములు గలదానిని; వింధ్య, హిమాలయ, పార్వతి మున్నగు పర్వతనామములు గలదానిని; కోకిల, శారిక మొదలగు పక్షినామములు గలదానిని; నాగి, భుజంగి, శేషి మొదలగు సర్పనామములు గలదానిని; భీమకుమారి, చండిక, కాళి మొదలగు భయంకర నామములు కలదానిని; మాధవదాసి, మీరాదాసి మొదలగు నీచనామములు గలదానిని; అనఁగా నీపేరులుగల కన్యలను వివాహ మాడఁగూడదు.) ఏలయనఁగా వీనిలోఁ గొన్ని కుత్సితములును, గొన్ని యితరపదార్థ నామములునై యున్నవి.

అవ్యంగాంగీం సౌమ్యనామ్నీం హంసవారణగామినీం ।
తనులోమకేశదశనాం మృద్వంగీముద్వహేత్ స్త్రియం ॥మను. ౩.౧౦॥

యోగ్య ప్రమాణము గలిగి వంకరటింకరలులేని అంగములుకలదియు, యశోద, సుభద్ర మొదలగు సుందర నామములు కలదియు, హంస, ఏనుఁగుల నడక కలదియు, సూక్ష్మములగు వెంట్రుకలు, మంచి దంతములు కోమలమయిన శరీరము కలదియునగు స్త్రీని వివాహమాడవలయును.

ప్రశ్న:—వివాహమునకు మంచి సమయమెద్ది ? మంచి ప్రకారమేమి ?

ఉత్తరము:- పదియాఱవ వర్షము మొదలుకొని యిఱువదినాల్గేండ్ల వఱకు కన్యకున్ను, ఇఱువదియైదవయేఁడు మొదలుకొని నలువది యెనిమిదవ యేటివఱకుఁ బురుషునకును వివాహమునకును సుత్తమ సమయము. పదునారవ యేఁట కన్యయు నిరువదియైదవయేట పురుషుడును వివాహమాడిన నది నిక్రష్టము; పదునెనిమిది లేక యిరువది యవయేట స్త్రీయు, ముప్పది, ముప్పది

యైదు, నలువదియవయేట పురుషుడు వివాహమాడిన నది మధ్యమము; ఇరు వదినాలుగవయేట స్త్రీయు, నలువది యెనిమిదవ యేట పురుషుడును వివాహ మాడిన నది యుత్తమము. ఏ దేశమం దీరితమగు శ్రేష్ఠవివాహములును, బ్రహ్మచర్యమును, విద్యాభ్యాసము నధికముగా వర్ధిల్లునో ఆ దేశమునందే సుఖమును వర్ధిల్లును. ఏ దేశమునందు బ్రహ్మచర్య విద్యాగ్రహణములు లేక బాల్యావస్థయందే వివాహము చేసికొనెదరో ఆ దేశము దుఃఖములో మునిఁగి పోవును. బ్రహ్మచర్యము నరిపి విద్యను గ్రహించి యుద్లు వివాహమాడుదు రేని సమస్తమును చక్కపడును. లేకున్న సమస్తమును జెడును.

ప్రశ్న:- అష్టవర్షా భవేద్గౌరీ నవవర్షా చ రోహిణీ,
దశవర్షా భవేత్కన్యా తత ఊర్ధ్వం రజస్వలా ॥౧॥
మాతా చైవ పితా తస్య జ్యేష్ఠో భ్రాతా తథైవ చ,
త్రయస్తే నరకం యాంతి దృష్ట్వా కన్యాం రజస్వలామ్ ॥౨॥

ఈ శ్లోకములు పరాశరమందును, శీఘ్రబోధయందును వ్రాయఁబడి యున్నవి. వీని యర్థము:- కన్యకు నెనిమిదవయేట గౌరియనియు, తొమ్మిదవ యేట రోహిణి యనియు, పదియవయేట కన్యయనియు అంతకు మీఁద రజ స్వల యనియు సంజ్ఞలు కలుగును ॥౧॥ పదియవ యేటివఱకు వివాహము చేయక రజస్వలసంజ్ఞ గల కన్యకను జూచిన తల్లియుఁ దండ్రియు నన్నయు నరకమందుఁ బడుచున్నారని వ్రాసియున్నదే ?

ఉత్తరము:- బ్రహ్మోవాచ:-

ఏకక్షణా భవేద్గౌరీ ద్విక్షణేయంతు రోహిణీ
త్రిక్షణా సా భవేత్కన్యా హ్యత ఊర్ధ్వం రజస్వలా ॥౧॥
మాతా పితా తథా భ్రాతా మాతులో భగినీ స్వసా,
సర్వే తే నరకం యాంతి దృష్ట్వా కన్యాం రజస్వలామ్ ॥౨॥

ఇది సద్యోనిర్మిత బ్రహ్మపురాణ వచనము:-

అర్థము:- పరమాణువు ఒక పర్యాయము పరివర్తనమగు సమయము నకు క్షణమని పేరు. కన్య పుట్టిన క్షణమందు గౌరియు, రెండవక్షణ మందు రోహిణియు, మూఁడవక్షణమందుఁ గన్యయు, నాల్గవక్షణమందు రజస్వలయు

నగును॥౧॥ ఆ రజస్వలనుజూచిన తల్లియుఁ,దండ్రియు,నన్నయు,మామయు, అక్కయు నందఱును నరకమునకుఁ బోవుచున్నారు ॥౨॥

ప్రశ్న:— ఈ శ్లోకములు ప్రమాణములు కావు.

ఉత్తరము:— ఏల ప్రమాణములు కావు? బ్రహ్మ శ్లోకములే ప్రమాణములుకాకున్న మీవియును ప్రమాణములు కాఁజాలవు.

ప్రశ్న:— పరాశర కాశీనాథుల వచనములంగూడ ప్రమాణములుగా నెంచరా?

ఉత్తరము:—వహ్వా! మీరు బ్రహ్మవచనములనుగూడ ప్రమాణములుగా నెంచరా? పరాశర కాశీనాథులకంటె బ్రహ్మ గొప్పవాఁడుకాఁడా? మీరు బ్రహ్మ శ్లోకములనే నమ్మరేని మేము పరాశర కాశీనాథుల శ్లోకములను నమ్మము.

ప్రశ్న:—మీశ్లోకములు అసంభవములగుటచేఁ బ్రమాణార్హములు కావు. ఏలయనఁగా జన్మసమయమందే సహస్రశఃజనములుగడచిపోవుచున్నవి. ఆ సమయమునందెట్లు వివాహము కాగలదు? ఇదికాక ఆ సమయమందు వివాహము చేయుటచేఁ బ్రయోజనమేమియుఁగానరాదు.

ఉత్తరము:-మా శ్లోకములు అసంభవములేని మీవియును అసంభవములే. ఏలయనఁగా ఎనిమిదవ యేటఁగాని, తొమ్మిదవ యేటఁగాని పదియవ యేటఁగాని వివాహముచేయుటయు నిష్ఫలమే ఏమన స్త్రీకి పదియాఱవయేటికిఁ బిమ్మటను, పురుషునకు నిఱువదినాల్గవ యేటికిఁ బిమ్మటను వివాహమగునేని పురుషుని వీర్యము పరిపక్వముగను, శరీరము బలిష్ఠముగను, స్త్రీ గర్భాశయము పూర్ణముగను, శరీరము బలయుక్తముగను ఉండును గనుక ఉత్తమసంతానము కలుగును. *

ఎనిమిదేండ్ల కన్యయందు సంతానోత్పత్తి యెట్లు అసంభవమో యట్లే గౌరి, రోహిణినామము లిచ్చుటయు నయుక్తము. కన్య తెల్లఁగానుండక నల్లఁగానుండెనేని గౌరియని పేరిడుట వ్యర్థము. ఇదిగాక గౌరి మహాదేవుని భార్య. రోహిణి వాసుదేవుని భార్య. పౌరాణికులగు మీరు ఆ స్త్రీలను తల్లుల

* యుక్తకాలమునకుఁ గొఱవడిన వయస్సుగల స్త్రీ పురుషుల గర్భాధానమును మునివరుఁ డగు ధన్వంతరి సుశ్రుతమందు నిషేధించి యున్నాఁడు చూడుఁడు:-

వరె నెంచుచున్నారు. కన్యామాత్రలయందు మీకు గౌరవాదుల భావముండెనేని వారిని వివాహమాడుట సంభవముగాదు; ధర్మముగాదు. కాఁబట్టి మీ రెండు శ్లోకములును మా రెండు శ్లోకములును మిథ్యలే. ఏలయనఁగా 'బ్రహ్మోవాచ' అని పేరుపెట్టి శ్లోకములను జేసితిమో అట్లే మీశ్లోకములను పరాశరాదుల పేర నెవ్వరో చేసినారు. కాఁబట్టి వీనినన్నిఁటిని వదలిపెట్టి వేదవిధి ననుసరించి సమస్త కార్యములను జేయఁదగును. ఈ విషయమై మనుస్మృతి యందేమియున్నదో చూడుఁడు:-

> ఊనషోడశ వర్షాయా మప్రాప్తః పంచవింశతిమ్।
> యద్యాధత్తే పుమాన్ గర్భం కుక్షిస్థః స విపద్యతే॥
> జాతో వా న చిరంజీవే జ్జీవేద్వా దుర్బలేన్ద్రియః।
> తస్మా దత్యంతబాలాయాం గర్భాధానం న కారయేత్ ॥౨॥
>
> సుశ్రుతశారీరస్థానము॥ అ. ౧౦. శ్లో. ౪౭-౪౮॥

అర్థము:- పదియా రేండ్లకుఁ గొఱవడిన స్త్రీయందు విఱువదియై దేండ్లకుఁ గొఱవడిన పురుషుఁడు గర్భస్థాపనఁ జేసెనేని అకుక్షిస్థమగు గర్భము విపత్తును బొందును. అనఁగా పూర్ణసమయము వఱకు గర్భాశయ మందుండి యుత్పన్నముకాదు. ఒక వేళ నుత్పన్నమైనను చిరకాలము జీవింపదు. జీవించినను దుర్బలేంద్రియములు గలిగియుండును. కాఁబట్టి మిక్కిలి బాల్యావస్థయందలి స్త్రీయందు గర్భస్థాపనము చేయఁదగదు.

ఇట్టి శ్లోకోక్త నియమములను, సృష్టి క్రమమును జూచుటవలనను బుద్ధిచే విచారించుటవలనను బదియాఱేండ్లకుఁ గొఱవడిన స్త్రీయు, ఇరువది యయిదేండ్లకుఁ గొఱవడిన పురుషుఁడును నిషేకకర్మ కర్తలుకారని యేర్పడుచున్నది. ఈ నియమమునకు విపరీతముగఁ జేయువారలు దుఃఖభాగు లగుచున్నారు.

> త్రీణి వర్షా ణ్యుదీక్షేత కుమార్యృతుమతీ సతీ।
> ఊర్ధ్వం తు కాలా దేతస్మా ద్విందేత సదృశం పతిమ్ ॥ మను. ౯.౯౦॥

కన్య రజస్వలయయిన పిమ్మట మూడు సంవత్సరముల వఱకుఁ బతిని వెదకుచుండి తనతో సమానుఁడగు పతినిఁ బొందఁదగును. ప్రతి మాసము రజోదర్శనమగుచు మూడుసంవత్సరములందు ముప్పదియాఱు పర్యాయములు రజస్వల యయినపిమ్మట వివాహమగుట యోగ్యము. అంతకుముందు వివాహ మగుట కూడదు.

కామ మామరణాత్తిష్ఠేద్గృహే కన్యర్తుమత్యపి ।
న చైవైనాం ప్రయచ్ఛేత్తు గుణహీనాయ కర్హిచిత్ ॥ మను. ౯. ౮౯॥

స్త్రీ పురుషులు మరణ పర్యంతము బ్రహ్మచారులుగా నుండినను నుండ వచ్చునుగాని అసదృశులకు-పరస్పర విరుద్ధ గుణకర్మ స్వభావములుగలవారికి-వివాహ మెన్నటికిని కాఁగూడదు. పైఁజెప్పినసమయమునకుఁ బూర్వముకాని, అసదృశులకుఁగాని వివాహమగుట యోగ్యముకాదని దీనిచే సిద్ధమైనది.

ప్రశ్న:- వివాహము తలిదండ్రుల యధీనమం దుండవలయునా? లేక కన్యావరుల యధీనమందా?

ఉత్తరము:-వివాహము కన్యావరులయధీనమై యుండుటయు త్తమము. తల్లిదండ్రు లెన్నడేని వివాహము చేయఁ బ్రయత్నించినను కన్యావరుల ప్రసన్నత లేక చేయఁగూడదు. ఏలయనఁగా పరస్పర ప్రసన్నతచే వివాహ మగుట వలన స్త్రీ పురుషులలో సామాన్యముగ విరోధము కలుగదు. ఉత్తమ సంతానమునుగలుగును. అప్రసన్నతచే వివాహ మగుటవలన నిత్యము క్లేశమే కలుగును. వివాహమందు ముఖ్యప్రయోజనము కన్యావరులదిగాని తల్లిదండ్రులది కాదు. ఏలయనఁగా కన్యావరులు పరస్పరము ప్రసన్నులై యుండిరేని వారికే సుఖమును, విరోధము కల్గియుండిరేని వారికే దుఃఖమును గలుగును.

సంతుష్టో భార్యయా భర్తా భర్త్రా భార్యా తథైవ చ ।
యస్మిన్నేవ కులే నిత్యం కల్యాణం తత్ర వై ధ్రువమ్ ॥ మను. ౩. ౬౦॥

ఏ కులమందు స్త్రీచేఁ బురుషుఁడును, పురుషునిచే స్త్రీయు సదా ప్రసన్నులుగా నుందురో ఆకులమం దానందమును, లక్ష్మియుఁ గీర్తియు, నివసించుచుండును. విరోధమును, గలహము నున్నచోట దుఃఖమును, దారిద్ర్యమును, నిందయు సంభవించును. కాఁబట్టి ఆర్యావర్తమందు స్వయంవరపద్ధతి పరంపరగా వచ్చుచున్నయది. అదియే యుత్తమ వివాహము. స్త్రీ పురుషులు వివాహమాడఁ దలఁచినపుడు ఇరువురకును విద్య, వినయము, శీలము, రూపము, ఆయువు, బలము, కులము, శరీర పరిమాణాదులు యథాయోగ్యముగ నుండవలయును. లేకున్నచో నా వివాహమువలన సుఖమేమియుఁ గలుగఁజాలదు. అట్లే బాల్యావస్థయందు వివాహమాడుటవలనను సుఖము కలుగనేరదు.

యువా సువాసాః పరివీత ఆగాత్స ఉ శ్రేయాన్భవతి జాయమానః।
తం ధీరాసః కవయ ఉన్నయంతి స్వాధ్యో౩ మనసా దేవయన్తః॥౧

ఋ॥మం.౩సూ.౮మం.౪॥

ఆరేనవో ధునయన్తామశిత్వాః శబర్దుఘాః శశయా అప్రదుగ్ధాః।
నవ్యానవ్యా యువతయో భవంతీర్మహద్దేవానామసురత్వమేకమ్॥౨॥

ఋ॥ మం.౩సూ.౫౫మం ౧౬॥

పూర్వీరహం శరదః శశ్రమాణా దోషావస్తోరుషసో జరయంతీః।
మినాతి శ్రియం జరిమాతనూనామప్యూను పత్నీర్వృషణో జగమ్యుః॥౩॥

ఋ॥ మం.౧ సూ.౧౭౯. మం.౧॥

ఏ పురుషుఁడు (పరివీతః) అన్నివిధముల యజ్ఞోపవీతము, బ్రహ్మచర్య సేవనము, ఉత్తమశిక్ష, విద్యలు గ్రహించి (సువాసాః) సుందర వస్త్రములు ధరించిన వాఁడును, (యువా) పూర్ణయౌవన వంతుఁడునై విద్యను గ్రహించి (ఆగాత్) గృహాశ్రమమునకు వచ్చునో (స,ఉ) అతఁడా రెండవ విద్యా జన్మమందు (జాయమానః) ప్రసిద్ధుఁడై (శ్రేయాః) అతిశయ శోభాయుక్త మంగళకారి (భవతి) అగుచున్నాఁడు. (స్వాధ్యః) చక్కఁగ ధ్యానయుక్తులును, (మనసా) విజ్ఞానముచే (దేవయన్తః) విద్యా వృద్ధియందలి కోరికగలవారును, (ధీరాసః) ధైర్యయుక్తులును, (కవయః) విద్వాంసులగువారు (తమ్) ఆ పురుషుని, (ఉన్నయన్తి) ఉన్నత శీలునిగా గౌరవించుచున్నారు. ఎవరు బ్రహ్మచర్య పూర్వకముగా విద్యను, ఉత్తమశిక్షను, గ్రహింపక బాల్యావస్థయందే వివాహము చేసికొందురో, వారు నష్టభ్రష్టులై విద్వాంసులలోఁ బ్రతిష్ఠను బొందఁజాలరు.

(అప్రదుగ్ధాః) పాలీయని(ధేనవః)గోవులవలె నుండువారును (అశిత్వాః) బాల్యావస్థా రహితులును (శబర్దుఘాః) అన్నివిధముల నుత్తమ వ్యవహారములను బూర్తిచేయువారును (శశయాః) కుమారావస్థ నుల్లంఘించినవారును (నవ్యానవ్యాః) నవీన నవీనమగు శిక్షచేతను, అవస్థచేతను. బూర్ణముగ (భవంతీః) వర్తించుచుండు (యువతయః) పూర్ణయువావస్థ గల స్త్రీలు (దేవానామ్) చక్కఁని బ్రహ్మచర్య నియమములంచేత పూర్ణవిద్వాంసుల (ఏకమ్) అద్వితీయమైన (మహత్) గొప్ప. (అసురత్వమ్) ప్రజ్ఞాశాస్త్రమునందుమ,

శీతమగు ప్రజ్ఞయందునుగల రతిదావార్థములం గ్రహింపగలవారలై తరుణ పతులను బొంది, (అధునయంతామ్) గర్భమును ధరింపవలయును. మరచి యుచు ఎన్నఁడును బాల్యావస్థయందు పురుషుని మనస్సునందైనను ధ్యానింపఁ గూడదు. ఏలయనఁగా నీకర్మయే ఈ లోకమందును బరలోకమందును సుఖము నకు సాధనమైయున్నయది. బాల్యావస్థయందలి వివాహముచే పురుషులకుఁ గలుగు నష్టమునకంటె స్త్రీలకెక్కువ నష్టము కలుగుచున్నది.

(ను) శీఘ్రముగ (శశ్రమాణాః) అత్యంతశ్రమఁ జేయునట్టియు, (వృషణః) వీర్యసేచనమందు సమర్థులునగు పూర్ణయువావస్థగల పురుషులు (పత్నీః) యువతి హృదయములకుఁ బ్రియలగు స్త్రీలను (జగమ్యః) పొంది పూర్ణముగ నూఱు సంవత్సరములుగాని అంతకంటె నధికమగు నాయువును గాని ఆనందముతో ననుభవించుచు, పుత్రపౌత్రాదులతోఁ గూడియుండఁ గలుగునట్లు స్త్రీ పురుషులు వర్తింపవలయును. (పూర్వీః) కడచిన (శరదః) శరదృతువులకు, (జరయంతీః) వృద్ధావస్థను గల్పించు (ఉషసః) ప్రాతః కాలములను (దోషా) రాత్రియు, (వస్తోః) పగలును (జరిమాన) మిక్కిలి వృద్ధావస్థ (తనూనాం) శరీరముల (శ్రియం) బలమును, శోభను (మినాతి) దూరము చేయునట్లు(అహమ్)నేను-స్త్రీయును బురుషుఁడును(ఉ)బాగుగ(అపి) నిశ్చయచేసికొని బ్రహ్మచర్యముతో విద్యను, శిక్షను, శరీర-ఆత్మల బలమును, యౌవనమును బొందియే వివాహముచేసికొందును. దీనికి విరుద్ధముగ చేయుట వేద విరుద్ధమగుటచే వివాహము సుఖదాయక మెన్నటికిని గాఁజాలదు.

ఈరీతిని ఋషులు, మునులు; రాజులు, మహారాజులునగు నార్యు లందఱు బ్రహ్మచర్యముచే విద్యనుజదివి, స్వయంవరవివాహమును చేసికొను చున్నంతవఱకు నీ దేశ మున్నతియందే యుండెను. బ్రహ్మచర్యముతోఁ గూడిన విద్యాధ్యయన మడుగంటి, బాల్యావస్థలో పరాధీనమున-తలిదండ్రుల అధీనమున వివాహము చేసికొనుచున్నప్పటినుండి క్రమముగ ఆర్యావర్తదేశ మునకు హాని కలుగసాగినది. కాఁబట్టి యీ దుష్టకార్యమును వదలి సజ్జనులు పూర్వోక్తప్రకారము స్వయంవర వివాహ మొనర్తురుగాక. ఈ వివాహము వర్ణాను క్రమముగాఁ గావలయును. వర్ణ వ్యవస్థయు గుణకర్మ స్వభావముల ననుసారముగా నుండవలయును.

ప్రశ్న :- ఏమీ? ఎవనితల్లి బ్రాహ్మణియుఁ దండ్రి బ్రాహ్మణుఁడో అతఁడు మాత్రమే బ్రాహ్మణుఁడని మీరునమ్మరా? తల్లిదండ్రులు అన్యవర్ణస్థులుగా నుండిరేని వారికిఁ బుట్టినవారు ఎన్నఁడేని బ్రాహ్మణులు కాఁగలరా?

ఉత్తరము :- ఛాందోగ్యోపనిషత్తులోని అజ్ఞాతకులముగల జాబాలియుఁ భారతమందలి క్షత్రియుఁడగు విశ్వామిత్రుఁడును, చండాలకులమందలి మాతంగ ఋషియు బ్రాహ్మణులయినట్లు అనేకులయినారు. అగుచున్నారు. కాఁగలరు. ఇప్పటికిని ఉత్తమ విద్యా స్వభావమును కలవారే బ్రాహ్మణులు. మూర్ఖులు శూద్రులనగుదురు. ఇఁకముందు నట్లే కాఁగలరు.

ప్రశ్న :- రజోవీర్యములంచేనయిన శరీరము మారి అన్యవర్ణమునకుఁ దగినదెట్లు కాఁగలదు?

ఉత్తరము:- బ్రాహ్మణ శరీరము రజోవీర్యములచేఁగాదు. చూడుఁడు.

స్వాధ్యాయేన జపైర్హోమై స్త్రైవిద్యే నేజ్యయా సుతైః।
మహాయజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః ॥మను. ౨।౨౮॥

దీనియర్థము ఇంతకుముందు వ్రాయఁబడినది. అయిన నిక్కడను సంక్షేపముగఁ జెప్పఁబడును. (స్వాధ్యాయేన) చదువుటచేతను. చదివించుటచేతను, (జపైః) ఆలోచించుటచేతను ఆలోచింపఁజేయుటచేతను (హోమైః) నానావిధ హోమముల ననుష్ఠించుటచేతను. అనుష్ఠింపఁజేయుటచేతను. (త్రైవిద్యేన) సంపూర్ణ వేదములను శబ్ద. అర్థ. సంబంధ. స్వరోచ్చారణ సహితముగఁ జదువుటచేతను జదివించుటచేతను. (ఇజ్యయా) పౌర్ణమాసేష్టి మొదలగునవి చేయుటచేతను. ఇంతకుముందుఁ జెప్పినట్లు విధిపూర్వకముగ. (సుతైః) ధర్మముచే సంతానోత్పత్తిని జేయుటచేతను. (మహాయజ్ఞైశ్చ) పూర్వోక్త బ్రహ్మయజ్ఞము. దేవయజ్ఞము. పితృయజ్ఞము. వైశ్వదేవయజ్ఞము. అతిథియజ్ఞము అను వీని నొనర్చుటచేతను. (యజ్ఞైశ్చ) అగ్నిష్టోమాది యజ్ఞములు. విద్వాంసుల సంగతి. సత్కారము. సత్యభాషణము. పరోపకారము మొదలగు సత్కర్మలను జేయుచు సంపూర్ణ శిల్ప విద్యాదులను జదివి దుష్టాచారములను వదలి, శ్రేష్ఠాచారమందు వర్తిల్లుటచేతను (ఇయమ్) ఈ(తనుః) శరీరము (బ్రాహ్మీ) బ్రాహ్మణునిదిగా (క్రియతే) చేయఁబడును. ఏమి; మీరి శ్లోకమును నమ్మరా;

ప్రశ్న:- నమ్ముచున్నాము.

ఉత్తరము:-మఱి యేల రజోవీర్యములచే వర్ణవ్యవస్థను నమ్ముచున్నారు?

ప్రశ్న:- నేనొకఁడనే యిట్లు నమ్ముటలేదు. అనేకులు పరంపరగా నిట్లే నమ్ముచున్నారు. ఏమి? మీరు పరంపరగా వచ్చుదానినిఁగూడ ఖండించెదరా ?

ఉత్తరము :- లేదు; కాని మీ యీ విపరీతజ్ఞానమును మన్నింపక ఖండించుచున్నాము.

ప్రశ్న:- మాతెలివితప్పు. మీతెలివియొప్పు అనుటకుఁ బ్రమాణమేమి?

ఉత్తరము :- మీరు అయిదాఱు తరములనుండి వచ్చుదానిని సనాతన మని నమ్ముచున్నారు. మేము వేదము మొదలు-సృష్ట్యారంభము మొదలు— నేఁటివఱకుండు దానిని పరంపరయని నమ్ముచున్నాము. తండ్రి శ్రేష్ఠుఁడయినను గొడుకు దుష్టుఁడగుటయుఁ, గొడుకు శ్రేష్ఠుఁడయినఁ దండ్రి దుష్టుఁడగుటయు, నిద్దఱును శిష్టులగుటయు, లేదా ఇద్దఱును దుష్టులగుటయు మనము చూచు చున్నాము గదా ! కాఁబట్టి మీరు భ్రమలోఁ బడియున్నారు. మను మహారాజు ఏమి వ్రాసియున్నాఁడో చూడుఁడు-

యేనాస్య పితరో యాతా యేన యాతా పితామహాః।
తేన యాయాత్సతాం మార్గం తేన గచ్ఛన్న రిష్యతే॥మను.౪. ౧౭౮॥

అర్థము:—ఏ మార్గమును దండ్రియుఁ దాతయు నవలంబించినారో ఆ మార్గమునే సంతానముకూడ నవలంబింపవలయును. కాని (సతామ్) అది సత్పురుషులగు తాత తండ్రు లవలంబించినదిగా నుండవలయును. అట్టి సన్మార్గము నవలంబింపవలయునే కాని దుష్టులగు తండ్రి తాతల మార్గము నవలంబింపగూడదు. ఏలయనఁగా నుత్తములును ధర్మాత్ములునగు పురుషుల మార్గము నవలంబించుటచే నెన్నఁటికిని దుఃఖముకలుగదు. దీనిని మీరు నమ్ముదురా! లేదా?

ప్రశ్న:—నమ్ముదుము.

ఉత్తరము:—ఇంతియకాదు. పరమేశ్వరునిచేఁ బ్రకాశింపఁబడిన వేద మందుఁ జెప్పఁబడినదే సంతానమనియు, దానికి విరుద్ధమగునది యెన్నిటికిని సంతానము కాఁజాలదనియు నందఱు నమ్మవలయునా? లేదా? అవశ్యము నమ్మవల యును. అట్లు నమ్మకున్న నొకనితండ్రి దరిద్రుఁడుగా నుండి పుత్రుఁడు ధనాఢ్యుఁ

రయినేని. అతని కతనితండ్రి దరిద్రత్వాభిమానముచేత ధనమును దాఁచి వేయు మని చెప్పవలెను. ఒకని తండ్రి అంధుఁడుగా నుండిన నతని పుత్రుఁడును తన కన్నులను పొడగొట్టుకొనవలయునా? ఒకని తండ్రి కుకర్మియయ్యెనేని యతని పుత్రుఁడును గుమ్మరి కావలయునా? అట్లుకాఁగూడదనుట స్పష్టము. కాఁబట్టి పురుషుల యే యుత్తమ కర్మలు కలవో వానిని సేవించుచు, దుష్టకర్మలు వదలి పెట్టుట అందఱకు నత్యావశ్యకము. గుణకర్మ యోగముచేతఁగాక రజోవీర్య యోగముచేత వర్ణవ్యవస్థను నమ్మెడివారిని 'ఒకఁడు తన వర్ణమును వదలి నీచుఁడగు నంత్యజుఁడు, క్రైస్తవ, తురక, యయ్యెనేని, అతనిఁగూడ బ్రాహ్మణుఁడని యేల నమ్మరు?' అని అడిగితిమేని, బ్రాహ్మణకర్మమును వదలినాఁడు కాఁబట్టి అతఁడు బ్రాహ్మణుఁడు కాఁడని చెప్పుదురు. దీనివలన ఉత్తమకర్మములను జేయువారే బ్రాహ్మణాదులనియు. నీచుఁడు (నీచవర్ణస్థుడు) ఉత్తమ గుణకర్మ స్వభావవంతుఁడయ్యెనేని యతని నుత్తమ వర్ణమందును. ఉత్తమ వర్ణస్థుఁడునీచకర్మ మొనర్చెనేని అతనిని నీచవర్ణమందు గణింపవలయునని సిద్ధ మగుచున్నది.

ప్రశ్న:-బ్రాహ్మణోఽస్య ముఖమాసీ ద్బాహూ రాజన్యః కృతః।
ఊరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాగ్ం శూద్రో అజాయత॥

ఇది యజుర్వేదము ౩౧వ అధ్యాయమందలి ౧౧వ మంత్రము. ఈశ్వరుని ముఖమునుండి బ్రాహ్మణులు, బాహువులనుండి క్షత్రియులు, ఊరువుల నుండి వైశ్యులు, పాదమునుండి శూద్రులు ఉత్పన్నమయినారని దీని యర్థము. కాఁబట్టి యెట్లు ముఖము బాహ్వాదులుగాని, బాహ్వాదులు ముఖముగాని, కాఁజాలవో అట్లే బ్రాహ్మణుఁడు క్షత్రియాదులుకాని, క్షత్రియాదులు బ్రాహ్మణుఁడు కాని, కాఁజాలరు

ఉత్తరము:— ఈ మంత్రమునకు మీరుచేసిన యర్థము సరికాదు, ఇక్కడ పురుష శబ్దముచేత నిరాకారుఁడును అగు పరమాత్మకు అనువృత్తి కలుగు చున్నది. అతఁడు నిరాకారుఁడగుటచే నతనికి ముఖాది యంగములు కలుగఁ జాలవు. ముఖాది యంగములు కలవాఁడు పురుషుఁడు - వ్యాపకుఁడు కాఁజాలఁడు. వ్యాపకుఁడు కానివాఁడు సర్వశక్తిమంతుఁడును, లోకస్రష్టయు, ధర్తయుఁ, బ్రలయ కర్తయు. జీవుల పుణ్యపాప వ్యవస్థచేయువాఁడును, సర్వజ్ఞ. అజన్మ- మృత్యు

రహితాది విశేషణవంతుఁడును కాఁజాలఁడు: కాఁబట్టి (అస్య) పూర్ణుఁడును వ్యాపకుఁడునగు పరమాత్మ సృష్టియందు ముఖమువలె నందఱి యందును ముఖ్యుఁడు ఉత్తముఁడగు నతఁడు (బ్రాహ్మణః) బ్రాహ్మణుఁడు. (బాహూ) ''బాహుర్వై బలమ్'' [౫.౪.౧.౧]''బాహుర్వై వీర్యమ్''[౬.౩.౨.౩.౫] శతపథబ్రాహ్మణము: బలవీర్యములకు బాహువని పేరు. అవి యెవని యందు నధికముగానుండునో అతఁడు (రాజన్యః) క్షత్రియుఁడు. (ఊరూ) కటి యధో భాగమునకును దొడయొక్క పైభాగమునకును ఊరువని పేరు. ఊరు వుల బలముచే సమస్త దేశములకు వచ్చుఁ బోవుచు సమస్త పదార్థములందుఁ బ్రవేశము కలవాఁడు(వైశ్యః) వైశ్యుఁడు. (పద్భ్యాగ్ం)పాదములతో-ననఁగాఁ క్రింది అంగమువలె మూర్ఖత్వాది గుణములతోఁ గూడినవాఁడు శూద్రుఁడు. తక్కిన శతపథాది బ్రాహ్మణాదులయందును ఈ మంత్రమునకిట్లే యర్థము చేయఁబడి యున్నది—

'యస్మాదేతే ముఖ్యాస్తస్మాన్ముఖతో హ్యసృజ్యంత.' ఇత్యాది

ముఖ్యమగుటచే ముఖమునుండి యుత్పన్నమయ్యెనని చెప్పుట నంగతము. అనఁగా ముఖము అంగములన్నిఁటిలో శ్రేష్ఠమయినట్లు పూర్ణవిద్యచేతను, ఉత్తమ గుణకర్మస్వభావముచేతను యుక్తుఁడగుటవలన మనుష్యజాతియందు నుత్తముఁడగువాఁడు బ్రాహ్మణుఁడనఁబడును. పరమేశ్వరుఁడు నిరాకరుఁడగుటచే ముఖాదియంగములే లేనప్పుడు ముఖమునుండి యుత్పన్నమగుట గొడ్రాలి పుత్రుని వివాహమువలె నసంభవము. ఇదియుఁగాక ముఖాది యంగముల నుండియే బ్రాహ్మణాదులు పుట్టియుండిరేని, ఉపాదానకారణమువలె బ్రాహ్మణాదుల ఆకృతియుఁ గావలయును; అనఁగా ముఖాకారము గుండ్రముగా నుండునట్లు వారి శరీరమును గుండ్రముగా నుండవలయును. క్షత్రియుల శరీరము భుజములవలె, వైశ్యుల శరీరము ఊరువులవలె, శూద్రుల శరీరము పాదముల వలె నాకారము కలిగియుండవలయును. అట్లుండుటలేదు. ఎవరేని ముఖాదుల నుండి యుత్పన్నమగుటచేతనే బ్రాహ్మణాది సంజ్ఞయని చెప్పిరేని వారినిఁగూర్చి. ముఖాదులనుండి యుత్పన్నమైన వారికి బ్రాహ్మణాదిసంజ్ఞ యుండిన నుండవచ్చునుగాని మీకుఁ గాదు; మీరును అందఱివలె గర్భాశయమునుండియే యుత్పన్నమగుచున్నారు. ముఖాదులనుండి యుత్పన్నముగాక, మీరు బ్రాహ్మ

ద్రాదిసంజ్ఞలయం దవమాన పడుచున్నారు. కాఁబట్టి మీ యర్థము వ్యర్థము. మేము చేసిన యర్థమే సరియైనదని చెప్పవలయును, ఈ విషయమై మన్వాదులు నిట్లే చెప్పియున్నారు——

శూద్రో బ్రాహ్మణతామేతి బ్రాహ్మణశ్చైతి శూద్రతామ్।
క్షత్రియాజ్జాతమేవం తు విద్యాద్వైశ్యాత్తథైవ చ॥ మను. ౧౦.౬౫॥

శూద్రకులమం దుత్పన్నులైనను బ్రాహ్మణక్షత్రియ వైశ్యులవంటి గుణకర్మ స్వభావములు గలవారైరేని వారు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులగుదురు. అట్లే బ్రాహ్మణ క్షత్రియ వైశ్యకులములం దుత్పన్నులైనను శూద్రునివంటి గుణకర్మ స్వభావములు కలవారైరేని శూద్రులగుదురు. అట్లే క్షత్రియకులమందుఁగాని వైశ్యకులమందుఁగాని యుత్పన్నుఁడై బ్రాహ్మణునితోఁగాని శూద్రునితోఁగాని సమానుఁడయ్యెనేని బ్రాహ్మణుఁడో శూద్రుఁడో కాఁగలఁడు: అనఁగా నాలుగు వర్ణములలోను ఏయేవర్ణమునకు సమానులగు స్త్రీ పురుషులుందురో వారు ఆయా వర్ణములందే గణింపఁబడుదురు.

ధర్మచర్యయా జఘన్యో వర్ణః పూర్వం వర్ణమాపద్యతే జాతిపరివృత్తౌ॥౧॥
అధర్మచర్యయా పూర్వోవర్ణోజఘన్యం జఘన్యంవర్ణమాపద్యతే జాతిపరివృత్తౌ॥౨॥

ఇవి ఆపస్తంబ సూత్రములు. ధర్మాచరణముచేత నికృష్టవర్ణములు ఉత్తమోత్తమ వర్ణములగును. ఏవర్ణమున కెవఁడు యోగ్యుఁడో వాని నా వర్ణమందు గణింపవలయును. ॥౧॥ అట్లే అధర్మాచరణముచేత పూర్వ అనఁగా ఉత్తమోత్తమ వర్ణముల వారు తమకంటెఁ దక్కువైన నీచవర్ణములను బొందుదురు. వారి నా నీచవర్ణములందే గణింపవలయును ॥౨॥

పురుషులకు వర్ణవ్యవస్థయుండినట్లే స్త్రీలకునని తెలియవలయును. ఇట్లగుటచే సమస్తవర్ణములును దమతమ గుణకర్మ స్వభావములతోఁగూడి పరిశుద్ధములుగా నుండును. బ్రాహ్మణకులమందు క్షత్రియ వైశ్యశూద్ర సదృశులుండరు. క్షత్రియ వైశ్య శూద్రులును శుద్ధులుగానుందురు. వర్ణసంకరము ప్రాప్తింపదు. దీనిచే నేవర్ణమునకును నిందకాని, అయోగ్యతగాని కలుగఁజాలదు.

ప్రశ్న:—ఒకనికొక్క కుమారుఁడో, కుమార్తెయో యుండి వేఱువర్ణమునందుఁ జేరెనేని ఆతల్లిదండ్రులకు సేవచేయువారెవరు? వంశచ్ఛేదనము కూడ కలుగునుగదా? దీని కేమి యేర్పాటు చేయవలయును?

చేసి శుద్ధముగా నుండుటచే-వివేచనాపూర్వకముగ సత్యమును గ్రహించి అసత్యమును త్యజించుటచే నిశ్చయముగ, పవిత్రుఁడగుచున్నాఁడు. ఇదియే శౌచము. (క్షాంతి) నిందాస్తుతి, సుఖదుఃఖ, శీతోష్ణ, క్షుధాతృష, హానిలాభ, మానాపమానాదులయందు హర్షశోకములను వదలి, ధర్మమందు దృఢనిశ్చయుఁడై యుండుట. (ఆర్జవము.) కోమలత-నిరభిమానము, సరలత-సరళస్వభావము కలిగియుండుట, కుటిలతాది దోషములను వదలివేయుట. (జ్ఞానము) సమస్త వేదాది శాస్త్రములను సాంగోపాంగముగఁ జదివి చదివించు సామర్థ్యము, వివేకము, సత్యనిర్ణయము, ఏవస్తువెట్లున్నదో దానినట్లే-జడమును జడముగాను, చేతనమును చేతనముగాను దెలియుట, నమ్ముట. (విజ్ఞానము) పృథివి మొదలుకొని పరమేశ్వర పర్యంతము పదార్థములను విశేషముగఁ దెలిసికొని వానినుండి యథాయోగ్యమగు నుపయోగముఁగొనుట.(ఆస్తిక్యము) వేదము, ఈశ్వరుఁడు, ముక్తి, పూర్వాపరజన్మములు, ధర్మము, విద్య, సత్సంగము, మాత, పిత, గురువు, అతిథి సేవ, నెప్పుడు వదలక వీని నెన్నఁడును నిందింపకుండుట ॥౨॥ ఈ పదునైదు గుణకర్మములు బ్రాహ్మణ వర్ణస్థుల కవశ్యముగా నుండవలయును.

క్షత్రియులకు :—

> ప్రజానాం రక్షణం దాన మిజ్యాధ్యయనమేవ చ।
> విషయేష్వప్రసక్తిశ్చ క్షత్రియస్య సమాసతః॥౧॥ మను.౧.౮౯॥

న్యాయముగాఁ బ్రజలను రక్షించుట. పక్షపాతమునువదలి శ్రేష్ఠులను-సత్కరించుచు, దుష్టులను దిరస్కరించుచు నన్నివిధముల నందఱను పాలించుట. (దానము) విద్య, ధర్మము అను వీని ప్రచారమందును, సుపాత్రుల సేవయందును, ధనాది పదార్థములను వ్యయపఱచుట. (ఇజ్య) అగ్నిహోత్రాది యజ్ఞములను జేయుట చేయించుట- (అధ్యయనము) వేదాదిశాస్త్రములను జదువుట చదివించుట (విషయే...శ్చ) విషయములయందుఁ దగులుకొనక జితేంద్రియుఁడయి సదా శరీరమును, ఆత్మను బలిష్ఠముగా నుంచుట ॥౧॥

> శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనం।
> దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్॥౨॥ గీతా.౧౮.శ్లో.౪౩॥

(శౌర్యము) వందలకొలంది శత్రువులతోనొంటిగా యుద్ధముచేయుట యందు భయపడకుండుట (తేజము) సదా తేజస్వి-దైన్యమునువదలి, ప్రగల్భుఁడై, దృఢుఁడై యుండుట.(ధృతి)ధైర్యవంతుడై యుండుట. (దాక్ష్యము) రాజ్యప్రజాసంబంధమగు వ్యవహారములందును. సమస్త శాస్త్రములందును అతిచతురుఁడై యుండుట. (యుద్ధే...) యుద్ధమందు దృఢుఁడై నిశ్శంకుఁడై యుండి యెన్నటికిని వెనుదీయకయుఁ బరుపెత్తకయునుండుట - తన్ను బ్రతికించుకొని నిశ్చయముగా విజయము కలుగురీతిని యుద్ధము చేయవలయు ననుట. తాను బరుగెత్తిపోవుటచేతఁగాని, శత్రువులను మోసపుచ్చుట చేతఁగాని జయము గలుగనుండునేని అట్లే చేయుట. (దానము) దానశీలము కలిగి యుండుట. (ఈశ్వరభావము) పక్షపాతరహితుఁడై అందఱితో యథాయోగ్యముగ వర్తించుట. విచారించి యిచ్చుట, ప్రతిజ్ఞను బూర్తిచేయుట, దానికెన్నటికిని భంగము కలిగింపకుండుట. అను నీ పదునొకండును క్షత్రియవర్ణము గుణకర్మములు. ॥ ౨॥

వైశ్యులకు:-

> పశూనాం రక్షణం దానమిజ్యాధ్యయనమేవ చ।
> వణిక్పథం కుసీదం చ వైశ్యస్య కృషి మేవ చ॥ మను. ౧-౯౦॥

(పశురక్షణమ్) గోవులు మొదలగు పశువులను బాలించుచు వృద్ధిపఱచుట.(దానమ్)విద్యాధర్మములను వర్ధిల్లజేయుటకు ధనాదులను వ్యయపఱచుట. (ఇజ్య)అగ్నిహోత్రాది యజ్ఞములను జేయుట.(అధ్యయనమ్)వేదాది శాస్త్రములను జదువుట. (వణిక్పథమ్) అన్ని విధముల వ్యాపారముచేయుట. (కుసీదమ్) నూటికి నాలుగు. ఆఱు. ఎనిమిది. పంన్రెండు. పదియాఱు. ఇఱువది. అణాలకంటె నధికముగ వడ్డీ తీసికొనక అప్పిచ్చుట. మూలమునకు రెండింతలు అనఁగా నొకరూపాయి ఇచ్చిన నూఱేండ్లలో రెండురూపాయలకంటె నధికముగ బుచ్చుకొనకుండుట. ఈయకుండుట. (కృషి) పొలముచేయుట. ఇవి వైశ్యుని గుణకర్మములు.

శూద్రునకు:-

> ఏకమేవ తు శూద్రస్య ప్రభుః కర్మ సమాదిశత్।
> ఏతేషామేవ వర్ణానాం శుశ్రూషామనసూయయా ॥మను.౧.౯౧॥

నింద, ఈర్ష్య, అభిమానాది దోషములను వదలి బ్రాహ్మణ క్షత్రియ వైశ్యుల సేవ యథారీతిని జేయుచు నందువలన తాను జీవించుట యొకటియే శూద్రుని గుణకర్మము. ఇట్లు సంక్షేపముగ నాయా వర్ణముల గుణకర్మములు వ్రాయఁబడినవి. ఎవరువరియందు నేయే వర్ణముల గుణకర్మము లుండునో వారివారికి నాయా వర్ణముల యధికార మీయవలయును. ఇట్టివ్యవస్థచే మనుష్యులందఱు నున్నతశీలురగుదురు. ఏలయనఁగా తమ సంతానము మూర్ఖత్వాది దోషయుక్తమయ్యెనేని శూద్రులయి పోదురను భయము ఉత్తమ వర్ణస్థులకు గలుగును. అట్లే బిడ్డలుకూడ దాము పైరీతి నడతగలిగి విద్యాయుక్తులు కావే శూద్రులు కావలసి వచ్చునని భయపడుదురు. ఇదియును గాక నీచవర్ణస్థులకు నుత్తమవర్ణస్థులగుట కుత్సాహము వర్ధిల్లును. విద్యాధర్మములను ప్రచారము చేయు నధికారము బ్రాహ్మణుల కీయవలయును. ఏలయనఁగా, వారు పూర్ణవిద్యావంతులును, ధార్మికులు నయియుందురు గనుక నాకార్యమును యథాయోగ్యముగఁ జేయఁగలుగుదురు. క్షత్రియులకు రాజ్యాధికార మిచ్చుటచే నెన్నటికిని రాజ్యమునకు హానిగాని, విఘ్నముగాని కలుగదు. పశుపాలనాదుల యధికారము వైశ్యులకిచ్చుట యోగ్యము. ఏలయనఁగా వారీ కార్యమును బాగుగఁ జేయఁగలరు. శూద్రునకు సేవాధికారమీయవలయును. ఏలయనఁగా వాఁడు విద్యారహితుఁడును మూర్ఖుఁడు నగుటచే విజ్ఞానసంబంధమగు కార్యమేదియుఁ జేయఁజాలఁడు. కాని శరీరసంబంధమగు కార్యములన్నియుఁ జేయఁగలఁడు. ఈరీతి వర్ణములను దమతమ యధికారములయందుఁ బ్రవర్తింపఁజేయుట రాజు మొదలగు సభ్యజనుల కర్తవ్యము.

## వివాహ లక్షణములు

> బ్రాహ్మో దైవ స్తథైవార్షః ప్రాజాపత్య స్తథాసురః।
> గాంధర్వో రాక్షసశ్చైవ పైశాచశ్చాష్టమోఽధమః॥ మను॰ ౩-౨౧.

అష్టవిధ వివాహములు:—

మొదటిది బ్రాహ్మము, రెండవది దైవము, మూడవది ఆర్షము, నాల్గవది ప్రాజాపత్యము, అయిదవది ఆసురము, ఆఱవది గాంధర్వము, ఏడవది రాక్షసము, ఎనిమిదవది పైశాచము.

ఈ వివాహముల వ్యవస్థ:—

కన్యావరు లిద్దఱు యథారీతిని బ్రహ్మచర్యముచేఁ బూర్ణవిద్వాంసులును, ధార్మికులును, సుశీలురు నయి పరస్పర ప్రసన్నతచే వివాహమాడుట బ్రాహ్మము. విస్తృతమయిన యజ్ఞకార్యమందు ఋత్విక్కర్మ చేయుచుండు నల్లునికి నలంకారయుక్తురాలగు కన్య నొసంగుట దైవము. వరునినుండియేమైనను గొంచెము పుచ్చుకొని వివాహముచేయుట ఆర్షము. ధర్మాభివృద్ధికొరకు నిద్దఱు వివాహమాడుట 'ప్రాజాపత్యము'. కన్యావరులకు నేమేనిగొంత యొసఁగుటచే వివాహమగుట 'ఆసురము'. నియమ సమయములులేక యేదియో యొకకారణముచేతఁ గన్యావరులు ఇచ్ఛాపూర్వకముగఁ బరస్పరమేక మగుట 'గాంధర్వము'. జగడమాడి బలాత్కారముగ-నీడ్చుకొనిపోయి అకస్మాత్తుగఁగాని, మోసముచేఁగాని కన్యను గ్రహించుట రాక్షసము. నిదురించునట్టియో, త్రాగి మైమరచినట్టియో, పిచ్చిపట్టినట్టియో కన్యతో బలాత్కారముగ సంయోగము చేయుట 'పైశాచము'. ఈ వివాహము లన్నిటిలో బ్రాహ్మ వివాహము సర్వోత్కృష్టము. దైవప్రాజాపత్యములు మధ్యమములు. ఆర్ష, ఆసుర, గాంధర్వములు నికృష్టములు. రాక్షసము అధమము. పైశాచము మహాభ్రష్టము. కన్యావరులను వివాహమునకుఁ బూర్వము ఏకాంతమందుఁ జేర్పఁగూడదు. ఏలయనఁగా యువావస్థయందు స్త్రీపురుషుల కేకాంతవాసము దూష్యము. కన్యకుఁగాని వరునకుఁగాని వివాహసమయము సమీపించినపుడు-బ్రహ్మచర్యాశ్రమమును విద్యయును బూర్తియగుటకు నొక సంవత్సరము కాని, ఆఱు నెలలుకాని యున్నపుడు, ఆ కన్యావరుల ప్రతిబింబములు (ఇపుడు 'ఫోటోగ్రాఫ్') అను ప్రతికృతులు తీసి కన్యల అధ్యాపికల యొద్దకుఁ గుమారులవియు, కుమారుల అధ్యాపకుల యొద్దకుఁ గన్యలవియుఁ బంపవలయును. ఎవరేని రూపము కలిగియున్నదో వారివారి చరిత్రము జన్మము మొదలు నాటివఱకు జరిగిన జన్మచరిత్రయను పుస్తకముండెనేని దాని నధ్యాపకులు దెప్పించి చూడ వలయును. ఇద్దఱ గుణకర్మస్వభావములు సమానము లగ నుండెనేని ఎవరితో నెవరికి వివాహమగుట యోగ్యమని తోచునో ఆ యువతీయువకుల ప్రతిబింబములను, ఇతిహాసములను గన్యావరుల చేతికిచ్చి యీ విషయమై మీఅభిప్రాయము దెలుపవలయునని అడుగవలయును. వారిద్దఱును బరస్పరము వివాహము చేసికొనుటకు నిశ్చయించుకొనిరేని వారిద్దఱును

సమావర్తనము ఒకటే సమయమున జరుగవలయును. వారిరువురును దమ వివాహము తమయధ్యాపకులయెదుటఁగావలయుననికోరి రేనిఅక్కడను, లేకున్నకన్య యొక్క తల్లిదండ్రుల గృహమందును వివాహ మగుట యుక్తము. వారిరువురు సమావేశమయినపుడు, అధ్యాపకులు కన్య తల్లిదండ్రులు మొదలగు సభ్యుల యెదుట వారిరువురికిని సంభాషణలు, శాస్త్రార్థమును జేయింపవలయును. గుప్త వ్యవహారము లెవ్వియేని తెలుసుకొనవలసి యుండిన సభయందుఁ బరస్పరము వ్రాతమూలకముగఁ బ్రశ్నోత్తరములుచేసికొనవచ్చును ఇద్దరికిని వివాహమందు దృఢప్రేమ కలిగినప్పుడు పూర్వపు బ్రహ్మచర్యవిద్యాధ్యయనరూపమగు తపశ్చర్య చేతను. కష్టముచేతను దుర్బలమైన వారి శరీరములు చంద్రకళవలె నభివృద్ధి చెందుచు కొన్నిదినములలో పుష్టి యగునట్లు వారి అన్నపానములకు నుత్తమమగు నేర్పాట్లు చేయవలయును పిమ్మటఁ గన్య రజస్వలయయి శుద్ధరాలయినపుడు మంటపము, వేదికను నిర్మించి అనేకసుగంధాదిద్రవ్యముల చేతను, ఘృతాదులచేతను హోమ మొనర్చి, విద్వాంసులగు ననేక స్త్రీపురుషులను సత్కరింపవలయును. పిమ్మట ఋతుదానమున కర్హమగు దినమందు 'సంస్కార విధి' యందలి విధి ననుసరించి సమస్తయత్నము లొనర్చి యందఱియెదుట పాణిగ్రహణ పూర్వకమగు వివాహవిధినిఁ బరిపూర్తి చేసికొని మధ్యరాత్రి యందుఁగాని. పదిగంటలప్పుడుగాని అతి ప్రసన్నతతో నేకాంతసేవన చేయవలయును. విధి ననుసరించి పురుషుఁడు వీర్యస్థాపనను, స్త్రీ వీర్యాకర్షణమును జేయవలయును. వీలయినంతవఱకు బ్రహ్మచర్యరక్షితమగు వీర్యమును వ్యర్థపరుపరాదు ఏలయనఁగా ఆ వీర్యరజస్సులచే నుత్పన్నమగు శరీరము అపూర్వము నుత్తమము నగుచున్నది.

[వీర్యము గర్భాశయ మందుఁబడునపుడు స్త్రీ పురుషు లిరువురును స్థిరులై నాసిక కెదుట నాసికయు. నేత్రముల కెదుట నేత్రములనుంచి-శరీరమును సరిగానుంచి-ప్రసన్నచిత్తులై యుండవలయును. చలింపరాదు. పురుషుఁడు దన శరీరమును వదలింపవలయును. స్త్రీ వీర్యప్రాప్తి సమయమున అపానమును బైకిఁ దీర్చుకొనవలయును. యోనిని బైన సంకోచపఱచి వీర్యమును బైకి నాకర్షించి గర్భాశయమునందుంచుకొనవలయును.* పిమ్మట నిద్ర

* ఈ విషయము రహస్యమయినది కావున ఇంతటిలోనే యంతయు నూహించి గ్రహింపవలయును. విశేషించి వ్రాయుట యుచితముకాదు.

యును శుద్ధ జలములో స్నానముచేయవలయును. గర్భమేర్పడినట్లు విద్వాంసు రాలగు స్త్రీకి అప్పుడే తెలియును. కాని దీని నిశ్చయ మొక మాసమునకుఁ బిమ్మట-రజస్వల కాకపోయినపుడు-అందఱికిని దెలియును. సొంటి. కుంకుమ పూవు (అశ్వగంధి) పెన్నేరుగడ్డ. ఏలకులు. పంచదార వేసి కాచి చల్లార్చిన పాలు రుచికొలఁది నిద్దఱును ద్రాగి వేఱువేఱుగఁ దమ తమ పడకలమీఁదఁ బరుండవలయును. గర్భాధానము చేసినపుడెల్ల నీ విధముగనే నడచుకొనుట యుచితము. మాసాంతమునకు రజస్వలకాక గర్భస్థితి కలిగెనని నిశ్చయ మయినది మొదలుకొని యొక సంవత్సరపర్యంతము స్త్రీపురుష లెప్పుడును సమాగమముఁ జేయఁగూడదు. అట్లు సమాగమముఁ జేయకుండుటచే నాసంతాన ము త్తమమయి రెండవ సంతానముకూడ నట్టిదియేయగును. గర్భస్థితిలో సమా గమము చేయుటవలన వీర్యము వ్యర్థముగాఁబోవును. ఆయువును తగ్గిపోవును. అనేకరోగములనుగలుగును. కాని సంభాషణాదిప్రేమ వ్యవహారము మాత్రము అవశ్యముగా నుండవలయును. పురుషుఁడు. తన వీర్య స్థైర్యమును, స్త్రీ గర్భ సంరక్షణమును జేసికొనుచు పురుషుఁడు తన వీర్యము స్వప్నమందైన నష్టము గాకుండునట్లును. స్త్రీ తన గర్భమందలి శిశువు శరీర మత్యుత్తమ రూప. లావణ్య. పుష్టి. బలపరాక్రమ యు క్తమయి పదియవమాసమందు జనియించు నట్లును భోజనాచ్ఛాదనములను జేయవలయును. కాని గర్భసంరక్షణము విశేష ముగ నాల్గవమాసమునుండియు. నంతకంటె నెక్కువగ నెనిమిదవమాసము నుండియుఁ జేయవలయును.

గర్భవతియగు స్త్రీ (రేచక) విరేచనకారి. (రూక్ష) రసములేనిది. (మాదక) మత్తు గలిగించునదియు. బుద్ధి. బలనాశకములునగు పదార్థములను భుజింపఁగూడదు. నెయ్యి. పాలు. బియ్యము. గోదుమలు. పెసలు. మినుములు మొదలగు నాహారములను కాలమును గుర్తెఱింగి సముచితముగ సేవింపవలయును. గర్భావస్థయందు జరుపవలసిన సంస్కారములు రెండు. నాల్గవ నెలయందు జరుపవలసిన పుంసవన మొకటి; ఎనిమిదవ నెలయందు జరుపవలసిన సీమంతోన్నయనము రెండు. వీనిని విధ్యుక్తముగఁ జేయవలయును. శిశువుజనింపఁగానే మాతాశిశువుల శరీరక్షణము మిక్కిలిజాగరూకతతోఁ

జేయవలయును. దానెంత సేవింపవలసిన, సొంటిపాకముకాని 'సౌభాగ్య శుంఠిపాకము' కాని మొదటనే చేసియుంచుకొనవలయును. ప్రసవమయిన పిమ్మట స్త్రీ సుగంధయుక్తమగు సుష్ణజలమందు అనఁగా గోరు వెచ్చని జలమున-స్నానము చేయవలయును. బిడ్డనుగూడ స్నానము చేయింపవలయును. పిమ్మట బొడ్డు గోయవలయును. శరీరమునుండి యొక్క రక్తపు బొట్టుకూడ పోకుండునట్లు బొడ్డు మూలమందు మెత్తని దారముతోఁగట్టి, నాలుగు వ్రేళ్ళు వదలి-కోయవలయును. పిమ్మట పురిటిల్లు శుద్ధిపఱచి వాకిటి లోపల సుగంధాదులతోఁ గూడిన ఘృతాదులతో హోమ మొనర్పవలయును. తరువాతఁదండ్రిబిడ్డచెవియందు,'వేదోఽసి' [శ.బ్రా.౧౪.౬.౪.౨౬] అనఁగా నీపేరు వేదమనివినిపించి-నేయియుఁ దేనెయుఁ దీసికొని యొకబంగరుశలాకతో నాలుక మీఁద 'ఓమ్'అని వ్రాసి యా తేనెను,నేతిని(అశలాకతోనే)చప్పరింపఁ జేయవలయును. పిమ్మట బిడ్డను దల్లి కీయవలయును. తల్లి బిడ్డకుఁ బాలు త్రావింపవలయును. తల్లికిపాలు లేనిచో పరీక్షించి దాదిచే, బాలిప్పింపవలయును. తరువాత శుద్ధవాయువుగల మఱియొక గదిలో నాతల్లిబిడ్డల నుంచవలయును. అందు సాయంప్రాతఃకాలములందు సుగంధముతోఁగూడిన నేతితో హోమము చేయుచుండవలయును. తల్లి ఆఱుదినములవఱకే బిడ్డకుఁ బాలీయవలయును. తల్లి తన శరీరము పుష్టియగు నిమిత్తము అనేక ప్రకారములగు సుత్తమభోజనములు చేయవలయును. యోనిసంకోచాదులను గూడ జేసికొనుచుండవలయును. ఆఱవదినము స్త్రీ వెలుపలికిరావచ్చును. బిడ్డకుఁ బాలిచ్చుటకు దాది నుంచవలయును. దానికి నన్నపానములు బాగుగ నీయవలయును. అది బిడ్డను బాలిచ్చి పెంచవలయును. బిడ్డ పాలనమందు నే యనుచిత వ్యవహారమును గలుగకుండునట్లు తల్లి పూర్ణదృష్టి యుంచవలయును. స్త్రీ స్రవించు పాలనాపుటకు స్తనమునందుఁ దగిన లేపమును జేయవలయును. అట్లే తగిన యన్నపాన వ్యవహారమునుగూడఁ జేయవలయును. పిమ్మట నామకరణాది సంస్కారములు 'సంస్కారవిధి' ననుసరించి ఆయా కాలముల యందుఁ జేయవలయును. స్త్రీ మరల రజస్వలయయి శుద్ధయయిన పిమ్మట నదే రీతిని ఋతుదాన మొసంగవలయును.

ఋతుకాలాభిగామీ స్యాత్స్వదారనిరతః సదా।
బ్రహ్మచార్యేవ భవతి యత్ర తత్రాశ్రమే వసన్ ॥మను-౩.౫౦॥

తన స్త్రీతోనే ప్రసన్నుఁడై నిషిద్ధ రాత్రులయందు స్త్రీనుండి దూరముగా నుండి ఋతుగామియగు నతఁడు గృహస్థుఁడయినను బ్రహ్మచారికి సమానుఁడు.

సంతుష్టో భార్యయా భర్తా భర్త్రా భార్యా తథైవ చ।
యస్మిన్నేవ కులే నిత్యం కల్యాణం తత్ర వై ధ్రువమ్॥మను-౩-౬౦॥

ఏ కులమందు భార్యచే భర్తయు, భర్తచే భార్యయు బాగుగా ప్రసన్నులయి యుందురో ఆ కులమందు సమస్త సౌభాగ్యములు, ఐశ్వర్యమును నివసించును, కలహించుచో దౌర్భాగ్యమును, దారిద్ర్యమును స్థిరముగానుండును.

యది హి స్త్రీ న రోచేత పుమాంసం న ప్రమోదయేత్ ।
అప్రమోదాత్ పునః పుంసః ప్రజనం న ప్రవర్తతే॥ మను.౩.౬౧॥

ఏ స్త్రీ తన పతిని ప్రేమించి యతనిఁ బ్రసన్నునిగాఁజేయదో ఆ స్త్రీ పతి అప్రసన్నుఁడుగా నుండును గనుక సతనికిఁ గామ ముత్పన్నముకాదు.

స్త్రియాం తు రోచమానాయాం సర్వం తద్రోచతే కులం ।
తస్యాం త్వరోచమానాయాం సర్వమేవ న రోచతే॥మను.౩.౬౨॥

స్త్రీ ప్రసన్నతచే కులమంతయు బ్రసన్నమగును. స్త్రీ అప్రసన్నతచే కులమంతయు నప్రసన్నమగును. అనఁగా దుఃఖముఁ బొందును.

పితృభిర్భ్రాతృభిశ్చైతాః పతిభిర్దేవరైస్తథా ।
పూజ్యా భూషయితవ్యాశ్చ బహుకల్యాణ మీప్సుభిః॥మను.౩.౫౫॥

స్త్రీలను సత్కారపూర్వకముగ భూషణాదులచేఁ బ్రసన్నలుగా నుంచుట తండ్రికి, అన్నకు, పెనిమిటికి, మఱఁదికి ధర్మము. మిక్కిలి కల్యాణమును గోరువారందఱు నిట్లు చేయవలయును.

యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః।
యత్రైతాస్తు న పూజ్యంతే సర్వాస్తత్రాఫలాః క్రియాః ॥మను.౩.౫౬॥

స్త్రీలకు సత్కారముగల గృహమందుఁ బురుషులు విద్యాయుక్తులయి దేవసంజ్ఞనుబొంది యానందముతోఁ గ్రీడింతురు. స్త్రీలకు సత్కారములేని గృహమందుఁ గ్రియలన్నియు నిష్ఫలములగును.

శోచంతి జామయో యత్ర వినశ్యత్యాశు తత్కులమ్ ।
న శోచంతి తు యత్రైతా వర్ధతే తద్ధి సర్వదా॥ మను.౩.౫౭॥

స్త్రీలు శోకాతురలై దుఃఖించుచుండు కులముకాని, యిల్లుకాని శీఘ్రముగా నశించును. ఆనందముతోను, ఉత్సాహముతోను సుఖించుచుండు స్త్రీలుగల కులము సర్వదా వర్ధిల్లును.

తస్మాదేతాః సదా పూజ్యా భూషణాచ్ఛాదనాశనైః ।
భూతికామైర్నరైర్నిత్యం సత్కారేషూత్సవేషు చ॥ మను. ౩.౫౯॥

కాఁబట్టి ఐశ్వర్యమును కామించువారు సత్కారసమయమందును, ఉత్సవ సమయమందును స్త్రీలను భూషణ వస్త్ర భోజనాదులచే నవశ్యముగా సత్కరించుట యోగ్యము.

'పూజ' అను శబ్దమునకర్థము సత్కారమని సదా తలంపవలయును. దినమందుఁగాని, రాత్రియందుఁగాని, ప్రథమదర్శనమందును, వేఱగునపుడును, స్త్రీపురుషులు పరస్పరము ప్రీతిపూర్వకముగ 'నమస్తే' అని చెప్పి సత్కరింపవలెను.

సదా ప్రహృష్టయా భావ్యం గృహకార్యేషు దక్షయా ।
సుసంస్కృతోపస్కరయా వ్యయే చాముక్తహస్తయా॥ మను ౫.౧౫౦॥

అతి ప్రసన్నతతో గృహకార్యములయందుఁ జతురురాలయి, పదార్థములన్నిటిని ఉత్తమవిధితో సంస్కారము చేయుచు నింటిని శుద్ధముగా నుంచి మితవ్యయిగా నుండుట స్త్రీకి యోగ్యము. అవసరము ననుసరించి వెచ్చపెట్టవలయును; దుబార చేయఁగూడదు. అన్నివస్తువులను పవిత్రముగా నుంచవలయును. ఔషధరూప మయి, శరీరమందు ఆత్మయందును రోగమును రానీయకుండునట్టి పాకము చేయవలయును. వ్యయమునకు తగిన లెక్క యుంచి పతి మొదలగువారికి వినిపింపవలయును. ఇంటి పనివాండ్రచే యథాయోగ్యముగఁ బనిచేయింపవలయును. ఇంటి పనిని దేనిని చెడనీయఁగూడదు.

స్త్రియో రత్నాన్యథో విద్యా సత్యం శౌచం సుభాషితమ్।
వివిధాని చ శిల్పాని సమాదేయాని సర్వతః॥ మను. ౨.౨౪౦॥

ఉత్తమస్త్రీని, నానావిధములగు రత్నములను, విద్యను, సత్యమును పవిత్రతను, శ్రేష్ఠభాషణమును, నానాప్రకారములగు శిల్పవిద్యను,-అన్ని విధ

ముం కళాకౌశలములను-అన్ని దేశములనుండియు, మనుష్యులందఱినుండియు గ్రహింపవలయును.

> సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయా న్నబ్రూయాత్సత్య మప్రియం।
> ప్రియం చ నానృతం బ్రూయా దేష ధర్మస్సనాతనః ॥ మను. ౪.౧౩౮॥

సర్వదా ప్రియసత్యమును-ఇతరులకు హితకారకమగు సత్యమును-జెప్పవలయును. అప్రియసత్యమును-గ్రుడ్డివానిని(గూర్చి 'గ్రుడ్డివా(డా' అని పిలుచుటచే వాని మనస్సు నొప్పించుట తప్ప మఱియేమియు లాభము గలు గదు. కనుక నిట్టి అప్రియసత్యమును పలుకగూడదు. ఇతరుల ప్రసన్నత కొఱకును అబద్ధ మాడ(గూడదు.

> భద్రం భద్రమితి బ్రూయాత్ భద్రమిత్యేవ వా వదేత్ ।
> శుష్కవైరం వివాదం చ న కుర్యాత్కేనచిత్సహ॥ మను. ౪.౧౩౯॥

సర్వదా భద్రమైన - అందరికిని హితకరమైన - వచనమే చెప్పుచుండ వలయును. శుష్కవైరము-అపరాధ మొనర్పనివారితో విరోధము-కాని, వివాదముకాని కూడదు. ఇతరులకు హితకరమగుదానిని-వారు చెడ్డదని యెంచినను-చెప్పియే తీరవలయును.

> పురుషా బహవో రాజన్ సతతం ప్రియవాదినః ।
> అప్రియస్య తు పథ్యస్య వక్తా శ్రోతా చ దుర్లభః॥మ.భా.ఉద్యోగ-విదురనీతి॥

ఓ ధృతరాష్ట్రా! ఈ ప్రపంచమందు నిరంతరము ఇతరులను ప్రసన్నపఱచు నిమిత్తము ప్రియమును జెప్పు ప్రశంసకులు విస్తారముగనున్నారు. కాని కల్యాణకరమగు వచనమును అప్రియమని తెలిసినను-చెప్పియేతీరువారు కాని, వినువారుకాని దుర్లభము. ఇతరుల దోషములను వారి యెదుట చెప్పుటయు( దమ దోషములను వారినుండి వినుటయు( బరోక్షమందు నితరుల గుణములను సర్వదా పొగడుటయు సత్పురుషుల స్వభావము. దుష్టులు సమ్ముఖమున గుణమును జెప్పుచు( బరోక్షమందు దోషములను బ్రకాశపఱతురు. మనుష్యు(డు తన దోషములను నితరులతో( జెప్పకుండువఱకు నాదోషములను వదలి గుణవంతుడు కా(జాల(డు. ఎన్న(డును, ఎవరిని నిందింప(గూడదు. (గుణేషు దోషారోపణమసూయా-అర్థాత్ దోషేషు గుణారోపణమప్యసూయా, గుణేషు గుణారోపణందోషేషు దోషారోపణం చ స్తుతిః)గుణములందు దోషము

లను దోషములందు గుణములను ఆరోపించుట- 'నింద'. గుణములందు గుణములను దోషములందు దోషములను జెప్పుట స్తుతి. మిథ్యాభాషణమునకు నింద యనియు; సత్యభాషణమునకు స్తుతి యనియుఁ బేరు.

> బుద్ధి వృద్ధి కరాణ్యాశు ధన్యాని చ హితాని చ ।
> నిత్యం శాస్త్రాణ్యవేక్షేత నిగమాంశ్చైవ వైదికాన్॥మను-౪-౧౯॥

శీఘ్రముగా బుద్ధిని, ధనమును, హితమును వృద్ధిపఱచునట్టి శాస్త్రములను, వేదములను నిత్యమును వినవలయును. వినిపింపవలయును. బ్రహ్మచర్యాశ్రమమందుఁ జదివిన వానిని స్త్రీపురుషులు నిత్యమును విచారించుచుఁ జదువుచు నుండవలయును.

> యథా యథా హి పురుషః శాస్త్రం సమధిగచ్ఛతి।
> తథా తథా విజానాతి విజ్ఞానం చాస్య రోచతే॥ మను-౪-౨౦॥

మనుష్యుఁడు శాస్త్రముల యాథార్థ్యమును దెలిసినకొలఁది నతని విద్య యందలి విజ్ఞాన మభివృద్ధియగును. దానియందే రుచియును వర్ధిల్లును.

> ఋషియజ్ఞం దేవయజ్ఞం భూతయజ్ఞం చ సర్వదా।
> నృయజ్ఞం పితృయజ్ఞం చ యథాశక్తి న హాపయేత్॥మను-౪-౨౧॥
> అధ్యాపనం బ్రహ్మయజ్ఞః పితృయజ్ఞస్తు తర్పణమ్।
> హోమో దైవో బలిర్భౌతో నృయజ్ఞోఽతిథిపూజనమ్॥మను.౩.౭౦॥
> స్వాధ్యాయేనార్చయేదృషీన్ హోమైర్దేవాన్ యథావిధి।
> పితౄన్ శ్రాద్ధైశ్చ నౄనన్నైః భూతాని బలికర్మణా॥మను.౩.౮౧॥

బ్రహ్మచర్యమందు వ్రాయఁబడిన రెండు యజ్ఞములను జేయవలయును. మొదటిది బ్రహ్మయజ్ఞము-అనఁగా వేదాది శాస్త్రములను జదివి చదివించుట, సంధ్యోపాసన, యోగాభ్యాసముచేయుట; రెండవది దేవయజ్ఞము అనఁగా విద్వాంసుల సేవ, సాంగత్యము, పవిత్రత, మొదలగు దివ్యగుణముల వహించుట, దాతృత్వము విద్య నున్నతిపఱచుట. ఈ రెండు యజ్ఞములను సాయంప్రాతఃకాలములయందుఁ జేయవలయును.

> సాయం సాయం గృహపతిర్నో అగ్నిః।
> ప్రాతః ప్రాతః సౌమనసస్య దాతా॥అథ.కాం-౧౯-అను-౭సూ.౫౫.మం-౩॥

సాయంకాలమందు హోమముజరుగును. అందు హుతమయిన హోమ ద్రవ్యము ప్రాతఃకాలమువఱకు వాయువును శుద్ధిపఱచుచు సుఖకారియగుచున్నది.

ప్రాతః ప్రాతర్గృహపతి ర్నో అగ్నిః।
సాయం సాయం సౌమనస్య దాతా॥ అథ.కాం.౧౯. అను.౭సూ.౫౫.౪॥

అగ్నియందుఁ బ్రాతఃకాలము హోమము చేయఁబడిన ద్రవ్యము సాయంకాలపర్యంతము వాయువును శుద్ధపఱచుచు బల, బుద్ధి, ఆరోగ్యములను గలిగించును.

తస్మాదహోరాత్రస్య సంయోగే బ్రాహ్మణః సంధ్యా ముపాసీత॥
ఉద్యంత మ స్తంయాంత మాదిత్య మభిధ్యాయ॥న్షడ్వింశబ్రాహ్మణే.
బ్ర.౪.౫౦.౫॥

కాఁబట్టి దినరాత్రుల సంధియందు - సూర్యోదయా స్త సమయముల యందుఁ-బరమేశ్వరుని ధ్యానమును, అగ్ని హోత్రమును అవశ్యము చేయ వలయును.

న తిష్ఠతి తు యః పూర్వాం నోపా స్తే యస్తు పశ్చిమామ్।
స శూద్రవద్బహిష్కార్యః సర్వస్మా ద్ద్విజకర్మణః॥౫॥ మను.౨.౧౦౩॥

ఈ రెండు కార్యములను సాయంప్రాతః కాలములయందుఁ జేయకుండు వానిని సజ్జనులందఱును సమ స్త ద్విజకర్మములనుండి వెలివేయవలయును — వానిని శూద్రుఁనిగ నెంచవలయును.

ప్రశ్న :- మూఁడు కాలములయందు సంధ్య యేలఁ జేయఁగూడదు?

ఉ త్తరము :- సంధి మూఁడుసమయములందుఁగాదు. ప్రకాశ - అంధ కారములసంధి సాయంప్రాతః కాలములను రెండు వేళలయందే యగుచున్నది. దీనిని గణింపక మధ్యాహ్న కాలమందు మూఁడవసంధ్య నెన్ను వాఁడు మధ్య రాత్రియందును ఏలచేయఁగూడదు? మధ్యరాత్రియందును జేయవలయు నేని ప్రహర ప్రహరమునకును, గడియ గడియకును, పల పలమునకును, క్షణ క్షణ మునకును సంధి యగుచున్నది. కనుక అప్పుడును సంధ్యోపాసన చేయవలసి వచ్చును. అట్లు చేయుట ఎన్నిటికిని జరగదు. ఇదిగాక యే శాస్త్రమునందును మధ్యాహ్న సంధ్యకుఁ బ్రమాణము లేదు. కాఁబట్టి రెండుకాలముల యందే సంధ్యాగ్నిహోత్రములను జేయుట యుచితము; కాని, మూఁడవకాలమందుఁ జేయుట యుచితముకాదు. మూఁడుకాలములు భూత భవిష్యద్వ ర్తమాన భేద ముచేఁగాని సంధ్యోపాసన భేదముచేతఁ గాదు.

మూడవది పితృయజ్ఞము :— దేనియందు దేవులు అనఁగా విద్వాంసులును, చదివించువారగు ఋషులును, పితరులును అనఁగా తల్లి దండ్రి మొదలగు వృద్ధులును, జ్ఞానులును, పరమ యోగులును సేవింపఁబడుదురో అది పితృయజ్ఞము.

పితృయజ్ఞమందు రెండు భేదములు: ఒకటి శ్రాద్ధము; రెండవది తర్పణము. శ్రత్ అనఁగా సత్యము (శ్రత్సత్యం దధాతి యయా క్రియయా సా శ్రద్ధా. శ్రద్ధయా యత్ క్రియతే తచ్ఛ్రాద్ధమ్.) ఏక్రియచే సత్యము గ్రహింపఁబడునో అది శ్రద్ధ. ఆ శ్రద్ధచే నేకర్మము చేయఁబడునో దానికి శ్రాద్ధమని పేరు. (తృప్యంతి తర్పయంతి యేన పితౄన్ తత్తర్పణమ్.) ఏకర్మముచేత బ్రతికియుండు మాతా పిత్రాది పితరులు ప్రసన్నులగుదురో లేక ప్రసన్నుల చేయఁబడుదురో దానికి తర్పణమని పేరు. ఈ తర్పణము జీవించియుండు వారికొఱకే చేయవలయును కాని మృతులయినవారి కొఱకుఁ గాదు.

దేవతర్పణము :—

ఓమ్ బ్రహ్మాదయో దేవాస్తృప్యంతామ్ ।
బ్రహ్మాది దేవపత్న్యస్తృప్యంతామ్ ।
బ్రహ్మాది దేవసుతాస్తృప్యంతామ్ ।
బ్రహ్మాది దేవగణాస్తృప్యంతామ్ ॥ ఇతి దేవతర్పణమ్॥

('విద్వాꣳసో హి దేవాః')ఇది శతపథ [౩।౩।౬-౧౦] బ్రాహ్మణ వచనము. విద్వాంసులకు దేవులని పేరు. నాలుగు వేదములను సాంగోపాంగముగ నెఱిగిన వానికి బ్రహ్మయని పేరు. అతనికంటెఁ దక్కువ శ్రేణిలోని విద్వాంసులు దేవశబ్దవాచ్యులు; అట్టి బ్రహ్మతో సమానమగు విద్యావంతురాలయి యతని భార్యయగు నామె బ్రహ్మాణి. దేవశబ్దార్థులగు విద్వాంసుని భార్య దేవి. వీరిని సేవించుటయు, వీరితో సమానులగు వీరి పుత్రులను, శిష్యులను వీరి గణమును - సేవకులను - సేవించుటయు శ్రాద్ధము; తర్పణము.

ఋషి తర్పణము:—

ఓమ్ మరీచ్యాదయ ఋషయస్తృప్యంతామ్
మరీచ్యాద్యృషి పత్న్యస్తృప్యంతామ్ ।

మరీచ్యాదయ ఋషయస్తృప్యంతామ్।
మరీచ్యాద్యృషి గణాస్తృప్యంతామ్ ॥ ఇతి ఋషితర్పణమ్ ॥

బ్రహ్మకు మునిమనుమఁడగు మరీచివలె విద్యావంతుఁడయి చదివించు నతనిని, అతనితో సమానముగ విద్యావంతురాలయి కన్యలకు విద్యా దానము చేయు నతని భార్యను, అతనితో సమానులగు నతని పుత్రులను, శిష్యులను, సేవకులను సత్కరించుట ఋషి తర్పణము.

**పితృ తర్పణము :—**

ఓమ్ సోమసదః పితర స్తృప్యంతామ్। అగ్నిష్వాత్తాః పితర స్తృప్యంతామ్।
బర్హిషదః పితర స్తృప్యంతామ్।సోమపాః పితర స్తృప్యంతామ్।
హవిర్భుజః పితర స్తృప్యంతామ్।ఆజ్యపాః పితర స్తృప్యంతామ్।
సుకాలినః పితర స్తృప్యంతామ్।యమాదిభ్యో నమః యమాదీం స్తర్పయామి।
పిత్రే స్వధా నమః పితరం తర్పయామి।పితామహాయ స్వధా నమః పితామహం తర్పయామి। ప్రపితామహాయ స్వధా నమః। ప్రపితామహం తర్పయామి।
మాత్రే స్వధా నమో మాతరం తర్పయామి।
పితామహ్యై స్వధా నమః పితామహీం తర్పయామి ।
ప్రపితామహ్యై స్వధా నమః ప్రపితామహీం తర్పయామి।
స్వపత్న్యై స్వధా నమః స్వపత్నీం తర్పయామి ।
సంబంధిభ్యః స్వధా నమః సంబంధిన స్తర్పయామి ।
సగోత్రేభ్యః స్వధా నమః సగోత్రాం స్తర్పయామి ॥ఇతి పితృతర్పణమ్॥

(యే సోమే జగదీశ్వరే పదార్థ విద్యాయాం చ సీదంతి తే సోమసదః.) పరమాత్మ (సంబంధమగు విద్య) యందును, పదార్థవిద్యయందును నిపుణులగు వారు సోమసదులు. (యైరగ్నేర్విద్యుతో విద్యా గృహీతా తే అగ్నిష్వాత్తాః.) అగ్ని అనఁగా విద్యుదాది పదార్థములు. వీనిని గుర్తెఱిగిన వారు అగ్నిష్వాత్తులు.(యే బర్హిషి ఉత్తమ వ్యవహారే సీదంతి తే బర్హిషదః) ఉత్తమ విద్యా వృద్ధి యుక్త వ్యవహారములయందుండువారు బర్హిషదులు.(యే సోమమైశ్వర్య మోషధీరసం వా పాంతి పిబంతి వా తే సోమపాః.) ఐశ్వర్యమును రక్షించు వారును, మహౌషధిరసమును పానము చేయువారును, రోగరహితులును, ఇతరుల మైశ్వర్యముల రక్షించువారును, ఔషధములనిచ్చి రోగములను బోఁగొట్టు వారును, సోమపులు. (యే హవిర్హోతు మత్తు మర్హం భుంజతే భోజయంతి వా తే

హవిర్భుజః.) మాదక ద్రవ్యములను, హింసాకారక ద్రవ్యములను వదలి భోజనము చేయువారు హవిర్భుజులు. ('య ఆజ్యం జ్ఞాతుం ప్రాప్తుం వా యోగ్యం రక్షంతి వా పిబంతి తే ఆజ్యపాః.) తెలియుటకు యోగ్యమగు వస్తువును రక్షించు వారును, ఘృతదుగ్ధాదులు త్రాగువారును ఆజ్యపులు. ('శోభనః కాలో విద్యతే యేషాం తే సుకాలినః.) ధర్మము చేయుటకు సుఖరూపమగు సమయము కలవారు సుకాలినులు. ('యే దుష్టాన్ యచ్ఛంతి నిగృహ్ణంతి తే యమా న్యాయాధీశాః.) దుష్టులను దండించి శ్రేష్ఠులను పాలించు న్యాయకారులు యములు. ('యః పాతి స పితా') సంతానమును అన్నముచేతను సత్కారముచేతను రక్షించువాఁడు జనకుఁడు-పిత. (పితుః పితా పితామహః, పితామహస్య పితా ప్రపితామహః) తండ్రికి తండ్రి పితామహుఁడు: తాత తండ్రి ప్రపితామహుఁడు. (యా మానయతి సా మాతా) అన్నముచేతను, సత్కారముచేతను సంతానమును మాన్యము చేయునది మాత. ('యా పితు ర్మాతా సా పితామహీ. పితామహస్య మాతా ప్రపితామహీ') తండ్రితల్లి పితామహి. పితామహుని తల్లి ప్రపితామహి. వీరిని, తన భార్యను, అక్కలను, బంధువులను తన గోత్రము వారిని, ఇతరమహాపురుషులను, వృద్ధులను అత్యంతశ్రద్ధతో నుత్తమాన్నవస్త్రసుందరయానము లిచ్చి బాగుగఁదృప్తిపఱచుట-అనఁగా నేయే కర్మములచే వారి ఆత్మ తృప్తిఁబొంది శరీరము స్వస్థమగుచున్నదో ఆయా కర్మములచేఁ ప్రీతిపూర్వకముగ వారిసేవ చేయుట శ్రాద్ధ తర్పణము లనఁబడును.

నాల్గవది వైశ్వదేవము. అనఁగా భోజనము సిద్ధముకాఁగానే భోజనము కొఱకుఁ జేయఁబడిన పదార్థములలోఁ బులుసు, ఉప్పు, కారము కలిసిన యన్నమును వదలి చక్కెర, నెయ్యి వీనితోఁగలిసిన యన్నమును పొయ్యిలో నుండి కొంత నిప్పు వేఱుగఁదీసి యందులో నీక్రింద వ్రాయఁబడిన మంత్రములచే హోమము చేయవలయును.

> వైశ్వదేవస్య సిద్ధస్య గృహ్యేఽగ్నౌ విధిపూర్వకమ్ ।
> ఆభ్యః కుర్యాద్దేవతాభ్యో బ్రాహ్మణో హోమ మన్వహమ్॥ మను. ౩.౮౪॥

పాకశాలయందు భోజనార్థము సిద్ధమయినది. దానిని దివ్యగుణములు కలుగుటకు ఆ పాకాగ్నిలో విధిపూర్వకముగ నిమ్నలిఖిత మంత్రములతో నిత్యము హోమము చేయవలయును.

హోమమంత్రములు:—

ఓమ్। అగ్నయే స్వాహా॥ సోమాయ స్వాహా॥ అగ్నిషోమాభ్యాం స్వాహా॥
విశ్వేభ్యో దేవేభ్యః స్వాహా॥ ధన్వంతరయే స్వాహా॥
కుహ్వై స్వాహా॥ అనుమత్యై స్వాహా॥ ప్రజాపతయే స్వాహా॥
సహ ద్యావా పృథివీభ్యాం స్వాహా॥ స్విష్టకృతే స్వాహా॥

ఈ ప్రత్యేక మంత్రము చేత నొక్కొక్క పర్యాయము ప్రజ్వలితమగు నగ్నియం దాహుతులను వదలవలయును. పిమ్మట పళ్ళెములోఁగాని భూమి మీఁద ఆకు వేసి కాని, పూర్వదిశాది క్రమానుసారము ఈ క్రింది మంత్రములచే యథాక్రమముగ భాగములు పెట్టవలయును.

ఓమ్। సానుగాయేంద్రాయ నమః। సానుగాయ యమాయ నమః। సానుగాయ
వరుణాయ నమః। సానుగాయ సోమాయ నమః। మరుద్భ్యో నమః॥ వనస్ప
తిభ్యో నమః॥ శ్రియై నమః॥ భద్రకాల్యై నమః॥ బ్రహ్మపతయే నమః॥ వాస్తు
పతయే నమః॥ విశ్వేభ్యో దేవేభ్యో నమః॥ దివాచరేభ్యో భూతేభ్యో నమః॥
నక్తంచారిభ్యో భూతేభ్యో నమః। సర్వాత్మభూతయే నమః॥

ఈ భాగములను నెవరేని అతిథి యుండిన అతనికి భుజింపఁ బెట్టవలయును. లేకున్న నగ్నియందు వదలిపెట్టవలయును. పిమ్మట లవణాన్నమును అనఁగా పప్పు అన్నము, శాకము, రొట్టె మొదలగువాని నాఱు భాగములుగ నొనర్చి భూమిపైఁ బెట్టవలయును. దీనికిఁ బ్రమాణము:-

శునాం చ పతితానాం చ శ్వపచాం పాపరోగిణామ్।
వాయసానాం క్రిమీణాం చ శనకై ర్నిర్వపేద్భువి॥ మను. ౩.౯౨॥

ఈ రీతిని(శ్వభ్యో నమః, పతితేభ్యో నమః, శ్వపగ్భ్యో నమః, పాపరోగిభ్యో నమః వాయసేభ్యో నమః, క్రిమిభ్యో నమః.) అని పెట్టి దుఃఖితునకు ఆఁకలిగొన్న వానికి, కుక్క, కాకి, మొదలగు వానికి పెట్టవలయును. ఇక్కడ నమః అను శబ్దమున కన్నమని యర్థము. అనఁగా కుక్క, పాపి, చండాలుఁడు, పాపరోగి, కాకి, క్రిమి అనఁగా చీమ మొదలగు పురుగులు వీని కన్నిటికి నాహారము పెట్టవలయునని మనుస్మృత్యాదులయందు విధింపబడి యున్నది. పాకశాలయందలి వాయువును శుద్ధపఱచుటయుఁ, జూడక తెలియక జరిగిన జీవహత్యకు మారుగ నుపకార మొనర్చుటయు నీ హోమమువలని ప్రయోజనము.

ఇంక నయిదవది అతిథిసేవ:- ఎవనికి తిథి నిశ్చయము లేదో అతఁడు అతిథియనఁబడును. ధార్మికుఁడును, సత్యోపదేశకుఁడును లోకోపకారార్థమంతటఁ జరించువాఁడును, పూర్ణ విద్వాంసుఁడును పరమయోగియునగు సన్యాసి (అకస్మాత్తుగా) గృహస్థుని యొద్దకు వచ్చెనేని మొదటఁ బాద్యము, అర్ఘ్యము, ఆచమనమను మూఁడువిధముల జలమొసంగి, పిమ్మట ఆసనముమీఁద సత్కారపూర్వకముగఁ గూర్చుండఁ బెట్టి, అన్నపానాది యుత్తమోత్తమ పదార్థములచేత సేవాశుశ్రూషలు చేసి యతనిని ప్రసన్నునిగాఁ జేయవలయును. పిమ్మట సత్సంగ మొనర్చి ధర్మార్థ కామ మోక్షములనొసంగు జ్ఞాన విజ్ఞానము మున్నగు నుపదేశములను అతనినుండి గ్రహించి తననడత నాతని సదుపదేశానుసారముగ సవరించుకొనవలయును.

సమయమును బట్టి గృహస్థుఁడు రాజు మొదలగువారు గూడ అతిథివలె సత్కరింపఁ బడుటకు యోగ్యులగుదురు. కాని—

పాషండినో వికర్మస్థాన్ వైడాలవ్రతికాన్ శఠాన్ ।
హైతుకాన్ బకవృత్తీంశ్చ వాఙ్మాత్రేణాపి నార్చయేత్ ॥ మను. ౪.౩౦ ॥

(పాషండినః) వేద నిందకులు, వేద విరుద్ధముగ నాచరించువారు (వికర్మస్థాన్) వేదవిరుద్ధమగు మిథ్యాభాషణాది దుష్కర్మ యుక్తులు. (వైడాలవ్రతికాః) పిల్లి పొంచియుండి తటాలున నెలుక మొదలగు ప్రాణులను జంపి పొట్టనించుకొనునట్లు సమయము కనిపెట్టి యితరుల సొత్తు నపహరించువారు. (శఠాః) హఠము, దురాగ్రహము, దురభిమానము గలిగి తనకు తెలియక, ఇతరులుచెప్పినను వినక యుండువారు. (హైతుకాః) కుతర్కము చేయువారు. 'నేను బ్రహ్మను, జగత్తు మిథ్య, వేదాది శాస్త్రములు, ఈశ్వరుఁడు కల్పితములు' అని గప్పాలు కొట్టుచు నిప్పటి వేదాంతులు వాగునట్లు వాగువారు. (బకవృత్తీః) కొంగ ఒంటికాలిమీఁద ధ్యానివలె నుండి తటాలునఁ జేపప్రాణమును హరించి తన స్వార్థమును సిద్ధపఱచు కొనునట్లు స్వార్థమును నెఱవేర్చుకొనుచుండు హఠులు, దురాగ్రహులు, వేదవిరుద్ధులు నగు వైరాగులు, దేహము నిండబూదిద పూసికొని తిరుగుచుండు సాధు నామకులు మొదలగువారి నెవరిని వాక్కుచేతఁ గూడ సత్కరింపఁగూడదు. ఏలయనఁగా వీరిని సత్కరించితిమేని వీరు వృద్ధినిఁ బొంది ప్రపంచము నధర్మ యుక్తముగాఁ జేయుదురు. తాము అధోగతికిఁ బోవ

కార్యముల నొనర్పుటయే గాక తోడ్తో సేవకులనుగూడ నవిద్యారూప మహాసాగరమందు ముంచివేయుదురు.

పంచమహాయజ్ఞముల ఫలము:—

బ్రహ్మయజ్ఞము చేయుటచే విద్య, శిక్ష, ధర్మము, సభ్యత మొదలగు శుభ గుణములు వర్ధిల్లును. అగ్నిహోత్రముచే వాయు, వృష్టి, జలములు శుద్ధములయి వృష్టివలన ప్రపంచమునకు సుఖము కలుగును. అనఁగా శుద్ధవాయు శ్వాసస్పర్శములచేతను, దానితోఁ గూడిన అన్నపానములచేతను ఆరోగ్య మలవడి బుద్ధిబల పరాక్రమములు వర్ధిల్లి, ధర్మార్థ కామ మోక్షములు పూర్ణముగ ననుష్ఠింపనగును. కనుక దీనిని దేవయజ్ఞ మందురు. పితృయజ్ఞముచేత తల్లి, తండ్రి, జ్ఞాని, మహాత్ముల, సేవ సమకూఱును గనుక జ్ఞానము వర్ధిల్లును. దానిచే సత్యాసత్యముల నిర్ణయము చేసి సత్యమును గ్రహించి యసత్యములు బరిత్యజించి సుఖి కాఁగలరు. ఇదిగాక కృతజ్ఞత-తల్లి, తండ్రి, ఆచార్యులు తమ సంతానమునకును, శిష్యులకును జేసిన సేవకు మాఱుగ మరల వారి సేవచేయుట యుచితమే కద.! దీనిచే నదియును గలుగును. బలి వైశ్వదేవముల ప్రయోజనమింతకుఁ బూర్వమే చెప్పఁబడినది. అతిథియజ్ఞముచే నతిథి సత్కారము కలుగును. ఉత్తమాతిథి జగత్తునందు లేనంతవఱకు నున్నతి కలుగదు. అతఁడు సమస్త దేశములందును సంచరించుటచేతను, సత్యోపదేశము చేయుటచేతను పాఖండము-అధర్మము-వృద్ధి కాఁజాలదు. అంతటను గృహస్థులకు సత్య విజ్ఞానప్రాప్తి సులభముగ కలుగుచుండును. ఇదిగాక మనుష్య మాత్రులయం దొకేధర్మము స్థిరమయి నిలుచును. అతిథులు లేరేని సందేహనివృత్తి రాదేని దృఢనిశ్చయము కలుగఁజాలదు. నిశ్చయము కలుగకుండెనేని సుఖమెక్కడిది?

బ్రాహ్మే ముహూర్తే బుధ్యేత ధర్మార్థౌ చానుచింతయేత్ ।
కాయక్లేశాంశ్చ తన్మూలాన్ వేదతత్త్వార్థమేవ చ ॥ మను. ౪.౯౨॥

(రాత్రి నాల్గవ జామునందుఁ నాలుగు గడియల రాత్రియుండగాఁ లేచి కాలకృత్యముల నొనర్చి, ధర్మార్థములను, శరీర సంబంధమగు రోగ నిదానములను, పరమేశ్వరుని ధ్యానము చేయవలయును. ఎన్నఁడును అధర్మము నాచరింపఁ గూడదు.)

నాధర్మశ్చరితో లోకే సద్యః ఫలతి గౌరివ ।
శనైరావర్తమానస్తు కర్తుర్మూలాని కృంతతి ॥ మను. ౪.౧౭౨॥

చేయఁబడిన యధర్మ మెప్పటికిని నిష్ఫలముకాదు. కాని ఆధర్మము చేసినప్పుడే దాని ఫలము గలుగదు. కాఁబట్టి అజ్ఞాను లధర్మమునకు భయ పడరు. అయిన నా యధర్మాచరణము మెల్ల మెల్లగా నీ సుఖమూలమునే కోసి వేయునని నిశ్చయముగాఁ దెలిసికొనుము.

అధర్మేణైధతే తావత్తతో భద్రాణి పశ్యతి ।
తతః సపత్నాన్ జయతి సమూలస్తు వినశ్యతి॥ మను. ౪.౧౭౪॥

అధర్మాత్ముఁడు ధర్మ మర్యాదను వదలి (చెఱువుకట్ట తెగి నీరు నాలుగు వైపుల వ్యాపించునట్లు) మిథ్యాభాషణము, కపటము, పాషండము,- రక్షింప వేదముల ఖండనము-విశ్వాసఘాతము మొదలగు కర్మములచే నితరుల పదార్థ ముల నపహరించుచు మొదట వృద్ధిని-ధనాది ఐశ్వర్యములతో, అన్నము, పానము, వస్త్రము, అభూషణము, యానము, మానము, ప్రతిష్ఠలను-బొందును. అన్యాయముచేత శత్రువులను గూడ జయించునుకాని తరువాత అధర్మి మొదలు నఱికిన వృక్షమువలె శీఘ్రముగ నష్టభ్రష్టుఁడగును.

సత్యధర్మార్య వృత్తేషు శౌచే చైవారమేత్సదా ।
శిష్యాంశ్చ శిష్యాద్ధర్మేణ వాగ్బాహూదరసంయతః॥ మను. ౪.౧౭౫॥

విద్వాంసుఁడు వేదోక్త సత్య ధర్మము నాచరించుచు-పక్షపాత రహితుఁడై, సత్యమును గ్రహించి యసత్యమును వదలి న్యాయరూపమగు వేదోక్త ధర్మాదులను ఆర్యులవలె-ధర్మము నాచరించు వారివలె—ధర్మ పూర్వకముగ శిష్యులకు నేర్పవలయును.

ఋత్విక్పురోహితాచార్యైర్మాతులాతిథిసంశ్రితైః ।
బాలవృద్ధాతురైర్వైద్యైర్జ్ఞాతి సంబంధి బాంధవైః ॥
మాతా పితృభ్యాం యామీభిర్భ్రాత్రా పుత్రేణ భార్యయా ।
దుహిత్రా దాసవర్గేణ వివాదం న సమాచరేత్ ॥మను. ౪.౧౭౯॥

(ఋత్విక్) యజ్ఞము చేయువాఁడు (పురోహితః) సర్వదాయుక్తమ ప్రవర్తనము నేర్పువాఁడు (ఆచార్యః) విద్య నేర్పువాఁడు, (మాతులః) మేన మామ, (అతిథిః) రాకపోకలకు నిశ్చయమైన తిథి లేనివాఁడు, (సంశ్రితః)

తన యాశ్రితుఁడు. (బాలః) బాలకుఁడు. (వృద్ధః) ముసలివాఁడు. (ఆతురః) పీడితుఁడు. (వైద్యః) ఆయుర్వేదము దెలిసినవాఁడు. (జ్ఞాతిః) స్వగోత్రుఁడు లేక స్వవర్ణస్థుఁడు. (సంబంధి) మామ అత్త మొదలగువారు. (బాంధవః) మిత్రుఁడు. (మాతా) తల్లి. (పితా) తండ్రి. (యామీ) అక్క. (భ్రాతా) అన్న. తమ్ముఁడు (భార్యా) భార్య. (దుహితా) పుత్రి (దాసవర్గః) సేవకులు అను వీరితో వివాదము-విరుద్ధముగా తగవులు-చేయరాదు.

అతపా స్త్వనధీయానః ప్రతిగ్రహరుచి ర్ద్విజః ।
అంభస్యశ్మప్లవేనైవ సహ తేనైవ మజ్జతి॥ మను. ౪. ౧౯౦॥

ఒకటి (అతపాః) బ్రహ్మచర్య సత్యభాషణాది తపస్సు లేనివాఁడు. రెండవది (అనధీయానః) చదువనివాఁడు. మూడవది (ప్రతిగ్రహరుచిః) ధర్మము నెపముతో మిక్కిలిగ నితరులనుండి పుచ్చుకొనువాఁడు. ఈ ముగ్గురు రాతినావచే సముద్రమును దరించువారివలెఁ దుష్టకర్మలచే దుఃఖసాగరమందు మునుఁగుచున్నారు. తాము మునుఁగుటయేగాక తమతో దాతలను గూడ ముంచివేయుచున్నారు.

త్రిష్వప్యేతేషు దత్తం హి విధినాప్యర్జితం ధనమ్
దాతుర్ భవత్యనర్థాయ పరత్రాదాతురేవ చ॥ మ. ౪. ౧౯౩.

ధర్మముచేఁ బ్రాప్తించిన ధనమును బైఁజెప్పిన ముగ్గురికి నిచ్చుదాతకు వినాశ మీజన్మమందును. దానము దీసికొన్నవానికి వినాశము పరజన్మమందును గలుగును. దాతయు ప్రతిగ్రహీతయు నజ్ఞులగుచో :—

యథాప్లవే నౌపలేన నిమజ్జత్యుదకే తరన్।
తథా నిమజ్జతో ఽధస్తా దజ్ఞౌ దాతృ ప్రతీచ్ఛకౌ॥ మను. ౪. ౧౯౪॥

రాతినావపైఁ గూర్చుండి నీటియందుఁ బోవువాఁ డెట్లు మునుఁగునో, అట్లే అజ్ఞానియగు దాతయు, గ్రహీతయు నిరువురును అధోగతని-దుఃఖమును-బొందుదురు.

పాషండుల లక్షణములు :—

ధర్మధ్వజీ సదా లుబ్ధ శ్ఛాద్మికో లోకదంభకః।
వైడాలవ్రతికో జ్ఞేయో హింస్రః సర్వాభిసంధకః॥

అధోదృష్టిర్నైష్కృతికః స్వార్థసాధనతత్పరః।
శఠో మిథ్యావినీతశ్చ బకవ్రతచరో ద్విజః॥ మను. ౪. ౧౯౬॥

(ధర్మధ్వజీ)ధర్మమేమియుఁ జేయక ధర్మముపేర లోకులనుదోఁచుకొను వాఁడు. (సదాలుబ్ధః) సర్వదా లోభముతోఁ గూడినవాఁడు (ఛాద్మికః) కపటి (లోకదంభకః) సంసారులయెదుట బడాయి గొట్టుచు నుండువాఁడు(హింస్రః) ప్రాణులను హింసించువాఁడు, ఇతరులను ద్వేషించువాఁడు (సర్వాభిసంధకః) అందఱిలో - మంచివారితోను చెడ్డవారితోను - గలసి స్నేహించుచుండువాఁడు: ఇతఁడే బైడాలవ్రతికుఁడు - అనఁగా నతఁడు గోడమీఁదిపిల్లివలె ధూర్తుఁడు. నీచుఁడు, (అధోదృష్టిః) కీర్తికొఱకుఁ గ్రిందుచూపు కలవాఁడు (నైష్కృతికః) ఈర్ష్యాళువు. ఎవఁడేని గొంచెమపరాధ మొనర్చెనేని దానికిమారుగ వాని ప్రాణముఁగూడఁ దీయుటకుఁ దత్పరుండగువాఁడు(స్వార్థ...తత్పరః)కపటము చేతఁగాని, అధర్మముచేతఁగాని, విశ్వాసఘాతముచేఁ గాని, మఱి దేనిచేఁ గాని, తన ప్రయోజనమును సాధించుకొనుటయందుఁ జతురుఁడు. (శఠః) తనమాట అబద్ధమయినను సరే తన హఠమును మాత్రము వదలనివాఁడు,(మిథ్యావినీతః) లోపలఁ గపటము నుంచుకొని బైకి శీలమును, సంతోషమును, సాధుత్వమును జూఁపువాఁడు, వీనిని బకవ్రతుఁడనియు నందురు. అనఁగా నతఁడు కొంగ వంటి నీచుఁ డన్నమాట. ఈ లక్షణములు కలవారందఱు పాషండులు; వీరిని నమ్మరాదు; ఎన్నటికిని వీరిని సేవింపఁ గూడదు.

ధర్మం శనైః సంచినుయాద్వల్మీకమివ పుత్తికాః।
పరలోకసహాయార్థం సర్వభూతాన్యపీడయన్॥ మను. ౪. ౨౩౮॥

స్త్రీ పురుషులు ఏ ప్రాణికిని బీడ గలిగింపక పరలోకమందు-పరజన్మమందు-సుఖము కలుగుకొఱకు చెదలు పుట్టను బెట్టునట్లు మెల్ల మెల్లగా ధర్మమును సంపాదింపవలయును.

నాముత్ర హి సహాయార్థం పితా మాతా చ తిష్ఠతః।
న పుత్రదారం న జ్ఞాతిర్ధర్మస్తిష్ఠతి కేవలః॥ మను. ౪. ౨౩౯॥

తల్లిగాని తండ్రిగాని, పుత్రుఁడుగాని, భార్యగాని, జ్ఞాతిగాని పరలోకమున సహాయము చేయఁజాలరు. ఒక్క ధర్మముమాత్రమే సహాయముగ నుండును.

ఏకః ప్రజాయతే జంతు రేక ఏవ ప్రలీయతే।
ఏకోఽనుభుఙ్క్తే సుకృత మేక ఏవ చ దుష్కృతమ్॥మను.౪. ౨౪౦॥

మాడుఁడు: జీవుఁడు ఒంటిగా పుట్టుచున్నాఁడు. ఒంటిగా మరణము నొందుచున్నాఁడు. ఒంటిగానే ధర్మఫలమగు సుఖమును, అధర్మఫలమగు దుఃఖమును అనుభవించుచున్నాఁడు.

ఏకః పాపాని కురుతే ఫలం భుఙ్క్తే మహాజనః।
భోక్తారో విప్రముచ్యంతే కర్తా దోషేణ లిప్యతే॥మ.భా.ఉద్యోగవిప్రజాగర౩.౨॥

కుటుంబమందొకపురుషుఁడు పాపముచేసి పదార్థమును దెచ్చును. దానిని మహాజనులు - కుటుంబమువారందఱు - ననుభవింతురు; అట్లు అనుభవించువారు దోషభాగులు కారు; కాని, ఆ యధర్మము నొనర్చిన వాఁడే దోషభాగి యగుచున్నాఁడు.

మృతం శరీరముత్సృజ్య కాష్ఠలోష్టసమంక్షితౌ।
విముఖా బాంధవా యాంతి ధర్మస్తమనుగచ్ఛతి॥మను.౪.౨౪౧॥

ఎవరి చుట్టమయినను మరణము నొందెనేని వానిని మంటిముద్ద వలె భూమిమీఁద వదలి బంధువర్గము వెనుకకుఁ దిరిగి వెళ్ళిపోవును. వానితో నెవడును బోరు. ఒక ధర్మముమాత్రము వానిని వెంబడించును.

తస్మాద్ధర్మం సహాయార్థం నిత్యం సంచినుయా చ్ఛనైః॥
ధర్మేణ హి సహాయేన తమ స్తరతి దు స్తరమ్॥ మను.౪.౨౪౨॥

కాఁబట్టి పరలోకము - పరజన్మసుఖము - కొఱకును, జన్మ సహాయము కొఱకును మెల్ల మెల్లగా నిత్యము ధర్మమును సంపాదించుచు నుండవలయును. ఏలయనఁగా జీవుఁడు ధర్మసహాయముచేత దుస్తరమగు గొప్ప దుఃఖ సాగరమును దాఁటఁగలుగును.

ధర్మప్రధానం పురుషం తపసా హతకిల్బిషం।
పరలోకం నయత్యాశు భాస్వంతం ఖశరీరిణమ్॥మను.౪.౨౪౩॥

ఎవఁడు ధర్మమునే ప్రధానముగా నెంచుచున్నాఁడో ఎవని ధర్మానుష్ఠానముచేతఁ జేసిన పాపము లన్నియు నశించినవో, అతనిని ధర్మమే శీఘ్రముగా ప్రకాశ స్వరూపుఁడును, ఆకాశమే శరీరముగ గలవాఁడును, పరలోకమును - పరమ దర్శనీయుఁడగు పరమాత్మను - బొందించును.

దృఢకారీ మృదు ర్దాంతః క్రూరాచారై రసంవసన్।
అహింస్రో దమదానాభ్యాం జయేత్స్వర్గం తథావ్రతః॥ మను. ౪.౨౪౬॥

దృఢకారియుఁ, కోమల స్వభావుఁడును, జితేంద్రియుఁడును, హింసకుల నుండియుఁ గ్రూరుల నుండియు దుష్టాచారుల నుండియుఁ దూరముగా నుండు వాఁడును నగు ధర్మాత్ముఁడు మనస్సును జయించుట చేతను, విద్యాదులను దానము చేయుటచేతను సుఖమును బొందును.

వాచ్యర్థా నియతాః సర్వే వాఙ్మూలా వాగ్వినిఃసృతాః।
తాం తు యః స్తేనయేద్వాచం స సర్వ స్తేయకృన్నరః॥ మను. ౪.౨౫౬॥

ఏ వాణియందు సకలార్థములు-వ్యవహారములు-నిశ్చితము లగుచున్నవో ఆ వాణియే వానికి మూలము. వాణిచేతనే సమస్త వ్యవహారములు నెఱవేఱు చున్నవి. ఆ వాణిని దొంగిలించువాడు-అసత్యమాడువాఁడు - చౌర్యాది సమస్త పాపములను జేయువాఁడగును.

ఆచారా ల్లభతే హ్యాయు రాచారా దీప్సితాః ప్రజాః।
ఆచారా ద్ధనమక్షయ్య మాచారో హ న్త్యలక్షణమ్॥ మను. ౪.౧౫౬॥

మిథ్యాభాషణాది రూపమగు అధర్మమును వదలి ధర్మాచారముచే బ్రహ్మచర్య జితేంద్రియత్వములచేఁ-బూర్ణాయువును, ధర్మాచారముచే నుత్తమ సంతానమును, అక్షయ ధనమును బొందును. ధర్మమందు వర్తించి దుష్టలక్షణము లన్నిఁటిని బోఁగొట్టుకొన్నవారి యాచరణమే సంతత మనుసరణీయము. ఏల యనఁగా :—

దురాచారో హి పురుషో లోకే భవతి నిందితః।
దుఃఖభాగీ చ సతతం వ్యాధితోఽల్పాయురేవ చ॥ మను. ౪.౧౫౭॥

దుష్టాచారియగు పురుషుఁడు ప్రపంచమున సజ్జనుల నడుమ నిందను బొంది దుఃఖభాగియు, నిరంతర వ్యాధియుక్తుఁడు నయి అల్పాయువును గూడ ననుభవించును. కాఁబట్టి యీ క్రిందఁ జెప్పఁబోవు ప్రయత్నము చేయవలయును.

యద్యత్పరవశం కర్మ తత్తద్యత్నేన వర్జయేత్।
యద్యదాత్మవశం తు స్యాత్తత్తత్సేవేత యత్నతః॥ మను. ౪.౧౫౯॥

ఏ యే కర్మలు పరాధీనములో వానిని ప్రయత్నముచే వదలి యే యే కర్మలు స్వాధీనములో వానిని ప్రయత్నముచే సేవింపవలయును.

సర్వం పరవశం దుఃఖం సర్వమాత్మవశం సుఖమ్
ఏతద్విద్యాత్సమాసేన లక్షణం సుఖదుఃఖయోః॥ మను. ౪-౧౬౦॥

పరాధీనమయిన దంతయు దుఃఖము; స్వాధీనమయిన దంతయు, సుఖము. ఇదియే సంక్షేపముగ సుఖదుఃఖముల లక్షణము.

పరస్పరాధీనమైయున్న యా యా కార్యములు వారివారి యధీనము ననే చేయవలయును. స్త్రీ పురుషుల వ్యవహారము పరస్పరాధీనమై యుండవల యును. అనఁగా స్త్రీ పురుషునితో, పురుషుఁడు స్త్రీతోఁ బ్రియాచరణముతో ననుకూలముగా నుండవలయును. వ్యభిచారము కాని, విరోధము కాని ఎన్నటికిని గూడదు. పురుషుని యాజ్ఞానుకూలముగ నింటికార్యములు స్త్రీకిని, వెలుపలి కార్యములు పురుషునికిని నధీనములయి యుండవలయును. దుష్ట వ్యసనముల యందు జిక్కుకొనక యుండునట్లు పరస్పర మడ్డగించుచుండవలయును. ఇట్టి విషయములయందు బరస్పరమధీనులయి యుండవలయును. వివాహముకాఁగానే స్త్రీకి బురుషుఁడును, బురుషునకు స్త్రీయు నమ్ముడుపోయినారని తెలియవలయును. స్త్రీపురుషుల యందలి హావ భావములు, నఖశిఖాగ్రపర్యంతమున్న వీర్యాదు లన్నియు పరస్పరాధీనము లయిపోవుచున్నవి. స్త్రీగాని పురుషుఁడుగాని మొగము ముడుచుకొని యే వ్యవహారమును జేయఁగూడదు. అందునను మిక్కిలి అప్రియ కారకమగు వ్యభిచారమును-వేశ్యాగమనము, పరపురుషగమనము-వదలి (సతీ పతులు ఒకరితో నొకరు సదా ప్రసన్నులై యుండవలయును.) బ్రాహ్మణులయి రేని బురుషుఁడు మగబిడ్డలను, సుశిక్షితురాలగు స్త్రీ ఆఁడు బిడ్డలను జదివించి నానావిధోపదేశముల చేతను వక్తృత్వముచేతను వారిని విద్వాంసులుగాఁ జేయవలయును. స్త్రీకి దేవుఁడు- సత్కారార్హుఁడు-పతి; పురుషునకు దేవి - సత్కారార్హురాలు-భార్య. గురుకులమం దుండువఱకు శిష్యులు అధ్యాపకులను దమ తలిదండ్రులుగ నెంచవలయును,

### చదివించునట్టి అధ్యాపిక-అధ్యాపకుల లక్షణములు :-

ఆత్మజ్ఞానం సమారంభ స్తితిక్షా ధర్మనిత్యతా ।
యమర్థా నాపకర్షంతి స వై పండిత ఉచ్యతే॥ మహా-విదుర-ప్రజాగర. అ. ౩౩॥

ఆత్మజ్ఞాని సమ్యగారంభుఁడు-నిష్కర్మత, సోమరితనము లేనివాఁడు-సుఖదుఃఖములయందు, హానిలాభములందు, మానావమానములయందు నిందా

స్తుతులయందును హర్ష శోకముల నెన్నఁడును బొందనివాఁడు, ధర్మమందే దృఢముగా నుండువాఁడు, విషయసంబంధములగు వస్తువులచే, నాకర్షింపబడని వాఁడు పండితుఁడు.

నిషేవతే ప్రశస్తాని నిందితాని న సేవతే ।
అనాస్తికః శ్రద్దధాన ఏతత్పండితలక్షణమ్ ॥ ......

సర్వదా ధర్మయుక్తములగు కర్మములను సేవించుటయు, అధర్మయుక్త కర్మములను వదలుటయు, ఈశ్వరుని, వేదమును, సత్యాచారమును నిందింపకుండుటయు, ఈశ్వరాదులయందు మిక్కిలి శ్రద్ధాళువై యుండుటయుఁ బండితులకు కర్తవ్యములు.

క్షిప్రం విజానాతి చిరం శృణోతి విజ్ఞాయ చార్థం భజతే న కామాత్ ।
నాసంపృష్టో హ్యుపయుంక్తే పరార్థే తత్ప్రజ్ఞానం ప్రథమం పండితస్య ॥ "......

కఠినవిషయమును గూడ శీఘ్రముగఁ దెలియఁగలుగుట, చాలకాల పర్యంతము శాస్త్రములను జదివి,విని, విచారించి యుండుటయు,తెలిసినదానిని బరోపకారమందుఁ బ్రయోగించుటయు, స్వార్థమునకై యే కార్యమును జేయకుండుటయు, అడుగనపుడును, సమయము కానపుడును ఇతరుల కార్యమందు సమ్మతి నీయకుండుటయు నను నీ ప్రజ్ఞానము మొదటనే పండితున కుండవలయును.

నాప్రాప్యమభివాంఛంతి నష్టం నేచ్ఛంతి శోచితుమ్ ॥
ఆపత్సు చ న ముహ్యంతి నరాః పండితబుద్ధయః ॥ ......

పొందుటకు అయోగ్యమగువాని నెన్నఁడును గోరనివాఁడును, నష్టమైన పదార్థమును గూర్చి శోకింపనివాఁడును, ఆపత్కాలమందు మోహమును జెంది వ్యాకులత నొందని వాఁడును అగు బుద్ధిమంతుఁడే పండితుఁడు.

ప్రవృత్తవాక్ చిత్రకథ ఊహవాన్ ప్రతిభానవాన్ ।
ఆశు గ్రంథస్య వక్తా చ యః స పండిత ఉచ్యతే ॥ ......

సమస్త విద్యలలోను ప్రశ్నోత్తరములలోను అతినిపుణమగు వాడిగలవాఁడును, చక్కగా శాస్త్రప్రకరణములను జెప్పుటలో వైచిత్రి గలవాఁడును, యథా యోగ్యముగఁ దర్కించువాఁడును, స్మృతిమంతుఁడును, గ్రంథముల యథార్థమును శీఘ్రముగాఁ జెప్పువాఁడు నే పండితుఁడు.

శ్రుతం ప్రజ్ఞానుగం యస్య ప్రజ్ఞా చైవ శ్రుతానుగా ।
అసంభిన్నార్యమర్యాదః పండితాఖ్యాం లభేత సః ॥

మహాభార. ఉద్యోగ. విదుర. అ. ౩౩॥

వినఁబడిన సత్యార్థమున కనుకూలమగు ప్రజ్ఞయు, బుద్ధికనుకూలమగు వినికియు, ఆర్యుల - శ్రేష్ఠధార్మిక పురుషుల - మర్యాదకు భంగము గలిగింపనివాఁడును పండిత సంజ్ఞను బొందదగును.

ఎక్కడ నిట్టి స్త్రీ పురుషులు చదివింతురో అక్కడ విద్య, ధర్మము, ఉత్తమాచారము వృద్ధి బొంది ప్రతిదినము నానందమే వర్ధిల్లసాగును.

చదువుట కనర్హుఁడగు మూర్ఖలక్షణములు :—

అశ్రుతశ్చ సమున్నద్ధో దరిద్రశ్చ మహామనాః ।
అర్థాంశ్చాకర్మణా ప్రేప్సుర్మూఢ ఇత్యుచ్యతే బుధైః ॥ మ. భా. ఉ. వి. ప్ర. అ. ౩౩॥

అర్థము:- ఏ శాస్త్రమును జదువనివాఁడు, విననివాఁడు, మిక్కిలి హఠము కలవాఁడు, దరిద్రుఁడై గొప్పగొప్ప కోరికలను కోరువాఁడు, పని చేయకయే పదార్థములను బొందుటకు నిచ్ఛయించువాఁడును మూఢుడని బుద్ధిమంతులందురు.

అనాహూతః ప్రవిశతి హ్యపృష్టో బహు భాషతే ।
అవిశ్వస్తే విశ్వసితి మూఢచేతా నరాధమః ॥ ..—

పిలువనిదే సభయందుఁగాని యొకరి గృహమందుఁగాని ప్రవేశించి యుచ్చాసనమందుఁ గూర్చుండఁ గోరువాఁడును, అడుగకయే మిక్కిలి వాగువాఁడును, విశ్వాసమునకు యోగ్యముగాని వస్తువును, మనుష్యుని విశ్వసించువాఁడును అగు మూఢుఁడు మనుష్యులందఱిలో నీచుఁడు.

ఎక్కడ నిట్టిపురుషులు అధ్యాపకులుగను, ఉపదేశకులుగను, గురువులుగను మాననీయులుగను నుందురో, అచ్చట నవిద్యయు నధర్మము నసభ్యతయు, కలహమును, విరోధమును, వైమనస్యమును వృద్ధిజెంది దుఃఖము వర్ధిల్లఁ దొడఁగును.

విద్యార్థుల లక్షణములు:—

ఆలస్యం మదమోహౌ చ చాపల్యం గోష్ఠిరేవ చ ।
స్తబ్ధతా చాభిమానిత్వం తథాఽత్యాగిత్వమేవ చ ।
ఏతే వై సప్త దోషాః స్యుః సదా విద్యార్థినాం మతాః ॥ విదురప్రజాగర-౪౦.అధ్యా॥

ఆలస్యము-శరీరమందును, బుద్ధియందును జడత్వము-సోమరితనము, మత్తు, మోహమున ఏ దేని ఒక విషయమునందుఁ జిక్కు-వడి యుండుట. చపలత-చాంచల్యము,-అక్కడక్కడకుఁబోయి వ్యర్థాలాపములాడుచు వినుచు నుండుట, చదువుచు మానుట, అభిమానియగుట, పిసినిగొట్టుతనము అను నీ యేడును విద్యార్థుల యందుఁ గలుగు దోషములు. ఈ దోషములు గలవారికి విద్య లభింపదు.

సుఖార్థినః కుతో విద్యా కుతో విద్యార్థినః సుఖమ్।
సుఖార్థీ వా త్యజేద్విద్యాం విద్యార్థీ వా త్యజేత్సుఖమ్॥ .. ..

సుఖమును గోరువానికి విద్య యెక్కడిది? విద్యను గోరువానికి సుఖమెక్కడిది? కాఁబట్టి విషయ సుఖార్థులు విద్యను, విద్యార్థులు విషయసుఖమును వదలవలయును. అట్లు వదలరేని విద్య యెన్నటికి లభింపదు.

విద్య లభించువారు:—

సత్యే రతానాం సతతం దాంతానా మూర్ధ్వరేతసామ్ ।
బ్రహ్మచర్యం దహేద్రాజన్ సర్వపాపా న్యుపాసితమ్॥ ... ..

సంతత సత్యాచార ప్రవృత్తులు, జితేంద్రియులు, అస్ఖలితవీర్యులు నగు వారిదే సత్యమగు బ్రహ్మచర్యము. వారే విద్వాంసులగుదురు. కాఁబట్టి అధ్యాపకులును విద్యార్థులును శుభలక్షణయుక్తులు కావలయును. విద్యార్థులు సత్యవాదులును, సత్యమానులును, సత్యకారులును, సభ్యులును, జితేంద్రియులును, సుశీలతాది శుభగుణయుక్తులును నయి శరీరాత్మల పూర్ణబలమును వృద్ధిపఱచుకొని సమగ్ర వేదాది శాస్త్రములయందు విద్వాంసు లగునట్లుగ అధ్యాపకులు ప్రయత్నింపవలయును. వారి కుచేష్టలను సర్వదా మాన్పుచు వారికి విద్య నేర్పవలయును. విద్యార్థులును దాము జితేంద్రియులు, దాంతులు, చదివించు వారియందుఁ బ్రేమగలవారు, విచారశీలురు, బరిశ్రమ చేయువారు నయి పూర్ణ విద్య, పూర్ణాయువు, పరిపూర్ణ ధర్మము, పురుషార్థ నిర్వహణాభ్యాసము కలుగునట్లు పాటుపడవలయును. ఈ విద్యాధ్యాపన సంబంధమగు పనులు బ్రాహ్మణులవి. క్షత్రియుల కర్మములు రాజధర్మమందుఁ జెప్పఁబడును. బ్రహ్మచర్యాదులంచే వేదాదులను జదివి వివాహము చేసికొని దేశభాషలను, నానావిధవ్యాపారముల రీతిని, వాని భావములను దెలిసికొని అమ్ముటయుఁ గొనుటయు, ద్వీపద్వీపాంత

రములకుఁ బోవుటయు వచ్చుటయు, లాభార్థము వ్యాపారముల నారంభించు టయు, పశువులను బాలించుటయు, పొలమును జాతుర్యముతో నున్నతిఁ జేయు టయుఁ, జేయించుటయు, ధనమును వృద్ధిపఱచుటయు, దానిని విద్యాధర్మముల యున్నతికి వ్యయపఱచుటయు, సత్యవాదియు నిష్కపటియు నయి సత్యముతో సమస్త వ్యాపారములను జేయుటయు, ఎట్టి నష్టము కలుగకుండునట్లు అన్ని వస్తువులను రక్షించుటయు వైశ్యుల ధర్మమై యున్నది. శూద్రుఁడు సమస్త సేవలయందుఁ జతురుఁడయి, పాకవిద్యయందు నిపుణుఁడయి అతిప్రేమచే ద్విజు లను సేవించి వారివలన తాను జీవింపవలయును. ద్విజులు వానికి అన్న, పాన, వస్త్ర, స్థానములను, వాని వివాహాదుల వ్యయములన్నిటి నీయవలయును; లేక మాసికవేతన మేర్పరుపవలయును. నాలుగు వర్ణములవారును బరస్పరము ప్రేమించుచు, సజ్జనులయి సుఖదుఃఖముల యందును హాని లాభములయందును ఐకమత్యముకలిగి ప్రజలయు రాజ్యము నున్నతియందుఁ దమ తనువును, మన స్సును, ధనమును వ్యయపఱచుచుండవలయును. స్త్రీపురుషుల కెప్పుడును వియో గము కూడదు:-

> పానం దుర్జనసంసర్గః పత్యా చ విరహోఽటనమ్ ।
> స్వప్నోఽన్యగేహవాసశ్చ నారీసందూషణాని షట్ ॥మను.౯.౧౩॥

(సారాయి, గంజాయి మొదలగు మాదకద్రవ్యములను సేవించుట, దుష్ట పురుషులతో సహవాసము చేయుట, పతిని వదలియుండుట, పాషండులు మొద లుగాఁగల వేషధారుల దర్శనార్థము ఇక్కడనక్కడ నొంటరిగఁ దిరుగులాడుట, పరగృహమందుఁ బరుండుట, వాసముచేయుట, యీ యాఱును స్త్రీని దూషితు రాలుగాఁజేయు దుర్గుణములు. ఇవి పురుషునకును గూడవు.)

స్త్రీపురుషులకు వియోగము రెండు ప్రకారములఁ గలుగుచున్నది. ఒకటి:- ఏదేనిఁ గార్యార్థము దేశాంతరము పోవుటవలన, రెండవది:-మృత్యువు వలన, ఇందులో మొదటిది, దూరదేశము యాత్రార్థము పోయినపుడు, స్త్రీనిఁ గూడ వెంటఁబెట్టుకొని పోవుటయే యుపాయము. ఏల యనఁగా చాలకాల మెడ బాటు యోగ్యము కాదు.

ప్రశ్న:—స్త్రీపురుషు లనేక వివాహములుచేసికొనుట యోగ్యమా? కాదా?

ఉత్తరము :— ఏకకాలమునఁ గూడదు.

ప్రశ్న :— కాలాంతరమందుననేక వివాహములు కూడునా ?

ఉత్తరము :— కూడును.

యా స్త్రీ త్వక్షతయోనిః స్యాద్గతప్రత్యాగతాపి వా ।
పౌనర్భవేన భర్త్రా సా పునః సంస్కారమర్హతి॥ మను. ౯.౧౭౬॥

స్త్రీకిఁ గాని పురుషునకుఁగాని పాణిగ్రహణ సంస్కారము మాత్రము జరిగి సంయోగము గాకుండెనేని అనఁగా స్త్రీ అక్షతయోనియు, పురుషుఁడక్షత వీర్యుఁడు నయియుండిరేని వారికిఁ బునర్వివాహము కావచ్చును; కాని, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్ణములయందు క్షతయోని స్త్రీకిని క్షతవీర్య పురుషునకును బునర్వివాహము కూడదు.

ప్రశ్న :— పునర్వివాహమందుండు దోషము లెవ్వి ?

ఉత్తరము:— మొదటిది:- స్త్రీ పురుషులయందుఁ బ్రేమ న్యూనమగును. ఏలయనఁగా కావలసినపుడెల్ల పురుషుఁడుస్త్రీని, స్త్రీ పురుషునివదలి యితరులతో సంబంధము చేయుదురు. రెండవది:- స్త్రీగాని పురుషుఁడుగాని మరణము నొంది నచో రెండవ వివాహము చేసికొన గోరునపుడు ప్రథమ స్త్రీ పూర్వపతి - పదార్థ మును గొనిపోవును. దానిచేఁ గుటుంబము వారితోఁ గలహము సంభవించును. మూడవది:- గొప్పవంశము లనేకములు బొత్తిగాఁ బేరులేక నశించి పోవును. వారి పదార్థములును ఛిన్న భిన్నములయిపోవును. నాల్గవది:- పతివ్రతము, పత్నీ వ్రతము నష్టమగుట మున్నగు దోషములు గలుగును గనుక ద్విజులయందుఁ బునర్వివాహముకాని, అనేక వివాహములు కాని యెన్నఁటికినిఁ గూడవు

ప్రశ్న :—వంశచ్ఛేదన మయినపుడును వారి కులము నశించును, మఱియు స్త్రీపురుషులు వ్యభిచారాదులయందుఁ బ్రవృత్తులై గర్భపాతనాది పెక్కు దుష్కర్మముల నొనర్తురు గనుక పునర్వివాహ ముండుట మంచిది.

ఉత్తరము :— అట్లుకాదు. స్త్రీ పురుషులు బ్రహ్మచర్యమందు స్థిరముగా నుండగోరిరేని, ఏ యుపద్రవమును గలుగదు. కులపరంపర స్థిరపఱుచుకొను టకుఁ దమ స్వజాతి బాలు నెవనినేని దత్తు దీసికొనవచ్చును. దానివలన కులము నిలువఁగలదు. వ్యభిచారమును గలుగదు. బ్రహ్మచర్యమం దుండఁజాలరేని నియోగము చేసికొని సంతానము గలిగించుకొనవచ్చును.

ప్రశ్న :— పునర్వివాహమునకును, నియోగమునకును భేదమేమి ?

ఉత్తరము:- మొదటిది:- వివాహమందు, గన్య తన తండ్రియింటిని వదలి పతిగృహమును చేరుచున్నది. తండ్రితో విశేషసంబంధ ముండదు నియోగమందు విధవాస్త్రీ తన వివాహిత పతిగృహమందే యుండును. రెండవది:- ఆ వివాహిత స్త్రీ కుమారులు ఆ వివాహిత పతి దాయభాగు లగుచున్నారు. అనఁగా నియోగమందు విధవాస్త్రీ కుమారులు వీర్య దాతకుఁ బుత్రులనఁబడరు. అతని గోత్రమునోఁ జేరరు. అతని సొత్తున కధికారులు గారు. కాని మృతపతిపుత్రు లనఁబడుదురు. అతని గోత్రమందుందురు. అతని పదార్థములకు దాయభాగు లగుదురు. అతని గృహమందే యుందురు. మూడవది :- వివాహిత స్త్రీపురుషులకుఁ బరస్పర సేవ పాలనము నావశ్యకము. నియుక్త స్త్రీపురుషుల కట్టిబాధ్యత లేదు. నాల్గవది:-వివాహిత స్త్రీపురుషుల సంబంధము మరణపర్యంత ముండును. నియుక్త స్త్రీపురుషులకుఁ గార్యానంతరము సంబంధము వదలిపోవును. అయిదవది:-వివాహిత స్త్రీపురుషులు తమ గృహకృత్యముల నెఱవేర్చుకొనుట యందుఁ బరస్పరము తోడుపడుదురు. నియుక్త స్త్రీ పురుషులు తమ తమ గృహకార్యములను జేసికొందురు.

ప్రశ్న :—వివాహ, నియోగ నియమములు సమానములా? భిన్నములా?

ఉత్తరము:- ఇంతకు ముందు చెప్పినట్లును ఇఁకఁ జెప్పబోవునట్లును గొంతకొంత భేదమున్నది. వివాహిత స్త్రీపురుషులు దశసంతానము నుత్పన్నము చేయఁగలరు. నియుక్త స్త్రీపురుషులు రెండు లేక నాలింటికంటె నెక్కువ సంతానమును గలిగింపఁగూడదు. అనఁగా కుమారీకుమారులకు వివాహమగునట్లు, స్త్రీగాని పురుషుఁడుగాని మరణము నొందిన వారిరువురకు (విధవా-విధురులకు)నియోగమగును. కుమారీకుమారులకు నియోగములేదు. వివాహిత స్త్రీపురుషులు సర్వదా కలిసియుందురు. నియుక్త స్త్రీపురుషులు ఋతుదాన సమయమందుఁదప్ప కూడియుండఁదగదు. స్త్రీ తనకొఱకు నియోగము చేసికొనెనేని రెండవ గర్భము ధరించిన దినము మొదలుకొని పురుష సంబంధము వదలిపోవును. పురుషుఁడు తనకొఱకు జేసికొనెనేనియు రెండవ గర్భముతోనే సంబంధము దూరమగును; కాని ఆ నియుక్త స్త్రీయే రెండుమూడేండ్లవఱకు నాబిడ్డలను బెంచి నియుక్త పురుషున కిచ్చివేయవలయును. ఇట్లు ఒక విధవా

స్త్రీ తనకొఱకిద్దఱను, నలుగురు పురుషులకిద్దఱిద్దఱ చొప్పున నెనమండుగురను- మొత్తము పదుగురను-కనవచ్చును. విధురుఁడు తనకొఱకిద్దఱను నలుగురు విధవాస్త్రీలకు ఇద్దఱిద్దఱవంతున నెనమండుగురను కలిగింపవచ్చును. చూడుఁడు

> ఇమాం త్వమింద్ర మీఢ్వః సుపుత్రాం సుభగాం కృణు ।
> దశాస్యాం పుత్రానా ధేహి పతిమేకాదశం కృధి॥
>
> ఋ॥ మం. ౧౦. సూ. ౮౫. మం. ౪౫

ఓ (మీఢ్వఇంద్ర)వీర్యసేచనమందు సమర్థుఁడవును, ఐశ్వర్యయుక్తుఁడవు నగు పురుషుఁడా ! ఈ వివాహిత స్త్రీకిఁగాని, విధవా స్త్రీలకుఁగాని శ్రేష్ఠ పుత్రులను, సౌభాగ్యమును గలిగింపుము. వివాహిత స్త్రీ యందు దశపుత్రుల నుత్పన్నము చేయుము; పదునొకండవది స్త్రీయనుకొనుము. ఓ స్త్రీ: నీవును వివాహిత పురుషుని వలనఁ గాని నియుక్త పురుషుని వలనఁ గాని దశసంతానము నుత్పత్తి చేయుము: పదునొకండవది పతియనుకొనుము ఈ వేదాజ్ఞ వలన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యవర్ణ స్త్రీ పురుషులు దశసంతానముకంటె నెక్కువగ నుత్పన్నము చేయఁగూడదు. ఏలయనఁగా అధికముగాఁ గలిగించుట చేత సంతానము నిర్బలమును, నిర్బుద్ధియు, అల్పాయువుఁ గలదగును. స్త్రీ పురుషులు నిర్బలులును, అల్పాయువులును, రోగులు నగుదురు. చాలాకాలము జీవించినను వృద్ధావస్థయందు మిక్కిలి దుఃఖమును బొందుదురు.

ప్రశ్న:— ఈ నియోగము వ్యభిచారమువలె గనఁబడుచున్నది.

ఉత్తరము:— వివాహితులు కానివారి సమాగమము వ్యభిచారమైనట్లే నియుక్తులు కానివారి సమాగమమును వ్యభిచార మనఁబడును. నియమ పూర్వకముగా వివాహము జరిగినమీఁదట ఆ సంబంధము వ్యభిచార మనఁబడనట్లు నియమ పూర్వకముగ నియోగ మగుటవలన నదియును వ్యభిచార మనఁబడ జాలదు. ఒక కన్య ఒక కుమారుని-బ్రహ్మచారిని-శాస్త్రోక్త విధిపూర్వకముగ వివాహ మాడెనేని వారి సమాగమమందు వ్యభిచారముగాని, పాపముగాని, లజ్జగాని కలుగదు. అట్లే వేదశాస్త్రోక్తనియోగమును వ్యభిచారమని గాని, పాపమని గాని, లజ్జయని కాని యెంచఁగూడదు.

ప్రశ్న :— బాగుగనే యున్నది; కాని యిది వేశ్యా కార్యమువలెఁ గనఁబడుచున్నది.

ఉత్తరము:- కాదు కాదు. ఏలయనఁగా వేశ్యా సమాగమ మందెవఁ డేని నిశ్చిత పురుషుఁడు కాని, యేదేని నియమము కాని లేదు. నియోగమందు వివాహమువలె నియమమున్నది. ఇతరులకుఁ గన్య నిచ్చుటకుఁగాని ఇతరులతో సమాగమమునకుఁగాని, అది వివాహపూర్వకమయ్యేనేని లజ్జ కలుగదు. అట్లే నియోగ మందునని తెలియవలయును. స్త్రీ పురుషులు వ్యభిచారులే యయిరేని వివాహ మయినమాత్రమున దుష్కర్మములను వదలుదురా ?

ప్రశ్న:- నియోగము పాపమని మాకు తోఁచుచున్నది.

ఉత్తరము:- నియోగము పాపమయ్యేనేని వివాహమును పాపమేయని యేల తలంపరు: నియోగము నాపుటచే పాపము గలుగుచున్నది. ఏలయనఁగా వైరాగ్యవంతులును, పూర్ణ విద్వాంసులును, యోగులు నగువారి యందుఁ దప్ప నీశ్వరుని సృష్టిక్రమానుకూల మగు స్త్రీ పురుషుల స్వాభావిక వ్యవహార మాఁగఁజాలదు. గర్భపాతరూపమగు భ్రూణహత్య, విధవా స్త్రీలయు, పెండ్లము చచ్చినవారలయు మహా సంతాపములను పాపమని గణింపరా! రాజశాసనము లున్నను, జాతినియమము లున్నను, మనస్సునందు సంతానోత్పత్తిని, విషయములను గోరు స్త్రీ పురుషులు యువావస్థయందుఁ గుకర్మలనుజేయక మానరు. ఈ వ్యభిచారమును, గుకర్మను ఆఁపుటకు శ్రేష్ఠమగు నుపాయము జితేంద్రియత్వము. వివాహము కాని నియోగముకాని చేసికొనక జితేంద్రియులుగా నుండఁగలిగిరేని మంచిదే. కాని అట్లుండఁజాలని వారికి వివాహమును, ఆపత్కాలమందు నియోగమును అవశ్యము కావలయును. దీనివలన వ్యభిచారము తగ్గుటకును, ఉత్తమసంతానము కలిగి మనుష్యులు వృద్ధినొందుటకును అవకాశమున్నది. భ్రూణహత్య నశించును. నీచపురుషులతో నుత్తమస్త్రీలయు, వేశ్యాదినీచస్త్రీలతో నుత్తమపురుషులయు వ్యభిచారరూపమగు కుకర్మములును, ఉత్తమకులములందు కళంకములును, వంశోచ్ఛేదనమును, స్త్రీపురుషుల సంతాపములును, గర్భహత్యాదికుకర్మలును వివాహ నియోగములచే నివృత్తియగును. కాఁబట్టి నియోగము కావలయును.

ప్రశ్న:- నియోగమం దుండవలసిన నియమము లెవ్వి?

ఉత్తరము:- వివాహము ప్రసిద్ధముగా నగునట్లే నియోగమును ప్రసిద్ధముగాఁ గావలయును. వివాహమందు భద్రపురుషుల యనుమతియుఁ గన్యా

వరుల ప్రసన్నతయు నుండునట్లే నియోగమందు నుండవలయును. అనఁగా స్త్రీ పురుషులు నియోగము చేసికొను నపుడు తమ కుటుంబ స్త్రీపురుషుల యెదుట 'మేమిరువురమును సంతానోత్పత్తి కొఱకు నియోగముచేసి కొన చున్నాము. నియోగ నియమము ముగిసిన పిమ్మట మేము సంయోగము చేయము. దీనికి విపరీతముగ నడచితిమేని౯ పాపులమును, రాజు, జాతి వంశ సంబంధ శిక్షార్హుల మగుదుము మాసమునం దొకపర్యాయము గర్భాధాన కార్యము చేసెదము. గర్భము కలిగినపిమ్మట నొకసంవత్సర పర్యంతము వేఱువేఱుగా నుందుము, అని ప్రతిజ్ఞ చేయవలయును.

ప్రశ్న:-నియోగము తమ వర్ణములోనే కావలయునా? అన్య వర్ణస్థుల తోడను గావచ్చునా?

ఉత్తరము:- తమ వర్ణమందుఁగాని, తమకంటె నుత్తమవర్ణ పురుషునితోఁగాని కావలయును. అనఁగా వైశ్యస్త్రీ వైశ్యునితోఁగాని, క్షత్రియునితోఁగాని, బ్రాహ్మణునితోఁగాని; క్షత్రియ స్త్రీ క్షత్రియునితోఁగాని, బ్రాహ్మణునితోగాని; బ్రాహ్మణస్త్రీ బ్రాహ్మణునితో మాత్రమే నియోగము చేసికొన వలయును, వీర్యము సమానవర్ణస్థునిది కాని, యుత్తమ వర్ణస్థునిది కాని కావలయును. తనకంటె నీచవర్ణస్థునిది కాఁగూడదు. అని దీని అభిప్రాయము. ధర్మముచేత- వేదోక్తరీతిచే-వివాహమువలనఁ గాని నియోగము వలనఁ గాని సంతానోత్పత్తి చేయుటయే స్త్రీ పురుషుల సృష్టి ప్రయోజనము.

ప్రశ్న:-పురుషునకు నియోగావశ్యకత మేమి యున్నది? రెండవ వివాహము చేసికొనును గదా?

ఉత్తరము:-ద్విజులయందు స్త్రీపురుషులు ఒకేపర్యాయము వివాహము చేసికొనవలయునని వేదాది శాస్త్రములయందు వ్రాయఁబడియున్నది. రెండవ పర్యాయము కూడదు. అని యింతకుఁబూర్వమే వ్రాసియున్నాము.బ్రహ్మచారిణీ బ్రహ్మచారులకు వివాహమగుట న్యాయము. విధవతో బ్రహ్మచారికిగాని, బ్రహ్మచారిణితో విధురునకుఁగాని, వివాహమగుట అన్యాయము-అనఁగా అధర్మము. విధవతో వివాహమాడుటకు బ్రహ్మచారి యెట్లు గోరఁడో అట్లే వివాహితునితో-స్త్రీతో సమాగమము చేసిన పురుషునితో-వివాహమాడుటకు బ్రహ్మచారి

డియు నిచ్ఛగింపదు. వివాహితుఁడైన పురుషుని బ్రహ్మచారిణియు, విధవను బ్రహ్మచారియు గ్రహింపకపోయినపుడే స్త్రీ పురుషులకు నియోగము చేసికొనుట నావశ్యకత కలుగును ఎట్టివారి కట్టివారితో సంబంధము కలుగుటయే ధర్మము.

ప్రశ్న:-వివాహమందు వేదాదిశాస్త్రముల ప్రమాణ ముండునట్లు నియోగమందును ప్రమాణమున్నదా?

ఉత్తరము:— ఈవిషయమం దనేక ప్రమాణము లున్నవి, చూడుడు:-

కుహ స్విద్దోషా కుహ వస్తోరశ్వినా కుహాభిపిత్వం కరతః కుహోషతుః।
కో వాం శయుత్రా విధవేవ దేవరం మర్యం న యోషా కృణుతే సధస్థ ఆ॥
ఋ. మం.౧౦.।సూ.౪౦।మం.౨॥

ఉదీర్ష్వ నార్యభిజీవలోకం గతాసుమేతముప శేష ఏహి।
హస్తగ్రాభస్య దిధిషోస్తవేదం పత్యుర్జనిత్వమభి సం బభూథ॥
ఋ.మం.౧౦.సూ।.౧౮।మం.౮॥

ఓ (అశ్వినా) స్త్రీ పురుషులారా! (దేవరం విధవేవ) విధవ, దేవరుని (యోషామర్యన్న) వివాహిత స్త్రీ తన పతిని (సధస్థే) సమానస్థాన శయ్యయం దుఁడఁ గలిసి సంతానమును (ఆకృణుతే) అన్నివిధముల నుత్పన్నము చేయు చున్నట్లు స్త్రీ పురుషులు మీరిరువురును (కుహస్విద్దోషా) రాత్రియం దెక్కడఁ (కుహవస్తో) పగటియం దెక్కడ వసించితిరి?(కుహాభిపిత్వమ్) ఎక్కడఁ బదార్థము లనుప్రాప్తము(కరతః)చేసితిరి?మఱియు(కుహోషతుః)ఏ సమయ మందెక్కడ వసించుచుంటిరి?(కోవాం శయుత్రా)మీ శయనస్థానమెక్కడ? మీరెవరు? ఏదేశమం దుండువారు? అని అర్థము. దీనివలనే దేశవిదేశములయందును స్త్రీ పురుషులు కూడియుండవలయునియు దేలుపడుచున్నది. వివాహిత పతిని వలెనే నియుక్తపతిని గ్రహించి విధవయు సంతానోత్పత్తిని జేయవచ్చును.

ప్రశ్న:-దేవరుఁడనగా పతి తమ్ముఁడు, అతఁడుండెనేని నియోగము చేసికొననగును. లేదేని విధవ నియోగ మెవనితోఁ జేసికొనవలయును?

ఉత్తరము:-దేవరునితోఁ జేసికొనవలయును. కాని దేవరశబ్దమునకు మీరనుకొన్న యర్థముకాదు. నిరుక్తము చూడుడు.

దేవరః కస్మాద్ద్వితీయో వర ఉచ్యతే॥ ని రు.అ.౩.ఖం.౧౫॥

విధవయొక్క రెండవపతికి దేవరుఁడని పేరు. (అతడు మృత పతికి) తమ్ముఁడు కాని, అన్న కాని, తన వర్ణస్థుఁడు కాని, తనకంటె నుత్తమ వర్ణస్థుఁడే కాని, ఎవనితో నియోగము చేసికొనునో అతనికి దేవరుఁడని పేరు. ఓ (నారీ) విధవా! నీవు (ఏతం గతాసుం) ఈ మృతిఁబొందిన పతి ఆశనువదలి (శేషే)తక్కిన పురుషులలోనుండి (అభిజీవలోకం) బ్రతికియుండు మఱియొక పతిని (ఉపైహి) పొందుము మఱియును (ఉదీర్ష్వ) దీనిని విచారించి నిశ్చయించుకొనుము. దేనిననఁగా (హస్తగ్రాభస్యదిధిషోః) విధవయగు నిన్ను మరల పాణిగ్రహణము చేసికొని నియుక్త పతి సంబంధము కొఱకు నియోగమయ్యెనేని (ఇదమ్) ఈ (జనిత్వం) పుట్టిన బాలకుఁడు అనియుక్త (పత్యుః) పతి కగును. నీవు నీకొఱకు నియోగముచేసికొంటివేని యీసంతానము(తవ)నీది యగును. ఇట్లు నిశ్చయముతోఁ గూడుకొన్నది (అభిసంబభూథ) కావలయును. నియుక్త పురుషుఁడును, ఈ నియమమును బాలింపవలయును.

అదేవృఘ్న్యపతిఘ్నీహైధి శివా పశుభ్యః సుయమా సువర్చాః।
ప్రజావతీ వీరసూర్దేవృకామా స్యోనేమమగ్నిం గార్హపత్యం సపర్య॥
అథర్వ॥కాం. ౧౪.అను.౨.సూ.౨.మం. ౧౮॥

(అపతిఘ్న్యదేవృఘ్ని) పతికిని దేవరకును దుఃఖము నీయని (ఇహ) ఈ గృహాశ్రమమందు (పశుభ్యః) పశువుల కొఱకు(శివా)కల్యాణము చేసెదు (సుయమాః) బాగుగ ధర్మనియమములందుఁ జరించెదు (సువర్చాః) రూప యుక్తురాలగు, సర్వశాస్త్ర విద్యాయుక్తురాలగు(ప్రజావతీ) ఉత్తమ పుత్రపౌత్రాదులతోఁ గూడిన (వీరసూః) శూర వీరపుత్రులను గనఁ గలిగిన (దేవృకామా) దేవరను గామించెదు (స్యోనా) సుఖ మిచ్చెదు నీవు పతినిగాని దేవరునిగాని (ఏధి) పొంది (ఇయమ్) ఈ (గార్హపత్యం) గృహస్థ సంబంధమగు (అగ్నిమ్) అగ్నిహోత్రమును (సపర్య) సేవింపుచుండుము.

తా మనేన విధానేన నిజో విందేత దేవరః ॥ మను. ౯.౬౯॥

అక్షతయోని స్త్రీ విధవ యయ్యెనేని. పతియొక్క తమ్ముఁడు కూడ ఆమెను వివాహము చేసికొనవచ్చును.

ప్రశ్న :—ఒక స్త్రీకాని పురుషుఁడుకాని యెన్ని నియోగములు చేసికొనవచ్చును. వివాహిత నియుక్త పతుల కేయే పేరులు కలుగును ,

ఉత్తరము:–
సోమః ప్రథమో వివిదే గంధర్వో వివిద ఉత్తరః।
తృతీయో అగ్నిష్టే పతి స్తురీయ స్తే మనుష్యజాః॥
ఋ॥ మం. ౧౦ సూ. ౮౫. మం. ౪౦॥

ఓస్త్రీ (తే) నీ ప్రథమ వివాహిత. (పతిః) పతియయి నిన్ను. (వివిదే) పొందువాని నామము.(సోమః)సుకుమారతాది గుణయుక్తుఁడగుటచే సోముఁడు. రెండవతూరి నియోగమునే. (వివిదే) పొందువాఁడు. (గంధర్వః) ఒక స్త్రీతో సంభోగించుటచే గంధర్వుఁడు. (తృతీయఉత్తరః) పిమ్మట మూఁడవపతియగు వాఁడు. (అగ్నిః) అత్యుష్ణతాయుక్తుఁడగుటచే నగ్ని సంజ్ఞకుఁడు (తే) నీ (తురీయః)నాలుగు మొదలుకొని పదునొకండు వరకు నియోగముచేసెడు పతులు. (మనుష్యజాః)మనుష్య నామముచేఁ బిలువఁ బడుదురు. (ఇమాం త్వమింద్ర) ఈ మంత్రముచేఁ బదునొకొండవ పురుషుని వరకు స్త్రీ నియోగమును జేసికొన వచ్చును. అట్లే పురుషుడును బదునొకండవ స్త్రీ వరకు నియోగము చేసికొన వచ్చును.

ప్రశ్న:– ఏకాదశ శబ్దముచేత దశపుత్రులు పదునొకండవ పతి అని యేల గణింపఁగూడదు.

ఉత్తరము:– అట్లు అర్థము చేసితిరేని 'విధవేవ దేవరమ్' 'దేవరః కస్మాద్ద్వితీయో వర ఉచ్యతే' 'అదేవృఘ్ని' 'గంధర్వో వివిద ఉత్తరః' ఇత్యాది వేదప్రమాణములచే విరుద్ధార్థమగును. ఏలయనఁగా మీ యర్థముచేత రెండవ పతిగూడఁ బ్రాప్తింపఁజాలదు

దేవరాద్వా సపిండాద్వా స్త్రియా సమ్యఙ్నియుక్తయా।
ప్రజేప్సి తాధిగంతవ్యా సంతానస్య పరిక్షయే॥౧॥
జ్యేష్ఠో యవీయసో భార్యాం యవీయాన్వాగ్రజస్త్రియమ్।
పతితౌ భవతో గత్వా నియుక్తావప్యనాపది॥౨॥
ఔరసః క్షేత్రజశ్చైవ॥౩॥ మను.అ.౯.౫౯,౫౮, ౧౫౯॥

సపిండ:–పతికి సంబంధించిన యాఱుతరములయందు.పతియొక్క తమ్మునితోఁ లేక అన్నతోఁగాని. లేక స్వజాతీయ పురుషునితోఁగాని. తనకంటె నుత్తమజాతి పురుషునితోఁగాని. విధవాస్త్రీకి నియోగము కావలయును; కాని విధురుఁడును. విధవయు సంతానోత్పత్తి నిచ్ఛగించు వారేని నియోగము

చేసికొనుట యుచితము. సంతానము సర్వథా క్షయమయినపుడును నియోగము కావలయును. అపత్కాలమందు-సంతానము కావలయునను నిచ్ఛలేనప్పుడు-అన్నభార్యతోఁ దమ్మునికిని, దమ్ముని భార్యతో నన్నకును నియోగమై సంతానము కలిగిన పిమ్మటను, ఆ నియుక్తులగువారు మరలఁ దమలోఁదాము సమాగమముఁ జేసిరేని * పతితు లగుదురు. ఒక నియోగమందు రెండవగర్భము ధరించువఱకు నియోగావధి. అటుపిమ్మట సమాగమము చేయఁగూడదు. ఇద్దఱికొఱకు నియోగమయ్యెనేని నాల్గవ గర్భమువఱకు నియోగము పరిమితి; అనఁగా బూర్వోక్త రీతిని పది సంతానమువఱకుఁ గావచ్చును. పిమ్మట విషయాసక్తియని యెంచఁదగును; కాఁబట్టి వారు పతితు లనఁబడుదురు. వివాహిత స్త్రీ పురుషులును పదియవ గర్భమునకంటె నధికముగ సమాగమ మొనర్చిరేని గాముకులును, నిందితులు నగుదురు. అనఁగా వివాహముకాని, నియోగముకాని సంతానము కొఱకే చేయఁబడ వలెను గాని పశువులవలెఁ గామక్రీడ కొరకుఁగాదు.

ప్రశ్న:- నియోగము పతి గతించిన పిమ్మటనా? లేక బ్రతికి యుండు నపుడు గూడఁ గావచ్చునా?

ఉత్తరము:- బ్రతికి యుండునపుడును గావచ్చును.

అన్యమిచ్ఛస్వ సుభగే పతిం మత్॥ ఋ.మం. ౧౦.సూ. ౧౦.మం.౧౦॥

పతి సంతానోత్పత్తియం దసమర్థుఁ డయినపుడు తన స్త్రీనిగూర్చి ఓ సుభగా! సౌభాగ్యవతీ నీవు (మత్) నాకంటె (అన్యమ్.) వేఱగు పతిని (ఇచ్ఛస్వ) ఇచ్ఛగింపుము; ఏల యనఁగా నిఁకనావలన సంతానము గలుగదు. అని ఆజ్ఞ నీయవలయును. అప్పుడు స్త్రీ యితరునితో నియోగము చేసికొని సంతానముఁ బొందవలయును. కాని మహాశయుఁడైన వివాహిత పతి సేవయందుఁ దత్పరురాలై యుండవలయును. అట్లే స్త్రీయును రోగాది దోషములు గలిగి సంతానోత్పత్తియం దసమర్థురాలయినపుడు తనపతికి స్వామీ! నాయందు సంతానేచ్ఛ వదలి మఱొక విధవాస్త్రీతో నియోగము చేసికొని సంతానమును గాంచుఁడు; అని ఆజ్ఞ నీయవలయును. పాండురాజు స్త్రీలగు

* పతితు లనఁగా స్త్రీ పురుషులు. నియోగమువలన దగసంతానము మర్యాదను చేసికొని నియమముంచినారు.

కుంతియు, మాద్రియు నిట్లే నియోగము చేసికొని సంతానమును గాంచిరి. ఇదియుఁగాక వ్యాసుఁడు తన తమ్ములగు చిత్రాంగద విచిత్రవీర్యులు మృతినొందిన పిమ్మట వారి స్త్రీలతో నియోగము చేసికొని అంబికయందు ధృతరాష్ట్రుని అంబాలిక యందుఁ బాండుని, దాసి యందు విదురుని నుత్పత్తి చేసెను. ఇట్టి యితిహాసములు గూడ నిందు ప్రమాణములుగ నున్నవి.

ప్రోషితో ధర్మకార్యార్థం ప్రతీక్ష్యోఽష్టౌ నరః సమాః।
విద్యార్థం షడ్యశోఽర్థం వా కామార్థం త్రీంస్తు వత్సరాన్ ॥ మను ౯-౭౬॥

వివాహితపతి ధర్మము కొఱకుఁ పరదేశము పోయియుండిన నెనిమిదేండ్లును, విద్యాకీర్తుల కొఱకుఁ బోయియుండిన నాఱేండ్లును, ధనాదుల కొఱకుఁ బోయియుండిన మూడేండ్ల వఱకును నిరీక్షించి, పిమ్మట వివాహితస్త్రీ నియోగము చేసికొని సంతానమును గాంచవచ్చును. కాని వివాహితపతి రాగానే నియుక్తపతి వదలి పోవలయును.

వంధ్యాష్టమేఽధివేద్యాబ్దే దశమే తు మృతప్రజా।
ఏకాదశే స్త్రీజననీ సద్యస్త్వప్రియవాదినీ ॥ మను. ౯.౮౧॥

అట్లే పురుషునికి నియమము లున్నవి:- గొడ్డురాలయ్యెనేని ఎనిమిదేండ్లకును, (వివాహ మయినది మొదలు ఎనిమిదేండ్ల వఱకు గర్భిణిగాకుండిన నని యర్థము) పుట్టిన బిడ్డలు చచ్చుచు నుండిరేని పదేండ్లకును, పుట్టినపుడెల్ల నాఁడు బిడ్డలే పుట్టుచు మగబిడ్డలు కలుగకుండినఁ బదునొకండవ యేఁటను, అప్రియము పలుకునదిగా నుండెనేని తక్షణమును వివాహిత స్త్రీని వదలి రెండవ స్త్రీతో నియోగముఁ జేసికొని సంతానము గాంచనగును.

పురుషుఁడత్యంత దుఃఖదాయకుఁ డయ్యెనేని అతనిని వదలి రెండవ పురుషునితో నియోగముఁ జేసికొని సంతానము బొంది ఆ సంతానమును ఆ వివాహిత పతికే దాయభాగిగాఁ జేయుట స్త్రీకి ఉచితము. ఇట్టి ప్రమాణములచేతను, యుక్తుల చేతను ఏర్పడిన స్వయంవరవివాహ, నియోగములచేఁ దమ తమ కులములనున్నతి పఱచుకొనవలయును. 'ఔరసుఁడు'—వివాహితపతిచే నుత్పన్నుఁడగు పుత్రుఁడు-తండ్రి పదార్థములకు స్వామియగుచున్నట్లు, 'క్షేత్రజులు'-నియోగముచే నుత్పన్నులగు పుత్రులును-మృతు డగుతండ్రికి దాయభాగులగుచున్నారు వీర్యమును, రజమును అమూల్యములు. ఈ యమూల్యపదార్థములను పురుషులుపరస్త్రీవేశ్యా

దులయందుఁగాని, స్త్రీలు దుష్టపురుషులయందుఁగాని బోఁగొట్టుకొనువారు మహా మూర్ఖులు. ఏలయనఁగా పొలముఁ జేయువాఁడు కాని, తోటఁవాఁడుగాని మూర్ఖుఁడయినను గూడ తన పొలమందును, తనతోఁట యందునుఁ దప్ప వేఱుచోట బీజము నాటఁడు. సాధారణములగు గింజలవిషయమై మూర్ఖుడే యిట్లు వర్తిల్లుచుండగా సర్వోత్తమమగు మనుష్య శరీరరూప వృక్షపు బీజమును అల్పక్షేత్రమందుఁ బాడుజేయువాఁడు మహా మూర్ఖుఁడనఁబడును. ఏలయనఁగా దానిఫలము వానికిఁ జిక్కదు. 'ఆత్మావై జాయతే పుత్రః' (శత. బ్రా ౧౪.౯ ౪.౨౬) ఇది బ్రాహ్మణగ్రంథములోని వచనము.

> అంగా దంగా త్సంభవసి హృదయా దధిజాయసే।
> ఆత్మాసి పుత్ర మా మృథాః స జీవ శరదః శతమ్॥
>
> సామ. బ్రా. ప్రపా. ౧, ఖం. ౫. ౫౦. ౧౬-౧౮॥

ఇది సామవేదబ్రాహ్మణవచనము. 'ఓ పుత్రుఁడా! నీవు అంగములన్నిటియం దుత్పన్నమయిన వీర్యమునుండియు, హృదయము నుండియు నుత్పన్నమగుచున్నావు. కాఁబట్టి నీవు నా యాత్మవు. నాకంటె ముందు నీవు మృతినొందకుము. నూఱేండ్లవఱకును బ్రతుకుము' అనియర్థము. ఈ వీర్యమునుండి గొప్ప గొప్పమహాత్ములయు, మహాశయులయు శరీరములుత్పన్నము లగుచున్నయవి. కాఁబట్టి దానిని వేశ్యాది దుష్టక్షేత్రములయందు విత్తుటకాని, దుష్టబీజమును సుక్షేత్రమందు విత్తించుట కాని మహా పాపకృత్యమని తెలియవలయును.

ప్రశ్న :-- వివాహ మేలచేసికొనవలయును ? దీనినుండి స్త్రీపురుషుల బంధనమందుఁ జిక్కి మిక్కిలి సంకుచితులై దుఃఖము ననుభవింపవలసివచ్చును. కాఁబట్టి యెవరి కెవరి యందుఁ బ్రీతియుండునో వారు వారితోఁ గలసియుండి ప్రీతి తొలఁగగానే వదలిపెట్ట వలయును.

ఉత్తరము:-ఇదిపశుపక్షులవ్యవహారముకాని మనుష్యవ్యవహారము కాదు. మనుష్యులయందు వివాహనియమము లేకపోయినేని గృహాశ్రమపు మంచి వ్యవహారములన్నియుఁజెడి నశించిపోవును. ఒకని నొకఁడు సేవింపను సేవింపఁడు. ఇంతియగాక వ్యభిచారము ప్రబలి యందఱు రోగులును, నిర్బలులును, అల్పాయువులునై శీఘ్రముగ మృత్యువువాతఁ బడుదురు. ఒకనితో నొకనికి భయము కాని, లజ్జకాని కలుగకుండును. వృద్ధావస్థయం దొకఁడొకని సేవకూడఁ జేయక పోవును. ఇట్లు వ్యభిచారమధికముగా ప్రబలి యందఱు రోగులును, నిర్బలులును,

అల్పాయువులునై కులములకు కులములే నిర్మూలములై పోవును. ఒకని పదార్థమునకు మఱియొకఁడు స్వామికాని, దాయభాగికాని కాఁజాలకుండును. ఒకని కొక పదార్థముపై దీర్ఘకాల పర్యంతముస్వత్వము-అధికారము-హక్కు ఉండక పోవును. ఇట్టి దోష నివారణార్థము వివాహమే యన్ని విధముల యోగ్యము.

ప్రశ్న :— ఒక్కటే వివాహ ముండునేని ఒక పురుషున కొక స్త్రీయుఁ ఒక స్త్రీకినొకఁడే పురుషుఁడును ఉందురు. స్త్రీ గర్భవతియో, దీర్ఘరోగిణియో, లేదా పురుషుఁడు దీర్ఘరోగియో యయి, యిద్దరును యువావస్థ యందుండి, యాగజాలని వారుగా నుండిరేని, ఏమి చేయవలయును ?

ఉత్తరము:—దీని యుత్తరము నియోగమం దీయఁబడినది. గర్భవతి యయిన స్త్రీతో నొక సంవత్సర పర్యంతము సమాగమము చేయఁగూడని సమయమందు పురుషుఁడును, దీర్ఘరోగియగు పురుషుని స్త్రీయుఁ దాము బ్రహ్మచర్య మందుండఁజాలరేని, ఎవరితో నేని నియోగముఁ జేసికొని వారికిఁ సంతతిని గలిగింప నగును. కాని వేశ్యాగమన వ్యభిచారాదు లెప్పటికినిఁ గూడవు.

చేతనైనంతవఱకు నప్రాప్తవస్తువులను సంపాదించుచు, ప్రాప్తించిన ధనమును రక్షించుచు, రక్షించిన ధనమును వృద్ధిపఱచుచు, వృద్ధిపఱచిన ధనమును దేశోపకారమందు వెచ్చపెట్టుచు నుండవలయును. అన్ని విధముల - బూర్వోక్త రీతిని-ధమతమ వర్ణాశ్రమ వ్యవహారములయం దత్యుత్సాహ పూర్వకముగఁ బ్రయత్నించుచు, శరీరము చేతను మనస్సుచేతను ధనముచేతను సర్వదా పరమార్థ మొనర్చుచుండ వలయును. తల్లి, తండ్రి, అత్త, మామ వీరలకు లెస్సగ శుశ్రూష చేయవలయును. మిత్రులయందును, ఇరుగు పొరుగు వారియందును, రాజునందును, విద్వాంసులయందును, వైద్యులయందును, సత్పురుషుల యందును గౌరవ ముంచవలయును. అధర్ములగు దుష్టులయెడ ఉపేక్ష - ద్రోహము - వదలి వారిని సవరించుటకుఁ బ్రయత్నింప వలయును. శక్తికొలఁది ప్రేమచేఁ దమసంతానమును విద్వాంసులుగ సుశిక్షితులుగ జేయుటకు ధనాది పదార్థములను వ్యయపఱచి వారినిపూర్ణ విద్వాంసులుగ సుశిక్షాయుక్తులుగఁ జేయ వలయును. ఇట్లు ధర్మయుక్త వ్యవహారము లొనర్చుచు పరమానంద కందమగు మోక్షమును సాధించుటకును బ్రయత్నింప వలయును.

ఈ క్రింద వ్రాయఁబోవు శ్లోకములవంటి వానిని నమ్మఁగూడదు:-

పతితోఽపి ద్విజః శ్రేష్ఠో న చ శూద్రో జితేంద్రియః।
నిర్దుగ్ధా చాపి గౌః పూజ్యా న చ దుగ్ధవతీ ఖరీ॥

దుష్టకర్మకారియగు ద్విజుని శ్రేష్ఠుఁడనియు, శ్రేష్ఠకర్మకారియగు శూద్రుని నీచుఁడనియు నెన్నుటకంటె నధికమగు పక్షపాతము, అన్యాయము, అధర్మము వేఱేమి యుండును? ఏమి? పాలిచ్చు గోవు కాని, పాలీయని గోవు కాని గొల్లఁడు పెంచదగినట్లు కుమ్మరి మున్నగువారికి గాడిదెయే పాలనీయము కాదా? ఇదియునుగాక యీ దృష్టాంతమే విషమము. ఏలయనఁగా ద్విజులు, శూద్రులు మనుష్యజాతి. ఆవు గాడిదె భిన్నజాతి. కొంతవఱకు పశుజాతిచే దృష్టాంతము నందలి యేకదేశము దార్ష్టాంతమందుఁ గలిసినను దీని ఆశయ మయుక్త మగుటచే నీశ్లోకము లెన్నటికిని విద్వాంసులకు మాననీయములు కాఁజాలవు.

అశ్వాలంభం గవాలంభం సన్న్యాసం పలపైతృకమ్।
దేవరాచ్చ సుతోత్పత్తిం కలౌ పంచ వివర్జయేత్॥

అశ్వాలంభము-గుఱ్ఱమును జంపియు, గవాలంభము-ఆవునుజంపియు హోమము చేయుటయే వేదవిహితము కానపుడు, దానిని గలియుగములో నిషేధించుట వేదవిరుద్ధ మేలకాదు? ఈ నీచకర్మమునకు నిషేధము కలియుగమని యంగీకరింపఁబడు నేని త్రేతాదులయందు విధియైయున్నట్లు తోఁచును కదా! ఇట్టి దుష్టకర్మ మా శ్రేష్ఠయుగముల యందుండుట సర్వథా యసంభవము. (దీనికి విధి యేయుగమందునులేదు.) సన్న్యాసమునకు విధి వేదాది శాస్త్రముల యందున్నది గనుక దాని నిషేధించుట నిర్మూలము. మాంసాహారమే నిషిద్ధమై యున్నప్పుడు అది సర్వదా నిషిద్ధమే యనుట స్పష్టము. అట్లే దేవరచేఁ బుత్రోత్పత్తికి విధానము వేదమందు స్పష్టముగా నుండఁగా నీశ్లోకమును వ్రాసినవాఁ డేల మొఱుగుచున్నాఁడో తెలియదు.

నష్టే మృతే ప్రవ్రజితే క్లీబే చ పతితే పతౌ।
పంచస్వాపత్సు నారీణాం పతిరన్యో విధీయతే॥

ఇవి కపోల కల్పితములగు పారాశరి (౮-౩౩॥౪.౩౦) శ్లోకములు

(నష్టే) పతి దేశాంతరము పోయినపుడు ఇంటి స్త్రీ నియోగము చేసి కొనెనేని అప్పుడే వివాహిత పతియు చేతెంచినచో నామె యెవరి స్త్రీ కాఁగ లదు? ఎవరేని వివాహితపతికే స్త్రీ కావలయునని చెప్పెదరేని మాకు సమ్మ తమే. కాని యిట్టి వ్యవస్థ పారాశరమందు వ్రాయఁబడలేదు. (కాఁబట్టి యీ శ్లోకము ప్రమాణార్హముకాదు) ఇదియుగాక స్త్రీకి అపత్కాలము లేయయిదింటి కంటె వేఱు లేవా యేమి? రోగియగుట, కలహించుట మొదలుగాఁ గల యాప త్కాలము లయిదింటికంటె నెక్కువగా నున్నవి. కాఁబట్టి యిట్టి శ్లోకముల నెన్నఁ టికిని నమ్మ గూడదు.

ప్రశ్న :- మీరు పరాశరముని వచనమును కూడ నమ్మరా?

ఉత్తరము:- ఎవరి వచనమే కాని, వేదవిరుద్ధమయ్యేనేని నమ్మము. ఇది యునుఁగాక యిది పరాశరుల వచనమునుగాదు. ఇది స్వార్థుల వచనము (బ్రహ్మో వాచ, వశిష్ఠఉవాచ, రామఉవాచ, శివఉవాచ, విష్ణురువాచ, దేవ్యువాచ) ఇత్యాది శ్రేష్ఠుల పేర గ్రంథములను రచించుటకుఁగారణ మేమనఁగా నందఱు మన్నించు నట్టి వారి పేరనుండుటచే తమగ్రంథములను ప్రపంచమున నందఱు నమ్మెదరు. తమ జీవికయుఁ బుష్కలముగా నడచును. కాఁబట్టి యిట్టి యనర్థగాథాయుక్త గ్రంథములను రచించుచున్నారు. కొన్ని ప్రక్షిప్తశ్లోకములను వదలినచో మను స్మృతియే వేదానుకూలమగు స్మృతి. తక్కినవి కావు. అన్య మాయా గ్రంథ ముల వ్యవస్థయు నిట్లేయని తెలియ వలయును.

ప్రశ్న :- గృహాశ్రమ మన్నిటిలోఁ గొప్పదా, చిన్నదా?

ఉత్తరము :- అన్నియుఁ దమతమ కర్తవ్యకర్మములయందు గొప్పవే కాని :—

యథా నదీనదాః సర్వే సాగరే యాంతి సంస్థితిమ్।
తథైవాశ్రమిణః సర్వే గృహస్థే యాంతి సంస్థితిమ్॥ మను. ౬. ౯౦॥
యథా వాయుం సమాశ్రిత్య వర్తంతే సర్వజంతవః।
తథా గృహస్థమాశ్రిత్య వర్తంతే సర్వ ఆశ్రమాః॥ మను. ౩. ౭౭॥
యస్మాత్త్రయోఽప్యాశ్రమిణో దానేనాన్నేన చాన్వహమ్।
గృహస్థేనైవ ధార్యంతే తస్మాజ్జ్యేష్ఠాశ్రమో గృహీ॥ "—౭౮॥
స సంధార్యః ప్రయత్నేన స్వర్గమక్షయ మిచ్ఛతా।
సుఖం చేహేచ్ఛతా నిత్యం యోఽధార్యో దుర్బలేంద్రియైః॥ "—౭౯॥

నదులును నదములును సముద్రమునాశ్రయింపనంతవరకు పాఱునట్లు, గృహస్థాశ్రయమువలననే సమస్తాశ్రమములును స్థిరముగా నుండును. ఈ యాశ్రమము లేక యే యాశ్రమ వ్యవహారమును సిద్ధింపఁజాలదు. సర్వ జంతువుల వాయువు నాశ్రయించి యుండునట్లు ఆశ్రమములన్నియు గృహస్థముననే పెట్టుకొని యుండును. బ్రహ్మచర్య, వానప్రస్థ, సన్న్యాసములనెడి యీ మూడాశ్రమముల వారికిని దానము అన్నాదులనిచ్చి ప్రతిదినమును గృహస్థే ధరించుచున్నాఁడు. కాఁబట్టి గృహస్థాశ్రమమే జ్యేష్ఠాశ్రమము. అనఁగా నన్ని వ్యవహారములందును ధురంధరము కాఁబట్టి మోక్షమును, ప్రపంచ సుఖమును గోరువారు ప్రయత్నముతో గృహాశ్రమమును ధరింపవలయును. దుర్బలేంద్రియులు-పిఱికివారు.-నిర్బలులు-అగువారిచే ధరింపఁబడుటకుఁ యోగ్యము కాని. యీ గృహస్థాశ్రమమును బాగుగ ధరింపవలయును. కాబట్టి ప్రపంచ వ్యవహారము కంతటికి ఆధారము గృహాశ్రమము. గృహాశ్రమమే లేదేని సంతానోత్పత్తియే కలుగదు. కనుక బ్రహ్మచర్య, వానప్రస్థ, సన్న్యాసాశ్రమములు, ఎక్కడనుండి కలుగును? గృహాశ్రమమును నిందించు వాఁడేనిందపియుడు. ప్రశంసించువాడే ప్రశంసనీయుఁడు. కాని స్త్రీపురుష లిరువురును బరస్పరము ప్రసన్నులును, విద్వాంసులును, పురుషార్థులును, అన్ని విధముల వ్యవహారములను దెలిసిన వారును అయినప్పుడే గృహాశ్రమమందు సుఖము కలుగును. కాబట్టి గృహాశ్రమ సుఖమునకు ముఖ్యకారణముల బ్రహ్మచర్యమును, పూర్వోక్త స్వయంవర వివాహము నై యున్నవి.

సంక్షేపముగ సమావర్తన, వివాహ, గృహాశ్రమముల విషయమై వ్రాయఁబడినది. ఇంకముందు వానప్రస్థ సన్న్యాసాశ్రమముల విషయమయి వ్రాయఁబడును.

శ్రీమద్దయానంద సరస్వతీ స్వామికృతమును
సుభాషావిభూషితమునగు సత్యార్థ ప్రకాశమునందు
సమావర్తన, వివాహ, గృహాశ్రమ విషయములు గల
చతుర్థ సముల్లాసము సంపూర్ణము.

# పంచమ సముల్లాసము

## వానప్రస్థ - సన్న్యాస విధులు

బ్రహ్మచర్యాశ్రమం సమాప్య గృహీ భవేత్।
గృహీ భూత్వా వనీ భవేద్వనీ భూత్వా ప్రవ్రజేత్॥శత.బ్రా.।కాం౧౪॥

బ్రహ్మచర్యాశ్రిమమును ముగించి గృహస్థులును, పిమ్మట వానప్రస్థులును, తరువాత సన్న్యాసులును, అగుట మనుష్యుల కుచితము. ఆశ్రమముల క్రమమిది.

ఏవం గృహాశ్రమే స్థిత్వా విధివత్స్నాతకో ద్విజః।
వనే వసేత్తు నియతో యథావ ద్విజితేంద్రియః॥మను.౬.౧॥

ఈరీతిని స్నాతకుఁడు-బ్రహ్మచర్య పూర్వకముగ గృహాశ్రమమొనర్చు ద్విజుఁడు-బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు-గృహాశ్రమమందుండి నిశ్చితాత్ముఁడై యథారీతి నింద్రియములను జయించి వనమందు వసింపవలయును.

గృహస్థస్తు యదా పశ్యేద్వలీ పలిత మాత్మనః।
అపత్యస్యైవ చాపత్యంతదారణ్యం సమాశ్రయేత్॥ "—౨॥

గృహస్థుడు తన తల వెంట్రుకలు తెల్లఁబడి చర్మము ముడుతలుపడి కుమారునకుఁ గుమారుఁడు కలుగఁగానే వనమందు వసింపవలయును.

సంత్యజ్య గ్రామ్య మాహారం సర్వం చైవ పరిచ్ఛదమ్।
పుత్రేషు భార్యాం నిఃక్షిప్య వనంగచ్ఛేత్సహైవ వా॥"—౩॥

గ్రామసంబంధమగు సమస్తాహారములను, వస్త్రాదులను, సమస్తోత్తమోత్తమ పదార్థములను వదలి భార్యను పుత్రునియొద్దబెట్టి కాని, వెంటఁదీసికొని గాని వనమందు వసింపవలయును.

అగ్నిహోత్రం సమాదాయ గృహ్యం చాగ్ని పరిచ్ఛదమ్।
గ్రామా దరణ్యం నిఃసృత్య నివసే న్నియతేంద్రియః॥ మను.౬.౪॥

సాంగోపాంగముగ నగ్నిహోత్రమును దీసికొని గ్రామమునుండి వెడలి దృఢేంద్రియుఁడయి అరణ్యమందు వసింపవలయును.

మున్యన్నైర్వివిధైర్మేధ్యైః శాకమూల ఫలేన వా।
ఏతానేవ మహాయజ్ఞా న్నిర్వపే ద్విధిపూర్వకమ్॥మను.౬.౫॥

నానావిధములగు చామలు మొదలగు సన్నములు, సుందర శాకములు, మూలములు, ఫలములు, పుష్పములు, కందములు మొదలగు వానితో పూర్వోక్త పంచమహాయజ్ఞములను అతిథిసేవను జేయుచుఁ దానును నిర్వహించు కొనవలయును.

> స్వాధ్యాయే నిత్యయుక్తః స్యాద్దాంతో మైత్రః సమాహితః।
> దాతా నిత్యమనాదాతా సర్వభూతానుకంపకః॥ మను. ౬.౮॥

స్వాధ్యాయము-చదువుట, జదివించుట యందు నిత్యయుక్తుఁడు, జితాత్ముఁడు, అందఱకు మిత్రుఁడు, ఇంద్రియ దమన శీలుఁడు, విద్యాదులను దానము చేయువాఁడు, అందఱియందును దయాళువు నయి యెవరినుండియు నేమియుఁ బుచ్చుకొనక సర్వదా వర్తింపవలయును.

> అప్రయత్నః సుఖార్థేషు బ్రహ్మచారీ ధరాశయః।
> శరణే ష్వమమశ్చైవ వృక్షమూలనికేతనః॥ మను. ౬.౨౬॥

శరీర సుఖముకొఱకు మిక్కిలి ప్రయత్నము చేయఁగూడదు. బ్రహ్మచారియయి-తనభార్య తనతోనుండినను, ఆమెతో విషయచేష్ట లేమియుఁజేయక-యుండవలయును. భూమిమీఁద శయనింపవలయును. ఆశ్రితులందు, తనవస్తువులయందు మమత నుంచఁగూడదు. వృక్షమూలమందు వసింపవలయును.

> తపః శ్రద్ధే యే హ్యుపవసంత్యరణ్యే శాంతా విద్వాంసో భైక్షచర్యాం చరంతః।
> సూర్యద్వారేణ తే విరజాః ప్రయాంతి యత్రామృతః స పురుషో హ్యవ్యయాత్మా॥
> ముండక ౧.ఖం౨.మ.౧౧॥

శాంతులును, విద్వాంసులు నగువారు వనమందుఁ దపస్సును, ధర్మానుష్ఠానమును సత్యమందు శ్రద్ధయుఁ గలిగి భిక్షాచరణ మొనర్చుచు నరణ్యమందు వసింతురు. నాశరహితుఁడును, పూర్ణ పురుషుఁడును, హానిలాభ రహితుఁడునగు పరమాత్మయందు నిర్మలులయి ప్రాణద్వారమున వారా పరమాత్మను బొంది యానందింతురు.

> అభ్యాదధామి సమిధమగ్నే వ్రతపతే త్వయి।
> వ్రతం చ శ్రద్ధాం చోపైమీంధే త్వా దీక్షితో అహమ్॥ యజు. అ.౨౦.మం.౨౪॥

'నేను అగ్నియందు హోమముఁజేసి దీక్షితుఁడనై వ్రతమును సత్యాచరణమును, శ్రద్ధను బొందుదునుగాక!' యని నిశ్చయించి వానప్రస్థుఁడై నానా

విరముల తపశ్చర్య-సత్సంగ యోగాభ్యాస సువిచారములచే జ్ఞానమును పవిత్రతను బొందుట వానప్రస్థున కుచితము. పిమ్మట సన్న్యాసము గ్రహింప నిచ్ఛ వొడమినపుడు, తనస్త్రీనిఁ బుత్రునియొద్దకుఁ బంపి సన్న్యాసమును గ్రహింప వలయును. ఇది సంక్షేపముగ వానప్రస్థవిధి.

సన్న్యాసవిధిః—

> వనేషు చ విహృత్యైవం తృతీయం భాగమాయుషః।
> చతుర్థ మాయుషో భాగం త్యక్త్వా సంగాన్ పరివ్రజేత్॥మను.౬.౩౩॥

ఈ రీతిని వనమందు ఆయువులో మూడవ భాగపర్యంతము,-ఏఁబది నుండి డెబ్బదియైదవ యేఁటి వరకు,-వానప్రస్థుడుగానుండి ఆయుస్సులో నాల్గవ భాగమందు సంగములను వదలి (పరివ్రాట్) సన్న్యాసి కావలయును.

ప్రశ్న:—గృహస్థ వానప్రస్థాశ్రమములను పాలింపక సన్న్యాసాశ్రమము నుస్వీకరించువారికిఁ బాపము కలుగునా, లేదా?

ఉత్తరము:—కలుగను వచ్చును; కలుగకయు పోవచ్చును

ప్రశ్న:—ఈ రెండు విధముల మాటయేలఁ జెప్పుచున్నారు:

ఉత్తరము:—రెండు విధముల మాటకాదు; ఏలయనఁగా బాల్యావస్థ యందు విరక్తుఁడై పిమ్మట విషయములయందుఁ దగులుకొనువాఁడు మహాపాపియు, దగులు కొననివాఁడు మహాపుణ్యాత్ముఁడు—సత్పురుషుఁడు-నగును.

> యదహరేవ విరజేత్తదహరేవ ప్రవ్రజేద్వనాద్వా గృహాద్వా బ్రహ్మ
> చర్యాదేవ ప్రవ్రజేత్॥ బ్రాహ్మణము[అథ.జాబాయప.కం.౪]

వైరాగ్యము కలిగిన దినమందే, యింటినుండికాని-వనమునుండికాని—సన్న్యాసము గ్రహింపవలయును. మొదట సన్న్యాసపు పక్షక్రమము [మను.౬—౩౩] చెప్పఁబడినది. ఇకనిందు వికల్పము, అనఁగా వానప్రస్థము నాచరింపవలసిన పనిలేదు. గృహాశ్రమము నుండియే సన్న్యాసము పుచ్చుకొనవచ్చును. మూఁడవ పక్షమేమన—పూర్ణ విద్వాంసుఁడును. జితేంద్రియుఁడును, విషయభోగముల కోరిక లేనివాఁడును, పరోపకారము చేయు నిచ్ఛగలవాఁడును, అగు పురుషుఁడు బ్రహ్మచర్యాశ్రమమునుండియే సన్న్యాసము గ్రహింపవచ్చును. వేదమునందును 'యతయః బ్రాహ్మణస్య విజానతః' ఈ మొదలగు పదములచే సన్న్యాసమునకు విధానమున్నది. కాని:—

నావిరతో దుశ్చరితాన్నాశాంతో నాసమాహితః।
నాశాంత మానసో వాపి ప్రజ్ఞానేనైనమాప్నుయాత్॥కఠ. వల్లీ.౨.మం.౨౩॥

దురాచారము నుండి దూరముగా నుండనివాఁడు, శాంతి రహితుఁడు, యోగి కానివాఁడు, మనస్సు శాంతముకానివాఁడు, సన్న్యాసము పుచ్చుకొన్నను బ్రజ్ఞానముచేతఁ బరమాత్మను బొందఁజాలఁడు. కాఁబట్టి:—

యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞస్తద్యచ్ఛేద్ జ్ఞాన ఆత్మని।
జ్ఞానమాత్మని మహతి నియచ్ఛేత్తద్యచ్ఛేచ్ఛాంత ఆత్మని॥కఠ.వల్లీ.౩.మం.౧౩॥

బుద్ధిమంతుఁడగు సన్న్యాసి వాణిని, మనస్సును అధర్మము నుండి మరలించి వానిని జ్ఞానమునందును, ఆత్మయందును చేర్పవలయును. ఆ జ్ఞానస్వాత్మలను బరమాత్మయందుఁ జేర్పవలయును. ఆ విజ్ఞానమును శాంత స్వరూపమగు నాత్మయందు స్థిర పఱుపవలయును.

పరీక్ష్యలోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేద మాయాన్నాస్త్యకృతః కృతేన।
తద్విజ్ఞానార్థం స గురు మేవాభిగచ్ఛేత్ సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్॥
ముండ.ఖండ.ముండ౧.ఖం.౨.మం.౧౨॥

లౌకిక భోగములన్నియు కర్మముచే సంచితము లయినవని కనుఁగొని బ్రాహ్మణుఁడు—సన్న్యాసి-వైరాగ్యమును బొందవలయును (అకృత)చేయఁబడని ఆ పరమాత్మ (కృత) కేవల కర్మముచేఁ బ్రాపింపఁజాలఁడు. కాఁబట్టి అర్పించుట కెద్దియేని బుచ్చుకొని, వేదవిదుఁడయి బరమేశ్వరుని గుర్తెఱిఁగిన గురువు నొద్దకు విజ్ఞానముకొఱకుఁ బోవలయును. పోయి సమస్త సందేహములను నివృత్తి చేసికొనవలయును. చెప్పఁబోవు వారి సాంగత్యము మాత్రము సదా వర్జింపవలయును.

అవిద్యాయామంతరే వర్తమానాః స్వయం ధీరాః పండితమ్మన్యమానాః।
జంఘన్యమానాః పరియంతి మూఢా అంధేనైవ నీయమానా యథాంధాః॥౮॥

తాము అవిద్యలోఁ గ్రీడించుచుఁ దమకుఁ దామే ధీరులమనియు బండితుల మనియు ననుకొనుచు నీచ గతినిఁ బొందు నా మూఢులు, గ్రుడ్డివానిచే నడుపబడిన గ్రుడ్డివారు దుర్దశనువలె దుఃఖమును బొందుదురు.

అవిద్యాయాం బహుధా వర్తమానా వయం కృతార్థా ఇత్యభిమన్యంతి బాలాః॥
యత్కర్మిణో న ప్రవేదయంతి రాగాత్తేనాతురాః క్షీణలోకాశ్చ్యవంతే॥౯॥
ముం ౧.ఖం.౨.మం.౯॥

ప్రాయికముగా నవిద్యయందు రమించు బాలబుద్ధులు తాము కృతార్థుల మని యనుకొనుచున్నారు; కేవలము కర్మకాండులగువారు రాగముచే మోహింపఁ బడి దాని నెఱుఁగ లేరు; ఎఱిఁగింపఁజాలరు. వారు ఆతురులై జన్మమరణరూపఁ దుఃఖమునఁ బడియుందురు.

వేదాంతవిజ్ఞాన సునిశ్చితార్థాః సన్యాసయోగాద్యతయః శుద్ధసత్వాః।
తే బ్రహ్మలోకేషు పరాంతకాలే పరామృతాః పరిముచ్యంతి సర్వే॥
ముండకోప.౩. ఖం.౨.మం.౬॥

వేదాంతము-పరమేశ్వర ప్రతిపాదకములగు వేద మంత్రముల అర్థజ్ఞాన మందు ఆచారమందు-బాగుగ నిశ్చయింపఁబడిన సన్న్యాసయోగముచే శుద్ధాంతః కరణులై సన్న్యాసులగువారు పరమేశ్వరుని యందు ముక్తి సుఖమును బొంది ముక్తిసుఖపుటవధి పూర్తి కాఁగానే అక్కడి నుండి విడి సంసారమునకు వత్తురు. ముక్తిలేకున్న దుఃఖమునకు వినాశము గలుగఁజాలదు—

న వై సశరీరస్య సతః ప్రియాప్రియయో రపహతి రస్తి।
అశరీరం వావ సంతం న ప్రియాప్రియే స్పృశతః॥ఛాందో॥౮.౧౨.౧॥

దేహధారి సుఖదుఃఖ ప్రాప్తినుండి దూరము గాఁజాలఁడు. శరీర రహితుఁ డగు జీవాత్మ ముక్తియందు సర్వవ్యాపకుండగు పరమేశ్వరునితోఁగూడి శుద్ధుఁడై యుండును. అప్పుడు వానికి సాంసారిక సుఖదుఃఖములు కలుగఁజాలవు. కాఁబట్టి:-

లోకైషణాయాశ్చ విత్తైషణాయాశ్చ పుత్రైషణాయాశ్చ
వ్యుత్థాయాథ భైక్షచర్యం చరంతి॥శత.కాం.౧౪ ప్ర.౫.బ్రా.౨.కం.౧॥

లోకమందలి ప్రతిష్ఠా లాభములు, ధనముచేఁ గలుగు భోగ గౌరవములు, పుత్రాదుల మోహము వీనినుండి దూరముగానుండి సన్న్యాసులు భిక్షుకులయి రేయింబగళ్లు మోక్షసాధనమందుఁ తత్పరులై యుందురు.

ప్రాజాపత్యాం నిరూప్యేష్టిం తస్యాం సర్వవేదసం హుత్వా బ్రాహ్మణః
ప్రవ్రజేత్॥యజుర్వేద బ్రాహ్మణే॥ (శున్యాయ.మా.వా.రా.౪.౦.౬)
ప్రాజాపత్యాం నిరూప్యేష్టిం సర్వవేదసదక్షిణామ్।
ఆత్మన్యగ్నీన్ సమారోప్య బ్రాహ్మణః ప్రవ్రజేద్గృహాత్॥మను.౬.౩౮॥

ప్రజాపతి-పరమేశ్వరుని-ప్రాప్తికొఱకు. ఇష్టి.-యజ్ఞ-మొనర్చి దాని యందు యజ్ఞోపవీతశిఖాది చిహ్నములను వదలి ఆహవనీయము మున్నగు నయి

దగ్నులను 'ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానములను' పంచప్రాణములం యందు నారోపించి బ్రాహ్మణుఁడు-బ్రహ్మవిదుఁడు,-ఇంటినుండి వెడలి సన్న్యాసి కావలయును.

> యో దత్త్వా సర్వభూతేభ్యః ప్రవ్రజత్యభయం గృహాత్।
> తస్య తేజోమయా లోకా భవంతి బ్రహ్మవాదినః॥"—౨౯॥

సమస్తభూత ప్రాణి మాత్రమున కభయదాన మొసంగి యింటినుండి వెలువడి సన్న్యాసియగు నా బ్రహ్మవాదికి-పరమేశ్వర ప్రకాశితమగు వేదోక్త ధర్మాది విద్యలను ఉపదేశించు సన్న్యాసికి-ప్రకాశమయమగు లోకము-మోక్ష నంద స్వరూపమగునది-ప్రాప్తించును.

ప్రశ్న :— సన్న్యాసుల ధర్మములెవ్వి ?

ఉత్తరము:— పక్షపాతరహితమైన న్యాయాచరణము, సత్యగ్రహణము, అసత్య పరిత్యాగము, వేదోక్తమగు నీశ్వరాజ్ఞా పాలనము, పరోపకారము, సత్య భాషణము మొదలగు లక్షణములతోఁ గూడిన యీ ధర్మము, అన్నియాశ్రమ ముల వారికి-మనుష్యమాత్రులకు,-నొక్కటియే. కాని సన్న్యాసులకు విశేష ధర్మము లెవ్వి యనఁగా :—

> దృష్టిపూతం న్యసేత్పాదం వస్త్రపూతం జలం పిబేత్।
> సత్యపూతాం వదే ద్వాచం మనఃపూతం సమాచరేత్॥మను. ౬. ౪౬॥

సన్న్యాసి, మార్గమందు నడచునపుడెల్ల నటు నిటు జూడక క్రిందభూమిపై దృష్టినుంచి నడువవలయును. గుడ్డతో నీటిని వడపోసికొని త్రాగవలయును. నిరంతరము సత్యమునే చెప్పవలయును. మనస్సున విచారించి సత్యమును గ్రహించి యసత్యమును వదలవలయును.

> క్రుధ్యంతం న ప్రతి క్రుధ్యేత్ దాక్రుష్టః కుశలం వదేత్।
> న సప్తద్వారావకీర్ణాం చ న వాచమనృతాం వదేత్॥ "—౪౮॥

ఉపదేశ సమయమందుఁగాని, సంవాదమందుఁగాని ఎవఁడేని సన్న్యాసిపై కోపించినను, నిందించినను వానిపై మరల దాను గ్రోధింపక వాని కల్యాణార్థము, ఉపదేశించుట సన్న్యాసి కుచితము. ఇఁక ముఖనాసికా నేత్ర కర్ణాది ఛిద్రములందు విస్తరించి యున్నవాటికి విరోధముగ నసత్య మెన్నటి కిది జెప్పఁగూడదు.

అధ్యాత్మరతిరాసీనో నిరపేక్షో నిరామిషః।
ఆత్మనైవ సహాయేన సుఖార్థీ విచరే దిహ॥ “— ౪౯॥

తన ఆత్మయందును పరమాత్మయందును స్థిరుఁడును, అపేక్షారహితుఁడును, మద్యమాంసాది వర్జితుఁడును, ఆత్మ సహాయముచేతనే సుఖార్థియు నయి ఈ ప్రపంచమందు ధర్మమును, విద్యయు వృద్ధిఁబొందున ట్లుపదేశము చేయుటకు సంచరించుచుండవలయును.

క్లృప్తకేశనఖశ్మశ్రుః పాత్రీ దండీ కుసుంభవాన్।
విచరేన్నియతో నిత్యం సర్వభూతా న్యపీడయన్॥ “— ౫౨॥

తలవెండ్రుకలను, గోళ్ళను, గడ్డమును, మీసములను గొఱిగించుకొని సుందరమగు పాత్రను, దండమును కుసుమ పువ్వు మొదలగు రంగులతో నద్దిన వస్త్రమును గ్రహించి నిశ్చితాత్ముఁడై యేభూతమునకు-ఏప్రాణికినిఁ-బీడ గలిగింపక నంతట సంచరించుచుండవలయును.

ఇంద్రియాణాం నిరోధేన రాగద్వేష క్షయేణ చ।
అహింసయా చ భూతానా మమృతత్వాయ కల్పతే॥ “— ౬౦॥

ఇంద్రియముల నధర్మాచరణమునుండి నిరోధించి రాగద్వేషములను వదలి సమస్తప్రాణులయందును నిర్వైరుఁడయి వర్తించుచు, మోక్షముకొఱకు సామర్థ్యమును వృద్ధిపఱచుకొనవలయును.

దూషితోఽపి చరేద్ధర్మం యత్ర తత్రాశ్రమే రతః।
సమః సర్వేషు భూతేషు న లింగం ధర్మకారణమ్ “— ౬౬॥

ఈ యా యాశ్రమ మనక నందఱితో వర్తించువాఁడు కాఁబట్టి సన్న్యాసి తన్నెవరు దూషించినను, భూషించినను, లక్ష్యపెట్టక సమస్త ప్రాణులయందుఁ బక్షపాతరహితుఁడై యుండి, స్వయముగ ధర్మాత్ముఁడగుచు నితరులను ధర్మాత్ములనుగాఁ జేయఁ బ్రయత్నింప వలయును. దండము, కమండలము, కాషాయవస్త్రము మొదలగు చిహ్నములను ధరించుట ధర్మ కారణములు కావనియును, మనుష్యులందఱకు సత్యోపదేశ విద్యాదానములచే నున్నతిని గలిగించుటయే సన్న్యాసి ముఖ్యధర్మ మనియునుఁ దనమనస్సునందు నిశ్చయముగాఁ దెలియవలయును.

ఫలం కతకవృక్షస్య యద్యప్యంబు ప్రసాదకమ్।
న నామగ్రహణాదేవ తస్య వారి ప్రసీదతి॥౬.౬౭॥

ఏల యనఁగా చిల్లగింజ నఱుగఁదీసి వంచరిదీసి నీటిలోఁ గలిపితిమేని అది జలమును శోధింపఁగలుగును. అట్లు చేయక చిల్లగింజపేరు చెప్పిన మాత్రముచేతఁగాని విన్నమాత్రముచేతఁగాని జలము శుద్ధము కాఁజాలదు.

ప్రాణాయామా బ్రాహ్మణస్య త్రయోఽపి విధివత్కృతాః।
వ్యాహృతిప్రణవైర్యుక్తా విజ్ఞేయం పరమం తపః॥"—౭౦॥

కాఁబట్టి ఓంకార పూర్వక సప్త వ్యాహృతులచే విధిపూర్వకముగఁ ప్రాణయామము శక్తికొలఁది చేయుట బ్రాహ్మణునకు-బ్రహ్మవిదుఁడగు సన్న్యాసికి-నుచితము. కాని ప్రాణాయామము మూఁడింటికిఁ దక్కువగఁ జేయఁగూడదు. ఇదియే సన్న్యాసికిఁ బరమ తపము.

దహ్యంతే ధ్మాయమానానాం ధాతూనాం హి యథా మలాః।
తథేంద్రియాణాం దహ్యంతే దోషాః ప్రాణస్య నిగ్రహాత్॥ "—౭౧॥

ఏలయనఁగా అగ్నియందుఁ గాచుటచేతను, గఱగించుటచేతను ధాతువుల మలము నష్టమైపోవునట్లు ప్రాణముల నిగ్రహము చేత మనస్సు మొదలగు నింద్రియముల దోషము భస్మీభూతమగుచున్నది.

ప్రాణాయామైర్దహేద్దోషాన్ ధారణాభిశ్చ కిల్బిషమ్।
ప్రత్యాహారేణ సంసర్గాన్ ధ్యానేనానీశ్వరాన్ గుణాన్॥ "—౭౨॥

కాఁబట్టి సన్న్యాసులు ప్రతిదినము ప్రాణాయామముచే ఆత్మాంతఃకరణ, ఇంద్రియముల దోషములను, ధారణముచేఁ బాపములను, ప్రత్యాహారముచే సంగ (విషయాసక్తి) దోషములను, ధ్యానముచే అనీశ్వరగుణములను అనఁగా హర్ష శోకావిద్యాది జీవుని దోషములను భస్మీభూతము చేయవలయును.

ఉచ్చావచేషు భూతేషు దుర్జ్ఞేయా మకృతాత్మభిః।
ధ్యానయోగేన సంపశ్యేద్గతి మస్యాంతరాత్మనః॥ ॥౭౩॥

ఈ ధ్యానయోగముచేతనే యోగ విద్యా విముఖులును, అవిద్వాంసులును నగు వారు తెలిసికొనలేని ఉత్తమాధమపదార్థములం దంతట పరమేశ్వరుని వ్యాప్తిని గనఁదగును. అట్లే తన ఆత్మగతిని, అంతర్యామియగు పరమాత్ముని గతిని చూడఁదగును.

అహింస యేంద్రియాసంగైర్వైదికైశ్చైవ కర్మభిః ।
తపసశ్చరణైశ్చోగ్రైస్సాధయంతీహ తత్పదమ్॥ ...–౧౫౦

సమస్త భూతములయందును నిర్వైరుఁడయి, ఇంద్రియ విషయములను త్యజించి, వేదోక్త కర్మముల చేతను, అత్యుగ్ర తపశ్చరణచేతను ఈ ప్రపంచమందు మోక్షపదమును బూర్వోక్త సన్న్యాసియే సాధింపఁగలఁడు. సాధింపఁజేయఁగలఁడు. ఇతరుడు కాడు.

యదా భావేన భవతి సర్వభావేషు నిస్పృహః ।
తదా సుఖమవాప్నోతి ప్రేత్య చేహ చ శాశ్వతమ్॥"–౮౦॥

సన్న్యాసి సమస్త భావములయందు- పదార్థములయందు - నిస్పృహుఁడును. కాంక్ష రహితుఁడును, లోపలి, వెలుపలి వ్యవహారము లన్నిటియందుఁ బవిత్రుఁడును అయినపుడే యీ దేహమందును, మరణానంతరమునను నిరంతర సుఖము బొందగలఁడు.

చతుర్భిరపి చైవైతైర్నిత్యమాశ్రమిభిర్ద్విజైః ।
దశలక్షణకో ధర్మః సేవితవ్యః ప్రయత్నతః॥ "–౯౧॥

కాఁబట్టి బ్రహ్మచారి, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాసులు ఈ క్రింది దశలక్షణయుక్త ధర్మమును బ్రయత్నముచే సేవించుట యోగ్యము.

ధృతిః క్షమా దమోఽస్తేయం శౌచ మింద్రియ నిగ్రహః ।
ధీర్విద్యా సత్య మక్రోధో దశకం ధర్మలక్షణమ్॥ "–౯౨॥
అనేన విధినా సర్వాం స్త్యక్త్వా సంగాన్ శనైః శనైః ।
సర్వద్వంద్వ వినిర్ముక్తో బ్రహ్మణ్యే వావతిష్ఠతే॥ ...–౮౧॥

౧ [ధృతిః] సదా ధైర్యము గలిగియుండుట. ౨ (క్షమా)నిందాస్తుతి, మానావమాన, హాని లాభాది దుఃఖములందును సహనశీలుఁడయి యుండుట. ౩ (దమః) మనస్సును సదా ధర్మమందే ప్రవర్తపఁజేసి యధర్మమునుండి నిరోధించుట అనగా అధర్మమొనర్ప నిచ్ఛకూడ పుట్టకుండఁజేయుట. ౪ (అస్తేయమ్) చౌర్యత్యాగము అనఁగా ఆజ్ఞలేక కాని, ఛలకపటములచేఁగాని, విశ్వాసఘాతముచేఁ గాని, కొండొక వ్యవహారముచే కాని, వేదవిరుద్ధమగు నుపదేశముచేఁగాని, పర పదార్థములను గ్రహించుట చౌర్యము. దీనిని వదలిపెట్టుట అస్తేయము. ౫ (శౌచమ్) రాగద్వేష పక్షపాతములను వదలి లోపలను, బల

మృత్తికా మార్జనాదులచే వెలుపలను బవిత్రముగా నుంచుట. ౬ (ఇంద్రియ నిగ్రహః) ఇంద్రియములను అధర్మాచరణము నుండి నిరోధించి ధర్మమందే సదా నడుపుట. ౭ (ధీః) మాదక ద్రవ్యములు, బుద్ధిని నాశపఱచు తక్కిన పదార్థములు, దుష్టుల సాంగత్యము, సోమరితనము, ప్రమాదము మొదలగు నానివి వదలి శ్రేష్ఠ పదార్థములను సేవించుట చేతను, సత్పురుషుల స్నేహము చేతను, యోగాభ్యాసము చేతను బుద్ధిని వృద్ధిపఱచుట. ౮ (విద్యా) పృథివి మొదలుకొని పరమేశ్వర పర్యంతము యథార్థ జ్ఞానమును. వానినుండి యథా యోగ్యమగు నుపకారమును బొందుటయును, ఆత్మయందున్నట్లు మనస్సునందును, మనస్సునందున్నట్లు వాణియందును, వాణియందున్నట్లు కర్మమునందును వర్తించుటయు విద్య. దీనికి విపరీత మయినది అవిద్య. ౯ (సత్యమ్) ఏ పదార్థమెట్లున్నదో దానినట్లే తెలియుటయుఁ, జెప్పుటయు, జేయుటయు. ౧౦ (అక్రోధము) క్రోధాది దోషములను వదలి శాంత్యాది గుణములను గ్రహించుట, అనునివి ధర్మలక్షణములు. ఈ దశలక్షణయుక్త, పక్షపాత రహిత న్యాయాచరణమను, ధర్మమును నాలుగాశ్రమముల వారును సేవింపవలయును. ఈవేదోక్త ధర్మమందుఁదాము నడుచుటయు, బోధించి యితరులను నడిపించుటయు సన్న్యాసులకు విశేషధర్మమైయున్నయది.

ఈప్రకారముగా క్రమముగ సమస్తసంగదోషములను వదలి హర్షశోకాది సమస్త ద్వంద్వములనుండి విముక్తుఁడయి సన్న్యాసి బ్రహ్మమునందే యవస్థితుఁడగుచున్నాఁడు. సమస్త గృహస్థాది ఆశ్రమముల వారికి అన్నివిధములఁగు వ్యవహారముల సత్యమును నిశ్చయింపఁజేసి అధర్మ వ్యవహారములనుండి తొలగించి సమస్త సంశయములు నివారించి, వారిని సద్ధర్మయుక్త వ్యవహారములయందుఁ బ్రివర్తింపఁ జేయుటయే సన్న్యాసులకు ముఖ్య కర్మము.

ప్రశ్న:-సన్న్యాసమును బ్రాహ్మణుఁడే గ్రహింప వలెనా?

ఉత్తరము:- బ్రాహ్మణుఁడే గ్రహింపవలెను. ఏలయనఁగా అన్ని వర్ణములలోను పూర్ణ విద్వాంసుఁడును, ధార్మికుఁడును, పరోపకార ప్రియుఁడు నగు మనుష్యునకే బ్రాహ్మణుఁడని పేరు. పూర్ణవిద్యయు, ధర్మమందును, పరమేశ్వరునియందును నిష్ఠయు, వైరాగ్యమును లేక సన్న్యాసమును గ్రహించుటచే లోకమునకు విశేషోపకారము కలుగఁజాలదు. కాఁబట్టి బ్రాహ్మణునికే సన్న్యాస

మృత్తిక మార్జనాదులచే వెలుపలను పవిత్రముగా నుండుట. ౬ (ఇంద్రియ నిగ్రహః) ఇంద్రియములను అధర్మాచరణము నుండి నిరోధించి ధర్మమందే సదా నడుపుట. ౭ (ధీః) మాదక ద్రవ్యములు, బుద్ధిని నాశపఱచు తక్కిన పదార్థములు, దుష్టుల సాంగత్యము, సోమరితనము, ప్రమాదము మొదలగు వానిని వదలి శ్రేష్ఠ పదార్థములను సేవించుట చేతను, సత్పురుషుల స్నేహము చేతను, యోగాభ్యాసము చేతను బుద్ధిని వృద్ధిపఱచుట. ౮ (విద్యా) పృథివి మొదలుకొని పరమేశ్వర పర్యంతము యథార్థ జ్ఞానమును. వానినుండి యథా యోగ్యముగు నుపకారమును బొందుటయు, ఆత్మయందున్నట్లు మనస్సునందును, మనస్సు నందున్నట్లు వాణియందును, వాణియందున్నట్లు కర్మమునందును వర్తించుటయు విద్య. దీనికి విపరీత మయినది అవిద్య. ౯ (సత్యమ్) ఏ పదార్థమెట్లున్నదో దానినట్లే తెలియుటయు, చెప్పుటయు, చేయుటయు. ౧౦ (అక్రోధము) క్రోధాది దోషములను వదలి శాంత్యాది గుణములను గ్రహించుట. అనునివి ధర్మలక్షణములు. ఈ దశలక్షణయుక్త, పక్షపాత రహిత న్యాయాచరణమను, ధర్మమును నాలుగాశ్రమముల వారును సేవింపవలయును. ఈవేదోక్త ధర్మమందుండాము నడుచుటయు, బోధించి యితరులను నడిపించుటయు సన్న్యాసులకు విశేషధర్మమైయున్నయది.

ఈప్రకారముగా క్రమముగ సమస్తసంగదోషములను వదలి హర్షశోకాది సమస్త ద్వంద్వములనుండి విముక్తుడయి సన్న్యాసి బ్రహ్మమునందే యవస్థితుడగుచున్నాడు. సమస్త గృహస్థాది ఆశ్రమముల వారికి అన్నివిధములగు వ్యవహారముల సత్యమును నిశ్చయింపజేసి అధర్మ వ్యవహారములనుండి తొలగించి సమస్త సంశయములు నివారించి, వారిని సద్ధర్మయుక్త వ్యవహారములయందు బ్రవర్తింపజేయుటయే సన్న్యాసులకు ముఖ్య కర్మము.

ప్రశ్న:-సన్న్యాసమును బ్రాహ్మణుడే గ్రహింప వలెనా?

ఉత్తరము:- బ్రాహ్మణుడే గ్రహింపవలెను. ఏలయనగా అన్ని వర్ణములలోను పూర్ణ విద్వాంసుడును, ధార్మికుడును, పరోపకార ప్రియుడు నగు మనుష్యునకే బ్రాహ్మణుడని పేరు. పూర్ణవిద్యయు, ధర్మమందును, పరమేశ్వరునియందును నిష్ఠయు, వైరాగ్యమును లేక సన్న్యాసమును గ్రహించుటచే లోకమునకు విశేషోపకారము కలుగదు. కావున బ్రాహ్మణునికే సన్న్యాస

సన్న్యసాశ్రమమే ముఖ్యమని మనుష్యులందఱు దానినే గ్రహించిరేని మను ష్యుల మూలచ్ఛేదన మయి పోవును.

ఉత్తరము:- మంచిది. వివాహము చేసికొనినను అనేకులకు సంతా నము గలుగదు. కలిగియుఁ గొందఱికి శీఘ్రముగా నశించిపోవును. వారును ఈశ్వరాభిప్రాయమునకు విరుద్ధముగానే చేసిన వారగుదురు. 'యత్నే కృతే యది న సిద్ధ్యతి కోఽత్ర దోషః' (పంచతంత్రము, మిత్రభేదము) యత్నము చేసియుఁ గార్యము సిద్ధింపదేని యందేమిదోషము? ఏమియు లేదందు రేమో! దానికి మేముచెప్పునది వినుఁడు! గృహాశ్రమముచేవి శేష సంతానము కలిగి తమలోఁదాము విరుద్ధాచరణ మొనర్చి కొట్టుకొని చచ్చిరేని, ఎంత హానికలుగు చున్నదో విచారింపుఁడు. విరోధాభిప్రాయములచేత నేకదాకలహములు విశేషములగు చున్నవి. అప్పుడొక సన్న్యసి యుండెనేని వేదోక్త ధర్మము నుపదేశించి పరస్పర ప్రీతిగలిగించి లక్షలకొలది మనుష్యులను రక్షించునుగద! దీని వలన ననేక గృహస్థుల వలె సన్న్యసి వేలకొలఁది మనుష్యులను వృద్ధి పఱిచిన వాఁడగును. ఇదియుఁగాక అందఱును సన్న్యసమును గ్రహింపఁజాలరు. ఏల యనఁగా అందఱకు విషయాసక్తి యెన్నఁటికిని దూరము గాఁజాలదు. సన్న్యసి యుపదేశముచే ధార్మికులగు వారందఱును సన్న్యసికిఁ బుత్రతుల్యులని తెలియ వలయును.

ప్రశ్న:- సన్న్యసులందఱు "మే మేమియుఁ జేయవలసినది లేదు. అన్న వస్త్రములను గ్రహించి యానందముగా నుండవలయును. అవిద్యా రూప సంసారములో మే మేల మా మెదడు పాడుచేసికో వలయును. తాను బ్రహ్మయని తెలిసి సంతుష్టుఁడుగా నున్న చాలును. నీవును బ్రహ్మవే. నీకుఁ బాపపుణ్యము లంటవు. శీతోష్ణములు శరీరధర్మములు. క్షుత్తృష్ణలు ప్రాణ ధర్మములు. సుఖదుఃఖములు మనోధర్మములు. జగత్తు మిథ్య, జగద్వ్యవహా ములన్నియుఁగల్పితములు, అసత్యములు; కాఁబట్టి దీనియందుఁ దగులుకొనుట బుద్ధిమంతుల పని కాదు. పాపపుణ్యములు దేహేంద్రియముల ధర్మము కావి. ఆత్మది కాదు." అని ఇట్లుపదేశించుచున్నారు. మీ రేదో దీనికి విలక్షణమైన సన్న్యస ధర్మమును చెప్పియున్నారు. మేము దేనిని సత్యమని నమ్మవలయును? దేని నసత్యమని యెంచవలయును?

ఉత్తరము :— ఏమి? వారికి ఉత్తమ కర్మములు గూడ కర్తవ్యములు కావా? చూడుడు: (వైదికైశ్చైవ కర్మభిః) వైదికకర్మములు-ధర్మయుక్తమగు సత్కర్మలు-సన్న్యాసులు కూడ నవశ్యముగ చేయ వలయునని మనువు వ్రాసి యున్నాఁడు. భోజనాచ్ఛాదనాది కర్మములను వారు వదలఁగలరా? ఆ కర్మములను వదలజాలరేని ఉత్తమకర్మములను వదలుటవలన వారు పతితులును, పాపభాగులును గారా? గృహస్థులనుండి అన్న వస్త్రాదులను బొందినపుడు వారికిఁ బ్రత్యుపకారము జేయరేని వారు మహాపాపులు కారా? కంటితోఁ జూచుటయుఁ జెవితో వినుటయు లేకుండెనేని ఆ కన్నును జెవియు ఉండియు నెట్లువ్యర్థములో, అట్లే సత్యోపదేశమును, వేదాది సత్యశాస్త్రముల ఆలోచనా ప్రచారములను జేయఁ డేని ఆ సన్న్యాసియు జగత్తునందు వ్యర్థుఁడును, భారరూపుఁడు నగును. అవిద్యారూప సంసారములో మనమేల మెదడు పాడుచేసికొన వలెనను నిట్టివారుం వ్రాయువారును, జెప్పువారును, ఉపదేశించువారును మిథ్యారూపులును, బాపమును వృద్ధి పఱచువారు నయియున్నవారు. శరీరాదులచేఁ జేయఁబడు కర్మములన్నియు నాత్మవే: దాని ఫలమును బొందునదియు నాత్మయే. జీవుని బ్రహ్మమని దెలుపు వారు అవిద్యయందు నిద్రించుచున్నారు. ఏలయనఁగా జీవుఁడు, అల్పజ్ఞుఁడు. బ్రహ్మము సర్వవ్యాప్తము, సర్వజ్ఞము, నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావయుక్తము. జీవుఁడు ఒకప్పుడు బద్ధుఁడుగను, ఒకప్పుడు ముక్తుఁడుగను ఉండును. బ్రహ్మము సర్వవ్యాప్తము, సర్వజ్ఞము నగుటచే నతనికి భ్రమకాని, అవిద్యకాని యెన్నఁటికిని గలుగఁ జాలదు. జీవునికి నొకప్పుడు విద్యయు నొకప్పుడవిద్యయుఁ గలుగును. బ్రహ్మమునకు జన్మమరణ దుఃఖములులేవు. జీవునికి గలవు. కావున్ట్టి వారియుపదేశము మిథ్య.

ప్రశ్న :— 'సన్న్యాసి సర్వకర్మవినాశి, అగ్నిని మరియు ధాతువులను ముట్టరుఁ అందురు; ఇది సత్యమా?

ఉత్తరము:— కాదు. (సమ్యఙ్నిత్యమాస్తే యస్మిన్ యద్వా సమ్యఙ్న్యస్యంతి దుఃఖాని కర్మాణి యేన స సన్న్యాసః, స ప్రశస్తో విద్యతే యస్య స సన్న్యాసీ) బ్రహ్మమునందు, అతని యాజ్ఞలందు స్థితి కలుగుటచే దుష్కర్మలు వదులుట సన్న్యాసమగును. ఆ యుత్తమ స్వభావము కలవారు సన్న్యాసి యన

బడును. కాఁబట్టి సుకర్మ మొనర్చుచు, దుష్కర్మములను నాశనము చేయుటా నికే సన్న్యాసి యని పేరు.

ప్రశ్న :— అధ్యాపనమును, ఉపదేశమును గృహస్థులు చేయుదురుగదా! సన్న్యాసి వలన ప్రయోజనమేమి?

ఉత్తరము:-సత్యోపదేశము అన్ని ఆశ్రమముల వారును జేయవలసినదే; వినవలసినదే; కాని సన్న్యాసి కీపక్షపాతములేక మెలఁగఁగలుగునంతఅవకాశము గృహస్థునికిఁ కలుగఁజాలదు. పురుషుఁడు పురుషులకును, స్త్రీ స్త్రీలకును, సత్యోపదేశము చేయుటయుఁ జదివించుటయు బ్రాహ్మణులపనియేకాని సంచారము చేయుటకు సన్న్యాసికిఁజిక్కునంత అవకాసము గృహస్థ బ్రాహ్మణాదుల కెన్నఁటికిని చిక్కఁజాలదు. బ్రాహ్మణులు వేదవిరుద్ధముగా నాచరించిరేని వారిని సన్న్యాసియే నియమించును. కాఁబట్టి సన్న్యాసియుండుట యుచితము.

ప్రశ్న :— 'ఏకరాత్రింవసేద్గ్రామే' [నారదపరి. ఉప ౪.౧౪]ఇత్యాది వచనములచే సన్న్యాసి యొకచోట నొకరాత్రి మాత్రమే యుండవలయును; అధికముగా నివాసము చేయఁ గూడదు కదా?

ఉత్తరము :— ఇది కొన్నియంశములయందు బాగుగనే యున్నయది. ఏలయనఁగా ఒకచోటనే యుండుటచే జగత్తునకు నుపకార మధికముగాఁ గలుగఁజాలదు. స్థానాభిమానమునుగలుగును. రాగద్వేషములును అతిశయించును. కాని యొకచోటనే యుండుటచే విశేషోపకారము కలుగనుండెనేని, జనకమహారాజునొద్ద నాలుగుమాసములవఱకు పంచశిఖాదులును, సంవత్సరములకొలఁది యితర సన్న్యాసులును నివసించుచుండినట్లు లుండవచ్చును. సన్న్యాసి యొకచోటనుండఁగూడ దనుమాట ఈ కాలపు పాషండులు - స్వార్థులును సంప్రదాయులు నగువారు-గల్పించినది. ఏలయనఁగా సన్న్యాసి యొకచోట నధికముగా నుండెనేని, వారి పాషండము ఖండింపఁబడి యధికముగా పెంపొందదు.

యతీనాం కాంచనం దద్యాత్తాంబూలం బ్రహ్మచారిణామ్।
చౌరాణామభయం దద్యాత్స నరో నరకం వ్రజేత్॥ [రా. పారాశరీ. అ. ౧ శ్లో. ౬౦]

ప్రశ్న :— సన్న్యాసులకు సువర్ణదాన మిచ్చుదాత నరకమును బొందునని దీని యభిప్రాయము. ఇది సత్యమా?

ఉత్తరము:— ఇదియును వర్ణాశ్రమవిరోధులును, సాంప్రదాయులును, స్వార్థులు నగు పౌరాణికులు కల్పించినదే. ఏలయనఁగా సన్న్యాసులకు ధనమిచ్చె నేని వారు వీరి పాషండమును విశేషముగ ఖండన చేయఁగలుగుదురు. వీరికి నష్టము కలుగును. ఈ పౌరాణికుల యధీనమందుండువారు సన్న్యాసుల భిక్షాది వ్యవహారములు తమ యధీనమందుండునేని వారు తమకు భయపడుచుందురను నుద్దేశముతోఁ బౌరాణికులీ శ్లోకమును గల్పించియున్నారు. మూర్ఖులకు స్వార్థులకుఁగూడ దానమిచ్చుట మంచిదని యెంచుచున్నపుడు విద్వాంసులును బరోపకారులు నగు సన్న్యాసులకు దానమిచ్చుటచేత నాదోషము కలుగును? ఎన్నఁటికిని గలుగఁజాలదు. చూడుడు:—

వివిధాని చ రత్నాని వివిక్తేషూపపాదయేత్॥ మను. ౧౧.౬॥

నానా ప్రకారములగు రత్నసువర్ణాది ధనములు(వివిక్తులకు)సన్న్యాసులకీయఁబడవలయునని మనువు వ్రాసియున్నాఁడు. కాఁబట్టి పౌరాణికులు గల్పించిన శ్లోకము అనర్థకము. ఏలయనఁగా సన్న్యాసికి సువర్ణదానము చేయుటచే యజమానుఁడు నరకమునకుఁ బోవునేని వెండి, ముత్యములు, వజ్రములు మొదలగునవి దానము చేసెనేని స్వర్గమునకుఁ బోఁగలుగునుగదా!

ప్రశ్న:— పై శ్లోకములో 'యతిహస్తే ధనం దద్యాత్' అని చెప్పవలసియుండెను. అనఁగా సన్న్యాసి చేతియందు ధనముఁ బెట్టువారు నరకమునకుఁ బోవుదురు.

ఉత్తరము:— పామరుల కపోలకల్పితమగు నీ వచనమును అనర్థకమే. ఏలయనఁగా చేతియందు ధనము పెట్టుటచే దాత నరకమునకుఁ బోవునేని, కాళ్ళమీదఁ బెట్టినను, మూటగట్టి యిచ్చినను స్వర్గమునకుఁ బోవును. కాఁబట్టి యిట్టి కల్పనలు విశ్వాసార్హములుకావు. కాని సన్న్యాసి తన యోగక్షేమమునకంటె నధికముగా నుంచుకొనెనేని చోరాదులచేఁ బీడితుఁడును, మోహితుఁడు నగుట కొంత నిజము. కాని విద్వాంసుఁ డగువాఁడు ఎన్నఁటికిని అయుక్త వ్యవహారమును జేయఁడు. మోహము నందును దగులువడఁడు. ఏలయనఁగా అతఁడు మొదట గృహాశ్రమమందుఁ గాని, బ్రహ్మచర్యమందు గాని, అన్నిఁటి ననుభవించియుండును; లేదా చూచియుండును. బ్రహ్మచర్యమునుండి సన్న్యాసియయినవాఁడు పూర్ణవైరాగ్యయుక్తుఁ డగుటచే నెన్నఁటికిని దేనియందును దగులువడఁడు.

ప్రశ్న :— శ్రాద్ధమందు సన్న్యాసి వచ్చినను, భుజించినను, ఆ గృహస్థుని పితరులు పరుగెత్తుకొని పోదురనియు నరకమునందుఁ బడుదురనియు లోకులు చెప్పుచున్నారు; ఇది సత్యమా?

ఉత్తరము:— మొదట చచ్చిన పితరులు వచ్చుటయు, చేసిన శ్రాద్ధము చచ్చిన పితరులకు జెందుటయు నసంభవమును, వేదమునకును యుక్తికిని విరుద్ధము నగుటచే నసత్యము. రాకయే పోయినపుడు పరుగెత్తుకొనిపోవువారెవరు? మరణమునొందినపిమ్మట జీవులు తమ పాపపుణ్యానుసారముగ ఈశ్వర వ్యవస్థచే జన్మము నొందుచున్నారు. వా రెట్లు రాఁగలుగుదురు? కాఁబట్టి యిదియును గుతింరులగు పౌరాణికులయు, బైరాగులయు మిథ్యాకల్పన. వేదాది శాస్త్రములకు విరుద్ధమగు మృతక శ్రాద్ధముఁ జేయునపుడు అక్కడికి సన్న్యాసి పోఁదటస్థించెనేని యా పాషండత యంతయు దూరముగాఁ బరుగెత్తుకొనిపోవు ననుట నిశ్చయమే.

ప్రశ్న:— బ్రహ్మచర్యమునుండి సన్న్యాసమును గ్రహించునతఁడు నిర్వహించుట కఠినము. అట్లే కామవేగము నాపుట అంతకంటె కఠినము. కాఁబట్టి గృహాశ్రమ వానప్రస్థములకుఁ బిమ్మట వృద్ధుఁడయినపుడు సన్న్యాసము గ్రహించుట యుచితము.

ఉత్తరము:- నిర్వహింపఁజాలనివాఁడును, ఇంద్రియవేగము నాపఁజాలనివాఁడును బ్రహ్మచర్యమునుండి సన్న్యాసి గానక్కఱలేదు. కాని ఆఁపఁజాలినవాఁ డేల సన్న్యాసి గాఁగూడదు? విషయముల దోషములను వీర్యగుణమును దెలిసియున్న యతఁడు విషయాసక్తుఁ డెన్నఁటికినిఁగాఁజాలఁడు. అతని వీర్యము ఆలోచనాగ్ని కింధనమువలె నుండును. అనఁగా దానియందే వ్యయమగును. వైద్య-ఔషధముల యావశ్యకత రోగి కున్నట్లు నీ రోగికుండదు. ఏ స్త్రీపురుషుల ప్రయోజనము విద్యాధర్మములు వృద్ధిపఱచుటయు, లోకమునకంతటికి నుపకార మొనర్చుటయు నగునో, వారు పంచశిఖాది పురుషులవలె, గార్గి మొదలగు స్త్రీలవలె వివాహము జేసికొనక యుండవచ్చును; కాఁబట్టి సన్న్యాసమును గ్రహించుట అధికారుల కుచితము. అనధికారులు సన్న్యాసమును గ్రహించిరేని, తాము మునుఁగుటయే కాక యితరులను గూడ ముంచివేయుదురు. చక్రవర్తియగు రాజు, (సమ్రాట్) అయినట్లు సన్న్యాసి (పరి

(వ్రాట్)అగుచున్నాఁడు. రాజు తన దేశమందును లేదా తనవారితోను సత్కారమును బొందును. కాని సన్న్యాసి సర్వత్ర పూజితుఁడగును.

విద్వత్త్వం చ నృపత్వం చ నైవ తుల్యం కదాచన।
స్వదేశే పూజ్యతే రాజా విద్వాన్ సర్వత్ర పూజ్యతే॥ చాణక్యనీతి సార. శ్లో. ౧॥

విద్వాంసునితో రాజెన్నఁటికిని సమానుఁడు కాఁజాలఁడు. ఏల యనఁగా రాజు తన రాజ్యమందే మన్నన, సత్కారములను బొందును. విద్వాంసుఁడు సర్వత్ర గౌరవమును బ్రతిష్ఠను బొందును.

కాఁబట్టి విద్యను జదువుట, సుశిక్షను బొందుట, బలవంతుఁడగుట అను నీ మొదలగువాని కొఱకే బ్రహ్మచర్యము. అన్నివిధములగు నుత్తమ వ్యవహారములను సాధించుకొనుటకు గృహస్థము. ఆలోచనమును, ధ్యానమును, విజ్ఞానమును వృద్ధిపఱుచుకొనుటకును దపశ్చర్య చేయుటకును వానప్రస్థము. వేదాది సత్యశాస్త్రముల ప్రచారము, ధర్మవ్యవహార గ్రహణము, దుష్టవ్యవహారత్యాగము, సత్యోపదేశము, అందఱ సందేహములు తీర్చుట మొదలగువానికొఱకు సన్న్యాసాశ్రమము. కాని ఈ సన్న్యాసమునకు ముఖ్య ధర్మమగు సత్యోపదేశాదులను జేయనివాఁరు పతితుఁడును, నరకగామియు నగుచున్నాఁడు. కాఁబట్టి సత్యోపదేశముచే శంకా సమాధానములను, వేదాది సత్యశాస్త్రముల అధ్యాపనమును, అనఁగా చదివించుటయును, వేదోక్త ధర్మ వృద్ధియును, ప్రయత్నపూర్వకముగఁ జేయుచు లోకమున కున్నతిఁ గలిగించుట సన్న్యాసుల కుచితము.

ప్రశ్న:- సన్న్యాసికంటె నన్యులగు సాధువులు, బైరాగులు, ధన్మధారులు మొదలగువారు కూడ సన్న్యాసాశ్రమమందు లెక్కింపఁబడుదురా లేదా?

ఉత్తరము:- లేదు. ఏలయనఁగా వారియందు సన్న్యాసలక్షణ మేదియుఁ గనఁబడదు. వారు వేదవిరుద్ధమార్గమందుఁ బ్రవృత్తులై వేదమునకంటె నెక్కువగాఁ దమ సంప్రదాయమును. దమ యాచార్యుల వచనములను నమ్ముచున్నారు. తమ మతమునే ప్రశంసించుచు మిథ్యా ప్రపంచమందుఁ దగులు కొని తమ స్వార్థముకొఱకే యితరులనుగూడఁ దమతమ మతమందుఁ దగుల వడఁ జేయుచున్నారు. సవరించుమాట యటుండఁగా సంసారమును భ్రమింపఁ జేసి యధోగతిని బొందించుచు దమ ప్రయోజనసిద్ధి మాత్రము జేసికొను

చున్నారు. కాఁబట్టి వీరిని సన్న్యాసాశ్రమమందు లెక్కింపఁగూడదు. వీరిని కేవలము స్వార్థాశ్రమములో గణింపనగును. దీనికి సందేహము లేదు.

తాము స్వయముగ ధర్మమందు నడచుచు లోకమును ధర్మమందు నడపుచుఁ దామును సమస్తలోకమును ఈ జన్మమందును, రాఁబోవు జన్మమందును, స్వర్గమును-సుఖమును-అనుభవించుచు ననుభవింపఁ జేయుచు నుండు ధర్మాత్ములే సన్న్యాసులును, మహాత్ములు నయి యున్నారు.

సంక్షేపముగ నీ సన్న్యాసాశ్రమ విధి వ్రాయబడినది. ఇకముందు రాజప్రజాధర్మ విషయము వ్రాయబడును.

శ్రీమద్దయానంద సరస్వతీస్వామి కృతమును
సుభాషావిభూషితము నగు సత్యార్థప్రకాశమున
వానప్రస్థ, సన్న్యాసాశ్రమ విషయము గల
పంచమ సముల్లాసము సంపూర్ణము

---

# షష్ఠ సముల్లాసము

## రాజధర్మములు

రాజధర్మాన్ ప్రవక్ష్యామి యథావృత్తో భవేన్నృపః।
సంభవశ్చ యథా తస్య సిద్ధిశ్చ పరమా యథా॥ మను. ౭.౧॥

మహారాజగు మనువు ఋషులతో చెప్పుచున్నాఁడు :— ఋషులారా ! నాలుగువర్ణములయు, నాలుగు ఆశ్రమములయు వ్యవహారమును జెప్పినపిమ్మట. నీఁక రాజధర్మమును జెప్పుచున్నాను. రాజు ఎట్టివాఁడు గావలయును ; ఎట్లు కాఁగల్గును ; అతని కెట్లు పరమసిద్ధి ప్రాప్తించును ; వీని నన్ని విధములఁ జెప్పెదను.

బ్రాహ్మం ప్రాప్తేన సంస్కారం క్షత్రియేణ యథావిధి।
సర్వస్యాస్య యథాన్యాయం కర్తవ్యం పరిరక్షణమ్॥ మను. ౭.౨॥

పరమ విద్వాంసుఁడు బ్రాహ్మణుఁ డగునట్లే విద్వాంసుఁడును సుశిక్షితుఁడును అయి క్షత్రియుఁడు సమస్తరాజ్యరక్షణమును న్యాయముగా-యథారీతివి-జేయఁదగును.

రాజ్యపరిపాలనా క్రమము :—

త్రీణి రాజానా విదథే పురూణి పరి విశ్వాని భూషథః సదాంసి॥
ఋ॥ మం। ౩. సూ. ౩౮. మం. ౬॥

ఈశ్వరుఁడి ట్లుపదేశించుచున్నాఁడు :—(రాజానా) రాజును, ప్రజలును, గలిసి (విదథే) సుఖప్రాప్తికారకమును, విజ్ఞానవృద్ధికారకము నగు రాజప్రజా సంబంధరూపవ్యవహారమందు (త్రీణిసదాంసి)మూఁడు సభలను(విద్యార్యసభ, ధర్మార్యసభ, రాజార్యసభలను) నియమించుకొని(పురూణి)నానాప్రకారములను (విశ్వాని)సమగ్ర ప్రజారూపులగు మనుష్యాదిప్రాణులను (పరిభూషథః) అన్ని విధములవిద్య, స్వాతంత్ర్యము, ధర్మము, సుశిక్ష, ధనము మున్నగు వానిచే నలంకరింపవలయును.

తం సభా చ సమితిశ్చ సేనా చ॥ అథర్వ। కాం. ౧౫. అను. ౨ వ ౯.మం ౨॥

(తమ్) ఆ రాజధర్మమును (సభా చ) మూఁడు సభలును (సమితిశ్చ) సంగ్రామాదుల వ్యవస్థయు (సేనా చ) సేనయుఁ గలసి పాలింపవలయును.

సభ్య సభాం మే పాహి యే చ సభ్యాః సభాసదః ॥
అథర్వ॥ కాం. ౧౯. అను. ౭. వ. ౫౫. మం. ౬॥

రాజుసభాసదులతో (సభ్య) సభకు యోగ్యుఁడవగు ముఖ్య సభాసదుఁడా! నీవు (మే) నా (సభామ్) ధర్మయుక్తసభావ్యవస్థ (పాహి) పాలింపుము. అని ఆజ్ఞాపింపవలయును. (యే చ) ఎవరు (సభ్యాః) సభకు యోగ్యులగు(సభాసదః) సభాసదులో వారు సభావ్యవస్థను పాలింపవలయును. ఇట్లు చేయుట సభాసదులకును రాజునకును యోగ్యము. రాజ్యమున స్వతంత్రాధికార మొకని కెప్పుడు నీయఁగూడదు. కాని సభాపతియగు రాజాధీనమందు సభయు, సభాధీనమందు రాజును, రాజును సభయు ప్రజల యధీనమందును, ప్రజలు రాజసభకు అధీనమందు నుండవలయును.

అట్లు చేయక పోయిరేని :—

రాష్ట్రమేవ విశ్యాహంతి తస్మా ద్రాష్ట్రీ విశం ఘాతుకః ।
విశమేవ రాష్ట్రాయాద్యాం కరోతి తస్మాద్రాష్ట్రీ విశమత్తి న
పుష్టం పశుం మన్యత ఇతి॥ శత. కాం. ౧౩. ప్ర. ౨. బ్రా. ౩. కం. ౭. ౮॥

రాజవర్గము ప్రజలకు లోఁబడక స్వతంత్రముగా-స్వాధీనముగా-ఉండెనేని (రాష్ట్రమేవ విశ్యాహంతి) రాజ్యమందుఁ బ్రవేశించి ప్రజలను నాశము చేయును. కాఁబట్టి కేవలము ఒక్కఁడే-స్వతంత్రుఁడు-రాజయ్యేనేని అతఁడు స్వాధీనుఁడుగాని, ఉన్మత్తుఁడుగాని అయి (రాష్ట్రీవిశం ఘాతుకః) ప్రజలకు నాశకుఁడగుచున్నాఁడు. ఆ రాజు(విశమేవ రాష్ట్రాయాద్యాం కరోతి)ప్రజలను దినిపేయును. (మిక్కిలి పీడించుననుట) కాబట్టి రాజ్యమందొక్కనికే సర్వాధికార ముండఁగూడదు. సింహము కాని క్రూరమృగము మాంసాహారియుకాని చక్కగా బలిసియున్న పశువును జంపి తినివేయునట్లే (రాష్ట్రీ విశమత్తి) స్వతంత్రరాజు ప్రజలను నాశముఁజేయును. ఎవనిని గాని తనకంటె నధికుని గానీయఁడు. శ్రీమంతుని దోచుకొనియు నన్యాయముచే దండుగఁగొనియుఁ దన ప్రయోజనమును బూర్తిచేసికొనును.

ఇంద్రో జయాతి న పరా జయాతా అధిరాజో రాజసు రాజయాతై।
చర్కృత్య ఈడ్యో వంద్యశ్చోపసద్యో నమస్యో భవేహ
అథర్వ॥ కాం ౬. అను. ౧౦. వ. ౯౮. మం. ౧॥

ఓ మనుష్యులారా! ఎవఁడు (ఇహ) ఈ మనుష్యసముదాయమందు (ఇంద్రః) పరమైశ్వర్యకర్తయు, శత్రువులను (జయాతి) జయింపఁగల వాఁడును (న పరాజయాతై) శత్రువులచేఁ బరాజితుఁడు కానివాఁడును (రాజను) రాజులలో (అధిరాజః) సర్వోపరి విరాజమానుఁడును (రాజయాతై) ప్రకాశమానుఁడును (చర్కృత్యః) సభాపతియగుట కత్యంత యోగ్యుఁడును (ఈడ్యః) ప్రశంసనీయ గుణకర్మస్వభావ యుక్తుఁడును (వంద్యః) సత్కరణీయుఁడును (చోపసద్యః) సమీపించుటకును, శరణు చొచ్చుటకును యోగ్యుఁడును (నమస్యః) అందఱకు మాననీయుఁడును (భవ) అగునో అతనినే సభాపతిగా రాజుగాఁ జేసికొనవలయును.

ఇమం దేవా అసపత్నగ్ం సువధ్వం మహతే క్షత్రాయ మహతే
జ్యైష్ఠ్యాయ మహతే జాన రాజ్యాయేన్ద్రస్యేంద్రియాయ॥ యజు.౯.౪౦॥

(దేవాః) విద్వాంసులగు జనులారా! మీరు (ఇమం) ఇట్టి పురుషుని (మహతే క్షత్రాయ(గొప్ప చక్రవర్తి రాజ్యముకొఱకును(మహతే జ్యైష్ఠ్యాయ) అందఱకంటె గొప్పవాఁడగుట కొఱకును (మహతే జానరాజ్యాయ) గొప్ప గొప్ప విద్వాంసులతోఁ గూడిన రాజ్యమును బాలించుట కొఱకును (ఇంద్రస్య ఇంద్రియాయ) పరమైశ్వర్యవంతమగు రాజ్యమును, ధనమును బాలించుట కొఱకు, (అసపత్నగ్ం సువధ్వం) సర్వత్ర పక్షపాతరహితుఁడును, పూర్ణ విద్యావినయవంతుఁడును, అందఱకును మిత్రుఁడును నగు సభాపతి రాజును సమ్మతిపూర్వకముగా సర్వాధీశునిగా నెంచి సమస్తభూగోళమును శత్రురహితముగాఁ జేయుఁడు.

స్థిరా వః సన్త్వాయుధా పరాణుదే వీడూ ఉత ప్రతిష్కభే।
యుష్మాకమస్తు తవిషీ పనీయసీ మా మర్త్యస్య మాయినః॥
ఋ. మం. ౧. సూ. ౩౯. మం. ౨॥

ఈశ్వరుఁ డిట్లు ఉపదేశించుచున్నాఁడు:—

రాజపురుషులారా! మీరు సదా విజయమును బొందునట్లు (వః) మీ (ఆయుధాః) ఆగ్నేయాద్యస్త్రములు, శతఘ్ని అనఁగా ఫిరంగి, తుపాకి, ధనుస్సు, బాణము, కత్తి మొదలగు శస్త్రములు శత్రువులను (పరాణుదే)

ఓడించుటకును (ఉత ప్రతిష్కృభే) అడ్డగించుటకును (వీడూ) ప్రశంసితములును (స్థిరాః) దృఢములును (సంతు) అగుఁగాక. (యుష్మాకం) మీయొక్క (తవిషీ) సేనయు (పనీయసీ) ప్రశంసనీయమైనది (అస్తు) అగునుగాక. కాని (మా మర్త్యస్య మాయినః) నిందితమగు అన్యాయరూప కార్యముల నొనర్చు వారికొఱకు (పూర్వోక్త వస్తువులట్లు గాకుండునుగాక) అనఁగా మనుష్యుఁడు ధార్మికుఁడుగా నుండునంతకు రాజ్యము వృద్ధియగుచు నుండును. దుష్టాచారి యయ్యెనేని నష్టము భ్రష్టము నయిపోవును. మహావిద్వాంసులను విద్యా సభాధికారులుగను, ధార్మిక విద్వాంసులను ధర్మ సభాధికారులుగను, ప్రశంసనీయు లయిన ధార్మిక పురుషులను రాజసభకు సభాసదులుగను, వీ రందఱియందును సర్వోత్తమ గుణకర్మ స్వభావములుగల మహాపురుషుని రాజసభకుఁ బతి రూపుఁడుగను, ఎంచి అన్నివిధముల నున్నతిని బొందవలయును. మూఁడు సభల సమ్మతిచే రాజనీతికి జెందిన యుత్తమనియమము లేర్పఱుపఁ బడవల యును. ప్రజ లానియమముల కధీనులై వర్తిల్లవలయును. అందఱకును హితకారకములగు కార్యములు సమ్మతింపవలయును. సర్వహిత మొనర్చుటకుఁ బరతంత్రులయి, ధర్మయుక్త కార్యములందు – తమ తమ కార్యములందు– స్వతంత్రులయి యుండవలయును.

**సభాపతి గుణములు :-**

> ఇంద్రానిలయమార్కాణామగ్నేశ్చ వరుణస్య చ।
> చంద్రవిత్తేశయోశ్చైవ మాత్రా నిర్హృత్య శాశ్వతీః॥ మను. ౭-౪ ॥

ఆ సభేశుఁడగు రాజు. ఇంద్రునివలె–విద్యుత్తువలె–శీఘ్రముగా నైశ్వర్యమును కూర్చువాఁడును, వాయువువలె నందఱకును ప్రాణప్రియుఁడును హృదయమును దెలియువాఁడును, యమునివలెఁ బక్షపాతరహితుఁడై న్యాయాధీశునివలె వర్తించువాఁడును, సూర్యునివలె న్యాయమును, ధర్మమును, విద్యను ప్రకాశపఱచువాఁడును, అంధకారమును అనఁగా అవిద్య, అన్యాయములను నిరోధించు వాఁడును, అగ్నివలె దుష్టులను భస్మముచేయువాఁడును, వరుణుని వలె–కట్టివేయువానివలె–దుష్టులను అనేక ప్రకారములఁ గట్టువాఁడును, చంద్రుని వలె శ్రేష్ఠులను ఆనందపఱచువాఁడును, ధనాధ్యక్షునివలె బొక్కసమును నింపు వాఁడును గావలయును.

తప త్యాదిత్యవచ్చైష చక్షూంషి చ మనాంసి చ।
న చైనం భువి శక్నోతి కశ్చిద ప్యభివీక్షితుమ్॥ మను ౭. ౬॥

సూర్యునివంటి ప్రతాపియు, అందఱియొక్క లోపలివెలుపలి మనస్సును తన తేజముచేఁ దపింపఁజేయువాఁడు, పృథివియందు, అన్యులచే కన్నెత్తియైన జూడ శక్యము కానివాఁడు.

సోఽగ్నిర్భవతి వాయుశ్చ సోఽర్కః సోమః స ధర్మరాట్।
స కుబేరః స వరుణః స మహేంద్రః ప్రభావతః॥మను ౭-౭॥

తనంతట నగ్నియు, వాయువును, సూర్యుఁడును, సోముఁడును ధర్ముఁడును, ప్రకాశకుఁడును, ధనవర్ధకుఁడును, దుష్టులను బంధించువాఁడును, గొప్ప యైశ్వర్యవంతుఁడును అగు నతఁడే సభాధ్యక్షుఁడును, సభేశుఁడు నగుటకు యోగ్యుఁడు.

నిజమైన రాజెవరు ?

స రాజా పురుషో దండః స నేతా శాసితా చ సః।
చతుర్ణా మాశ్రమాణాం చ ధర్మస్య ప్రతిభూః స్మృతః॥ మను ౭-౧౭॥

దండమే పురుషుఁడు; రాజు; అదియే న్యాయమును ప్రచారము చేయునది, అదియే అందఱను శాసించునది, అదియే నాలుగువర్ణములయు, నాలుగు ఆశ్రమములయు ధర్మమునకు (ప్రతిభువు) పూటపడునది.

దండః శాస్తి ప్రజాః సర్వా దండ ఏవాభిరక్షతి।
దండః సుప్తేషు జాగర్తి దండం ధర్మం విదు ర్బుధాః॥౭-౧౮॥

అదియే ప్రజలను శాసించునది, ప్రజల నందఱను రక్షించునది, అదియే నిదురించుప్రజలలో మేలుకొని యుండునది. కాఁబట్టియే బుద్ధిమంతులు దండమునే ధర్మమందురు.

సమీక్ష్య స ధృతః సమ్యక్ సర్వా రంజయతి ప్రజాః।
అసమీక్ష్య ప్రణీత స్తు వినాశయతి సర్వతః॥ ౭-౧౯॥

దండము బాగుగా విచారించి ధరింపబడెనేని ప్రజల నందఱను ఆనంద పఱచును. అది విచారింపక నడుపబడెనేని అన్ని విధముల నది యా రాజునే వినాశపఱచును.

దుష్యేయుః సర్వవర్ణాశ్చ భిద్యేరన్ సర్వసేతవః।
సర్వలోక ప్రకోపశ్చ భవేద్దండస్య విభ్రమాత్ ॥ ..—౨౪॥

దండము లేదేని వర్ణములన్నియు దూషితములయి, మర్యాదలన్నియు ఛిన్నభిన్నము లయిపోవును. యథారీతిని దండము లేకపోవుటచే నందఱు ప్రకోపులగుదురు.

యత్ర శ్యామో లోహితాక్షో దండశ్చరతి పాపహా।
ప్రజాస్తత్ర నముహ్యంతి నేతా చేత్సాధు పశ్యతి॥ "—౨౫॥

నల్లని వన్నెయు నెఱ్ఱని నేత్రములు గల భయంకరపురుషునివలె పాపమును నాశనముచేయు దండము విచరించుచోవున ప్రజలు మోహము నొందక, ఆనందితు లగుదురు. కాని ఆ దండమును ప్రయోగించువాఁడు పక్షపాతరహితుఁడగు విద్వాంసుఁడుగా నుండవలయును.

తస్యాహుః సంప్రణేతారం రాజానం సత్యవాదినమ్।
సమీక్ష్య కారిణం ప్రాజ్ఞం ధర్మ కామార్థకోవిదమ్॥"—౨౬॥

సత్యవాదియు, విచారించి చేయువాఁడును, బుద్ధిమంతుఁడును, ధర్మార్థకామములను సాధించుటయందుఁ బండితుఁడును, అగు రాజే ఆ దండమును ప్రయోగించుటకు యోగ్యుఁడని విద్వాంసులందురు.

తం రాజా ప్రణయన్సమ్యక్ త్రివర్గేణాభివర్ధతే।
కామాత్మా విషమః క్షుద్రో దండేనైవ నిహన్యతే। "—౨౭॥

దండమును బాగుగా ప్రయోగించు రాజు ధర్మార్థకామముల సిద్ధిని వర్ధిల్లఁజేయును. విషయలంపటుఁడును, కుటిలుఁడును, ఈర్ష్యగలవాఁడును, క్షుద్రుఁడును, నీచబుద్ధియు నగురాజు న్యాయాధీశుఁ డయ్యేనేని అతఁడు దండముచేతనే కొట్టఁబడును.

దండో హి సుమహత్తేజో దుర్ధరశ్చాకృతాత్మభిః।
ధర్మాద్విచలితం హంతి నృపమేవ సబాంధవమ్॥ "—౨౮॥

దండము మిక్కిలి తేజోమయ మయినపుడు దానిని అవిద్వాంసులును, అధర్మాత్ములును ధరింపఁజాలరు. అప్పుడా దండమే ధర్మరహితుఁడగు రాజును కుటుంబయు క్రమముగా నాశనము చేసివేయును.

సోఽసహాయేన మూఢేన లుబ్ధేనాకృతబుద్ధినా।
న శక్యో న్యాయతో నేతుం సక్తేన విషయేషు చ॥"—౩౦॥

ఏలయనఁగా ఆప్తపురుషుల సహాయము, విద్యాసుశిక్షలు లేక విషయములయం దాసక్తుఁడగు మూర్ఖుఁడు న్యాయముచే దండమును బ్రయోగింప నసమర్థుఁడగును.

శుచినా సత్యసంధేన యథా శాస్త్రానుసారిణా।
ప్రణేతుం శక్యతే దండః సుసహాయేన ధీమతా॥ "-౩౧॥

పవిత్రాత్ముఁడును, సత్యాచారుఁడును, సత్పురుషులతో సాంగత్యముచేయువాఁడును, నీతిశాస్త్రము విధిపూర్వకముగ ననుసరించి నడుచు వాఁడును, శ్రేష్ఠపురుషుల సహాయము గలవాఁడును, బుద్ధిమంతుఁడును నగు న్యాయాధీశుఁడే దండమును బ్రయోగింప సమర్థుఁడు.

సైనాపత్యం చ రాజ్యం చ దండనేతృత్వమేవ చ।
సర్వలోకాధిపత్యం చ వేదశాస్త్రవిదర్హతి॥ మను-౧౨.౧౦౦॥

సమస్త సేనలమీఁదను సేనాధిపతులమీఁదను అధికారము, రాజ్యాధికారము, సమస్తకార్యములందు దండన వ్యవస్థాధిపత్యము, అన్నిఁటికి మీఁద వర్తించు సర్వాధీశరాజ్యాధికారము, ఈ నాలుగధికారములయందు సంపూర్ణముగ వేదశాస్త్రములందుఁ బ్రవీణులును, పూర్ణ విద్యావంతులును, ధర్మాత్ములును, జితేంద్రియులును, సుశీలురును నగువారిని నియమింపవలయును. అనఁగా ముఖ్య సేనాధిపతి, ముఖ్య న్యాయాధీశుఁడు, ముఖ్యరాజ్యాధికారి యను ప్రధాని, రాజు ఈ నలుగురు సమస్త విద్యలయందుఁ బూర్ణ విద్వాంసులుగ నుంచవలయును.

దశావరా వా పరిషద్యం ధర్మం పరికల్పయేత్।
త్ర్యవరా వాపి వృత్తస్థా తం ధర్మం న విచాలయేత్॥ "-౧౧౦॥

అధమము పదుగురు విద్వాంసులయు లేదా అంతకంటె కనీస పక్షమున ముగ్గురు విద్వాంసుల సభ చేసిన వ్యవస్థను-ఆ ధర్మమును-ఎవరు నుల్లంఘింపఁగూడదు.

త్రైవిద్యో హైతుకస్తర్కీ నైరుక్తో ధర్మపాఠకః।
త్రయశ్చాశ్రమిణః పూర్వే పరిషత్స్యాద్దశావరా॥ "—౧౧౧॥

ఈ సభయందు నాలుగువేదములు, న్యాయశాస్త్రము, నిరుక్తము, ధర్మశాస్త్రము మొదలగువానిని దెలిసిన విద్వాంసులు సభాసదులుగ నుండవలయును.

కాని, వారు బ్రహ్మచారులు, గృహస్థులు, వానప్రస్థులుగా నుండిరేని అప్పుడు కనీసపక్షమున పదుగురు విద్వాంసులు గల సభ కావలయును.

> ఋగ్వేదవిద్యజుర్విచ్చ సామవేదవిదేవ చ।
> త్ర్యవరా పరిషజ్జ్ఞేయా ధర్మసంశయ నిర్ణయే॥ "—౧౧౨॥

ఋగ్వేదమును, యజుర్వేదమును, సామవేదమును దెలిసిన ముగ్గురు సభాసదులుగల సభచేయు వ్యవస్థ నెవరు నుల్లంఘింపఁగూడదు.

> ఏకోఽపి వేదవిద్ధర్మం యం వ్యవస్యేద్ద్విజోత్తమః।
> స విజ్ఞేయః పరో ధర్మో నాజ్ఞానాముదితోఽయుతైః॥ మను౧౨—౧౧౩॥

వేదములనన్నిఁటినిఁ దెలిసినవాఁడును, ద్విజులలో నుత్తమసన్న్యాసియు నగు నతఁడొక్కఁడైనను జేసిన ధర్మవ్యవస్థ శ్రేష్ఠధర్మము. అజ్ఞానులు వేల కొలఁదియు, లక్షలకొలఁదియుఁ, గోట్లకొలఁదియుఁ గలిసిచేసినను ఆ వ్యవస్థ విశ్వాసార్హమైనది కాదు

> అవ్రతానా మమంత్రాణాం జాతిమాత్రోపజీవినామ్।
> సహస్రశః సమేతానాం పరిషత్త్వం న విద్యతే॥ "—౧౧౪॥

బ్రహ్మచర్యముగాని, సత్యభాషణాది వ్రతములుగాని, వేదవిద్యగాని, ఆలోచనముగాని, లేక శూద్రులవలె వర్తించు ద్విజాత్యభిమానులు వేలకొలఁదిగఁ జేరినను అది సభ యనఁబడదు

> యం వదంతి తమోభూతా మూర్ఖా ధర్మమతద్విదః।
> తత్పాపం శతధా భూత్వా తద్వక్తౄననుగచ్ఛతి॥ మను ౨.౧౧౫॥

అవిద్యావంతులును, మూర్ఖులును, వేదములను దెలియనివారును జెప్పు ధర్మము నెన్నటికిని నమ్మఁగూడదు. ఏలయనఁగా మూర్ఖులు చెప్పిన ధర్మము ననుసరించువారు అనేకములగు పాపములకు లోనగుదురు.

కావున మూఁడు సభలయందు "అనఁగా విద్యాసభ, ధర్మసభ, రాజసభలయందు" మూర్ఖుల నెన్నఁడును జేర్పఁగూడదు. సర్వదా విద్వాంసులను ధార్మిక పురుషులను మాత్రమే నియమింపవలయును.

> త్రైవిద్యేభ్యస్త్రయీం విద్యాం దండనీతం చ శాశ్వతీమ్।
> ఆన్వీక్షికీం చాత్మవిద్యాం వార్తారంభాంశ్చ లోకతః॥ మను—౭—౪౩॥

నాలుగు వేదములందలి కర్మోపాసనాజ్ఞానవిద్యలను దెలిసినవారి నుండి ఈ మూఁడు విద్యలను, సనాతనదండనీతిని, న్యాయవిద్యను, ఆత్మ విద్యను-

అనఁగా పరమాత్మగుణకర్మస్వభావముల నున్నదున్నట్లు తెలిసికొనగల బ్రహ్మ విద్యను, లోకవార్తల యారంభమును (జనులతో వ్యవహరించుట) నేర్చుకొనినవాఁడు సభాసదుఁడుకాని సభాపతికాని కాఁగలఁడు.

ఇంద్రియాణాం జయే యోగం సమాతిష్ఠేదివానిశమ్।
జితేంద్రియో హి శక్నోతి వశే స్థాపయితుం ప్రజాః॥ –౪౪॥

సభాసదులందఱును, సభాపతియు ఇంద్రియములను జయించి తమ వశమందుంచుకొని సర్వదా ధర్మమునందే వర్తిల్లుచు సధర్మమునుండి తొలఁగియుఁ దొలఁగింపఁబడియు నుండవలయును. కాఁబట్టి రేయింబగళ్లు నియతసమయము లయందు యోగాభ్యాసమును జేయుచుండవలయును. ఏలయనఁగా జితేంద్రియుఁడయి తన యింద్రియములను (మనఃప్రాణశరీరరూప) ప్రజలను జయింపఁ దేని వెలుపలి ప్రజలను దనవశమందుఁ బెట్టుకొనుట కెన్నఁటికిని సమర్థుఁడు కాఁజాలఁడు.

దశ కామసముత్థాని తథాష్టౌ క్రోధజాని చ।
వ్యసనాని దురంతాని ప్రయత్నేన వివర్జయేత్॥ –౪౫॥

మనుష్యుఁడు దగులువడెనేని మరల విడివడుటకు కఠినమగు కామ సంబంధమగు పది దుర్వ్యసనములను, క్రోధసంబంధమగు నెనిమిది వ్యసనములను దృఢోత్సాహియై ప్రయత్న పూర్వకముగా వదలవలయును; వదలింపవలయును.

కామజేషు ప్రసక్తో హి వ్యసనేషు మహీపతిః।
వియుజ్యతేఽర్థధర్మాభ్యాం క్రోధజేష్వాత్మనైవ తు॥ –౪౬॥

ఏలయనఁగా కామముచే నుత్పన్నమగు దుర్వ్యసనములందుఁ జిక్కువడు రాజు అర్థము–రాజ్యధనాదులు–ధర్మములేనివాఁ డగును క్రోధమునుండి యుత్పన్నములగు దుర్వ్యసనములయందుఁ జిక్కువడెనేని, శరీరమునుకూడ బోఁగొట్టుకొనును.

మృగయాక్షో దివాస్వప్నః పరివాదః స్త్రియో మదః।
తౌర్యత్రికం వృథాట్యా చ కామజో దశకో గణః॥ –౪౭॥

కామమునుండి యుత్పన్నములగు వ్యసనములు:— వేఁటాడుట, పాచికలాడుట, జూదమాడుట మొదలగునవి; పగలు నిద్రించుట, కామకథ, యితరు

లను నిందించుట, స్త్రీలతో నతిసంగమము, మాదక ద్రవ్యసేవనము-మద్యము, నల్లమందు, భంగు, గంజాయి, మొదలగునవి సేవించుట; పాడుట, వాయించుట, నాట్యమాడుట, నాట్యమాడించుట; వీనిని వినుట, చూచుట, వృథాగా నిక్కడనక్కడఁ దిరుగుట- యీ పదియుఁ గామోత్పన్నములగు వ్యసనములు.

> పైశున్యం సాహసం ద్రోహ ఈర్ష్యాఽసూయార్థదూషణమ్।
> వాగ్దండజం చ పారుష్యం క్రోధజోఽపి గణోఽష్టకః॥ ”-౪౮॥

క్రోధముచే నుత్పన్నములగు వ్యసనములు:- పైశున్యము (చాడీలు చెప్పుట,) ఆలోచనలేక బలాత్కారముగ పరస్త్రీతోఁ జెడుపని యొనర్చుట, ద్రోహముంచుట, ఈర్ష్య (ఇతరుల బాగును జూచి మండిపడుట,) అసూయ (దోషములందు గుణములను గుణములందు దోషములను ఆరోపించుట,) అర్థ దూషణము (అధర్మయుక్తమగు చెడుపనులయందు ధనాదులను వ్యయపఱచుట) కఠినపు మాటలాడుట, నిరపరాధులయెడ పరుషవచనము లుపయోగించుట, వారిని విశేషముగా దండించుట యను నీ యెనిమిది వ్యసనములు క్రోధముచే నుత్పన్నము లగుచున్నవి.

> ద్వయోరప్యేతయోర్మూలం యం సర్వే కవయో విదుః।
> తం యత్నేన జయేల్లోభం తజ్జావేతావుభౌ గణౌ॥ ”-౪౯॥

ఈ కామజక్రోధజ వ్యసనములకు మూలమయి మనుష్యులను సమస్త దుర్గుణములలోఁ జిక్కుపడఁజేయునది లోభమని విద్వాంసులందఱు నెఱుగుదురు కాఁబట్టి లోభమును బ్రయత్నముచే వదలవలయును.

> పానమక్షాః స్త్రియశ్చైవ మృగయా చ యథాక్రమమ్।
> ఏతత్కష్టతమం విద్యా చ్చతుష్కం కామజే గణే॥ ”-౫౦॥

కామ సంబంధమగు వ్యసనములందు మాదకద్రవ్యములను సేవించుట, పాచికలు మొదలయినవానితో జూదమాడుట, విశేష స్త్రీసంగమము, వేఁటాడుట అను నీ నాలుగు మహా దుష్టవ్యసనములు.

> దండస్య పాతనం చైవ వాక్పారుష్యార్థదూషణే।
> క్రోధజేఽపి గణే విద్యాత్కష్ట మేతత్త్రికం సదా॥ ”-౫౧॥

క్రోధసంబంధ మగువానియందు నిరపరాధులను దండించుట, పరుష వచనములాడుట, ధనాదుల నన్యాయమునందు వెచ్చించుట, ఈమూఁడును మహా దుఃఖదాయక దోషములు.

సప్తకస్యాస్య వర్గస్య సర్వత్రైవానుషంగిణః।
పూర్వం పూర్వం గురుతరం విద్యాద్వ్యసనమాత్మవాన్॥ ౭-౫౨॥

కామజక్రోధజము లను నీ రెండు దోషములనుండి యీ యేడు దుర్వ్యసనములును గణింపఁబడినవి. వీనియందుఁ బూర్వ పూర్వము అనఁగా వ్యర్థవ్యయమునకంటెఁ గఠోరవచనము, కఠోరవచనమునకంటె నన్యాయముగ దండించుట, దానికంటె వేటాడుట, దానికంటె నతి స్త్రీసంగమము, దానికంటె జూదము, దానికంటె మద్యాదిసేవనము గొప్ప వ్యసనమైయున్నది.

వ్యసనస్య చ మృత్యోశ్చ వ్యసనం కష్టముచ్యతే।
వ్యసన్యధోఽధో వ్రజతి స్వర్యాత్యవ్యసనీ మృతః॥ మను. ౭-౫౩॥

దుష్టవ్యసనములందుఁ దగులువడుటకంటెఁ జచ్చుట మేలు. ఏలయనఁగా దురాచారియగు పురుషుఁడు బ్రతికినకాలఁది పాపములేయొనరించి నీచగతిని-అధికదుఃఖమును-పొందును. ఏ వ్యసనమందును జిక్కువడనివాఁడు మృతినొందినను సుఖమునే అనుభవించును. కాఁబట్టి మద్యపానాది దుష్టవ్యసనములయందు నెన్నఁడును జిక్కువడక వానినుండి తొలఁగి ధర్మయుక్తగుణ కర్మస్వభావములతో సర్వదా వర్తిల్లుట మనుష్యులందఱకును, ముఖ్యముగా రాజునకును ఉచితము.

## రాజసభాసదులును మంత్రియు నుండవలయు విధము

మౌలాన్ శాస్త్రవిదః శూరాన్ లబ్ధలక్షాన్ కులోద్గతాన్।
సచివాన్ సప్త చాష్టౌ వా ప్రకుర్వీత పరీక్షితాన్॥ మను-౭-౫౪॥

స్వరాజ్యమందు, స్వదేశమందు నుత్పన్నమయినవారు, వేదాది శాస్త్రముల దెలిసినవారు, శూరవీరులు, లక్ష్యము అనఁగా వ్యర్థమగునాలోచన చేయనివారు, కులీనుల నగువారిని, ఏడుగురనుగాని యెనమండుగురనుగాని, యుత్తమ ధార్మిక చతురులను సచివులు-మంత్రులుగాఁ జేసికొనవలయును.

అపి యత్సుకరం కర్మ తదప్యేకేన దుష్కరమ్।
విశేషతోఽసహాయేన కింతు రాజ్యం మహోదయమ్॥ ౭-౫౫॥

తగిన సహాయములేక సుగమకార్యమును గూడ నొక్కఁడే చేయుట కఠినము. ఇట్లుండగా గొప్ప రాజ్యకార్యము లొక్కనిచే నెట్లుజాఁగలవు! కాఁబట్టి

యొక్కనినే రాజును జేయుట కాని, యొక్కని బుద్ధిమీఁదనే రాజ్యకార్యము నిర్భరమై యుండుట కాని యుచితము కాదు

> తైః సార్ధం చింతయే న్నిత్యం సామాన్యం సంధివిగ్రహమ్।
> స్థానం సముదయం గుప్తిం లబ్ధప్రశమనాని చ॥ "-౫౬॥

సభాపతి-రాజు-ప్రతిదినమును ఆయా రాజ్యకార్యములయందుఁ గుశలులును, విద్వాంసులు నగు మంత్రులతోఁగూడి (సంధి) ఎవరితో మైత్రి చేయవలయును. (విగ్రహము) ఎవరితో విరోధము చేయవలయును. (స్థానము) స్థితి, సమయము గుర్తెఱిఁగి యూరకుంటవలయును. ఎవరియెడల తటస్థముగ నుండి స్వరాజ్యమును రక్షించుకొనవలయును. (సముదయమ్) అభివృద్ధి కలిగినపుడు ఏ శత్రువు మీఁద దండెత్తవలయును. (గుప్తిమ్) మూల సైన్యమును, కోశము నెట్లు రక్షింపవలయును (లబ్ధప్రశమనాని) వశమయిన దేశములం దెట్లు శాంతిని స్థాపించి నిరుపద్రవముగఁ జేయనగును? అను నీయాఱు విషయములను జక్కఁగా విచారింపవలయును.

> తేషాం స్వం స్వమభిప్రాయ ముపలభ్య పృథక్ పృథక్।
> సమస్తానాం చ కార్యేషు విదధ్యాద్ధిత మాత్మనః॥ "౫౭॥

ఆయా సభాసదులనుండి వేఱువేఱుగ వారి యభిప్రాయములను దెలిసికొని బహుపక్షానుసారము, తనకును ఇతరులకును హితకరములగు వానిని జేయఁబూనవలయును.

> అన్యానపి ప్రకుర్వీత శుచీన్ ప్రాజ్ఞా నవస్థితాన్।
> సమ్యగర్థసమాహ ర్తౄ నమాత్యాన్ సుపరీక్షితాన్॥ "౬౦॥

పవిత్రాత్ములు, బుద్ధిమంతులు, దృఢచిత్తులు, పదార్థములను సంగ్రహించుటయం దతిచతురులు, సుపరీక్షితులు నగువారినిగూడ మంత్రులుగ నేర్పఱచుకొనవచ్చును.

> నిర్వ ర్తేతాస్య యావద్భిరితి క ర్తవ్యతా నృభిః।
> తావతో ఽ తంద్రితాన్ దక్షాన్ ప్రకుర్వీత విచక్షణాన్॥ "-౬౧॥

సోమరితనము లేనివారు, బలవంతులు, మిక్కిలి చతురులునగు ప్రధానపురుషులను నధికారులను కార్యసిద్ధి కావశ్యకమయినంత మందిని నియమింపవలయును.

తేషా మర్థే నియుంజీత శూరాన్ దక్షాన్ కులోద్గతాన్।
శుచీ నాకరకర్మాంతే భీరూ నంతర్నివేశనే॥ ౭-౬౨॥

వీరి యధీనమందుండు శూరవీరులును, బలాఢ్యమైన కులమందు బుట్టిన వారును, పవిత్రులునగు భృత్యులను గొప్పగొప్ప కార్యములందును, భయపడు పిఱికివారిని లోపలిపనులయందును బెట్టవలయును.

దూతం చైవ ప్రకుర్వీత సర్వశాస్త్ర విశారదమ్।
ఇంగితాకారచేష్టజ్ఞం శుచిం దక్షం కులోద్గతమ్॥ ౭-౬౩॥

ప్రశంసనీయకులమందుఁబుట్టి చతురుఁడు, పవిత్రుఁడు హావభావ చేష్టలచే లోపలి హృదయమును, ముందు రాఁబోవువానినిగూడఁ దెలియువాఁడు, అన్ని శాస్త్రములయందును విశారదుఁడు, చతురుఁడునగు నొక్క దూతనుగూడ రాజేర్పఱచి యుంచుకొనవలయును.

అనురక్తః శుచిర్దక్షః స్మృతిమాన్ దేశకాలవిత్।
వపుష్మాన్ వీతభీ ర్వాగ్మీ దూతో రాజ్ఞః ప్రశస్యతే॥ ౭-౬౪॥

రాజ్యకార్యములయం దత్యంతోత్సాహము గలవాఁడును, ప్రీతియుక్తుఁడును, నిష్కపటియు, పవిత్రాత్ముఁడును, చతురుఁడును, మఱపులేనివాఁడును, దేశకాలములను గుర్తెఱిఁగి వర్తించువాఁడును, సుందర రూపయుక్తుఁడును, నిర్భయుఁడును, గొప్పవక్తయు నగువాఁడే రాజునకు దూతయగుటకు ప్రశస్తుఁడు.

అధికారార్థులు:—

అమాత్యే దండ ఆయత్తో దండే వైనయికీ క్రియా।
నృపతౌ కోశరాష్ట్రే చ దూతే సంధివిపర్యయౌ॥ ౭-౬౫॥

అమాత్యునకు-మంత్రికి-దండాధికార మీయవలయును. దండమందు వినయక్రియ యుండవలయును. అన్యాయరూపమగు దండము కలుగఁగూడదు. రాజ నధీనమందు కోశమును, రాజ కార్యమును, సభాధీన మందు సమస్త కార్యములు నుండవలయును. ఎవరితోనైన మైత్రి విరోధములఁ జేయు నధికారము దూత కీయవలయును.

దూత ఏవ హి సంధత్తే భినత్త్యేవ చ సంహతాన్।
దూత స్తత్కురుతే కర్మ భిద్యంతే యేన వా న వా॥ ౭-౬౬॥

విరోధులలో సంధి గూర్పఁగలిగినట్టియు, గలిసియుండు దుష్టులకుఁ బరస్పరవిరోధమును గల్పింపఁగలిగినట్టియు నేర్పుగలవాఁడే దూత. కాఁబట్టి యతఁడు శత్రువులయందుఁ బరస్పరము వైమనస్యమును బుట్టింపవలయును.

> బుద్ధ్వా చ సర్వం తత్త్వేన పరరాజచికీర్షితమ్।
> తథా ప్రయత్నమాతిష్ఠే ద్యథాత్మానం న పీడయేత్॥ –౬౮॥

ఇఁక నా సభాపత్యాది సమస్త సభాసదులుగాని, దూత మొదలగుగాఁగం వారలుగాని, విరోధము బూనియున్న యితర రాజు రాజ్యాభిప్రాయమును యథార్థముగ దెలిసికొని తమ కపాయము కలుగకుండు ప్రయత్నము చేయఁదగును.

> ధనుర్దుర్గం మహీదుర్గ మబ్దుర్గం వార్క్షమేవ వా।
> నృదుర్గం గిరిదుర్గం వా సమాశ్రిత్య వసేత్పురమ్॥ –౭౦॥

రాజు సుందరమగు నడవులు, ధనధాన్యములు గల దేశమందు (ధనుర్దుర్గం) ధనుర్ధారులచే గహనమైనదియు (మహీదుర్గం) మంటిచేఁ గట్టబడి నదియు (అబ్దుర్గం)నీటిచేఁ జుట్టఁబడినదియు (వార్క్షమ్) నాలుగువైపుల వనము గలదియును (నృదుర్గమ్) నాలుగువైపుల సేన గలదియు (గిరిదుర్గం) అన్నివైపులఁ గొండలుగలిగి నడుమనుండు నదియుఁగాఁ గోటనుగట్టి దాని నడుమ నగరమును నిర్మింపవలయును.

> ఏకః శతం యోధయతి ప్రాకారస్థో ధనుర్ధరః।
> శతం దశసహస్రాణి తస్మాద్దుర్గం విధీయతే॥ –౭౪॥

నగరమునకు నాలుగువైపులఁ బ్రాకారముగూడఁ గట్టవలయును. ఏలయనఁగా దానిమీదనుండి ధనుర్ధారియు, శస్త్రయుక్తుఁడునగు నొక్కొక్క వీరుఁడు నూఱుగురతోను, నూఱుగురు పదివేలతోను యుద్ధము చేయఁగలుగుదురు. కాఁబట్టి యవశ్యముగా దుర్గము గట్టుట యుచితము.

> తత్స్యాదాయుధసంపన్నం ధనధాన్యేన వాహనైః।
> బ్రాహ్మణైః శిల్పిభి ర్యంత్రై ర్యవసేనోదకేన చ॥ –౭౫॥

ఆ దుర్గము శస్త్రాస్త్రములు, ధనధాన్యములు, వాహనములు, చదివించువారును ఉపదేశము చేయువారునగు బ్రాహ్మణులు, చేతిపనివాండ్రు, నానాప్రకారములగు కళాయంత్రములు, తిండి, గడ్డి, నీరు మొదలగువానిచే సంపన్నముగా–పరిపూర్ణముగా నుండవలయును.

తస్య మధ్యే సుపర్యాప్తం కారయేద్గృహమాత్మనః।
గుప్తం సర్వర్తుకం శుభ్రం జలవృక్షసమన్వితమ్॥ —౭౬॥

దాని మధ్యమందు జలవృక్షపుష్పాదులచే నన్నివిధముల రక్షింపఁబడినది, అన్ని ఋతువులయందు సుఖకారకమయినది, శ్వేతవర్ణము కలదియయి రాజకార్యములన్నియు నిర్వహింపనగు నొక్క గృహమును దనకొఱకుఁ గట్టించు కొనవలయును.

తదధ్యాస్యోద్వహేద్భార్యాం సవర్ణాం లక్షణాన్వితామ్।
కులే మహతి సంభూతాం హృద్యాం రూపగుణాన్వితామ్॥ —౭౭॥

ఇంతచేసి—అనఁగా బ్రహ్మచర్యముచే విద్యను జదివి, యింతవఱకు రాజకార్యములనొనర్చి, పిమ్మట సౌందర్య రూపగుణయుక్తురాలును, హృదయమున కతిప్రియురాలును, గొప్ప యుత్తమకులమందుఁ బుట్టినదియును, సుందర లక్షణయుక్తురాలును, అగు తన క్షత్రియకులపు కన్యను అనఁగాఁ దనవంటి విద్యాది గుణకర్మ స్వభావములుగలయొక్క స్త్రీనే వివాహమాడవలయును. తక్కిన స్త్రీలందఱు నగమ్యలనియెంచి చూడనుగూడఁ జూడఁగూడదు.

పురోహితం చ కుర్వీత వృణుయాదేవ చర్త్విజం।
తేఽస్య గృహ్యాణి కర్మాణి కుర్యుర్వైతానికాని చ॥ మను॰ ౭౮॥

అగ్నిహోత్రము, పక్షేష్టి మొదలగు రాజగృహకార్యముల నన్నింటిని జేయుటకు పురోహితుని, ఋత్విజులను స్వీకరింపవలయును. రాజు తానెప్పుడును రాజకార్యములందే తత్పరుఁడై యుండవలయును. అనఁగా రేయుం బగల్లు రాజ్యకార్యముల యందుఁ బ్రవృత్తుఁడై యుండి వానిని జెడకుండునట్లు చూచుకొనుటయే రాజునకు సంధ్యోపాసనాది కర్మమైయున్నది.

సాంవత్సరికమాప్తైశ్చ రాష్ట్రాదాహారయేద్బలిమ్।
స్యాచ్చామ్నాయపరో లోకే వర్తేత పితృవన్నృషు ॥మను॰ ౮౦॥

సంవత్సరపు పన్నును ఆప్తపురుషుల మూలమున గ్రహింపవలయును. సభాపతిరూప రాజు మొదలగు ప్రధాన పురుషులును వేదానుకూలముగ నడుచుచుఁ బ్రజలయెడఁ దండ్రివలె వర్తింపవలయును.

అధ్యక్షాన్ వివిధాన్ కుర్యాత్ తత్ర తత్ర విపశ్చితః।
తేఽస్య సర్వాణ్యవేక్షేరన్ నృణాం కార్యాణి కుర్వతామ్। ॥—౮౧॥

ఆయా రాజ్యకార్యముల యందలి వివిధరూపులగు సభ్యశీలను సభ నియమింపవలయును. వీరు ఆయా అధికారుల నియమానుసారము వర్తిల్లి యథావిధిగఁ దమతమ కర్తవ్యములను నెఱవేర్చుచున్నారా, లేదా యని విచారించి సక్రమముగ ప్రవర్తిల్లువారిని సత్కరించుచు, విరుద్ధముగాఁ బ్రవర్తిల్లు వారిని యథాన్యాయముగ దండించుచుండవలయును ఇదియే వీరికర్తవ్యము.

అవృత్తానాం గురుకులాద్విప్రాణాం పూజకో భవేత్।
నృపాణామక్షయో హ్యేష నిధిర్బ్రాహ్మో విధీయతే॥ ..—౮౨॥

సర్వదా రాజుల వేదప్రచారరూపమగు నక్షయకోశమును బ్రచారపఱచు నిమిత్తము ఎవరేని యథావిధిగ బ్రహ్మచర్యముచే వేదాది శాస్త్రములనుజదివి గురుకులమునుండి వచ్చిరేని వారిని, వారి గురువులను, రాజును సభయు యథా యోగ్యముగ సత్కరింపవలయును. ఇట్లుచేయుటచే రాజ్యమందు విద్యాభివృద్ధి యయి రాజ్య మత్యున్నతిని బొందును.

సమోత్తమాధమై రాజా త్వాహూతః పాలయన్ ప్రజాః।
న నివర్తేత సంగ్రామాత్ క్షాత్రం ధర్మ మనుస్మరన్ ..—౮౭॥

ఎప్పుడేని బ్రజలను బాలించునట్టి రాజును అతనికంటె హీనుఁడుగాని, సమానుఁడుగాని, అధికుఁడుగాని యుద్ధమునకుఁ బిలిచెనేని క్షత్రియ ధర్మమును స్మరించి యుద్ధముచేయుట కెన్నఁటికిని వెనుదీయఁగూడదు. తనకు విజయము కలుగురీతిని మిక్కిలి నేర్పుతో యుద్ధము చేయవలయును.

ఆహవేషు మిథోఽన్యోన్యం జిఘాంసంతో మహీక్షితః।
యుధ్యమానాః పరం శక్త్యా స్వర్గం యాంత్యపరాఙ్ముఖాః॥ ..—౮౯॥

సంగ్రామమందొకరిని మఱియొకరు చంపవలెనని కోరుచు భయపడకయు వెనుఁజూపకయు తమశక్తికొలఁది యుద్ధముచేయు రాజులే సుఖము నబొందుదురు. కాఁబట్టి యెన్నఁడును విముఖుఁడు కాఁగూడదు కాని యెప్పుడేని శత్రువును జయించు నిమిత్తము అతని నుండి డాఁగవలసివచ్చినప్పుడట్లే చేయవలయును. ఏలయనగా శత్రువును జయించుటకై యట్లుచేయుటదోషము కాదు. సింహము కోపముచే నెదుటఁబడి శస్త్రాగ్నియందు. శీఘ్రముగా భస్మమయిపోవున్నట్లు రాజు మూర్ఖతచేఁ జెడిపోఁగూడదు.

న చ హన్యాత్ స్థలారూఢం న క్లీబం న కృతాంజలిమ్।
న ముక్తకేశం నాసీనం న తవాస్మీతి వాదినమ్॥ ..—౯౧॥

యుద్ధసమయమందు యుద్ధముతో సంబంధము లేక అక్కడనిక్కడ నుచుండువారిని, నపుంసకులను, చేతులు జోడించువారిని, తల విరియఁబోసి కొన్నవారిని, కూర్చుండియున్నవారిని, శరణుచొచ్చినవారిని.

న సుప్తం న విసన్నాహం న నగ్నం న నిరాయుధమ్।
నాయుధ్యమానం పశ్యంతం న పరేణ సమాగతమ్॥ ౯౨॥

నిద్రపోవువారిని, మూర్ఛనొందినవారిని, నగ్నముగా నున్నవారిని, ఆయుధములేనివారిని, యుద్ధమునుఁ జూచుచుండువారిని శత్రువువెంబడి నూరక వచ్చినవారిని.

నాయుధవ్యసనం ప్రాప్తం నార్తం నాతిపరిక్షతమ్।
న భీతం న పరావృత్తం సతాం ధర్మ మనుస్మరన్॥ ౯౩॥

ఆయుధపు దెబ్బచేఁ బీడఁ జెందినవారిని, దుఃఖులను, మిక్కిలిగాయము తగిలినవారిని, భయపడినవారిని, పరుగెత్తుకొని పోవువారిని, సత్పురుషుల ధర్మమును స్మరించుచు యోధులెన్నఁటికిని గొట్టఁగూడదు. కాని వారిని బట్టుకొని కారాగృహమందుంచి యథారీతిని వారికి భోజనాదుల నీయవలయును. గాయపడినవారికి నౌషధాదుల నిప్పింపవలయును. వారిని దుఃఖపెట్టఁగూడదు. పరిహాసము చేయఁగూడదు. వారిచే యోగ్యమగు పనులను చేయింపవలయును. స్త్రీలు, బిడ్డలు, వృద్ధులు, ఆతురులు, శోకయుక్తులు నగువారిపై శస్త్రమును ప్రయోగింపఁగూడదు. ఈ విషయమున విశేష ధ్యాన ముంచవలయును. వారి బిడ్డలను దమ సంతానమువలెఁ బాలింపవలయును. స్త్రీలనుగూడఁ బాలింపవలయును. వారిని దమయక్కచెల్లెండ్రవలెను, కుమార్తెలవలెను జూడవలయును. ఎన్నఁడును వారిని విషయాసక్తమగుదృష్టితోఁ జూడఁగూడదు. రాజ్యము కుదురుపడినపుడు మరల యుద్ధమునకై తెదరను శంక గలిగింపనివారిని సత్కారపూర్వకముగ వదలి వారిదేశమునకుఁగాని, ఇంటికిఁగాని పంపివేయవలయును. ముందు విఘ్నము గలుగఁగలదని తోఁచువారిని సర్వదా కారాగారమం దుంచవలయును

యస్తు భీతః పరావృత్తః సంగ్రామే హన్యతే పరైః।
భర్తుర్యద్దుష్కృతం కించిత్తత్సర్వం ప్రతిపద్యతే॥ ౯౪॥

పరుగెత్తుకొనికాని, భయపడికాని పోయిన భృత్యుఁడు శత్రువుచేఁ గొట్టఁబడెనేని, యతఁడు తన రాజునెడచేసిన యపరాధమునకు దండనీయుఁడు కావలయును.

యచ్చాస్య సుకృతం కించి దముత్రార్థముపార్జితమ్।
భర్తా తత్సర్వ మాదత్తే పరావృత్తహతస్య తు॥ ..౯౫॥

ఈ లోకమునందును పరలోకమునందును సుఖముఁ గలుగజేయు భృత్యుని ప్రతిష్ఠ వాని స్వామికిఁజేరును. పాఱిపోవువాఁడు గొట్టఁబడెనేని వానికేమియు సుఖము కలుగఁజాలదు. వాని పుణ్యఫలమంతయు నష్టమయిపోవును. ధర్మముగా-యథారీతిని యుద్ధము చేయునతఁడే ప్రతిష్ఠఁబొందును.

రథాశ్వం హస్తినం ఛత్రం ధనం ధాన్యం పశూన్ స్త్రియః।
సర్వద్రవ్యాణి కుప్యం చ యో యజ్జయతి తస్య తత్॥ ..౯౬॥

రథము, గుఱ్ఱము, ఏనుఁగు, ఛత్రము, ధనము, ధాన్యము, ఆవుమొదలగు పశువులు, స్త్రీలు, తక్కిన నానావిధములగు సమస్త ద్రవ్యములు, నేయి, నూనె మొదలగు వానిని జయించిన ఆయా భృత్యులుకాని, అధ్యక్షులు కాని వానిని గ్రహింపవలయును. ఈ వ్యవస్థనెన్నటికిని చెఱుపఁగూడదు.

రాజ్ఞశ్చ దద్యు రుద్ధారమిత్యేషా వైదికీ శ్రుతిః।
రాజ్ఞా చ సర్వయోధేభ్యో దాతవ్య మపృథగ్జితమ్॥మను. ౭-౯౭॥

కాని సైనికులుగూడఁ దాము జయించిన పదార్థములలోఁ బదియాఱవ భాగమును రాజున కీయవలయును. రాజును అందఱుఁ గలసి జయించిన ధనములోఁ బదియాఱవ భాగము సైనికుల కీయవలయును. యుద్ధమందెవఁడేని చనిపోయెనేని వాని స్త్రీకిని, సంతానమునకును వాని భాగమీయవలయును. వాని స్త్రీని, అసమర్థులగు బిడ్డలను దగినట్లు పాలింపవలయును. వాని కుమారులు సమర్థులయినపుడు వారికిఁ దగిన యధికారములీయవలయును. తన రాజ్యవృద్ధియుఁ, బ్రతిష్ఠయు, విజయమును ఆనందాభివృద్ధియుఁ గోరువాఁడెవ్వఁడును ఈ మర్యాద నెన్నఁడు నుల్లంఘింపఁగూడదు.

అలబ్ధం చైవ లిప్సేత లబ్ధం రక్షేత్ప్రయత్నతః।
రక్షితం వర్ధయేచ్చైవ వృద్ధం పాత్రేషు నిఃక్షిపేత్॥ మను- ౭-౯౯॥

రాజును, రాజసభయు తమకు లేనిదానిని బొందుటకు నిచ్ఛగింపవలయును. కలిగినదానిని బ్రయత్నముచే రక్షింపవలయును. రక్షించిన దానిని వృద్ధిపఱపవలయును. వృద్ధిపఱచిన ధనమును వేదవిద్యయందును, ధర్మప్రచా

చిఱుతవలె దాఁగి శత్రువులను బట్టవలయును. సమీపించిన బలముగల శత్రువు నుండి కుందేటివలె దూరముగఁ బరుగెత్తుకొనిపోయి పిమ్మట వాని నుపాయముతోఁ బట్టవలయును.

ఏవం విజయమానస్య యేఽస్య స్యుః పరిపంథినః ।
తానానయేద్వశం సర్వాన్ సామాదిభి రుపక్రమైః॥ ———౧౦౯॥

ఇట్లు విజయమునొందు సభాపతి రాజ్యమందు పరిపంథి-బందిపోటు వేయు దొంగలు-ఉండిరేని వారిని (సామ) సామముతో దగ్గరఁ జేర్చుకొనవలయును. (దాన) కొంచె మేదేని యొసంగి వారిని వశపఱుచుకొనవలయును. భేద (భేద) వారిలో వైరమును బుట్టించి వశపఱుచుకొనవలయును. వీనిచే వశముకారేని (దండ) అతి కఠినదండముచే వశపఱుచుకొనవలయును.

యథోద్ధరతి నిర్దాతా కక్షం ధాన్యం చ రక్షతి।
తథా రక్షేన్నృపో రాష్ట్రం హన్యాచ్చ పరిపంథినః॥ ———౧౧౦॥

బియ్యము చేయువాఁడు పొట్టును దూరముచేసి బియ్యము విఱుగకుండ రక్షించునట్లు బందిపోటు దొంగలు మొదలగువారిని గొట్టి రాజ్యమును రక్షింపవలయును.

మోహాద్రాజా స్వరాష్ట్రం యః కర్షయత్యనవేక్షయా।
సోఽచిరాద్భ్రశ్యతే రాజ్యాజ్జీవితాచ్చ సబాంధవః॥ ———౧౧౧।

మోహముచేతను, అవిచారముచేతను రాజ్యమును దుర్బలపఱుచు రాజు తాను బంధువులతోపాటు జీవితమునుండియు, రాజ్యమునుండియు భ్రష్టుఁడగును

శరీరకర్షణాత్ప్రాణాః క్షీయంతే ప్రాణినాం యథా।
తథా రాజ్ఞామపి ప్రాణాః క్షీయంతే రాష్ట్రకర్షణాత్॥ ———౧౧౨॥

శరీరమును కృశింపఁజేయుటచేఁ బ్రాణుల ప్రాణము నశించునట్లు ప్రజలను దుర్బలపఱుచు రాజు ప్రాణము-బలాదులు బంధుసహితముగ నశించును.

రాష్ట్రస్య సంగ్రహే నిత్యం విధాన మిదమాచరేత్।
సుసంగృహీతరాష్ట్రో హి పార్థివః సుఖమేధతే॥ ———౧౧౩।

కాఁబట్టి రాజును, రాజసభయు రాజకార్యము పాలించుటకుఁ దగిన ప్రయత్నము చేయవలయును రాజ్యకార్యములయం దన్నివిధములఁ దత్పరుఁడుగ నుండు రాజుసుఖము సర్వదా వర్ధిల్లును.

ద్వయోస్త్రయాణాం పంచానాం మధ్యే గుల్మమధిష్ఠితమ్।
తథా గ్రామశతానాం చ కుర్యాద్రాష్ట్రస్య సంగ్రహమ్॥—...౧౧౪॥

కాఁబట్టి రెండు, మూఁడు, అయిదు లేక నూఱు గ్రామముల నడుమ నొక్కొక్క రాజ్యస్థానముంచి యందు భృత్యులను-పనిచేయు రాజపురుషులను-బెట్టి సమస్త రాజకార్యములను పూర్తిచేయవలయును.

గ్రామస్యాధిపతిం కుర్యాద్దశగ్రామపతిం తథా।
వింశతీశం శతేశం చ సహస్రపతిమేవ చ॥—...౧౧౫॥

ఒక్కొక్క గ్రామమందు నొక్కొక్క ప్రధానపురుష నుంచవలయును. పది గ్రామములమీఁద మఱియొక్కని, ఇరువది గ్రామముల మీఁద మూఁడవవానిని, నూఱుగ్రామములమీఁద నాల్గవవానిని, వేయి గ్రామముల మీఁద నయిదవవానిని నియమింపవలయును. అనఁగా నిప్పుడున్నట్లు ఒక్కొక గ్రామమం దొక్కొక పట్వారిని, (కరణమును) అట్టి పదిగ్రామములమీఁద నొక ఠాణాను, రెండు ఠాణాలపైన నొక పెద్దఠాణాను, అయిదు ఠాణాలమీఁద నొక తహశీలును, పది తహశీలులపై నొక జిల్లాను నియమింపవలయును. ఇప్పటివారు నిదేరీతి మనువాది ధర్మశాస్త్రములనుండి గ్రహించియున్నారు.

గ్రామదోషాన్ సముత్పన్నాన్ గ్రామికః శనకైః స్వయమ్।
శంసేద్గ్రామదశేశాయ దశేశో వింశతీశినమ్॥—...౧౧౬॥
వింశతీశస్తు తత్సర్వం శతేశాయ నివేదయేత్।
శంసేద్గ్రామశతేశస్తు సహస్రపతయే స్వయమ్॥—...౧౧౭॥

ఈ రీతిని దగిన యేర్పాటుఁజేసి ప్రతిగ్రామాధిపతియు నిత్యముఁ దన గ్రామదోషములు గుప్తరీతిని దశగ్రామాధిపతికిని, అతఁడు తన పదిగ్రామముల వర్తమానమును ఇఱువదిగ్రామముల యధిపతికిని, అతఁడు తన యిఱువది గ్రామముల విషయమును శతగ్రామాధిపతికిని, అతఁడు తన నూఱుగ్రామముల సంగతిని వేయి గ్రామముల యధిపతికిని అతఁడు తన వేయి గ్రామముల విశేషమును పదివేల గ్రామముల యధిపతికిని, అతఁడు తన పదివేలగ్రామముల వృత్తాంతమును లక్షగ్రామాధిపతికిని, అతఁడు తన వార్తలను రాజసభకును ప్రతిదినము దెలుపవలయును, ఆ రాజసభవారందఱు మహారాజసభకు-"సార్వభౌమ చక్రవర్తి మహారాజ సభ"కు సమస్తభూగోళ వర్తమానమును దెలుపవలయును.

తేషాం గ్రామ్యాణి కార్యాణి పృథక్కార్యాణి చైవ హి।
రాజ్ఞోఽన్యః సచివః స్నిగ్ధస్తాని పశ్యేదతంద్రితః॥—,.-౧౨౦।

ప్రతి పదివేల గ్రామములకు నిరువురు సభాపతులుండవలయును. వారి యందొక్కఁడు రాజసభయం దుండవలయును. మఱియొక్కఁడు సమస్తన్యా యాధీశాది రాజపురుషుల కార్యములను సర్వదా సోమరితనము విడిచి తిరిగి చూచుచుండ వలయును.

నగరే నగరే చైకం కుర్యాత్సర్వార్థ చింతకమ్।
ఉచ్చైః స్థానం ఘోరరూపం నక్షత్రాణామివ గ్రహమ్॥—..-౧౨౧॥

గొప్పగొప్ప నగరములందు చంద్రునివలె సుందరమును, ఉచ్చమును, విశాలము నగు విచారణసభామందిర ముండవలయును. అందు విద్యావృద్ధుల-విద్యచే నన్ని టినన్నివిధములఁ బరీక్షించినవారు-గూర్చుండి విచారణ చేయవల యును. రాజును ప్రజలును ఉన్నతిఁబొందు విధానములను, విద్యను సర్వదా ప్రకాశపఱచుచుండవలయును.

స తానను పరిక్రామేత్సర్వానేవ సదా స్వయమ్।
తేషాం వృత్తం పరిణయేత్సమ్యగ్రాష్ట్రేషు తచ్చరైః॥—..-౧౨౨।

సంచారముచేయు సభాపతి యధీనమందు గుప్తచరులు-దూతలు-ఉండ వలయును. రాజపురుషులవలనను దక్కినవారివలనను రాజ-ప్రజల-సమస్తదోష ములను. గుణములను గుప్తరీతిని దెలిసికొనవలయును. అపరాధులను దండిం చుచు గుణవంతులను సన్మానించుచు నుండవలయును.

రాజ్ఞో హి రక్షాధికృతాః పరస్వాదాయినః శఠాః।
భృత్యా భవంతి ప్రాయేణ తేభ్యో రక్షేదిమాః ప్రజాః॥—..-౧౨౩॥

ప్రజలనురక్షించు నధికారమును రాజు ధార్మికులు, విద్వాంసులు, గుణీనులు నగువారి కీయవలయును. శఠులను, పరపదార్థముల హరించుదొంగలనువారియధీన మందుంచి చక్కగా పని చేయించవలయును. ఆ శఠులు మొదలగువారిని దుష్ట కర్మములనుండి మరలించుటకు వారిని రాజ భృత్యులుగా నొనర్చి విద్వాంసుల యధీనమందుంచి వారిమూలమున ప్రజలను యథారీతిని రక్షింపవలయును.

యే కార్యికేభ్యోఽర్థమేవ గృహ్ణీయుః పాపచేతసః।
తేషాం సర్వస్వమాదాయ రాజా కుర్యాత్ప్రవాసనమ్॥ మను. ౭-౧౨౪॥

అన్యాయముగా వాది ప్రతివాదులనుండి గుప్తముగా ధనముఁ బుచ్చు కొని పక్షపాతముచేయు ఉద్యోగుల సర్వస్వమును హరించి తగినట్లు దండిచి, మరల వారు రాజాంని దేశమందు వాని నుంచవలయును. వానిని శిక్షింప నిచో తక్కిన రాజభృత్యులును దుష్టకర్మములను చేయఁదొడ గుదురు. వారు దండింపఁబడెనేని దక్కినవారును అట్టి చెరుపనుల నుండి తొలఁగియుందురు. తమ యోగక్షేమము బాగుగా జరుగఁగలిగి నంతగాని, తాము ధనాఢ్యులగు నంతగాఁని, ధనమునో, భూమినో రాజునుండి రాజపురుషులు మాసికముగ, లేక వార్షికముగ లేక ఒకే పర్యాయము తీసికొనవలయును. వృద్ధులు తమ జీవితములో సగము ఉపకారవేతనము పొందవలయును. ఆ వృద్ధుఁడు బ్రతికియుండువఱకు నతని జీవనము జరుపుటయందు ధ్యానముంచవలయును. విస్మరించ నవసరములేదు. కాని వాని సంతానమున కతని గుణానుసారము సత్కారముకాని, ఉద్యోగముకాని యవశ్యమీయవలయును. ఇదియుఁగాక ఆ వృద్ధుడు గతించినదాది వాని బాలురు సమర్థులగువఱకు వారికిని, వాని భార్య బ్రతికియుండునేని ఆమెకును, నిర్వాహార్థము తగినంత ధనమీయవలయును. ఆ స్త్రీయును బాలురును దుశ్చరితులైన ఏమియునీయనక్కఱయుండదు. ఇట్టి నీతివి రాజు యథావిధి నడుపవలయును.

యథా ఫలేన యుజ్యేత రాజా కర్తా చ కర్మణాం।
తథా ఽవేక్ష్య నృపో రాష్ట్రే కల్పయేత్సతతం కరాన్॥ మను-౭-౧౨౮॥

రాజును, కార్యకర్తలగు రాజపురుషులును, జనులును సుఖరూపఫలమును పొందునట్లు రాజును, రాజసభవారును రాజ్యమునందుఁ బన్ను విధింపవలయును.

యథాల్పాల్పమదన్త్యాద్యం వార్యోకోవత్సషట్పదాః।
తథాల్పాల్పో గ్రహీతవ్యో రాష్ట్రాద్రాజ్ఞాబ్దికః కరః॥ ౭-౧౨౯॥

భోగ్య పదార్థమును జెలగయు, దూడయుఁ, దుమ్మెదయు, కొంచెము కొంచెముగా గ్రహించునట్లు రాజును బ్రజలనుండి వార్షికపు పన్నును గొంచెము గొంచెముగా గ్రహింపవలయును.

నోచ్ఛింద్యాదాత్మనో మూలం పరేషాం చాతితృష్ణయా।
ఉచ్ఛిన్దన్హ్యాత్మనో మూలం మాత్మానం తాంశ్చ పీడయేత్॥ ౭-౧౩౯॥

మిక్కిలిలోభముచేఁ దన-యితరుల సుఖమూలమును ఛిన్నము-నష్టము ఎన్నటికిని జేయఁగూడదు. సుఖముమూలమునే ఛేదించు వ్యవహారము తనకును, ఇతరులకును బీడనే కలిగించును.

తీక్ష్ణశ్చైవ మృదుశ్చ స్యాత్కార్యం వీక్ష్య మహీపతిః।
తీక్ష్ణశ్చైవ మృదుశ్చైవ రాజా భవతి సమ్మతః॥ మను. స్మృ.–౧౪౦॥

కార్యము ననుసరించి తీక్ష్ణుఁడు, గోమలుఁడు నగునట్టి మహీపతి దుష్టులకుఁ దీక్ష్ణుఁడు, శ్రేష్ఠులకుఁ గోమలుఁడునయి అతి మాననీయుఁ డగును.

ఏవం సర్వం విధాయేదమితి కర్తవ్య మాత్మనః।
యుక్తశ్చైవాప్రమత్తశ్చ పరిరక్షేదిమాః ప్రజాః॥ ..–౧౪౨॥

ఈ రీతిని రాజ్యపు టేర్పాటుల నన్నిటిని జేసి సర్వదా వాని ననుసరించుచు ప్రమాదరహితుఁడు నయి తన ప్రజలను నిరంతరముఁ బాలింపవలయును.

విక్రోశంత్యో యస్య రాష్ట్రాద్ధ్రియంతే దస్యుభిః ప్రజాః।
సంపశ్యతః సభృత్యస్య మృతః స న తు జీవతి॥ ..–౧౪౩॥

భృత్యసహితుఁడై యే రాజు చూచుచుండఁగా నేడ్చుచున్న ప్రజల పదార్థములను, ప్రాణములను దొంగ లపహరింతురో, ఆ రాజు తన భృత్యామాత్య సహితముగ బ్రతికియుండియుఁ జచ్చినవాఁడే యని తెలియవలయును. ఆ రాజు మహాదుఃఖమును బొందును.

క్షత్రియస్య పరో ధర్మః ప్రజానా మేవ పాలనమ్।
నిర్దిష్ట ఫలభోక్తా హి రాజా ధర్మేణ యుజ్యతే॥ ..–౧౪౪॥

కాఁబట్టి రాజునకు ప్రజలను బాలించుటయే పరమధర్మము. మనుస్మృతి యేడవ యధ్యాయమందు వ్రాయబడియుండు నట్లును, సభ నియమించునట్లును బన్ను బుచ్చుకొను రాజు ధర్మాత్ముఁడై సుఖము బొందును. దీనికి విపరీతముగ నొనర్చు రాజు దుఃఖమునే పొందును.

ఉత్థాయ పశ్చిమే యామే కృతశౌచః సమాహితః।
హుతాగ్ని ర్బ్రాహ్మణాంశ్చార్చ్య ప్రవిశేత్స శుభాం సభామ్॥ మను–౭–౧౪౫॥

జామురాత్రి యుండఁగా లేచి శౌచకృత్యము దీర్చుకొని సావధానుఁడై పరమేశ్వర ధ్యానమును, అగ్ని హోత్రమును, ధార్మిక విద్వాంసుల సత్కారమును. పిదప భోజనమును జేసి సభ యందుఁ బ్రవేశింపవలయును

మిక్కిలి లోభముచేఁ దన-యితరుల సుఖమూలమును ఛిన్నము-నష్టము నెన్నటికిని జేయఁగూడదు. సుఖమూలమునే ఛేదించు వ్యవహారము తనకును, ఇతరులకును బీడనే కలిగించును.

తీక్ష్ణశ్చైవ మృదుశ్చ స్యాత్కార్యం వీక్ష్య మహీపతిః।
తీక్ష్ణశ్చైవ మృదుశ్చైవ రాజా భవతి సమ్మతః॥ మను.స్మృ.—౧౪౦॥

కార్యము ననుసరించి తీక్ష్ణుఁడు, కోమలుఁడు నగునట్టి మహీపతి దుష్టులకుఁ దీక్ష్ణుఁడు, శ్రేష్ఠులకుఁ గోమలుఁడునయి అతి మాననీయుఁ డగును.

ఏవం సర్వం విధాయేదమితి కర్తవ్య మాత్మనః।
యుక్తశ్చైవాప్రమత్తశ్చ పరిరక్షేదిమాః ప్రజాః॥ ,,—౧౪౨॥

ఈ రీతిని రాజ్యపు టేర్పాటుల నన్నిటిని జేసి సర్వదా వాని ననుసరించుచు ప్రమాదరహితుఁడు నయి తన ప్రజలను నిరంతరముఁ బాలింపవలయును.

విక్రోశంత్యో యస్య రాష్ట్రాద్ధ్రియంతే దస్యుభిః ప్రజాః।
సంపశ్యతః సభృత్యస్య మృతః స న తు జీవతి॥ ,,—౧౪౩॥

భృత్యసహితుఁడై యే రాజు చూచుచుండఁగా నేడ్చుచున్న ప్రజల పదార్థములను, ప్రాణములను దొంగ లపహరింతురో, ఆ రాజు తన భృత్యామాత్య సహితముగఁ బ్రతికియుండియుఁ జచ్చినవాఁడే యని తెలియవలయును. ఆ రాజు మహాదుఃఖమును బొందును.

క్షత్రియస్య పరో ధర్మః ప్రజానా మేవ పాలనమ్।
నిర్దిష్టఫలభోక్తా హి రాజా ధర్మేణ యుజ్యతే॥ ,,—౧౪౪॥

కాఁబట్టి రాజునకు ప్రజలను బాలించుటయే పరమధర్మము. మనుస్మృతి యేడవ యధ్యాయమందు వ్రాయబడియుండు నట్లును, సభ నియమించునట్లును పన్ను బుచ్చుకొను రాజు ధర్మాత్ముఁడై సుఖము బొందును. దీనికి విపరీతముగ నొనర్చు రాజు దుఃఖమునే పొందును.

ఉత్థాయ పశ్చిమే యామే కృతశౌచః సమాహితః।
హుతాగ్నిర్బ్రాహ్మణాంశ్చార్చ్య ప్రవిశేత్స శుభాం సభామ్॥ మను—౭—౧౪౫॥

జాము రాత్రి యుండఁగా లేచి శౌచకృత్యము దీర్చుకొని సావధానుఁడై పరమేశ్వర ధ్యానమును, అగ్ని హోత్రమును, ధార్మిక విద్వాంసుల సత్కారమును, పిదప భోజనమును జేసి సభ యందుఁ బ్రవేశింపవలయును.

సంధి, విగ్రహము, యానము, ఆసనము, ద్వైధీభావము, సంశ్రయము, అను నీ ద్వివిధములగువానిని రాజు యథారీతిని దెలియవలయును.

సమానయానకర్మా చ విపరీతస్తథైవ చ।
తథా త్వాయతి సంయుక్తః సంధిర్జ్ఞేయో ద్విలక్షణః॥ ...౧౬౩॥

(సంధి) శత్రువుతో స్నేహము చేయుట లేక విపరీతముగ నవర్తముండియు వర్తమానమందును, భవిష్యత్తునందును జేయవలసిన కార్యములు యథావిధిగఁ జేయుట అని యిది రెండువిధముల సంధి.

స్వయంకృతశ్చ కార్యార్థ మకాలే కాల ఏవ వా।
మిత్రస్య చైవాపకృతే ద్వివిధో విగ్రహః స్మృతః॥ ...౧౬౪॥

(విగ్రహము) కార్యసిద్ధికొఱకు నుచితసమయ మందేని అనుచిత సమయమందేని తానుగాని తన మిత్రుని మూలమునఁ గాని అపరాధము చేసిన శత్రువుతో విరోధించుట ఇది రెండువిధములు.

ఏకాకినశ్చాత్యయికే కార్యే ప్రాప్తే యదృచ్ఛయా।
సంహతస్య చ మిత్రేణ ద్వివిధం యానముచ్యతే॥ ...౧౬౫॥

(యానము) తటాలున ఏదేని కార్యము సంభవించినపుడు ఒంటిగాఁ గాని, మిత్రునితోఁ గలసి కాని, శత్రువుపై దండెత్తిపోవుట. ఇది రెండు విధములు.

క్షీణస్య చైవ క్రమశో దైవాత్పూర్వకృతేన వా।
మిత్రస్య చానురోధేన ద్వివిధం స్మృతమాసనమ్॥ ...౧౬౬॥

ఏదేని కారణముచేఁ దాను క్రమముగ క్షీణించి నిర్బలుఁడయినపుడు గాని, లేదా మిత్రుఁ డర్థగించునపుడుగాని దన స్థానమందుండుట. ఇది రెండు విధములు.

బలస్య స్వామినశ్చైవ స్థితిః కార్యార్థసిద్ధయే।
ద్వివిధం కీర్త్యతే ద్వైధం షాడ్గుణ్యగుణవేదిభిః॥ ...౧౬౭॥

(ద్వైధము) కార్యసిద్ధికొఱకు సేనాపతులను, సేనలను రెండు విభాగములొనర్చి విజయముఁ బొందుట. ఇది రెండు విధములు.

అర్థసంపాదనార్థం చ పీడ్యమానస్య శత్రుభిః।
సాధుషు వ్యపదేశార్థం ద్వివిధః సంశ్రయః స్మృతః॥ ...౧౬౮॥

(అ(శయము) తన ప్రయోజన మేదేని సాధించునిమిత్తము శత్రువుచేఁ బీడింపఁబడకుండునట్లు బలవంతుఁడగు నొక రాజునో లేక యొక మహాత్మునో శరణము చొచ్చుట. ఇది రెండు విధములు.

యదావగచ్ఛేదాయత్యా మాధిక్యం ధ్రువమాత్మనః।
తదాత్వే చాల్పికాం పీడాం తదా సంధిం సమాశ్రయేత్॥ మను-౧౬౯॥

అప్పుడు యుద్ధ మొనర్పుటచేఁ బీడగలుగుననియు, బిమ్మటఁ జేయుటచే వృద్ధియు, విజయము గలుగుననియుఁ దెలిసెనేని, శత్రువుతో నప్పటికి గలిసి యుచితసమయమువఱకు ధైర్యముతో నుండవలయును.

యదా ప్రహృష్టా మన్యేత సర్వాస్తు ప్రకృతీర్భృశమ్।
అత్యుచ్ఛ్రితం తథాత్మానం తదా కుర్వీత విగ్రహమ్॥ ..-౧౭౦॥

రానును, దన ప్రజలును, దనసేనయు నత్యంత ప్రసన్నులనియు, నున్నత శీలురనియు, శ్రేష్ఠులనియుఁ దెలిసినపుడే శత్రువుతో విగ్రహించి యుద్ధము చేయనగును.

యదా మన్యేత భావేన హృష్టం పుష్టం బలం స్వకమ్।
పరస్య విపరీతం చ తదా యాయాద్రిపుం ప్రతి॥ ..-౧౭౧॥

తన సేన హర్షముతోఁగూడి, పుష్టిగలిగి, ప్రసన్నభావముతో, నున్నదనియు, వైరిసేన దీనికి విపరీతముగ దుర్బలమయి యున్నదనియుఁ దెలిసినపుడు శత్రువుమీఁదికి యుద్ధమునకై వెడలవలయును.

యదా తు స్యాత్పరిక్షీణో వాహనేన బలేన చ।
తదాసీత ప్రయత్నేన శనకైః సాంత్వయన్నరీన్॥ ..-౧౭౨॥

తన సేన బలములో, వాహనములోఁ గొఱవడియుండునేని శత్రువులను మెల్ల మెల్లఁగాఁ బ్రయత్నములో శాంతపఱచుచుఁ,దనస్థానమును వదలక యుండవలయును.

మన్యేతారిం యదా రాజా సర్వథా బలవత్తరమ్।
తదా ద్విధా బలం కృత్వా సాధయేత్కార్యమాత్మనః॥ ..-౧౭౩॥

శత్రువు అత్యంత బలవంతుఁడని యెఱిఁగినపుడు సేనను ద్విగుణముగ గాని, ద్వివిధములుగ కాని చేసి పైఁబడి తన కార్యమును సాధింపవలయును.

యదా పరబలానాం తు గమనీయతమో భవేత్।
తదా తు సంశ్రయేత్ క్షిప్రం ధార్మికం బలినం నృపమ్॥ ...౧౭౪॥

శత్రువులు త్వరలోనే తనమీఁదికి దండెత్తి వచ్చుచున్నారని తెలిసి నపుడు తక్షణమే యొక ధార్మికుఁడును, బలవంతుఁడు నగు రాజు నాశ్రయ మును దీసికొనవలయును.

నిగ్రహం ప్రకృతీనాం చ కుర్యాద్యోఽరిబలస్య చ।
ఉపసేవేత తం నిత్యం సర్వయత్నైర్గురుం యథా॥ ...౧౭౫॥

శత్రువుల బలమును నిగ్రహించిన - అణఁగించిన - తన ప్రజలను. సేన లను గురువులవలె నిత్యము సేవింపవలయును.

యది తత్రాపి సంపశ్యే ద్దోషం సంశ్రయకారితం।
సుయుద్ధమేవ తత్రాపి నిర్విశంకః సమాచరేత్॥ మను-౭. ౧౭౬॥

ఆశ్రయించిన పురుషునిలో దోషము కనఁబడెనేని అతనితోడను నిశ్శం కుఁడై బాగుగ యుద్ధము చేయవలయును.

ధార్మికుఁడగు రాజుతో నెప్పుడును విరోధింపఁగూడదు. అతనితో నర్వదా కలిసిమెలసి యుండవలయును. దుష్టుఁడు ప్రబలుఁడుగా నుండిన నతని జయించుటకొఱకుఁ బైఁజెప్పిన యుపాయములఁ బ్రయోగించుట యుచితము:-

సర్వోపాయైస్తథా కుర్యాన్నీతిజ్ఞః పృథివీపతిః।
యథాస్యాభ్యధికా న స్యుర్మిత్రోదాసీనశత్రవః॥ మను-౭-౧౭౭॥

నీతి గుర్తెఱిఁగిన పృథివీపతి తన మిత్రు లుదాసీనులును (మధ్యస్థు లును) అనగా (తటస్థులును) శత్రువులు ప్రబలులు గాకుండునట్టి సమస్త విధోపాయములచే వర్తిల్లవలయును.

ఆయతిం సర్వకార్యాణాం తదాత్వం చ విచారయేత్।
అతీతానాం చ సర్వేషాం గుణదోషౌ చ తత్త్వతః॥ ...౧౭౮॥

వర్తమానకాలమందుఁ జేయుచున్న. భవిష్యత్తునందుఁ జేయవలసిన. భూతకాలమందుఁ జేసిన సమస్త కార్యములను వాని యథార్థమగు గుణదోష ముల విచారణ చేయవలయును.

ఆయత్యాం గుణదోషజ్ఞస్తదాత్వే క్షిప్రనిశ్చయః।
అతీతే కార్యశేషజ్ఞః శత్రుభిర్నాభిభూయతే॥ ...౧౭౯॥

విస్మృత దోషములను నివారించుటకును, గుణములను స్థిరపరచుకొను టకు ప్రయత్నింపవలయును. రాజు భవిష్యత్తునందుఁ జేయఁదగిన పనుల యందలి గుణదోషములను గుర్తెఱిఁగి, వర్తమానమందుఁ జేయఁదగిన వానిని తక్షణమే నిశ్చయించుచు, చేయఁబడిన కార్యములందలి కొఱఁతలను సవ రించుకొనుచు నుండునో అతఁడు శత్రువులచే నెప్పటికిని బరాజితుఁడు కాఁడు.

యథైనం నాభిసంధద్యు ర్మిత్రోదాసీనశత్రవః।
తథా సర్వం సంవిదధ్యా దేష సామాసికో నయః॥ మను–౭–౧౮౦॥

మిత్రులను, ఉదాసీనులను, శత్రువులను వశపఱచుకొను ప్రయత్నమును అన్ని విధములచే రాజపురుషులును, విశేషించి రాజును జేయవలయును. దీనికి విరోధముగ మోహమం దెన్నఁడును దగులుపడఁగూడదు. ఇదియే సంక్షేప ముగ వినయము–రాజనీతి :–

కృత్వా విధానం మూలే తు యాత్రికం చ యథావిధి।
ఉపగృహ్యాస్పదం చైవ చారాన్సమ్యగ్విధాయ చ॥ మను–౭–౧౮౪॥

రాజు శత్రువులపై యుద్ధమునకుఁ బోవునపుడు తన రాజ్య రక్షణకుఁ దగిన యేర్పాటుచేసి యాత్రకుఁ దగిన సమస్త సామగ్రిని సేకరించుకొని సమస్త సేనలను, యానములను, వాహనములను, శస్త్రాస్త్రాదులను సంపూ ర్ణముగఁదీసికొని, అన్ని వైపుల దూతలను–నలువైపుల సమాచారములను తెలుపుటకు గుప్తముగా నియమించి యుద్ధమునకు పోవలయును.

సంశోధ్య త్రివిధం మార్గం షడ్విధం చ బలం స్వకమ్।
సాంపరాయికకల్పేన యాయాదరిపురం శనైః॥ ౭–౧౮౫॥

మార్గములు మూఁడువిధములు: ఒకటి స్థలము (భూమి) రెండవది జలము (నది, సముద్రము) మూఁడవది ఆకాశము. ఈ మార్గములను శుద్ధ ముచేసికొని భూమిపై రథ, గజ, తురగముల మీఁదను, నీటియందు నావల మీఁదను, ఆకాశమునందు విమానాది యానములమీఁదను పోవలయును. రథ, గజ, తురగ, పదాతులు, అస్త్ర శస్త్రములు, అన్న పానములు మొదలగు సామ గ్రులను వెంబడి దీసికొని పూర్ణబలముతోఁ గూడుకొని యేదే నొక నిమిత్త మును ప్రసిద్ధపఱచి శత్రువుల నగరసమీపమునకు మెల్లమెల్లఁగా పోవలయును.

శత్రుసేవిని మిత్రే చ గూఢే యుక్తతరో భవేత్।
గతప్రత్యాగతే చైవ స హి కష్టతరో రిపుః॥ ...౧౮౬॥

లోపల శత్రువుతోఁ గలిసి, పైకిఁ దనతోఁ గలసియుండునట్లు నటించు శత్రువునకుఁ దన భేదము నీక, వాని రాకపోకలఁ గనుచుండును. వానితో మాటలాడుట యందును మిక్కిలి జాగ్రత్త కలిగి యుండవలయును. లోపల శత్రువై పైకి మిత్రునిగా నటించువానిని గొప్ప శత్రువని యెంచవలయును.

దండవ్యూహేన తన్మార్గం యాయాత్తు శకటేన వా।
వరాహ మకరాభ్యాం వా సూచ్యా వా గరుడేన వా॥ ...౧౮౭॥

సమస్త రాజపురుషులకును యుద్ధవిద్యను నేర్పి తానును నేర్చియుండవలసినదియేగాక ప్రజలకును నేర్పియుంచవలయును. శిక్షనభ్యసించిన యోధులే బాగుగా యుద్ధముఁ జేయుటకును, జేయించుటకును దెలిసియుందురు. శిక్ష నేర్పునప్పుడు(దండవ్యూహము)దండమువలెను,(శకట)బండివలెను, (వరాహ) పందులు ఒకటి వెంబడి మఱియొకటి పరుగెత్తుచుఁ దటాలున నన్నియు గుంపుగా గూడునట్లును, (మకర) నీళ్ళయందు మొసలి చరించు విధమునను, (సూచివ్యూహ) సూది మొన సూక్ష్మముగా నుండి వెనుక బోయినకొలఁది స్థూలముగా నుండునట్లును, సేనను శిక్షచేఁ దీర్పవలయును. (నీలకంఠ) నెమలి అటునిటు దటుక్కునఁ గొట్టునట్లు సేనలను దీర్చి యుద్ధముచేయు విధమును నేర్పవలయును.

యతశ్చ భయమాశంకేత్తతో విస్తారయేద్బలమ్।
పద్మేన చైవ వ్యూహేన నివిశేత సదా స్వయమ్॥ ...౧౮౮॥

ఏ వైపున భయము దోఁచునో ఆ వైపున సేనను వ్యాపింపఁ జేయవలయును. సేనాపతులను నాలుగు వైపులను బెట్టవలయును. (పద్మవ్యూహము) అనఁగా దామరవలె నాలుగు వైపులను సేనలనుంచి మధ్యఁ దానుండవలయును.

సేనాపతి బలాధ్యక్షౌ సర్వదిక్షు నివేశయేత్।
యతశ్చ భయమాశంకేత్ ప్రాచీం తాం కల్పయేద్దిశమ్॥ ...౧౮౯॥

సేనాపతులను, బలాధ్యక్షులను-సేనలను ఆజ్ఞాపించుచు, సేనలతోఁ గూడి యుద్ధముఁ జేయుచు, యుద్ధముఁ జేయించుచు నుండువీరులను-ఎనిమిది దిక్కులయందు నుంచవలయును. యుద్ధము జరుగుచుండు వైపుననే సేనలముఖము

నుంచవలయును. కాని అన్యదిక్కులఁగూఁడ దగిన యేర్పాటు చేసియుంచ వలయును. అట్లు చేయరేని వెనుకనుండియు, ప్రక్కలనుండియు శత్రువులచే భయము కలుగవచ్చును.

గుల్మాంశ్చ స్థాపయేదాప్తాన్ కృతసంజ్ఞాన్ సమంతతః।
స్థానే యుద్ధే చ కుశలానభీరూనవికారిణః॥ ...౧౯౦॥

గుల్మములు—దృఢ స్తంభముల—వలె యుద్ధవిద్యయందు సుశిక్షితులు, ధార్మికులును, నిలిచి యుద్ధముచేయుటయందుఁ జతురులు, భయరహితులు వికారమెఱుఁగని మనస్సుగలవారునగువారిని నాలుగు వైపులయందునుంచవలయును.

సంహతాన్ యోధయేదల్పాన్ కామం విస్తారయేద్బహూన్।
సూచ్యా వజ్రేణ చైవైతాన్ వ్యూహేన వ్యూహ్య యోధయేత్॥ ...౧౯౧॥

అనేకులతోఁ గొందఱే యుద్ధముచేయఁ దటస్థించినపుడు గుంపుగాఁ గలిసి యుద్ధము చేయవలయును. వీలయినపుడు వారిని తక్షణమే వ్యాపింప జేయవలయును. నగరమందుఁగాని, కోటయందుఁగాని శత్రువుల సేనయందుఁ గాని ప్రవేశించి యుద్ధము చేయవలసి వచ్చినపుడు (సూచివ్యూహము) లేదా (వజ్రవ్యూహము) ఇరువైపులఁ బదునుగల ఖడ్గము రెండు వైపులఁ జీల్చునట్లు యుద్ధముచేయుచు ప్రవేశించుచుఁ బోవలయును. ఇట్లు అనేకప్రకారముం వ్యూహములను-సేనలనుదీర్చి-యుద్ధముఁ జేయింపవలయును. ఎదుట (శతఘ్ని) అనఁగా ఫిరంగి, తుపాకి వీనిని బ్రయోగించుచుండురేని (సర్పవ్యూహము) సర్పమువలెఁ బండుకొని ప్రాకుచు ఫిరంగుల యొద్దకుఁజేరి వారినిఁగొట్టి వానిని బట్టుకొనవలయును. లేక ఆ ఫిరంగులను వారి వైపునకే త్రిప్పి యా ఫిరంగులచేతను, తుపాకుల చేతను వారిని గొట్టవలయును. లేదా ఈ ఫిరంగుల కెదురుగ వృద్ధులను గుఱ్ఱముల మీఁద పంపుచు శత్రువులను గొట్టవలయును. నడుమనడుమ మంచిమంచి గుఱ్ఱపురౌతుల నుంచవలయును. ఒకపేతూరి పరుగెత్తి మీఁదబడి శత్రువుల సేనను ఛిన్నభిన్నముఁజేసి పట్టుకొనవలయును లేక తఱిమి వేయవలయును.

స్యందనాశ్వైః సమే యుధ్యేదనూపే నౌద్విపైస్తథా।
వృక్షగుల్మావృతే చాపైరసిచర్మాయుధైః స్థలే॥...౧౯౨॥

సమభూమియందు రథాశ్వ పదాతులతోను, సముద్రమందు నావల మీదను, జలము కొద్దిగానున్న ఏనుగులమీదను, చెట్లయందును, పొదలలో

బాణముంచేతను. ఇసుక భూములయందుఁ గత్తి డాలులతోను యుద్ధము చేయ వలయును చేయింపవలయును.

> ప్రహర్షయేద్బలం వ్యూహ్య తాంశ్చ సమ్యక్పరీక్షయేత్।
> చేష్టాశ్చైవ విజానీయా దరీన్ యోధయతామపి॥ ...౧౯౪॥

యుద్ధసమయమందు యుద్ధము చేయువారికి హర్షోత్సాహములను గలిగింపవలయును. యుద్ధము నిలువఁగానే శౌర్యమును, యుద్ధమందుత్సాహమును గలిగించి, వక్తృత్వముచేతను, అన్నపానవస్త్రశస్త్ర సహాయములచేతను, ఔషధాదులచేతను, అందఱి మనస్సులను ప్రసన్నపఱుపవలయును. వ్యూహము దీర్పక యెన్నఁడును యుద్ధము చేయఁగూడదు, చేయింపను గూడదు. చక్కఁగా యుద్ధము చేయుచున్నారా, లేక కపటముతో వర్తిల్లుచున్నారా అని తెలిసికొనుటకు యుద్ధము చేయుచుండు తన సేన చేష్టను గనిపెట్టి యుండవలయును.

> ఉపరుధ్యారిమాసీత రాష్ట్రంచాస్యోపపీడయేత్।
> దూషయేచ్చాస్య సతతం యవసాన్నోదకేంధనమ్॥ ...౧౯౫॥

ఉచితమని తోఁచినపుడు శత్రుసేనలను నాలుగు వైపుల ముట్టడించి యాటంకపఱచి యుంచవలయును. శత్రువుల యాహారపదార్థములను, నీటిని, ఇంధనములను నాశనము జేయవలయును.

> భింద్యాచ్చైవ తటాగాని ప్రాకారపరిఖా స్తథా।
> సమవస్కందయేచ్చైనం రాత్రౌ విత్రాసయేత్తథా॥...౧౯౬॥

శత్రువుల చెఱువు, నగరము, కోట, అగడ్త వీనిని బగుల గొట్టి భయ పెట్టుచు జయించు నుపాయము చేయవలయును.

> ప్రమాణాని చ కుర్వీత తేషాం ధర్మ్యాన్యథోదితాన్।
> రత్నైశ్చ పూజయేదేనం ప్రధానపురుషైః సహ॥...౨౦౩॥

జయించి వారినుండి ప్రమాణమును-ప్రతిజ్ఞను-వ్రాయించి పుచ్చుకొన వలయును. ఉచితమని తోఁచినపుడు అతని వంశస్థుఁడగు మఱి యేధార్మిక పురుషునేని రాజుగాఁ జేయనగును. నీవు మా యాజ్ఞానుసారము నడచి న్యాయముతో ప్రజలను బాలింపవలయునని యుపదేశించి యట్లే వానినుండి వ్రాయించి పుచ్చుకొనవలయును. మరల నుపద్రవము కలుగకుండులాగున నతని యొద్ద నొకపురుషునుంచవలయును. ఓడిపోయిన వానిని, ప్రధాన పురుషులతోఁ గలిసి

రత్నాది ఉత్తమ పదార్థముల నొసంగి సత్కరింపవలయును. వానియోగక్షేమమునకు భంగము కలిగింపఁగూడదు. కారాగృహమందుంచినను గూడ నోరు బచేఁగలిగిన శోకమునుమాని యానందముగా నుండునట్లు అతని నుచితరీతిని సత్కరింపవలయును.

అదాన మప్రియకరం దానం చ ప్రియకారకమ్।
అభీప్సితానా మర్థానాం కాలే యుక్తం ప్రశస్యతే॥ ...౨౦౪॥

ప్రపంచమందితరుల పదార్థమును గ్రహించుట వారియెడల నప్రీతికిని, ఇచ్చుట వారియెడ ప్రీతికిని గారణమగును. విశేషించి సమయోచితకార్యముల నెఱవేర్పవలయును; ఓడిన వానికి మనోవాంఛిత పదార్థముల నిచ్చుటయుత్తమము. అతని నెన్నఁడును ఎత్తిపొడువరాదు. ఎగతాళి చేయరాదు. అతని యెదుట 'చూడు నిన్ను జయించితిమి' అని కూడ ననరాదు. మీరు 'మాసోదరులవంటివారు' ఈ మొదలగు మాటలచే సదా గౌరవింపవలయును.

మిత్రుని లక్షణము:—

హిరణ్య భూమిసంప్రాప్త్యా పార్థివో న తథైధతే।
యథా మిత్రం ధ్రువం లబ్ధ్వా కృశమప్యాయతిక్షమమ్॥ మను. ౭. ౨౦౮॥

నిశ్చలమైన ప్రేమయున్నవాఁడును. భవిష్యద్విషయములను గూర్చి యోచించువాఁడును కార్యమును సాధించుటయందు సమర్థుఁడు నగుమిత్రునిగాని. లేక దుర్బలుఁడగు మిత్రునిగాని పొందుటవలన వర్ధిల్లునట్లు సువర్ణమును-భూమిని-పొంది రాజు వర్ధిల్లనేరఁడు.

ధర్మజ్ఞం చ కృతజ్ఞం చ తుష్టప్రకృతి మేవ చ।
అనురక్తం స్థిరారంభం లఘుమిత్రం ప్రశస్యతే॥ ...౨౦౯॥

ధర్మమును గుర్తెఱిఁగినవాఁడు, కృతజ్ఞుఁడు-చేసినమేలును మఱవని వాఁడు-ప్రసన్న స్వభావుఁడు, అనురాగియు, స్థిరారంభుఁడు నగు సామాన్య మిత్రునిఁ బొందియు రాజు ప్రశంసితుఁ డగుచున్నాఁడు.

ప్రాజ్ఞం కులీనం శూరం చ దక్షం దాతార మేవ చ।
కృతజ్ఞం ధృతిమంతం చ కష్టమాహు రరిం బుధాః॥ ...౨౧౦॥

బుద్ధిమంతుఁడు, కులీనుఁడు, శూరుఁడు, వీరుఁడు, చతురుఁడు, దాత, చేసిన యుపకారము నెన్నువాఁడు, ధైర్యవంతుఁడు నగు పురుషుని నెన్నఁడును

శత్రువుగాఁ జేసికొనఁగూడదు. దీనిని దృఢముగా నమ్మవలయును. అట్టివానిని శత్రువుగాఁ జేసికొన్నవాఁడు తప్పక దుఃముఁ బొందును.

ఉదాసీనుని లక్షణము:—

> ఆర్యతా పురుషజ్ఞానం శౌర్యం కరుణవేదితా
> స్థౌలలక్ష్యం చ సతత ముదాసీనగుణోదయః॥ మను.౭.౨౧౧॥

ప్రశంసిత గుణయుక్తుఁడు సజ్జన దుర్జన వివేక జ్ఞానముగలవాఁడు, శూరవీరుఁడు, కరుణగలవాఁడు, స్థూలలక్ష్యుఁడు-పై పైమాటలను నిరంతరము వినువాఁడు నగు నతఁ డుదాసీనుఁడు.

> ఏవం సర్వమిదం రాజా సహ సంమంత్ర్య మంత్రిభిః।
> వ్యాయామ్యాప్లుత్య మధ్యాహ్నే భోక్తుమంతఃపురం విశేత్॥ మను.౭.౨౧౬॥

పూర్వము చెప్పినట్లు ప్రాతఃకాలమందు లేచి శౌచాదులను సంధ్యోపాసనను సలిపి అగ్నిహోత్రమును జేసి లేక చేయించి, మంత్రులతో నాలోచించి, సేనలోనికిఁబోయి భృత్యులందఱితోను, సేనాధ్యక్షులతోను గలిసి వారిని సంతోషపఱచి నానా ప్రకారములగు వ్యూహశిక్ష - కవాయతు - చేసి చేయించి, యేనుగులు గుఱ్ఱములు ఆవులు మొదలగు వాని శాలలను, శస్త్రాస్త్రముల కోశములను, వైద్యాలయమును, ధనకోశములను బరీక్షించి, వానిలోఁ దొలఁగింపవలసినవానిని దొలఁగించి. వ్యాయామశాలకు బోయి వ్యాయామముఁజేసి, మధ్యాహ్నసమయమందు భోజనముకొఱకు అంతఃపురమును-భార్య మొదలగువారు నివసించు స్థానమును-బ్రవేశింపవలయును. ఏమ్మట సుపరీక్షితమును, బుద్ధి బల పరాక్రమవర్ధకమును, రోగనివారకమును, సుగంధిత మిష్టాద్యనేక రసయుక్తమును ఉత్తమమును అగు నన్నమును వ్యంజనపానాదికములను సుఖముగ నుండగలుగునట్లు భుజింపవలయును. ఈరీతిని మెలఁగుచు సమస్త రాజ్యకార్యముల నున్నతి పఱుపవలెను.

> పంచాశద్భాగ ఆదేయో రాజ్ఞా పశు హిరణ్యయోః।
> ధాన్యానా మష్టమో భాగః షష్ఠో ద్వాదశ ఏవ వా॥ మను.౭.౧౩౦॥

వ్యాపారము చేయువారినుండి, శిల్పకారులనుండి వారికి బంగారు వెండి మొదలగువానిలో గలుగు లాభములో నేఁబదియవ భాగమును, బియ్యము మొదలగు నాహారవస్తువులమీఁద నాఱవభాగమునో, యెనిమిదవ భాగమునో

లేదా పండ్రెండవభాగమునో పుచ్చుకొనవలయును. పొలము కాఁపులు మొదలగువారినుండి వారు భోజన పానములు, ధనములేక దుఃఖముఁ బొందకుండునట్లు పన్ను పుచ్చుకొనవలయును. ప్రజలు ధనాఢ్యులు, ఆరోగ్యవంతులు, అన్నపాన సంపన్నులునై యుండిరేని ఆ రాజుకూడ మిక్కిలి యున్నతినిబొందును. రాజు తన సంతానమునకు వలెఁ బ్రజలకు సుఖ మొసంగవలయును. ప్రజలు రాజును, రాజపురుషులను దమ తండ్రులవలె నెంచవలయును. కాఁపులు మొదలగు పారిశ్రామికులు రాజులకు రాజులు. ప్రజలులేరేని రాజుండఁడు. రాజులేఁడేని ప్రజలు నుండరు. రాజు ప్రజలు వీరిరువురును దమతమ కార్యముంయందు స్వతంత్రులుగను, సామాజిక కార్యములయందు పరస్పరము పరతంత్రులై ప్రీతితో మెలఁగవలయును. ప్రజల సమ్మతికి విరుద్ధముగా రాజుకాని, రాజపురుషులుగాని నడువఁగూడదు. రాజు నాజ్ఞకు విరోధముగా రాజపురుషులుకాని, ప్రజలుకాని నడవఁ దగదు. ఇది రాజనీతి. ('పాలిటిక్స్') సంక్షేపముగ నిట్లు వ్రాయఁబడినది. విశేషించి చూడఁగోరువారు నాలుగువేదములు, మనుస్మృతి, శుక్రనీతి, మహాభారతము మొదలగు వానియందుఁజూచి నిశ్చయించుకొన నగును. ప్రజల వివాద పరిష్కార వ్యవహారములు మనుస్మృతి అష్టమ నవమాధ్యాయాదుల ననుసరించి చేయవలయును. ఇచ్చట సంక్షేపముగ వ్రాయఁబడును :—

ప్రత్యహం దేశదృష్టైశ్చ శాస్త్రదృష్టైశ్చ హేతుభిః।
అష్టాదశసు మార్గేషు నిబద్ధాని పృథక్ పృథక్॥ మను.౮.౩ ॥

సభయు, రాజును, రాజపురుషు లందఱును దేశాచారశాస్త్ర వ్యవహార హేతువులచే నీ క్రింద వ్రాయఁబడు పదునెనిమిది వివాదాస్పదములగు మార్గములయందలి వివాదవిషయములను ప్రతిదినము నిర్ణయింపవలయును. శాస్త్రములందుఁ జెప్పఁబడని యేవేని నియమములు ఆవశ్యకములని తోఁచినపుడు రాజును, ప్రజలును ఉన్నతిని గలిగించునట్టి యుత్తమోత్తమ నియమముం నేర్పఱుపవలయును.

తేషామాద్యమృణాదానం నిక్షేపోఽస్వామివిక్రయః।
సంభూయ చ సముత్థానం దత్తస్యానపకర్మ చ॥ ...౮.౪॥

వివాదాస్పదములగు పదునెనిమిదివిషయములు:— ౧. (ఋణాదానమ్)ఎవరి నుండియేని ఋణమిచ్చిపుచ్చుకొనుట ౨. (నిక్షేపమ్) కుదువపెట్టిన పదార్థమును

ఏక ఏవ సుహృద్ధర్మో నిధనేప్యనుయాతి యః।
శరీరేణ సమం నాశం సర్వమన్యద్ధి గచ్ఛతి॥ ...౮-౧౭॥

ఈ ప్రపంచమందు మృత్యువునకుఁ బిమ్మటఁగూడ వెంబడించివచ్చు నది ఈ ధర్మమను స్నేహితుఁడొక్కఁడే. శరీరము నశించినతోడనే తక్కిన పదార్థములన్నియు నాశము పొందును. అనఁగా సంగము వదలిపోవును. ధర్మము వదలదు.

పాదోఽధర్మస్య కర్తారం పాదః సాక్షిణమృచ్ఛతి।
పాదః సభాసదః సర్వాన్ పాదో రాజానమృచ్ఛతి. ౮-౧౮॥

రాజసభయందుఁ బక్షపాతముచే నన్యాయము జరిగెనేని అక్కడి యధర్మము నాలుగు భాగములగుచున్నది:- దానిలో నొకభాగము చేసినవానిని. రెండవభాగము సాక్షిని, మూఁడవ భాగము సభాసదులను. నాలుగవ భాగము అయధర్ముల సభ కధిపతియగు రాజును బొందును.

రాజా భవత్యనేనాస్తు ముచ్యంతే చ సభాసదః।
ఏనో గచ్ఛతి కర్తారం నిందార్హో యత్ర నింద్యతే॥ మను-౮-౧౯॥

ఏ సభయందు నిందకు తగిన వారికి నింద, స్తుతికి యోగ్యులగువారికి స్తుతియు, దండనకర్హులగు వారికి దండన, మన్ననకు యోగ్యులగు వారికి మన్నన గలుగుచున్నదో యక్కడ రాజును, సభాసదులను, పాపరహితులై పవిత్రులగుచున్నారు. పాపము చేసినవారికే పాపము కలుగును.

సాక్షులు:-

ఆప్తాః సర్వేషు వర్ణేషు కార్యాః కార్యేషు సాక్షిణః।
సర్వ ధర్మవిదోఽలుబ్ధా విపరీతాంస్తు వర్జయేత్॥ మను-౮-౬౩॥

అన్ని వర్ణములయందును, ధార్మికులును, విద్వాంసులును, నిష్కపటులును, సర్వ ధర్మములు గు ర్తెఱింగినవారును, లోభరహితులును, సత్యవాదులను అగువారినే న్యాయవ్యవస్థయందు సాక్షులుగాఁ దీసికొన వలయును. దీనికి విపరీతముగ నుండువారి సాక్ష్యము గ్రహింపఁగూడదు.

స్త్రీణాం సాక్ష్యం స్త్రియః కుర్యుర్ద్విజానాం సదృశా ద్విజాః।
శూద్రాశ్చ సంతః శూద్రాణా మంత్యానామంత్యయోనయః॥ ...౬౮॥

స్త్రీలకు స్త్రీలును, ద్విజులకు ద్విజులును, శూద్రులకు శూద్రులును, అంత్యజులకు అంత్యజులును సాక్షులుగా నుండవలయును.

సాహసేషు చ సర్వేషు స్తేయసంగ్రహణేషు చ।
వాగ్దండయోశ్చ పారుష్యే న పరీక్షేత సాక్షిణః ॥ ...౭౨॥

బలాత్కార కర్మములగు దొంగతనము, వ్యభిచారము, కఠోర వచనము, కొట్టుట, ఇట్టి యపరాధములయందు సాక్షిని బరీక్షింపరాదు. సాక్షి యావశ్యకమని యెంచనురాదు. ఈ పనులన్నియు గుప్తముగా జరుగునుగదా.

బహుత్వం పరిగృహ్ణీయాత్సాక్షి ద్వైధే నరాధిపః।
సమేషు తు గుణోత్కృష్టాన్ గుణద్వైధే ద్విజోత్తమాన్॥ ...౭౩॥

రెండు వైపులను సాక్షులుండిరేని బహు సంఖ్యానుసారమును, రెండు వైపులను సమానముగ సాక్షులుండిరేని ఉత్తమ పురుషుల సాక్ష్యమున కనుకూలముగను, రెండు వైపుల సాక్షులును ఉత్తమ పురుషులుగ నుండిరేని ద్విజోత్తముల - ఋషి, మహర్షి, యనుల సాక్ష్యమున కనుసారముగను న్యాయము చేయవలయును.

సమక్షదర్శనాత్సాక్ష్యం శ్రవణాచ్చైవ సిధ్యతి।
తత్ర సత్యం బ్రువన్ సాక్షీ ధర్మార్థాభ్యాం న హీయతే॥ మను–౭౪॥

సాక్ష్యము రెండు విధములు. సాక్షాత్తుగఁ జూచిన సాక్ష్యము. విన్న సాక్ష్యము. సభయందడిగినపుడు సత్యము చెప్పిన సాక్షులు ధర్మహీనులుగాని, దండనీయులుగాని గారాదు. అసత్యము చెప్పిన సాక్షులను యథాయోగ్యముగ దండింపవలయును.

సాక్షీ దృష్టశ్రుతాదన్య ద్విబ్రువన్నార్య సంసది।
అవాఙ్నరకమభ్యేతి ప్రేత్య స్వర్గాచ్చ హీయతే॥ ...౭౫॥

రాజసభయందుఁగాని, యే యుత్తమ పురుషుల సభయందుఁగాని సాక్షి యగునతఁడు చూచిన దానికిని, వినినదానికిని విరుద్ధముగఁ జెప్పెనేని యతని (జిహ్వాచ్ఛేదనము) నాలుక కోయవలయును. వాఁడింతియకాక మృతినొందిన పిమ్మటఁకూడ సుఖమునుండి దూరమగును.

స్వభావేనైవ యద్బ్రూయు స్తద్గ్రాహ్యం వ్యావహారికమ్।
అతో యదన్యద్విబ్రూయుర్ధర్మార్థం తదపార్థకమ్॥ ...౭౮॥

సాక్షి, స్వభావముచేఁ జెప్పు వ్యవహార సంబంధపు మాటలను నమ్మవలయునే కాని, వ్యతిరిక్తముగ నేర్పబడి చెప్పినమాటలను నమ్మఁగూడదు. న్యాయాధీశుఁడు వానిని వ్యర్థమని తెలియవలయును.

సభాంతః సాక్షిణః ప్రాప్తా నర్థిప్రత్యర్థి సన్నిధౌ।
ప్రాడ్వివాకోఽనుయుంజీత విధినానేన సాంత్వయన్॥ ...౭౯॥

సభలో వాది ప్రతివాదుల యెదుట సాక్షులు ప్రవేశించినపుడు—న్యాయాధీశుఁడు, ప్రాడ్వివాకులు (వకీలు, బారిస్టరులును) వారితో శాంతి పూర్వకముగ నిట్లు చెప్పవలయును:-

యద్ద్వయోరనయోర్వేత్థ కార్యేఽస్మిన్ చేష్టితం మిథః।
తద్బ్రూత సర్వం సత్యేన యుష్మాకం హ్యత్ర సాక్షితా॥ ...౮౦॥

ఓ సాక్షులారా! ఈ కార్యమందీ యిరువుర విషయములను మీకుఁ దెలిసిన దానిని సత్యముగాఁ జెప్పుఁడు. ఏలయన గా నీ విషయమున మీరు సాక్షులయియున్నారు.

సత్యం సాక్ష్యే బ్రువన్సాక్షీ లోకానాప్నోతి పుష్కలాన్।
ఇహ చానుత్తమాం కీర్తిం వాగేషా బ్రహ్మపూజితా॥ ...౮౧॥

సత్యమును జెప్పుసాక్షి జన్మాంతరమందు త్తమ జన్మమును, ఉత్తమ లోకాంతరము లందలి జన్మమును బొంది సుఖించును. ఈ జన్మమందును పర జన్మమందును గీర్తిని బొందును. వేదములందీ వాణియే సత్కారమునకును, తిరస్కారమునకును గారణమని వ్రాయఁబడియున్నది. సత్యము చెప్పువాఁడు గౌరవింపఁబడును. అసత్యముఁ జెప్పువాఁడు నిందింపఁబడును.

సత్యేన పూయతే సాక్షీ ధర్మః సత్యేన వర్ధతే।
తస్మాత్సత్యం హి వక్తవ్యం సర్వవర్ణేషు సాక్షిభిః॥ ...౮౩॥

సత్యము చెప్పుటచే సాక్షి పవిత్రుఁడగుచున్నాఁడు. సత్యము చెప్పుటచేతనే ధర్మము వర్ధిల్లును. కాఁబట్టి అన్నివర్ణముల సాక్షులు సత్యమునే చెప్పుట యోగ్యము.

ఆత్మైవ హ్యాత్మనః సాక్షీ గతిరాత్మా తథాత్మనః।
మావమంస్థాః స్వమాత్మానం నృణాం సాక్షిణముత్తమమ్॥ ...౮౪॥

ఆత్మకు సాక్షి ఆత్మ. ఆత్మకు గతియు నాత్మయే. దీనిని దెలిసి ఓ మనుష్యుఁడా! మనుష్యులందఱికిని ఉత్తమ సాక్షియగు నీయాత్మను అవమానపఱుపకుము. నీయాత్మయందును, మనస్సునందును, వాణియందును ఉండు సత్యభాషణమే సత్యము. దీనికి విపరీతమయినది అసత్యము.

యస్య విద్వాన్హి వదతః క్షేత్రజ్ఞో నాభిశంకతే।
తస్మాన్న దేవాః శ్రేయాంసం లోకేఽన్యం పురుషం విదుః॥ ౯౬॥

సాక్ష్యము చెప్పుచుండు నేపురుషుని యాత్మ (విద్వాన్క్షేత్రజ్ఞుఁడు) "శరీరమును గుర్తెఱుఁగునది" లోపల శంకను బొందదో అట్టిపురుషుని కంటె నుత్తముండని విద్వాంసులు మఱెవనిని గ్రహింపరు

ఏకోఽహమస్మీత్యాత్మానం యత్త్వం కల్యాణ మన్యసే।
నిత్యం స్థిత స్తే హృద్యేష పుణ్యపాపేక్షితా మునిః॥ ...౯౧॥

కల్యాణమును గోరు ఓ పురుషుఁడా! నీ వొంటిగా నున్నావని నీయాత్మ యందుఁ దెలిసి నీవసత్యమాడరాదు. నీహృదయమందు నంతర్యామి రూపముచే పుణ్యపాపములను జూచు ముని.-పరమేశ్వరుఁడు—మదియొకఁడున్నాఁడు. ఆ పరమాత్మకు భయపడుచు సర్వదా సత్యమునే చెప్పుము.

లోభాన్మోహాద్భయాన్మైత్ర్యాత్కామాత్క్రోధాత్తథైవ చ।
అజ్ఞానా ద్బాలభావాచ్చ సాక్ష్యం వితథ ముచ్యతే॥ మను-౮-౧౧౮॥

లోభము. మోహము. స్నేహము. కామము. క్రోధము. అజ్ఞానము. పసితనములచేత ఇచ్చిన సాక్ష్యములు ప్రమాణార్హములు కావు.

ఏషా మన్యతమే స్థానే యః సాక్ష్యమనృతం వదేత్।
తస్యదండవిశేషాంస్తు ప్రవక్ష్యామ్యనుపూర్వశః॥ ...౧౧౯॥

వీనిలో నేస్థానమందైన నను సాక్షి అబద్ధమాడెనేని శిక్ష క్రిందఁ జెప్పఁబడురీతిని దండింపఁబడ వలయును:—

లోభాత్సహస్రం దండ్యస్తు మోహాత్పూర్వం తు సాహసమ్।
భయా ద్ద్వౌ మధ్యమౌ దండ్యౌ మైత్రాత్పూర్వం చతుర్గుణమ్॥ ...౧౨౦॥

లోభముచే నబద్ధపు సాక్ష్యమిచ్చెనేని వానినుండి పదునేను రూపాయల పదియణాలును. మోహముతో నట్టిసాక్ష్యమిచ్చెనేని మూఁడు రూపాయల రెండ ణాలును. భయముచే నట్టిసాక్ష్య మిచ్చెనేని ఆఱు రూపాయల పావులాయు. స్నేహముచే నిచ్చెనేని పంద్రెండు రూపాయల నఱయ దండుగఁ బుచ్చుకొన వలయును.

కామా ద్దశగుణం పూర్వం క్రోధాత్తు త్రిగుణం పరమ్।
అజ్ఞానా ద్ద్వే శతే పూర్ణే బాలిశ్యాచ్ఛత మేవ తు॥ ...౧౨౧॥

కామముచే నబద్ధపు సాక్ష్యమిచ్చిన వాని కిఱువదియైదు రూపాయలును, క్రోధముచే నిచ్చిన వానినుండి నలువదియాఱు రూపాయల పదునాలుగణాలును, అజ్ఞానముచే నిచ్చెనేని ఆఱు రూపాయలును, పసితనముచే నట్టి సాక్ష్యమిచ్చెనేని వానినుండి ఒక రూపాయ తొమ్మిదియణాలును దండుగ విధింపవలయును.

ఉపస్థ ముదరం జిహ్వా హస్తౌ పాదౌ చ పంచమమ్ ।
చక్షుర్నాసా చ కర్ణౌ చ ధనం దేహస్తథైవ చ॥ ..౧౨౫॥

దండించుటకు నుపస్థేంద్రియము, కడుపు, నాలుక, చేతులు, కాళ్లు, కన్నులు, ముక్కు, చెవులు, ధనము, దేహము ఈ పదియును స్థానములు, అనఁగా వీనియందే శిక్షింపవలయును.

అనుబంధం పరిజ్ఞాయ దేశకాలౌ చ తత్త్వతః ।
సారాపరాధౌ చాలోక్య దండం దండ్యేషు పాతయేత్॥ ..౧౨౬॥

వ్రాయఁబడిన దండనకంటె నెక్కువగూడ విధింపవచ్చును. ఎట్లనఁగా లోభముచేఁ దప్పుసాక్ష్యమిచ్చువానికి పదునేను రూపాయల పదియణాలు దండుగ వ్రాయఁబడియున్నది కాని అత్యంత నిర్ధనుఁడయ్యెనేని వానినుండి తక్కువగను, ధనాఢ్యుఁడయ్యెనేని రెండింతలు మూఁడింతలు నాలుగింతల వఱకును గూడ విధింప వచ్చును. దేశమును, గాలమును, అపరాధముఁ జేసినవాని పరిస్థితిని బట్టి దండింపవలయును.

అధర్మదండనం లోకే యశోఘ్నం కీర్తినాశనమ్ ।
అస్వర్గ్యం చ పరత్రాపి తస్మాత్తత్పరివర్జయేత్ ॥ మను-౧౨౭॥

అధర్మయుక్తమైన దండనపూర్వప్రతిష్ఠను, వర్తమాన భవిష్యత్తులయు పరజన్మయు కీర్తిని నశింపఁజేసి పరజన్మమందును దుఃఖమును గలిగించును. కాఁబట్టి యధర్మ పూర్వకముగా నెన్నఁడును దండింపఁగూడదు.

అదండ్యాన్దండయన్ రాజా దండ్యాంశ్చైవాప్యదండయన్।
అయశో మహదాప్నోతి నరకం చైవ గచ్ఛతి॥ ..౧౨౮॥

దండనీయులను దండింపక అదండనీయులను దండించు రాజు బ్రతికియుండునపుడు గొప్పనిందను, చచ్చిన పిమ్మట మహాదుఃఖమును బొందును. కాఁబట్టి యపరాధము చేసినవానినే దండింపవలయును. అనపరాధిని నెన్నటికిని దండింపఁగూడదు.

వాగ్దండం ప్రథమం కుర్యాద్ధిగ్దండం తదనంతరమ్।
తృతీయం ధనదండం తు వధదండ మతః పరమ్॥ ..౧౨౯॥

దండము నాల్గువిధములు:- మొదటిది వాగ్దండము— నిందించుట. రెండవది ధిగ్దండము-నీవేల యిట్టివని చేసితివి అని ధిక్కరించుట. మూఁడవది ధనదండము-జరిమానా. నాల్గవది వధదండము-కొరడాలోఁగాని బెత్తములోఁగానిఁ గొట్టుట లేదా శిరచ్ఛేదనము చేయుట.

యేన యేన యథాంగేన స్తేనో నృషు విచేష్టతే।
తత్తదేవ హరేదస్య ప్రత్యాదేశాయ పార్థివః॥ ..౩౩౪॥

దొంగ ఏయేయంగముచే నెట్లు మనుష్యులయందు విరుద్ధచేష్టను జేయుచున్నాఁడో ఆయా యంగమును (మనుష్యులందరికి శిక్ష నేర్పుటకు) రాజు ఛేదింపవలయును.

పితాచార్యః సుహృన్మాతా భార్యా పుత్రః పురోహితః।
నాదండ్యో నామ రాజ్ఞోఽస్తి యః స్వధర్మే న తిష్ఠతి। ..౩౩౫॥

స్వధర్మ మాచరింపనివాఁడు తండ్రియైనను, ఆచార్యుఁడైనను, మిత్రుఁడైనను, స్త్రీయైనను, పుత్రుఁడైనను,పురోహితుఁడైనను,రాజునకు దండ్యుఁడు. అనఁగా రాజు న్యాయాసనమందుఁ గూర్చుండి న్యాయముజేయునపుడు ఎవరికిని పక్షపాతము చేయక యథోచితముగ దండింపవలయును.

కార్షాపణం భవేద్దండ్యో యత్రాన్యః ప్రాకృతో జనః।
తత్ర రాజా భవేద్దండ్యః సహస్రమితి ధారణా॥ ..మను-౩౩౬॥

ఏ యపరాధ మొనర్చి సాధారణ మనుష్యున కొకకాని దండుగ విధింపఁబడునో యా యపరాధ మొనర్చిన రాజునకు వేయి కానులుదండుగ విధింపఁబడవలయును. అనఁగా సాధారణ మనుష్యునకంటె రాజునకు వేయిరెట్లును, మంత్రికి నెనిమిదివందలరెట్లును, అతనికంటె దక్కువగువానికి నేఁడువందలరెట్లును, అతనికంటెఁ గ్రిందివానికి నాఱువందల రెట్లును దండుగ విధింపఁబడవలెను. ఈ రీతిని ఉత్తరోత్తరము-సర్వాంత్యల్పుఁడగు భృత్యునకు-ఎనిమిది రెట్లకంటెఁ దక్కువగా శిక్ష కలుగఁగూడదు. (అనఁగాఁ ప్రజల కంటె ఉద్యోగుల కెక్కువ శిక్ష విధింపఁబడవలయును.) అట్లు లేకుండిన నుద్యోగులు ప్రజలను నాశనము చేయుదురు. సింహమధికదండనచేతను, మేక అల్పదండన

చేతను వశమగును. కావున రాజు మొదలుకొని కట్టకడపటి భృత్యునివఱకు నుండు ఉద్యోగులకు అపరాధమందు, సామాన్య ప్రజలకంటె నధికశిక్ష విధింపవలయును.

అష్టాపాద్యం తు శూద్రస్య స్తేయే భవతి కిల్బిషమ్।
షోడశైవ తు వైశ్యస్య ద్వాత్రింశత్ క్షత్రియస్య చ॥ ...౩౩౭॥

అట్లే కొంత వివేకముగల శూద్రుఁడు దొంగిలించినచో నెనిమిది రెట్లును, అట్టి వైశ్యునకుఁ బదియాఱురెట్లును. క్షత్రియునకు ముప్పదిరెండు రెట్లును.

బ్రాహ్మణస్య చతుఃషష్టిః పూర్ణం వాఽపి శతం భవేత్।
ద్విగుణా వా చతుఃషష్టి స్తద్దోషగుణవిద్ధి సః॥ ...౩౩౮॥

బ్రాహ్మణునకు అఱువదినాల్గురెట్లుకాని, నూఱురెట్లుకాని, నూటయిఱువదెనిమిదిరెట్లుకాని శిక్ష కలుగవలయును. అనఁగా జ్ఞానమును, ప్రతిష్ఠయు నెవనికెంత యధికముగా నుండునో-వానికి దండనము నట్లే యధికముగా విధింపఁబడవలయును.

ఐంద్రం స్థానమభిప్రేప్సుర్యశ శ్చాక్షయ మవ్యయమ్।
నోపేక్షేత క్షణమపి రాజా సాహసికం నరమ్॥ మను-౩౪౪॥

రాజ్యాధికారులును, ధర్మమును ఐశ్వర్యమును ఇచ్ఛగించు-రాజును, బలాత్కారముగ దోఁచుకొను బందిపోటు మొదలగు దొంగలను శిక్షించుట యందు ఒక్క క్షణమేని ఆలస్య మొనర్పఁగూడదు.

సాహసపురుషుని లక్షణము:—

వాగ్దుష్టాత్తస్కరాచ్చైవ దండేనైవ చ హింసతః।
సాహసస్య నరః కర్తా విజ్ఞేయః పాపకృత్తమః॥—...౩౪౫॥

దుష్టవచనములను జెప్పువానికంటె, దొంగతనముఁ జేయువానికంటె, దండముచే హింసించువానికంటె, సాహసించి బలాత్కారపు పనులు చేయువాఁడు మహాపాపి-దుష్టుఁడు అని తెలియవలయును.

సాహసే వర్తమానం తు యో మర్షయతి పార్థివః।
స వినాశం వ్రజత్యాశు విద్వేషం చాధిగచ్ఛతి॥—...౩౪౬॥

ఏ రాజు (దుష్టకార్యమందు) సాహసించి వర్తించు పురుషుని దండింపక సహనముతో నుండునో యతఁడు శీఘ్రమే వినాశమును బొందును. రాజ్యమందు ద్వేషము పుట్టును.

న మిత్రకారణాద్రాజా విపులాద్వా ధనాగమాత్ ।
సముత్సృజేత్సాహసికాన్ సర్వభూతభయావహాన్ ॥—..౩౪౭॥

సమస్త ప్రాణులకు దుఃఖమిచ్చు సాహసికపురుషుఁడు తనమిత్రుఁడైనను, ధనవంతుఁడైనను లక్ష్యముసేయక (అతనిని బంధింపకయు, ఛేదింపకయు) ఎన్నటికిని విడువఁగూడదు.

గురుం వా బాలవృద్ధౌ వా బ్రాహ్మణం వా బహుశ్రుతమ్ ।
ఆతతాయినమాయాంతం హన్యాదేవాఽవిచారయన్ ॥—..౩౫౦॥

ధర్మమును వదలి యధర్మమునందు వర్తించుచు నపరాధముఁజేయుచు నితరులను జంపువానిని తన గురువైనను, పుత్రుఁడైనను, దండ్రియైనను, బ్రాహ్మణుఁడైనను, మరి యనేక శాస్త్రముల వినినవాఁడైనను విచారింపక చంపివేయ వలయును-చంపిన పిమ్మట విచారింపవలయును.

నాతతాయివధే దోషో హంతుర్భవతి కశ్చన ।
ప్రకాశం వాఽప్రకాశం వా మన్యుస్తన్మన్యుమృచ్ఛతి ॥—..౩౫౧॥

దుష్టపురుషులను బహిరంగముగాఁ జంపినను, రహస్యముగాఁ జంపినను జంపినవానికిఁ బాపము కలుగదు. ఏలయనఁగా క్రోధిని, గ్రోధముతోఁ జంపుట క్రోధముతోఁ గ్రోధమునకు యుద్ధమని తెలియవలయును.

యస్య స్తేనః పురే నాస్తి నాన్యస్త్రీగో న దుష్టవాక్ ।
న సాహసికదండఘ్నౌ స రాజా శక్రలోకభాక్ ..—౩౮౬॥

ఏ రాజు రాజ్యమందు దొంగలు కాని, పరస్త్రీగాములు కాని, దుష్ట వచనములను జెప్పువారు కాని, సాహసికులుగాని, బందిపోటు దొంగలు కాని, రాజాజ్ఞను భంగపఱచు వారుకాని లేరో ఆరాజు మిక్కిలి శ్రేష్ఠుఁడు.

భర్తారం లంఘయేద్యా స్త్రీ స్వజ్ఞాతిగుణదర్పితా।
తాం శ్వభిః ఖాదయేద్రాజా సంస్థానే బహుసంస్థితే॥ మను.౮.౩౭౧

ఏ స్త్రీ తనజాతి, గుణముల గర్వముచేఁ బతిని వదలి వ్యభిచరించునో దానిని అనేక స్త్రీ పురుషుల యెదుట బ్రతికి యుండఁగాఁ గుక్కలచేఁ గఱిపించి రాజు చంపివేయవలయును.

పుమాంసం దాహయేత్పాపం శయనే తప్త ఆయసే।
అభ్యాదధ్యుశ్చ కాష్ఠాని తత్ర దహ్యేత పాపకృత్॥ ...౩౭౨॥

అదేరీతిని తన స్త్రీని వదలి పరస్త్రీ గమనముఁగాని, వేశ్యాగమనముగాని చేసిన పాపులను ఎఱ్ఱఁగాఁ గాచిన యినుప మంచములమీఁదఁ బరుండఁబెట్టి యనేక పురుషుల యెదుట భస్మముఁజేసి వేయవలయును.

ప్రశ్న :— రాజుగాని, రాణిగాని లేక న్యాయాధీశుఁడుగాని, వాని భార్యగాని, వ్యభిచారాది పాపము లొనర్చి రేని వారిని దండించు వారెవరు?

ఉత్తరము:— సభవారు దండింపవలయును. వారికి శిక్షయుఁ బ్రజల కంటె నధికముగ నుండవలయును.

ప్రశ్న :— రాజు మొదలగు వారు సభవలన శిక్ష నేల గ్రహింతురు?

ఉత్తరము :— రాజు ఒక పుణ్యాత్ముఁడు, భాగ్యశాలియగు పురుషుఁడు-అతనికి శిక్ష విధింపకయు నతఁడే శిక్షను గ్రహింపకయు నుండెనేని ఇతరులు శిక్షనేల యంగీకరింతురు? ప్రజలును ప్రధానియు, అధికారులును, సభయు న్యాయముగా దండింపఁ గోరిరేని ఒంటిరాజేమి చేయగలఁడు? ఇట్టి వ్యవస్థ లేకుండునేని రాజును, ప్రధానియు, సమర్థ పురుషులందఱును అన్యాయమందు మునిఁగి న్యాయధర్మములను ముంచి ప్రజల నందఱను నాశముచేసి తామును నష్టమైపోదురు. న్యాయయుక్తమగు దండమునకే రాజు అనియు, ధర్మమనియుఁ బేరు. దానిని నష్టపఱచు వానికంటె నీచపురుషుఁడు మఱెవ్వఁడును లేఁడు అను నీ శ్లోకార్థమును రాజు స్మరింపవలయును.

ప్రశ్న :- మీరు వర్ణించినట్లు కఠినముగా దండించుట యుచితము కాదు. ఏలయనఁగా మనుష్యుఁడు, ఏయంగమునేని సృష్టించువాఁడుకాని బ్రదికించువాఁడుకాని కాఁడు. కాబట్టి యట్లు దండింపఁగూడదు.

ఉత్తరము:- దీనిని కఠినమని యెంచువారు రాజనీతిని గుర్తెఱుఁగరు: ఏలయనఁగా ఇట్లు ఒకనిని దండించుటచేత లోకు లందఱు చెడుపనుల నుండి

దూరమగుదురు. ధర్మమార్గమందుందురు. యథార్థముగఁ జూచితిమేని అవ గింజంతయేని పరుం భాగమునకు రానిది యీదండనయే. సుగమమైన దండన కలిగెనేని దుష్టకార్యములు విశేషముగ వృద్ధిబెందును. మీరు సుగమదండమని యెంచునది కోటిరెట్లుకఠినమగుచున్నది. ఏలయనఁగా ననేకులు దుష్టకార్యము లొనర్చిరేని గొంచెము గొంచెముగానే దండింపవలసివచ్చును. అనఁగా నొకని కొక మణుగు దండనయు, మఱియొకనికి పావుదండనయు నిచ్చితిమేని రెండునుగలిసి యొక మణుగుంబావు దండన యగును. దీనిని వారిరువురకు సమభాగము చేసితిమేని ప్రతివానికిని ఇఱువది సేరుల యఱపావు దండన యగును. దుష్టులు ఇట్టి సుగమ దండననేమి లక్ష్యముచేయుదురు, ఒకని కొక మణుగు దండనయు, వేవురకు ఒక్కొక్కని కొక్కొక్క పావు దండనయుఁ గలిగెనుకొందము. వేవుర దండన గలిసి మనుష్యజాతి మీఁద నాఱుమణుగుల పావుదండన పడును గనుక అధికమగుచున్నది. ఇదియే కఠినము. ఒక మను ష్యునకు నొక మణుగుదండన యిచ్చుటయే తక్కువయు, సుగమము నగు చున్నది. కాఁబట్టి మేము వర్ణించిన దండమే సుగమము.

> దీర్ఘాధ్వని యథా దేశం యథా కాలం తరో భవేత్ ।
> నదీతీరేషు తద్విద్యాత్సముద్రే నాస్తి లక్షణమ్॥ మను. ౮-౪౦౬॥

మిక్కిలి నిడుదయగు మార్గమందు, సముద్ర తీరములందును, నదుల యందును-ఆ యా ప్రదేముల పై కాలమునుబట్టి పన్ను విధింపవలయును. మహాసముద్రములయందుఁ బన్ను నియమింప వలను పడదు. కాఁబట్టి అను కూలమగునట్టి-రాజునకును గొప్పగొప్ప నావికులకును లాభము కలుగునట్టి వ్యవస్థఁ జేయవలయును. పూర్వము ఈ దేశస్థులు నావలు నడుపుచుండలేదను మాట సర్వదా అబద్ధమని యెంచవలయును. దేశ దేశాంతరములందును, ద్వీప ద్వీపాంతరములందును నావలపైఁబోయి వచ్చు తన ప్రజలకు దుఃఖ మేమాత్రమును గలుగకుండు నట్లు రాజు రక్షింపవలయును.

> అహన్యహన్యవేక్షేత కర్మాన్తాన్ వాహనాని చ ।
> ఆయవ్యయౌ చ నియతా వాకరాన్ కోశమేవ చ॥ మను. ౮-౪౧౯॥

రాజు ప్రతిదినమును దన కార్యములు ముగించిన పిమ్మట నేనుఁగులు గుఱ్ఱములు మొదలగు వాహనములను, ఆయవ్యయములను, రత్నాదుల ఆకర ములను, కోశమును బరీక్షింపవలయును.

ఏవం సర్వానిమాన్రాజా వ్యవహారాన్సమాపయ న్ ।
వ్యపోహ్య కిల్బిషం సర్వం ప్రాప్నోతి పరమాం గతిమ్॥ ...౮.౨౦౧

రాజు ఈ ప్రకారము సమస్త వ్యవహారములను యథారీతిని ముగించి, ముగింపఁ జేయుటచే సమస్త పాపములనుండి విముక్తుఁడయి పరమగతి యను మోక్షానందమును బొందును.

ప్రశ్న :- సంస్కృత విద్యయఁదు రాజనీతి సంపూర్ణము గనున్నదా అసంపూర్ణ మగనా ?

ఉత్తరము :- పూర్తిగా నున్నది. భూగోళమందు నడుచుచుండు-నడువగలయట్టి రాజనీతియంతయు సంస్కృతవిద్యనుండియే గ్రహింపబడినది. ప్రత్యక్షముగా వ్రాయబడని విషయములకొఱకు-

ప్రత్యహం లోకదృష్టైశ్చ శాస్త్రదృష్టైశ్చ హేతుభిః॥ మను॥ ౮.౩॥

రాజానకును ప్రజలకును సుఖకారకము లనియు, ధర్మయుక్తము లనియు నెంచఁబడు ఆయా నియమములను బూర్ణ విద్వాంసులతోడి రాజసభ ఏర్పఱుపవలయును. కాని దేశనయనంతనకుకు బాల్యావస్థయందు వివాహములు జరుగనీయగూఁడదు. సర్వదా శరీరమును ఆత్మయుఁ బూర్ణ బలముతోఁ గూడియుండునట్లు యథారీతిని బ్రహ్మచర్యము సేవించి సేవింపజేయవలయును. వ్యభిచారమును, బహువివాహములను అరిపేయవలయును. కేవలము ఆత్మబలమును-విద్యాజ్ఞానములను-అభివృద్ధి చేసికొని శరీరబలమును వృద్ధి పఱుపరేని బలవంతుఁడగు నొక్కఁడే వందలకొలఁది విద్వాంసులను, జ్ఞానులను జయింపఁగలుగును. ఇదిగాక కేవల శరీరబలమునే వృద్ధిపఱుచుకొని ఆత్మాభివృద్ధి చేయకుందురేని ఉత్తమ రాజ్యపాలనావ్యవస్థ విద్యలేక యెన్న రుఁను గలుగఁజాలదు. వ్యవస్థ లేకుండునేని అందఱును దమలో దాము విరోధించి కలహించుచు, జగడమాడుచు నష్టులు, భ్రష్టులు నయిపోదురు. కాఁబట్టి సర్వదా శరీర, ఆత్మబలము వృద్ధిపఱుచుకొనుచుండవలయును. వ్యభిచారము, అతి విషయాసక్తి యను పీనవరె బలమును, బుద్ధిని నాశనముఁ జేయు వ్యవహారములు మఱియొవేపు. విశేషించి క్షత్రియులు దృఢాంగులుగ, బలయుక్తులుగ నుండవలయును. వారే విషయాసక్తు లయిరేని రాజధర్మమే

నష్టమయిపోవును. 'యథా రాజా తథా ప్రజా' (చాణక్య.నీ.ద ౧౩వ)రాజు వలెనే ప్రజలునగుదురు. దీనిని ధ్యానమందుంచుకొని రాజును, అధికారులును ఎన్నఁడును దుష్టాచారముల నాచరింపక నిరంతరము ధర్మ న్యాయములందే వర్తించి యందఱ సంస్కరణమునకు దృష్టాంతమై యుండవలయును.

సంక్షేపముగ రాజధర్మ మిచ్చట వర్ణింపబడినది. విశేషించి వేదము నందును, మనుస్మృతి సప్తమ, అష్టమ, నవమ అధ్యాయముల యందును. శుక్రనీతి. విదుర ప్రజాగరము. మహాభారతమందలి శాంతిపర్వపు రాజధర్మము, ఆపద్ధర్మము మొదలగువానియందును గల పూర్ణ రాజనీతి వహించి మాందలి కులును, సార్వభౌములును, చక్రవర్తులును అగుదురుగాక. 'వయం ప్రజాపతేః ప్రజా అభూమ' (యజు అ. ౧౮ మం. ౨౯) ఇది యజుర్వేద వచనము. మనము ప్రజాపతి-పరమేశ్వరుని-ప్రజలము. పరమాత్మ మన రాజు. మనము అతని కింకరులము-భృత్యులవంటి వారము అని తెలియవలయును. అతఁడు తన యపారకృపచే నతని సృష్టియందు మనలను రాజ్యాధికారులుగఁ జేయును గాక! మన చేతులద్వారా అతని సత్య న్యాయములను ప్రవర్తింపఁ జేయునుగాక!

ముందు ఈశ్వర వేద విషయములు వ్రాయబడును.

శ్రీమద్దయానంద సరస్వతీ స్వామికృతమును
సుభాషావిభూషితమునగు సత్యార్థ ప్రకాశమున
రాజధర్మ విషయము గల షష్ఠ సముల్లాసము
సంపూర్ణము.

# సప్తమ సముల్లాసము

## ఈశ్వర వేద విషయము

ఋచో అక్షరే పరమే వ్యోమన్యస్మిన్ దేవా అధి విశ్వే నిషేదుః ।
యస్తన్న వేద కిమృచా కరిష్యతి య ఇత్తద్విదుస్త ఇమే సమాసతే ॥
ఋ॥ మం॥ ౧. సూ॥ ౧౬౪. మం. ౩౯॥

(ఋచో అక్షరే) ఈ మంత్రమునకర్థము బ్రహ్మచర్యాశ్రమ శిక్షయందు వ్రాయఁబడినది. (ఇచ్చట సంక్షేపముగ వ్రాయఁబడును) ఎవఁడు దివ్యగుణ కర్మస్వభావ విద్యాయుక్తుఁడో, యెవనియందుఁ బృథివీ సూర్యాది లోకములు స్థితములై యున్నవో, ఎవఁడు ఆకాశమువలె వ్యాపకుఁడును, సమస్త దేవతలకు దేవుఁడు నయియున్నాఁడో యతని నెవఁడు తెలియఁడో-నమ్మఁడో-ధ్యానింపఁడో అట్టి నాస్తికుఁడును, మందమతియు సర్వదా దుఃఖసాగరమందే మునిఁగియుండును. కాఁబట్టి అతనిఁ దెలిసియే మనుష్యు లందఱును సుఖులు కాఁగలరు.

ప్రశ్న :- వేదమందు నీశ్వరు లనేకులు చెప్పఁబడి యున్నట్లు మీరొప్పుదురా? లేదా?

ఉత్తరము:- ఒప్పుకొనము. ఏలయనఁగా నాలుగు వేదములందెచ్చటను ఈశ్వరులనేకులుగా చెప్పఁబడకపోఁగా నీశ్వరుఁ డొక్కఁడున్నాఁడని మాత్రము స్పష్టముగ వ్రాయఁబడియున్నది.

ప్రశ్న :- వేదమందు అనేక దేవతలను గూర్చి చెప్పఁబడియున్నదే। దాని యభిప్రాయమేమి?

ఉత్తరము:- దివ్యగుణ యుక్తము లగుటవలనఁ బృథివి మొదలగునవి దేవత లనఁబడును గాని వీనిని ఈశ్వరుఁడనికాని, ఉపాసనీయములని కాని యెచ్చటను అంగీకరింపలేదు. పై మంత్రమందుఁ జూఁడుఁడు. ఎవని యందు సమస్త దేవతలు స్థితములై యున్నవో అతఁడే తెలియుటకును, ఉపాసనకును యోగ్యుఁడని యున్నది. దేవతాశబ్దముచేత నీశ్వరుని గ్రహించువారు పొరపాటు పడుచున్నారు. అతఁడే సమస్త జగదుత్పత్తి స్థితి ప్రలయ

ములను జేయువాఁడును, న్యాయాధీశుఁడును, అధిష్ఠాతయునగుటచేఁ బర మేశ్వరుఁడు దేవుల కందఱికిని దేవుఁడయి మహాదేవుఁడనఁబడును. (త్రియ స్త్రింశతా. (యజు॥ ౧౪.౩౧) మొదలగు ప్రమాణములు వేదమందున్నవి. దీని వ్యాఖ్యయు శతపథమందుఁ (కాం. ౧౪. ప్రపా. ౫. బ్రా. ౭ కం. ౪) గలదు. చూఁడుఁడు:- ముప్పది మూఁడు దేవత లనఁగా:- పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, చంద్రుడు, సూర్యుఁడు, నక్షత్రములు ఇవి సమస్త సృష్టికి నివాస స్థానములగుటచే నష్టవస్తువులు. ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన, నాగ, కూర్మ, కృకల, దేవదత్త, ధనంజయములును, జీవాత్మయు నివి శరీరమును వదలు నపుడు ఏడ్పించును గనుక పదునొకండు రుద్రులు. సంవత్సరములోని పండ్రెండు మాసములు, ఇవి యందఱి యాయువ్సును దీసుకొని పోవుచున్నవి. కనుక పన్నిద్దఱు ఆదిత్యులు. పరమైశ్వర్యమునకు హేతువగుటచే మెఱుపునకు నింద్రుఁడని పేరు. వాయువు, వృష్టిజలము, ఔష ధముల శుద్ధియును, విద్వాంసుల సత్కారములు, నానా ప్రకారములగు శిల్ప విద్యలును గలిగించి యజ్ఞము ప్రజలను పాలించుచున్నది. కాఁబట్టి యజ్ఞ మునకుఁ బ్రజాపతి యని పేరు. ఈ ముప్పదిమూఁడును, బూర్వోక్తగుణము లచేఁ గూడియుండుటవలన దేవత లనఁబడును. వీని కన్నిఁటికిని స్వామియు, నన్నిఁటికంటె గొప్పవాఁడు నగుటచేఁ ముప్పది నాలుగవ పరమాత్మయే యుపాస్య దేవుఁడని శతపథము పదునాల్గవ కాండమందు స్పష్టముగా వ్రాయఁ బడియున్నది: ఇట్లే తక్కినచోట్లను వ్రాయఁబడియున్నది. ఈ శాస్త్రములను జూడరు. చూడలేని వేదమం దనేకేశ్వరులు గలరని యేల భ్రమింతురు ?

ఈశా వాస్య మిదగ్ం సర్వం యత్కించ జగత్యాం జగత్।
తేన త్యక్తేన భుంజీథా మా గృధః కస్య స్విద్ధనమ్ ॥యజు॥' అ.౪౦,మం. ౧॥

ఓ మనుష్యుఁడా! ఈ ప్రపంచమందుండు జగత్తునందు (గమనశీల పదార్థము లన్నింటియందు) వ్యాపించి నియమించువాఁడు ఈశ్వరుఁ డనఁ బడును. అతనికి భయపడుము. అన్యాయముగ నితరులధనమును గాంక్షింప కుము. అన్యాయమును వదలి న్యాయరూప ధర్మముచే నీయాత్మద్వారా ఆనం దము ననుభవింపుము.

అహం భువం వసునః పూర్వ్యస్పతిరహం ధనాని సంజయామి శశ్వతః।
మాం హవన్తే పితరం జంతవోఽహం దాశుషే విభజామి భోజనమ్॥

ఋ॥ మం. ౧౦. సూ. ౪౮. మం. ౧॥

వేదమందీశ్వరుఁ డేమి యుపదేశించు చున్నాఁడో వినుఁడు. ఓ మనుష్యులారా! ఈశ్వరుఁడనగు నేను అన్నిటికిని బూర్వము విద్యమానుఁడనయి సమస్త జగత్తునకుఁ బతినై యున్నాఁడను. జగత్తునకు సనాతన కారణమును, సమస్త ధనములను విజయము చేయువాఁడను, దాతయు నయియున్నాడను. సంతానము తండ్రిని బిలుచు నట్లు జీవులందఱును నన్నే పిలువ వలయును. అందఱకు సుఖమునిచ్చు నేను పాలన కొఱకు జగత్తునందు నానా ప్రకారము లగు భోజనములను విభాగించుచున్నాఁడను.

అహమింద్రో న పరాజిగ్య ఇద్ధనం న మృత్యవేఽవతస్థే కదాచన।
సోమమిన్మా సున్వంతో యాచతా వసు న మే పూరవః సఖ్యే రిషాథన॥

ఋ॥ మం. ౧౦. సూ. ౪౮. మం. ౫॥

నేను బరమైశ్వర్యవంతుఁడను, సూర్యునివలె సమస్త జగత్తును బ్రకాశ పఱచువాఁడను. ఎన్నఁడును బరాజయమునుగాని మృత్యువునుగాని పొందను. నేనే జగద్రూపమగు ధనమును నిర్మించినవాఁడను. జగత్తు నుత్పత్తి చేయువాఁడను నేనేయని తెలియుఁడు. జీవులారా! ఐశ్వర్యప్రాప్తికొఱకు యత్నము చేయుచు మీరు విజ్ఞానాది ధనములను నా నుండి కోరుఁడు. మీరు నా మైత్రి నుండి దూరముగాకుఁడు.

అహం దాం గృణతే పూర్వ్యం వస్వహం బ్రహ్మ కృణవం మహ్యంవర్ధనం।
అహంభువం యజమానస్య చోదితాయజ్వనః సాక్షి విశ్వస్మిన్ భరే॥

ఋ॥ మం॥ ౧౦.సూ.౪౯.మం.౧॥

ఓ మనుష్యులారా! నేను సత్యభాషణ రూపమగు స్తుతిజేయు మనుష్యులకు సనాతన జ్ఞానాది ధనముల నొసంగు చున్నాఁడను. నేను బ్రహ్మమను. అనఁగా వేదమును బ్రకాశపఱచువాఁడను. నన్ను గూర్చి ఆవేదము ఉన్నదున్నట్లు చెప్పుచున్నది. దాని ద్వారా నేను అందఱ జ్ఞానమును వర్ధిల్లఁజేయుచున్నాడను. సత్పురుషులకుఁ బ్రేరకుఁడను, యజ్ఞము చేయువారికి ఫలమిచ్చువాఁడను, ఈ విశ్వమందుఁగల కార్యములను జేయువాఁడను, ధరించువాఁడను నేను. కాఁబట్టి మీరు నన్ను వదలి మఱియొవరిని నా స్థలమందుఁ బూజింపకుడు; నమ్మకుఁడు; తెలిసికొనకుడు.

హిరణ్యగర్భః సమవర్తతాగ్రే భూతస్య జాతః పతిరేక ఆసీత్ ।
స దాధార పృథివీం ద్యాముతేమాం కస్మై దేవాయ హవిషా విధేమ॥ యజు. ౧౩. ౪॥

ఇది యజుర్వేద మంత్రము ఇందు మన మితరుల కుపదేశింపవల సిన విధానమును దెల్పియున్నాడు:—

ఓ మనుష్యులారా! ఎవఁడు సృష్టికిఁ బూర్వము సూర్యాది తేజోవంత ములగులోకముల కుత్పత్తిస్థానమును, ఆధారమును, ఉత్పన్నమయిన, అగు చున్న, కాఁగల వానికి స్వామియునై యుండెనో, యగుచున్నాఁడో కాఁగలడో యతఁడే పృథివి మొదలుకొని సూర్యలోక పర్యంతము గల సృష్టినిజేసి ధరిం చుచున్నాఁడు. ఆ సుఖస్వరూపుఁడగు పరమాత్మనుగూర్చి మేము భక్తిసల్పి నట్లు మీరును సల్పుఁడు.

ప్రశ్న:-మీరు ఈశ్వరుఁడీశ్వరుఁడని చెప్పుచున్నారే, అతఁడున్నాఁడని యెట్లు సాధింపగలరు?

ఉత్తరము,-ప్రత్యక్షాది ప్రమాణము లన్నిటిచేతను.

ప్రశ్న:-ఈశ్వరునియందుఁ బ్రత్యక్షాది ప్రమాణము లెన్నటికిని ఘటిం పఁజాలవు.

ఉత్తరము:—

'ఇంద్రియార్థ సన్నికర్షోత్పన్నం జ్ఞాన మవ్యపదేశ్యమవ్యభిచారి
వ్యవసాయాత్మకం ప్రత్యక్షమ్॥ న్యాయ. అ. ౧. సూ. ౪॥

ఇది గౌతమమహర్షి రచించిన న్యాయదర్శనమందలి సూత్రము:— శ్రోత్ర, త్వక్, చక్షు, జిహ్వా, ఘ్రాణ, మనస్సులకు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ, సుఖదుఃఖ సత్యాసత్యాది విషయములతో సంబంధము కలుగుటవలన నుత్పన్నమగుజ్ఞానము ప్రత్యక్షము. కాని యది భ్రమరహితమై యుండవల యును. మనము బాగుగ విచారించితిమేని ఇంద్రియముల చేతను, మనస్సు చేతను గుణములు ప్రత్యక్షమగుచున్నవేకాని గుణికాదు. త్వగాది నాలుగింద్రి యములచే స్పర్శ, రూప, రస, గంధముల జ్ఞానము కలుగుటవలన గుణియగు పృథివి ఆత్మతోఁగూడిన మనస్సునకుఁ బ్రత్యక్షమగుచున్నది. అట్లే యీ ప్రత్యక్షసృష్టి యందలి రచనావిశేషాదులు జ్ఞానాది గుణములు ప్రత్యక్షమగుట వలనఁ బరమేశ్వరుఁడు ప్రత్యక్షమగుచున్నాఁడు. ఆత్మ మనస్సును, మనస్సు ఇంద్రియములను ఏ దేని విషయమందుఁ లగ్నముచేసినపుడు, దొంగతనము మొదలగు చెడ్డపనులనుగాని, చేయఁదొడగిన క్షణమందును, జీవుని యిచ్ఛా

జ్ఞానాదులు అపేక్షిత విషయములందు వాలును. అప్పుడు ఆత్మలోఁ జెడ్డ పనులు చేయుటకు భయమును, శంకయు, లజ్జయు, మంచి పనులు చేయుటకు నిర్భయతయు, నిశ్శంకతయు, ఆనందోత్సాహములును బుట్టుచున్నవి. అవి జీవాత్మ నుండి కలుగునవి కావు. పరమాత్మనుండి కలుగును. జీవాత్మ శుద్ధుఁడై పరమాత్మ విచారమునఁదత్పరుఁడయినపుడతని కాసమయమందే యిద్దఱును ప్రత్యక్షమగుచున్నారు. పరమేశ్వరుఁడు ప్రత్యక్షమేయగునపుడు అనుమానాదులచేఁ బరమేశ్వరునిజ్ఞానముకలుగుటయందేమి సందేహము? కార్యమును జూచి కారణ మనుమానింపఁబడును గద.

ప్రశ్న:-ఈశ్వరుఁడువ్యాపకుఁడా? లేక యేదేని దేశవిశేషమందుండునా?

ఉత్తరము:-వ్యాపకుఁడు. ఏలయనఁగా నేకదేశమందుండువాడయ్యెనేని సర్వాంతర్యామియు సర్వజ్ఞుఁడును, సర్వ నియంతుఁడును అన్నిఁటిని సృష్టించువాఁడును ధరించువాఁడును, ప్రళయము చేయువాఁడును గాఁజాలఁడు. కర్తలేని కావున క్రియగలుగుట యసంభవము.

ప్రశ్న:-పరమేశ్వరుఁడు దయాళువును. న్యాయకారియునా? కాదా?

ఉత్తరము:-అవును.

ప్రశ్న:-ఈ రెండు గుణములు పరస్పర విరుద్ధములు. న్యాయము చేసెనేని దయయు. దయఁజూపెనేని న్యాయమును దప్పిపోవును. ఏలయనఁగాఁ గర్మముల కనుకూలముగ నెక్కువ దక్కువలు లేక, సుఖదుఃఖముల నిచ్చుట న్యాయము. అపరాధిని దండింపక వదలిపెట్టుట దయయనఁబడును.

ఉత్తరము:-న్యాయమునకును, దయకును నామమాత్రమే భేదము. ఏలయనఁగా న్యాయముచే సిద్ధమగు ప్రయోజనమే దయచేతను సిద్ధమగుచున్నది. మనుష్యుఁడు అపరాధము చేయుటమాని దుఃఖమును బొందకుండ వలయుననుటయే కదా దండించుటవలని ప్రయోజనము. కాఁబట్టి యితరులను దుఃఖమునుండి వదలించుటయే దయ; న్యాయమునకు మీరు చేసిన యర్థము సరియే కాని అపరాధిని దండింపక వదలిపెట్టుట దయ యని మీరు చేసిన యర్థము సరియైనది కాదు. ఏలయనఁగా అపరాధిని దండింపకుండిన దయ నాశనమయిపోవును. ఒక అపరాధియగు బందిపోటుదొంగను వదలిపెట్టుట యనఁగా వేంకొంది ధర్మాత్ములకు దుఃఖ మిచ్చుటయగును. ఒకని వదలుట

వలన వేలకొలఁది జనులకు దుఃఖమును గలిగించునది దయయెట్లు కాఁగలదు? ఆ దొంగను జంపుటవలన వేలకొలఁది మనుష్యులపై దయచూపుట యగుచున్నది. అదియే దయ.

ప్రశ్న:-అట్లైన దయ యనియు న్యాయ మనియు రెండు శబ్దములేల యున్నయవి? వాని రెంటికిని అర్థమొక్కటియేని రెండు శబ్దములుండుట వ్యర్థము. కాఁబట్టి యొకటే శబ్దముండుట బాగు. దయాన్యాయములని రెండు శబ్దములుండుటయే వాని ప్రయోజన మొకటి కాదని చూపుచున్నది.

ఉత్తరము:-ఏమి? ఒక యర్థమునకు అనేక నామములును, అనేకార్థముల కొక్క నామమును ఉండవా?

ప్రశ్న:-ఉండును.

ఉత్తరము!-అట్లుండెనేని మీకు శంకయేల?

ప్రశ్న:-లోకమందు వినుచున్నాము కాఁబట్టి.

ఉత్తరము:- లోకమందు సత్యమును, అసత్యమును విననగుచున్నది. కాని వానిని విచారించి నిశ్చయించుట మన పని. ఈశ్వరుని సంపూర్ణ మగు దయను జూడుఁడు సమస్తజీవుల ప్రయోజనము సఫల మగుటకు జగత్తునందు సకల పదార్థములను సృజించి దానము చేసియున్నాఁడు. దీనికంటె గొప్పదయ మఱియేట్టి యుండును? ఇఁక న్యాయము ఫలమో ప్రత్యక్షముగా జూచుచున్నాము. ఎక్కువ తక్కువలగు సుఖదుఃఖముల వ్యవస్థయే న్యాయఫలమును చూపుచున్నది. దయాన్యాయముల భేదము:-మనస్సులో నందఱకును సుఖము కలుగవలయుననియు, దుఃఖము దూరము కావలయుననియుఁ గోరి పని చేయుట దయ. బాహ్యచేష్టలచేత-బంధన ఛేదనాదులచేతఁ-దగినట్లు దండించుట న్యాయము. అందఱను పాపముల నుండియు దుఃఖముల నుండియు దూరము చేయవలయుననుటయే యీ రెంటి ప్రయోజనము.

ప్రశ్న:-ఈశ్వరుఁడు సాకారుఁడా? నిరాకారుఁడా?

ఉత్తరము:-నిరాకారుఁడు. సాకారుఁడేని వ్యాపకుఁడు కాఁడు. వ్యాపకుఁడు కాఁడేని సర్వజ్ఞాదిగుణము లీశ్వరునియందు ఘటింపఁజాలవు. ఏలయనఁగాఁ బరిమితవస్తువునందు గుణకర్మస్వభావములును బరిమితముగానుండును. ఇదిగాక శీతోష్ణ, క్షుధా, తృష్ణా, రోగ, దోష, ఛేదన, భేదనాదులు లేనివాఁ

దును గాఁజాలఁడు. కాబట్టి నిశ్చయముగా నీశ్వరుఁడు నిరాకారుఁడే. సాకారుఁడేని అతనిముక్కు, చెవి, కన్ను, మొదలగు నవయవములను జేసినవాఁడు మఱియొకఁడుండ వలయును. ఏలయనఁగా సంయోగముచే నుత్పన్నములగు వానిని సంయోజనము చేసిన నిరాకార చేతన మొదటి యుండితీఱవలయును. ఈశ్వరుఁడు స్వేచ్ఛగాఁ దనంతట తనశరీరమును చేసికొనెనని యనుకొన్నను ఆశరీరము కలుగుటకుఁబూర్వము అతఁడు నిరాకారుఁడుగ నుండెననియే యేర్పడుచున్నది. కాఁబట్టి పరమాత్మ ఎన్నఁడును శరీరమును ధరింపఁడు. నిరాకారుఁడగుటచే సమస్తజగత్తును సూక్ష్మకారణములనుండి స్థూలాకారముచేసివేయును.

ప్రశ్న:—ఈశ్వరుఁడు సర్వశక్తిమంతుఁ డవునా కాదా?

ఉత్తరము:-అవును. కాని సర్వశక్తిమంతుఁడను శబ్దమున కర్థము మీరు తలఁచునట్లుకాదు. ఈశ్వరుఁడు తన పనులలో-ఉత్పత్తి, పాలనము, ప్రలయము మొదలగు వానియందు, సమస్త జీవుల పుణ్యపాపములకు దగిన వ్యవస్థ చేయుటయందుఁ గొంచెమైన నితరుల సహాయము దీసికొనఁడు. అనఁగాఁ దన యనంతసామర్థ్యముచేతనే తన సమస్త కార్యములను సంపూర్ణముగఁ జేసికొనుచున్నాఁడు. ఇదియే సర్వశక్తిమంతుఁడను శబ్దమున కర్థము.

ప్రశ్న:-అతని మీఱిన వారెవ్వరును లేరు గనుక ఈశ్వరుఁడు తారిను కొట్లు చేయును అని మేము నమ్ముచున్నాము.

ఉత్తరము:-అతఁడేమి కోరును? అతఁడన్నిఁటిని తలఁచి యన్నిఁటిని చేయఁగలఁడేని పరమేశ్వరుఁడు తన్నుఁదాను జంపుకొని, అనేకేశ్వరులను జేసికొని తానవిద్వాంసుఁడయి దొంగతనము-వ్యభిచారము మొదలగు పాపములను జేసి దుఃఖియుఁగా గలఁడా? ఇవి యన్నియు నీశ్వరుని గుణకర్మస్వభావమునకు విరుద్ధములు. కాఁబట్టి యతఁడివి యన్నియుఁ జేయఁగలఁడని మీరు చెప్పిననవి యీశ్వరునియందు ఘటింపఁజాలవు. కాఁబట్టి సర్వశక్తిమంతుఁడను శబ్దమునకు మేము చేసిన అర్థమే సరి.

ప్రశ్న:-పరమేశ్వరుఁడు సాదియా అనాదియా?

ఉత్తరము:-అనాది అనఁగా ఆది-కారణము గాని, సమయము కాని లేనివా. ఈ యర్థములన్నియుఁ ప్రథమసముల్లాసమందుఁ జెప్పఁబడినవి.

ప్రశ్న:-పరమేశ్వరుఁ డేమికోరుచున్నాఁడు?

ఉత్తరము:-అందఱు మేలును, సుఖమును గోరుచున్నాఁడు.
పాపము చేయునివాని నెవనిని దాను స్వతంత్రించి పరాధీనునిగాఁ జేయఁడు.

ప్రశ్న:-పరమేశ్వరునిగూర్చి స్తుతి ప్రార్థన ఉపాసనలను జేయవలయునా? లేదా?

ఉత్తరము:-చేయవలయును.

ప్రశ్న:-ఏమి? స్తుతి మొదలగునవి చేయుటవలన ఈశ్వరుఁడు తన నియమమును వీడి భక్తుల పాపములను విడిపించునా?

ఉత్తరము:-లేదు.

ప్రశ్న:-మఱి స్తుతి ప్రార్థనల నేల చేయవలయును?

ఉత్తరము:-వానిని చేయుటవలన వేఱు ఫలము గలదు.

ప్రశ్న:-ఏమి గలదు?

ఉత్తరము:-స్తుతిచే నీశ్వరునియందుఁ బ్రీతియు, అతని గుణకర్మ స్వభావములచే తన గుణకర్మ స్వభావముల సవరణయు, ప్రార్థనచే నిరభిమానము ఉత్సాహము సహాయమును కలుగుటయు, నుపాసనచేఁ బరబ్రహ్మతోడి సంబంధము నతని సాక్షాత్కారమును గలుగును.

ప్రశ్న:-వీనిని స్పష్టపఱచి తెలుపుఁడు.

ఉత్తరము:-వినుఁడు:-

స పర్యగా చ్ఛుక్ర మకాయ మవ్రణ మస్నావిరగంశుద్ధ మపాపవిద్ధమ్ ।
కవిర్మనీషీ పరిభూః స్వయంభూర్యాథాతథ్యతో౽ర్థాన్ వ్యదధాచ్ఛాశ్వతీభ్యః సమాభ్యః॥ యజుః॥ అ. ౪౦. మం. ౮॥

(ఈశ్వరుని స్తుతి) ఆ పరమాత్మ సమస్తమందు వ్యాపకుఁడు. వేగవంతుఁడు అనంత బలవంతుఁడు. శుద్ధుఁడు. సర్వజ్ఞుడు. అన్నిటికంతర్యామి. అన్నిఁటిని మీఱి విరాజిల్లువాఁడు. సనాతనులునై న జీవరూపులగు తన ప్రజలకు సనాతన విద్యయగు వేదము ద్వారా యథారీతిని అర్థబోధ చేయుచున్నాఁడు; అనునిది సగుణ స్తుతి. అనఁగా గుణములతో గూడినట్లు పరమేశ్వరుని స్తుతించుట సగుణము.-(అకాయ) అతఁడెన్నఁడును శరీరమును ధరింపఁడు. జన్మమెత్తఁడు. అతనికి వ్రణముల గలుగవు. అతఁడు నాడి మొదలగు బంధము

లందు చిక్కుడు. పాపము నెన్నడును జేయడు. అతనియందు క్లేశముకాని, దుఃఖముగాని, అజ్ఞానముకాని యెన్నడును గలుగదు. ఇట్లు రాగద్వేషాది గుణములచే దూరుడని నమ్మి పరమేశ్వరుని స్తుతించుట నిర్గుణ స్తుతి. ఈ స్తుతి ప్రయోజనము:-పరమేశ్వరుని గుణములవలె మన గుణకర్మ స్వభావములను జేసికొనుట. అనగా, పరమేశ్వరుడు న్యాయకారి. మనమును న్యాయకారులము కావలయుననుట. ఇంతే కేవలము భట్టుల వలె పరమేశ్వని గుణకీర్తన మాత్రము చేయుచు దన చరిత్రను సవరించుకొననివాడు చేయు స్తుతివ్యర్థము.

ప్రార్థన :—

యాం మేధాం దేవగణాః పితరశ్చోపాసతే।
తయా మామద్య మేధయాగ్నే మేధావినం కురు స్వాహా॥

యజుః అ. ౩౨, మం. ౧౪॥

ఓ అగ్నీ! ప్రకాశ స్వరూపుడవగు పరమాత్మా! నీ కృపచేత విద్వాంసులును, జ్ఞానులును, యోగులు నేమేధ (బుద్ధి) నుపాసించుచున్నారో మమ్మును అట్టి మేధావంతులుగ-విద్వాంసులుగ నిపుడే జేయుము.

తేజోఽసి తేజో మయి ధేహి।వీర్యమసి వీర్యం మయి ధేహి।
బలమసి బలం ధేహి। ఓజోఽస్యోజో మయి ధేహి।
మన్యురసి మన్యుం మయి ధేహి।సహోఽసి సహో మయి ధేహి॥

యజుః అ. ౧౯, మం.౯॥

నీవు ప్రకాశస్వరూపుడవు. దయచేసి నాయందును ప్రకాశమును నింపుము. నీవు అనంత పరాక్రమ యుక్తుడవు. నీ కృపాకటాక్షముచే నాయందును బూర్ణ పరాక్రమ ముంచుము నీవు అనంత బలయుక్తుడవు, నాయందును బలము జేర్చుము. నీవు అనంత సామర్థ్యయుక్తుడవు. నాకును బూర్ణ సామర్థ్యమును బ్రసాదింపుము. నీవు దుష్టకార్యములయందును, దుష్టులమీదను క్రోధకారివి. నన్నును అట్లే కావింపుము. నీవు నిందాస్తుతులయందును, నీకప రాధుల యెడలను సహనముకలవాడవు. నేనును నీకృపచే నట్లే యగుదునుగాక.

యజ్జాగ్రతో దూరము దైతి దైవం తదు సుప్తస్య తథైవైతి।
దూరంగమం జ్యోతిషాం జ్యోతిరేకం తన్మే మనః శివసంకల్పమస్తు॥

యజుః అ. ౩౪. మం. ౧॥

ఓ దయానిధీ! నీ కృపచేత నామనస్సు జాగ్రదవస్థలో దూరముపోవుచు ప్రకాశించుచు దివ్యగుణయుక్తమైయుండును. నిద్రించునపుడా నా మనస్సు సుషుప్తినిబొందును. స్వప్నమందు దూరముగఁ బోయినట్లు వ్యవహరించుచుఁ బ్రకాశకములకు బ్రకాశకమైయున్నది. అట్టి నా మనస్సు శివసంకల్పము - తన కొఱకును ఇతరుల కొఱకును కల్యాణమును సంకల్పించునది-యగునుగాక. అనఁగా నెవరికినిఎన్నఁడును హాని చేయుట కిచ్ఛగింపకుండును గాక.

యేన కర్మాణ్యపసో మనీషిణో యజ్ఞే కృణ్వంతి విదథేషు ధీరాః।
యదపూర్వం యక్షమంతః ప్రజానాం తన్మే మనః శివసంకల్పమస్తు॥"—౨॥

ఓ సర్వాంతర్యామీ! కర్మమొనర్చు ధర్మయుక్తులగు విద్వాంసులు యజ్ఞమునందును, యుద్ధాదులయందును దేనిమూలమున పనిచేయుచున్నారో, ఏది యపూర్వ సామర్థ్యముతోఁ గూడి పూజనీయమై ప్రజలలోపల నుండునో, అట్టి నా మనస్సు ధర్మముచేయు నిచ్ఛతోఁ గూడి యధర్మమును సర్వథా వదలిపెట్టును గాక.

యత్ప్రజ్ఞానముత చేతో ధృతిశ్చ యజ్జ్యోతిరంతరమృతం ప్రజాసు।
యస్మాన్న ఋతే కించన కర్మ క్రియతే తన్మే మనఃశివసంకల్పమస్తు"॥మం.౩॥

ఏది యుత్కృష్టజ్ఞానమో, ఏది యితరులకు జైతన్యమునిచ్చు నిశ్చయాత్మకవృత్తియో, ఏది ప్రజలయందుఁ బ్రకాశయుక్తముగను, నాశరహితముగను ఉండునో, ఏది లేక యెవ్వఁడు నే కార్యమును జేయఁజాలఁడో ఆ నా మనస్సు శుద్ధగుణములను గోరి దుష్టగుణములనుండి దూరముగా నుండునుగాక.

యేనేదం భూతం భువనం భవిష్యత్పరిగృహీత మమృతేన సర్వమ్
యేన యజ్ఞస్తాయతే సప్త హోతా తన్మే మనః శివసంకల్పమస్తు"॥మం.౪॥

ఓ జగదీశ్వరా! యోగులందఱును దేనిమూలమున నీ భూత భవిష్యద్వర్తమాన వ్యవహారముల నన్నిఁటిని దెలియుచున్నారో, యేది నాశరహితమై జీవాత్మను బరమాత్మతోఁ గూర్చి యన్నివిధముల త్రికాలజ్ఞునిగ జేయుచున్నదో, దేనియందు జ్ఞానక్రియ యున్నదో, దేనియందుఁ బంచజ్ఞానేంద్రియములును, బుద్ధియు నాత్మతో గూడి యుండునో, యోగరూపయజ్ఞము దేనిచే వర్ధిల్లునో ఆ నా మనస్సు యోగవిజ్ఞానయుక్తమై అవిద్యాది క్లేశములనుండి దూరమగును గాక.

యస్మిన్నృచః సామ యజూగ్ంషి యస్మిన్ప్రతిష్ఠితా రథనాభావివారాః।
యస్మింశ్చిత్తగ్ం సర్వమోతం ప్రజానాం తన్మే మనః శివసంకల్పమస్తు॥మం.౫॥

ఓ పరమవిద్వాంసుఁడవగు పరమేశ్వరా! రథచక్రమధ్యమందు నడ్డకఱ్ఱలు కూడియుండునట్లు ఏ నా మనస్సునందు ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదమును ప్రతిష్ఠితములగుచుండునో, దేనియందు సర్వజ్ఞుఁడును, సర్వవ్యాపకుఁడును, ప్రజలకు సాక్షియు నగు చిత్తచైతన్యుఁడు విదితుఁడగునో ఆ నా మనస్సు అవిద్యను బోఁగొట్టుకొని సదా విద్యాప్రియమగుఁగాక.

సుషారథిరశ్వానివ యన్మనుష్యాన్నేనీయతేఽభీశుభిర్వాజిన ఇవ।
హృత్ప్రతిష్ఠం యదజిరం జవిష్ఠం తన్మే మనః శివసంకల్పమస్తు॥
యజు॥ అ. ౩౪. మం. ౬॥

ఓ సర్వ నియంతవగు నీశ్వరా! గుఱ్ఱములను పగ్గములచేత సారథి త్రిప్పునట్లు ఏది మనుష్యుల నటునిటు మిక్కిలి త్రిప్పుచున్నదో, ఏది హృదయమందుండి గతి అత్యంతవేగములు గల్గియుండునో, ఆ నామనస్సు సమస్తేంద్రియములను అధర్మాచరణమునుండి నిరోధించి ధర్మపథమందు సర్వదా నడిపించునట్లు కృప చేయుము.

అగ్నే నయ సుపథా రాయే అస్మాన్ విశ్వాని దేవ వయునాని విద్వాన్।
యుయోధ్యస్మజ్జుహురాణమేనో భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ॥
యజు॥ అ. ౪౦. మం. ౧౬॥

సుఖము నిచ్చువాఁడవై స్వప్రకాశ స్వరూపుఁడవై సర్వజ్ఞుఁడవగు నో పరమాత్మా! నీవు మమ్ములను శ్రేష్ఠమార్గమునందు నడిపి సంపూర్ణ ప్రజ్ఞానము నందజేయుము. కుటిల పాపాచరణ రూపమగు మార్గమునుండి మమ్ము దూరము చేయుము. మేము నమ్రతాపూర్వకముగ నిన్ను మిక్కిలి స్తుతించుచున్నారము. మమ్ముఁ బవిత్రులను జేయుము.

మానో మహాంతముత మా నో అర్భకంమా న ఉక్షంతముత మా న ఉక్షితం
మా నో వధీః పితరం మోత మాతరంమా నః ప్రియాస్తనోవ్ రుద్ర రీరిషః॥
యజు॥ అ. ౧౬. మం. ౧౫॥

ఓ రుద్రా! దుఃఖరూపమగు పాపఫలమునిచ్చి దుష్టుల నేడ్పించు పరమేశ్వరా! నీవు మాయందలి చిన్న పెద్దలను, గర్భమును, తలిదండ్రులను, ప్రి

యులను,బంధువర్గమును, శరీరములను జంపుటకుమమ్ములను ప్రేరేపింపకుము. నీదండమునకు పాత్రులము గాకుండునట్టి మార్గమందు మమ్ములను నడుపుము.

అసతో మాసద్గమయ, తమసో మా జ్యోతిర్గమయ।
మృత్యోర్మాఽమృతం గమయేతి॥ శతపథ. బ్రా. ౧౪. ౩. ౧. ౩౦॥

పరమగురూ! పరమాత్మా! నీవు మమ్ములను అసన్మార్గమునుండి దూరముఁజేసి సన్మార్గమందుఁజెట్టుము. అవిద్యాంధకారమునుండి తొలగించి విద్యారూపసూర్యుని బొందఁజేయుము మృత్యురోగమునుండి వదలించి మోక్షానందామృతమును గూర్చుము. అనఁగా, నేయే దోషముల నుండియు, దుర్గుణములనుండియుఁ బరమాత్మను దూరునిగా నెంచి తానునట్లగుటకు ఏశ్వరుని బ్రార్థించునో యది విధిపూర్వకము నిషేధపూర్వకమునగుటచే పార్థన సగుణము, నిర్గుణము నగుచున్నది. ఎవఁడు దేనినిగూర్చి పార్థించునో వాఁడట్లే ప్రవర్తిల్లవలయును. సర్వోత్తమ బుద్ధికొఱకుఁ బరమేశ్వరుని బ్రార్థించువాఁడు, దాని కొఱకుఁ దన శక్తికొలఁది ప్రయత్నింప వలయును,అనఁగా తాను పురుషకారము చేయుచు బ్రార్థించుట యోగ్యము. "ఓ పరమేశ్వరా! నీవు నా శత్రువులను నాశనము చేయుము. నన్నందఱిలో గొప్పవానిఁగ జేయుము. నాకే ప్రతిష్ఠ కలుగవలయును. అందఱు నాయధీనమం దుండవలయును." ఈ మొదలగు పార్థనల నెన్నఁడును జేయగూడదు. వీనిని బరమేశ్వరుఁడు నంగీకరింపఁడు. ఏలయనఁగా విద్దఱు శత్రువులు దమశత్రువు నాశనము కావలెనని పార్థించిరేని, ఏమి పరమేశ్వరుఁడా యిద్దఱిని నాశనము చేయవలయునా?కొందఱి విషయ మందెవని ప్రేమ యధికమో యతని పార్థన సఫలమగునందు రేని, ఎవని ప్రేమ న్యూనమో యతని శత్రు నాశనమును న్యూనము కావలసివచ్చును. కాఁబట్టి యిట్లు మూర్ఖముగ బ్రార్థించుచు నొక్కనాఁడు 'ఓ పరమేశ్వరా! మాకు రొట్టె చేసి పెట్టుము, నాయింటి నూడ్చిపెట్టుము. నాబట్టలుదుకుము. నాదోఁటను సాగు చేయుము, అనిగూడఁ బ్రార్థింపఁగలఁడు. ఈ రీతిగఁ బరమేశ్వరునిపై భారము వైచి సోమరులై కూర్చుండువారు మహామూర్ఖులు ఏలయనఁగా పరమేశ్వరుఁడు పురుషార్థము చేయుటకాజ్ఞాపించి యున్నవాఁడు. ఎవఁడుదాని నుల్లఘించునో యతఁడెన్నఁడును సుఖముఁబొందఁడు.

కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతగ్ం సమాః॥ యజు.అ.౪౦.మం. ౨॥

పరమేశ్వరుఁడు ఆజ్ఞాపించునది :—

మనుష్యుఁడు నూఱేండ్ల పర్యంతము-బ్రతికియుండు నంతకాలము-గర్మముచేయుచు బ్రతుకుట కిచ్ఛగింపవలయును. కాని యెన్నఁడును సోమరిగా నుండఁగూడదు. చూడుడు! సృష్టియందుఁ బ్రాణులును, అప్రాణులును-అన్నియును, దమతమ కర్మమును, యత్నమును జేయుచునే యున్నవి. చీమ మొదలగునవి సర్వదా ప్రయత్నముచేయుచునేయున్నవి. పృథివి మొదలగునవి సర్వదా తిరుగుచునే యున్నవి. వృక్షములు మొదలగునవి పెఱుగుచు విఱుగుచున్నవి. ఈ దృష్టాంతములను మనుష్యులందఱు గ్రహించుట యోగ్యము. ప్రయత్నముఁ జేయునట్టి పురుషున కితరుఁడు సహాయముఁ జేయునట్లే, ధర్మముతో బురుషార్థ మొనర్చువానికి ఈశ్వరుఁడును సహాయముఁజేయుచున్నాఁడు. పని చేయునట్టి పురుషునే భృత్యునిగాఁ జేసికొనుచున్నాము. సోమరినిగాదు. చూడవలెనని కోరు వానికిని, గన్నులు గలవానికిని చూపుదుమే కాని గ్రుడ్డివానికిఁ గాదు. ఇది గాక పరోపకార మొనర్చు ప్రార్థనయందు పరమేశ్వరుఁడు సహాయకుఁడగుచున్నాఁడు. కాని హానికారక కర్మములయందుఁ గాఁడు. బెల్లము తియ్యగా నున్నదని మాటలు మాత్రము చెప్పువానికి బెల్లము కాని, దాని రుచి కానియెన్నఁడును గలుగదు. ఎవఁడు ప్రయత్నము చేయునో వానికి శీఘ్రముగానో, విలంబముగానో బెల్లము దొరకనే దొరకును.

ఉపాసన:—

> సమాధినిర్ధూతమలస్య చేతసో నివేశితస్యాత్మని యత్సుఖం భవేత్।
> న శక్యతే వర్ణయితుం గిరా తదా స్వయం తదంతఃకరణేన గృహ్యతే॥
>
> మైత్రాయణ్యుపనిషత్తు, ౪.౩.౯॥

ఇదియుపనిషద్వచనము:-ఎవనికి సమాధియోగము వలన నవిద్యాది మలములు నష్టమయినవో, యెవఁడు ఆత్మస్థుఁడై పరమాత్మయందు చిత్తముఁ జేర్చియున్నాఁడో, అతనికిఁ బరమాత్మ యోగముచే నే సుఖము కలుగుచున్నదో యది వాణిలోఁ జెప్పుటకలవికానిది. ఏలయనఁగా నా యానందమును జీవాత్మ తన యంతఃకరణముచే గ్రహించును. ఉపాసనా శబ్దమునకు సమీపస్థుఁడగుట యని యర్థము. అష్టాంగ యోగముచేఁ బరమాత్మకు చేరువయగుట

కుసు. ఆ పరమాత్మను సర్వవ్యాపి, సర్వాంతర్యామి రూపముచేఁ బ్రత్యక్షము చేసి కొనుటకును ఏయే పనులవసరములో యవియన్నియును జేయవలయును. అనఁగా:—

తత్రాహింసాసత్యాస్తేయ బ్రహ్మచర్యాఽపరిగ్రహా యమాః॥యోగ.౩౦॥

ఇత్యాది సూత్రములు పాతంజల యోగదర్శన మందలి:—ఉపాసన చేయఁగోరువాఁడు ఎవరియందును వైరముంచఁ గూడదు. అందఱి యందును, నిరంతరము ప్రీతి నుంచవలయును. సత్యమే చెప్పవలయును. అసత్య మెన్నఁడును పలుకగూడదు. దొంగిలింపఁ గూడదు. సత్య వ్యవహారమే చేయవలయును. జితేంద్రియుఁడై యుండవలయును. లంపటుఁడు కాఁ గూడదు. నిరభిమాని కావలయును. అభిమానమెన్నఁడును గూడదు. ఈ యయిదువిధముల యమము నుపాసన యోగమునకు ప్రథమాంగము.

శౌచసంతోషతపఃస్వాధ్యాయేశ్వరప్రణిధానాని నియమాః॥యోగ.సాధ.౩౨॥

రాగ ద్వేషములను వదలి లోపలను, జలాదులచే వెలుపలను బవిత్రుఁడుగా నుండ వలయును. ధర్మముచేఁ బురుషార్థ మొనర్చుట వలనఁ గలుగు లాభముచే సంతోషమును, హానిచే దుఃఖమును బొందక సర్వదా ప్రసన్నుఁడై యాలస్యమును వదలి పురుషప్రయత్నము చేయుచుండ వలయును. సదా సుఖ దుఃఖములను సహించి ధర్మమునే యనుష్ఠింప వలయును. ఎన్నఁడును అధర్మము నాచరింపఁ గూడదు. ఎల్లప్పుడు సత్య శాస్త్రములను జదువ వలయును. చదివింప వలయును. సత్పురుషుల సాంగత్యము చేయ వలయును. పరమాత్మ-ఓంకార నామార్థమును విచారించుచుఁ బ్రతినిత్యము జపము చేయవలయును. తన యాత్మను బరమేశ్వరుని యాజ్ఞానుకూలముగా సమర్పింపవలయును. ఈయయిదు నియమములు గలసి యుపాసన యోగమున రెండవ యంగము. దీనికిఁ బిమ్మట యాఱంగములను యోగశాస్త్రమందుఁగాని*ఋగ్వేదాది భాష్య భూమిక యందుఁ గాని చూచి తెలిసికొనవలయును.

ఉపాసన చేయవలసినపుడు ఏకాంత మగు పరిశుద్ధదేశమందు ఆసనము వేసికొని ప్రాణాయామముఁ జేసి బాహ్యవిషయముల నుండి యింద్రియముల నాకర్షించి మనస్సును నాభిప్రదేశ మందుఁగాని, హృదయ మందుఁగాని, కంఠ

*ఋగ్వేదాది భాష్యభూమికలో నుపాసనా విషయమందు దీని వర్ణన యున్నది.

మందుఁగాని, నేత్రములయందుగాని, శిఖయందుఁగాని వెన్నెముక-బ్రహ్మదండి యందుఁగాని స్థిరపఱచి స్వాత్మపరమాత్మల వివేచనచేయుచుఁ బరమాత్మయందు మగ్నుఁడయి సంయమి కావలయును. ఈ సాధనములను జేసినపుడు అతని యాత్మయు, నంతఃకరణమును బవిత్రములయి సత్యపూర్ణము లగుచున్నవి. ప్రతిదినము జ్ఞానమును, విజ్ఞానమును వర్ధిల్లి ముక్తిని గూడఁబొందును ఎనిమిది జాములలో నొక్కగడియ యైన ఇట్లు ధ్యానించెనేని అతఁడు సర్వదా యున్నతినే పొందఁదొడఁగును.

సర్వజ్ఞాదిగుణములతోఁ బరమేశ్వరుని ఉపాసించుట సగుణోపాసన. ద్వేష, రూప, రస, గంధ, స్పర్శాది గుణములచే వేఱని యెంచి యతిసూక్ష్మమగు నాత్మలోపలను వెలుపలను వ్యాపించియుండు పరమేశ్వరుని యందు దృఢస్థితుఁడగుట నిర్గుణోపాసన. దీని ఫలము:—శీతలముచే బాధితుఁడగు పురుషుఁడు అగ్నిని సమీపించుటచే శీతలము నివృత్తి యగునట్లు, పరమేశ్వరుని సమీపించుటచే సమస్త దోషములును, దుఃఖములునుబోయి పరమేశ్వరుని గుణకర్మ స్వభావములవలె జీవాత్మ గుణకర్మ స్వభావములును బవిత్రములగును. కాఁబట్టి పరమేశ్వరుని స్తుతి ప్రార్థనోపాసనల నవశ్యము చేయవలయును. దీనికి తక్కిన ఫలములటుండఁగాఁ బర్వతమంతటి దుఃఖము ప్రాప్తించినను భయపడక సహింపగలుగును. ఆధ్యాత్మికబలము వర్ధిల్లును. ఇదియేమి సాధారణమా? ఇదిగాక పరమేశ్వరుని స్తుతి ప్రార్థనోపాసనలు చేయనివాఁడు మహామూర్ఖుఁడును, గృతఘ్నుఁడు నగును. ఏలయనఁగా ఏ పరమాత్మ యీజగత్తున సమస్త పదార్థములను జీవుల సుఖముకొఱకు బ్రసాదించియున్నాఁడో యతని గుణములను మఱచుటయు, నా యీశ్వరునే నమ్మకుండుటయు, గృతఘ్నతయు, మహా మూర్ఖతయుఁగాక మఱేమియగును.

ప్రశ్న:— పరమేశ్వరునకు శ్రోత్ర నేత్రాదింద్రియములే లేనప్పుడు అతఁడింద్రియముల పని నెట్లు చేయగలఁడు?

ఉత్తరము :—

అపాణిపాదో జవనో గ్రహీతా పశ్యత్యచక్షుః స శృణోత్యకర్ణః ।
స వేత్తి విశ్వం న చ తస్యాస్తి వేత్తా తమాహురగ్ర్యం పురుషం మహాన్తమ్ ॥
శ్వేతాశ్వతరోపనిషత్. ౩. మ. ౧౯

పరమేశ్వరునకుఁ జేతులు లేవు. కాని తనశక్తి రూపములగు చేతులచే సమస్తమును రచించుచు గ్రహించుచు నున్నాఁడు. కాళ్లు లేవు కాని వ్యాపకుఁడగుటచే నన్నిటికంటెనధిక వేగవంతుఁడు. కన్నులులేవు. కాని అన్నిటిని ఉన్నదున్నట్లు కనుఁగొనుచున్నాఁడు. చెవులులేకున్నను అందఱమాటలను వినుచున్నాఁడు. అంతఃకరణములేదుకానిసమస్త జగత్తును దెలిసికొనుచున్నాఁడు. అతనిని సంపూర్ణముగ (అవధిసహితముగ) దెలియు వాఁడెవ్వఁడును లేఁడు. సనాతనుఁడును అందఱికంటె శ్రేష్ఠుఁడును. అన్నిటియందుఁ బూర్ణుఁడు నగుటచే నతనిఁబురుషుఁడందురు. అంతఃకరణము, ఇంద్రియములు వీనిచేనగు కార్యములను తన సామర్థ్యముచే చేయును.

ప్రశ్న:— అతని ననేకులు నిష్క్రియుఁ డనియు, నిర్గుణుఁ డనియు జెప్పుచున్నారే యిది సత్యమా?

ఉత్తరము:—

న తస్య కార్యం కరణం చ విద్యతే న తత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే।
పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ॥

శ్వేతాశ్వతరోపనిషత్. ౬. మం: ౮॥

పరమాత్మనుండి యేర్పడు తద్రూప కార్యము లేదు. అతనికిఁ గరణము అనఁగా బనిచేయుటకు వేఱు సాధనాపేక్షయును లేదు. అతనితో సమానుఁడు కాని, అతనికంటె నధికుఁడుకాని యెవ్వఁడును లేఁడు. సర్వోత్తమ శక్తి. అనఁగా నతనియందు ననంతజ్ఞానమును, అనంతబలమును, అనంత క్రియయు నున్నది. ఇది స్వాభావికము-సహజము. పరమేశ్వరుఁడు నిష్క్రియుఁడేని జగదుత్పత్తి స్థితి ప్రలయములను జేయఁజాలఁడు. కాఁబట్టి యతఁడు విభుఁడును, చైతన్యుఁడు నగుటచే నతనియందుఁ గ్రియము నవశ్యముగ నున్నది.

ప్రశ్న :- అతఁడు క్రియ చేయునేని ఆ క్రియ అవధితోఁ గూడి యుండునా లేదా?

ఉత్తరము:- ఎంతటి దేశకాలములయందుఁ గ్రియఁజేయుట యుచితమని తోఁచునో యంతటి దేశకాలములయందే క్రియఁజేయును. అంతకంటె నధికముగాని. న్యూనముగాని చేయఁడు. ఏలయనఁగా నతఁడు విద్వాంసుఁడు.

ప్రశ్న:- పరమేశ్వరునకు తన యంతము దెలియునా తెలియదా?

ఉత్తరము:- పరమాత్మ పూర్ణజ్ఞాని. దేనిచే నున్నదియున్నట్లు తెలియ నగునో యది జ్ఞానము. అనఁగా నే పదార్థమెట్లున్నదో దాని నట్లే తెలియుట యన్నమాట. పరమేశ్వరుఁడు అనంతుఁడేని దన్ను అనంతుఁడని తెలియు టయే జ్ఞానము. దానికి విరుద్ధమైనది అజ్ఞానము, అనఁగా అనంతమును సాంత ముగాఁగాని సాంతము ననంతముగాఁగానితెలియుట భ్రమయగును. 'యథార్థ 'దర్శనం జ్ఞానమితి'(భగ.గీ. ౧౩ ౧౧)దేని గుణకర్మ స్వభావము లెట్టివో వాని నట్లే తెలియుటయు నమ్ముటయు జ్ఞానము; విజ్ఞానము, దీనికి విపరీత మజ్ఞానము. కాఁబట్టి పరమేశ్వరుఁడు దన్ను అనంతుఁడని తెలియుచున్నాఁడు.

> క్లేశకర్మవిపాకాశయై రపరామృష్టః పురుషవిశేష ఈశ్వరః॥
> యోగ సమాధి సూ. ౨౪.

అవిద్యాది క్లేశములచేతను, శుకల, అశుకల, ఇష్ట, అనిష్ట, మిశ్ర ఫలదాయకములగు కర్మముల వాసనలచేతను రహితుఁడును, జీవులందఱికంటె విశిష్టుఁడు నగువాఁడు ఈశ్వరుఁ డనఁబడును.

ప్రశ్న:—

> ఈశ్వరాసిద్ధేః॥ సాంఖ్య. అ. ౧. సూ. ౯౨॥
> ప్రమాణాభావాన్న తత్సిద్ధిః సాం. అ. ౫. సూ. ౧౦॥
> సంబంధాభావాన్నానుమానమ్॥సాం. అ. ౫. సూ. ౧౧॥

ఈశ్వరుని సిద్ధి ప్రత్యక్షముచే ఘటించునది కాదు. ఆతని సిద్ధి ప్రత్య క్షమేకానపుడు అనుమానాది ప్రమాణము లూఁదఁజాలవు. వ్యాప్తి సంబంధము లేకుండటచే ననుమానమును గలుగఁజాలదు ప్రత్యక్షానుమానములు లేకపోవు టచే శబ్దప్రమాణాదులును ఘటింపఁజాలవు. కాఁబట్టి యీశ్వరుని సిద్ధికాఁజాలదు.

ఉత్తరము:-ఇక్కడ ఈశ్వరుని సిద్ధియందుఁ బ్రత్యక్షము ప్రమాణము కాదు. మరి ఈశ్వరుఁడు జగత్తున కుపాదాన కారణము గాదు. పురుషునికంటె. జీవునికంటె విలక్షణుఁడును. సర్వత్రపూర్ణుఁడు నగుటచేఁ బరమాత్మకుఁ బురు షుఁడని పేరు. శరీరమందు శయనించుటచే జీవునకునుఁ బురుషుఁడని పేరు. ఏలన-పరమేశ్వరుఁడు జగత్తున కుపాదాన కారణము కాదనుటకు నిదే ప్రక రణమందిట్లు చెప్పఁబడియున్నది:-

ప్రధాన శ క్తియోగాచ్చేత్సంగాప త్తిః ॥సాం. అ. ౫. సూ. ౮॥
సత్తామాత్రాచ్చేత్సర్వైశ్వర్యమ్॥ " " " ౯॥
శ్రుతిరపి ప్రధానకార్యత్వస్య॥ " " " ౧౨॥

పురుషునకు ప్రధాన శ క్తి యోగము కలుగునేని పురుషునియందు సంగాప త్తి కలుగును. అనఁగా ప్రకృతి సూక్ష్మముతోఁగలసి కార్యరూప మగు నట్లు పరమేశ్వరుఁడును స్థూలము కావలసివచ్చును. కాఁబట్టి పరమేశ్వరుఁడు జగ త్తున కుపాదాన కారణము కాదు, కాని నిమి త్తకారణము. చేతనము నుండి జగదుత్ప త్తియయ్యెనేని పరమేశ్వరుఁడుసమగ్రైశ్వర్యయు క్తుఁడగునట్లేప్రపంచమునకును సర్వైశ్వర్య యోగము కలుగవలయును; అట్లులేదు. కాఁబట్టి పరమేశ్వరుఁడు జగ త్తున కుపాదాన కారణము కాదు, కాని నిమి త్తకారణము. ఏలయనఁగా నుపనిష త్తు కూడ ప్రధానమునే జగ త్తుకుపాదానకారణమని చెప్పు చున్నది.

అజామేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీః ప్రజాః సృజమానాం స్వరూపాః॥
శ్వేతాశ్వతరోపనిషత్॥ అ. ౪. మం. ౫॥

జన్మరహితమగు సత్వరజ స్తమోగుణరూపమునగు ప్రకృతియే స్వరూపాకారముచే ననేక ప్రజారూప మగుచున్నది. అనఁగా పకృతి పరిణామిని, కాఁబట్టి యవస్థాంతరమును బొందుచున్నది. పురుషుఁడు అపరిణామియగుటచే నతఁడు అవస్థాంతరుఁడయి వేఱు రూపము నెన్నఁడును బొందరు. సర్వదా కూటస్థుఁడై నిర్వికారుఁడుగ నుండును. కాఁబట్టి ఎవఁడేని గపిలాచార్యుని అనీశ్వర వాది యన్నచో అతఁడే అనీశ్వరవాది; కాని కపిలాచార్యుఁడు కాదు. ధర్మము ద్వారా ధర్మి యాశ్వరుఁడని మీమాంస శాస్త్రాభిప్రాయము. అట్లే ఆత్మశబ్దముచే న్యాయ వైశేషికకారులు గూడ అనీశ్వరవాదులు కారు. ఏల యనఁగా సర్వజ్ఞాది ధర్మయు క్తుఁడయి (అతతి సర్వత్ర వ్యాప్నోతీత్యాత్మా) సర్వత్ర వ్యాపించి సమ స్త జీవులకు నాత్మయగువానిని మీమాంస, వైశేషిక, న్యాయములందు ఈశ్వరుఁడని నమ్ముచున్నారు.

ప్రశ్న:- ఈశ్వరుఁడు అవతార మెత్తునా? ఎత్తదా?

ఉ త్తరము:- ఎత్తఁడు. ఏలయనఁగా (అజ ఏకపాత్-౩౪.౫౩. సపర్యగాచ్ఛుక్ర మకాయం-౪౦-౮) ఇవి యజుర్వేదపు వచనములు. ఇట్టి ప్రమాణములచేఁ బరమేశ్వరుఁడు జన్మమె త్తఁడని సిద్ధమగుచున్నది.

ప్రశ్న:-

యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ ॥భ. గీ. అ. ౪. శ్లో. ౭॥

ఎప్పుడెప్పుడు ధర్మమునకు లోపము కలుగునో అప్పుడప్పుడు నేను శరీరమును ధరించుచున్నాఁడనని శ్రీకృష్ణుడు చెప్పియున్నాడే దీనికి మీరేమి చెప్పగలరు?

ఉత్తరము:-ఇది వేదవిరుద్ధమగుటచేఁ బ్రమాణముకాదు. శ్రీకృష్ణుఁడు ధర్మాత్ముఁడు. ధర్మమును రక్షింపఁగోరుచుండెను. కాఁబట్టి యుగయుగమందును నేను జన్మమెత్తి శ్రేష్ఠులను రక్షించి దుష్టులను నాశనముచేసెదను అని చెప్పుట వలన దోషమేమియు లేదు. ఏలయనఁగా (పరోపకారాయ సతాం విభూతయః) సత్పురుషుల సర్వస్వము పరోపకారము కొఱకే వినియోగమగుచున్నది. అయినను దీనిచే శ్రీకృష్ణుఁడు ఈశ్వరుఁడు కాజాలఁడు.

ప్రశ్న:-అట్లయ్యెనేని ప్రపంచమందు ఈశ్వరుని కిఱువదినాలు గవతారములని యేల నమ్ముచున్నారు?

ఉత్తరము:-వేదార్థమును దెలియకుండుటచేతను, సాంప్రదాయులు భ్రమింపఁజేయుటచేతను, తాము అవిద్వాంసులగుటచేతను భ్రమజాలమందుఁ జిక్కుకొని యిట్టియప్రామాణికములగు వానిని జెప్పుచును నమ్ముచునున్నారు.

ప్రశ్న:-ఈశ్వరుఁడు అవతారమెత్తకున్న కంసరావణాది దుష్టుల నాశనమగుటయెట్లు?

ఉత్తరము:-జన్మమెత్తిన వాఁడు మృతినొందియే తీరవలయును. శరీరమును ధరింపకయే జగదుత్పత్తిస్థితిప్రలయములనుజేయు నీశ్వరుని యెదుటఁ గంసరావణాదులు, ఒక్క పురుగుతోఁ గూడ సమానులు కారు. అతఁడు సర్వవ్యాపకుఁడగుటచేఁ గంసరావణాదుల శరీరమందును బరిపూర్ణుఁడగుచున్నాడు. అనుకొన్నప్పుడు తత్క్షణమే మర్మచ్ఛేదనఁజేసి నాశనముఁ జేయఁగలడు. ఇట్టి అనంత గుణకర్మస్వభావయుక్తుఁడగు పరమాత్మను, ఒక క్షుద్రజీవుని జంపుట కొఱకు జన్మమరణయుక్తుఁ డయ్యెనని చెప్పువారిని మూర్ఖులనక యేమనవలయును? భక్తులను ఉద్ధరించుట కొఱకు జన్మమెత్తెనని యందురేని అదియును అసత్యమే. ఏలయనఁగా ఈశ్వరుని యాజ్ఞానుకూలముగ వర్తించు భక్తుల

నుద్ధరించు సామర్థ్య మీశ్వరునియందున్నది. ఏమిః పృథివిని, సూర్యచంద్రాది జగత్తులను సృజించి,ధరించిపాలించునట్టిపనికంటె కంసరావణాదులనువధించు నట్టియు, గోవర్ధనపర్వతము నెత్తునట్టియుఁ బనులు ఈశ్వరునకు గొప్పవా? ఎవ్వఁడేని ఈసృష్టియందలి పరమేశ్వరుని కార్యములనుగూర్చి విచారించెనేని (న భూతో న భవిష్యతి) ఈశ్వరునితో సమానుఁడెవ్వఁడును లేఁడు. కాఁబోఁడు, అని తేటపడుచున్నది. యుక్తిచేతను ఈశ్వరునకు జన్మము సిద్ధింపఁజాలదు; అనంతాకాశము గర్భములోనికి వచ్చెననుట కాని, యొక పిడికిలిలోనికి వచ్చె ననుటకాని సత్యము కాఁజాలదు. ఏలయనఁగా ఆకాశమనంతమై యన్నిటి యందు వ్యాపించియున్నది కాఁబట్టి ఆకాశము వెలుపలికిరాదు; లోపలికిఁబోదు. అట్లే పరమాత్మయు అనంతఁడును, సర్వవ్యాపకుఁడు నగుటచే నతఁడువచ్చుట కాని పోవుటకాని యెన్నఁటికిని ఘటింపదు. ఈ రాకపోకలు వస్తువులేనిచోటఁ గలుగును. పరమేశ్వరుఁ డెక్కడనుండియో వచ్చుటకు గర్భమందు వ్యాపకుఁ డయి యుండలేదా? లోపలి నుండి వెలుపడుటకు వెలుపల నుండలేదా? ఈశ్వరుని విషయమందు విద్యావిహీనులుదప్ప మఱెవ్వరును ఇట్లు చెప్పలేరు. కాఁబట్టి ఈశ్వరునకు రాకపోకలు కాని, జన్మమరణములు కాని ఎన్నఁటికిని సిద్ధింప జాలవు. కాన ఏసు, మొదలగు వారు ఈశ్వరుని అవతారములు కారు. వారు రాగము, ద్వేషము, దప్పి, ఆఁకలి, భయము, శోకము, దుఃఖము, సుఖము, జన్మము, మరణము మొదలగు గుణములతోఁగూడియుండిరి గనుక మనుష్యులు.

ప్రశ్న:- ఈశ్వరుఁడు తన భక్తుల పాపములను క్షమించునా, లేదా?

ఉత్తరము:- లేదు. ఏలయనఁగా పాపమును క్షమించెనేని అతనిన్యాయము నష్టమైపోవును. మనుష్యులందఱును మహాపాపులై పోదురు. క్షమించునను మాట వినఁగానేవారికి పాపము చేయుటయందు నిర్భయమును, ఉత్సాహమును గలుఁగును. రాజు అపరాధులను క్షమించునేని వారుత్సాహపూర్వకముగ మీఁదు మిక్కిలి గొప్పగొప్ప పాపములను జేయఁ దొడఁగుదురు. రాజు తమ యప రాధములను క్షమించునని తెలిసి రాజునుగూర్చి మనము వందనాదులు చేసితి మేని మన యపరాధములను క్షమించునను నమ్మకము గూడ వారికిఁగలిగి యపరాధము చేయనివారుగూడ చేయుటకుభయపడక ప్రవర్తింతురు. కాఁబట్టిఅన్ని కర్మములకుఁ దగినట్లు ఫలము నిచ్చుటయే ఈశ్వరునిపనిగాని క్షమించుటకాదు.

ప్రశ్న:- జీవుఁడు స్వతంత్రుఁడా? పరతంత్రుఁడా?

ఉత్తరము:- తన కర్తవ్యకర్మములయందు స్వతంత్రుఁడు. ఈశ్వరుని వ్యవస్థయందుఁ బరతంత్రుఁడు. (స్వతంత్రః కర్తా) ఇది పాణినీయ వ్యాకరణ సూత్రము. స్వతంత్రుఁడు-స్వాధీనుఁడే-కర్త.

ప్రశ్న:- ఎవనిని స్వతంత్రుఁడందురు?

ఉత్తరము:- ఎవని యధీనమందు శరీరము, ప్రాణము, ఇంద్రియములు అంతఃకరణాదులున్నవో యతఁడు స్వతంత్రుఁడు. జీవుఁడు స్వతంత్రుఁడు కాఁడేని యతఁడు పాపపుణ్య ఫలముల నెన్నఁడును బొందఁగూడదు. ఏల యనఁగా భృత్యులు యజమానునియు, సైన్యము సేనాధ్యక్షునియు నాజ్ఞచేతనో, ప్రేరణచేతనో యుద్ధమందనేకులను జంపి యపరాధులు కానట్లే పరమేశ్వరుని ప్రేరణచేతనో, అధీనతచేతనో జీవుఁడు పనిచేయుట సిద్ధించెనేని జీవునిఁ బాపపుణ్యము లంటఁ గూడదు. ఆ ఫలమును ప్రేరకుఁడగు పరమేశ్వరుఁడే పొందవలసివచ్చును. అనఁగా స్వర్గనరకములను-సుఖదుఃఖములను ఆ పరమేశ్వరుఁడే పొందవలయును. ఒకఁడొక శస్త్ర విశేషముతో నొకనిఁ జంపిన, ఆ చంపినవాఁడే పట్టుకొనఁబడి దండింపఁబడును గాని శస్త్రము కాదు. అట్లే జీవుఁడు పరాధీనుఁడయ్యెనేని పాప పుణ్యఫలములకుఁ బాత్రుఁడు కాఁడు. కాఁబట్టి తన సామర్థ్యానుకూలము కర్మ మొనర్చుటయందు జీవుఁడు స్వతంత్రుఁడు. కాని పాపము చేసిన పిమ్మట ఈశ్వరవ్యవస్థయందుఁ బరాధీనుఁడై పాపఫలమును భవించును. కాఁబట్టి కర్మముఁజేయుట యందు జీవుఁడు స్వతంత్రుఁడును, దుఃఖరూపమగు పాపఫలమనుభవించుట యందుఁ బరతంత్రుఁడు నయియున్నాఁడు.

ప్రశ్న:- పరమేశ్వరుఁడు జీవునిఁ జేసి సామర్థ్య మీయకుండిన జీవుఁ డేమియుఁ జేయఁజాలఁడు. కాఁబట్టి పరమేశ్వరుని ప్రేరణచేతనే జీవుఁడు కర్మమును జేయుచున్నాఁడు.

ఉత్తరము:- జీవునకుత్పత్తి యెన్నఁడును లేదు. ఈశ్వరునివలె, జగత్తున కుపాదానకారణము వలె, జీవుఁడును అనాది; నిత్యము. జీవుని శరీరమును, ఇంద్రియ గోళకములును బరమేశ్వరుఁడు రచించినను అవియన్నియు జీవుని అధీనములయి యున్నవి. మనోవాక్కర్మములచే నెవ్వఁడేని పాపపుణ్యములఁ జేసెనేని వాని ఫలము నతఁడే యనుభవించును. ఎట్లనఁగా:- ఎవ్వఁడో

యొకఁడు కొండనుండి యినుమును దీసెను. ఎవ్వఁడో యొక వ్యాపారి ఆ యినుమును గొనెను. వాని యంగడినుండి దాని నొక కమ్మరి కొని కత్తిని జేసెను. వానిదగ్గఱ నొక సిపాయి దానిని గొనెను. ఆ సిపాయి యా కత్తితో నెవనినో దంపివేసెను. అప్పుడు రాజు ఇనుమును దీసినవానిని గాని, దానిని గొన్న వ్యాపారినిగాని, దానితోఁ గత్తిచేసిన వానినిగాని, కత్తినిగాని పట్టి దండింపఁడు. ఆ కత్తితోఁ జంపినవాఁడే దండింపఁబడును. ఆ ప్రకారమే శరీరాదుల నుత్పత్తిచేసిన పరమేశ్వరుఁడు జీవుని కర్మములను అనుభవించువాఁడు కాఁడుఁగాని జీవుని ననుభవింపఁ జేయువాఁడగుఁచున్నాడు. పరమేశ్వరుఁడే కర్మముచేయువాఁడయ్యెనేని జేయువాఁడగు చున్నాఁడు. పరమేశ్వరుఁడే కర్మముచేయువాఁడయ్యెనేని జీవుఁడు పాపముఁ జేయఁడు. ఏలయనఁగాఁ బరమేశ్వరుఁడు పవిత్రుఁడును, ధార్మికుఁడు నగుటచే నెవనిని పాపము చేయుటకు బ్రేరేపఁడు. కాఁబట్టి జీవుఁడు తన పనులను జేయుటయందు స్వతంత్రుఁడు. అట్లే పరమేశ్వరుఁడును తన పనులను జేయుటలో స్వతంత్రుఁడు.

**ప్రశ్న**:— జీవునియు ఈశ్వరునియు స్వరూపములును గుణ కర్మ స్వభావములును ఎట్టివి?

**ఉత్తరము**:— ఇద్దఱును చేతనస్వరూపులు. ఇద్దఱి స్వభావము పవిత్రమును, నాశనము లేనిదియు, ధర్మవంతము మొదలగునదియును. కాని పరమేశ్వరునకు సృష్టి ఉత్పత్తి, స్థితి, ప్రలయము లొనర్చుట, అన్నిటిని నియమములో నుంచుట, జీవులకు పుణ్యపాపముల ఫలము లిచ్చుటయు, మొదలగునవి ధర్మయుక్తకర్మములై యున్నవి. జీవునకు సంతానోత్పత్తి, వాని పాలన శిల్పవిద్యాదులును, మొదలగు మంచి చెడుగులు జీవుని కర్మములు. ఈశ్వరునకు నిత్యజ్ఞానము, ఆనందము, అనంతబలము మొదలగునవి గుణములు. జీవునకు :-

ఇచ్ఛాద్వేషప్రయత్న సుఖదుఃఖ జ్ఞానాన్యాత్మనో లింగమితి॥

న్యాయ. అ.౧.ఆ.౧.సూ.౧౦॥

ప్రాణాపాననిమేషోన్మేషజీవన మనోగతీంద్రియాంతరవికారాః।
సుఖదుఃఖే ఇచ్ఛాద్వేషౌ ప్రయత్నాశ్చాత్మనో లింగాని॥

వైశేషిక. అ.౩.ఆ.౨.సూ.౪॥

(ఇచ్ఛా) పదార్థములను పొందుటకు అభిలాష (ద్వేష) దుఃఖాదుల యందు అనిచ్ఛ, వైరము (ప్రయత్న) పురుషార్థము, బలము (సుఖ) ఆనందము (దుఃఖ) విలాపము, అప్రసన్నత (జ్ఞాన) వివేకము అను నివి న్యాయ వైశేషికములందును సమానములు; కాని వైశేషికమందు (ప్రాణ) ప్రాణవాయువును పీల్చుట (అపాన) ప్రాణవాయువును వదలుట-ఊపిరి విడుచుట (నిమేష) కన్నులు మూయుట, (ఉన్మేష) కన్నులు తెఱచుట (జీవన) వృద్ధి క్షత ప్రరోహణాదులు, (మనః) నిశ్చయించుట, స్మరించుట, అహంకరించుట (గతి)చలనము (ఇంద్రియ, సమస్తేంద్రియములను నడుపుట (అంతరవికారాః) ఆఁకలిగొనుట, దప్పిగొనుట, సంతోషించుట, శోకించుట, అను నివి జీవాత్మకుఁ బరమాత్మకంటె భిన్నమగు గుణములు, వీనిచేతనే ఆత్మప్రతీతి కలుగుచున్నది. ఏలయనఁగా ఆత్మస్థూలము కాదు. దేహమందు ఆత్మయుండు వఱకే యీ గుణములు ప్రకాశించుచుండును. శరీరము వదలి పోగానే యీ గుణము లుండవు. ఏది యుండగా నేవి యుండునో, ఏది లేకున్న నేవి యుండవో యా గుణములు దానివే యగును. దీపమును సూర్యాదులును లేక పోవుటచేఁ బ్రకాశాదులు లేకపోవుటయు, అవి ఉండుటచేఁ బ్రకాశాదులుండుటయు (దీప సూర్యబోధకములగు నట్లు) బరమాత్మ. జీవుల విజ్ఞానము వాని గుణముల మూలమున గడుగు చున్నది.

ప్రశ్న :- పరమేశ్వరుఁడు త్రికాలదర్శి కాఁబట్టి భవిష్యత్తును దెలియును. అతఁడెట్లు నిశ్చయించుచున్నాఁడో జీవుఁడు నట్లే చేయుచున్నాఁడు కాఁబట్టి జీవుఁడు స్వతంత్రుడు కాఁడు. జీవుని ఈశ్వరుఁడు దండింపఁజాలఁడు. ఏలయనఁగా నీశ్వరుఁడెటు తన జ్ఞానముచే నిశ్చయించెనో అట్లే జీవుఁడు చేయుచున్నాఁడు.

ఉత్తరము:- ఈశ్వరుని త్రికాలదర్శియనుట మౌర్ఖ్యము. ఏలయనఁగా గతించినది భూతకాలము, కాఁబోవునది భవిష్యత్తు. ఏమి ఈశ్వరునికేదేని జ్ఞానము గతించినదా? ఏదేని జ్ఞానమిప్పుడు లేక ముందు కలుగునా? అట్లు కాఁజాలదు. కాఁబట్టి పరమేశ్వరుని జ్ఞానము సదా యేకరసముగను, అఖండితముగ వర్తమానమై యుండును. భూతభవిష్యత్తులు జీవులవే. జీవుల కర్మములను బట్టి త్రికాలజ్ఞానము ఈశ్వరునియందు ఘటించుచున్నదే కాని స్వతః

కాదు. స్వాతంత్ర్యముచే జీవుఁడు చేయుచున్నట్లే సర్వజ్ఞత్వముచే నీశ్వరుఁ డెఱుగుచున్నాడు. ఈశ్వరుఁడు తెలియునట్లే జీవుఁడుచేయుచున్నాఁడు. అనఁగా భూత భవిష్యద్వర్తమాన జ్ఞానమందును. ఫలమిచ్చుటయందును ఈశ్వరుఁడు స్వతంత్రుఁడు జీవుఁడు కించిద్వర్తమానుఁడై కర్మముజేయుటయందు స్వతంత్రుఁడు ఈశ్వరుని జ్ఞాన మనాదియగుటవలన కర్మ జ్ఞానమువలెనే దండించు జ్ఞానముగూడ ననాది. అతని యీ రెండు జ్ఞానములును సత్యములే. ఏమి, కర్మజ్ఞానము సత్యమును. దండనజ్ఞాన మసత్యమును ఎన్నఁడేని కాఁగలదా? కాఁబట్టి దీనివలన నేదోషమును రాదు

ప్రశ్న :- జీవుఁడు శరీరమందు భిన్నుఁడగునుగాని విభుఁడా? పరిచ్ఛిన్నుఁడా?

ఉత్తరము :- పరిచ్ఛిన్నుఁడు. విభుఁడైన జాగ్రత్త. స్వప్నము, సుషుప్తి, మరణము, జన్మము, సంయోగము, వియోగము, వచ్చుట పోవుట ఎన్నఁడును గలుగనేరవు. కాఁబట్టి జీవుని స్వరూప మల్పజ్ఞత. అల్పమనగా సూక్ష్మము పరమేశ్వరుఁడు మిక్కిలి సూక్ష్మముకంటె సూక్ష్ముఁడు, అనంతుఁడు, సర్వజ్ఞుఁడు, సర్వవ్యాపక స్వరూపుఁడు. కాఁబట్టి జీవ పరమేశ్వరులకు వ్యావ్యవ్యాపక సంబంధము కలదు.

ప్రశ్న :- ఏ స్థలమం దొక వస్తు వున్నదో ఆదే స్థలమందు మఱియొక వస్తువుండఁజాలదు. జీవేశ్వరులకు సంయోగ సంబంధ ముండఁగలుగునే కాని వ్యాప్యవ్యాపకము కాదు.

ఉత్తరము:- ఈ నియమము సమానాకారము గల పదార్థములయందు పట్టునే కాని అసమానాకృతుల యందుఁగాదు. ఏలయనఁగా ఇనుము స్థూలము, అగ్ని సూక్ష్మము. ఈ కారణముచే విద్యుదగ్ని యినుమునందు వ్యాపించి యొకటే అవకాశ మందు రెండు నుండును. జీవుఁడు పరమేశ్వరుని కంటె స్థూలుఁడును, పరమేశ్వరుఁడు జీవునికంటె సూక్ష్ముఁడు నగుటచేఁ బరమేశ్వరుఁడు వ్యాపకుఁడు జీవుఁడు వ్యాప్యుఁడు. జీవేశ్వరుల కీవ్యాప్యవ్యాపక సంబంధ ముండు నట్లే సేవ్యసేవక. ఆధారాధేయ. స్వామిభృత్య. రాజా ప్రజా. పితా పుత్రాది సంబంధములుఁ గూడ నున్నవి.

ప్రశ్న:- జీవేశ్వరులు వేఱుగ నుందురేని:-

ప్రజ్ఞానం బ్రహ్మ ॥౧॥ ఐతరేయ ఉప.౩.౫.౩॥ అహం బ్రహ్మాస్మి ॥౨॥
బృహ. ఉప. ౧. ౪. ౧౦॥

తత్త్వమసి॥౩॥ఛాందో. ఉప.౬.౮.౭॥ అయమాత్మా బ్రహ్మ ॥౪॥మాండూక్య. ౨॥
వేదములందలి యీ మహావాక్యముల కర్థమేమి?

ఉత్తరము :- ఇవి వేదవాక్యములే కావు. కాని బ్రాహ్మణ గ్రంథముల వచనములు. వీనికి మహావాక్యములను పేరు సత్యశాస్త్రము లందెందును వ్రాయఁబడలేదు. వీనియర్థము:- (అహమ్) నేను (బ్రహ్మ) బ్రహ్మస్థుఁడుగ (అస్మి) ఉన్నాను. ఇక్కడ శాస్త్ర్యోపాధి. ఏలయనఁగా (మంచాః క్రోశంతి) మంచె లఱచు చున్నవి. మంచె జడము; దానియందఱచు సామర్థ్యములేదు. కాఁబట్టి మంచెయం దుండు మనుష్యుఁ డఱచుచున్నాఁడని తెలియనట్లే యిక్కడను దెలియవలయును. అన్ని పదార్థములు బ్రహ్మస్థము లయియుండగా జీవుని బ్రహ్మస్థుఁడనుటచే నేమి విశేషమని కొందఱడుగరేని, అన్ని పదార్థములును బ్రహ్మమందుండినను జీవునివలెఁ దక్కినవి సాధర్మ్య యుక్తములును, నికటస్థములును గావు. జీవునకు బ్రహ్మ జ్ఞానమును, ముక్తి యందు బ్రహ్మముతో సాక్షాత్సంబంధమును గలుగును. కాఁబట్టి జీవునకు బ్రహ్మముతో శాస్త్ర్యము. లేక తత్సహచరితోపాధి యున్నది. అనఁగా జీవుఁడు బ్రహ్మమునకు సహచారి. కాఁబట్టి జీవుఁడును బ్రహ్మము నొక్కటి కాదు. ఒకఁడు మఱి యొకని గూర్చి "నేనును ఇతఁడును ఒకటి" అనఁగా నవిరోధులము అన్నమాట. సమాధిస్థుఁడగు జీవుఁడు ప్రేమబద్ధుఁడై పరమేశ్వరునియందు నిమగ్నుఁడై న పుడు "నేనును బ్రహ్మయు నొకటి" అనఁగా నవి రోధులము అనుట. ఒక్కయవకాశస్థుమని చెప్పఁగలఁడు. ఏ జీవుఁడు, పరమాత్మ గుణకర్మ స్వభావముల కనుకూలముగ దనగుణకర్మ స్వభావముల జేసికొన్నాఁడో యతఁడే సాధర్మ్యముచే బ్రహ్మముతో నేకత్వమును అనఁగా "బ్రహ్మము నేనును ఒకటి" యని చెప్పఁగలఁడు.

ప్రశ్న:-మంచిది. తత్త్వమసి"దీని కెట్లు అర్థముఁ జేయుదురు? (తత్) ఆ బ్రహ్మము (త్వం) (జీవుఁడు) నీవు (అసి) అయితివి. ఓజీవా! (త్వం) నీవు (తత్) ఆ బ్రహ్మవయి (అసి) ఉన్నావు అనికదా.

ఉత్తరము:-మీరు తత్ శబ్దముచే నేమిగ్రహింతురు? "బ్రహ్మ" అందు లేని బ్రహ్మమును గ్రహించుటకు బ్రహ్మశబ్దము ననువృత్తి నెక్కడ నుండి తెచ్చితిరి?

ప్రశ్న:-

'సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయం బ్రహ్మ'॥

ఈ పూర్వవాక్యము నుండి.

ఉత్తరము:-మీరు ఈ ఛాందోగ్యోపనిషత్తు దర్శనము కూడ చేయలేదని తోఁచుచున్నది. ఏలయనఁగా మీరు చూచి యుండురేని, అక్కడ బ్రహ్మశబ్ద పాఠము లేనిదే (యిట్లు బ్రహ్మశబ్దమును జేర్చి) యబద్ధమేల చెప్పుదురు? ఛాందోగ్యమందు:-

సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయమ్॥ ఛాం. ప్ర. ౬. ఖం. ౨. మం. ౧

అని యిట్లు పాఠమున్నదే కాని బ్రహ్మశబ్దమక్కడ లేదు.

ప్రశ్న:- తమరు తత్ శబ్దముచే నేమి గ్రహింతురు?

ఉత్తరము:-

స య ఏషోఽణిమా ఐతదాత్మ్యమిదꣳ సర్వం తత్సత్యꣳ స ఆత్మా

తత్త్వమసి శ్వేతకేతో ఇతి॥ ఛాందోగ్య॥ ప్ర. ౬. ఖం. ౮. మం. ౭॥

ఆ పరమాత్మ తెలియుటకు యోగ్యుఁడు. ఎవఁడు అత్యంత సూక్ష్ముఁడును. ఈ సమస్త జగత్తునకును జీవునకు నాత్మయో యతఁడే. సత్యస్వరూపుఁడు. తన ఆత్మ తానే యయియున్నాఁడు. ఓ శ్వేతకేతు! ప్రియపుత్ర! 'తత్త్వమసి' అనఁగా :

తదాత్మక స్తదంతర్యామీ త్వమసి॥

అంతర్యామి యగు నాపరమాత్మచే నీవు యుక్తుఁడవు. ఇదే యర్థము ఉపనిషత్తులయం దవిరుద్ధమయి యున్నది. ఏలయనఁగా:—

య ఆత్మని తిష్ఠన్నాత్మనోఽన్తరో యమాత్మా న వేద యస్యాత్మా శరీరమ్।

ఆత్మనోఽన్తరో యమయతి స త ఆత్మాన్తర్యామ్యమృతః॥ బృ. అ. ౫. బ్రా. ౭. ౨౨॥

ఇది బృహదారణ్యకపు వచనము:- మహర్షి యాజ్ఞవల్క్యుఁడు తన స్త్రీయగు మైత్రేయితో 'ఓ మైత్రేయి! ఏ పరమేశ్వరుఁడు ఆత్మయందు-జీవుని యందు స్థితుఁడై జీవాత్మకంటె భిన్నుఁడై యున్నాఁడో, మూఢుఁడగు జీవాత్మ

తనయందు వ్యాపకుఁడయియున్న యా పరమేశ్వరుని దెలియఁడో, ఏ పర
మేశ్వరునకు జీవాత్మ శరీరమో అనఁగా శరీరమందు జీవుఁడున్నట్లు జీవుని
యందుఁ బరమేశ్వరుఁడు వ్యాపకుఁడయియున్నాడో. ఏ పరమేశ్వరుఁడు
జీవుని కంటె భిన్నుఁడుగా నుండి జీవుని పాపపుణ్యములకు సాక్షియయి వానికి
ఫలమిచ్చి నియమమం దుంచుచున్నాఁడో, అయవినాశ స్వరూపుఁడే నీకు నం
తర్యామియగు నాత్మ. అనఁగా నీలోపలను వ్యాపకుఁడయి యున్నాఁడు; అతని
నీవు తెలిసికొనుము' అని చెప్పును. ఏమి, ఇత్యాది వచనముల కెవ్వఁడేని
వేఱుగ అర్థము చేయఁగలఁడా? (అయమాత్మా బ్రహ్మ) సమాధి దశయందు
యోగికిఁ బరమేశ్వరుఁడు ప్రత్యక్షమయినపుడు "ఈ నాయందు వ్యాపకుఁడగు
బ్రహ్మమే సర్వత్ర వ్యాపకుఁడై యున్నాడు" అని చెప్పును. కాఁబట్టి జీవ
బ్రహ్మలొక్కటియని చెప్పునిప్పటి వేదాంతులు వేదాంత శాస్త్రమును దెలియరుఁ

ప్రశ్న:—

అనేన ఆత్మ నా జీవేనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి॥

ఛాం ప్ర. ౬. ఖం. ౩. మం. ౨॥

తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్॥ తైత్తిరీయ. బ్రహ్మానం. అను. ౬॥

పరమేశ్వరుఁడు చెప్పుచున్నాఁడు:—నేను జగత్తును, శరీరములనురచించి
జగత్తునందు వ్యాపకుఁడను, జీవరూపుఁడనయి శరీరమందుఁ బ్రవిష్టుఁడనగుచు
నామరూపముల వ్యాఖ్యచేయుదునుగాక. పరమేశ్వరుఁడు జగత్తును శరీరమును
జేసి దానియందతఁడే ప్రవిష్టుఁడయ్యెను. ఇత్యాది శ్రుతుల యర్థమును వేఱుగ
నెట్లు చేయఁగలరు?

ఉత్తరము:— మీరు పదమును, పదార్థమును, వాక్యార్థమును దెలిసి
యుండురేని ఇట్టి యనర్థముల నెన్నఁడును జేసియుండరు. ఏలయనఁగా నిక్కడ
యొకటి ప్రవేశము. రెండవది అనుప్రవేశము-పిమ్మట ప్రవేశముఅనఁబడును.
పరమేశ్వరుఁడు శరీరములందుఁ బ్రవిష్టులయిన జీవుల వెంట ననుప్రవిష్టుని
వలెనయి వేదము ద్వారా సమస్తనామ రూపాదుల విద్యను బ్రకటపఱుచుచు
న్నాఁడు. శరీరమందు జీవుని ప్రవేశపెట్టి, తాను జీవునిలో అనుప్రవిష్టుఁడగు
చున్నాడు. ఇది యర్థము. మీకు అను శబ్దార్థము తెలిసియున్న నిట్టి విపరీతార్థ
మెన్నఁడును జేసియుండరు.

ప్రశ్న:-

"సోఽయందేవదత్తో య ఉష్ణకాలే కాశ్యాందృష్టః స ఇదానీం ప్రావృట్ సమయే మథురాయాం దృశ్యతే" నే నుష్ణకాలమందు కాశిలోఁజూచియుండిన దేవదత్తునే వర్షాకాలమందు మథురలోఁ జూచుచున్నారను. ఇక్కడ కాశీ దేశమును, ఉష్ణకాలమును వదలి శరీరమాత్రమందే లక్ష్యముంచితిమేని దేవదత్తుఁడు లక్షితుఁడగుచున్నాడు. అట్లే భాగత్యాగలక్షణముచే నీశ్వరుని పరోక్ష దేశ-కాలమాయోపాధిని. జీవుని వర్తమాన దేశకాల, అవిద్యా, అల్పజ్ఞతో పాధిని వదలి చేతన మాత్రమందు లక్ష్యముంచుటచే నొక్కచే బ్రహ్మవస్తువు రెంటియందును లక్షితమగుచున్నది. కొంత గ్రహించుట, కొంత వదలిపెట్టుట యనునీ భాగత్యాగ లక్షణమును బట్టి ఈశ్వరుని సర్వజ్ఞత్వాది వాచ్యార్థమగు చేతనమును మాత్రము గ్రహించుటచే నద్వైతము సిద్ధమగుచున్నది. దీనికి మీరేమి చెప్పగలరు.

ఉత్తరము:-మీరు జీవుని, ఈశ్వరుని నిత్యులని నమ్ముచున్నారా? అనిత్యులనియా? మొదటఁజెప్పుఁడు.

ప్రశ్న:-వీరిద్దఱను, ఉపాధి జన్యులును, గల్పితులు నగుటచే. అనిత్యులని నమ్ముచున్నాము.

ఉత్తరము:- ఆ ఉపాధిని నిత్యమని నమ్ముచున్నారా? అనిత్యమనియా?

ప్రశ్న:-మా మతమందు:-

జీవేశా చ విశుద్ధాచిద్విభేదస్తు తయోర్ద్వయోః।
అవిద్యా తచ్చితోర్యోగః షడస్మాక మనాదయః॥
కార్యోపాధిరయం జీవః కారణోపాధి రీశ్వరః।
కార్యకారణతాం హిత్వా పూర్ణబోధోఽవశిష్యతే॥

ఇవి సంక్షేప శారీరకము, శారీరక భాష్యములలోని కారికలు:-ఒకటి జీవుఁడు రెండవది ఈశ్వరుఁడు, మూఁడవది బ్రహ్మము, నాల్గవది జీవేశ్వరుల విశేషభేదము, ఐదవది అవిద్య-అజ్ఞానము, ఆఱవది అవిద్యా చేతనముల యోగము అను నీయాఱు పదార్థములు ననాది యని వేదాంతులమగు మేము నమ్ముచున్నారము. కాని బ్రహ్మముమాత్ర మనాది, అనంతము. తక్కిన యైదును ప్రాగభావము వలె, అనాది సాంతములు. అజ్ఞానముండువఱ కీయైదు

సుందును. ఈ ద్వైదింటికి ఆది విదితముకానందున అనాది సంజ్ఞ. జ్ఞానము కలిగిన పిమ్మట నివినష్టమయిపోవునుగనుక సాంతములు. అనఁగా నశించున వనియనఁబడును

ఉత్తరము:—మీ యీ రెండు శ్లోకములును అశుద్ధములే. ఏల యనఁగా మీమతమందు అవిద్యతోఁ గూడక జీవుఁడును, మాయతోఁ గూడక యీశ్వరుఁడును సిద్ధింపఁజాలరు. కాఁబట్టి "తచ్చితోర్యోగ" అని మీరెంచిన యాఱవ పదార్థముండనే యుండదు. ఏలయనఁగా నది—యవిద్యామాయలు. జీవేశ్వరులయందుఁ జరితార్థమైపోయినది. మఱి బ్రహ్మము మాయావిద్యల సంయోగములేక జీవేశ్వరులు కాఁజాలనిచో, అవిద్యాబ్రహ్మముల కంటె నీశ్వరుని వేఱుగ నెన్నుట వ్యర్థము. కాబట్టి మీ మత మందు బ్రహ్మము, అవిద్య అను నీ రెండు పదార్థములే సిద్ధమగు చున్నవి; కాని ఆఱు కావు. మఱి మొదట అనంత, నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్త స్వభావుఁడును, సర్వవ్యాపకుఁడు నగు బ్రహ్మమునం దజ్ఞానమును మీరు సిద్ధపఱచినఁ గాని, కార్యోపాధిచేత జీవుని, కారణోపాధిచే నీశ్వరుని సిద్ధి చేయఁజాలరు. బ్రహ్మము నేకదేశమందు స్వాశ్రియమును, స్వవిషయకమునగు అజ్ఞానమును సర్వత్రి అనాదియని నమ్మితిరేని బ్రహ్మ మంతయు శుద్ధముగా నుండఁజాలదు. ఒక్క దేశమందజ్ఞానమును నమ్మితి రేని, అది పరిచ్ఛిన్నము కాఁబట్టి ఇక్కడికక్కడికి వచ్చుచుఁ బోవుచు నుండును. ఎప్పటికిఁ బోవునో అప్పటి బ్రహ్మమజ్ఞానియును, ఏ దేశమును వదలునో యా దేశపు బ్రహ్మము జ్ఞానియు నగుచునుండును. కాఁబట్టి యేదేశపు బ్రహ్మమునైనను అనాది, శుద్ధము, జ్ఞాన యుక్తమునని మీరు చెప్పఁజాలరు. అజ్ఞానసీమయందుండు బ్రహ్మము అజ్ఞానియు, వెలుపటి బ్రహ్మము జ్ఞానియు నయ్యెనేని బ్రహ్మము ఖండమైపోవును. దీనివలన బ్రహ్మమునకేమి. హానియందు రేని బ్రహ్మమఖండముగాదు. అఖండ మేని అజ్ఞానికాదు. మఱియు జ్ఞానాభావమును, విపరీతజ్ఞానమును గుణములగుటఁ జేసి వాని కొక ద్రవ్యముతో నిత్యసంబంధ ముండును. అట్లయ్యెనేని సమవాయ సంబంధము కలిగి యుండుటచే అనిత్య మెన్నఁటికిని గాఁజాలదు. మఱియు నెట్లు శరీరమున నొక ప్రదేశమందు పుండు గలిగిన సంతత దుఃఖము వ్యాపించునో యట్లే బ్రహ్మము నేక దేశమందు అజ్ఞాన సుఖదుఃఖ క్లేశ

ములు కలిగిన బ్రహ్మమంతయు దుఃఖాదుల ననుభవింపవలసి వచ్చును. కార్యో పాధి- అంతఃకరణమును ఉపాధితోఁ గూడి బ్రహ్మము జీవుఁడగుచున్నాఁడని మీరు నమ్మదురేని, బ్రహ్మము వ్యాపకమా? పరిచ్ఛిన్నమా? బ్రహ్మము వ్యాపకమే కాని ఉపాధి పరిచ్ఛిన్నము- ఏక దేశీయమును, భిన్నభిన్నమును అందురేని, అంతఃకరణము చరించుచుండునా? లేదా?

ఉత్తరము:-చరించుచుండును.

ప్రశ్న:-అంతఃకరణముతోఁ గూడ బ్రహ్మము చరించుచుండునా? స్థిరముగా నుండునా?

ఉత్తరము:-స్థిరముగా నుండును.

ప్రశ్న:-అంతఃకరణమే యే దేశమును వదలునో ఆయా దేశపు బ్రహ్మమజ్ఞాన రహితమును, ఏయేదేశమును బొందునో ఆయా దేశపు శుద్ధబ్రహ్మమజ్ఞానియు నగుచుండవచ్చును. అట్లే బ్రహ్మము క్షణమందు జ్ఞానియును, క్షణమందు అజ్ఞానియును కావలసి వచ్చును. దీనిచే మోక్షమును, బంధమును క్షణభంగురమై యుండును, ఒకఁడు చూచిన దానిని మఱొకఁడు స్మరింప లేనట్లు నిన్నఁజూచిన పదార్థమో, వినిన మాటయో నేఁడుజ్ఞాపకము లేక పోవును, ఏల యనఁగా చూచిన దేశకాలములు వేఱు. స్మరించు దేశకాలములు వేఱు.కాఁబట్టి బ్రహ్మము సర్వజ్ఞము కాఁజాలదు. బ్రహ్మమొక్కఁడు, అతఁడు సర్వజ్ఞుఁడేల కాఁడు? అంతఃకరణము భిన్నభిన్నము కాఁబట్టి అతఁడును భిన్నభిన్న మగుచు నుండవచ్చు నందురేని, అంతఃకరణము జడము కాఁబట్టి దానికి జ్ఞానము కలుగఁజాలదు, కేవలము బ్రహ్మమునకుఁగాని, కేవల మంతఃకరణమునకుఁ గాని జ్ఞానము కలుగదు. కాని అంతఃకరణస్థచిదాభాసమునకు జ్ఞానము కలుగు నన్నను చేతనమునకే అంతఃకరణము ద్వారా జ్ఞానము కలిగెను; అట్లయ్యే నేని అతఁడు నేత్రముల ద్వారా అల్పము అల్పజ్ఞము నేల కావలయును?కాఁబట్టి బ్రహ్మము కారణోపాధి చేత నీశ్వరుఁడును,గార్యోపాధిచేత జీవుఁడును గాడు. వాస్తవముగ బ్రహ్మమునకే ఈశ్వరుఁడని పేరు- బ్రహ్మమునకంటె భిన్నుఁడును, అనాదియు, అనుత్పన్నుఁడును, అమృత స్వరూపుఁడు నగు జీవునకు జీవుఁడని పేరు. చిదాభాసునికే జీవుఁడని పేరందురేని అది క్షణభంగురము కాఁబట్టి నష్టమైపోవును.

ఇఁక మోక్షసుఖ మెవ్వరనుభవింతురు? కాన బ్రహ్మము జీవుఁడు కాని, జీవుఁడు బ్రహ్మము కాని యెన్నఁడును కాలేదు, కారు, కాఁబోరు.

ప్రశ్న:-సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేక మేవాద్వితీయమ్॥ఛాందోగ్య ౬ ౨.౧॥

మరి అద్వైత మెట్లు సిద్ధింపఁగలదు? మా మతమందు బ్రహ్మమున కంటె భిన్నముగా ఏ సజాతీయ, విజాతీయ స్వగతావయవ భేదము లేనందున, ఒక్క బ్రహ్మమే సిద్ధమగుచున్నది. జీవుఁడు వేఱేని అద్వైత మెట్లుసిద్ధింపఁ గలదు?

ఉత్తరము :- ఈ భ్రమ యందుఁ జిక్కి యేల భయపడుచున్నారు? విశేష్యవిశేషణముల విద్యను, దాని ఫలమును దెలిసి కొనుఁడు. ('వ్యావర్తకం విశేషణం భవతీతి) విశేషణము భేదకారక మగునందు రేని, దానితో కూడ (ప్రవర్తకం ప్రకాశమపి విశేషణం భవతీతి) విశేషణము ప్రవర్తకమును బ్రకాశకమును నగుచున్న దనియు యొప్పు కొనుఁడు. ఇక్కడి అద్వైత శబ్దము బ్రహ్మమునకు విశేషణమని గ్రహింపుఁడు అద్వైతమనున దిటననేకములగు జీవులనుండి బ్రహ్మమును వేఱు చేయుచున్నది; ఇది వ్యావర్తక ధర్మము. మఱి బ్రహ్మ మొక్కఁడే యనుటను బ్రవృత్తి చేయుచున్నది గనుక నీ విశేషణము ప్రకాశక ధర్మము నగుచున్నది.

'అస్మిన్నగరేఽద్వితీయో ధనాఢ్యో దేవదత్తః
అస్యాం సేనాయామద్వితీయః శూరవీరో విక్రమసింహః'

ఒకఁడు మఱి యొకనితోఁ, ఈ నగరమందు అద్వితీయ ధనాఢ్యుఁడు దేవదత్తుఁడును, ఈ సేనయందు అద్వితీయశూర వీరుఁడు విక్రమ సింహుఁడును గలఁ డనగా నీ నగరమందు దేవదత్తుని వంటి ఇతర ధనాఢ్యుఁడును ఈ సేన యందు విక్రమసింహుని వంటి యితర శూరవీరుఁడును లేఁడు. కాని తక్కువ వారున్నారని మాత్రము సిద్ధమగు చున్నది. ఇఁక పృథివ్యాది జడపదార్థములును, పశ్వాది ప్రాణులును, వృక్షాదులును గూడ నున్నవి. వాని నిషేధము గలుగదు. అట్లేయిక్కడను జీవుఁడు కాని ప్రకృతికాని బ్రహ్మకు దుల్యములుగాక న్యూనము లనుట స్పష్టము. కాన బ్రహ్మము సదా యొక్కఁడే. జీవులును ప్రకృతిస్థ తత్త్వములు ననేకము లని దీనిచే సిద్ధమైనది. అద్వైత విశేషణము కాని అద్వితీయ విశేషణము కాని, బ్రహ్మమును జీవప్రకృతుల నుండి వేఱుపఱచి బ్రహ్మము

ఏకత్వమును సిద్ధపఱచు చున్నది. కాబట్టి యీ విశేషణముల నుండి జీవ ప్రకృతులకును, కార్యరూప జగత్తునకును అభావనిషేధములు కలుగఁజాలవు. ఇవన్నియు నున్నవి; కాని బ్రహ్మములోఁ దుల్యమైనవి కావు. కావున దీనివలన అద్వైత సిద్ధికాని, ద్వైతసిద్ధికాని హానిగలుగదు. భయపడకుఁడు విచారించి తెలిసి కొనుఁడు.

ప్రశ్న :— బ్రహ్మము సత్. చిత్. ఆనంద గుణములును, జీవుని అస్తి భాతి. ప్రియ రూపములు నొక్కటియే యగుచున్నవి. మఱియేల ఖండించెదరు ?

ఉత్తరము: — కొంత సాధర్మ్య ముండుటచే నేకత్వమనఁబడఁజాలదు. ఎట్లనఁగా:—పృథివి జడమును, దృశ్యము నై యున్నది. అట్లే అగ్నిజలాదులును జడములును దృశ్యములునై యున్నవి. ఇంతమాత్రము చేత నొక్కటి కాఁజాలవు. వీనియందలి వైధర్మ్యము-విరుద్ధ ధర్మము-భేద కారకము. ఎట్లనఁగా-గంధము, రూక్షత, కాఠిన్యము మొదలగునవి పృథివికివి. రసత్వము, ద్రవత్వము, కోమలత్వము మొదలగు ధర్మములు జలమునకును, రూపదాహకత్వధర్మములు అగ్నికివి. ఉండుటఁ బట్టి యొక్కటి కావు. కీటకమును, మనుష్యుఁడును కంటితోఁ జూచుచు, నోటితోఁ దినుచు, కాళ్ళతో నడుచుచు నున్నారు. ఇట్లుండినను మనుష్యుని ఆకృతి, రెండు కాళ్ళు మున్నగునవియు, కీటకాకృతి అనేక పాదములు మొదలగు నవియు భిన్నము లగుటచే నొక్కటి కానట్లే పరమేశ్వరుని అనంత జ్ఞానమును, ఆనందబలక్రియలును, నిర్భ్రాంతత్వమును, వ్యాపకత్వమును జీవుని కంటె భిన్నముగను, జీవుని అల్పజ్ఞానము, అల్పబలము, అల్పస్వరూపము, భ్రాంతిత్వము, పరిచ్ఛిన్నత మొదలగు గుణములు బ్రహ్మకంటె భిన్నముగను ఉండుటచే జీవుఁడును పరమేశ్వరుఁడును ఒక్కటి గారు. వీరి స్వరూపముగూడ భిన్నము. [పరమేశ్వరస్వరూపము సూక్ష్మతమము, జీవస్వరూప మతనికంటెఁ గొంత స్థూలము.]

ప్రశ్న:—

అథోదరమంతరం కురుతే। అథ తస్య భయం భవతి। ద్వితీయాద్వై భయం భవతి॥

బృ. ఉ. అ. ౧. ౪. ౧.॥

ఇది బృహదారణ్యక వచనము:-జీవ బ్రహ్మముల యందుఁ గొంచెమేని భేదము చేయువానికి భయము కలుగును. ఇతరునివలననే గదా భయము కలుగును।

ఉత్తరము:- దీని కర్థమది కాదు. పరమేశ్వరుని నిషేధించువానికి. లేక పరమేశ్వరుని ఒకదేశమందో యొకకాలమందో పరిచ్ఛిన్నుడని నమ్మువానికి, అతని యాజ్ఞకుఁ గాని గుణకర్మ స్వభావములకుఁగాని విరుద్ధముగా నడుచువానికి, ఇతర మనుష్యునితో వైరము నుంచు వానికి భయము కలుగునని యర్థము. ఏలయనఁగా ద్వితీయ బుద్ధి అనఁగా నీశ్వరునకును తనకు నేమియు సంబంధము లేదను వానికి భయము కలుగును. అట్లే యొకఁడు మఱి యొకనితో 'నీవు నాకు లక్ష్యము లేదు. నీవు నన్నేమియుఁ జేయఁజాల' వనువానికిని, ఇతరులకు హాని కలిగించుచు దుఃఖము కల్గించుచుండు వానికిని ఇతరుల వలన భయము కలుగును. మఱి వారన్ని విధముల నవిరోధులయి రేని ఒక్కటి యనఁబడుదురు. ఎట్లనఁగా దేవ దత్తుఁడును, యజ్ఞ దత్తుఁడును, విష్ణుమిత్రుఁడును ఒకటి యని లోకమందుఁ జెప్పఁబడుదు రేని వారియందు విరోధము లేదని యర్థము. విరోధము లేకపోవుటచే సుఖమును, విరోధముచే దుఃఖమును గలుగును.

ప్రశ్న :- జీవబ్రహ్మములకు ఏకతానేకతలు సర్వదా యుండునా లేక యెన్నఁడేని రెండును గలసి యొక్కటగునా ?

ఉత్తరము:- ఇంతకుఁ బూర్వ మీ విషయమందుఁ గొంత యుత్తర మీఁబడినది. 'మఱియు వినుఁడు. సాధర్మ్యాన్వయభావములచే నొక్కటి యగును. ఎట్లనఁగా:- మూర్తద్రవ్యము జడమగుటచే ఆకాశమును వదలి యెన్నఁడును వేఱుగానుండదు గనుక రెండు నొక్కటి. ఇఁక విభుత్వము, సూక్ష్మత్వము, అరూపత్వము, అనంతత్వాది ఆకాశ గుణములకును, పరిచ్ఛిన్నత్వ దృశ్యత్వాది మూర్తద్రవ్యముల విరుద్ధ ధర్మములకును భేదము కలదు. అనఁగా పృథివ్యాది ద్రవ్యములు ఆకాశమున కంటె భిన్నముగా నుండవు. అన్వయ భావముతో అవకాశములేక మూర్తద్రవ్య మెన్నడు నుండ నేరదు. మఱి వ్యతిరేక భావముతో స్వరూపమునందు భిన్నమగుటఁ బట్టి వేఱుగ నుండును. అట్లే బ్రహ్మము వ్యాపకమగుటచే జీవుఁడును, పృథివ్యాది ద్రవ్యములును అతని నుండి వేఱుగా నుండఁజాలవు. స్వరూపముచే నొక్కటియుఁ గాఁజాలవు. ఎట్లనఁగా:- ఇల్లు కట్టక మునుపు వేఱు వేఱు ప్రదేశములందు మన్ను, కఱ్ఱలు, ఇనుము మొదలగు పదార్థము లాకాశమందే యుండును.

ఇల్లు కట్టినపుడును ఆకాశమందే ఉండును. ఆ యిల్లు నష్టమయి నపు(డు ఆ యింటి యవయవములన్నియు భిన్నభిన్న దేశములఁ బొందినపుడుగూడ నాకాశమందే యుండును. మూఁడు కాలములందును ఆకాశమున కంటె భిన్నము కాఁజాలవు. కాని స్వరూపముచే భిన్నమగుటఁ బట్టియెన్నఁడు నొక్కటై యుండలేదు. లేవు, ఉండఁబోవు. అట్లే జీవుఁడును, జగత్పదార్థము లన్నియు బరమేశ్వరుని యందు వ్యాప్యములగుటచేఁ బరమాత్మనుండి మూఁడు కాలము లందును వేఱు కాఁజాలవు. స్వరూపమునందు భిన్నమగుటచే నొక్కటియు కాఁజాలవు. ప్రస్తుత వేదాంతుల దృష్టి మెల్లకంటి వానివలె అన్వయము వైపున మాత్రము పడి వ్యతిరేకభావమునుండి జాఱి విరుద్ధమై పోయినది. సగుణ నిర్గుణములును అన్వయ వ్యతిరేకములును, సాధర్మ్యములును, విశేషణభావమును లేని ద్రవ్యమే లేదు.

ప్రశ్న :- పరమేశ్వరుఁడు సగుణుఁడా నిర్గుణుఁడా ?

ఉత్తరము :- రెండు ప్రకారముల నున్నాఁడు.

ప్రశ్న :- ఒక యొఱలో రెండు కత్తు లెన్నఁడేని యుండఁగలుగునా ? ఒకటే పదార్థమందు సగుణత్వము లెట్లుండఁగలుగును ?

ఉత్తరము :- జడమందు రూపాది గుణములుండి జ్ఞానాది చేతన గుణము లుండవు. చేతనమందు ఇచ్ఛాది గుణములుండి రూపాది జడ గుణములుండవు. (యద్గుణైస్సహ వర్తమానం తత్సగుణమ్' 'గుణేభ్యో యన్నిర్గతం పృథగ్భూతం తన్నిర్గుణమ్) గుణములతోఁ గూడినది సగుణమనియు గుణములచే రహితమయినది నిర్గుణ మనియు ననఁబడును. తమ తమ స్వాభావిక గుణములతోఁ గూడి ఇతర విరోధిపదార్థముల గుణముల నుండి రహితమగుటచేఁ బదార్థములన్నిటి యందును సగుణత్వనిర్గుణత్వములుండును. కేవల సగుణత్వమును, కేవల నిర్గుణత్వమును గల పదార్థమే లేదు. కాని యొకే పదార్థమందు సగుణత్వమును, నిర్గుణత్వము నుండును. అట్లే పరమేశ్వరుఁడు తన యనంత జ్ఞానబలాది గుణ సహితుఁడగుట వలన సగుణుఁడును, రూపాది జడ గుణములు, ద్వేషాది జీవుని గుణములు లేకుండుట వలన నిర్గుణుఁడు ననఁబడును.

ఉత్తరము:—అగ్నేర్ ఋగ్వేదో వాయోర్యజుర్వేదః సూర్యాత్సామవేదః॥
శత. ౧౧. ४. ౨. ३॥

సృష్ట్యాది యందు పరమాత్మ అగ్ని, వాయు, ఆదిత్య, అంగిరసులను ఋషుల యాత్మలందొక్కొక్క వేదమును ప్రకాశ పఱచెను.

ప్రశ్న :—
యో వై బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై॥
శ్వేత. అ. ౬. మం. ౧౮॥

ఈ వచనమందు బ్రహ్మ హృదయ మందు వేదములను ఉపదేశించి నట్లు చెప్పఁబడి యుండఁగా మరల నగ్న్యాది ఋషుల యాత్మ లందని యేలఁ జెప్పఁబడెను.

ఉత్తరము :— బ్రహ్మయాత్మయందు అగ్న్యాదుల ద్వారా స్థాపింపఁ జేసెనని తెలియ వలయును. మనుస్మృతి చూడుఁడు:—

అగ్ని వాయురవిభ్యస్తు త్రయం బ్రహ్మ సనాతనమ్।
దుదోహ యజ్ఞ సిద్ధ్యర్థమృగ్యజుస్సామ లక్షణమ్॥ మను. ౧. ౨౩॥

పరమాత్మ సృష్ట్యాదియందు మనుష్యుల నుత్పాదించి అగ్ని మొదలగు నలువురు మహర్షుల ద్వారా నాలుగు వేదములను బ్రహ్మకు ప్రాప్తింపఁ జేసెను. ఆ బ్రహ్మ అగ్ని, వాయు, ఆదిత్య, అంగిరసులనుండి ఋగ్యజుస్సామాథర్వ ములను గ్రహించెను.

ప్రశ్న:— ఆ నలుగుర యందే వేదమును ప్రకాశ పఱచెను. అన్యుల యందుఁ గాదు, కాఁబట్టి దీనిచే నీశ్వరుఁడు పక్షపాతి యగు చున్నాఁడు గదా।

ఉత్తరము:— జీవులందఱ కంటె నా నలుగురే మిక్కిలి పవిత్రాత్ములగ నుండిరి. తక్కినవారు వారితో సమానులు కాకుండిరి. కాఁబట్టి యీ పవిత్రి విద్యను వారి యందే ప్రకాశ పఱచెను.

ప్రశ్న:— ఏదేశభాష యందేని వేదములను ప్రకాశ పఱుపక సంస్కృ తము నందే యేలఁజేసెను?

ఉత్తరము:- ఏదేని దేశభాష యందుఁ బ్రకాశపఱచి యుండిన ఈశ్వ రుఁడు పక్షపాతి యగును. ఏలయనఁగా వేదపఠనపాఠన మా దేశస్థులకు సుగ మమును, విదేశీయులకుఁ గఠినము నగును. కాఁబట్టి యే దేశ భాషయు కాక్ష్

సంస్కృత మందు( బ్రకాశపఱచెను ఇ(క వేదభాష తక్కిన సమస్త భాషలకు, గారణము కాన నందే ప్రకాశపఱచెను. పృథివ్యాది సృష్టి సమస్త దేశముల కును, దేశస్థులకును ఒక్కవిధమై, సమస్త శిల్ప విద్యలకు( గారణమై యున్నట్లే పరమేశ్వరుని విద్యకు సంబంధించిన భాషయు నొక్కవిధముగా నుండవలయును. ఏల యనఁగా సర్వ దేశస్థులకును జదువుట యందును జదివించుటయందును సమానముగ పరిశ్రమ చేయనగును. కాఁబట్టి ఈశ్వ రుఁడు పక్షపాతి కాఁడు.

ప్రశ్న :- వేదము ఈశ్వర కృతమే కాని, అన్యకృతము కాదనుట కేమి ప్రమాణము ?

ఉత్తరము :- ఎట్లు ఈశ్వరుఁడు పవిత్రుఁడు సర్వవిద్యావిదుఁడు, శుద్ధ గుణకర్మస్వభావుఁడై, న్యాయము, దయ మొదలగు గుణములతోఁ గూడి యున్నాఁడో అట్లు ఏ పుస్తకమందు ఈశ్వరగుణకర్మ స్వభావముల కనుకూల మయిన కథన ముండునో యది ఈశ్వరకృతమే. అన్యకృతముకాదు, ఇంక దేనియందు సృష్టి క్రమమునకును, ప్రత్యక్షాది ప్రమాణములకు ఆప్తులయు( బవిత్రాత్ములయు వ్యవహారమునకు విరుద్ధమగు కథన ముండదో యది ఈశ్వ రోక్తము. ఈశ్వరుని జ్ఞానము నిర్భ్రాంతమయినట్లు ఏ పుస్తకమందు భ్రాంతి రహిత జ్ఞానము ప్రతిపాదింపఁ బడినదో అది ఈశ్వరోక్తము. పరమేశ్వరుని యట్లు, సృష్టిక్రమ మట్లు, ఈశ్వరునియు సృష్టికార్యకారణములయుజీవులయు( బ్రతిపాదనము దేని యందున్నదో యది పరమేశ్వరోక్త పుస్తకము. మఱియు నది ప్రత్యక్షాది ప్రమాణముల కవిరుద్ధముగను, శుద్ధాత్మ స్వభావమునకు విరుద్ధము కానిదిగ నుండవలయును. ఈ ప్రకారము వేదమున్నదే కాని తక్కిన బైబిలు, ఖురాను మొదలగు పుస్తకములు లేవు. దీనిని స్పష్ట వ్యాఖ్యానము బైబిలు, కురానుల ప్రకరణములగు పదుమూఁడవ పదునాల్గవ సముల్లాసముల యందుఁ జేయఁబడును.

ప్రశ్న :- వేద మీశ్వరుని నుండి రావలసిన యావశ్యక మేమియు లేదు. ఏలయనఁగా మనుష్యులే క్రమశః జ్ఞానమును వృద్ధి పఱచుకొని పిమ్మట పుస్తకములను వ్రాయఁ గలుగుదురు.

ఉత్తరము:- ఎన్నఁటికిని వ్రాయఁజాలరు. ఏలయనఁగా కారణము లేక కార్యోత్పత్తి యగుట యసంభవము. ఎట్లనఁగా అడవి మనుష్యులు సృష్టిని జూచినను విద్వాంసులు కాఁజాలరు. వారికెవరేని శిక్షకులు గలిగిరేని విద్వాంసు లయిపోదురు. ఇప్పుడును ఎవని యొద్దనేని జదువక యెవ్వఁడును విద్వాంసుడు కాఁడు. పైఁజెప్పినట్లు పరమాత్మ సృష్ట్యాది యందా ఋషులకు వేదవిద్యను జదివింపకున్నను, వారు దాని నితరులకుఁ జదివింపక పోయినను యిప్పటివఱకందఱు నవిద్వాంసులుఁగానే యుందురు. ఎట్లనఁగా ఎవ్వనినేని యొక్క బాలుని పుట్టగానే ఏకాంత దేశమందో,మూఢుల సాంగత్య మునవో. పశువుల సాహచర్యముననో యుంచితి మేని వాఁడట్టి వాఁడేయయి పోవును. అడవిలోని భిల్లులు మొదలగు వారు దీనికి దృష్టాంతము. ఆర్యావర్త దేశమునుండి శిక్షను బొందనంతవఱకు సీజిప్టు, గ్రీసు, యూరోపు మొదల గాఁగల దేశములందలి జనులు విద్యావిహీనులై యుండిరి.యూరపునుండికొలంబసు మొదలగు పురుషులు అమెరికాకుఁ బోకుండు వఱకు నక్కడి వారు వేల కొలఁది, లక్షలకొలఁది కోట్లకొలఁది వర్షములనుండి మూర్ఖులు-విద్యావిహీను లయి యుండిరి. పిమ్మట శిక్షను బొంది విద్వాంసులయిరి. అట్లే సృష్ట్యాది యందుఁ బరమేశ్వరు నుండి విద్యాశిక్షల బొందుట చేతనే యుత్తరోత్తరకాల మందు విద్వాంసులగుచు వచ్చిరి.

స పూర్వేషామపి గురుః కాలేనానవచ్ఛేదాత్ ॥ యోగ. సమాధిపాదే సూ. ౬॥

ప్రస్తుత సమయ మందు మన మధ్యాపకుల నుండి చదివియే విద్వాంసుల మగుచున్నట్లు సృష్ట్యారంభ మందుత్పన్నులయిన అగ్న్యాది ఋషులు పరమేశ్వరునుండి విద్వాంసు లయిరి. కాబట్టి పరమేశ్వరుఁడే గురువు-చదివించు వాఁడు. జీవుఁడు సుషుప్తి యందును ప్రళయమందును జ్ఞానరహితుఁడై పోవు చున్నట్లు పరమేశ్వరుఁడు కాఁడు. అతని జ్ఞానమునిత్యము కాఁబట్టి నిమిత్తము లేక యెన్నఁడును నైమిత్తిక ప్రయోజనము సిద్ధింప దని నిశ్చయముగాఁ దెలియ వలయును.

ప్రశ్న:- వేదము సంస్కృతభాష యందుఁ బ్రకాశింపఁబడెను. అయగ్ని మొదలగు ఋషులు సంస్కృతభాషను దెలిసి యుండలేదు కద. మఱి వేదార్థ మును వారెట్లు తెలిసి కొన గలిగిరి.?

ఉత్తరము:— పరమేశ్వరుఁడు చేర్చెను. ధర్మాత్ములును, యోగులును, మహర్షులును ఎప్పుడెప్పు డేయే యర్థమును దెలిసి కొనుట కిచ్ఛగించి ధ్యానావస్థితులై పరమేశ్వరస్వరూప మందు సమాధిస్థు లగుచుండిరో, అప్పుడప్పుడు అభీష్టమంత్రముల యర్థమును పరమాత్ముఁడు దెలిపెను. ఇట్లనేకుల ఆత్మల యందు వేదార్థము ప్రకాశమయి నపుడు ఋషిమునులు ఆ యర్థములను ఇతిహాసపూర్వక గ్రంథములను వ్రాసిరి. వానికే బ్రాహ్మణము లని పేరు. బ్రహ్మ యనఁగా వేదము, దాని వ్యాఖ్యాన గ్రంథమగుటచే బ్రాహ్మణమను నామము కలిగెను. మఱియు:—

ఋషయో మన్త్రదృష్టయః మన్త్రాన్సంప్రాదుః ॥నిరు. ౧.౨౦॥

ఏయే మంత్రార్థదర్శన మేయే ఋషికిఁగలిగెనో, అంతకు మున్నెవరును ప్రకాశ పఱుపని మంత్రార్థము మొదట నే ఋషి తాను ప్రకాశపఱచి యితరులకును బోధించెనో, ఆ మంత్రముతోఁ గూడ నా ఋషి పేరు స్మరణార్థ మప్పటి నుండి వ్రాయఁ బడుచు వచ్చుచున్నది. ఋషులనే మంత్రకర్తల నెడివారు మిథ్యావాదులని తెలియవలయును. ఋషులు మంత్రార్థ ప్రకాశకులు.

ప్రశ్న:— ఏ గ్రంథములకు వేదమని పేరు?

ఉత్తరము:—ఋక్, యజుః, సామ, అథర్వణములను మంత్ర సంహితలకు మాత్రమే.

ప్రశ్న:—

మన్త్రబ్రాహ్మణయోర్వేదనామధేయమ్ ॥

కాత్యాయనాదులు చేసిన యీ ప్రతిజ్ఞా సూత్రాదుల కర్థమేమి చేయుదురు?

ఉత్తరము:— చూడుడు! సంహితా పుస్తకారంభ మందును, అధ్యాయ సమాప్తి యందును వేద మను శబ్దము సనాతనముగ వ్రాయఁ బడుచు వచ్చుచున్నది. బ్రాహ్మణ పుస్తకముల యారంభ మందుఁగాని అధ్యాయ సమాప్తి యందుఁగాని వేదశబ్ద మొప్పుటను వ్రాయఁబడలేదు. మఱియు నిరుక్తమందు:—

ఇత్యపి నిగమో భవతి। ఇతి (చ) బ్రాహ్మణమ్ ॥నిరు. అ ౫. ఖం. ౩. ౪॥

ఛన్దోబ్రాహ్మణాని చ తద్విషయాణి। అష్టాధ్యా. ౪. ౨.౬౬॥

వీని వలనఁగూడ మంత్రభాగము వేదమనియు, వ్యాఖ్యానభాగము బ్రాహ్మణమనియు స్పష్ట మగుచున్నది. ఈ విషయమై విశేషించి చూడఁ

గారువారు నా రచించిన 'ఋగ్వేదాది భాష్యభూమిక' యందుఁ జూడుఁడు. అచ్చట నిది యనేక ప్రమాణములకు విరుద్ధ మగుటచే గార్త్యాయనుల వచనము కాఁజాలదని సిద్ధాంతము చేయ బడినది. బ్రాహ్మణములను గూడ వేదమని నమ్మితిమేని వేదము సనాతనము కాఁజాలదు. ఏలయనఁగా బ్రాహ్మణ గ్రంథముల యందనేక ఋషిమహర్షి రాజాదుల ఇతిహాసములు వ్రాయఁబడి యున్నవి. ఎవని ఇతిహాసమేకాని, వానిజన్మమునకుఁ బిమ్మట వ్రాయఁబడును ఆ గ్రంథమును వాని జన్మమునకుఁ బిమ్మటనే కలుగును. వేదముల యందె వని యితిహాసమును లేదు. కాని విశేషించి యేయే శబ్దముచే విద్య బోధపడునో ఆయా శబ్దము ప్రయోగింపఁబడియున్నది. వేదమందే మహాపురుషుని పేరు (సంజ్ఞ) కాని, కథా ప్రసంగము కాని లేదు.

ప్రశ్న:- వేదముల కెన్ని శాఖలున్నవి?

ఉత్తరము:- పదునొకండు వందల యిఱువది యేఁడు.

ప్రశ్న:- వేనిని శాఖ లందురు?

ఉత్తరము:- వ్యాఖ్యానములను శాఖ లందురు.

ప్రశ్న:- విద్వాంసులు వేదావయవభూతము లగు విభాగములను శాఖలని నమ్ముచున్నారు గద.

ఉత్తరము:- కొంచెము విచారించి చూఁడుడు. ఎన్ని శాఖలున్నవో అవి యన్నియు నాశ్వలాయనాది ఋషుల నామములచేఁ బ్రసిద్ధములయి యున్నవి. మంత్రసంహిత పరమేశ్వరుని నామముచేఁ బ్రసిద్ధమయియున్నది. నాలుగు వేదములు పరమేశ్వరకృతములని నమ్ముచున్నట్లు ఆశ్వలాయనాది శాఖల నాయా ఋషికృతములని నమ్ముచున్నాము. శాఖలయందంతటను వేదమంత్ర ములు (ప్రతీకగ నిచ్చి) వ్యాఖ్యానములు చేసి యున్నారు. ఎట్లనఁగా తైత్తి రీయ శాఖ యందు 'ఇషేత్వోర్జేత్వేతి' ఈ మొదలగు మంత్రముల మొదలిచ్చి వ్యాఖ్యానము చేయఁబడియున్నది. వేదసంహిత యందట్లెచ్చటను మంత్రమును బ్రతీకముగ నుంచుకొని వ్యాఖ్యానము చేయఁబడలేదు. కాఁబట్టి పరమేశ్వర కృతములగు నాలుగు వేదములు మూలవృక్షము. ఆశ్వలాయనాది శాఖలన్నియు ఋషిముని కృతములు. పరమేశ్వర కృతములుకావు. ఈ విషయమై విశేష వ్యాఖ్యను జూడఁగోరువారు 'ఋగ్వేదాదిభాష్యభూమిక' యందుఁ జూడఁదగును.

తల్లిదండ్రులు తమ సంతానముపైఁ గృపాదృష్టి యుంచి వారి యున్నతినే కోరునట్లు పరమాత్మయు, మనుష్యులందఱు నవిద్యాంధకార భ్రమజాలము నుండి తొలఁగి విద్యావిజ్ఞానరూపమగు సూర్యునిఁబొంది యానందింపఁగలిగి విద్యను, సుఖమును వృద్ధిపఱుపఁగలుగునట్లు దయతో వేదములను బ్రకాశపఱచెను.

ప్రశ్న:- వేదము నిత్యమా, అనిత్యమా?

ఉత్తరము:- నిత్యము. ఏలయనఁగా పరమేశ్వరుఁడు నిత్యుఁడు. కాఁబట్టి యతని జ్ఞానాది గుణములును నిత్యములు. నిత్యపదార్థముల గుణకర్మస్వభావములు నిత్యములును. అనిత్యద్రవ్యముల గుణకర్మస్వభావము లనిత్యములు నగుచున్నవి.

ప్రశ్న:- ఈశ్వరుఁడా ఋషులకు జ్ఞానము నిచ్చి యుండవచ్చును. వారా జ్ఞానముచే వేదములను జేసియుందురు.

ఉత్తరము:- జ్ఞేయములేక జ్ఞానము కలుగఁజాలదు. గాయత్ర్యాది ఛందములతోడను, షడ్జాది, ఉదాత్తానుదాత్తాది స్వరములతోడను జ్ఞాన పూర్వకముగ గాయత్ర్యాది ఛందములను నిర్మించుటకు-సర్వజ్ఞాన యుక్తిశాస్త్రమును రచించుటకు-సర్వజ్ఞుఁడగు పరమేశ్వరునికంటె మఱి యెవ్వఁడును సర్వజ్ఞుఁడు గానేరఁడు. వేదములను జదివినపిమ్మటనే విద్యలను బ్రకాశపఱుచుటకు ఋషులును, మునులును, వ్యాకరణము, నిరుక్తము ఛందాదులనెడి గ్రంథములుచేసిరి. పరమాత్మ వేదములను బ్రకాశపఱుపకుండిన నెవ్వరు నేమియును జేయఁజాలకుందురు. కాఁబట్టి వేదము పరమేశ్వరోక్తము. దీనిననుసరించియే యందఱు నడువవలయును. ఎవ్వఁడేని మీ మతమేమి యని యడిగెనేని, మా మతము వేదము అనఁగా వేదమందేమి చెప్పఁబడియున్నదో దానినే నమ్ముచున్నామని ప్రత్యుత్తర మీయవలయును. ఇఁకముందు సృష్టి విషయమై వ్రాయఁబడును. సంక్షేపముగ ఈశ్వరవేద విషయముంగూర్చి వ్యాఖ్యానింపఁబడినది.

శ్రీమద్దయానంద సరస్వతీ స్వామికృతమగు
సుభాషా విభూషిత సత్యార్థప్రకాశమున
ఈశ్వర వేద విషయము గల సప్తమ సముల్లాసము
సంపూర్ణము

# అష్టమ సముల్లాసము

## సృష్ట్యుత్పత్తి స్థితి ప్రలయ విషయములు

ఇయం విసృష్టిర్యత ఆ బభూవ యది వా దధే యది వా న।
యో అస్యాధ్యక్షః పరమే వ్యోమన్త్సో అంగ వేద యది వా న వేద॥
ఋ. మం. ౧౦ సూ. ౧౨౯. మం. ౭॥

(అంగ) ఓ మనుష్యుఁడా! ఎవనిచే నీ వివిధసృష్టి ప్రకాశితమయి యున్నదో, ఎవఁడు జగత్తును ధరించి ప్రలయము చేయుచున్నాఁడో, ఎవఁడు జగత్తునకు స్వామియో, ఏ వ్యాపకునియందీ జగత్తంతయు ఉత్పత్తిస్థితి ప్రలయములను బొందుచున్నదో, అతఁడే పరమాత్మ. అతని నీవు తెలిసికొనుము. ఇతరుని సృష్టికర్తయని నమ్మకుము.

తమ ఆసీత్తమసా గూఢమగ్రే ప్రకేతం సలిలం సర్వమా ఇదమ్।
తుచ్ఛ్యేనాభ్వపిహితం యదాసీత్తపసస్తన్మహినా జాయతైకమ్॥
ఋ. మం. ౧౦. సూ. ౧౨౯. మం. ౩॥

ఈ జగత్తంతయు సృష్టికిఁ బూర్వ మంధకారముచే నావృతమై, రాత్రి రూపమున తెలియుటకయోగ్యమై, ఆకాశరూపమున జగత్తంతయు తుచ్ఛమై అనంత పరమేశ్వరునియెదుట నొక ప్రదేశమందాచ్ఛాదితమై యుండెను. పిమ్మట పరమేశ్వరుఁడు తన సామర్థ్యముచే గారణరూపము నుండి కార్య రూపము చేసెను.

హిరణ్యగర్భః సమవర్తతాగ్రే భూతస్య జాతః పతిరేక ఆసీత్।
స దాధార పృథివీం ద్యాముతేమాం కస్మై దేవాయ హవిషా విధేమ॥
ఋ. మం. ౧౦. సూ. ౧౨౧. మం. ౧॥

ఓ మనుష్యులారా! సమస్తసూర్యాది తేజః పదార్థములకు నాధారము, అయిన, ఉన్న, కాఁగల జగత్తునకు అద్వితీయ పతి, యీ జగదుత్పత్తికిఁ బూర్వము విద్యమానుఁడు, పృథివి మొదలుకొని సూర్యపర్యంత జగత్తు నుత్పన్నము చేసినవాఁడునగు, ఆదేవుఁడైన పరమాత్మనుఁ బ్రేమతో సేవింపుడు.

పురుష ఏవేదగ్ం సర్వం యద్భూతం యచ్చ భావ్యమ్
ఉతామృతత్వస్యేశానో యదన్నేనాతిరోహతి॥ యజు. అ. ౩౧. మం ౨॥

ఓ మనుష్యులారా! అన్నిఁటియందు నిండియున్న పూర్ణపురుషుఁడు, నాశరహితకారణమునకును, జీవునకును స్వామి, పృథివ్యాది జడములకంటెను, జీవునికంటెను అతిరిక్తుఁడునగు ఆ పురుషుఁడే యీ సమస్తభూత భవిష్యద్వర్తమానస్థ జగత్తులఁ జేయువాఁడు.

యతో వా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవంతి।
యత్ప్రయంత్యభిసంవిశంతి తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మ॥
తైత్తిరీ. భృ. వ. అను. ౧॥

ఏ పరమాత్మ రచనచేత ఈ సమస్తపృథివ్యాది భూతము లుత్పన్నము లగుచున్నవో, ఏవనిచే జీవనమును, ఎవనియందుఁ బ్రలయమును బొందుచున్నవో అతఁడే బ్రహ్మము. అతనిని దెలియుటకు నిచ్ఛగింపుము.

జన్మాద్యస్య యతః॥ శారీరక సూ. అ.౧.పా. ౧.సూ.౨॥

ఎవనిచే నీ జగదుత్పత్తిస్థితి ప్రలయములగుచున్నవో, ఆ బ్రహ్మయే తెలియుటకు యోగ్యుఁడు.

ప్రశ్న :- ఈ జగత్తుత్పన్నమయినది పరమేశ్వరునుండియా? ఇతరము నుండియా?

ఉత్తరము:- నిమిత్తకారణమగు పరమాత్మనుండి యుత్పన్నమయినది కాని దీని కుపాదాన కారణము ప్రకృతి.

ప్రశ్న:- ఏమి! ప్రకృతిని బరమేశ్వరుఁడు చేయలేదా?

ఉత్తరము:- లేదు. అది అనాది.

ప్రశ్న:- దేనిని అనాదియందురు? అనాది పదార్థము లెన్ని?

ఉత్తరము:- దేని కాది లేదో యది అనాది. ఈశ్వరుఁడు, జీవుఁడు, జగత్కారణమగు ప్రకృతి. ఈ మూఁడును అనాదులు.

ప్రశ్న:- ఇందుల కేమి ప్రమాణము?

ఉత్తరము:-

ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే।
తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యో అభిచాకశీతి॥
ఋ. మం. ౧. సూ. ౧౬౪. మం. ౨౦॥

(ద్వా) బ్రహ్మము, జీవుఁడును వీరిద్దఱు (సుపర్ణా) చేతనత్వము, పాలనము మొదలగు గుణములతో సమానులును (సయుజా) వ్యాప్యవ్యాపక భావములచే సంయుక్తులును (సఖాయా) పరస్పరమైత్రితో యుక్తులు, సనాతనులు, అనాదులును (సమానమ్) అట్లే (వృక్షమ్) అనాది మూలరూప కారణము, శాఖారూప కార్యమునగు వృక్షము "అనఁగా స్థూలమై ప్రలయమందు ఛిన్న భిన్నమై పోవునట్టి ప్రకృతి మూఁడవ అనాది పదార్థము ఈ మూఁటి గుణ కర్మ స్వభావములును అనాదియే. ఈ జీవబ్రహ్మములలో జీవుఁడొకఁడీ వృక్ష రూప సంసారమందలి పాప పుణ్య రూప ఫలములను (స్వాద్వత్తి) బాగుగ భుజించుచున్నాఁడు. రెండవవాఁడగు పరమాత్మ (అనశ్నన్) భుజింపక (అభి చాకశీతి) నాలుగువైపులందు లోపల వెలుపల-సర్వత్ర ప్రకాశమానుఁడగు చున్నాఁడు. జీవునికంటె ఈశ్వరుఁడును, ఈశ్వరుని కంటె జీవుఁడును, వీరిద్దఱి కంటెఁ బ్రకృతియు భిన్న స్వరూపములుగల యీ మూఁడును అనాదులు.

శాశ్వతీభ్యః సమాభ్యః యజుః. అ. ౪౦. మ. ౮॥

(శాశ్వతీభ్యః) అనాది, సనాతన, జీవరూపులగు ప్రజలకొఱకు వేదము ద్వారా పరమాత్మ సమస్త విద్యలను బోధించెను.

అజామేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీః ప్రజాః సృజమానాం స్వరూపాః।
అజో హ్యేకో జుషమాణోఽనుశేతే జహాత్యేనాం భుక్తభోగామజోఽన్యః॥
శ్వేతాశ్వతరోపనిషత్. అ. ౪. మం. ౫॥

పరమాత్మ, జీవ, ప్రకృతు లీ మూఁడును అజములు. అనఁగా వీని నెన్నఁడును జన్మము కలుగదు. ఈ మూఁడును సమస్త జగత్తునకు కారణములు. వీనికిఁ గారణ మేదియులేదు. ఈ యనాదియగు ప్రకృతిని అనాదియగు జీవుఁడనుభవించుచు సందుఁ దగులుపడు చున్నాఁడు. పరమాత్మ దాని యందుఁ జిక్కఁడు, దానిని భోగింపఁడు. జీవేశ్వరుల లక్షణము లీశ్వర విషయమందుఁ జెప్పఁబడినవి. ఇఁకఁ బ్రకృతి లక్షణము వ్రాయఁబడును.

సత్త్వరజస్తమసాం సామ్యావస్థా ప్రకృతిః, ప్రకృతేర్మహాన్
మహతోఽహంకారోఽహంకారాత్ పంచ తన్మాత్రాణ్యుభయమింద్రియమ్।
పంచ తన్మాత్రేభ్యః స్థూలభూతాని పురుష ఇతి పంచవింశతిర్గణః॥
సాంఖ్య.సూ. అ. ౧. సూ. ౬౧॥

(సత్వ) శుద్ధము (రజః) మధ్యమము (తమః) జాడ్యము అనఁగా జడత యీ మూఁడు వస్తువులు కలసిన సముదాయమున్నది. దానికిఁ బ్రకృతి యని పేరు. దానినుండి మహత్తత్వమను బుద్ధి. దానినుండి అహంకారము. దానినుండి పంచతన్మాత్రలను సూక్ష్మభూతములు. పది యింద్రియములు. పదునొకండవ మనస్సు. ఆ పంచతన్మాత్రలనుండి పృథివ్యాది పంచభూతములు ఏర్పడి యిరువదినాల్గును. యిరువది యయిదవది పురుషుఁడు—జీవుఁడును పరమేశ్వరుఁడు నయియున్నారు. వీనియందుఁ బ్రకృతి అవికారిణి. మహత్తత్వాహంకార పంచసూక్ష్మ భూతములు ప్రకృతి కార్యములయి ఇంద్రియములకు, మనస్సునకును, స్థూలభూతములకును గారణములై యున్నవి. పురుషుఁడు దేనికినిఁ బ్రకృతి అనఁగా నుపాదాన కారణముకాని, దేనికిని గార్యముకాని కాఁడు.

ప్రశ్న:—

సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్ ॥౧॥ఛాందో. ప్ర.౬.ఖం. ౨॥

అసద్వా ఇదమగ్ర ఆసీత్ ॥౨॥తైత్తిరీయోప. బ్రహ్మానందవల్లి. అను. ౭॥

ఆత్మా వా ఇదమగ్ర ఆసీత్ ॥౩॥ బృహ. అ. ౧. బ్రా. ౪. మం. ౧॥

బ్రహ్మ వా ఇదమగ్ర ఆసీత్ ॥౪॥ శత. ౧౧. ౧. ౧౧. ౧.॥

ఓ శ్వేతకేతూ! ఈ జగత్తు సృష్టికిఁ బూర్వము సత్ ॥౧॥ అసత్ ॥౨॥ ఆత్మ ॥౩॥ బ్రహ్మస్వరూపముగా నుండెను ॥౪॥

సిమ్మట :—

తదైక్షత బహుః స్యాం ప్రజాయేయేతి॥ఛాందోగ్య. ప్ర.౬. ఖం.౨.మం.౩॥

సోఽకామయత బహుఃస్యాం ప్రజాయేయేతి॥ తై. బ్రహ్మానందవల్లి.అను.౬॥

ఆ పరమాత్మయే తన యిచ్ఛచే ననేక రూపములాయెను.

సర్వం ఖల్విదం బ్రహ్మ నేహ నానాస్తి కించన॥

ఇదియు నుపనిషత్తు వచనము. ఈ జగత్తంతయు నిశ్చయముగా బ్రహ్మమే. దీనియందు వేఱుగ నానాప్రకారమగు పదార్థమేమియును లేదు. కాని అంతయు బ్రహ్మరూపమైయున్నది.

ఉత్తరము:— ఏల యీ వచనముల కపార్థములు చేయుచున్నారు? ఆ యుపనిషత్తులందే. (ఏవమేవ ఖలు)

సోమ్యాన్నేన శుంగేనాపో మూలమన్విచ్ఛాద్భిస్సోమ్య

శుంగేన తేజో మూలమన్విచ్ఛ తేజసా సోమ్య శుంగేన సన్మూలమన్విచ్ఛ

సన్మూలాః సోమ్యేమాః సర్వాః ప్రజాః సదాయతనాః సత్ప్రతిష్ఠాః॥
ఛాందో. ప్ర. ౬. ఖం. ౮ మం. ౪॥

ఓ శ్వేతకేతూ! అన్నరూప పృథివీకార్యమునుండి జలరూప మూలకారణమును నీవుగు ర్తెఱుగుము. కార్యరూప జలమునుండి తేజోరూప మూలమును, తేజోరూపకార్యమునుండి సద్రూపకారణమగు నిత్య ప్రకృతిని నీవు తెలిసికొనుము. ఈ సత్యస్వరూప ప్రకృతియే సమస్త జగత్తునకుఁ బుట్టినిల్లను, స్థితికి స్థానము నయియున్నది. ఈ జగత్తంతయు సృష్టికిఁ బూర్వము అసత్తువలె జీవాత్మ బ్రహ్మ ప్రకృతులయందు లీనమై యుండెను. కాని అభావము కాలేదు (సర్వం ఖలు...కించన) ఈ మీ వచనము "ఒకచోటి యిటిక ఒకచోటి మన్నుతీసి (భానుమతి) యొక యింటిని జేసె" నన్నట్లున్నది.

సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాంత ఉపాసీత॥
ఛాం. ప్ర. ౩. ఖం. ౧౪. మం. ౧॥

నేహ నానాస్తి కించన॥ కఠోపనిషత్. అ. ౨. వల్లి. ౪. మం. ౧౧॥

శరీరావయవములు శరీరముతోఁ గూడియుండువఱకుఁ బనికివచ్చు శరీరమునుండి వేఱుకాఁగానే పనికిమాలినవైనట్లు ప్రకరణస్థమగు వాక్యము సార్థకమగును. ప్రకరణమునుండి వేఱుపఱచుట చేతను, ఇతర వాక్యముతోఁ గూర్చుట వలనను అనర్థకమగును. దీని యర్థము వినుఁడు-ఓజీవా! ఏ బ్రహ్మనుండి ఈ జగదుత్పత్తిస్థితి ప్రళయములు కలుగుచున్నవో, యెవఁడు రచించి ధరించుట చేతనే ఈ సమస్త జగత్తు విద్యమానమైయున్నదో, సహచరితమైయున్నదో, ఆ బ్రహ్మను వదలి నీవితరము నుపాసింపకుము. ఈ చేతనమాత్ర-అఖండైకరస బ్రహ్మరూపమందు నానావస్తువులు కలసి యుండలేదు. కానియవియన్నియుఁ దమతమ స్వరూపముచేఁ బరమేశ్వరుని యాధారమందు నిలచియున్నవి.

ప్రశ్న:— జగత్తునకుఁ గారణము లెన్ని ?

ఉత్తరము:- మూఁడు. ఒకటి నిమిత్తము, రెండవది యుపాదానము, మూడవది సాధారణము. తానుచేయుటచే నేదేనియగుటయుఁ దాను జేయకున్నఁ గాకుండుటయుఁ దాను స్వయము మారక మఱియొక దానిని మఱియొక విధముగ చేయుటయు నిమిత్తకారణ లక్షణములు. రెండవది యుపాదాన కారణము:- తాను లేదేని ఏదియుఁగాకుండుటయుఁ దానే అవస్థాంతరముగా మాఱు

నదియు నుపాదాన కారణమనఁబడును. మూఁడవది సాధారణ కారణము: చేయుటయందు సాధనభూత మయి సాధారణ నిమిత్తమయినది సాధారణ కారణము. నిమిత్తకారణము రెండు విధములు:- ఒకటి:- కారణముచేత సమస్త సృష్టిని రచించుచు, ధరించుచుఁ, బ్రళయము చేయుచు నన్నిఁటిని వ్యవస్థ యందుంచునది ముఖ్య నిమిత్తకారణము; అది పరమాత్మ. రెండవది:- పరమాత్మని సృష్టియందలి పదార్థములను దీసికొని అనేకవిధ కార్యాంతరములను జేయునది సాధారణ నిమిత్తకారణము, అది జీవుఁడు సమస్త జగత్తునుజేయుటకు సామగ్రియగు ప్రకృతి-పరమాణువులు ఉపాదాన కారణము. అది జడమగుట వలనఁ దనంతటఁ దానే మాఱజాలదు. కాని యితరులు మార్చిన మాఱును-అనఁగా అవస్థాంతరమును బొందును. ఒక్కొక్కచోట జడము నిమిత్తముచే జడముగ మాఱును. ఎట్లనఁగా బరమేశ్వరునిచే రచితమగు బీజము, పృథివియందుఁబడి నీళ్లను బొందుటచే వృక్షమగు చున్నది. అగ్ని సంయోగముచేఁ జెడిపోవుచున్నది. కాని వీనిని నియమపూర్వకముగఁ జేర్చుట కాని, వేఱుచేయుట కాని జీవఁ బరమేశ్వరుల యధీనము. ఏదేని వస్తువు చేయఁ బడునపుఁ డుపయోగింపఁబడు సాధనములు జ్ఞానము, దర్శనము, బలము, చేతులు మొదలగు నానా ప్రకారములు, దిశ, కాలము, ఆకాశము అను నివి సాధారణకారణములు. ఎట్లనఁగా కుండచేయుట యందు, కుమ్మరి వాఁడు నిమిత్తము, మన్ను ఉపాదానము, దండచక్రాదులు సామాన్య నిమిత్తము, దిశ, కాలము, ఆకాశము, ప్రకాశము, కన్ను, చేయి, జ్ఞానము, క్రియ మొదలగునవిసాధారణకారణమును, నిమిత్త కారణమునగుచున్నవి. ఈ మూఁడు కారణములులేక యే వస్తువును గాఁజాలదు; ఏ వస్తువునుజెడఁజాలదు.

ప్రశ్న :- నవీన వేదాంతులు కేవల పరమేశ్వరునే జగత్తున కభిన్న నిమిత్తోపాదానకారణమని నమ్ముచున్నారు :-

'యథోర్ణనాభిః సృజతే గృహ్ణతే చ॥ ముండకోప.ముం.౧.ఖం ౧.మం.౭॥

ఇది యుపనిషద్వచనము. సాలెపురుగు వెలుపలి పదార్థము నేదియును దీసికొనక తనలోపలి నుండి దారమును దీసి గూఁడు కట్టుకొని తానే దాని యందుఁ గ్రీడించునట్లు బ్రహ్మము తనలోనుండి జగత్తును రచించి తానే క్రీడించుచున్నాఁడు. ఆ బ్రహ్మము 'నేను బహురూపముగ -

నగుదును గాక' అని సంకల్పము చేసినంత మాత్రమున జగద్రూపమైపోయెను.

ఆదావంతే చ యన్నాస్తి వర్తమానే౽పి తత్తథా॥ గౌడపాదీయకారికా. శ్లో. ౩౧॥

ఇది మాండూక్యోపనిషత్తు మీఁది కారిక. ఏది ప్రథమ మందు, అంత మందు నుండదో అది వర్తమాన మందును లేదు. ఆదియందు జగత్తులేదు. బ్రహ్మముండెను. ప్రలయాంతమందును ప్రపంచముండదు; బ్రహ్మముండును. కాన వర్తమాన మందలి జగత్తంతయు నేల బ్రహ్మముకాదు?

ఉత్తరము:-మీరు చెప్పినట్లు జగత్తున కుపాదానకారణము బ్రహ్మమేని అతఁడుపరిణామియు, అవస్థాంతరయుక్తుఁడును, వికారియు నయిపోవును. అది యునుగాక యుపాదానకారణ గుణకర్మస్వభావములు కార్యమునందునువచ్చును.

కారణగుణపూర్వకః కార్యగుణో దృష్టః॥ వైశేషికము. అ. ౨. ఆ. ౧. సూ. ౨౪॥

ఉపాదానకారణ (గుణ)మునకు సదృశమయిన గుణము కార్యము నందునుఁ గలుగుననుట. బ్రహ్మము సచ్చిదానంద స్వరూపము. ఈ కార్య రూప జగత్తు అసత్తు, జడము, ఆనంద రహితము. బ్రహ్మము అజము; జగత్తు ఉత్పన్నమయినది. బ్రహ్మమదృశ్యము; జగత్తు దృశ్యము. బ్రహ్మము అఖండము; జగత్తు ఖండరూపము. బ్రహ్మమునుండియే పృథివ్యాది కార్యముత్పన్నమగునేని పృథివ్యాది కార్యమందుగల జడాదిగుణములు బ్రహ్మమందు నుండవలయును. అనఁగా పృథివ్యాదులు జడమయినట్లే బ్రహ్మమును జడమయి పోవలసివచ్చును. లేదా పరమేశ్వరుఁడు చేతనమయినట్లు పృథివ్యాది కార్యములును చేతనములు గావలయును. మీరిచ్చిన సాలెపురుగు దృష్టాంతము మీ మతమునకు సాధకముకాదు; బాధకము. ఏల యనఁగా ఆ జడరూపమగు శరీరము దారమున కుపాదానకారణము. జీవాత్మ నిమిత్తకారణము. ఇదిగూడఁ బరమాత్మ యద్భుత రచనా ప్రభావము. ఏలయనఁగాఁ దక్కిన జంతువుల శరీరమునుండి జీవులు దారమును దీయఁజాలవు. అట్లే వ్యాపకమగు బ్రహ్మము తనయందు వ్యాప్యమగు ప్రకృతి పరమాణువులను కారణముచే స్థూల జగత్తును జేసి, వెలుపల స్థూల రూప మొసర్చి, తాను దానియందు వ్యాపకమయి, సాక్షిభూతమైయానందమయమునగుచున్నది పరమాత్మ 'నేనునను స్త జగత్తును జేసి ప్రసిద్ధుఁడ నగుదును గాక, యనియీక్షించి నపుడు. అనఁగాజగత్తుత్పన్నమయి నపుడే జీవులయాలోచన మందును, జ్ఞానమందును, ధ్యానమందునుఉప

దేశమందును, శ్రవణ మందును ప్రసిద్ధుఁడై మిక్కిలి స్థూల పదార్థములతోఁ గలిసి వర్తించుచున్నాఁడు. ప్రళయ మయినపుడు పరమేశ్వరుఁడును, ముక్త జీవులను దప్ప జగత్తు నెవరును దెలియఁజాలరు. మీకారికయు భ్రమమూలము. ఏలయనఁగా సృష్టికిఁ బూర్వము ప్రలయమందు జగత్తు ప్రసిద్ధముగానుండదు. కాని సృష్ట్యంత మందు-ప్రలయారంభము మొదలుకొని మరల సృష్టియగు వఱకు-జగత్కారణము సూక్ష్మమై యప్రసిద్ధముగా నుండును ఏలయనఁగా:-

తమ ఆసీత్తమసా గూఢమగ్రే॥ ఋ. మం. ౧౦. సూ. ౧౨౯. మం. ౩॥
ఆసీదిదం తమోభూతమప్రజ్ఞాతమలక్షణమ్।
అప్రతర్క్యమవిజ్ఞేయం ప్రసుప్తమివ సర్వతః॥ మను. ౧. ౫॥

ఈ సమస్త జగత్తు సృష్టికి బూర్వము అంధకారముచే నావృతమును ఆచ్ఛాదితమునై యుండెను. ప్రలయారంభమునకు పిమ్మటఁగూడ నట్లే యుండును. ఆ సమయ మందెవరికిని దెలియుటకు, తర్కించుటకు, ప్రసిద్ధ చిహ్నములచే నింద్రియముల ద్వారా తెలియుటకు యోగ్యముగలేదు, ఉండదు. కాని వర్తమాన సమయమందుఁ దెలియ నగును. ప్రసిద్ధ చిహ్నములతో సహా తెలియుటకు యోగ్యమై - ఉన్నదున్నట్లు గోచరమగును. కాఁబట్టి ఆ కారికాకారుఁడు వర్తమాన సమయమందును జగదభావమును వ్రాసియుండునది సర్వథా అప్రమాణము. ఏలయనఁగా ప్రమాత ప్రమాణములచేఁ దెలిసి పొందు నది యెన్నఁటికి నభావమనబడదు

ప్రశ్న:— జగత్తును జేయుటయందుఁ బరమేశ్వరుని కేమిప్రయోజనము?

ఉత్తరము:- చేయకుండుట యందేమి ప్రయోజనము.

ప్రశ్న:— చేయకుండు నేని ఆనందములో నుండును. జీవులకును సుఖదుఃఖములు ప్రాప్తింపకుండును.

ఉత్తరము:— పురుషార్థులుకాని సోమరులును దరిద్రులు నిట్లందురు. ప్రలయమందలి జీవుల సుఖదుఃఖములను సృష్టియందలి సుఖదుఃఖములతోఁ దూఁచిన సృష్టియందలి సుఖమెన్నియో మడుఁగు లధికముగా నున్నది. ఇది గాక యనేకపవిత్రాత్ములగు జీవులు ముక్తి సాధనములద్వారా మోక్షానందముఁ గూడ ననుభవింపఁ గలుగుదురు. సుషుప్తియందు పడియుండు నట్లు ప్రలయమందును బడియుందురు. సృష్టి చేయకుండె నేని ప్రలయమునకు

పూర్వము గడచిన సృష్టియందు జీవులొనర్చిన పాపపుణ్య కర్మములకు పరమేశ్వరుఁడెట్లీయఁ గలుగును? జీవులెట్లనుభవింపఁ గలుగుదురు? మిమ్మెవ్వరేని కన్ను ఉండుట వలనఁ బ్రయోజనమేమని యడిగిరేని, జూచుటయని చెప్పుదురు కద. అట్లే ఈశ్వరునియందు జగత్తుఁ జేయఁగల జ్ఞానబల క్రియలుండుట వలని ప్రయోజనము జగత్తును జేయుట తప్ప మఱియేముండును? ఏమియు నుండదు కద! జగత్తునుజేసినపుడే పరమేశ్వరుని న్యాయము. ధారణ. దయ, మొదలగు గుణములు కూడ సార్థకములు కాఁగలవు. అతని యనంత సామర్థ్యము జగత్తునుత్పత్తిస్థితి ప్రలయములను. దాని వ్యవస్థలను జేయుట చేతనే సఫలమగుచున్నది. కంటికి జూచుట స్వాభావిక గుణమైనట్లే పరమేశ్వరునకును జగత్తునుత్పత్తిచేసి జీవుల కసంఖ్య పదార్థములనిచ్చి పరోపకారము చేయుటయే స్వాభావికగుణ మయియున్నయది.

ప్రశ్న:— విత్తు మొదలా చెట్టు మొదలా?

ఉత్తరము:— విత్తు. ఏలయనఁగా విత్తు. బీజము. హేతువు. నిదానము. నిమిత్తము. కారణము ఈ మొదలగు శబ్దములు ఏకార్థవాచకములు; కారణమునకు విత్తు అను నామముగలదు గాన నది వృక్షమను కార్యమునకు మొదటనే యుండును.

ప్రశ్న:— పరమేశ్వరుఁడు సర్వశక్తి మంతుడు. గనుక కారణమును. జీవులను గూడ నుత్పన్నము చేయఁగలడు. చేయలేఁడేని సర్వశక్తిమంతుఁడు కాఁజాలడు గదా!

ఉత్తరము:— సర్వశక్తిమచ్ఛబ్దమున కర్థము ఇంతకుఁ బూర్వమే వ్రాయఁబడినది. ఏమి? అసంభవమగు దానిఁగూడఁ జేయఁగలవాఁడే సర్వశక్తిమంతుఁడనఁబడునా? అసంభవమును-కారణములేకయే కార్యమునుజేయగలిగెనేని కారణములేక మఱియొక్క ఈశ్వరునుత్పన్నముచేసి తాను మృత్యువును బొంది, జడుఁడు, దుఃఖి, అన్యాయకారి, అపవిత్రుఁడు, కుకర్మి మొదలగు వాఁడు కాగలడగునా, లేదా? స్వాభావిక నియమములను-ఉష్ణత్వముగలఅగ్నిని, శీతలత్వము గల జలమును, పృథివ్యాది సమస్త జడములను, విపరీత గుణములు గలవిగా'-పరమేశ్వరు డును చేయఁజాలడు. ఈశ్వర నియమములు సత్యములును, పూర్ణములునైయున్నవి. కాఁబట్టి పరివర్తనము కాజాలదు.

కాన సర్వశక్తిమంతుఁడనగా సర్థము పరమాత్మ యితరుల సహాయము లేకయే తన సమస్త కార్యములను బూర్ణముగఁజేయగలుగుననుట.

ప్రశ్న:— ఈశ్వరుడు సాకారుడా? నిరాకారుడా? నిరాకారుఁడేని చేయి మొదలగు సాధనములు లేక జగత్తును జేయఁజాలఁడు. సాకారుఁడేని దోష మేమియు రాఁజాలదు.

ఉత్తరము:— ఈశ్వరుఁడు నిరాకారుఁడు "సాకారుఁ" డనఁగా శరీర ముతోఁ గూడినవాఁడు ఈశ్వరుడు కాఁజాలఁడు ఏలయనఁగా వాఁడు పరిమిత శక్తియుక్తుఁడును, దేశకాల వస్తువులచే బరిచ్ఛిన్నుఁడును, ఆఁకలి దప్పిక, ఛేదనము, భేదనము, శీతము, ఉష్ణము, జ్వరము, పీడ మొదలగువానితోఁ గూడినవాఁడు నయిపోవును. వానియందు జీవుని గుణములు తప్ప ఈశ్వరుని గుణములు ఘటింపఁజాలవు. మీరును మేమును సాకారులము-శరీరధారులము కానఁ ద్రసరేణు, అణు, పరమాణు ప్రకృతులను మనవశమునకుఁ దేఁజాలము అట్లే స్థూల దేహధారియగు పరమేశ్వరుఁడును నా సూక్ష్మపదార్థములచే స్థూల జగత్తును జేయఁజాలక పోవును. పరమేశ్వరుఁడు భౌతికేంద్రియములచేతను, హస్తపాదాది యవయవముల చేతను రహితుఁడయ్యును అనంతశక్తి బల పరాక్రమములు గలవాఁడు. కాన వాని చేతనే సమస్త కార్యములను జేయుచున్నాఁడు. ఇది జీవుని చేతను, ప్రకృతిచేత నెన్నఁడును గాదు. అతఁడు ప్రకృతి జీవులకంటె సూక్ష్ముఁడును, వాని యందు వ్యాపకుఁడునగుటచే వానిని జగదాకారముగఁజేయుచున్నాఁడు.

ప్రశ్న:— మనుష్యాదుల తల్లిదండ్రులు సాకారులగుటచే వారి బిడ్డలు సాకారులును, నిరాకారులయినచో వారి బిడ్డలు నిరాకారులునగుదురు. అట్లే పరమేశ్వరుఁడు నిరాకారుఁడేని అతఁడుచేసిన జగత్తును నిరాకారము కావలయును.

ఉత్తరము:— ఈ మీప్రశ్న పసిబిడ్డల ప్రశ్నవంటిది. ఏలయనఁగా పరమేశ్వరుఁడు జగత్తునకుపాదాన కారణము కాదు. కాని నిమిత్తకారణమని యింతకు మునుపే చెప్పఁబడినది. జగత్తున కుపాదానకారణమగు స్థూల ప్రకృతి పరమాణువులును సర్వథా నిరాకారములు కావు. కాని పరమేశ్వరుని కంటెఁ గొంత స్థూలములై, అన్యకార్యములకంటె సూక్ష్మాకారము కలిగియున్నవి.

ప్రశ్న:— పరమేశ్వరుఁడు కారణము లేక కార్యమును జేయలేఁడా?

ఉత్తరము:- చేయలేఁడు. ఏలయనఁగా అభావమునకు భావము (అనఁగా లేకుండునది ఉండఁగలుగుట) సర్వథా అసంభవము. ఎట్లనగా:- ఒకఁడు, నేను గొడ్రాలి కుమారీకుమారుల వివాహము జూచితిని. ఆ కుమారుఁడు నరశృంగముతోఁ జేసిన బాణమును ధరించి యుండెను. వారిరువురు ఆకాశ పుష్పమాలికలను వేసికొని యుండిరి. ఎండమావుల నీళ్లలో స్నానముచేసి గంధర్వనగరమందు వసించుచుండిరి. అక్కడ మేఘములు లేకయే వర్షమును, పృథివి లేకయే సమస్తాన్నాదుల నుత్పత్తి యగుచుండెను, అని గప్పాలు కొట్టినేని అవి యెట్లు అసంభవములో అట్లే కారణములేక కార్యమగుట యునసంభవము, ఎవ్వఁడేని:-

"మమ మాతాపితరౌ నస్తోఽహమేవమేవ జాతః।
మమ ముఖే జిహ్వా నాస్తి వదామి చ"

నాకుఁ దలితండ్రులు లేకయే నేను బుట్టినాను. నా నోటిలో నాలుకలేదు, కాని మాటాడుచున్నాడను. పుట్టలో పాములేదు కాని పుట్టలోనుండి వెలుపలికి వచ్చెను. నేనెక్కడను లేను. మీరును ఎక్కడను లేరు కాని మేమందఱము వచ్చితిమి. అని చెప్పెనేని ఇవి యన్నియు నసంభవములగుట వలనఁ బ్రమత్త గీతములు-పిచ్చివాని మాటలగును.

ప్రశ్న:- కారణము లేక కార్యము కాదేని కారణమునకుఁ గారణమేమి?

ఉత్తరము:- కేవలకారణరూపముగానే యుండునది దేనికినిఁ గార్యము కాదు. ఒక దానికిఁ గారణమయి మఱి యొక దానికిఁ గార్యమగునది కేవలకారణముకాదు, కాని యదివేఱు. ఎట్లనఁగా పృథివి యనునది ఇల్లు మొదలగు వానికి గారణమును, జలము మొదలగువానికి గార్యమునై యున్నది; కాని ఆదికారణమగు ప్రకృతి అనాది.

మూలే మూలాభావాదమూలం మూలమ్॥ సాంఖ్యద. అ ౧. సూ. ౬౭॥

మూలమునకు మూలము (కేవల) కారణమునకుఁ గారణముండదు. కాఁబట్టి ఆ కారణమే సమస్త కార్యములకును గారణమగుచున్నది. ఏలయనఁగా నేదేని కార్యారంభ సమయమునకుఁ బూర్వము మూఁడు కారణములవశ్యముండి తీరవలయును. ఎట్లనఁగా వస్త్ర మగుటకుఁ బూర్వము సాలెవాఁడు, ప్రత్తి, నారె (మొదలగునవి) పూర్వమందుండెనేని వస్త్రమగుచున్నది. అట్లే జగదుత్పత్తికి

బూర్వము పరమేశ్వరుఁడు, ప్రకృతి, కాలము, ఆకాశము, జీవులు అనాదిగా నుండిన, జగదుత్పత్తి కాఁగలదు. వీనిలో నేదేని ఒక్కటియు లేకుండిన జగ త్తుత్పన్నము కానేరదు. నాస్తికు లందురుగదా !

మొదటివాఁడు:-

శూన్యం తత్త్వం భావో వినశ్యతి వస్తుధర్మత్వాద్వినాశస్య॥

సాంఖ్యద. అ. ౧. సూ. ४४॥

సృష్టికి బూర్వము శూన్యముండెను. అంత మందును శూన్యమైపోవును. ఏలయనఁగా భావ మను వర్తమాన పదార్థముల కభావము కలిగి శూన్యమై పోవును గాన శూన్యమే యొక పదార్థమని నాస్తికు లనుచున్నారు.

ఉత్తరము:—ఆకాశము, అదృశ్యము, అవకాశము, బిందువు వీనినన్ని టిని శూన్యమందురు;శూన్యము జడపదార్థము. సమస్త పదార్థములు నీ శూన్య మందు అదృశ్యములై యుండును. బిందువు నుండి రేఖ, రేఖ నుండివర్తులాకార మగునట్లు భూమి, పర్వతాదులు (శూన్యము-జడపదార్థము నుండి) ఈశ్వరుని రచనచేఁగలుగును. మఱి శూన్యమును దెలియువాఁడు శూన్యుఁడుకాఁజాలఁడు.

రెండవ నాస్తికుఁడు :-

అభావాద్భావోత్పత్తిర్నానుపమృద్య ప్రాదుర్భావాత్॥న్యా.ద.४.౧.౧४॥

అభావము నుండి భావోత్పత్తి యగుచున్నది. గింజ నశింపక దాని యం దంకురము కలుగదు. దానినిబగులఁగొట్టి చూచితిమేని యంకురముండదు. ప్రథమమున నంకురము లేదు కాఁబట్టి అభావమునుండి యుత్పత్తికలిగినది.

ఉత్తరము:- గింజను నమర్దించునది (నశింపఁజేయునది) మొదట నా గింజయందుండెను. లేకున్నచో యెన్నఁడు నుత్పన్నమై యుండదు.

మూఁడవ నాస్తికుఁడు :-

ఈశ్వరః కారణం పురుషకర్మాఫల్యదర్శనాత్॥ న్యా. ద.४.౧.౧౯॥

కర్మఫలము పురుషుఁడు కర్మము చేయుటచేఁ బ్రాపింపడు. ఎన్నియో కర్మములు నిష్ఫలములగుచుండుట మనము చూచుచున్నాము. దీనివలన కర్మ ఫలమున్నచొ ఈశ్వరాధీన మని యనుకొనవచ్చును. ఏ కర్మఫలము ఈశ్వరుఁ డీయఁగోరునో దాని నిచ్చును; దేని ఫలము నీయఁగోరఁడో దానినీయఁడు. కాఁబట్టి కర్మఫల మీశ్వరాధీనము.

ఉత్తరము:- కర్మఫల మీశ్వరాధీన మేని కర్మము చేయకయే యీశ్వరుఁడేం ఫలమీయఁడు; కాఁబట్టి మనుష్యుఁడెట్టికర్మ చేయునో ఈశ్వరుఁడట్టి ఫలమునే యిచ్చును.

నాల్గవ నాస్తికుఁడు:-

అనిమిత్తతో భావోత్పత్తిః కంటక తైక్ష్ణ్యాది దర్శనాత్॥ న్యా.ద.౪.౧.౨౨॥

నిమిత్తము లేకయే పదార్థ ముత్పత్తి యగుచున్నది. ఎట్లనఁగా తుమ్మ మొదలగు వృక్షముల ముండ్లకుఁ దీక్ష్ణములగు మొన లగుపడుచున్నవి. దీని వలన సృష్ట్యారంభ మగునపుడు శరీరాది పదార్థములు నిమిత్తము లేకయే కలుగుచున్నవని తెలుచున్నది.

ఉత్తరము:- దేనిచేఁ బదార్థ ముత్పన్న మగుచున్నదో, అదే దానికి నిమిత్తము. ముండ్లచెట్లు కానివానికి ముండ్లేల కలుగవు?

అయిదవ నాస్తికుఁడు:-

సర్వమనిత్యముత్పత్తివినాశధర్మకత్వాత్॥ న్యా.ద.౪.౧.౨౫॥

వస్తువులన్నియు నుత్పత్తి వినాశము కలవి. కాఁబట్టి అన్నియు ననిత్యములే.

శ్లోకార్ధేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః।
బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః॥

ఇది యేదియో యొక గ్రంథవచనము:- నవీనవేదాంతు లీయైదవ నాస్తిక కోటిలోనివారు. వీరు బ్రహ్మముసత్యము, జగత్తుమిథ్య; జీవుఁడు బ్రహ్మమునకంటె భిన్నుఁడు కాఁడు. ఇది కోటిగ్రంథముల సిద్ధాంత మనుచున్నారు.

ఉత్తరము:-అన్నిఁటి యనిత్యత నిత్యమయ్యేనేని. సర్వము ననిత్యము గాఁజాలదు.

ప్రశ్న:- అన్నిటి యనిత్యతయు ననిత్యమే. ఎట్లనఁగా అగ్ని కట్టెలను నష్టముచేసి తానును నష్టమైపోవుచున్నది.

ఉత్తరము:- యథారీతిగ నుపలబ్ధమగుచున్న దానికి వర్తమానమం దనిత్యత్వమును గాని, పరమసూక్ష్మ కారణమును అనిత్య మనిగాని చెప్పుట యెన్నఁటికిని సరికాదు. వేదాంతులు బ్రహ్మమునుండి జగదుత్పత్తిని నమ్ముదు రేని బ్రహ్మము సత్యమగుటచే నతని కార్య మెన్నఁటికిని అసత్యము కాఁజా

౦దు. స్వప్నరజ్జు సర్పాదులవలె కల్పిత మందురేని అదియును గాదు. ఏల యనఁగా కల్పన యనునది గుణము. గుణమునుండి ద్రవ్యమును, ద్రవ్యము నుండి గుణమును వేఱుగ నుండఁజాలవు. కల్పన చేయు కర్త నిత్యమయ్యె నేని యతని కల్పనయు నిత్యమే యనఁబడ వలయును. లేనిచో నతనినిగూడ ననిత్యమని యొప్పుకొనుఁడు. వినకయుఁ జాగకయు స్వప్న మెన్నటికిని రాదు. జాగ్రదవస్థ యందు వర్తమాన సమయమందు ఏ సత్యపదార్థ ములు కలవో వాని సాక్షాత్సంబంధముచేఁ బ్రత్యక్షాది జ్ఞానము కలిగి, పిమ్మట సంస్కారము-వాని వాసనారూప జ్ఞానము-ఆత్మ యందు స్థితమగు చున్నదో, స్వప్నమందదియే ప్రత్యక్ష మగుచున్నది. సుషుప్తియందు బాహ్య పదార్థముల జ్ఞానము కలుగకపోయినను బాహ్య పదార్థములు విద్యమానము లయియే యుండును. అట్లే ప్రలయమందును గారణద్రవ్యము వర్తమానమైయుండును. సంస్కారము లేకయే స్వప్నము కలుగునేని జన్మాంధునకుఁ గూడ రూప స్వప్నము కలుగవలయును గద. (అట్లు కలుగుట లేదు.) గాన నట జ్ఞానము మాత్రమునుండి వెలుపల పదార్థములన్నియు విద్యమానములై యుండు ననుట.

ప్రశ్న!— జాగ్రదవస్థయందలి పదార్థములు స్వప్నమందును, ఇవి సుషుప్తియందును అనిత్యము లగుచున్నవి. కాబట్టి జాగ్రదవస్థ యందలి పదా ర్థములను గూడ స్వప్నముతోఁ దుల్యముగ నెంచవలయును.

ఉత్తరము:— అట్లు నమ్మఁగూడదు. ఏలయనగా స్వప్న సుషుప్తుల యందు బాహ్య పదార్థముల యజ్ఞానము మాత్ర ముండునేకాని వాని అభావము కాదు. ఎట్లనఁగా నొకని వీపువెనుక ననేక పదార్థములు కనబడ కుండినను ఆ పదార్థముల కభావము కలుగదు గద. అట్లే స్వప్నసుషుప్తులందును తెలియ వలయును. కాఁబట్టి పూర్వము చెప్పఁబడి నట్లు బ్రహ్మము, జీవుఁడు, జగత్కా రణము-ప్రకృతి యీ మూఁడును అనాది నిత్యము లనుటయే సత్యము.

ఆథవ నాస్తికుఁడు:—

సర్వం నిత్యం పంచభూతనిత్యత్వాత్ ॥ సాం. ద. ౪. ౧౨౮

పంచభూతములు నిత్యము లగుటఁబట్టి జగత్తును నిత్యమే.

ఉత్తరము:- ఇది సత్యము కాదు. ఏలయనఁగా:- ఏ పదార్థములకు ఉత్పత్తి వినాశకారణములను జూచు చున్నామో అవి నిత్యములు కాఁజాలవు.

సమస్తస్థూలజగత్తు శరీరఘటపటాదులు ఉత్పత్తి వినాశములఁ బొందుచుండుట ప్ర
త్యక్షముగాఁ జూచుచున్నారము. కాఁబట్టి కార్యము నిత్యము కాఁజాలదు.

పండ్రెండవ నాస్తికుఁడు:—

సర్వం పృథక్ భావలక్షణపృథక్త్వాత్॥ న్యా-ద-౪-౧.౩౪॥

పదార్థములన్నియు వేఱు వేఱుగానున్నవి. వీనియన్నిటిలోనుండు ఒక్క
పదార్థ మేదియు లేదు.

ఉత్తరము:- అవయవముల యందు అవయవి, వర్తమానకాలము,
ఆకాశము, పరమాత్మ, జాతి, ఇవి యాయా పదార్థసమూహముల యందొక్కొ
కటియే యున్నవి. వాని నుండి వేఱయి యే పదార్థము నుండ జాలదు. కాఁబట్టి
అన్నియు వేఱు వేఱు పదార్థములు కావు. కాని స్వరూపముచే వేఱు వేఱువు
వేఱు వేఱు పదార్థములలో నొక్కటియుఁ గూడఁ గలదు.

పదమూఁడవ నాస్తికుఁడు:-

సర్వమభావో భావేష్వితరేతరాభావసిద్ధేః॥ న్యాయ సూ. అ.౪.ఆ.౧.౩౭॥

పదార్థము లన్నిటియందును ఇతరేతరాభావము సిద్ధమగుచున్నది. కాఁబట్టి
అన్నియు నభావరూపములే ఎట్లనఁగా:-(అనశ్వో గౌః అగౌరశ్వః)ఆవుగుఱ్ఱము
కాదు;గుఱ్ఱము ఆవుకాదు. కాఁబట్టి అన్నిటి నభావరూపములని నమ్మవలయును.

ఉత్తరము:- అన్ని పదార్థముల యందును ఇతరేతరాభావయోగముండుఁ
గాక; కాని ( గవి గౌః అశ్వే ఽశ్వో భావరూపో వర్తత ఏవ ) ఆవు నందు ఆవు
భావమును. గుఱ్ఱము నందు గుఱ్ఱపు భావమునున్నది. అభావ మెన్నఁడును
గాఁజాలదు. పదార్థమందు భావమే లేదేని ఇతరేతరాభావము దేని యందుఁ
జెప్పఁబడును?

పదునాల్గవ నాస్తికుఁడు:— స్వభావముచే జగత్తు ఉత్పత్తియగుచున్నది.
ఎట్లనఁగా:- నీళ్ళు అన్నము కలసి కుళ్ళిపోవుటచే దానియందుఁ బురుగులును,
విత్తు, భూమి, నీరు గలసి గడ్డి, వృక్షములు మున్నగునవియు, అగ్నిపాషా
ణాదులును, సముద్రము వాయువు నివి కూడుటచే నలలును, తరంగముల
తాఁకుడుచే నురుగును, (పసుపు, సున్నము, నిమ్మరసము) కలసి యెఱుపు
వన్నెయుఁ గలుగునట్లు సమస్త జగత్తు తత్త్వముల స్వాభావిక గుణముంచే
నుత్పన్నమైనదే కాని దీనిని జేసిన వాఁడెవఁడును లేఁడు.

ఉత్తరము:— స్వభావముచే జగత్తు ఉత్పన్నమగునేని వినాశమెన్నఁడును గాఁజాలదు. వినాశము కూడ స్వభావముచేఁ గలుగు నని నమ్మితిమేని ఉత్పత్తి కా జాలదు. ద్రవ్యములం దీ రెండు స్వభావముల నొకడే సమయమున నమ్మితిమేని ఉత్పత్తి వినాశముల వ్యవస్థ యెన్నటికిని గాఁజాలదు. నిమిత్తముచే నుత్పత్తివినాశములను నమ్మితిరేని, ఆ నిమిత్తము ఉత్పన్నమును వినష్టమునగు ద్రవ్యములకు వేఱుగా నున్నదని నమ్మవలయును. స్వభావము చేతనే యుత్పత్తి వినాశములగు నేని, అయా సమయమునందే యుత్పత్తివినాశములగుట సంభవింపదు. స్వభావముచే నుత్పన్నమగుచుండు నేని, ఈ భూగోళమునకు సమీపమందు మఱియొక భూగోళమును, క్రొత్తక్రొత్త సూర్యచంద్రులు నేల యుత్పన్నమగు చుండుట లేదు? దేని కూడికచే నేదేని యుత్పన్నము కావలయునో అదియే యగుచున్నది. ఈశ్వరునిచే నుత్పన్నములయిన విత్తనము, ధాన్యము జలము మొదలగు వాని సంయోగము చేతను గడ్డి, వృక్షములు, పురుగులు మొదలగునవి యుత్పన్నములగుచున్నవే కాని అవివేక కావు. మఱి పసుపు, సున్నము నిమ్మరసము ఇవి తామే దూరదూరదేశమునుండి వచ్చి కలియవు. ఎవ్వరేని గలిపిరేని గలియును. అప్పుడును దగినట్లు కలుపుట చేతనే అవన్నె యేర్పడును. ఎక్కువగాఁగాని తక్కువగాఁగాని విపరీతముగాఁగాని కలుపుటచే నేర్పడదు. అట్లే ప్రకృతి పరమాణువులను జ్ఞాన పూర్వకముగను, యుక్తి పూర్వకము గను పరమేశ్వరుఁడు కలుపఁడేని జడపదార్థము తనంతఁదాను ఒక కార్యసిద్ధి యగునట్లు విశేషపదార్థ మెంత మాత్రము గాఁజాలదు కాఁబట్టి సృష్టి స్వభావముచేఁ గలుగదు కాని పరమేశ్వరుఁడు రచించుటచేఁ గలుగు చున్నది.

ప్రశ్న:— ఈ జగత్తునకుఁ గర్తయుండలేదు, లేఁడు, ఉండఁబోఁడు. అనాది కాలమునుండి యున్నదున్నట్లే యున్నది. దీని కెన్నఁడు నుత్పత్తి గలుగలేదు. వినాశమును గలుగదు.

ఉత్తరము:—కర్త లేకయే క్రియకాని, క్రియాజన్య పదార్థము కాని కలుగఁజాలదు. పృథివ్యాది పదార్థములయందు సంయోగవిశేషముచేఁ గలిగిన రచన గోచరమగు చున్నది; కాన నవి అనాది యెన్నటికిని గాఁజాలవు. సంయోగముచేఁ గలుగు నది సంయోగము నకుఁ బూర్వ ముండదు. వియోగమున

కంతమందు నుండదు. దీనిని నమ్మకుందు రేని మిక్కిలి కఠినములగు రాయి. వజ్రము, ఉక్కు మొదలగు వానిని ముక్కలు ముక్కలుగాఁ బగులఁగొట్టి కఱఁగియో భస్మము చేసియో చూడుఁడు. వీని యందుఁ బరమాణువులు వేఱు వేఱుగఁ జేరి యున్నవా? లేవా? చేరియున్న వేని సమయాంతరమందవశ్య ముగ వేఱగును.

ప్రశ్న:— అనాది యగు నీశ్వరుఁడెవ్వ డును లేఁడు. కాని యోగాభ్యాసముచే నణిమాది ఐశ్వర్యములను బొంది సర్వజ్ఞాది గుణయుక్తుఁడై కేవల జ్ఞాని యయిన జీవుఁడే పరమేశ్వరుఁ డనబడును.

ఉత్తరము:— అనాది యగు నీశ్వరుఁడు జగత్స్రష్ట కాఁడేని జీవులకు జీవనాధారమై సాధనములచే సిద్ధములగు నీజగత్తు, శరీరములు, ఇంద్రియ గోళకములు మున్నగున వెట్లు కలుగును. ఇవిలేక జీవుఁడు కృషి నడుప నేరఁడు. సాధనములే లేనప్పుడు సిద్ధుఁడెట్లగును? జీవుఁడెట్టి సాధనములచే సిద్ధిని బొందినను, అనంత సిద్ధులు గల సనాతన, అనాది సిద్ధుఁడునగు ఈశ్వరుని వంటివాఁడెన్నఁడును గాఁజాలఁడు. ఏలయనఁగా జీవుని జ్ఞానము పరమావధి వఱకు వృద్ధి బొందినను నతఁడు పరిమిత జ్ఞానసామర్థ్యములు కలవాఁడే యగును. అనంత జ్ఞానసామర్థ్యములు కలవాఁడెన్నఁడును గాఁజాలఁడు. చూడుఁడు! నేటి వఱకు నే యోగియు నీశ్వరకృత సృష్టి క్రమమును మార్పఁజాలఁడు కాలేదు. కాఁబోఁడు. అనాది సిద్ధుఁడగు పరమేశ్వరుఁడు నేత్రములతోఁ జూచునట్టియుఁ జెవులతో వినునట్టియు నియమ మేర్పఱచి యున్నాఁడు. దీని నేయోగియు మార్పఁజాలఁడు. కాన జీవుఁడు ఈశ్వరుఁ డెన్నటికిఁ గాఁజాలఁడు.

ప్రశ్న:- ఈశ్వరుఁడు కల్ప కల్పాంతరములందు సృష్టిని విలక్షణముగాఁ జేయునా? లేక యొకేవిధముగనా?

ఉత్తరము:- ఇప్పుడెట్లో అట్లే మొదటను, ఇకముందును జేయును. భిన్నముగాఁ జేయఁడు:-

సూర్యాచంద్రమసౌ ధాతా యథా పూర్వమకల్పయత్।
దివం చ పృథివీం చాంతరిక్షమథో స్వః॥ మం. ౧౦. సూ. ౧౯౦. మం.౩

(ధాతా) పరమేశ్వరుడు ఎట్లు పూర్వకల్పమందు సూర్య, చంద్ర, విద్యుత్, పృథివీ, అంతరిక్షాదులను జేసెనో యట్లే ఇప్పుడును జేసి యున్నాఁడు

ఇష్టే ఆ'కముందును జేయును. పరమేశ్వరుని కార్యము ప్రమాదరహితమై యుండును గనుక సర్వదా యొకే విధముగా నుండును. ఎవని జ్ఞానము వృద్ధి క్షయములఁ బొందుచుండునో యట్టి అల్పజ్ఞుని కార్యమందు పొరపాటు తట స్థించునే కాని పరమేశ్వరుని పని యందు' గాదు.

ప్రశ్న:- సృష్టివిషయ మందు వేదాది శాస్త్రములు అవిరుద్ధములా? విరుద్ధములా?

ఉత్తరము:- అవిరుద్ధములు.

ప్రశ్న:- అవిరుద్ధము లేని,

తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః।
ఆకాశాద్వాయుః। వాయోరగ్నిః। అగ్నేరాపః।
అద్భ్యః పృథివీ। పృథివ్యా ఓషధయః। ఓషధీభ్యోఽన్నమ్।
అన్నాద్రేతః। రేతసః పురుషః। స వా ఏష పురుషోఽన్నరసమయః॥

తైత్తిరీయోపని. బ్రహ్మానంద. అను ౧॥

ఆ పరమేశ్వరు నుండియుఁ బ్రకృతి నుండియు ఆకాశము అవకాశ మును-అంతట వ్యాపించి యుండిన కారణ ద్రవ్యమును-ఒక్కటఁజేర్పుటచే నవకాశ ముత్పన్నమయి నట్లగుచున్నది. వాస్తవమున నాకాశమున కుత్పత్తి కలుగదు. ఏలయనఁగా నాకాశము లేకున్న ప్రకృతి పరమాణువు లెక్కడ నుండఁ గలుగును? ఆకాశమునకుఁ బిమ్మట వాయువు. తరువాత వాయువు నుండి యగ్ని, దానినుండి జలము, జలమునుండి పృథివి పృథివినుండి యోష ధులు, ఓషధుల నుండి యన్నము, అన్నము నుండి వీర్యము, వీర్యము నుండి పురుషుఁడు, అనఁగా శరీరము నుత్పన్నమగుచున్నది. ఇక్కడ నాకాశాది క్రమము చేతను, ఛాందోగ్య మందు అగ్న్యాది క్రమము చేతను, ఐతరేయమందు జలాది క్రమము చేతను సృష్టి యయినట్లు వ్రాయఁబడి యున్నది. వేదము లందుఁ గొన్నిచోట్ల పురుషుని చేతను, కొన్నిచోట్ల హిరణ్యగర్భాదుల చేతను, మీమాంస యందుఁ గర్మము చేతను, వైశేషిక మందుఁ గాలము చేతను, న్యాయమందుఁ బరమాణువుల చేతను, యోగమందుఁ బురుషార్థము చేతను, సాంఖ్య మందుఁ బ్రకృతి చేతను, వేదాంత మందుఁ బ్రహ్మము చేతను సృష్ట్యుత్పత్తి యంగీకరింపఁబడి యున్నది. వీనియందేది సత్యము? ఏది యసత్యము?

ఉత్తరము:- ఇవి యన్నియు సత్యములే ఏదియు నసత్యము కాదు. వీనిని విపరీతముగ భావించు వారే యసత్యవంతులు. ఏలయనఁగా, పరమేశ్వరుఁడు జగత్తునకు నిమిత్తకారణము. ప్రకృతి యుపాదానకారణము. మహాప్రలయము నకు, విమ్మట నాకాశాది క్రమము చేతను, ఆకాశ వాయువులకు, ప్రళయము కాక అగ్న్యాదుల కయి నపుడు అగ్న్యాది క్రమముచేతను, విద్యుదగ్నియు నశింప నపుడు జలక్రమము చేతను, సృష్టి యగుచున్నది. అనఁగా నేయే ప్రలయమందు నెక్కడెక్కడి వఱకు ప్రలయ మగు చున్నదో అక్కడక్కడి నుండి సృష్టి యగుచున్నది. పురుషహిరణ్య గర్భాది నామములు పరమేశ్వరునివే యని ప్రథమ సముల్లాస మందు వ్రాయఁబడినది. ఒక కార్యమందొకటే విషయము మీఁద విరుద్ధవాదము కలిగెనేని అది విరుద్ధ మనఁబడును. ఆఱు శాస్త్రములం దీవిధముగ నవిరోధము గలదు చూడుఁడు:- మీమాంస యందుఁ గర్మ లేక జగత్తునం దేకార్యముఁ గాఁజాల దనియు. వైశేషిక మందుఁగాలము పట్టక యేకార్యమును గాదనియు, న్యాయమందు ఉపాదాన కారణము లేక యే కార్యము గాఁజాల దనియు, యోగమందు విద్యాజ్ఞాన విచారములు లేక యేదియుఁ గాదనియు, సాంఖ్యమందుఁ దత్త్వముల కూడికలేక యొద్దియుఁ గాఁజాల దనియు, వేదాంత మందుఁ గర్త-చేయువాఁడు-చేయకున్న నే పదార్థము నుత్పన్నము కాదనియు వ్రాయఁబడి యున్నది. సృష్టి యీయాఱు కారణములచే నగుచున్నది. ఆ యాఱు కారణము లందలియొక్కొకదానివ్యాఖ్యయొక్కొకశాస్త్రమందున్నది. కాఁబట్టివానియందువిరోధమేమియులేదు. ఆఱుగురు కలసి యొక పందిరిని ఒక గోడపైఁ బెట్టినట్లు సృష్టిరూపకార్యవ్యాఖ్య ఈ యాఱుగురు శాస్త్రకారులు కలసి పూర్తిచేసి యున్నారు. అయిదుగురు గ్రుడ్డి వాండ్రకును, ఒక మందదృష్టికి నేనుఁగు నవయవములలో నొక్కొక దానిని జూపి యేనుఁ గెట్లున్నదని యడిగిన నొకఁడు స్తంభము వలె నున్నదనియు, రెండవ వాఁడు చేఁటవలె నున్న దనియు, మూఁడవ వాఁడు రోఁకలి వలె నున్నదనియు, నాల్గవ వాఁడు చీపురువలె నున్నదనియు, ఐదవవాఁడు అఱుఁగువలె నున్నదనియు, ఆఱవవాఁడు నల్లగ నాలుగు స్తంభముల మీఁద నేదో యెనుబోతు వంటి యాకారము కలదిగా నున్నదనియుఁ జెప్పినట్లు, అనార్షములగు నవీన గ్రంథముల జదువుచుండు వర్తమానకాంపు

ప్రాకృతభాషం నెఱుగువారు ఋషిప్రణీత గ్రంథములను జదువక క్షుద్రబుద్ధి కల నవీన పురుషులచేఁ గల్పింపఁబడిన సంస్కృత ప్రాకృత గ్రంథములను జదివి యొకరి నొకరు నిందించుచు యందుఁ దత్పరులై యసత్య సంహమలను బెంచియున్నారు. వీరి మాటలు బుద్ధిమంతులకుఁ గాని తక్కిన వారికిఁ గాని మాననీయములు కావు. గ్రుడ్డివారిని వెంబడించిన గ్రుడ్డివారు దుఃఖము నేల పొందకుందురు? అవశ్యముగఁ బొందుదురు. ఇప్పటి అల్పవిద్యాయుక్తులును, స్వార్థులును, ఇంద్రియారాములు నగు పురుషుల లీలలు ప్రపంచమును నశింపఁజేయునవై యున్నవి.

ప్రశ్న:- కారణములేక కార్యము కాదేని కారణమునకుఁ గారణమెందులకు లేదు?

ఉత్తరము:- ఓ అమాయకులగు సోదరులారా! మీ బుద్ధి నేల యుపయోగింపరు? చూడుఁడు ప్రపంచమందు రెండే పదార్థములు గలవు. ఒకటి కారణము. రెండవది కార్యము. ఏది కారణమో యది కార్యము కాదు. కార్యమైయున్నప్పుడది కారణము కాదు. మనుష్యుఁడు సృష్టిని ఉన్నదున్నట్లు తెలిసికొననంత వఱకు నతనికి సరియైనజ్ఞానము కలుగఁజాలదు.

విశ్యాయాః సత్వరజస్తమసాం సామ్యావస్థాయాః ప్రకృతేరుత్పన్నానాం
పరమసూక్ష్మాణాం, పృథక్ పృథగ్వర్తమానానాం
తత్త్వపరమాణూనాం ప్రథమః సంయోగారంభః
సంయోగవిశేషాదవస్థాంతరస్య స్థూలాకారప్రాప్తిః సృష్టిరుచ్యతే॥

అనాదియు నిత్యమును సత్వరజస్తమో గుణముల యేకావస్థా రూపమునగు ప్రకృతిచే నుత్పన్నములయిన వేఱువేఱు తత్త్వముల పరమ సూక్ష్మవయవములు కలపు వానికే మొదట సంయోగారంభమగును. ఆ సంయోగవిశేషముచేఁ గలుగు నవస్థాంతరములు స్థూల సూక్ష్మములయి పెక్కయొక యవస్థను గలిగించుచు విచిత్ర రూపములఁదాల్చును. ఈ సంసర్గమునకే సృష్టి యనిపేరు. ప్రథమ సంయోగము నందుఁ గలియునట్టియుఁ గలుపునట్టియు పదార్థము-సంయోగమునకాదియు వియోగమున కంతమునగునది-విభజింపఁ బడనిది-కారణ మనఁబడును. సంయోగానంతర మేర్పడునదియు, వియోగానంతర మట్లుండనిదియుఁ గార్యమనఁబడును. అట్టి కారణమునకుఁ గారణమును,

కార్యమునకుఁ గార్యమును, గర్తకుఁగర్తయు, సాధనమునకు సాధనమును, సాధ్యమునకు సాధ్యము నుండుననిఁ జెప్పువాఁడు చూచుచు గ్రుడ్డి వాఁడును, వినుచుఁ జెవిటి వాఁడును, తెలియుచు మూఁడుఁడు నగుచున్నాఁడు ఏమిఁ కంటికిఁ గన్నును, దీపమునకు దీపమును, సూర్యునకు సూర్యుఁడును ఉండునా? దేనినుండి యుత్పన్నమగునో యది కారణము. ఉత్పన్నమగునది కార్యము. ఇంత నాకారణమును గార్యరూపమున మార్చువాఁడు కర్తయనఁబడును.

నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః।
ఉభయోరపి దృష్టోఽంత స్త్వనయో స్తత్వదర్శిభిః॥ భగవద్గీ. ౨. ౧౬.

ఎన్నఁడును అసత్తునకు భావముండదు. అట్లే సత్తునకు అభావముండదు. ఈ రెంటి నిర్ణయమును తత్త్వదర్శులు తెలిసియున్నారు. పక్షపాతులును ఆగ్రహులును, మలినాత్ములును, అవిద్వాంసులునగు నితరులు వీని నెట్లు సులభముగాఁ దెలియఁ గలుగుదురు? పూర్ణవిచారముచే విద్వాంసుఁడును సత్సంగియుఁ గాని వాఁడు సర్వదా భ్రమజాలమందుఁబడియుండును. సమస్త విద్యల సిద్ధాంతములను దెలిసిన వారును, తెలియుటకుఁ బరిశ్రమ చేయువారును, దెలిసికొని యితరులకు నిష్కపట్యముతోఁ దెలుపువారునగు పురుషులే ధన్యులు. కాఁబట్టి కారణము లేక సృష్టికలిగినదని నమ్ము నతఁడు ఏమియు దెరియఁడు.

సృష్టి కలుగ వలసి నపుడా పరమసూక్ష్మ పదార్థములను బరమాత్ముఁ డొక చైపునఁ జేర్చును. ప్రథమావస్థయం దాపరమసూక్ష్మమగు ప్రకృతిరూప కారణము నుండి కొంచెము స్థూలమగు దానికి పేరు మహత్తత్వము. దానికంటెఁ గొంచెము స్థూలమగు దాని పేరు అహంకారము, ఆయహంకారము నుండి భిన్నభిన్నమగు పంచసూక్ష్మ భూతములును, శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములను పంచజ్ఞానేంద్రియములును, వాక్హస్త పాదోపస్థగుదములను పంచకర్మేంద్రియములును, పదునొకండవదియగు మనస్సు గొంచెము స్థూలముగ నుత్పన్నమగుచున్నవి. ఆ పంచసూక్ష్మ భూతములను తన్మాత్రల నుండియనేక స్థూలావస్థలను బొందుచు పంచస్థూల భూతములు మనము ప్రత్యక్షముగా జూచునవి క్రమముగా నుత్పన్నములగుచున్నవి. వాని నుండి నానా విధము లగు నోషధులు, వృక్షములు మొదలగునవియు, వానినుండి యన్నమును, అన్నము నుండి వీర్యమును, వీర్యమునుండి శరీరమును గలుగు చున్నవి. ఆది

సృష్టి మైథున సృష్టికాదు. ఎందువలన ననఁగా పరమాత్మ స్త్రీ పురుషుల శరీరములను జేసి వానియందు జీవులను సంయోగ పఱచిన పిమ్మట మైథున సృష్టి కాఁదొడఁగును.

శరీరమం దెట్టి జ్ఞానపూర్వక మగు సృష్టి రచింపఁ బడినదో చూడుఁడు. దానిని జూచి విద్వాంసులు ఆశ్చర్య మగ్న లగుచున్నారు లోపలి యెముకల కూర్పు. నరములకట్టు, మాంసపు పూఁత చర్మము కప్పు శ్వాసకోశము. పిత్తకోశము. ప్లీహాదులు. హృదయ యంత్రస్థాపన, జీవుని సంయోజనము. శిరోరూప మూలరచన, వెంట్రుకలు, గోళ్ళు మొదలగు వాని స్థాపన. కంటి యందలి యతి సూక్ష్మమగు నరముల తంతులఁ బోలిన బిగింపు. ఇంద్రియ మార్గముల ప్రకాశము. జీవుఁడు జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలను భోగించుటకుఁ దగిన స్థానవిశేషముల నిర్మాణము. సమస్త ధాతువుల విభాగకరణము. కళాకౌశలస్థాపనాదులతోఁ గూడిన అద్భుత సృష్టిని బరమేశ్వరుఁడుగాక మఱెవ్వఁడు చేయ గలఁడు? ఇదియుఁగాక నానాప్రకారములగు రత్నధాతువులచే నలంకృతమగు భూమిని, నానా విధములగు వట వృక్షాదుల బీజములందలి యతి సూక్ష్మ రచనను, అసంఖ్యములగు హరిత, శ్వేత, పీత, కృష్ణ, చిత్ర మధ్యరూపములతోఁ గూడిన పత్ర, పుష్ప, ఫల, మూల నిర్మాణమును, మధుర, క్షార, లవణ, కషాయ, తిక్త, అమ్లాది వివిధరసములను, సుగంధాది యుక్తములగు పత్ర, పుష్ప, ఫల, అన్న, కందమూలాదుల రచనను, అనేకానేకములగు-కోట్ల కొలఁది భూగోళ సూర్య చంద్రాది లోకముల నిర్మాణమును, వానిని ధారణ చలన నియమములలో నుంచుట మొదలగువానిని పరమేశ్వరుఁడు దక్క అన్యుఁ డెవ్వఁడు చేయఁ గలఁడు? ఎవ్వఁడేని ఒక పదార్థము జూచి నపుడు అతని కా పదార్థమెట్లున్న దియు, రెండవది దానియందలి రచనఁజూచి దాని జేసిన వాని తెలివియునను ఏ రెండు విధముల జ్ఞానము గలుగు చున్నది. ఎవ్వఁడేని ఒక సుందరమగు నాభరణమును అడవియందుండగఁ జూచెనేని అది సువర్ణ ములోఁ జేయఁబడిన దనియు, దాని నెవ్వఁడో బుద్ధిమంతుఁడగు శిల్పి చేసినాఁడనియు గ్రహించును. అదే రీతిని ఈ నానావిధమగు సృష్టి యందలి రచనా విశేషము దానిని చేసిన పరమేశ్వరుని సిద్ధింపఁజేయుచున్నది.

ప్రశ్న:- మొదట మనుష్యుఁడు సృష్టింపఁ బడెనా ? పృథివ్యాదులా ?

ఉత్తరము:— పృథివ్యాదులు. ఏలయనఁగా బృథివ్యాదులు లేక మను ష్యుని స్థితియుఁ బాలనాదులును జరుగఁజాలవు.

ప్రశ్న:-సృష్ట్యాదియందు సృష్టింపఁ బడినది యొక్కటా, అనేకులా,

ఉత్తరము:-అనేకులు. ఈశ్వరీయసృష్టియందుత్పన్నులగుటకుఁ దగిన కర్మముగల జీవులనే ఈశ్వరుఁడు సృష్ట్యాది యందు బుట్టించు చున్నాడు

మనుష్యా ఋషయశ్చ యే।తతో మనుష్యా అజాయంత॥యజు॥అ.౩౧.మం.౯

ఇది యజుర్వేద వచనము. ఈ ప్రమాణముచే నాది యందనేకుల. వందల కొలఁది వేలకొలఁది మనుష్యులు-ఉత్పన్ను లయిరని నిశ్చయ మగు చున్నది. సృష్టియందుఁ జూచినను మనుష్యులు పెక్కుఁరు తలిదండ్రుల సంతానమని తేటపడు చున్నది.

ప్రశ్న:— సృష్ట్యాదియందు మనుష్యాదులు బాల్యావస్థయందు సృష్టింపఁ బడిరా, యువావస్థ యందా, వృద్ధావస్థయందా, లేక మూఁడవస్థలయందునా,

ఉత్తరము:— యువావస్థ యందు. ఏలయనఁగా:- బాలురనుగా నుత్ప న్నము చేసియున్న వారిని బాలించుటకు నితర మనుష్యుల యవసరముండి యుండును. వృద్ధులనుగా నుత్పన్నము చేసిన మైథున సృష్టి కలుగ కుండెడిది కాఁబట్టి యువావస్థ యందే సృష్టింపఁ బడిరి.

ప్రశ్న:- సృష్టికిఁ బ్రారంభ మెన్నఁడేని యున్నదా, లేదా?

ఉత్తరము:- లేదు. ఎట్లు దినమునకు ముందు రాత్రియు, రాత్రికిముందు దినమును, దినమునకుఁ బిమ్మట రాత్రియు, రాత్రికిఁ బిమ్మట దినమును క్రమ ముగా వచ్చుచున్నవో అదేరీతిని సృష్టికిఁ బూర్వము ప్రలయమును, ప్రలయ మునకుఁ బూర్వము సృష్టియు, సృష్టికిఁ బిమ్మటఁ బ్రలయమును, ప్రలయమునకుఁ బిమ్మట సృష్టియు ననాది కాలమునుండి చక్రముగఁ దిరుగుచున్నవి. దీని కాది కాని, అంతము కాని లేదు. ఇఁక దినమునకుఁగాని రాత్రికిఁ గాని ఆరంభ మును, అంతమును గోచరమగుచున్నట్లు సృష్టిప్రలయములకు నాదియు నంత మును గలుగుచుండును. పరమేశ్వరుఁడు, జీవుఁడు, జగత్కారణము ఈ మూఁడు స్వరూపముచే ననాది యయి నట్లే జగదుత్పత్తిస్థితి-వర్తమానములును ప్రవా హముచే ననాదియములు. ఒకప్పుడు నదిప్రవాహరూప మందుండును, ఒకప్పుడు సామాన్యముగ నగపడును. ఒకప్పుడు ఎండిపోయి కనఁబడ కుండును. మరల

వానకాలములోఁ గనఁబడును. ఎండకాలములోఁ గనఁబడదు. ఇట్లు ఒకప్పుడు కనబడుచు నొకప్పుడు కనబడకయు నుండు వ్యవహారములను ప్రవాహరూపము లని తెలియవలయును. పరమేశ్వరుని గుణకర్మ స్వభావము లనాది యయినట్లు అతనిచేఁ గలుగు జగదుత్పత్తి స్థితి లయములును అనాదియములు. ఈశ్వరుని గుణకర్మ స్వభావముల కెన్నఁడు నారంభమును, అంతమును లేనియట్లు అతని కర్తవ్యము లగు కర్మముల కారంభమును, అంతమును లేదు.

ప్రశ్న:- ఈశ్వరుఁడు ఎన్నియో జీవులకు మనుష్యజన్మమును, ఎన్నియో జీవులకు సింహాది క్రూర మృగముల జన్మమును, ఎన్నియో జీవులకు జింక, ఆవు మొదలగు పశువుంజన్మమును, ఎన్నియో జీవులకు వృక్షాదులయుఁ గ్రిమి కీటపతంగాదులయు జన్మమును ఇచ్చియున్నాఁడు. దీనిచేఁ బరమాత్మయందు బక్షపాతము సంభవించు చున్నది.

ఉత్తరము:- పూర్వసృష్టియందు జీవులు చేసిన కర్మానుసారము వ్యవస్థ చేసి యున్నందున పక్షపాతము సంభవింపదు; ఏలయనఁ గర్మము లేకయే జన్మ మిచ్చియున్న బక్షపాత మగును.

ప్రశ్న:- ఈ సృష్ట్యాది యందు మనుష్యులేస్థలమందు సృష్టింపఁబడిరి?

ఉత్తరము:- త్రివిష్టప మందు-ఇపుడు టిబెట్టని చెప్పఁబడు దేశమందు.

ప్రశ్న :- సృష్ట్యాది యందుండినది యొక జాతియా? అనేక జాతులా?

ఉత్తరము:- మనుష్యజాతి యొక్కటే; కాని, పిదపఁ 'విజానీహ్యార్యాన్యే చ దస్యవః' అను ఋగ్వేద వచనముచే శ్రేష్ఠులు ఆర్యులు, విద్వాంసులు, దేవులు అనియు, దుష్టులకు దస్యులు దొంగలు, మూర్ఖులు-అనియు నామము కలిగి ఆర్యులు, దస్యులు అను రెండు భేదము లయ్యెను. 'ఉత శూద్రే ఉతార్యే' ఇది అథర్వ వేద వచనము. ఆర్యుల యందుఁ బూర్వము చెప్పఁబడి నట్లు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రు లని నాలుగు భేదము లేర్పడెను. ద్విజులగు విద్వాంసులకు ఆర్యులనియు, మూర్ఖులకు శూద్రులు, అనార్యులు-తెలివి లేని వారు-అని పేరులు.

ప్రశ్న:- మఱి వారెట్లిక్కడికి వచ్చిరి?

ఉత్తరము:- వారియందు ఆర్యులకును దస్యులకును - విద్వాంసులు నేరు దేవతలకును అవిద్వాంసులనెడు అసురులకును - సదా కలహములు కాఁగా

దఁగెను. మిక్కిలి యుపద్రవము కాసాగినపుడు, ఆర్యులు సమస్త భూగోళ మందీ భూభాగ ముత్తమమని తెలిసి యిక్కడికి వచ్చి వసించిరి. కాఁబట్టియే ఈ దేశమునకు ఆర్యావర్తమను పేరు కలిగెను.

ప్రశ్న:- ఆర్యావర్తపుటవధి యెంతవఱకు?

ఉత్తరము:-

ఆసముద్రాత్తు వై పూర్వాదాసముద్రాత్తు పశ్చిమాత్।
తయోరేవాంతరం గిర్యోరార్యావర్తం విదుర్బుధాః॥
సరస్వతీ దృషద్వత్యోర్దేవనద్యోర్యదంతరమ్।
తం దేవనిర్మితం దేశమార్యావర్తం ప్రచక్షతే ॥మను. అ. ౨. ౧౭.॥

ఉత్తరమందు హిమాలయము, దక్షిణమందు వింధ్యాచలము, పూర్వ పశ్చిమముల యందు సముద్రము, పశ్చిమమందు సరస్వతీ-అటక్ నది,-(ఇది యుత్తర పర్వతమందుబుట్టి దక్షిణ సముద్రపు అఖాతమందుఁ గలియుచున్నది.) తూర్పు దిక్కున బ్రహ్మపుత్ర యని పిలువఁబడు దృషద్వతీనది, (ఇది నేపాళపు పూర్వ భాగ మందలి కొండలనుండి వెడలి బంగాళ అసాములకుఁ బూర్వమునను, బ్రహ్మ దేశమునకుఁ బశ్చిమమునను బ్రవహించి దక్షిణముగాఁ బాఁకి సముద్రమందుఁ జేరును.) ఈ రెంటికి నడుమనుండు నదియు, హిమాలయపు మధ్యరేఖ నుండి దక్షిణమునఁ బర్వతముల నడిమి ప్రదేశమును, వింధ్యరామేశ్వరముల నడిమి ప్రదేశమును, ఇవన్నియును గలిసిన దేశమునకు ఆర్యావర్తమని పేరు. ఇక్కడ దేవతలు-విద్వాంసులను ఆర్యులు- వసించిరి. కాఁబట్టి దీనికి ఆర్యావర్తమని పేరు కలిగెను.

ప్రశ్న:- అంతకు మునుపు ఈ దేశమునకుఁ బేరేమి? ఇక్కడ నెవరు వసించుచుండిరి?

ఉత్తరము:-అంతకుమునుపు ఈ దేశమున కేపేరును లేదు. ఆర్యులకుఁ బూర్వమీదేశమం దెవరును లేరు. ఏల యనఁగా ఆర్యులు ఆది సృష్టియందు గొంతకాలమునకుఁ ద్రివిష్టప టిబెట్టునుండి నేరుగ నీదేశమందు వచ్చివసించిరి.

ప్రశ్న:- వీరు ఇరాను దేశమునుండి వచ్చుటచే నార్యు లనఁబడినారనియు వీరికిఁ బూర్వ మిక్కడ అడవి మనుష్యులు వసించుచుండి రనియు, ఆర్యులు వారిని అసురులు, రాక్షసులు అనుచుండి రనియు. తమ్ము దేవతలని

చెప్పుకొను చుండిరనియు, వారిరువురకుఁగలిగిన సంగ్రామములకు దేవాసుర సంగ్రామములను కథలు కల్పింపఁబడె ననియుఁ జెప్పుచున్నారు; ఇది నిజమా?

ఉత్తరము:- ఇది సర్వథా యసత్యము, ఏలయన గా:-

వి జానీహ్యార్యాన్యే చ దస్యవో బర్హిష్మతే రంధయా శాసదవ్రతాన్ ॥
ఋ. మం. ౧ సూ. ౫౧. మం. ౮ ॥

ఉత శూద్రే ఉతార్యే ॥ అథర్వ. కాం. ౧౯. సూ. ౬౨. మం. ౧ ॥

ధార్మికులు, విద్వాంసులు, ఆప్తపురుషులునగు వారికి ఆర్యులనియు వీరికంటె భిన్నులగు వారికి దస్యులు అనఁగా దొంగలు, దుష్టులు, అధార్మికులు, అవిద్వాంసులనియు, బ్రహ్మ క్షత్రియ వైశ్యులను ద్విజులకు ఆర్యులనియు, శూద్రులకు అనార్యులనియుఁ జెప్పని యింతకు మునుపే వ్రాయఁబడినది. వేదమిట్లు చెప్పునపుడు ఇతర విదేశీయుల కపోల కల్పనలను బుద్ధిమంతు లెన్నఁడును నమ్మజాలరు. ఆర్యావర్తీయులగు అర్జునుఁడు, దశరథుఁడు మొదలగు వారు, హిమాలయ పర్వత ప్రాంతములం దార్యులకును, దస్యులను అసురమ్లేచ్ఛులకును జరిగిన యుద్ధములందు [దేవాసుర సంగ్రామములందు] దేవతలను ఆర్యులను రక్షించుటకును, అసురుల నోడించుటకును సహాయకు లయి యుండిరి. దీనివలన ఆర్యావర్తమునకు వెలుపల నాలుగు వైపులందు అనఁగా హిమాలయమునకుఁ బూర్వ, ఆగ్నేయ, దక్షిణ, నైఋత్య, పశ్చిమ, వాయవ్య, ఉత్తర, ఈశాన్య దేశములందు, వసించు మనుష్యులే అసురులనుట సిద్ధము ఏలయనఁగా హిమాలయ ప్రదేశమందుండు నార్యులమీఁద మ్లేచ్ఛులు దండెత్తి వచ్చి నపుడెల్ల, ఇక్కడి మహారాజులందఱు నా యుత్తరదేశ మందలి యార్యులకు సహాయకు లగుచుండిరి. దక్షిణదేశ మందు శ్రీరామచంద్రునితో జరిగిన యుద్ధము దేవాసుర సంగ్రామముకాదు. కాని రామరావణ సంగ్రామము-ఆర్యరాక్షస సంగ్రామమని చెప్పనొప్పును. ఆర్యులు ఇరాను దేశము నుండి వచ్చి యిక్కడి యడవి మనుష్యులతోఁ గలహించి జయమును బొంది వారిని దఱిమి యీ దేశమునకు రాజులయిరని యే సంస్కృత గ్రంథ మందును లేక చరిత్రమందును లేదు. ఇట్లుండఁగా విదేశీయుల వ్రాతలెట్లు మాననీయములు కాఁగలవు? ఇదియును గాక:-

మ్లేచ్ఛవాచశ్చార్యవాచః సర్వే తే దస్యవః స్మృతాః ॥ మను. ౧౦.౪౫ ॥

మ్లేచ్ఛదేశస్త్వతః పరః ॥ మను. ౨.౨౩ ॥

ఆర్యావర్త దేశమున కంటె భిన్న దేశములు దస్యు దేశములనియు, మ్లేచ్ఛ దేశములనియు ననఁబడును. దీనివలన ఆర్యావర్తమునకంటె భిన్నమగు పూర్వదేశము మొదలుకొని ఈశాన్య, ఉత్తర, వాయవ్య, పశ్చిమ దేశములం దుండువారికి దస్యు, మ్లేచ్ఛ, అసురులనియు, నైఋత్య, దక్షిణ ఆగ్నేయ దిశల యందలి (ఆర్యావర్తమున కంటె భిన్నమగు) వారికి రాక్షసులనియుఁ బేరు ప్రసిద్ధమగుచున్నది. ఇప్పటికినిఁ జూడుఁడు; హబ్శీ, నీగ్రో మొదలగు వారి స్వరూపము అసురుల వలె భయంకరముగాఁ గనఁబడుచున్నది. ఆర్యావర్తమునకు సరిగా కాళ్ళ వైపునుండు దేశమునకుఁ బాతాళమని పేరు. ఆ దేశస్థులు నాగు లనఁబడుదురు. ఏలయనఁగా ఆ దేశ మార్యావర్తీయులకు నేరుగఁ బాదముల క్రిందనున్నది. అచ్చట నాగ వంశపు రాజులు రాజ్యమేలు చుండిరి. ఆ దేశపు రాజ కన్య యగు ఉలూపిని అర్జునుఁడు వివాహమాఁడెను. ఇక్ష్వాకువు మొదలు కౌరవ పాండవుల వఱకు సమస్త భూగోళమందార్యుల రాజ్యమును. ఆర్యావర్తమునకంటె భిన్న దేశముల యందుఁ గొంత కొంత వేద ప్రచారమును నుండెననుట స్పష్టము. బ్రహ్మకుఁ బుత్రుఁడు విరాట్టు, విరాట్టునకుఁ మనువు మనువునకు మరీచి మొదలగు పదుగురు పుత్రులు కలిగిరి. వీరికి స్వయంభువు మొదలగు నేడుగురు రాజులుపుట్టి రాజ్యమేలిరి. వారి సంతానమే ఇక్ష్వాకువుమున్నగు రాజులు. వీరే ఆర్యావర్తమం దార్యులను వసింపఁ జేసి రాజ్య మేలిన మొదటి రాజులు. ఇప్పుఁడు దౌర్భాగ్యోదయము చేతను ఆర్యుల ఆలస్య ప్రమాద పరస్పర విరోధముల చేతను అన్యదేశముల మీఁద రాజ్యము చేయు మాట యటుండగా ఆర్యావర్తమందైన నార్యుల యఖండ, స్వతంత్ర, స్వాధీననిర్భయ రాజ్య మీకాలమునలేదు. ఉన్నదియును విదేశీయుల పాదాక్రాంత మయినది. కొందఱు రాజులు మాత్రము స్వతంత్రులుగ నున్నారు. దుర్దినములు సంభవించు నపుడు దేశవాసులనేక దుఃఖము లనుభవింప వలసి వచ్చును. కాని ఎవరెంత చేసినను స్వదేశీయ రాజ్యమే సర్వాంశము లందుత్తమ మనుట స్పష్టము. ఇఁక మత మతాంతరముల మూర్ఖపుపట్టుదల గాని, స్వపక్ష పరపక్ష పక్షపాతము గాని లేక, ప్రజల యందుఁ దలి దండ్రుల వంటి కృప గలిగి, దయాన్యాయములతోఁ గూడి యున్నను విదేశీయుల రాజ్యము సంపూర్ణ సుఖ

హాయకము కానేరాదు. ఈ దేశమందలి భిన్న భిన్న భాషలు, వేరు వేరు శిక్షలు, పరస్పర విరుద్ధ వ్యవహారములు దూరమగుట యతి దుష్కరము. వీనినుండి విడివడక యొండొరులకుఁ బూర్తిగ నుపకారమును, పరస్పరాభిప్రాయ సిద్ధియుఁ గలుగుట కఠినము. కాఁబట్టి వేదాది శాస్త్రములందు వ్రాయఁబడిన వ్యవస్థలను, ఇతిహాసమును గౌరవించుట భద్రపురుషులకుఁ గర్తవ్యము.

ప్రశ్న:— జగత్తు ఉత్పత్తియయి యెంత కాలమయినది,

ఉత్తరము:- జగదుత్పత్తి, వేదప్రకారము జరిగి నూటతొంబది యారు కోట్లచిల్లర సంవత్సరము లయినవి, దీనికి విపుల వ్యాఖ్యానమునాచే వ్రాయబడిన ఋగ్వేదాదిభాష్యభూమికయందు చూడుఁడు. సృష్టి విధమెట్లనఁగా.- అన్నిటికంటె సూక్ష్మమైన దానికి-విభజింపఁ బడనేరని దానికి పరమాణువని పేరు. అట్టి అరువది పరమాణువులు కలసిన అణు వగును. రెండణువులు కలసి ద్వ్యణుకము-స్థూలవాయువు--అగును. మూఁడు ద్వ్యణుకములు కలసి అగ్ని. నాలుగు ద్వ్యణుకములుకలసి జలము, అయిదు ద్వ్యణుకములు కలసి పృథివి. అనఁగా మూడు ద్వ్యణుకము లొక తర్వసరేణువు; అది రెండింత లయ్యెనేని పృథివి మొదలగు దృశ్య పదార్థము లేర్పడును. ఈ ప్రకారమే క్రమక్రమముగ భూగోళాదులను బరమేశ్వరుఁడు రచించినాఁడు.

ప్రశ్న:- దీని నెవఁడు ధరించి యున్నాఁడు? కొందఱు సహస్రఫణములు కల శేషుఁడగు సర్పశిరస్సుపై నున్న దనియుఁ, గొందఱు ఎద్దుకొమ్ముల మీఁద నున్నదనియు, మఱి గొందఱు దేని మీఁదను లేదనియు, మఱికొందఱు వాయువు నాధారమున నున్నదనియు, కొందఱు సూర్యుని ఆకర్షణచే నిద్వఁబడి తన స్థలమందు నిలఁబడియున్నదనియు, కొందఱు భూమి భార మగుటచే నాకాశమందుఁ గ్రింది క్రిందికి బోవుచున్నదనియుఁ జెప్పుచున్నారు; వీనియం దేది సత్యము?

ఉత్తరము:— శేషుఁడను సర్పముమీఁదను, ఎద్దుకొమ్ముల మీఁదను పృథివి ధరింపఁబడి నిలిచి యున్నదని చెప్పువారిని గూర్చి ఈ సర్పవృషభముల తలిదండ్రులు పుట్టినపుడు దేనిపై నుండెను? మఱియు నీ సర్పమును, ఎద్దును దేనిపై నున్నవి? అని యడిగితిమేని ఎద్దుమీఁద నున్నదని చెప్పు ముసల్మానులేమో మాటలాడలేక యూరకుండురు. సర్పము మీఁద నున్నదను

వారో సర్పము కూర్మము మీదను, కూర్మము నీటిమీఁదను నీరు అగ్ని మీఁదను, అగ్ని వాయువుమీఁదను, వాయువు ఆకాశమందునున్నదని చెప్పుదురు. ఇవన్నియు దేనిమీఁద నున్నవని యడిగితిమేని పరమేశ్వరుని మీఁద నున్నవని తప్పక చెప్పుదురు. శేషవృషభములెవరి బిడ్డలని యడిగితిమేని వృషభమును గోవృషభముల బిడ్డయందు రేమో కాని శేషుఁడు కద్రూకశ్యపుల బిడ్డయనియు, కశ్యపుడు మరీచి పుత్రుఁడనియు, మరీచి మనువుపుత్రుఁడనియు, మనువు విరాట్టు పుత్రుఁడనియు, విరాట్టు బ్రహ్మ పుత్రుఁడనియు, బ్రహ్మ ఆది సృష్టియందలి వాఁడనియుఁజెప్పుదురు. శేషుడు జన్మింపకముందు అయిదు తరములు గడచినవే యప్పుడీ పృథివి నెవరు ధరించి యుండిరి, అప్పుడు దేని పైనుండెను? అని అడిగితిమేని ముందు మాటాడఁబోఁకలగర మాఁడ బొరఁగుదురు. దీని సత్యాభిప్రాయ మేమనఁగా:- మిగతకు శేషమని పేరు. ఎవఁడేని కవి పరమేశ్వరుఁడు ఉత్పత్తి ప్రలయముల నుండి మిగిలి యుండును. అనఁగా దూరమై యుండును గనుక యతనిని శేషుఁడని తలంచి (శేషాధారా పృథివీ.) శేషుని యాధార మందుఁ పృథివి యున్నదని చెప్పి యుందురు. అతని యభిప్రాయమును దెలిసికొనక సర్పమును మిథ్యార్థమును గల్పించుకొని యుందురు.

సత్యేనోత్తభితా భూమిః॥ ఋక్ ౧౦.౮౫.౧॥

ఎన్నటికిని నాశనము లేని త్రికాలాబాధ్యుఁడగు (సత్య) పరమేశ్వరుఁడు భూమిని, ఆదిత్యుని, సమస్త లోకములను ధరించియున్నాఁడు.

ఉక్షా దాధార పృథివీముత ద్యామ్॥ ఋక్ ౧౦.౩౧.౮॥

దీని యందలి (ఉక్షా) శబ్దమును జూచి ఎవ్వఁడో యెద్దని గ్రహించి యుందురు. ఏలయనఁగా ఎద్దునకును ఉక్షయని పేరు. కాని యామూఢునకు వింత పెద్ద భూగోళమును ధరించు సామర్థ్యము ఎద్దునందెట్లుండఁ గలుగునని తోఁచలేదు. వర్షము ద్వారా భూగోళమును దడుపును గనుక సూర్యునకు ఉక్ష యని పేరు. ఆ సూర్యుఁడు తన యాకర్షణచే బృథ్విని ధరించియున్నాడు. కాని సూర్యాదులను ధరించువాఁడు పరమేశ్వరుఁడు దప్ప మఱెవ్వఁడుకాఁడు.

ప్రశ్న:- ఇంత పెద్దపెద్ద భూగోళాదులను పరమేశ్వరుఁడెట్లు ధరింపఁ గలుగును.

ఉత్తరము:- అనంతాకాశము నెదుట గొప్ప గొప్ప భూగోళములొక లెక్కలోనివి గావు. అనఁగా సముద్రమున కెదుట నీటిబొట్టుతో సమానములును గావు. అట్లే అనంత పరమేశ్వరుని యెదుట నసంఖ్యాక లోకములొక పరమాణువుతోఁ గూడ సమానములు కాఁజాలవు. అతఁడు లోపల, వెలుపల నంతటవ్యాపకుఁడు. "విభుః ప్రజాసు" [యజుః ౩౨-౮] ఇదియజుర్వేదవచనము. ఆ పరమాత్మ సమస్త ప్రజలయందు వ్యాపకుఁడై యన్నిటినిధరించుచున్నాఁడు. క్రైస్తవులు, ముసల్మానులు, పౌరాణికులు అతని విభుఁడని చెప్పరు. అతఁడు విభుఁడు కాఁడేని, ఈసమస్త సృష్టిని ఎన్నటికిని ధరింపఁజాలఁడు. ఏలయనఁగా వస్తువును ప్రాపింపని వాఁడెన్నఁడును దానిని ధరింపఁజాలఁడు. ఈ సమస్త లోకములు పరస్పరాకర్షణముచే ధరింపఁబడును, పరమేశ్వరునిచే ధరింపఁబడవలసిన యవసరమేమని కొందఱడుగుదురేని, వారిని గూర్చి సృష్టి యనంతమా, సాంతమా? అని యడుగవలయు. అనంతమందురా, ఆకారము గల వస్తువు అనంతమెన్నటికి కాఁజాలదు సాంతమందురా: దానికావలనేలోకము నుండదు గద. అక్కడ నెవరియాకర్షణముచే ధరింపఁబడి యుండును? సమష్టి వ్యష్టి:- అనఁగా సముదాయమునకు వనమని పేరు పెట్టితిమేని అది సమష్టి. వృక్షాదులను వేఱువేఱుగ నెంచితిమేని అది వ్యష్టి. అట్లే సమస్త భూగోళములను సమష్టియని యెంచి దానిని జగత్తందుమేని సమస్త జగత్తునుధరించి యాకర్షించు కర్త పరమేశ్వరుఁడు దప్ప మఱెవ్వఁడును గాఁడు. కాఁబట్టి సమస్త జగత్తును రచించువాఁడే ధరించుచున్నాఁడు.

స దాధార పృథివీం ద్యాముతేమాం॥ యజుః. అ. ౧౩. మం. ౪॥

ఏ పరమాత్మ పృథివ్యాది ప్రకాశ రహిత లోకలోకాంతర పదార్థములను, సూర్యాది ప్రకాశసహిత లోకములను, పదార్థములను రచించి ధరించుచున్నాఁడో, ఎవఁడన్నిటియందును వ్యాపకుఁడగుచున్నాఁడో, ఆఁతడే సమస్త జగత్కర్తయు, ధర్తయు నయియున్నాఁడు.

ప్రశ్న:- పృథివ్యాది లోకములు తిరుగుచున్నవా? లేక స్థిరముగా నున్నవా?

ఉత్తరము:- తిరుగుచున్నవి.

ప్రశ్న:—కొందరు సూర్యుఁడు తిరుగుచున్నాడు. పృథివి తిరుగదనియుఁ మఱికొందఱు పృథివి తిరుగుచున్నది సూర్యుఁడు తిరుగఁడనియుఁ జెప్పుచున్నారు. ఇందులోనేది సత్యము?

ఉత్తరము:— వీరిద్దఱి మాటయు సగమబద్ధమయియున్నది.

ఆయం గౌః పృశ్నిరక్రమీ దసదన్మాతరం పురః॥
పితరం చ ప్రయన్త్స్వః॥ యజు॥ అ. ౩. మం. ౬॥

అనఁగా నీ భూగోళము జలముతో సహా సూర్యుని నాలుగు వైపులను దిరుగుచుఁ బోవుచున్నది; అని యున్నది కనుక భూమి తిరుగుచుండును.

ఆ కృష్ణేన రజసా వర్తమానో నివేశయన్నమృతం మర్త్యం చ।
హిరణ్మయేన సవితా రథేనా దేవో యాతి భువనాని పశ్యన్॥
యజు॥ అ. ౩౩. మం. ౪౩॥

వర్షాదులను జేయువాఁడును. ప్రకాశ స్వరూపుఁడును. తేజోమయుఁడును రమణీయ స్వరూపవంతుఁడు నగు సవితయను సూర్యుఁడు సమస్త ప్రాణి అప్రాణులయందు నమృతరూప వృష్టిని గావించి రేఖా కిరణముల ద్వారా అమృతమును ప్రవేశింపఁజేసి సమస్త మూర్తిమంత ద్రవ్యములను జూపుచు. సమస్త లోకముల గొని, ఆకర్షణ గుణముతో కూడియుండి తన పరిధియందుఁ దిరుగుచుండును. కాని యేలోకమునకు చుట్టును దిరుగఁడు. అట్లే యొక్కొక్క బ్రహ్మాండమందొక్కొక్క సూర్యుడు ప్రకాశకుఁడును. దక్కిన లోకలోకాంతరములు ప్రకాశ్యములునైయుండును:—

దివి సోమో అధి శ్రితః॥ అథర్వ.కాం. ౧౪. అను. ౧. మం. ౧॥

ఈ చంద్రలోకము సూర్యునిచేఁ బ్రకాశిత మగునట్లే పృథివ్యాది లోకములును సూర్యుని ప్రకాశ మందే ప్రకాశితమగు చున్నవి. రేయింబగళ్ళు ఎల్లప్పుడు నుండును. ఏలయనఁగాఁ బృథివ్యాది లోకములు తిరుగుట వలన నెంతభాగము సూర్యునెదుటికి వచ్చునో అంత ప్రదేశమందు దినమును. ఎంత వెనుక నుండునో-మరుగుపడి యుండునో అంత ప్రదేశమందు రాత్రియు నుండును. అనఁగా ఉదయము. అస్తమయము, సంధ్య.మధ్యాహ్నము, మధ్యరాత్రిము మొదలగు కాలావయవము లన్నియు నాయాదేశ దేశాంతరములందు నంతతము లైయుండును. ఆర్యావర్తమందు సూర్యోదయ మయినపుడు పాతాళ

మనెడి అమెరికా దేశమందు అస్తమయమును, ఆర్యావర్తమందు అస్తమయ మయినపుడు పాతాళమందు ఉదయమును, ఆర్యావర్తమందు మధ్య దినమును, మధ్యరాత్రియునయినపుడు పాతాళమందు మధ్యరాత్రియు మధ్య దినమునగును. సూర్యుడు తిరుగుచున్నాడు; పృథివి తిరుగదనువారందరు అజ్ఞులు, అటులయిన నెన్నియోవేలేండ్లకు రాత్రిందినములుకావలసి వచ్చును. సూర్యునకు బ్రధ్నుడని పేరు. పృథివికంటె లక్షల రెట్లు పెద్దవాడై కోట్లకొలది క్రోసుల దూరమున నున్నాడు. ఆవగింజను చుట్టి కొండ తిరుగుటకు చాలకాలము పట్టును. ఆవగింజ తిరుగుట కంతకాలము పట్టదు. కాబట్టి పృథివి తిరుగుటచేత యథా యోగ్యముగ దినమును, రాత్రియునగును. సూర్యుడు తిరుగుటచేత గాదు. సూర్యుడు స్థిరముగా నున్నాడను వారు గూడ జ్యోతిర్విద్యావిదులు కారు. ఏలయనగా సూర్యుడు తిరుగడేని యొక రాశినుండి మఱియొక రాశిని బొందకుండును. ఇదియుగాక గురుపదార్థ మాకాశమందు దిరుగకుండ నియతస్థానమున నెన్నడు నుండజాలదు. పృథివి తిరుగక క్రింది క్రిందికి బోవుచున్నదనియు, కేవలము జంబూద్వీపమం దిద్దరు సూర్యులు, నిద్దరు చంద్రులు నున్నారనియు చెప్పు జైనులు గంజాయి మైకమందు బూర్ణముగ మునిగి యున్నారని తెలియవలయును. ఏలయనగా గ్రింది క్రిందికి బోవుచుండు నేని నాలుగు పైపులను వాయువు మండల మేర్పడక పృథివి చిన్న భిన్నమయిపోవును. ఇక లోతగు ప్రదేశములం దుండువారికి వాయు స్పర్శయే లేకపోవును. క్రిందనుండు వారికి గాలి యధికమగును. వాయు గతియు నొక్కటే విధముగ నుండును. ఇద్దరు సూర్యచంద్రులుండుచో రేని రాత్రియును, కృష్ణ పక్షమును గలుగక యంతయు నవ్యవస్థితమై పోవును. కాబట్టి యొక భూమి యొద్ద నొక చంద్రుడును, అనేక భూములకు మధ్య నొక సూర్యుడునుండును.

ప్రశ్న :- సూర్యుడు, చంద్రుడు నక్షత్రము లివి యేమివస్తువులు? వీనియందు మనుష్యాది సృష్టియున్నదా? లేదా?

ఉత్తరము:- ఈ గోళములన్నియు లోకములే, వీనియందు మనుష్యాది జీవులున్నారు. ఏలయనగా:-

ఏతేషు హీదగ్ం సర్వం వసు హితమేతే హీదగ్ం సర్వం వాసయంతే।
తద్యదిదగ్ం సర్వం వాసయంతే తస్మాద్వసవ ఇతి॥

శత. కాం. ౧౪. ప్ర. ౬. బ్రా. ౭. కం. ౪॥

(పృథివి, జల, అగ్ని, వాయు, ఆకాశ, సూర్య, చంద్ర, నక్షత్రములకు వసువులు అని పేరు. వీనియందు సమస్త పదార్థములును, ప్రజలును వసింతురు. ఇవి యన్నిటిని వసింపఁజేయును. నివసించుటకు గృహములుగా నున్నందున వీనికి వసువులని పేరు. పృథివివలెనే సూర్యచంద్ర నక్షత్రములు వసువులయి నపుడు వానియం దీప్రకారమే ప్రజలుండుననుటకు సందేహమేమి? పరమేశ్వరుని యీ చిన్న లోకమే మనుష్యాది సృష్టిచే నిండియుండునపుడు తక్కిన సమస్త లోకములు శూన్యములై యుండునా? పరమేశ్వరుని యే కార్యమును నిష్ప్రయోజనము కాదు గదా! ఇట్టి యసంఖ్యాక లోకములందు మనుష్యాదిసృష్టి లేకున్న నెన్నఁడేని సార్థకములగునా? కాఁబట్టి యన్నిటియందును మనుష్యాది సృష్టి యున్నదనుట స్పష్టము.)

ప్రశ్న:- ఎట్లు ఈ లోకమందు మనుష్యాదుల యాకృతి, అవయవము లున్నవో, అట్లే అన్యలోకముల యందు ఉండునా? లేక విపరీతముగనా?

ఉత్తరము:- ఆకృతియందుఁ గొంతకొంత భేదముండవచ్చును. ఈ లోకమందును, చీనా యవన ఆర్యావర్తములయందును, యూరోపునందును అవయవభేదము, రంగు, రూపు, ఆకృతులభేదము కొంత కొంత యుండు నట్లే లోక లోకాంతరములందును భేదముండును. కాని ఈ లోకమందే జ్ఞాతి సృష్టి యెట్లున్నదో అట్లే ఆయా జాతి సృష్టియు అన్యలోకముల యందు నుండును. శరీరమున నేయే ప్రదేశములయందు నేత్రాది అంగములున్నవో ఆయా ప్రదేశములయందే లోకలోకాంతరములందలి ఆయా జాతుల యవ యవములు నట్లే యుండును. ఏలయనఁగా:-

సూర్యాచంద్రమసౌ ధాతా యథాపూర్వమకల్పయత్।
దివం చ పృథివీం చాంతరిక్షమథో స్వః॥ ఋ. మం. ౧౦. సూ. ౧౯౦. మం. ౩॥

(ధాతా) పరమాత్మ యేప్రకారము సూర్య, చంద్ర, ద్యౌ, పృథివి అంత రిక్షములను, వాని యందలి సుఖ విశేష పదార్థములను పూర్వకల్పమందు రచించియుండునో, అట్లే యీ కల్పమందు అనఁగా నీ సృష్టియందును

రచించి యున్నాఁడు. అట్లే సమస్త లోకలోకాంతరములను జేసియున్నాఁడు. కించిన్మాత్రమును భేదము కలుగదు.

ప్రశ్న:— ఈ లోకమం దేవేదములు ప్రకాశింపఁబడియున్నవో యవే ఆ లోకములయందును ప్రకాశింపఁబడి యుండెనా?

ఉత్తరము:— అవే ప్రకాశింపఁబడియున్నవి. ఒకరాజు రాజ్యవ్యవస్థయు, నీతియు నన్నిదేశముల యందును సమానముగా నుండునట్లే రాజరాజేశ్వరుఁ డగు పరమాత్ముని వేదోక్తనీతిగూడ నతని సృష్టిలోని సమస్త రాజ్యములందు నొకటేవిధముగ నుండును.

ప్రశ్న:— ఈ జీవులును, ప్రకృతిస్థితత్వములును ఈశ్వరుని చేతఁజేయ బడక అనాది యయ్యెనేని వానిమీఁద ఈశ్వరుని యధికారము నుండఁగూడదు. అందఱు స్వతంత్రులేగదా?

ఉత్తరము:— రాజును ప్రజలును సమకాలీనులైనను ప్రజలు రాజాధీనులై యుండునట్లే పరమేశ్వరుని యధీనమందు జీవులును జడపదార్థములు నున్నవి. పరమేశ్వరుఁడు సమస్త సృష్టిని జేయువాఁడును, జీవుల కర్మఫలము లిచ్చువాఁడును, అన్నిటిని దగినట్లు రక్షించువాఁడును, అనంత సామర్థ్యవంతుఁడునైయుండగా అల్పసామర్థ్యవంతులును, జడపదార్థములును అతని యధీనములేలకావు? కావున జీవుఁడు కర్మము చేయుటయందు స్వతంత్రుఁడు. కర్మఫలమనుభవించుటయందు ఈశ్వరుని వ్యవస్థచేఁబరతంత్రుఁడు. అట్లే సృష్టిసంహార పాలనములఁగావించు సకల విశ్వకర్త సర్వశక్తిమంతుఁడు.

ఇఁకముందు విద్య, అవిద్య, బంధ, మోక్షవిషయములనుగూర్చివ్రాయ బడును.

శ్రీమద్దయానంద సరస్వతీస్వామి కృతమును సుభాషావిభూషితమునగు సత్యార్థ ప్రకాశమున సృష్ట్యుత్పత్తిస్థితి ప్రలయవిషయములుగల అష్టమ సముల్లాసము సంపూర్ణము.



# నవమ సముల్లాసము

## విద్యాఽవిద్యా బంధ మోక్ష విషయములు.

విద్యాం చావిద్యాం చ యస్తద్వేదోభయగ్ం సహ।
అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయాఽమృతమశ్నుతే॥

యజుః. అ. ౪౦. మం. ౧౪॥

ఎవఁడు విద్య అవిద్యలస్వరూపమునొకేసమయమున తెలియుచున్నాఁడో యతఁడు అవిద్యయనెడు కర్మోపాసనలచే మృత్యువును దరించి, విద్యయను యథార్థజ్ఞానముచే మోక్షమును బొందును.

## అ వి ద్యా ల క్ష ణ ము.

అనిత్యాశుచిదుఃఖానాత్మసు నిత్యశుచిసుఖాత్మఖ్యాతిరవిద్యా॥

యో. ద. సాధనపాద. సూ. ౫॥

అనిత్యసంసారమును, దేహాదులను నిత్యములనియు, కనఁబడు, వినఁబడు కార్యరూపజగత్తు సర్వదాయుండగలదు-అనియు, అట్లే యుండుననియు, యోగబలముచే దేవతలశరీరము శాశ్వతముగ నుండుననియు నిట్టి విపరీతబుద్ధి కలుగుటయే అవిద్యప్రథమాంగము. అట్లే అశుచి-ననఁగా మలమయులగు స్త్రీలుమున్నగువారిని, అబద్ధము, దొంగతనము మొదలగు అపవిత్రములను పవిత్రములనితలంచుట రెండవయంగము. అత్యంత విషయసేవనరూపమగు దుఃఖమును సుఖమని తలంచుట మూఁడవయంగము అనాత్మయందు ఆత్మబుద్ధికలిగియుండుట నాల్గవయంగము. ఈ నాలుగువిధముల విపరీతజ్ఞానమే అవిద్యయనఁబడును. దీనికి విపరీతముగ ననఁగా అనిత్యమును అనిత్యమనియు, నిత్యమును నిత్యమనియు, అపవిత్రమును అపవిత్రమనియు, పవిత్రమును పవిత్రమనియు, దుఃఖమును దుఃఖమనియు, సుఖమును సుఖమనియు, అనాత్మను అనాత్మయనియు, ఆత్మను ఆత్మయనియు, నెఱుఁగుటయే విద్య. 'వేత్తి యథావత్తత్త్వంపదార్థస్వరూపం యయా సా విద్యా. యయా తత్త్వస్వరూపం న జానాతి భ్రమాదన్యస్మిన్నన్యన్నిశ్చినోతి యయా సా అవిద్యా, దేనిచేఁ బదార్థ యథార్థస్వరూపము బోధపడునో

అది విద్య. దేనిచేఁ దత్త్వస్వరూపము బోధపడదో అనఁగా నొకదానియందు మఱి యొకదాని బుద్ధిపొరపాటమునో యది అవిద్య యనఁబడును. ఇఁక కర్మోపాసనలు, బాహ్యాంతర క్రియావిశేషములేకాని, జ్ఞానవిశేషములు కావు. కాఁబట్టి అవిద్య యందు గణింపఁబడినవి. ఇందువలననే మంత్రమందు శుద్ధకర్మములను, పరమేశ్వరోపాసనను జేయుచున్న మృత్యువను దుఃఖమునుండి యెవఁడును దూరము గాఁజాలఁడని చెప్పఁబడియున్నది. అనఁగాఁ బవిత్రకర్మము, పవిత్రోపాసన, పవిత్రజ్ఞానము అను వీనిచేతనే ముక్తియు, అపవిత్రమగు మిథ్యాభాషణాది కర్మములచేతను, పాషాణ మూర్త్యాదుల యుపాసనచేతను, మిథ్యాజ్ఞానముచేతను. బంధమును గలుగును. ఏమనుష్యుఁడేని ఒకక్షణమైనకర్మము, ఉపాసన, జ్ఞానము అనువానిని వీడియుండఁజాలఁడు. కాఁబట్టి ధర్మయుక్తములగు సత్యభాషణాది కర్మములొనర్పుచు మిథ్యాభాషణాది అధర్మయుక్తకర్మములఁ ద్యజించుటయే ముక్తికిసాధనము.

ప్రశ్న:—ముక్తి యెవని కబ్బును ?

ఉత్తరము:—బద్ధునికి.

ప్రశ్న:—బద్ధుఁ డెవఁడు ?

ఉత్తరము:— అధర్మమందును, అజ్ఞానమందును చిక్కువడియున్న జీవుఁడు.

ప్రశ్న:—బంధమోక్షములు స్వభావముచేఁ గలుగునా? నిమిత్తముచేతనా?

ఉత్తరము:—నిమిత్తముచేత. స్వభావముచేఁగలిగిన బంధమోక్షములకు నివృత్తి యెన్నఁడును కలుగకుండెడిది.

ప్రశ్న:— న నిరోధో న చోత్పత్తిర్న బద్ధో న చ సాధకః।
న ముముక్షుర్న వై ముక్త ఇత్యేషా పరమార్థతా॥
గౌడపాదీయకారిక. ప్ర. ౨. కాం ౩౨.॥

ఈ కారిక మాండూక్యోపనిషత్తు విషయమును వివరింపవ్రాయబడినది. జీవుఁడు బ్రహ్మ మగుటచే సహజముగ జీవునకు నిరోధముకలుగదు. అనఁగా నెన్నఁడు నావరణములోనికిరాఁడు. జన్మమెత్తఁడు. బంధమందుఁ జిక్కఁడు. సాధనము చేయువాఁడును గాఁడు. విడివడుటకు నిచ్ఛగింపఁడు. వాని కెన్నఁడును ముక్తిలేదు. పరమార్థమునుబట్టి బంధమేలేనపుడు ముక్తియెట్లు ?

ఉత్తరము:-నవీనవేదాంతుల యీమాట సత్యముకాదు. ఏలయనఁగా జీవుఁడు అల్పస్వరూపము కలవాఁడు కాఁబట్టి ఆవరణమందుఁ జిక్కును. శరీరముతోఁ బ్రకటమగును-జన్మమెత్తును. పాపకర్మముల ఫలమగు భోగరూపబంధమందుఁ జిక్కును. దానినుండి విడివడుటకు ప్రయత్నముచేయును. దుఃఖమునుండి విడిపడఁగోరును. అట్లు విడివడి పరమానంద పరమేశ్వరునిబొందిముక్తిని గూడ ననుభవించును.

ప్రశ్న:-ఇవన్నియు దేహాంతఃకరణముల ధర్మములేకాని జీవునివికావు ఏలయనఁగా జీవుఁడేమో పాపపుణ్యరహితుఁడు - సాక్షి మాత్రుఁడు; శీతోష్ణాదులు శరీరాదుల ధర్మములు. ఆత్మ నిర్లిప్తము.

ఉత్తరము:-దేహాంతఃకరణములు జడములు. వానికి శీతోష్ణములంటవు. భోగమును గలుగదు. వానిని స్పృశించు చేతనములగు మనుష్యాది ప్రాణులకే శీతోష్ణములు తోఁచును. వారే యనుభవింతురు. అట్లే ప్రాణములును జడములే. వానికి క్షుత్పిపాసలు లేవు. కాని ప్రాణముకల జీవులకే ఆఁకలియు దప్పికయు నగును. అట్లే మనస్సుకూడ జడమే. దానికి హర్షశోకములు కలుగఁజాలవు. కాని మనస్సుచేత జీవుఁడు హర్షశోకములను, సుఖదుఃఖములను అనుభవించును. జీవుఁడెట్లు బహిష్కరణములనెడి శ్రోత్రాదీంద్రియములచే మంచివియుఁ, జెడ్డవియునగు శబ్దాదివిషయములను గ్రహించి సుఖియు, దుఃఖియు నగునో, అట్లే అంతఃకరణములనెడి మనోబుద్ధి చిత్తాహంకారములచే సంకల్ప. వికల్పములను, నిశ్చయమును, స్మరణను, అభిమానమును బొంది దండనకును, మన్ననకును పాత్రుఁడగును. కత్తితోఁ గొట్టినవాఁడు దండనీయుఁడుగాని కత్తి కాదు. అట్లే దేహేంద్రియాంతఃకరణ ప్రాణములనెడి సాధనములచే మంచి చెడు కర్మములకుఁ గర్తయగుజీవుఁడు సుఖదుఃఖముల ననుభవించుచున్నాఁడు. జీవుఁడు కర్మములకు సాక్షికాఁడు. కాని, కర్తయు భోక్తయు నయి యున్నాఁడు. అద్వితీయుఁడగు పరమాత్మయే కర్మములకు సాక్షి. కర్మము నొనర్చుజీవుఁడు కర్మయందు లిప్తుఁడగుచున్నాఁడే కాని యా సాక్షియగు పరమేశ్వరుఁడు కాఁడు.

ప్రశ్న:-బ్రహ్మప్రతిబింబమే జీవుఁడు. అద్దము పగులుటవలన బింబమునకేమియు హానికలుగనట్లు అంతఃకరణోపాధి యుండువఱకే అంతఃకరణ

మందు బ్రహ్మప్రతిబింబమనెడి జీవుఁడుండును. అంతఃకరణము నష్టమకాఁగానే జీవుఁడు ముక్తుఁడగును.

ఉత్తరము:-ఇది పసితనపుమాట. సాకారము ప్రతిబింబము సాకారమునందే యేర్పడును. అవి వేఱుగనుండవలయును. ఆకారము గల ముఖము, అద్దము ఇవి వేఱువేఱుగ నుండుటవలననే ప్రతిబింబమేర్పడుచున్నది. బ్రహ్మ నిరాకారుఁడును,సర్వవ్యాపకుఁడునగుటచే వానిని ప్రతిబింబమే సిద్ధింపదు.

ప్రశ్న:-చూడుఁడు. లోతుగల స్వచ్ఛమైనజలమందు నిరాకారము వ్యాపకమునగు ఆకాశముయొక్క యాభాస కలుగుచున్నట్లే స్వచ్ఛమైనఅంతఃకరణమందు పరమాత్మాభాస కలుగుచున్నది. దీనికే చిదాభాసమని పేరు.

ఉత్తరము:- ఇది బాలబుద్ధిగల మిథ్యాప్రలాపము. ఆకాశము దృశ్యమే కానపుడు దానినెవ్వఁడేనియుఁ గంటితో నెట్లుచూడఁగలఁడు?

ప్రశ్న:-పైనసింముగను,ధూమ్రముగనుగనబడునదియాకాశముకాదా?

ఉత్తరము:- కాదు.

ప్రశ్న:- మఱి యదేమి?

ఉత్తరము:- వేఱు వేఱుగఁ బృథివీజలాగ్నుల త్రసరేణువులగపడుచున్నవి. అందు సింముగఁగనఁబడునది వర్షించునట్టి యుదకజలభాగము. అ కనఁబడు ధూమ్రిమ వాయువునందుఁదిరుగుచుండుభూమి, దుమ్ము. దాని ప్రతిబింబమే నీళ్లయందుఁగాని అద్దమందుఁగాని కనఁబడునది. ఆకాశప్రతిబింబమెన్నటికిఁ గాదు.

ప్రశ్న:-ఘటాకాశము, మేఘాకాశము మహదాకాశము,అనుభేదములు వ్యవహారమందున్నట్లే బ్రహ్మాండము, అంతఃకరణమనను ఉపాధులభేదముచే బ్రహ్మమునకు జీవుఁడు, ఈశ్వరుఁడు అనునామములు గలుగును. ఘటాదులు నష్టమైనపుడు మహాకాశమే యనఁబడును.

ఉత్తరము:-ఇదియు నవిద్వాంసుల మాటయే. ఏలయనఁగా ఆకాశమెన్నఁడును చిన్నభిన్నముగాదు. వ్యవహారమందుగూడ 'ఘటమును దెమ్ము', మొదలగువాక్యములు ప్రయోగింపఁబడునేకానిఘటాకాశమునుదెమ్మనియెవ్వరు ననరు; కాఁబట్టి యీ మాటయు సరికాదు.

ప్రశ్న:-సముద్ర మధ్యమందుఁ జేపలును బురుగులును, ఆకాశ మధ్యమందుఁ బక్షులు మొదలగునవియుఁ దిరుగునట్లు చిదాకాశ బ్రహ్మమందు అంతఃకరణములన్నియుఁ దిరుగుచుండును. అవి స్వయముగా జడములే కాని సర్వవ్యాపకుఁడగు పరమాత్ముని సత్తాచేత నగ్నితోఁగూడిన లోహములవలె చేతనములగుచున్నవి. అవి చలించుచుఁ దిరుగుచున్నను ఆకాశమును, బ్రహ్మము నిశ్చలములై యున్నట్లే జీవుని బ్రహ్మమని నమ్ముటచే దోషమేమియుఁ గలుగదుగదా?

ఉత్తరము: ఈ దృష్టాంతమును సరికాదు. ఏలయనఁగా సర్వవ్యాపియగు బ్రహ్మ మంతఃకరణములందుఁ బ్రకాశమానుఁడయి జీవుఁడగునేని సర్వజ్ఞాది గుణములు జీవునియందేలగలుగవు? ఆవరణముండుటఁ బట్టి సర్వజ్ఞత్వము లేదందురేని, బ్రహ్మ మావృతము-ఖండితమా? లేక యఖండితమా? అఖండితమందురేని నడుమ తెఱయుండఁజాలదు. తెఱలేనపుడు సర్వజ్ఞుఁడెలాగాకుండును; తన స్వరూపమును మఱచి యంతఃకరణముతోఁ గదలుచుండునట్లుండునే కాని స్వరూపముచేతఁ గాదనిన స్వయముగాఁ దాను జరుగకుండునపుడు అంతఃకరణము పూర్వప్రాప్త ప్రదేశమును వదలి మున్ముందు ఎక్కడెక్కడికి ఎంతెంత జరుగునో అక్కడక్కడి బ్రహ్మము భ్రాంతమును అజ్ఞానమునయిపోవును. విడువఁబడిన ఆయా ప్రదేశపు బ్రహ్మము జ్ఞానియు,పవిత్రుఁడును ముక్తుఁడునగుచుండును. ఈ ప్రకారమే సర్వత్ర సృష్టియందలి బ్రహ్మమును అంతఃకరణములు చెరుపుచుండును. ఇంక బంధమోక్షములును క్షణక్షణమునఁ గలుగుచుండును. మీమాటయే నిజమైన నేజీవునకును బూర్వము చూచినది, వినినది జ్ఞాపకముంత కుండెడిది. ఏలయనఁగా ఏ బ్రహ్మము చూచెనో అతఁడులేఁడు. కాఁబట్టి బ్రహ్మము జీవుఁడుకాని జీవుడు బ్రహ్మముకాని యెన్నటికి నొక్కటి కారు. సర్వదా వేఱువేఱుగనుందురు.

ప్రశ్న:- ఇదంతయు నధ్యారోపమే. అధ్యారోపమనఁగా నొక వస్తువునందు మఱియొక వస్తువు నారోపించుట. అట్లే బ్రహ్మమను వస్తువునందు జగత్తును దాని వ్యవహారమును అధ్యారోపము చేసి జిజ్ఞాసువునకు బోధింపనగును. వాస్తవముం దంతయు బ్రహ్మమే.

(సిద్ధాంతి) అధ్యారోపము చేయువాఁడెవఁడు?
(నవీన వేదాంతి) జీవుఁడు.
(సిద్ధాంతి) ఎవనిని జీవుఁడందురు?
(నవీన వేదాంతి) అంతఃకరణావచ్ఛిన్న చేతనమును.
(సి.) అంతఃకరణావచ్ఛిన్న చేతనము వేఱా? అదియే బ్రహ్మమా?
(న. వే.) అదియే బ్రహ్మము.
(సి.)ఏమి!బ్రహ్మమేతనయందుజగత్తునుమిథ్యగాకల్పననుజేసికొనెనా?
(న. వే.) అవును. బ్రహ్మమునకు దీనిచే నేమిహాని?
(సి.) మిథ్యాకల్పనలు చేయువాఁడు అసత్యవాదికాఁడా?
(న. వే.) కాఁడు. మనస్సుచేతను,వాక్కుచేతను కల్పింపఁబడినదిచెప్పఁబడినది-అంతయు నసత్యమే.

(సి.) అట్లైన మనస్సు చేతను, వాక్కు చేతను మిథ్యా కల్పనలు చేసి మిథ్యలను జెప్పు బ్రహ్మము కల్పితుఁడును, మిథ్యావాదియు నయ్యెనా? లేదా?
(న. వే.) అవును. అదిమాకు నిష్టాపత్తియే.

(సి.) ఛీ! అసత్య వేదాంతులారా! మీరు సత్యస్వరూపుఁడును, సత్యకాముఁడును, సత్యసంకల్పుఁడునగు పరమాత్మను మిథ్యావాదిగాఁజేసివేసితిరే? ఏమి? ఇది మీ దుర్గతికిఁగారణముకాదా? పరమేశ్వఁరుఁడు మిథ్యావాది, మిథ్యాసంకల్పుఁడని యేయుపనిషత్తునందు, ఏసూత్రమందు, ఏవేదమునందువ్రాయఁబడి యున్నది? మీమాట "దొంగ కొత్వాలును దండించెను" అన్నట్లున్నది. కొత్వాలు దొంగను దండించుట యుచితము కాని, దొంగ కొత్వాలును దండించుట విపరీతము. అట్లే మీరును మిథ్యాసంకల్పులును,మిథ్యావాదులు నయి,ఆ మీదోషమును బ్రహ్మమందు వ్యర్థముగా నారోపించుచున్నారు.బ్రహ్మమిథ్యాజ్ఞానియు,మిథ్యావాదియు, మిథ్యాకారియు నయ్యేనేని అనంతబ్రహ్మమంతయు నట్లే యయిపోవును. ఏలయనఁగా నతఁడు ఏకరసుఁడు,సత్యస్వరూపుఁడు,సత్యమాని, సత్యవాది, సత్యకారి;కాన నీ దోషములన్నియు మీవేకాని బ్రహ్మవి కావు. మీరు దేనినివిద్యయందురో యదియే అవిద్య.మీ యధ్యారోపముకూడ మిథ్యయే.ఏలయనఁగాఁ దాముబ్రహ్మకానిది తమ్ము బ్రహ్మయనియు,బ్రహ్మను జీవుఁడనియు నమ్ముటఁఇది మిథ్యాజ్ఞానముకాక మఱి యేమగును?సర్వవ్యాప

కుఁడగువాఁడు పరిచ్ఛిన్నుఁడై యజ్ఞానమందును బంధమందు నెన్నఁడునుండఁడు
పరిచ్ఛిన్నుఁడును,ఏకదేశియు అల్పుఁడును,అల్పజ్ఞుఁడు నగు జీవుఁడు అజ్ఞాని
యగునేకాని సర్వజ్ఞుఁడును సర్వవ్యాపియునగు బ్రహ్మ అజ్ఞానికాఁడు.

**ము క్తి బం ధ ము లు:—**

ప్రశ్న:—దేనిని ముక్తి యందురు?

ఉత్తరము:—"ముంచంతి పృథగ్భవంతి జనా యస్యాం సా ముక్తిః"
దేనియందు విడుదల కలుగునో దానికి ముక్తియని పేరు.

ప్రశ్న:—దేనినుండి విడుదల?

ఉత్తరము:—దేనినుండి విడివడుటకు జీవులందరు నిచ్ఛగించుచున్నారో
దానినుండి.

ప్రశ్న:-దేనినుండి విడివడుట కిచ్ఛగించుచున్నారు?

ఉత్తరము:-దేనినుండి తొలఁగఁగోరుదురో దానినుండి.

ప్రశ్న:-దేనినుండి తొలఁగఁగోరుదురు?

ఉత్తరము:-దుఃఖము నుండి.

ప్రశ్న:-తొలఁగి దేనిని పొందుదురు?ఎక్కడనుందురు?

ఉత్తరము:-సుఖమునుపొంది బ్రహ్మయందుందురు.

ప్రశ్న:-ముక్తికాని,బంధము కాని దేనిచేఁ గలుగును?

ఉత్తరము:-పరమేశ్వరునిఆజ్ఞను పాలించుట. అధర్మా విద్యాదుస్సంగ
కుసంస్కార దుష్టవ్యసనములనుండి దూరముగనుండుట,సత్యభాషణము,పరోప
కారము, విద్య,పక్షపాతరహిత న్యాయాచరణము,ధర్మము వీనిని వృద్ధిపఱ
చుట, పూర్వోక్తప్రకారము పరమేశ్వరునిస్తుతి,ప్రార్థనోపాసనలను అనఁగా
యోగాభ్యాసముచేయుట,విద్యను జదువుట చదివించుట,ధర్మపూర్వకముగ పురు
షార్థముచేయుచు జ్ఞానము నున్నతి పఱచుకొనుట. అన్నిటికంటె ఉత్తమసాధ
నములను జేయుట'చేయునదంతయుఁ బక్షపాతములేకుండ న్యాయధర్మానుసార
ముగఁ జేయుట యీ మొదలగుసాధనములచే ముక్తియు,దీనికి విపరీతముగా
అనగా ఈశ్వరాజ్ఞా భంగముచేయుట మొదలగు వానిచే బంధమునుగలుగును.

ప్రశ్న:-ముక్తియందు జీవుఁడు లయమై పోవునా?లేక విద్యమానుఁడై
యుండునా?

ఉత్తరము:-విద్యమానుఁడయియుండును.

ప్రశ్న:- ఎచ్చట నుండును?

ఉత్తరము:-బ్రహ్మయందు.

ప్రశ్న:-బ్రహ్మ యొక్కడ నున్నాఁడు? ఆ ముక్తజీవుఁ డొక స్థలమం దుండునా? లేక స్వేచ్ఛాచారియయి సర్వత్ర సంచరించునా?

ఉత్తరము:- బ్రహ్మయంతటఁ బూర్ణుఁడయి యున్నాడు. అతని యందే ముక్తజీవుఁ డవ్యాహతగతితో సంచరించును. అనఁగా ఎక్కడ నాటంకములేక విజ్ఞానానంద పూర్వకముగ స్వతంత్రుఁడై సంచరించును.

ప్రశ్న:-ముక్తజీవునకు స్థూల శరీరముండునా? ఉండదా?

ఉత్తరము:-ఉండదు.

ప్రశ్న:-మఱి యతఁడెట్లు సుఖము,ఆనందము ననుభవించును?

ఉత్తరము:-అతనికి సత్యసంకల్పము మొదలగు స్వాభావిక గుణము లనెడి సామర్థ్యములన్నియు నుండును.భౌతిక సంబంధ ముండదు.

శృణ్వన్ శ్రోత్రం భవతి, స్పర్శయన్ త్వగ్భవతి, పశ్యన్ చక్షుర్భవతి,
రసయన్ రసనా భవతి, జిఘ్రన్ ఘ్రాణం భవతి.
మన్వానో మనో భవతి, బోధయన్ బుద్ధిర్భవతి,
చేతయంశ్చిత్తం భవత్యహం కుర్వాణో ఽహంకారో భవతి ॥ శతపథ.కాం.౧౪॥

మోక్షమందు భౌతికశరీరముకాని, ఇంద్రియముల గోళకములుకాని జీవాత్మతో నుండవు,తన స్వాభావికశుద్ధగుణములే యుండును. తన స్వశక్తిచే వినవలసినపుడు శ్రోత్రరూపుఁడును. స్పృశింపవలసినపుడు త్వగ్రూపుఁడును,చూడవలసినపుడు చక్షూరూపుఁడును.రుచిచూడవలసినపుడు రసనారూపుఁడును,వాసన చూడవలసినపుడు ఘ్రాణరూపుఁడును,సంకల్ప వికల్ప సమయమందు మనోరూపుఁడును. నిశ్చయింపవలసినపుడు బుద్ధిరూపుఁడును. స్మరింపవలసినపుడు చిత్తరూపుఁడును, అహంకారము చేయవలసినపుడు అహంకారరూపుఁడును నగుచున్నాఁడు ముక్తియందు సంకల్పమనెడు శరీరమే యుండును. శరీరాధారమందుండి యింద్రియగోళముల ద్వారా జీవుఁడు స్వకార్యములను జేయునట్లే ముక్తియందుఁ దన శక్తిచే సమస్తానందముల ననుభవించును.

ప్రశ్న:-అతని శక్తియెంత? అది యెన్నివిధములు?

ఉత్తరము:-ముఖ్యముగా నొకేవిధమైన శక్తి కలదు. కాని బల, పరాక్రమ, ఆకర్షణ, ప్రేరణ, గతి, భీషణ, వివేచన, క్రియా, ఉత్సాహ, స్మరణ, నిశ్చయ, ఇచ్ఛా, ప్రేమ, ద్వేష, సంయోగ, విభాగ, సంయోజక, విభాజక, శ్రవణ,స్పర్శన దర్శనస్వాదనగంధగ్రహణజ్ఞానములను ఇరువదినాల్గువిధముల సామర్థ్యముతో జీవుఁడు కూడియుండును. దీనిచే ముక్తియం దానందమనుభవించును. ముక్తియందు జీవుఁడు లయమగునన్న ముక్తిసుఖము నెవఁడనుభవించును? జీవుని నాశమునే ముక్తియని నమ్మువారు మహామూఢులు. దుఃఖము నుండి విడివడి యానంద స్వరూపుఁడును, సర్వవ్యాపకుఁడు అనంతుఁడునగు పరమేశ్వరునియందు జీవుఁడానందముతో నుండుటయే ముక్తి. ఈ విషయమై వేదాంతమందలి శారీరకసూత్రములందు జూడుఁడు:-

అభావం బాదరిరాహ హ్యేవమ్॥ వేదాంత ద. ౪.౪.౧౦॥

వ్యాసుల తండ్రియగు బాదరి ముక్తియందు జీవునకును, వానితో మనస్సునకును భావముండునని నమ్ముచున్నాఁడు. అనఁగా జీవుఁడును, మనస్సును లయము కావని పరాశరులు నమ్ముచున్నారు. అట్లే:-

భావం జైమిని ర్వికల్పామననాత్॥ వేదాంత ద. ౪.౪.౧౧॥

జైమిన్యాచార్యుఁడు ముక్తపురుషునకు మనస్సువలెనే సూక్ష్మ శరీరమును, ఇంద్రియములును, ప్రాణాదులును కూడ విద్యమానములై యుండునని నమ్ముచున్నాఁడు, అభావము నొప్పఁడు.

ద్వాదశాహవ దుభయవిధం బాదరాయణోఽతః ॥వేదాంత ద. ౪.౪.౧౨॥

వ్యాసముని ముక్తియందు భావాభావములను రెంటిని నమ్ముచున్నాఁడు. అనఁగా జీవుఁడు ముక్తియందు శుద్ధసామర్థ్యముతోఁ గూడియుండుననియు, అపవిత్రత,పాపాచరణము,దుఃఖము,అజ్ఞానము మున్నగునవి యుండవనియు నమ్ముచున్నాఁడు.

యదా పంచావతిష్ఠంతే జ్ఞానాని మనసా సహ ।
బుద్ధిశ్చ న విచేష్టతే తామాహుః పరమాంగతిమ్ ॥కఠోప.అ.౨.వ.౬.మం.౧౦॥

శుద్ధ మనస్సుతోఁగూడి పంచజ్ఞానేంద్రియములుజీవునితోనుండినిశ్చయబుద్ధి స్థిరమయినపుడు దానిని పరమగతి-మోక్షము అందురు.

య ఆత్మా అపహతపాప్మా విజరో విమృత్యుర్విశోకో౽విజిఘత్సో౽పిపాసః సత్యకామః సత్యసంకల్పః సో౽న్వేష్టవ్యః స విజిజ్ఞాసితవ్యః సర్వాంశ్చ లోకానాప్నోతి సర్వాంశ్చ కామాన్ య స్తమాత్మానమనువిద్య విజానాతీతి॥

ఛాందో. ప్ర. ౮. ఖం. ౭. మం. ౧॥

స వా ఏష ఏతేన దైవేన చక్షుషా మనసైతాన్ కామాన్ పశ్యన్ రమతే॥ య ఏతే బ్రహ్మలోకే తం వా ఏతం దేవా ఆత్మాన ముపాసతే తస్మాత్తేషాగ్ం సర్వే చ లోకా ఆత్తాః సర్వే చ కామాః స సర్వాగ్ంశ్చ లోకానాప్నోతి। సర్వాగ్ంశ్చ కామాన్య స్తమాత్మాన మనువిద్య విజానాతీతి॥

ఛాందో. ప్ర. ౮. ఖం. ౧౨. మం. ౫. ౬॥

మఘవన్మర్త్యం వా ఇదగ్ం శరీర మాత్తం మృత్యునా తదస్యా౽మృతస్యా శరీరస్యాత్మనో౽ధిష్ఠానమాత్తో వై సశరీరః ప్రియాప్రియాభ్యాం న వై సశరీరస్య సతః ప్రియాప్రియయోరపహతిర స్త్యశరీరం వావ సంతం న ప్రియాప్రియే స్పృశతః॥ ఛాందో. ప్ర. ౮. ఖం. ౧౨. మం. ౧॥

అపహతపాప్ముఁడగు నే పరమాత్ముఁడు సమస్త పాపజరామృత్యు శోక క్షుధా పిపాసలచే రహితుఁడో, సత్యకాముఁడో, సత్య సంకల్పుఁడో, యతని వెదకి తెలిసికొనుటకు నిచ్ఛగింపవలయును. ఎవఁడా పరమాత్మను దెలిసి మోక్షసాధనములను దన్ను శుద్ధపఱచు కొనుటను దెలియునో ఆ పరమాత్మ సంబంధముచే నా ముక్తజీవుఁడు సమస్త లోకములను, సమస్త కామములనుబొందును.

ఎవరు పరమాత్మ నెఱింగి మోక్షసాధనములను తనను శుద్ధము చేసి కొన నెఱుఁగునో యట్టి ముక్తజీవుఁడు శుద్ధదివ్య నేత్రములచేతను. శుద్ధమనస్సు చేతను గామములను జూచుచును, బొందుచును రమించును. ఎవరుబ్రహ్మలోకము దర్శనీయ పరమాత్మయందు స్థితులై మోక్ష సుఖమునసుభవింతురో సర్వాంతర్యామియగు నా పరమాత్మను ముక్తిని బొందు నేవిద్వాంసులందఱు నుపాసింతురో వారికి సమస్తలోకములును, సమస్త కామములును ప్రాప్తించును. అనఁగా నేయే సంకల్పములఁజేయుచున్నారో ఆయా లోకములను అయా కామములను బొందుదురు. ఆ ముక్తజీవులు స్థూలశరీరమునువదలి సంకల్పమయశరీరముచే నాకాశములోఁ బరమేశ్వరునియందు సంచరింతురు. లౌకికశరీరము గలవారు సాంసారికదుఃఖములనుండి రహితులుకాఁజాలరు.

దీనిని గూర్చి ప్రజాపతి ఇంద్రునికిఁజెప్పిన దేమనఁగా:- ఓ పరమ పూజితుఁడవు ధనయుక్తుఁడవునగు పురుషుఁడా! ఈస్థూల శరీరము మరణధర్మముతోఁగూడినది. సింహముఖమందు మేఁకయుండులాగున నీ శరీరముమృత్యుముఖమం దున్నయది. ఈ శరీరము, మరణమును, శరీరమునులేని జీవాత్మకు నివాసస్థానము. కాబట్టి యీజీవుఁడు సర్వదా సుఖదుఃఖములచే నావరింపబడి యుండును. ఏలయనఁగా శరీరసహితుఁడగు జీవుని సాంసారికప్రసన్నతకు నివృత్తియేయగును. కాని శరీరరహితుఁడగు ముక్తజీవుఁడు బ్రహ్మయందుండునుగాన సతనికి సాంసారికసుఖదుఃఖములంటనే యంటవు. సర్వదా ఆనందమందే యుండును.

ప్రశ్న:- జీవుడు ముక్తినిబొంది మరల జన్మమరణరూప దుఃఖమునకెన్నఁడేని వచ్చునా? రాఁడా? ఏలయనఁగా:-

న చ పునరావర్తతే న చ పునరావర్తతే ఇతి ॥ఛాందో. ప్ర. ౮. ఖం. ౧౫.॥
అనావృత్తిః శబ్దాదనావృత్తిః శబ్దాత్ ॥వేదాంత ద. అ. ౪. పా. ౪. సూ. ౨౨॥
యద్ గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ ॥భగవద్గీతా. ౧౫. ౬॥

ఇత్యాది వచనములవలన. దేని నుండి నివృత్తులై మరల సంసారమం దెన్నటికిని రారో యదేముక్తియని విదితమగుచున్నది.

ఉత్తరము:- ఇది సరి కాదు. వేదమందిది నిషేధింపఁ బడియున్నది. చూడుఁడు:-

కస్య నూనం కతమస్యామృతానాం మనామహే చారు దేవస్య నామ ।
కో నో మహ్యా అదితయే పునర్దాత్ పితరం చ దృశేయం మాతరం చ ॥
ఋ. మం. ౧. సూ. ౨౪. మం. ౧. ॥

ప్రశ్న:-మన మెవనినామమును పవిత్రమని తెలియవలయును? సర్వదా నాశరహిత పదార్థములందు వర్తమానుఁడైయుండు ప్రకాశ స్వరూపుఁడగు దేవుఁడును, ముక్తి సుఖమననుభవింపఁజేసి మరల నీ సంసారమందు జన్మమిచ్చి మాకు తలిదండ్రుల దర్శనము చేయించువాఁడునెవ్వఁడు?
అగ్నేర్వయం ప్రథమస్యామృతానాం మనామహే చారు దేవస్య నామ ।
స నో మహ్యా అదితయే పునర్దాత్ పితరం చ దృశేయం మాతరం చ ॥ఋ।౧।౨౪.౨॥

ఉత్తరము:- మనలను ముక్తియందానంద మనుభవింపఁజేసి పృథివి మీఁద మరల తలిదండ్రుల సంబంధముగల జన్మమిచ్చి తలిదండ్రుల దర్శన

ముఁజేయించునో ఆ పరమాత్మయే ముక్తివ్యవస్థను చేయుచునందఱకుస్వామి యయియున్నాఁడు మన మా స్వప్రకాశస్వరూపుఁడును, అనాదియు, సర్వదా ముక్తుఁడునగు పరమాత్మనామమునే పవిత్రమని తెలియవలయును.

ఇదానీమివ సర్వత్ర నాత్యంతోచ్ఛేదః ॥సాంఖ్య. అ. ౧. సూ. ౧౫౯॥

ఈ సమయమందెట్లు బంధముక్త జీవులున్నారో యట్లే సర్వదా యుందురు. బంధమోక్షములకెన్నఁడు నత్యంతవిచ్ఛేదము కలుగదు, కానబంధమోక్షములు శాశ్వతములు కావు.

ప్రశ్న:- తదత్యంతవిమోక్షోఽపవర్గః ॥న్యాయ ద.అ.౧.ఆ.౧.సూ.౨౨॥
దుఃఖజన్మ ప్రవృత్తిదోషమిథ్యాజ్ఞానానాముత్తరోత్తరాపాయే ।
తదనంతరాపాయాదపవర్గః ॥న్యాయ ద. అ. ౧.ఆ.సూ,౨॥

దుఃఖాత్యంత విచ్ఛేదమే ముక్తి యనఁబడును, ఏలయనఁగా మిథ్యాజ్ఞానమనెడు అవిద్య లోభాది దోషములు విషయములనెడు దుష్ట వ్యసనమునందుఁ బ్రవృత్తి, జన్మము, దుఃఖము, అనునివి యొకటివెనుక నొకటి-ఉత్తరోత్తరము-నశించి పూర్వపూర్వములు నివృత్తియగుట వలననే శాశ్వత మోక్షమగును.

ఉత్తరము:- అత్యంతమను శబ్దముచే నత్యంతాభావమేయనిగ్రహించుట యనావశ్యకము. ఎట్లనగా:-"అత్యంతం దుఃఖమత్యంతం సుఖంచాస్యవర్తతే" ఈ మనుష్యునకు నత్యంత దుఃఖమును నత్యంత సుఖమునున్నదనిన, ఇతనికి మిక్కిలిసుఖముకాని మిక్కిలి దుఃఖము కాని యున్నదనియే విదితమగుచున్నది. అట్లే యిక్కడను అత్యంతశబ్దార్థమును దెలిసికొనవలయును.

ప్రశ్న:- ముక్తినుండి జీవుఁడు మరలవచ్చెనేని అతఁడెంతసమయము వఱకు ముక్తియం దుండును?

ఉత్తరము:-
తే బ్రహ్మలోకే హ పరాంతకాలే పరామృతాత్ పరిముచ్యంతి సర్వే॥
ముండక. ౩౦. ౨. మం ౬॥

ఆ ముక్తజీవులు ముక్తినిబొంది బ్రహ్మయం దానందమును బరాంత కాలమువఱ కనుభవించి మహాకల్పమునకుఁ బిమ్మట ముక్తిసుఖమును వదలి మరల సంసారమునకు వచ్చుచున్నారు. పరాంతకాల మనఁగా:-నలువదిమూడు లక్షల యిరువదివేల వర్షములొక చతుర్యుగము; రెండువేల చతుర్యుగము లొక

యహోరాత్రము; అట్టి ముప్పదియహోరాత్రము బ్రాహ్మ మాసము, అట్టి పండ్రెండు మాసము బ్రాహ్మ వర్షము, అట్టి నూఱువర్షము బ్రాహ్మపరాంతకాలము. దీనిని గణిత రీతిని చక్కఁగా దెలిసికొనుఁడు. ఇంతసమయము ముక్తియందు సుఖ మనుభవింప నగును.

ప్రశ్న:-మరల జన్మమరణము లెన్నఁడు పొందరని సమస్త ప్రపంచమును, గ్రంథకారులును నభిప్రాయ పడుచున్నారుగద.

ఉత్తరము-ఇది యెన్నటికి సరిగాదు. ఏలయనఁగా జీవుని సామర్థ్యమును, శరీరాది పదార్థములును, సాధనములును, పరిమితములు. కాన వానిఫల మనంత మెట్లుకాఁగలదు ? అనంతానంద మనుభవించుట కనంత సామర్థ్యమును, గర్మమును, సాధనములును జీవులయందు లేవు కాఁబట్టి యనంతసుఖ మనుభవింపఁజాలరు. వేని సాధనము లనిత్యములో వానిఫల మెన్నఁటికిని నిత్యము కానేరదు. ఇఁక ముక్తినుండి యెవ్వఁడును దిరిగి యీ సంసారమునకు రాఁడేని సంసారము ఉచ్ఛేద మయిపోవును అనఁగా జీవులు నిశ్శేషులై పోవలసి వచ్చును.

ప్రశ్న:-ఎందఱుజీవులు ముక్తులగుదురో క్రొత్తజీవులనందఱను ఈశ్వరుఁడు సంసారమం దుత్పన్నముచేసియుంచును. కాఁబట్టి నిశ్శేషులు కారు.

ఉత్తరము:-అట్లగునేని జీవుఁడు అనిత్యుఁడై పోవును. ఏలయనఁగా నుత్పన్నమగునది యవశ్యము నశించును. ఇఁక మీమతానుసారముము క్తినిబొంది యు నశించును. మఱి ముక్తి యనిత్యమయ్యెను. ముక్తిస్థానమునందు గొప్ప దొమ్మియుజరుగును. ఆదాయమట నధికమయి వ్యయములేకపోవుటచే వృద్ధికి మేరలేకపోవును. ఇదియుఁగాక దుఃఖానుభవములేకున్న సుఖమేమియుఁగలుగఁజాలదు కారములేదేని తీపేమి? తీపిలేదేని కారమని దేని ననవలయును? ఒక రుచిగల పదార్థమునకు విరుద్ధముగ మఱియొకటి యుండుటచేతనే రెంటిని పరీక్షింపగలుగుచున్నాము. అన్నిరసములను భుజించు వానికిఁ గలుగునట్టి సుఖము కేవల మధురపదార్థములనే సేవించు వానికిఁ గలుగదు. ఈశ్వరుఁడు అంతముగల కర్మముల కనంతఫలమిచ్చునేని యతని న్యాయము నష్టమైపోవును. ఎవఁ డెంతభారమును వహింపగలఁడో వానిపై నంతభారమును బెట్టుటయే బుద్ధిమంతులపని. ఒక మణుగుబరువును మోయఁగల వాని తలమీఁదఁ బదిమణుగుల బరువును మోపువాఁడు నిందితుఁడగునట్లే అల్పజ్ఞుఁడును, అల్పసామర్థ్యము గల

వాఁడునగు జీవునిమీఁద ననంత సుఖభారమును మోపుట యీశ్వరునకు యుక్తముకాదు. పరమేశ్వరుఁడు క్రొత్తజీవుల నుత్పన్నము చేయునేని వాని నేకారణముతో నుత్పన్నము చేయునో యదియును ముగిసిపోవును. ఏలయనఁగా నెంత గొప్ప ధనకోశమున్నను ఆయములేక వ్యయమే యుండునేని, ఒకనాఁడు గాకున్న నొకనాఁడు దివాలా తీయనేతీయును. కాఁబట్టి ముక్తినిబొంది జీవుఁడు మరల నచ్చటి నుండి వచ్చుననుటయే సమంజసము. కొద్దిరోజుల కారాగారమునకంటె జన్మకారాగారమును, మరణదండనను మంచిదని యెవ్వఁడేని నమ్మఁగలఁడా? అక్కడి నుండి వచ్చుటయే లేదేని జన్మకారాగారము నకును, మోక్షమునకును భేదమేముండును? అనఁగా నక్కడ కూలి చేయవలసిన యవసరముండదనుటయే. ఇఁక బ్రహ్మయందు లయమగుననుట సముద్రమందుబడి చచ్చుటయే యనఁదగును.

ప్రశ్న:-పరమేశ్వరుఁడెట్లు నిత్యముక్తుఁడును పూర్ణసుఖియో అట్లే జీవుఁడును నిత్యముక్తుఁడును సుఖియు నగునేని దోషమేమియు నుండదుగదా?

ఉత్తరము:-పరమేశ్వరుఁడు, అనంత సామర్థ్యయుక్తుఁడు. అనంత గుణకర్మ స్వభావములుగలవాఁడు. కాఁబట్టి యతఁడెన్నఁడును అవిద్యయందును దుఃఖబంధనములందును బడఁజాలఁడు. జీవుఁడు ముక్తినిబొంది శుద్ధస్వరూపుఁడైనను అల్పజ్ఞుఁడును, పరిమిత గుణకర్మస్వభావములు కలవాఁడు నయియుండును. పరమేశ్వరునివంటివాఁడెన్నఁడును గాఁడు.

ప్రశ్న:-ఇట్టి ముక్తియు జన్మమరణముల వంటిదే. కాఁబట్టి ముక్తి కొఱకు శ్రమపడుట వ్యర్థము.

ఉత్తరము:-ముక్తి జన్మమరణములవంటిది కాదు. ఏలయనఁగా ముప్పది యాఱువేల పర్యాయముల సృష్టిలయముల కెంతసమయము పట్టునో యంత సమయము వఱకు దుఃఖమునుండి విడివడి ముక్తిని బొందిన జీవులానంద మనుభవించుట సామాన్యమా? నేఁడు తినుచుఁద్రాగుచునున్నారు. మరల రేపు తిర కలుగనున్నదికద. ఇఁక దానికొఱకేయుపాయముఁ జేయుచున్నారు? ఆఁకలి, దప్పిక, ధనము, రాజ్యము, ప్రతిష్ఠ, స్త్రీ, సంతానము మొదలగువాని కొఱకుపాయముచేయుట యావశ్యకమయినపుడు ముక్తికొఱకు [illegible] యావశ్యక మేలఁగాదు? మృతినొందుట నిశ్చయమైయున్నను

యము చేయునట్లే ముక్తినుండి మరల జన్మమునకు రావలసియున్నప్పటికిని తత్ప్రయత్న మావశ్యకమనుట స్పష్టము

ప్రశ్న:-ముక్తికి సాధనములెవ్వి?

ఉత్తరము:-కొన్నిసాధనములు మొదటనే వ్రాయఁబడినవి. కాని విశేషోపాయము లెవ్వియనఁగా:-ముక్తినిగోరువారు, దుఃఖఫలమునిచ్చు మిథ్యాభాషణాది పాపకర్మములనువదలి సుఖఫలమునిచ్చు సత్యభాషణాది ధర్మాచరణములొనర్చి జీవన్ముక్తులు కావలెను. దుఃఖమునుండి విడిపడి సుఖమును బొందఁగోరువారు అధర్మమును వదలి, ధర్మమునవశ్యము చేయవలయును ఏలయనఁగా దుఃఖమునకుఁ బాపాచరణము, సుఖమునకు ధర్మాచరణము మూలకారణములు. సత్పురుషుల సంగతిచే సత్యాసత్య, ధర్మాధర్మ, కర్తవ్యాకర్తవ్యములను వేఱు వేఱుగ నిశ్చయింపఁజేయు వివేకమును బొందవలయును. శరీరము-జీవుఁడు పంచకోశములు - వీని వివేచన చేయవలయును. అవి యెవ్వియనఁగా:-

ఒకటి "అన్నమయకోశము" ఇది త్వక్కు మొదలుకొని యస్థి పర్యంతముగల దేహభాగము, పృథ్వీమయము. రెండవది:"ప్రాణమయ కోశము", అనఁగా బయటినుండి లోనికిఁబోవు ప్రాణము, లోపలినుండి వెలికిబోవు 'అపానము', నాభిస్థలమందుండి శరీరమందంతట రసమును వ్యాపింపఁజేయు సమానము, కంఠమందలి అన్నపానముల నాకర్షించుచు బలపరాక్రమములను గలిగించు ఉదానము, శరీరమంతటను చేష్టాది కర్మములొనర్చుచు జీవునకుపయోగించు వ్యానము అను నీ పంచప్రాణములతోఁగూడినది. మూఁడవది: 'మనోమయ కోశము' దీనియందు మనస్సుతోడి అహంకారమును, వాక్పాణి పాదపాయూపస్థలను పంచకర్మేంద్రియములును గలవు. నాల్గవది:'విజ్ఞానమయ కోశము.' దీనియందు జీవుని జ్ఞానాది వ్యవహారముల కుపయోగించు బుద్ధియు, చిత్తమును, శ్రోత్ర త్వక్ చక్షుర్జిహ్వాఘ్రాణములను పంచజ్ఞానేంద్రియములును గలవు. ఐదవది: 'ఆనందమయకోశము' దీనియందుఁ బ్రీతి, ప్రసన్నత న్యూనానంద, అధికానందములును, ఆధారమగు కారణరూపప్రకృతియుఁగలవు. ఇవి పంచకోశములనఁబడును. వీనిచేతనే జీవుఁడు సమస్తవిధములగు కర్మోపాసనా జ్ఞానాది వ్యవహారములను జేయును.

అవస్థలు మూఁడు:-ఒకటి జాగ్రదవస్థ, రెండవది స్వప్నావస్థ, మూఁడవది సుషుప్త్యవస్థ.

శరీరములు మూఁడు:-ఒకటి కనఁబడుస్థూలశరీరము. రెండవది పంచప్రాణములు, పంచజ్ఞానేంద్రియములు, పంచసూక్ష్మ భూతములు, మనస్సు, బుద్ధి యను నీ పదునేడుతత్వములతోఁగూడిన సూక్ష్మశరీరము ఈ సూక్ష్మశరీరము; జన్మమరణాదులయందును జీవునితోనుండును. ఇది ద్వివిధము. ఒకటి లౌకికము-సూక్ష్మ భూతముల యంశములచేఁ జేయఁబడినది. రెండవది స్వారాజిక గుణరూపమైనది. ఈ రెండవ యలౌకికశరీరము ముక్తియందునుండును. దీనితోడనే జీవుఁడు ముక్తియందు సుఖమనుభవించును. మూఁడవది కారణశరీరము. దీనియందు జీవుఁడు సుషుప్తిని-గాఢనిద్రను-బొందును. ఇది ప్రకృతి రూపమగుటచే సర్వత్ర విభువై జీవులందఱకు నొక్కటిగానున్నది. నాల్గవది తురీయశరీర మనఁబడును. దీనియందు సమాధిచేఁ (బరమాత్ముని) యానందస్వరూపమున జీవులు మగ్ను లగుదురు. ఈ సమాధివలని సంస్కారజన్యమగు శుద్ధశరీర ప్రభావమే ముక్తియందును దగిన సహాయకారియై యుండును. ఈ సమస్త కోశముల నుండియు, అవస్థలనుండియు జీవుఁడు వేఱయియున్నాడు.

అవస్థలను:డి జీవుఁడు వేఱుగానున్నాఁడనుట యందఱకు విదితమే. ఏలయనఁగా:- మృత్యువును బొందినపుడు జీవుఁడు వెడలిపోయెనని అందఱును జెప్పుదురు. కాన నీ జీవుఁడే అన్నిటికిఁబ్రేరకుఁడు. అన్నిటిని ధరించువాఁడు, సాక్షి, కర్త, భోక్తయు ననఁబడును. ఎవ్వడేని, జీవుఁడు కర్తయు, భోక్తయు గాడనెనేని వాఁడు అజ్ఞాని, వివేకములేనివాఁడని తెలియవలయును. ఏలయనఁగా జీవుఁడు లేనిచో ఈ సమస్త జడపదార్థములకు సుఖదుఃఖముల అనుభవము కాని, పాపపుణ్య కర్తృత్వము కాని కలుగఁజాలదు. కాని వీని సంబంధముచే జీవుఁడు పాపపుణ్యముల కర్తయు, సుఖదుఃఖముల భోక్తయు నగుచున్నాఁడు. ఇంద్రియములను వానివాని విషయములతోను, మనస్సునింద్రియములతోను, ఆ మనస్సుతో తాను సంయుక్తమై యాత్మ ప్రాణములను బ్రేరేపించి మంచి చెడు కర్మములయందు లగ్నమయినపుడే బహిర్ముఖమగును. అప్పుడే లోపలినుండి మంచి కార్యములందానందమును, ఉత్సాహమును, నిర్భయత్వమును, చెడుకార్యములయందు భయమును, శంకయు, లజ్జయు, నుత్పన్న

ములగును. అది యంతర్యామియగు పరమాత్మునిచేఁగలుగు శిక్ష. ఈ శిక్షను కూలముగ వర్తించువాఁడే ముక్తి జన్యసుఖమును పొందును. దీనికి విపరీతముగ వర్తించువాఁడు బంధజన్య దుఃఖమును నుభవించును.

రెండవ సాధనము వైరాగ్యము :- వివేకముచే సత్యాసత్యములను దెలిసి, సత్యాచరణము గ్రహించి అసత్యాచరణము వదలుట యోగ్యము. పృథివి మొదలుకొని పరమేశ్వరపర్యంతమగు పదార్థముల గుణ కర్మస్వభావములను దెలిసి పరమేశ్వరుని ఆజ్ఞాపాలనమందును, ఉపాసనయందును దత్పరుడై, అతనికి విరుద్ధముగా వర్తింపక సృష్టిచేనుపకారముగొనుట వివేకమనఁబడును.

మూడవ సాధనము: 'షట్కసంపత్తి':- ఆఱు ప్రకారముల కర్మము జేయుట. ఒకటి:- "శమము" తన ఆత్మాంతఃకరణములను అధర్మాచరణము నుండి తొలగించి ధర్మాచరణమందు సర్వదా ప్రవర్తింపఁజేయుట. రెండవది: "దమము" శ్రోత్రాది ఇంద్రియములను, శరీరమును, వ్యభిచారాది చెడుకార్యముల నుండి తొలగించి జితేంద్రియత్వాది శుభ కర్మములయందుఁ బ్రవర్తింపఁజేయుట. మూఁడవది:- "ఉపరతి" దుష్టకర్మలొనరుచు పురుషుల నుండి నిరంతరము దూరముండుట. నాల్గవది:- "తితిక్ష" నిందాస్తుతి హాని లాభములెన్ని కలిగినను హర్షశోకములను వదలి ముక్తిసాధనములందుఁదగిలి యుండుట. అయిదవది:- "శ్రద్ధ" వేదాది సత్యశాస్త్రములందును, వానినెఱిగిన పూర్ణ ఆప్తులు, విద్వాంసులు, సత్యోపదేష్టలునగు మహాశయుల వచనములందును విశ్వాసముంచుట. ఆఱవది:- "సమాధాన" చిత్తైకాగ్రత. ఈ యాఱునుగలసి మూఁడవ సాధనమనఁబడును.

నాల్గవ సాధనము:- "ముముక్షుత్వము" అనఁగా ఆఁకలి దప్పికగొన్న వారికి అన్న జలములుదప్ప మఱియేదియు బాగుగఁదోఁచనట్టు ముక్తిసాధనములందుఁదప్ప మఱి దేనియందును ప్రీతిలేకుండుట. ఇవి నాలుగుసాధనములు.

ఈ సాధనములకుఁ బిమ్మటఁ జేయవలసిన కర్మములు అనుబంధము లనఁబడును. అవి నాలుగు. పైఁ జెప్పబడిన నాలుగు సాధనములచే యుక్తుఁడగు పురుషుఁడే మోక్షమునకధికారి యగుచున్నాఁడనునది యొకటి. రెండవది 'సంబంధము' ప్రతిపాద్యమైన బ్రహ్మప్రాప్తి రూపమగు ముక్తిని వేదాది

శాస్త్ర ప్రతిపాదకములను యథావిధిఁ దెలిసి యన్వితముఁ జేయుట. మూడవది 'విషయ' సమస్త శాస్త్రముల ప్రతిపాదన విషయమగు బ్రహ్మమును బొందుటయను విషయముతోఁ గూడియుండుట. నాల్గవది 'ప్రయోజనము' సమస్త దుఃఖముల నివృత్తియుఁ బరమానంద ప్రాప్తియుఁ గలిగి ముక్తి సుఖమును బొందుట. ఈ నాలుగును అనుబంధములు.

పిమ్మట 'శ్రవణచతుష్టయము':- ఒకటి 'శ్రవణము' విద్వాంసులెవరేని ఉపదేశము చేయునపుడు శాంతముగా ధ్యానముతో వినవలయును. విశేషించి బ్రహ్మవిద్యను వినుటయందత్యంత ధ్యానముంచవలయును. ఏలయనఁగానిది యన్ని విద్యలలోను సూక్ష్మమయినది. రెండవది, "మననము" ఏకాంత దేశమందుఁ గూర్చుండి విన్నదానిని గూర్చి విచారింపవలయును. ఏదేని విషయమందు శంకకలిగిన మరల నడుగవలయును. వినునప్పుడు గూడ వక్తయు, శ్రోతయు నుచితమని యెంచిరేని, అడుగవలయును, సమాధానము చెప్పవలయును. మూఁడవది 'నిదిధ్యాసనము':- వినుటచేతను మననముచేయుచేతను సందేహరహితుఁడయినపుడు, అది యెట్లువినెనో, విచారించెనో అట్లే యున్నదా లేదాయని సమాధిస్థుఁడై ధ్యానయోగముచేఁ జూడవలయును. నాల్గవది 'సాక్షాత్కారము' పదార్థముల స్వరూపములను, గుణములను, స్వభావములను ఉన్నదియున్నట్లు తెలిసికొనుట. ఇది శ్రవణచతుష్టయ మనఁబడును. తమోగుణముల నుండి అనఁగా క్రోధము, మాలిన్యము, ఆలస్యము, ప్రమాదము, మొదలగువాని నుండియు, రజోగుణములనుండి అనఁగా ఈర్ష్య, ద్వేష, కామ, అభిమాన, విక్షేపాదులనుండియుఁ దొలఁగి సత్త్వరూపములగు శాంత ప్రకృతి, పవిత్రత, విద్య, ఆలోచన మొదలుగాఁగల గుణములు వహింపవలయును. (మైత్రి) సుఖముగానున్నవారియందు మిత్రత్వము. (కరుణ) దుఃఖితులగువారిమీఁద దయ. (ముదిత)పుణ్యాత్ములఁ జూచి సంతోషించుట. (ఉపేక్ష) దుష్టాత్ములయందుఁ బ్రీతికాని వైరముకాని యుంచకుండుట.

ముముక్షువు ప్రతినిత్యము కనీసము రెండుగంటలయినను మనస్సు మొదలగు పదార్థముల సాక్షాత్కారమగుటకు, అవశ్యముగ ధ్యానము చేయవలయును. చూడుఁడు! మనము చేతనస్వరూపులము కాబట్టి జ్ఞానరూపులమై మనస్సునకు సాక్షిగానున్నాము. మనస్సు శాంతముగను, చంచలముగను,

ఆనందయుక్తముగను లేక విషాదమయముగ నున్నపుడే దానిని యదారీతిని జూచుచున్నాము. అట్లే ఇంద్రియములను, ప్రాణము మొదలగువానిని దెలియువాఁడును, పూర్వము చూచిన దానిని స్మరించువాఁడును, ఒక్క కాలమందనేక పదార్థములను దెలియువాఁ[illegible] ఆకర్షణలను జేయువాఁడునగు జీవుఁడీ యన్నిటి నుండి వేఱయియున్నాఁడు. వేఱుగాలేకున్న స్వతంత్రకర్తయు, వీని కిఁ బ్రేరకుఁడును, అధిష్ఠాతయు నెన్నటికిని గాఁజాలకుండెడివాఁడు.

అవిద్యాఽస్మితారాగద్వేషాభినివేశాః పంచ క్లేశాః ॥ యోగశాస్త్ర. పాద. ౨ సూ. ౩.॥

వీనియందలి అవిద్య స్వరూపము ముందే చెప్పఁబడినది. వేఱుగానుండు బుద్ధిని ఆత్మకంటె భిన్నముగాఁ దెలియకుండుట అస్మిత; సుఖమందుఁ బ్రీతి-రాగము, దుఃఖమందు అప్రీతి-ద్వేషము, 'సర్వదా నేను శరీరస్థుఁడనై యుండ వలయును చావఁగూడదు' అను నిచ్చ ప్రాణిమాత్రమున కుండునుగదా! ఈ మృత్యుదుఃఖమువలని త్రాసమే అభినివేశము. యోగాభ్యాస విజ్ఞానములచే నీ పంచక్లేశములనుండి విడివడి బ్రహ్మమును బొంది పరమమగు మోక్షానందము ననుభవింపవలయును.

ప్రశ్న:—మీరునమ్ము ముక్తివలె నితరులెవ్వరు నమ్మరు. చూడుఁడు! జైనులు శివపురికిఁబోయి అందు మోక్షశిలపై నూఱక కూర్చుండుటయు; క్రైస్తవులు నాల్గవ యాకాశమునుజేరి యచ్చట వివాహము, జగడము, ఆట, పాట, వస్త్రాదుల ధారణము మొదలగువానిచే నానందము నొందుటయు; మహమ్మదీయులు ఏడవయాకాశమును,వామమార్గులు శ్రీపురమును, శైవులు కైలాసమును, వైష్ణవులు వైకుంఠమును, గోకులపు గోసాయులు గోలోకమునుజేరి యచ్చట సుందరస్త్రీలను, అన్నపానవస్త్ర స్థానాదులనుబొంది యానందమునొందుటను ముక్తియని నమ్ముచున్నారు పౌరాణికులు (సాలోక్యము) ఈశ్వరుని లోకము నందువసించుట, (సానుజ్యము) తమ్మునివలె నీశ్వరునితోఁ గూడియుండుట. (సారూప్యము)ఉపాసనీయ దేవునియాకృతివలెనగుట. (సామీప్యము) సేవకుని వలెనీశ్వరుని సమీపమందుండుట, (సాయుజ్యము) ఈశ్వరునితో సంయుక్తుఁడై యుండుట అను నీయయిదువిధముల ముక్తిని నమ్ముచున్నారు.

ఉత్తరము:—(పం)డెండవ సముల్లాసమందు జైనులయు, పదమూఁడవ సముల్లాసమునందుక్రైస్తవులయు,పదునాల్గవ సముల్లాసమందుమహమ్మదీయులయు

ముక్తి మొదలుగాఁగల మతవిషయములు వ్రాయఁబడును.)వామమార్గులు శ్రీపుర మునకుఁ బోయి మద్యముఁ ద్రాగుచు, మాంసమునుదినుచు లక్ష్మివంటి-సుంద రమైన స్త్రీలను-బొంది క్రీడాదులు సలుపుటను ముక్తి యనుచున్నారు. ఇక్కడి కంటె నెక్కడి విశేష మేమియుగానరాదు. ఆ మహాదేవునివంటియు, విష్ణువు వంటియు నాకృతికలవారై పార్వతివంటియు లక్ష్మివంటియు స్త్రీలతోఁ గూడి యానందమనుభవింతురన్న నిక్కడి ధనాఢ్యులకంటెను, రాజుల కంటెను అధి కులు గాజాలరు. ఇఁకనక్కడ రోగరహితులై సంతతము యువావస్థయందుందు రని వ్రాయుచున్నారు,కాని వారియీ మాట సత్యముకాదు. ఏలయనఁగా నెక్కడ భోగమో అక్కడ రోగమును, ఎక్కడ రోగమో అక్కడ వార్ధక్యము నవశ్య ముగా సంభవించును.

ఇఁక పౌరాణికుల నిట్లడుగవలయును. "మీరు నమ్ముచున్న నాల్గుప్రకా రముల ముక్తి క్రిమికీట పతంగ పశ్వాదులకుఁగూడ స్వతఃసిద్ధముగఁ బ్రాపించి యున్నదని"చెప్పవలయును. ఏలయనఁగా నెన్ని లోకములున్నవో యవన్నియు నీశ్వరునివే కదా సమస్త జీవులును వానియందే వసించుచున్నారు. కాఁబట్టి సాలోక్యముక్తి అనాయాసముగ నందఱకును ప్రాపించియే యున్నది. ఈశ్వ రుఁడు సర్వత్ర వ్యాప్తుఁడగుటచే నందఱు నతని సమీపముననే యున్నారు. కాఁబట్టిసామీప్యముక్తియు స్వతఃసిద్ధమయ్యేయున్నది. జీవుఁడు ఈశ్వరునికంటె నన్నివిధముల చిన్నవాఁడయి, చేతనుఁడగుటచే స్వతఃసిద్ధముగనే బంధువువలె నున్నాఁడు. కాఁబట్టి సానుజ్యముక్తియుఁ బ్రయత్నము లేకయే సిద్ధించియున్నది. సమస్తజీవులు సర్వవ్యాపకుఁడగు పరమాత్మయందు వ్యాప్యులగుటచే సంయు క్తులై యున్నారు. కాఁబట్టి సాయుజ్యముక్తియు స్వతఃసిద్ధమయియున్నది." మరణము నొందుటవలనఁ దత్త్వములు తత్త్వములతోఁ గలసి పరముక్తి కలుగుచున్నదనిఅన్యసాధారణనాస్తికులుచెప్పుముక్తి కుక్క-, గాడిదె మొదలగు వానికిఁగూడ లభించుననుట. ఇవి ముక్తులుకాక యొకవిధమయిన బంధనములు. ఏలయనఁగా వీరు శివపురము, మోక్షశిల,నాల్గవయాకాశము,ఏడవయాకాశము, శ్రీపురి, కైలాసము, వైకుంఠము, గోలోకము అను నేదో యొక దేశమందలి స్థానవిశేషములను ముక్తియని నమ్ముచున్నారు. ఆ స్థలమునుండి దూరమయి లేని ముక్తి వదలిపోవును. ఇఁక పంద్రెండు ఱాంవర్య దృష్టింతమున

ఏకాంతవాస కారాగార మందుండు వారివలె వారు బంధనమందుందురు. కాన నిరాతంకముగ నిష్టమైనస్థలములం దంతట సంచరించుటయే ముక్తి యన నొప్పును. అందు భయముకాని, శంకకాని, దుఃఖముకాని కలుగదు. జన్మమన నుత్పత్తి. మరణమన ప్రలయము. సమయము వచ్చినపుడు జన్మమెత్తుదురనుట స్పష్టము.

ప్రశ్న:-జన్మ మొక్కటా? అనేకములా?

ఉత్తరము:-అనేకములు.

ప్రశ్న:-అనేకములైన పూర్వపు జన్మమరణముల విషయము లేం తెలియవు?

ఉత్తరము:-జీవుఁడు అల్పజ్ఞుఁడు. త్రికాలదర్శి కాఁడు కాఁబట్టి స్మరణ యుండదు. ఏ మనస్సుతో నెఱుగుచున్నాఁడో యదియును రెండు విషయముల నొకటే సమయమందుఁ దెలిసికొనఁజాలదు పూర్వజన్మపు మాట యటుండ నిందు. ఈ జన్మమందే గర్భమందు జీవుఁడుండినప్పుడును, శరీరమేర్పడి జన్మించినపిమ్మట నయిదవయేటివఱకును జరిగిన సంగతులేల స్మరణకురావు? జాగ్రత్ స్వప్నావస్థలందును అనేక వ్యవహారములను ప్రత్యక్షముగాఁ జేయును గదా. సుషుప్తి అనఁగా గాఢనిద్రయం దావ్యవహారము లేలస్మరణకు రావు? మిమ్మెవ్వరేని యింద్రేండేండ్లకుముందు పదుమూఁడవయేఁట నైదవమాసపు తొమ్మిదవదినము పగలు పదిగంటల మొదటినిమిషమందు మీరేమిచేసితిరి? మీముఖము, చేతులు, చెవి, కన్ను, శరీరము ఏవైపున నెట్లుండెనని యడిగిన మేని జెప్పగలరా? మఱియు మీమనస్సులం దేమియాలోచనలుండెను? ఈ జన్మమందే యిట్లుండునపుడు పూర్వజన్మపు స్మరణను గూర్చి శంకచేయుట పసితనపుమాట. స్మరణ లేకపోవుటచేతనే జీవుఁడు సుఖియైయున్నాఁడు. లేకున్న నన్నిజన్మల దుఃఖములను జూచి చూచి దుఃఖితుడై మృతినొందును. ఎవ్వఁడేని పూర్వజన్మము అంతకు మునుపటి జన్మముల వర్తమానములను దెలిసికొన దలఁచినను దెలిసికొనఁజాలఁడు. ఏలయనఁగా జీవుని జ్ఞానమును, స్వరూపమును అల్పము. దీని నీశ్వరుఁడు తెలియుట కర్హుఁడు కాని జీవుఁ డెఱుఁగనేరఁడు.

ప్రశ్న:— జీవునకుఁ బూర్వజ్ఞానములేనపుడు వాని నీశ్వరుఁడు దండించినను జీవుఁడు తన్ను సవరించుకోఁజాలఁడు. ఏలయనఁగా నేను ఫలానా కార్యము

చేసి యున్నందులకు నాకీ ఫలము కలిగినదని తెలిసినపుడే జీవుఁడు పాపకర్మములనుండి తొలఁగియుండఁ గలుగును.

ఉత్తరము:- మీరెన్నివిధముల జ్ఞానమును నమ్ముచున్నారు?

ప్రశ్న:-ప్రత్యక్షాదిప్రమాణములచే నెనిమిది విధముల జ్ఞానమును.

ఉత్తరము:- మీరు జన్మము మొదలు ప్రతిక్షణమున రాజ్యము, ధనము, బుద్ధి, విద్య, దారిద్ర్యము, బుద్ధిలేనితనము, మూర్ఖత్వము మొదలగు సుఖదుఃఖములను ప్రపంచమందుఁ జూచుచున్నప్పుడు, మీకుఁ బూర్వజన్మజ్ఞానమేలఁ గలుగదు? ఒక వైద్యునకును, అవైద్యునకును ఏదేని రోగము సంభవించెనేని దాని కారణమును వైద్యుడు తెలిసికొనును. మూర్ఖుడు తెలిసికొనఁజాలడు. వైద్యుఁడు వైద్యశాస్త్రము జదివినాఁడు. ఇతరుఁడు చదువలేదు. కాని జ్వరాదిరోగములు కలిగెనేని అవైద్యుఁడు గూడ నేనేమో అపథ్యముజేసితిని కాఁబట్టి నా కీరోగము కలిగినదని మాత్రము తెలిసికొనగలఁడు. అట్లే జగత్తునందు విచిత్రములగు సుఖదుఃఖాదుల వృద్ధిక్షయములను జూచి పూర్వ జన్మమును అనుమానముచే నేలఁ దెలిసికొనరు? పూర్వజన్మమును నమ్మకుందురేని పరమేశ్వరుఁడు పక్షపాతియైపోవును. ఏలయనఁగా పాపములేకయే దారిద్ర్యాది దుఃఖములను, పూర్వసంచితపుణ్యము లేకయే రాజ్యమును, ధనాఢ్యత్వము నిచ్చినవాఁడగును అది అన్యాయము. పూర్వజన్మపు పాపపుణ్యానుసారమే సుఖదుఃఖముల నిచ్చినందులకా పరమేశ్వరుఁడు సరియైన న్యాయకారి యన నొప్పును.

ప్రశ్న:- ఒకటే జన్మమును నమ్మటచేతను గూడ పరమేశ్వరుఁడు న్యాయకారి కావచ్చును. ఎట్లనఁగా అందఱకంటె పైనుండు రాజు దానేమిచేసినను న్యాయమే. తోఁటమాలి తనతోఁటయందుఁ జిన్నచెట్లను వేయును; కొన్నిటిని గత్తిరించును. కొన్నిఁటిని దీసిపారవేయును. కొన్నిటిని గాపాడిపెంచును. ఏవస్తువెవనిదో దానిని వాఁడు తన యిచ్చవచ్చినట్లు చేయవచ్చును. అట్లే పరమేశ్వరుఁడు దాను గోరినట్లు చేయవచ్చును. అతనిని దండించుటకుఁగాని, యతని భయపెట్టుటకుఁగాని, యతనిమీఁద న్యాయము చేయువాఁడుగాని మఱెవ్వఁడును లేఁడుగదా?

ఉత్తరము:- పరమాత్మ న్యాయమే చేయుచున్నాఁడు. అన్యాయమెన్నఁడును జేయఁడు. కావుననే యతఁడు పూజనీయుఁడును గొప్పవాఁడునయి యున్నాఁడు. న్యాయమునకు విరుద్ధముగాఁజేయువాఁడు ఈశ్వరుఁడే కాఁడు. ఆలోచనలేకుండ నొకానొక మార్గమందో, తగనిచావుననో చెట్లను వేయుటచేతను, నఱకఁదగనివాని నఱుకుటచేతను, పనికిరాని వానిని బెంచుచు యోగ్యమగు వానిని బెంచకపోవుటచేతను, తోఁటమాలి దూషితుఁడగునట్లే కారణము లేక ఫలమిచ్చుటచే నీశ్వరునియందును దోషముకలుగును. పరమేశ్వరుఁడవశ్యముగ న్యాయయుక్తమైన కార్యమే చేయును. ఏలయనఁగా నతఁడు స్వభావముచేఁ బవిత్రుఁడును, న్యాయకారియు నయియున్నాఁడు. పిచ్చివానివలెఁ బనిచేసెనేని ప్రపంచమందలి శ్రేష్ఠ న్యాయాధీశులకంటెను దక్కువయు, నప్రతిష్ఠుఁడు నగును. ఏమి? ఈ జగత్తునందు యోగ్యమగు నుత్తమకార్యము చేయనివానిని ప్రతిష్ఠావంతునిగాఁ జేయువాఁడును, దుష్టకార్యము చేయనివానిని దండించువాఁడును నిందనీయుఁడును, అప్రతిష్ఠుఁడును గాఁడా? కాఁబట్టి ఈశ్వరుఁడు అన్యాయముఁజేయఁడుగనుక నెవరికిని భయపడఁడు.

ప్రశ్న:— పరమాత్మ మొదటనే యెవరికెంత యీయవలయునని విచారించియున్నాఁడో యంతయే యిచ్చును. ఎంత పనిచేయవలయునో యంతయే చేయును.

ఉత్తరము:— అతని యాలోచనము జీవుల కర్మానుసారముగ నుండునే కాని విపరీతముగనుండదు. విపరీతముగానున్న నతఁడే అపరాధియు నన్యాయకారియు నగును.

ప్రశ్న:— సుఖదుఃఖము లందఱకు నొక్కవిధముగ నున్నవి. గొప్పవారికి గొప్పచింత; చిన్నలకుఁ జిన్నచింత. ఎట్లనఁగా:- కోర్టులో లక్ష రూపాయల తగవుకోరు నొకసాహుకారు పల్లకిలోఁగూర్చుండి తన యింటినుండి యుష్ణకాలమందు గచ్చేరికిఁ బోవుచుండునపుడు యతనిఁజూచి యజ్ఞానులు "పుణ్యపాపముల ఫలము చూడుఁడు: ఒకఁడేమో పాలకియందానంద పూర్వకముగ గూర్చుండియున్నాఁడు. తక్కినవారు కాళ్ళకుజెప్పులుకూడ లేక, పైనఁ దలయు క్రిందఁగాళ్లను మంటలు మాడుచుండఁ బాలకిని మోసుకొని పోవుచున్నారు" అనుకొందురు. కాని కోర్టు సమీపించుకొలఁది సాహుకారునకు

మిక్కిలి శోకము, సందేహము వృద్ధికాఁదొడఁగును. మోయువారి కానంద మగుచువచ్చును. కోర్టు చేరఁగానే సాహుకారు (ప్రాడ్వివాక్) వకీలునొద్దకుఁ బోదునా? శిరస్తాదారునొద్దకుఁబోదునా? నేను గెలుతునో ఓడుదునో? ఏమగునో అని యిటునటు దిరుగుచు విచారగ్రస్తుఁడై యుండును. ఆ మోయువారు చుట్టయగాల్చుచు పరస్పరము మాటలాడుకొనుచుఁ బ్రసన్నులై యానందముతో నిద్రింతురు. ఆ సాహుకారు జయించెనేని సుఖము బొందును. ఓడెనేని దుఃఖసాగరమందు మునిఁగిపోవును. ఆ మోయుబెస్తలో యెప్పటివలెనే యుందురు, అట్లే రాజు మృదువై సుందరమగు మెత్తపైఁబరుండినను అతనికి క్రమముగ నిదురపట్టదు. కూలిజేయువారు కాళీమీఁదగాని, మిట్టపల్లముల మీఁదగాని పరుండినను గూడ వారికిఁ దక్షణమే నిదురపట్టును. ఇట్లే సర్వత్ర తెలియ వలయునని బుద్ధిమంతులు గ్రహింతురు.

ఉత్తరము :— ఈ తెలివి యజ్ఞానులది. ఏలయనఁగా:—మన మొక సాహుకారుని పాలకిమోయు బోయీవని కమ్మనియు, పాలకి మోయుబోయీని సాహుకారువు గమ్మనిచెప్పితిమేని సాహుకారు పల్లకి మోయుబోయీయగుట కెన్నఁడును సమ్మతింపఁడు. కాని పాలకిమోయువాఁడు మాత్రము సాహుకారుకాఁగో రును సుఖదుఃఖములు సమానము లేనిదమతమయవస్థలను వదలి హెచ్చుతగ్గులను బొందుటకిద్దఱును గోరకుందురు చూడుఁడు: ఒక జీవుఁడు విద్వాంసుఁడు, ధర్మాత్ముఁడు, శ్రీమంతుఁడునగు రాజుభార్య గర్భమందుఁబుట్టును మఱియొకఁడు మహాదరిద్రురాలైన కూలిదాని గర్భమందుఁబుట్టును ఒకనికి గర్భమునుండియన్నివిధ ములసుఖమును, మరియొకనికన్ని విధములందుఃఖమును గలుగుచుండును. ఒకఁడు పుట్టఁగానే మంచి సుగంధయుక్తమగు జలముచే స్నానమును, ఉపాయముగ నాడీచ్ఛేదనమును, దుగ్ధపానాదులును యథాయోగ్యముగఁ బొందును. మఱి వాఁడు పాలుత్రాగఁగోరినపుడు పంచదార మొదలగునవి చేర్చిన పాలు యథేష్టముగ వానికి దొరకును. అతనిని బ్రసన్నుని చేయుటకుఁ బనివాండ్రు, ఆడుకొనువస్తువులు, వాహనములు నుండును. అతఁడుత్తమస్థానమందుఁ బెరిమచే నానందమునొందును. మఱియొకఁడడవియందుఁ బుట్టి స్నానమునకు నీళ్లుగూడఁ గానక, పాలుత్రాగఁ గోరినపుడెల్ల పాలకుమాఱుగ దెబ్బలాదివి యత్యంతార్త స్వరముతో నేడ్చును, ఎవఁడును విచారించువాఁడే యుండఁడు.

జీవునకు పుణ్యపాపములు లేకయే యిట్టి సుఖదుఃఖములు కలుగునన్నఁ బరమేశ్వరుని యందు దోషము సంభవించును. కర్మములు చేయకయే సుఖదుఃఖములు కలుగునన్న పాపపుణ్యఫలములుగ నరకస్వర్గములుకూడ నుండఁగూడదు. ఏల యనఁగాఁ బరమేశ్వరుఁడిప్పుడెట్లు కర్మములు లేకయే సుఖదుఃఖముల నిచ్చెనో యట్లే మృతినొందినపిమ్మటఁగూడ నిష్టమైనవారిని స్వర్గమునకు, నన్యులను నరకమునకును బంపివేయును. అట్లయ్యెనేని అందఱు నధర్మయుక్తులై పోదురు. ఇంక ధర్మముచేయు టెందులకు? పరమేశ్వరుఁడు తన యిష్టమువచ్చి నట్లు చేయునని తలంచి ధర్మఫలము నందఱును సందేహింపఁజొత్తురు. అప్పుడు జనులకుఁ బాపకర్మములందు భయముతగ్గును. ప్రపంచమందుఁ బాప మధికమై ధర్మమడుగంటిపోవును. కాఁబట్టి పూర్వజన్మ పుణ్యపాపములనుబట్టి వర్తమాన జన్మమును, వర్తమాన పూర్వజన్మముల కర్మానుసారము భవిష్య జ్జన్మమును గలుగుచుండు ననుట యుక్తము.

ప్రశ్న :— మనుష్యునియందును, అన్యపశ్వాది శరీరములయందును ఒకేజాతి జీవులుందురా? భిన్న భిన్న జాతి జీవులా?

ఉత్తరము :— ఒకజాతి జీవులే; కాని పాపపుణ్యముల యోగముచేత బవిత్రులు నపవిత్రులు నగుచున్నారు.

ప్రశ్న :— మనుష్యశరీరమందలి జీవులు పశ్వాదులలోనికిని, పశ్వాదు లందలి జీవులు మనుష్యశరీరములోనికిని, స్త్రీశరీరమునుండి పురుషశరీరము నకును, పురుషశరీరమునుండి స్త్రీశరీరమునకును వచ్చుచు, పోవుచుందురా? లేదా?

ఉత్తరము:— వచ్చును, పోవును. ఏలయనఁగాఁ బాప మెక్కువ యయి పుణ్యము తక్కువయయినపుడు మనుష్యశరీరస్థ జీవుఁడు పశ్వాది నీచ శరీరములను, ధర్మ మధికమయి యధర్మము తక్కువయయినపుడు దేవతల-విద్వాంసుల — శరీరములను, పుణ్యపాపములు సమానము లయినపుడు సాధారణ మనుష్యశరీరములను, బొందును. ఇందుకు పుణ్యపాపములపరిమితులను బట్టి మనుష్యాదులయందును, ఉత్తమ మధ్యమ శరీరాది సామగ్రులతోఁ గూడుదురు. అధిక పాపఫలమును పశ్వాదిశరీరములందనుభవించిన పిమ్మటఁ బాపపుణ్యములు సమానములగుటచే మఱల మనుష్యశరీరమును బొందును. పుణ్యఫలము ననుభవించి మఱల మధ్యమ మనుష్యశరీరమునుబొందును. శరీర

వియోగమునకు మృత్యువనియు, శరీరసంయోగమునకు జన్మమనియుఁబేరులు. శరీరమును వదలినపుడు జీవుఁడుయమాలయమందు అనఁగా ఆకాశస్థవాయువు నందుండును. ఏలయనఁగా 'యమేన వాయునా' [ఋ.౧౦ ౧౪.౮:అథర్వ. ౩౦ ౧౪౧.౨] వేదమందు వాయువునకు యముఁడని వ్రాయఁబడి యున్నది. గరుడపురాణోక్తమగు కల్పిత యముఁడుకాఁడు. దీనిఁగూర్చిన విశేష ఖండన మండనము పదునొకండవ సముల్లాసమునందు వ్రాయఁబడును. పిమ్మట ధర్మ రాజను పరమేశ్వరుఁడు జీవుని పాపపుణ్యానుసారము పుట్టించును. ఆ జీవుఁడు పరమేశ్వరుని ప్రేరణచే వాయు జలాన్నములద్వారా, లేదా శరీర రంధ్రముల ద్వారా యితర శరీరమందుఁ బ్రవేశించి క్రమక్రమముగా వీర్యమందుచేరి గర్భ మందు స్థిరపడి శరీరముసుధరించి వెలుపలికివచ్చును స్త్రీ శరీరమును ధరించు టకుఁ దగినకర్మము చేసియుండెనేని స్త్రీయు, పురుషశరీరమును ధరించుటకుఁ దగినకర్మము చేసియుండెనేని పురుషుఁడునగును. అట్లే గర్భస్థితి కాలమున స్త్రీపురుషుల రజోవీర్యములు సమానమునగుటవలన నపుంసకుఁడు నగును. అనఁగా నుత్తమ కర్మోపాసనా జ్ఞానములచే ముక్తిని బొందకుండువఱకు నీ విధముగ నానాప్రకారముల జన్మమరణములఁ బొందుచుండును. ఏలయనఁగా నుత్తమ కర్మాదులను జేయుటచే మనుష్యులకు నుత్తమజన్మమును. ముక్తి యందు మహాకల్పపర్యంతము జన్మమరణదుఃఖ రహితమైన యానందమును గలుగును.

ప్రశ్న:—ముక్తి ఒక్క జన్మమందుఁ గలుగునా? అనేక జన్మములందా?

ఉత్తరము:— అనేక జన్మములయందు. ఏలయనఁగా:-

భిద్యతే హృదయగ్రంథిశ్ఛిద్యంతే సర్వసంశయాః।

క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్దృష్టే పరావరే॥

ముండక.౨.ఖం.౨.మం౮ ।

ఈ జీవుని హృదయములోని యవిద్యాజ్ఞాన రూపమగు ముడితెగినమస్త సంశయములు ఛిన్న భిన్నములై దుష్టకర్మములన్నియు క్షీణించినపుడే తన యాత్మలోపలను, వెలుపలను వ్యాపించియుండు నా పరమాత్మ గోచరమగును.

ప్రశ్న:— ముక్తియందు జీవుఁడు పరమేశ్వరునియందు లీనమైపోవునా? వేఱుగా నుండునా?

ఉత్తరము:— వేఱుగానుండును. లీనమైపోవునేని ముక్తిసుఖమునను భవించువాఁ డెవ్వఁడు? ముక్తిసాధనములన్నియు నిష్ఫలము లయిపోవును. ఇఁక నదియు ముక్తి కాదు దానిని జీవుని ప్రలయమనవలయును. ఈశ్వరాజ్ఞాపాలనము, ఉత్తమకర్మములు, సత్సంగతి, యోగాభ్యాసము అను పూర్వోక్తసమస్త సాధనముల నొనర్చు జీవుఁడే ముక్తిని బొందును.

సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్।
సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితేతి ॥

తైత్తిరీ. బ్ర.వ. అను.౧॥

ఏ జీవాత్మ తన బుద్ధియందును, ఆత్మయందును స్థితుఁడయి సత్యజ్ఞానుఁడును, అనంతానంద స్వరూపుఁడునగు పరమాత్మను దెలియునో యతఁడా వ్యాపకరూప బ్రహ్మమందు స్థితుఁడై (విపశ్చితా) అనన్తవిద్యాయుక్తుఁడగు బ్రహ్మతోఁ గూడి సమస్త కామములను బొందుచున్నాఁడు. అనఁగా నేయే యానందమును గామించునో ఆ యా యానందమును బొందును. ఇదియే ముక్తి యనఁబడును.

ప్రశ్న:— జీవుఁడు శరీరములేక సాంసారికసుఖమనుభవింపజాలఁడు కదా! ముక్తియందు శరీరములేక ఆనందము నెట్లనుభవింపఁ గలుగును.

ఉత్తరము:— దీనికి సమాధానము పూర్వము చెప్పఁబడినది. ఇంకనధికముగఁ జెప్పఁబడును వినుడు:-జీవుఁడు సాంసారికసుఖములను శరీరాధారముచే ననుభవించునట్లే పరమేశ్వరుని యాధారముచే మోక్షానందము ననుభవించును. ఆ ముక్తజీవుఁడు అనంతవ్యాపక బ్రహ్మమందు స్వచ్ఛందముగా సంచరించును. శుద్ధజ్ఞానముచే సమస్త సృష్టిని జూచును. ఇతర ముక్త పురుషులతోఁ గలియును. సృష్టివిద్యను గ్రమముగాఁ జూచుచు సమస్త లోక లోకాంతరములయందు అనఁగా నీ కనఁబడు నట్టియుఁ గనఁబడకుండునట్టియు లోకములం దంతటను సంచరించును. తన జ్ఞానమున కభిముఖమైయున్న సమస్త పదార్థములను జూచును. జ్ఞాన మధికమయిన కొలదియు నానంద మతనికధికమగును. ముక్తియందు జీవాత్మ నిర్మలుఁడగుటఁబట్టి పూర్ణజ్ఞాని యగును. అతనికి సమస్త సన్నిహిత పదార్థముల జ్ఞానము యథార్థముగఁ గలుగును. ఈ సుఖవిశేషమే స్వర్గము, విషయ తృష్ణయందుఁ దగులువడి దుఃఖవిశేష మనుభవించుటయే

నరకము. స్వఃఅనఁగా సుఖము 'స్వః సుఖం గచ్ఛతి యస్మిన్ స స్వర్గః అతో విపరీతో దుఃఖభోగో నరక ఇతి' సాంసారికసుఖము సామాన్య స్వర్గము పరమేశ్వరుని ప్రాప్తిచేఁ గలుగు నానందమే విశేషస్వర్గము. సమస్త జీవు లను స్వభావముచే సుఖప్రాప్తిని, దుఃఖమునుండి వియోగమునుగోరుచున్నారు. కాని యెంతవఱకు ధర్మమునుజేయుచుఁ బాపములను వదలరో యంతవఱకు సుఖమమరదు; దుఃఖమును దూరము కాదు. ఏలయనఁగా దేనికేది కారణమో అనగా మూలమో యది యెన్నఁడును నష్టముకాజాలదు. ఎట్లనగా:-

ఛిన్నే మూలే వృక్షో నశ్యతి తథా పాపే క్షీణే దుఃఖం నశ్యతి।

మూలమును ఖండించుటచే వృక్షము నష్టమగునట్లు పాపములను వద లుటచే దుఃఖము నష్టమగును. మనుస్మృతియందుఁ బాపపుణ్యముల గతి అనేక ప్రకారములుగ నెట్లు వ్రాయఁబడియున్నదో చూడుడు:-

మానసం మనసైవాయముపభుంక్తే శుభాశుభమ్।

వాచా వాచా కృతం కర్మ కాయేనైవ చ కాయికమ్ ॥ మను. అ. ౧౨. శ్లో. ౮॥

మనుష్యుఁడీప్రకారముగ శ్రేష్ఠ మధ్యమ నికృష్టస్వభావములను దెలిసి కొని యుత్తమస్వభావములను గ్రహించి మధ్యమ నికృష్టములను వదలిపెట్ట వలయును జీవుఁడు శుభాశుభకర్మములను మనస్సుతోఁజేసినేని మనస్సును, వాక్కుతోఁజేసెనేని వాక్కును, శరీరముతోఁజేసెనేని శరీరమును సుఖదుఃఖ ములను బొందును. అని నిశ్చయముగ తెలియవలెను.

శరీరజైః కర్మదోషైర్యాతి స్థావరతాం నరః।

వాచికైః పక్షిమృగతాం మానసైరంత్యజాతితామ్॥ ౯॥

ఎవఁడు శరీరముతో దొంగతనము, పరస్త్రీగమనము, శ్రేష్ఠులను గొట్టుట, చంపుట మొదలగు దుష్టకర్మములనుజేయునో వానికి వృక్షాది స్థావర జన్మమును, వాక్కుతోఁజేసిన పాపకర్మములచేఁబక్షి మొదలగు మృగాదులశరీ రమును, మనస్సుతోఁజేసిన దుష్టకర్మములచేఁ జాండాలాది శరీరమునుగలుగును.

యో యదైషాం గుణో దేహే సాకల్యేనాతిరిచ్యతే

స తదా తద్గుణప్రాయం తం కరోతి శరీరిణామ్॥ ౨౫॥

ఏ గుణ మీ జీవులదేహమం దధికముగానుండునో యది జీవులను దన వలె జేసివేయును.

సత్త్వం జ్ఞానం తమోఽజ్ఞానం రాగద్వేషౌ రజః స్మృతమ్।
ఏతద్వ్యాప్తిమదేతేషాం సర్వభూతాశ్రితం వపుః॥ "—౨౬

ఆత్మయందు జ్ఞానముకలిగినపుడు సత్త్వగుణ మనియు, అజ్ఞానముండు నపుడు తమోగుణమనియు, రాగద్వేషము లుండునపుడు రజోగుణమనియు దెలియవలయును. ప్రకృతి గుణము లీమూడును ప్రపంచమందలి సమస్తపదార్థములందును వ్యాప్తమై యుండును.

తత్ర యత్ప్రీతిసంయుక్తం కించిదాత్మని లక్షయేత్।
ప్రశాంతమివ శుద్ధాభం సత్త్వం తదుపధారయేత్॥ "—౨౭॥

దాని నెట్లు తెలిసికొనవలె ననఁగా:-ఆత్మయందుఁ బ్రసన్నత యుండి మనస్సు ప్రశాంతమగు శుద్ధసాత్త్వికవర్తన కలిగియుండునేని సత్త్వ గుణము ప్రధానముగా నున్నదనియు, రజోగుణ తమోగుణముల ప్రధానములై యున్న వనియుఁ దెలియవలయును.

యత్తు దుఃఖసమాయుక్తమప్రీతికరమాత్మనః।
తద్రజోఽప్రతిఘం విద్యాత్సతతం హారి దేహినామ్॥ "—౨౮॥

ఆత్మయు మనస్సును దుఃఖసంయుక్తములు, ప్రసన్నతారహితములునై విషయములం దిక్కడక్కడ గమనాగమనములందుఁ దగులువడియుండిన రజో గుణము ప్రధానమనియు, సత్త్వగుణ తమోగుణము లప్రధానము లనియుఁ దెలియవలయును.

యత్తు స్యాన్మోహసంయుక్తమవ్యక్తం విషయాత్మకమ్।
అప్రతర్క్యమవిజ్ఞేయం తమస్తదుపధారయేత్॥ "—౨౯॥

ఆత్మయు, మనస్సును మోహమందు అనఁగా ప్రాపంచిక పదార్థముల యందుఁ దగులువడియుండునపుడును, మనస్సునందు వివేక మేమియులేకుండు నపుడును, విషయములం దాసక్తమై తర్కవితర్క రహితమై తెలియుటకు యోగ్యము గాకుండునపుడును తమోగుణము ప్రధానమనియు, సత్త్వరజో గుణములు అప్రధానము లనియుఁ దెలియవలయును.

త్రయాణామపి చైతేషాం గుణానాం యః ఫలోదయః।
అగ్ర్యో మధ్యో జఘన్యశ్చ తం ప్రవక్ష్యామ్యశేషతః॥ "—౩౦॥

ఇఁక నీమూడుగుణములచేఁ గలుగు నుత్తమ మధ్యమ నికృష్ట ఫలములు పూర్ణభావముతోఁ జెప్పబడును.

వేదాభ్యాసస్తపో జ్ఞానం శౌచమింద్రియనిగ్రహః ।
ధర్మక్రియాత్మచింతా చ సాత్త్వికం గుణలక్షణమ్॥　　"—౩౧॥

వేదాభ్యాసము, ధర్మానుష్ఠానము, జ్ఞానాభివృద్ధి, పవిత్రతేచ్ఛ, ఇంద్రియ నిగ్రహము, ధర్మక్రియ, ఆత్మచింతనమను వివిధ సత్త్వగుణముచేఁ గలుగు లక్షణములు.

ఆరంభరుచితాఽధైర్యమసత్కార్య పరిగ్రహః ।
విషయోపసేవా చాజస్రం రాజసం గుణలక్షణమ్॥　　"౩౨॥

రజోగుణ ముదయమై సత్వతమోగుణములు అంతర్భావ మయినపు డా రంభమందు రుచి, ధైర్యత్యాగము, అసత్కార్యముల గ్రహణము, విషయసేవ సమం దెడతెగని ప్రీతి యనునవి కలుగును. అప్పుడు తన యందు రజోగుణము ప్రధానముగ నున్నదని తెలియవలయును.

లోభః స్వప్నో ధృతిః క్రౌర్యం నాస్తిక్యం భిన్న వృత్తితా ।
యాచిష్ణుతా ప్రమాదశ్చ తామసం గుణలక్షణమ్॥　　"—౩౩॥

తమోగుణ ముదయమై తక్కిన రెండు నంతర్భావ మయినపుడు సమస్త పాపములకు మూలమగు లోభ మమితముగా వర్ధిల్లి అత్యంతాలస్యము, నిద్ర, అధైర్యము, క్రౌర్యము, నాస్తిక్యము—అనఁగా వేదమందును ఈశ్వరునియందును అశ్రద్ధ—అంతఃకరణముల భిన్న భిన్న వృత్తులు ఏకాగ్రతలేమి, అనేక వ్యసనములయందుఁ దగుల్పడుటయను నివికలుగును. అప్పుడివి తమోగుణ లక్షణములని విద్వాంసులెఱుఁగఁదగును.

యత్కర్మ కృత్వా కుర్వంశ్చ కరిష్యంశ్చైవ లజ్జతి ।
తజ్జ్ఞేయం విదుషా సర్వం తామసం గుణలక్షణమ్॥　　"—౩౪॥

ఏ కర్మము చేసినపుడు, చేయునపుడు, చేయుట కిచ్ఛగించి నపుడును దన యాత్మయందు లజ్జయు, శంకయు, భయమును గలుగునో యప్పుడు తనయందుఁ దమోగుణ మమితమైయున్నదని తెలియవలయును.

యేనాస్మిన్కర్మణా లోకే ఖ్యాతిమిచ్ఛతి పుష్కలామ్ ।
న చ శోచత్యసంపత్తౌ తద్విజ్ఞేయం తు రాజసమ్॥　　—౩౫॥

ఏ కర్మముచే నీలోకమందు జీవాత్మ యధికప్రసిద్ధి గోరునో, దరిద్రు డయినపుడుగూడ చారణులు, భట్టులు మొదలగువారికి దానమిచ్చుటమానఁడో అప్పుడు రజోగుణ మతనియందు ప్రబలముగా నున్నదని తెలియవలయును

యత్సర్వేణేచ్ఛతి జ్ఞాతుం యన్న లజ్జతి చాచరన్।
యేన తుష్యతి చాత్మాస్య తత్సత్త్వగుణలక్షణమ్॥ “–౩౭॥

మనుష్యుని ఆత్మయెప్పుడన్నిటిని తెలియగోరునో, ఎప్పుడు గుణముల గ్రహింపనుద్యమించునో, ఎప్పుడు మంచిపనులయందు లజ్జనుబొందదో, అనఁగా నేకర్మమొనర్చునపుడు ప్రసన్నత కలదై ధర్మాచరణమందు రుచికలదై యుండునో యప్పుడు సత్వగుణము ప్రబలముగానున్నదని తెలియవలయును.

తమసో లక్షణం కామో రజసస్త్వర్థ ఉచ్యతే।
సత్త్వస్య లక్షణం ధర్మః శ్రైష్ఠ్యమేషాం యథోత్తరమ్॥
మను. అ. ౧౨. శ్లో. ౩౮

తమోగుణలక్షణముకామము; రజోగుణలక్షణముఅర్థమునుసంగ్రహించు నిచ్ఛ; సత్వగుణలక్షణము ధర్మమును సేవించుట యని తెలియవలయును. తమో గుణముకంటె రజోగుణమును, రజోగుణముకంటె సత్వగుణమును శ్రేష్ఠములు.

ఇంక నేయేగుణములచే నేయే గతిని జీవుఁడు పొందునో యది వ్రాయ బడును:—

దేవత్వం సాత్త్వికా యాంతి మనుష్యత్వం చ రాజసాః।
తిర్యక్త్వం తామసా నిత్యమిత్యేషా త్రివిధా గతిః॥ మను. అ. ౧౨ శ్లో. ౪౦॥

సాత్త్వికులగువారు దేవతలు అనఁగా విద్వాంసులును, రజోగుణము కల వారు మధ్యమమనుష్యు లగుదురు. ఇఁక తమోగుణము కలవారు నీచగతిని బొందుదురు.

స్థావరాః కృమికీటాశ్చ మత్స్యాః సర్పాశ్చ కచ్ఛపాః।
పశవశ్చ మృగాశ్చైవ జఘన్యా తామసీ గతిః॥ “–౪౨॥

మిక్కిలి తమోగుణము కలవారు స్థావర వృక్షాది జన్మములను, క్రిమి, కీట, మత్స్య, సర్ప, కచ్ఛప, పశు, మృగముల జన్మములను బొందుదురు.

హస్తినశ్చ తురంగాశ్చ శూద్రా మ్లేచ్ఛాశ్చ గర్హితాః।
సింహా వ్యాఘ్రా వరాహాశ్చ మధ్యమా తామసీ గతిః॥ "—౪౩॥

మధ్యమ తమోగుణము కలవారు ఏనుఁగు, గుఱ్ఱము, శూద్రులు, మ్లేచ్ఛులు, నింద్యకర్మకారులు, సింహము, వ్యాఘ్రము, వరాహము, అను నీ జన్మములను బొందుదురు.

చారణాశ్చ సుపర్ణాశ్చ పురుషాశ్చైవ దాంభికాః।
రక్షాంసి చ పిశాచాశ్చ తామసీషూత్తమా గతిః॥ "—౪౪॥

ఉత్తమ తమోగుణముకలవారు చారణులు—గవిత్వముచే నితరులను పొగడువారును, సుందరమైన పక్షులును, దాంబికులు—తన సుఖముకొఱకుఁ దన్నుదానే పొగడుకొనువారును, రాక్షసులు—హింసకులును, పిశాచులు—మద్యాదుల సేవించుచు మలినముగా నుండువా రగుదురు. ఇది యుత్తమ తమోగుణఫలము.

ఝల్లా మల్లా నటాశ్చైవ పురుషాః శస్త్రవృత్తయః।
ద్యూతపాన ప్రసక్తాశ్చ జఘన్యా రాజసీ గతిః॥ "—౪౫॥

మిక్కిలి రజోగుణము కలవారు (ఝల్ల)—శస్త్రిచే జీవించువారు గుద్దలిచే ద్రవ్వువారు. (మల్ల) పల్లెవాండ్రు నటులు—బొమ్మరులు—శస్త్రధారులకు భృత్యులు, జూదరులు, మద్యపులుగా జన్మింతురు. ఇది నీచరజోగుణఫలము.

రాజానః క్షత్రియాశ్చైవ రాజ్ఞాం చైవ పురోహితాః।
వాదయుద్ధప్రధానాశ్చ మధ్యమా రాజసీ గతిః॥ "—౪౬॥

మధ్యమ రజోగుణము కలవారు రాజులు, క్షత్రియవర్ణస్థులగు రాజపురోహితులు, వాదవివాదము చేయువారు, ప్రాడ్వివాకులు—న్యాయవాదులు, యుద్ధవిభాగాధ్యక్షులను సేనాపతులుగా జన్మింతురు.

గంధర్వా గుహ్యకా యక్షా విబుధానుచరాశ్చ యే।
తథైవాప్సరసః సర్వా రాజసీషూత్తమా గతిః॥ "—౪౭॥

ఉత్తమ రజోగుణము కలవారు గంధర్వులు (గాయకులు) గుహ్యకులు (వాదిత్రములను వాయించువారు) యక్షులు (ధనాఢ్యులు) విద్వాంసుల సేవకులు, అప్సరసలు—ఉత్తమ రూపవంతులగు స్త్రీలుగా జన్మింతురు.

గాఁగోరువారు గుణాతీతులై అనఁగా సమస్త గుణస్వభావములందుఁ జిక్కికొనక మహాయోగు లయి ముక్తికొఱకు సాధనము చేయవలయును.

యోగశ్చిత్తవృత్తినిరోధః॥ యో. స. ౧. ౧॥

ఇది పతంజలి రచిత యోగశాస్త్రసూత్రము. మనుష్యుఁడు రజోగుణ తమోగుణయుక్త కర్మములనుండియు, సత్వగుణయుక్త కర్మములనుండియు మనస్సును నిరోధించి శుద్ధ సత్వ గుణయుక్తుఁడై పిమ్మట దాని నిరోధించి యేకాగ్రితవహించి అనఁగా నొక్కపరమాత్మయు,ధర్మ కర్మములయొక్కయు నగ్రభాగమందుఁ జిత్తమును నిలిపియుంచవలయును. అన్నివైపులనుండి మనోవృత్తుల నడ్డగించి నిరోధింపఁదగును.

తదా ద్రష్టుః స్వరూపేఽవస్థానమ్॥ యో. సమాధిపాదే. ౩.॥

చిత్తమేకాగ్రమై నిరోధించి యున్నపుడే జీవుఁడు సర్వద్రష్టయగు నీశ్వరుని స్వరూపమందు స్థితుఁడగును.

అథ త్రివిధదుఃఖాత్యంతనివృత్తి రత్యంతపురుషార్థః॥ సాంఖ్య సూ.అ. ౧.౧

అధ్యాత్మికమను శరీరసంబంధమగు పీడ; అధిభౌతికమను ఇతర ప్రాణులనుండి కలుగుదుఃఖము; అధిదైవికమను అతివృష్టి, అతితాపము;అతి శీతము, ఇంద్రియ మనస్సుల చాంచల్యము మున్నగువానిచేఁ గలుగు దుఃఖము; ఈ త్రివిధ దుఃఖములనుండి తొలఁగి ముక్తినిబొందుటయే అత్యంత పురుషార్థము.

ఇఁకముందు ఆచారానాచార భక్ష్యాఽభక్ష్యవిషయములు వ్రాయఁబడును.

శ్రీ మద్దయానంద సరస్వతీస్వామి కృతమును
సుభాషావిభూషితమునగు సత్యార్థ ప్రకాశమున
విద్యాఽవిద్యాబంధమోక్షవిషయములుగల
నవమ సముల్లాసము సంపూర్ణము.

గాఁగోరువారు గుణాతీతులై అనఁగా సమస్త గుణస్వభావములందుఁ జిక్కి-
కొనక మహాయోగు లయి ముక్తికొఱకు సాధనము జేయవలయును.

యోగశ్చిత్తవృత్తినిరోధః॥ యో. స. ౧. ౧॥

ఇది పతంజలి రచిత యోగశాస్త్రసూత్రము. మనుష్యుఁడు రజోగుణ తమోగుణయుక్త కర్మములనుండియు, సత్వగుణయుక్త కర్మములనుండియు మనస్సును నిరోధించి శుద్ధ సత్వ గుణయుక్తుఁడై పిమ్మట దాని నిరోధించి యేకాగ్రితవహించి అనఁగా నొక్కపరమాత్మయు, ధర్మ కర్మములయొక్కయు నగ్రిభాగమందుఁ జిత్తమును నిలిపియుంచవలయును. అన్నివైపులనుండి మనోవృత్తుల నడ్డగించి నిరోధింపఁదగును.

తదా ద్రష్టుః స్వరూపేఽవస్థానమ్॥ యో. సమాధిపాదే. ౩:॥

చిత్తమేకాగ్రమై నిరోధించి యున్నపుడే జీవుఁడు సర్వద్రష్టయగు నీశ్వరుని స్వరూపమందు స్థితుఁడగును.

అథ త్రివిధదుఃఖాత్యంతనివృత్తి రత్యంతపురుషార్థః॥ సాంఖ్య సూ. అ. ౧.౧

అధ్యాత్మికమను శరీరసంబంధమగు పీడ; అధిభౌతికమను ఇతర ప్రాణులనుండి కలుగుదుఃఖము; అధిదైవికమను అతివృష్టి. అతితాపము; అతి శీతము. ఇంద్రియ మనస్సుల చాంచల్యము మున్నగువానిచేఁ గలుగు దుఃఖము; ఈ త్రివిధ దుఃఖములనుండి తొలఁగి ముక్తినిబొందుటయే అత్యంత పురుషార్థము.

ఇఁకముందు ఆచారానాచార భక్ష్యాఽభక్ష్యవిషయములు వ్రాయఁబడును.

శ్రీ మద్దయానంద సరస్వతీస్వామి కృతమును
సుభాషావిభూషితమునగు సత్యార్థ ప్రకాశమున
విద్యాఽవిద్యాబంధమోక్షవిషయములుగల
నవమ సముల్లాసము సంపూర్ణము.

# దశమ సముల్లాసము

## ఆచారానాచార భక్ష్యాభక్ష్య విషయములు

ధర్మయుక్త కార్యాచరణము, సుశీలత, సత్పురుషుల సహవాసము, సద్విద్యాగ్రహణమందు రుచి మొదలగునవి ఆచారములు. వీనికి విపరీతమైనవి యనాచారములు.

విద్వద్భిః సేవితః సద్భిర్నిత్యమద్వేషరాగిభిః ।
హృదయేనాభ్యనుజ్ఞాతో యో ధర్మస్తన్నిబోధత ॥ మను. అ.౨. శ్లో. ౧॥

రాగద్వేషాది రహితులు, విద్వాంసులు నగువారు దేనిని నిత్యము సేవింతురో, హృదయమును నాత్మ కేదిసత్యకర్తవ్యమని తెలియునో, యా ధర్మమే మాననీయమును, గరణీయమునని మనుష్యులు సదాధ్యానముంచవలెను.

కామాత్మతా న ప్రశస్తా న చైవేహాస్త్యకామతా ।
కామ్యో హి వేదాధిగమః కర్మయోగశ్చ వైదికః ॥ "—౨॥

ఈ ప్రపంచమందత్యంతకామాత్మతకాని, నిష్కామతకాని శ్రేష్ఠము కాదు. ఏలయన వేదార్థజ్ఞానము, వేదోక్తకర్మములు—అన్నియు కామము చేతనే సిద్ధించుచున్నవి.

సంకల్పమూలః కామో వై యజ్ఞాః సంకల్పసంభవాః ।
వ్రతాని యమధర్మాశ్చ సర్వే సంకల్పజాః స్మృతాః ॥ "—౩॥

ఎవ్వఁడేని నేను ఇచ్ఛారహితుఁడను, నిష్కాముఁడను అని కాని, అట్లు కాఁగలననిగాని చెప్పెనేని, వాఁడెన్నఁడును అట్లు కాఁజాలఁడు, ఏలయనఁగా యజ్ఞము, సత్యభాషణాది వ్రతములు, యమనియమములను ధర్మాదులన్నియు సంకల్పము చేతనే సిద్ధమగును.

అకామస్య క్రియా కాచిద్దృశ్యతే నేహ కర్హిచిత్ ।
యద్యద్ధి కురుతే కించిత్ తత్తత్కామస్య చేష్టితమ్ ॥ మను —౪॥

చేతులు, కాళ్లు, కన్నులు, మనస్సు మొదలగువాని చలనములన్నియుఁ గామముచేతనే కలుగుచున్నవి. ఇచ్ఛలేకుండెనేని కన్నుతెఱచుటయు మూయుటయుఁ గూడ జరుగదు.

వేదోఽఖిలో ధర్మమూలం స్మృతిశీలే చ తద్విదామ్ ।
ఆచారశ్చైవ సాధూనామాత్మనస్తుష్టిరేవ చ ॥ "—౬॥

కాఁబట్టి సంపూర్ణ వేదములను, మనుస్మృత్యాది ఋషిప్రణీత శాస్త్రములను, సత్పురుషుల యాచారమును, తన యాత్మప్రసన్నమగు కర్మములు-భయముకాని, శంకకాని, సిగ్గుకాని కలుగనివి – సేవించుట యుచితము. చూడుఁడు: అబద్ధముచెప్పుటకును, దొంగతనము మొదలగునవిచేయుటకును, ఇచ్ఛగించినపుడేవానియాత్మయందు భయము, శంక, లజ్జ అనునవి యుత్పన్నమగును. కాఁబట్టి యా కర్మములను చేయఁగూఁడదు

సర్వం తు సమవేక్ష్యేదం నిఖిలం జ్ఞానచక్షుషా ।
శ్రుతిప్రామాణ్యతో విద్వాన్ స్వధర్మే నివిశేత వై ॥ "–౮॥

మనుష్యుఁడు సంపూర్ణ శాస్త్రములను, వేదమును, సత్పురుషుల ఆచారమును తనయాత్మకవిరుద్ధమగువానిని బాగుగ జ్ఞాననేత్రముద్వారా విచారించి శ్రుతిప్రమాణములచే స్వాత్మానుకూల ధర్మమందుఁ బ్రవేశింపవలయును.

శ్రుతిస్మృత్యుదితం ధర్మమనుతిష్ఠన్ హి మానవః ।
ఇహ కీర్తిమవాప్నోతి ప్రేత్య చానుత్తమం సుఖమ్ ॥ "–౯॥

వేదోక్తధర్మమును, వేదమున కవిరుద్ధమగు స్మృత్యుక్తధర్మమును అనుష్ఠించునరుఁడీలోకమందుఁగీర్తిని, మృతించినసర్వోత్తమసుఖమునుబొందును.

[శ్రుతిస్తు వేదో విజ్ఞేయో ధర్మశాస్త్రంతు వై స్మృతిః ।
తే సర్వార్థేష్వమీమాంస్యే తాభ్యాం ధర్మో హి నిర్బభౌ ॥ "౧౦॥]

యోఽవమన్యేత తే మూలే హేతుశాస్త్రాశ్రయాద్ద్విజః ।
స సాధుభిర్బహిష్కార్యో నాస్తికో వేదనిందకః ॥ "–౧౧॥

శ్రుతియని వేదమును, స్మృతియని ధర్మశాస్త్రమును అందురు. వీనిచే సమస్త కర్తవ్యాకర్తవ్యములను నిశ్చయించుకొనవలయును॥ వేదమునుగాని, వేదానుకూలములగు నాప్తగ్రంథములనుగానియవమానముచేయువానిని శ్రేష్ఠులు జాతిబాహ్యునిగాఁ జేయవలయును. ఏలయనఁగా వేదమును నిందించువాఁడు నాస్తికుఁడు.

వేదః స్మృతిః సదాచారః స్వస్య చ ప్రియమాత్మనః ।
ఏతచ్చతుర్విధం ప్రాహుః సాక్షాద్ధర్మస్య లక్షణమ్ ॥ "–౧౨॥

కాఁబట్టి వేదము, స్మృతి, సత్పురుషుల యాచారము, తనయాత్మ జ్ఞానమునకవిరుద్ధమగు ప్రియాచరణము అను ఈ నాలుగు ధర్మలక్షణములు: అనఁగా వీనిచేతనే ధర్మము లక్షితమగుచున్నది.

అర్థకామేష్వసక్తానాం ధర్మజ్ఞానం విధీయతే ।
ధర్మం జిజ్ఞాసమానానాం ప్రమాణం పరమం శ్రుతిః ॥ "—౧౩॥

ద్రవ్యలోభమందును, కామమును విషయవాసనలయందును చిక్కుపడని యతనికే ధర్మజ్ఞానము కలుగును. ధర్మమును తెలిసికొనగోరువారికి వేదమే పరమప్రమాణము.

వైదికైః కర్మభిః పుణ్యైర్నిషేకాదిర్ద్విజన్మనామ్ ।
కార్యః శరీర సంస్కారః పావనః ప్రేత్య చేహ చ॥ "—౨౬॥

కాఁబట్టి వేదోక్త పుణ్యరూపకములచే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యలు తమ సంతానమున కీజన్మమందును, పరజన్మమందును పవిత్రతను గలుఁగఁజేయు నిషేకాది సంస్కారములనుజేయుట యుచితము.

కేశాంతః షోడశే వర్షే బ్రాహ్మణస్య విధీయతే ।
రాజన్యబంధో ర్ద్వావింశే వైశ్యస్య ద్వ్యధికే తతః॥ మను. అ. ౨.శ్లో. ౬౫॥

బ్రాహ్మణునకుఁ బదియాఱవయేట, క్షత్రియునకు నిఱువది రెండవయేట, వైశ్యునకు నిఱువది నాల్గవయేట కేశాంతకర్మము అనఁగా నీ విధికిఁ బిమ్మట శిఖమాత్రమే యుంచి గడ్డమును మీసమును దలవెంట్రుకలను గొఱిగించుకొనుచుండవలయును. అనఁగా మరల నెన్నఁడును బెట్టుకొనగూడదు. శీత ప్రధానదేశమయ్యేనేని వారియిష్టానుసార మెన్ని వెంట్రుకలేని యుంచుకొనవచ్చును. అత్యుష్ణ దేశమయ్యేనేని శిఖాసహితముగ నంతయును గొఱిగిఁచుకొనవచ్చును. ఏలయనఁగాఁ దలయందు వెంట్రుకలుండుటచే నుష్ణమధికమగుటయేగాక బుద్ధియు తగ్గును. గడ్డము మీసము లుండుటచే భోజనములం దాటంకమును గలుగును. ఇఁక నెంగిలియు వెంట్రుకల నంటియుండును.

ఇంద్రియాణాం విచరతాం విషయేష్వపహారిషు ।
సంయమే యత్నమాతిష్ఠేద్విద్వాన్యంతేవ వాజినామ్॥ మను.అ.౨.౮౮॥

మనుష్యుని ముఖ్యాచారము:-చిత్తమును హరించు విషయము లందుఁ బ్రవర్తించు నింద్రియములను నిరోధింపఁబ్రయత్నింపవలయును. సారథిగుఱ్ఱములనులాగి శుద్ధమార్గమందు నడుపునట్లు ఈ ఇంద్రియములను దన వశమందు బెట్టుకొని యధర్మమునుండి తొలఁగించి, ధర్మమార్గమందు నడిపింపవలయును.

ఇంద్రియాణాం ప్రసంగేన దోషమృచ్ఛత్యసంశయమ్ ।
సన్నియమ్య తు తాన్యేవ తతః సిద్ధిం నియచ్ఛతి॥ "—౯౩॥

ఇంద్రియములను విషయాసక్తితోనధర్మమందునడుపుటచే మనుష్యుఁడు నిశ్చయముగ దోషి యగుచున్నాఁడు. మఱి వాని జయించి ధర్మమందు నడుపునపుడే యభీష్టసిద్ధులఁ బొందుచున్నాఁడు.

> న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి ।
> హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే॥ –౯౪॥

ఇంధనములను. నేతిని వేయుటచేత నగ్ని వర్ధిల్లునట్లే కామముఁను భోగించుటచేతఁ గామము వర్ధిల్లునే కాని శాంతింపదు. కాన మనుష్యుఁడెన్నఁడును విషయాసక్తుఁడు కాఁగూడదు.

> వేదాస్త్యాగశ్చ యజ్ఞాశ్చ నియమాశ్చ తపాంసి చ ।
> న విప్రదుష్టభావస్య సిద్ధిం గచ్ఛంతి కర్హిచిత్ ॥ –౯౭॥

జితేంద్రియుఁడు కాని పురుషునకు విప్రదుష్టుఁడని పేరు. వాని వేదజ్ఞానము కాని. త్యాగముకాని. యజ్ఞముకాని. నియమముకాని. ధర్మాచరణము కాని.సిద్ధినిబొందదు.ఇవి యన్నియు జితేంద్రియులగు ధర్మాత్ములకేసిద్ధించును.

> వశేకృత్వేంద్రియగ్రామం సంయమ్య చ మన స్తథా।
> సర్వాన్సంసాధయేదర్థా నక్షిణ్వన్యోగత స్తనుమ్॥ –౧౦౦॥

కాఁబట్టి పంచకర్మేంద్రియములను. పంచజ్ఞానేంద్రియములను. పదునొకండవ మనస్సును దన వశపఱచుకొని. యుక్తాహార విహార యోగముచే శరీరమునురక్షించుకొనుచు. సమస్తార్థములను సాధించుకొనవలయును.

> శ్రుత్వా స్పృష్ట్వా చ దృష్ట్వా చ భుక్త్వా ఘ్రాత్వా చ యో నరః।
> న హృష్యతి గ్లాయతి వా స విజ్ఞేయో జితేంద్రియః॥ –౯౮॥

స్తుతిని విని హర్షమును. నిందను విని శోకమును. ఉత్తమ స్పర్శచే సుఖమును. దుష్టస్పర్శచే దుఃఖమును. సుందరరూపమును జూచి ప్రసన్నతను. దుష్టరూపమును జూచి యప్రసన్నతను. ఉత్తమ భోజనముచేసి యానందమును. నికృష్ట భోజనముచేసి దుఃఖమును. సుగంధమందు రుచిని. దుర్గంధమంద రుచినిఁ బొందనివాఁడే జితేంద్రియుఁడు.

> నాపృష్టః కస్యచిద్బ్రూయాన్నచాన్యాయేన పృచ్ఛతః ।
> జానన్నపి హి మేధావీ జడవల్లోక ఆచరేత్ ॥ –౧౧౦॥

అడుగని వారికిని, అన్యాయముతో, కపటముతో, నడుగువారికిని ఉత్తర మీయఁగూడదు. బుద్ధిమంతుఁడు వారియెదుట జడునివలె నుండవలయును. నిష్కపటులకు, జిజ్ఞాసులకు నడుగకుండినను నుపదేశింపవలయును.

విత్తం బన్ధుర్వయః కర్మ విద్యా భవతి పఞ్చమీ ।
ఏతాని మాన్యస్థానాని గరీయో యద్యదుత్తరమ్॥ "-౧౩౬॥

ధనము, బంధుత్వము (కుటుంబము, కులము,) వయస్సు, ఉత్తమ కర్మము, శ్రేష్ఠవిద్య అనునివి గౌరవ స్థానములు. కాని ధనికుని కంటె మాన్యుఁడు బంధువు. బంధువుకంటె నధిక వయస్సుగలవాఁడుత్తముఁడు. వయస్సుకంటె నుత్తమకార్యములు చేయువాఁడధికుఁడు. అతనికంటె పవిత్ర విద్యావంతుఁడు గొప్ప. ఇట్లుత్తరోత్తరులు అధికమాననీయులు.

అజ్ఞో భవతి వై బాలః పితా భవతి మన్త్రదః ।
అజ్ఞం హి బాలమిత్యాహుః పితేత్యేవ తు మన్త్రదమ్॥ "-౧౫౩॥

ఏలయనఁగా నూఱేండ్ల వయస్సు కలవాఁడైనను విద్యా విజ్ఞానరహితుఁడేని బాలుఁడనియు, బాలుఁడైనను విద్యా విజ్ఞానముల నిచ్చువాఁడేని వృద్ధుఁడనియు నెంచవలయుఁదను. అప్తులు, విద్వాంసులు అజ్ఞానిని బాలకుఁడనియు, జ్ఞానిని పితయనియు నందురు అట్లే శాస్త్రములందంతటను గలదు.

న హాయనైర్న పలితైర్న విత్తేన న బన్ధుభిః ।
ఋషయశ్చక్రిరే ధర్మం యోఽనూచానః స నో మహాన్॥ "-౧౫౪॥

మిక్కిలి వయస్సుచెల్లుటచేతఁగాని, వెండ్రుకలుతెల్లబడుటచేతఁ గాని, మిక్కిలి ధనముకలిగియుండుటచేతఁగాని, గొప్పకుటుంబపు వాఁడగుటచేతఁ గాని వృద్ధుఁడుకాఁడు; కాని మనలో విద్యావిజ్ఞానములయందు నధికుఁడైనవాఁడే వృద్ధుఁడు అని ఋషులును, మహాత్ములును నిశ్చయించియున్నారు.

విప్రాణాం జ్ఞానతో జ్యైష్ఠ్యం క్షత్రియాణాం తు వీర్యతః॥
వైశ్యానాం ధాన్య ధనతః శూద్రాణామేవ జన్మతః॥ "-౧౫౫॥

బ్రాహ్మణుఁడు జ్ఞానముచేత, క్షత్రియుఁడు బలముచేత, వైశ్యుడు ధన ధాన్యములచేత, శూద్రుఁడు జన్మముచేత, అధికవయస్సుచేత వృద్ధుఁడనఁబడును.

న తేన వృద్ధో భవతి యేనాస్య పలితం శిరః ।
యో వై యువాప్యధీయానస్తం దేవాః స్థవిరం విదుః॥ "-౧౫౬॥

విద్వాంసులు తలిదండ్రులు నెఱిసిన ముసలివానిని గొప్పవాఁడనరు. యువకుడైనను విద్యనేర్చినవానిని గొప్పవాఁడని భావింతురు.

యథా కాష్ఠమయో హస్తీ యథా చర్మమయో మృగః।
యశ్చ విప్రోఽనధీయానస్త్రయస్తే నామ బిభ్రతి॥ ౨-౧౫౭॥

విద్యచదువని మూఢుఁడు కొయ్యయేనుఁగువలె, తోలుతో జేయఁబడిన మృగమువలె జగత్తునందు నామమాత్రము మనుష్యుఁడు.

అహింసయైవ భూతానాం కార్యం శ్రేయోఽనుశాసనమ్।
వాక్చైవ మధురా శ్లక్ష్ణా ప్రయోజ్యా ధర్మమిచ్ఛతా॥ ౨-౧౫౯॥

కాఁబట్టి విద్యపఠించి విద్వాంసుఁడు ధర్మాత్ముఁడునై నిర్వైరముతో సమస్త ప్రాణుల కల్యాణముకొఱకు నుపదేశింపవలయును. ఉపదేశము చేయునపుడు వాణి మధురముగను, కోమలముగ నుండవలయును. ఇట్లు సత్యోపదేశముచేత ధర్మాభివృద్ధిని, అధర్మనాశమును జేయువారే ధన్యులు.

నిత్యము స్నానముచేయుచు వస్త్రములను, అన్నపానములను, స్థానమును శుద్ధముగా నుంచుకొనవలయును. ఏలయనఁగా నివి శుద్ధముగా నుండుటచే చిత్తశుద్ధియు, నారోగ్యమును గలిగి పురుషార్థమధికమగును. మలమును, దుర్గంధమును దూరమగునట్లు శుద్ధి చేయవలయును.

ఆచారః పరమో ధర్మః శ్రుత్యుక్తః స్మార్త ఏవ చ॥ మను.౧.౧.౦౮॥

సత్యభాషణాదికర్మముల నాచరించుటయే వేదమందును, స్మృతియందును జెప్పఁబడిన యాచారము.

మా నో వధీః పితరం మోత మాతరమ్ ॥యజుః। అ.౧౬.మం.౧౫॥
ఆచార్య ఉపనయమానో బ్రహ్మచారిణమిచ్ఛతే॥
అథర్వకాం. ౧౧ సూ.౫.మం.౧౭॥

మాతృదేవో భవ। పితృదేవో భవ। ఆచార్యదేవో భవ। అతిథిదేవో భవ॥
తైత్తిరీయారణ్యకే ప్ర. ౭. అను. ౧౧॥

(తల్లిదండ్రులకు, ఆచార్యాతిథులకు సేవచేయుట దేవపూజ యనఁబడును.) ఏయేకర్మముచే జగత్తున కుపకారము కలుగునో ఆయాకర్మములనుజేయుచు హానికారక కర్మములను వదలివేయుటయే మనుష్యుని ముఖ్యకర్తవ్యము. ఎన్నఁడును నాస్తికులు, లంపటులు, విశ్వాసఘాతుకులు మిథ్యావాదులు, స్వార్థులు, కపటులు మొదలగు దుష్టుల సహవాసము చేయఁగూడదు. సత్యవాదులు, ధర్మాత్ములు,

పరోపకార ప్రియులు నగు నాప్తులతో సహవాసము చేయవలయును. ఇదియే శ్రేష్ఠాచారము.

ప్రశ్న:-ఆర్యావర్త దేశవాసులు తమ దేశమునకంటె భిన్నమగు దేశములకుఁ బోవుటవలన నాచారము నష్టమయిపోవునా? లేదా?

ఉత్తరము:—నష్టమేమియు కాదు. ఏలన లోపల, వెలుపల పవిత్రముగ నుండి సత్యభాషణాది కర్మము లెటనొనర్చినను ఆచారమే. పర దేశమునకుఁ బోయినంతమాత్రమున ఆచారభ్రష్టుఁడు, ధర్మభ్రష్టుఁడు నెన్నటికిని గాఁడు. ఆర్యావర్తమందుండియు దుష్టాచార మొనర్చువాఁడే ధర్మభ్రష్టుఁడు. వాఁడే ఆచారభ్రష్టుఁడు. ఇతర దేశములకుఁ బోవుటచే భ్రష్టుఁడగునేని:—

మేరోర్హరేశ్చ ద్వే వర్షే వర్షం హైమవతం తతః।
క్రమేణైవ వ్యతిక్రమ్య భారతం వర్షమాసదత్॥
స దేశాన్ వివిధాన్ పశ్యంశ్చీన హూణనిషేవితాన్॥

మహాభారత శాంతి. మోక్షధర్మ. అ. ౩౨౭. శ్లో. ౧౪. ౧౫॥

ఈ శ్లోకములు మహాభారతమందు శాంతిపర్వమున మోక్షధర్మమందలి వ్యాసశుకసంవాదమందున్నవి. ఒకప్పుడు వ్యాసులు తనపుత్రుఁడగు శుకుని తోడను. శిష్యులతోడను (ఇప్పుడు అమెరికాయనఁబడు పాతాళమందు) నివసించుచుండిరి. అప్పుడు శుకాచార్యులు తమతండ్రితో ఆత్మవిద్య యింతయేనా? ఇంకనున్నదా? అని అడిగిరి. వ్యాసు లెఱిఁగియుండియు దానికిఁ బ్రత్యుత్తర మియ్యలేదు. ఏల యనఁగా నావిషయమై యంతకుమునుపే యుపదేశించియుండిరి. మఱియొక సాక్ష్యముకొఱకుఁ దనపుత్రుఁడగు శుకునితో వ్యాసులు ఓపుత్రా! నీవు మిథిలాపురికిఁ బోయి యీ ప్రశ్నను జనకరాజు నడుగుము. దానికతఁడు యథాయోగ్యముగ నుత్తరమిచ్చునని యనెను. తండ్రిమాట విని శుకాచార్యులు పాతాళమునుండి మిథిలాపురికి బయలుదేరి మొదట మేరువునకు (హిమాలయమునకు-ఈశాన్యోత్తరమునను) వాయవ్యకోణముననుగల హరివర్షమను దేశమునకువచ్చిరి. హరి యనఁగా గోరి. ఇప్పటికాదేశస్థులకు రక్తముఖము, గోఁరివంటి నీలపుకండ్లు నుండును. ఇప్పుడా దేశమును "యూరోప్" అందురు. దీనినే సంస్కృతమందు 'హరివర్ష' మనుచున్నారు) దీనిని జూచుచు నక్కడినుండి యహూదిదేశమును చూచి చైనాదేశమునకువచ్చి యక్కడినుండి హిమాలయమునకును. అక్కడి

నుండి మిథిలాపురికిని వచ్చిరి. (అశ్వతరీ) అగ్నియానమను నావయందు శ్రీకృష్ణుఁడును, అర్జునుఁడును పాతాళమునకుఁ బోయి యుధిష్ఠిరమహారాజు యజ్ఞమునకు నుద్దాలకఋషిని గొనివచ్చిరి. ధృతరాష్ట్రుని వివాహము గాంధారదేశము-'కంధహార్' దేశపు రాజపుత్రితో జరిగెను. పాండురాజుభార్య మాద్రి 'ఈరాన్' దేశపు రాజకన్య. అర్జునునికి అమెరికాదేశపు రాజపుత్రికయగు సులూపితో వివాహమయ్యెను. దేశదేశాంతరములకు, ద్వీపద్వీపాంతరములకును బోకుండిన నివియన్నియు నెట్లు జరిగినవి. ఆర్యావర్తమునుండి ద్వీపాంతరములకు పోవుచుండిన కారణము చేతనే మనుస్మృతియందు సముద్రమార్గమునబోవు నావలపైఁ బన్ను విధింపఁబడియున్నది. యుధిష్ఠిరమహారాజు రాజసూయయజ్ఞముచేసినపుడు దానియందు సమస్తభూగోళరాజులను పిలుచుటకు భీముఁడును, అర్జునుడును, నకులుఁడును, సహదేవుఁడును నాలుగుదిక్కులకును బోయియుండిరి. దోషమని తలఁచినచోఁ బోయియేయుండరు. కాఁబట్టి మొదట నార్యావర్త దేశీయులు వ్యాపారము, రాజకార్యము, సంచారము అను వీనికొఱకు సమస్త భూగోళమునందును సంచరించుచుండిరి.

ఈకాలపు అంటుముట్టులును, ధర్మము నష్టమగునను శంకయుఁ, గేవలము మూర్ఖులు భ్రమింపఁజేయుటచేతను, అజ్ఞానమగుటచేతను గలిగియున్నవి. దేశదేశాంతరములకును, ద్వీపద్వీపాంతరములకును బోయి వచ్చుటకు శంకింపనివారు అచటి యనేకవిధములగు మనుష్యులరీతి వర్తనలనుజూచి తమరాజ్యమును, వ్యవహారములను వృద్ధిపఱచుకొనుచు నిర్భయులు, శూరులు నగుదురు. మంచి వ్యవహారములను గ్రహించుటయందు, చెడ్డవానిని వదులుట యందు నాసక్తులై మిక్కిలి యైశ్వర్యమును బొందుదురు. మహాభ్రష్టులును, మ్లేచ్ఛకులోత్పన్నులునగు వేశ్యాదులసమాగమముచే ఆచారభ్రష్టులును ధర్మహీనులును గారట! దేశదేశాంతరపు టుత్తమపురుషుల సహవాసముచే దోషులగుదురట! ఇది పరమమూర్ఖతగాక మఱి యేమయియుండును. మాంసభక్షణము, మద్యపానము చేయువారి శరీరములును, వీర్యాది ధాతువులును దుర్గంధాదులచే దూషితము లగుచున్నవి. కాఁబట్టి వారి సహవాసముచే నార్యులందే దుర్లక్షణములు సంభవింపఁగలవనుట నిజమేకాని వారి మద్యపానాది దోషములనువదలి గుణములనుగ్రహించిరేని హాని యేమియు గలుగదు. వారితో వ్యవహారము చేయుట

చేతను. వారి సద్గుణములను గ్రహించుటచేతను దోషముగాని, పాపము కాని కలుగదు. విదేశీయులనంటుటయు, వారినిఁ జూచుటయుఁగూడ పాప మని మూర్ఖులు దలచుచున్నారు. కాఁబట్టి వారితో యుద్ధముఁగూడ నెన్నటికిఁజేయఁ జాలరు. ఏలయనఁగా యుద్ధమందు వారి నంటుటయుఁ, జూచుటయునావశ్యక మగును. రాగము, ద్వేషము, అన్యాయము, మిథ్యా భాషణము మొదలగు దోషములను వదలి, నిర్వైరము, ప్రీతి, పరోపకారము సౌజన్యము మొదలగు వానిని ధరించుటయే సజ్జనులకు నుత్తమాచారము. ధర్మము మనయాత్మలోను, కర్తవ్యముతోను సంబంధించి యున్నదని తెలియవలయును. మనము మంచి పనులను జేయుచుందుమేని దేశదేశాంతరములకును, ద్వీపద్వీపాంతరములకును బోవుటచే మన కేదోషమును గలుగజాలదు. దోషము పాపకర్మములు చేయుటచేఁ గలుగును. మనకెవ్వరును మిథ్యావిశ్వాసము కలిగింపకుండునట్లు మనము వేదోక్త ధర్మమును సత్యమని నమ్మి పాషండమత ఖండనవిధానము నవశ్యముగా నేర్చి యుండవలయును. దేశదేశాంతరమందును, ద్వీపద్వీపాంతరమందును రాజ్యమును, వ్యాపారమును జేయకున్న స్వదేశ మెన్నడేని ఉన్నతిని బొందఁగలదా? స్వదేశీయులు స్వదేశమందే వ్యవహారము చేయుచున్నపుడు పరదేశీయులుగూడ వచ్చి వ్యవహారమును, రాజ్యమును జేయఁదొడఁగి రేని స్వదేశీయులకు దారిద్ర్యమును, దుఃఖమును దప్ప మరేమియుఁ గలుగఁజాలదు. వీరికి విద్యనునేర్చి దేశదేశాంతరములు బోవుటకు నాజ్ఞయొసంగితిమేని వీరు బుద్ధిమంతులై, తమ పాషండజాలమందుఁ జిక్కకపోవుటచేఁ దమ ప్రతిష్ఠకును, జీవనమునకును భంగముకలుగునని తెలిసి స్వార్థపరులు వీరి నితరదేశములకుఁ బోజాలకుండునట్లు భోజనాచారములందాతంకమును గల్పించుచున్నారు. మఱియైనను మద్యమాంసములను మాత్రమెన్నఁడును గ్రహింపఁగూడదు. రాజపురుషులు యుద్ధమునందు చౌకా యేర్పఱచుకొని-మడితో వంటచేసుకొని-భోజనము చేయుట వారి పరాజయమునకు హేతువయ్యెనని బుద్ధిమంతులుచెప్పలేదా? (ఉత్తరదేశస్థులు వంటచేసికొనుటకుఁబూర్వము కొంతస్థలమును శుద్ధిచేసుకొనియుందురు. దానిదాటి వెలుపలికివచ్చుట యనాచారమని యెంతురు. దీనికి 'చౌకా' యని పేరు.) యుద్ధమం దొకచేతితో రొట్టెతినుచు. నీళ్ళు త్రాగుచు మఱియొక చేతితో రథగజాశ్వములపై నెక్కికాని, పాదచారులై కాని శత్రువులను నఱకుచుఁ

బోయి జయముఁ బొందుటయే క్షత్రియుల యాచారము. పరాజితులగుటయే యనా చారము. ఈదేశస్థుల మూఢులై 'చౌకా' యేర్పఱచుకొనుచును, మఱియట్లు కొనుచును బోయిపోయి విరోధమును పెంచిపెంచి తుదకు సమస్తస్వాతంత్ర్యమునకును, ఆనందమునకును, ధనమునకును, రాజ్యమునకును విద్యకు పురుషార్థమునకు ముగ్గు పెట్టి, పూజ్యముచేసి చేతులునలుపుకొనుచు చతికిలఁబడి యున్నారు. ఏమయిన వింతదొరుకునా ; వండి తిందుమా ; అని గుటకలు మ్రింగుచు నుందురు. కావున ఈ చౌకా, ఈ లేనిపోని మడి మొదలగునవియే ఆర్యావర్త దేశమునంత నాశనముచేసినవని యెఱుఁగఁదగును. భోజనముచేయు స్థానమును చెత్త మొదలగునవిలేకుందునట్లు ఊడ్చి యలికి క్రమముగానుంచుట మాత్రమావశ్యకము. ముసల్మానులయు, క్రైస్తవులయు పాకశాలలవలె నక్రమముగా నుంచఁగూడదు.

ప్రశ్న:-సఖరీ నిఖరీ యనఁగానేమి?

ఉత్తరము:-జల పక్వాన్నములను సఖరీయనియు, ఘృతదుగ్ధపాకమును నిఖరీయనియు నందురు ఇదియును ధూర్తులేర్పఱచిన పాషండమే. ఏలన విశేషఘృతక్షీరాదులచే పక్వముచేయఁబడిన స్నిగ్ధపదార్థములు రుచిగ నుండి యుదరములోని కధికముగాఁ బోవుననుటకే వారిట్లు కల్పించి యున్నారు. అగ్నిచేఁగాని, కాలముచేతగాని సిద్ధమైనది పక్వము అట్లు సిద్ధముకానిది అపక్వము. ఇక పక్వమునే తినవలయును. అపక్వమును తినరాదందురేని, అదియును సర్వత్ర సరిగాదు. ఏలయనఁగా సెనగలు మొదలగునవి అపక్వమైనవి కూడ దిననగునుగదా!

ప్రశ్న:-ద్విజులు తమచేతితోనే వంటజేసికొని భుజింపవలయునా? లేక శూద్రునిచే వండించి తినవలయునా:

ఉత్తరము:-శూద్రునిచే వండించి తినవలయును. ఏలయనఁగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యవర్ణస్థ స్త్రీపురుషులు విద్య నేర్పుటయందును, రాజ్య పాలనమందును, పశుపాలనకృషివాణిజ్యము లందును తత్పరులై యుండ వలయును. శూద్రుని పాత్రలయందును, వాని యింటను వండిన యన్నమును ఆపత్కాలమందుఁ దప్ప మఱెప్పుడును దినఁ గూడదు. ప్రమాణమును చూడుఁడు.

ఆర్యాధిష్ఠితా వా శూద్రాః సంస్కర్తారః స్యుః॥
ఆపస్తంబ ధర్మసూత్రము। ప్రశ్న. ౨. పటల. ౨. ఖండ. ౩. సూ. ౪॥

ఆర్యులగృహములందు శూద్రులు-మూర్ఖ స్త్రీపురుషులు-పాకపరిచారకత్వాది కార్యములు చేయవలయునుకాని వారు శరీరవస్త్రాదులచేఁ బవిత్రులుగా నుండవలయును. ఆర్యుల గృహములందు వంటచేయునపుడు వారి నోటినుండి యుచ్ఛిష్టముగాని, శ్వాసముగాని వెడలి అన్నము నంటకుండునట్లు నోరుమూసి కాని చేయవలయును. వారు ఎనిమిది దినముల కొకతూరి క్షౌరము చేయించుకొని గోళ్ళు తీయించుకొనుచుండవలయును. స్నానముచేసియే వంటచేయవలయును. ఆర్యులను భుజింపజేసి పిమ్మటఁ దాము భుజింపవలయును.

ప్రశ్న:-శూద్రుఁడంటిన పక్వాన్నమును దినుటయే దోషమగునేని, వాని చేతులతోవండిన దెట్లు తిననగును?

ఉత్తరము:-ఇది మీ మిథ్యాకపోలకల్పితము. బెల్లము, చక్కెర, నెయ్యి, పాలు, పిండి, శాకఫలమూలాదులను దిన్నవారు జగత్తులో నున్న జనులందఱి చేతినుండియు, నందఱియెంగిలియుఁ దిన్నవారేయని యెఱుఁగఁదగును. ఏలయనఁగా పొలములోని చెఱకులనుగోసి గానుగులోవేసి రసము దీయునపుడు శూద్రులు, మాలమాదిగలు, తురకలు, క్రైస్తవులు, మలమూత్రములవిడిచి కడుగనిచేతితో వానినంటుదురు, ఎత్తుదురు, దాచుదురు. సగముపీల్చి తిని దానియందే వేయుదురు; రసమును వండునపుడు తమ రొట్టెలను గూడ నదే ప్రొయ్యిమీద వండుకొందురు. చక్కెర జేయునపుడు మలము, మూత్రము, పేఁడదుమ్ము తగిలియున్న పాదరక్షల అడుగుబిళ్ళలతో ఊతురు. పాలయందు దమ యింటియెంగిలి పాత్రలతో నీళ్ళను గలుపుదురు. వానియందే నెయ్యి మొదలగు వాని దాచుదురు. పిండి విసరునపుడును, ఎంగిలిచేతులతో నెత్తుదురు. చెమటయు పిండిలో జారుచుండును. ఈ మొదలగునవియన్నియు జరుగుచుండును. ఫలమూలకందములందు నిట్లే జరుగుచుండును. ఈ పదార్థములను దినినప్పుడు అందఱిచేతినుండి తినినవారేయనుట స్పష్టము.

ప్రశ్న :- కందమూలఫలరసా ద్యదృష్టములందు దోషములేదు.

ఉత్తరము :- భళీభళీ! ఇట్టి యుత్తరమీకుండు రేని మీ రేమి బాసిద, మన్నుతిని బ్రతుకుదురా! చక్కెర, బెల్లము తియ్యనివిగనుక పాలు నేయి

పుష్టికరములుగనుక వీనిని వదలుట కిష్టములేక యీమాటను గల్పించితిరికద. ఇఁక సదృష్టపదార్థమునందు దోషములేదేని పాకీవారును, దురకలును దమ చేతులతో మహోత్కృష్టాసమంచు వంటచేసి మీకిచ్చిరేని మేరేల తినరు? కాఁబట్టి అదృష్టమందును దోషమున్నది. ఇవియన్నియు మద్యమాంసాహారులగు ముసల్మానులయుఁ గ్రైస్తవులయుఁ జేతులనుండి తినుటచేత నార్యులకుఁ గూడ మద్యమాంసాదులనుదిను—త్రాగు—దోషము సంభవించునని కల్పించినకల్పనలే కావి పరస్పరమార్యుల సహభోజనమున నేమియు దోషము కనఁబడదు. ఒకే మతస్థులై పరస్పరహానిలాభములను సుఖదుఃఖముల నొక్కటిగా భావింప నంతవఱకు నున్నతికెలుగుటమిక్కిలి కఠినము. కేవలము భోజనపానములొక్క టగుటవలననే సంస్కరణ కాఁజాలదు. చెడువిషయములను వదలి మంచి వానిని జేయకుండువఱకు వృద్ధికి మాఱుగ హానియే కలుగుచుండును.

విదేశీయుల కార్యావర్తమందు రాజ్యమేర్పడుటకుఁ గారణము లెవ్వి యనఁగా:- స్వదేశీయుల పరస్పరవిరోధము, మతభేదము, బ్రహ్మచర్య లోపము, విద్య చదువకుండుటయు జదివింపకుండుటయు, బాల్యావస్థయందు అస్వయంవర వివాహములు, విషయాసక్తి, మిథ్యాభాషణాదిదుర్లక్షణములు, వేదవిద్య ప్రచారము లేకపోవుట ఇః మొదలగు దుష్కర్మములే కారణములు. అన్నదమ్ములు తమలోఁదాము కలహింపఁ దొడఁగినపుడే మూఁడవవాఁడు మధ్యస్థుడై వచ్చి యింటివి ఆక్రమించుకొని కూర్చుండును. అయిదు వేలేండ్ల క్రిందట జరిగిన మహాభారతపు సమాచారమును మీరు వినియున్నారుగద. చూడుఁడు! అప్పుడు యుద్ధములో వాహనముల మీఁదనే తినుచును, త్రాగు చును యుద్ధముచేసిరి. అట్లే చేయవలయునుకాని, పరస్పర విరోధముచేతనే పాండవులును, గౌరవులును, యాదవులును నాశనమయి పోయిరి. వారు పోయిరి కాని ఆ పరస్పర విరోధమను రోగమింకను వెన్నంటియేయున్నది. ఈ భయంకరరాక్షస మెన్నఁడేని విడివడునా లేదా? ఆర్యుల సందఱను సుఖముల నుండి దూరముచేసి దుఃఖసాగరమందే ముంచివేయునా? తెలియుటలేదు. దుష్టుఁడును, గోత్రఘాతుకుఁడును, స్వదేశవినాశకుఁడును, నీచుఁడునగు నాదుర్యోధనుని దుష్టమార్గమందే ఆర్యులిప్పటివఱకును నడచుచు దుఃఖములఁ

తెంచుకొనుచున్నారు. ఆర్యులనుండి యీ రాజరోగము దూరమగుటకు పరమేశ్వరుఁడనుగ్రహించుగాక !

భక్ష్యాఽభక్ష్యములు రెండువిధములు. ఒకటి ధర్మశాస్త్రోక్తము: రెండవది వైద్యశాస్త్రోక్తము. ధర్మశాస్త్రమందు:-

అభక్ష్యాణి ద్విజాతీనామమేధ్యప్రభవాణి చ॥ మను. ౫.౫॥

ద్విజులు-బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు-శూద్రులు మలమూత్రాది సంసర్గముచే నుత్పన్నమగు శాకఫలమూలాదులను దినఁగూడదు.

వర్జయేన్మధు మాంసం చ. మను. ౨.౧౭౭॥

నానావిధములగు మద్యములను గంజాయి, భంగు, నల్లమందుమున్నగు వానిని, మాంసమును వర్జింపవలయును.

బుద్ధిం లుంపతి యద్ద్రవ్యం మదకారీ తదుచ్యతే॥ శార్ఙ్గధర. అ. ౪. శ్లో. ౨౧॥

బుద్ధిని నాశనముచేయు పదార్థముల నెన్నఁడును సేవింపఁగూడదు. అట్లే పాసిన, చెడిన, దుర్గంధాదులచే దూషితమయిన, బాగుగ పక్వముకాని-యన్నమును-నాహారమును-దినఁగూడదు. మద్యమాంసాహారులగు మ్లేచ్ఛాదుల శరీరము మద్యమాంస పరమాణువులచేఁ బూరితమైయుండును గాన వారి చేతి యన్నమును దినఁగూడదు ఒక యావునుండి పాలు, నేయి, యెద్దు, ఆవు, అనునివి కలుగుచు దానిఒక్క జీవితమున నాలుగులక్షల డెబ్బదియైదు వేల యాఱువందల మనుష్యులకు సుఖమిచ్చును. ఇట్లు ఉపకారముచేయు ప్రాణులను జంపఁగూడదు. ఒకదినమునకు మంచియావు ఇఱువదిసేర్ల పాలిచ్చును. కనిష్ఠమైన యావు రెండుసేర్ల పాలిచ్చును. వీని రెంటిని గలిపి సరాసరి చేసితిమేని మొత్తముమీఁద ప్రతిదినము ప్రతిఆవునుండి పదునొకండు సేర్ల పాలువచ్చును. కొన్ని పదునెనిమిది నెలల వఱకును గొన్ని యాఱు నెలల వఱకును పాలిచ్చును దీనిని సగటు చేసితిమేని పండ్రెండు నెలలగును. ఇట్లొక్కొక్క ఆవు జీవితమున దానిపాలచే నిఱువదినాలుగు వేల కొమ్మిది వందల యఱువదుగురు మనుష్య లొక పర్యాయము తృప్తులు కాఁగలరు. దాని కాఱు పెయ్యదూడలును, ఆఱు కోడెదూడలును బుట్టునని కొందము. వానిలో రెండు గతించినను పది జీవించియుండును. వానియందు నైదు పెయ్యదూడలు తమ జీవితమున లక్ష యిఱువది నాల్గువేల యెనిమిది

వందల మనుష్యులను దమపాలచేఁ దృప్తిపఱచును. ఇఁక నా యావెద్దులు తన జీవితమున నయిదువేల మణుగుల యన్నము నుత్పన్నము చేయఁగలుగును. ఆ యన్నములో ప్రతి మనుష్యుఁడు మూఁడుపావులు తిన్నను, రెండు లక్షల యేఁబది వేల మనుష్యులు తృప్తులగుదురు. పాలను అన్నమును గలిపితిమేని మూఁడు లక్షల డెబ్బదినాలుగువేల యెనిమిదివందల మనుష్యులు తృప్తులగుదురు. రెంటినిగలిపితిమేని ఒక ఆవు తన జీవితమందు నాలుగులక్షల డెబ్బదియయిదువేల ఆఱువందల మనుష్యుల నొక పర్యాయము తృప్తి పఱుచును. తరతరములు లెక్కించితిమేని లెక్కలేని మనుష్యులు పాలింపఁబడుదురు ఇదిగాక యెద్దులు బండ్లనులాగుట, బరువులు మోయుట మొదలగు పనులచే మనుష్యులకు మిక్కిలి యుపకారముచేయును. పాలవిషయమున ఆవులధికముగా నుపకారకములగును. మరియు నెద్దులవలె దున్నలు నుపకారకములగును అట్లే గేదెలును గలవుకాని ఆవుపాలచేతను, నెయ్యి చేతను, బుద్ధి వృద్ధియయి లాభము కలుగునంత గేదెపాలచేఁగలుగదు. కాఁబట్టియే ఆర్యులు ఆవును ముఖ్యోపకారకముగ నెంచిరి. ప్రతి విద్వాంసుఁడు నీ ప్రకారమే యెంచును. మేఁకపాలచే నిరువదియయిదు వేల తొమ్మిదివందల యిరువది మంది మనుష్యులు పాలింపఁబడుదురు. అట్లే యేనుఁగు ఒంటె, గుఱ్ఱము, గొఱ్ఱె, గాడిద మొదలగు వానిచేతను మిక్కిలి యుపకారము కలుగును. (వీని విశేష వ్యాఖ్య "గోకరుణానిధి" యందు వ్రాయఁబడి యున్నది. అక్కడఁ జూడుఁడు) కాఁబట్టి యీ పశువులను జంపువారు మనుష్యులనందఱను జంపువారని తెలిసికొనవలయును. చూడుఁడు! ఆర్యుల రాజ్యముండినపుడు మహోపకారము చేయు ఈ యావు మొదలగు పశువులు చంపఁబడు చుండలేదు. అప్పుడే ఆర్యావర్తమందును, అన్యదేశముల యందును, మనుష్యాదిప్రాణులానందముతో నుండిరి. ఏలయనఁగా పాలు నేయి, ఎద్దులు, మొదలగు పశువులు మిక్కిలిగా నుండుటచే నన్నరసములును పుష్కలముగాలభించుచుండెను. విదేశీయులగు మాంసాహారులీదేశమునకువచ్చి గవాదిపశువుల చంపువారును, మద్యపానము చేయువారును రాజ్యాధికారులయిననాటనుండి క్రమముగ ఆర్యులకు దుఃఖమే వృద్ధియగుచు వచ్చుచున్నది. ఏలయనఁగా:-

నష్టే మూలే నైవ ఫలం న పుష్పమ్ ॥ వృద్ధచాణక్యము. అ. ౧౦. ౧౩ ॥

వృక్షమూలమునే కొట్టివేసినపుడు ఫలపుష్పము లెక్కడినుండివచ్చును.

ప్రశ్న:- అంతఃఖ సహింసకులై రేని పులి మొదలగు మృగములు ప్రబలమయి, ఆవు మొదలగు పశువులన్నిటిని జంపి తినివేయును కద. ఇఁక మీపురుషార్థమే వ్యర్థమయిపోవును.

ఉత్తరము:- హానిబిలుగఁజేయు మృగములనేకాదు. అట్టి మనుష్యులను గూడ దండించుటయు, ప్రాణములు తీయుటకూడ క్షత్రియాది రాజుల కర్తవ్యమై యున్నది.

ప్రశ్న:-అట్లుచంపఁబడిన మృగముల మాంసము పాఱవేయవలయునా?

ఉత్తరము:- పాఱవేసినను వేయవచ్చును. లేదా కుక్క మొదలగు మాంసముదిను మృగములకు పెట్టవచ్చును. లేక కాల్చి వేయవచ్చును. ఎవఁడేని మాంసాహారి ఆమాంసమునుదినినను ప్రపంచమునకేమియు హానికాదు. కాని యా మనుష్యుఁడు మాంసాహారస్వభావము కలవాఁడయి హింసకుఁడౌన నుట మాత్రము నిశ్చయము.

హింస, చౌర్యము, విశ్వాసఘాతము, మోసము, కపటము అను వీనిచేఁ బదార్థములను సంపాదించి భోగించుటయే అభక్ష్యము. అహింసాది ధర్మ పూర్వకముగ నార్జించిన పదార్థములను సేవించుట భక్ష్యము. స్వాస్థ్యము, రోగని వారణము, బుద్ధిబలపరాక్రమవృద్ధి, ఆయుర్వృద్ధినిచ్చునట్టి బియ్యము, గోదు మలు, పండ్లు, కందమూలములు, నేయి, పాలు, చక్కెర మొదలగు పదార్థ ములను దగినట్లు పచనముచేసి, తగిన సమయ మందు, మితముగా భుజించుట భక్ష్యమనఁబడును. వికారములను గలుగఁజేయు-దమదమ ప్రకృతికి విరుద్ధము లైన పదార్థములను - సర్వథా వదలి విహితములగువానిని గ్రహించుటయు భక్ష్యమే.

ప్రశ్న:- ( ఒకపళ్లెములో ) కలిసి భోజనము చేయుటయందు దోష మున్నదా? లేదా?

ఉత్తరము:- దోషమున్నది. పరస్పరస్వభావమును ప్రకృతియుఁ గలియకుండును. కుష్ఠురోగులు మొదలగు వారితోఁ గలిసి భుజించుటచే మంచి వారి రక్తముఁగూడ చెడిపోవును. కాన నితరులతోఁ గలిసి తినుటచేఁ గొంత చెఱుపు గలుగవచ్చునుగాని మేలు కలుగదు. కాఁబట్టి:-

నోచ్ఛిష్టం కస్యచిద్దద్యాన్నా ద్యాచ్చైవ తథాంతరా ।
నచై వాత్యశనం కుర్యాన్నచోచ్ఛిష్టః క్వచిద్వ్రజేత్॥ మను. అ. ౨. శ్లో. ౫౬॥
తనయెంగిలి యితరుల కీయఁగూడదు. ఎవ్వరితో భోజనమునదుమను దాను భుజింపఁ గూడదు. అధికముగా భుజింపఁగూడదు. భోజనము చేసిన పిమ్మట చేతులు గడిగికొనక యిక్కడి కక్కడికిఁ బోఁగూడదు.

ప్రశ్న:- 'గురోరుచ్ఛిష్టభోజనమ్' ఈవాక్యమున కర్థమేమి?

ఉత్తరము:- గురువు భోజనము చేసిన పిమ్మట వేరుగా మిగిలియున్న శుద్ధాన్నమును శిష్యుఁడు భోజనముచేయవలయునని దీని యర్థము. ముందుగా గురువునకు భోజనముచేయించి తరువాత శిష్యుఁడుభుజింపవలెనని తాత్పర్యము.

ప్రశ్న:- ఉచ్ఛిష్టమంతయు నిషిద్ధమేని, ఈఁగలయుచ్ఛిష్టమగు తేనె, దూడయుచ్ఛిష్టమగు పాలు, ఒకముద్దఁ దిన్నపిమ్మట మిగిలినయన్నము నుచ్ఛిష్టములేయగును. వానినిగూడ మనము తినఁగూడదు గదా?

ఉత్తరము:- తేనెను ఉచ్ఛిష్టమందురు కాని అదియనేకౌషధముల సార మగుటవలన గ్రాహ్యము. దూడ తనతల్లిపొదుగులోని వెలుపలి పాలుద్రాగునే కాని లోఁపలను త్రాగదు. కాఁబట్టి యుచ్ఛిష్టముకాదు. దూడత్రాగి పిమ్మట తల్లి పొదుగును నీళ్ళతోఁగడిగి పరిశుద్ధమగు పాత్రయందుఁ బిండవలయును ఇఁక తనయుచ్ఛిష్టము తనకు వికారకారకమును గాదు. ఒకరి యెంగిలి మఱియొకరు దినగూడదనుట న్యాయము. ఏలన తన ముఖము, ముక్కు చెవి, కన్ను, గుహ్యేంద్రియముల, మల మూత్రాదులనంటుట యసహ్యముకాదు. కానియిత రుల మలమూత్రముల నంటుటయం దసహ్యము కలుగును. కాఁబట్టి తనయెంగిలి తనకు వికారము కాదనుట విపరీతముకాదు. కాఁబట్టి యితరులయుచ్ఛిష్టమును- ఎంగిలిని దినకుండుట మనుష్యులందఱ కుచితము.

ప్రశ్న:- స్త్రీపురుషులుగూడ పరస్పరము ఉచ్ఛిష్టము తినఁగూడదా?

ఉత్తరము:- తినఁగూడదు. వారిశరీరస్వభావములును భిన్నభిన్నములే.

ప్రశ్న:- మనుష్యమాత్రుఁడు వండినదానిని దినుటచే నేమిదోషము? బ్రాహ్మణశరీరమున రక్తము, ఎముకలు, మాంసము, తోలు, వీనితోఁ గూడి యున్నట్లే చండాలాదులశరీరములు నట్లేరక్తమునున్నగువానిచే గూడియున్నవి కాఁబట్టి మనుష్యమాత్రునిచే వండఁబడిన దానిని దినుటయం దేమి దోషము?

ఉత్తరము:- దోషమున్నది; ఏలయనఁగా నుత్తమపదార్థములను దిని బ్రాగుటచే బ్రాహ్మణీ బ్రాహ్మణుల శరీరములందు దుర్గంధాదిదోషరహితములగు రజోవీర్యములుత్పన్నములగునట్లు చండాలురశరీరములందుఁగావు. చండాలుర శరీరము దుర్గంధమైన పరమాణువులచే నిండియుండును. బ్రాహ్మణాదుల వట్లుండదు. కాఁబట్టి బ్రాహ్మణాది యుత్తమవర్ణములవారిచేతఁ దిన వలసినదే కాని, చండాలాదినీచులగు మాలమాదిగలచేతఁ దినగూడదు. తల్లి, అత్త, వదినె, కూఁతురు, కోడలు, మున్నగువారి శరీరమువలెనే మీ స్త్రీశరీరమును గలదు. తల్లి మొదలగు స్త్రీలతో, స్వస్త్రీతో వర్తించునట్లేల వర్తింపరని మిమ్మెవ్వరేని అడిగిన మీరు సంకోచపడి యూరకుండవలసి వచ్చునుగద! చేతిలోను, నోటిలోను, ఉత్తమాన్నములు తిననగునట్లు దుర్గంధములను దిన నగునా? మఱేల మలాదులను దినరని అడిగిన బాగుగ నుండునా?

ప్రశ్న :- ఆవు పేఁడచే నలుకునట్లు తమ పేఁడచే నేలయలుకరు? చౌకా లోనికిఁ బేఁడ దెచ్చుటవలన స్థానము మలినమైపోదా?

ఉత్తరము :- ఆవుపేఁడయందు మనుష్యుని మలమువంటి దుర్గంధము లేదు. జిగటఁ గలిగియుండును. కాఁబట్టి శీఘ్రముగా పేఁడెత్తదు. వస్త్రములు చెడవు. మలినముగాదు. మన్నునుండి దుమ్ములేచునట్లు పేఁడనుండి లేవదు. మన్నును గలిపి యలుకుటచే జూచుటకు నందముగానుండును. ఇఁక భోజనాదులు చేయుటచేతను, నేయి, చక్కెర, ఎంగిలి పడుటచేతను పాకశాల మలినమైపోవును. దానిచే ఈఁగలు, పురుగులు, విశేషముగా నటుఁజేరును. ఇఁకస్థానమును బ్రతిదినమును ఊడ్చి పేఁడ మన్ను వీనితో నలికి యన్ని విధముల శుభ్రముగా నుంచుకొనవలయును. గచ్చుటిల్లయ్యేనేని నీటితో బాగుగఁ గడుగఁ దగును. దానిచే బూర్వోక్తదోషములన్నియు నివృత్తియగును. తురకల వంటయింట్లయందొకవైపున బొగ్గులు, ఒకవైపున బూడిద, ఒకవైపున కట్టెలు, అక్కడఁ బగిలిన కుండలు, ఇక్కడ నెంగిలి గిన్నెలు, అక్కడ నెముకలు, ఇక్కడ మన్నుపడి ఈఁగలచే నిండి అసహ్యముగ నుండును. ఎవఁడేని శ్రేష్ఠపురుషుఁడు అక్కడకుఁబోఁదటస్థించెనేని వమనము చేసికొనును. మఱియు తురకలు పేఁడచే వంటయిల్లలుకుటయందు దోషము గలదందురు. వారు దమప్రొయ్యిలోఁ బిడుకలుకాల్చి యానిప్పుతోఁ జుట్టలుగాల్చుట చేతను

దమయింటిగోడలకు పేడబూయించుటచేతను భ్రష్టులగుటయే గాక వారి చౌకా కూడ భ్రష్టమైపోవుననుటకు సందేహముండదు గద.

ప్రశ్న:- చౌకాలోఁగూర్చుండి భోజనము చేయుట మంచిదా? వెలుపల భుజించుట మంచిదా?

ఉత్తరము :- సుందరరమణీయస్థానమని తోఁచినచోటఁ గూర్చుండి భోజనము చేయవలయును. కాని, అవసర యుద్ధాదులయందుమాత్రము గుఱ్ఱము మొదలగు యానములమీద గూర్చుండియో, నిలుచుండియో తినుటయు, త్రాగుటయు నత్యావశ్యకము.

ప్రశ్న:-తనచేతిభోజనమే చేయవలయునా? ఇతరులచేతిది తినఁగూడదా?

ఉత్తరము :- ఆర్యులు పరిశుభ్రముగ వంట చేయుదురేని ఆర్యులందఱితో సరిగకూర్చుండి భోజనముచేయుటయందేమియు హానిలేదు. బ్రాహ్మణాదివర్ణస్త్రీ పురుషులే వంటచేయుచు అలుకుచు, ఊడ్చుచు, పాత్రలను తోముచునుందురేని విద్యాదిగుణములెన్నటికిని వృద్ధిపొందజాలవు. చూడుఁడు: యుధిష్ఠిరమహారాజు చేసిన రాజసూయయజ్ఞమందు భూగోళమండలి రాజులును, ఋషులును, మహర్షులును వచ్చియుండిరి. అందఱు నొకచే పాకశాలయందు భోజనము చేయుచుండిరి. క్రైస్తవ మహమ్మదీయాది మతమతాంతరములు ప్రబలమై తమలోఁదమకు విరోధములు కలిగి మద్యపానము, గోమాంసాదిభోజనము చేయఁదొడగిన నాటినుండి భోజనాదులయందుఁ గశలు కలిగెను. చూడుఁడు: కాబూలు, కందహారు, ఈరాన్, అమెరికా, యూరోపు మొదలగు దేశముల రాజకన్యలగు గాంధారి, మాద్రి, ఉలూపి మొదలగు వారిని ఆర్యావర్తీయులగు రాజులు వివాహమాడిరి. శకుని మొదలగువారు కౌరవ పాండవులతోఁ గలిసి భోజనాదులు చేయుచుండిరి. విరోధించుచుండలేదు. ఏలయనఁగా నప్పుడు భూగోళమందంతట నొక్కవేదోక్త ధర్మమే యుండెను. అందర నిష్ఠయు దానియందేయుండెను ఒకరి సుఖదుఃఖ హానిలాభముల నితరులు తమవని తలంచుచుండిరి. అప్పుడే భూగోళమందు సుఖముండెను. ఇప్పుడనేక మతస్థులగుటచే మిక్కిలి దుఃఖము, విరోధము వర్ధిల్లినది. దీనిని దూరపఱచుటయే బుద్ధిమంతుల కుచితము. మిథ్యామతములు శీఘ్రముగా నశించుట కా పరమాత్ముఁడందఱమనస్సులందు సత్యమతాంకు

ంమును నాటునుగాక. ఈ విషయమునందు విద్వాంసులందఱును విచారించి విరోధము వదలి యానందమును వృద్ధిపఱతురుగాక.

ఇది సంక్షేపముగ ఆచారానాచారభక్ష్యాభక్ష్యముల విషయము. ఈ గ్రంథపూర్వార్ధ మీపదియవ సముల్లాసముతో ముగిసినది. ఈ సముల్లాసములయందు విశేషించి ఖండనములు వ్రాయఁబడలేదు. ఏలయనఁగా మనుష్యుఁడు సత్యాసత్యవిచారమందు నించుకేని సామర్థ్యమును వృద్ధిపఱచుకొననంతవఱకు స్థూల సూక్ష్మ ఖండనల యభిప్రాయమును దెలిసికొనజాలడు. కాఁబట్టి మొదట సత్యశిక్షయే యెల్లర కుపదేశింపఁబడినది. ఇఁక నాలుగు సముల్లాసములుగల యుత్తరార్ధమందు ఖండనమండనములు వ్రాయఁబడును. ఈ నాలిగింటిలో మొదటిసముల్లాసమందు నార్యావర్తీయ మతమతాంతరములయు, రెండవవానియందు జైనులయు, మూఁడవ దానియందుఁ గ్రైస్తవులయు, నాల్గవదానియందు ముసల్మానులయు మతఖండన విషయములు వ్రాయఁబడును. పిమ్మటఁ బదునాల్గవ సముల్లాసాంతమందు స్వమతమును జూపింపబడును. విశేషించి ఖండనమండనలను జూడఁగోరువారీనాలుగు సముల్లాసములందుఁ జూడఁగలరు. అక్కడక్కడ పది సముల్లాసములలోనే కొంత ఖండనమును మండనమును చేయఁబడినది. ఈ పదునాలుగు సముల్లాసములను పక్షపాతము వదలి న్యాయదృష్టితోఁ జూచువారికి నాత్మయందు సత్యార్థప్రకాశము కలిగి యానందమంకురించును. హఠము, దురాగ్రహము, ఈర్ష్య వీనితోఁ జూచువారికిఁగాని, వినువారికిగాని ఈ గ్రంథాభిప్రాయము యథార్థముగ విదితమగుట మిక్కిలి కఠినము. కాఁబట్టి యథారీతిని విచారింపనివాఁడు దీనియభిప్రాయమును దెలిసికొనలేక మునిగిపోఁగలఁడు. సత్యాసత్యనిర్ణయముచేసి సత్యమును గ్రహించి యసత్యమునువదలి పరమానందమునొందు గుణగ్రాహకులే విద్వాంసులై, ధర్మార్థకామమోక్షములను ఫలములనుబొంది ప్రసన్నులై యుందురు. ఇదయే విద్వాంసుల కర్తవ్యము.

శ్రీమద్దయానంద సరస్వతీస్వామి కృతమును
సుభాషావిభూషితమునగు సత్యార్థప్రకాశమున
ఆచారానాచార భక్ష్యాభక్ష్య విషయములుగల
దశమ సముల్లాసము సంపూర్ణము



# సత్యార్థ ప్రకాశము

ఉత్తరార్ధము

## అనుభూమిక

వేదోక్త సమస్తవిషయములును విద్యకు విరోధించినవి కావు. ఏలన ఐదువేలసంవత్సరములకుఁబూర్వము వేదమతము తప్ప మఱొక మతము లేకుండెననుటయే నిర్వివాదాంశము. మఱి వేదప్రచారము లోపించుటకు మహాభారతయుద్ధమే కారణము. ఆలోపమువలన నవిద్యాంధకారము భూగోళమంతట నావరింపఁగా మనుష్యులబుద్ధి భ్రమచెంది. యెవనికిఁ దోఁచినమతమును వాఁడు ప్రవేశపెట్టుచు వచ్చెను. వానియన్నిటిలోను వేదవిరుద్ధములైన పౌరాణిక జైన క్రైస్తవ మహమ్మదీయములను నాలుగుమతములే యన్ని మతములకును మూలములు. ఇవి యొకదానివెనుక నొకటి క్రమక్రమముగాఁ బ్రచలితమైనవి. ఈ నాలిగింటి శాఖలు వేయింటికంటెఁ దక్కువలేవు. సమస్త మతవాదులకును, వారిశిష్యులకును, దక్కిన యందఱకును బరస్పరము సత్యాసత్య విచారణ చేయుటలో నధిక పరిశ్రమగాకుండుటకొఱకే ఈ గ్రంథమును రచించితిని. అందఱకుఁ దెలియుటయే ప్రయోజనమని భావించి, దీనియందు సత్యమతమండనమును, అసత్య మతఖండనమును వ్రాసితిని. నా బుద్ధికొలఁది నావిద్యానుసారము ఈ నాల్గుమతముల మూలగ్రంథముల నవలోకించుటవలన నాకుఁదోఁచినంతసందఱయెదుట నివేదించుటయేయుత్తమమనియూహించితిని. ఏలయనఁగా, గుప్తమైనవిజ్ఞానము మరలలభించుట సహజముకాదు. పక్షపాతము వదలి యీ గ్రంథమునుఁ జదువుటవలన సత్యాసత్యమతము లెల్లరకుఁ దెలియఁ గలవు. పిమ్మట వారివారి తెలివికొలఁది సత్యమతమున గ్రహించుటయును. అసత్యమతములను త్యజించుటయును వారికి సులభమగును. వీనిలోఁ బురాణాది గ్రంథములనుబట్టి శాఖ శాఖాంతర రూపములనొంది. యార్యావర్త దేశ

మునందుఁ బ్రచలితమైయున్నమతముల గుణదోషములను సంక్షిప్తముగా నీపదునొకండవ సముల్లాసమునఁ గనబఱచుచున్నాఁడను. ఒకరికి హానిగలుగఁ జేయుటగాని, యొకరితో విరోధముఁబూనుటగాని నా యభిప్రాయముకాదు. కాని సత్యాసత్యనిర్ణయముఁ జేయుటయుఁ జేయించుటయు నాపని. కావున నా యీకార్యముపకారమని యెన్నకపోయినను, విరోధము మాత్రముచేయకుఁడు. ఈ రీతినే మనుష్యులందఱును న్యాయవిచక్షణగల్గి వర్తించుట యత్యుచితము. మనుష్యుఁడై పుట్టినది సత్యాసత్యనిర్ణయము చేయుటకును జేయించుటకునే కాని, వాదవివాదములొనర్పుచు విరోధము బూనుటకుఁగాని, కలిగించుటకుఁ గాని కాదు. ఈమతమతాంతరముల వివాదములవలన జగత్తునందు నింత వఱకుఁ బుట్టినట్టియు, నిప్పుడు పుట్టుచున్నట్టియు, నింకముందుఁబుట్టఁబోవు నట్టియు ననర్థములను బక్షపాతరహితులైన విద్వాంసు తెలుపగసమర్థులు. ఈ మనుష్యజాతిలో మిథ్యామతమతాంతరముల పరస్పర విరుద్ధవాదములు దూరము గానంతవఱకు నన్యోన్యానందము కలుగఁజాలదు కావున మనుష్యులమగు మన మందఱమును, అందులో ముఖ్యముగా విద్వజ్జనులును ఈర్ష్యాద్వేషములను వదలి, సత్యాసత్యనిర్ణయముచేసి సత్యగ్రహణమును అసత్యపరిత్యాగమును జేయఁ జేయింప గోరుట యసాధ్యముకాదు. ఈ విద్వాంసుల విరోధమును బట్టియే యందఱును విరోధమను వలలోఁదగులుపడియున్నారనుటకు సందేహములేదు. కాని స్వార్థపరత్వమునకు లోఁబడక యందఱుప్రయోజన సిద్ధి కొఱకుఁ బాటుపడదలఁచిన నైకమత్యమిప్పుడుగూడఁ గలుగవచ్చును. దీనికి గావలసిన యుపాయముల నీగ్రంథముచివర వ్రాయఁగలవాఁడను. సర్వశక్తి మంతుఁడగు పరమాత్మ మనుష్యులందఱు నొక్కమతమునే యవలంబించునట్టి యుత్సాహమును వారి యాత్మలందుఁ బ్రకాశింపఁజేయునుగాత.

విద్వద్వర శిరోమణులకు వివరములోఁ బనిలేదు.



# ఏకాదశ సముల్లాసము

## ఆర్యావర్తీయ మత ఖండన మండనములు

ఇప్పుడు ఆర్యావర్తదేశమునందు నివసించు నార్యజనుల మతముల ఖండనమండనములు చేయఁబోవుచున్నాను. భూగోళమునం దార్యావర్త దేశమువంటి దేశము మఱొకటేదియును లేదు. కావుననే యీ భూమికి సువర్ణ భూమి యని పేరువచ్చినది. ఏలయనఁగా నిది సువర్ణరత్నాదుల నుత్పన్నము చేయును. ఇందువలననే సృష్ట్యాదియం దార్యజను లీదేశమునకువచ్చి నివసించిరి. కాఁబట్టి సృష్ట్యుత్పత్తి ప్రకరణమున ఉత్తమపురుషులను ఆర్యులనియు, వారికంటె నన్యులైనవారిని దస్యులనియు వ్రాసి యున్నాఁడను. భూగోళమునఁగల దేశముల వారందఱును ఈ దేశమునే ప్రశంసించుచున్నారు. ఇఁక బరుసవేదియను రాయి యున్నదనుమాట యబద్ధము కాని యీ దేశమే యథార్థమైన పరుసవేదియనియు, లోహరూప దరిద్రావస్థలోనున్న విదేశీయులు దీనిఁ దాఁకినమాత్రాన సువర్ణముగా- ధనాఢ్యులుగా- మాఱుచున్నారనియు నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

ఏతద్దేశప్రసూతస్య సకాశా దగ్రజన్మనః ।
స్వం స్వం చరిత్రం శిక్షేరన్ పృథివ్యాం సర్వమానవాః ॥మను. ౨. ౨౦॥

సృష్టి మొదలుకొని ౫౦౦౦ సంవత్సరములకుఁ బూర్వమువఱకు ఆర్యులు సార్వభౌమ చక్రవర్తులుగా ననఁగా భూగోళమంతట నేకచ్ఛత్రముగా రాజ్య మేలుచుండిరి. అన్యదేశములందు మాండలిక రాజులు అనఁగా సామంత రాజులుండిరి. ఏలయనఁగాఁ గౌరవపాండవులవఱకు నిచ్చటి రాజ్యమునకును, రాజశాసనమునకును భూగోళమందలి రాజులందఱును, సమస్త ప్రజలును లోఁబడి వర్తించుచుండిరి. చూడుఁడు: సృష్ట్యాదియందు రచియింపఁబడిన మనుస్మృతిలోఁ దానికి ప్రమాణముగా నిట్లున్నది. "ఈ ఆర్యావర్తదేశమునందుఁ బుట్టిన బ్రాహ్మణుల (విద్వాంసుల) వలన భూగోళమందలి మనుష్యులు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర దస్యుమ్లేచ్ఛాదులందఱును- తమతమ యర్హవిద్యలను, చరిత్రములను నేర్చుకొందురుగాక" యుధిష్ఠిరమహారాజు రాజసూయయజ్ఞము జరిపినపుడును, మహాభారతయుద్ధము జరుగువఱకును సమస్తరాజ్యములు నిచ్చటి రాజ్యా

ధికారమునకు లోఁబడియుండెను. వినుఁడు: చీనాదేశపు భగదత్తుఁడు, అమెరికా దేశపు బభ్రువాహనుఁడు, యూరపుదేశపు బిడాలాక్షుఁడు (పిల్లి కండ్లు గలవాఁడు), ఈరానుదేశపు శల్యుఁడు, మొదలగు రాజులందఱు నాజ్ఞావర్తులయి రాజసూయయాగమునకు, మహాభారతయుద్ధమునకును వచ్చియుండిరి. రఘువంశీయుల రాజ్యపరిపాలనకాలమందు రావణుఁడును ఆజ్ఞకులోఁబడియుండెను. రామచంద్రునికాలమున నాతఁడు విరోధికాగా, రామచంద్రుఁ డారావణుని శిక్షించి, రాజ్యమునుండి తొలగించి, యాతనిసోదరుఁడగు విభీషణునకా పదవినొసంగెను. స్వాయంభువరాజు మొదలుకొని పాండవులవఱకు ఆర్యుల చక్రవర్తి రాజ్యము సాగుచుండెను. పరమాత్ముని సృష్టియందు అభిమానులు, అన్యాయకారులు, అవిద్వాంసులు నైనవారిరాజ్యము బహుదినములు చెల్లదు. కావుననే విమ్మట నొకరితో నొకరు విరోధమూని, పోట్లాడి నశించిరి. ప్రయోజనమునకన్న నధికముగా ధనము హెచ్చినపుడు ఆలస్యము, పురుషార్థరాహిత్యము, ఈర్ష్య, ద్వేషము, విషయాసక్తి, ప్రమాదము హెచ్చుననుట ప్రపంచమున సహజమే. ఇందువలన విద్యాశిక్షలు నశించి దేశమందు మద్యమాంససేవనము, బాల్యవివాహము, స్వేచ్ఛాచారాది దుర్వ్యసనములు, దుష్టగుణము లధికమగును. ఇఁక యుద్ధవిరాగమునందు, యుద్ధవిద్యాకౌశలము, తన్నెదిరించువాఁడు భూలోకమందు మఱి యెవ్వఁడునులేఁడన్నంత గొప్ప సైన్యముఁగలిగినపుడు జనులలోఁ బక్షపాతము నభిమానముఁ బెరిగి, యన్యాయమువృద్ధిఁజెందును. అప్పుడు పరస్పరము వైరభావమూనఁగా వారికంటె నధికసమర్థుఁడు అప్రసిద్ధకులమువాఁడొకఁడు మహమ్మదీయరాజుల నెదిరించి వారిరాజ్యము ఛిన్నభిన్నము చేసిన శివాజీ గోవిందసింహులవలె-వారి నెదిరించినిలుచును.

> అథ కిమేతైర్వా పరేఽన్యే మహాధనుర్ధరాః చక్రవర్తినః కేచిత్
> సుద్యుమ్న భూరిద్యుమ్నేంద్రద్యుమ్న కువలయాశ్వ యౌవనాశ్వ
> వధ్ర్యశ్వాశ్వపతి శశబిందు హరిశ్చంద్రాంబరీష ననక్తు సర్యాతి
> యయాత్యనరణ్యాక్షసేనాదయః। అథ మరుత్త భరత ప్రభృతయో
> రాజానః॥ మైత్ర్యుపని. ప్ర ౧. ఖం ౪॥

సృష్టి మొదలుకొని మహాభారతయుద్ధపర్యంతము ఆర్యకులోత్పన్నులే చక్రవర్తులు (సార్వభౌమరాజులు) గా నుండిరని యీ ప్రమాణమువలన సిద్ధ

మగుచున్నది. అట్టివారికిఁబుట్టిన సంతానము, తమ యభాగ్యోదయమువలన ఇప్పుడు రాజ్యపదవీచ్యుతులై విదేశీయులకుఁ బాదాక్రాంతులై యున్నారు. సుద్యుమ్నుఁడు, భూరిద్యుమ్నుఁడు, ఇంద్రద్యుమ్నుఁడు, కువలయాశ్వుఁడు, యౌవనాశ్వుఁడు, వధ్ర్యశ్వుఁడు, అశ్వపతి, శశబిందువు, హరిశ్చంద్రుఁడు, అంబరీషుఁడు, ననక్తుఁడు, సర్యాతి, యయాతి, అనరణ్యుఁడు, అక్షసేనుఁడు, మరుత్తు, భరతుఁడు అను నీ జగత్ప్రసిద్ధ సార్వభౌమచక్రవర్తుల నామములిట వ్రాయఁబడియున్నట్లే, మనుస్మృతి మహాభారతాది గ్రంథములందును స్వాయంభువాది చక్రవర్తుల నామములు స్పష్టముగా వ్రాయఁబడియున్నవి. దీని నబద్ధమనువా రజ్ఞానులు. పక్షపాతబుద్ధి గలవారు.

ప్రశ్న:-గ్రంథములందు వ్రాసియుండు నాగ్నేయాస్త్రాదివిద్యలు సత్యమగునా కాదా? తుపాకులును, గుండ్లునాసమయమునందుండెనా లేదా?

ఉత్తరము:-ఆ మాట సత్యము; అవి పదార్థవిద్యవలన గలుగును. కావున నా శస్త్రములు గూడ నుండెను.

ప్రశ్న:-అవి దేవతలమంత్రములవలన సిద్ధించుచుండెనా యేమి?

ఉత్తరము:-కాదు. అస్త్రశస్త్రముల మంత్రములవలన సిద్ధించుచుండెననఁగా ఆలోచనమువలన వానిసాధించుచు ప్రయోగించుచుండి రన్నమాట. శబ్దమయమైన మంత్రమువలన నే ద్రవ్యమును బుట్టదు. మంత్రమువలన నగ్ని పుట్టునని యెవరైనను జెప్పిన నది జపించువారిహృదయమును, వారినాలుకను మొదట భస్మముచేసివేయును. శత్రువులను జంపఁబోయి వారేచత్తురు. రాజకార్యములను విచారించువాఁడు "రాజమంత్రి" యనఁబడునుకదా! అట్లే ఆలోచనమునకు మంత్రమనిపేరు. మంత్రము (యోచన) వలన సమస్తజగత్పదార్థముల జ్ఞానము మొదటఁ గలుగును. పిమ్మటఁ బ్రయత్నముచే ననేకవిధములగు పదార్థములును, క్రియాకౌశలములు నుత్పన్నమగును. లోహముతో నొకబాణమునుకాని, గుండునుగాని చేసి(నిప్పుముట్టించిన వాయువునందుఁ లోగవ్యాపించి సూర్యరశ్మి సోకుటవలననో, వాయుస్పర్శవలననో ప్రజ్వలితమై పైకెగయునట్టి) ఒకపదార్థమును దానియందుంచిన నది యాగ్నేయాస్త్రమగును. మఱియొకఁడు దానిని నివారింపదలచిన దానిమీఁదనే వారుణాస్త్రమునువదలవలయును. అనఁగా నొకశత్రువు వేరొకశత్రుసేనమీఁద నాగ్నేయాస్త్రమునువదలి చంప

దలచినపుడు,ఎదుటి సేనాధిపతి తన సేనను రక్షించుకొనుటకు వారుణాస్త్ర ప్రయోగమువలన నాగ్నేయయాస్త్రమును నివారించును. ఆ వారుణాస్త్రమును కొందొక ద్రవ్యయోగమువలనఁ గలుగునట్టిదే. ఆ ద్రవ్యయోగమువలనఁబుట్టుపొగకు వాయుస్పర్శ కలుగగానే మేఘముత్పన్నమై యప్పుడే వాన కురిసి అగ్నిని జల్లార్చును అటువంటిదే "నాగపాశము". అనఁగా దాని ప్రయోగమువలన శత్రువుల యంగము లురులలోఁదగులుపడును. మోహనాస్త్రమును అట్టిదే అనఁగా దానిలో వస్తుపదార్థములుండుటవలన దానిపొగ తాఁకి శత్రుసేన నిద్రచెందును. అనఁగా మూర్ఛపోవును ఈ విధముననే సమస్త శస్త్రాస్త్రములు గలుగుచుండెను మఱియు నొకతంతినో,అద్దమునో, ఒక పదార్థమునో కొని విద్యుత్తునుగలుగఁజేసి శత్రునాశనమును జేయుచుండిరి. దానినిగూడ నాగ్నేయాస్త్రమనియు, పాశుపతాస్త్రమనియుఁ జెప్పుదురు."బందూకు"(తుపాకి) "తోపు" (ఫిరంగి) అనునవి అన్య దేశభాషలలోని పేరులు గావి సంస్కృతముసకు, ఆర్యావర్తీయభాషలకు చెందినవికావు. ('ఫిరంగి'కి సంస్కృతార్య భాషలందు "శతఘ్ని" యనియు, 'తుపాకి' కి సంస్కృతార్యభాషలందు "భుశుండీ" యనియు నామములు.) సంస్కృతవిద్య చదువనివారు భ్రమచెంది యొకదానికొకటి వ్రాయుచు నొకదానికొకటి చెప్పుచు నున్నారు.బుద్ధిమంతులగు వారు దానిని ప్రమాణముగా సంగీకరింపరు భూగోళమునందు వ్యాపించి యుండు విద్యలన్నియు నార్యావర్త దేశమునుండి,మిశ్రదేశములవారు గ్రహించిరి. వారివలన యూనానులును, వారివలన రోమనులును గ్రహించిరి. వారివలన యూరపు అమెరికాది దేశములం దంతటనువ్యాపించెను. ఇప్పటికిని సంస్కృతవిద్యా ప్రచారము ఆర్యావర్త దేశమునందున్నంత మఱి యే యన్య దేశమునందునులేదు. జర్మనీదేశమున సంస్కృతవిద్యాప్రచారమత్యధికముగా నున్నదనియు, మోక్షమూలరుగారు చదివినంత సంస్కృతము మఱియెవ్వరు చదువలేదనియు నసుట వట్టిమాట. ఏలయనఁగా "నిరస్త పాదపే దేశే ఏరండోపి ద్రుమాయతే" 'యస్మిన్ దేశే ద్రుమో నాస్తి తత్రైరండోఽపి ద్రుమాయతే' చెట్టులేనిసీమయందాముదపుచెట్టేమహావృక్షమగు నన్నట్లు యూరోపుదేశమున సంస్కృతవిద్యాప్రచారము లేకపోవుటవలన జర్మనీదేశమువారును, మోక్షమూలరుగారును,చదివిన కొంచెి చదువే ఆ దేశ

మునకు గొప్పయైనది. కాని యార్యావర్త దేశము లోనిపండితులను బట్టి చూచిన వారు లెక్కకురారు. ఏలయనఁగా జర్మనీదేశవాసియగు నొకయాచార్యుఁడు(ప్రిన్సిపల్)వ్రాసిన యొకజాబునుజూచుటవలననంస్కృతమునవ్రాసిన జాబులకర్థముచేయువారుకూడజర్మనీదేశమునఁదక్కువఁగానున్నారనినాకుఁ దెలిసినది.మఱియు మోక్షమూలరు దొరగారి సంస్కృతసాహిత్యమునాయనవ్రాసిన వేదవ్యాఖ్యను గొలఁదిగాఁజూచితిని. దానివలన మోక్షమూలరుగారు ఆర్యావర్తములోని యాయాపండితులువ్రాసిన టీకలననుసరించి యేదోయొక విధముగా వ్రాసినారని గుర్తెరిగితిని. దానిలో నొకచోట :-

యుంజన్తి బ్రధ్నమరుషం చరన్తం పరితస్థుషః।రోచన్తే రోచనా దివి॥ఋ.౧.౬.౧॥

అను నీ మంత్రమున బ్రధ్నశబ్దమునకు గుఱ్ఱమనియు నర్థముచేసినారు. ఇంతకంటె సూర్యునిపరమున సాయణాచార్యులుచేసిన యర్థము బాగుగానున్నది. దీనికి పరమాత్మపరమున నేనువ్రాసిన సరియైనయర్థము నాచేరచింపఁబడిన, 'ఋగ్వేదాది భాష్యభూమిక' యందు మీరు చూడనచ్చును. దీనితో జర్మనీ దేశమువారికి, మోక్షమూలరుగారికి సంస్కృత విద్యయం దెంత పాండిత్యమున్నది మీరే గ్రహింపవచ్చును. (భూగోళమం దంతటను వ్యాపించియుండు సమస్త విద్యలును, మతములును ఆర్యావర్త దేశమునుండియే ప్రచారమునకు వచ్చినవన్నమాట యథార్థము ఫ్రాంసుదేశపు (ప్యారిస్) వాసియగు "జైకాలయట్" అను విద్వాంసుఁడు సమస్తవిద్యలకును, కులములకును నిధియైయున్న ఈ యార్యావర్తదేశమునుండియే సమస్తవిద్యలును, సకలమతములును ప్రచారమునకువచ్చినవని తన "బైబిల్ ఇన్ ఇండియా" అను గ్రంథమున వ్రాయుచుఁ బరమాత్మనుగూర్చి, "ఓ పరమేశ్వరా! పూర్వకాలమున నార్యావర్తదేశ మెట్టియున్నతస్థితియందుండెనో, యట్టి యున్నతస్థితిని మా దేశమునకుఁ బ్రసాదింపుము" అన్న ప్రార్థన, మీరా గ్రంథమునఁ జూడవచ్చును. అటులే "దారాశికోహ" అను తురుష్క రాజుకూడ సంస్కృతమునఁగల న పూర్ణవిద్య యేభాషయందును లేదనియే నిశ్చయించినాఁడు అతఁడునచించిన యుపనిషత్తుల భాషాంతరమున, "నేనరబ్బి మొదలగు ననేకభాషల నభ్యసించితిని. కాని నా మనస్సందేహములు దూరమై యానందమునకలుగలేదు. పిమ్మట సంస్కృతమునభ్యసించితిని; విం

టిని. అప్పుడు నా సందేహములు దూరమై నా కమితానందము కలిగెను."అని వ్రాసియున్నాఁడు. కాశిలోనున్న 'మానమందిరమున' "శింశుమార చక్రమును" జూడుఁడు. దానిని బాగ్తిగాఁ గాపాడువారు లేనున్నను, ఇప్పటికి భగోళ ముసుగుతించిన యనేకసమాచారములను మనకుఁ దెలియఁజేయునంతటి యుత్తమస్థితిలో నున్నది. "సవాయీ జయపురాధీశుడు" విఱిఁగిపడియున్న దానిని బాగుచేయించిన బాగుగనుండును. కాని యటువంటి శిరోమణియైన యీ దేశమునకు మహాభారతయుద్ధము కలుగఁజేసిన హానివలన నింతవఱకు నది మఱలఁ బూర్వదశకు రాకున్నది. అన్నదమ్ములలో నొకరినొకరు చంప గోనబూనినపుడు నాశనమగుట కేమిసందేహము ?

వినాశకాలే విపరీతబుద్ధిః॥ వృద్ధచాణక్యము. నీతిద.అ.౧౬.౫॥

వినాశకాలము సమీపించినపుడు, విపరీతబుద్ధికలిగి విపరీతకర్మలు చేయఁదొడఁగుదురు. ఎవరు బుద్ధిచెప్పినను వారిపాలిటి కదియపుడు విషముగాఁ దోఁచును. విపరీతమును బోధించిన నది యమృతప్రాయముగా నుండును. గొప్పగొప్ప విద్వాంసులు, రాజులు, మహారాజులు, ఋషులు, మహర్షులనేకులు మహాభారత యుద్ధమున బలిగా నర్పింపఁబడిరి. మఱియు ననేకులు మృత్యువు వాతఁబడిరి. అనంతరము విద్యయుఁ వేదోక్తధర్మప్రచారమును నష్టముకాసాగెను. ఒకరియం దొకరికి ఈర్ష్యయు, ద్వేషమును, అభిమానము కలిగెను. బలవంతుఁడైనవాఁడు తన చేతికిఁజిక్కిన దేశమును లోఁబఱచుకొని, తానొక రాజయిపోవుచుండెను. ఇట్లు ఆర్యావర్తదేశమం దంతటను రాజ్యము తునకలు తునకలై పోయెను. ఇఁక ద్వీపద్వీపాంతరములందు రాజ్య వ్యవస్థ చేయువారెవరు? బ్రాహ్మణులే విద్యావిహీనులైనపుడు క్షత్రియులును వైశ్యులును, శూద్రులును, విద్యాగంధ రహితులగుటకు సందేహమేమి ! పరంపరగా వేదాది శాస్త్రముల నర్థసహితముగ నభ్యసించు ప్రచారము లోపించెను. బ్రహ్మణులు కేవలము తమ పొట్టకొఱకుఁ బాఠవశేఁ బఠించుచుండిరి. వారా గ్రుద్ధిపాఠము గూడ క్షత్రియాదులకుఁ జెప్పలేదు. విద్యావిహీనులైనవారు గురువులు కానారంభించినపుడు, ఛలకపటాధర్మములు వారిలో నధికమగుచువచ్చెను. తమ జీవితార్థము బ్రాహ్మణులందఱునుజేరి,కుట్రలుపన్ని క్షత్రియాదులకిట్లుపదేశింప నిశ్చయించుకొనిరి. "మేమే మీకుఁ బూజనీయ దేవతలము, మా

సేవచేయక ముక్తిగాని స్వర్గముగాని మీకులభింపదు. మా సేవచేయకపోయిన మీరు ఘోరనరకమునఁబడుదురు" అని చెప్పసాగిరి. పూర్ణవిద్యావంతులైన ధర్మాత్ములను బ్రాహ్మణులని పూజనీయులని వేదములందు, ఋషి ముని ప్రోక్త శాస్త్రములందు వ్రాసియుండఁగా నా గౌరవమును మూర్ఖులు విషయలంపటులు, కపటులు, ధర్మవిహీనులు నగువారు తమయందన్వయింపఁజేసి కొనిరి. కాని యింతటితో నా యాప్తులగు విద్వాంసులలక్షణము లీమూర్ఖులయందెట్లుసంఘటిల్లగలవు? సంస్కృత విద్యావిముఖులైయున్న యజమానుల (క్షత్రియాదుల) వీరుచెప్పెదు తలఁ. లోఁకలేక మాటలనన్నిఁటిని నమ్ముచు వచ్చిరి. అప్పుడీ నామమాత్రబ్రాహ్మణులు మరింతజెలరేగి వారిని తమ వాగ్జాలమునఁ జిక్కించుకొని—బ్రహ్మవాక్యం జనార్దనః ॥పాంచవగీత॥

"బ్రాహ్మణుని నోటినుండి వచ్చిన మాటలన్నియు సాక్షాద్భగవంతుని ముఖమునుండి వెడలివచ్చినవనియే నమ్మవలయును." అని చెప్ప నారంభించిరి. ఇట్లు తెలివిలో నంధులును, ధనములో బూర్ణులు ననఁగా విద్యానేత్రములేని ధనాఢ్యులైన క్షత్రియాదులు ఈ వ్యర్థబ్రాహ్మణనామమాత్రులకు శిష్యులుగాలభించుట వీరి విషయానందమునకు సుపవనము లభించినట్లయ్యెను. అప్పుడు వీరు పృథ్వియందున్న యుత్తమ పదార్థములన్నియు బ్రాహ్మణుల కొఱకే సృజింపఁబడినవనియుఁ బ్రకటింపసాగిరి. అట్లే గుణకర్మస్వభావములచే గలుగుచుండిన బ్రాహ్మణాది వర్ణవ్యవస్థను రద్దుపరిచి జన్మమునుండియే వర్ణమును స్థిరపఱచిరి. మరణకాలమందును యజమానులవలన దానములని ధనములాగుట కారంభించిరి. తమ యిష్టమువచ్చినట్లెల్ల చేయుట కారంభించి, "మేము భూదేవతలము, మా సేవచేయక యెవరికిని దేవలోకములభింప" దని చెప్పసాగిరి. ఇట్టివారిలో "తమ దేలోకమునకు దయచేయుదురు? మీ వము మిమ్ము ఘోరనరక మనుభవింపఁజేయును, మీరు కృమికీటపతంగాదులగుదురు" అనినచో వారు మహాకుపితులై, "మేము శాపమిచ్చిన మీరు నశించి పోదురు; "బ్రహ్మ ద్రోహీ వినశ్యతి" బ్రాహ్మణులకు ద్రోహము చేయువాఁడు నశించును" అని వ్రాసియున్నదందురు. ఔను, పూర్ణవేదమును, పరమాత్మను దెలిసిన ధర్మాత్ములు, సమస్తజగత్తున కుపకారము చేయువారునగు పురుషుల

ఘోర ద్వేషముఁ బూనువాఁడు అవశ్యము నశించును; బ్రాహ్మణులు కానివారికి బ్రాహ్మణులను పేరుకాని, సేవచేయించుకొను యోగ్యతకాని లేదు.

ప్రశ్న:-అట్లైన మేమెవ్వరము :

ఉత్తరము:-మీరు 'పోపులు'.

ప్రశ్న:-పోపులని ఎవ్వరినందురు ?

ఉత్తరము:-రోమక భాషలో గొప్పవానికిని, దండ్రికిని పోపని పేరు. కాని యిప్పుడు మోసము కపటములచేత నితరులను మోసపుచ్చి, తమ ప్రయోజనముల నెరవేర్చుకొనువారిని పోపులనుచున్నారు.

ప్రశ్న:-అట్లన్న మేము బ్రాహ్మణులము; సాధువులము. ఏలయన మా తండ్రి బ్రాహ్మణుఁడు, మాతల్లి బ్రాహ్మణి, మేము ఫలానా సాధువు శిష్యులముగా!

ఉత్తరము:-అమాట సత్యమే, కాని నాయనలారా! వినుఁడు. తల్లి దండ్రులు బ్రాహ్మణి బ్రాహ్మణులగుటవలననే బ్రాహ్మణులు గాఁజాలరు. ఒక సాధువునకు శిష్యులగుటచేతనే సాధువులు కాఁజాలరు. కాని తమతమ యుత్తమ గుణకర్మస్వభావములను బట్టియుఁ బరోపకారమును బట్టియు బ్రాహ్మణులు, సాధువులు నగుచున్నారు.

రోమనుల 'పోపు' తన శిష్యులతో "మీరు మీపాపములను మాయెదుటఁ జెప్పిన మేము వానిని క్షమింతుము. మా సేవచేయక, మా యాజ్ఞనుబొందక, యెవ్వరును స్వర్గమునకేగలేరు. మీరు స్వర్గమునకుఁ బోదలఁచిన నెన్నిరూపాయలు మాయొద్ద జమయిత్తురో, వానికిఁదగినన్ని వస్తువులే మీకు స్వర్గలోకమున దొరకును" అని వచించును. అది విన్న జ్ఞానహీనుఁడయిన ధనికుఁ డొకఁడు స్వర్గమునకుఁబోవఁగోరి 'పోపు' గారికి యథేష్టముగా రూపాయలిచ్చుచుండును ఆ 'పోపు' గా రపుడు యేసు మరియమ్మల విగ్రహములయెదట నిలిచి ("ఓ దీనబంధూ ! యేసురక్షకా !) ఫలానా మనుజుఁడు మీపేరిట లక్ష రూపాయలు దాను స్వర్గములోనికి వచ్చుటకు, మాయొద్ద జమయిచ్చియుంచినాఁడు. అతడు స్వర్గమునకు వచ్చినపుడు నీవు నీతండ్రి స్వర్గరాజ్యమునందు నిలువది యైదువేల రూపాయల విలువగలతోఁటయు, నిల్లును, వాకిళ్లును, నిలువదియైదువేల రూపాయలకు గుఱ్ఱములను, పేఁటకుక్కలును, బండ్లును,

సేవకులును, ఇఱువదియైదువేలరూపాయలకు అన్నపాన వస్త్రోపవస్త్రములును; నిఱువదియైదువేల రూపాయలకు ద్రవ్యమును నితని యిష్టమిత్రసోదర బంధు వర్గముల భోజన ప్రతిభోజన పాలనాదులకొఱకు నిప్పింపవలయును " అని యొక హుండీని వ్రాసి దానిక్రింద దన చేవ్రాయనుంచి, వాని చేతికిచ్చి, " నీవు చచ్చునపుడు ఈ హుండీని గోరిలో నీ తలక్రింద బెట్టునట్లు నీకుటుంబము వారికి జెప్పియుంచుము. మరల నిన్ను దీసికొని పోవుటకు దేవదూతలువచ్చి నిన్ను నీ హుండీతో స్వర్గమునకు గొనిపోయి, దానిలో వ్రాసినప్రకార మన్ని వస్తువులను నీకిప్పింతు " రని చెప్పుదురట. చూడుడు ! పోపుగారు స్వర్గ మును గుత్తగొన్నారనియే యనుకొనవలెను. యూరోపుదేశమునందు మూర్ఖత రాజ్యముచేయుచుండి నంతవఱకు పోపుగారియాటలన్నియు సాగుచుండెను; కాని విద్యా ప్రభావమునుబట్టి, ఇప్పుడు పోపుగారి మోసములకంతగా నాస్ప దములేదు కాని అది నిర్మూలమును గాలేదు. అటువలెనే యార్యావర్తదేశము నందును పోపులు లక్షవరాములనుబొంది క్రీడించుచున్నారు. అనగా రాజు లను, ప్రజలను విద్యాభ్యాసమునుండి దూరపఱచుచు, సత్పురుషుల సాంగత్య మును బొందకుండునట్లుచేయుట, రాత్రింబవళ్లు నితరులను మోసపుచ్చుటతప్ప తక్కినపని చేయకుండుట, మున్నగునాటలాడుచున్నారనుట. ఛలము, కపటము, కుత్సితవ్యవహారములు చేయువారేపోపు లనబడుదురు; కాని వారిలోను ధార్మి కుడును, విద్వాంసుడును పరోపకారియు నెవడైననుండిన నతడు యథార్థ మైనబ్రాహ్మణుడు, సాధువు నగునన్నమాట మీరు ధ్యానమునందుంచుకొన వలెను ఇక నిప్పుడును ఛలకపటములచే నితరమనుష్యులను మోసపుచ్చి, తమప్రయోజనముల నెఱవేర్చుకొను మనుష్యులేపోపులని గ్రహింపబడుదురు. బ్రాహ్మణ. సాధునామములుగల ఉత్తమపురుషులనుమాత్రము బ్రాహ్మణు లనియు, సాధువులనియు సంగీకరించుటయోగ్యము. ఉత్తమ బ్రాహ్మణుడు కాని సాధువుకాని లేకుండిన జైన మహమ్మదీయ క్రైస్తవవాదులనుండి వేదాది సత్యశాస్త్రముల స్వరసహిత పఠనమునురక్షించి, ఆర్యులను వేదాదిసత్యశాస్త్ర ములందును, వర్ణాశ్రమములందును ప్రీతియుక్తులుగా నిలుపుటకు బ్రాహ్మణ సాధువులు తప్ప దక్కినవా రెవ్వరుసమర్థులగుదురు ? 'విషాదప్యమృతం గ్రాహ్యమ్' [మను. ౨. ౨౩౯] విషమునుండికూడ నమృతమునుగ్రహింప

దగునన్నటులే పోపుల క్రీడలవలనను, భ్రమ వలనను జైనమతాదులనుండి యార్యులను గాపాడియుండుట విషములోని యమృతసమాన గుణమువంటిదని గుర్తెఱుంగవలయును యజమానులు విద్యావిహీనులుకాఁగా నప్పుడు పోపులు తాము కొంతపూజాపాఠములను జదువుకొని యభిమానముఁజెంది, యందఱు వారిలోవారుగలసి నిశ్చయించుకొని రాజాదులతో 'చూడుఁడు! (బ్రాహ్మణో న హంతవ్యః,సాధుర్న హంతవ్యః) 'బ్రాహ్మణుడును, సాధువులును దండార్హులుకారు' అని చెప్పఁదొడగిరి. యథార్థబ్రాహ్మణసాధువులవిషయమున వ్రాసియున్నవానిని పోపులు తమ కన్వయించుకొనిరి. మిథ్యావచనముతో కూడిన గ్రంథములనురచించి, వానియందు ఋషిమునుల నామములనుజేర్చి వారిపేరచే వినిపించుచువచ్చిరి. అట్టి సుప్రతిష్ఠిత ఋషిమహర్షులపేరులు చెప్పి, తాము దండనీయులుకారని, మనస్సునందైన తమ్ము దండింపఁదలపరాదని యథేష్టాచారమును బ్రవర్తింపఁజొచ్చిరి. అనఁగాఁ పోపులయాజ్ఞలేనిది యెవరును నిద్రించుట, లేచుట, కూర్చుండుట, నడచుట, భుజించుట, త్రాగుట మొదలగునవి యేమియుఁజేయరాదని కఠినములయిన కట్టుదిట్టము లేర్పఱచిరి. పోపులను బ్రాహ్మణ సాధునామధారు లేమిచేసినను వారినెన్నఁటికిని దండింపగూడదు. అనగా వారిని దండింపవలెనను తలంపు కలుగఁగూడదనంత నిశ్చయమును, రాజుల యెదలఁ గలుగఁజేసిరి. ఇట్టిమూర్ఖత ప్రబలమగుచురాఁగా నీ పోపులు దమయిచ్ఛకువచ్చినట్లు చేయుటకుఁ జేయించుటకు నారంభించిరి. అనఁగా నీ దురవస్థకుమూలము మహాభారతయుద్ధమునకుబూర్వము వేయి సంవత్సరములనుండియే ప్రారంభమైయుండెను. ఆకాలమున ఋషిమునులు గూడ నుండిరి. కాని యప్పటికే కొంతయాలస్యము, ప్రమాదము, ఈర్ష్య, ద్వేషము నంకురించియుండెను. రాఁగా రాఁగా నభివృద్ధిచెందెను. ఎప్పుడు సత్యోపదేశమే శూన్యమయ్యెనో యప్పుడే ఆర్యావర్తమునం దవిద్య వ్యాపించెను. జనులు పరస్పరము విరోధమునుబూని కలహించుట కారంభించిరి.

ఏలయనఁగా:-

ఉపదేశ్యోపదేష్టృత్వాత్ తత్సిద్ధిః । ఇతరథాంధపరంపరా ॥

సాంఖ్య. అ. ౩. సూ. ౭౯. ౮౧ ॥

అనఁగా నుత్తములయిన యుపదేశకులున్నప్పుడే ధర్మార్థ కామ మోక్షములు చక్కఁగా సిద్ధించును. ఉత్తములగు నుపదేశకులును, శ్రోతలును లేకున్నప్పుడు దుర్గుడియాచారములు-గొడ్డెదాటులు-వ్యాపించును. మఱల సత్పురుషులు పుట్టి యుపదేశముచేసినప్పుడే చీకటిలేఱలు నష్టమై ప్రకాశపరంపరలు వృద్ధికి వచ్చును పోపులు దమపూజను, దమపాదపూజను జేయించుకొనుట కారంభించి, లోకులకు వారి శుభములు వీనియందేయున్నవని చెప్పఁబూనిరి. ప్రమాద విషయాసక్తులలో నిమగ్నులై. గొఱ్ఱెలకాఁపుంవలెనున్న యబద్ధపుగురువులును, వారి శిష్యులును గూలఁబడిరి. విద్య, బలము, బుద్ధి, పరాక్రమము, శూరత ధీరత మొదలగు శుభగుణము లన్నియు నశించుచువచ్చెను. పిమ్మట విషయాసక్తినుండి దిగి మద్యమాంసములను గోప్యముగా సేవించుట కారంభించిరి. తరువాత వారిలోనే యొకఁడు వామమార్గమును నిలువఁబెట్టి "శివ ఉవాచ" "పార్వత్యువాచ" భైరవ ఉవాచ" ఇత్యాదినామములతో గ్రంథములు వ్రాసి వానికిఁ దంత్రములని పేరిడెను. వానిలో వ్రాసియుంచిన మహావిచిత్రములైన కొన్ని లీలలు చూడుఁడు.

మద్యం మాంసం చ మీనం చ ముద్రా మైథునమేవ చ ।
ఏతే పంచ మకారాః స్యుర్మోక్షదా హి యుగే యుగే॥ కాళీతంత్రాదులందు॥
ప్రవృత్తే భైరవీచక్రే సర్వే వర్ణా ద్విజాతయః ।
నివృత్తే భైరవీచక్రే సర్వే వర్ణాః పృథక్పృథక్॥ కులార్ణవ తంత్రము॥
పీత్వా పీత్వా పునః పీత్వా యావత్పతతి భూతలే ।
పునరుత్థాయ వై పీత్వా పునర్జన్మ న విద్యతే॥ మహానిర్వాణతంత్రము॥
మాతృయోనిం పరిత్యజ్య విహరేత్సర్వయోనిషు ।
[యోన్యాం లింగం సంస్థాప్య జపేన్మంత్రి మతంద్రితః]॥
వేదశాస్త్రపురాణాని సామాన్యగణికా ఇవ ॥
ఏకైవ శాంభవీ ముద్రా గుప్తా కులవధూరివ॥ జ్ఞానసంకలినీతంత్రము॥

ఈ యజ్ఞానులగు పోపులలీల లెట్టివో చూడుఁడు। వేదవిరుద్ధమును మహాఅధర్మమును నగువానినే వామమార్గులు శ్రేష్ఠమని యెన్నిరి. మద్యము, మాంసము, మీనము-చేపలు, ముద్ర, గారెలు, బూరెలు మున్నగు పిండి వంటలు, యోని పాత్రాధార ముద్రలు, నైదవది (మైథునము-అనగా పురుషు లందరును శివులుగాను, స్త్రీలందఱును పార్వతులుగాను ఎంచి:—)

అహం భైరవ స్త్వం భైరవీ హ్యావయోరస్తు సంగమః ॥

అను నీ యసంగతవచనములు చదువుచు సమాగమముచేయుట-వామ
మార్గులకు దోషముగాదు. అంటరాని నీచస్త్రీలతోఁ బోవుట మహా పవిత్రమని
యెంచియున్నారు శాస్త్రములలో రజస్వలాది స్త్రీలను దాఁకుటఁగూడ నిషేధించి
యుండగా వామమార్గులు దానిని మహాపవిత్రమని నమ్ముచున్నారు వీరి శ్లోక
ముల వ్యర్థాలాపముల జూడుఁడు:—

> రజస్వలా పుష్కరం తీర్థం చాండాలీ తు స్వయంకాశీ॥ చర్మకారీ ప్రయాగః
> స్యాద్రజకీ మథురా మతా॥ అయోధ్యా పుక్కసీ ప్రోక్తా॥
>
> రుద్రయామలతంత్రము॥

రజస్వలయైన స్త్రీతోఁజేరినఁ బుష్కరస్నానము చేసినట్లును, మాల
దానితోఁబోయిన గాశీయాత్రఁజేసినట్లును, మాదిగదానితో వ్యభిచరించిన
ప్రయాగస్నానము జేసినట్లును, చాఁకలిదానితోఁగూడిన మథురాదర్శనము చేసి
నట్లును, లోగముదానితోఁగలసిన నయోధ్యను దర్శించి వచ్చినట్లును, భావింప
వలసినదఁట. మద్యమునకు "తీర్థ"ము, మాంసమునకు "శుద్ధి", "పుష్ప"
ములు, మత్స్యమునకుఁ "తృతీయ", 'జలతుంబిక'లు, ముద్రకుఁ 'చతుర్థి',
మైథునమునకుఁ 'పంచమి'యని నామములిడియున్నారు. ఈ నామములుంచు
టకుఁ గారణము వారి నితరులు దెలిసికొనరాదనుటయే. ఇఁకఁ దాము కౌల,
ఆర్ద్రవీర, శాంభవ, గణ ఆదినామములు పెట్టుకొనిరి. వామమార్గమతము
నవలంబింపనివారికి 'కంటకులు' 'విముఖులు' 'శుష్కపశువులు' అను నిట్టి
నామము లిడియున్నారు ౧॥ భైరవీచక్రమునందున్నపుడు బ్రాహ్మణుఁడు మొదలు
కొని చండాలుని వఱకందఱును ద్విజులగుదురనియు నా భైరవీచక్రమును
వదలినతోడనే మఱలఁదమతమవర్ణస్థులగుదురనియువారుచెప్పుదురు. భైరవీచక్ర
మునవామమార్గులు భూమిమీఁదనో లేకపలకమీదఁనో యొకబిందువుత్రికోణ.
చతుష్కోణ, వర్తులాకారముగావ్రాసి దానిమీఁద నొకసారాకడవనుంచి, దానికిఁ
బూజచేసి. (బ్రహ్మశాపం విమోచయ) 'ఓ మద్యమా: నీవు బ్రహ్మశాపము
నుండి విముక్తిఁజెందుము.' అను నీమంత్రమును బఠించుచున్నారు. వామ
మార్గులు చేరుచోటి కితరులను రానీయరు. అట్టి రహస్య స్థలమున స్త్రీ పురుష
లందరును జేరుదురు. పిమ్మట నచ్చట నొకస్త్రీని దిగంబరనుజేసి పురుషులును,
ఒకపురుషుని వస్త్రహీనునిఁజేసి స్త్రీలును బూజింతురు. అచ్చటికి స్త్రీలనేకుల-

ఆయా పురుషుల భార్యలు, కుమార్తెలు, తల్లులు, అక్క-చెల్లెండ్రు, కోడండ్రు మున్నగు వారందఱువత్తురు. తరువాత నొకపాత్రనిండ మద్యమునింపి, యొక పళ్ళెమున మాంసము, వడలు మొదలగుపదార్థములనుంతురు. వారంలో నాచార్యుఁడైనవాఁడు ఒకగిన్నెలో సారాపోసి,చేతనుంచుకొని 'భైరవోఽహం' 'శివోఽహం' అనఁగా నేను భైరవుఁడను, శివుఁడను అని చెప్పి, దానిని ద్రాగును. మఱల నాయెంగిలి గిన్నెలోనే తక్కినవారును ద్రాగుదురు పిమ్మట నొక మగనాలినో, వేశ్యనో లేదా పురుషునో వస్త్రహీనులుగాజేసి చేతికొక కత్తినిచ్చి, ఆ స్త్రీని దేవియనియుఁ బురుషుని మహాదేవుఁడనియుఁ బిలుతురు. వారి యుపస్థేంద్రియములనుఁ బూజింతురు. పిమ్మట నా దేవికో శివునకో యొకగిన్నెఁడు సారద్రాగించి, ఆయెంగిలి గిన్నెలోనే యందఱు నొక్కొక గిన్నెడుసారాయిపుచ్చుకొందురు. మఱల నదేరీతిని గ్రమక్రమముగా నందఱును ద్రాగి త్రాగి మైమఱచి, ఎవరికెవరియందు దిష్టముండునో యట్టివారితో 'కొడుకు' 'కూతురు' తల్లియని కూడఁ జూడక, కుకర్మ నొనర్తురు. అప్పుడప్పుడు చాల మత్తెక్కుట వలన, 'నొకరునొకరు కొట్టుకొని, జుట్టుపట్టుకొని జగడ మాడఁజొత్తురు.కొందరువాంతిచేసుకొందురు.వారిలో ఘోరీ-సిద్ధుఁడు,ఆవమన పదార్థముగూడఁ దినివేయును. వీరిలో నందఱికంటె సిద్ధుడైనవానిలక్షణమిది:-

> హాలాం పిబతి దీక్షితస్య మందిరే సుప్తో నిశాయాం గణికాగృహేషు।
> విరాజతే కౌలవ చక్రవర్తీ॥

దీక్షితుని-సారాయి నమ్మువాని- యింటికిఁబోయి బుద్ధిమీఁద బుద్ధి త్రాగుట, ముండలయింటికిఁ బోయి రాత్రులు వారంతో వ్యభిచరించుట ఈ మొదలగుపనులు సిగ్గు, సందేహము లేక చేయువాఁడే వామమార్గులలో ముఖ్యుఁడు, చక్రవర్తి-రాజుతో సమానుఁడు నగును. అనఁగా వారిలో గొప్ప దుర్మార్గుఁడు శ్రేష్ఠుఁడనియు మంచికార్యములను జేయుచు దుష్కర్మములు చేయుటకు జంకువాఁడు హీనుఁడనియు ననఁబడును. ఎలయనఁగా:-

> పాశబద్ధో భవేజ్జీవః పాశముక్తః సదాశివః॥ జ్ఞానసంకలనీ తంత్రము శ్లో ४३॥

లోకలజ్జ, శాస్త్రలజ్జ, కులలజ్జ, దేశలజ్జ మొదలగు పాశముంచేత బంధింపఁబడినవాఁడు జీవుడు. లజ్జాహీనుఁడై కుకర్మలఁజేయువాఁడు సదా శివుఁడని యీ తంత్రాభిప్రాయము.౨॥

భైరవ తంత్రమున నొక ప్రయోగముగలదు. అదియేమనగా ఒక యింటిలో నాలుగుప్రక్కలను గూడులుండవలయునట; వానియందు సారా సీసాలు నింపిపెట్టవలసినదట. ఆ గూడులలో నొకదానియందలి యొకసారా బుడ్డిత్రాగి, రెండవగూటికి బోవలయునట. అందులోనిది యొకటిత్రాగి మూడవగూటికి బోవలయునట. అప్పటి సీసా స్వీకరించి నాల్గవగూటికి బోవలయునట. ఇట్లు నిలిచి నిలిచి కఱ్ఱవలె భూమి మీద పడకుండునంతవఱకు సారాయి త్రాగవలయునట. మఱల మత్తు దిగినప్పు డదేప్రకారము త్రాగి త్రాగి నేలమీద బడవలయునట మఱల మూడవపర్యాయము నిదేరీతిని త్రాగి క్రిందబడి లేచినవానికి పునర్జన్మ ముండదట. అనగా వాస్తవమున నట్టి మనుష్యులకు మఱల మనుష్యజన్మము లభించుట కఠినమే కాక నీచ యోనులందుబడి బహుకాలపర్యంతము మునుగుచుందురు. ౩॥ వామమార్గుల తంత్రగ్రంథములం దొక్క తల్లినిదప్ప దక్కిన యే స్త్రీనిగూడ వదలిపెట్ట గూడదు. అనగా నామె కూతురుగాని, తోబుట్టువుగాని మఱెవ్వరైన గాని వారితో వ్యభిచరింపవలయునని వారిలో నిదియొక నియమము. ఈ వామమార్గు లందు దశమహావిద్యలనునవి ప్రసిద్ధములు. అందులో మాతంగి విద్యా వంతుడు 'మాతరమపి న త్యజేత్' 'తల్లినిగూడ సమాగమముచేయక వదల' గూడదని చెప్పుచున్నాడు. మఱియు స్త్రీ పురుష సమాగమ సమయమునందు 'మాకు సిద్ధి ప్రాప్తమగుగాక' అను మంత్రమును జపించుచున్నారు. ఇట్టి బుద్ధివైకల్యము చెందినవారును, మహా మూర్ఖులును నీ ప్రపంచమున లెక్క కుదక్కువ యుండవచ్చునా!!! ౪॥ అసత్యమును బురస్కరించుకొని సంచ రించువా రవశ్యము సత్యమును దూషింతురు. చూడుడు! 'వేద శాస్త్ర పురాణములన్నియు సామాన్య వేశ్యలవంటివట. ఇక శాంభవీముద్ర గుప్తకుల స్త్రీవంటి' దని వామమార్గులు చెప్పుదురు. ౫॥ ఇందువలననే వీరు కేవలము వేద విరుద్ధమైన మతమును స్థాపించిరి. వీరి మతము మిక్కిలివ్యాప్తిచెందినప్పుడు వీరు మహాధూర్తులై, వేదముల పేరగూడ గొన్ని యాటలనాడిరి. అనగా:-

సౌత్రామణ్యాం సురాం పిబేత్। ప్రోక్షితం భక్షయేన్మాంసమ్॥ మను ౫.౨౭
వైదికీ హింసా హింసా న భవతి ॥

న మాంసభక్షణే దోషో న మద్యే న చ మైథునే ।
ప్రవృత్తిరేషా భూతానాం నివృత్తిస్తు మహాఫలా ॥ మను. అ. ౫.౫౬॥

సౌత్రామణి యజ్ఞమునందు సురాపానము చేయవలయునన్న సోమరసము- సోమవల్లి రసము త్రాగవలయునని దాని యర్థము. యజ్ఞమునందు ప్రోక్షితమాంసము తినుట దోషముకాదని యీ తెలివి మాలినమాట వామమార్గులు తెచ్చిపెట్టినదే. 'వైదికీ హింస హింస కాకపోయిన నిన్నును నీ కుటుంబమునుజంపి హోమముచేసినను చింతలేదుకద' యని వీరిని అడుగవలయును. మాంసభక్షణముచేయుట, మద్యముత్రాగుట, పరస్త్రీతో వ్యభిచరించుట మొదలగునవి దోషములు కావు' అనిచెప్పుట పిల్లతనము. ఏలయనగాఁ ప్రాణులకు బాధకలుఁగ జేయక మాంసములభింపదు. నేరములేకయే బాధ గలుగఁజేయుట ధర్మవిరుద్ధము. మద్యపానము సర్వథా నిషిద్ధమే. ఇది మంచిదనియొక వామమార్గగ్రంథములందుఁదప్పదక్కినగ్రంథములం దంతట నింతవఱకు నిషిద్ధమనియే వ్రాయఁబడియున్నది. వివాహములేనిది మైథునము చేయుటకూడ గొప్ప దోషమే. దీనిని నిర్దోషమని చెప్పువారు దుష్టులు. ఇటువంటివచనముల నెందఱో ఋషులగ్రంథములందుజేర్చి,ఋషిమునుల నామములిడిగ్రంథములువ్రాసి గోమేధాశ్వమేధము లనఁబడుయజ్ఞములనుగూడజేయించుచుండిరి. అనఁగా నీ పశువులఁ జంపి హోమముజేయుటవలన యజమానికిని, పశువునకును స్వర్గప్రాప్తి కలుగునను వ్యవహారమునకు స్వర్గప్రాప్తి కలుగునను వ్యవహారమునకు మూలము బ్రాహ్మణగ్రంథములందలి అశ్వమేధ, గోమేధ నరమేధాది శబ్దముల సరియైన యర్థములను తెలిసికొనకపోవుటయే. ఏలయన అట్లు తెలిసియున్న నిట్లనర్థము లేలచేసియుందురు?

ప్రశ్న :- అశ్వమేధ, గోమేధ, నరమేధాది శబ్దముల కర్థమేమి?

ఉత్తరము :- వీనియర్థ మిది :-

రాష్ట్రం వా అశ్వమేధః ॥ శత. ౧౩.౧.౬.౩॥

అన్నగం హి గౌః ॥ శత. ౪.౩.౧.౨౫॥

అగ్నిర్వా అశ్వః ॥ శత.౩.౫.౧.౨౨॥ ఆజ్యం మేధః ॥ శత. ౧౩.౨.౧౧.౨॥

గుఱ్ఱము, ఆవు మొదలగు పశువులను-మనుష్యులను జంపి హోమము చేయవలయునని యెచ్చటను వ్రాయలేదు. వామమార్గుల గ్రంథములందు

మాత్రమే యట్టి యనర్థములు వ్రాసియున్నవి. కాని యిదియు వామమార్గులే నరిపిరి.) ఇతర గ్రంథములందు అచ్చటచ్చట నీ వామమార్గులే ప్రక్షేపములు చేసియున్నారు. చూడుడు: రాజు న్యాయముగ ధర్మానుకూలముగ ప్రజా పాలనము చేయుటయు, విద్యాదులొసగు యజమానుడగ్నియందు నాజ్యా దులను హోమము జేయుటయు నశ్వమేధ మనబడును. అన్నము, ఇంద్రియ ములు,కిరణములుపృథివిమున్నగువానిని బరిశుద్ధముగానుంచుటయే గోమేధము. మనుష్యుడు మృతిచెందినతరువాత వాని శరీరమును విధిపూర్వకముగా దహ మునచేయుటయే నరమేధ మనబడును.

ప్రశ్న :- యజ్ఞము చేయుటవలన యజమానుడును, పశువును స్వర్గ గాములగుదురనియు;హోమముచేసిన పశువునుమరల బ్రతికించుచుండిరనియు యజ్ఞముచేయువారు చెప్పుమాట నిజమా? అబద్ధమా?

ఉత్తరము:- అబద్ధము. వారు స్వర్గమునకే పోవుదురేని యట్లు చెప్పు వాని జంపి. హోమముచేసి స్వర్గమునకు బంపవలయును. లేక వాని ప్రియ మైనతల్లినో, తండ్రినో, భార్యనో, పుత్రాదులనో చంపి, హోమముచేసి స్వర్గ మున కేలపంపగూడదు? లేక వేదిలోనుండి మరల నేలబ్రతికించుకొనరు?

ప్రశ్న :- వారు యజ్ఞముచేయునపుడు వేదమంత్రములను జదువు చున్నారుకద. అట్లు వేదమునందే లేకుండిన నేల పఠింతురు?

ఉత్తరము :- మంత్రము ఎక్కడ జదివినను ఎవరిని వలదని చెప్పదు. ఏలయనగా నదియొక శబ్దము. కాని దానియర్థము పశువునుజంపి హోమము చేయుమని కాదు. ఎట్లనగా 'అగ్నయే స్వాహా' మొదలగు మంత్రముం డర్థము అగ్నిలో హవిస్సు,పుష్ట్యాదులను గలుగజేయు నేయి మొదలగు పదా ర్థములను హోమముచేయుటవలన వాయు, వృష్టి, జలములు పరిశుద్ధి జెంది జగత్తునకు సుఖకారకములగును. కాని యీసత్యార్థము నా మూఢులెఱుగరు. ఏలయనగా స్వార్థులు కేవలము తమ ప్రయోజనము నెఱవేరుటకు దేనినిలక్ష్య పెట్టరు; నమ్మరు. ఈపోపులు చేయునిట్టియనాచారములను, జచ్చినవారిపేర దర్పణశ్రాద్ధాది కర్మములనుజాలి చూచి మహా భయంకరమును. వేదాది శాస్త్ర నిందకమును నగు బౌద్ధము, జైనము కల్పింపబడెను. ఈ దేశము నందే గోరఖపూరునకు రాజొకడుండెననియు, పోపులు అతనిచేత నొక

యజ్ఞముఁజేయించి, యతని ప్రియురాలగు రాణి నాసమయమునందొక గుఱ్ఱముతో సమాగమము చేయించుటవలన నామె చనిపోయెననియు, తదనంతర మతఁడు విరక్తుఁడై తన కొడుకును రాజుఁగాఁజేసి, సాధువేషమూని పోపుల రహస్యములను వెలిపఱుప నారంభించెననియు వినుచున్నాము. దీని కథా రూపములే చార్వాకాభాణక మతములు. ఈమతమువారిట్లు శ్లోకములు రచించిరి:—

> పశుశ్చేన్నిహతః స్వర్గం । జ్యోతిష్టోమే గమిష్యతి ।
> స్వపితా యజమానేన । తత్ర కస్మాన్న హింస్యతే ॥౧॥
> మృతానామపి జంతూనాం । శ్రాద్ధం చేత్తృప్తికారణమ్ ।
> గచ్ఛతామిహ జంతూనాం । వ్యర్థం పాథేయకల్పనమ్ ॥౨॥
>
> స. ద. సంగ్రహం—చార్వాక దర్శనము. ౮—౨౫

పశువును జంపి, అగ్నియందు హోమముచేయుటవలన బశువు స్వర్గమునకు బోవునట్లయిన, యజమానుఁడు తన తండ్రి మొదలగువారిని జంపి స్వర్గమున కేలపంపఁడు? చనిపోయిన మనుష్యుల తృప్తికొరకు శ్రాద్ధతర్పణములైన, విదేశమునకుఁబోవు మనుష్యులకు దారిబత్తెము- తిండికి త్రాగుటకుఁ బదార్థములను గట్టియిచ్చుట వ్యర్థము. ఏలయనఁగా జనిపోయినవానికి శ్రాద్ధతర్పణములుచేసి అన్న జలాదులు ముట్టజెప్పునపుడు, సంజీవుఁడై పరదేశమునకో లేక మార్గమునకో పోవుచుండువానికి నింటవండినపదార్థములు విస్తరియందుంచి, చెంబులో నీళ్లు నింపి వానిపేర నుంచిన నేలచేరుటలేదు? ఇంటికి యుండఁగా దూరదేశమునకో, పదియడుగుల దూరమునకో గూర్చున్నవానికే చేరకపోయిన నది చచ్చినవాని కేవిధమునను చేరఁజాలదు: ఇట్టియుక్తిసిద్ధమగు నుపదేశమును జనులు నమ్మఁటకారంభించిరి. ఇఁక వారిమతము నానాఁటికి వృద్ధియగుచు వచ్చెను. రాజులు, భూపతులు నామతమును స్వీకరించుటఁజూచి, పోపులు నాప్రక్కకే వ్రాలిరి. ఏలయనఁగా వారికెచ్చట ద్రవ్యార్జనకు మంచి త్రోవదొరికిన నచ్చట సిద్ధముగానుందురు కాన వారును జైనమతము నవలంబించుట కారంభించిరి. ఈ జైనమతమునను వేఱువిధములగు పోపులీలలనేకములున్నవి. పండ్రెండవ సముల్లాసమున నవి వ్రాయఁబడును. అనేకులు వీరి మతమును స్వీకరించిరి. కాని యప్పటప్పటఁగాశీ, కనోజి పర్వతప్రాంతములం

దున్నవారును, పశ్చిమ దక్షిణ దేశములందున్న వారును మాత్రము జైనమతా వలంబులు కారేదు. జైనులు వేదార్థజ్ఞానము లేనివారుకాన బహిర్గతములైన పోపులీలను వేదములోనివేయని నమ్మి, వానినిగూడ నిందించుచు, వాని పఠనపాఠనములు మాన్పి. యజ్ఞోపవీతాదులు త్రెంపి. బ్రహ్మచర్యనియమము లను నిర్మూలమొనర్పఁజొచ్చిరి. వేదాదిపుస్తకము లెన్నిదొరికిన వానిన్ని టిని నిర్మూలముచేసిరి. ఆర్యులమీఁద జాలవఱకురాజ్యాధికారముఁ జెల్లించుచు వారి ననేకవిధముల దుఃఖపెట్టిరి. భయశంకారహితులగుచు క్రమక్రమముగఁ దమ మతస్థులగు గృహస్థులకును సాధువులకును సత్కారముచేయుచు, వేద మార్గావలంబుల కవమాన మొనర్చుటయేకాక, పక్షపాతబుద్ధితో వారికి దండ నలుగూడ విధింపసాగిరి. తాము సుఖమును, విశ్రాంతియు ననుభవించుచు, గర్వముచే బలిసి, మన్నుమిన్నుఁగానక ప్రవర్తించుచుండిరి. ఋషభదేవుఁడు మొదలుకొని మహావీరుని పర్యంతము గల తీర్థంకరుల గొప్పగొప్ప ప్రతి మలనుజేసి పూజింపనారంభించిరి. అనఁగాఁ పాషాణాది మూర్తిపూజకు నీ జైనులే మూలము. పరమేశ్వరునందు విశ్వాసము న్యూనమై పాషాణాది మూర్తిపూజయందుఁ దవిలి నిలిచెను ఇట్లు మూఁడువందలయేండ్ల వరకు నార్యా వర్తనమున జైనమతము రాజ్యమేలెను. తఱచుగా జనులు వేదార్థజ్ఞానము లేనివారై సుమారు రెండువేల అయిదువందల సంవత్సరము లయియుండ వచ్చును.

రెండువేల రెండువందల సంవత్సరములకుఁబూర్వము శంకరాచార్యు లను ద్రవిడదేశోత్పన్న బ్రాహ్మణుడు బ్రహ్మచర్యమూని, వ్యాకరణాది సమస్తశాస్త్రములను జదివి, తనలోఁ దాను 'అహహా! సత్యాస్తిక వేదమత ముడుగంటి జైననాస్తిక మతములుప్రబలి గొప్ప కీడు గలుగఁజేసినవిగా! వీని నేవిధమునఁ దొలఁదోలవలయునో' యని విచారించిరి. శంకరాచార్యులు శాస్త్ర ములనభ్యసించి, జైనమతగ్రంథములనుగూడ జదివియుండిరి. వారియుక్తి యను మిక్కిలి బలవత్తరమై యుండెను. వారుపదేశముచేతను, శాస్త్రార్థ ములచేతను జైనులనోడించి పాఱదోల వచ్చునని నిశ్చయించుకొని, ఉజ్జ యినీనగరమునకు వచ్చిచేరిరి. ఆ కాలమున నచ్చట సుధన్వుఁడనురాజు రాజ్యముచేయుచుండెను. అతఁడు జైనగ్రంథములను గొంత సంస్కృతమును

జదివియుండెను. శంకరాచార్యులచటికిఁబోయి, వేదోపదేశముచేయనారంభించి, యీ కనారు రాజును సందర్శించి 'మీరు సంస్కృతమును, జైనగ్రంథములును గూఁడ జదివియున్నారు; జైనమతమున విశ్వాసమును మీకుఁగలదు. కావున, నేఁజెప్పునది యేమనఁగా:- ఓడినవారు గెలిచినవారి మతమును స్వీకరింపఁదగునను ప్రతిజ్ఞపై మీరు జైనపండితులకు నాకు శాస్త్రార్థము చేయింపుడు. గెలిచిన వారి మతమునే మీరును స్వీకరింపుడు" సుధన్వరాజు జైనమతావలంబియయ్యును సంస్కృత గ్రంథావలోకనమువలన నాతనిబుద్ధి కొంత విద్యాప్రకాశమును బొందియుండెను. దీనివలన నతనిలో మిక్కిలి పశుత్వములేదు. ఏలయనఁగా విద్వాంసుఁడు సత్యాసత్యములను బరీక్షించి, సత్యమును గ్రహించి యసత్యమును వదలిపెట్టును. సుధన్వ రాజునకు గొప్ప విద్వాంసుఁడగు నుపదేశకుఁడు లభింపనంతవఱకు వీనిలోనేది సత్యము, ఏది యసత్యమను సందేహము జనించి యతనిని బాధించుచుండెను. శంకరాచార్యులుచెప్పిన యీమాటను విని యతఁడు మహాసంతోషముతో 'నేను శాస్త్రార్థము చేయించి సత్యాసత్యనిర్ణయము చేయింతునని చెప్పెను. దూరదేశముల నుండి జైనపండితులను రప్పించి సభచేయించెను. దానిలో శంకరాచార్యులది వేదమతము; జైనులది వేదవిరుద్ధమతము. అనఁగా శంకరాచార్యులపక్షము వేదమతస్థాపనమును, జైనమత ఖండనమును జైనులపక్షము స్వమతస్థాపనమును, వేదమత ఖండనము నైయుండెను. శాస్త్రార్థము బహుదినములవరకు జరిగెను. సృష్టిచేసిన యనాదియైన యీశ్వరుఁడెవఁడును లేఁడనియు నీ జగత్తును, జీవుఁడును అనాదులనియు నీ రెంటికి నుత్పత్తి వినాశములు లేవనియు జైనులమతము. దీనికి విరుద్ధముగా ననాదిసిద్ధ పరమాత్మయే యీ జగత్తునకు సృష్టికర్త. ఈ జగత్తును జీవుఁడు నబద్ధము. ఏలయనగా నా పరమాత్మ తన మాయచేతనే జగత్తునుసృజించి, ధరించి, నశింపజేయుచున్నాఁడు. ఈ జీవుఁడును ప్రపంచమును స్వప్నమువంటివి. పరమేశ్వరుఁడు తానే జగద్రూపమును వహించి క్రీడించుచున్నాడనునది శంకరాచార్యుల మతము. బహుదినముల పర్యంత మీ శాస్త్రార్థము జరిగి, కడపట యుక్తిప్రమాణముంచేత జైనమతము ఖండింపబడి శంకరాచార్యుల మతము స్థిరపడెను. అప్పుడు జైనపండితులును సుధన్వరాజు నా మతమును స్వీకరించి జైనమతమును పరిత్యజించిరి దీనివలన దేశ

మంతటి గొప్ప యల్లకల్లోలము గాఁదొడగెను. సుధన్వరాజు తన యిష్టమిత్రులకు, దక్షిణరాజులకును వ్రాసి శంకరాచార్యులతో శాస్త్రార్థమును జేయించెను. కాని జైనులకును తదపటివరకు అపజయమే కలుగుచువచ్చెను. సుధన్వుఁడు మొదలగురాజులు ఆర్యావర్త దేశమునందంతట శంకరాచార్యులు సంచారము చేయుటకుఁ దగినయేర్పాటులు చేసిరి. మఱి సంరక్షణార్థము పరిచారకులను గూడ నియమించి వారితోఁ బంపిరి. అప్పటినుండియే యజ్ఞోపవీతధారణమును వేదముల పఠనపాఠనమును ప్రారంభమయ్యెను. వారు పదియేండ్లలో నార్యావర్త దేశమునం దంతట దిరిగి, జైనమతమును ఖండించి, వేదమతమును స్థాపించిరి. కాని శంకరాచార్యుల కాలముననే జైనమత విధ్వంస మయ్యెననఁగా నిఁతవఱకు నక్కడక్కడ భూమిలోపలదొరకి విరిగిన జైనవిగ్రహములన్నియు శంకరాచార్యులకాలమున విఱిగినవియే. అట్లు విఱుగకుండినవి విఱిగిపోవునను భీతిచే జైనులు భూమియందు బాతియుంచినవని యెఱుగఁదగును. అవి యిప్పటికిని నక్కడక్కడ భూమిలోనుండి వెడలుచున్నవి. ఇఁక శంకరాచార్యులకుఁ బూర్వమే కొంత వ్యాపించియుండిన శైవమతమును, వామమార్గమతమును వారు ఖండించి వెలసిరి. ఆకాలమున నీదేశమునఁ గావలసినంత ధనముండుటయేకాక, జనులలో దేశభక్తి విశేషించి యుండెను. శంకరాచార్యులును, సుధన్వుఁడును జైనమందిరములనుఁ బడగొట్టింపలేదు. ఏలయనఁగా వానిలోనే వేదపాఠశాలలనుఁ బెట్టింపవలెనని వారభిప్రాయపడుచుండిరి. వేదమతమును స్థాపించి విద్యాప్రచారము చేయుటకొఱకు నాలోచించుకొనుచుండు నంతలోనె ఇరువురు కపటజైనమునులు బయటికి వేదమతస్వీకారము చేసినట్లు నటించుచుఁ దమ కపటభక్తివిశ్వాసములచే శంకరాచార్యుల ప్రేమను చూఱగొని, సమయమునుజూచి, వారికి విషయుక్తవస్తువు నొసఁగిరి. దానిశక్తివలన నాఁకలి మందమయి, పిమ్మట శరీరమునందెల్ల వ్రణములుపుట్టి, ఆరుమాసములలో వారు శరీరమును త్యజించిరి. అప్పు డందఱును నిరుత్సాహులై పోయిరి. కాఁబోవు విద్యాప్రచారమును నిలిచిపోయెను. వారు రచించిన శారీరక భాష్యాదుల ప్రచారము వారిశిష్యులు చేయఁదొడఁగిరి. అనఁగా జైనమత ఖండనకొఱకు బ్రహ్మ సత్యమనియు, జగత్తు మిథ్యమనియు, జీవబ్రహ్మ లొక్కటేయనియు శంకరాచార్యులు చెప్పియుండినదానినే వారుపదేశము

చేయుట కారంభించిరి. దక్షిణమున శృంగేరిమఠమును, పూర్వున భోగోవర్ధన మఠమును ఉత్తరమున జోశీమఠమును, ద్వారకా పట్టణమున శారదా మఠమును గట్టించి, శంకరాచార్యులశిష్యులు మహంతుపదవినిబొంది, శ్రీమంతులై యానందింపఁదొడఁగిరి. ఏలయనఁగా, శంకరాచార్యులకుఁ దరువాత వారి శిష్యులకు మిక్కిలి గౌరవము కలుగుచు వచ్చెను.

ఇపుడు విచారింపవలసినది యేమనఁగా జీవబ్రహ్మ లొక్కటే. జగత్తు మిథ్యయనునది శంకరాచార్యుల నిశ్చిత మతమైయుండిన నది మంచిమతము కాదు. కాని జైనులను ఖండించుటకొఱకే పక్షముఁ బూనియుండిరేని కొంత మంచిదే.

నవీన వేదాంతుల మతము:—

ప్రశ్న:- జగత్తు స్వప్నమువంటిది. రజ్జువునందు సర్పము, ముత్యపు చిప్పయందు వెండియు, ఎండమావులందు నీరును, గంధర్వనగరము ఇంద్రజాలమువలె నీ సంసారము నబద్ధము ఒక బ్రహ్మమాత్రమే సత్యము.

సిద్ధాంతి:- అబద్ధమని మీరు దేని ననుచున్నారు?

నవీనుడు:- వస్తువులేకుండియు నున్నట్లు కనపడుదానిని.

సిద్ధాంతి:- వస్తువే లేకపోయిన నది యున్నట్లెట్లు కానఁబడును?

నవీనుఁడు:- అధ్యారోపము వలన.

సిద్ధాంతి:- దేని నధ్యారోప మనుచున్నారు?

నవీనుఁడు:- 'వస్తున్యవస్త్వారోపణమధ్యాసః.' - [వేదాన్తసారము ౬౦.౬]

'అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచ్యతే'

[అనుభూతి ప్రకాశ. అ. ౧. శ్లో. ౧౮]

పదార్థ మొకటియై దానియం దన్యపదార్థము నారోపణచేయుట అధ్యాసాధ్యారోపములు. ఇఁక నట్టి యారోపణమును నిరాకరించుట కపవాదమని పేరు. ఈ రెంటివలనను, ప్రపంచరహితుఁడైన బ్రహ్మమందుఁ ప్రపంచరూప జగము విస్తరింపచేయుచున్నారు.

సిద్ధాంతి:— మీరు రజ్జువును వస్తువుగాను. సర్పము నవస్తువుగానుభావించుచు భ్రమలోఁబడియున్నారు. సర్పము వస్తువుకాదా యేమి? రజ్జువునందు

లేదనిచెప్పిన నది మఱియొకచోట నెచ్చటనైన నున్నదా లేదా? దాని సంస్కారము హృదయమునం దున్నదా లేదా? అట్లున్నదిగాన సర్పమవస్తువు కాలేదు. అటులే స్థాణువునందు బురుషుఁడును, ముత్యపుఁజిప్పయందు వెండియు మొదలగువాని వ్యవస్థయని తెలియవలయును. స్వప్నమందుగూడ దేనిభావము కలుగునో యది యెచటనో యొకచోట నుండును. దానిసంస్కార మాత్మయందుఁ బడియున్నదికావున నా స్వప్నమును వస్తువునం దవస్త్వారోపణమువంటిది కాదు.

ప్రశ్నుఁడు:— అట్లైనఁ దన తలదెగినట్లును, తా నేడ్చుచున్నట్లును నీటిధార పైకి లేచిపోవుచున్నట్లును, మన మెప్పుడును చూచలేదు. వినలేదు కదా! మఱి యట్లు జరిగినట్లు మనకు (స్వప్నమందు) గోచరముగు చున్నదే, యది సత్యమెట్లు కాఁగలదు?

సిద్ధాంతి:— ఈ దృష్టాంతముకూడ మీపక్షమును బలపఱుపదు. చూడకున్నను, వినకున్నను సంస్కారమే యంకురించియుండదు. సంస్కారమే లేకున్న స్మృతికలుగదు. స్మృతికలుగకున్న సాక్షాదనుభవమునకు రాఁజాలదు. పరాయివాని తల నఱుకఁబడెనని వినినప్పుడును, లేదా తాను దాని జూచినప్పుడును, అట్లే యుద్ధమందుఁ జనిపోయినవానిఁ గూర్చి వాని తండ్రియో తమ్ముఁడు మొదలగువారలో బ్రత్యక్షముగా నేడ్చుచుండుటను, గొట్టములోనుండి నీరు పై కెగురుచుండుట తాను జూచియో వినియో యున్నపుడును యట్టిసంస్కారము తనయాత్మయందుఁ బడును జాగ్రదవస్థయందలి పదార్థములనుండి వేఱయి యిదియంతయు చూచుచున్నప్పుడు తాను మొదటఁ జూచియున్న, వినియున్న పదార్థములనే తన యాత్మయందుఁ జూచుచున్నాఁడు. తనలోనే తాను జూచుచున్నపుడు. తనతలయే ఖండింపబడినట్లును, తానే యేడ్చుచున్నట్లును, నీటిధార పైకిపోవుచున్నట్లును భావించును. ఇదికూడ వస్తువునందు అవస్త్వారోపణము వంటిది కాదు. చిత్రకారుఁడు తాను ముందువినియో కనియో చేసియో యున్న దానినే తనయాత్మనుండి తీసి కాగితముమీఁద వ్రాయుచున్నాఁడు. ప్రతిబింబమును దీయువాఁడు బింబమునుజూచి, దానియాకృతిని దన యాత్మయందుంచుకొని వ్యత్యాసములేక వ్రాయుచున్నాఁడు. ఒక్కొక్కప్పుడు నొకఁడు దన యధ్యాపకుని జూచుచున్నట్లు స్వప్నమందుఁ దాను చూడవచ్చును. మఱియు నొక్కొక్కప్పుడు బహుకాలము క్రిందట చూచియో వినియో చేసియో

యుండి గడచినదానిని మరల స్వప్నమునందుఁ జూచుచున్నాడు. కాని జాగ్రత్తలోఁ దాను జూచిన, వినిన, చేసిన దానినే తానప్పుడుఁ జూచుచున్నట్లుకాని, వినుచున్నట్లుకాని, చేయుచున్నట్లుకాని, వానిస్మరణకురాదు. జాగ్రదవస్థయందు స్మరణచేయునట్లు స్వప్నమునందు నియమపూర్వకముగ సంభవింపదు. మఱియు : జన్మాంధునకు రూపస్వప్నమే కలుగదుకదా : కావున మీ యధ్యాసాధ్యారోపణ లక్షణము అబద్ధము. బ్రహ్మమందు జగద్భ్రమము కలుగునను టకు వేదాంతులు వివర్తవాదము అనగా రజ్జువునందు సర్పాదులభావము కలుగునని యిచ్చుదృష్టాంతముకూడ సరియైనది కాదు.

నవీనుఁడు:- అధిష్ఠానము లేక యధ్యాసము ప్రతీతము కాదు. రజ్జువే లేపోయిన సర్పభ్రాంతికూడఁ గలుగఁజాలదు. రజ్జువునందు సర్పము త్రికాలములందు నుండదు. కాని యంధకారమందును గొంత వెలుగు కలిసియుండు నపుడు నకస్మాత్తుగా ద్రాటినిజూచినందున సర్పమను భ్రాంతికలిగి భయముచే కంపించును. దానిని దీపాదులచేఁ జూచినపుడే భ్రమయు, భయమును నివారణమగును. దీపముచే సర్పభ్రాంతినివారణమై రజ్జువని గోచరమగునట్లే, బ్రహ్మము సాక్షాత్కారము చేసికొనినచో బ్రహ్మమందు కలిగిన జగద్భ్రాంతి నివారణమై బ్రహ్మము గోచరమగును.

సిద్ధాంతి:- బ్రహ్మమందు జగద్భ్రమము ఎవరికిఁ గలిగినది :

నవీనుఁడు:- జీవునకు.

సిద్ధాంతి:- జీవుఁ డెక్కడినుండి కలిగినాఁడు :

నవీనుఁడు:- అజ్ఞానమునుండి.

సిద్ధాంతి:- అజ్ఞాన మెక్కడినుండి కలిగినది? అది యెచ్చటనుండును?

నవీనుఁడు:- అజ్ఞాన మనాది. అది బ్రహ్మములో నుండును :

సిద్ధాంతి:- బ్రహ్మమునందు బ్రహ్మమున కజ్ఞానము కలిగెనా : అన్యునకా : అన్యునకగుచో నెవనికి :

నవీనుఁడు:- చిదాభాసునకు.

సిద్ధాంతి:- చిదాభాసుని స్వరూప మేమి :

నవీనుఁడు:- బ్రహ్మము. బ్రహ్మమునకు అజ్ఞానమనఁగా బ్రహ్మము తనరూపమును తాను మఱచిపోవుట.

సిద్ధాంతి:- అతఁడు మఱచుటకుఁ గారణమేమి?

నవీనుఁడు:- అవిద్య.

సిద్ధాంతి:-అవిద్య సర్వవ్యాపకుఁడగు సర్వజ్ఞుఁని గుణమా లేక అల్పజ్ఞునిదా?

నవీనుఁడు:- అల్పజ్ఞునిది.

సిద్ధాంతి:- అట్లైన మీ మతమునందొక యనంత సర్వజ్ఞ చేతనుఁడే గాక మఱియొక చేతనుఁడున్నాఁడా లేదా? మఱి యల్పజ్ఞు డెక్కడినుండి వచ్చెను? బ్రహ్మమే కాక వేఱొక చేతనుడైన యల్పజ్ఞుఁడున్నాఁడని యొప్పుకొనిన సరే. ఇఁక నొకచోట బ్రహ్మము తన స్వరూపమునే తాను మఱచిన నా యజ్ఞానమంతటను వ్యాపించునుగద. ఎట్లనఁగా శరీరములో నొక పుండుపుట్టిన దాని బాధవలన శరీరావయవములన్నియు నిరర్థకము లగును. అట్లే బ్రహ్మము నొకచోట నజ్ఞాని క్లేశయుక్తుఁడునైన బ్రహ్మమంతయు నజ్ఞానియు, పీడానుభవయుక్తుఁడునగును.

నవీనుఁడు:- ఇదియంతయు నుపాధిధర్మమే కాని బ్రహ్మది కాదు.

సిద్ధాంతి:- ఉపాధి జడమా? లేక చేతనమా? ఇఁక నది సత్యమా అసత్యమా?

నవీనుఁడు:- అది యనిర్వచనీయము; అనఁగా దానిని జడమనికాని, చేతనమనికాని, సత్యమనికాని, అసత్యమనికాని చెప్పుటకు వీలుపడదు.

సిద్ధాంతి:- మీరు చెప్పినది (వదతో వ్యాఘాతః) అను దోషమును బోలి యున్నది. ఏలయనఁగా మీరొప్పుకొను నవిద్యను జడమనికాని చేతనమనికాని, సత్యమనికాని యసత్యమనికాని చెప్పఁజాలరేని యీ మీ మాట యిత్తడితోఁ గలిసిన బంగారమును పరీక్షించుట కొక కమసాలి యొద్దకుఁ గొనిపోయిన నతఁడు దానిఁజూచి ఇది యిత్తడియనికాని, బంగారమనికాని చెప్పుటకు వీలుపడదు, కాని దీనిలో నీ రెండుధాతువులును గలిసియున్నవని చెప్పినట్లున్నది.

నవీనుఁడు:- మహదాకాశమే ఘట మఠ మేఘములను నుపాధులఁబట్టి ఘటాకాశమనియు, మఠాకాశమనియు, మేఘాకాశమనియు, వేఱువేఱుగాఁ గోచరమగును; కాని వాస్తవముగా నదంతయు నొక్క మహదాకాశమే. అటులే బ్రహ్మము మాయ, అవిద్య, సమష్టి, వ్యష్టి అంతఃకరణములను నుపాధులనుబట్టి యజ్ఞానులకు వేఱువేఱుగాఁ గనఁబడుచున్నాఁడే కాని వాస్తవ

ముగా బ్రహ్మయొక్కఁడే. ఈ ముందుచెప్పఁబోవు ప్రమాణమునం దేమిచెప్పి యున్నదో చూడుఁడు:—

> అగ్ని ర్యథైకో భువనం ప్రవిష్టో రూపం రూపం ప్రతిరూపో బభూవ ।
> ఏకస్తథా సర్వభూతాంతరాత్మా రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ ॥
>
> కఠో. వల్లీ. ౫. మం. ౯ ॥

అగ్ని పొడుగును, వెడల్పును గుండ్రమును చిన్న పెద్ద యాకృతులును గల పదార్థములలోనెల్ల వ్యాపించి, వాని యాకారములను బొంది కనబడినను, ఆ పదార్థములకంటె నది వేఱయియున్నది. అటువలెనే సర్వవ్యాపకుడైన పరమాత్మ వివిధాంతఃకరణములలోనెల్ల వ్యాపించి, వాని యాకారములను బొందుచున్నను అంతఃకరణములకంటె నా బ్రహ్మము భిన్నమే.

సిద్ధాంతి:— అట్లు మీరు చెప్పుటకూడ వ్యర్థమే. ఏలయనఁగా మీరు ఘట మఠ, మేఘములను, ఆకాశముకంటె భిన్నపదార్థములని యంగీకరించునట్లే, కారణకార్యరూపములగు జగత్తును, జీవుని బ్రహ్మముకంటె వేఱనియు, బ్రహ్మ మా రెంటికంటె భిన్నమనియు నంగీకరింపవలయును.

నవీనుఁడు :— అగ్ని సమస్తపదార్థములలోఁ బ్రవేశించి, చూచుటకాయా యాకారములు కలదిగా నగపడుచున్నటులే పరమాత్మ జడములలో జీవులలోను వ్యాపించి సాకారుడై యజ్ఞానులకు నాకారయుక్తుఁడుగాఁ గనఁబడుచున్నాఁడు. యథార్థముగా బ్రహ్మము జడముకాని, జీవుడుకాని కాఁడు. ఎట్లనఁగా వేయి కుండలలో నీరు నింపిపెట్టిన, వానిలో సూర్యుని వేయిప్రతిబింబములు కానఁబడును. కాని వాస్తవముగా సూర్యుఁడొక్కఁడే. ఆ కుండలుపగిలి, నీటికిఁ జలనము కలిగి ప్రవహించునపుడు దానితో సూర్యునకు నష్టముకాని, చలనముకాని, ప్రవాహకత్వముకానికలుగదు. అటులే అంతఃకరణములయందు బ్రహ్మయొక్క ఆభాసము కలుగును. దానిని చిదాభాసమందురు. అంతఃకరణ ముండువరకు జీవుఁడుండును. జ్ఞానము వలన నంతఃకరణము నశించునపుడే జీవుఁడు బ్రహ్మస్వరూపి యగును. ఈ చిదాభాసమునకుఁ దన బ్రహ్మస్వరూపము మఱచుటవలన కర్తృత్వ, భోక్తృత్వ, సుఖ, దుఃఖ, పాప, పుణ్య, జన్మమరణముల నెంత వఱకుఁ దనలో నారోపించుకొనునో యంతవఱకు సాంసారిక బంధనముల నుండి విడుదల కలుగదు.

సిద్ధాంతి :- మీరిచ్చిన యీ దృష్టాంతమును వ్యర్థమే. ఏలయనఁగా, సూర్యుఁ డాకారముకలవాఁడు. నీటికుండలు నాకారము కలవే. సూర్యుఁడు నీటికుండలకంటె భిన్నుఁడు; నీటికుండలు సూర్యునికంటెను భిన్నములు. కావుననే సూర్యునకుఁ బ్రతిబింబములు కలుగుచున్నవి. కాని అది నిరాకారవస్తువే యయియుండిన దానికిఁ బ్రతిబింబమేకలుగదు. అట్లే పరమేశ్వరుఁడు నిరాకారుఁడగుటవలనను, ఆకాశమువలె సర్వత్రవ్యాపకుఁడగుటవలనను బ్రహ్మముకంటె యేపదార్థముకాని, పదార్థములకంటే బ్రహ్మముకాని వేఱైయుండుట యసంభవము. ఇక వ్యాప్యవ్యాపక సంబంధమునుబట్టియు రెండు నొకటి గాఁజాలవు. అనఁగా నన్వయ వ్యతిరేక భావములనుబట్టిచూచిన, వ్యాపవాప్యక పదార్థములు పరస్పరము కలిసియుండియు నెల్లపుడు వేఱువేఱుగ నుండును. ఒక్కటేయైన వ్యాప్యవ్యాపక భావసంబంధ మెప్పటికిని గలుగనేరదని బృహదారణ్యకాంతర్యామి బ్రాహ్మణమునందు [బృ. ఉ. అ. ౩. బ్రా. ౭. కం ౩-౨౩] స్పష్టముగా వ్రాసియున్నది. ఆకారము లేనిదానికిఁ బ్రతిబింబము లేర్పడుట యసంభవము. కాన బ్రహ్మమునకుఁ బ్రతిబింబము నేర్పడదు. అంతఃకరణోపాధినిబట్టి బ్రహ్మమును జీవుఁడని నమ్ముచున్నామను మీమాట వట్టి పసిపిల్లమాటయే. అంతఃకరణము చలనముగలది, ఖండితమును; (పరిచ్ఛిన్నము). బ్రహ్మము ఖండము నచలమును. బ్రహ్మము, జీవులు వేఱు వేఱని యంగీకరింపరేని అంతఃకరణము పోవుచోటులనెల్ల బ్రహ్మమజ్ఞానియును, అది వదలిపోవు చోట్లనెల్ల జ్ఞానియు నగుచుండునా లేదా? దీనికి మీ ప్రత్యుత్తరమేమి? ఎండలో గొడుగుపట్టినచోట్లనెల్లనది ఎండను మఱుఁగుపఱచును. దానిని స్థలాంతరమునకు మార్చునపు డది వదలిపోవుచోట్లనెల్ల నెండమఱుఁగు లేకుండును. అటులే యంతఃకరణము బ్రహ్మమును క్షణక్షణము జ్ఞానిగాను, అజ్ఞానిగాను, బద్ధముగాను, ముక్తముగాను జేయుచుండును. బ్రహ్మము చేతనము కావున నఖండబ్రహ్మమున కొక్కచోటఁగలుగు నావరణ ప్రభావ మన్నిచోట్లను వ్యాపించును. కనుక బ్రహ్మమంతయు నజ్ఞానియగును. ఇఁక మథురలోనున్న యంతఃకరణస్థమగు బ్రహ్మ మొకవస్తువును జూచిన, దాని స్మరణ కాశిలో నున్న యంతఃకరణస్థమగు బ్రహ్మమునకుఁ గలుగదు. ఏలయనఁగా 'అన్య దృష్టమన్యోనన్మరతీతిన్యాయాత్' [యోగ విభూ. ౩పాద. సూ. ౧౪. వ్యాసభాష్య]

ఒకచోట వస్తువునుజూచిన, దాని స్మరణ మఱియొకనికిఁగలుగదు. మథురలోఁ జూచిన చిదాభాసుఁడు కాశిలో లేఁడుకనుక మథురలోనున్న యంతఃకరణప్రకాశకుఁడు కాశిలోని బ్రహ్మము కాఁడు. బ్రహ్మమే జీవుఁడు; అన్యుఁడెవఁడును లేఁడన్న జీవుఁడు సర్వజ్ఞుఁడుగావలయును. బ్రహ్మ ప్రతిబింబము వేఱని చెప్పుదురేని యెవరికిని దాము ముందుఁ జూచినదికాని విన్నదికాని స్మరణకు రాకుండును. బ్రహ్మమొక్కఁడేకాన స్మరణ కలుగుచున్నదందురేని యొకచోటఁ గలుగు నజ్ఞానమువలనకాని, దుఃఖము వలనకాని బ్రహ్మమంతయు దుఃఖితము జ్ఞానయుక్తము గాఁదగును. ఇట్టిదృష్టాంతమువలన నిత్య శుద్ధ బుద్ధ ముక్తస్వభావమైన బ్రహ్మమును మీరు అనిత్య, అశుద్ధ, అజ్ఞాని, బద్ధాది దోషయుక్తముగాను, అఖండ బ్రహ్మమును ఖండఖండముగాను జేసితిరికదః

నవీనుఁడు :— నిరాకార వస్తువునకు నాభాసకలుగును. అద్దమునను;నీటియందునునాకాశాభాసనీలముగనో, లేకమరియొకవిధముగనోగాఢముగనగుపడుచున్నటులే సమస్తాంతఃకరణములందును బ్రహ్మమున కాభాస కలుగుచున్నది.

సిద్ధాంతి :- ఆకాశమునకు రూపమేలేదు; దానిని గంటితో నెవఁడును జూఁడజాలఁడు- కంటికిఁగానరాని పదార్థము అద్దమందుగాని నీటియందుఁగాని యెట్లు కానవచ్చును, ఘనీభవించినట్లో, పలుచనై నట్లో సాకారమైన వస్తువగపడునే కాని నిరాకారవస్తువు కానరాదు.

నవీనుఁడు :- అట్లైన, మీద నీలముగా నగుపడుచు అద్దము మున్నగు పదార్థములందుఁ భాసించుచున్నదే, అది యేమిపదార్థము,

సిద్ధాంతి :- భూమినుండి పైకెగసిపోయినట్టి పృథివీజలాగ్నుల త్రసరేణువులు. అప్పటినుండియే వర్షముకురియును. అప్పటి జలరేణువులే లేకపోయిన వర్ష మెచ్చటినుండిపడును, కావున దూరమున గుడారమువలెఁ గానవచ్చుచు చక్రాకారముగా నుండునది నీటియావిరి. పొగ దూరమునుండి దట్టముగాఁగనఁబడుచు దగ్గఱకు రానురాను బలుచనగా-గుడారమువలె నగునట్లే యాకాశమున నీటిబిందువులు కానవచ్చుచున్నవి.

నవీనుఁడు :- మేమిచ్చియున్న రజ్జు, సర్ప, స్వప్నాదులదృష్టాంతము లసత్యములా యేమి,

సిద్ధాంతి :- కాదు; మీజ్ఞానము మిథ్యయని యింతకుమునుపే వ్రాసి యున్నాము. అదట్లుండనిండు; కాని మొదట నజ్ఞాన మెవరికిఁగలుగునో చెప్పుఁడు?

నవీనుఁడు :- బ్రహ్మమునకు.

సిద్ధాంతి :- బ్రహ్మమల్పజ్ఞమా? సర్వజ్ఞమా?

నవీనుఁడు :- సర్వజ్ఞుఁడును గాఁడు, అల్పజ్ఞుఁడును గాఁడు. ఏలయనగా సర్వజ్ఞత్వాల్పజ్ఞత్వములు ఉపాధితోఁ గూడియున్నప్పుడే సంఘటించును.

సిద్ధాంతి :- ఉపాధితోఁగూడువాఁడెవ్వఁడు?

నవీనుఁడు :- బ్రహ్మ

సిద్ధాంతి :- అట్లైన బ్రహ్మయే యల్పజ్ఞుఁడును సర్వజ్ఞుఁడు నయ్యెను. మఱి మీరు అల్పజ్ఞుఁడుగాఁడు, సర్వజ్ఞుఁడుగాఁడని యేల నిషేధించితిరి? ఉపాధి కల్పితము అనఁగా మిథ్యయని మీరన్నను దానిఁగల్పించువాఁడెవ్వఁడు?

నవీనుఁడు :- జీవుఁడు బ్రహ్మయా లేక వేఱా?

సిద్ధాంతి :- అన్యుఁడు. ఏలయనఁగా, నతఁడు బ్రహ్మస్వరూపియే యైనచో మిథ్యాకల్పనయే చేయఁడు. మిథ్యాకల్పన చేయువాఁడు సత్య నండు డెట్లు కాఁగలుగును?

నవీనుఁడు :- మేము సత్యాసత్యములనే అబద్ధమందుము. నోటితో మాటలాడుట కూడ మిథ్యయే.

సిద్ధాంతి :- అబద్ధమే నుడువుచు నబద్ధమే నమ్ముచున్న మీరసత్య వాదు లేలగారు?

నవీనుఁడు :- ఉండు; సత్యాసత్యములు మాలోనే కల్పితములు. మేమా రెంటికిని సాక్షి అధిష్ఠాన భూతులము.

సిద్ధాంతి:— సత్యాసత్యములకు నాధారభూతులైన మీరే దొంగలును, మీరే దొరలు నగుచున్నారు. కాన మీరు ప్రామాణికులును కారు. ఏలయనఁగా నెప్పుడు సత్యము నేనమ్ముచు, సత్యమునే నుడువుచు, సత్యమే యాచరించుచు నసత్యము నెన్నటికిని నమ్మనివారును, చెప్పనివారును జేయనివారును మాత్రమే ప్రామాణికు లనఁబడుదురు. మీ మాటలను మీరే యబద్ధ మన్నప్పుడు, మీరు స్వయముగా మిథ్యావాదు లగుచున్నారు.

నవీనుఁడు:– బ్రహ్మ నాశ్రయించుచు నా బ్రహ్మకు ఆవరణముగా నున్నట్టి యనాదిమాయను మీరు నమ్ముచున్నారా లేదా?

సిద్ధాంతి:–లేదు. ఏలయనఁగా లేనివస్తు వున్నట్లు గుపడునదియే మాయ యని మీరు నమ్ముచున్నారు. జ్ఞానహీనుఁడగువాడే దీని నంగీకరించును. ఎల యనఁగా గొడ్రాలి బిడ్డకు బ్రతిబింబ మెన్నడు గలుగఁజాలదన్నట్లు, వస్తువే లేకున్న నది యున్నట్లు గుపడుట సర్వథా యసంభవము. ఇఁక 'సన్మూలాః సోమ్యేమాః ప్రజాః' [ఛాం. ఉ. ప్ర. ౬. ఖం. ౮. ప్రవా.౪]ఇత్యాది ఛాందోగ్యోపనిషద్వచనములకు మీరు చెప్పునది విరుద్ధముగా నున్నది.

నవీనుఁడు:–మీకంటె నధికపండితులై యుండిన వసిష్ఠశంకరాచార్యులు మొదలుకొని నిశ్చలద్దాసు పర్యంతము వ్రాసినదానిని మీరు ఖండించుచున్నారుగా? మే మా వసిష్ఠ శంకరాచార్య నిశ్చలదాసాదులను గొప్పవారనియే భావించుచున్నాము.

సిద్ధాంతి:–మీరు విద్వాంసులా లేక అవిద్వాంసులా?

నవీనుఁడు:–మేమును గొంతవఱకు విద్వాంసులమే.

సిద్ధాంతి:–మంచిది. అట్టైన వసిష్ఠశంకరాచార్య నిశ్చలదాసుల పక్షమును నాయెదుట స్థాపనచేయుఁడు. నేను దానిని ఖండనచేసెదను. ఎవరిపక్షము నిలిచిన, వారే గొప్పవారు. వారి మాటలును మీమాటలును ఖండింపరానివిగానున్న, మీరాయుక్తులనే కొని నామాటల నేల ఖండింపకుందురు? అప్పుడే మీ మాటలును, వారిమాటలును మాననీయములై యుండెడివి. శంకరాచార్యాదులు జైనమతమును ఖండించుటకొఱకే యీ మతమును స్వీకరించియుండవచ్చునని యనుమానింపఁ దగియున్నది. ఏలయనఁగా దేశకాలములనుబట్టి తమపక్షమును స్థాపించుటకొఱకు స్వార్థులైన విద్వాంసులు తమ యాత్మజ్ఞానమునకు విరుద్ధముగాఁగూడ నటింతురు. జీవేశ్వరు లొక్కటి, జగన్మిథ్య అను నిత్యాదిమాటలను వారు నిజమని నమ్మియుండిన, సత్యము కాఁజాలవు. ఇఁక నిశ్చలదాసు పాండిత్య మెట్లున్నదో చూడుఁడు. "జీవో బ్రహ్మాఽభిన్నః చేతనత్వాత్"

అని యతఁడు తన 'వృత్తిప్రభాకర' [ద్వితీయ ప్రకాశవృత్తి.౯].మున జీవబ్రహ్మల యేకతను గుఱించి యనుమాన ప్రమాణము వ్రాసియున్నాఁడు. అనఁగాఁ జేతనుఁడగుటవలన జీవుఁడు బ్రహ్మకంటె వేఱుకాఁడఁట. ఇది

మిక్కిలి తెలివితక్కువవాని మాటవంటిదే. ఏలయనఁగా నొక సాధర్మ్యమాత్ర ముననే యొకదానితో మరియొకదాని కేకత్వము గలుగదు; వానిలోనివైధర్మ్యము భిన్నత్వమును గలుగఁజేయును. ఎట్లనఁగా:- "పృథ్వీ జలాఽభిన్నా జడత్వాత్"

పృథ్వి జడమగుటవలన జలముకంటె వేఱుకాదనిచెప్పిన నా మాట యెన్నఁటికిని సంభవము కానట్లే నిశ్చలదాసు చూపిన లక్షణమును వ్యర్థమే. ఏలయనఁగా అల్పత, అల్పజ్ఞత్వ భ్రాంతిమత్త్వాది ధర్మములు బ్రహ్మకంటె భిన్నముగ జీవునియందును, సర్వగతత్వ, సర్వజ్ఞత్వ, నిర్భ్రాంతిత్వాది ధర్మములు జీవునకంటె భిన్నముగా బ్రహ్మయందును గలవు దీని వలన జీవబ్రహ్మలు వేఱువేఱనుట స్పష్టము. గంధవత్వ కఠినత్వాది పృథివీ ధర్మములు, రసవత్వ ద్రవత్వాది జల ధర్మ్యములకు విరుద్ధ మగుటవలనఁ బృథివి యుజలము నొక్కటి కాఁజాలవు. జీవబ్రహ్మం వైధర్మ్యము లట్టివే. కావున, జీవబ్రహ్మలు త్రికాలము నందు నొక్కటికాఁజాలరు. ఇంతటితోనే నిశ్చలదాసాదు లెంతగొప్ప పండితులై యుండిరో కనుఁగొనుఁడు. యోగవాసిష్ఠమును రచించినవాఁడు ఎవఁడో యాధునికవేదాంతి కావచ్చును. వాల్మీకి వ్రాసినదికాదు. అట్లే వసిష్ఠుఁడు చెప్పినదికాని, రామచంద్రుఁడు వినినదికాని యదికాదు. ఏలయనఁగా వారందఱు వేదానుయాయులు. కావున వేదవిరుద్ధములగు వానిని వ్రాయను వ్రాయరు, చెప్పను చెప్పరు, వినను వినరు.

ప్రశ్న:— వ్యాసుఁడు రచించిన శారీరక సూత్రములందును జీవబ్రహ్మలొక్కటి యని విదితమగుచున్నది చూడుఁడు:-

సంపద్యాఽఽవిర్భావః స్వేన శబ్దాత్ ॥౧॥. వేదాంతదర్శనమ్. అ ౪ పా ౪. సూ. ౧॥

పూర్వము బ్రహ్మస్వరూపముగల జీవుఁడు తన స్వరూపమును బొంది ప్రకట మగుచున్నాఁడు. ఏలయనఁగా స్వశబ్దమువలనఁ దన బ్రహ్మస్వరూపము గ్రహణమగుచున్నది.

బ్రాహ్మేణ జైమినిరుపన్యాసాదిభ్యః ॥౫॥ "–౫॥

'అయ మాత్మా. అపహతపాప్మా' [ఛాం. ౮.౭. ౩. ౧] ఇత్యాది యుపన్యాసముల (వచనముల) చేతను, ఐశ్వర్యప్రాప్తి పర్యంత హేతువులనుబట్టి జీవుఁడు బ్రహ్మస్వరూపముతో నిలుచుచున్నాఁడనునది జైమిన్యాచార్యుల మతము.

విభక్తన్నాత్రేణ తదాత్మకత్వాదిత్యౌడులోమిః ॥౬॥ ౼౬౪

తదాత్మక స్వరూపనిరూపణాది బృహదారణ్య కోపనిషత్తులోని హేతు రూపకములగు వచనములవలనఁ జైతన్యమాత్ర స్వరూపముతో జీవుఁడు ముక్తి యందుండు ననునది యౌడులోమ్యాచార్యుల మతము.

ఏవమప్యుపన్యాసాత్పూర్వభావాదవిరోధం బాదరాయణః ॥౭॥ ౼౬౫

వ్యాసులు పైఁజెప్పిన యుపన్యాసాదులనుబట్టి, ఐశ్వర్యప్రాప్తి రూప హేతువులనుబట్టి, జీవుఁడు బ్రహ్మస్వరూపముఁ బొందునను విషయమున నవి రోధభావముఁ గనపరచి యున్నారు.

అత ఏవ చానన్యాధిపతిః ॥౯॥ ౼౬౭

యోగియైనవాఁడు ఐశ్వర్యసహితుఁడై తన బ్రహ్మస్వరూపమును బొంది, యితరుల యాధిపత్యములేక-దనంతట తానే-తనకును సమస్తమునకు నధిపతిరూపమైనట్టి బ్రహ్మరూపముతో ముక్తియం దుండును.

ఉత్తరము:- ఈ సూత్రముల కీర్తి నర్థముచేయుట తప్పు. వీనికి సరియైన యర్థముఁ జెప్పెదను వినుఁడు: జీవుఁడు పాపమునుండి విముక్తిఁజెంది పవిత్రుఁడై తన స్వకీయ శుద్ధస్వరూపమును బొందనంతవఱకు, యోగము ద్వారా ఐశ్వర్య యుక్తుఁడై తనయంతర్యామియై యున్న బ్రహ్మనుబొంది యానందము ననుభవింపఁజాలఁడు. ॥౧॥

ఈ ప్రకారమే యోగి పాపాదులనుండి రహితుఁడునై శ్వర్యయుక్తుఁడు నగునప్పుడే బ్రహ్మతోఁగూడి మోక్షానందము ననుభవించుచున్నాఁడనునది జైమి న్యాచార్యుల మతము. ॥౨॥

అవిద్యాది దోషములనుండి తొలఁగి శుద్ధచైతన్యమాత్ర స్వరూపములో జీవుఁడున్నప్పుడే "తదాత్మకత్వ" మనఁగా బ్రహ్మస్వరూపముతో సంబంధమును బొందుచున్నాఁడు. ॥౩॥

బ్రహ్మతోఁగూడ (బ్రహ్మసాక్షాత్కారముతోబాటు)నై శ్వర్యమును శుద్ధ విజ్ఞానమును దనజీవితకాలముననే గడించి జీవన్ముక్తుఁడగునపుడే తన నిర్మల మైన పూర్వస్వరూపమునుబొంది యానందము ననుభవించుననునది వ్యాసుల మతము. ॥౪॥

యోగి సత్యసంకల్పుడైనపుడే స్వయముగా పరమేశ్వరునిబొంది ముక్తి సుఖము ననుభవించును. అచ్చట స్వాధీనుడై స్వతంత్రుడుగా నుండును. ప్రపంచమందొకడు ప్రధానుడుగాను మఱియొకడప్రధానుడుగా నున్నట్లు ముక్తియం దుండరు. కాని యట ముక్తజీవులందఱును సమానులుగా నుందురు. ॥౫॥

అట్లుకాకుండిన:—

నేతరో౽నుపపత్తేః ॥౧. ౧. ౧౬.॥
భేదవ్యపదేశాచ్చ ॥౧. ౧. ౧౭.॥
విశేషణభేదవ్యపదేశాభ్యాం చ నేతరౌ ॥౧. ౨. ౨౨.॥
అస్మిన్నస్య చ తద్యోగం శాస్తి ॥౧. ౧. ౧౯.॥
అంత స్తద్ధర్మోపదేశాత్ ॥౧. ౧. ౨౦.॥
భేదవ్యపదేశాచ్చాన్యః ॥౧. ౧. ౨౧.॥
గుహాం ప్రవిష్టావాత్మానౌ హి తద్దర్శనాత్ ॥౧. ౨. ౧౧.॥
అనుపపత్తేస్తు న శారీరః ॥౧. ౨. ౩.॥
అంతర్యామ్యధిదైవాదిషు తద్ధర్మ వ్యపదేశాత్ ॥౧. ౨. ౧౮.॥
శారీరశ్చోభయే౽పి హి భేదేనైనమధీయతే ॥౧. ౨. ౨౦.॥
(వ్యాసమునికృత వేదాంతసూత్రములు)

అర్థము:- బ్రహ్మతప్ప మఱి యేజీవుఁడును సృష్టికర్త కానేరఁడు. ఏలయనఁగా నీయల్పసామర్థ్యముగలవాఁడును, అల్పజ్ఞుఁడునగు జీవునియందు సృష్టికర్తృత్వము సంఘటిల్లదు కాన జీవుఁడు బ్రహ్మకాఁడు. ॥౧.॥

"ఏవం హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి" [తై. ఉ. బ్ర. వల్లి. అను. ౭]

ఇది ఉపనిషత్తులోని వచనము. జీవుఁడును బ్రహ్మయు వేఱు. ఏలయనఁగా వీరియుభయులయందలి భేదము ప్రతిపాదింపఁబడినది. అట్లుకాకపోయిన రసమును ఆనందస్వరూపుఁడైన బ్రహ్మనుబొంది జీవుఁడానంద స్వరూపుఁడగుచున్నాఁడనిననేగాని తా బొందఁదగిన బ్రహ్మము, నతనిఁ బొందు జీవుఁడును వేర్వేఱుగ నిరూపింపఁబడకుండురు. కావున జీవుఁడును బ్రహ్మము నొక్కటి కారు. ॥౨.॥

దివ్యో హ్యమూర్తః పురుషః స బాహ్యాభ్యంతరో హ్యజః।
అప్రాణో హ్యమనాః శుభ్రో హ్యక్షరాత్పరతః పరః॥
ముండకోపనిషత్తు. ముం. ౨. ఖం. ౧. మం. ౨॥

దివ్యుఁడు, శుద్ధుఁడు, మూర్తిమత్త్వరహితుఁడు, అన్నిటను నిండియుండు వాఁడు, నిరంతర మంతర్బహిర్వ్యాపకుఁడు, అజుఁడు, జన్మమరణ శరీరధార ణాది రహితుఁడు, శ్వాస ప్రశ్వాసములు, శరీరము, మనస్సు అను వీనితో సంబంధములేనివాఁడు, ప్రకాశస్వరూపుఁడు. ఈ మొదలగునవన్నియుఁ బర మాత్మకు విశేషణములు. ఇఁక నక్షరమును, నాశరహితమునగు ప్రకృతికంటె భిన్నుఁడగు సూక్ష్మజీవునికంటెనుగూడఁ బరమేశ్వరుఁడు సూక్ష్ముఁడు. అనఁగా బ్రహ్మ సూక్ష్మాతిసూక్ష్ముఁడు.) ప్రకృతిజీవుల కంటె బ్రహ్మ వేఱు అను ప్రతిపాదన రూపకారణములఁ బట్టి ప్రకృతి జీవులకంటె బ్రహ్మ భిన్నుఁడనుట స్పష్టము.॥౩॥

ఈ సర్వవ్యాపకుఁడైన బ్రహ్మతో జీవునికిని జీవునితో బ్రహ్మకును సంబంధము ప్రతిపాదింపఁబడుటవలన జీవుఁడును బ్రహ్మయు భిన్నులు. ఏల యనఁగా సంబంధము భిన్నపదార్థములకే కలుగును. ॥౪॥

ఈ బ్రహ్మ కంతర్యామి మొదలగు ధర్మములు చెప్పఁబడియున్నవి. జీవునిలో వ్యాపించియుండుటవలన వ్యాప్యుఁడగు జీవుఁడు వ్యాపకుఁడగు బ్రహ్మ కంటె భిన్నుఁడు. ఏలయన, వ్యాప్యవ్యాపక సంబంధముకూడ భిన్నత్వమునే నిరూపించుచున్నది. ॥౫॥

పరమాత్మ జీవునికంటె భిన్నస్వరూపుఁ డగునట్లే, ఇంద్రియాంతఃకరణ ములకంటెను, పృథివ్యాదిభూతములకంటెను, దిశావాయుసూర్యాదులకంటెను, దివ్యగుణానుభవయుక్తులగు విద్వాంసులకంటెను గూడఁ బరమాత్మ భిన్నుఁ డుగా నున్నాఁడు. ॥౬॥

"గుహాం ప్రవిష్టౌ సుకృతస్య లోకే" [కఠోప. అ. ౧. వల్లి. ౩. మం. ౧]

ఈ మొదలగు నుపనిషద్వచనములఁబట్టి జీవుఁడును బరమాత్మయు వేఱు వేఱుగాగలరు. ఆదేరీతి నుపనిషత్తులం దనేకస్థలముల వ్రాయఁబడియున్నది.॥౭॥

"శరీరే భవః శారీరః" శరీరధారియగు జీవుఁడు బ్రహ్మకాఁడు. ఏల యనఁగా బ్రహ్మకున్న గుణకర్మస్వభావములు జీవునియందు సంఘటింపవు.॥౮॥

(అధిదైవ) మనస్సు, ఇంద్రియములు మొదలగు దివ్య పదార్థము లందును (అధిభూత) పృథివ్యాది భూతములందును, (అధ్యాత్మ) సమస్త జీవు లందును, అంతర్యామిరూపముచే విద్యమానుఁడై యున్నాఁడు. ఆ పరమాత్మ

యొక్క వ్యాపకత్వాది ధర్మములే యుపనిషత్తులం దంతటను వ్యాఖ్యానింపఁబడియున్నవి. ॥౯॥

శరీరధారియగు జీవుఁడు బ్రహ్మకాఁడు. స్వరూపమున బ్రహ్మము జీవుడు భిన్నులనుట సిద్ధము. ॥౧౦॥

ఈ మొదలగు శారీరకసూత్రములచేతను స్వరూపమందే బ్రహ్మకును, జీవునకును భేదముకలదని సిద్ధమగుచున్నది. అటులే వేదాంతుల యుపక్రమోపసంహారములుకూడ సంఘటింపఁజాలవు ఏలయనఁగా 'ఉపక్రమము' అనఁగా బ్రహ్మనుండియే ఆరంభమును "ఉపసంహారము" అనఁగాఁ బ్రహ్మయందే ప్రళయమును నమ్ముచున్నారు వేఱొక వస్తువునే నమ్మరేని యుత్పత్తి ప్రళయములను బ్రహ్మధర్మములగును. ఉత్పత్తి వినాశరహితుఁడని బ్రహ్మ వేదాది సత్యశాస్త్రములందు ప్రతిపాదింపఁబడియున్నాఁడు. ఆయన యీ నవీనవేదాంతుల మీఁద గోపపడవచ్చును. నిర్వికార, అపరిణామి, శుద్ధ, సనాతన, నిర్భ్రాంతాది విశేషణయుక్తుఁడగు బ్రహ్మయందు వికారము, ఉత్పత్తి, అజ్ఞానము మున్నగునవి యెన్నఁటికిని సంభవింపవు. ఇఁక నుపసంహారమను ప్రళయమైనపుడు కూడ బ్రహ్మయుఁ, గారణాత్మకమగు 'ప్రకృతి'-జడమును, జీవులును విద్యమానులై యుందురు. కావున నుపక్రమోపసంహారములను (నవీన) వేదాంతుల కల్పనయు మిథ్యయే. ఇట్టివింకను శాస్త్రములకును, ప్రత్యక్షాది ప్రమాణములకును విరుద్ధములైన పెక్కియో యసంగతపుమాటలు వీరిలో నున్నయవి.

దీనికిఁ దరువాత జైనులయు, శంకరానుయాయులయు నుపదేశరూప సంస్కారము లార్యావర్తమందువ్యాపించెను. ఇఁక నా యుభయ మతవాదులొకరినొకరు ఖండించుకొనుచుండిరి. శంకరాచార్యులకుఁ బిమ్మట మూఁడు వందల సంవత్సరములకుఁ గొంత పరాక్రమవంతుఁడగు విక్రమాదిత్యుఁడను నతఁడు ఉజ్జయినీనగరమునకు రాజయ్యెను. అతఁడు రాజులలోని పరస్పర కలహములనుమాన్పి, శాంతిస్థాపించెను. తదనంతరము భర్తృహరిరాజు కావ్యాదిశాస్త్రములందును, తదితరములందును కొంత విద్వత్తునుగడించెను. ఆతఁడు వైరాగ్యమును జెంది రాజ్యమును వదలిపోయెను. విక్రమాదిత్యునిఁదరువాత నైదువందల సంవత్సరములకు భోజరాజు రాజ్యమునకువచ్చెను. అతఁడు కొంత వ్యాకరణమును, గావ్యాలంకారాదులను మిక్కిలి యభివృద్ధికిఁదెచ్చెను.

ఆతని కాలముననే గొల్లవాడుగానుండిన కాళిదాసు రఘువంశకావ్యమును రచించునంతటి విద్యావంతుఁడయ్యెను. ఎవఁడేని మంచిశ్లోకమునురచించి వినిపించిన భోజరాజు వానికి విశేషముగాధనమునిచ్చి సమ్మానించుచుండెను. అతనికిఁ దిమ్మటవచ్చిన రాజులు, శ్రీమంతులు చదువుటనే మానివేసిరి. శంకరాచార్యులకంటె ముందును, వామమార్గులకుఁ దరువాతను శైవాది సాంప్రదాయిక మతవాదులు కూడ నుండిరి. కాని వారు అంత ప్రబలియుండలేదు. విక్రమాదిత్య మహారాజుగారి కాలమునుండి శైవులబలము ఎక్కుడుగాఁ బెంచెను. వామమార్గులలో దశమహావిద్యాదిశాఖ లున్నటులే శైవులయందును పాశుపతాదిశాఖ లనేకములు ప్రచలితములై యుండెను. లోకులు శంకరాచార్యులను శివుని యవతారమని విశ్వసించిరి. ఆయన యనుయాయులయిన సన్యాసులుకూడ శైవమతమునఁ గలిసిరి. వారు వామమార్గులనుగూడఁ గలుపుకొనుచుండిరి. వామమార్గులు దేవియను శివునిపత్నిని, శైవులు మహాదేవుని నుపాసించువారలయిరి. ఈ యిరువురును విభూతి రుద్రాక్షలవింక ధరించుచున్నారు. కాని వామమార్గులు వేదవిరోధు లయినంతగా శైవులు కారు.

ధిగ్ధిక్కపాలం భస్మరుద్రాక్షవిహీనమ్ ॥ ౧॥

ఇట్టి పెక్కెయో శ్లోకములను వీరు రచియించి కపాలమున విభూతిని, మెడను రుద్రాక్షలను ధరింపనివాఁడు ధిక్కారార్హుఁడనియు "తంత్యజేదంత్యజం యథా" [శివపురాణము, విద్యేశ్వర సంహిత.౧. అ. ౨౫. శ్లో.౧౫] వానిని అంత్యజునివలెఁ బరిత్యజింపఁదగుననియుఁ జెప్పుట కారంభించిరి. ॥౧॥

రుద్రాక్షాన్ కంఠదేశే దశనపరిమితాన్మస్తకే వింశతీ ద్వే।
షట్షట్కర్ణప్రదేశే కరయుగళగతాన్ ద్వాదశాన్ ద్వాదశైవ।
బాహ్వోరిందోః కలాభిః పృథగితి గదితమేకమేవం శిఖాయామ్।
వక్షస్యష్టాధికం యః కలయతి శతకం స స్వయం నీలకంఠః॥ ౨॥

కంఠమునముప్పదిరెండును, శిరస్సుననలువదియును, చెవులనాఱేసియును, చేతులఁ బన్నెండు పన్నెండును, భుజములఁ బదియాఱు పదియాఱును, శిఖయందొక్కటియును, హృదయమున నూటయెనిమిదియు రుద్రాక్షలు ధరించువాఁడే సాక్షాన్మహాదేవతుల్యుఁడు. ॥ ౨॥

శాక్తేయులుగూడ నిటులే నమ్ముచున్నారు. పిమ్మట నీ వామమార్గులును, శైవులును గలిసి భగలింగములను స్థాపించిరి. వానినే జలాధారియనియు, లింగమనియు ననుచున్నారు. ఈ సిగ్గులేనివారి కీ బుద్ధిలేని పని నేలచేయుచున్నామను లజ్జకొంచెమైనను లేకపోయినదిగదా। 'స్వార్థీ దోషం న పశ్యతి' [చా. నీ. ద. అ. ౬. శ్లో. ౮] స్వార్థులు తమ స్వార్థసిద్ధికొఱకు దుష్టకర్మములనుగూడ శ్రేష్ఠములని తలంచుచు వానిలోని దోషములను గణింపరని యొక కవివ్రాసినది నిశ్చయమేకద. ఆ పాషాణాది మూర్తులను, భగలింగములను పూజించుటచేతనే సమస్త ధర్మార్థ కామమోక్షాదులు సిద్ధించునని నమ్మనారంభించిరి. భోజరాజునకుఁ బిమ్మట జైనులు మందిరముకట్టి విగ్రహములు స్థాపించి, వాని దర్శించుటకును బూజించుటకును నచ్చటికి వచ్చుచుఁ బోవుచునుండగా నీ పోపుల శిష్యులును, జైనమందిరములకు పోవనారంభించిరి. ఆ సమయముననే పశ్చిమదేశమునుండి యవనులును, నన్యమతస్థులును నార్యావర్తమునకు వచ్చుచుఁ బోవుచుండిరి. అప్పుడు పోపులీ క్రిందిశ్లోకమును రచించిరి:

న వదేద్యావనీం భాషాం ప్రాణైః కంఠగతైరపి।
హస్తినా తాడ్యమానోఽపి న గచ్ఛేజ్జైనమందిరమ్ ॥

భవిష్య. పురాణము. ప్రత్య. ౩ ఖం. ౩. అ. ౨౮. శ్లో. ౫౩

ఎన్ని కష్టములువచ్చినను, ప్రాణము కంఠగతమైయున్నప్పుడును-ప్రాణాంతసమయము వచ్చినప్పుడును-గూడ నోటితో యవనులభాషనుచ్చరింపఁగూడదు. అట్లే మదించిన యేనుఁగు చంపఁ దఱుముకొనివచ్చినప్పుడును జైనమందిరమునఁ బ్రవేశించుటవలనఁ దన ప్రాణము దక్కునట్లున్నను ఆజైనమందిరమున నడుగిడఁగూడదు. అట్లా మందిరమును జొచ్చి ప్రాణమును గాపాడుకొనుటకంటె నేనుఁగుకాలఁ గ్రిందఁబడి చచ్చుటయే మేలు' అను నిట్టి యుపదేశములను దమశిష్యులకుఁ జేయఁదొడఁగిరి. అప్పుడు ఎవరేని దీనికిఁ బ్రమాణము మీమతగ్రంథములలో చెప్పఁబడి యున్నదా యని యడిగిన, ఉన్న దని చెప్పుచుండిరి. వారి న్ప్రమాణమును జూపుచున్న మార్కండేయాది పురాణముల వచనములను జదివి వినిపించుచుండిరి. అది దుర్గాపాఠమున దేవీవర్ణనఁ జేసినట్లుండును. భోజరాజు రాజ్యమున వ్యాసులపేరు పెట్టి మార్కండేయ శివపురాణముల నెవరో రచించియుండగా నాసమాచారము భోజరాజుకు

తెలిసెను. అప్పుడాయన యాపండితులనుబట్టి తెప్పించి వారికి హస్తచ్ఛేదనాది శిక్షలను విధించి, "ఇకమీఁదట నెవరైనను గావ్యాది గ్రంథములను రచించిన, వారు తమపేర నంకితము చేయవలయునే కాని, ఋషిమునుల పేరఁజేయఁ గూడదు" అని శాసించెను. ఈ సంగతి భోజరాజకృత "సంజీవిని" యనెడి యితిహాసగ్రంథమున వ్రాసియున్నది. ఈ గ్రంథము గ్వాలియర్ రాజ్యములోని "భిండ్" పట్టణనివాసులగు తివారీ బ్రాహ్మణుల యింటనున్నది. దీనిని 'లఖున' యొక్క రావుసాహెబుగారును, వారి లేఖరియగు రామదయాలు చౌబే గారును దమకన్నులతోఁ దాము చూచియున్నారు. దానిలో నిట్లు వ్రాయఁబడి యున్నది. వ్యాసులు నాలుగువేల నాలుగువందల శ్లోకములును, వారి శిష్యులు అయిదువేల యాఱువందల శ్లోకములును అనఁగా మొత్తము పదివేల శ్లోకములు కల మహాభారతమును రచియించియుండిరి. అది మహారాజగు విక్రమాదిత్యుల కాలమున నిఱువదివేల శ్లోకములు కలదయ్యెను. "మాతండ్రిగారి కాలమున నిఱువదివేల శ్లోకములు కలదయ్యెను. ఇప్పుడు నాకు సగము వయస్సయినది. ముప్పదివేల శ్లోకములుగల మహాభారతగ్రంథము దొఱకును. ఇటులే వృద్ధియగుచుఁబోయిన మహాభారతగ్రంథమొక యొంటెమోయునంతయగును. ఇఁక నిట్లే ఋషి మునుల నామము లిడి పురాణాది గ్రంథములు రచించుచుఁ బోయిన నార్యావర్తీయజనులు భ్రమజాలమునఁబడి వైదికధర్మరహితులగుచు భ్రష్టులై పోదురు" ఇది భోజరాజు కథనము. దీనివలన నాతనికి వేదజ్ఞానము గొంత యుండినట్లు విశదమగుచున్నది. ఈయన భోజప్రబంధమున:-

> ఘత్యైకయా క్రోశదశైకమశ్వః సుకృత్రిమో గచ్ఛతి చారుగత్యా ।
> వాయుం దదాతి వ్యజనం సుపుష్కలం వినా మనుష్యేణ చలత్యజస్రమ్ ॥

భోజరాజు రాజ్యమునను దత్సమీపమునను శిల్పవిద్యా ప్రవీణులనేకు లుండిరి. వారిలో నొకఁడు గుఱ్ఱమునుబోలియుండిన యొక యంత్రయానమును రచించియుండెను. అది యొకగడియలో పదునొకండు క్రోసు లనఁగా నొక గంటలో నిఱువదియేడున్నఱక్రోసుల దూరము పోవుచుండెను. అది యంత రిక్షమందే కాక భూమిమీఁదను నడుచుచుండెను. మఱియొకఁడు యంత్ర యుక్తమగు నొక వీవన జేసియుండెను. అది మనుష్యుని సహాయములేక

తనంతటఁదానే విసరుచు గావలసినంత గాలి నిచ్చుచుండెను. ఈ రెండు పదార్థములైన నింతవఱకు విద్యమానములై యుండిన నైరోపాలండస్థు లింత యభిమానపూర్ణులై యుండకుందురు.

పోపులు తమ శిష్యులను జైనమందిరములకుఁ బోఁగూఁడదని యెంత యాటంకపఱచినను వారు దానినిలక్ష్యపెట్టక జైనుల కథాశ్రవణమునకుఁగూడఁ బోఁదొడఁగిరి. జైనపోపులు పౌరాణికపోపుల శిష్యులను భ్రమింపఁజేయు చుండిరి. అప్పుడు పౌరాణికపోపులు తాము తగిన యుపాయములఁ జింతింప కున్నఁ దమశిష్యులందఱును జైనులయిపోదురని యోచించి, జైనులవలెనే తమలోను అవతారములను, దేవాలయములను విగ్రహములను కథాపుస్తకము లను జేయ నిశ్చయించుకొనిరి. అనంతరము జైనుల యిఱువదినలుగురు తీర్థంకరులకు మాఱుగా నిఱువదినాలుగవతారములను, గుడులనువిగ్రహములను జేసిపెట్టిరి. ఇఁక జైనుల ఆది పురాణ, ఉత్తరపురాణాదులవలెఁ బదునెనిమిది పురాణములను వ్రాయ నారంభించిరి. భోజరాజునకుఁ దరువాత నూటయేఁబది సంవత్సరములకు వైష్ణవమత మారంభమయ్యెను. శఠకోపుఁడనువాఁడు "కంజర" (పిచ్చుఁగుంటు. దొమ్మర) కులమునఁ బుట్టినవాఁడు, అతఁడు దీనిని గొంతవఱకుఁ బ్రచారమునకుఁదెచ్చెను. తరువాత భంగీ (పాకీ) కులజుఁడగు మునివాహనుఁడును, బిమ్మట యవనకులమునఁబుట్టిన యావనాచార్యుఁడును, ఆచార్యులైరి. తదనంతరము బ్రాహ్మణకులమునఁబుట్టిన రామానుజాచార్యుఁడు నాల్గవవాఁడు. ఇతఁడు తన మతమును వ్యాపింపజేసెను. శైవులు శివపురాణాదు లను, శాక్తేయులు దేవీభాగవతాదులను, వైష్ణవులు విష్ణుపురాణాదులను వ్రాసిరి. తమపేర వ్రాసినవాని నెవ్వరును బ్రమాణముగా నంగీకరింపరనియే తమ నామములనుదాఁచి వ్యాసాది ఋషిమునుల పేరఁ బురాణములు రచించిరి. వాస్తవముగా వీనికి నవీనములని పేరిడవలసియుండెను. కాని దరిద్రుఁడు తన కొడుకునకు "మహారాజాధిరాజ" అని గాని యాధునిక పదార్థమునకు సనా తనమని గాని పేరుపెట్టిన నేమియాశ్చర్యము? ఇఁక వీరిలోఁగల పరస్పర కలహములవంటివే పురాణములందంతట నిండియున్నవి.

చూడుడు! దేవీభాగవతమున "శ్రీః" అను దేవి శ్రీపురమునకు స్వామి నిగా నుండెననియు, నామెయే యీ జగత్తునంతటిని రచించెననియు, బ్రహ్మ

విష్ణుమహాదేవులనుగూడ నామెయే సృజించెననియు వ్రాయఁబడియున్నది. అదెట్లనఁగా:- ఆమెకు నొక కోరికపుట్టి, తనచేతులను రాయఁగా దాన నొక బొబ్బకలిగి. యా బొబ్బలోనుండి బ్రహ్మవెడలెనఁట. అతనిఁజూచి యా దేవి. "నీవు నన్ను వివాహమాడు" మని కోరఁగా నా బ్రహ్మ 'నీవు నా తల్లివి. నిన్ను నేను వివాహమాడఁజాలను" అని ప్రత్యుత్తరమిచ్చెనట। ఆ మాట వినఁగానే తల్లి కోపావేశముకలదై తన యాకుమారుని భస్మమొనరించెనఁట. మరల నదేవిధముగ దనచేతులను రాఁచి మఱియొక కుమారుని బుట్టించి, యతనికి విష్ణువని పేరు పెట్టెనఁట. అతనిఁగూడ నదేరీతిని దన్నుఁ బెండ్లాడు మని యాజ్ఞాపింపఁగా నాతఁడు విననందున నతనిఁగూడఁ బూడిదచేసివేసెనఁట. తరువాత మునుపటిరీతిని మూఁడవకుమారుని సృజించి, యాతనికి "మహాదేవు"డను పేరిడి. యాతనిఁ దన్ను వివాహమాడ నాజ్ఞాపింపఁగా నతఁడు. 'నీవు వేఱురూపమును ధరించువఱకు నిన్ను నేను బెండ్లాడఁజాలనని చెప్పెనఁట. ఆమె యటులే మాఱురూపమును ధరించెనఁట. మహాదేవుఁడప్పుడా రెండుకుప్పల బూడిదను జూచి యిదేమి యని యడుగఁగా నా దేవి 'వీరిరువురును నీ యన్నలు. నా యాజ్ఞ నతిక్రమించిరికావున వారిని భస్మము చేసితి'నని చెప్పగా మహాదేవుఁడు నేనొక్కఁడ నేమిచేయుదును। వీరిని మరల బ్రతికించి, యిరువుర స్త్రీలను గూడ సృజించిన, ముగ్గురము మువ్వురను వివాహమాడవచ్చునని యామెతో నుడివెనఁట. ఆమె యటులేచేయఁగా ముగ్గురు మువ్వురను వివాహమాడిరఁట. "ఆహాహా! తల్లిని వివాహమాడలేదు. కాని చెల్లెండ్రను బెండ్లియాడిరఁట. ఇది యుచితమా?" పాఠకు లూహింపఁదగును. ఇమ్మట నింద్రాదులను సృజించెననియు బ్రహ్మ విష్ణు రుద్ర ఇంద్రులను. దన పల్లకిమోయుట కాదేవి నియమించెననియు నిట్టి లేనిపోని మాటలు వ్రాసి యున్నారు. "ఆ దేవిశరీరమును. ఆ శ్రీపురమును రచించిన వారెవ్వరు? దేవికిఁ తల్లిదండ్రు లెవ్వరు?" అని వారి నడుగవలెను. దేవి "అనాది"యని చెప్పిరేని. సంయోగజన్యపదార్థ మెన్నఁటికి ననాది కాఁజాలదు. తల్లికొడుకులు మాత్రము వివాహము చేసికొనుటకు వెఱచిరికాని యన్నచెల్లెండ్ర వివాహములోని మేలేమి?

ఈ దేవీభాగవతమున బ్రహ్మ విష్ణు మహాదేవులను నీచులని తెగడియు, దేవిని గొప్పదని పొగడియు వ్రాసియున్నటులే శివపురాణమున దేవి మొదలగువారిని కడుహీనులని అందఱు మహాదేవునకు దాసులనియు, నా మహాదేవుఁ డందఱికి స్వామియనియు-వ్రాసిరి. రుద్రాక్షలను (ఇవి యొక చెట్టు ఫలములోని గింజలు) బూడిదను ధరించుటవలన ముక్తికలుగునని చెప్పుదురేని బూడిదలోఁ బొరలాడు గాడిద మున్నగు పశువులను, గురిగింజల మొదలగువానిఁ ధరించు భిల్లులను, పిచ్చుకుంటు (కంజర) మున్నగువారును ముక్తిని బొందవలెను. బూడిదలోఁబడి పొరలాడు పంది, కుక్క, గాడిద మొదలగు పశువులకు ముక్తియేల కలుగదు?

ప్రశ్న:- కాలాగ్ని రుద్రోపనిషత్తునందు భస్మము ధరించు విధానము వ్రాయఁబడియున్నదే; అది యథార్థమగునా? అట్లే యజుర్వేదమునఁగల 'త్ర్యాయుషం జమదగ్నేః' [యజుః ౩.౬౨] అనునిత్యాది వేదవచనములందును భస్మధారణ విధానము కలదు. ఇది పురాణములలో ఈ చెట్టు రుద్రుని కన్నీటి నందున దీనికి రుద్రాక్షయను నామము కలిగెననియు నట్టి రుద్రాక్షలు ధరించుట నుండి పుట్టివలనఁ పుణ్యము లభించుననియు వ్రాయఁబడియున్నది. ఒక రుద్రాక్షనైనను ధరించిన సమస్త పాపములను బాసి, యమనరక భీతులు లేక, తిన్నగా స్వర్గమునకుఁ బోవగును.

ఉత్తరము:—"యాస్య ప్రథమా రేఖా సా భూర్లోకః" ఈ మొదలగు వచనములనుబట్టి, కాలాగ్నిరుద్రోపనిషత్తు నెవఁడో భస్మధారియే వ్రాసినాఁడనుట స్పష్టము. దానిలో నిట్టియనర్థకములైన వచనములేకలవు ఏలన ప్రతిదినము జేతితో వ్రాయు రేఖ భూలోకము కాని, తద్వాచకము కాని యెట్లు కాగలదు? "త్ర్యాయుషం జమదగ్నేః"[యజుః ౩.౬౨] మొదలగు మంత్రములు భస్మధారణమును గాని, త్రిపుండ్రధారణమును గాని బోధించునవి కావు. కాని "చక్షుర్వై జమదగ్నిః"; [శతపథము ౮.౧.౨.౩] హే పరమేశ్వరా! నా నేత్రజ్యోతి(త్ర్యాయుషం) త్రిగుణమై అనఁగా మూడువందల సంవత్సరములపర్యంతము ఉండునట్లనుగ్రహింపుము. దృష్టిని నశింపఁజేయని ధర్మకార్యములనే నేను జేయుచుందును గాకయని భావము. ఇదట్లుండనిండు. కన్నీటినుండికూడ వృక్షముత్పన్నమగుననుట యెంత మౌర్ఖ్యమనవలెను! ఎవఁడైనను పరమేశ్వరుని

సృష్టిక్రమమునే త్రిప్పివేయఁగలదా? పరమాత్ముఁడు ఏ వృక్షబీజము నెట్లు రచించెనో దానినుండి యావృక్షమే యుత్పన్నముకాఁగలదు. కాని వేఱుకాదు. రుద్రాక్షలు, భస్మము, తులసిపూసలు, కమలాక్షులు, గడ్డి, చందనము మొదలగు వానిని గంతాదుల ధరించుకొనుట పశుప్రాయులైన యజ్ఞానిమనుష్యులు చేయుదురే యనఁనొప్పును. ఇట్టి వామమార్గులు, శైవులు నగువారు మిక్కిలి మిథ్యాచారులు, వేదవిరోధులుఁ, గర్తవ్య కర్మలు త్యజించువారునై యున్నారు. వీరిలో నొకానొక శ్రేష్ఠపురుషుఁడు ఈ మాటలు విశ్వసింపక సత్కర్మములనే చేయును. భస్మ రుద్రాక్షల ధరించుటవలన యమదూతలు భయపడుచున్నారన్నఁ బోలీసువారు కూడ భయపడుచుండవచ్చును రుద్రాక్షలను భస్మమును ధరించు వారిని జూచి సింహము, కుక్క, సర్పము, తేలు, ఈఁగ, దోమ మున్నగునవి కూడభయపడుటలేదే; న్యాయాధీశుఁడైన యాయమునిదూతలేల భయపడుదురు?

ప్రశ్న:-వామమార్గులు, శైవులును మంచివారుగారు కాని వైష్ణవులు మంచివారే కద?

ఉత్తరము:-వీరును వేదవిరోధులగుటవలన వారికంటెను జెడ్డవారే.

ప్రశ్న:-'నమస్తే రుద్రమన్యవే' [యజు. ౧౬.౧] 'శివాయ చ శివతరాయ చ' [యజు. ౧౬.౪౧] 'వైష్ణవమసి' [యజు. ౫.౨౧] 'వామనాయ చ' [యజు. ౧౬.౩౦] 'గణానాం త్వా గణపతిగ్ం హవామహే' [యజు. ౨౩. ౧౯] 'భగవతీభూయాః' [అథర్వ. ౭. ౧౦. ౨౦] 'సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ' [యజు. ౧.౩. ౪౬.]

ఈ మొదలగు వేదప్రమాణములను బట్టి శైవాదిమతములు సిద్ధమగుచున్నవికద. మఱి మీరు వానిని ఖండించుచున్నా రేల?

ఉత్తరము:- ఈ వచనములవలన శైవాది సంప్రదాయములు స్థిరపడవు. ఏలయనఁగా ("రుద్ర" అనునామము పరమేశ్వరునకును ప్రాణాది వాయువులకును, జీవునకును, అగ్ని మొదలగు వానికిని గలదు; క్రోధకర్తయగు రుద్రునకు-దుష్టుల నేడ్పించు పరమాత్మకు-నమస్కారముచేయుట. ప్రాణమునకును, జఠరాగ్నికి నన్నమొసంగుట.(నమ ఇతి అన్ననామ. నిఘంటు-౨-౭ )మంగళకారియు, సమస్త ప్రపంచమున కత్యంత కల్యాణ దాయకుఁడునగు పరమాత్మకు నమస్కారము చేయుటయు దీని భావము.)

'శివస్య పరమేశ్వరస్యాయం భక్తః శైవః. 'విష్ణోః పరమాత్మ-
నోఽయం భక్తో వైష్ణవః' 'గణపతేః సకలజగత్స్వామినోఽయం
సేవకో గాణపతః'. 'భగవత్యా వాద్యా అయం సేవకః భాగవతః'
'సూర్యస్య చరాచరాత్మనోఽయం సేవకః సౌరః'

ఈ రుద్ర, శివ, విష్ణు, గణపతి, సూర్య మున్నగునవన్ని పరమేశ్వరుని పేరులు. సత్యభాషణ యుక్తమగువాణికిఁ భగవతియని పేరు. వీని యర్థము దెలిసికొనకయే కలహములు చేయుచున్నారు. అదెట్లనగా:—

ఒక బైరాగి కిద్దఱుశిష్యులుండిరి. వారు ప్రతిదినమునుదమగురువు కాళ్లు పట్టుచుండిరి. ఒకఁడు కుడికాలిని మఱియొకఁ డెడమకాలిని బంచుకొని సేవ చేయుచుండిరి. ఒకదినమాశిష్యులలో నొకఁడు బజారునకు బోఁదలఁచెను. మఱియొకఁడు తనభాగమునకువచ్చిన కాలుబట్టుచుండెను. గురువుపరుండి పొరలినవు డాశిష్యుఁడు పట్టుచుండినకాలుమీఁద రెండవపాదముపడెను అప్పుడా శిష్యుఁ డచ్చటనున్న యొక దండమును బుచ్చుకొని యాడ్చి యొకదెబ్బ కొట్టెను. అప్పుడా గురువు, 'ఓరి దుర్మార్గుఁడా! ఏమిపని చేసితివిరా!' అని యా శిష్యునితో ననఁగా వాఁడు 'నేను బట్టుచున్న కాలిమీఁద ఈ పాదమేల పడవలెను!' అని యనెను. అంతలో బజారునకు వెళ్ళియుండిన శిష్యుఁడువచ్చి తన వాడుకప్రకారము పట్టుచున్న పాదమునుబట్టుట కారంభించి. చూడఁగా నా పాదము వాచియుండెను. అదట్లు వాచియున్నందునకుఁ గారణము నడుగఁగా గురువుగారు జరిగిన వృత్తాంతమును సవిస్తరముగాఁ జెప్పిరి. అప్పుడా మూర్ఖశిష్యుఁడు, చెప్పక, వేఱొకదండమును బుచ్చుకొని రెండవ శిష్యుఁడొత్తు పాదముమీఁద నీడ్చి యొక దెబ్బవేసెను. అప్పుడు గురువు బిగ్గరగా గోల చేయ నారంభించెను. కాని శిష్యులిరువురును చేతులఁ గఱ్ఱలుపట్టుకొని గురువు రెండుపాదములను దంచ నారంభించిరి. ఆ యేడ్పు, ఆ అఱపులు విని జను లచ్చటికి గుంపులుగూడివచ్చి జరిగిన వృత్తాంత మేమని బైరాగి నడిగిరి. ఆ గుంపులో బుద్ధిమంతుఁ డొకఁడు ఆ సాధువును విడిపించి, యా మూర్ఖశిష్యులను జూచి నాయనలారా! ఈ రెండుపాదములును మీ గురువుగారివేకద మీరి రెంటిని సేవచేయుట వలన సుఖము మీ గురువుగారికే కలుగుచున్నది. వానిని మీరుపెట్టినబాధ దుఃఖమునుమీగురువుగారికే కలుగుచున్నది. అనివారికుపదేశించెను

ఒక్కగురువు సేవలోనున్న ఈ శిష్యులు వర్తించినట్లే, సచ్చిదానందా ఖండ స్వరూపుఁడగు నా పరమాత్మకుఁ వేరులుగానున్న ఏ విష్ణు రుద్రాది అనేక నామములకుఁ బ్రథమ సముల్లాసమున వివరించినట్లు సత్యార్థమును గుర్తెఱుఁగక శైవశాక్తవైష్ణవాది సాంప్రదాయములవారు పరస్పర మొకరిపేరు నొకరు నిందించుచున్నారు. ఈ బుద్ధిహీనులు తమబుద్ధిని గొంచెమైన నుపయోగించుట లేదుగద. అనేక గుణకర్మ స్వభావములంబట్టి యీ విష్ణురుద్ర శివాది నామములా యద్వితీయుఁడు, సర్వనియంతయు, సర్వాంతర్యామియునగు నొక్క జగదీశ్వరునకే కలవని యేల యోచింపరు? మఱి యిట్టిమూర్ఖులమీఁద నీశ్వరుఁడు కోపపడకపోవునా?

ఇఁక చక్రాంకిత వైష్ణవుల యద్భుతమాయ యెట్టిదో చూడుఁడు :

తాపః పుండ్రం తథా నామ మాలా మంత్రస్తథైవ చ।
అమీ హి పంచసంస్కారాః పరమైకాంత హేతవః॥
అతప్తతనూర్న తదామో అశ్నుతే. ఇతిశ్రుతేః॥ (రామానుజపటల పద్ధతి)

(తాపః) శంఖచక్ర గదా పద్మాకారములుగల ముద్రలను నిప్పునఁ గాల్చి, భుజాగ్రములమీఁద వాఁతలువేసి, మరల వానిఁ బాలగిన్నెలోముంచి చల్లార్చుదురు. ఆ పాలను కొందఱు పానముచేయుదురు. కావున వారికిప్రత్యక్షముగా మనుష్యమాంసరుచికూడఁ దెలియవచ్చును. ఇట్టి కర్మంబులనఁ బరమేశ్వరునిబొందుట కపేక్షించుచున్నారు శంఖచక్రాది చిహ్నములం వాఁతలు శరీరముమీఁద లేకున్న జీవుఁడు పరమాత్మను బొందఁజాలఁడట! ఏలయనఁగా వాఁడు (అమః) పరిపక్వుఁడు కాఁడట! రాజసేవకాదులకుండు చిహ్నములనుఁ బట్టి రాజపురుషులని తెలిసి, ప్రజలు భయపడునట్లే, విష్ణువుయొక్క శంఖ, చక్రాది ఆయుధచిహ్నాల ధారణజూచి యముఁడును, అతని దూతలును భయపడుచున్నారఁట! ఇదియునుగాక:-

దోహా॥ బానా బనా దయాల కా, తిలక ఛాప ఔర మాల।
యమ డరపై కాలా కహే, భయ మానే భూపాల॥ భక్తమాల. విష. ౬.॥

భగవంతుని వేషమైన తిలక, ముద్రా మాలల ధరించుకొనుట మిక్కిలి గొప్పయఁట! దీనివలన యమరాజేగాక రాజుకూడ భయపడుచున్నాఁడఁట! ఎట్లనఁగా (పుండ్రం) లలాటమున త్రిశూలమువంటి రేఖలు దిద్దుకొనుట

(నామ) నారాయణదాసు, విష్ణుదాసను దాస శబ్దాంతములగు నామముల పెట్టుకొనుట. (మాల) తామరపూసలపేరు మెడను ధరించుట, మంత్రము-

ఓం నమో నారాయణాయ ॥౧॥ పద్మ పురా. ఉ. ఖం. అ. ౬౨. శ్లో. ౧౧॥

ఇది సాధారణ మనుష్యులకొఱకు జేసియుంచినమంత్రము. అటువలెనే

శ్రీమన్నారాయణ చరణం శరణం ప్రపద్యే॥ ౨॥
శ్రీమతే నారాయణాయ నమః॥ ౩॥
శ్రీమతే రామానుజాయ నమః॥ ౪॥ ఇత్యాది॥

ఈ మొదలగు మంత్రములను ధనాఢ్యులును, రాజ్యులును నగువారి కొఱకు రచించియున్నారు చూడుఁడు! ఎటువంటి ముఖమున కటువంటి తిలకమన్నట్లిదియు నొకవర్తకమే యయ్యెనుగద! ఈ పంచ సంస్కారములు ముక్తిదాయకములని చక్రాంకితులు నమ్ముచున్నారు. ఈ మంత్రముల కర్థము:- నేను నారాయణునకు నమస్కారము చేయుచున్నాఁడను ॥౧॥ నేను లక్ష్మీసమేతుఁడగు నారాయణుని చరణారవిందముల శరణమును బొందుచున్నాఁడను. ॥౨॥ శ్రీయుత నారాయణునకు నమస్కారము చేయుచున్నాఁడను. ॥౩॥ శోభాయుక్తుఁడగు రామానుజునకు నా నమస్కారములు చెందునుగాక॥౪॥ వామమార్గులు పంచ మకారములను నమ్మినట్లే చక్రాంకితులు ఈ యైదు సంస్కారములను నమ్ముచున్నారు తమ శంఖచక్రాది చిహ్నముల కాల్చుకొనుటకు ప్రమాణముగా నేర్పఱచియుండు వేదమంత్రమును, దానియర్థము నిక్రింద వ్రాయుచున్నాను. గమనింపుఁడు:-

పవిత్రం తే వితతం బ్రహ్మణస్పతే ప్రభుర్గాత్రాణి పర్యేషి విశ్వతః।
అతప్తతనూర్న తదామో అశ్నుతే శృతాస ఇద్వహన్తస్తత్సమాశత॥
ఋ. మం. ౯. సూ ౮౩. మం ౧॥

బ్రహ్మాండములను, వేదములను బాలించు సర్వసామర్థ్య యుక్తుఁడవు, సర్వశక్తిమంతుఁడవునునగు ప్రభూ! నీవు బ్రహ్మాండభాగములందంతట వ్యాపించియున్నావు. ఆ నీ వ్యాపకమైయున్న పవిత్ర స్వరూపమును బ్రహ్మచర్య, సత్యభాషణ, శమ, దమ, యోగాభ్యాస, జితేంద్రియత్వ, సత్సహవాసాది తపశ్చర్యలు లేని యపరిపక్వాత్మాంతఃకరణ యుక్తులగువారు పొందఁజాలరు.

పై నుడివియున్న తపశ్చర్యలపలనఁబరిశుద్ధులైనవారే తపములాచరించునుఁదని ఏతీర నీ శుద్ధస్వరూపమును బొందుచున్నారు.

తపోష్పవిత్రం వితతం ప్రపశ్యదే॥ ఋ. మం. ౯. సూ. ౮౩. మం. ౨॥

ప్రకాశస్వరూపుడైన పరమేశ్వరుని సృష్టియందు విస్తృతమైన సవిత్రాచరణరూప తపముల నాచరించు వారే పరమాత్మను బొందుట కర్హులగుచున్నారు.

రామానుజీయాదు లీ మంత్రము చక్రాంకితమును స్థాపించునని యెట్లు దలఁచుచున్నారో తెలియదు. వారు విద్వాంసులగుదురా? విద్యా విహీనులగుదురా? మీరే చెప్పఁడు విద్వాంసులందురేని, ఈ మంత్రమున కిట్టి యసంభావితార్థము నేలచేసియుందు.స. ఏలయనఁగా నీ మంత్రమున (అత ప్తతనూః) అను పదములున్నవి; కాని (అత ప్తభుజైక దేశః) అనిలేవు. (అత ప్తతనూః) అనునది నఖశిఖాగ్రపర్యంత సముదాయమున కర్థము ఈ ప్రమాణమునబట్టి యగ్నిచేతనే కాల్పవలసినదని చక్రాంకితులంగీకరించినయెడలఁ దమ శరీరములను గొలిమిలోఁబెట్టి కాల్చి భస్మముచేసినప్పటికి నీ మంత్రార్థ మన్వయించుటలేదు. ఏలయనఁగా నీ మంత్రమందు సత్యభాషణాది పవిత్రకర్మ లాచరించుటయే. తపమని విధింపబడినది.

"ఋతం తపః సత్యం తపః శ్రుతం తపః శాంతం తపోదమ స్తపః స్వాధ్యాయ స్తపః

తై త్తిరీ. ప్ర. ౧౦. అను. ౧౦॥

ఈ మొదలగునవి తపస్సనఁబడును. (ఋతం తపః) యథార్థశుద్ధభావముతో సత్యమునే నమ్ముచు సత్యమునే చెప్పుచు, సత్యమునే యాచరించుచు మనన్ను నధర్మమునఁ బోనియ్యకుండుట, బాహ్యేంద్రియముల నన్యాయాచరణలోఁ బడకుండ నిరోధించియుంచుట:- అనఁగా శరీరేంద్రియమనములను శుభకర్మములయందే వినియోగపఱచుట. వేదాది సత్యవిద్యలుచదువుట, చదివించుట, వేదానుకూలముగఁ బ్రవర్తించుట. అను నీ యుత్తమకర్మములకుఁ బేరు తపము. లోహము వేఁడిచేసి తోలునుగాల్చుట తపమనఁబడదు. చూడుఁడు! చక్రాంకితులు తామే గొప్పవైష్ణవులమని చెప్పుకొనుచున్నారు. తమ గురుపరంపరను గాపి, తాము చేయు కుకర్మలనుగాని యెంతమాత్రము విచారించుట లేదుగదా! ఈ వైష్ణవమునకు మూలపురుషుఁడగు శఠకోపుని గుఱించి చక్రాంకిత

గ్రంథములలో నొక్కటియగు భక్తమాలయను కావ్యమున తద్గ్రంథకర్తయైన నాభాజీయు నేమి వ్రాసియున్నాఁడో చూడుఁడు:

'విక్రీయ శూర్పం విచచార యోగీ' [దివ్యసూరి రచిత కావ్యము. సర్గము.౨]

ఇత్యాదివచనములు చక్రాంకితుల గ్రంథములందు వ్రాయఁబడియున్నవి. శఠకోపయోగి చేటలుచేసి యటునిటు నమ్ముకొనుచుఁ దిరుగుచుండిన 'కంజర' (పిచ్చుఁగుంటు లేక దొమ్మర) కులమునఁ బుట్టినవాఁడు. ఇతఁడు బ్రాహ్మణుల యొద్ద విద్యాశిక్షలు పొందఁగోరినపుడు వారితని తిరస్కరించి యుండవచ్చును. కావున నీతఁడు శాస్త్రవిరుద్ధమైన తిలక చక్రాంకితాది స్వేచ్ఛాచారయుక్తమగు నీ సంప్రదాయమును బ్రాహ్మణులకు విరుద్ధముగఁ బరికొల్పియుండవచ్చును. ఇఁక నీతని శిష్యుఁడు 'మునివాహను'డనువాఁడు చాండాలకులమునబుట్టినవాఁడు. యవనకులమున బుట్టిన 'యామునాచార్యు'డనుపేరఁ బిలువఁబడు' యావనాచార్యుఁడను వాఁడతనికి శిష్యుఁడయ్యెను. వీరికిఁ బిమ్మట బ్రాహ్మణకులమునఁ బుట్టిన రామానుజుఁడు చంక్రాంకితుఁడయ్యెను. ఇతనికి ముందున్న వారంద ఱును తమతమ గ్రంథములు దేశభాషలోనే వ్రాసియుండిరి. రామానుజుఁడు సంస్కృతమునఁ గొంత పాండిత్యము గడించి శ్లోకబద్ధ గ్రంథములను, శారీరక సూత్రములకును, ఉపనిషత్తులకు శంకరాచార్యులకు విరుద్ధముగా భాష్య మును రచించెను. ఈయన శంకరాచార్యులను జాలవఱకు నిందించియున్నాఁడు. 'జీవబ్రహ్మము లొక్కటి:వాస్తవముగ వేఱొకవస్తువేలేదు. జగత్తు(ప్రపంచము) మిథ్యామాయారూపముఅనిత్యము'అనిశంకరాచార్యులుప్రతిపాదించినయద్వైత మతమునకు విరుద్ధముగా రామానుజుఁడు జీవబ్రహ్మమాయలు మూఁడును నిత్య ములని స్థాపించియున్నాఁడు. శంకరులు బ్రహ్మముకంటె వేఱుగ జీవుఁడుకాని, కారణవస్తువుకాని లేదనిచెప్పుట తప్పు రామానుజు లీవిషయమున అనఁగా విశిష్టాద్వైతమున జీవమాయా పరమేశ్వరులుమువ్వురు అనిత్యమునునమ్ముట మఱల జీవమాయా పరమేశ్వరులొక్కటేయని యద్వైతమును చెప్పుట సంపూ ర్ణముగ వ్యర్థము. అట్లే జీవుఁడు బరమేశ్వరునకు సర్వథా అధీనుఁడనియు, పరతంత్రుఁడనియు నమ్ముట, హార తిలక జపమాల మూర్తిపూజ మొదలగు పాషండమతముల ప్రవర్తింపఁజేయుట అను నీ దోషములు చక్రాంకితులందుఁ గలవు. చక్రాంకితులయినంత వేదవిరోధులు శంకర సాంప్రదాయులు కారు.

ప్రశ్న:-మూర్తిపూజ యెక్కడినుండి వచ్చినది?

ఉత్తరము:-జైనులనుండి.

ప్రశ్న:-జైనులెక్కడనుండి ప్రవర్తింపజేసిరి?

ఉత్తరము:-తమ మూర్ఖత్వమునుండి.

ప్రశ్న:-శాంతముగ ధ్యానావస్థలోఁ గూర్చుండియున్న విగ్రహమును సందర్శించినచో జీవుఁడునట్టి శుభపరిణామములోఁ గూడినవాఁడగునని జైనులు చెప్పుచున్నారు కదా?

ఉత్తరము:-జీవుఁడు చేతనుఁడు; మూర్తి జడము; మూర్తివలెనే జీవుఁడును జడమైపోవునా యేమి? కేవలపాషండమతమైయున్న యీ మూర్తిపూజను జైనులే ప్రవర్తింపఁజేసిరి. కావున దీనిఖండన పంద్రెండవ సముల్లాసమున చేయఁబడును.

ప్రశ్న:-వైష్ణవాదుల విగ్రహములు జైనుల విగ్రహములవంటివి కావు; కావున శాక్తేయాదు లీవిషయమున జైనుల ననుసరించినవారు కారు.

ఉత్తరము:-ఔను కాని, జైనుల విగ్రహములవంటివే చేసియుండినచో జైనమతములోనే గలిసినవారై యుందురు. కావుననే జైనులకు విరుద్ధముగా భిన్నరూపముగల విగ్రహములను జేసియున్నారు. ఏలయనఁగా జైనులతో విరోధముఁబూనుట వీరిపని; వీరికి విరుద్ధముగా నాచరించుటయే వీరిముఖ్యకర్తవ్యమై యుండెను. ఎట్లనఁగా జైనులు తమ విగ్రహములను నగ్నముగాను, ధ్యానావస్థలోనున్న విరక్త మనుష్యునివలెను జేసిరి. తద్విరుద్ధముగా వైష్ణవాదులు శృంగారయుక్తములు, స్త్రీసహితములు నగు రాగభోగ విషయాసక్తులతోఁ గూడియున్నట్టి విగ్రహములను నిలుచున్నట్లుగాను, గూర్చున్నట్లుగాను రచియించిరి. జైనులుసాధారణముగా శంఖము, గంట మొదలగువానిని వాయింపరు. వీరో మిక్కిలి కోలాహలముతోఁ బూజలు చేయుచున్నారు. ఇట్టి లీలలను గల్పించియుండుటవలననే వైష్ణవాది సాంప్రదాయులగు పోపుఁలీమ్యలు జైనమతములోఁజేరక వీరి వలలోనే తగులుపడియున్నారు. ఇంతియకాదు. వీరు వ్యాసాదిమహర్షులచే రచింపఁబడినట్లు తలతోఁకలు లేని కథలుగల గ్రంథములను ధామేవ్రాసి పురాణము లనుపేరుపెట్టి, వానిని దమశిష్యులకు వినిపింపసాగిరి. ఇంక నెన్నియో విచిత్రములను చేయఁదొడఁగిరి. ఒకఁడు శాళితో విగ్రహము

చేసి రహస్యముగా దాని నొక కొండమీఁదఁగాని, యొక యడవిమార్గమునగాని వరవేసియో భూమిలోఁ బాతిపెట్టియో వచ్చును. పిమ్మట, 'నాకు రాత్రి స్వప్నమున ఫలానా దేవుఁడు అనఁగానది యేదేవుని విగ్రహమో యాదేవుఁడు(అనఁగా మహాదేవుఁడో, పార్వతియో, రాధాకృష్ణుఁడో, సీతారాముఁడో, లక్ష్మీనారాయణుఁడో, భైరవుఁడో, హనుమంతుఁడో లేక మఱియెవ్వరో)నేను ఫలానా స్థలమున నున్నాను; నన్నచ్చటనుండి తీసికొనిరమ్ము. ఒక మందిరమును గట్టించి దానిలో స్థాపనచేయుము; నీవే నాకుఁ బూజారివికమ్ము. నేను ఎవ్వరేమికోరిన నా ఫలమునిచ్చెద'నని చెప్పినాఁడు' అని తన శిష్యులందఱితోను చెప్పి ప్రకటించును. వివేకశూన్యులు, ఐశ్వర్య సంపన్నులునగు నా శిష్యులు పోపుగారి దక్కరిమాటలను విని నిశ్చయముని నమ్మి యావిగ్రహ మెచ్చటఁగలదని యడుగఁగా నేదోయొక కొండమీఁదనో, అడవియందో కలదు; నాతో రండు నేను జూపెదననును; అప్పుడా తెలివిమాలిన వారా ధూర్తుని వెంబడించిపోయి, యాస్థలమును జేరి, యా విగ్రహమునుజూచి యాశ్చర్యమగ్నులై పోపుగారి పాదములమీఁదఁబడి, "ఈ దేవతకు మీమీఁద నెంత గొప్పదయ గలదు!దీనిని మీరు తీసికొనిరండు; మేమాలయము గట్టించెదము. ఈ దేవతనందు స్థాపించి మీరే పూజచేయవలయును. మేముకూడ నీ మహిమగల దేవుని దర్శన స్పర్శనములు జేయుచు మా మనోవాంఛిత ఫలమును బొందుచుందుము"అని చెప్పుదురు. ఒకఁడివ్విధముగ తంత్రము జేయఁగా దానిఁజూచిన పోపులందఱు తమ జీవికార్థము మాయోపాయములఁబన్ని విగ్రహములను స్థాపించిరి.

ప్రశ్న:- పరమేశ్వరుఁడు నిరాకారుఁడు గదా. అతఁడు ధ్యానములోనికి రానేరఁడు. కాన విగ్రహ మవశ్యముగా నుండవలయును. ఏమియుఁ జేయలేని వారైనను దానిసమీపమునకుఁబోయి మ్రొక్కి పరమేశ్వరుని నామస్మరణాది స్తోత్రములు చేయఁగలుగుదురు. దీనివలన నష్టమేమి ?

ఉత్తరము:- పరమేశ్వరుఁడు నిరాకారుఁడును, సర్వవ్యాపకుఁడు నగుటవలన నతనికి విగ్రహమే నిర్మింపఁబడనేరదు. విగ్రహమును జూచిన మాత్రమున పరమేశ్వరుఁడు స్మరణకువచ్చునన్న నాపరమేశ్వరుఁడు పృథివి, జలము, అగ్ని, వాయువు, వనస్పతి మొదలుగాఁగల పదార్థములు నిర్మించి తన యద్భుత రచనా విశేషమును గనఁబఱచి యున్నాఁడుగద. ఏమీ, మనుష్యులే సర్వ

తాదులనుండి విగ్రహములు మున్నగువానిని జేయఁగలుగుదురో యట్టి పృథివీ పర్వతాది పరమేశ్వరరచిత మహామూర్తులను జూచినపుడు వారికి పరమేశ్వరుఁడు స్మరణకు రానేరఁడా? మూర్తిని జూచినమాత్రమునఁ బరమేశ్వరుఁడు స్మరణకు వచ్చుననెడు మీ మాట సర్వథా యబద్ధము. విగ్రహ మెదుట లేకున్నపుడు పరమేశ్వరస్మరణ కలుగకపోవుటవలన మనుష్యుఁ డొంటరిగా దొంగతనము, వ్యభిచారము మొదలగు దుష్కర్మములు చేయుటయందుఁ బ్రవృత్తుఁడగును. ఏలయనఁగా నీ సమయమునఁ దన్నెవ్వరు జూడరనియే వాఁడు తలఁచుచున్నాడు. కావున వాఁ డనర్థకములను జేయకమానఁడు. ఇట్టి యనేక దోషము లీ విగ్రహారాధనమువలన కలుగుచున్నవి. ఇఁక పాషాణాదిమూర్తులను నమ్మక, యెల్లప్పుడు సర్వవ్యాపకుఁడును, సర్వాంతర్యామియు, న్యాయకారియునగు నా పరమాత్ముఁ డంతటనున్నాఁడని గుర్తెఱుఁగుచు, నమ్ముచునున్న పురుషుఁడు, అందఱి మంచి చెడు కర్మములను సర్వజ్ఞుఁడగు బరమేశ్వరుఁడు జూచుచున్నాఁడనియు, క్షణమాత్రము గూడ నతఁడు దన్ను వదలియుండఁడనియు భావించిన దుష్కర్మములఁ జేయుమాట యటుండనిండు. మనస్సునందైనను దుష్టాలోచన కెడమీయఁడు. ఏలయనఁగా దాను మనోవాక్కాయములతో నేదుష్కర్మములు చేసినను నంతర్యామియైయున్న న్యాయకారియగు పరమేశ్వరునిచేఁ దప్పక శిక్షింపఁబడుదునని యతఁడు గట్టిగా నెఱిఁగియుండును. మఱి చక్కెర చక్కెర యన్నంతమాత్రమున తీపియు, వేఁపాకు వేఁపాకన్నంత మాత్రమున చేదును గలుగక నాలుకతో రుచిచూచినపుడు తీపి, చేఁదు తెలియును. కాన నామస్మరణ మాత్రమున లాభమేమియుఁ గలుగదు.

ప్రశ్న:- పురాణములందంతటను నామస్మరణము మాహాత్మ్యము గొప్పగా వ్రాయఁబడియున్నది కదా! అట్టి నామస్మరణము సర్వథా వ్యర్థమేనా యేమి?

ఉత్తరము:— నామస్మరణ చేయవలసిన రీతి యది కాదు. మీరు చేయు నామస్మరణము నిరర్థకమే.

ప్రశ్న:— మారీతి యెట్టిది?

ఉత్తరము:— అదియు వేదవిరుద్ధమే.

ప్రశ్న:— పోనిండు ఇప్పుడు మాకు నియుక్తముగ నామస్మరణ చేయు రీతిని తెలియఁజేయుఁడు.

ఉత్తరము :—"న్యాయకారి" ఇది పరమేశ్వరుని యొక్క నామము. పిష్పక్షపాతముగ నందఱ విషయమున సరియైన న్యాయము చేయువాఁడు ఆ పరమాత్ముఁడుగలఁడ' నిఈనామార్థమునుగ్రహించి,యన్యాయమెన్నఁడునుజేయక న్యాయపూర్వకముగనే వ్యవహరింపఁదగును. ఇదియే నామస్మరణచేయవలసిన విధము ఈప్రకారమొకనామమువలననేమనుష్యునకెంతో ఉపకారముక లుగవచ్చును.

ప్రశ్న:—పరమేశ్వరుఁడు నిరాకారుఁడనుమాట మేమునుఎఱుఁగుదుము; కాని, యతఁడు దేవీ శివ విష్ణు గణేశ సూర్యాదుల శరీరములను ధరించి, రామ కృష్ణాద్యవతారము లెత్తియున్నందున నతని విగ్రహములను చేయవచ్చును గదా ఇదికూడ నబద్ధమేనా యేమి?

ఉత్తరము:—ఔను అబద్ధమే.ఏలయనఁగా"అజ ఏకపాత్"[యు.౬.౨౪. ౧౩]"అకాయం"[యజు. ౪౦.౮] అను నీ మొదలగు విశేషణములనవలఁ (పరమేశ్వరునకు జన్మమరణములు లేవనియు, శరీరమును ధరింపఁడనియు వేదములు నుడువుచున్నవి.) యుక్తిచేత నయినను, పరమేశ్వరుఁ డవతార మెత్తుననుట యెన్నటికిని సంభవింపదు. ఏలయనఁగా పరమాత్ముఁ డాకాశము వలె నంతట వ్యాపకుఁడు, అనంతుఁడు, సుఖదుఃఖ దృశ్యాది గుణరహితుఁడు నయియున్నవాఁడు. అతఁడొక చిన్న వీర్యములోనికి, గర్భాశయములోనికి శరీరములోనికి నెట్లురాఁగలుగును? ఏకదేశియై న వాఁడేవచ్చుచు,బోవుచు నుండును. అచలుఁడై అదృశ్యుఁడై ఒక పరమాణువునుగూడ వదలక యంతట నిండియుండువాఁడు అవతారమెత్తునని చెప్పుట గొడ్రాలు తనకొడుకునకు పెండ్లి చేసి తనమనుమని౯ జూచుచున్నట్టు లున్నది.)

ప్రశ్న:—పరమేశ్వరుఁడు వ్యాపకుఁడేని యతఁడు విగ్రహములందును గలఁడు గదా! ఇఁక నేపదార్థమందైనను పరమాత్ముఁడుగలఁడని భావించి పూజ చేయుట యేల మంచిది కాదు? చూడుఁడు:—

న కాష్ఠే విద్యతే దేవో న పాషాణే న మృణ్మయే ।
భావే హి విద్యతే దేవ స్తస్మాద్భావో హి కారణమ్॥ చా.నీ.ద. ౮.౧౧॥

(పరమేశ్వరుఁడు కఱ్ఱతోఁగాని, రాతితోఁగాని, మంటితోఁగాని, చేయఁ బడిన పదార్థములలో లేఁడు: కాని యాయన భావమందుమాత్రము కలఁడు. ఎచ్చట భావించిన నచ్చటఁ బరమేశ్వరుఁడు సిద్ధమగును.)

ఉత్తరము:- పరమేశ్వరుఁ డంతట వ్యాపించియుండగా నతని నొక వస్తువున నున్నాఁడనియు, అన్యత్ర లేఁడనియు భావించుట యొక చక్రవర్తి రాజును సర్వరాజ్యాధిపతియని నమ్ముటకు మాఱుగా నతనినొక చిన్నగుడిసెకు యజమానుఁడని భావించునట్లున్నది. అట్లు చేయుటవలన నా చక్రవర్తికెంతటి యవమానముకలుగునో యోచింపుడు ఆ ప్రకారమే మీరు పరమేశ్వ నిగూర నవమాన పఱచుచున్నారు. మీరు పరమేశ్వరుని సర్వవ్యాపకుఁడని నమ్ము వారైనచోఁ దోటలోనుండి పత్రపుష్పములను గోసి తెచ్చి విగ్రహముమీఁద నేల వేయుచున్నారు? గంధము నఱుగఁదీసి యేల పూయుచున్నారు? సాంబ్రాణి ధూపముల నేల గాల్చుచున్నారు? గంట, డోలు మొదలగువానినేల వాయించుచున్నాఁరు? పరమాత్మ మీచేతులందున్నాఁడు; వానిని ఛేదింపనేల? శిరస్సున నున్నాఁడు. దానిని వంపనేల? అన్నజలాదులందున్నాఁడు. నైవేద్యము పెట్టనేల? జలమునసున్నాఁడు; స్నానము చేయింప నేల? పరమాత్మ వానియందంతటను వ్యాపించియున్నాఁడు గదా మీరా సర్వవ్యాపకునిఁబూజించుచున్నారా లేక వ్యాప్య పదార్థమునా? వ్యాపకుని బూజించుచున్నామన్న. రాల రప్పల మీఁదఁ జందనపుష్పాదుల నేల వేయుచున్నారు? వ్యాప్యవస్తువును బూజించు మేము పరమేశ్వరునిఁబూజించుచున్నామని యబద్ధమేల చెప్పుచున్నారు? మేము పాషాణాదులఁ బూజించువారమని నిజమేల చెప్పరు?

ఇప్పుడు భావము నిజమా అబద్ధమా మీరే చెప్పుఁడు? నిజమని చెప్పిన మీ భావన కధీనుఁడై పరమేశ్వరుఁడు బద్ధుఁడగును. ఇంకను మీ భావనా ప్రభావమువలన మంటిని బంగారము, వెండి మొదలగునవిగాను, రాలను వజ్రము పచ్చ మొదలగునవిగాను. సముద్రపునురుగును ముత్యములుగాను. నీటిని పాలు పెరుగు నెయ్యి మొదలగునవిగాను, దుమ్మును. పిండి చక్కెర మొదలగునవిగాను, ఏల చేయరు? దుఃఖము నెన్నటికిని మీరు భావనచేయరే? యది యేల కలుగుచున్నది? ఎల్లప్పుడును సుఖమునే భావించుచున్నారు; అది యేల లభించుటలేదు? కన్నులు భావనచేసి గ్రుడ్డివాఁడేల చూడఁడు? మృత్యు భావన చేయరే, ఏల మృత్యువు పొందుచున్నారు? కావున మీ భావన సత్యము కాదు. (ఉన్నదున్నట్లు నమ్ముటకే "భావన" యనిపేరు.) అగ్ని నగ్నిగా నీటిని నీరనియు. నిప్పును నిప్పనియు నమ్ముటయే భావన. కాని. నిప్పును నీరనియు. నీటిని

నిప్పునియు నమ్ముట అభావనయే. ఏదియనఁగానున్నదియున్నట్లు తెలిసికొనుట జ్ఞానమును, తద్విరోధముగా నెఱుఁగుట యజ్ఞానమ్మునగును. కావున మీరు అభావనను భావనయనియు భావన నభావనయనియుఁ జెప్పుచున్నారు.

ప్రశ్న :- అయ్యా! వేదమంత్రములద్వారా యావాహన చేయనంత వఱకు దేవతరాదు. కాని యావాహన చేయఁగానే వచ్చుచున్నది. మఱి విసర్జన చేసినతోడనే వెడలిపోవుచున్నది కదా?

ఉత్తరము:- మంత్రమును జదివి యావాహన చేయుటవలననే దేవత వచ్చుచున్న దేని యావిగ్రహము చేతన మేలగాదు? మఱి విసర్జన చేయఁగానే వెడలిపోదెందులకు? అది వచ్చునదెక్కడినుండి? పోవున దెక్కడికి? ఆలింపుఁ డంధులారా! అంతట నిండియుండు పరమాత్మకు రాకపోకలులేవు. మీరు మీ మంత్రబలమువలనఁ బరమాత్మనే రప్పించుచోనదే మంత్రమహిమ వలన మృతిచెందిన మీ పుత్రుని కళేబరమున జీవుని మరల రప్పించరేల? విసర్జనచేసి శత్రు శరీరమునుండి జీవుని వెడలఁగొట్టి చంపరేల? అమాయకు లగు సోదరులారా! వినుఁడు: ఈ పోపులు మిమ్ముల మోసపుచ్చి తమ ప్రయోజనమును సిద్ధింప జేసికొనుచున్నారు. పాషాణాది మూర్తిపూజ చేయవలెనని గాని, పరమేశ్వరుని యావాహన విసర్జనలనుగురించి కాని వేదములందొక్కయక్షరమైనను లేదు.

ప్రశ్న :- ప్రాణా ఇహాగచ్ఛంతు సుఖం చిరం తిష్ఠంతు స్వాహా ।
ఆత్మేహాగచ్ఛతు సుఖం చిరం తిష్ఠతు స్వాహా ।
ఇంద్రియాణీహాగచ్ఛంతు సుఖంచిరం తిష్ఠంతు స్వాహా॥
ప్రతిష్ఠామయూఖగ్రంథము తంత్రగ్రంథము॥

ఈ మొదలగు వేదమంత్రము లున్నవే. లేవని యేల చెప్పుచున్నారు?

ఉత్తరము:- నాయనలారా! మీ బుద్ధిని గొంచెము ఉపయోగించి చూడుఁడు. ఇవి అన్నియు వామమార్గుల కపోలకల్పిత వేదవిరుద్ధములైన గ్రంథములందలి పోపురచిత వచనములేకాని. వేదవచనములు గావు.

ప్రశ్న:- తంత్రము అబద్ధములా?

ఉత్తరము:- సర్వథా అబద్ధములే. పాషాణాదిమూర్తి విషయకము లగు నావాహన ప్రాణప్రతిష్ఠాదులనుగూర్చి వేదమున నొక మంత్రమును

లేనట్లే "స్నానం సమర్పయామి" మొదలగు వచనములు గూడ లేవు. మఱియు "పాషాణాది మూర్తిం రచయిత్వా. మందిరేషు సంస్థాప్య, గంధాదిభిరర్చయేత్" ఱాయి మొదలగువానిచే విగ్రహములను జేసి, మందిరములందుస్థాపించి గంధాక్షతలచేఁ బూజింపవలయునను మాట రెంతమాత్రమును వ్రాయఁబడి యుండలేదు.

ప్రశ్న:- వేదములలో విధిలేనప్పుడు ఖండనకూడ నుండదు. ఖండన గలదనిన:- "ప్రాప్తౌ సత్యాం నిషేధః" ప్రాప్తియున్నప్పుడే కద ఖండన యుండగలుగును.

ఉత్తరము:- విధిలేదు. కాని పరమేశ్వరునకు మాఱుగ మఱి యే పదార్థమునైనను బూజనీయముగా భావింపఁగూడదని మాత్రము సర్వథా నిషేధింపఁబడి యున్నది. ఏమి? అపూర్వవిధి యుండనేరదా? ఇది గమనింపుఁడు:-

అంధంతమః ప్రవిశంతి యేఽసంభూతిముపాసతే ।
తతో భూయ ఇవ తే తమో య ఉ సంభూత్యాగ్ం రతాః ॥ యజు. అ. ౪౦. మం ౯ ॥

అసంభూతి యనఁగా అనుత్పన్నము, అనాది, కారణభూతమునగు ప్రకృతిని బ్రహ్మకుమాఱుగా నుపాసించువారు, అంధకారమందు అనఁగా నజ్ఞానమనెడు దుఃఖసాగరమందు మునుగుచుందురు. సంభూతి యనఁగా కారణము నుండి యుత్పన్నమైన కార్యరూపములగు పృథివ్యాది భూతములను, పాషాణములను, వృక్షాద్యవయవములను, మనుష్యాదుల శరీరములను బ్రహ్మమునకు మాఱుగా నుపాసించువారు, ఆ యంధకారమునఁబడుదురు. అనఁగా మహామూర్ఖులై చిర కాలము ఘోర దుఃఖరూప నరకమునఁబడి మహాక్లేశము ననుభవింతురు.

న తస్య ప్రతిమా అస్తి ॥ యజు. అ. ౩౨. మం. ౩ ॥

(జగత్తునందంతటను వ్యాపించియుండు నిరాకారుఁడగు పరమాత్మని ప్రతిమ-పరిమాణము-సాదృశ్యము-మూర్తి-లేదు.)

యద్వాచానభ్యుదితం యేన వాగభ్యుద్యతే ।
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే ॥ కేనోప. ఖం. ౧. మం. ౪ ॥

వాణియొక్క "ఇదంతా" అనఁగా "ఇదిజలము, దీనిని బుచ్చుకొనుఁడు" అని యొక పదార్థమును జెప్పునట్లు వాక్కుతోఁ జెప్పరాని వాఁడు. ఎవని ధారణ బలన-సామర్థ్యమువలన-నాలుకకుఁ బల్కుబడి కలుగుచున్నదో. యతనినే నీవు

బ్రహ్మయని యెఱిఁగి యుపాసింపుము. అతనికంటె భిన్నమైనదాని నుపాసింపకుము.

యన్మనసా న మనుతే యేనాహుర్మనో మతమ్।
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే॥ కేనో.ఖం.౧.మం.౬॥

ఎవఁడు మనస్సుతో(ఇయత్తా) ఇంతవాడని విచారింపఁ బడుటకు. వీలు కానివాడో మనస్సునకు విషయమునుగాఁడో. ఎవఁడు మనస్సును గుర్తెఱుఁగుచున్నాడో యతనిని నీవు బ్రహ్మయని తెలిసి యతనినే యుపాసింపుము. తద్భిన్నమైన జీవునిఁగాని, యంతఃకరణమునుగాని బ్రహ్మకు మాఱుగా నుపాసింపకుము.

యచ్చక్షుషా న పశ్యతి యేన చక్షూంషి పశ్యంతి।
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే॥ కేనో.ఖం.౧.మం.౭॥

కన్నులకుఁ గానరాఁడు కాని యందఱు కన్నులెవనివలనఁ జూచుచున్నవో అతనిని నీవు బ్రహ్మయని తెలిసికొని యతనినే యుపాసింపుము. కాని యతనికంటె నన్యమగు సూర్య విద్యు దగ్ని మొదలగు జడపదార్థముల నుపాసింపకుము.

యచ్ఛ్రోత్రేణ న శృణోతి యేన శ్రోత్రమిదగ్ంశ్రుతమ్।
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే॥ కేనో.ఖం.౧.మం.౮॥

చెవులకు వినరాఁడు. కాని యెవనివలనఁ జెవులు వినుచున్నవో, అతనిని నీవు బ్రహ్మమని గుర్తెరింగి యతనినే యుపాసింపుము; అతనికి మాఱుగ నన్యశబ్దాదుల నుపాసింపకుము.

యత్ప్రాణేన న ప్రాణితి యేన ప్రాణః ప్రణీయతే।
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే॥ కేనో ఖం. ౧. మ. ౯॥

ప్రాణములమూలమున చలింపఁడు కాని యెవనివలనఁ ప్రాణములకు గతి కల్గుచున్నదో,అతనిని నీవు బ్రహ్మయని యెఱిఁగి యతనినే యుపాసింపుము. అతనికంటె వేఱగు వాయువు నుపాసింపకుము.

ఇట్లు నిషేధించునవి యనేకములున్నవి. ప్రాప్తమునకు. నప్రాప్తమునకుఁగూడ నిషేధములున్నవి. ఎట్లనఁనొకచోటఁ గూర్చుండియుండినవాని నచ్చ

టనుండి లేవఁదీయుట ప్రాప్తనిషేధము. అట్లే తండ్రి తన కుమారునితో "నాయనా! నీ వెన్నటికిని దొంగతనము చేయకుము. బావిలోఁ బడకుము. దుష్టుల సహవాసము చేయకుము. విద్యావిహీనుఁడవై యుండకుము" అను నీ మొదలగునవి చెప్పుట అప్రాప్త నిషేధము. కాన నప్రాప్తవిషయముకూడ నిషేధింపఁబడవచ్చును. మనుష్యుల జ్ఞానమున లేనివి పరమేశ్వరుని జ్ఞానమున నుండినందున నిషేధింపబడినవి. కావున పాషాణాది మూర్తిపూజ సర్వథా నిషిద్ధము.

ప్రశ్న:—విగ్రహారాధనమున పుణ్యము లేనపుడు పాపమును లేదు కదా?

ఉత్తరము:—కర్మములు రెండే విధములు. (౧) విహితములు- వేదమందుఁ గర్తవ్యములని ప్రతిపాదింపఁబడిన సత్యభాషణాదులు. (౨) నిషిద్ధములు- వేదమందు నకర్తవ్యములని నిషేధింపఁబడిన మిథ్యా భాషణాదులు. విహితకర్మముల నొనర్చుట ధర్మము. వానిని చేయకుండుట యధర్మము. అటులే నిషిద్ధ కార్యములను జేయుట యధర్మము. వానిని చేయకుండుట ధర్మము. కావున వేదమందు నిషేధింపబడిన మూర్తిపూజాది కర్మములనొనర్తురేని మీరు పాపులేల గారు?

ప్రశ్న:—వేద మనాది కద. ఆ సమయమున విగ్రహాదులతో నేమి పని? ఏలయనఁగా నప్పుడు దేవతలు ప్రత్యక్షమగుచుండిరి తరువాతఁ దంత్రపురాణముల కాలమున నీ మూర్తిపూజ సాగినది. మనుష్యులలోఁ దెలివియు, సామర్థ్యమును దక్కువైనప్పుడు వారు పరమేశ్వరుని ధ్యానించుకొనుట కశక్తులైరి. అట్టిచో విగ్రహములను ధ్యానింపవచ్చును గాన నజ్ఞానులకొఱకే యీ విగ్రహారాధనము. ఏలయనగాఁ గ్రమముగ నొక్కొక్కమెట్టు నెక్కుచు మిద్దెను జేరవచ్చును. మొదటి మెట్టును వదలి మీఁదికిఁ బోవలెనన్న సాధ్యముగాదు. కాన మూర్తి మొదటిమెట్టు. దానిని బూజింపఁగా బూజింపఁగా జ్ఞానముకలిగి అంతఃకరణము కూడ బవిత్రమగును. అప్పుడు పరమేశ్వరుని ధ్యానించు శక్తి కలుగును. గురిపెట్టి కొట్టువాఁడు మొదటఁ దాను బెద్ద గురుతును జూచి బాణము చేతనో, గుండుచేతనో గురిపెట్టి కొట్టుచుఁ గొట్టుచు దరువాత నా గురు తెంత సూక్ష్మమైనను, గురిచూచి కొట్టఁగలుగును. అటులే స్థూలవిగ్రహమును బూజించుచుఁ బూజించుచుఁ దరువాత సూక్ష్మ బ్రహ్మమునుగూడఁ బొందగలు

గును. కన్యలు నిజముగా భర్తం బొందకుండునంత వఱకే కదా బొమ్మలతో నాడుచుందురు, కాన నీ కారణముంబట్టి మూర్తిపూజచేయుట దుష్టకర్మము కాదు.

ఉత్తరము:- వేదవిహితాచరణము ధర్మము: వేద విరుద్ధాచరణము అధర్మము. ఇప్పుడు మీరు చెప్పినదాని వలనను మూర్తిపూజ యధర్మమనియే స్థిరపడును. వేదములకు విరుద్ధములగు గ్రంథములను ప్రమాణముగా నంగీకరించుటచే మనుష్యుఁడు నాస్తికుఁడగును. చూడుఁడు:-

నాస్తికో వేదనిందకః ॥ మను. ౨ ౧౧ ॥

వేదముల నింద (అవమానము, త్యాగము, తద్విరుద్ధాచరణము) చేయువాఁడు నాస్తికుఁడని మనుస్మృతియందుఁ గలదు

యా వేదబాహ్యాః స్మృతయో యాశ్చ కాశ్చ కుదృష్టయః ।
సర్వాస్తా నిష్ఫలాః ప్రేత్య తమోనిష్ఠా హి తాః స్మృతాః ॥ మను. ౧౨.౯౫ ॥

వేదబాహ్యులు, కుత్సితులునగు పురుషులచే రచింపఁబడిన గ్రంథములు జనులను దుఃఖసాగరమున ముంచివేయును. అవి యన్నియు నిష్ఫల అసత్య అంధకారరూపములు కాన నిహమునను బరమునను దుఃఖమునే యొసంగును.

ఉత్పద్యంతే చ్యవంతే చ యాన్యతోఽన్యాని కానిచిత్ ।
తాన్యర్వాక్కాలికతయా నిష్ఫలాన్యనృతాని చ॥ మను. ౧౨.౯౬ ॥

వేదవిరుద్ధముగ రచింపఁబడిన గ్రంథములు నవీనములగుటవలన శీఘ్రకాలముననే నశించును. కావున వానిని విశ్వసించుట నిష్ఫలము. అది సరి కాదు, తప్పు.

బ్రహ్మ మొదలుకొని జైమిని మున్యాచార్యుల కాలము వఱకున్న మత మిదే రీతి నుండినది. వారు వేదవిరుద్ధమైన దానిని నమ్మక వేదాను కూలముగ ప్రవర్తించుటయే ధర్మమని నమ్మియున్నారు. ఏలయనఁగా వేదము సత్యార్థమునే నిరూపించుచున్నది. దీనికి విరుద్ధములగు తంత్రపురాణ గ్రంథము లన్నియు వేదమునకుఁ బ్రతికూలములగుటవలన నసత్యములు. ఇఁక నట్టి వేద విరుద్ధములగు పుస్తకములందు విధింపఁబడిన విగ్రహారాధనము కూడఁ బాప కృత్యమే. మనుష్యుల జ్ఞానము జడపదార్థములను బూజించుటవలన వృద్ధి చెందదుకాని యున్నదికూడ మంటగలియును. కావున జ్ఞానుల సేవా సాంగత్యములవలన జ్ఞాన మధికమగునే కాని పాషాణాదులను బూజించుట వలనఁగాదు.

మనుష్యుఁడు పాషాణాది మూర్తిపూజవలనఁ బరమేశ్వరు నెన్నఁడేని ధ్యానింపఁ గలుగునా? లేదు. మూర్తిపూజ వానికి మెట్టుకాదు; కాని యదియొక పెద్దకందకము. మనుష్యుఁడు దానిలోఁబడి ముక్కముక్కలైపోవుచున్నాఁడు; మరల నా కందకమునుండి పైకిరాఁజాలఁడు. అందులోనే పడి చచ్చును. ధర్మాత్ములైన సాధారణవిద్వాంసులయు, పరమవిద్వాంసులగు యోగులయు సహవాసమువలన కలుఁగు సద్విద్య, సత్యభాషణాదులే "మిద్దెమీఁదికిఁ బోవుటకు నిచ్చెనవలె" పరమేశ్వరుని బొందుటకు సోపానములు. మఱి విగ్రహపూజఁ జేసిచేసి జ్ఞానులైన వారెవ్వరును లేరు. మూర్తిపూజకు లందఱును వివేకశూన్యులై తమ మనుష్యజన్మమును వ్యర్థముగ నష్టపఱచుకొని గతించిరి. ఇప్పుడు మూర్తిపూజఁ జేయుచున్నవారును, ఇఁకముందు చేయఁబోవు వారుగూడ మనుష్యజన్మ ఫలములగు ధర్మార్థ కామమోక్షములఁ బొందఁజాలక విముఖులై నిరర్థకముగా నశించిపోదురు. ధర్మాత్ములైన విద్వాంసులును, సృష్టి విద్యయు నను నవియే బ్రహ్మమును బొందుటకు స్థూలలక్ష్యము వంటివి. కాని మూర్తిపూజ స్థూలలక్ష్యము వంటిది కాఁజాలదు. కాన సృష్టివిద్యాదుల జ్ఞానమును వృద్ధిపఱచు కొనుచు, రాఁగ రాఁగ మనుష్యులు బ్రహ్మనుగూడఁ బొందగలరు. మూర్తిపూజ బొమ్మలాట వంటిదియుఁగాదు. కాని యా బ్రహ్మమును బొందుటకు అక్షరాభ్యాస సుశిక్షాదులే బొమ్మలాటవంటి సాధనమువలన నొప్పును. వినుఁడు: మంచి శిక్షను, మంచి విద్యను బొందినప్పుడే సత్యస్వామియగు నా పరమాత్మను గూడఁ బొందఁగలుగుదురు.

ప్రశ్న:- సాకార వస్తువున మనస్సు నిలుచునేకాని నిరాకారా వస్తువున నిలుచుట కఠినము. కావున మూర్తిపూజ యుండియే తీరవలయును.

ఉత్తరము:- (౧) సాకారవస్తువున మనస్సెన్నటికి నిలువఁజాలదు. ఏలయనఁగా దానిని మనస్సు తక్షణమే గ్రహించి, దాని ప్రత్యేకావయవమునఁ దిరుగుచు నొకదానినుండి మఱియొక దానికిఁ బఱుగిడును. ఇఁక నిరాకారుఁడగు పరమాత్మను గ్రహించుటకు మనస్సు తనసత్తువకొలఁది నెంతపరుగెత్తినను దాని కంతుదొరకదు. పరమాత్ముఁడు అవయవరహితుఁడైనందున మనస్సునకుఁ జాంచల్యము గూడఁ గలుగదు. కాని యా పరమాత్ముని గుణకర్మస్వభావములను గుఱించి విచారణము చేయుచుఁ జేయుచు నానందమున

మగ్నమై నిలిచిపోవుచున్నది. సాకార వస్తువునందే మనస్సు నిలువఁగలిగినచో ప్రపంచమందలి మనుష్య స్త్రీ పుత్ర ధన మిత్రాది సాకారములందుఁ దగులువడి యుండుట స్పష్టము. కాఁబట్టి నిరాకారవస్తువున మనస్సును నిలుపనంతవఱకు నెవరి మనస్సునకును స్థైర్యము కలుగదు. నిరవయవమగుటవలన దానియందే మనస్సు నిలువఁగలుగును. కావున మూర్తిపూజ చేయుట యధర్మము.

(౨) కోట్లకొలఁది ధనమును దేవాలయములఁ గట్టుటయందు వ్యయపఱచుటవలన దరిద్రులగుటయే గాక ప్రమాదము వాటిల్లుచున్నది.

(౩) దేవాలయములలో స్త్రీపురుషుల చేరుటవలన వ్యభిచారము కలహములు. అంటురోగాదులు కలుగుచున్నవి.

(౪) దీనినే ధర్మార్థ కామమోక్షములకు సాధనమని తలఁచి పురుషార్థరహితులై జనులు తమ మనుష్యజన్మమును వ్యర్థముగాఁ బోగొట్టుకొను చున్నారు.

(౫) నానావిధములగు భిన్నభిన్న స్వరూపములు, నామములు, చరిత్రములుగల మూర్తులను బూజించువారు, ఐకమత్యమును మంటఁగలిపి విరుద్ధ మతప్రవర్తకులగుచు నొకరితో నొకరు భేదభావములఁ బెంచుకొని దేశమును నశింపఁజేయు చున్నారు.

(౬) విగ్రహములమీఁది విశ్వాసమున శత్రువులకుఁ బరాజయమును, దమకు విజయమును గలుగునని నమ్మి కూర్చుందురు. దానివలన తమకుఁ బరాజయము గలిగి రాజ్యస్వాతంత్ర్యమును, ధనసౌఖ్యములును శత్రువులపాల గును. అప్పుడు వారు పరాధీనులై బాడుగకు మోయు గుఱ్ఱములవలెనుఁ గాఁకలి వాని గాడిదలవలెనుఁ శత్రువుల చేతఁజిక్కి బహువిధ దుఃఖముల ననుభవించు చున్నారు.

(౭) ఒకఁడొకనితో నీవు కూర్చుండుచోటనో, నీపేర నొకఱాయి బాతుదు నన్న వాఁడు క్రోధావేశుఁడై వానిఁగొట్టును, తిట్టును బోవునుగద. అటువలె పరమేశ్వరోపాసనకు స్థానమైన హృదయమునందును, నామమునకు బదులుగాను పాషాణాదిమూర్తులను స్థాపించు దుష్టుల నాపరమేశ్వరుఁడేల నాశనము చేయకుండును?

(౮) పిచ్చిపట్టి గుడి గోపురములఁజూచి దేశదేశాంతరములకుఁ బోవుచు దిరిగి దుఃఖపడుదురు. ఇఁక ధర్మమును, ఐహికాముష్మికకార్యములను నష్టపఱచుకొందురు. మఱియు చోరులచేతఁ జిక్కి పీడింపఁ బడుదురు. అక్కడ మోసగాండ్ర వలనఁబడి నష్టము నొందుదురు.

(౯) దుష్టులగు పూజారులకు ధనము నిచ్చుచున్నారు. వారా ధనమును వేశ్యాది పరస్త్రీగమనమందును, మద్యమాంసాహారములందును, కలహ ద్రోహములందును వినియోగపఱచుటవలన నిచ్చిన దాతకు సుఖమూలము నష్టమై దుఃఖము వాటిల్లును.

(౧౦) తల్లి తండ్రి మొదలుగాఁగల పూజ్యుల దిరస్కరించుచుఁ బాషాణాది మూర్తులను సత్కరించుటవలనఁ గృతఘ్నులగుచున్నారు.

(౧౧) విగ్రహముల నెవరైన విఱుగఁగొట్టినను, దొంగిలించినను మహావ్యసనముతో నేడ్చుచున్నారు.

(౧౨) పూజారులు పరస్త్రీలతోను, పూజారిణులు పరపురుషులతోను గూడుటవలన దూషితులై ప్రేమ సంబంధమైన స్త్రీపురుషుల యానందమును కుదముట్టజేయుచున్నారు.

(౧౩) స్వామియాజ్ఞను సేవకుఁడు సక్రమముగా బాలింపకపోటవలనఁ బరస్పర విరోధభావ మంకురించి యొండొరులు నష్టభ్రష్టులగుచున్నారు.

(౧౪) నిర్జీవమగు జడమును ధ్యానించువాని బుద్ధియు జడమైపోవుచున్నది. ఏలయనఁగా ధ్యేయపు జడత్వధర్మము, అంతఃకరణముద్వారా అవశ్యము ఆత్మను బొందును.

(౧౫) పరమేశ్వరుఁడు సుగంధయుక్తమగు పుష్పాదులను వాయుజలములలోని దుర్గంధమును నివారించుటకొఱకును, ఆరోగ్యమును గలుగఁజేయుటకొఱకును రచించినాడు. ఆపుష్పములసుగంధ-మాకాశమునవ్యాపించి వాయుజలములను శుద్ధిపఱచుచు నవి యెంతకాలము వఱకట్లు పూర్ణసుగంధముతోఁ గూడియుండఁగలుగునో తెలియదు గద! ఈ పూజారులట్టి పుష్పములను మధ్యనే తుంచి పాడుచేయుచున్నారు. ఇఁక నాపుష్పములుబురదలోఁ గలిసి మఱిగి, సుగంధమునకుమాఱుగా దుర్గంధము గలుగఁజేయుచున్నవి.

ఏమి పరమాత్ముఁడు శిలల నలంకరించుటకా, పుష్పములను సుగంధయుక్తముగ రచియించినది?

౧౬) శిలలకు సమర్పించిన చందనాక్షత పుష్పాదులు మంటిలోఁ గూడ నభిషేకపునీటితోఁ గొట్టుకొనిపోయి. కుండులోఁబడి ముఱిగి మనుష్యమలముతో సమానమగు దుర్గంధము నాకాశమున వ్యాపింపఁజేయును. దానికిఁ గోదన్నియో జీవజంతువులు దానిలోఁబడి చచ్చిముఱుగుచుండును. ఇట్టిదోషములనేకములు మూర్తిపూజవలనఁ గల్గుచున్నవి. కావున నీ పాషాణాదులలోఁ జేయఁబడిన విగ్రహములను బూజించుట సజ్జనుల కెంతమాత్రము తగదు. పాషాణాది మూర్తులఁ బూజించువారు పూర్వోక్తదోషములనుండి దూరులయి యుండరనుట త్రికాలములందును సంభవింపదు.

ప్రశ్న:— మఱి యేవిధమైన మూర్తిపూజ చేయను—జేయింపను-రాదు. కాని మన యార్యావర్తమునఁ బూర్వమునుండి పరంపరగావచ్చుచున్న పంచదేవ పూజను పంచాయతన పూజయని శివవిష్ణ్వంబికా గణేశ సూర్యుల విగ్రహములను నిర్మించి వానిఁ బూజించుచున్నారు. ఇది పంచాయతన పూజ యవునా కాదా?

ఉత్తరము:-ఏ విధమైన మూర్తిపూజను జేయరాదు- కానిఁ దిగువ వ్రాయబడు మూర్తిమంతులైనవారికి పూజ—సత్కారముచేయవలయును. పంచదేవ పూజ, పంచాయతనపూజ యను శబ్దములకు మిక్కిలి మంచియర్థము కలదు. కాని విద్యావిహీనులైన మూఢులా యుత్తమార్థమును వదలి యిప్పుడు నికృష్టార్థమునే పట్టుకొని కూరుచున్నారు. ఈవాది పంచవిగ్రహములఁ జేసి పూజించువారినిప్పుడే ఖండించియున్నారము. ఇఁక యథార్థమగు పంచాయతనమనువేదోక్తము-వేదానుకూలోక్తము-నగు దేవపూజను మూర్తిపూజను గమనింపుఁడు:-

మా నో వధీః పితరం మోత మాతరమ్ ॥ యజు. అ. ౧౬. మం. ౧౫॥
ఆచార్య ఉపనయమానో బ్రహ్మచారిణమిచ్ఛతే ॥ అథర్వ. కాం౧౧.వ.౩.మం.౧౭॥
అతిథిర్గృహానాగచ్ఛేత్ ॥ అథర్వ. కాం. ౧౫. వ. ౧౩ మం ౬॥
అర్చత ప్రార్చత ప్రియమేధాసో అర్చత ॥ ఋ. మం.౮. సూ. ౬౯.మం.౮॥
త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి ॥
తైత్తిరీయోపని. వల్లి. ౧. అను. ౧॥

శతపథ ఏకో దేవ ఇతి స బ్రహ్మ త్యదిత్యాచక్షతే॥ శతపథ కాం. ౧౪.
ప్రపాఠ. ౬. బ్రాహ్మ. ౭. కండిక ౧౦॥

మాతృదేవో భవ పితృదేవో భవ ఆచార్యదేవో భవ అతిథిదేవో భవ॥
తైత్తిరీయోపని. వ. ౧. అను. ౧౧॥

పితృభిర్భ్రాతృభిశ్చైతాః పతిభిర్దేవరైస్తథా
పూజ్యా భూషయితవ్యాశ్చ బహుకల్యాణమీప్సుభిః ॥ మను. అ. ౩. ౫౫॥
ఉపచర్యః స్త్రియా సాధ్వ్యా సతతం దేవవత్పతిః॥ మను. ౫.౧౫౪॥

మొదట, మూర్తిమతియైయున్న తల్లి పూజనీయురాలు. అనఁగా బిడ్డలు మనస్సుచేతను, శరీరముచేతను, ధనముచేతను, తల్లి సేవ చేయుచు నామెను సంతోషపఱుపవలయును. కాని హింసించి యామె కెన్నటికి దుఃఖము కలుగఁజేయఁగూడదు.(రెండవది)సత్కారార్హుఁడైన తండ్రికిగూడఁ దల్లికివలెనే సేవచేయవలయును.॥౧॥(మూఁడవది) విద్యాదాతయగు నాచార్యుని సేవమనస్సుచేతను,ధనముచేతనుజేయఁదగును॥౨॥(నాల్గవది)విద్వాంసుఁడును, ధర్మాత్ముఁడును, నిష్కపటియు అందఱయున్నతిని గోరువాఁడును, దేశసంచారము సేయుచు సత్యోపదేశమువలన సందఱికిని సుఖము గూర్చువాఁడునగు నతిథికిని సేవచేయవలయును.॥౩॥(అయిదవది)స్త్రీ తనపతిని, పురుషుఁడు తన పత్నిని ఆదరింపవలయును ॥౪॥ ఈ యైదుగురుమూర్తిమంతులైనదేవతలు.వీరి మూలముననే మనుష్యదేహోత్పత్తి, పాలనము, సుశిక్ష,విద్య,సత్యోపదేశము అను నివి కలుగును. ఇవియే పరమేశ్వరప్రాప్తికి సోపానములు. వీరిసేవ జేయక రాలను బూజించు పామరులు నరకగాములనుట స్పష్టము.

ప్రశ్న:- తల్లిదండ్రులను సేవించుచు మూర్తిపూజఁగూడ జేయుచుండిన దోషమేమియు లేదుగదా?

ఉత్తరము:- పాషాణాది మూర్తిపూజను పూర్ణముగఁ ద్యజించి మూర్తిమంతులయిన తల్లి మున్నగువారిసేవచేయుటయే మేలు. యథార్థముగ సుఖమొసంగు తల్లి మొదలుగాఁగల ప్రత్యక్ష దేవతలను వదలి, జడములగు పాషాణాది విగ్రహములయెదుటఁ దలగొట్టుకొనుట గొప్ప యనర్థకమే కాక పామరకృత్యమనుట సిద్ధము. ఈ పన్నుగడకుఁ గారణమేమన దల్లి తండ్రి మున్నగు వారియెదుట నైవేద్యాదులనుంచినచో వానిని వారు భక్షించి దక్షి

బాదులు పుచ్చుకొందురేని దమచేతిలో నేమియుండకుండును. కావున బాల తోను అప్పలతోను విగ్రహములను చేసి వానియెదుట నైవేద్యముంచి, ఘంటానాదమును టం టం, శంఖనాదమును పుం పుం ధ్వనులచేత గొప్పకోలాహలము చేసి, తమ వ్రేలిని మూర్తికిఁ జూపుదురు. "త్వమంగుష్ఠం గృహాణ భోజనం పదార్థం వాఽహం గ్రహీష్యామి" నీవు వ్రేలినిదీసికొనుము, భోజనపదార్థము నేను పుచ్చుకొనెదను, అని హెచ్చరింతురే. ఒక బాలకునియెదుట భోజన పదార్థముల నుంచి, వాఁడతని మోసపుచ్చుటకో అవమానించుటకో గంటను నీవు తీసికొమ్మని వ్రేలుచూపి వానిముందున్న పదార్థములన్నిటిని లాగుకొని తానే భుజించినట్లు ఈ పూజారుల (పూజయను సత్కర్మములకు శత్రువులగు వారల) చర్యలు కలవు. వీరు విగ్రహములకుఁ దళుకుబెళుకులుచేసి తాము దొంగవేషములను వేసికొని మూఢులు, అమాయకులునగువారిని వంచించి, వారిధనము నపహరించి, యానంద మనుభవించుచున్నారు. ధర్మాత్ముఁడైన రాజెవ్వఁడైన నుండిన నీ పాషాణప్రియులను బాలు పగులగొట్టుట, వానిఁ జక్కపఱచుట, గృహములు నిర్మించుట మున్నగుపనులు చేయించుచు వారి జీవనమున కన్నవస్త్రముల నొసఁగుచుండెడివాఁడు.

ప్రశ్న:-స్త్రీరూపాది ప్రతిమం దర్శనమాత్రమునఁ గామముత్పన్న మగునట్లే, వీతరాగ శాంతరూపాది విగ్రహములను జూచుటవలన వైరాగ్య మును శాంతియు నేల గలుగకుండును?

ఉత్తరము:- కలుగనేరదు. ఏలయనఁగా నా విగ్రహ ధర్మమగు జడత్వ మాత్మకుఁగలుగఁగానే మనుష్యుని ఆలోచనాశక్తి తగ్గిపోవును. మఱి వివేక మలవడకున్న వైరాగ్యము కలుగదు. వైరాగ్యము కలుగకున్న విజ్ఞానము లభింపదు. విజ్ఞానము లభింపకున్న శాంతియుఁ గలుగఁ జాలదు. సహవాసమువలనను, ఉపదేశమువలనను, వాని యితిహాసాదులు చదువుటవలనను కొంత లాభము వారికేమైన గలిగినఁ గలుగవచ్చును. ఏలయనఁగా గుణదోషములు విదితముకానట్టి పురుషుని విగ్రహమును జూచినమాత్రమున నందుఁ బ్రీతికలుగదు. గుణజ్ఞానమే ప్రీతికిఁ గారణమగును. ఇట్టి విగ్రహారాధనాది దుష్కారణములవననే యార్యావర్తమునఁ బనికిమాలిన పూజారులు, బిచ్చగాండ్రు, సోమరులు, పురుషార్థరహితులు కోట్లకొలఁదిగలరు. ప్రపంచ

మందంతట సీమూర్తులే మౌర్ఖ్యమును వ్యాపింపజేసినవారు. వీరివలననే కపటమును, అసత్యమును ప్రబలినవి.

ప్రశ్న:-ఔరంగజేబు అసురాజు కాశికిఁ బోయినపు డచటి కచ్చటనున్న "లాటభైరవాదులు" గొప్పగొప్ప చమత్కారములు చూపిరి. తురుష్కుల వ్వానినిఁ బగులఁగొట్టుటకు వెడలి, వానిమీద దుపాకులను, గుండ్లను గాల్పఁగా పెద్దపెద్ద కణుదురీగలు బయలువెడలి యాసైన్యమును జెల్లాచెదురుచేసి పాఱఁ దోలెను కదా!

ఉత్తరము:-అందులో బాలుచేసిన చమత్కారము లేమియులేవు. కాని యప్పుడుఁ గణుదురీగల గూళ్లుండి యుండవచ్చును. వాని స్వభావమే మహా క్రూరమైనది. ఎవరైనను వానిని రేఁచిన, యవి కఱచుటకు తఱుముకొని వచ్చును విగ్రహమునుండి పాలు ధారగా వెడలుచుండిన చమత్కారము పూజారులుచేసిన యుక్తియేకాని వేఱేమియుఁగాదు.

ప్రశ్న:- మ్లేచ్ఛులకు దర్శనమీయరాదని మహాదేవుఁడు బావిలోను, వేణీమాధవుఁడొక బ్రాహ్మణు నింటిలోను దాఁగియుండిరి కద. ఇవి కూడఁ జమత్కారములు గావా యేమి?

ఉత్తరము:-అహా! కోటపాల కాలభైరవ, లాటభైరవాది భూత ప్రేతములును, గరుడాది గణములును దురుష్కులతో యుద్ధముచేసి, యేల యోడింపలేకపోయిరి? పురాణములందుఁ ద్రిపురాసురాద్యనేక ఘోరభయంకరులైన దుష్టులను శివవిష్ణువులు భస్మముచేసినట్లు కథలు వ్రాయఁబడి యున్నవి కదా! ఆమాట నిశ్చయమేని వారు దురుష్కుల నేల భస్మము చేయలేకపోయిరి? పావమా బాలేమి యుద్ధముచేయఁజేయింప గలుగును? ఇందువలననే మహమ్మదీయులు గుళ్ల గోపురములు పడఁగొట్టుచు, విగ్రహములను విఱుగఁగొట్టుచుఁ గాశిని సమీపింపఁబూజారు లాకాశిలింగము నొకనూతిలోఁ బడవేసి, వేణీమాధవు నొక బ్రాహ్మణునింట దాచిరి. కాలభైరవునికి భయపడి కాశీపురమున యమదూత లరుగిరట యనుటయుఁ బ్రలయకాలమునందును గాశీపట్టణమును నశింపనీక గాపాడు ననుటయు నిజమేని, మ్లేచ్ఛదూతల నేలరాయ పెట్టలేదు? తనరాజ మందిరమును బడఁగొట్టినప్పు డేల యూరకయుండెను? ఇవన్నియుఁ బోపం పన్నుగడలు

ప్రశ్న:—గయలో శ్రాద్ధము చేయుటవలనఁ బితరులు పాపవిముక్తులై యచ్చటి శ్రాద్ధపుణ్య ప్రభావమువలన వారు స్వర్గమునకుఁ బోవుచున్నారనియు, నా పితరులు తమచేతులుచాచి పిండముల నందుకొనుచున్నారనియు ననుమాట కూడ నబద్ధమేనా యేమి?

ఉత్తరము:—సర్వథా యబద్ధము. అచ్చట పిండప్రదానము యొక్క ప్రభావమట్టిదేయైనచోఁ బితరుల సౌఖ్యముకొఱకు పండాల కొసంగు లక్షం కొలఁది ధన మా గయావాసులు వేశ్యాగమనాది పాపకర్మలందు వెచ్చ పెట్టు చున్నారు గదా! వారా పాపములనుండి యేల విముక్తులగుటలేదు? పండాకు తప్ప వచ్చినవారు చేతులు చాచుదురనుట యిప్పుడెక్కడను గానరాదు. ఎవరో మోసగాఁడు మునుపెప్పుడో గుంతద్రవ్వి దానిలో నొకమనుష్యుని గూర్చుండ బెట్టి వానిచేతులు మాత్రము పైకగపడునట్లును, తల యగపడనట్లును దర్భను గప్పిపెట్టి వానిచేతికిఁ బిండము నిచ్చియుండవచ్చును ఆ మోసగాఁడు తీసి కొనియుండవచ్చును. మూర్ఖుఁడైన ధనికుఁడెవఁడో యా మోసకృత్యము జూచి నిజమని నమ్మి మోసపోయియుండిన నది యాశ్చర్యము కాదు. రావణుఁడు వైద్యనాథ లింగమును దెచ్చెనదికూడ నిట్టితంత్రమే. కావున నదియు నబద్ధమే.

ప్రశ్న:—చూడుఁడు! కలకత్తాలోని కాళి, కామాక్షి మొదలగు దేవతలను లక్షోపలక్షలు నమ్ముచున్నారు. ఇది చమత్కారము కాదా ఏమి?

ఉత్తరము:—చమత్కారమేమియుఁగాదు. గొఱ్ఱెలెట్లు యొకదాని వెనుక నొకటిపోయి నూతిలోఁబడి తప్పించుకొనఁజాలవో, యటులే ఈ గుడ్డి వాండ్రు ఒక మూర్ఖునివెనుక నొకఁడుపోయి మూర్తిపూజయను గుంతలోఁబడి, దుఃఖ మనుభవించుచున్నారు.

ప్రశ్న:— సరే, దానిని వదలిపెట్టుఁడు; కాని జగన్నాథములోఁ ప్రత్యక్షమైన చమత్కారములున్నవి. చూడుఁడు! జగన్నాథుఁడు శరీరమును మార్చు నపుడు గంధపుకఱ్ఱ సముద్రములోనుండి తనంతటదానే యొడ్డునకుఁ గొట్టుకొని వచ్చుటయుఁ, బొయ్యిమీద నొకదానిపై నొక్కటిగ నేడుకుండలను బెట్టి వండగా పైనున్నకుండలలోనివి మొదటఁ బక్వమగుటయు, నచ్చట స్వామిప్రసాదము తిననివారు కుష్ఠరోగి యగుటయు, స్వామిరథము తనంత

టందానే నడుచుటయు. పాపులకు స్వామి తనదర్శనమీక పోవుటయు. నింద్ర
ద్యుమ్నుని రాజ్యపరిపాలనమున దేవత లాగుడి గట్టియుండుటయు. స్వామి
కళేబరమును మార్చునపుడొక రాజు. ఒకపూజారి ఒక వడ్రంగి ఈ మువ్వురు
చచ్చుచుండుటయు నీ మొదలుగాఁగల్గు చమత్కారముల మీ రబద్ధము చేయ
లేరు కద।

ఉత్తరము:- జగన్నాథములో పంద్రెండేండ్లు అర్చకుఁడుగానుండిన
ఒకరు విరక్తిఁబొంది మథురకు వచ్చియుండెను. అతఁడు నన్నుఁజూచినపుడు
వీని వివరము నడుగగా నతఁడవన్నియు నబద్ధములనియే చెప్పెను. విచారించుట
వలన నిశ్చయమని తెలినయంశ మిది:- కళేబరమును మార్చుసమయము వచ్చు
నపుడొకపడవలో గంధపు కఱ్ఱలను దీసికొని వెడలి సముద్రమునఁ బడవై
చుచున్నారు. సముద్ర తరంగములు కొట్టుకొనివచ్చి వానినొడ్డునకుఁ దెచ్చిపడ
వేయుచున్నవి. వడ్రంగులు దానిని దెచ్చి విగ్రహములు చేయుచున్నారు. వంటచేయు
సమయమునఁ దలుపులు మూసికొని వంటచేయుదురు. దాని నితరుల కెవ్వ
రికిఁ దెలియనియ్యరు. ఎవరిని చూడనీయరు. చక్రాకారముగాఁ జుట్టు నాలు
ప్రొయ్యిలను, మధ్య నొకదానిని చేసియుంచినారు. ఇఁక నాలుకుండల యడు
గున నేయి, మన్ను, బూడిద కలిసిన లేపనముచేసి వానిలోఁ గడిగిన బియ్యము
పోసి నీరుగలిపి, యెసరుపెట్టి యన్నము వండుదురు. అన్నము పచనమైనపుడు మసిని
తుడిచి యాకుండలు క్రమపఱుతురు పిమ్మట వేరొకకుండలోపలఁ గడిగినబియ్యము
నీరుఁబోసినదిమి ప్రొయ్యిమీఁద బెట్టి, దానిమీదనన్నమైయున్న యాయాకుండ
లనుదొంతివలె పెట్టుదురు. చుట్టునున్న ప్రొయ్యిల మూఁతలను నినుపమూకుడు
పెట్టి మూసియుంతురు. ధనవంతులెవ్వరైన జూడవచ్చిన వానిని బిలుచుకొని
పోయి చూపింతురు. మీఁదికుండలలోని యుడికిన యన్నమును, అన్నిటికంటె
నడుగున నుడుకని బియ్యమును జూపి యేమైన దక్షిణఁ బెట్టుమందురు. మూఢు
లైన ధనాఢ్యులుకొందఱప్పుడే భూరిదక్షిణలిత్తురు మఱికొందఱు మాసికవేతన
మేర్పఱతురు. అచ్చట స్వామికి నైవేద్యముఁ దెచ్చిపెట్టువారు నీచశూద్రజాతి
వారు. నైవేద్యము కాఁగానే యీ నీచశూద్రులు దాని నెంగిలిచేయుదురు.
పిమ్మట రూపాయలిచ్చి ప్రసాదము గొన్నచో వారి బసలకుఁ గొనిపోయి
ముట్టఁజెప్పుదురు. పేదలగు గృహస్థులు. సాధువులు శూద్రులు మొదలుకొని

అంత్యజులపర్యంత మందఱు నొకేపంక్తిలో గూర్చుండి యొకరి యెంగిలి నొకరు తిందురు. ప్రథమపంక్తివారు విస్తళ్ళువదలి లేచిపోయిన నా యెంగిలి విస్తళ్ళలోనే యితరులకుఁ బెట్టుదురు. ఇది మహా అనాచారము. అచ్చటికి వెళ్ళినవారేకు రెంగిళ్ళుతినక స్వయముగఁ దామే వంటజేసికొని తినివచ్చు చుందురు. వారికిఁ గుష్ఠాదిరోగములు కూడ సంభవించుటలేదు. ఆ జగన్నాథమున నుండువారే యెందఱో యా ప్రసాదమును దినరు. మఱి వారికిఁ గుష్ఠాది రోగములు గలుగుటలేదు. అదే జగన్నాథమున నెందఱో కుష్ఠరోగులుకలరు. వారు ప్రతిదినము నెంగిలిప్రసాదము దినుచునేయున్నారు. కాని వారి నాకుష్ఠ రోగము వదలలేదు. జగన్నాథమున వామమార్గులు భైరవీచక్రమును జే యుంచినారు. ఏలయనఁగా సుభద్ర, శ్రీకృష్ణ బలభద్రులకుఁ జెల్లెలు. ఆమె నాయిరువురన్నదమ్ముల నడుమ భార్యగాను, దల్లిగాను జేసియుంచినారు. భైరవీచక్రమే లేకపోయిన నిట్టి వెన్నటికిని గలుగకుండెడివి. రథము కనం తటఁ దానే నడుచుటకు దాని చక్రమునం దెద్దియో యొకకీలు పెట్టియున్నారు. దానిని ద్రిప్పినపు డిదినడుచును. జనులు గుమిగూడి యుండుచోటునా రథము రాఁగానే యా కీలు వెనుకకుఁ ద్రిప్పుదురు. అప్పుడది నిలిచిపోవును. "పం డితుల లొనఁగువారొనఁగుదు. పుణ్యము చేయువారు చేయుఁడు. జగన్నాథ స్వామిని బ్రసన్నుని జేసికొనుఁడు. స్వామి తన రథమును గదుపనిందు. ధర్మ మును నిలువనిందు" అని పూజారులు పలపుష్పదక్షిణాదులు దెచ్చియిచ్చు వారందఱు ముగియువఱకుఁ గూతలు పెట్టుచుందురు. ఇచ్చినదంతయు ముగి సిన తరువాత నొక వ్రజవ్రాసి మంచి వస్త్రములను దుస్సాలువును ధరించు కొని రథమునెదుట ముకుళిత కరకములుఁడై నిలిచి, "హే జగన్నాథస్వామీ! మీరు దయచేసి రథము నడుపుఁడు. మా ధర్మమును నిలుపుఁడు" అని యనేక విధముల స్తోత్రముచేసి. సాష్టాంగ దండ ప్రణామము లొనరించి రథము మీఁది కెక్కును తత్క్షణమే చక్రములోనికీలు ద్రిప్పివేయుదురు. జయజయ ధ్వనులతో ననేక సహస్రజనులు రథమునకుఁ గట్టియున్న త్రాళ్ళను బట్టి లాగఁగా రథము కదలి నడువసాగును ఇఁక ననేకులా స్వామిదర్శనము కొఱకుఁ బోవుచుందురు. అచ్చటి గుడి చాలపెద్దది. దానఁబగలే చీఁకట్లుగ్రమ్మి యుండును. వెలుతురుకొఱకు దీపముల యవసరముండును. విగ్రహములకు

ముందుగ రెండుప్రక్కలను లాగుటకు వీలగునట్లు తెరఁగట్టి యుందురు. ఆ తెరచాటున పూజారులు నిలిచియుందురు. ఆ తెర నొక ప్రక్కకు లాగి యా విగ్రహముల మఱుఁగుపఱచి యుందురు. అప్పుడు (పాండా) పూజారులు "దక్షిణలిండు. మీ పాపములు పోవును. స్వామిదర్శనమగును. త్వరపడుఁడు" అని కేకలువేయ నారంభింతురు. పాపమా యమాయకులగు యాత్రికు లావంచకులచేతులలోఁ జిక్కి, యున్న నాలుగుడబ్బులను వారిచేతఁ బెట్టుదురు. ఆ తక్షణమే యా తెఱను వేఱుప్రక్కకు లాగుదురు. అప్పు డా విగ్రహముల దర్శన మగును అంత జయజయ శబ్దములు చేయుచు మహాప్రసన్నులయి మఱలి త్రోవలోఁబడి నలిగిపచ్చి యిల్లుచేరుదురు.

ఇంద్రద్యుమ్నుఁడను రాజొకఁడుండెను. అతని సంతతి వారిప్పటికిఁ గలకత్తాలో నున్నారు. ఆ రాజు మిక్కిలి ధనవంతుఁడు. దేవీ ఉపాసకుఁడునై యుండెను. అతఁడార్యావర్త దేశములోని భోజన ప్రతిలోజనముల నిర్బంధముల నివారణముగ తొలఁగింపనెంచియే యతఁడు లక్షల కొలఁది ధనమును వ్యయపఱచి యా గుడి కట్టించెను. కాని యీ మూర్ఖులు దాని నెక్కుడ వదలదురు: దేవతలు-అనఁగా నా గుడినిగట్టిన శిల్పులనే దేవతలని భావింపుదురు. రాజు, పూజారి వడ్రంగి యిప్పుడు బ్రతుకలేదు. కాని యీ ముప్పదే యుచ్చట ముఖ్యులు కళేబరమును మార్చు సమయమున నీముప్పదియును సమీపమునసే యుందురు. కాన నీకాలమందో వీరు దమ చేతిక్రిందివారిని దూరముపెట్టి యుండవచ్చును. వారంత నాలోచించి, ఆ విగ్రహ హృదయస్థానమును బోలుగాఁ జేసి, దానియందొక బంగారు సంపుటమున నొక సాలిగ్రామముంచి, దానిని ప్రతిదినమును గడిగి, చారణామృతమని యానీటిని త్రాగు నాచారమున్నందున నారాత్రి శయనోపచారము చేయునపుడే యా సాలిగ్రామమునకు విషము రాచి పెట్టి మఱునాఁడు దానినే కడిగి త్రాగింపఁగా నాముప్పదియును చచ్చియుండవచ్చును. వారు చచ్చిన దిట్లుకాని దానినే భోజనభట్టుమఱొ జగన్నాథస్వామి తన శరీరమును మార్చునపుడు ముగ్గురుభక్తులను గూడఁ దనతోఁ దీసికొని పోవుచున్నాఁడని ప్రకటన చేసినారు. ఇవన్నియు పరులధనము నపహరించుటకుఁ బన్నిన పన్నుగడలు.

ప్రశ్న:- రామేశ్వరమున గంగోత్రి జలము నభిషేకముగఁ జేయునపుడు లింగము పెద్దదగుచున్నదను మాటకూడ నబద్ధమేనా యేమి?

ఉత్తరము:- అబద్ధము. ఆ గుడిలోఁగూడఁ బగలే చీఁకట్లు గ్రమ్మి యుండును. రాత్రింబగళ్ళునుదీపములు పెట్టియేయుందురు. జలధార వదలినపుడు దానియందు దీపముల ప్రతిఫలము విద్యుత్తువలె తళతళ మెఱయుచుండును. ఇంతియ కాని యా శిల పెఱుగదు, తఱుగదు, ఉన్న దున్నట్లుండును. ఇటువంటి బూటకములను జేసి, తెలివిమాలిన వారిని మోసపుచ్చుచున్నారు.

ప్రశ్న:- రామచంద్రుఁడు రామేశ్వరుని స్థాపించినాఁడు గదా! విగ్రహారాధనము వేదవిరుద్ధమే యయిన, రామచంద్రుఁ డామూర్తిని స్థాపించినట్లు వాల్మీకుఁడు రామాయణమున నేల వ్రాసిరి?

ఉత్తరము:- రామచంద్రుని కాలమున నా లింగదేవాలయముం పేరు గాని, దాని గుర్తుగాని లేదు. దక్షిణదేశపు రామరాజు, ఆ దేవాలయమును గట్టించి, రామేశ్వరుఁడను పేర నా లింగమును బ్రతిష్ఠించిన మాట నిజము. ఇక రామచంద్రుఁడు సీతను విడుచుకొని హనుమదాదులతో విమానారూఢుఁడై అయోధ్యామార్గమునబట్టి వచ్చునపుడు సీతతోఁ జెప్పిన దేమన :-

అత్రపూర్వం మహాదేవః ప్రసాదమకరోద్విభుః ।

సేతుబంధ ఇతి ఖ్యాతమ్ ॥ వాల్మీకిరా. యుద్ధకాం. సర్గ. ౧౨౩. శ్లో. ౨౦.౨౧.

ఓ సీతా! నీ వియోగమువలన మేము కడు వ్యసనముతో సంచరించుచు నీ స్థలముననే చాతుర్మాస్యమును సలిపితిమి. పరమేశ్వరోపాసనధ్యానము లనుగూడ నిచ్చటనే చేసితిమి. సర్వత్రవిభుఁ (వ్యాపకు)డు, దేవదేవుఁడైన మహాదేవుఁడునగు నా పరమాత్ముని దయవలననే మాకు సమస్త సామగ్రియు నిచ్చటనే సమకూడినది. చూడుము! మేమిచంతెనఁగట్టి, లంకను మెట్టి రావణుని గొట్టి నిన్నుఁదెచ్చితిమి" అనుటకంటె వాల్మీకి మహేమియు వ్రాయలేదు.

ప్రశ్న:-

"రంగ హై కాలియాకంత కో, జిసనే హుక్కా పిలాయా సంత కో"

దక్షిణమునఁ గాలియాకంతుని విగ్రహ మొకటియున్నది. అది యిప్పటి వఱకు హుక్కాపొగ బీల్చుచున్నది. విగ్రహారాధన మబద్ధమైన నీ చమత్కారముకూడ నబద్ధమే యైయుండెడిది కద.

ఉత్తరము:- ముమ్మాటికి సబద్ధమే. ఇవన్నియు బోపుల చమత్కారములు. ఆ విగ్రహము నోటిని బోలుచేసి, దానితోఁ గలిసి వీపువఱకు వచ్చియుండున ట్లొకరంధ్రముచేసి యుండవచ్చును. ఇట్టి నా రంధ్రమునుండి యొకగొట్టమును విగ్రహమునకు వెన్నంటియున్న గోడలోని ఛిద్రముద్వారా వెనుకటి గదిలోనికిఁ దెచ్చి పెట్టియుండవచ్చును. పూజారి గుడాకువింపిన హుక్కా నాళమును విగ్రహమునోటనిఱికించి, తెఱదీసివేయును. వేఱు మనుష్యుఁడొకఁడు వెనుకటి గదిలోఁ గూర్చుండి యా గొట్టముద్వారా పొగ పీల్చినపుడు విగ్రహము పీల్చునట్లే గుడగుడ శబ్దము పుట్టును. ఆ విగ్రహము నోటికిని, ముక్కునకును సంబంధముగల వేఱొక రంధ్రముఁ జేసియుందురు. వెనుకటి గదిలోనివాఁడు పొగను పీల్చి యూదినపు డా పొగ ఆ విగ్రహము నోటను, ముక్కునను రావచ్చును. ఈ వింతను-జూపున దు మూఢుల నెందఱను మోసపుచ్చి, వారి ధనాది పదార్థములను దోఁచుకొని, వారి చేతులకుఁ జిప్పల నిచ్చుచుందురో తెలియదు.

ప్రశ్న:- 'డాకోరు' విగ్రహము ద్వారకనుండి భక్తునివెంట నడిచి వచ్చినదికదా! ఎన్నియో మణుఁగుల బరువుగల యా విగ్రహము ఒకటింటావు గురిగింజ యెత్తు బంగారము తూచినకు సరిపోయినదే! ఇవికూడఁ జమత్కారములు కావా యేమి?

ఉత్తరము:- కావు. ఆ భక్తుఁడావిగ్రహమును దొంగిలించి తెచ్చియుండవచ్చును. అది యొకటింటావు గురిగింజకు సరిగాఁదూఁగినదనియెవఁడో భంగు త్రాగినవాఁడు నుడివిన బూటకపుమాటయే యగును.

ప్రశ్న:- సోమనాథలింగము భూమికి నంతరిక్షమునకు నడుమ వ్రేలాడుచుఁ గడు చమత్కారము కలదై యుండెను గదా! ఇది కూడ సబద్ధమేనా యేమి?

ఉత్తరము:- ఔ సబద్ధమే వినుఁడు. మీఁదను క్రిందనుగూడ సూదంటు రాల నుంచియుండిరి. వాని యాకర్షణచే నది యంతరిక్షమున నిలిచియుండెను. మహమ్మదు గజనీయను తురుష్కరాజు దండెత్తివచ్చినపు డా గుడిని బడఁ గొట్టెను. అప్పుడచ్చటనుండిన భక్తులకును, బూజారులకును మహాదుర్గతి వాటిల్లెను. లక్షంకొంది భటులు పదివేం సైన్యము నెదిరించి నిలువఁజాలక, భయ

పడి, పలాయనసూత్రమును బఠించిరి. ఇది జరిగిన చమత్కారము. పోపు లును పూజారులును. ఓ మహాదేవా! ఈ మ్లేచ్ఛులను నీవు చంపి, మమ్ము రక్షింపుమని, యా విగ్రహమునకుఁ బూజలు, పురశ్చరణలు, స్తోత్రములు, ప్రార్థన లెన్నిటినో చేసిరి. ఇంకను దమ శిష్యులగు రాజులకు "మీరు నిశ్చింతగా నుండుఁడు, మహాదేవుఁడు వీరభద్ర భైరవులలో నొకని బంపును. అతఁడు మ్లేచ్ఛులను జంపివేయును- లేదా వారి నంధులుగా సైనను జేసివేయును మా దేవుని మహిమ ప్రకటమగుట కిదియే సమయము. రాత్రి మా స్వప్నములలో హనుమంతుఁడు, వీరభద్రుఁడుఁ దుర్గాదేవి ప్రత్యక్షమై మేము చేయవలసిన దంతయుఁ జేయుదుమని చెప్పినారని. విశ్వసింపఁజేసిరి. పాపము మాయకులగు క్షత్రియరాజులు పోపులమాటలు నమ్మిరి. ఇక నెందరో జ్యోతిష్కులగు పోపు లుండిరి. వారిలో నొకడింకను మంచిముహూర్తము రాలేదనియు మఱియొకఁడు చంద్రుఁ డష్టమమున నున్నాఁడనియు, వేఱొకఁడు యోగినీ శార యెదురుగా నున్నదనియుఁ గల్పించి చెప్పిరి. రాజులువీరిమాటలు గూడ నిజమని నమ్మి యుద్ధమునకు సన్నద్ధులుగాక యూరకుండిరి. అంతట మ్లేచ్ఛుల సైన్యము గుడిని ముట్టడించెను. వారప్పుడు భయపడిమూలకొక్కఁడుగాఁ బరుగెత్తిరి. ఎందరో పోపులగు పూజారులు, వారి శిష్యులు వారిచేత జిక్కిరి. అపుడు పూజారులు కరములు ముకుళించి. "మూఁడుకోట్ల రూపాయల సైన నిచ్చెదముకాని మా మందిరమును విగ్రహమును బగులగొట్టవలదు" అని యెంతెంతయో వారిని బ్రార్థించిరి. కాని తురుష్కులు, మేము "బుత్పరస్తులము (విగ్రహారాధకులము)కాము కాని "బుత్శికనులము"(మూర్తి భంజకులము) మని. యాగుడిని బడఁగొట్టిరి. అపుడు మిద్దెలో మీఁదనున్న నూదంటురాయియు నేలగూలెను. తోడనే విగ్రహమును జాతిమీఁదఁబడి పక్కలై పగిలెను" అపుడు దానిలోనుండిన సుమారు పదునెనిమిదికోట్ల రూపాయల విలువగల రత్నములు జల్లున నేలరాలెను. పోపులను: పూజారులను బట్టి దంచఁగా, వారేడువసాగిరి. "మీధనమెక్కడదనని వారి కోఁతలు వినఁగఁదన్నఁగా వారు తక్షణమే యామ్లేచ్ఛులకు దాని జూపిరి. అంతట నా తురుష్కులున్నదంతయు నూడ్చుకొని. పోపులగు పూజారులను, వారి శిష్యులను గూడ "గులాములుగా" అనఁగా వెట్టివారుగాఁ జేసికొని. వారిచేత దినసెనగలనిచ్చివారి

చేతఁ బిండిపిసరింపించిరి. గడ్డి గోయించిరి. మలమూత్రాదుల నెత్తించిరి. అయ్యో విగ్రహములను బూజింపనేల. ఈ నాశనము నొందనేల! పరమేశ్వరునియం దేల భక్తినుంచలేదు! అట్లు చేసియుండిన మ్లేచ్ఛుల పండ్లూడఁదన్ని యుందురు. పతితాము విజయమునొంది యుందురుగదా! ఈ మూర్తులకుమాఱు శూరవీరులను బూజించియున్నఁ దమ కెంతో మేలుకలిగి యుండెడిదే! పూజారులు శిలలమీఁద నెంతయో భక్తి గలిగియుండిరి; కాని యొక విగ్రహమైన నా శత్రుల శిరస్సుమీఁదికి దుముకలేకపోయెనే! విగ్రహమునకు సేవచేసినట్లొక శూరవీరుని సేవయే చేసియుండిన, వాఁడు దన్ను నమ్మిన వారిని దన శక్తి కొలఁది కాపాడియుండును. ఆ శత్రువులనుగూడఁ జంపియుండును.

ప్రశ్న:— ద్వారకలో నున్న రణఛోడను విగ్రహము నర్సీమెహతా యొద్దకు హుండీ పంపి యతనిని ఋణవిముక్తునిగాఁ జేసెనను విశ్వాసములను సబద్ధము కేనా యేమి?

ఉత్తరము:— సాహుకా రెవఁడో రూపాయలిచ్చి యుండవచ్చును. దానిని శ్రీకృష్ణుఁడు పంపినాఁడని యెవఁడో కల్పించియుండును. [illegible] (వి. శ.) సంవత్సరమున నాంగ్లేయులు, సుంతల చేత గుడిని, విగ్రహమునెగురఁ గొట్టినపుడా విగ్రహ మెచ్చటికిఁబోయెను? యథార్థముగా బాఘేరులు తమ శౌర్యముచేత యుద్ధముచేసి శత్రువులను జంపిరి; కాని విగ్రహ మొక యీఁగ కాలినిగూడఁ ద్రుంపలేకపోయెను. శ్రీకృష్ణునివంటి వాఁడెవ డైన నుండియుండిన వారినోడించి పాఱఁద్రోలియుండును. రక్షకుఁడైనవాఁడే తన్నులుతిన్న పుడు అతని శరణుచొచ్చినవారేల తన్నులు దినకుందురు?

ప్రశ్న:— జ్వాలాముఖి యను ప్రత్యక్షదేవి యన్నిటిని భక్షించుచున్నది కద. ఎవరైనను నైవేద్యముంచిన సగముమాత్రము తిని తక్కినసగ మట్లే యుంచును. మహమ్మదీయరాజు లా జ్వాలమీఁద సీటిధార ప్రవహింపజేసి దాని మూతికొక యినుపతవ్వను బెట్టి కొట్టిన నాజ్వాల యాఱనులేదు, ఆఁగనులేదు. అటువలె హింగళాజాదేవియు యర్ధరాత్ర సమయమున పర్వతముపై నంచారముచేయుచు పర్వతమును గర్జింపఁజేయుచున్నది. చూడవచ్చును. చంద్ర కూపము మాటలాడును. యోనియంత్రముద్వారా యొకసారి దూఁటవచ్చినచో పునర్జన్మము కలుఁగదు. మూపల్లను గట్టుకొనుటవలనఁ బూర్ణ మహాపురుషుఁ

దనఁబడును. ఇక హింగళాజను దర్శించి రానంతవఱకర్ధమహాపురుషుఁడన బడును. అను నీ మాటలన్నియు విశ్వాసార్హములుకావా యేమి?

ఉత్తరము:- కావు. ఏలయనఁగా జ్వాలాముఖి యనునది కొండలో నుండి వెడలు నొకవిధమైన యగ్ని. అటఁ బూజారులు విచిత్రములగు తంత్రములు పన్నియున్నారు ఇఁక నొక గరిటెలో నేయిపోసి మంటమీఁదఁ బెట్టిన, నేతికి నిప్పంటి బగ్గని మండునుగద. గరిటెను మంటమీఁది నుండి జరిపినను ఆ మంట నా దినను యదిచల్లాఱిపోవును. కాలిన నేయి పోఁగా మిగిలిననగ మస్లీయుండును. మఱి పొయ్యిమంటలో నేమిపడవేసినను భస్మమైపోవును. అడవికిఁగాని యింటికిఁగాని నిప్పంటినపుడామంట వానిలో నున్నవానినెల్ల భస్మముచేయును గదఃఇవియే యచ్చట జరుగు చమత్కారములు. ఇంతకంటె విశేష మచ్చట నేమికలదు ? ఒక గుడి ఒక చిన్నకోనేరు, ఇక్కడక్కడ నీటిగొట్టములు మాత్రము కానవచ్చును, గాని హింగళాజదేవి సవారివెడలుట మొదలగునవేవియుఁ గనఁబడవు. అచ్చట జరుగునవన్నియుఁ బూజారుల కృత్రిమ చమత్కారములే. వేఱేమియులేదు. ఇఁక నట బురదకొల నొకటి యున్నది. దానిలో నుండి నీటిబుగ్గలు వెడలుచుండును. దానిజూచి యాత్ర సఫలమైనదని మూఢులు విశ్వసింతురు. యోనియంత్రమును దబ్బు దోఁచు కొనుటకేపోపుగారో చేయించి యుంచినారు. టుమకీలనునవియు నా పోషం తంత్రములే. వానిని ధరించుటచేత మనుష్యుఁడు మహాపురుషుఁడగు నన్న నొక పశువును టుమకీలు మోయించిన నదికూడ మహాపురుషుఁడై పోవునా యేమి ? ధర్మయుక్తమగు గొప్ప పురుషార్థమువలననే మహా పురుషుఁడగును.

ప్రశ్న :- అమృతసరమునఁగల సరోవర మమృతతుల్యమైయున్నది. అచ్చట కుంకుడుకాయ నగముతియ్యగా నుండును. ఒక గోడగలదు. అది వంగును; కాని నేలఁగూలదు; రేవాల్సరమున కాలు నీటిఁదేలును అమరనాథ క్షేత్రమున లింగములు తమంతటఁదామే యుత్పన్నమగును.హిమవత్పర్వతము నుండి పావురములు జతలుగావచ్చి దర్శనమిచ్చి, మరల దమ యునికిపట్టు లకుఁ బోవుచున్నవి అను నీ వార్తలుకూడ నమ్మఁదగినవి కావా యేమి ?

ఉత్తరము:- కావు. అరణ్యముగా నున్నప్పుడెప్పుడో యందలి నీరు స్వచ్ఛముగా నుండుటచే దాని కమృతసరమని పేరిడి యుండవచ్చును. ఆ

నీరాహ్నికమే యయియున్న, బౌరాణికులు నమ్మిన ట్లచ్చట  నెవ్వరునుజావ, గూడదు గద;గోడ వంగుచు, గూలకపోవుట దాని, గట్టినవానిచమత్కారమై యుండును. కుంకుడుకాయ నగముతియ్యగా నుండుటకు;గారణ మది యంటు కట్టుగా నుండిన నుండవచ్చును; లేదా పట్టివా ర్తయేమైయుండవచ్చును.రేవాల్ప రమున జాలు తేలునన్న నట యంత్రబలమేదియో యుండినయుండవచ్చును. అమరనాథక్షేత్రమున మంచుగుడిసి పర్వతములే యేర్పడు చున్నప్పుడు,నీరుగడ్డ కట్టి చిన్నచిన్న లింగములగుట యొక యాశ్చర్యమా;పావురములజతలన్నియు బెంచినవిగా నుండవచ్చును. కొంతబాటునుండి పోవులు వానినివదలుచుండ వచ్చును. మఱి వాని;జూపి డబ్బుకూడ లాగుచుండవచ్చును.

ప్రశ్న:-హరిద్వారమనునది స్వర్గమునకు ద్వారము. ఆ హరసోపాన మున స్నానముచేసిన, బాపవిమోచన మగును. తపోవనమున నుండుటవలన, దపస్వులగుదురు. ఇక దేవప్రియాగ, గంగో త్తరియందలి గోముఖము, ఉ త్తర కాశీయందలి గు ప్తకాశి, త్రియుగీనారాయణుడు అనుపీనిదర్శనము లభించును. కేదారనాథుని, బదరీనారాయణునిపూజ మనుష్యు లాఖుమాసములను, దేవత లాఖుమాసములను, జేయుచున్నారు. మహాదేవునిముఖము పశుపతి యనుపేర నేపాళమునను,ఆతని పిఱుదులు కేదార తుంగనాథక్షేత్రములందును, కౌదలును పాదములును అమరనాథ క్షేత్రిమునను;గలవు. వాని దర్శన స్పర్శనల వలనను. అచ్చటి జలస్నానాదుల వలనను. ము క్తిలభించును. కేదారము నుండియు, బదరినుండియు, స్వర్గమునకు, బో;దలచిన, బోవచ్చునను నిశ్చాటి మాట లెట్లున్నవి?

ఉ త్తరము:- హరిద్వార ము త్తరమున హిమవత్పర్వతము లోపలకు; బోవు త్రోవకారంభము. (హరకీపైరీ) హరసోపాన మనుటకట కోనేటిలో దిగి స్నానముచేయుట కనుకూలముగా మెట్లుచేయ;బడి యున్నవి. కాని యథార్థ ముగా దానిని (హర్‌పైరీ) ఎముకల మెట్లు అన;దగును. ఏలయన;గా దేశ దేశాంతరములలో;వచ్చినవారి యెముకలన్నియు నర్చటవచ్చి పడుచుండును. ఎచ్చటికి;బో యినను బాపములకింపకతప్పదు తగ్గదు  ఎప్పుడో తపోవనమై యున్నసుండవచ్చును. కాని యిప్పుడది భిక్షకవనమై యున్నదనుటనిక్కము. తపోవనమునకు;బో యి యటనున్న ంతమాత్రమున నది తపస్సు కా;జాలదు.

కాని తపస్సుచేయుటవలననే ఫలము గలుగును ఏలయనఁగా సనేకులు దుకాణములు పెట్టుకొని యబద్ధములను జెప్పువారు కూడనచట నుందురు 'హిమవతః ప్రభవతి గంగా' పర్వతము మీఁదినుండి జలము క్రిందికిఁ బడుచున్నది. కుక్షింతపలన గోముఖాకారము చేసియుండవచ్చును ఆపర్వత మేపోపుల పాలిటికి స్వర్గము. ఉత్తరకాశి మొదలగు స్థలములు ధ్యానులకొఱకు మంచివే కాని యవి వేరగాండ్రకుఁగూడ ననుకూలముగా నున్నవి. దేవప్రయాగయనునది పురాణములలోని కట్టుకథయే. అనఁగా అలకనంద, గంగయను నీ రెండునదులచ్చట సంగమించును కావున నచ్చట దేవతలు వాసము చేయుచున్నారని కల్పింపకపోయిన నచ్చటి కెవఁడువచ్చును? మఱి వారికి దబ్బెవ్వఁడిచ్చును? అది గుప్తకాశి కాదు, కాని ప్రసిద్ధమైన కాశియే. మూఁడు యుగములనుండి నెగిడి యున్నట్లగపడదు. కాని పోపుల పది యిరువది తరములనుండి పారసీకులయు, బూడిద పూతఁగాండ్రయు అగ్నికుండములవలె నెప్పుడు సంలగ్నరగులు చుండవచ్చును. తప్తకుండమనునదియుఁ బర్వతములోని యుష్ణము వలన వేడిమిచెంది వచ్చిన నీరు. దానికి సమీపమున నుండు మఱొక కుండము లోని నీరుపైనుండి వేడిమిలేని ప్రదేశమునుండి వచ్చుచున్నందున నదిచల్లగా నుండును. కేదార క్షేత్రమనునదికూడ మహారమణీయమైన స్థలమే; కాని యచ్చట నొక చర్మమైన జాతిమీఁదఁ బోపులో లేదా వారి శిష్యులో యొక మందిరమునుఁ గట్టియుంచిన్నారు. అటనుండు మహంతులు, పూజారులు, పండాలు మూఢ ధనవంతులగు యాత్రికులను దోఁచుకొని విషయానందము ననుభవించుచున్నారు అటులనే బదరీనారాయణమునను ఇట్టి దోఁపుడుగాండ్ర నేకులు గుమిగూడియున్నారు. రావల్జీ అనువాఁడు వారిలో ముఖ్యుఁడు. అతఁడొక స్త్రీని గాడు; అనేక స్త్రీల నుంచుకొని యున్నాఁడు. పశుపతియను దేవాలయ మొకటికలదు. అందలి విగ్రహమునకుఁ బంచముఖియని పేరిడి యున్నారు. విచారించువారు లేనప్పుడేకదా యిట్టి పోపుల తంత్రములు సాగుచుండును. తీర్థస్థలములందుండు ధూర్తులైన ధనాపహారులు వంటివారా పర్వత ప్రదేశములందుండువారు మాత్రముకారు ఇక నా ప్రదేశము మాత్రము మిగుల రమణీయమై బహు పరిశుద్ధముగా నున్నది.

ప్రశ్న:- వింధ్యాచలమునఁగల, వింధ్యేశ్వరీ. కాళీ. అష్టభుజాయను దేవి సాక్షాత్సత్యము! మూఁడు కాలములందును మూఁడు వేఱువేఱు రూపములనామె ధరించును! ఆమె చుట్టునున్న ప్రాకారములోని కొః యీఁగగూడ వ్రాలుటలేదు. తీర్థరాజమను ప్రయాగలోఁ వంటు బోడి చేయించుకొన్న సిద్ధి కలుగును. గంగా యమునా సంగమమున స్నానముచేసిన వాంఛితసిద్ధి కలుగును. అయోధ్యానగరము, బజారులతో గూడ నెన్నియో పర్యాయములు స్వర్గమున కెగిసిపోయినది. తీర్థములలో గొప్పదగు మథురయాత్ర. లీలాస్థానమను బృందావనయాత్ర. గోవర్ధన వ్రజయాత్రలు గొప్ప భాగ్యవంతులకేలభించును. సూర్యగ్రహణ సమయమునఁ గురుక్షేత్రమున లక్షలకొలఁదిజనులు గుమిగూడుచున్నారు. ఇవన్నియు నబద్ధములా యేమి ?

ఉత్తరము:- మూఁడు కాలవిగ్రహములు మాత్రము ప్రత్యక్షముగాఁ గంటికిఁగానవచ్చును. మూఁడుకాలములందును మూఁడువిధముల రూపములు ధరించుననుటకుఁ గారణ మా పూజారులు వానిని వస్త్రాభూషణాదులతో నలంకరించు చమత్కారమే. ఇఁక నట వేలకొలఁది, లక్షలకొలఁది యీఁగలుండునది నేను నాకన్నులతోఁజూచియున్నాఁడను. ప్రయాగ మందన మాహాత్మ్యమును శ్లోకములు రచియింపఁగల యప్పటి క్షౌరకుఁడెవఁడో వ్రాసియుండవచ్చును. లేదా వాఁడు కొంత ద్రవ్యమిచ్చి పోపుగారిచే వ్రాయించియుండిన నుండవచ్చును ప్రయాగలో స్నానము చేసినవారు స్వర్గమున కేగుదురన్న మరల వారిండ్లకే రాకయుందురు. కాని యట స్నానముచేసిన వారందరు మరల నిండ్లకు వచ్చుచుందురుటను మనము చూచుచునేయున్నాము. ఇఁక నచ్చట నెవఁడైనను మునిఁగి చచ్చిన, నా జీవుఁడాకాశమండలి గాలిలో సంచరించి మరల జన్మమెత్తును. తీర్థరాజమను పేరుకూడఁ బోపులు పెట్టినదే. జడపదార్థమందు రాజప్రజాభావ మెన్నటికిని సంభవింపదు. అయోధ్యపట్టణముకుక్కలు గాడిదలు, పాకీవాండ్రు, మాలలు, మాదిగలు మున్నగువారితోఁగూడ మూఁడుసార్లు స్వర్గమునకుఁ బోయివచ్చిన దనుమాట పూర్తిగా నసంభవము ! అది స్వర్గమునకుఁబోక యున్నచోటనే యున్నది అయోధ్య స్వర్గమునకెగిరిపోయినదనుట కేవలము పోపుల మిథ్యాలాపమే. ఈ మిథ్యాలాపమే కథారూపమున నెగురుచున్నది. ఇటువలెనే నైమిశారణ్యాదుల విషయమందును గల్పించి

నారని యెఱుగ< దగును. మథుర త్రిలోకా తీతముకాదుకాని,దానిలో మూ<డు విచిత్రములైన జంతువులున్నవి. వానివలన జలమునను, స్థలమునను, అంతరిక్షమును నెవ్వరు సుఖముగ నుండజాలరు. ఒకటి చౌబే ఎవ్వరుస్నానము చేయ<బోయిన నీర<దు పురస్కరించుకొనివచ్చి, "ఓ యజమాను<డా!ఠంగు< దాగ్రిగుటకు, లడ్డులను దినుటకు డబ్బునిమ్ము; యజమానుని మేలు కోరెదను" అని వారు సన్నునిచ్చువఱకు< బట్టి పీడించును. రెండవది:-నీటిలో నితా<బేళ్ళు; అవి కొఱకనే కొఱకును; వానివలన గట్టున నిలిచి స్నానముచేయుటయే కష్టమగును. మూ<డవది:- అంతరిక్షమున< (చెట్లుగుట్టలందు) చరించు నెఱుపు మూతి కో<తులు. ఇవి రుమాళ్ళు, టోపీలు' సొమ్ములు, పాదరక్షలనయితము వదలక తీసికొని పాఱిపోవును వాని నెవరైన బెదరించిన< గొఱకును,త్రోపులు ద్రోసి పడవైచును. ఒక్కొకప్పుడు చంపనుగూడ జంపును. ఈ మూ<డును పోపులకును వారి శిష్యులకును పూజనీయములే. మణు<గులకొలది శెనగలు మొదలగునవి తా<బేళ్ళకును, శెనగలు బెల్లముమున్నగునవి గో<తులకును, దక్షిణలను, లడ్డులను< చౌబేలకును అర్పణచేసి, వారి సేవకులు సేవచేయుచుందురు. బృందావన మెప్పుడై యుండెనో కాని యిప్పుడుమాత్రమది వేశ్యావనమై యున్నది. అచ్చట లల్లాలల్లీలయు, గురు శిష్యురాండ్రయు లీలలు విస్తరించుచున్నవి. ఇ<క నల్లే దీపమాలికోత్సవ సందర్భమున గోవర్ధన వ్రజయాత్రలు గూడ< బోపులకు పండుగై యుండును. కురుక్షేత్రమం దిట్టివెన్నియో పొట్టనింపుకొను విచిత్రములు కలవు. ధర్మాత్ము<డు పరోపకారియునగు వా<డీ పోపుల లీలలలో< జేర<డు.

ప్రశ్న:-మూర్తిపూజయు, తీర్థయాత్రలును సనాతన కాలము నుండియే జరుగుచున్నవి కదా! అవి యబద్ధము లెట్లుకా<గలవు?

ఉత్తరము:- మీరు సనాతనమని దేనిననుచున్నారు? అనాదినుండి వచ్చుచున్న దానినే కదా!ఇవి అనాదీయములే యైయున్న వేదము లందును, బ్రాహ్మణములు మొదలగు ఋషిముని కృత గ్రంథములందును వీనిపేర్లే లయుండక పోవును! ఈ మూర్తిపూజ సుమారు మూ<డువేల సంవత్సరముల కిటీవల వామమార్గులును, జైనులును వ్యాపింప<జేసిరే కాని మొదట నార్యావర్తమున నిదిలేదు ఈ తీర్థములుగూడ లేవు.జైనులు మొట్టమొదట గిరనార,పాలిటానా,

శిఖర, శత్రుంజయ, అబూ మొదలగు తీర్థములను గల్పించిరి. వారినిజూచి వీరును దమకొఱకు కేర్పఱచుకొనిరి. వీనియారంభకాలమును దెలిసికొన గోరువారు పండాలయొద్దనున్న స్థలపురాణములను, దామ్రశాసనములను జూచిన తెలియును. ఈ తీర్థములన్నియు నైదునూఱేండ్ల కిటీవలివనియో, లేక వేయి సంవత్సరములకు లోనివనియో నిశ్చయమగును. వేయి సంవత్సరములకు మించిన శాసనము లెవ్వరియొద్దను జిక్కుటలేదు. కాన నివి యాధునికములే.

ప్రశ్న:- తీర్థములయు నామములయు మాహాత్మ్యములు కలవను "అన్యక్షేత్రే కృతం పాపం కాశీ క్షేత్రే వినశ్యతి" మొదలు గాఁగల మాటలు సత్యములా కావా?

ఉత్తరము:- కావు. ఏలయనఁగా పాపములే విడిపోవు ననునది నిజమైన దరిద్రులకు ధనమును రాజ్యమును, గ్రుడ్డివాండ్రకుఁ గన్నులను లభించుచుండును. అట్లే కుష్ఠురోగుల కుష్ఠాది రోగములుకూడ నశించుచుండును. ఇట్ల గుటలేదు. ఒకఁడుచేసిన పాపముకాని, పుణ్యముకాని నశించిపోదు.

ప్రశ్న:-

గంగా గంగేతి యో బ్రూయాద్ యోజనానాం శతైరపి
ముచ్యతే సర్వపాపేభ్యో విష్ణులోకం స గచ్ఛతి॥ బ్రహ్మపు. అ. ౧౭౫. ౮౨॥

ఇత్యాది శ్లోకములు పురాణములం దున్నవి. అనఁగా వందలక్రోసుల-వేలకోసుల దూరమునుండి గంగ గంగయని స్మరించునతఁడు పాపములనుండి విముక్తుఁడై విష్ణులోకమును వైకుంఠమునకుఁ బోవును.

హరిర్హరతి పాపాని హరిరిత్యక్షరద్వయమ్॥ పద్మపు. అ. ౭౨. ౧౨॥

"హరి" యను నీ రెండక్షరముల నామోచ్చారణ సమస్త పాపములను దొలగించును. రామ, కృష్ణ, శివ, భగవతి మొదలగు నామముల మాహాత్మ్యము నట్టిదే.

ప్రాతః కాలే శివం దృష్ట్వా నిశిపాపం వినశ్యతి।
ఆజన్మకృతం మధ్యాహ్నే సాయాహ్నే సప్తజన్మనామ్॥ శిక్షదర్పణ.పరిచ్ఛే.౨॥

ఇఁక మనుష్యుఁడు ప్రాతఃకాలమున శివలింగమును-పాషాణమూర్తిని-దర్శించిన రాత్రిచేసిన పాపములన్నియును, మధ్యాహ్నమునదర్శించినజన్మలో చేసిన పాపమును, సాయంకాలమునదర్శించిన నేడు జన్మముల పాపములను

నశించిపోవును. ఇది దర్శన మాహాత్మ్యము. ఇది యబద్ధము లగునా యేమి?

ఉత్తరము:- అబద్ధములనుట కేమిసందేహము? ఏలయనఁగా గంగ గంగయని కాని. లేదా హరి, కృష్ణ, రామ, నారాయణ, శివ, భగవత్యాది నామములను స్మరించుటవలనఁ గాని పాపము లెన్నఁటికిని దొలఁగవు అట్లు తొలఁగుచుండిన దుఃఖమనునదియే లేకుండును. ఇఁకఁ బాపముచేయుట కెవ్వరును వెఱువరుపోవుదురు వర్తమానకాలమందు పోపుల లీలలవలనఁ బాపము హెచ్చుచున్నది పాపముచేసి మఱల నామస్మరణనో లేదా తీర్థయాత్రనో చేసినఁ బాపవిమోచనము కలుగునని మూఢులు నమ్ముచున్నారు. ఇట్టి విశ్వాసముతోడనే కద జనులు పాపముచేసి యిహపరములను రెంటిని బాడుచేసికొనుచున్నారు. కాని చేసినపాప మనుభవింపక తీఱదు.

ప్రశ్న:-ఏదేని తీర్థమో లేదా నామస్మరణమో సత్యమైన దున్నదా లేదా?

ఉత్తరము:-ఉన్నది. వేదాదిసత్యశాస్త్రములపఠనపాఠనములు, ధర్మాత్ములైన విద్వాంసులసాంగత్యము. పరోపకారము, ధర్మానుష్ఠానము. యోగాభ్యాసము. నిర్వైరము, నిష్కపటత్వము. సత్యభాషణము. సత్యమును సమ్మతి సత్యాచరణము. బ్రహ్మచర్యము. ఆచార్యాతిథి మాతాపితృల సేవ. పరమేశ్వరస్తుతి ప్రార్థనోపాసనములు, శాంతి, జితేంద్రియత, సుశీలత, ధర్మయుక్త పురుషార్థము జ్ఞానము విజ్ఞానము మొదలగు శుభగుణకర్మము లేదుఃఖము నుండి తరింపఁజేయును గానఁ దీర్థములనఁబడును జలస్థలములతోఁ గూడియున్న వితీర్థము లెన్నటికిని గాఁజాలవు. ఏలయనఁగా 'జనా యైస్తరంతి తాని తీర్థాని' అనఁగా మనుష్యులు వేనిచే దుఃఖమునుండి తరింతురో వానికిఁ దీర్థములని పేరు. జలస్థలములు తరింపఁజేయునవి కావు. కాని ముంచిచంపును నావలు మొదలగు వానికిఁ దీర్థములను పేరిడవచ్చును. ఏలయనఁగా వానివలన మనుష్యులు సముద్రాదులను దాటిపోవుచున్నారు.

సమాన తీర్థే వాసీ॥ అష్టా. ౪. పా. ౪. ౧౦౭॥
సమ తీర్థ్యాయ చ॥ యజు. అ. ౧౬. మం. ౪౨॥

ఒక యాచార్యునియొద్ద నొకేశాస్త్రమును గుమిగూడి చదువు బ్రహ్మచారు లందఱు సతీర్థ్యులు. అనఁగా సమానమైన తీర్థమును సేవించువారు. వేదాదిశాస్త్రము లభ్యసించి, సత్యభాషణాది ధర్మలక్షణములతోఁ, సాధువులైన

వారికి నన్నాది పదార్థము లొసంగి, వారినుండి విద్యను సంగ్రహించుట మొదలగునవియు దీర్ఘములనఁబడును. ఇఁక నామస్మరణమన్న :-

యస్య నామ మహద్యశః ॥ యజు. అ. ౩౨ మం. ౩॥

పరమేశ్వరునిపేరు మహద్యశము-అనఁగా ధర్మయుక్తములగు పనులనుజేయుట. ఎట్లన-బ్రహ్మ, పరమేశ్వరుఁడు, ఈశ్వరుఁడు, న్యాయకారి, దయాళువు, సర్వశక్తిమంతుడను నిత్యాదులౌ పరమాత్ముని గుణకర్మ స్వభావములను బోధించు నామములు. గమనింపుఁడు : బ్రహ్మయనగా నందఱికంటె గొప్పవాఁడు; పరమేశ్వరుఁడనఁగా నీశ్వరులకీశ్వరుఁడు; ఈశ్వరుఁడనఁగా సామర్థ్యయుక్తుఁడు; న్యాయకారి యనఁగా నెన్నటికి నన్యాయము చేయనివాఁడు; దయాళు వనగా నందఱిమీఁదను గృపాదృష్టి నుంచువాఁడు; సర్వశక్తిమంతుఁ డనఁగా నొకని సహాయము గొనక తన సామర్థ్యముచేతనే సకల జగదుత్పత్తి స్థితి ప్రలయములు గావించువాఁడు; బ్రహ్మ వివిధజగత్పదార్థములను రచించు వాఁడు; విష్ణు వన్నిటను వ్యాపించి రక్షించువాఁడు; మహాదేవుఁడు దేవతలకు దేవుఁడు; రుద్రుఁడు ప్రలయము చేయువాఁడు: ఇత్యాది నామార్థములను తాను ధారణచేయవలయును అనఁగా గొప్ప కార్యములనుచేసి గొప్పవాఁడు గాఁదగును. సమర్థులందెల్ల సమర్థుఁడు గావలెను. అట్లే సామర్థ్యమును బెంచుకొనుచుండవలయును అధర్మ మెన్నటికిని జేయఁగూడదు అందఱియందును దయ గలిగి యుండవలయును. సమస్త విధములైన సాధనములను సమర్థింపవలయును. శిల్పవిద్యనుబట్టి వివిధపదార్థములను జేయవలయును. ప్రపంచమునఁ దనవలెనే యందఱి సుఖదుఃఖముల నెంచి, యందఱిను రక్షింపవలయును. విద్వాంసులలో విద్వాంసుఁడు గాదగును. దుష్టకర్మములను ద్వేషింపవలయును. దుష్టకర్మములను జేయువారిని బ్రయత్నముచేసి దండింపవలయును. సుజనులను రక్షింపవలయును. ఈ ప్రకారముగ పరమేశ్వరుని నామముల యర్థమును గ్రహించి, పరమేశ్వరుని గుణకర్మస్వభావముల ననుసరించుచుఁబోవలయును. ఇదియే పరమేశ్వరుని నామస్మరణ.

ప్రశ్న:- గురుర్బ్రహ్మా గురుర్విష్ణుర్గురుర్దేవో మహేశ్వరః ।
గురురేవ పరంబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః ॥ గురుగీత. శ్లో. ౧౯॥

ఇత్యాది గురుమాహాత్మ్యమైన సత్యమా? గురువు పాదములను గడిగి యానీటిని ద్రాగుట, అతఁడాజ్ఞాపించినట్లు వర్తించుట, అట్లే గురువులోభియైన వామనుఁడని, క్రోధియైన నరసింహుఁడని, మోహియైన రాముఁడని, కామియైనఁ గృష్ణుఁడని తలఁచుట, గురువెంతటి పాపకృత్యమును జేసిన నతని యెడల శ్రద్ధతప్పక యుండుట, గురుదర్శనము చేయఁబోవునప్పుఁ డడుగడుగున నశ్వమేధఫలము లభించుననుట ఈ మాటలు సత్యములా. కావు!

ఉత్తరము:- కావు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులనునవి పరబ్రహ్మ పరమేశ్వరుని పేరులు. ఆతనితో సమానుఁడు గురువెన్నటికిఁ గాఁజాలఁడు. ఈ గురుమాహాత్మ్యము, గురుగీతలు అనునవియుఁ బోపుల తంత్రములే. తల్లి తండ్రి, ఆచార్యుఁడుఅతిథి వీరేగురువులు. వీరిసేవచేసివీరివలన విద్యాశిక్షలనుబొందుటశిష్యులకుఁ గర్తవ్యము. అట్లే శిష్యులకు విద్యాశిక్షలనొసఁగుటగురువునకుఁ గర్తవ్యము. కాని గురువు లోభి, క్రోధి, మోహి, కామియైన నతనిని శిక్షించి వదలిపెట్టవలయును. సామాన్యమైనశిక్షకు లొంగకపోయిన నర్ఘ్యపాద్యములు అనఁగా హస్తతాడనము, పాదతాడనములుచేసి మరణదండనను విధించినను గూడఁబాపములేదు. విద్యాది సుగుణములు గలిగియున్నమాత్రమున గురువు గాఁడు. బూటకములైన రుద్రాక్షమాలాతిలకములను ధరించి వేదవిరుద్ధములైన మంత్రముల నుపదేశించువారు గురువులుకారు; వారు గొఱ్ఱెలకాపరులు. గొఱ్ఱెల కాపరులు గొఱ్ఱెలవలనను, మేకలవలనను పాలు మున్నగు స్వప్రయోజనముల నెఱవేర్చుకొనునట్లే యీ గురువులు శిష్యులనుండియు, శిష్యురాండ్రనుండియు ధనములాగి తమప్రయోజనములు నెఱవేర్చుకొనుచున్నారు.

దోహా॥ గురు లోభీ చేలా లాలచీ, దోనోఁ ఖేలేఁ దావ్ ।
భవసాగరమేఁ డూబతే, బైఠ్ పత్థరకీ నావ్ ॥

శిష్యుఁడును, శిష్యురాండ్రును ధనకేమైన నిత్తురని గురువను కొనును. ఇఁక నట్లే గురువు మమ్ముల మిథ్యాశపథములను చేయుట మున్నగు పాపముల నుండి విముక్తులఁజేయునని శిష్యులనుకొనెదరు ఇట్లు లోభములోఁగూడిన యీ కపట గురుశిష్యులిరువురు ఱాతినావలోఁ గూర్చుండి పోవువారు సముద్రమున మునుఁగునట్లే, దుఃఖసాగరమునఁబడి మునుఁగుదురు. అట్టి గురుశిష్యుల ముఖముల మీఁద మన్నుపోయవలయును. వారి సమీపమునగూడ నెవరును

నిలువఁగూడదు. లేనిచో వారును దుఃఖసాగరమునఁబడి మునుఁగుదురు. పౌరాణికులైన పూజారుల తంత్రములు పన్నినట్లే యీ గొఱ్ఱెలకాపరులవంటి గురువులును బిన్నియున్నారు. ఈ కార్యములన్నియు స్వార్థులచే, గల్పింపబడినవి. పరమార్థులగువారు తాముదుఃఖము'దొంటినను లోకోపకారము చేయక మానరు. కుకర్మలు చేయు సీ లుబ్ధులైనగురువులే యీ గురుమాహాత్మ్యములను, గురుగీతాదులను కల్పించిరి.

ప్రశ్న:- అష్టాదశ పురాణానాం కర్తా సత్యవతీసుతః॥ మహాభా.ఆదిప.౧.౨౬౬
ఇతిహాసపురాణాభ్యాం వేదార్థ ముపబృంహయేత్ ॥ "

పదు నెనిమిది పురాణములను రచించినవారు వ్యాసులు వ్యాసుల వచనమును బ్రమాణముగా నవశ్య మంగీకరింపవలయును. ఇతిహాసము, మహాభారతము, అష్టాదశపురాణములు వీనితోడ వేదముల యర్థమును గ్రహింపవలయును; గ్రహింపఁ జేయవలయును. ఏలయనఁగా నితిహాసపురాణములు వేదార్థమున కనుకూలములై యున్నవి.

పురాణాని ఖిలాని చ ॥ మను. అ. ౩. శ్లో. ౨౩౨ ॥

పితృకర్మములందు పురాణమును, హరివంశీయుల కథను ( ఖిలము ) వినవలయును.

ఇతిహాసపురాణః పంచమో వేదానాంవేదః॥ ఛాందో. ప్ర. ౭. ఖం. ౧. ప్రవా.४॥
ఇతిహాస పురాణములు పంచమవేద మనఁబడును.

దశమేఽహని కించిత్పురాణ మాచక్షీత॥
శత. కాం. ౧౩. ప్ర. ३. బ్రా. ౧. కం. ౧౩॥

అశ్వమేధ యాగాంతమునఁ బదియవ దినమునఁ గొంత పురాణమును వినఁదగును.

పురాణవిద్యా వేదః॥ సూ త్రే. శత. ౧३. ४. ३. ౧३. ॥

వేదార్థమునెఱుఁగుటవలనసేకద పురాణమందలి విద్య వేదమనఁబడును.

ఇత్యాది ప్రమాణములను బట్టి పురాణములు ప్రామాణికము లనియు, వానియందలి మూర్తిపూజలు తీర్థములుగూడఁ బ్రామాణ్యములనియు గ్రహింపఁదగును. ఏలయనఁగా బురాణములలో 'మూర్తిపూజ' తీర్థయాత్రాదులు విధింపఁబడి యున్నవి.

ఉత్తరము:- పదునెనిమిది పురాణములను వ్రాసినది వ్యాసులే యయిన వారియందు విద్యాబుద్ధము యుండకపోవును. ఏలయనంగా శారీరక సూత్రము లను, యోగశాస్త్ర భాష్యము మొదలగు వ్యాసోక్త గ్రంథముల నవలోకించుట వలన వ్యాసులవారు గొప్పవిద్వాంసులనియు, సత్యవాదులనియు, ధర్మాత్ము లనియు, యోగులనియు దెలియవచ్చుచున్నది. వారిట్టియబద్ధముల నెన్నటికిని వ్రాయరు. దీనివలన పరస్పర మతవిరోధులగు భాగవతాది నవీనములైన కపోల కల్పిత గ్రంథములు రచించిన పురుషులందు వ్యాసులయందున్న గుణములు లేశమాత్రము నుండలేవని సిద్ధమగుచున్నది. మఱి వేదశాస్త్ర విరుద్ధమగు అసత్యవాదమును వ్రాయుట వ్యాసులవంటి విద్వాంసుల పని కాదు. కాని యిది శూద్రులను, స్వార్థులును, విద్యావిహీనులైన పామరుల పని. ఇతిహాస పురా ణములనగా శివపురాణాదుల పేరులుకావు కాని:—

బ్రాహ్మణానీతిహాసాన్ పురాణాని కల్పాన్ గాథా నారాశంసీరితి ॥

ఆశ్వలాయనగృహ్యసూ. ౩.౩.౧ ॥

ఇవి బ్రాహ్మణములయు, సూత్రములయు, వచనము. ఐతరేయ, శత పథ, సామ, గోపథములను బ్రాహ్మణగ్రంథములకే ఇతిహాసము, పురాణము, కల్పము, గాథ, నారాశంసీయను నైదుపేరులు (ఇతిహాసము) జనక యాజ్ఞ వల్క్య సంవాదము వంటిది. (పురాణము) జగదుత్పత్తి మొదలగువర్ణన. (కల్పము) వేదశబ్దముల సామర్థ్యవర్ణన. అర్థనిరూపణము. (గాథ) దృష్టాంత దార్ష్టాంతికరూపముగా నొకరి కథాప్రసంగము. (నారాశంసి) మనుష్యుల ప్రశంసనీయ చరిత్రలను వివరించుట. వీనివలననే వేదార్థము బోధపడును పితృకర్మమునందు జ్ఞానుల ప్రశంసగ గాథల వినుట. అశ్వమేధాంతమున సూత సృష్టి స్థితుల ప్రశంసను వినవలెననియే వ్రాసియున్నది

అటువలెనంగా వ్యాసరచిత గ్రంథములను వినవలెననియు, వినిపింపవలె ననియు వ్యాసులు పుట్టినతరువాత సంభవించును. కాని తత్పూర్వము కాదుగద. వ్యాసులు పుట్టకమునుపే వేదార్థమును జదువుచు, జదివించుచును, వినుచు, విని పించుచునుండిరి. కావుననన్నిటికంటెను ప్రాచీనములగు బ్రాహ్మణగ్రంథములకే యీనామము లన్వయించును. ఈ నవీన కపోలకల్పితములైన శ్రీమద్భాగవత శివపురాణాది మిథ్యా దూషిత గ్రంథముల కన్వయింపవు. వ్యాసులు వేదమును

చదివి చదివించి, వేదార్థమును వ్యాపింపజేసిరి. కావుననే యాయనకు "వేద వ్యాసు"లను పేరు కలిగినది. వలయ మధ్యరేఖను వ్యాసమనుచున్నారు. కాన వారు ఋగ్వేదము మొదలుకొని యథర్వవేద పర్యంతము నాలుగువేదములను జదివిరనియు నట్లే వానిని శుకదేవ, జైమిని మొదలగు శిష్యులకును జదివించి యుండిరనియుఁ దెలియుచున్నది గదా. వారి జన్మనామము కృష్ణద్వైపాయనులు. కొందఱు వ్యాసుచే వేదముల నొకచోట జేర్చిరనుచున్నారు; కాని యా మాట సత్యముగాదు. ఏల యనఁగా వారి తండ్రి తాత ముత్తాతలగు పరాశర, శక్తి, వసిష్ఠ, బ్రహ్మాదులు కూడ నాలుగువేదములను జదివియుండిరి కదా! ఇఁక నీమాట సంగతమెట్లగును.

ప్రశ్న:- పురాణములలోని మాటలన్నియు నబద్ధములేనా? నిజమేదైన నున్నదా?

ఉత్తరము:- దబ్బఱపలుకు లనేకములున్నవి. ఘుణాక్షరన్యాయానుసారమే కొకటొకటి నిజమైనదియుఁ గలదు. సత్యమైనవన్నియు వేదాది సత్యశాస్త్రములలోనివనియు, నబద్ధములన్నియుఁ బోపుల యింటఁబుట్టిన పురాణముల లోనివనియు నెఱుఁగఁదగును. చూడుఁడు: శైవులు శివపురాణమున శివుని పరమేశ్వరుఁడని నమ్మి విష్ణు, బ్రహ్మ, ఇంద్ర, గణేశ, సూర్యాదుల నతనికి దాసులుగాఁ జేసిరి. అట్లే వైష్ణవులు విష్ణు పురాణాదులలో విష్ణువును బరమాత్ముఁడని నమ్మి శివాదుల నతనికి దాసులుగాను, (శాక్తులు) దేవీభాగవతమున దేవిని బరమేశ్వరియని నమ్మి, శివ విష్ణ్వాదుల నామెకుఁ గింకరులుగాను వ్రాసిపెట్టిరి. గణేశఖండమున గణేశుని బరమాత్ముఁడనియు, తక్కినవారందఱుతని దాసులనియు వ్రాసిరి ఇవన్నియు సాంప్రదాయకులగు పోపులవి కాక మఱియెవ్వరివి. ఒకే మనుష్యుఁడు రచించినవానిలో నిట్టి పరస్పర విరుద్ధములగు మాటలుండునపుడు, విద్వాంసుఁడు వ్రాసినవానిలో నిట్లెన్నడునుండఁ జాలవు. దీనిలో నొకమాట నిజమనినమ్మిన రెండవది యబద్ధమగును. రెండవ దానిని నిజమన్న మూఁడవది యబద్ధమగును మూఁడవదానిని సత్యమని నమ్మినఁ దక్కినవన్నియు నబద్ధము లగును. శివపురాణము వాఁడు శివుని వలన, విష్ణుపురాణమువాఁడు విష్ణువువలన దేవీపురాణమువాఁడు దేవివలన, గణేశఖండమువాఁడు గణేశునివలన సూర్యపురాణమువాఁడు సూర్యునివలన,

వాయుపురాణమువాఁరు వాయువువలనను సృష్ట్యుత్పత్తి ప్రళయములు జరుగు చున్నవని వేర్వేఱు కారణములు చూపినాఁరు. ఇంతియకాక ప్రతి గ్రంథ కర్తయుఁ దన గ్రంథమున వర్ణించిన దేవతయే సృష్టికర్తయనియు నితర గ్రంథములలో సృష్టికర్తలుగా వ్రాయఁబడినవారినెల్ల సృజించినాఁడనియు గూడ వ్రాసియున్నాఁరు. 'జగదుత్పత్తి స్థితిలయములను జేయువాఁడు పుట్టునా? పుట్టినవాఁడు సృష్టికిఁ గారణమెన్నటికైనను గాఁగలఁడా?' అని యెవ్వరైన నడిగిన, నీ పౌరాణికులు నోరుమూసికొని యూఱకుందురే కాని యేమియుఁ జెప్పఁజాలరు. ఈ సృష్టికర్తలందఱు శరీరములు నిట్టివే కలిగినవి సృష్టి పదార్థములై స్వయముగఁ దామె పరిచ్ఛిన్నులైనందున నీప్రపంచమునకు సృష్టి కర్త లెట్లుకాఁగలుగుదురు? చిత్రవిచిత్రముగా వ్రాయఁబడిన యుత్పత్తివిధము కూడ సంపూర్ణముగ నసంభవమే యనఁదగును. ఎట్లనఁగా:- శివ పురాణమున శివుఁడు సృష్టిచేయవలెనని తలఁచి నారాయణ-జలాశయమును సృజింపఁగా దాని నాభియందొక కమల ముత్పన్నమయి, యా కమలములోనుండి బ్రహ్మ వెడలెనఁట. అతఁడంతను జలమయమైయుండుటఁజూచి తనపుడిసిలిలోఁ గొంత జలమును బుచ్చుకొని, చూచి, మరలదానిని నీటఁ బాఱవైవ నానీట నొక బుగ్గపుట్టి దాన నొకపురుషుఁడు వెడలెనఁట. అతఁడు బ్రహ్మనుజూచి, "ఓ పుత్రకా! నీవు సృష్టిచేయుము. అని చెప్పఁగా "బ్రహ్మ యతనితో, నేను నీ కుమారుఁడనుగాను, నీవే నాకుఁ బుత్రుఁడవు" అని యనెనఁట. దాన వారిలో వివాదము పుట్టి, వేయి దివ్యవర్షముల పర్యంతము నీటిమీఁదనే యుద్ధము చేయు చుండిరఁట. అప్పుడు మహాదేవుఁడు "నేను సృష్టి చేయుటకొఱకు బంపిన వారిరువురు నొకరితో నొకరు యుద్ధము చేయుచున్నారని యోచించి వారిరువుర మధ్యమున నొక తేజోమయమైన లింగమును గలుగఁజేయనది తత్క్షణమే యాకాశమునకు పెరిగిపోయెనఁట. దానిని జూచి యా యిరువురు నాశ్చర్య మగ్నులై, దాని యాద్యంతములను దెలిసికొనవలెనను నభిప్రాయము కల వారైరఁట. ఇఁక దానిఁదెలిసికొని ముందు వచ్చువాఁడు తండ్రియనియుఁ దరు వాత వచ్చువాఁడుగాని, తెలిసికొనిరానివాఁడుగాని పుత్రుఁడనియు నొకరి నొకరు లానింపవలసినదని, నిశ్చయించుకొని విష్ణువు కాఁబేలు రూపమును ధరించి క్రిందికిని. బ్రహ్మ హంసరూపముతో నాకసమునకు మనోవేగముగా

చెప్పిరఁట. వారట్లు దివ్య సహస్రవర్షముల పర్యంతము పోయినను, వారికిదాని యంతు దొరకనందున క్రిందనుండి మీఁదికి విష్ణువును, మీఁదినుండి క్రిందికి బ్రహ్మయును దమతో దాము "అతఁడంతమును తెలిసికొనియే వచ్చియుండిన నేనతనికిఁ బుత్రుఁడును కావలసివచ్చునే"యని చింతిల్లుచు రాఁగా మీఁదినుండి యొక యావును, ఒక కేతకీ వృక్షమును క్రిందికి దిగివచ్చుచుండుటను బ్రహ్మ చూచి, "మీరెచ్చటినుండి వచ్చుచున్నా"రని వానినడుగ నవి బ్రహ్మతో, "మేమీ లింగమునను సరించి వేయి సంవత్సరములనుండి వచ్చుచున్నాము." అనిచెప్పెనట. బ్రహ్మ మరల, "ఈ లింగమునకంతమున్నదాలేదా"యనివాని నడుగ నవి లేదని ప్రత్యుత్తరమిచ్చెనఁట. అంతట బ్రహ్మ వానితో "నాతోఁ గూడవచ్చి, ఆవూ! నీవు ఈ లింగము శిరస్సుమీఁద క్షీరధారఁ గురిపించు చుండినట్లును, కేతకీ వృక్షమా! నీవు పువ్వులను వర్షించుచుండినట్లును సాక్ష్య మియ్యవలసినది. అట్లు మీరు చేసిన మీ గమ్యస్థానమునకు మిమ్ము జేర్పఁగం" నని చెప్పఁగా నవి,"మేము కూటసాక్ష్యమీఁజాల"మని ప్రత్యుత్తరమిచ్చెనట. అపుడు బ్రహ్మ కుపితుఁడై "మీరు నేను జెప్పినట్లు సాక్ష్యమియకపోయిన మిమ్ములనిప్పుడే భస్మముగావించెద"నని, వానిని బెదరింపఁగా నవి జడిసి, "మీరు చెప్పినట్లు సాక్ష్యమీయఁగలవార"మని బ్రహ్మను సమాధానపఱచెనఁట. అప్పుడా ముప్పురును గలసి క్రిందికి దిగివచ్చి వీరికంటె ముందుగ నచ్చటికి వచ్చియున్న విష్ణువునుజూచి, బ్రహ్మ"నీవు దీని యంతమును దెలిసికొనివచ్చి తివా లేదా"అని యతని నడిగెనఁట. అందులకు విష్ణువు, "నాకు దీనియంతు చిక్కలేదు"అని బ్రహ్మతోఁ జెప్పఁగా నతఁడు "నేను దెలిసికొనివచ్చినా"నని మాట చెప్పెనఁట.అంత విష్ణువు సాక్ష్యమెవ్వరని బ్రహ్మనడుగ నా యావును, వృక్షమును, "మేమిరువురమును లింగము శిరస్సు మీఁదనుంటిమి" అని సాక్ష్య మిచ్చెనఁట. తోడనే యా లింగమున నొక శబ్దముత్పన్నమయి, వృక్షము నుద్దేశించి, "నీవబద్ధము చెప్పితివి కాబట్టి, నీ పుష్పములకు నా మీఁదగాని యితర దేవతలమీఁదఁగాని యిఁక మీఁదట నుంచునర్హతలేకుండఁబోవునుగాక! అట్లైనదైన వానిని ధరింపఁజేసిన, వాఁడు నిర్మూలమగునుగాక" యనియును, గోవు నుద్దేశించి "నీవు నీ నోట నబద్ధమాడితివి కావున ఆ నోటితోనే నీవశు ధము తిందువుగాక. కాని, నీముఖమును పూజింపక నీతోఁకనుమాత్ర మంద

బును బూజింతురుగాక" యనియును, విష్ణువు బ్రహ్మనుద్దేశించి. "నీవబద్ధ మాడితివి కావున నీ ప్రపంచమునందెచ్చటను నీపూజ చేయబోవుదురుగాక" అని యును శాపమొసంగినట్లును. అంతట విష్ణువు నుద్దేశించి "నీవు సత్యమాడితివి కావున నిన్నంతట బూజింతురుగాక" అనియు వరమిచ్చినట్లును వినిపించెనఁట. అంతట బ్రహ్మ విష్ణువు లిరువురును లింగమును స్తోత్రముచేయఁగా బ్రీతిఁజెంది యాలింగములోనుండి యొక జటాజూటమూర్తి బయలువెడలి. యా యిరు వులనుజూచి. మిమ్ములను నేను సృజింపఁబంపితి; మీలో మీరు కలహము లేలపెట్టుకొంటిరి? అని యడుగఁగా బ్రహ్మ విష్ణువులు "మామగ్రలేనిది సృష్టి నెట్లుచేయుదుము" అని ప్రత్యుత్తరమిచ్చిరఁట. అప్పుడు మహాదేవుఁడు తన జటాభారమునుండి యొక బూడిదముద్దను దీసి వారిచేతికిచ్చి, "పొండు, దీనితోఁ బ్రపంచమునంతటిని రచింపుడు" అని యాజ్ఞాపించెనఁట. ఈ మొదలగు కథలు దానిలో నున్నవి. బళా! సృష్టికర్తమును బంచమహాభూతములనుగూడ లేనపుడు బ్రహ్మ విష్ణుమహాదేవుల శరీరములు, జలము, కమలము, లింగము, ఆవు, కేతకీ వృక్షము, భస్మపుటుండ. ఇవన్నియు నెక్కడినుండివచ్చెను? మీ యబ్బ యింటినుండి యూడిపడెనా? అని యీ పురాణములు వ్రాసిన వారి నడుగ వలయును.

అటులే భాగవతమున, విష్ణువునాభినుండి కమలమును, ఆకమలము నుండి బ్రహ్మయు, నా బ్రహ్మ కుడికాలి బొటనవ్రేలినుండి స్వాయంభువును, ఎడమకాలి బొటనవ్రేలినుండి సత్యరూపారాణియు, లలాటము నుండి రుద్రుఁడును, మరీచి మొదలగు పదిమందికుమారులును, వారివలన దశప్రజాపతులును గలిగిరనియు, నా ప్రజాపతుల పదుమువ్వురు కుమార్తెలను కశ్యపుఁడు వివాహమాడెననియు, వారిలో దితికి దైత్యులును, దనువునకు దానవులును, అదితికి నాదిత్యులును, వినతకుఁ బక్షులును, కద్రువునకు సర్పములును, సరమకుఁ గుక్కలును, స్యాలాది ఇతర యువతులకు నేనుఁగులు, గుఱ్ఱములు, ఒంటెలు, గాడిదలు, బఱ్ఱెలు, గడ్డి, పచ్చిక, కసింత మొదలగుచెట్లు ముండ్లతోఁగూడఁ బుట్టెననియు వ్రాయబడియున్నది. బలే! బలే!! భాగవతమును రచించిన మాయగాఁడా! ఏమిచెప్పవలెను? ఇట్టి యబద్ధపుగాఁథలు వ్రాయుటకు నీకుఁ గొంచెమైనను సిగ్గులేదాయెగా! నీ కన్నులు పోయియుండెనా యేమి?

స్త్రీ పురుషుల రజోవీర్యముల సంయోగమువలన మనుష్యుఁడు పుట్టుట సహజమే కాని పరమేశ్వరుని సృష్టి క్రమమునకు విరుద్ధముగాఁ బశుపక్షి సర్పాదులెన్నటికిని బుట్టఁజాలవు. మఱి ఏనుఁగు, ఒంటియ, సింహము, కుక్క, గాడిద, వృక్షములు మున్నగునవి స్త్రీయుదరంబున నుండనవకాశమెట్లుండగలదు? సింహాదులుపుట్టి తమ తల్లిదండ్రుల నేల మ్రింగలేదు? మనుజుని శరీరము నుండి పశుపక్షి వృక్షాదుల యుత్పత్తి యెట్లుసంభవమగును? ప్రపంచము నింత వఱకు భ్రాంతిరూపమునఁ బడవైచి, తలయెత్త నీకయుంచిన యీయసంగతపు వ్రాతలకును, వాని వ్రాసినపోపులకును ధిక్కారము. వ్రాసిరిపో, ఈ రిక్త జల్పములను నంధులగు పోపులును, తెలివిమాలిన వారిశిష్యులును విని నమ్ము చున్నారే! వీరలు మనుష్యులేనా మఱేమైననా? ఇది మహాశ్చర్యకరముగా నున్నది! ఈ భాగవతాది గ్రంథములను రచించినవారు గర్భములో నున్నప్పుడే యేల నష్టము కాకపోయిరో పుట్టినతోడనే యేల చావకపోయిరో! ఏలయనఁగా ఏ పోపులు లేకుండిన నీయార్యావర్తదేశ మిట్టి దుఃఖములపాలయ్యెడిది కాదు.

ప్రశ్న:- ఈ మాటలలో విరోధము కలుగఁజాలదు. ఏలయనఁగా నెవని వివాహమున వానిపాట పాడుచున్నట్లే. విష్ణువును స్తోత్రము చేయునపుడు అతనిని బరమేశ్వరునిగాను, అన్యుల నతనికి దాసులుగాను, శివుని గుణములను బాడునపుడు శివునిఁ బరమాత్మగాను, దక్కిన వారి నతనికిఁ గింకరులుగాను జేసియున్నారు. పరమేశ్వరుని మాయ కన్నియు శోభించినవే. పరమేశ్వరుఁడు మనుష్యులనుండి పశువులను, పశువుల నుండి మనుష్యులను పుట్టింపఁగలఁడు. చూడుడు! కారణములేకయే తన మాయవలన నీశ్వరుఁడు సమస్త సృష్టిని నిలువఁబెట్టినాఁడు అతని కసంభవమైన దొక్కటియు లేదు. అతఁడు జేయఁదలచిన నన్నియుఁ జేయగలఁడు.

ఉత్తరము:- ఓ యమాయకులారా! వివాహమున నెవని గుఱించి పాటపాడుదురో వాని నందఱికంటె గొప్పయని గాని, ఇతరులను చిన్నయని గాని ఇతరులను దిరస్కరించి వాఁడే యందఱకుఁ దండ్రియని కాని చెప్పుట లేదు. పోపులారా! మునుస్తోత్రములను జేయు బట్టులకంటె మీరు మించిపోయితిరా లేదా? మీరే చెప్పుఁడు! ఎవనివెంటఁ బడుదురో వాని నందఱికంటె గొప్పవానిగాను. ఎవనితో వైరము బూనుదురో వాని నందఱికంటె హీనుని

గాను జేయుచున్నారుగదా! మీకు సత్యముతో నేమిపని? ధర్మముతో నేమి ప్రయోజనమున్నది? మీకు స్వార్థముతోనే పని. మనుష్యులయందు మాయ, ఛలము, కపటములుండుట సహజమే కాన సట్టిమనుష్యులు మాయకాండ్రనఁ బడుదురు. కాని పరమేశ్వరుని యందు ఛలకపటాది దోషములు లేనందున ఆయన మాయగాఁడు కాదు. ఆదిసృష్టిని గశ్యపుని స్త్రీలకే పశువులు, పక్షులు, సర్పములు, వృక్షాదులు పుట్టియుండిన నిప్పుడు సట్లే పుట్టరేల? వెనుక వ్రాయఁబడిన సృష్టిక్రమమే సరియైనదని యెఱుఁగఁదగును. పోపం వారు ఈ క్రిందఁగనఁబఱచిన వచనములనుబట్టి మోసపోయి, లేనిపోని మాటలు వ్రాసియున్నట్లు అనుమానము కలుగుచున్నది.

తస్మాత్ కాశ్యప్య ఇమాః ప్రజాః॥ శతపథ. ౭.౪.౧.౫॥

ఈ సృష్టియంతయుఁ గశ్యపుని రచనయని శతపథమున వ్రాసియున్నది.

కశ్యపః పశ్యకో భవతీతి॥ నిరుక్త. అ.౨.౮౦౧.॥

"పశ్యక" యనఁగా 'పశ్యతీతి పశ్యః పశ్య ఏవ పశ్యకః' భ్రమరహితుఁడై చరాచరజగత్తును, సమస్తజీవులను, వారి కర్మములను, సకల విద్యలను ఉన్నదున్నట్లు చూచుచున్నాడు. కాన నా సృష్టికర్తయైన పరమేశ్వరునికే కశ్యపుఁడని పేరు. ఇఁక 'ఆద్యంత విపర్యయశ్చ' అను మహాభాష్య వచనమునుబట్టి మొదటివర్ణము తుదిని, తుదివర్ణ మాదిని వచ్చుటవలన "పశ్యక" శబ్దము "కశ్యప" శబ్దమయినది. ఇట్లు దీనియర్థము దెలియక భంగు త్రాగియున్మత్తులై సృష్టిక్రమమునకు విరుద్ధమైన మాటలు వ్రాయుచుఁ దమజన్మమును వ్యర్థముచేసికొనిరి.

మార్కండేయపురాణములోని దుర్గాపాఠమున దేవతల దేహములనుండి తేజస్సువెడలి యొకదేవి పుట్టెననియు, నామె మహిషాసురునిఁ జంపెననియు, రక్తబీజుని శరీరములోని రక్తబిందువులు భూమిమీఁదఁ బడుటవలన బిందువున కొక్కొక్క రక్తబీజుఁడు పుట్టుటచే నీ జగత్తంతయు రక్తబీజులతో నిండిపోయెననియు, రక్తము కాలువలు కట్టి ప్రవహించుచుండెననియు నింక ఎన్నెన్నియో అబద్ధములను వ్రాసిపెట్టిరి. రక్తబీజులతో జగమంతయు నిండియుండినపుడు దేవియు, దేని సింహమును, ఆమె సైన్యము నెక్కడ

నుండెను ; రక్తబీజులు దేవికి దూర దూరముగ నుండిరని చెప్పిన జగత్తం తయు రక్తబీజులతో నిండియుండ లేదుగదా ! అట్లు నిండియే యుండిన బళు, పక్షి, మనుజాది ప్రాణులును, జలస్థ మకర మత్స్య కచ్ఛపాదులును, వనస్ప త్యాది వృక్షములును, ఇవన్నియు నెక్కడ నుండ గలిగెను? దుర్గా పాఠమును వ్రాసిన పోపుగారి యింటిలోనికిఁ బయిగిడిపోవచ్చును. చూడుఁడు: రంగు ద్రాగిన మైకమున నీ తలతోఁక లేని యసంభవ కథను కల్పించి వ్రాసిరి కద్య

శ్రీమద్భాగవత మన బడు గ్రంథమందలి లీలలను వినుఁడు. బ్రహ్మకు నారాయణుఁడు చతుఃశ్లోక భాగవతము నుపదేశించెనఁట :-

జ్ఞానం పరమగుహ్యం మే యద్విజ్ఞాన మన్వితమ్ ।
సరహస్యం తదంగంచ గృహాణ గదితం మయా ॥

భాగవత. స్కంధ. ౨. అ. ౯. శ్లో. ౩౦॥

ఓ బ్రహ్మ! విజ్ఞాన రహస్యములతోఁ గూడి, ధర్మార్థ కామ మోక్షముల కంగముగా నున్న నా పరమగుహ్య మను జ్ఞానమును నీవు నానుండి గ్రహిం పుము ఇట విజ్ఞానము తోఁగూడిన జ్ఞానమన్నపుడు పరమ అనుపదమును జ్ఞాన మునకు విశేషణముగా నుంచుట వ్యర్థము అట్లే గుహ్యమను విశేషణ ముం డఁగా రహస్యమను పదమును జేర్పుటకూడఁ బునరుక్తమే.ఇట్టి మూలశ్లోకమే యనర్థకమైయున్న నా గ్రంథమేల యనర్థకము కాకపోదు ?

ఇఁక బ్రహ్మకొసంగిన వరము.

భవాన్ కల్పవికల్పేషు న విముహ్యతి కర్హిచిత్॥

భాగవత. స్కంధ. ౨.అ.౯.శ్లో. ౩౬॥

నీవు సృష్టియందునుఁబ్రళయమందును మోహమునెన్నటికిని బొందకుం దువుగాక!అని వ్రాయఁబడియున్నది.మరలదశమస్కంధమున నాబ్రహ్మ మోహి తుఁడయి వత్సహరణము చేసెననియుఁ గలదు. ఈ రెంటిలో నొకమాట సత్య మును, మఱియొకటి యసత్యమునై న రెండు నబద్ధములేయని తేలను. వైకుం ఠమున రాగము, ద్వేషము, క్రోధము. ఈర్ష్య, దుఃఖము ఇవి లేవనుమాట నిజమేయైన సనకాదులకు వైకుంఠద్వారమునఁ గ్రోధమేల కలిగెను? క్రోధము కలిగినప్పుడది స్వర్గమే కాదు మఱి జయవిజయులు ద్వారపాలకులుగా నున్నం దున స్వామియాజ్ఞను బాలించుట వారి కర్తవ్యమై యుండెను. కాన వారు

సనకాదులను లోనికిఁ బోవనీయలేదేని ఇందులో వారుచేసిన యపచారమేమి, అపరాధములేనిది శాపమే తగులనేరదు. వారు "మీరు భూమిపైఁ బడిపొం" డని శాపమునిచ్చిరన్న నన్నటి భూమియేలేదని సిద్ధమగుచున్నది. మఱి యాకాశము, వాయువు, అగ్ని, జలము లనునివియే యటనున్న నా ద్వారమందిరములను, జలమును నిలిచియుండుట కాధారమేమి? ఇఁక జయ విజయులు, మహానుభావులారా ! మరల మేము వైకుంఠమున కెప్పుడు రాఁగలుగుదుము" అని సనకాదులను ప్రార్థించి యడుగఁగా వారు "ప్రేమతో నారాయణుని సేవచేసిన యేడవ జన్మమందును, విరోధమున సేవఁజేసిన మూఁడవ జన్మమందును మరల మీకు వైకుంఠ మమరు" నని చెప్పిరఁట. ఇట విచారణ చేయవలసిన దేమనఁగా:- జయ విజయులు నారాయణుని సేవకులుగా నుండిరి. వారిని గాపాడుటయు, వారికి సహాయముచేయుటయు నారాయణునకుఁ గర్తవ్యమైయుండెను. తన సేవకుల నపరాధములేనిదే దుఃఖపెట్టువారి నాయజమానుఁడు దండింపకుండిన నతని సేవకులనెవరైనను దుఃఖపెట్టుదురు. కావున జయ విజయుల గౌరవించి సనకాదులకుఁ దగిన దండనవిధించుట యే నారాయణున కుచితమై యుండెను. ఏలయనఁగా సనకాదులు లోనికిఁబోవుటకును హఠమేల చేసిరి? సేవకులతో నెందులకు కలహించిరి? శాపమిచ్చినందులకా సనకాదులను భూమిని బడవైచుట నారాయణునకు న్యాయమేగదా? నారాయణునియందట్టి యన్యాయమున్న వైష్ణవులగు నతని సేవకు లెంతదుర్దశ నొందినను గొదువయే యనవచ్చునుగద. పిమ్మట నా జయవిజయులు హిరణ్యాక్ష హిరణ్యకశిపులై పుట్టిరి. వారిలో హిరణ్యాక్షుని వరాహము చంపెను. ఎట్లన వాఁడు భూమిని చాఁపఁగాఁ జుట్టి, తలగడగా నుంచుకొని నిద్రించుచుండఁగా విష్ణువు వరాహ రూపముదాల్చి వాని తలక్రిందనుండిన భూమిని దన కోఱల నెత్తిపట్టుకొనెను. అప్పుడా హిరణ్యాక్షుఁడు నిద్రనుండి మేలుకువ చెంది లేవఁగా వారిరువురకును ఘోరయుద్ధము జరిగెను. ఆయుద్ధమున వరాహుఁడు వానిని జంపివేసెను; అని వ్రాయఁబడి యున్నది. భూమిగుండ్రముగా నున్నదా లేక చాపవలెనున్నదా? అని వీరి నెవరైన నడిగిన నోరెత్త కూరకుందురు. ఏలయనఁగా పౌరాణికులు భూగోళవిద్యకు గర్భశత్రువులు. పోనీ. వాఁడట్లుచుట్టి తలక్రిందఁబెట్టుకొని దేనిమీదఁబరుండి నిద్రపోయెను? మఱి వరా

హుఁడు దేనిమీఁద నడుగులపెట్టి పరుగెత్తికొని వచ్చెను? భూమిని వరాహుఁడు తన కోఱలమీఁదఁ బెట్టుకొనెనన్న వాఁడువురుసు దేనిమీఁద నిలిచి యుద్ధము చేసిరి? అక్కడఁ దిరుగుటకు మఱియేస్థలము లేదు కాని భాగవతాదులను రచించిన పోపుల మొదలమీఁద నిలిచి యుద్ధము చేసియుండవచ్చునని తోఁచుచున్నది. ఇఁక దీనివ్రాసిన పోపుగా రెచ్చటబరుండి యుండిరో తెలియకున్నది. ఇది ఒక వదరుఁబోతు మఱియొక వదరుఁబోతు నింటికివెళ్ళి వదరినట్లున్నది. ఒక వదరుఁబోతు నింటికి మఱియొక యసత్యవాది వచ్చి, కూర్చుండిన నిట్టివృథాలాపములకు నేమి కొదువ?

ఇక మిగిలిన హిరణ్యకశిపుడనువానికిఁ బ్రహ్లాదుఁడను నొక కొమారుఁడుండెను. ఆ బాలకుఁడు భక్తుఁడై యుండెను. చదువుకొనుటకు వానితండ్రి వానిని పాఠశాలకుఁ బంపుచుండెను. అపుడు వాఁడు తన పలక మీఁద 'రామ రామ: రామ రామ 'యని వ్రాసియిమ్మని తన యధ్యాపకుల నడుగుచుండెను. ఈమాట వానితండ్రి విని నీవు నాశత్రువు నేల భజించుచున్నావని వాని నడిగెను. కాని తండ్రిమాటను వాఁడొప్పుకొనలేదు; కాన వానితండ్రి వానిని బంధించి పర్వతము మీదినుండి దొరలించెను. బావులలో ముంచెను. కాని వానికేమియు కలుగలేదు. ఒక యినుప స్తంభమును లెస్సఁగగాల్చి యతనితో "నీయిష్టదైవమగు రాముఁడు సత్యమైనచో నీవు దీనిని పట్టుకొన్నచో కాలదు. ప్రహ్లాదుఁడు పట్టుకొనఁదలంచెను.కాని పట్టుకొన్నచో కాలునేమోయని మనస్సు శంకించెను. నారాయణుఁడు ఆ స్తంభముమీఁద చిన్నచిన్న చీమలబారులు నడిపించెను. అతనికి నమ్మకము కుదిరివెంటనే వెళ్ళి దానిని పట్టుకొనెను. అది పటాలున బ్రద్దలయ్యెను. దానినుండి నృసింహుఁడు బయలువెడలి యతనితండ్రిని పొదవి పట్టుకొని పొట్ట బ్రద్దలగునట్లు చీల్చెను. తరువాత ప్రహ్లాదునిఁబట్టుకొని ప్రేమతో నాకుచు "నీకు కావలసిన వరము కోరుకొ"మ్మని పలికెను. అతఁడు తన తండ్రికి సద్గతి కలుగుఁగాక యని కోరెను. "నీయిరువదియొక్క తరములవారు సద్గతి నొందిర"ని నృసింహుఁడు వరమిచ్చెను.

చూడుఁడు. తక్కిన గప్పాలకిదియు దీసిపోదు. భాగవతమును చదువువానినిగాని,ఆలకించువానినిగాని పైనుండి క్రిందికిపడవైచినచో తుత్తునియలయి చచ్చునుగాని రక్షించువాఁ డెవ్వఁడు నుండఁడు. హిరణ్యకశిపుఁడు ప్రహ్లాదుని

చదువుకొనుటకుఁ బంపెను. ఇందుదోషమేమి? కాని ప్రహ్లాదుఁడు చదువు మాని బైరాగి కాఁదలఁచుచుండెను. కాలుచున్న స్తంభముమీఁద చీమలబారు నడిచినదనియు, ప్రహ్లాదుఁడుపట్టుకొన్నను కాలలేదనియు నమ్మువానిని బట్టు కొని ఆ స్తంభమునకు కట్టివేయవలయును. వీరు కాలకున్నచో వారును కాలలేదన్నమాట! నృసింహుఁడు గూడ నేల కాలియుండఁడు!

మూఁడవ జన్మమున తిరిగి వైకుంఠమునకు రావలయునని సనకాదులకు వరముండెనుగదా! దానిని మీ నారాయణుఁడు మఱచెనా యేమి? భాగవతము ననుసరించి బ్రహ్మ, ప్రజాపతి, కశ్యపుఁడు తరువాత హిరణ్యాక్ష, హిరణ్యకశిపులు గనుక వీరు నాలుగవతరములోని వారు గదా! మఱి యిఱువది యొక్క తరములవారు సద్గతినొందిరని నృసింహుఁగనుట మిక్కిలి పొరపాటు కదా!

ఈ హిరణ్యాక్ష హిరణ్యకశిపులే రావణ కుంభకర్ణులు గాను, శిశుపాల దంతవక్త్రులుగాను సుద్భవించిరందురుగదా! అటులయిన నృసింహుని వర మెక్కడి కెగిరిపోయినది? ప్రమాదశీలు రిట్టి పొఱపాటులు చేయుచుందురు. వినుచుందురు. నమ్ముచుందురు. కాని విద్వాంసులు కాదు. మఱియు:-

రథేన వాయువేగేన.........॥భాగవ ౧౦.౩౯.౩౮॥
జగామ గోకులం ప్రతి......॥భాగవ. ౧౦.౩౮.౧౪॥

అక్రూరుఁడు కంసునిపంపున వాయువేగముతో బరుగిడు. తురగముల పూన్చిన రథముమీఁద నధిరోహించి సూర్యోదయకాలమున బయలు వెడలి నాలుగుమైళ్ల దూరమునఁగల గోకులమునకు సూర్యాస్తమయమునకుఁ జేరెనఁట. ఈ గుఱ్ఱములు భాగవతకర్తచుట్టు ప్రదక్షిణము చేయుచుండెనా? లేక త్రోవదప్పిన నక్రూరసారథి గుఱ్ఱములు భాగవతకర్త యింటిలోఁజేరి గుఱ్ఱపు పెట్టి యుండురా?

పూతన దేహము ఆఱుక్రోసుల వెడల్పు. పొడవు అపరిమితము. అట్టి దానిని చంపి శ్రీకృష్ణుఁడు మథురా గోకులములనడుమఁ బడవైచెను. అది నిజమైనచో నా రెండుగ్రామములు ఈ పోషు గృహములోఁ గూడ నణఁగి పోయియుండును.

అజామీళుని కథ వికృతముగ వ్రాయఁబడియున్నది. నారదుని ప్రేరణ వలన తనకుమారునికి నారాయణుఁడని పేరు పెట్టెను. ప్రాణములువిడుచు నపుడు తనకుమారుని పిలిచెను. ఈనడుమ నారాయణుఁడువచ్చి దుమికెను. అజామీళుఁడు తన పుత్రునిఁ బిలుచున్నాఁడుగాని తన్ను గాదని నారాయణునికిఁ దెలియదా? నామమాహాత్మ్య మిట్టిదై నచో నిప్పుడుకూడ నారాయణునిస్మరించు వారి దుఃఖములు తొలఁగింప నేలరాఁడు? ఈ మాట సత్యమైనచో 'నారాయణ' యని స్మరించు కారాగార బద్ధుల నేలవిడిపింపఁడు?

జ్యోతిశ్శాస్త్రవిరుద్ధముగా సుమేరుపర్వత పరిమాణ మిట్టులే భాగవత మున విపరీతముగ వ్రాయబడినది. ప్రియవ్రతమహారాజు రథచక్రముల గాడి వలన సముద్రములై నవఁట! భూమి నలువదితొమ్మిది కోట్ల యోజనముల పరిమాణము గలదఁట! ఇట్టియసత్యవిషయములు భాగవతముననిండియున్నవి. వీని కంతు పొంతు లేదు.

గీతగోవిందము రచియించిన జయదేవునిసోదరుఁడగు బోపదేవుఁడు ఈ భాగవతము రచించెను. తాను రచించిన "హిమాద్రి"అనుగ్రంథమున శ్రీమద్భా గవతపురాణమును తాను రచించినట్లు రెండు శ్లోకములు చెప్పుకొనెను. ఆగ్రం థమునందలి మూడుపత్రములు మా యొద్దనున్నవి. వానిలో నొకటి పోయి నది. అందలి శ్లోకముల భావములో రెండుశ్లోకములు వ్రాసి క్రింద నుదాహ రించితిమి. చూడఁదలఁచినవారు "హిమాద్రి"ని చూడదగును.

శ్లో॥ హిమాద్రేః సచివస్యార్థే సూచనా క్రియతేఽధునా
స్కంధాధ్యాయ కథానాం చ యత్ప్రమాణం సమాసతః ॥౧॥
శ్రీమద్భాగవతం నామ పురాణం చ మయేరితమ్ ।
విదుషా బోపదేవేన శ్రీకృష్ణస్య యశోఽన్వితమ్॥ ౨॥

పోయిన పత్రమునందలి శ్లోకము లిట్టివి.

రాజమంత్రి-హిమాద్రియనువాఁడు - బోపదేవుపండితునితో బలికెను. "నాకు శ్రీమద్భాగవతము సంపూర్ణముగా వినవలెనని యున్నది కాని యవ కాశములేదు; కావున సంక్షిప్తముగ-శ్లోకరూపముగ-విషయసూచికను రచిం పుము. దానిని జూచి శ్రీమద్భాగవత కథను దెలిసికొందును" అనఁగా నీ క్రింది సూచీపత్రమును బోపదేవుఁడురచియించెను. పోయిన పత్రమునుండి తొమ్మిది

శ్లోకములిందుఁ జేర్పనయితిగాలేదు. పదునొకంటవ శ్లోకమునుండి యీయఁబడి నవి. ఇవియన్నియు బోపదేవునివే—

శ్లో॥ బోధయంతీతి హి ప్రాహుః శ్రీమద్భాగవతం పునః।
పంచ ప్రశ్నాః శౌనకస్య సూతస్యాత్రోత్తరం త్రిషు॥ ౧౦॥
ప్రశ్నౌ పరాకయోర్వ్యాసస్య నిర్వృతిః కృతాత్ ।
నారదస్యాత్ర హేతూక్తిః ప్రతీత్యర్థం స్వజన్మ చ ॥ ౧౧॥
సుప్తఘ్నం ద్రౌణ్యభిభవస్తదస్త్రాత్పాండవావనమ్ ।
భీష్మస్య స్వపదప్రాప్తిః కృష్ణస్య ద్వారకాగమః॥ ౧౨॥
శ్రోతుః పరీక్షితో జన్మ ధృతరాష్ట్రస్య నిర్గమః।
కృష్ణమర్త్యత్యాగసూచా తతః పార్థమహాపథః॥ ౧౩॥
భూధర్మయోః కలేర్భీతి స్తతస్త్రాణం పరీక్షితా
పరీక్షితో బ్రహ్మశాపః ప్రాయోపేశః శుకసంగమః॥ ౧౪॥
ఇత్యష్టాదశభిః పాదైః అధ్యాయార్థః క్రమాత్స్మృతః।
స్వపర ప్రతిబంధోనం స్ఫీతం రాజ్యం జహౌ నృపః॥ ౧౫॥
ఇతి వై రాజ్ఞే దార్ఢ్యోక్త్యా ప్రోక్తా ద్రౌణిజయాదయః॥ ౧౬॥
ఇతి ప్రథమః స్కంధః ౧॥

ఇట్లు ద్వాదశస్కంధములకు బోపదేవుఁడు సూచీపత్రము రచియించి హేమాద్రీ మంత్రి కంకితమిచ్చెను. సవిస్తరముగాఁ జూడఁగోరుచో నాగ్రంథ మును జూడవచ్చును. తక్కిన పురాణముల లీలలు నిట్లే యొకదాని నొకటి మీఱియున్నవి. చూరుడు—

శ్రీకృష్ణుని యితిహాసము మహాభారతమున నత్యుత్తమముగానున్నది. అతని గుణకర్మ స్వభావములు చరిత్ర ఆప్తపురుషునివంటివి. శ్రీకృష్ణుఁడుపుట్టి నదిమొదలు గిట్టుదాఁక నేయధర్మకార్యమును చేసినట్లు అందుఁ గానరాదు. ఈ భాగవతకారుఁ డనుచితముగ-ఇచ్చవచ్చినట్లు-దోషముల నారోపించినాఁడు. పాలు పెరుగు, వెన్నమీగడల దొంగతనము చేసినాఁడనియు, కుబ్జ దాసితో వ్యభిచరించినాఁడనియు, పరస్త్రీలతో రాసమండలమునఁ గ్రీడించినాఁడనియు నిటువంటి పెక్కియో లేనిపోని నిందలు శ్రీకృష్ణునియం దారోపింపఁబడినవి. దానిని జదివియుఁ జదివించియు, వినియు వినిపించియు నన్య మతములవారు శ్రీకృష్ణుని ననేక విధముల నిందించుచున్నారు. ఈ భాగవతమే వ్రాయఁబడక

౬. శుక్రమంథినః (శుక్రుని మంత్రము) యజు. ౧౮. ౨౦
౭. శన్నో దేవీ రభిష్టయః (శని మంత్రము) యజు. ౩౬. ౧౨
౮. కయా నశ్చిత్ర ఆభువత్ (రాహు మంత్రము) యజు. ౨౭. ౩౯
౯. కేతుం కృణ్వన్న కేతవే (కేతు మంత్రము) యజు. ౨౯. ౩౭

(౧) (ఆ కృష్ణేన) ఈ మంత్రము భూమిదినకరుల యాకర్షణమును. (౨)రాజుల గుణములును. (౩) అగ్నిని. (౪)యజమానుని. (౫) విద్వాంసులను. (౬)వీర్యమును అన్నమును. (౭) జలమును, ప్రాణమును.పరమేశ్వరుని. (౮) మిత్రుని. (౯) జ్ఞానగ్రహణ విధాయకమును బోధించు మంత్రములే కాని యివి గ్రహవాచకములు-గ్రహముల బోధించునవికావు. వీనియర్థమును దెలిసికొనలేక భ్రమజాలమునఁ బడియున్నారు.

ప్రశ్న:--గ్రహములఫలము కలుగునా లేదా?

ఉత్తరము:--పోపులు కల్పించునటువంటి ఫలము కలుగదు. కానిసూర్య చంద్రుల కిరణములద్వారాఁ గలుగు నుష్ణశీతలములు, ఋతుకాలముల ననుసరించి మన ప్రకృతుల కనుకూలములును, ప్రతికూలములును నగుటఁబట్టి సుఖదుఃఖములకుఁ గారణము లగుటమాత్రము నిక్కము. ఇఁక పోపులుచెప్పు మాటల నాలకింపుఁడు: "ఓ మహారాజా! ఓసాహుకారా! నేఁడు మీకు చంద్రుఁడష్టమమున నున్నాఁడు. సూర్యాదులు క్రూరగృహములందుఁ గలరు. పాదములందు కని రెండున్నఱ సంవత్సరము లుందురు.మీరు చేయు పనులందు విఘ్నములు కలుగుచుండును. ఇల్లు వాకిలి వదలి పరదేశమునఁ దిరుగఁజేయును. కావున గ్రహములకు దానమో, జపమో,పూజయో శాంతియో చేయించినయెడలదుఃఖమునుండి దూరమగుదు"రని చెప్పుదురు. అప్పుడు వానిని పోపుగారూ! మీకును గ్రహములకు నేమి సంబంధము? గ్రహ మేమివస్తువు?అనియడుగవలయును.

పోపు:-- దైవాధీనం జగత్సర్వం మంత్రాధీనాశ్చ దేవతాః।
తే మంత్రా బ్రాహ్మణాధీనా స్తస్మాద్ బ్రాహ్మణ దైవతమ్ ॥

చూడుఁ డెట్టిప్రమాణ మున్నదో! జగత్తు దేవతలయధీనము. దేవతలు మంత్రముల యధీనము.ఆ మంత్రములుబ్రాహ్మణులయధీనములైయున్నవి. కావున బ్రాహ్మణులు దేవతలని చెప్పఁబడుదురు. ఏలయనఁగా నేదేవతనైనను మంత్రబలముచేత రప్పించి, సంతోషింపఁ జేసి కార్యము సిద్ధింపఁజేయు నది

కారము మాకుఁగలదు. మాయందు మంత్రశక్తియే లేకపోయిన మీవంటి నాస్తికులమమ్ముల నీ ప్రపంచమున నుండనీకపోదు

సత్యవాది:- చోరులు బందిపోటుదొంగలు, దుర్మార్గులు అనువారుగూడ మీ దేవతల కధీనమైయుండవచ్చును! దేవతలే వారిచేత దుష్కార్యములను జేయించుచుండవచ్చును: అటులయిన మీ దేవతలకును, రాక్షసులకును భేద మేమియు నుండదుగద. మంత్రములు మీ యధీనములేని వానివలన మీరు కోరినవన్నియుఁ జేయఁజాలుదురేని, ఆ మంత్రములచేత దేవతలనువశపఱచు కొని, రాజుల ధనాగారముల నెత్తించుకొనివెళ్ళి మీయిండ్లలో నుంచుకొని హాయిగా నింటఁగూర్చుండి యానందమునేల యనుభవింపరు? శనైశ్చరాదుల పేరుచెప్పి నూనెమొదలగు ఛాయాదానములకొఱకింటింటికేల దిరుగుచున్నారు? కుబేరుఁడని మీ రెవనిని నమ్ముచున్నారో వానిని వశముచేసికొని మీకుఁ గావలసినంతధనమును రాఁబట్టుకొన వచ్చునే. పాపము! బీదల నేల దోఁచుకొను చున్నారు? మీకు దానమిచ్చుటవలన గ్రహములు ప్రసన్నమగుటయు నీయకున్న నప్రసన్నమగుటయు నిజమేని మాకు సూర్యాది గ్రహముల ప్రసన్నతా ప్రసన్నతలు ప్రత్యక్షము గాఁజూపుఁడు. ఒకనికి సూర్యుఁడో చంద్రుఁడో యెనిమిదవ యింట, మఱియొకనికి మూఁడవయింటనున్న నా యిరువురను జ్యేష్ఠ మాసమునఁ బాదరక్షలు లేకుండ గాలియున్న భూమిమీఁదనడిపింపుడు. ఆగ్రహ మెవనిమీదఁ బ్రసన్నమైయుండునో వాని గాళ్ళు బొబ్బలును గాలకపోవలయును. క్రూర నెవనిమీద గ్రూరమైయుండునో వానికి కాలిపోవలయును. అటులే యిరువుర దిగంబరులఁజేసి పుష్యమాసముఁ బున్నమనాఁటి రాత్రియంతయు బయలులోనుంచిన వారిలో నొకనికిజలుబుచేసి మఱియొకనికిఁ జేయకున్నగ్రహముల దృష్టి క్రూరముగ, సౌమ్యముగ నున్నదనినమ్మవచ్చును గ్రహములు మీబంధువులా యేమి? మీజాబులు, తంతివార్తలువానియొద్దకుఁబోవుచువచ్చుచుండునా? లేదా మీరు వానియొద్దకుఁగాని అవి మీ యొద్దకుఁగాని వచ్చుచుఁ బోవుచునున్నవా? మీయందు మంత్రశక్తియే యుండిన మీరు స్వయముగా రాజులుగాని లేక ధనాఢ్యులుగాని యేలకారు? మఱి శత్రువులనైనను మీ వశముచేసికొనియుండ రేల? వేదేశ్వరుల యాజ్ఞల నతిక్రమించి, వేదవిరుద్ధములైన మిథ్యాతంత్ర ములను నమ్మువారే నాస్తికులనఁబడుచున్నారు. మీకు గ్రహదాన మియ్యక,

గ్రహ మెవనిమీద నున్నదో వాఁడే యాగ్రహదాన మనుభవించినదోషమేమి? 'అట్లుకాదు, మాకిచ్చిన గ్రహము పరిసన్నమగునేకాని ఇతరులకిచ్చిన ప్రసన్న ముగాదందురేని. మీ రాగ్రహములను గుత్తతీసికొని యున్నారా యేమి?అట్లా యినచో సూర్యాదిగ్రహముల మీయిండ్లకు బిలువనంపుకొని కాలిపావుఁడు,యథా ర్థమేమన, సూర్యాది లోకములు జడములు. అవియొకరికి సుఖముకాని,దుఃఖ ముకాని కలిగింపనేరవు. గ్రహదానమునవలన జీవించు మీరందఱును వాని విగ్ర హము లయియున్నారు. ఏలయనఁగా, 'యేగృహ్ణంతి తేగ్రహాః' అనఁగా నెవరు గ్రహణము చేయుదురో వారే గ్రహము లనఁబడెదరు. కానగ్రహార్థమిదియం దొప్పియున్నది. ఎంతవఱకు మీపాదములు గాఁపులు, వర్తకులు,ధనవంతులు, దరిద్రులు మొదలగువారి యిండ్లనుఁ బవిత్రమొనరింపవో యంతవఱకువారి కెవ్వరికిని నవగ్రహములు స్మరణకుకూడ రావు. సాక్షాత్తుగా మూర్తిమంతులగు మీరే రవి శన్యాది క్రూరరూపములు ధరించి వారి నావహించి గ్రహణము చేయక వారి నెన్నటికివదలరు. మీకు లొంగని వారిని, నాస్తికాది నామము లలో నిందించుచు సంచరించుచు నున్నారు.

పోపుగారు:-జ్యోతిష ప్రత్యక్షఫలమునుఁ గనుఁడు! ఆకాశము నందుండు దినకరేందులతో రాహు కేతువుల సంయోగమువలనఁ గలుగు గ్రహణములను అవి రాకమునుపే చెప్పుచున్నాము. ఇదియెట్లు ప్రత్యక్షమో యట్లే గ్రహఫలము గూడఁ బ్రత్యక్ష మగుచున్నది. ధనాఢ్యులు, దరిద్రులు రాజులు, సేవకులు, సుఖులు,దుఃఖులు గ్రహముల చేతనే యగుచున్నారు.

సత్యవాది:- ఈ గ్రహణమను ప్రత్యక్షఫలము గణితవిద్యకుఁ జేరినది కాని ఫలితమునకుఁగాదు. గణితవిద్య సత్యమైనది. కాని, ఫలిత విద్య స్వాభా వికసంబంధజన్యము తప్ప తక్కినదంతయు ననత్యమే. అనులోమ ప్రతిలోమ ముగాఁ దిరుగు పృథ్వీ చంద్రుల గతుల గణితమును బట్టి ఫలానా సమయ మున ఫలానా దేశమున ఫలానాయవయవమున సూర్య చంద్రుల గ్రహణము కలుగుచున్నది.

ఛాదయత్యర్కమిందుర్విధుం భూమిభాః ॥ గ్రహలాఘవము. అ. ౪.శ్లో.౪ ॥

ఇది సిద్ధాంతశిరోమణిలోని వచనము. మఱియు నిదేరీతిని సూర్య సిద్ధాంతమునగూడ నున్నది. అనఁగా సూర్యునకును భూమికిని మధ్యఁ

జంద్రుఁడు వచ్చినపుడు సూర్య గ్రహణమును, సూర్యునకు జంద్రునకును నడుమ భూమివచ్చినపుడు చంద్రగ్రహణమును నగును. అనఁగాఁ జంద్రుని మీఁద భూమి మీఁదను భూమిమీఁద చంద్రుని మీఁదను బడును. సూర్యుఁడు ప్రకాశ స్వరూపుఁడు కావున నతనిమీఁద దేని నీడయుఁబడదు. ప్రకాశమానమైన సూర్యునకుఁ గాని దీపమునకుఁగాని నెదురైన దేహాదులనీడ సూర్యదీపముల కభిముఖముగాఁబడి గ్రహణములు కలుగునని తెలియవలయును. ధనాఢ్యులు, దరిద్రులు, రాజులు, ప్రజలు, వీరలు ముఖ్యగువారు తమతమ కర్మములనుబట్టి యట్లగుచున్నారు. కాని గ్రహప్రభావమునఁగాదు. అనేక జ్యోతిష్కులు తమ పుత్రులయుఁ బుత్రికలయు వివాహములను గ్రహగణిత విద్యానుసారముగ చేయుచున్నారే! ఆ దంపతులందు విరోధము పుట్టుటయు, పతిగతించి స్త్రీ విధవయగుటయు, సతిగతించి పురుషుఁడు మృతస్త్రీకుఁడగుటయుమనముచూచుచున్నాముకదాఃఅపులమేనిశ్చయమైన నిట్లెందుల కగుచున్నదిః కావునఁ గర్మగతియే సత్యముకాని, గ్రహగతి సుఖదుఃఖభోగములకుఁ గారణముకాదు. గ్రహములు, భూమియు నాకాశమునఁ నేయొకటి కొకటి యెంతో దూరమున నున్నవి. ఆ గ్రహములకు భూమి మీఁదనున్న కర్తతోఁగాని వానికర్మముతో గాని సాక్షాత్సంబంధములేదు. కర్మము చేయువాఁడును గర్మఫలము ననుభవించు వాఁడును జీవుఁడు. మఱి కర్మఫలము ననుభవింపఁ జేయువాఁడు పరమాత్ముఁడు. గ్రహముల ఫలముఁ మీరు నిజమందురేని దీనికి బ్రత్యుత్తరమిందు. ఒక మనుష్యుఁడు పుట్టిన కాలమున మీరు ధ్రువపత్రికయని వ్రాసి కుండలివేయుకాలమున భూమిమీఁద మఱియొకఁడు పుట్టుచున్నాడా లేదాః లేదనిచెప్పితిరా యది యబద్ధమగును. పుట్టుచున్నాఁడంటిరా, ప్రపంచమునందొక చక్రవర్తి-రాజువలె మఱియొక చక్రవర్తి-రాజు కలుగుటలేదెందులకు ; సరే ; మీరు మీ యుదరపోషణకొఱకీ యాటలాడుచున్నామనిన నెవఁడేని సమ్మతింపవచ్చును.

ప్రశ్న:- గరుడపురాణము[illegible] యేమి ?

ఉత్తరము:- అవును అసత్యమే.

ప్రశ్న:- అట్లైన మృతినొందిన జీవునిగతి యేమగును ?

ఉత్తరము:- వానికర్మ[illegible] యట్లగును.

ప్రశ్న:- యముడనువాడు రాజు. అతనిమంత్రి చిత్రగుప్తుడు. మహా భయంకరముగ కాటుకవంటి నల్లకొండలతో సమానమైన శరీరములు కల యతని కింకరగణము జీవులనుబట్టికొనిపోయి వారి పాప పుణ్యానుసారము వారిని నరకమునకో స్వర్గమునకో వేయుదురు. అందులకే దానము, పుణ్యము, శ్రాద్ధము, తర్పణము, వైతరణీనదిని దాటుటకు గో దానాదులను జేయుచున్నారు ఈమాట లన్నియు నబద్ధము లెట్లగును?

ఉత్తరము:- ఈ మాటలన్నియు పోపుల గప్పాలు. ఇతర స్థలముల నుండి జీవులక్కడికి బోవుచున్నారనియు యమరాజు చిత్రగుప్తుడు మొదలగు వారు విమర్శించి తీర్పు చేయుచున్నారనియు నన్న నా యమలోకమందలి జీవులు పాపమొనర్చిరేని న్యాయ వ్యవస్థచేయుట కితర న్యాయాధికులను, వేరొక యమలోకమునను నమ్మవలసివచ్చునుగదా! ఇంక యమకింకరుల శరీరము కొండలతో సమానముగ నున్నవన్న నగపడవెందులకు? మఱి వారి వ్రేలయినను బట్టని యీ గృహములలోనికిరాలేక వీథులలోను సందులలోను వారెందుల కాగిపోరు? ఒకవేళ వారుసూక్ష్మదేహములను ధరించి వత్తురన్న, బర్వతసమానములైన వారి గొప్పగొప్ప కళేబరములను పోపులు తమ యిండ్లలోఁ గాక మఱెచోట నుంచగలరు? అడవికి నిప్పంటుకొని యొకేసారి పిపీలికాది జీవములు శరీరములు వీడగా వానిఁ గొనిపోవుటకు లెక్కలేని యమకింకరు లేతెంచిన నా చోటంతయు జీకటితోఁ గ్రమ్ముకొని పోవలసినదే! ఇక జీవులను బట్టుకొనిపోవుటకుఁ బరుగులిడునప్పుడు వారి శరీరము లొకటితో నొకటి డీకొనుటచే నున్నతమైన పర్వతశిఖరములు నేలఁగూలినట్లు వారి గొప్ప శరీరావయవము లా గరుడపురాణమును జదువువారియు, వినువారియు నంగణములలో బడి వారందఱును నలిగి చావవలసినదే కదా! ఇక నిండ్ల ద్వారములందును, వీధులందునుగూడ నెగమే లేకపోవును. అట్లయిన వారెట్లు వెడలఁగలుగుదురు. మఱి యెట్లు నడువఁగలరు! అట్లే చేయఁబడు శ్రాద్ధము, తర్పణము, పిండప్రదానము ఆ చచ్చినజీవుల కందవుగాని. వారి ప్రతినిధులుగానున్న పోపుల యిండ్లలోను, బొట్టలలోను, జేతులలోను బోయిపడును. వైతరణీ తరణమునకై తీసికొన్న గోదానము పోపుగారి యింటికో లేదా కటికవానియింటికో చేరును. ఇంక నా గోవే వైతరణికేగదు గావున దేని తోఁకబట్టుకొని దాఁట

గదరా: చేతుల నిక్కడనే కాల్చియో లేదా పూడ్చియో పెట్టితిరికదా: మరల నా జీవులు వేనితో దానిఁ బట్టుకొనఁ గలరు: ఈ విషయమున నొకదృష్టాంతమిట మిగుల నుపయుక్తముగా నున్నయది. అదెట్లనిన:-

ఒకచోట నొక కాపువాఁడుండెను. వాని యింట నిఱువదిసేర్లపాలిచ్చు మంచియావొకటియుండెను దాని పాలు మిక్కిలిమధురమయినవి. అవి పురోహితునినోట నపుడపుడు పడుచుండెను. ఆ కాఁపువాని తండ్రి మృతినొందు కాలమున నా యావునే సంకల్పముచేయించి తాఁదీసికొనవలెనని యా పురోహితుఁడు నిశ్చయించుకొని యుండెను. కొన్నిదినములలోనే దైవయోగమున వానితండ్రికి మరణకాల మాసన్నమై నోరు మూఁతపడెను. వానిని మంచము మీద నుండి తీసి భూమిపయి పరుండఁబెట్టిరి. అనఁగా జీవాంతదశ కలిగెను. ఆసమయమున వానిని యిష్టమిత్రులు బంధువులు విచ్చేసియుండఁ బోపుగారు దిగ్గరగా "యజమానీ: ఇపు డీతనిచేత గోదానము చేయింపుమా" యనెను. కాఁపు పదిరూప్యములు దండ్రిచేతఁబెట్టి, యా పురోహితునితో సంకల్పము చెప్పుమనెను. అపుడా బోపుగారు సరి: సరి: మీతండ్రి మాటిమాటికిఁ జెప్పినా: ఈ సమయమునఁ బాలిచ్చునది, వయసుది, అన్నివిధములను త్తమమయినదియు నగు గోవునే దానము చేయవలసినది. అని యా కాఁపుతో ననెను అందున కాకాఁపు మాయొద్దనున్నది యొకటేయావు, అదికూడ లేకయిపోయిన మా పిల్లలను కుటుంబమును నిర్వహించుట కష్టము. గాన దాని నీయను. ఇదిగో: ఈ యిఱువది రూపాయలు తీసికొని సంకల్పము చదువుడు. ఈ రూపాయలతోఁ బాలిచ్చు నావును గొనవచ్చుననెను దానికి బోపుగారు, సెబాస్: సెబాస్: నీవు నీ జనకునికంటె నీగోవునే యెక్కువనుకొనుచున్నావు కదా: నీ తండ్రిని వైతరణీ నదిలోఁ బడవేసి దుఃఖ మొదవఁ జేయవలెననియా నీతలంపు: నీవు సుపుత్రుఁడవే యని బదులుచెప్పెను. అంత నా కాఁపువాని బంధువులందఱు నేకమయి బోపుగారి మాటను బలపఱచిరి. ఏలన, నాఁతండంతకుముందే వారలందఱతోఁ జెప్పియుండెను. అప్పుడును సైగచేసెను. కాన వారందఱును బట్టుపట్టి యా యావునే యాతనికిప్పించిరి. కాపున కాఁపేమనక యుండెను. అంతలో వాని తండ్రి గతించెను. పురోహితుఁడు దూడతోను, పాలుపిండి పాత్రతోను నావును దనయింటికిఁ గొనిపోయి దాని నచటఁగట్టియుంచి, మరల యజమానికడకు

వచ్చి, శవము వెంట శ్మశానమున కరిగి దహనకర్మమును జేయించి, దక్షిణం పేరుపెట్టి కొంతరబ్బు వాఁతవేసికొనెను పిమ్మట దశగాత్రసపిండీకరణాదులు చేయించుటలో కూడ వానిని క్షౌరము చేసెను ఇఁక మహాబ్రాహ్మణులును, భిక్షుకులును నాతనితోఁజేరి యా కాఁపును బాగుగా దోఁచికొని పోపుగారును దమ పొట్ట నింపుకొనిరి ఈ యపరక్రియలు ముగియుసందాక పొరుగు వారి యిండ్లకుఁబోయి పాలుదెచ్చుకొనుచు గాఁపు దనయింటివని జరుపుకొను చుండెను, గాని పదునాల్గవనాఁ డువయమునసే లేచి పోపుగారింటికి బోయి చూడ నప్పుడే పోపుగారు పాలుపిండుట ముగిసి సేవ సిద్ధముగా నుండిరి. కాఁపు వచ్చుటచూచి "యజమానులుగారు: లోనికి దయచేయుఁడు కూర్చుం డుఁడు" అని యుపచారము చేసెను.

కాఁపు:— పురోహితులుగారూ: మీరే యిచ్చటికి రండు.

పోపు:— మంచిది పాలు లోనఁబెట్టి వచ్చెదను.

కాపు:— వలదు, వలదు, పాలపాత్రగూడ నిచ్చటికే కొనిరండు.

పోపు:— (వీని యప్లే పోయి కూర్చుండి) యా పాలపాత్రను నతవి యెదుటఁ బెట్టెను.

కాఁపు:— మీరు మహా వంచకులయ్యా!

పోపు:— నేను జేసిన వంచన యేమి?

కాఁపు:— అవును మీరేల రిసికొంటిరో చెప్పుడు.

పోపు:—మీ తండ్రిని వైతరణీనదిని దాఁటించుటకొఱకే కద?

కాఁపు:— అట్లయిన మీరావును వైతరణీ వద్దున కేల చేర్పలేదు? మేము మీ మీఁద భారమువేసియుండఁగా మీరు దానిని దెచ్చి మీయింటఁ గట్టివేచుకొంటిరే: మా తండ్రి వైతరణీ నదిలోబడి యెన్ని మునుకలు వేసి నాఁడో తెలియదు కద?

పోపు:— లేదు లేదచ్చట నీ దాన పుణ్యప్రభావము వలన నొక యావువచ్చి యాయన నొడ్డుకుఁ జేర్చియుండును.

కాఁపు:— వైతరణీనది యిచ్చటి కెంతదూరము? అది యే వైపున నున్నది?

పోపు:— తమారమి ముప్పదికోట్ల కోసుల దూరము. (ఏలయనఁగా నలువది తొమ్మిదికోట్ల యోజనముల భూమియే యున్నది) ఇక దక్షిణ నైఋత్యదిక్కున యా వైతరణీనది యున్నది.

కాఁపు:— అంతదూరము మీరు పంపినజాబో తంతివార్తయో పోయి, యచ్చట పుణ్యఫలమువలన నావు వచ్చి ఫలానావాని తండ్రి నొద్దునకుఁ జేర్చి నదని ప్రత్యుత్తరము వచ్చియుండినఁ జూపుఁడు.

పోపు:— మాయొద్ద గరుడపురాణములోని లేఖతప్పఁ దక్కిన టపాలు తంతివర్తమానము లేవియు లేవు.

కాఁపు:— మేమీ గరుడపురాణమును సత్యమని యెట్లు నమ్మవలయును?

పోపు:— అందఱెట్లు నమ్ముచున్నారో యట్లే.

కాఁపు:— ఈ పుస్తకమును మీ పూర్వులే మీ జీవికార్థము కల్పించినారు. ఏలయనగా దండ్రికిఁ దన కుమారుని కంటె నెక్కువ ప్రీతిపాత్రుఁడు మఱి యొక్కఁ డుండఁడు. మా తండ్రి నాయొద్దకు జాబునో తంతివార్తనో పంపిన తక్షణమే వైతరణీ నదియొద్దున నావునుజేర్చి, యాయనను దాటించి, మఱల నా యావును దెచ్చి మా యింటిలోఁబెట్టుకొని, నేనును పిల్లలును దానిపాల ద్రాగుచుందుము. ఇందు! అని పాలతో నిండియున్నపాత్రను, ఆవును దూడను దీసికొని తనయింటికిఁ దోవఁబట్టెను.

పోపు:—దానముచేసినదానిని మరలఁ దీసికొనుచున్నావే. నీవు నిర్మూలమయి పోదువు.

కాఁపు:—నోరుమూయుము. లేకున్నఁ బదమూఁడు దినములవఱకు నీవు తీసికొన్నపాలదే కాదు. ఈ మధ్యమేముపడిన పాట్లకు బదులు గూడఁదీసెదను సుమా! అనగానే పోపుగారు నోరెత్తకూరకుండిరి. ఆ కాఁపు ఆవు దూడలను తోలుకొనివెళ్ళి తన గృహమును జేరెను.

ఆ కాఁపువంటి పురుషులేయుండిన నీ ప్రపంచమునఁ బోపుల యాట లేవియు సాగకుండెడివి. దశగాత్రుల పిండములవలన దశాంగములుపుట్టి, సపిండీకరణమైనతోడనే యంగుష్ఠమాత్ర శరీరముతో సమ్మేళనము కలిగి జీవుఁడు యమలోకమునకుఁ బోవుచున్నాఁడని వీరు చెప్పుచున్నారు. అట్లయిన మరణకాలమున యమదూతలు వచ్చుటయు వ్యర్థమగును. వారు త్రయోదశా

హములైన తరువాత రావలసియుండును. ఇఁక జీవునకు శరీరమే కలుగునన్న నతఁడు భార్యాపుత్ర మిత్రుల మీఁది మోహమువలన మరలఁ దిరిగివచ్చుటలే దెందులకు?

ప్రశ్న:—వారికి స్వర్గమున నేమియు దొరకదు. కాని దానము చేసినదే యట లభించును. కావున సమస్తదానములను చేయవలసినదే.

ఉత్తరము:-అట్టి మీ స్వర్గమునకంటె నీ లోకమే మేలు. ఇచ్చట ధర్మశాలలు కలవు జనులు దానము లిచ్చుచున్నారు ఇష్ట మిత్ర బంధువర్గములందు విందుభోజనములు జరుగుచుండును. మంచి వస్త్రములు చిక్కుచుండును మీరు చెప్పెడు ప్రమాణములనుబట్టి స్వర్గమున నేమియు దొరకదన్న నా దయాశూన్యమయిన-కృపణభూయిష్ఠమయిన-పనికిరాని స్వర్గమునకు లోభులగుమీరే పోయి పాడుగందు! అటకేగ సుజనుల కేమిపని?

ప్రశ్న:-సరి! ఇఁక మీరు చెప్పునట్లే యముఁడును యమలోకమును లేకపోయినఁ జచ్చినతరువాత జీవులెక్కడికిఁ బోవుచున్నారు? మఱి వారి న్యాయ వ్యవస్థ యెవరు చేయుచున్నారు?

ఉత్తరము:-మీ గరుడపురాణమునఁ జెప్పఁబడినది ప్రమాణముకాదు. వేదమున నేమిచెప్పియున్నదో చూడుఁడు:—

యమేన వాయునా సత్యరాజన॥ యజుః. అ. ౪॥

ఈ మొదలగు వేదవచనములనుబట్టి ("యమ" అనుపేరు వాయువున కొప్పుచున్నది. శరీరమును వదలి వాయువుతోఁ గూడ జీవుఁ డంతరిక్షమున నుండును. సత్యకర్త, పక్షపాత రహితుఁడునగుపరమాత్మ ధర్మరాజు. ఆయనే యందఱకు న్యాయకర్త.)

ప్రశ్న:—మీరన్న మాటలవలన గో దానాది దానముల నెవరికిని జేయఁ గూడదనియే స్థిరపడుచున్నది.

ఉత్తరము:—మీరిట్లు చెప్పుటసర్వథా వ్యర్థమే ఏలయనఁగా సుపాత్రులకును, పరోపకార మొనర్చువారలకును, పరోపకారార్థము బంగారము, వెండి వజ్రములు, ముత్యములు, మాణిక్యములు, అన్నము, జలము, ఇండ్లు వస్త్రములు మొదలుగాఁగల దానము అవశ్యము జేయవలసినదే. కాని కుపాత్రులకు దాన మెన్నఁటికిని జేయగూడదు

ప్రశ్న:—కుపాత్రులయు సుపాత్రులయు లక్షణము లెవ్వి?

ఉత్తరము:—ఛలకపటములతోఁ గూడిన వారు, స్వార్థులు, విషయలంపటులు, కామ, క్రోధ, లోభ మోహములు కలవారు, పరులకు హాని గలిగించువారు, మిథ్యావాదులు, విద్యాహీనులు దుస్సాంగత్యము చేయువారు, సోమరిపోతులు, దాతనుమాటిమాటికిమ్మని పీడించువారు, గుమ్మముముందుఁగూర్చుండి బలాత్కారముగ దానమిమ్మనువారు, లేదనిచెప్పినను హఠముచేసి యడుగువారు, సంతోషపడనివారు, ఇయ్యనివారిని దూఱువారు, శపించువారు, బూతుల దిట్టువారు, అనేకపర్యాయములిచ్చి యొకపర్యాయ మీకున్నవారిలో శత్రుత్వము బూనువారు, సాధువేషముతో నితరుల మోసపుచ్చువారు, తమయొద్దఁబదార్థము లున్నను ఏమియు లేదని చెప్పువారు, అందఱను బొగడి పొగడి తమ ప్రయోజనములు నెఱవేర్చుకొనువారు, రాత్రింబగళ్ళు భిక్షమెత్తుటయందే ప్రవృత్తులై యుండువారు, భోజనమునకుఁ బిలిచిన ఇచ్ఛవచ్చినట్లు భంగు మొదలగు మాదక ద్రవ్యములను బుచ్చుకొని మితిమీఱఁబరపదార్థములను దినువారు, మరల నున్మత్తులై తెలివితప్పి పోవువారు, స్వప్రయోజనముకొఱకు సన్మార్గము నవరోధించి యసన్మార్గమునఁ బ్రవర్తించువారు, అటులే తమ శిష్యులకు గేవలము తమ శుశ్రూష సేచేయునట్లుపదేశము చేయువారు, ఇతర యోగ్య పురుషుల సేవ చేయఁగూడదనిచెప్పువారు, సద్విద్యాదుల ప్రచారమున నాటంకము కలుగఁజేయువారు, ప్రాపంచిక వ్యవహారమును స్త్రీ, పురుషులు, తల్లి, దండ్రులు, బిడ్డలు, రాజు, ప్రజలు, ఇష్టమిత్రులు, వీఱంద రసత్యమని వారియం దప్రీతిని గలుగఁజేయువారు, జగత్తు మిథ్యయను నిత్యాది దుష్టోపదేశములు చేయువారు, ఈ లక్షణములు గలవారందఱును గుపాత్రులని దెలియదగును.

ఇఁక నల్లే బ్రహ్మచారులు, జితేంద్రియులు, వేదాది విద్యలు చదువువారును, జదివించువారు, సుశీలురు, సత్యవాదులు పరోపకార ప్రియులు, పురుషార్థము చేయువారు, ఉదారులు, ధర్మోన్నతికొఱకు నిరంతరము పాటుపడువారు, ధర్మాత్ములు, శాంతస్వభావులు, నిందాస్తుతులందు హర్షశోకములు పొందనివారు, నిర్భయులు, ఉత్సాహపరులు, యోగులు, జ్ఞానులు, సృష్టిక్రమమునకును, వేదాజ్ఞకును, ఈశ్వర గుణకర్మ స్వభావములకు అనుకూలముగా వర్తించువారు, న్యాయానుసారముగ పక్షపాత రహితంబగు సత్యోపదేశమును, సత్య

శాస్త్రములు చదువు వారిని, చదివించువారిని చక్కఁగా గుర్తెఱుఁగునట్టి పరీక్షకులు, మోమోటపడనివారు, ప్రశ్నలకుసరియైన సమాధానము చెప్పువారు, తమ కెట్లు సుఖదుఃఖ హానిలాభములు కలుగునో యితరులకు నట్లే కలుగునని భావించువారు, అవిద్యాది క్లేశ హత దురాగ్రహాభిమానరహితులు, అవమానము నమృతసమముగాను, సన్మానమును విషప్రాయముగా నెంచువారు. సంతోషము కలవారు, ప్రీతితో నెవరెంత యిచ్చిన నంతటిలోనే ప్రసన్నులగువారు, ఆపత్కాలమం దడిగినమీదట నీయకపోయినను, తిరస్కరించినను దుఃఖపడకయు, కుచేష్టల జేయకయు నుండువారు, అట్లే అచ్చటినుండి చివాలున లేచిపోయి వానిని నిందింపకుందువారు, సజ్జనులతో స్నేహమును, దుఃఖితులమీదఁ గనికరమును గలవారు, పుణ్యాత్ములయెడ నానందమును, పాపులయెడ నుపేక్షయును గలవారు, అనఁగా రాగద్వేష రహితులు, సత్యము నంగీకరించువారు, సత్యవాదులు,సత్యకారులు, నిష్కపటులు, ఈర్ష్యాద్వేషరహితులు, గంభీరాశయులు, సత్పురుషులు, ధర్మముతోఁ గూడియుండు వారు, దుష్టాచార రహితులు, తమ మనస్సును, దనువును, ధనమును,పరోపకారమున వినియోగపఱచువారు, పరుల సుఖముకొఱకుఁ దన ప్రాణమును గూడ సమర్పించువారు ఇత్యాదిశుభలక్షణములు కలవారు సుపాత్రులు. కాని దుర్భిక్షాది-ఆపత్కాలమున నన్న జల వస్త్రౌషధ పథ్యస్థలములకుఁ బ్రాణిమాత్రులందఱు నధికారులగుచున్నారు.

ప్రశ్న:—దాత లెన్నితెఱఁగుల వారుందురు?

ఉత్తరము:—ఉత్తమ మధ్యమ నికృష్టులని మూఁడు తెఱఁగులవారు. దేశకాల పాత్రములఁ గని సత్య విద్యాది ధర్మాభివృద్ధిరూపంబగు దానమును పరోపకారముకొఱ కిచ్చుదాత యుత్తముఁడనఁబడును. కీర్తిఁబడయుటకో,లేదా స్వార్థముకొఱకో దానముచేయువాఁడు మధ్యముఁడు తన మేలుకొఱకుఁగాని, పరుల మేలుకొఱకుగాని దాన మేమియుఁజేయక వేశ్యలకును మఱిస్తోత్రము చేయువారలకును, విదూషకులకును దబ్బిచ్చువాఁడును, ఇచ్చునపుడును దిరస్కారభావముతో నవమానాది వంచనపూర్వకముగ నిచ్చువాఁడును,దాన్యముల నన్నిటి నాకేదరకు విక్రయించు వానివలె దాత కుపాత్రుల సేమాత్రము విచర్రింపక యిచ్చువాఁడును, వాదించుచు గలహించుచు నిచ్చువాఁడును, ఇతర

ధర్మాత్ములయినవారికి దుఃఖముఁ గలుగఁజేసి తన సుఖముకొఱకు దానమిచ్చు వాఁడును నగు దాత యధముఁ డనబడును. అనగా:-పరీక్షించి విద్వాంసులగు ధర్మాత్ముల సత్కరించునతఁ డుత్తముఁడు పరీక్షించియో, లేదా పరీక్షింపకయో కాదు. కాని తన ప్రశంసకొఱకు అనఁగా తన్ను బొగడవలె నని దానము చేయువాఁడు మధ్యముఁడు. ఇఁక విచక్షణలేక గ్రుడ్డివానివలె వ్యర్థముగ దానముఁజేయు దాత నికృష్టుఁ డనఁబడును.

ప్రశ్న:-దానఫల మిచ్చటనే లభించునా లేక పరలోకముననా?

ఉత్తరము:-అంతటను లభించును.

ప్రశ్న:-తనంతట దానే కలుగునా లేక ఫలమిచ్చువాఁడెవ్వఁడైనను గలఁడా?

ఉత్తరము:-ఫలమునిచ్చువాఁడీశ్వరుఁడు. దొంగతనముఁ జేసినవాఁడు తనంతట దానే చెరసాలకుఁ బోవఁగోరఁడు. కాని రాజు వాని నవశ్యముగాఁ బంపి దత్ఫలము ననుభవింపఁజేయుచున్నాఁడు. అతఁడు ధర్మాత్ములైన పురుషుల సౌఖ్యమునకు భంగముకాకుండ దొంగలు మొదలగు వారినుండి కాపాడుచు వారిని సుఖముగా నుంచుచున్నాఁడు గద. అటువలెనే పరమాత్మయు నందఱకు దమతమ పాపపుణ్యములకుఁ దగినట్లు సుఖదుఃఖ రూపఫలముల ననుభవింపఁజేయుచున్నాఁడు.

ప్రశ్న:-ఈ గరుడపురాణాది గ్రంథములు వేదార్థముగాని. వేదములను గాని బలపఱుచుచున్నవా లేవా?

ఉత్తరము:-బలపఱుచునవికావు కాని వేదవిరుద్ధములై విపరీతములను బోధించుచున్నవి. మఱి తంత్రములుగూడ నట్టివే. ఒకనికి మిత్రుఁడయి ప్రపంచమున కంతటికి శత్రువుగానుండు మనుష్యునివలెనే ఈ పురాణములను, తంత్రములను నమ్మువాఁడు నుండును. ఏలయనఁగా నీ గ్రంథము లొకరితో నొకరికి విరోధమును గలుగఁజేయుచున్నవి. వీనిఁ బశుప్రాయుఁడయినవాఁ డంగీకరింప వలసినదే కాని, మనుష్యుఁడయినవాఁ డంగీకరింప వలసిన పని లేదు. చూడుఁడు! శివపురాణమున త్రయోదశీ సోమవారములు, ఆదిత్యపురాణమున రవివారము, చంద్రఖండమున సౌమ్య గ్రహములనఁబడు మంగళ, బుధ, బృహస్పతి, శుక్ర, శనైశ్చర, రాహుకేతువుల గ్రహ దినములు, వైష్ణ

వైకాదశి, వామనుని ద్వాదశి, నృసింహుని (యనంతుని) చతుర్దశి, చంద్రుని పౌర్ణమి దిక్పాలకులందశమి, దుర్గానవమి, వసువులయష్టమి, మునులసప్తమి, కార్తికస్వామి షష్టి, నాగులపంచమి, గణేశునిచవితి, గౌరీతదియ, అశ్వినీ కుమారుల విదియ, ఆద్యాదేవిపాడ్యమి, పితరుల అమావాస్య, అను నీదినము లన్నియుఁ బురాణములందుఁ జెప్పఁబడిన ఉపవాసదినములు. ఇఁక నీ వారము లందును, తిథులందును అన్నపానములను బుచ్చుకొనువాఁరు నరకమునకుఁ బోవుదురనియే యన్నిఁట వ్రాసియున్నది. కాన పోపుగారు, వారిశిష్యులు నేయే వారమందేకాని, యేతిథియందే కాని భోజనము జేయఁగూడదు ఏలయనఁగా నన్నపానములను గ్రహింతురేని నరకమునకు బోవుదురు. ప్రమాదముకల మనుష్యులు నిర్ణయసింధు, ధర్మసింధు, వ్రతార్కము మొదలగు గ్రంథముల వ్రాసి యందొక్కొక్క వ్రతమునకెంతయో దుర్దశ వాటిల్లఁజేసిరి. ఎట్లనఁగా శైవులు దశమీవిద్ధమగు నేకాదశీవ్రతమును. మఱికొందఱు ద్వాదశియం దేకాదశీ వ్రతమును సలుపుచున్నారు. ఉపవాస ముండుటకు-తిండిలేక మాడుటకు నయితము-వాదవివాదములనే కలుగఁజేయు నీ పోపుల పన్నుగడల నెంత విచిత్రములనవచ్చును. ఇట్లు కొంచెమైనను దయలేక కేవలం స్వార్థమునకుఁలో బడినవాఁదే యీయేకాదశీవ్రతమును ప్రచారము చేసియుండును గద.

ఇఁకవారు 'ఏకాదశ్యాముస్నే పాపాని వసంతి'॥ పద్మపు.అ.౧౫. శ్లో.౧౧॥

పాపము లెన్నియున్నవో యవన్నియు నేకాదశీ దినమున నన్న ముందుండునని చెప్పుచున్నారు 'ఎవరి పాపములం దుండును? మీ పాపములా. లేక మీ తండ్రి తాతలవా?' అని యీ పోపుగారి నడుగవలయును. అట్లందఱ పాపములన్నియు నేకాదశియందుండునన్న నేకాదశినా డెవరికిని దుఃఖమే కలుగకుండవలయునుగద. అట్లు తటస్థించుటలేదు కాని, దానికిఁ బదులుగ నాఁకలిబాధ మొదలగు దుఃఖములు మాత్రము కలుగుచునేయున్నవి. దుఃఖము పాపఫలమేకద. కాన' దిండితినకమాదుట పాపము దీనికి గొప్ప మాహాత్మ్యము ను గల్పించియున్నారు. దానిని వినియే యనేకులు మోసపోవుచున్నారు. అందొక కథ వ్రాయఁబడియున్నది. అదేమన, బ్రహ్మలోకమున నొక వేశ్య యుండెనఁట. ఏమియో యపరాధము చేయఁగా శాపమిచ్చిరఁట. పిమ్మట భూమిమీఁదఁబడున ట్లామెకు శాపము కలిగెనట. అప్పుడామె మరల నేనెట్లు స్వర్గమునకు రాఁగలుగుదునని

బ్రహ్మను ప్రార్థనచేసి వేడుకొనఁగా నతఁడెవ్వఁడైన నీకు నేకాదశీ వ్రతఫలము నిచ్చినతక్షణమే నీవు స్వర్గమునకు రాఁగలుగుదువని యామెకు సెలవిచ్చెనఁట. అప్పుడామె విమానమునఁ గూర్చుండి యొకానొక పట్టణమునకు దిగి రాఁగలిగెనఁట. అక్కడి రాజు నీ వెవ్వతెవు? అని యామె నడుగఁగా నామె తన వృత్తాంతమంతయు వినిపించి. యెవరేని నా కేకాదశీ ఫలము దానముచేసిన మరల నేను స్వర్గమునకుఁ బోఁగలుగుదునని యనఁగా నా రాజు పట్టణమున నెంతవెదకించినను ఏకాదశీవ్రతము చేయువా రొక్కరైనను చిక్కలేదు: కాని యొకనాఁ డొక శూద్రస్త్రీ పురుషునితోఁ గలహములాడి కోపముచేత నామె రాత్రింబవళ్ళును బస్తుపడియుండఁగా దైవయోగమువలన నానాఁ డేకాదశీ యయియుండెనఁట. ఆ స్త్రీ ఏకాదశియని తెలిసి నేనుపవాసముండలేదు. నాఁ డకస్మాత్తుగాఁ బస్తుపడియుంటినని భృత్యులతోఁ జెప్పెనఁట. అప్పుడు వారు రాజుగారిచెంత కామెను దోడ్కొనిపోవ రాజామెను జూచి. "నీవీ విమానమును దాఁకు"మని యాజ్ఞాపించెనఁట. ఆమె తాకినంతట నా విమాన మంతరిక్షమున కెగిరిపోయెనఁట. ఇది తెలియక చేసిన యేకాదశీ వ్రతఫలము.

ఇఁక దెలిసిచేసిన యేకాదశీ వ్రతఫలమున కొక మేఱయుందువా: ఓ తెలివితక్కువ వారలారా! ఈ మాట నిజమేయైనఁ జూడుఁడు! స్వర్గమునఁ దమ్ములపుటాకుచుట్టలు దొరకవు. కావున నొకవిడెపుచుట్టను బంపఁదలఁచుకొన్నాము. ఏకాదశీవ్రతము చేయువారగు మీరందఱును మీమీఫలములను దయఁజేయుఁడు. ఆ మహిమచే నొక విడెము మీఁది కెగసిపోయిన మరల లక్షలకొలఁది కోట్లకొలఁది యచ్చటికిఁ బంపి దేరము చేయవచ్చును. అప్పుడు మేమును ఏకాదశీవ్రతమును జేయఁబూనుదుము. అట్లుగాకపోయిన యెడల మిమ్ము నీ యుపవాసరూపమైన యాపదనుండి రక్షించినవారమగుదుము. ఇఁక నీ యిఱువదినాలు గేకాదశిదినములకును వేఱువేఱు పేరులుపెట్టియుంచినారు. ఒక యేకాదశికి ధనదయనియు, నింకొకదానికిఁ గామదయనియు, మఱియొక దానికిఁ బుత్రదయనియు, వేఱొకదానికి నిర్జలయనియు నిట్లే తక్కినవాని కన్నిఁటికిని పేరులు గలవు. అనేక దరిద్రులును, కాముకులును, పుత్రులు లేక నిర్వంశమైపోవువారును ఏకాదశీ వ్రతమును జేసిచేసి ముసలివారైనారు;

చావను ఇచ్చినారుకాని. ధనము కాని, కామిత వస్తువుగాని, పుత్రులుగాని వారెప్పరికిని గలుగలేదు. జ్యేష్ఠ శుక్ల పక్షమున నెండ లతితీక్ష్ణమై యొక గడియ సేపు నీళ్ళు దొరకకపోయిన మనుష్యులు దహాతహపడుచుందురు. అందులో వ్రతము చేయువారికి మహాదుఃఖకరముగా నుండును. విశేషించి బంగాళా దేశమున విధవలగు స్త్రీలందఱు నేకాదశినాఁడు పడు పాట్లు చెప్పనలవికాదు. వ్రాయునపుడు జాలిగుండెగల ఈ కసాయివాండ్రకు గొంచెమైనను దయరాక పోయెనుగద. లేనిచో నీ యేకాదశికి నిర్జల యనుటకుమాఱు సజలయనియు. పుష్య శుక్ల ఏకాదశికి నిర్జలయనియు పేరిడినఁ గొంతబాగుగనుండెడిది. కాని యీ పోపులకు దయతో నేమిపని. ఎవరు బ్రతికిననేమి? ఎవరు చచ్చిననేమి? తమ పొట్టనిండుటయే ముఖ్యము గర్భిణీస్త్రీలును. సద్యోవివాహిత స్త్రీలును. బనిబాలురును యువకులు నెన్నఁటికి నుపవాసముఁ జేయనేకూడదు. కాని చేయవలసియే యుండిన నాఁకలి లేక యజీర్ణమైయుండు దినమున (శర్కరావత్ శరబత్తు) పానకము. పాలుద్రాగి యుండవలసినది. ఆఁకలి యయి నప్పుడు భోజనము చేయనివాఁడును. ఆఁకలి లేనప్పుడు భోజనముఁ జేయు వాఁడును. ఈ యిరువురు రోగముల మునిఁగి దుఃఖముల ననుభవించు చుందురు. ఈ యవివేకులు చెప్పునది కాని, వ్రాయునది కాని ప్రమాణముగా నెవరు నంగీకరింపఁగూడదు.

ఇఁక గురుశిష్యుల మంత్రోపదేశములను గురించియు. మతమతాంతరముల చరిత్రలను గురించియు జెప్పుచున్నాము గమనింపుడు. వేదము లనంతములనియు ఋగ్వేదమునకు ౨౧ శాఖలును, యజుర్వేదమునకు ౧౦౧ శాఖలును. సామవేదమునకు ౧౦౦౦ శాఖలును, అథర్వణమునకు ౯ శాఖలును గలవనియు. వానిలోఁ గొన్ని శాఖలు చిక్కుచు తక్కినవి లోపించినవనియు. ఆ లోపించినవానిలో మూర్తిపూజకును, తీర్థయాత్రలకును ప్రమాణ ముండ వచ్చును. లేకున్నఁ బురాణములలో నవి యెక్కడినుండి వచ్చెననియు. కార్యమునుజూచి కారణానుమానము కలుగుచున్నప్పుడు పురాణములఁజూచి మూర్తిపూజను గురించి సందేహింపవలసిన దేమున్నదనియు నీ మూర్తి పూజకులైన సాంప్రదాయకు లనుచున్నారు.

ఉత్తరము:- ఒక వృక్షములోని శాఖలన్నియు నొక్కచోటివిగముగా నుండునుగాని వేరుగానుండవు. అవి కొన్ని చిన్నవిగా నుండవచ్చును. కొన్ని పెద్దవిగా నుండవచ్చును. కాని వానిలో భిన్నత్వముండనేరదు. అటువలెనే ఇపుడు లభ్యములై యున్న శాఖలలోఁ బాషాణాది మూర్తిపూజకును, బలస్థల విశేషములైన తీర్థములకును ప్రమాణములు చిక్కినపుడు లోపించిన శాఖలలోఁగూడ నుండఁజాలవు. మఱి నాలుగువేదములు సంపూర్ణముగా నున్నవి కదా! వానికి విరుద్ధములైన శాఖలెన్నటికి నుండఁజాలవు. విరుద్ధముగా నున్న వానిని వాని శాఖలని యెవరును నిరూపింప నేరరు. కాఁబట్టి పురాణములు వేదములకు శాఖలు గావు. అవి సాంప్రదాయకులచేఁ బరస్పర విరుద్ధముగా వ్రాయఁబడిన గ్రంథములు. మీరు వేదములను పరమేశ్వరకృతములని నమ్మువారేని ఆశ్వలాయనాదిఋషిమునులపేరఁ బ్రసిద్ధములై యున్న గ్రంథములను వేదములని యేల విశ్వసించుచున్నారు? కొమ్మలను, ఆకులను జూచుటవలన నిది రావిచెట్టు, ఇది మేడిచెట్టు, ఇది మామిడిచెట్టు అని తెలియవచ్చునట్లే, ఋషిమునులచే వ్రాయఁబడిన బ్రాహ్మణములను, అంగములను, ఉపాంగములను, ఉపవేదాదులను జదివిచూచుటవలన వేదార్థము విస్పష్టమగుచున్నది. కావున నీ గ్రంథములకు శాఖలని పేరువచ్చినది. వేదములకు విరుద్ధములైనవి ప్రామాణ్యములును, వానికనుకూలించునవి యప్రామాణ్యములును గాఁజాలవు. మీరు లుప్తశాఖలందు మూర్తిపూజలకుఁ బ్రమాణము లుండెనని కల్పన చేయుచున్నారేని, ఆ లుప్తశాఖలందు వర్ణవ్యవస్థ తలక్రిందులుగా నుండును. అనఁగా జండాలురకును శూద్రులకును బేరులు బ్రాహ్మణాదులనియు, బ్రాహ్మణాదులకు బేరులు అంత్యజ, శూద్రాదులనియు, అగమనీయమునకు గమనీయమనియు, అకర్తవ్యమునకుఁ గర్తవ్యమనియు, మిథ్యాభాషణాదులకు ధర్మమనియు, సత్యభాషణాదుల కధర్మమనియు, నీ మొదలగునవి వ్రాసియుండెనని మఱియొకఁడు మీతో వాదింపఁబూనినపుడు మీరును మేమిచ్చినయుత్తరమునేయిత్తురు అనఁగా వేదములలోను వాని ప్రసిద్ధశాఖలలోను బ్రాహ్మణాదులకు బ్రాహ్మణులనియు శూద్రాదులకు శూద్రులనియు, వ్రాసియున్నట్లే యా లుప్తశాఖలలోఁగూడ నుండెనని నమ్మవలయును. లేకపోయిన వర్ణాశ్రమవ్యవస్థాదులన్నియు వ్యత్యస్తములై చెడిపోవుననియేకద బదులుచెప్పగలుగుదురు. పోనిండు! జైమిని

వ్యాసపతంజలుల కాలమువఱకు శాఖలన్నియు నున్నవా లేవా? లేకున్న మీరెన్నఁటికిని నిషేధింపలేరు. లేదనిచెప్పినపుడు ఆ శాఖలుండెననుటకుఁ బ్రమాణమేమి? చూడుడు! జైమిని మీమాంసమునఁ గర్మకాండనంతయును, పతంజలిముని యోగశాస్త్రము నుపాసనా కాండనంతటిని, వ్యాసులు శారీరకసూత్రములందు జ్ఞానకాండనంతటిని వేదానుకూలముగా వ్రాసియున్నారు. వానిలోఁ బాషాణాది మూర్తిపూజకాని, ప్రయాగాది తీర్థములపేరులుగాని వ్రాయలేదు. ఎక్కడినుండి వ్రాయుదురు? వేదములందెచ్చటనయిన వ్రాసియున్న నెన్నఁటికి వానిని వారు వదలియుండరు. కావున లుప్తశాఖలలోఁ గూడ, మూర్తిపూజాదులుఁ బ్రమాణములేదు. ఇఁక నీశాఖలన్నియు వేదములుగావు. ఏలయనఁగా వీనియం దీశ్వర కృత వేదములోని మంత్రముల నాధారముగాఁ గొని వానిపై వ్యాఖ్యానము లును, ప్రాపంచిక పనుల యితిహాసములును వ్రాసియున్నవి. కావున నవి వేదము లెన్నఁటికిని గానేరవు. వేదములందుఁ గేవలము మనుష్యులకు విద్యోపదేశము చేయఁబడియున్నది. ఒక మనుష్యుని పేరయినను వానిలోలేదు. కావున మూర్తి పూజ నితాంతముగ ఖండింపఁబడెను.

ఈ మూర్తిపూజవలన శ్రీరామచంద్ర, శ్రీకృష్ణ, నారాయణ, శివాదులు గొప్ప నిందలపాలయి యెంతటి యవమానమును బొందుచున్నారోచూడుఁడు! వారు గొప్ప మహారాజాధి రాజులుగాను, వారి పత్నులు సీతా, రుక్మిణీ, పార్వతీ మొదలగువారు మహారాణులుగాను ఉండిరని యందఱెఱుఁగుదురు. కాని వారి మూర్తులనుమందిరములలో నుంచి పూజారులు వారిపేర భిక్షమెత్తుచున్నారు. అనఁగా వారిని భిక్షుగాండ్రను జేయుచున్నారు. ఎట్లనఁగా నచ్చటికివచ్చు శ్రీ పురుషులనుజూచి, 'మహారాజా! మహారాణీగారు! సేటుగారు! స్వామి దర్శనము చేయుఁడు; కూర్చుండుఁడు; చరణామృతమును సేవింపుఁడు; దక్షిణ నేమైనఁ బెట్టుఁడు. మహారాజా! సీతారాములకు, రుక్మిణీకృష్ణులకు, లేక రాధాకృష్ణులకు, లక్ష్మీనారాయణులకు, పార్వతీ మహాదేవులకు మూఁడు దినములనుండి బాల భోగముకాని రాజభోగముకాని లేదు. అనఁగా జలపానముకాని యన్నపానము కాని వారు చేయలేదు నేఁడు వారికేమియు లేకున్నది. రాణీగారు! సేటాని గారు! సీతాదులకు ముక్కుపోఁగులను చేయించి పెట్టుఁడు. అన్నాదులను బం పిన రామకృష్ణాదులకు నైవేద్యము చేయుదుము. వస్త్రములన్నియుఁ జినిఁగి

పోయినవి. దేవాలయములోని మూలలన్నియుఁ గూలిపోయినవి. మీఁది నుండి కారుచున్నది దుర్మార్గులగు దొంగలు ఉన్నవికూడ దోఁచుకొనిపోయినారు. ఎలుకలు కొంత గోడకి పొఱవేసినవి. ఒకనాఁ డెలుక యెంతటియనర్థము చేసినవో చూడుఁడు. దాని కంటినిఁ బెకలించి తీసికొని పారిపోయినవి మరల వెండిది చేయింప శక్తిలేక గవ్వతోఁ జేయించినాము' అని యాచించుచున్నారు.

రామలీలను, రాసమండలమునుగూడఁ జేయించుచున్నారు. వానిలో సీతారాములు, రాధాకృష్ణులాడుచుండగాఁ సేవకులైన రాజులు మహంతులు మొదలగువారానందముగాఁ గూర్చుండియుందురు దేవాలయమునందు సీతారామాదులు నిలిచియుండగా పూజారులును, మహంతులును ఆసనములమీఁదనో, పఱుపులమీఁదనో దిండ్లనుంచుకొని హాయిగా కూర్చుందురు. ఉష్ణకాలమునఁ గూడ వారిని లోపలఁ బెట్టి తలుపులుమూసి తాళములు వేసియుందురు. తాము మాత్రము మంచములమీఁద మంచి గాలిలోఁ బరుండుదురు. పూజారులనేకులు తమ నారాయణుని డబ్బిలోఁ బెట్టి మూసి, పైనొక గుడ్డఁజుట్టి మెడలఁ దగిలించుకొనుచున్నారు. ఆడుకోఁతులు తమ బిడ్డలను వ్రేలాడవేసికొనునట్లే వారుకూడ వానిని మెడలో వ్రేలాడవైచికొందురు. ఎవరైనను తమ విగ్రహములను బగులఁగొట్టినప్పుడు బొమ్మలు బాదుకొనుచుఁ గదుపులుకొట్టుకొనుచు మా సీతారాములను, మా రాధాకృష్ణులను, మా పార్వతీశివులను దుష్టులెవరో పగులగొట్టినారే యని యెలుగెత్తి యేడ్చుచున్నారు పిమ్మట బలపపురాతితో మంచి శిల్పిచేసిన వేఱొకవిగ్రహమును దెప్పించి స్థాపన చేయవలెననియు, నారాయణునకు నేయిలేనిది నైవేద్యము పెట్టరాదనియు, దాంకపోయినను గొంచెమైన నవశ్యముగా పంపుఁడను నిత్యాది మాటలను గల్పించి చెప్పుచున్నారు. రామలీల, రాసమండలము లను నాటలు ముగియునప్పుడు సీతారాముల చేతను, రాధాకృష్ణులచేతను బిచ్చమెత్తించుచున్నారు. ఉత్సవ ప్రదేశములో నొక చిన్నవానికొక కిరీటమునుబెట్టి, కృష్ణునివేషమును వేయించి మార్గమునఁ గూర్చుండఁబెట్టి వానిచే బిచ్చమెత్తించుచున్నారు. ఇవన్నియు నెంత శోచనీయమైన విషయములో మీరే యోచింపుఁడు. సీతారామాదు లిట్టిదరిద్రులుగాను, భిక్షకులుగాను ఉండిరా, మీరే చెప్పుఁడు, ఇవన్నియు వారి తిరస్కారావమానములు

గాక మఱి యేమగును? దీనివలన మన మాదరింపఁదగిన పురుషులు మిగుల నిందితులగుచున్నారు.

ఒకవేళ నీ పూజారులు సీతా రుక్మిణీ లక్ష్మీ పార్వతులను వారి జీవిత కాలమున నొకమార్గమునఁబో లేక యొకయింటనో నిలువఁబెట్టి శ్రోవరులు 'జూచిరండు. దర్శనము చేయుఁడు దక్షిణయుపెట్టుఁడు' అనుచున్న సీతారామాదులీ మూర్ఖులమాటలనువిని యెన్నఁటికి నిట్టి పనులు చేయనీయక యుందురుగద. ఇట్లు వారి నవమానపఱచువారిని దండింపకూరకుందురా? వారివలన దండన కలుగకపోయినను విగ్రహారాధనమునకు విరోధులగు వారిచే నీ పూజారులకు వారికర్మములే యనేక పర్యాయములు ప్రసాదము గలుగఁజేసినవి. ఇపుడుకూడ గలుగఁజేయుచున్నవి. ఈ కుకర్మలను వదలనంతవఱకుఁ గలుగఁజేయుచునే యుందును. ఆర్యావర్తమునకుఁ బ్రతిదినమును గలుగుచున్న మహాహానికిని, పాషాణాది మూర్తిపూజకుల పరాజయమునకును మూలమీ దుష్కర్మములే యనుటకు సందేహమేమి? ఏలయనగాఁ బాపము-ఫలమే దుఃఖము. పాషాణాది మూర్తులయందు విశ్వాసము కలిగియున్నందులనే కద! అనేక నష్టములు కలిగినవి. ఇంకను వదలకపోయినఁ బ్రతిదిన మధికాధిక నష్టములే కలుగుచుండును. వీరిలో వామమార్గులు గొప్ప యపరాధులు. వీరు శిష్యులకు మొట్టమొదట సభలోఁ జేర్చుకొనునప్పుడు, సామాన్యులయిరేని:—

దం దుర్గాయై నమః॥ భం భైరవాయ నమః॥ ఐం హ్రీం క్లీం చాముండాయై విచ్చే॥

ఈ మొదలగు మంత్రముల నుపదేశింతురు. విశేషించి బంగాళా దేశమున ఏకాక్షరీ మంత్రోపదేశమును జేయుదురు. ఎట్లనఁగా:—

హ్రీం. శ్రీం. క్లీం॥ శావరతంత్రము. ౧౦.ప్రకీ.ప్ర.౪౪॥

ఈ మొదలగు వానితో ధనాఢ్యులైనవారికి పూర్ణాభిషేకమును జేయుదురు. ఇట్లే దశమహావిద్యలకు మంత్రములు కలవు:—

హ్రాం హ్రీం హ్రూం వగలాముఖ్యై ఫట్ స్వాహా॥ శావరతం.ప్రకీ ప్ర. ౪౧॥

అచ్చటచ్చట:—

హ్రూం ఫట్ స్వాహా॥ కామరత్న తంత్ర బీజమంత్రము ౪॥

ఇంకను మారణ, మోహన, ఉచ్చాటన, విద్వేషణ వశీకరణాది ప్రయోగములను జేయుదురు. ఆ మంత్రములవలన నేమియుఁగాదు కాని క్రియలవల

ననే యన్నికార్యములను జేయుదురు. ఒకనిని జంపుటకు ప్రయోగము చేయ వలెనన్నపుడు జేయించువానియొద్ద ధనమునుబుచ్చుకొని పిండితోనో, మట్టితోనో చంపఁదలచినవాని విగ్రహమును జేసి, దాని యెదయందును, నాభియందును, కంఠమునను, గత్తులను గుచ్చి, కన్నులు, చేతులు, కాళ్లు అను వీని యందు మేకులను దింపి, భైరవ దుర్గలలో నొకదాని విగ్రహమునుజేసి దాని చేతికొక త్రిశూలమునిచ్చి యా చంపదలచిన వాని బొమ్మయెదమీఁద నిలిపి, యొక వేదికచేసి, దానిపై మాంసాదులను హోమము చేయుచుందురు. ఇఁక నచ్చటికి దూతలు మొదలగు వారినిబంపి విషము మున్నగువానివలన వానిఁ జంపుటకుపాయములనుజేయుదురు తమ పురశ్చరణ కాలమున నా మనుష్యుని చావు మూడినఁదామువేవీభైరవులను వశపఱచుకొనియున్నట్లుచెప్పుకొనుదురు.

"భైరవో భూతనాథశ్చ" ఈ మొదలగువానిని జపించుచుందురు.

మారయ మారయ, ఉచ్చాటయ ఉచ్చాటయ. విద్వేషయ విద్వేషయ.
ఛింధి ఛింధి. భింధి భింధి. వశీకురు వశీకురు. ఖాదయ ఖాదయ.
భక్షయ భక్షయ. త్రోటయ త్రోటయ, నాశయ నాశయ.
మమ శత్రూన్ వశీకురు వశీకురు. హుం ఫట్ స్వాహా॥

కామరత్న తంత్రము. ఉచ్చాటన ప్రకరణము. మం. ౫-౮౫

ఇత్యాది మంత్రములను జపించుచు, మద్యమాంసాదులను గావలసినంతదిని త్రాగుచుఁ గనుబొమలనడుమ సిందూరరేఖ (కుంకుమబొట్టు) బెట్టుకొనియుందురు. అప్పుడప్పుడు కాళీ మొదలగువానిపేర నొక మనుష్యునిఁ బట్టి హోమముచేసి యా మాంసమును కొంత దినుటగూడ గలదు. భైరవీ చక్రమునఁ బ్రవేశించి మాంసమును, మద్యమును సేవింపకున్న వానిఁబట్టి చంపి హోమముచేయుదురు. ఇఁక వారిలో నఘోరి యనఁబడువాఁడు చచ్చిన మనుష్యులను-పీనుగల-మాంసమును గూడ దినును. అజరీ వజరీలను జేయు వారు మూత్రపురీషములను గూడ సేవింతురు.

వారిలోఁ, చోళీమార్గులు, బీజమార్గులు అని రెండుతెగలు కలవు. చోళీ మార్గులనువారొకరహస్యస్థలమును భూమిక్రిందనో మఱియొక చావునవో యేర్పఱచుకొని యచ్చట స్త్రీ పురుషులు, బాలబాలికలు, అక్కచెల్లెండ్రు, తల్లులు, కోడండ్రు మొదలగువారందఱునుజేరి, ఎంగిలిమంగలమను మాట

లేక యందఱును మాంసమును దిని మద్యమును పానముచేయుదురు. ఒక యాఁడుదానిని దిగంబరఁజేసి, దానిపేరు 'దుర్గాదేవి' యని పెట్టి, దాని గుప్తేంద్రియమును బురుషులందఱును బూజింతురు. అట్లే ఒక పురుషుని వస్త్రహీనుఁ జేసి వాని గుప్తేంద్రియమును స్త్రీలందఱును పూజింతురు. సారాయి ద్రాగి త్రాగి యున్మత్తులైనపుడు స్త్రీలు మొదలఁగప్పియున్న రైకలన్నిటిని నొక్క మంటి పాత్రలోఁ బడవేసి యన్నియుఁ గలియఁజేసి, యొక్కొక్క పురుషుఁడును దానఁ జేయివేయఁగా నెవతె కుబుసము వానిచేతి కబ్బునో దానితోఁ దల్లి, సోదరి, కూఁతురు, కోడలను వావివరుసల నెన్నక సంభోగించును. ఆసమయమున నా స్త్రీ వానికి భార్యయగును; మఱియు మత్తెక్కినట్లెల్ల చెప్పులతోను గజ్జలతోను ఒకరినొకరు గొట్టుకొందురు. ప్రాతఃకాలమునఁ గొంతచీఁకటి శేషించి యుండగనే యెక్కడివారక్కడఁ దమతమ యిండ్లకుఁ బోవుదురు. అప్పుడు తల్లి తల్లియే. కూఁతురు కూఁతురే, తోఁబుట్టువు తోఁబుట్టువే, కోడలు కోడలే యగును. బీజమార్గులు స్త్రీ పురుషులు సమాగమ మొనర్చినపిదప నా వీర్యమును నీటిలోఁ గలిపి త్రాగుదురు. ఈ మూఢులీ కర్మములను ముక్తికి సాధనములని నమ్ముచున్నారు; వీరు విద్య, ఆలోచనము, సుజనత్వము మున్నగునవి లేకయుందురు.

ప్రశ్న:- శైవమతమువారైన మంచివారా?

ఉత్తరము:- మంచివారెట్లగుదురు? "ప్రేతనాథుని వంటివాఁడే భూతనాథుఁడు" వామమార్గులు మంత్రోపదేశముఁ జేసి ధనాపహరణము జేయునట్లే, శైవులును "ఓం నమశ్శివాయ" యను మొదలగు పంచాక్షరీ మున్నగు మంత్రముల నుపదేశించుచున్నారు. రుద్రాక్షలను, భస్మమును ధరించుకొనుచున్నారు. మంటితోను, పాషాణములతోను లింగములను జేసి పూజించుచున్నారు. మఱియు హర హర యనియు, బంబమ్మనియు, మేకకూఁతవంటి బడ బడ శబ్దమును నోటితో చేయుచున్నారు. దానికిఁ గారణము "చప్పట్ల వలనను నోటితో చేయు బంబం నాదములవలనను, పార్వతి ప్రసన్నురాలును, మహాదేవుఁడు ప్రసన్నుఁడునగునని" చెప్పుచున్నారు. ఏలయనఁగా భస్మాసురుని యెదుట మహాదేవుఁడు నిలువఁజాలక వెన్నిచ్చి పరుగెత్తినప్పుడు వంచన జేయుటకు బంబం నాదములు, చప్పట్లు చేయఁబడినవని చెప్పుదురు. ఇఁకనట్లే

దవుదల శబ్దమువలనఁ బార్వతి యప్రసన్నురాలును, మహాదేవుఁడు ప్రసన్నుఁడు నగునని చెప్పుచున్నారు. ఏలయనఁగాఁ బార్వతి తండ్రియైన దక్షప్రజాపతి తలను మహాదేవుఁడు త్రుంచి నిప్పులోఁబడవైచి యా మొండెముమీఁద నొక మేఁకతలను దెప్పించిపెట్టెనని చెప్పుదురు. దానివలన దవుదలవలనఁ గలుగు శబ్దము మేకకూఁతవంటిదని వారు నమ్ముచున్నారు. శివరాత్రిని ప్రదోష వ్రతముఁ జేయుచున్నారు. ఇట్టివానిని జేయుటవలన ముక్తి కలుగునని నమ్ము చున్నారు. కావున వామమార్గులకుఁ బట్టిన పిచ్చియే వీరికిని బట్టియున్నది. వీరిలోఁ జెవులకు దూట్లుపొడుచుకొనువారును, నాథ, గిరి, పురి, వన, అరణ్య పర్వత, సాగరు లనువారును, గృహస్థులును శైవులై యున్నారు. కొందఱు రెండశ్వములమీఁద స్వారి చేయుచున్నారు. అనఁగా వామశైవ మతముల రెంటి ననుసరించుచున్నారు. మఱియు నెందఱో వైష్ణవు లిట్లుండుట కలదు. వారల లక్షణము :—

> అంతశ్శాక్తా బహిశ్శైవాః సభామధ్యే చ వైష్ణవాః ।
> నానారూపధరాః కౌలా విచరంతీహ మహీతలే ॥

(కౌలోపనిషత్తు, కులార్ణవ తంత్రము-౧౧. ఉల్లాసము చూడుఁడు)

ఇది తంత్రములోని శ్లోకము లోన శాక్తులును-వామమార్గులును, బయటికి శైవులును-రుద్రాక్ష భస్మధారణఁ జేయువారునై సభలందు వైష్ణవులమనియు, విష్ణువు నుపాసించువారమనియుఁ జెప్పుకొనుచున్నారు. ఇట్లు నానారూపములు దాల్చి వామమార్గులు ప్రపంచమున సంచరించుచున్నారు.

ప్రశ్న:- వైష్ణవులైన మంచివారా?

ఉత్తరము:- ఏమిమంచి? మన్నుమంచి! వారెంతో వీరు నంతె. వైష్ణవుల చిత్రములను జూడుఁడు వారు విష్ణువునకు దాసులఁట. చక్రాంకితులైన శ్రీవైష్ణవులగు వారందఱికంటె నుత్తములఁట. ఇవన్నియు వ్యర్థాలాపములేకాని మఱి యేమియులేదు.

ప్రశ్న:- అన్నియు వ్యర్థాలాపము లేనా? కావు. అన్నియు నిజములే. చూడుఁడు! లలాటమున నారాయణుని చరణారవిందమువంటి తిలకమును, దాని నడుమ నొక పచ్చని శ్రీయను రేఖయు నుండును. కావుననే మేము శ్రీవైష్ణవులమని పిలువఁబడుచున్నాము. ఒక నారాయణునిదప్ప మఱి యెవ్వ

రిని మేము నమ్మము. మహాదేవుని లింగమును జూడనుగూడఁ జూడము. ఏలయనఁగా, మా లలాటమున విరాజమానమైయున్న శ్రీ లక్ష్మితువాలంగు చున్నది. ఆలమందారాది స్తోత్రములు పఠించుచున్నాము. మంత్రపూర్వక ముగ నారాయణునిఁ బూజించుచున్నాము. మేము మాంసముతినము. మద్యము త్రాగము. మఱి మేము మంచివార మెందులకుఁగాము?

ఉత్తరము:- ఈ మీ తిలకమును హరిపాదాకృతియనియు, నీ పచ్చని రేఖను శ్రీయనియు నమ్ముటగూడ వ్యర్థమే. ఏలయనఁగా నేసు గు లలాట మునఁ జిత్రవిచిత్రములు వ్రాయఁబడునట్లే యా మీ లలాటమున వ్రాయఁబడు చిత్రమును మీ చేతిపనియే. మీ లలాటములందు విష్ణువు పాదచిహ్నమెక్కడి నుండి వచ్చినది? ఎవఁడైనను వైకుంఠమునకుబోయి విష్ణుపాద చిహ్నము లను లలాటమునఁ జేయించుకొచ్చినాఁడా యేమి?

వివేకి:- మఱి యీ శ్రీయనునది జడమా చేతనమా?

వైష్ణవుఁడు:- చేతనము

వివేకి:- మఱి యీ రేఖ జడమైయున్నది కాన శ్రీ కాదు. ఈ శ్రీ చేయఁ బడినదా, చేయఁబడనిదా చెప్పుఁడు? చేయఁబడనిదంటిరా యిది శ్రీ కానేరదు ఏలయనఁగా దీనిని నిత్యమును మీరు మీ చేతితోఁ జేయుచున్నారు. మఱల నది శ్రీ యెట్లుకాఁగలదు? మీలలాటమున శ్రీయే నివసించుచున్నదన్న నెందఱో వైష్ణ వులు కాంతిలేక వికారముఖములతో నేల గానవచ్చుచున్నారో తెలియదు. ముఖ మున శ్రీయుండి యింటింటికి వెళ్లి భిక్షమెత్తుకొనుచు సదాన త్రమునుదానమరిగి, పిండి, బియ్యము మున్నగువానిఁ దెచ్చుకొని పొట్టఁబోసికొనుచు నేల తిరుగు చున్నారు? నొసఁట శ్రీయున్నదనుచు మహాదరిద్రులవంటి పనులు చేయుట గడు హేయమును, లజ్జాస్పదము నై యున్నది.

పరిలోఁ బరికాలుఁడను పేరుఁగల వైష్ణవభక్తుఁ డొక్కఁడుండెను. అతఁడు దొంగతనముచేసియు, దారులు గొట్టియు, మోసము చేసియుఁ బరులసొత్తు నపహరించి వైష్ణవులకు దానము చేయుచుండెను. ఒకనాఁ డపహరించుటకు సొత్తుగాని, దోఁచుకొందుమన్న నొక మనుష్యుఁడుగాని దొరకనందున మహా వ్యాకులతజెంది పిచ్చియెత్తినట్లు తిరుగుచుండఁగా తనభక్తుఁడట్లు దుఃఖపడు చున్నాఁడని నారాయణుఁడుచూచి, కనికరించి, యొక సెట్టివేషమూని, యుంగ

రముల మొదలగు భూషణములు ధరించుకొని, యొక బండినెక్కి.. యతని కళిముఖుఁడై వచ్చెనఁట. పరికాలుఁడా వచ్చుచున్న బండిని సమీపించి, "నీ వస్తువుల నన్నిఁటిని త్వరగాఁ గ్రిందదించి పెట్టుము. లేనిచో నిన్నుఁ జంపెద" నని యా సెట్టి ననెనఁట. సెట్టి తనపైనున్న వస్తువులన్నిటినొక్కటొక్కటిగాఁ గ్రింద బెట్టుచుఁ జేతనున్న యుంగరమును దీయఁ గొంత యాలసించినందులకు పరికాలుఁడా సెట్టి వ్రేలుగోసి యుంగరమును బుచ్చుకొనఁగా నా మాయారూపియైన నారాయణుఁడు మహాప్రసన్నుఁడై యతనికిఁ జతుర్భుజములతో దర్శన మిచ్చి నీవు 'నాప్రియభక్తుఁడవు ఏలయనఁగా నీవు దొంగతనముఁ జేసియు. బలవంతముగా నపహరించియుఁ దెచ్చినధనమంతయు వైష్ణవులకువినియోగపఱచుచున్నావు. కావున నీవు ధన్యుఁడవు అని యతని వర్ణించెనఁట। పిమ్మట నా పరికాలుఁ డావస్తువులను దీసికొనిపెరలి వైష్ణవులకు సమర్పించెనఁట.

మఱొకప్పుడొక వర్తకుఁడు పరికాలుని దనయొద్దఁ గొలువుంచుకొని, పడవలోఁ దనతోఁ గూర్చుండఁబెట్టుకొని దేశాంతరమునకుఁబోయి మరల నచ్చటినుండి యాపడవలోఁ బోఁకల నించుకొని వచ్చుచుండఁగా త్రోవలోఁ బరికాలుఁడొక గుండుపోకనుదీసి దానిని సగముగా రెండు బ్రద్దలు చేసి తన యజమానునితో 'ఇదిగో! ఈ నా సగముపోఁకను బడవలో నుండనిండు; మఱి నాకొక కాగితపుముక్కను. "ఈ పడవలో సగముపోక పరికాలునిది కలదని వ్రాసియిండనఁగా దానికావర్తకుఁడు "కావలసియుండిన వేయిపోఁకలను దీసికొనుము. చింతలే" దని పరికాలునకుఁ జెప్పెనఁట. కాని యతఁడు. "వలదు, వలదు. అన్యాయముగ దీసికొనుటకు నేను ధర్మహీనుఁడనుగాను; నాకాసగము పోకయే చాలును" అని తన యజమానునికి సమాధానము చెప్పఁగా నావర్తకుడమాయకుండగుటవలనఁ బరికాలుఁడు చెప్పినట్లే వ్రాసియిచ్చెనఁట.

పిమ్మట నాపడవ తనదేశమునకు వచ్చిచేరఁగాఁ బోకలను దించుటకుఁ బ్రయత్నము చేయఁదొడఁగెనఁట. అప్పుడు పరికాలుఁడు 'నాసగముపోకలిం'డని తనయజమాను నడుగఁగా నతఁడు (పరికాలుఁడు పెట్టియుండిన) యా సగము పోఁకలనే తీసి యియ్యఁబోయెనఁట. కాని పరికాలుఁడు. "ఈ పడవలోని సగము పోఁకలు నాయవి; నాసగము నేను దీసికొనయేతీరెద" నని యతనితోఁ బోట్లాడనారంభించ నాకలహము బలమై రాజపురుషులయొద్దకు బోవలసిరాఁగాఁ బరి

కొలఁదు, వర్తకుఁడు దనకువ్రాసియిచ్చిన (పడవలోని సగముపోఁవయి తన
వని వ్రాసియిచ్చిన) లేఖను వారికిఁ జూపెనఁట ఆ వర్తకుఁ డెన్నియోవిధ
ములఁ జెప్పినను యతఁడు వినక సగముపోఁడలను దీసికొనిపోయి వైష్ణవులకు
సమర్పింపఁగా వైష్ణవులు మిగులసంతసించిరఁట. ఇప్పఁటికి నా దొంగయు,
దోపుడుకాఁడునగు పరికాలుని విగ్రహమును దేవాలయములలో నుంచుచు
న్నారు. ఈ కథ భక్తమాలలో వ్రాయఁబడియున్నది. దీనివలన వైష్ణవులును,
వారి సేవకుఁడును, నారాయణుఁడును అను నీ ముగ్గురు దొంగలగుంపులోఁ
జేరినవారగుదురో కారో బుద్ధిమంతులే యూహింపవచ్చును

ఈ మత మతాంతరముల వారలలో నొకానొకఁడు గొంత మంచివాఁడై
యున్న నుండవచ్చునుకాని యీ మతమందుండుటచే నతఁడు పూర్ణముగ
మంచివాఁ డెన్నఁటికిని గానేరఁడు. ఇఁక జూడుఁడు! వైష్ణవులలోను భేదముల
కలవు. వేఱు వేఱు విధములైన తిలకములను, హారములను ధరించుచున్నారు.
రామానందు లిఱుప్రక్కలను గోపీచందన రేఖలను, నడుమ ఎఱ్ఱని రేఖను,
నీమావతమువారు రెండు సూక్ష్మరేఖలను నడుమనొకనల్లనిచుక్కను, మాధ
వుడు నల్లనిరేఖను, గౌడులను బంగాళీలు బాకువంటి రేఖలను, రామప్రసాద
సాంప్రదాయకులు రెండర్ధచంద్రాకారరేఖలను నడుమ నొక తెల్లని గుండ్రని
బొట్టును బెట్టుకొనుచున్నారు మఱి వీరిమాటలు గడువిలక్షణములుగానుండును.
రామానంద సాంప్రదాయకులు నారాయణుని వక్షస్థలమున నెఱ్ఱనిరేఖ లక్ష్మి
చిహ్నమనియు, గోసాయీలు శ్రీకృష్ణచంద్రుని హృదయస్థలమున రాధ విరాజ
మానురాలై యున్నదనియు నిత్యాదులు వచింతురు.

భక్తమాలలో నొక కథకలదు. అదేమన, నొక మనుష్యుఁడొక చెట్టు
క్రిందఁబరుండి నిద్రపోయి యా నిద్రలోనే మృతిచెందెనట. ఆ చెట్టుమీఁద
నొక కాకి కూర్చుండి మలము విడువఁగా నది వాని లలాటమునఁదిలకాకారమై
యుండెనఁట. యమదూతలు వానిని గొనిపోవుటకు రాఁగా నంతలో విష్ణుదూత
లును విచ్చేసిరట యమదూతలు మా స్వామి యాజ్ఞానుసారము మే మీతనిని
యమలోకమునకుఁగొనిపోయెదమనియు అట్లే విష్ణుదూతలు "మా స్వామి
యాజ్ఞాపించినట్లేతనిని మేము వైకుంఠమునకుఁదీసికొనిపోవుదు" మనియు
నిజపక్షముల దూతలు పరస్పరము జగడమాడఁ దొడఁగిరఁట కొసకు-

చూఁడుడు! వీని ముఖమున వైష్ణవతిలక మున్నది కదా! మీ రెట్లు తీసికొని పోఁగలుగుదురని విష్ణుదూతలు చెప్పఁగా యమదూతలు నిరుత్తరులై, వెడలి పోయిరఁట. అప్పుడు విష్ణుదూతలు సుఖముగా వానిని వైకుంఠమునకు గొని రాఁగా నారాయణుఁడు చూచి వానిని వైకుంఠముననే యుంచుకొనెనఁట. ఇట్ల కస్మాత్తుగా నేర్పడిన తిలకమునకే యింతటి మాహాత్మ్యము కలదన్న. ప్రీతి పూర్వకముగాఁ దమ చేతిలోఁ దిలకమును ధరించుకొనువారు సరకమునుజూడక నేరుగ వైకుంఠమునకే పోయెదరనుట కాశ్చర్యమేమి!!

చిన్న తిలకమును బెట్టుకొనుటవలననే వైకుంఠమునకుఁ బోవుదురన్న ముఖమునంతయు లేపనముఁ జేసికొన్నను లేక ముఖమంతయు నలుపుచేసి కొన్నను, దేహముమీదలేపనముఁజేసికొన్నను వైకుంఠమునుదాఁటి దానికంటె నుత్తమలోకమునకును బోవుదురా లేదా యని మే మడుగుదుము! ఇవన్నియు వ్యర్థాలాపములనుటయే నిక్కము. ఈ వైష్ణవులలో ననేకులు కొయ్యతోఁజేసిన కౌపీనధారులై, మంట వేయుచు, జడలు పెంచుచు, సిద్ధవేషములూని కొంగవలె ధ్యానావస్థలో నుందురు. గంజాయి చరస్సుల పొగలు పీల్చియు, భంగు ద్రాగియు గన్నులెఱ్ఱజేసికొనియు నుందురు. పిడికెఁడన్నము, పిండి, గవ్వలు పైసల కొఱకు బిచ్చమెత్తుచు, గృహస్థుల పిల్లవాండ్రను మోసముచేతఁ దమ శిష్యులుగాఁ జేసికొనుచున్నారు. చాలవఱకు వీరిలోఁజేరువారు కూలిపనిచేసి బ్రతుకు వారే. ఎవరైనను విద్య నభ్యసించుచున్నవారిని జదువవలదని చెప్పుచున్నారు. ఏలయనఁగా:-

పఠితవ్యం తదపి మర్తవ్యం దంత కటాకటేతి కిం కర్తవ్యమ్॥

సంతులకు విద్యలో నేమిపని! ఏలయనఁగా విద్య నభ్యసించువారు గూడఁ జచ్చుచున్నారు మఱి దంతకటాకట మేలచేయవలెను! సాధువులు నర్థి తల దిరుగవలెను; సంతులకు సేవ చేయవలెను. అట్లే రాముని భజియింప వలెను మౌర్ఖ్యము-అవిద్య-స్వరూపమును జూడగోరువారీబూదిపూఁతగాండ్రను వారియొద్దికిఁబోయి వారిం జూచివచ్చినఁ జాలును. వారికి తల్లిదండ్రులంతటి వారై యున్నను వారిని "అబ్బాయి" "అమ్మాయి" అనియే పిలుతురు. వీరివలెనే రూఖండీలు, సూఖండీలు, గోదడీలు, గుంపులుగుంపులుగానుండునుత రెసాయాలు.

అకాలీలు, కాన్ఫటీలు, జోగీలు, ఔఘడులు మొదలయినవారును గలరు. వీరం దఱు నొకే తరగతివారు.

ఒకప్పుడొక ఉదాసీపూంతశిష్యుండు నీరుం దెచ్చుటకు నూతియొద్దకుం బోయి 'శ్రీగణేశాయ నమః' అను మంత్రమును "స్రీగనే సాఇ నమె" అని పఠించుచుండంగా నట గూర్చుండియున్న పండితుం డొకండాతండుచేయుచున్న పాఠమును విని వానితో నతండు ఓసాధూ! నీవు పాఠముచేయుచున్నది తప్పు: "శ్రీగణేశాయ నమః" అని పఠించుమని చెప్పెను. ఆ మాట వినిన తత్క్షణమే యా శిష్యుండు చెంబులో నీరు నింపుకొని వెళ్ళి తన గురువుతో. "ఒక బాపండు నేను పాఠముచేయునది విని తప్పని చెప్పుచున్నాండు" అనెను. ఆ మాట చెవిని బడంగానే యా ఉదాసీపూంతగురువు బావియొద్దకువచ్చి. పండితుని జూచి నీవు నా శిష్యుని మనస్సు చెదరంగొట్టుచున్నావా? నీవు చదివినదేమి! నీకుం దెలిసిన దొకేపాఠము. చూడు! నాకు "స్రీగనేసాఇన్నమే" "స్రీగనేసాయన్నమే" "శ్రీగనేసాయ నమే" అని మూండుపాఠములు వచ్చుననెను

పండితుండు:—ఓ సాధుగారు! వినుండు! విద్య మహాకఠినమైనది. చదువకున్న నది లభింపదు.

బాబీ:—పోరా పో. విద్వాంసులనందఱు నిలిచిపేసినాను. భంగులో కలిపి త్రాగివేసినాను. సంతుల మహత్తు నేమనుకొన్నావు. బావండవు నీ వేమెఱుంగుదువు?

పండితుండు:—మీరు విద్య చదివియుండినయెడల నిట్టి యపశబ్దముం నుచ్చరింపక పోదురుగద! అన్ని విధములు మీకు దెలిసియుండునే!

బాబీ:—ఒరే! నీవిప్పుడునాకుగురువయ్యెదవా?నీయుపదేశమునునేవినను.

పండితుండు:-బుద్ధికే పట్టకున్న వినుటెక్కడ. ఉపదేశము వినుటకు గాని. తెలిసికొనుటకుంగాని విద్య కావలసియున్నది.

బాబీ:—శాస్త్రముల నెంత చదివియున్నను సంతులను సన్మానింపనివాడు ఏమియు' జదువనివాండనియే తెలియవలసినది.

పండితుండు:—ఔను; మేము సంతుల సేవ చేయుదుముగాని. మీ వంటి సోమరిపోతుల సేవచేయము. ఏలయనంగా సజ్జనులు, విద్వాంసులు, ధర్మాత్ములు పరోపకారము చేయువారు నగు పురుషులే సంతులన బడుదురు.

శాకి:—చూడు! మేము రాత్రింబవళ్ళు గుడ్డలులేక దిగంబరులమై, మంటల సెగలోఁ గూర్చుండి, గంజాయి చరస్సుల పొగను మితిమీఱ పీల్చుచుందుము. ఒక్కొక్క పర్యాయమునకు మూఁడేసి చెంబుల భంగును చులకనగ త్రాగుచుందుము. గంజాయి, భంగు, దత్తూరము, అను వీనియాకులను శాకమువలె వండుకొని తినుచుందుము. పాషాణమును, నల్లమందును గూడ మ్రింగివేయుదుము. మత్తులోఁ బడి రేయింబగళ్ళు నిర్వికారముగా నుందుము. ప్రపంచము సునదియే లేదని మేము తలఁచెదము బిచ్చమెత్తి రొట్టెలు చేసికొని దినుచుందుము. ఎవరు మాయొద్దఁ బరుండినను వారికిగూడ నిద్రపట్టనట్లు రాత్రంతయు దగ్గుచుందుము. ఇత్యాది సిద్ధులను, సాధుత్వములును మాయందున్నవి. మఱి నీవు మమ్మెందులకు దూషించుచున్నావు: ఒరే! తెలివిదెచ్చుకో; నీవు నన్ను నిందింతువేని నిన్నిప్పుడే భస్మము చేసివేసెదను సుమా!

పండితుఁడు:—ఇవన్నియు నసాధువులయు, మూర్ఖులయు, విద్యావిహీనులయు లక్షణములే కాని సాధువులవి కావు. వినుము 'సాధ్నోతి పరాణి కార్యాణి స సాధుః' ధర్మయుక్తములైన పనులు చేయుచు, నెల్లప్పుడు బరోపకారమునసే ప్రవర్తించుచు, దుర్గుణములు లేనివాఁడై విద్యావంతుఁడై సత్యోపదేశమువలన సందఱకు నుపకారమును జేయువాఁడు సాధువనబడును.

శాకి:-పోరా పో! సాధువుల కర్మములు నీకేమి తెలియును? సంతుల శక్తి నేమని యెంచినావు? సంతులతో వాదము వలదు. లేకపోయిన జూడు! "చిమటా పట్టుకారుతో నొకదెబ్బ పెర్పి కొట్టితినా, నీ బుఱ్ఱ బ్రద్దలగును సుమా.

పండితుఁడు:- సరి! శాకిగారు! మీ చోటికిఁ బోండు; నా మీఁద గోపమువలదు. రాజ్యమెట్టిదై యున్నది మీ రెఱుంగరుకాఁబోలు. ఎవరినైనను గొట్టితిరా పట్టుపడుదురు. చెఱసాల ననుభవింపవలసి వచ్చును. బెత్తపుదెబ్బలు దినవలసివచ్చును. లేదా మిమ్ములనే యెవరైనఁ గొట్టిన మీ రప్పు డేమిసేయుదురు! ఇది సాధుల లక్షణము కాదు.

శాకి:-పోదము పదరా శిష్యుఁడ! ఎటువంటి రాక్షసుని ముఖమును జూపితివిరా!

పండితుఁడు:-మీ రెన్నఁడును మహాత్ముల సహవాసము చేయలేదు చేసియుండిన మీయం దిట్టి మూర్ఖత్వముండెడిది కాదు.

ఖాఖీ:-మా యంతట మేమే మహాత్ములము. మాకు మఱి యొకరితో నవసరమే లేదు.

పండితుఁడు:-దౌర్భాగ్యులగు మీ బోఁటివారి కీలాటి బుద్ధియే కలిగి యభిమాన మెక్కువై యుండును.

అంత ఖాఖీ తన స్వస్థానమునకుఁ బోయి కూర్చుండెను. పండితుఁడును తన యింటికిఁ వెడలిపోయెను. ఇఁక సాయంకాలము కాఁగా హారతియయిన పిమ్మట నా ఖాఖీ పెద్దవాఁడని భావించి యతనియొద్దకు ఖాఖీలనేకులు వచ్చి "దండోత దండోత"అని సాష్టాంగ నమస్కారములు చేసి కూర్చుండిరి. అప్పుడా ఖాఖీ వారిలో నొకని జూచి యిట్లనియె ఒరే రామదాసీయా! నీవేమి చదివినావు?

రామదాసు:-మహారాజా! నేను 'వేస్నుసహసరనామ' చదివినాను.

మఱియొకనిఁజూచి:-ఒరే గోవిందాసియే! నీవేమి చదివినావు?

గోవిందదాసు:-నేను "రామసతవరాజము"ను ఫలానా ఖాఖీయొద్ద నేర్చినాను. అప్పుడు:-

రామదాసు:-మహారాజా, మీరేమి చదివినారు?

ఖాఖీగారు:-నేను గీతను జదివినాను.

రామదాసు:-ఎవరియొద్ద?

ఖాఖీగారు:-పోరా కుఱ్ఱవాఁడా! నే నెవ్వరినిగాని గురువుగాఁ జేసికొనను. చూడు నేను పరాగరాజమందుండగా నాకొక యచ్చరపు ముక్కకూడ రాకుండెను. పొడుగు తోవతిగల పండితునిఁ జూచినపుడెల్లగీతలోని యొక్కొక యచ్చరమును "ఈ వంకర యచ్చరం పేరేమి" అని యడిగియడిగి పదునెనిమిది యధ్యాయములను నూరి చంపినాను. నేనొక్కనినైనను గురువునుజేసికొనలేదు సుమా.

ఆహా! ఇటువంటి విద్యాశత్రువులం దవిద్య స్థిరపడియుండకున్న మఱి యెక్కడ నుండనగును!

ఇఁక మాదకద్రవ్యములను సేవించుట, సోమరులై పడియుండుట, పోట్లాడుట, భోజనము చేయుట, నిద్రించుట, శంఖముల నూదుట, గంటలు వాయించుట, నిప్పు రగులఁజేసియుంచుట, స్నానము చేయుట, ఉదుకుట, వ్యర్థముగ సన్నిధిశలందు సంచరించుట మున్నగునవి తప్ప వీరొక మంచి

పని నెంతమాత్రముఁ జేయరు. కాలనైనను గడుఁగింపవచ్చును గాని యీ కాలీల యాత్మలకు బోధపఱచుట మిక్కిలి యసాధ్యము. ఏలయనఁగాఁ గొం దఱకు శూద్రవర్ణములోనివారే కూలిచేసి, సేందున్ని, నీరుమోసి జీవించువారే తమ తమ పనులు మానివేసి. కేవలము బూడిదఁ బూసికొని కాళీ మొదలగు లికుంగుచున్నారు వారికి విద్యా సత్సంగముల మాహాత్మ్య మెంతమాత్రము విశదము గానేరదు. వీరిలో 'నాథు'ల కొఱకు "నమఃశివాయ" అనుమం త్రమును కాళీలకు "నృసింహాయ నమః" అనియు, రామావతులకు "శ్రీ రామచంద్రాయ నమః" లేక "సీతారామాభ్యాం నమః" అనియుఁ గృష్ణోపాసకులకు "శ్రీ రాధాకృష్ణాభ్యా న్నమః" "నమో భగవతే వాసుదేవాయ" అనియుఁ బంగాళీలకు "గోవిందాయ నమః" అనియుఁ మంత్రములు కల్పింపఁబడి యున్నవి. ఈ మంత్రములనే చెవిలోనూఁది తత్క్ష ణమే శిష్యులుగాఁ జేసికొనుచున్నారు. మఱియు 'సర్వాయీః సౌరకాయ మం త్రమును బఠింపుము' అను నీలాటి మంత్రముల నుపదేశింతురు:—

జల పవితర సథల పవితర ఔర పవితర కుల ।
శివ కహే సున పార్వతీ తుంబా పవితర హూఆ ॥

జలము పవిత్రము, స్థలము పవిత్రము. దాని పవిత్రము, సౌరకాయయు పవిత్రమని శివుఁడు పార్వతి కుపదేశించెనఁట. ఛీ ! ఇట్టి పాండిత్యముగల సాధువులవలన జగత్తున కేమియుపకారము కలుగఁగలదు ! మఱి యీ కా లీలు రాత్రిందివములను గబ్బెలను, ఏఱుఁబిఱుకలను గాల్చుచుందురు. ఒక నెలలో నెన్నియో రూపాయల కఱ్ఱలను గాల్చి బూడిదచేయుచున్నారు. ఇట్లొక నెల కఱ్ఱల మూల్యములో శతాంశధనమును వెచ్చపెట్టి కంబళి మున్నగు గుడ్డల గాని యానందముగ కాలము గడుపవచ్చునే. వారి కింతటితెలివి యెచటనుండి కల్గును ! ఇట్లు మంటసెగలఁ గాఁచుకొనుచున్నందులకే కద వారు తమంతట దాము తపస్వుల మని చెప్పుకొనుచున్నారు ఈ రీతినే తపస్వులయిన యెడల నరవిమనుష్యులు వీరికంటెను గొప్ప తపస్వులగుదురు. లేదా జడలు పెంచుట చేతను, బూడిదె పూసికొనుటచేతను తిలకములు దిద్దుకొనుటచేతను తపస్వు లగుదురన్న నట్లెందఱును తపస్వులు గావచ్చును వీరు బైరాగులుగాను లోన గడు లోభస్వభావము కలవారై యున్నారు.

ప్రశ్న:- కబీరు మతానుయాయులు మంచివారేనా?

ఉత్తరము:- కారు.

ప్రశ్న:- ఏల మంచివారు కారు? పాషాణాది మూర్తిపూజను నిరాకరింతురు కబీరుసాహెబు పువ్వులలోపలఁ బుట్టి, కడపటఁ బువ్వయి పోయినాఁడు. బ్రహ్మ, విష్ణు, రుద్రులు పుట్టుటకుఁ బూర్వమే కబీరుసాహెబు విద్యమానుఁడై యుండెను. వేదాది పురాణములలో లేని విషయములను గూడఁ గబీరు సాహెబు తెలిసికొనఁగలుగునంతటి సామర్థ్యముకల సిద్ధుఁడు సత్యమైన మార్గమును జూపినవాఁడు కబీరుఁడె మఱి వీరి మంత్రము "సత్యనామ కబీర" అను నిత్యాదులు.

ఉత్తరము:-పాషాణాదులను వదలి, మంచమును, మెత్తలను, దిండ్లను, పాకోళ్ళను, దీపమును బూజించుట పాషాణాదుల పూజకంటెఁ దక్కువయినది కాదు. కబీరుసాహెబు పుష్పములోఁ బుట్టుటకుఁ బురుగా? అంతమున పువ్వయి పోవుటకు మొగ్గయా! ఈతని గుఱించి యిచట వినఁబడు సమాచారము యథార్థమై యుండవచ్చునని తోచుచున్నది. అదేమన (కాశీలో నొక సాలెవాఁడుండెను. వాఁడు సంతాన రహితుఁడై యుండెను. ఒకనాఁటి రాత్రిసమయమున వాఁడొక సందున బడి పోవుచుండఁగా నాత్రోవయంచున నొకపూలబుట్టలో-ఆ రాత్రియే జన్మించియున్న యొక శిశువు-పడియుండుట చూచి వాఁడా పసికూనను దీసికొనివెళ్ళి తన భార్యచేతికిచ్చెను. ఆమె యా పిల్లవానిఁ బెంచెను. అతఁడు యుక్తవయస్కుఁడై నేతపని చేసికొనుచు సంస్కృతము నేర్చుకొన వలెనను తలంపుతో నొక పండితునియొద్దకుఁ బోయి యడుగఁగా నతఁడు (మేము సాలెవాండ్రకు నేర్పమని) యవమానపఱచెను ఇట్లనేక పండితుల యొద్దకుఁబోయి ప్రార్థించినను వారిలో నొక్కఁడును నతనికి జదువు చెప్పలేదు. అంతఁట దానే క్రమములేక యశుద్ధమైన భాషను గల్పించి సాలెలు మొదలగు నీచజాతివారికి బోధించుట కారంభించెను. తంబూరఁ బట్టుకొని పాడుచు పాటలు గల్పించుచు ముఖ్యముగాఁ బండితులను, శాస్త్రములను, వేదములను నిందించుచుండెను. కొందఱు మూర్ఖులతని బోధకు లోఁబడిరి. అతఁడు చావఁగానే జనులాతని నొకసిద్ధునిగాఁ జేసికొనిరి. అతఁడు తన జీవితకాలమున రచించియున్న కృతులనే యతని శిష్యులు పాఠము చేయుచువచ్చిరి. చెవిని

వీరు మూర్తిపూజను జేయరుకాని, దానికంటె నెక్కువగా దమగ్రంథములనుబూజించుచున్నారు ఇది మూర్తిపూజ కాదా యేమి? ఒక జడపదార్థమునకుఁ దలవంచి నమస్కారము కాని, పూజకాని చేయుట యున్నగు నవన్నియు మూర్తిపూజలే. విగ్రహారాధకులు దేరగాంద్రవలె తమ తమ దుకాణములను బెట్టి పొట్టపోసికొనునట్లే వీరుగూడ చేయుచున్నారు. పూజారులు మూర్తిని దర్శింపఁజేసి, దక్షిణలను బెట్టించునట్లే యీ నానక పంథులును గ్రంథమునకుఁ బూజచేయుచుఁ జేయించుచు దక్షిణలనుగూడఁ బెట్టించుచున్నారు. మూర్తిపూజకులు వేదములను గౌరవించునంతగా నీగ్రంథసాహెబువారు గౌరవింపరు. వీరు వేదములను వినలేదు,. కనలేదు అనుటకంటె మఱి యేమనగలము? వేదములను వినియో కనియో యున్నప్పుడు హతులు దురాగ్రహులు కానట్టి బుద్ధిమంతులందఱు 'వారేసంప్రదాయము వారైయున్నను' వేదమతమును స్వీకరింతురు. అయినను వీరందఱుఁ బనికిమాలిన భోజన నిర్బంధములను మాత్రము చాలవఱకుఁ దొలగించియున్నారు. దీనిని దూరపఱచినట్లే విషయాసక్తి, దురభిమానముగూడ వర్జించి వేదమతమును వర్ధిల్ల జేయుదురేని కడు మునయోగకరమై యుండును.

ప్రశ్న:- దాదూపంథుల మార్గమైనను మంచిదేనా?

ఉత్తరము:- వేదమార్గమే మంచిది దానిని బట్టగల్గితిరా బట్టుకొనుడు. లేనిచో నెల్లప్పుడును మునుకలు వేయుచునేయుందురు. వీరి మతమున దాదూజీ యను నతఁడు గుజరాతునఁబుట్టి, కొంతకాలమునకుఁ బిమ్మట జయపురమునకు సమీపముననున్న 'ఆమేరు' పట్టణమునకువచ్చి యచ్చట నివసించుచుండె ననియు, నా స్థలమున గానుగాది జీవించుచుండె ననియు జెప్పుచున్నారు. సృష్టిలోని విచిత్రలీల నేమనవచ్చును, అట్టి దాదూజీగూడఁ బూజింపఁబడ నారంభించెను. ఇప్పుడు వేదాది శాస్త్రోక్తముల నన్నిఁటిని మానివేసి కేవలం "దాదూరామ దాదూరామ" అని జపించుటవలననే తమకు ముక్తిలభించునని యతని శిష్యులు నమ్ముచున్నారు సత్యమార్గోపదేశకులు లేకపోయినపుడేదరు ఇట్టి విపరీతముల కవకాశము కలిగి యవి యాచారమునకు రాఁగలుగును,

శాహపురమున "రామస్నేహి" యను మత మొకటి యిటీవల బయలు దేఱినది. ఆ మతమువారు వేదోక్తకర్మముల నన్నిఁటిని మానివేసి "రామ

రామ" అని పిలుచుటయే మంచిదనియు, నందే జ్ఞానము, ధ్యానము ముక్తి యివన్నియు కలవనియు నమ్ముచున్నారు కాని యాఁకలియైనపుడు రామనామములో నుండి రొట్టెకాని, శాకముకాని వచ్చుటలేదు. అట్టి భోజనపానాదుల మాత్రము గృహస్థుల యిండ్లలోనే లభించును. ఇఁక వారుగూడ మూర్తిపూజను ధిక్కరించుచున్నారు. కాని తామే స్వయం విగ్రహరూపులై కూర్చున్నారు. మఱి రాములవారికి రామత్కారేనిది యానందమే కలుగ దన్నట్లు వారు విశేషముగ స్త్రీల సహవాసమందే యుండుచున్నారు.

ఇఁక నీ రామస్నేహీలను వారి మతవిషయమున గొంత వ్రాయుదుము:-

రామచరణు'డను సాధువొకఁడుండెను. అతనిమతము ముఖ్యముగా శాహపురమున-మేవాడ యను స్థానమున-వ్యాపించినది. ఆ మతస్థులు "రామ రామ" అనుటయే పరమ మంత్రమనియు, పరమసిద్ధాంతమనియు, నమ్ముచున్నారు. వారి మతగ్రంథమొకటి కలదు అందు సంతదాసాదులు చెప్పిన వచనములు వ్రాయఁబడినవి అందివచనము వ్రాయఁబడియున్నది:-

భరమ రోగ తబ హీ మిట్యా, రట్యా, నిరంజన రాఇ।
తబ జమ కా కాగజ ఫట్యా, కట్యా కరమ తబ జాఇ॥సాఖీ॥ సుమరణ.౧॥

రామరామ యని చెప్పుటవలననే యజ్ఞానమను భ్రమకాని, పాపమునకుఁ దగిన యమరాజు శాసనము కాని, చేసిన కర్మలు కాని యెన్నటికైన దూరము కాఁగలవా? ఇట్లు దూరమగుననుట సంభవమో? అసంభవమో? బుద్ధిమంతు లూహించి కనుగొనఁదగును. ఇది కేవలము మనుష్యులను పాపకూపములోఁ బడఁద్రోసి మనుష్యజన్మమును నష్టపఱచుటయే యననొప్పును. వీరికి ముఖ్య గురువైన రామచరణుఁ డేమి చెప్పుచున్నాడో గమనింపుఁడు:-

మహమా నాఁవ ప్రతాపకీ, సుణో సరవణ చిత లాఇ।
రామచరణ రసనా రటో। క్రమ సకల ఝడ జాఇ॥ ౧॥
జిన జిన సుమర్యా నాఁవ కూఁ।। సో సబ ఉతర్యా పార।
రామచరణ జో వీసర్యా। సో హీ జమకే ద్వార॥ ౨॥
రామ వినా సబ ఝూఠ బతాయో।
రామ భజత ఛూట్యా సబ క్రమ్మా। చంద అరు సూర దేఇ పరకమ్మా॥
రామ కహే తినకూ కై నాహీఁ। తీన లోకమే కీరతి గాహీఁ॥
రామ రటత జమ జోర న లాగై

రామ నామ లిఖి వఠర తరారు। భగతి హేరి దొరార హీ దరహీ॥
ఉంచనీచ కుల భేద విచారై। సోకో జనమ ఆవతో హారై।
సంతాఁ కై కుల దీస్తై నాహీఁ। రాఁమ రామ కహ రామ సమ్హాఁహీఁ॥
ఐసో కుల కో కింఠ గావై। హరి హరి జన కో పావన పావై॥
రామసంతాఁ కా అం న ఆవై। ఆవ ఆవకీ బుద్ధి నసుగావై॥ నామప్రతాపము॥

## వీనిఖండనము

మొదట రామసనేహదుల గ్రంథముల నవలోకించుటవలన నతఁడొక సరళస్వభావముకల గ్రామీణుఁడుగా నుండెననియు, నతఁడేమియుఁ జదివియుం డలేదనియు తెలియవచ్చుచున్నది. లేనిచో నట్టి వృథాలాపముల నెందులకు వ్రాసియుండును? రామ రామ యని నుడువుటవలనఁ గర్మ విమోచనము కలు గుననుట వీరి భ్రమయేకాని మఱియేమియుఁగాదు. దీనివలన వీరు తమ జన్మ ములనే కాక యితరుల జన్మములఁగూడ నష్టపఱచుచున్నారు. యమునిభయ మన్న చాల గొప్పది. కాని రాజభటులు, దొంగలు దోపుడుగాండ్రు, పులులు, పాములు, తేళ్ళు, దోమలు మున్నగువాని భయమైన నెప్పరును దూరముగుటలేదే. ఇష్టమైనట్లు రేయింబవళ్లు రామరామ యని యెంత యఱచిన నేమియుఁ గాదు గద. చక్కెర చక్కెర యనుటచే నోరుతీపి కానట్లు సత్యభాషణాది కర్మముల సేవింపక కేవల రామ రామ యనుటవలన నేమియుఁ గాదు. ఇఁక రామ రామ యనునపుడు వీరి రాముఁడు వినఁడేని బ్రతికిననాళ్లు అఱచినను వినఁడ నుటయే. వినునన్న రెండవతూరి రామ రామయనుట వ్యర్థము. వీరు తమ పొట్ట నింపుకొనుటకును, ఇతరులజన్మగూడ వ్యర్థము చేయుటకొఱకు నీ పాషండమత మును స్థాపించియున్నారు. వీరు తమపేరు 'రామ స్నేహి' అని పెట్టుకొని ముండలతోఁ గూడి 'రాండస్నేహి'ల పనులు చేయుచుండుట చూచియు, విని యుఁ గడు విచారఁ బొందుచున్నాము ఎచ్చటఁ జూచిన నచ్చట విధవలే యీ సంతుల నావరించుకొని యుండురు. ఇట్టి పాషండము నరువకపోయిన నీ యా ర్యావర్తమున కీ దుర్దశ యేల వాటిల్లియుండును? వీరు దమ శిష్యుల రుచ్చిష్ట మును దినిపింతురు. వీరికి స్త్రీలును నలువుఁగాబడి దండప్రణామము చేయు దురు. ఏకాంతమునందు స్త్రీలును, ఈ సాధువులును జేరి బీల లొనర్చు చుందురు.

ఇఁక వీరి మఱియొక శాఖ మర్వాడిదేశమునందుఁగల "ఖేడాపా" గ్రామ మున వెలువడినది. దానిచరిత్ర యేమనఁగా:-రామదాసుఁడను మాలవాఁడుండె ను. అతఁడు మహాచాకచక్యముకలవాఁడు అతనికిర్వురు భార్యలుండిరి. అతఁడు తానున్మత్తుఁడై కుక్కలతోఁ గూడఁ దినుచుండెను. వెమ్మట వామమార్గ మునఁబడి కుండా పంథుఁడును, తదనంతరము రామదేవుని *కామడియయు" గా జొచ్చెను. అక్లే తనయిరువురు భార్యలతోఁ గూడి గీతములఁ బాడుచుండెను. ఇట్లు సంచారము చేయుచు [జోధ్పూరు రాజ్యమునందున్న) సీథల్ అను గ్రామ ముఁజేరి అచ్చట మాలలకు గురువుగా నుండిన రామదాసుతోఁగలసి యతనికి రామదేవపంథము నుపదేశించి తనకు శిష్యునిగాఁ జేసికొనెను ఆ రామదాస నువాఁడు "ఖేడాపా" గ్రామమునఁ దన వసతిని నుదుర్చుకొనియెను ఇఁక నిచ్చట నీ మతమును, నచ్చట శాహపురమున రామచరణుని మతమునునడువసాగెను.

వాని చరిత్రకూడ నిట్లువినవచ్చినది:- అతఁడు జయపురములోని వైశ్యుఁడు. "దాంతడా" గ్రామమున నతఁడొక సాధువుతోఁ గలిసి వేషమును బూని యా సాధువును గురువుగాఁ జేసికొని శాహపురమునకు వచ్చి యచ్చట దన స్థలము నేర్పఱచుకొనెను. మూఢులం దా పాషండ మతబీజము త్వరలోనే యంకురించి స్థిరముగా నాటుకొనెను వీవియందంతటను పైఁజెప్పిన రామచర ణుని వచన ప్రమాణమును బట్టియే శిష్యులను జేసికొనుచున్నారు ఉచ్చనీచమను భేదమేమియు లేకుండ బ్రాహ్మణులు మొదలుకొని యంత్యజులపర్యంతము వీరికి శిష్యులగుచున్నారు. ఇప్పటికిని వీరు "కూండా" పంథులుగానే యున్నారు. ఏలయనఁగా వీరు మంటికుండలలోనే తిండి దినుచున్నారు. సాధువుల యెంగిలి కూడ తిందురు. ఈ సాధువులు వేదధర్మమునుండియు దల్లిదండ్రుల నుండియు, సాంసారిక వ్యవహారములనుండియు జనులను మోసపుమాటలచేతఁ దొలఁ గించి తమ శిష్యకూటములోఁ జేర్చుకొనుచున్నారు. ఇఁక రామనామమును మహా మంత్రమని నమ్ముచు దానినే "ఛుచ్చమ" (అనఁగా సూక్ష్మ) వేదమని కూడఁ జెప్పుదురు రామరామ యనుటచే ననంత జన్మపాపములు వదలిపోవు

*కాశీపురానలో చర్మకారుఁడు కాషాయ వస్త్రములను ధరించి, రామదేవాదుల శబ్దములను గ్రామములను చర్మకారులకును, అస్పృశ్యులకు వారలకును వినిపింతురు, వారు కామడియాలనఁబడు దురు. (సంశోధకులు)

మూసికొన్న వినఁబడు శబ్దము ననుసరించి 'అనహతశబ్ద'మను సిద్ధాంతమును స్థాపించిరి. మనోవృత్తికి 'సురతి'యను పేరిడుచున్నారు. దానిని (ఆ మనోవృత్తిని) ఆ శబ్దమును (అనహత శబ్దమును) వినుటయందు వినియోగపఱచుటయే పరమేశ్వరధ్యాన మనుచున్నారు. అట్లు వినియోగపఱచువానినే సంతుఁడనుచున్నారు. ఈయవస్థలో నున్నవారికి మరణము లేదట. వీరు బల్లెమువంటి తిలకము ధరించి చందనము మున్నగు కఱ్ఱపూసలను మెడల గట్టుకొనుచున్నారు. దీనివలన నాత్మోన్నతి కాని, జ్ఞానాభివృద్ధి కాని యెట్లు కానగునో యోచింపుఁడు. ఇది కేవలము పిల్లలాడుకొను నాటగా నున్నది.

ప్రశ్న:- పంజాబునందు 'నానకు' అను వారొక మతమును నడిపించి యున్నారు. ఎట్లనఁగా ఆయనకూడ మూర్తిపూజను ఖండించుచు లోకులను తురకలై పోకుండఁ గాపాడినవాఁడు. అతఁడు సాధువుగూడఁ గాఁడు. గృహస్థుడే. అతఁడుపదేశించిన యీ మంత్రమువలన నతని యభిప్రాయము మంచిదై యుండెనని విదితమగుచున్నది. చూడుఁడు:-

ఓం సత్యనామ కర్తా పురుష నిర్భౌ నిర్వైర
అకాలమూర్త అజోని సహభం గురు ప్రసాద జప ఆది
సచ జుగాది సచ హై భీ సచ నానక హోసీ భీ సచ ॥జపజీ పౌరి. ౧॥

(ఓం) ఎవఁడు సత్యనామముకలవాఁడో యతఁడేకర్త. పురుషుఁడును. భయవైర రహితుఁడు. అకాలమూర్తి-కాలమునకు లోఁబడనివాఁడు. అయోని సంభూతుఁడు. ప్రకాశమానుఁడు నై యున్నాఁడు. గురుపు ననుగ్రహముఁబడసి యతని జపముచేయుము. ఆపరమాత్ముఁడే యాదియందును, యుగాదులందును సత్యస్వరూపుఁడై యుండెను. ఇపుడు నున్నాఁడు. ఇకముందు నుండును.

ఉత్తరము:- నానకు నభిప్రాయము మంచిదే కాని. యతని యందు విద్య యేమాత్రము లేదు. ఐన నాప్రదేశపు గ్రామ్యభాషనుమాత్రమతఁడెఱిఁగి యుండెను. వేదాది శాస్త్రములను గాని, సంస్కృతమునుగాని చదివి యుండలేదు. చదివియే యుండిన "నిర్భయ" శబ్దమును "నిర్భౌ"యని యేల వ్రాసి యుండును? మఱియు దీనికి దృష్టాంతముగా నాయన రచించిన "సంస్కృతీ స్తోత్ర" మనునదియు నున్నది. అతనికి సంస్కృతమునం దరుగిడ వలయు నను నపేక్షకూడ నుండెను కాని, చదువకున్న సంస్కృత మెటుల రాఁగల

గును; అయినను సంస్కృతము నెప్పుడును వినియుండని గ్రామీణుల సమక్ష
మున "సంస్కృతీ" కృతిని రచించి సంస్కృతపండితుఁడై యుండవచ్చును
తనకు గొప్పతనమును, ప్రతిష్ఠయుఁగీర్తియు గలుగ వలెనను కోరిక లేకున్న
నీకార్యము నెప్పుడును జేయకుండును. అతఁడు నిజముగనే ప్రతిష్ఠ బొందగోరు
చుండెను. లేనిచో దానెఱిఁగియున్న భాషలోనే చెప్పుకొనుచు నేను సంస్కృత
మును జదువలేదని చెప్పవలసియుండెను. కొంతయభిమానము కలిగియున్నం
దులకే కదః మానప్రతిష్ఠలకై కొంత దంభముకూడ చేసియుండును. కావుననే
యతని గ్రంథములం దక్కడక్కడ వేదాదుల నిందా స్తుతులు కూడ నున్నవి.
ఏలయనఁగా నతఁడట్లు చేయకుండిన నతనితో వేదార్థ మడిగినప్పుడతఁడు చెప్ప
లేకున్న నతని ప్రతిష్ఠకు లోపము కలుగును. కావున ముందే తన శిష్యుల
యెదుట నతఁడచ్చటచ్చటవేదములకు విరోధముగాఁజెప్పుచుండెను. ఒక్కొకచోట
వేదములను మంచివనియు జెప్పియున్నాఁడు. ఏలయనఁగా నేమాత్రము వేద
ములను మంచివనిచెప్పకపోయినలోకులతనినా స్తికుఁడనియు నందురు. ఎట్లన:-

వేద పఠత బ్రహ్మ మరే చారో, వేద కహాని ।
సన్త (సార) కి మహిమా వేద న జానీ॥ సుఖమనీ అష్టపదీ.౭.పదము.౮॥
నానక బ్రహ్మజ్ఞానీ. ఆప పరమేశ్వర॥ సు.అష్ట.౮.ప.౬॥

వేదములను జదివిన వారందఱును గతించిరన్న నానకజీ మొదలగు
వారు తాము అమరులని తలంచుచుండిరా? వారు చావలేదా? వేదము సమస్త
విద్యలకు నిలయము అట్టి నాల్గువేదములను గథలని పల్కువారి పల్కు
లన్నియుఁ గథలేయని తెలియవలయును. మఱి మూర్ఖులే సాధునంతు లయి
నపుడు, పాపము! వారా వేదముల మహిమ యెన్నటికిఁ దెలిసికొనలేరుకదా!
ఇఁక నానకుగారు వేదములనే నమ్మియున్న నతని మతము ప్రచారమునకు రాక
యుండెడిది. అట్లే యతఁడు గురు పదవినిగూడ బొందకుండెను. ఏలయన
నతఁడు సంస్కృతవిద్య చదివియే యుండనపుడు, ఇతరులకుఁ జదువుచెప్పి
శిష్యుల నెట్లు చేసికొనఁ గలుగుచుండెను! నానకుగారు పంజాబుదేశమునఁ బుట్టి
పనిచేయునప్పుడా దేశమున సంస్కృతవిద్య బొత్తిగా లేదు. మఱి మహమ్మ
దీయులచే నా దేశవాసులు పీడింపఁబడుచుండిరి కావున నా సమయముననతఁడు
కొందఱను గాపాడెననుట నిక్కము. నానకుగారి జీవితకాలమున నతని సంప్ర

దాయ మంతగా వృద్ధిపొందలేదు. అతనికి శిష్యులును చాలమంది కాలేదు. కాని యవివేకులో నాచారమేమన నొక మనుష్యుఁడు మృతినొందిన పిమ్మట, వాని నొక సిద్ధుని జేసిపెట్టుదురు. అట్లే వానినొక గొప్పమాహాత్మ్య మును గల్పించి వాని నొక దేవునితో సమానముగాఁ దలఁచెదరు నానకు గారొక గొప్ప ధనాఢ్యుఁడుగాని, గొప్ప వంశస్థుఁడుగాని కాదు. కాని యతని శిష్యులు 'నానక చంద్రోదయము' 'జన్మసాఖి' మొదలగు గ్రంథములం దతఁడొక గొప్ప సిద్ధుఁడనియు, మహైశ్వర్య సంపన్నుఁడనియు [జనమ సాఖీ బాబాలా. పేజీలు ౪౭-౪౮] నతఁడు బ్రహ్మ మొదలగు వారితోఁ గలిసి, బహు సంభాషణలు చేయుచుండెననియు, వారందఱీయనను గౌరవించుచుండిరనియు నతని వివాహకాలమున బిలిమీజిన గుఱ్ఱములు, రథములు, ఏనుగులు, బంగారము, వెండి, మౌక్తికములు, వజ్రములు మొదలగు రత్నములు ఇవన్నియు నిండి యుండెననియు, నమూల్య రత్నములు గణనాతీతమై యుండెననియు వ్రాసి యున్నారు. ఔరా! ఇవన్నియు వట్టి కల్పనలుకాక మఱి యేమగును? ఇట్లు వ్రాయుట యాయన శిష్యులదోషమే కాని యాయనది కాదు. ఆయన గతించిన పిమ్మట నాయన కుమారునివలన నుదాసీలయు, రామదాసాదుల వలన నిర్మలులయుఁ దెగలు బయలుదేఱెను. ఆయనకుఁ దరువాత గురుపీఠమునకు వచ్చినవారు తామెంతయో వ్రాసి యాతని గ్రంథమునఁ జేర్చుచు వచ్చిరి. వీరి గురుసంతతిలోఁ బదియవయతఁడు గురుగోవిందసింహుఁడు. అతనికిఁ దరువాత నా గ్రంథమున నెవ్వరును వ్రాసి చేర్పలేదు. కానియతఁడువ్రాయఁ బడిన చిన్నచిన్న పుస్తకముల నన్నిఁటిని జేర్చియట్టులతో నొకే పుస్తకముగాఁ జేసియున్నారు. నానకుగారి యనంతరము వీరు నవేశపదములను కల్పించిరి. పురాణములలోని నానావిధ మిథ్యా కథలవంటి వెన్నిఁటినో వ్రాసిపెట్టిరి. వీరిని బ్రహ్మజ్ఞానులని, వీరే పరమేశ్వరులని భావించియేకద వీరి శిష్యులు కర్మోపాసనలు ద్యజించి వీరికే మ్రొక్కనారంభించిరి. ఇట్లు వీరు చాలవఱకు మతమును జెఱిపిపెట్టిరి. అట్లుకాక నానకుగారు అచ్చుతచ్చుత వ్రాసిన యీశ్వరభక్తివిషీరా చరించుచు వచ్చినను గొంత మేలుగ నుండెడిది. వర్తమానకాలమందు ఉదాసీలను వారు, నిర్మలు లనువారు తామే యధికుల మనియు, వీరి అకాలీయులను సూతరహసాయిలును తామందఱకంటె గొప్ప యనియుఁ దమలోఁదాము

వాదులాడుచున్నారు. గురునంతరి వారిలో గురుగోవిందసింహుడు తూరవీరు డయ్యెను. ఆయన తన పూర్వపురుషుల ననేకవిధములఁ గష్టపెట్టినతురుష్కుల మీఁది కసి తీర్చుకొనవలెనను నభిప్రాయము కలవాఁడు కాని యాయనయొద్ద తగిన సామగ్రి యేమాత్రములేదు. మఱొకవైపున తురుష్కుల రాజ్యము దేదీప్యమానమై ప్రజ్వరిల్లుచుండెను అప్పుడాయన యొక పురశ్చరణఁ జేయించి తనకు "దేవి యొకవరము నొక ఖడ్గము నొసఁగి నీవు మహమ్మదీయులతో యుద్ధము చేయుము; నీకు జయము కలుగునని" చెప్పినదని ప్రకటించెను. అప్పుడనేకు లతనితోఁ జేరిరి.

వామమార్గులు పంచమకారములను, చక్రాంకితులు పంచసంస్కారములను వారుకచేసినటులే ఈయన యుద్ధమున కుపయోగకరములయిన పంచకకారములను వారుతలోనికి దెచ్చెను అవియెవ్వి అనగా, (ఒకటి) 'కేశములు-వెండ్రుకలు' వీని నుంచుకొనుటవలన యుద్ధమునఁ దగులు గఱ్ఱలయు దెబ్బనుండి కొంత కాపుదలఁ గలుగనగును. (రెండవది) 'కంగణము' అనఁగా చక్రము, దీని నకాలీలు తలపాగాలలో నుంచుకొనుచున్నారు మరియు 'కర' అనగా నినుపకడెమును ముంజేతిని ధరింతురు. వీనివలన శిరస్సునకును, చేతులకును గొంత కాపుదల కలుగును (మూఁడవది) "కాఛ" అనఁగా గాసె దీని వలన బయగెత్తుటకును దుముకుటకును మిక్కిలి యనుకూలముగానుండును. దాలవఱకు గరడీలపై సాముచేయు మల్లులు, నటులుగూడ దీనిని ధరించుచున్నారు. ఏలయనఁగా దానివలన శరీర మర్మస్థానము రక్షింపఁబడును.ఇతనస్లే కొందరపాటున చేయఁబడు కార్యములందాటంకములు తూరఁ గలుగకుండును. (నాల్గవది) 'కంగా' అనఁగా దువ్వెన; దీనివలన వెండ్రుకలచిక్కువిడదీయనగును. (ఐదవది) 'కర్ద' లేక 'కాచూ' అనునొక కత్తివిశేషము.ఇది శత్రువులతో ముఖాముఖిగా యుద్ధము చేయునప్పుడు పనికివచ్చును. కావున గోవిందసింహగారు తమ బుద్ధికౌశలము నుపయోగించి, యీ పద్ధతి నానమ యముకొఱ కేర్పఱచి యుండిరి. ఈనమయమున వాని నుంచుకొనుటవలన నేవిధమైన యుపయోగములేదు. కాని యుద్ధ ప్రయోజనముకొఱకు నియమింపఁబడిన వాని నిప్పుడు తమ మతమునకు సంబంధించినవని నమ్ముచున్నారు.

బడునేని వాని ఫలముగూడ కృష్ణు డనుభవింపవలసివచ్చును గదా. అందుచే గృష్ణునిది. పుచ్చుకొనువారు తాముయి సమర్పణ చేయకొఱకు చేయించు కొనుచున్నారు. దేహమునగల మలమూత్రాదులు కూడ గోసాయిగారి కర్పిం పబడునవే రెండులకు; ఏమి: తియ్యని పదార్థములను గొఱుకు భుజింగుచు. వేదుగలవాని యుప్పున నుమ్మివేయునట్లు: మఱిగోసాయులకే యీ యర్పణ చేయవలసినది కాని యన్యమతస్థులకుగాదని కూడ వ్రాయఁబడి యున్నది. ఇవన్నియు స్వార్థముతోఁ గూడినట్టియు, పరులధనము నపహరించునట్టియు, వేదోక్త ధర్మమును నశింప జేయునట్టియు, పన్నుగడలే యనవొప్పును. ఈ వల్లభుని మాయోపాయములు గమనింపుడు :—

క్రావణస్యామలే పక్షే । ఏకాదశ్యాం మహానిశి ।
సాక్షాద్భగవతా ప్రోక్తం । తదక్షర ఉచ్యతే ॥ ౧॥

ఇత్యాది శ్లోకములు గోసాయుల సిద్ధాంతరహస్యాది గ్రంథములలో వ్రాయఁబడియున్నవి. ఇదియే గోసాయుల మతమందలి మూలతత్వము. శ్రీకృష్ణులు పరలోకవాసులై యుదుమించుగా నయిదువేలసంవత్సరములైనవి కదా: వారు వల్లభునితో శ్రావణ శు॥ ౧౧ నాటి రాత్రి నెట్లు కలిసిరని వీరి నడుగవలయును.

బ్రహ్మసంబంధకరణాత్ సర్వేషాం దేహజీవయోః ।
సర్వదోషనివృత్తిర్హి । దోషాః పంచవిధాః స్మృతాః ॥ ౨॥

గోసాయికి శిష్యుఁడయి సమస్త పదార్థములనెవఁడాతనికి సమర్పించునో వాని శరీర సంబంధములైనట్టియు, ఆత్మసంబంధములైనట్టియు సమస్తదోష ములు దూరమగును. మూర్ఖులను మోసపుచ్చి వారిని తన మతములోఁ జేర్చు కొనుటకై వల్లభుఁడు పన్నిన పన్నుగడ యిదియేగా: సరి గోసాయుల శిష్యు లయి, శిష్యురాండ్రు సమస్త దోషములు దూరమగునేని, మఱి రోగముల చేతను వారేల పీడితులగుచున్నారు:

ఇఁక నా దోషములైదుదివిధములుగా నున్నయవి.

సహజా దేశకాలోత్థా । లోకవేదనిరూపితాః ।
సంయోగజాః స్పర్శజాశ్చ । న మంతవ్యాః కదాచన ॥ ౩॥

ఒకటి:—స్వాభావికములు. కామక్రోధాదులవలనఁ బుట్టునవి.

రెండవది:-ఏదేశకాలములందో చేయఁబడిననానావిధములైన పాపములు.

మూఁడవది:-లోకమునఁ జెప్పఁబడు భక్ష్యాభక్ష్యములవలనఁ గలుగునవియు. వేదములందు (దోషములుగా) చెప్పబడిన మిథ్యాభాషణాదులును.

నాల్గవది:-దుస్సంగము అనఁగా దొంగతనము, వ్యభిచారము, తల్లి, తోఁబుట్టువు, కుమార్తె, కోడలు, గురుపత్ని మొదలగువారితో సంయోగించుట వలనఁ గలుగు సంయోగజన్యములు.

ఐదవది:- స్పర్శజములు—ముట్టరానివారిని ముట్టుటవలనఁగలుగునవి. ఈ పంచవిధ దోషములను గోసాయుల మతానుయాయులెన్నటికినినంగీకరింపఁ గూడదు. అనఁగా నిష్ఠానుసారము ప్రవర్తింపవలయు ననుట.

అన్యథా సర్వదోషాణాం । న నివృత్తిః కథంచన।
అసమర్పిత వస్తూనాం। తస్మాద్వర్జనమాచరేత్॥ ౪॥

దోషములు తొలఁగిపోవుటకు గోసాయి మతము తప్ప వేరొక మత మేదియు లేదు. కావున గోసాయులకు సమర్పింపఁబడని పదార్థములను వారి శిష్యులెంతమాత్ర మనుభవింపఁదగదు. ఇందులకే వీరి శిష్యులు తమ భార్యలను, బిడ్డలను, కోడండ్రను, ధనాది పదార్థములను గూడ వీరికి సమర్పించు చున్నారు. కాని సమర్పింపవలసిన నియమమిది. గోసాయిగారి చరణసేవలో సమర్పింప బడనంతవఱకు భర్త తన భార్యను దాకను రాదఁట.

నివేదిభిః సమర్ప్యైవ । సర్వం కుర్యాదితి స్థితిః ।
న మతం దేవదేవస్య । స్వామిభుక్తిసమర్పణమ్॥ ౫॥

కాన నీ గోసాయుల శిష్యులు సమర్పణ చేసినతర్వాతనే తమ తమ పదార్థములను భోగింపవలయును. ఏలయన దాము భోగించినతరువాత సమర్పణ చేయరాదు.

తస్మాదాదౌ సర్వకార్యే । సర్వవస్తు సమర్పణమ్ ।
దత్తాపహారవచనం । తథా చ సకలం హరేః ॥ ౬ ॥

కాఁబట్టి కార్యములందంతట నన్ని వస్తువులను మొదట సమర్పణ చేయవలయును. మొదట గోసాయిగారికి భార్యాదులను సమర్పించి పిమ్మటఁదాము స్వీకరింపవలయును. అట్లే హరికి సంపూర్ణ పదార్థములను సమర్పించి పిదపఁ దాము పుచ్చుకొనవలయును.

న గ్రాహ్యమితి వాక్యం హి । భిన్నమార్గపరం మతమ్ ।
సేవకానాం యథా లోకే । వ్యవహారః ప్రసిధ్యతి ॥ ౭ ॥

గోసాయిగారి మతముకంటె భిన్నమార్గమును బోధించు మాటలను గూడ నీ గోసాయుల శిష్యులును, శిష్యురాండ్రును వినరాదు, గ్రహింపను గూడదు. ఇదియే వారి శిష్యుల ప్రసిద్ధిలోనున్న వ్యవహారరీతి.

తథా కార్యం సమర్ప్యైవ । సర్వేషాం బ్రహ్మతా తతః ।
గంగాత్వే గుణదోషాణాం । గుణదోషాది వర్ణనమ్ ॥ ౮ ॥

గోసాయుల సిద్ధాంత రహస్యము ॥

ఇఁక నటులే యన్ని వస్తువులను సమర్పించి వాని యన్నిటియందు బ్రహ్మను భావింపవలయును. తదుపరి గంగలో నన్యజలముచేరి తద్రూపమును బొందునటులే స్వమతమున గుణములును, దక్కిన మతములందు దోషములును గలవని నమ్మి స్వమతమందలి గుణములనే వర్ణించుచుండవలయును.

ఇపుడు చూచితిరా ! తన ప్రయోజనమును సిద్ధించుకొనుటయం దన్ని మతములకంటె నీ గోసాయుల మతము మించియున్న దనవచ్చును గద. భలా: బ్రహ్మలక్షణమొక్కటిగూడ మీరెఱుఁగరే: మఱి శిష్యులకును, శిష్యురాండ్రకును బ్రహ్మ సంబంధము మీరెట్లు కలిగింపఁ గలుగుదురు ? అని యీ గోసాయుల నెవరైన నడుగవలయును. మేమే బ్రహ్మలము, మాతో సంబంధమగుటవలన బ్రహ్మ సంబంధము కలుగుచున్నదందురేని మీయందు బ్రహ్మ గుణకర్మ స్వభావములలో నొక్కటియును లేదు. కేవల భోగవిలాసములకొఱకు మీరు మీయంత బ్రహ్మలై యున్నారా? అని యడుగవలెను. సరే, మీరు శిష్యులను, శిష్యురాండ్రను సమర్పితము చేసికొని శుద్ధిచేయుచున్నారు. కాని మీరు, మీ భార్యలు, బిడ్డలు, కోడండ్రు మొదలగువారు సమర్పితులు కాలేదు గాన అశుద్ధములై యుండిరా, లేదా ? మఱి మీరు సమర్పితము కాని వస్తువులను అశుద్ధములని చెప్పుచున్నారు గదా! అట్టివారినుండియే యుత్పన్నులైన మీరు అశుద్ధులేల గారు? కాన మీరును మీ భార్య బిడ్డలు కోడండ్రు మొదలగువారి నన్యమతస్థులకు సమర్పించుచుండవలయును. అట్లు కూడదని చెప్పెదరేని, మీరు నన్య స్త్రీ పురుషధనాది పదార్థములనుగూడ సమర్పింపఁజేయుట, చేయించుట మానుఁడు. ఇప్పటివఱకు జరిగినదేమో జరిగినది: కాని యిఁకనైన నీ మిథ్యా పాషండాది దురాచారములను వదలుఁడు. మఱి చక్కని యీశ్వరోక్తం

ఁగు వేద విహిత మార్గము నవలంబించి. ఈ మానవజన్మమును సార్థకము చేసికొని ధర్మార్థ కామమోక్షములను నాలుగు ఫలములను బొందిన మీ రానందము ననుభవింపుండు. ఇఁకను గమనింపుఁడు: ఈ గోసాయులు తమ సంప్రదాయమును "పుష్టిమార్గ" మనుచున్నారు. అనఁగాఁ దినుట. త్రాగుట, బలియుట, స్త్రీలతో యథేష్టముగ భోగవిలాసములు చేయుట అను నివి యందుఁ గలవు కానఁ బుష్టిమార్గమందురు. కాని మహా దుఃఖకరములైన భగందరాది రోగములు కలిగి, చెప్పనలవికాని దురవస్థలోఁబడి చచ్చుచున్నారు. యథార్థమేమన నది పుష్టిమార్గము కాదు కాని కుష్ఠిమార్గ మననొప్పును. కుష్ఠు రోగి శరీరములోని ధాతువంతయు నీరునీరయి వెడలి పోవుచున్నట్లు వాఁడు విలపించుచు శరీరము వదలుచున్న యట్టియవస్థయే వీరియందును గానవచ్చుచున్నది. కావున దీనిని నరకమార్గమనుటయే సమంజసము. ఏలయనఁగా దుఃఖమునకుఁ బేరు నరకమును,సుఖమునకుఁ బేరు స్వర్గము నయియున్నది. ఈ విధమున మాయయను వలనుబన్ని యా వలలో నమాయకులయిన మూఢులఁ జిక్కించుకొని తమంతటఁ దాము శ్రీకృష్ణులమని చెప్పికొని యందఱకు స్వాములగుచున్నారు. గోలోకము నుండి యిచ్చటికి వచ్చియున్న దైవీ జీవుల నందఱ నుద్ధరించుటకొఱకు తాము లీలా పురుషోత్తములయి జన్మించిరనియు, తమ యుపదేశమును గ్రహింపనంతవఱకు నితరులకు గోలోకము లభింపదనియు. నచ్చట శ్రీకృష్ణుండొక్కఁడే పురుషుఁడును దక్కినవారందఱు స్త్రీలు గంరనియుఁ జెప్పుచున్నారు. ఔరౌరా! మీ మత మెంత బాగుగానున్నది !!! గోసాయుల శిష్యులెందఱు గలరో వారందఱు గోపికా స్త్రీలగుదురు గద ! ఇప్పుడొక పురుషున కిరువురు భార్యలున్న వాఁడెంతో దుర్దశ ననుభవించుచుండగా నొక పురుషుని గోట్లకొలఁది స్త్రీలొకరివెంట నొకరు తగిలిన, వాని దుఃఖమునకు మేరయుండునా ? చదువరులే యూహింపఁదగును. శ్రీకృష్ణునియందు గొప్ప సామర్థ్యము కలదు:ఆయన యందఱను సంతృప్తులను జేయునందురేని.స్వామిని యగు నాయనభార్య యర్ధాంగి యగుటవలన నామెయందుఁ గూడ శ్రీకృష్ణునితో సమానమైన సామర్థ్య ముండవలెనుగద. ఏలయనఁగా నిచ్చటి స్త్రీపురుషుల కామచేష్టలు సమానములో లేక పురుషులకంటె స్త్రీల కధికముగనో యున్నప్పుడు గోలోకమునందిట్లేల సంభవింపకుండును ; అట్లేయయియున్నఁ దక్కినఁ

సనియు. నట్లనని వారికి ముక్తి లభ్యముకాదనియు, శ్వాసప్రశ్వాసంతో 'రామ రామ' యని యుచ్చరించుటకు నేర్పునతఁడే సద్గురు వనియుఁ జెప్పుదురు. అట్టి సద్గురువును పరమేశ్వరుని కంటె నధికుఁగని భావించి అతని మూర్తినే ధ్యానింతురు. సాధువుల పాదములు గడిగి యా కడిగిన నీరు త్రాగుదురు. గురువువీడి శిష్యుఁడు దూరము పోవలసిపుడెల్ల గురువుగోళ్లను, నతనినడ్డము లోని వెంట్రుకలను దీసికొని తనయొద్దనుంచుకొని వాని చరణామృతమును ప్రతి దినమును త్రాగుదురు రామదాస హరిరామదాసుల వచనములుగల పుస్తకము లను వేదములకంటె నధికములని నమ్ముదురు వానికిఁ బ్రదక్షిణమును నేనిమిది దండప్రణామములను జేయుదురు. గురువు సమీపమున నున్నపు పతిసికి దండ ప్రణామములను జేయుదురు. స్త్రీ పురుష లందఱకు నొకే రామమంత్రము నుప దేశింతురు. నామస్మరణ వలననే శుభము కలుగునని నమ్ముదురు. చమువుల వలనఁ బాపము కలుగునని చెప్పుదురు. వీరి మత గ్రంథమునగల సాక్షి:-

వందతాఖ పానే పడీ। ఓ పూరబ లో పాప॥
రామ రామ సుమర్యా। బినా। రఖగ్యో లీతో ఆప॥ ౧॥
వేదపురాణ పఠే పఠ గీతా। రామ భజన బిన ఒహ గయే రీతా॥

ఇట్టి పుస్తకములను రచించియున్నారు. స్త్రీలకుఁ బతిసేవవలనఁ బాపము కలుగుననియు, గురుసేవయు సాధువులసేవయుఁ జేయుట ధర్మమనియుఁ జెప్పుదురు. వర్ణాశ్రమములు నమ్మరు. రామస్నేహి కాని బ్రాహ్మణుఁడు నీచు డనియుఁ, జండాలుఁడనియు రామస్నేహి యయిన నరోత్తము డనియు ననుచున్నారు. ఈశ్వరుఁడవతారమెత్తఁడని యందురు గాని పైనుదాహరించిన రామచరణుని వచనములలో వ్రాసినదేమన:-

భగత హేత బౌతా హి ధరహి

భక్తిసలుపుటకు సంతుల హితముకొఱకు మాత్రము అవతారమును గూడ నమ్ముచున్నారు. ఇత్యాది వీరి బూటకములన్నియు నార్యావర్తదేశమున కహితకరములయినవే. కాన నింతటితోనే బుద్ధిమంతు లధికముగ నూహించి గ్రహింపగలరు.

ప్రశ్న:—గోకులీయ గోసాయీల మతము మాత్రము మిగుల మంచిదే కదా! వారైశ్వర్యము నెట్లనుభవించుచున్నారో చూడుఁడు. ఈ యైశ్వర్యము మహిమ లేనిదే యబ్బగలదా?

ఉత్తరము:- ఈ యైశ్వర్యము గృహస్థులదేకాని గోసాయీలదేమియు కాదు.

ప్రశ్న:- సరిసరి: అది గోసాయీల ప్రతాపమువలనఁ గలిగినదే! అట్లు గాకపోయినఁ ఒక్కినవారికట్టి యైశ్వర్యములభించుటలే దెందులకు?

ఉత్తరము:- ఇతరులుగూడ నదేప్రకారము మాయోపాయములను బన్నిన ఐశ్వర్యములభించుట కేమిసందేహము? వీరికంటె నధికములైన టక్కులఁ బన్నిన నధికైశ్వర్యవంతులుగూడఁ గావచ్చును.

ప్రశ్న:- ఔరా! ఇందేమిటక్కులుకలవు? ఇదియంతయు గోలోక మహిమ కాదా?

ఉత్తరము:- ఇది గోలోకమహిమగాదు; కాని గోసాయీల మహిమయే. ఇది గోలోకమహిమయేయన్న గోలోకముగూడనిట్టిదే కావచ్చును గదా! ఈ మతము త్రిలింగదేశమునఁ బ్రచలితమైనది. అదెట్లన: లక్ష్మణ భట్టను తెనుఁగు బ్రాహ్మణుఁడొకఁడు పెండ్లిచేసికొని, యే కారణమువలననో తల్లిదండ్రులను భార్యనువదలి కాశికిఁబోయి, యచటఁదనకు వివాహము కాలేదని యబద్ధమాడి సన్న్యాసమును స్వీకరించియుండెను. దైవయోగమువలన నతని తల్లిదండ్రులు కును, భార్యకును నతఁడు కాశిలో సన్న్యాసియైయున్నాఁడను. వార్తతెలియఁగా, వారు ముగ్గురును గాశిఁజేరి యతనికి సన్న్యాసమిచ్చిన యతితో "ఈతని సన్న్యాసిగా నేలచేసితిరి: చూడుఁడీ స్త్రీ ఈతని భార్యయని చూపిరి. అతని పత్నికూడ "నాపతిని నాతోఁజేర్చకున్న నాకును సన్న్యాసము నొసఁగుఁడు" అని యాయతితో నడిగెను. అప్పుడాయతి యాతనిఁబిలిచి, "నీవు గొప్ప యసత్యవాదివి. సన్న్యాసమును త్యజించి మరల గృహస్థుఁడవుకమ్ము. ఏలయన, నీవబద్ధమాడి సన్న్యాసివైతివి" అని చెప్పఁగా నతఁడాతీతినే చేసెదనని సన్న్యాసమును వదలి వారలతోఁగలసిపోయెను. చూడుఁడు: ఈ మతము మూలమే యబద్ధముతో, కపటముతోఁ బూరితమైయున్నది. అనంతర మాతఁడు తెనుఁగుదేశమునకువెళ్లెను. అప్పటి వారెవ్వరు నతనిని కులములో జేర్చుకోలేదు. అప్పుడతఁడాదేశమును వదలి సంచారముచేయుచుఁ గాశికి సమీపముననున్న "చరణారగఢ" యందలి చంపకమను నరణ్యమునుబట్టిపోవుచుండగా నచ్చటనొక బాలకుని నెవరోవిడిచి పెట్టి "ఏ మృగమైన వానిని తక్షణమే చంపి తినకుండ" నలుదిక్కులఁ గొంత

దూరదూరమున గజ్జెలను రగులబెట్టి వానిని విడిచిపోయి యుండుట లక్ష్మణ భట్టు నతని భార్యయుఁ జూచి, యాశిశువును దీసికొని పుత్రునిగాఁ జేసికొనిరి. పిమ్మటఁగాశికిఁబోయి యచ్చట నివసించిరి. ఆ పిల్లఁడు పెద్దవాడయ్యెను.వాని తల్లి దండ్రులిరువురును గతించిరి. అఁతను బాల్యమునుండియు యువకుఁడగు నంతవఱకుఁగొంత చదువఁగలిగెను. కాని యనంతర మొకానొక విష్ణుస్వామి మందిరమునకుఁబోయి యచ్చట శిష్యుఁడై యుండెను. ఏకారణముననో వారితో పడనందున నాస్థలమును వదలి మరల గాశికివచ్చి సన్యాసముపుచ్చుకొనెను. ఇఁక నిటులే జాతిబహిష్కృతుఁడైన బ్రాహ్మణుఁ డొకఁడాకాశిలో నుండెను. అతనికొక యువతియైన కొమార్తెయుండెను అతఁడీ సన్యాసితో 'నీవు సన్యాసమును వదలి నా కుమార్తెను వివాహము చేసికొమ్మనఁగా నతఁడంగీకరించి యట్లే చేసికొనెను. తండ్రి యెట్టిలీలల చేసియుండెనో, వాని కొడుకట్లేల చేయ కుండును: ఇఁక నితఁడు తన భార్యను వెంటఁబెట్టుకొని, తానుముందుశిష్యుఁడై యుండిన విష్ణుస్వామి మందిరమునకుఁబోయెను. వివాహము చేసికొనిన కారణమున వాని నచ్చటినుండి వెడల గొట్టిరి. మొత్త మిల్లుకట్టుకొని వాసముచేయు చుండిన వ్రజదేశమునకుఁబోయి, యచ్చటఁ దనప్రపంచము ననేకవిధ మాయో పాయముల వ్యాపింపఁజేయఁ దొడఁగెను.శ్రీకృష్ణుఁడు నాకుదర్శనమిచ్చినాఁడు, "గోలోకమునుండి దైవీజీవములు మర్త్యలోకమునకు వచ్చియున్నవి. వానిని బ్రహ్మ సంబంధాదుల వలనఁ బవిత్రముచేసి గోలోకమునకుఁ బంపుము" అని నాతోఁజెప్పి నాఁడను నీ మొదలగు ప్రలోభనము గలుగఁజేయు మాటల మూర్ఖులకు వినిపించి కొంతమందిని (ఎనుబది నలుగురను) వైష్ణవులుగా జేసెను. ఈ క్రిందఁ గనఁబఱచిన మంత్రములను గూడ గల్పించెను. వానిలోను భేదములను గనఁబఱచి యున్నాఁరు. ఎట్లనఁగా:—

> శ్రీకృష్ణః శరణం మమ ॥ క్లీం కృష్ణాయ గోపీ జనవల్లభాయ స్వాహా ॥
> గోపాల సహస్రనామము. పద్మపు-ఉత్తరఖండము. అ. ౭. ౨. ౧౨౨॥

ఇవి రెండును సాధారణ మంత్రములు కాని యీక్రింది మంత్రము బ్రహ్మ సంబంధమును, సమర్పణమును జేయించునదఁటః-

> శ్రీకృష్ణః శరణం మమ సహస్రపరివత్సరమితకాలజాత కృష్ణవియోగజనిత తాపక్లేశానంత తిరోభావోఽహం భగవతే కృష్ణాయ దేహేంద్రియ-

ప్రాణాంతఃకరణ తద్ధర్మాంశ్చ దారాగారపుత్రాప్త విత్తేహ పరాణ్యాత్మనా
సహ సమర్పయామి దాసోఽహం కృష్ణః తవాస్మి॥

ఈ మంత్రము నుపదేశించి శిష్యులచేతను శిష్యురాండ్రచేతను సమర్పణమును జేయించుచున్నారు. "క్లీం కృష్ణాయేతి" ఇందలి 'క్లీం' అనునది తంత్ర గ్రంథములలోనిది. దీనివలన నీ వల్లభ మతము కూడ వామమార్గుల లోని భేదమనియే విదిత మగుచున్నది. ఇందుచేతనే గోసాయులు విశేషించి స్త్రీ సంగమము చేయుచున్నారు. "గోపీవల్లభేతి" కృష్ణుఁడు గోపికలకే ప్రియుఁడయి యుండెనా? తక్కిన వారికిఁ బ్రియుఁడై యుండలేదా? స్త్రైణుఁడు స్త్రీభోగమునందు లోలుఁడుగా నుండువాడె స్త్రీలకుఁ బ్రియుఁడగుచున్నాఁడు. ఏమి, కృష్ణుండట్లేయుండెనా? ఇఁక "సహస్రపరివత్సరేతి" అని సహస్ర వర్షములు గణించినది వ్యర్థమే. ఏలయనఁగా వల్లభుఁడు గాని, అతని శిష్యులు కాని సర్వజ్ఞులు కారుగద. కృష్ణుని వియోగమై వేయిసంవత్సరములే యైనవా యేమి? సరి! ఈ వల్లభమతమును, వల్లభుఁడును పుట్టియుండనంతవఱకు తన దైవీజీవుల నుద్ధరించుట కేలరాలేదు? తాపము, క్లేశము అను నీ రెండును పర్యాయవాచక శబ్దములు. కాన నీరెంటి నుపయోగింపక వీనిలో నొక్కటి మాత్రమే గ్రహింపవలసియుండెను. అట్లే "అనంత" శబ్దమునుపఠించుటగూడ వ్యర్థమే. ఏలయనఁగా ననంత శబ్దము నుపయోగించినపుడు "సహస్ర" శబ్దము నుపయోగింపఁగూడదు. మఱి సహస్ర శబ్దమునే యుపయోగించిన ననంత శబ్దపాఠము సర్వథా నిరర్థకమగును. అనంతకాలమువఱకు "తిరోహితుఁ" డనఁగానాచ్ఛాదితుఁడయి యున్నట్టిపురుషునిము క్తికొఱకువల్లభుఁడు ప్రాదుర్భవించుటగూడ వ్యర్థమే. ఏలయనఁగా ననంతమున కంతముండదు. ఇవన్నియు నట్లుండగా దేహేంద్రియములను, ప్రాణాంతఃకరణములను, వాని ధర్మమును, పత్నిని, స్థానమును, పుత్రులను, ప్రాప్తధనమును గృష్ణున కేలయర్పణ చేయవలెను? ఏలయన గృష్ణుఁడు పూర్ణకాముఁడగుటవలన నొకరి దేహాదులను కోరఁజాలఁడు. మఱి దేహాదుల యర్పణ చేయుటయును సంఘటింపదు. ఏమన నఖశిఖాగ్ర పర్యంతము దేహమనఁబడును. కావున దానిలో మంచివస్తువులును, చెడ్డవస్తువులును గలవే మఱి మలమూత్రాదులు గూడ నెట్లు అర్పణ చేయఁ బడఁగలవు? ఇఁక పాపపుణ్యరూపములై యున్న కర్మములను కృష్ణునకర్పింపఁ

స్త్రీలకును స్వభార్యకును జాల తగవులు. కొట్లాటలు జరుగుచుండవచ్చును. ఏలయన(గా సవతులపోరు మహోపద్రవకరమైయుండును. కావున నా గోలోక స్వర్గమనునది నరకమును బోలియుండవచ్చును. లేదా యనేక వ్యభిచారులగు పురుషులు భగందరాది రోగములచే( బీనతులగుసట్లు గోలోకముకూడ( బీడింప( బడుచుండవచ్చును ఛీ! ఛీ!! ఛీ!!! అట్టి గోలోకముకంటె సీమర్త్య లోకమే మేలుగద. చూడుడు! ఇచ్చట గోసాయులు తమంతట(దామే శ్రీకృష్ణుల మని యనేక స్త్రీలతో( గ్రీడించుటవలన భగందర ప్రమేహాది రోగములచేత( బీడితులై మహాదుఃఖముల ననుభవించుచున్నారు. ఇపుడు తన స్వరూపులయిన గోసాయులు పీడితులగుచుండ(గా నా గోలోక స్వామియైన శ్రీకృష్ణు( డీరోగ ముంచే నేల పీడింప(బడ కుండునో చెప్పు(డు. అట్లుకాదందురేని యతని స్వరూపులైన గోసాయు లేల పీడితులగుచున్నారు?

ప్రశ్న:- మర్త్యలోకమున లీలావతార మెత్తినందున సీ రోగదోషములు కలుగుచున్నవే కాని గోలోకమున( గలుగవు. అచ్చట రోగదోషములులేనేలేవు.

ఉత్తరము:- 'భోగే రోగభయమ్' [భర్తృహరి. వై రా. శ. శ్లో. ३३] ఎచ్చట భోగముండునో యచ్చట రోగము తప్పక సంభవించును. శ్రీకృష్ణున కా కోట్లకొలది స్త్రీలవలన సంతానము కలుగుచున్నదా లేదా? కలుగుచున్న దన్న సందటు కొడుకులే పుట్టుచున్నారా, కూతుండ్రా? లేదాకొడుకులునుగూతుం డ్రును గూడ( బుట్టుచున్నారా? కూతుండ్రే పుట్టుచున్నారంటిరేని వారి నెవరికిచ్చి వివాహము చేయుచుండవచ్చును? అచ్చట శ్రీకృష్ణు(డు తప్ప మఱొక పురుషు(డెవ్వ(డును లే(డుగద. మఱియొక దున్నా(డంటిరా మీరు చేసిన ప్రతిజ్ఞ భంగమైపోవును. లేదా, అందఱు కొడుకులేపుట్టుచున్నారన్నను నీ దోషమే తటస్థించును. వారికి వివాహ మెవరితోడ నెక్కడ( గావచ్చును? అథవా యింటనే తమలో( దాము సర్దుకొనుచున్నారా? లేదా యితర బాలబాలికలుగూడ నున్నా రంటిరేని "గోలోకమున శ్రీకృష్ణు( డొక్క(డే పురుషుడున్నా(డని మీరు చేసిన ప్రతిజ్ఞ నష్టమైపోవును. ఒకవేళ సంతానమే లేదని చెప్పితిరా శ్రీకృష్ణునియందు నపుంసకత్వము, స్త్రీలయందు గొడ్డుతనము అను దోషములు వచ్చును. సరి, మీ గోలోకమా! ఢిల్లీ బాదుషహా బీబీల సైన్యమనియే కద తెలియనగును. ఇ(క గోసాయులు తమశిష్యులయు శిష్యురాండ్రయు( తను మనో ధనములను

దమరు నర్పణ చేయించుకొనుచున్నారే అదియును సరియైనది కాదు. తనువు వివాహసమయమందే భార్యాభర్తల క్రిందొరులకు సమర్పణమగుచున్నది. మనస్సు ఇతరులకు సమర్పింపఁబడనేరదు. ఆ మనస్సుతోడనే కద, తనువుగూడ సమర్పింపఁబడుచున్నది. ఇట్లు మరల సమర్పింపబడునేని యది వ్యభిచారమనఁబడును. ఇంక మిగిలినది ధనము కద! దీని లీలయు వినిపించుము. మనస్సుతోఁగాక యే పదార్థమును సమర్పింపఁబడనేరదు. సంపాదించువారు శిష్యులు అనందించువారము మేము. అనియే ఈ గోసాయుల యభిప్రాయము. ఇంతవఱకీ వల్లభ సాంప్రదాయికులగు గోసాయులలో నెవ్వరును వెనుఁగు జాతివారు లేరు. మరచియో, తెలియకయో వీరికి పిల్లనిచ్చినవారుకూడ జాతి నుండి వెలివేయఁబడుచున్నారు. ఏలయన వీరు జాతిబాహ్యులైన భ్రష్టులు. ఏక విద్యావిహీనులై యున్నందున రేయింబగళ్ళు సోమరులుగాఁ బడియుందురు.

ఇంకను జూడుఁడు! ఒకానొకఁడు పాదపూజఁజేయ గోసాయిగారిని దోడ్కొనిపోయినపుడు కొయ్యబొమ్మవలెకదలక మెదలకఁ మౌనముగ వాని యింటఁ గూర్చుండును. పాపము, నోరెత్తినపుడే మూర్ఖుఁడని తెలియఁబోవు గద. 'మూర్ఖాణాం బలం మౌనమ్' మూర్ఖులకు మౌనమేబలమన్నట్లువారు లాడిన పరువు తగ్గుననుకొనును. కాని స్త్రీలనుమాత్రము తెప్పవాల్పక చూచుచుండును. ఎవతెమీఁద గోసాయిగారి దృష్టిపడునో ఆమె భాగ్యము గొప్పదని ఆమె పెనిమిటి, సోదరులు, బంధువులు, తల్లిదండ్రులుమహాప్రసన్నులగుదురు. ఇఁకనప్పటి స్త్రీలందఱును గోసాయిగారి పాదములను ముట్టుచుందురు. అప్పుడే స్త్రీమీఁద గోసాయిగారికి మనస్సు పోవునో, దయ కలుగునో యామెవ్రేలిని దన కాలితో నొత్తిపట్టును. అప్పుడా స్త్రీయును, ఆమె పెనిమిటి మొదలగు వారందఱును దమ భాగ్యమని యెంతురు. ఇఁక నట్లే యామెపెనిమిటిమున్నగు వారు ఆమెతో, నీవు గోసాయిగారి చరణసేవలో నుండుమని చెప్పుదురు. ఒకానొకచోట నా స్త్రీ పెనిమిటి మొదలుగాఁగల వారట్టి పని కిష్టపడక పోయిరేని దాసీంమూలమునసో, కుంటెనకత్తెంమూలముననో తన పనినెఱవేర్చుకొనును. వారిమందిరములలో వారిసమీపమున నిట్టి కార్యములు చేయువార లనేకులుందురనుట స్పష్టము.

ఇఁక వీరు దక్షిణలు లాగుటకుఁ బన్నిన పన్నుగడలు గమనింపుఁడు. గోసాయిగారికిని, గోసాయమ్మగారికిని, బుత్రునికిని గూఁతురునకును ముఖ్య సేవకునికిని బరిచారకులకును, గాయకునకును శ్రీకృష్ణ విగ్రహమునకును దక్షిణల సమర్పింపుఁడని యీ యేడుగళ్ళ పేర యథేష్టముగా దోఁచుకొను చున్నారు. ఇఁక గోసాయిగారి శిష్యులలో నెవఁడేని మరణించునపుడు గోసాయి గారు వాని యెదమీఁదఁ దన పాదము నుంచును. ఏమి దొఱికినను గోసాయి గారు అపహరింపకొందురు. ఇది మహా బ్రాహ్మణులును, కాటిపాపలు జేయు నట్టి పనికాదా? కొందఱు శిష్యులు వివాహమున గోసాయిగారిని బిలిచి యతని చేతనే వధూవరుల పాణిగ్రహణము చేయింతురు. కొందఱు సేవకు లాతనికిఁ గేసరీ స్నానమును జేయింతురు. అనఁగా గోసాయిగారి శరీరమునకు స్త్రీలు కేసరి లేపనముచేసి, యొకపెద్ద పాత్రయందొక పీటనుంచి, దానిపై గోసాయి గారిని గూర్చుండఁబెట్టి, స్త్రీ పురుషులందఱును జేరి స్నానము చేయింతురు. కాని వారిలోఁ దఱచుగ స్త్రీలే స్నానముచేయింతురు. తదనంతరము గోసాయి గారు పీతాంబరము ధరించి తడిదోవతి నా పాత్రయందే విడిపావుకోళ్ళదొడిగి, బయటికి విచ్చేయుదురు. పిదప నా నీటిని శిష్యులందఱును ఆచమనము చేయు దురు. తరువాత మంచి మసాలావేసి తాంబూలము గట్టి గోసాయిగారికిత్తురు. అతఁడు దానిని నమిలి కొంత మ్రింగి తక్కినదానిని, దన శిష్యుఁడు నోటియొద్ద నెత్తిపట్టుకొనియుండిన వెండిగిన్నెలో నుమ్మివేయును. అది ముఖ్యప్రసాద మఁట. దానినిగూడ బంచుకొని సేవింతురు. ఇప్పుడు వీరెట్టి మనుష్యులోఁ తను గొనుఁడు. ఇంతకుమించినమౌఢ్యముగాని, అనాచారముగానియుఁ యేముండును?

ఇఁక ననేక గోసాయులు సమర్పణలు పుచ్చుకొందురు. వారిలో నెం దఱో వైష్ణవుల చేతివంటను దిందురేకాని తక్కినవారిచేతఁ దినరు. కొందఱు వైష్ణవుల చేతివంటఁగూడ దినరు. వారు వంటచెఱకులను గూడఁ గడిగి వాడు కొందురు; గాని పిండి, బెల్లము, చక్కెర, నెయ్యి మొదలగువానిని గడుగుట వలన స్పర్శదోషము నివారణమగును గదా! పాపము వారేమి చేయఁగలరు! కడు గుదు రేని యా పదార్థములన్నీ పోఁగొట్టుకొనవలసివచ్చును. ఇఁక వారు "మేము శ్రీకృష్ణమూర్తిగారి యలంకార గానభోగములకొఱకుఁ బాలంద్రవ్యమును వెచ్చ పెట్టుచున్నా" మనిచెప్పుదురు. కాని యాయలంకారగానభోగములు దామే యను

లవించుదురు నిజముగఁజూచిన వీరు గొప్పయుద్యమములను జేయుచున్నారు. అనఁగా హోలిపండుగలలోఁ జిమ్మనగొట్టములనిండ రంగునునింపి స్త్రీలరహస్యావయవములు- మర్మస్థానముల మీఁద జిమ్ముదురు. మఱియు బ్రాహ్మణులకునిషిద్ధమయిన రసవిక్రయముగూఁడ జేయుదురు

ప్రశ్న:— గోసాయిగారు రొట్టెలు. పప్పు. పాయసము. కూరలు. లడ్డువులు మొదలగువానిని ప్రత్యక్షముగా నంగటఁ బెట్టి తామేకూర్చుండి యమ్ముట లేదు. కాని తమపరిచారకులకు విస్తళ్లలోఁ బెట్టియిత్తురు. వారుకొనిపోయి అమ్ముకొనుచున్నారే కాని గోసాయిగారు కారు.

ఉత్తరము:-గోసాయిగారు వారికి మాసిక వేతనములిచ్చుచుండిన వారా విస్తళ్ల నెందులకుఁ దీసికొందురు? గోసాయిగారు తమ సేవకులకుఁ బప్పు అన్నము మొదలగువానిని సేవకు మారుగ నమ్ముచున్నారు వారు వానిని దెచ్చి బజారులో నమ్ముకొనుచున్నారు గోసాయిగారు తామే బజారులో నమ్మిన నా బ్రాహ్మణాది సేవకులు రసవిక్రయ దోషమునుండి రక్షింపఁబడి యొక గోసాయిగారు మాత్రమే యా రసవిక్రియరూపపాపము ననుభవింతురుగద. మొదటఁ దామీ పాపమునఁబడి మునుఁగుచు నితరులనుగూడ నందుఁబడవేయుచున్నారు నాథద్వారము మొదలగు స్థలములందీ గోసాయిగాలుకూడ నన్నాదులు విక్రయించుచున్నారు. రసవిక్రయము చేయుట నీచుల పనియే కాని ఉత్తముల పని కాదు. ఇట్టివారే యీయార్యావర్తమున కధోగతి గలుగఁ జేసినవారు.

ప్రశ్న:-స్వామి నారాయణ మత మెట్లున్నది?

ఉత్తరము:-'యాదృశీ శీతలాదేవీ తాదృశో వాహనః ఖరః' ధనాపహరణాదు లందు గోసాయిగారి విచిత్రలీలలెట్టివో నారాయణస్వామియు నట్టివే చూడుఁడు! సహజానందుఁడను వాఁడు అయోధ్య సమీపమునందున్న యొక గ్రామమునఁ బుట్టినవాఁడు. అతఁడు బ్రహ్మచారియై గుజరాత్. కాఠియవాడ్ కచ్ఛ. భుజ్జ మొదలగు దేశములందు సంచారము చేయుచుండెను ఈ దేశము లందలి జనులు మూర్ఖులును. అమాయకులు నయియున్నారు. తాను వీరిని దన యభీష్ట మతమునందింపఁగలుగుదునని భావించి మువ్వుర నలువురను శిష్యులుగాఁ జేసికొనెను పరస్పర మంతనాలోచించుకొని సహజానందుఁడు నారాయణుని

యవతారమనియు, మహాసిద్ధుఁడనియు. భక్తులకుఁ జతుర్భుజములతో సాక్షాత్తుగ దర్శనమిచ్చు చున్నాఁడనియు నప్పటి జనులా శిష్యులు ప్రకటించిరి.

ఒకప్పుడు కాఠియవాడలో దాదాసాహెబను ఒక జమీందారుఁడుండెను. అతనితో నీశిష్యులు "చతుర్భుజ నారాయణుని దర్శనము చేసికొన వలెనను తలంపు మీకున్నచో మేము సహజానందుల వారిని వేడుకొందు" మనియుఁ జెప్పిరి శుద్ధ అమాయకుఁడు గావున నతఁడు మంచిది కానిమ్మని వారితో ననెను. అపుడొక గదిలో సహజానందుఁడొక కిరీటమును తన తలను ధరించుకొని. రెండుచేతులలో శంఖ చక్రముల నుంచుకొని. యా చేతులను మీఁదికిఁ జాచి పట్టుచుండెను. మఱియొకఁడు వానివెనుక నిలిచి. గదాపద్మముల పట్టుకొన్న తన రెండుచేతులను సహజానందుని చంకలలో నుండి దూర్చి ముందుకుఁ జాచి. చతుర్భుజమూర్తి యాకార మగుపడునట్లు చేసెను తక్కిన శిష్యులు దాదాసాహెబునితో "మీరొకసారి కన్నులు తెఱచి చూచి, మరల మూసికొని, తత్క్షణమే యావలకు వెడలి రావలయును. చాల చూచిన నారాయణుఁడు కోపగించు" నని చెప్పిరి. (తాము చేసిన కపటము నతఁడు పరీక్ష చేయఁగూడదని వారి తలంపు) అప్పుడతని నచ్చటికిఁ బిలుచుకొనిపోయిరి సహజానందుఁడు తళతళ మెఱయు జరీవస్త్రములను. పట్టుపీతాంబరమును ధరియించి యొక చీఁకటి గదిలో నిలిచి యుండెను అతని శిష్యులున్నట్టుండి యొకసారి దీపకాంతిచేత నాగదియంతయు దేదీప్యమానమగునట్లు చేసిరి. దాదాసాహెబుని కంటికెదురుఁ జతుర్భుజమూర్తినిలిచి యుండుట కానవచ్చెను తత్క్షణమే యాదీపములను మలిపివేసిరి. అంతటను నేలఁబడి నమస్కారములు చేసెను. వచ్చినత్రోవనుగాక వేఱు త్రోవనుబట్టి దాదాసాహెబుని బిలుచుకొనివచ్చుచు. నతనితో, "మీభాగ్యము నేఁడు ఫలించినది. మీరిఁక మహారాజుగారి శిష్యులు కం" డని. చెప్పఁగానతఁడు మిక్కిలి సంతోషించి యాశిష్యులతో ననెను. వారాతని నింకొకచోటికి తీసికొని వచ్చునప్పటికి. నప్పటి వేషవస్త్రములు ధరించి మెత్తమీఁదఁ గూర్చుండి యున్న సహజానందుఁడు దృష్టిగోచరుఁడయ్యెను. అప్పుడా శిష్యులు దాదాసాహెబునితో. "చూచితిరా! వేఱు స్వరూపము ధరించి యిప్పుడిచ్చటఁ జనుదెంచియున్నా రు" అని చెప్పిరి. అప్పుడు దాదాసాహెబుఁడు పూర్తిగా వారి వలలోఁ జిక్కెను. అప్పటినుండి యీ మతము చేత గట్టిగా నాటుకొనియెను దాదాసా

చరు: తనువాఁడొక గొప్పజమీందారుఁడుగా నున్నందున నచ్చటనే యీ మత మును స్థిరపరచుకొని. యా సహజానందుఁ డిక్కడక్కడ నుపదేశము చేయు చుఁ దిరుగుచుండెను. ఎందఱనో సాధువులనుగూడఁ జేసెను. అప్పుడప్పుడొక సాధువుయొక్క కంఠనాడిని నులిమి, మూర్ఛగలుగఁజేసి వానిని సమాధిస్థునిగాఁ జేసితి నని జనులను మోసపుచ్చుచుండెను. కాఠియవాడ్ జను లమాయకులగుటఁ బట్టి యతని టక్కులకుఁ లోఁబడిరి. సహజానందుని మరణానంతర మతని శిష్యులు అనేకానర్థములు వ్యాపింపఁ జేసిరి.

ఈ విషయమున నొకదృష్టాంత ముచితమని తోఁచుచున్నది. ఒకఁడు దొంగతనము చేసినందులకు పట్టుకొనఁబడెను. న్యాయాధీశుఁడు వాని ముక్కు చెవులు కోసివేయవలెనని దండనవిధించెను. ముక్కును గోయఁగానే యావం చకుఁడు నాట్యమాడుటకు, గానముచేయుటకు, నవ్వుటకునారంభించెను. జనులు చూచి నీవేల నవ్వుచున్నావని వాని నడిగిరి. దానికి వాఁడు, "అది చెప్పఁదగి నదికాదు" అనెను. అదియేల చిత్రమని మరల వారడిగిరి: మహా అద్భుతమ యిన చిత్రము. నేనెప్పుడును జూడలేదని వాఁడనెను అప్పుడు వారు "అది యేమిచిత్రమో చెప్పవలె"ననిరి. దానికి వాఁడు, "అహా! సాక్షాత్తుగ చతుర్భుజ నారాయణుఁడు నాయెదుట నిలిచియున్నాఁడు: నేనాయననుజూచి కడుసంతోష ముతో నాట్యమాడుచుఁ బాటలుపాడుచు నాకిట్లుసాక్షాత్తుగ నారాయణుని దర్శన మగుచున్నందులకు నేనెంతో గొప్ప భాగ్యవంతుఁడనని మురియుచున్నా"ననెను. 'మాకేల దర్శనమగుటలేదు:' అని మరలవారడిగిరి. దానికి వాఁడు, మీ ముక్కు ర్గమముగానున్నది. ముక్కుగోయించుకొందురేని నారాయణుఁడు మీకగపడును లేకపోయినలేదు' అని బదులు చెప్పెను. వారిలో మూర్ఖుఁడొకఁడు. "ముక్కు తెగిపోయినను చింతలేదుకాని, నారాయణుని దర్శన మవశ్యము చేసికొనవలె నని" నిశ్చయించుకొని, వానితో 'నాముక్కుగోసి నారాయణుని జూపించు' మనియనెను. అప్పుడతఁడు వానిముక్కుగోసి "నీవునావలెజేయుము. లేకపోయిన నీ బ్రతుకును నా బ్రతుకును నవ్వులపాలగునుసుమా" అని వానిచెవిలో మంత్ర మూదెను. పోయినముక్కుమరలరాదుగద! ఇఁక నిట్లుచెప్పుటయేతగునని యూహించి వాఁడును, వారి యెదుట నాడుచుఁబాడుచు దుముకులాడుచు, నవ్వుచు నాకును నారాయణుఁడు గానవచ్చుచున్నా"డని చెప్పనారంభించెను.

ఇట్లొకని వెనుక నొకఁడగుచు వేయిమంది ముక్కిఁడులు గుమిగూడిరి. ఈ వార్త అంతటను మార్మ్రోగసాగెను.

వీరు తమసంప్రదాయమునకు "నారాయణదర్శి" యను నామమును బెట్టిరి. తెలివిలేని రాజొకఁడీ సమాచారమువిని వారిని రప్పించెను. రాజు వారిని జూడఁబోయినప్పుడు వారు అపరిమితముగా నారుటకు, దుముకులాడుటకు, నవ్వుటకు నారంభించిరి. రాజదిజూచి, ఇదేమి? అని వారినడుగఁగా వారు ప్రత్యక్షముగ మాకునారాయణుఁ డగుపడుచున్నాఁడని చెప్పిరి.

రాజు:-మాకేల కానరాఁడు?

నారాయణదర్శి:-ముక్కుండునంతవఱకుఁ గనఁబడదు మీరు ముక్కు గోయించుకొందురేని మీకును నారాయణుఁడు ప్రత్యక్షముగ గోచరుఁడగు ననెను. మంచిదని రాజు జ్యోతిష్కుని బిలువనంపి. ముహూర్తముఁ జూడు మనెను. అపుడాతఁడు, చిత్తము అన్నదాతా! దశమినాడు ప్రాతఃకాలమెనిమిదిగంటలకు ముక్కుగోయించుకొనుటకు, నారాయణుని దర్శించుటకు మిక్కిలి మంచిముహూర్తము" అనిచెప్పెను బలే పోపుగారూ, బలే! మీ పుస్తకములలో ముక్కులు కోయించుకొనుటకుఁ గూడ ముహూర్తములు వ్రాసి పెట్టితిరిగా!

అట్లారాజు నిశ్చయించుకొని. యా వేయిమంది ముక్కిఁడుల భోజనార్థము సామగ్రినిపంపెను. అప్పుడు, వారమితానందభరితులై యాడుటకు, దుముకులాడుటకుఁ, బాడుటకు నారంభించిరి. కాని ఆ రాజుగారి మంత్రికిని దక్కిన బుద్ధిమంతులుగానున్న కొందఱికి నిది రుచింపలేదు. ఆ రాజుగారికంటె నాలుగు తరములకు బూర్వము మంత్రిగానుండిన తొంబదివర్షముల వృద్ధుఁడొకఁడుండెను. ఆ సమయమున మంత్రిగానుండిన యతని మునిమనుమడావృద్ధుఁడగు తన ముత్తాతకీ వృత్తాంతమంతయు వినిపించెను అపుడా ముసలిమంత్రి విని, వారు వంచకులు. నన్ను రాజునొద్దకు దీసికొనివెల్లుమనగా నతఁడట్లే చేసెను. రాజావృద్ధునకు మహా సంతోషముతో నాముక్కిఁడులవార్త యంతయు చెప్పెను ఆ వృద్ధ మంత్రి రాజుచెప్పినదంతయువిని, 'వినుఁడు మహారాజా! పరీక్షించుటకుఁబూర్వము శీఘ్రపడరాదు. పిమ్మటఁ బశ్చాత్తాపము కలుగు'ననెను.

రాజు:-ఆ వేపురు మనుష్యుల సదర్థము చెప్పుదురా ఏమి?

మంత్రి:-అబద్ధము చెప్పుచున్నారో. నిజమే చెప్పుచున్నారో పరీక్ష చేయని దిది నిజ మిది యబద్ధమని చెప్పరాదు

రాజు:-ఏప్రకారముగ పరీక్ష చేయవలయును?

మంత్రి:-విద్యా, సృష్టిక్రమము, ప్రత్యక్షాది ప్రమాణముల వలన

రాజు:- చదువనివాఁడెట్లు పరీక్ష చేయగలడు?

మంత్రి:-విద్వాంసుల సాంగత్యము వలన జ్ఞానమును వృద్ధి పఱచుకొని.

రాజు:- విద్వాంసుడు చిక్కనిపక్షమం దెట్లు?

మంత్రి:-పురుషార్థికేదియు దుర్లభముకాదు.

రాజు:-ఎట్లు చేయవలయునో మీరే చెప్పుఁడు?

మంత్రి:-నేను ముసలివాఁడను. ఇంటిలోనే కూలబడియుందును. ఇఁక కొన్ని దినములే జీవింతును. కావున మొదట నేను పరీక్షించెదను. పిమ్మటఁదగు ముచితమని తోఁచినట్లు చేయవచ్చును.

రాజు:-ఇది బాగుగా నున్నది.సిద్ధాంతిగారు! మంత్రిగారి కొఱకు ముహూర్తముఁ జూడుఁడు?

జ్యోతిష్కుఁడు:-మహారాజుగారి యాజ్ఞాప్రకారము ఈ శుక్లపంచమినాఁడు పది గంటలకు సుముహూర్తము కలదు.

ఆ నియమింపఁబడిన పంచమినాఁగానే యానాఁడెనిమిదిగంటలకు వృద్ధ మంత్రి రాజుగారియొద్దకు వచ్చి. మనమచ్చటికి రెండు మూఁడు వేల సైన్యమును గూడ మనతోఁదీసికొని వెళవలయుననెను.

రాజు:-అచ్చట సైన్యముతో నేమి ప్రయోజనము?

మంత్రి:- తమకు రాజ్యవ్యవస్థ తెలియదు నేఁజెప్పినట్లుచేయుఁడు.

రాజు:-అంగీకరించి సైన్యమును సిద్ధపఱుపుమనియాజ్ఞాపించెను సైన్యము సన్నద్ధముకాఁగానే తొమ్మిది గంటలన్నఱకు రాజు వాహనము నెక్కి యందఱను వెంటఁబెట్టుకొని పోయెను. వీరనందఱనుజూచి యా ముక్కిడులు ఆడుటకు పాడుటకు నారంభించిరి. వీరందఱు నచ్చటికిపోయి కూర్చుండిరి. వారిలో మొదట ముక్కిఁడియై యీ సాంప్రదాయమును నడిపించిన మహంతునుబిలిచి, "నేఁడు మంత్రిగారికి నారాయణుని దర్శనము చేయింపుము" అనఁగా వాఁడు

మంచిదని చెప్పి. పదిగంటల సమయముకాఁగానే. ఒక మనుష్యుఁడొక పళ్లెమును ముక్కుక్రిందఁ బట్టియుంచ గా తీక్ష్ణమైన కత్తితో మంత్రిగారి ముక్కు గోసి యా పళ్లెమునఁ బడవైచెను

అపుడా మంత్రి ముక్కునుండి నెత్తురుకారసాగెను. ముఖము వెల్లఁబోయెను. అయిన నా వంచకుఁ డా మంత్రిగారిచెవిలో "మీరు గూడ నవ్వుచు నారాయణుఁడు కనఁబడుచున్నాఁడని చెప్పుడు; కోసిన ముక్కు మఱలరాదు; మీరట్లు చెప్పకపోయిన మీకుఁ దలవంపు గలుగును. అందఱు మిమ్ములఁజూచి హాస్యముచేయుదురు." అను మంత్రముపదేశించి, దూరముగాఁ దొలఁగిపోయెను.

పాపము మంత్రిగారు తనచేతిగుడ్డతో గాయము నొత్తిపట్టుకొనెను. అప్పుడు రాజా మంత్రితో "నారాయణుఁ డగుపడుచున్నాఁడా లేడా" అని యడుగఁగా నతఁడు, "ఏమియు నగపడఁడు. వ్యర్థముగ నీధూర్తుఁడు మోసపుచ్చి వేలమందిని పాడుచేసినాఁడు" అని రాజుచెవిలో చెప్పెను. అంత రాజు ఇపుడేమి చేయవలయునని మంత్రినడుగ నతఁడు "వీనికి గఠినదండన విధింపవలయును. జీవితకాలమంతయు వీనిని జెఱసాలలో నుంచవలయును. వీని నందఱను చెఱపిన యీ దుర్మార్గుని గాడిదమీఁద నెక్కించి మహాఘోరముగ చంపవలయు" నని రాజుతో చెప్పెను.

రాజును మంత్రియు గుసగుసలాడ నారంభించినపుడే యా ముక్కిడులకు భయముపుట్టి పలాయన సూత్రమును బఠింపదలఁచిరి. కాని నలుప్రక్కలను వారిని సైన్యము ముట్టడించి యున్నందున పాఱిపోవుటకు వీలు దొరకకపోయెను. అప్పుడు 'వీరందఱనుబట్టి కాళ్ళకు సంకెళ్ళను వేయుఁడు: ఈ దుర్మార్గుని ముఖమున మసిబూసి నల్లగాజేసి గాడిదమీద నెక్కించి. వీని మెడను తెగిన చెప్పులపేరువేసి యంతటఁ బిల్లవాండ్రచేత మన్ను బూడిద వీనిమీఁదఁ జల్లించుచు, నాలుగు త్రోవలు కలిసినచోటుల నెల్ల నిలిపి చెప్పులతోఁ గొట్టించుచు. కుక్కలచేత వీని దేహమును దునాతునకగునట్లుచేసి. వీనిఁ జంపవలయును. అట్లు చేయకపోయిన వీరు మరల నితరులనుగూడ నిట్లే మోసపుచ్చుదు'రని రాజు దన భటుల కాజ్ఞాపించెను. వారట్లే చేసిరి. ఆ ముక్కిడుల సంప్రదాయ మంతటితో నంతరించెను.

ఈ విధమునసే వేద విరోధులందఱు నితరుల ధనము నపహరించుట యందుఁ జతురులై యున్నారు. సాంప్రదాయకుల పన్నుగడలిట్టివే. స్వామి నారాయణ మతస్థులు డబ్బు లాగుటకు నానావిధములైన కపట కృత్యములఁ జేయుచున్నారు. మాటల నెందఱినో మోసపుచ్చుటకుగాను. వారు మృతినొందినప్పుడు. వారితో సహజానందులు తెల్లని గుఱ్ఱము నెక్కి మోక్షస్థానమను స్వర్గమునకుఁ గొనిపోవుటకు వచ్చినాఁడనియుఁ, ప్రతిదినము నీమందిరమున కొకపర్యాయము వచ్చి పోవుచుండుననియుఁ జెప్పుదురు

ఇఁక నుత్సవసమయములందు మందిరములోపలఁ బూజారులుందురు. వా రుండుస్థలమునకుఁ గ్రిందిభాగమునసే యొక యంగడిని బెట్టియుందురు. ఆ యంగడి మందిరములమధ్య నొకరంధ్రము జేయఁబడి యుండును. నైవేద్యము కొఱకు భక్తులు సమర్పించిన టెంకాయలను మఱల నాయంగడిలోనికి రంధ్రముద్వారా దారవేయుదురు. అనఁగా నివ్విధముగానే యొక కొబ్బెరకాయ దినమునకు వేయిసారులు విక్రయింపఁబడును. ఇటువలెనే యన్ని పదార్థముల నమ్ముచుందురు. ఏజాతి సాధువు నాజాతిపని చేయుటకు నియమించుచున్నారు. మంగలిచే క్షౌరమును. కుమ్మరిచేతఁ గుండలు మొదలగువానిని. శిల్పిచే శిల్పములను. కోమటిచేత వాణిజ్యమును. శూద్రునిచేత నూడిగపు బనులను జేయించుచున్నారు. వీరు తమ శిష్యులమీఁద నొక శిస్తు వేసియుంచినారు వీరిట్లు మోసపుచ్చి లక్షంకొలది. ధనము సంగ్రహించిరి. సంగ్రహించుచునే యున్నారు గురు పీఠముపై గూర్చుండువాఁడు గృహస్థుఁడు. అనఁగా నతఁడు వివాహము చేసికొని ఆ భూషణము నలంకరించుకొనుచున్నాఁడు ఎవరైనఁ బాదపూజ కొఱకు రప్పించినవారితో గోకులీయ గోసాయులవలె గోసాయిగారికి. గోసాయమ్మగారికి. బిడ్డలకుదక్షిణలు సమర్పించుఁడని డబ్బులాగుదురు. తాము సత్సంగులనియు నితర మతములవారు కుసంగులనియుఁ జెప్పుదురు. తమ వారిని దప్ప తక్కినవా రెంతయుత్తములు. ధర్మాత్ములు. విద్వాంసులునైనను వారి నాదరింపరు. వారి సేవ యెన్నఁటికిని జేయరు. ఏలయనఁగా నితర మతస్థులకు సేవ చేయుటవలనఁ బాపము కలుగునని భావించుచున్నారు. ఈ సాధువులు స్త్రీల ముఖములు చూడరని చెప్పుట కలదు. కాని లోలోపల నేమేమి చిత్రములు జరు

గుచుందునో తెలియదు గద. వీరి ఖ్యాతి యంతటను దగ్గిపోయినది. కొన్నిస్థలములం దీ సాధువుల పరస్త్రీ గమనాది చేష్టలుకూడ బయల్పడినవి.

ఇఁక వీరిలో గొప్పవారనఁబడువారు చచ్చినపుడు, వానిని దీసికొనిపోయి రహస్యస్థలము లందుండు బావులలోఁ బడవైచివచ్చి "ఫలానా మహారాజు కొంతెతో వైకుంఠమునకుఁ బోయినాఁడనియు, వారిని సహజానందులవారే పిలుచుకొని పోయిరనియు, అప్పుడు మేము మహారాజా! ఈయనను గొనిపోవలదు. ఈ మహాత్ముఁడిట నుండుటవలన మాకు చాల మంచిద"ని ఎంత ప్రార్థించినను, "లేదులేదు, వీరి యవసరము వైకుంఠమున మెండుగాఁగలదు కాన దీసికొని పోవుచున్నా"నని సహజానందులు చెప్పిరనియు, మఱి "మేము సహజానందులవారిని, వారివిమానమును మృతకుని తన విమానమున గూర్చుండఁబెట్టుకొని పోవునపుడుపుష్పవర్షము గురియుటను మాకన్నులార జూచితి"మనియు ప్రసిద్ధపఱతురు. ఇఁక నొకసాధువు జబ్బుపడి బ్రతుకునాశ లేనివాఁడై యున్నపుడు "నేను రేపురాత్రి వైకుంఠమునకు బోవుదును" అని చెప్పును. ఆ రాత్రి వాఁడు చావక మూర్ఛచెంది యుండఁగానే వానిని గొనిపోయి బావిలోఁ బడవైతు రనుటయు వినుచున్నాము. ఏలయనఁగా నా రాత్రివానినట్లు పాఱవేయకపోయినఁ దామసత్యవాదులనగుదురుకద! కనుకనట్టిపని చేయుదురని ఓదితమగుచున్నది. మఱియిటులే గోకులీయ గోసాయులు మృతినొందినపుడును వారి శిష్యులు "గోసాయిగారు తమలీలలను విస్తరించిపోయిరి" అని చెప్పుదురు. ఈ గోసాయులు స్వామినారాయణమతస్థులు నుపదేశము చేయ 'శ్రీకృష్ణః శరణం మమ' అను మంత్రమొక్క పే-శ్రీకృష్ణుఁడు నాకుశరణ్యుఁడు అనఁగా నేను శ్రీకృష్ణునకు శరణాగతుఁడనని వారర్థము చేయుదురు. కాని శ్రీకృష్ణుఁడు నా శరణమును బొందునుగాక! అనఁగా నాకు శరణాగతు డగునుగాక.యనికూడదీనికర్థమగును. ఇట్టి మతస్థులందఱును విద్యావిహీనులగుట జేసి శాస్త్ర విరుద్ధములయిన యసంగతవాక్యములు రచించుచున్నారు. వారు విద్యానియమముల నెంత మాత్రము గుర్తెఱిఁగి యుండరు.

ప్రశ్న:-మాధ్వమతమైన మంచిదేనా?

ఉత్తరము:-తక్కిన మతావలంబులవంటివారె మాధ్వులు.వీరును జక్రాంకితు లగుచున్నారు అన్యచక్రాంకితులంతంటె వీరియందుఁగల విశేషమేమన.

రామానుజీయు లొకపర్యాయమే చక్రాంకితు లగుదురు. కాని మాధ్వులు ప్రతి మార్గశిరసంవత్సరసంవత్సరమును జక్రాంకితు లగుచుందురుచక్రాంకితులు ముఖమున బచ్చనిరేఖను మాధ్వులు నల్లని రేఖను దిద్దుకొనుచున్నారు.

ఒక మాధ్వపండితునకును,నొక మహాత్మునకునిట్లుశాస్త్రార్థముజరిగెను.

మహాత్ముడు:-మీరు నల్లని రేఖను గుండ్రపుబొట్టు నెందులకు బెట్టుకొనుచున్నారు?

శాస్త్రి:-ఇట్లు పెట్టుకొనుటవలన మేము వైకుంఠమునకుబోదుము. శ్రీకృష్ణుని దేహము శ్యామల వర్ణముగలది. కాన మేము నల్లనితిలకము పెట్టుకొనుచున్నాము.

మహాత్ముడు:-నల్లని రేఖను,గుండుబొట్టు పెట్టుకొనుటవలన వైకుంఠమునకు బోవుదురేని ముఖమునంత నల్లగాజేసికొన్న నెక్కడికి బోగలుగుదురు? వైకుంఠమునుగూడ దాటి బోదురా ఏమి? శ్రీకృష్ణుని శరీరమంతయు నల్లనిదిగా నుండినట్లే మీరును మీశరీరమును నల్లగాజేసికొన్న శ్రీకృష్ణుని వంటివారు గావచ్చునుగద దీనజేసి యీ మతముకూడ పై జెప్పినమతముల వంటిదే యననొప్పును.

ప్రశ్న:-లింగాంకితుల మత మెట్లున్నది?

ఉత్తరము:-అదియును చక్రాంకితుల వంటిదే. చక్రాంకితులు చక్రముచే మచ్చలునదునట్లు కాల్పబడి, యొక నారాయణునిదప్ప మఱి యెవ్వరిని విశ్వసింపనట్లే లింగాంకితులును లింగాకృతి గురుతింపబడినవారై మహాదేవుని దప్ప నన్యుల నెవ్వరి నుపాసింపరు. ఇంక నీ లింగాంకితులలో, గల విశేష మేమన నావీరు పాషాణములో జేయబడిన లింగమును బంగారుమూకుడు పెట్టెలో, గాని, వెండిమూకుడు పెట్టెలోగాని యుంచి మెడను ధరించుకొందురు;నీరు ద్రాగునపుడుకూడ దానికి జూపి త్రాగుదురు. వీరిమంత్రమును శైవులవంటి దేయని తెలియవలెను.

## బ్రహ్మసమాజ ప్రార్థనాసమాజముల గుణదోషములు.

ప్రశ్న:-బ్రహ్మసమాజ ప్రార్థనసమాజము లైనను మంచివా కావా?

ఉత్తరము:-కొన్నివిషయములందు మంచివే; కాని పెక్కు విషయములు చెడ్డవి.

ప్రశ్న:-బ్రహ్మసమాజ ప్రార్థనాసమాజము లన్నిటికంటె మేలు. ఏల యనఁగా వీని నియమములు కడు బాగుగా నున్నవి.

ఉత్తరము:-సర్వాంశములందాఁ నియమములు బాగుగాలేవు. వేదవిద్యా విహీనులై నవారి కల్పనయు సర్వత్రా సత్యము లెట్లుకాఁగలదు? బ్రహ్మసమాజ ప్రార్థనాసమాజమువారు క్రైస్తవ మతావలంబనమునుండి కొందఱను గాపాడిరి; కొంతకొంత పాషాణాది విగ్రహారాధనము గూడ దూరపఱచిరి; మఱి కొందఱిని, మిథ్యాకల్పిత గ్రంథో క్తులకు మోసపోకుండఁజేసిరి. అను నిత్యాది విషయములు మంచివే.

(౧) వీరియందు స్వదేశభక్తి మిక్కిలి తక్కువగానున్నది. వీరు క్రైస్తవుల యాచారములనే విశేషించి యనుకరించుచున్నారు. భోజన పానములను, వివాహాది నియమములనుగూడ మార్చివేసియున్నారు.

(౨) తమ దేశప్రశంస యెంతమాత్రము చేయరు. తమ పూర్వులగొప్పతనమును ప్రకటించుటకు మాఱుగా వారిని నోటికొలది నిందించుచున్నారు. ఉపన్యాసములలోఁ గ్రైస్తవాది ఆంగ్లేయుల ప్రశంసను మనసారఁ జేయుచుందురు. బ్రహ్మాదిమహర్షుల పేరుగూడ నెత్తరు. తద్విరుద్ధముగా నాంగ్లేయులు తప్ప సృష్టిలో నింతవరకెవ్వరును విద్వాంసులు కారేదనియు, నార్యావర్తీయు లెప్పుడును మూర్ఖులుగానే యుండిరి, ఇప్పుడు నట్లే యున్నారనియు వీరెప్పుడు నున్నతిని బొందలేదనియు నుడువుదురు.

(౩) వేదాదులను గౌరవించుమాట యటుండనిండు; కాని వానిని నిందచేయక మానరు. బ్రహ్మసమాజోద్దేశములు వ్రాయఁబడియున్న పుస్తకములో ఏసు, మూసా, మొహమ్మదు, నానకు, చైతన్యులను వీరిని సాధువులుగా గణించియున్నారు కాని యొకఋషి—మహర్షిపేరైన వ్రాయలేదు. దీనివలన వీరెవరి పేరులు వ్రాసియున్నారో, వారిమతమున కనుకూలమతముకలవారనియే విదితమగుచున్నది. అహా! బి దార్యావర్తమునఁబుట్టి, యందలి యన్న జలములనే సేవించియు నున్నారుగదా! తమ తల్లి దండ్రి, తాత మొద లగువారి మార్గమునువదలి, తదితరవిదేశీయ మతములపై నింత విశ్వాసము కలిగియుండుటయు, ఏతద్దేశస్థ సంస్కృత విద్యను జదువక, తమకుఁదామే విద్వాంసుల మని చెప్పుకొనుటయు, నాంగ్లేయభాష నభ్యసించి పండితాభిమానులై కటా

లైన నౌకక్రొత్తమతమును బ్రవేశపెట్టుటయందుఁ బ్రవృత్తులగుటయు ననులకు స్థైర్యమును, వృద్ధిని గలుగఁజేయునవి యెట్లు కాఁగలవు?

(౪) ఆంగ్లేయ, యవన అంత్యజాదులతోఁడను అన్నపానభేదములేదు. ఇట్లు తినుట త్రాగుటవలనను, జాతిభేదమును నిరాకరించుటవలనను దేశము బాగుపడునని వీరనుకొనుచున్నారు కాఁబోలు. కాని యిట్టి పనులవలన బాగుపడుటెట్లు? దానికిమాఱుగాఁ జెఱుపు కలుగును.

(౫) ప్రశ్న:-జాతి భేద మీశ్వరకృతమా లేక మనుష్యకృతమా?

ఉత్తరము:-జాతి భేదము ఈశ్వరకృతము మనుష్యకృతము నై యున్నది.

ప్రశ్న:—ఈశ్వరకృత మేది? మనుష్యకృత మేది?

ఉత్తరము:—మనుష్య, పశు, పక్షి, వృక్ష, జలజంత్వాది జాతులు పరమేశ్వరకృతములు. పశువులలో నావు, గుఱ్ఱము, ఏనుఁగు మొదలగు జాతి భేదములును; వృక్షములలో మేడి, మఱ్ఱి, చింత మొదలగు జాతి భేదములును; పక్షులలో హంస, కాకి, కొంగ మొదలగు జాతిభేదములును; జలజంతువులలోఁ జేఁపలు, మొసళ్లు మొదలగు జాతిభేదములును ఈశ్వరకృతములైనట్లే మనుష్యులలోను బ్రాహ్మణ-క్షత్రియ-వైశ్య-శూద్ర-అంత్యజజాతిభేదము లీశ్వర కృతములు. ఐనను మనుష్యులలో బ్రాహ్మణాదులను సామాన్యజాతిగాఁ గాక సామాన్య విశేషాత్మక జాతులందు గణించుచున్నాము. వర్ణాశ్రమ వ్యవస్థ యను విషయమున నింతకుఁ బూర్వము వ్రాయబడినట్లే గుణకర్మ స్వభావములను బట్టి వర్ణవ్యవస్థ నంగీకరించుట యావశ్యకము; ఇది మనుష్యకృతము. అనఁగా వారి వారి గుణకర్మ స్వభావములనుబట్టి పూర్వము చెప్పఁబడినట్లు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాది వర్ణములను పరీక్షాపూర్వకముగా నియమించుట రాజులకును, విద్వాంసులకును గర్తవ్యము. భోజన భేదముకూడ నీశ్వరకృతము, మనుష్యకృతము నయియున్నది. ఎట్లనఁగా సింహము మాంసాహార జంతువు. ఖడ్గమృగము గడ్డి మొదలగువానిం దినును. ఇది ఈశ్వరకృతము. ఇఁక దేశకాల వస్తుభేదములనుబట్టి భోజనభేదము మనుష్యకృతము.

ప్రశ్న:—యూరోపియనులనుఁ జూడుఁడు: వారు బూట్లు, కోట్లు లాగులు దొడిగి, హోటలులలో నందఱచేతి యన్నము దినుచున్నారు. కావుననే వారు వృద్ధిపొందుచున్నారు.

ఉత్తరము:—ఇట్లు తలంచుట మీ పొరపాటు. ఏలయనఁగా 'దురకలు' మాలలు మొదలగువారందఱిచేతఁ దినుచున్నారే. వారేల యున్నతిఁ బొందుట లేదు? యూరోపియనులు బాల్యావస్థయందు వివాహము చేసికొనరు. వారు పిల్లలకును, పిల్లవాండ్రకును విద్యాశిక్ష లలవఱతురు. స్వయంవర వివాహములు గావింతురు. దుర్మార్గుల యుపదేశముల గొనక తాము విద్యావంతులయి యుండుటచే నొకరి వలలోఁ జిక్కుపడరు. ఏపని చేసినను బరస్పరము విచారించి సభలలో నిశ్చయించుకొని చేయుచున్నారు. తమ జాత్యభివృద్ధికొఱకుఁ దనువును, మనసును ధనమును ధారపోయుచున్నారు. సోమరితనము వదలి, యెప్పుడును బనిచేయుచుందురు.

చూడుఁడు! వారు తమ దేశపు బూట్లు గార్యాలయము [ఆఫీసు]ం లోనికి—కచ్చేరీలలోనికి రానిచ్చుచున్నారు. కాని యీ దేశపుఁ బాదరక్షలను దొడిగి రానియ్యరు. దీనితో మీరు గ్రహింపవచ్చును. అనఁగా వారు తమ దేశపు పాదరక్షలను జూచునంతటి గౌరవమర్యాదలతోనయిన నన్యదేశ మనుష్యులనుగూడ జూడరు. చూడుఁడు! సుమారు వంద సంవత్సరముల పైనుండి యూరోపియను లీదేశమునకువచ్చి వసించుచున్నారు. ఇంతవఱకును మొద్దు గుడ్డలు మొదలగునవి దమదేశమునఁ దొడుగుచుండిన విధముననే తొడుగుచున్నారు. వారు తమ దేశమర్యాదలను వదలలేదు. కాని మీయందనేకులు వారి ననుసరించుచున్నారు దీనివలననేకద మీరు బుద్ధిహీనులనియు, వారు బుద్ధిమంతులనియు నెన్నఁబడుదురు. అనుకరించుట బుద్ధిమంతుల పనికాదు. ఇఁక వారిలో నెవ రేపనిలోనున్న దానిని యథోచితముగఁ జేయుచున్నారు. ఆజ్ఞానుకూలముగా వర్తించుచున్నారు. తమ దేశస్థులకువర్తకమున్నగు పనులందు సహాయముచేయుచున్నారు. ఈ మంచిగుణములచేత, మంచి కర్మములచేతను వా రున్నతిని బొందుచున్నారు కాని, బూట్లను కోట్లను, పంట్లాములనుదొడిగి, హోటలులలోఁదిని త్రాగుట మున్నగు సామాన్యమైన వర్తనంచేఁగాని,చెరు కార్యముంచేఁగాని వారు వృద్ధికిరాలేదు.

ఇఁక వీరిలోను జాతిభేదము కలదు. చూడుఁడు! ఒక యూరోపియనుఁ డెంత గొప్ప యధికారియుఁ బ్రతిష్ఠానంతుడు నైయున్నను, అతఁ డన్యదేశ కన్యనుగాని, అన్యమతస్థుల కన్యనుగాని వివాహమాడినను, లేదా యొక

యూరోపియను కన్య యన్య దేశీయుని వివాహమాడినను, తక్కిన తేగవారిం దఱును వారి నాహ్వానించుట కాని, వారితోఁ గలిసి భోజనము చేయుటగాని, వారితో వివాహాది సంబంధము చేయుటగాని తక్షణమే మానివేయుచున్నారు. ఇది జాతిభేదము కాక మరేమగును?

ఇఁక వారు "మాలో జాతిభేదములే" దని మీతోఁటి తెలివి తక్కువ వారిని భ్రమింపఁజేయుచున్నారు. మీరును మీ మూర్ఖత్వమువలన నిజమని నమ్ముచున్నారు. కావున నేపనిజేసినను మరల పశ్చాత్తాపము కలుగకుండునట్లు బాగుగా విచారించి చేయవలయును.

చూడుఁడు: వైద్యులయు నౌషధములయు నావశ్యకత రోగికిఁగలదే కాని రోగరహితుని కావశ్యకతలేదు. విద్యావంతుఁడు రోగరహితుఁడు విద్యావిహీనుఁ డవిద్యారోగముచేతఁ బీడితుఁడునై యుండును. కాన సత్య విద్యయు, సత్యోపదేశము నను నివియే ఆ రోగమును దూరపఱచును. ఈ అవిద్యయను రోగము కలవారు భోజనపానములందే ధర్మము కలదనియు, నందే ధర్మము పోవుననియుఁ దలఁచుచున్నారు. అన్నపానములందనాచారముగ వర్తించు వానిని జూచినపుడు, వాఁడు ధర్మభ్రష్టుఁడైనాఁడని యనుకొందురు. ఇక వాని మాట గూడ వినరు తాము వాని సమీపమునఁ గూర్చుండరు. వానిని దమ సమీపమునఁ గూర్చుండనీయరు.

ఇప్పుడు "మీ విద్య స్వార్థముకొఱకా, పరమార్థముకొఱకా," మీరే చెప్పుడు. మీ విద్యవలన నా యజ్ఞానులకు లాభముకలిగినపుడే యది పరమార్థమగును. వారా లాభమును బొందఁగోరరు. మే మేమిచేయుదు మందురేని యదియును మీ దోషమే కాని వారిదోషము కాదు. ఏలయనఁగా మీ ప్రవర్తన ముచితగానున్నచో వారు మిమ్ముఁ బ్రేమించి మీవలన నుపకారమును బొందియుందురు కేవలము మీరు మీ సుఖమునే చూచుకొని వేలకొలఁది జనులకు గలుగఁబోవు నుపకారమును నశింపఁజేసినందులకీ గొప్ప యపరాధమును పాపము మీకుఁ దగిలినదని యెఱుఁగఁదగును ఏలయనఁగా పరుల కుపకారము చేయుట ధర్మమనియు హానికలిగించుట యధర్మమనియు ననఁబడును. కనుక విద్వాంసులు యథాయోగ్యముగ వర్తించుచు నజ్ఞానులను దుఃఖసాగరమునుండి తరింపజేయుటకు పడవవంటివాఁడుగావలయును ఎప్పుడును

మూర్ఖులవరెఁ గార్యములను జేయగూడదు. కాని తమకును, ఇతరులకును దినదినాభివృద్ధిని గలుఁగజేయు కార్యములనుమాత్రముచేయుచుండవలయును

ప్రశ్న:-మీ పుస్తకము నీశ్వరకృతమనిగాని, లేదా దానిలోనియంశములన్నియు సత్యమైనవని కాని నమ్మము.ఏలయనఁగా మనుష్యులబుద్ధి భ్రాంతిరహితమైనది కాదు. కాఁబట్టి వారు రచించినగ్రంథములన్నియు భ్రాంతియుక్తములై యుండును. కాన మేమన్నిటిలోని సత్యమును గ్రహించుచున్నాము. అసత్యమును వదలివేయుచున్నాము.ఆ సత్యము వేదమునందు, బైబిలునందు, కురానునందుఁ మఱియే గ్రంథమునందు ఉన్న నది మాకు గ్రాహ్యమే.అసత్యమెచ్చట నున్న నది గ్రాహ్యము కానేరదు.

ఉత్తరము:-దేనివలన మీరు సత్యమును గ్రహింపఁ దలఁచుచున్నారో దానివలననే మీ రసత్యముగూడ గ్రహింపఁగలుగుదురు ఎలయనఁగా మనుష్యులెవ్వరును భ్రాంతిరహితులు కాఁజాలరు. మఱి మీరును మనుష్యులై యుందురు కాఁబట్టి భ్రాంతిసహితులే. కాన భ్రాంతి సహితులైనవారి మాటలు సర్వాంశములందుఁ బ్రామాణికములు కానపుడు మీమాటలను విశ్వసింపఁదగినవి కావు కాన మీమాటలనుగూడఁ బూర్ణముగా విశ్వసింపఁగూడదు. అట్లయిన విషయుక్తమైన అన్నమువలె నవియును త్యాజ్యములే.మఱి మీ వ్రాసినవ్యాఖ్యానపుస్తకములనుగూడఁ బ్రమాణములని యెవరు నంగీకరింపఁ గూడదు.'చలే తో చాబేజీ ఛబ్బేజీ బననేకో, గాంఠకే దో ఖోకర్ దుబేజీ బనగయే' చతుర్వేదియైనవాఁడు ఆఱు వేదముల వాఁడగుటకుఁబోగ నున్నవానిలోని రెండు పోఁగొట్టుకొని ద్వివేది యయ్యెనఁట. ఇతరమనుష్యులు సర్వజ్ఞులు కానప్డే మీరు నెంతమాత్రము సర్వజ్ఞులుకారు.మీరొకప్పుడు భ్రమచే నసత్యమును గ్రహించి, సత్యమును వీడినను వీడవచ్చును. కావున సర్వజ్ఞుడైన పరమేశ్వరుని వచనసహాయ మల్పజ్ఞులమయిన మనకవశ్యము గావలసినదే. వేదవిషయిక వ్యాఖ్యానమందుఁ వ్రాయఁబడినట్లుమీరు నవశ్యమంగీకరింపవలయును లేకపోయిన 'ఇతో భ్రష్టస్తతో భ్రష్టః' అన్నట్లు కావలసివచ్చును.వేదమునందసత్యమేమియు లేక యంతయుసత్యమేలభించుచుండగావానినంగీకరించుటకు సందేహించుట.తాము హానిఁబొందుటయేగాక పరులకును హానికలుగఁజేయుటయైయున్నది.దీనివలననే యార్యావర్తపుజనములు మిమ్ములనువమవారనిభావింపరు.కావున మీ రార్యావర్తపు

టలివృత్తికి కారణభూతులును కానేరకపోయితిరి. ఏలయనఁగా మీరు పదిండ్ల పాప రాజులు. "ఇట్లుచేయుటవలన మే ముపకారముపొందుచు నితరులకుపకారముచేయ గలుగుదు" మనిమీరనుకొనవచ్చును కాని మీరట్లుచేయలేరు. ఒక తల్లిదండ్రులకు వురే ప్రపంచములోని యెల్లరబిడ్డలను బాలింపఁజాలుదురేనివారెవ్వరిని బాలింప నేరక తమ సొంతబిడ్డలనుగూడ నష్టపరచుకొనునట్లే మీగతియు నగును. ఇఁక వేదాదిశాస్త్రముల నంగీకరింపనంతవఱకు మీ మాటలందుఁగల సత్యాసత్యముల పరీక్షించుటయు నార్యావర్తీయుల కున్నతి దేఁగలుగుటయు నెప్పుడైననుమీకు సాధ్యమగునా? దేశ మేరోగమున మునిఁగి యున్నదో దానికిఁదగినమందు మీయొద్దలేదు.

యూరోపియనులును మీ సహాయము నపేక్షింపరు. ఇంత నార్యావర్తీయులు మిమ్ముల నన్యమతస్థులవలెఁ జూచుచున్నారు. ఇప్పుడైనను మీరుతెలివి తెచ్చుకొని వేదాదిసత్యశాస్త్రముల నంగీకరించుచు దేశోన్నతికొఱకుఁ బ్రయత్నించుట మంచిది. మీరు సత్యమంతయుఁ బరమేశ్వరునిచేఁ బ్రకాశింపఁజేయఁబడునని చెప్పుచున్నారుకదా? ఋషుల యాత్మలలోఁ బ్రకాశింపఁజేయఁబడిన సత్యార్థములైన వేదముల నెందుల కంగీకరింపరు? దానికిఁ గారణమిదియే కద. మీరు వేదములు చదువనులేదు. చదువనుగోరరు. ఇఁక మీకు వేదోక్తజ్ఞాన మెట్లు కలుగఁగలదు?

(౬) జగత్తున కుపాదానకారణము నంగీకరింపక యీ జగదుత్పత్తియైనదనియు, జీవుఁడుకూడ నుత్పన్నుఁడనియు క్రైస్తవ మహమ్మదీయులవలెనే మీరును నమ్ముచున్నారు. దీని కుత్తరము సృష్ట్యుత్పత్తి ప్రకరణ మందును, జీవేశ్వరుల వ్యాఖ్యయందును గలదు. చూడవచ్చును. కారణము లేనిది కార్యమగుననుట నితాంత మసంభవము. ఉత్పన్నమైన వస్తువునకు నాశనము లేకపోవుటకూడ నటులే యసంభవము.

(౭) పశ్చాత్తాపమువలనను, ప్రార్థన చేయుటవలనను బాపవిమోచనమగునని నమ్ముటయు మీ పొరపాటే. దీనివలననే జగత్తునందుఁ బాపములు అధికమైనవి ఏలయనఁగా పౌరాణికులు తీర్థయాత్రలవలనను, జైనులు నవకార మంత్రజపములు, తీర్థయాత్రలవలనను, క్రైస్తవు లేసువునందు విశ్వాసముంచుటవలనను, ముసల్మానులు "తోబా" చేయుట వలనను, అనుభవింపకయే

పాపములనుండి విముక్తులగుదురని నమ్ముచున్నారు. దీనివలన జనులు పాప
భీతి లేనివారై పాపకార్యములం దమితముగఁ బ్రవృత్తులగుచున్నారు. ఈవిష
యమున బ్రహ్మసమాజ ప్రార్థనా సమాజములవారును పౌరాణికులతో సమా
నులే యనుట స్పష్టము. వేదములందే విధియున్న "తప్పక పాపపుణ్యఫల మనుభ
వింపవలసి వచ్చును. అనుభవింపక నివృత్తి కలుగ"దని పాపములకు వెఱచి
సదా ధర్మమునందే ప్రవృత్తులై యుందురు. మఱి అనుభవింపకయే నివృత్తి
కలుగునన నీశ్వరుఁడన్యాయకారియై నిలుచును.

(౮)ఇఁక మీరు జీవుని కనంతమగు ముక్తి కలుగునని నమ్ముచున్నారు.
అట్లెన్నటికిని గాదు. ఏలయనఁగా పరిమితుఁడైన జీవుని గుణకర్మ స్వభావముం
ఫలముకూడ నవశ్యముగా పరిమితమైయుండును.

ప్రశ్న:- పరమేశ్వరుఁడు దయాళువు కావున, పరిమితకర్మములకు
ననంతఫలము నీయవచ్చును.

ఉత్తరము:- అట్లుచేయునేని పరమేశ్వరుని న్యాయము నష్టమై పోవును.
అట్లే సత్కర్మమున పెంపుకొలఁదిఁగూడ నెవ్వఁడును పాటుపడకపోవును.
ఏలయనఁగా సత్కర్మ కించిన్మాత్రము చేసినను దాని కనంతఫలము పరమేశ్వరుఁ
డిచ్చుననియుఁ బశ్చాత్తాపమువలన, ప్రార్థనల వలన నెట్టిపాపములైనను వీడి
పోవుననియుఁ జెప్పెడుమాటలకులోఁబడుటవలనహానిగలిగిపాపములువర్ధిల్లును.

ప్రశ్న:- మేము స్వాభావికజ్ఞానమును వేదముకంటె నధికమని నమ్ము
చున్నామేకాని నైమిత్తికమునుగాదు. ఏలయనఁగా పరమేశ్వరుఁడొసఁగిన
స్వాభావికజ్ఞానమే మనలో లేకున్న వేదములనుగూడ మనమెట్లు చదువను,
జదివింపను, దెలియను-దెలియఁజేయను-గలుగుదుము? కావున మామతమే కడు
బాగుగానున్నది.

ఉత్తరము:- మీ యీ మాటకూడ నిరర్థకమైనదే. ఇతరు లిచ్చునపుడే
జ్ఞానము కలుగుచున్నది. కాన నది స్వాభావికముకాదు. స్వాభావికమై యుండు
నది సహజజ్ఞానము. అది హెచ్చను హెచ్చదు. తగ్గను తగ్గదు. దానివలన ముక్తి
నెవఁడును బొందఁజాలఁడు. అడవి మనుష్యులలోను స్వాభావికజ్ఞానము కలదు.
మఱి వారు తమంతటఁదామే యున్నతినిఁ బడయరేలేందులకు? కాన నైమిత్తిక
జ్ఞానమే యున్నతికిఁ గారణమన నొప్పును. చూడుఁడు! మీరును మేమును

బాల్యావస్థయందుఁ గర్తవ్యాగర్తవ్యములను, ధర్మాధర్మములను సరిగా గుర్తెరిఁగి యుండలేదు. విద్వాంసులయొద్దఁ జదివినపుడేకద, కర్తవ్యాకర్తవ్యములను, ధర్మాధర్మములను దెలిసికొనఁ గలిగితిమి; కావున స్వాభావిక జ్ఞానమునే యత్కృష్టమని నమ్ముట సరికాదు.

(౯)మీరు క్రైస్తవ మహమ్మదీయుల ననుసరించియే పూర్వ పరజన్మముల నమ్మకపోవచ్చును దీనికి నుత్తరము పునర్జన్మమును గుఱించిన వ్యాఖ్యయందు వ్రాయఁబడినది. చూచి తెలిసికొనవచ్చును. కాని యిప్పటను "జీవుఁ"డు శాశ్వతుఁడనగా నిత్యుఁడనియు నతని కర్మములు కూడఁ బ్రవాహ రూపమున నిత్యములేయనియు మీరెఱుఁగఁదగును. ఎందులకన గర్మమునకును గర్మముఁ జేయువారికిని నిత్యసంబంధ ముండును. ఏమి? ఆ జీవుఁడు పనికిరాక యెచ్చటనైనను గూలఁబడియుండెనా? అట్లుండునా? మఱి మీరట్లు చెప్పుటవలనఁ బరమేశ్వరుఁడుకూడఁ బనికిరాని వాఁడగుచున్నారు. పూర్వాపర జన్మములనునమ్మక పోవుటవలన నీశ్వరు నందుఁ గృతహాని, అకృతాభ్యాగమ, నైర్ఘృణ్య, వైషమ్యములను దోషములుకూడఁ గలుగుచున్నవి. ఏలయనఁగా జన్మమే లేకపోయినఁ బాపపుణ్యములఫలభోగమునకు హానికలుగును. ఏలయన నెవ్విధముగ నొకనికి సుఖదుఃఖహానిలాభములను గలుగఁజేసి యుండునో యట్టి పాపఫలమును శరీరమును ధరింపకపోయిన జీవుఁడు బొందనేరరు. (రెండవది) పూర్వజన్మ. పాపపుణ్యములే లేకుండిన నీ జన్మమున సుఖదుఃఖము లెట్లుకలుగన గును? పూర్వజన్మ పాపపుణ్యానుసార మవి కలుగకపోయిన పరమేశ్వరుఁ డన్యాయకారియై నిలుచును. మఱి యనుభవింపనిదే కర్మఫలము నశించి పోయి నట్లగును. కాన మీరిట్లు చెప్పునదికూడ సరికాదు.

(౧౦)ఒక్క యీశ్వరుఁడుతప్ప దక్కిన దివ్యగుణములుగల పదార్థములను,విద్వాంసులను సయితము మీరు దేవతలని నమ్మకపోవుటయు సరికాదు. ఏలయనఁగా పరమేశ్వరుఁడు మహాదేవుఁడు. ఇతర దేవతలే లేకపోయిన దేవతలకెల్ల స్వామియను మహాదేవనామముతో నతఁడేల పిలువఁబడియుండును?

(౧౧) అగ్నిహోత్రాది పరోపకారకములైన కర్మములనుగూడఁ గర్తవ్యములని యంగీకరింపకపోవుటయు నుచితము కాదు.

(౧౨) ఋషులును మహర్షులునుజేసిన యుపకారము నెన్నక, ఏసు మొదలగు వారి ననుసరించుటయు ననుచితమే.

(౧౩) కారణవిద్యయైన వేదములులేనిదే కార్యరూపమునున్న యితర విద్యల ప్రచారమునకు వచ్చినవనుట నితాంత మసంభవము.

(౧౪) విద్యాచిహ్నములైనట్టి యజ్ఞోపవీతమును, శిఖను ద్యజించి క్రైస్తవ మహమ్మదీయుల వంటి యాచారము కలిగియుండుటగూడ వ్యర్థమే. పంట్లాము మొదలగు వస్త్రములను ధరించుచు "బిరుదు బిళ్ళల" బొందఁగోరు చున్నారు గదా! ఏమి! యజ్ఞోపవీతాదు లంతభారమైయుండెనా!

(౧౫) బ్రహ్మ మొదలు నేటివఱకీ యార్యావర్తమున నెందఱో విద్వాంసులయి యుండగా వారలఁ గొనియాడక, యూరోపియనులను మాత్రము పొగడుట పక్షపాతమును ముఖస్తోత్రమును గాక మఱి యేమగును!

(౧౬) బీజాంకురమువలె జడచేతనముల చేరికవలన జీవోత్పత్తియగు నని నమ్ముటయుఁ, బుట్టుటకుముందు జీవతత్త్వమును నమ్మకపోవుటయు,నుత్ప న్నుడై నవానికి నాశనములేదనుటయుఁ బూర్వాపర విరుద్ధములు. ఉత్పత్తికిఁ బూర్వము జడచేతనములు లేకుండిన జీవుఁ డెక్కడినుండి వచ్చెను! సంయోగ మెవరికిఁ గలిగినది? ఈ రెంటిని సనాతనములని నమ్ముదురేని మంచిదే. కాని సృష్టికిఁ బూర్వము పరమేశ్వరుఁడు దప్ప మఱియేతత్త్వమును లేకయుండెననుట వలన మీ పక్షము వ్యర్థమైపోవుచున్నది. కావున నున్నతి నొందగోరుదురేని మీరు ఆర్యసమాజములోఁ జేరి వారి యుద్దేశానుసారము నడుచుకొనుట కంగీక రింపుఁడు. లేక పోయిన మీ చేతికేమియు దొరకదు. ఏలయనఁగా నేదేశము లోని పదార్థములతో మన దేహములు చేయఁబడి, యింతవఱకుఁ బోషింప బడుచున్నవో ఇకఁ ముందును బోషింపఁబడునో, అట్టి దేశోన్నతికొఱకుఁ దనుమనోధనములచే నందఱు మేకీభవించి ప్రీతిపూర్వకముగాఁ బాటుపడుట మీకును మాకును మిగుల నుచితమైయున్నది. కాన నార్యసమాజ మార్యావర్త దేశోన్నతికిఁ గారణమైయుండునట్లు మఱొకటి కాజాలదు. ఈ సమాజమునకుఁ దగిన సహాయముచేయుట యత్యవసరము ఏలయనఁగా సమాజసౌభాగ్యమును వర్ధిల్లఁజేయుట నలుగురుచేరి చేయవలసినపనియేకాని యొకరి పనికాదు.

ప్రశ్న:-మీ రన్నిటి ఖండనముచేయుచు వచ్చుచున్నారు. కాని ప్రతి మత ధర్మములం దవియన్నియు మంచివే. ఏ మతమును ఖండన చేయఁగూడదు. ఒకవేళ చేసితిరిపో: మీరు వారికంటె నధిక మేమి చెప్పబోవుచున్నారు: మఱి చెప్పుచున్నారన్నను మీకంటె నధికుఁడుగాని, మీతో సమానుఁడుగాని యీ వఁ ఉండరేదా? ఇట్లభిమానపడుట మీ కుచితము కాదు. ఏలయనఁగా పరమాత్ముని సృష్టియందొకనికంటె నొకఁడధికుఁడుగ, నొకనితో నొకఁడు తుల్యుఁడుగ, నొకనికంటె నొకఁడు న్యూనుఁడుగ నెందఱోగలరు. ఎవ్వరికిని గర్వపడుట యుచితము కాదు.

ఉత్తరము:—అందఱికి ధర్మమొక్కటా లేక యనేకమా? అనేక మంటి రేని, ఒకటి కొకటి విరుద్ధముగ నుండునా. యవిరుద్ధముగనా? విరుద్ధముగ నుండునన్న నొకటిమాత్రమేకాక, మఱొకటి ధర్మముకాఁజాలదు. అవిరుద్ధముగా నుండునన్న వేఱువేఱుగానుండుట వ్యర్థము. కాన ధర్మముకాని అధర్మముకాని యొక్కొక్కటే యుండునుగాని యనేకమైయుండదు. మేము చెప్పునట్టి విశేషమేమనఁగా ఒక రాజు సమస్త సంప్రదాయములందలి యుపదేశకులనందఱ నొక్కచోటఁజేర్చిన నా సంప్రదాయములు వేయింటికంటెఁ దక్కువగావు. కాని వీనియందుఁ బౌరాణిరా, క్రైస్తవ, జైన, మహమ్మదీయములను నాలుగే ముఖ్యవిభాగములు కలవు. ఈ నాలుగింటిలోనే సమస్త సంప్రదాయముల సమావేశము కలదు. ఒకానొకరాజు సంప్రదాయములవారి నందఱిని బిలిపించి సభచేసి, తాను జిజ్ఞాసువై మొదట వామమార్గోప దేశకునిజూచి యిట్లడుగ వలయును - 'మహారాజా? నేను సేటివఱకొక గురువునుగాని, యొక ధర్మమును గావి గ్రహించినవాఁడనుగాను. సర్వధర్మములలో నుత్తమధర్మ మెవ్వరిదో చెప్పుడు. దాని నేను స్వీకరించెదను.

వామమార్గి:—మాది.

జిజ్ఞాసువు:—మఱి తక్కిన తొమ్మిదివందల తొంబదితొమ్మిది ధర్మము లెట్టున్నవి?

వామమార్గి:—అవియన్నియు నబద్ధములు. నరకమునకుఁ గొనిపోవునవియు నైయున్నవి. ఏలయనగా 'కౌలాత్పరతరన్నాస్తి' (కులార్ణవము. ౨-౮)అను ప్రమాణమునుబట్టి మాధర్మమును మించినదివేఱొక ధర్మమే లేదు.

జిజ్ఞాసువు:—మీ ధర్మమేమి?

వామమార్గి:—భగవతిని నమ్ముట, మద్యమాంసాది పంచ మకారములు సేవించుట, రుద్రయామలాది తంత్రముల నఱువదినాల్గింటిని నమ్ముట మొదలు గాఁగలది. నీవు ముక్తిని గోరుదువేని మాకు శిష్యుఁడవు కమ్ము.

జిజ్ఞాసువు:- మంచిది. తక్కిన మహాత్ములనుగూడ దర్శించి, యడిగి తెలిసికొనివచ్చెదను ఏమ్మట దేనియందు నాకు శ్రద్ధయుఁ బ్రీతియుఁ గలుగునో యా మతస్థునకే శిష్యుఁడ నయ్యెదను.

వామమార్గి:— అరే! ఈ భ్రాంతిలో నేలపడియున్నావు? వీరు నిన్ను మోసపుచ్చి తమ వలలలోఁ జిక్కించుకొందురు. ఎవ్వరియొద్దకును బోకుము. మాకే శరణాగతుఁడవు కమ్ము. లేకపోయిన నీకుఁ బశ్చాత్తాపము కలుగును. చూడుము! మా మతమున భోగమోక్షములు రెండును గలవు.

జిజ్ఞాసువు:— మంచిది. చూచివానిందు; అని ముందున కరుగిడి శైవుని యొద్దకుఁబోయి యతని నడుఁగగా నట్టియుత్తరమునే యతఁడు నొసఁగెను. కాని శివభక్తి, భస్మరుద్రాక్షధారణ, లింగార్చన, యివి లేనిది ముక్తిదొరకదని మాత్రము విశేషముగాఁ జెప్పెను. అతడు వానిని వదలి నవీన వేదాంతిగారి యొద్దకుఁ బోయెను.

జిజ్ఞాసువు:— మహారాజా! మీ ధర్మ మేమియో చెప్పుఁడు?

వేదాంతి:- మేము ధర్మాధర్మముల నేమియు నమ్మము. మేమే సాక్షాద్బ్రహ్మమై యున్నాము. మాయందు ధర్మాధర్మ మెక్కడనున్నది? ఈ జగత్తంతయు మిథ్యయే. ఎవడు జ్ఞాని, శుద్ధుఁడు, చేతనుఁడు కాఁదలఁచునో యతఁడు తానే బ్రహ్మము ననుకొని జీవుఁడను భావమును వదలి నిత్యముక్తుఁడగును.

జిజ్ఞాసువు:- మీరు బ్రహ్మము నిత్యముక్తులైన మీయందు బ్రహ్మ గుణకర్మ స్వభావము లేల లేవు? ఈశరీరమున నేల బంధింపఁబడియున్నారు?

వేదాంతి:- నీకు శరీరములు గోచరమగుచున్నవి. దీనివలననే కద నీవు భ్రాంతి గలిగియున్నాఁడవు మాకు బ్రహ్మము తప్ప మరేదియుఁ గానరాదు.

జిజ్ఞాసువు:— చూచువారగు మీరెవ్వరు? మఱి మీరెవరిని చూచుచున్నారు?

వేదాంతి:— చూచువాఁడు బ్రహ్మము. బ్రహ్మము బ్రహ్మమునే చూచుచున్నాఁడు

జిజ్ఞాసువు:— బ్రహ్మము లిద్దఱాయేమి?

వేదాంతి:— లేదు. తన్నుఁదానే చూచుకొనుచున్నాఁడు.

జిజ్ఞాసువు:— ఎవఁడైనను దన భుజములమీఁదఁ దానే నిలువఁగలఁడా? మీ మాట యున్మత్తాలాపమే కాని మఱి యేమియుఁగాదు.

పిమ్మట నతఁడు జైనులయొద్దకుఁబోయి వారిని బ్రశ్నించెను. వారు నటులనే చెప్పిరి కాని "జినధర్మము" తప్పఁ దక్కిన ధర్మములన్నియు నబద్ధము లనియు, జగత్తునకుఁ గర్త యనాది యీశ్వరుఁ డెవ్వఁడును లేఁడనియు, అనాది కాలమునుండి యీ జగత్తు యిప్పుడున్నట్లే యున్నదనియు, ఇఁక ముందును నిట్లే యుండ గలదనియు, నీవు మాకు శిష్యుఁడవగుము. మేమన్నివిధముల నుత్తములమై యున్నామనియు, ఉత్తమ విషయములను మాత్రమే నమ్ముచున్నామనియు, జైన మార్గముకంటె భిన్నమైనదెల్ల నబద్ధమనియు నీ విషయములను బోధించిరి. తరువాత నతఁడు ముందునకు సాగి క్రైస్తవుని సమీపించి యతని నడిగెను. అతఁడును వామమార్గివలెనే యడిగిన ప్రశ్నలన్నిటికిని బ్రత్యుత్తరము లిచ్చుచు "మనుష్యులందఱును బాపులు. కేవలము తమ సామర్థ్యముచేఁ బాపములు దూరముకావు. యేసువునందు విశ్వాసము కలుగనంతవఱకు నెవఁడును బవిత్రుఁడై ముక్తినిఁ బొందలేఁడు. అతఁ డందఱ ప్రాయశ్చిత్తము కొఱకుఁ దన ప్రాణములను ధారవోసి దయ చూపెను. నీవు మాకు శిష్యుఁడవు కమ్ము" అని మాత్రము విశేషముగా చెప్పెను. అది విని, యా జిజ్ఞాసువు మౌల్వీసాహెబుగారియొద్దకుఁ బోయెను అతనితో నటులే ప్రశ్నోత్తరములు జరిగెను కాని మౌల్వీసాహెబు (లాషరీక్ ఖుదా) "అద్వైత పరమాత్మను" అతని పైగంబరును. ఖురాన్ షరీఫ్‌ను నమ్మక పోయిన నెవ్వరికిని ముక్తిలభించదని మాత్రము విశేషముగాఁ జెప్పెను అట్లే ఈ మతమును నమ్మనివారు నరకగామి. కాఫిర్. చంప బడుటకు యోగ్యుఁడు అనియుఁ బోధించెను. ఆ మాటలు విని జిజ్ఞాసువు వైష్ణవుని

యొద్దకుఁ బోయెను. అతని తోడను వైష్ణవునితో వలసే సంవాదముఁ జరిగెను. వైష్ణవుఁడు "మా తిలకచిహ్నములను జూచి యమరాజు కూడ భయపడుచున్నాఁడు" అను నీవిశేషమును బోధించెను. ఆ మాటను విని జిజ్ఞాసువు తనలోఁ దాను, దోమలు, ఈగలు, పోలీసువాండ్రు, చోరులు, బందిపోటు దొంగలు శత్రువులు వీరే భయపడరే. యమరాజకింకరు లేల భయపడుదురో యనుకొని యటులే యందఱ నడుగుచుఁ బోఁగా నన్నిమతములవారును దమతమ మతమే సత్యమనుచు వచ్చిరి. వారిలో నొకఁడు మా కబీరుఁడు సత్యమనియు, నొకఁడు నానకుఁడనియు, మరియొకఁడు దాదువనియు, నింకొకఁడు వల్లభుఁడనియు, వేరొకఁడు సహజానందుఁడనియు, మరొకఁడు మాధవుఁడనియు నిట్లందఱును తమ తమవారే గొప్పవారనియు, వారంద ఱవతారపురుషులనియుఁ జెప్పిరి. ఇట్లు సహస్ర సంఖ్యాకుల నడుగఁగా దెలిసదేమన వీరందఱు పరస్పర మొకరితో నొకరు విరోధము కలిగియున్నారనియు, వీరిలో నెవ్వఁడును గురువగుటకుఁ దగినవాఁడు లేఁడనియు నతనికి నిశ్చయము కలిగెను. ఏలయనఁగా నొక్కొక్కనిమాట యబద్ధమని తొమ్మిదివందల తొంబది తొమ్మండుగురు సాక్ష్యమిచ్చుచు వచ్చిరి. అసత్యవాదులయిన యంగడివాండ్రవలెను, వేశ్యలవలెను, కుంటెనగాండ్రవలెను తమతమ వస్తువులు మంచివని కొనియాడు కొనుచు దక్కినవారి వస్తువులు మంచివికావని దూషించుచున్నరీతిని వీరును జేయుచున్నారు అని యెఱిఁగి-

తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్।
సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్॥౧॥

ఆ సత్యజ్ఞానము కొఱకు వాఁడు సమిత్పాణియై ముకుళిత కరకమలుఁడయి, త్రికర్త్రహస్తుఁడుగాక వేదవిదుఁడు, బ్రహ్మనిష్ఠగలవాఁడు, పరమాత్మను గుర్తెఱిఁగినవాఁడు నైన గురునియొద్దకుఁ బోవలయును; పాషండులవలలోఁ జిక్కఁగూడదు; అని తలంచెను.

తస్మై స విద్వానుపసన్నాయ సమ్యక్ప్రశాంతచిత్తాయ శమాన్వితాయ।
యేనాక్షరం పురుషం వేద సత్యం ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యామ్॥౨॥
ముండకోప. ఖం ౧. మం ౧౨-౧౩॥

ఇట్టి జిజ్ఞాసువు విద్వాంసునియొద్దకుఁ బోయినపు డత డీ శాంతచిత్తుఁడును, జితేంద్రియుఁడును నగు జిజ్ఞాసువునకు యథార్థ బ్రహ్మవిద్యను, పర

మాత్మ గుణకర్మ స్వభావముల నుపదేశము చేయవలయును; అట్లే వానికి ధర్మార్థ కామమోక్షములను, పరమాత్మను గుర్తెఱుగఁగల నాయా సాధనములను విశదమగునట్లు బోధింపవలయును.

అటఁదపు వట్టి పురుషుని యొద్దకుఁబోయి, మహారాజా! ఈ సంప్రదాయములవారు చెప్పిన విపరీతములవలన నా మతి భ్రమచెందినది. ఏలయనఁగా నేను వీరిలో నొకనికి శిష్యుఁడనయితినేని తొమ్మన్నూట తొంబది తొమ్మిది సాంప్రదాయములవారికి విరోధి గావలసివచ్చును. ఒకనికి తొమ్మిదినూర్ల తొంబదితొమ్మండుగురు శత్రువులయి యొకడు మాత్రమే మిత్రుఁడుగానున్న వానికి సుఖమెన్నటికిఁ గలుగఁజాలదు. కావున నాకు మీరుపదేశము చేయుఁడు. నేను దాని ననుష్ఠించెదను. అని యతని ప్రార్థించెను.

ఆప్తవిద్వాంసుఁడు:— ఈ మతములన్నియు నవిద్యవలనఁ బుట్టి విద్యావిరుద్ధములై యున్నయవి ఈ మతములవారు మూర్ఖులు, పామరులునగు నరవి మనుష్యులను మోసపుచ్చి వలలోఁ జిక్కించుకొని తమ ప్రయోజనమును నెఱవేర్చుకొనుచున్నారుగా! అక్కటా! వారు, మనుష్యజన్మ ఫలమునుండి రహితులై, తమ మనుష్యజన్మమును వ్యర్థముచేసికొనుచున్నారుగా! ఏ విషయమునని వేయు మతములు నేకీభవించునో అదియే వేదమతము. అదియే గ్రాహ్యము అని తెలిసికొనుము. ఇక నేయంశమున బరస్పర విరోధముండునో యది కల్పితమనియు, నబద్ధమనియు, నధర్మమనియు, గ్రహింపఁదగనిదనియుఁ దెలియవలయును.

జిజ్ఞాసువు:— దీనిని బరీక్షించు టెట్లు?

ఆప్తవిద్వాంసుఁడు:— నీవు వెళ్ళి వారితో నీవిషయముల నడుగుము. వారందఱు నేకీభవింతురు. అపుడా జిజ్ఞాసువు వేవురు సాంప్రదాయకుల నడుమ నిలిచి అయ్యలారా! మీరందఱును వినుఁడు! ధర్మము సత్యభాషణమున నున్నదా! మిథ్యాభాషణమందా? అని యడుగఁగా దానికి వారందఱును సత్యభాషణమున ధర్మమును, అసత్యభాషణమున నధర్మమును గలదనిరి. అటులయిన విద్యాభ్యాసము, బ్రహ్మచర్యపాలనము, పూర్ణయువావస్థయందలి వివాహము, సత్సహవాసము, పురుషార్థము, సత్యవ్యవహారము, ఈ మొదలగు వాని నాచరించుట యందు ధర్మము గలదా? లేక యవిద్యాగ్రహణము, బ్రహ్మచర్యము నలుపక

పోవుట, వ్యభిచారము, దుస్సాంగత్యము, అసత్యవ్యవహారము, ఛలము, కపటము, హింస, పరహాని మొదలగు కర్మముల నాచరించుటయందా? అని యడుగంగా విద్యాభ్యాసము మొదలుగాఁగల కర్మములందే ధర్మమును, అవిద్యాప్రచారాది కర్మములం దధర్మమును గలదని అందఱు నేకగ్రీవముగా సంగీకరించిరి. అప్పుడా జిజ్ఞాసు వందఱనుజూచి, మీ రందఱట్లు ఏకాభిప్రాయులయి సద్ధర్మాభివృద్ధికొఱకును, మిథ్యా మార్గమునకు హాని గలిగించుటకును నేల పాటుపడరని యడుగగా వారు మే మట్లుచేసిన మ మ్మాదరించువారెవరు? మా శిష్యులును మా యాజ్ఞకు లోఁబడి యుండకపోవుదురు. మా జీవికకును నష్టము కలుగును మఱి మేమనుభవించుచున్న యానందమునకు భంగము కలుగును కావున మేమెఱిఁగియు మా మా మతములనే బోధించుచు పట్టుదలకలిగియున్నారము. ఏలయనఁగా "రొట్టెను జెక్కెరతోఁ దినవలయును. లోకమును టక్కులతో జయింపవలయును" అను లోకోక్తిగలదు. ప్రపంచ మెట్లున్నదో చూడుము. న్యాయచింతన గలిగి సత్యవ్రతియయిన మనుష్యున కెవ్వడు నొక దబ్బ నీయఁడు. వాని నెవ్వఁడు నున్నావాయని యడుగనుగూడ నడుగఁడు. మోసము, గపటవంచనలు చేయువానికే అన్నివస్తువులు లభించును.

జిజ్ఞాసువు:- మీరిట్టి సన్నుగడలు పన్ని పరుల మోసపుచ్చుచున్నారే, రాజు మిమ్ము నేల దండింపడు?

మతములవారు:- రాజునుగూడ మేము మా శిష్యవర్గములోఁ జేర్చుకొని యున్నారము; మే మన్నికట్టుదిట్టముల నేర్పరచి యుంచినాము. అది వదలదు.

జిజ్ఞాసువు:- మీరు కపటములో నన్యమతస్థులగు మనుష్యులను మోసపుచ్చి వారికి హాని కలుగఁజేయుచున్నారే; మీరు పరమేశ్వరుని యెదుట నేమియుత్తర మీఁగలరు? మీకు ఘోర నరకమే సంప్రాప్తమగును. కొద్ది జీవనముకొఱకు నింతటి గొప్పయపరాధము చేయుట నేల మానరు?

మతములవారు:- అప్పైన నప్పటికి జూచుకొందము. నరకము, పరమేశ్వరునిదండన ఇవియెప్పటికో కలుగును. ఇప్పుడో మే మానంద మనుభవించుచున్నాము. మాకు వారు సంతోషముతో ధనాది పదార్థముల నిచ్చుచున్నారు మేము వారిని బలాత్కారముచేసి లాగుటలేదు. కాన రాజు మమ్మేల దండించును?

జిజ్ఞాసువు:- ఒక పసిబాలు నెవ్వఁడైనను బుజ్జగించి వానిమీఁద నున్న ధనాదిపదార్థముల నపహరించిన వానికెట్టి శిక్ష లభించునో యట్టిశిక్ష మీకేల కలుగదు ?

అజ్ఞో భవతి వై బాలః పితా భవతి మంత్రదః ॥మను. అ.౨ శ్లో.౧౫౩॥

జ్ఞాన శూన్యుడైనవాని బాలుఁడనియు, జ్ఞానము నిచ్చువానిని తండ్రి లేక వృద్ధుఁడనియు నందురు. బుద్ధిమంతుఁడు, విద్యాంసుఁడు నైన వాఁడు మీ మాట లలోఁ జిక్కుపడఁడు; కాని బాలురవలెనున్న యజ్ఞానులను మీరు మోసపుచ్చు చున్నందులకు మీకు రాజదండన మవశ్యము కలుగవలయును.

మతములవారు:-రాజును బ్రిజలందఱును మామతములోని వారైనపుడు మాకు దండన విధించువాఁడెవ్వఁడు ? అట్టియవస్థ కలుగునప్పటికి వీనిని వదలి వేఱొకవ్యవస్థను కుదుర్చుకొనగలము.

జిజ్ఞాసువు:-మీరుకూర్చుండి కష్టపడక వ్యర్థముగా నితరుల ధబ్బు లాగు చున్నారు. దీనిని వదలి విద్యనభ్యసించి గృహస్థుల బాలబాలికలను జదివించిన మీకును ఆ గృహస్థులకు గూడ నెంతో శుభము చేకూరునుగద.

మతములవారు:- బాల్యావస్థ మొదలుకొని మరణపర్యంతము మాకు లభించియున్న సుఖము నిపుడు పంబఁగలిపి, బాల్యావస్థనుండి యువావస్థవఱకు విద్యాభ్యాసములోఁబడి, పిదప విద్య నెప్పుచు నుపదేశము చేయుచు నిట్లు బ్రతికి నన్నాళ్ళు శ్రమపడుచు నుండుటవలన మాకేమి ప్రయోజనము ? మాకు అనా యాసముగానే లక్షలకొలది రూప్యములు లభించుచున్నవి. ఆనందించు చున్నాము. దాని నెందులకు పోఁగొట్టుకొనవలయును ?

జిజ్ఞాసువు:—దీని పరిణామము మంచిదికాదు. చూడుఁడు: మీకు గొప్ప రోగములు సంభవించి త్వరలోనే మృత్యువును బొందుచున్నారు. మీరు బుద్ధి మంతులలో నిందితు లగుచున్నారుగద. అయినను మీ రేల తెలిసికొనరు.

మతములవారు:—ఓరీ ! నాయనా !

తదా ధర్మ స్తదా కర్మ తదా హి పరమం పదమ్ ।
యస్య గృహే తదా నాస్తి హా । తదా తదబరాయతే ॥౧॥

నీవు పసివాఁడవు. నీకుఁబ్రపంచ జ్ఞానములేదు. చూడుము: పైసాలేనిది ధర్మమును, పైసాలేనిది కర్మమును, పైసాలేనిది ముక్తియును దొరకదు.

ఎవ్వనియింటఁ బైసాలేదో, వాఁడు పైసా పైసాయని పలవరించుచుండును. మంచి మంచి వస్తువుల నువ్విళ్ళూరు చూపులతోఁ జూచుచు, అయ్యో! నా యొద్దఁ బైసయుండిన నీ మంచి పదార్థముల ననుభవించియుందునుగదా! అని తలంచును.

అనా అంశకలాః ప్రోక్తా రూప్యైకో భగవాన్ స్వయమ్ ।
అతస్తం సర్వ ఇచ్ఛంతి రూప్యం హి గుణవత్తమమ్ ॥౨॥

పైలయన సందఱును భగవంతుఁడు బదియాఱు కళలతోఁ గూడిన వాఁడు, అదృశ్యుఁడు అని చెప్పుట మాత్రము వినుచున్నారే కాని కంటితోఁ జూచియెఱుంగరు. కాని పదియాఱణాలు పైసాలు, గవ్వలు అను అంశలు కళలతోఁ గూడియున్న రూప్యమే సాక్షాద్భగవత్స్వరూపము. కావుననే యంద ఱును రూప్యములను జేకూర్చుటయందు మగ్నులై యున్నారు. పైలయనఁగాఁ బనులన్నియు రూప్యములవలననే నెఱవేఱుచున్నవి.

జిజ్ఞాసువు:—సరే! ఇప్పుడు మీ లోగుట్టు బైలుపడినది. మీరీ పన్ను గడలు మీ సౌఖ్యముకొఱకే పన్నితిరనుట స్పష్టము. కాని దీనివలన జగత్తు నకు హానికలుగుచున్నది. సత్యోపదేశమువలనఁ బ్రపంచమునకు లాభము కలుగునట్లే యసత్యోపదేశమువలన నష్టము కలుగును. మీరు ధనమే కావలని యున్న కొలువుచేసియో, వ్యాపార వ్యవహారాది కార్యము లొనర్చియో ధన మేల గూడఁబెట్టరు?

మతములవారు:— వానిలోఁ బరిశ్రమ మెక్కువగలదు. ఒక్కొక్క ప్పుడు నష్టముగూడఁ గలుగును. కాని మా యీ పన్నుగడలలో నష్టమెన్నటి కిని గలుగదు సదా లాభమే కలుగుచుండును. చూడుము! తులసీదళము చేతఁబట్టి చరణామృతము త్రాగించి, మెడ నొక మాలగట్టి శిష్యుఁడుగాఁ జేసి కొనుచున్నాము. వాఁడు బ్రతికినన్నాళ్ళు పశుప్రాయుఁడుగానుండి మేము చెప్పి నట్లెల్ల నడుచుకొనును.

జిజ్ఞాసువు:—వీరు మీకుఁ జాలధనము దేనికొఱ కిచ్చుచున్నారు?

మతములవారు:— ధర్మము, స్వర్గము, మోక్షము అను నివిలభించుటకు.

జిజ్ఞాసువు:—మీరు ముక్తులునుకారు, ముక్తిస్వరూపమును గాని, ముక్తి సాధనములనుగాని యెఱిఁగినవారునుగారు; మఱి మీఁబోటివారికి సేవచేయుట వలన వారికేమి దొరకఁగలదు?

మతములవారు:—ఏమి? ఈలోకమున దొరకునా? లేదు. కాని చచ్చిన తరువాత, పరలోకమున జిక్కును. ఈ లోకమున మాకెంత యిచ్చుచున్నారో, మాసేవ యెంతచేయుచున్నారో, అదంతయు వారికి, పరలోకమున లభించును.

జిజ్ఞాసువు:— ఇచ్చినది వీరికి దొరుకునో దొంగదోకాని తీసికొను వారగు మీకేమి దొరకును? నరకమేనా మతేమైననా?

మతములవారు:—మేము భజన చేయుచున్నాము. దానికి ప్రతిగా మాకు సుఖము దొరకును.

జిజ్ఞాసువు:—మీ భజనలన్నియు, దైసాకాలికే. ఆ పైసాయంతయు నిక్కడనే పడియుండును. మీరు పెంచుచున్న మాంసపిండముకూడ భస్మమై యిచ్చటనే పడియుండును. మీరు పరమేశ్వరుని భజించుచుండిన మీ యాత్మయైన పరిశుద్ధమై యుండెడిది.

మతములవారు:— మే మపవిత్రులమా యేమి?

జిజ్ఞాసువు:— మీ లోపలిభావము మహామలినమైనది.

మతములవారు:— మీ రెట్లెరుగుదురు?

జిజ్ఞాసువు :— మీ యాచారవ్యవహారములవలన.

మతములవారు:—మహాత్ముల వ్యవహారము ఏనుగుపండ్లవలెనుండును. ఏనుగునకు పండ్లు తినుటకుపయోగించునవి వేఱుగను, జూపునకు వేఱుగ నుండునటులే మేము లోపల, పవిత్రులముగానుండి వెలుపల లీలను మాత్రము చేయుచున్నాము

జిజ్ఞాసువు:—మీ యాంతర్యము పరిశుద్ధముగానుండిన మీ బహిశ్చర్యలు కూడ పవిత్రముగానే యుండెడివి. కావున మీయాంతర్యమును మలినమైనదే.

మతములవారు:—మేమెట్లున్ననేమి: మాశిష్యులుమాత్రము మంచివారేకదా?

జిజ్ఞాసువు:—గురువులగు మీరెట్లున్నారో మీశిష్యులు నట్లేయగుదురు

మతములవారు:—ఒక్క మత మెన్నటికి, గాఁజాలదు. ఏలయనఁగా మనుష్యుల గుణకర్మస్వభావములు భిన్నములు.

జిజ్ఞాసువు:—బాల్యావస్థయం దందఱికి నొకేవిధముగ శిక్షనొసఁగి సత్య భాషణాది ధర్మగ్రహణమును, మిథ్యాభాషణాద్యధర్మ త్యాగమును జేయించిన నవశ్యముగ నొకమతమే యుండనగును. ఇఁక ధర్మాత్ములు, అధర్మాత్ములు

అను రెండు మతములవారు అన్ని కాలములందుండవచ్చును. కాని ధర్మాత్ము లధికమైయధర్మాత్ములు న్యూనమగుటవలన ప్రపంచమున సుఖమధికమగును. అధర్మలధికమగునపుడు దుఃఖము హెచ్చును. కావున విద్వాంసులందఱు నొకేవిధమైన యుపదేశముచేయఁజూచురేని యొక్క మతమగుటకుఁ జాల కాలము పట్టదు.

మతములవారు:- ఇది కలియుగము. నీవు సత్యయుగపు మాటల గోరకుము.

జిజ్ఞాసువు:-కలియుగమనునది యొక కాలముపేరు.కాలము క్రియారహి తమై యున్నందున నది ధర్మాధర్మము లొనర్చుటకు సాధకము కాని బాధకము కాని కాదు. కాని మీరే కలియుగమూర్తులై యున్నారు. మనుష్యులే సత్య యుగ కలియుగములు కానిపక్షమున నెవ్వఁడు నీ ప్రపంచమున ధర్మా త్ముఁడు గాకుండును. ఇవన్నియు సాంగత్యమువలనఁ గలుగు గుణదోష ములేకాని స్వాభావికములుగావు. అని యింతముచ్చటించి, మరల నా ప్తవిద్వాం సుని యొద్దకుఁబోయి, యాయనతో మహారాజా! మీరు నన్నుద్ధరించితిరి. లేక పోయిన నేను నెవరివలలోనో పడి సర్వభ్రష్టుఁడనై పోదును. ఇఁక మీఁదట నేనుగూడ నీపాషండుల ఖండనము వేదోక్తసత్యమత మండనమునుజేసెదను.

ఆప్తవిద్వాంసుఁడు:- మనుష్యులందఱకును, ప్రాయికముగా విద్వాంసు లకు సన్యాసులకు నిదియే కర్తవ్యము. అనఁగా వారు సకలమనుష్యులకు సత్య మండనమును అసత్యఖండనమును జేయఁగలుగునట్లు వినిపించి, సత్యోప దేశము ద్వారా ఉపకారము కలుగఁజేయవలయును.

ప్రశ్న:-బ్రహ్మచారులు, సన్యాసులు అనఁబడువారైన మంచివారేనా?

ఉత్తరము:- ఈ యాశ్రమములు మాత్రము మంచివేకాని యిపుడు వీనిలోఁగూడఁ జాల మోసముగలదు. ఎందఱో బ్రహ్మచారులమని చెప్పుకొనుచు జటలుధరించి, లేనిపోని సిద్ధులను జూపుచు జప పురశ్చరణాదులలో లిప్తులై యున్నారు. విద్యాభ్యాసమను పేరుగూడఁ దలఁపరు. ఏకారణముచే బ్రహ్మచారి యను పేరుకలుగున్నదో యా బ్రహ్మమను వేదపఠనమం దెంతమాత్రము శ్రమపడరు. అట్టి బ్రహ్మచారులు మేకమెడనుండు స్తనమువలె నిరర్థకులుగా నున్నారు. అటువంటి సన్యాసులు విద్యావిహీనులై దండకమండలములను

ధరించి కేవలము భిక్షమెత్తుకొనుచు సంచారముచేయుచుందురు. వేదమార్గము నెంతమాత్రము వర్ధిల్లఁజేయరు. బాల్యావస్థలోనే సన్న్యాసమును స్వీకరించి భ్రమ్మరులై తిరుగుచుందురు. విద్యాభ్యాసమును వదలిపేయుదురు. ఇట్టి బ్రహ్మచారులును, సన్న్యాసులు నిక్కడక్కడ జలస్థల పాషాణాది మూర్తులను దర్శించుచుఁ బూజించుచు' దిరుగుచునుందురు. కొంతవిద్యావంతులై నవారును మౌనముగనుందురు. ఏకాంత ప్రదేశమున యథేష్టముగాఁ దిని త్రాగి నిద్రించుచు బడియుందురు ఈర్ష్యాద్వేషములయందు మగ్నులయి నిందా దుశ్చేష్టలొనర్చి తమజీవితమును నిర్వహించుకొందురు. కాషాయవస్త్రములను, దండమును గ్రహించిన మాత్రమునఁ దాము కృతకృత్యులయినట్లు తలంచుచుందురు తాము సర్వోత్కృష్టులమని భావించి యుత్తమకార్యములఁజేయరు. ఇట్టి సన్న్యాసులు గూడ నీ ప్రపంచమున వ్యర్థముగా వాసము చేయుచున్నారు. ఇఁక సకలజగత్తునకు మేలొనగూర్చువారు ప్రశంసనీయులు.

ప్రశ్న:-గిరి, పురి, భారతి మొదలగు గోసాయులయిన మంచివారేనా? ఏలయనఁగా వారు గుంపులు గుంపులుగా' జేరి అక్కడక్కడ సంచరించుచు వందలకొలఁది సాధువుల కానందము గలుగఁజేయుచున్నారు. వారు సర్వత్ర అద్వైతమత ప్రచారము చేయుచున్నారు. అట్లే కొంత చదువుచుఁ జదివించుచున్నారు. కావున వారు మంచివారు కావచ్చును.

ఉత్తరము:- ఈ పది పేరులు నిటీవలఁ గల్పింపఁబడినవే కాని సనాతనములు కావు. వారు గుంపులుగాఁ జేరియుండుటెల్ల భోజనము కొఱకే. అనేక సాధువులు పొట్టకూటికయి యా గుంపులలో నుందురు. అందు దంభము కలవారును గలరు. ఏలయనఁగా వారిలో మహంతుగాఁ జేయఁబడిన యొకముఖ్యుఁడు సాయంకాలముకాఁగా నొక గద్దెపైఁ గూర్చుండును. అప్పుడు బ్రాహ్మణులును, సాధువులందఱును లేచి నిలవబడి పుష్పములు చేతనుంచుకొని:-

> నారాయణం పద్మభవం వసిష్ఠం శక్తిం చ తత్పుత్ర-
> పరాశరం చ వ్యాసం శుకం గౌడపదం మహాంతమ్॥ పుష్పాంజలి॥

ఇత్యాది శ్లోకములను జదివి హరహరయని యతనిమీఁద'బువ్వుల వర్షమును గురియించి, సాష్టాంగ నమస్కారములను జేయుదురు. అట్లు చేయని వాని తప్పటి నుండుటయుఁ గష్టమే. ఈ దంభము ప్రపంచమునకుఁ జూపుట

కొలుపుఁ జేయురుదు. దీనివలన జగమునఁ బ్రతిష్ఠగలిగి ధనసంచయమగుననియే వారి యుద్దేశము. ఎందఱో మఠాధిపతులు గృహస్థులుగానున్నను సన్న్యాసమం దభిమానము గలిగియుందురే కాని యెంతమాత్రము కర్మము చేయరు. పంచమ సముల్లాసమున వ్రాయఁబడినదే సన్న్యాసుల కర్మమని యెఱుఁగవలెను. అట్టి కర్మమాచరింపక వృథా కాలహరణము చేయుచున్నారు. ఎవఁడైన మంచియుప దేశము చేసినవానికిఁగూడ వారు విరోధులగుదురు. తఱచుగా వీరు భస్మరుద్రా క్షం ధరించుచు శైవ సాంప్రదాయమున నభిమానమును గలిగి యుందురు. శాస్త్రార్థము జేయునపుడెల్ల దమ మతము సనఁగా శంకరాచార్యోక్తమతమును స్థాపించి, చక్రాంకితాదులను ఖండించుట యందుఁ బ్రవృత్తులగుచుందురు. వేద మార్గోన్నతికొఱకు పాషండమార్గము లెన్ని యున్నవో వాని ఖండించుటకు నెంతమాత్రము పాటుపడరు. ఈ సన్న్యాసులు "మాకు ఖండనమండనములతో బ్రయోజనమేమి? మేము మహాత్ము"లమని యెందురు. ఇట్టివారిచే ప్రపంచమునకార రూపులై యున్నారు. వీరిట్లుండఁ బట్టియే వేదవిరోధులగు వామమార్గాది సాంప్ర దాయములవారును గ్రైస్తవులును మహమ్మదీయులును జైనులు మొదలగువారును వృద్ధికివచ్చిరి. ఇప్పుడును వృద్ధికి వచ్చు చున్నారు. ఇట్లు తమకు నాశనము కలుగు చున్నను గూడ నీ సన్న్యాసులు కన్నులు దెఱువరు. ఎందులకు తెలియునా? వీరి హృదయములందుఁ బరోపకార బుద్ధియు. సన్న్యాసులనఁబడు వీరలకుఁ దమ కర్తవ్య కర్మములయందు నుత్సాహమును లేదు. కాని వీరు కేవలము తమ ప్రతిష్ఠను గోరుచు భోజనపానములకంటె నధికమేమియు లేదనియే తలంతురు. లోక నిందకుఁ జాల భయపడుదురు (లోకైషణ) లోకమునఁ బ్రతిష్ఠ. (విత్తైషణ) ధనార్జనమందుఁ దత్పరులై విషయభోగముల నభిలషించుట (పుత్రైషణ) పుత్రులవలె శిష్యులమీఁద మోహితులగుట. ఈ మూఁడేషణములను వదలుట యుచితము ఈ యేషణములే వదలనపుడు సన్న్యాస మెట్లుకాఁగలదు? పక్షపాతరహితమైనట్టి వేదోక్త మార్గోపదేశమువలన జగత్తునకు హితము కలుగఁజేయుటయందహర్నిశము ప్రవృత్తులయి యుండుట సన్న్యాసులకు ముఖ్య కర్తవ్యము. తమతమయధికారకర్మము లొనరింపలేని సన్న్యాసాదినామములు వహించుట వ్యర్థము. కావునఁ దమ వ్యవహారములయందును స్వార్థమునను శ్రమపడు గృహస్థులకంటె నధిక పరిశ్రమ చేయుచు పరోపకార మొనర్చుటయందు

సన్యాసులును దత్పరులై యుండవలయును. అప్పుడే యన్ని యాశ్రమములు అభివృద్ధిలో నుండును.

చూడుఁడు: మీ కంటియెదుటనే పాషండమతములు వృద్ధియగుచువచ్చుచున్నవి. జనులు క్రైస్తవులుగా, మహమ్మదీయులుగా నై పోవుచున్నారు. మీ యింటిని మీరు కాపాడుకొనుటకు, నితరులను మీలోఁ గలుపుకొనుటకునుగూడ మైనను మీ చేతఁగాకున్నది. వేరొనగుట యెప్పుడు? మీరు చేయఁదలఁచి నప్పుడుకదా? ఇప్పుడును, ఇఁకమీఁదటను మీరున్నతిశీలురు కాకపోయిన నార్యావర్తీయులకు నన్యదేశీయులకును వృద్ధిగలుగదు. వృద్ధికిఁ గారణములగు వేదాది శాస్త్రముల పఠనపాఠనములును, బ్రహ్మచర్యాది ఆశ్రమముల యథావదనుష్ఠానమును, సత్యోపదేశమును గలుగునప్పుడే దేశోన్నతియగును. గమనించి చూడుఁడు: అనేక కపటవ్యాపారములు, మీరుయథార్థముగచూచుచునేయున్నారు.

వేరగానివంటి యొకానొక సాధువు పుత్రాదులఁ గలిగింతునని సిద్ధుం డెవ్వఁటినో చూపును. అప్పుడు వానియొద్దకు స్త్రీ లెందఱో వెళ్ళి, ముకుళిత హస్తులై పుత్రభిక్ష నడుగుదురు. బాబాజీగా రందరికిని బుత్రులు గలుగునట్లాశీర్వదింతురు. వారిలో నొకతెకు బుత్రుఁడుగలిగినప్పుడు, ఆమె "బాబాజీగారి వచనప్రభావమువలననే పుత్రుఁడుగలిగినాఁడని" భావించును. కాని పంది, కుక్క, గాడిదె, కోడి మున్నగు వానికి ఏబాబాజీగారి యాశీర్వచనము వలనఁ బిల్లలు పుట్టుచున్నారని యడిగిన నా యతివ యుత్తరమేమియు నీయఁజాలకుండును గద. ఎవఁడేని "నేను పిల్లవానిని రక్షింతును; దావనీయను అని చెప్పునేని స్వయముగా వాఁడే యేల చనిపోవును? ఇట్టిందఱో వంచకులు. మంచి బుద్ధిమంతులుకూడ మోసపోవునంతటి మాయలు చేయుచున్నారు.

'ధనసారి' మోసగాండ్రను జూడుఁడు. వారై దాఱుగురుచేరి దూరదూర దేశములకుఁ బోయి, తమలో నాకారపుష్టిగలిగి, చూపులకుఁ జక్కగానుండు వానికి సిద్ధపురుషునివంటి వేషమువేసి, ధనాఢ్యులుండు పట్టణమునకుగాని, గ్రామమునకుఁగాని సమీపమునందున్న యడవిలో వానినుంచి, సాధకులుగా నున్న తక్కినవా రేమియు నెఱుఁగనివారివలె వేర్వేఱుగా నాయూరిలోనికిఁ బోయి, యెదురైనవారి నెల్ల "మీరిట నెక్కడైనను ఫలానా మహాత్ముని జూచి యున్నారా?" యని యడుగఁజొత్తురు. వారిట్లువిని, ఆ మహాత్ముఁడెవ్వఁడు? అతఁ

దెట్టివాఁడు? అని విచారింపగా నతఁడు మహా సిద్ధపురుషుఁడు. ఎదుటివాని హృదయములోనిమాట నున్నదున్నట్లు చెప్పును. అతఁడు చెప్పినమాట తప్పక ఫలించును. అతడు మహా యోగీశ్వరుఁడు; అతనిదర్శనము కొఱకే మేము మా యిండ్లను వదలి యిట్లు తిరుగుచున్నాము అమ్మహాత్ముఁడీప్రాంత మందే యెక్కడికో వచ్చియున్నట్లు మాకుఁ దెలిసినది. అని చెప్పుదురు ఈ సుద్దుల విన్న యా గృహస్థులు "ఆ మహాత్ముఁడు మీకు చిక్కినచో మాకును దెలియఁజేయుఁడు. మేము కూడ వారి దర్శనమును జేసికొనెదము. అట్లే మా మనస్సులోనున్న మాటలనడిగి తెలిసికొనెదము" అని యందురు ఇట్లు వారు దినమంతయు నాయూరు తిరిగి ప్రతియొకనికి ఆసిద్ధుని ప్రభావమును వెల్లడి చేయుదురు. రాత్రికాఁగానే సిద్ధ సాధకు లందఱును జేరి తిని త్రాగి నిద్రింతురు.

మరలఁ బ్రొద్దునలేచి యాయూరికే పోయి తిరిగి వత్తురు. ఇట్లు రెండు మూఁడు దినములైనతరువాత నా సాధకులలో నొక్కొక్కఁ డొక్కొక్క ధనవంతుని యొద్దకుబోయి, ఆ మహాత్ముఁడు దొరికినాడు. నీకు నాతనిదర్శింప నిచ్ఛయుండిన నాతోరమ్ము పోదము. అని చెప్పుదురు. ఇఁక వారు సిద్ధమై వెంబడిరాఁగా నీసాధకులు "నీవేమి యడుగఁదలఁచినావో నాతో చెప్పుమని" వారల నడుగుదురు. అప్పుడు వారిలో నొకఁడు తనకు రోగనివారణము కావలయుననియు, వేరొకఁడు తనకు శత్రుజయము కలుగవలెననియు దాము కోరెడు సంగతులెల్ల వారితోఁ జెప్పుదురు. అప్పుడు వారాధనికులను వెంటనిడుకొని యా సిద్ధుఁడున్న చోటికిఁ గొనిపోవుదురు.

ఈ మనోగతములఁ దెలిసికొనునట్లాసిద్ధసాధకులు మొదటనేకొన్ని సంకేతముల నేర్పఱచుకొని యుందురు. అనఁగా ధనాపేక్షగల వారిని గుడిప్రక్కను, పుత్రేచ్ఛగల వారిని సమ్ముఖమునను, రోగనివారణమును గోరువారి నెడమ ప్రక్కను, శత్రుజయము నాశించువారిని వెనుకప్రక్కనుండి త్రిప్పి యెదుటఁ గూర్చున్నవారి నడుమనుగూర్చుండఁ బెట్టుదురు. వారు నమస్కారము చేసిన తక్షణమే, యాసిద్ధుఁడు తన మాయా ప్రభావమువలనఁ గొంత బిగ్గరగా "నీవు పుత్రాపేక్ష గలిగి వచ్చియున్నావే" ఏమి, మాయొద్దఁ బుత్రుల నుంచుకొని యున్నామా? అనియు, ఆదేరీతిని ధనవాంఛతో వచ్చిన వానిని జూచి, ఇచ్చట సంచుల పెట్టుకొనియున్నామనియా? నీవు ధనమునుగోరి వచ్చియున్నావు వకీ

దుల యొద్ద దవమెక్కడ నుండునవియు, రోగనివారణార్థము వచ్చినవానిఁ జూచి, మేము వైద్యులమనియూ నీవు రోగనివారణము కొఱకు వచ్చి యున్నావు: నీ రోగమును మాన్పుటకు మేము వైద్యులము కాము వైద్యుఁ డెవఁడైననుండిన వానియొద్దకుఁ బో పొమ్మనియు నడును.

వచ్చినవాని తండ్రి రోగిగానున్న నంగుష్ఠమును, తల్లి రోగిగానున్న చూపుడు వ్రేలును, అన్నదమ్ములు రోగులుగానున్న నడిమి వ్రేలును, భార్య రోగిగానున్న ననామికను, కుమార్తె రోగిగానున్నఁ జిటికెనవ్రేలును నా సారకులు సంకేతముగాఁ జూపుదురు. అప్పుడా సిద్ధుఁడు నీ తండ్రిరోగిగానున్నాఁడు; నీ తల్లిరోగిగానున్నది; నీ తోఁబుట్టువు రోగిగా నున్నాఁడు; నీ భార్యరోగిగా నున్నది; నీ బిడ్డ రోగిగానున్నదని సంకేతమునుబట్టి సందర్భానుసారముగ చెప్పును. వచ్చియున్న యా నలుగురును మోహితులై పోవుదురు. అప్పుడా సారకులు వారితోఁ, జూచితిరా: మేము చెప్పినటులే యున్నారా, లేదాః యని యడుగుదురు. ఆ గృహస్థులు, మీరెట్లు చెప్పియుంటిరో, వారట్లేయున్నారు. మీరు మాకొక గొప్పయుపకారమును జేసితిరి. ఇటువంటి మహాత్ముఁడు ఉక్కుట మా గొప్ప భాగ్యోదయమే యనవలెను ఈ మహాత్ముని దర్శించి మేము కృతార్థులమైతిమి అని వారితో నందురు.

దానిపై నా సారకులు. నాయనలారా! వినుఁడు- ఈ మహాత్ముఁడు మనో గామి. చాలదినములవఱకిచ్చట నుండువాఁడు కాఁడు ఈయన యాశీర్వాదము నేమైనఁ గొంతఁ బొందవలయునంటిరా. మీ మీ సామర్థ్యము కొలఁది తను మ నోధనముల చేత సేవచేయుఁడు. ఏలయనఁగా సేవవలననే ఫలమబ్బును. ఈయన కెవ్వరిమీఁద నైన దయపుట్టెనా యేమి వరమిచ్చునో తెలియదు. నం తుల మహిమ అపారమైనది సుమా! అని వారిని బుజ్జగింతురు. పాప మా గృహస్థులు వారి మృదుమధుర వాక్కుల కుబ్బొంగి హర్షముతోఁ గొనియా డుచు దమతమ యిండ్లకుఁ బోవుదురు. తమ గుట్టు నెవరెక్కడ వెలిపఱతురో యను భీతిచే నాసారకులుగూడ వారిని వెంబడింతురు. వారట్లా ధనికులతోఁ గూడిపోవుచు, వారి మిత్రులెవరైన నెదురుపడిన వారితో నెల్ల నాసిద్ధుని ప్రశంసఁ జేయుచుందురు ఇట్లా సారకులతోఁ బోవుచున్న వారందఱు దమ దమ వృత్తాంతమంతయుఁ జెప్పుచుందురు. ఇఁక నాపట్టణమందెక్కడఁ బూఁచి

నను. 'ఫలానా స్థలమున నెవఁడో మహాపురుషుఁడు వచ్చినాఁడట. వదండి అతనియొద్దకు 'బోదము' అను వార్తానాదమే వినఁబడుచుండును. అప్పుడు జనులు గుంపులు గుంపులుగాఁబోయి, మహారాజా! నా మనస్సులోని వృత్తాంతమును దెలుపుఁడు; అనియాసిద్ధుని నడుగఁబోదురు. అప్పుడు తమ సాంకేతిక వ్యవహారమంతయు సన్నద్ధమై యుండుటఁజూచి, యా సిద్ధుఁడు మౌనవ్రతముఁ బూని కొంతసేపటికి. "మమ్మూరక పీడింపకుఁడు" అని చెప్పును. తక్షణమే సాధకుఁడొకఁ డామాటనందుకొని వారితో, 'ఈయన నిట్లూరక పీడించిన నితఁడు వెడలిపోవు'నని చెప్పును. వారిలో నెవఁడో యొక గొప్ప ధనాఢ్యుఁడు, ఆ సాధకుని వేఱుఁగా బిలుచుకొనివచ్చి "మా మనస్సులోని మాటఁ జెప్పించిన మేము యథార్థమని నమ్మఁగలము" అని వానితో ననును. అప్పుడా సాధకుఁడు అదేమి మాట అని యడుగును. ఆ ధనాఢ్యుఁడు తన యాంతర్యమును విప్పిచెప్పఁగానే, ఆ సాధకుఁడు, పైఁజెప్పిన సంకేతానుసార మాతనిని తీసికొనిపోయి యాసిద్ధునియొద్దఁ గూర్చుండబెట్టును. అప్పుడా సిద్ధుఁడు గ్రహించి తక్షణమే వానితలంపును జెప్పివేయును. అచ్చటఁ బ్రోగై యుండినవారెల్ల దానినివిని, ఓహో! ఈతఁడు గొప్ప సిద్ధపురుషుఁడని నమ్మి, కొందఱు మిఠాయిని, కొందఱు పైసాలను, కొందఱు రూపాయలను, కొందఱు నవరసులను, కొందఱు వస్త్రములను, కొందఱు వంటసామగ్రిని దెచ్చి సమర్పణచేయుదురు. ఇట్లాజనులకు నమ్మకమున్నంత కాల మా సిద్ధసాధకులు లోకులను యథేష్టముగా దోఁచుకొనితిందురు. ఎవరైన నొకరిద్దఱు హృదయాంధులు, ధనపూర్ణులు నైనవారు పుత్రాపేక్షతో వచ్చిన, వారి కాశీర్వాదమో లేక భస్మమో యొసఁగి, వేయి రూపాయలను వారినుండి పుచ్చుకొని, "ఏయందు నిజమైన భక్తికలదేని నీకుఁ బుత్రుఁడు దప్పక కలుగు"నని చెప్పును ఇటువంటి దొంగలెందఱోయున్నారు. అట్టి వారిని విద్వాంసులే పరీక్షింపఁ గలుగుదురు. కాని తక్కినవారు పరీక్షింప నర్హులుకారు. కాన వేదాది విద్యలను జదువుచు సత్సాంగత్యమున కాలము గడుపఁదగును. వాని నెవ్వఁను మోసపుచ్చనేరఁడు అతఁడితరులనుగూడ నట్టి మోసమునుండి కాపాడఁగలఁడు. ఏలయనఁగా విద్యయే మనుష్యునకు నేత్రమువంటిది. విద్యాశిక్షలఁ బొందకున్న జ్ఞానము కలుగనేరదు. బాల్యావస్థనుండియు నుత్తమశిక్ష నెవరు

పొందుదురో వారే విద్వాంసులగుదురు. దుస్సంగతిలోఁ బడినవారు దుష్టులుఁ బాపాత్ములు మహామూర్ఖులునై దుఃఖ మనుభవింతురు. కావుననే జ్ఞానమే విశేషమని చెప్పఁబడినది. వివేకమున్నవాఁడే యంగీకరింపగలఁడు.

> న వేత్తి యో యస్య గుణప్రకర్షం స తస్య నిందాం సతతం కరోతి।
> యథా కిరాతీ కరికుంభజాతా ముక్తాః పరిత్యజ్య బిభర్తి గుంజాః ॥
>
> చాణక్యనీతి. అ. ౧౧. శ్లో. ౮ ॥

అడవిలోనుండు భిల్లులు గజకుంభములోఁ బుట్టు ముత్యములను వదలి, గురిగింజల హారములను ధరించునట్లే యొక వస్తుగుణము గుర్తెఱుఁగనివాఁడు దానినెప్పుడును నిందించుచుండును. అట్లే యేపురుషుఁడు విద్వాంసుఁడు, జ్ఞాని, ధార్మికుఁడు, సత్పురుషులసహవాసము కలవాఁడు, యోగియు, పురుషార్థియు, జితేంద్రియుఁడు, సుశీలుఁడు నగునో వాఁడే ధర్మార్థ కామమోక్షములనుబొంది, ఈ జన్మమునను బరజన్మమునను సదా ఆనందముగ్నుఁడై యుండును. ఇంతవఱకు నార్యావర్తనివాసుల మతవిషయము సంక్షిప్తముగా వ్రాయఁబడినది. దీనికిఁ దరువాత కొంతవఱకు లభించిన యార్యరాజుల యితిహాసము సజ్జనులందఱకుఁ దెలియుటకు బ్రకటింపఁ బడినది.

ఇఁకనార్యావర్తదేశీయరాజవంశము(శ్రీమాన్ యుధిష్ఠిర మహారాజు మొదలుకొని యశపాలమహారాజు పర్యంతము) ఇతిహాసము వ్రాయుచున్నాము శ్రీమాన్ స్వాయంభువ మను మహారాజు మొదలుకొని యుధిష్ఠిర మహారాజు పర్యంతము నితిహాసము మహాభారతాది గ్రంథములందు వ్రాయఁబడియే యున్నది. కాన నిటీవలి రాజుల యితిహాసము దీనివలన, సజ్జనులకు విదితమగును. ఈ విషయము విద్యార్థుల యుపయోగార్థము, రాజపుత్రస్థానముననున్న యుదయపుర రాజసంస్థానమునకు రాజధానియైన చిత్తొడుగఢ (చిత్తోడు) పురమునుండి వెడలుచుండిన "హరిశ్చంద్రచంద్రిక" "మోహనచంద్రిక" యను పాక్షిక పత్రికలయందుఁ బ్రచురింపఁబడినది. (మీకందఱకును విదితమే) అయినను వానిఁబట్టియే మేము భాషాంతర మొనరించి యున్నాము అటులే మన యార్యసజ్జనులు ఇతిహాసములను, విద్యాపుస్తకములను, వెదకి ప్రకాశ పఱచిన మనదేశమున కెంతయో లాభముకలుగవచ్చును. ఆ ప్రతికారిపతి విక్రమశకము ౧౭౮౨వ సంవత్సరమున వ్రాసిన యొక

ప్రాచీనపుస్తకమును. దనమిత్రుని వలనఁ బొంది. విక్రమశకము ౧౯౩౯వ సంవత్సర మార్గశీర్ష శుక్లపక్షమున ౧౯-౨౦ సంఖ్యలుగల సంచికలలోఁ బ్రచురించినదే యీక్రింద వ్రాసిన దానికిఁ బ్రమాణమని చదువరు లెఱుఁగఁ దగును.

## ఆర్యావర్త దేశీయ రాజవంశావళి

శ్రీమద్యశపాల మహారాజుపర్యంతము ఆర్యు లింద్రప్రస్థపురమున రాజ్యముచేసిరి. వారిలో శ్రీమద్యుధిష్ఠిర మహారాజు మొదలుకొని యశపాల మహారాజు పర్యంతము ౪౧౫౭ సంవత్సరముల తొమ్మిది మాసముల, ౧౪ దినముల కాలములో సుమారు ౧౨౪ మంది రాజులైనారు. దాని వివరములు:-

| రాజులు. | శకము. | వర్షములు. | మాసములు. | దినములు. |
|---|---|---|---|---|
| ఆర్యరాజులు | ౧౨౪ | ౪౧౫౭ | ౯ | ౧౪ |

శ్రీమద్యుధిష్ఠిరాది మహారాజుల వంశమున సుమారు ౩౦ మంది పురుషులు ౧౭౭౦ సంవత్సరముల ౧౧ మాసముల ౧౦ దినములు రాజ్యముచేసిరి. దాని వివరము :-

| | ఆర్యరాజులు | వర్షములు | మాసములు | దినములు |
|---|---|---|---|---|
| ౧ | యుధిష్ఠిరుఁడు | ౩౬ | ౮ | ౨౫ |
| ౨ | పరీక్షిత్తు | ౬౦ | ౦ | ౦ |
| ౩ | జనమేజయుఁడు | ౮౪ | ౭ | ౨౩ |
| ౪ | అశ్వమేధుఁడు | ౮౨ | ౮ | ౨౨ |
| ౫ | రాజరాజు (ద్వితీయుఁడు) | ౮౮ | ౨ | ౮ |
| ౬ | చిత్రమల్లుఁడు | ౮౧ | ౧౧ | ౨౭ |
| ౭ | చిత్రరథుఁడు | ౭౫ | ౩ | ౧౮ |
| ౮ | దుష్టశైల్యుఁడు | ౭౫ | ౧౦ | ౨౪ |
| ౯ | ఉగ్రసేనుఁడు | ౭౮ | ౭ | ౨౧ |
| ౧౦ | శూరసేనుఁడు | ౭౮ | ౭ | ౨౧ |
| ౧౧ | భువనపతి | ౬౯ | ౫ | ౫ |
| ౧౨ | రణజీతుఁడు | ౬౫ | ౧౦ | ౪ |
| ౧౩ | ఋక్షకుఁడు | ౬౪ | ౭ | ౪ |

| ఆర్యరాజులు | సంవత్సరములు | మాసములు | దినములు |
|---|---|---|---|
| ౧౪ సుఖదేవుఁడు | ౬౨ | ౦ | ౨౪ |
| ౧౫ నరహరిదేవుఁడు | ౫౧ | ౧౦ | ౨ |
| ౧౬ సూచిరథుఁడు | ౪౨ | ౧౧ | ౨ |
| ౧౭ రెండవ శూరసేనుఁడు | ౫౮ | ౧౦ | ౮ |
| ౧౮ పర్వతసేనుఁడు | ౫౫ | ౮ | ౧౦ |
| ౧౯ మేధావి | ౫౨ | ౧౦ | ౧౦ |
| ౨౦ సోనచీరుఁడు | ౫౦ | ౮ | ౨౧ |
| ౨౧ భీమదేవుఁడు | ౪౭ | ౯ | ౨౦ |
| ౨౨ నృహరిదేవుఁడు | ౪౫ | ౧౧ | ౨౩ |
| ౨౩ పూర్ణమల్లుఁడు | ౪౪ | ౮ | ౭ |
| ౨౪ కరదవి | ౪౪ | ౧౦ | ౮ |
| ౨౫ అలమ్మిక | ౫౦ | ౧౧ | ౮ |
| ౨౬ ఉదయపాలుఁడు | ౩౮ | ౯ | ౦ |
| ౨౭ దువనమల్లుఁడు | ౪౦ | ౧౦ | ౨౬ |
| ౨౮ దమాత | ౩౨ | ౦ | ౦ |
| ౨౯ భీమపాలుఁడు | ౫౮ | ౫ | ౮ |
| ౩౦ క్షేమకుఁడు | ౪౮ | ౧౧ | ౨౧ |

క్షేమకరాజునకు మంత్రిగా నుండిన విశ్రవుఁడు క్షేమకునిఁజంపి రాజ్యమున కధిపతియయ్యెను. ఆతనితో నా వంశస్థులు ౧౪మంది రాజులు ౫౦౦ సం॥ ౩ మాసములు. ౧౭ దినములు రాజ్యమేలిరి. దానివివరము :—

| ఆర్యరాజులు | సంవత్సరములు | మాసములు | దినములు. |
|---|---|---|---|
| ౧ విశ్రవుఁడు | ౧౭ | ౩ | ౨౯ |
| ౨ పురసేని | ౪౨ | ౮ | ౨౧ |
| ౩ వీరసేనుఁడు | ౫౨ | ౧౦ | ౭ |
| ౪ అనంగశాయి | ౪౭ | ౮ | ౨౩ |
| ౫ హరిజిత్తు | ౩౫ | ౯ | ౧౭ |

| ఆర్యరాజులు | సంవత్సరములు | మాసములు | దినములు |
| --- | --- | --- | --- |
| ౬ పరమసేని | ౪౪ | ౨ | ౨౩ |
| ౭ సుఖపాతాలుఁడు | ౩౦ | ౨ | ౨౧ |
| ౮ కద్రుదత్తుఁడు | ౪౨ | ౯ | ౨౪ |
| ౯ సజ్జుఁడు | ౩౨ | ౨ | ౧౪ |
| ౧౦ అమరచూడుఁడు | ౨౭ | ౩ | ౧౬ |
| ౧౧ అమీపాలుఁడు | ౨౨ | ౧౧ | ౨౫ |
| ౧౨ దశరథుఁడు | ౨౫ | ౪ | ౧౨ |
| ౧౩ వీరసాలుఁడు | ౩౧ | ౮ | ౧౧ |
| ౧౪ వీరసాలసేనుఁడు | ౪౭ | ౦ | ౧౪ |

వీరసాలసేనుని. సతని మంత్రిగా నుండిన వీరమహుఁడు చంపి తాను రాజ్యపరిపాలకుఁ డయ్యెను. ఆతనితో నాసంతతివారు ౧౬ గురు రాజులు ౪౪౫ సంవత్సరముల ౫ నెలల ౩ దినములు రాజ్యమేలిరి. దాని వివరము:-

| ఆర్యరాజులు | సంవత్సరములు | మాసములు | దినములు |
| --- | --- | --- | --- |
| ౧ వీరమహుఁడు | ౩౫ | ౧౦ | ౮ |
| ౨ అజితసింహుఁడు | ౨౭ | ౭ | ౧౯ |
| ౩ సర్వదత్తుఁడు | ౨౮ | ౩ | ౧౦ |
| ౪ భువనపతి | ౧౫ | ౪ | ౧౦ |
| ౫ వీరసేనుఁడు | ౨౧ | ౨ | ౧౩ |
| ౬ మహీపాలుఁడు | ౪౦ | ౮ | ౭ |
| ౭ శత్రుశాలుఁడు | ౨౬ | ౪ | ౩ |
| ౮ సంఘరాజు | ౧౭ | ౨ | ౧౦ |
| ౯ తేజపాలుఁడు | ౨౮ | ౧౧ | ౧౦ |
| ౧౦ మాణికచందుఁడు | ౩౭ | ౭ | ౨౧ |
| ౧౧ కామసేని | ౪౨ | ౫ | ౧౦ |
| ౧౨ శత్రుమర్దనుఁడు | ౮ | ౧౧ | ౧౩ |
| ౧౩ జీవనలోకుఁడు | ౨౮ | ౯ | ౧౭ |

| ఆర్యరాజులు | సంవత్సరములు | మాసములు | దినములు |
|---|---|---|---|
| ౧౪ హరిరావు | ౨౬ | ౧౦ | ౨౯ |
| ౧౫ (రెండవ)వీరసేనుఁడు | ౩౫ | ౨ | ౨౦ |
| ౧౬ ఆదిత్య కేతువు | ౨౩ | ౧౧ | ౧౩ |

మగధదేశమునకు రాజుగానుండిన యాదిత్యకేతువును బ్రయాగకు రాజుగానుండిన ధంధరుఁడు చంపి రాజ్యమునకు వచ్చెను. అతనితో నాసంతతి వారు ౯ మంది రాజులు ౩౩౪ సంవత్సరముల ౧౧ మాసముల ౨౬ దినములు రాజ్యమేలిరి. దాని వివరము:—

| ఆర్యరాజులు | సంవత్సరములు | మాసములు | దినములు |
|---|---|---|---|
| ౧ ధంధరుఁడు | ౪౨ | ౭ | ౨౪ |
| ౨ మహర్షి | ౪౧ | ౨ | ౨౯ |
| ౩ సనరచ్చి | ౫౦ | ౧౦ | ౧౯ |
| ౪ మహాయుద్ధుఁడు | ౩౦ | ౩ | ౮ |
| ౫ దురనాథుడు | ౨౮ | ౫ | ౨౫ |
| ౬ జీవనరాజు | ౪౫ | ౨ | ౫ |
| ౭ రుద్రసేనుఁడు | ౪౭ | ౪ | ౨౮ |
| ౮ ఆరీలకుఁడు | ౫౨ | ౧౦ | ౮ |
| ౯ రాజపాలుఁడు | ౩౬ | ౦ | ౦ |

రాజపాలుఁడను రాజును ఆతని సామంతుఁడగు మహాపాలుఁడు చంపి ౧౪ సంవత్సరములు రాజ్యమేలెను.తరువాత నతని వంశస్థు లెవ్వరును గాలేదు.

"అవంతి" రాజ్యాధీశుఁడగు విక్రమాదిత్యుఁడు రాజామహాన్పాలుని రాజ్యముమీఁదికి దండువెడలి, యాతని జంపితాను౯౩సంవత్సరములు రాజ్యము చేసెను. పురుషుఁడు ౧. దీనికి వివరములేదు.

శాలివాహనుని సామంతుఁడుగా నుండిన పైఠణపు సముద్రపాలయోగి విక్రమాదిత్యుని జంపి, తాను రాజ్యమునకు వచ్చెను. అతనితో నాసంతతివారు ౧౬ గురు రాజులు ౩౭౨ సం॥ ౪ మాసముల ౨౭ దినములు రాజ్యమేలిరి. దాని వివరము:—

| ఆర్యరాజులు | సంవత్సరములు | మాసములు | దినములు |
|---|---|---|---|
| ౧ సముద్రపాలుఁడు | ౫౪ | ౨ | ౨౦ |
| ౨ చంద్రపాలుఁడు | ౩౬ | ౫ | ౪ |
| ౩ సహాయపాలుఁడు | ౧౧ | ౪ | ౧౧ |
| ౪ దేవపాలుఁడు | ౨౭ | ౧ | ౨౮ |
| ౫ నరసింహపాలుఁడు | ౧౮ | ౦ | ౨౦ |
| ౬ సామపాలుఁడు | ౨౭ | ౧ | ౧౭ |
| ౭ రఘుపాలుఁడు | ౨౨ | ౩ | ౨౫ |
| ౮ గోవిందపాలుఁడు | ౨౭ | ౧ | ౧౭ |
| ౯ అమృతపాలుఁడు | ౩౬ | ౧౦ | ౧౩ |
| ౧౦ బలిపాలుఁడు | ౧౨ | ౫ | ౨౭ |
| ౧౧ మహీపాలుఁడు | ౧౩ | ౮ | ౪ |
| ౧౨ హరిపాలుఁడు | ౧౪ | ౮ | ౪ |
| ౧౩ సీనపాలుఁడు * | ౧౧ | ౧౦ | ౧౩ |

(*కొన్ని చరిత్రలలో నీతని భీమపాలుఁడని వ్రాసియున్నది)

| ఆర్యరాజులు | సంవత్సరములు | మాసములు | దినములు |
|---|---|---|---|
| ౧౪ మదనపాలుఁడు | ౧౭ | ౧౦ | ౧౯ |
| ౧౫ కర్మపాలుఁడు | ౧౬ | ౨ | ౨ |
| ౧౬ విక్రమపాలుఁడు | ౨౪ | ౧౧ | ౧౩ |

విక్రమపాలుఁడు పశ్చిమదేశాధిపతియగు మల్లూఖచంద్రబోహరుని మీఁదికి దాడివెడలి యుద్ధమునఁ జచ్చెను. అంత నింద్రప్రస్థమునకు మల్లూఖచంద్రుఁడు పాలకుఁడయ్యెను. అతనితో నాసంతతివారు ౧౦గురు ౧౯౦ సం॥ ౧ మాసముల ౧౬ దినములు రాజ్యమేలిరి. దాని వివరము:-

| ఆర్యరాజులు | సంవత్సరములు | మాసములు | దినములు |
|---|---|---|---|
| ౧ మల్లూఖ చంద్రుఁడు | ౫౪ | ౨ | ౧౦ |
| ౨ విక్రమచంద్రుఁడు | ౧౨ | ౭ | ౧౨ |
| ౩ అమీనచంద్రుఁడు * | ౧౦ | ౦ | ౫ |

(*ఈతనిపేరు మానికచందని కూడ వ్రాసియున్నది)

| ఆర్యరాజులు | సంవత్సరములు | మాసములు | దినములు |
|---|---|---|---|
| ౪ రామచంద్రుడు | ౧౩ | ౧౧ | ౮ |
| ౫ హరిచంద్రుడు | ౧౪ | ౯ | ౨౪ |
| ౬ కల్యాణచంద్రుడు | ౧౦ | ౫ | ౪ |
| ౭ భీమచంద్రుడు | ౧౬ | ౨ | ౬ |
| ౮ లోవచంద్రుడు | ౨౬ | ౩ | ౨౨ |
| ౯ గోవిందచంద్రుడు | ౩౧ | ౭ | ౧౨ |
| ౧౦ పద్మావతీరాణి (గోవిందసింహునిరాణి) | ౧ | ౦ | ౦ |

సంతానములేక యా పద్మావతీరాణి గతించెను. ఆమె ముత్సద్దీ లందఱును గలిసి యాలోచించుకొని హరిప్రేమయోగిని సింహాసనాసీనునిఁ జేసి తాము రాజ్యము నేలుచుండిరి. ఆతనితో నా సంతతివారు ౪గురు ౫౦సం॥౨౧ దినములు రాజ్యము నేలిరి. దాని వివరము:-

| ఆర్యరాజులు | సంవత్సరములు | మాసములు | దినములు |
|---|---|---|---|
| ౧ హరిప్రేముడు | ౭ | ౫ | ౧౬ |
| ౨ గోవిందప్రేముడు | ౨౦ | ౨ | ౮ |
| ౩ గోపాలప్రేముడు | ౧౫ | ౭ | ౨౮ |
| ౪ మహాబాహుడు | ౬ | ౮ | ౨౯ |

మహాబాహుఁడు తపశ్చర్యచేయ వనమునకు వెడలిపోయెను. దీనిని విని బంగాళాదేశమునకు రాజుగా నుండిన ఆదిసేనుఁడు ఇంద్రప్రస్థమునకువచ్చి రాజ్యారూఢుఁడయ్యెను. అతనితో నా సంతతివారు ౧౨గురు ౧౫౧ సం॥ ౧౧ మాసముల ౨ దినములు రాజ్యమేలిరి. దాని వివరము:-

| ఆర్యరాజులు | సంవత్సరములు | మాసములు | దినములు |
|---|---|---|---|
| ౧ ఆదిసేనుడు | ౧౮ | ౫ | ౩ |
| ౨ విలావంసేనుడు | ౧౨ | ౪ | ౨ |
| ౩ కేశవసేనుడు | ౧౫ | ౭ | ౧౨ |
| ౪ మాధవసేనుడు | ౧౨ | ౪ | ౩ |

| ఆర్యరాజులు | సంవత్సరములు | మాసములు | దినములు |
|---|---|---|---|
| ౫ మయూరసేనుఁడు | ౨౦ | ౧౧ | ౨౩ |
| ౬ భీమసేనుఁడు | ౫ | ౧౦ | ౯ |
| ౭ కల్యాణసేనుఁడు | ౪ | ౭ | ౧ |
| ౮ హరిసేనుఁడు | ౧౨ | ౦ | ౨౫ |
| ౯ క్షేమసేనుఁడు | ౮ | ౧౧ | ౧౫ |
| ౧౦ నారాయణసేనుఁడు | ౨ | ౨ | ౨౯ |
| ౧౧ లక్ష్మీసేనుఁడు | ౨౬ | ౧౦ | ౦ |
| ౧౨ దామోదరసేనుఁడు | ౧౧ | ౫ | ౧౯ |

దామోదరసేనుఁడు తన సామంతులను పీడించుచుండి నందున, వారిలో నొకఁడగు దీపసింహుఁడు బలము గూర్చుకొని యుద్ధమున దామోదరసేనుని జంపి, తాను రాజ్యపాలకుఁడయ్యెను. అతనితో నా సంతతివారు ౬ గురు ౧౦౩ సంవత్సరముల ౬ మాసముల ౧౨ దినములు రాజ్యమేలిరి. దాని వివరము:-

| ఆర్యరాజులు | సంవత్సరములు | మాసములు | దినములు |
|---|---|---|---|
| ౧ దీపసింహుఁడు | ౧౪ | ౧ | ౨౬ |
| ౨ రాజసింహుఁడు | ౧౪ | ౫ | ౦ |
| ౩ రణసింహుఁడు | ౯ | ౭ | ౧౧ |
| ౪ నరసింహుఁడు | ౪౫ | ౦ | ౧౫ |
| ౫ హరిసింహుఁడు | ౧౩ | ౨ | ౨౯ |
| ౬ జీవనసింహుఁడు | ౮ | ౦ | ౧ |

జీవనసింహుఁడు తనసేననంతయును ఏదియోకారణమును బట్టి యుత్తర దిశకుఁ బంపియుండెను. ఈ వార్త, వైరాటు రాజుగానుండిన పృథ్వీరాజు చౌహాణుఁడు విని యతనిమీఁదికి దాడివెడలి యుద్ధమున నా జీవనసింహుని జంపి, తా నా యింద్రప్రస్థ రాజ్యము నాక్రమించెను.

[ఇఁకఁ గొన్ని యితిహాసములలో, మహారాజను పృథ్వీరాజుపై సుల్తాను షహబుద్దీనుగోరీ దండువెడలి యనేక పర్యాయములు పృథ్వీరాజుచేఁ బరాభవ

మంది, తిరిగిపోయెననియు. తుదకు ౧౨౪౯ వ (విక్రమ) సంవత్సరమున నంతః కలహముల కారణము'బట్టి పృథ్వీరాజును జయించి, యాతని సంధు నిగాఁజేసి, తన దేశమునకుఁ గొనిపోయి తానా యింద్రప్రస్థము నేలెననియు, ముసల్మానుల రాజ్యము ౪౫ తరములు ౬౧౩ సంవత్సరములు నిలిచియుండె ననియు వ్రాయఁబడియున్నది.ఇః బౌద్ధజైన మత విషయము వ్రాయఁబడును.]

అతనితో నా సంతతివారు ౫ గురు ౮౬ సంవత్సరముం ౨౦ దిన ములు రాజ్యమేలిరి. దాని వివరము:-

| ఆర్యరాజులు | సంవత్సరములు | మాసములు | దినములు |
|---|---|---|---|
| ౧ పృథ్వీరాజు | ౧౨ | ౨ | ౧౯ |
| ౨ అభయపాలుఁడు | ౧౪ | ౫ | ౧౩ |
| ౩ దుర్జనపాలుఁడు | ౧౧ | ౪ | ౧౪ |
| ౪ ఉదయపాలుఁడు | ౧౧ | ౭ | ౩ |
| ౫ యశపాలుఁడు | ౩౬ | ౪ | ౨౭ |

సుల్తాన్ మహబుద్దీన్‌గోరీ గజనీనుండి యశపాలరాజుమీఁదికి యుద్ధమునకు వెడలి యతనిఁబట్టి ప్రయాగకోటలో విక్రమశకము ౧౨౪౯వ సంవత్సరమునఁ జెఱఁబెట్టి, తాను ఇంద్రప్రస్థమున రాజ్యమేలెను. అతనితో నా సంతతివారు ౫౩ గురు, ౭౪౫ సంవత్సరముల ౧ మాసము ౧౩ దినములు రాజ్యమేలిరి. దీనివివర మనేకేతిహాస గ్రంథముల! గానవచ్చును. కావున దాని నిచ్చట వ్రాయలేదు.

శ్రీమద్దయానంద సరస్వతీ స్వామికృతమును
సుభాషావిభూషితమునగు సత్యార్థప్రకాశమున
ఆర్యావర్తీయ మతఖండనమండనములుగల
ఏకాదశ సముల్లాసము సంపూర్ణము



# అనుభూమిక (౨)

ఆర్యావర్తమునందుండు మనుష్యులయందు యథార్థముగ సత్యాసత్యములు నిర్ణయించు వేదవిద్య లుప్తమై యవిద్యవ్యాపించుటయే జైనమతము మొదలుగాగల విద్యావిరుద్ధములగు మతమతాంతరములంకురించివ్యాపించుటకు హేతువయ్యెను. ఏలయన వాల్మీకీయము, మహాభారతము మున్నగు గ్రంథములందు జైనులపేరయినలేదు. కాని జైనులపుస్తకములందు, వాల్మీకీయమున-మహాభారతాదులందును వర్ణింపబడినరామకృష్ణాదుల చరిత్రములతివిస్తారముగా వ్రాయఁబడియున్నవి. కాబట్టి యీ మతము వీనికిఁబిమ్మట వ్యాపించినట్లు సిద్ధమగుచున్నది. జైనులు తమ మతమును మిక్కిలి ప్రాచీన మయినదని వ్రాయుచున్నారు. అట్లయిన వాల్మీకీయాది గ్రంథములందు వారి చరిత్ర తప్పక యుండి యుండెడిది. కాన జైనమత మీగ్రంథములకుఁ బిమ్మట ప్రచలితమైన దనుట స్పష్టము. జైనగ్రంథమందలి కథలు సంగ్రహింపఁబడి వాల్మీకీయాది గ్రంథములు వ్రాయఁబడి యుండవచ్చు నన్నచో. వాల్మీకీయాదులందా మీ గ్రంథముల పేరులయిన నేల వ్రాయఁబడలేదు? మీ గ్రంథములం దేల వ్రాయఁబడి యున్నవని వారి నడుగవలయును. తండ్రి పుట్టుకను కొమారుఁడు వీక్షింపఁగలఁడా? ఎన్నఁడును కాదు. కావున బౌద్ధాది మతములు శైవ శాక్తేయాది మతములకు బిమ్మటనే వెలువడినవని సిద్ధమగుచున్నది. ఇఁక నీ పండ్రెండవ సముల్లాసమున జైనమత విషయమై వ్రాయబడిన సంగతులన్నియు వారి గ్రంథముల యుదాహరణ పూర్వకముగనే వ్రాయఁబడినవి. దీనిఁ జైనులు తప్పుగా నెన్నవలదు. ఏలయనఁ గేవల సత్యాసత్యనిర్ణయముకొఱకు వీరి మత విషయములు వ్రాయబడినవే కాని, విరోధము బెంచుటకును హాని నొనర్చుటకు నెంతమాత్రము కాదు. ఈ లేఖను జైనులును, బౌద్ధులును, ఇతరులను జూచి నప్పుడేకద! అందఱకు సత్యాసత్య నిర్ణయమున నాలోచనమును, వ్రాయసవసరమును కలిగి జ్ఞానమును పెరుగును. వారి ప్రతివాదు లేర్పడి ప్రేమయుక్తముగా తర్కింపనంతవఱకు, లిఖింపనంతవఱకు. సత్యాసత్య నిర్ణయము జరుగ

నేరదు. విద్వాంసులలో సత్యాసత్య నిశ్చయము కానప్పు డవిద్వాంసులు మహాంధకారమునఁబడి మిక్కిలి దుఃఖపడవలసి వచ్చును. కావున సత్యజయము కొఱకును, అసత్య క్షయముకొఱకును మైత్రితోడ వాదించుటయో, వ్రాయుటయో మనుష్యమాత్రులకు ముఖ్యకర్తవ్యము. అట్లుకాకపోయిన మనుష్యుల కౌన్నత్యమలవడదు. ఇఁక నీ జైన బౌద్ధ మతవిషయములు, వీరికేకాక యితర మతస్థులకు నపూర్వలాభమను జ్ఞానమును కలుగఁజేయును. ఏలయన వీరొక్కప్పుడైనఁ దమ పుస్తకముల నితర మతస్థులకుఁ జదువుటకుఁగాని, చూచుటకుఁగాని, వ్రాయుటకుఁగాని యియ్యరు. బహుపరిశ్రమతో నేనును విశేషముగ బొంబాయి ఆర్య సమాజమంత్రియగు శ్రేష్ఠిసేవకలాల్ కృష్ణదాసుగారును జేసిన ప్రయత్నమువలన గ్రంథములు లభించెను. కాశీపురి నుండు "జైనప్రభాకర" యంత్రాలయమున నచ్చుబడుటవలనను, బొంబాయిలో "ప్రకరణరత్నాకర"మను గ్రంథ మచ్చుపడుటచేతను ఎల్లఱకు జైనమతమును తెలిసికొనుట సులభమైనది. ఆహా! తమపుస్తకములు దామే చూచుకొనుటయు నితరులకుఁ జూపకుండుటయు నెట్టి పాండిత్యమో! ఈ గ్రంథములం దసంభవవాక్యము లున్నవనియు, నితర మతస్థులు చూచిన వానిఁ ఖండింతురనియు, మనవారితర గ్రంథములఁజూచిన నీ మతముపై శ్రద్ధ యుండజాలదనియు నీ గ్రంథకర్తలకు మొదటనే సందేహముండెనని దీనినుండియే విదితమగుచున్నది. ఉన్న నది యుండుఁగాక! పెక్కుమనుజులకు తమదోషములు కానరావు. కాని యితరుల దోషముఁగాంచ నత్యుద్యుక్తులగుచుందురు. ఇది న్యాయముగాదు. ఎందులకన తొలుతఁ దమదోషముల దొలగించికొని, పిదప నన్యులదోషములు గాంచి తొలగింపనుద్యమింపవలెను. ఇఁక నీ జైన బౌద్ధమత విషయములను సజ్జనుల సమ్ముఖమున నుంచెద. ఉన్నట్లు విచారింపుఁడు

బుద్ధిమంతులకు విశేషించి వ్రాయనక్కరలేదు.

# ద్వాదశ సముల్లాసము

## నాస్తిక మతాంతర్గత చార్వాక బౌద్ధ జైనమత ఖండన మండనములు

బృహస్పతి యను పేరుగల పురుషుఁడొకఁ డుండెను. అతఁడు వేదములను, ఈశ్వరుని, యజ్ఞాద్యుత్తమకర్మములనుగూడ నంగీకరింపకుండెను. అతని మతము నీక్షింపుఁడు.

యావజ్జీవం సుఖం జీవేన్నాస్తి మృత్యోరగోచరః।
భస్మీభూతస్య దేహస్య పునరాగమనం కుతః॥

సర్వదర్శన సంగ్రహే. చార్వాకదర్శనమ్॥

మనుష్యుఁడు మొదలగుప్రాణి యేదియు మృత్యువున కగోచరముగా నుండదు. ఎల్లరకు చావు గలదు. కావున శరీరమున జీవుఁడున్నంతవఱకు సుఖముగ నుండవలెను. ఎవఁడేని ధర్మము నాచరించుట కష్టమనియు, ధర్మమును వదలిన పునర్జన్మమున కడుకష్టమనుభవింపవలసివచ్చుననియు వచించిన నతని గూర్చి చార్వాకుఁడు, "ఓ వెఱ్ఱితమ్ముఁడా! చచ్చినవెనుక శరీరము భస్మమగును. ఎవఁడు తినెనో త్రాగెనో వాఁడు మరల ప్రపంచములోనికి రాఁడు. కాన సాధ్యమైన ట్లానందముగ నుండుము. లోకమున నీతితో జరియింపుము. ఐశ్వర్యమును వృద్ధి నొందింపుము. దానితో నిష్టభోగముల నందుము. ఇదియే లోక మనుకొనుము. పరలోక మేదియునులేదు. భూమి, జలము, అగ్ని, వాయువను నీ నాలుగు భూతముల పరిణామమున నీ శరీరమయ్యెను. ఇందు వీనియోగమున చైతన్య ముత్పత్తిల్లును. మదకర పదార్థములు సేవించుటవలన మద ముత్పత్తిల్లునట్లు, జీవుఁడు శరీరముతో నుద్భవించిన శరీర నాశనముతో దానును నశించును. ఇఁక పాపపుణ్యముల ఫల మెవనికిఁ గల్గు"నని యుత్తరమిడును.

తచ్చైతన్యవిశిష్టదేహ ఏవ ఆత్మా దేహాతిరిక్త ఆత్మని ప్రమాణాభావాత్॥

స. ద. చా. ద॥

ఈ శరీరమున భూతచతుష్టయ సంయోగముచే జీవాత్మపుట్టి, వాని వియోగముతోడనే నశించును. మృతినొందిన పిమ్మట నేజీవుఁడును గానరాఁడు. కాన

మేమొక ప్రత్యక్షమునే యొప్పుకొనుచున్నాము. ప్రత్యక్షముగాక యనుమానాదులు కలుగనే కలుగవు. కావున ముఖ్యమగు ప్రత్యక్షలిముఖమున ననుమానాదులు గౌణములగుటఁ బట్టి యవి గ్రహింపఁబడవు. సుందరీ మందయానను కౌగలించుకొని, సంతసిల్లుటయే పురుషార్థఫలము.

ఉత్తరము:— ఈ పృథివ్యాది భూతములు జడములు. వానిచే చైతన్య మెన్నఁడు నుత్పత్తిల్ల నేరదు. ఇప్పుడు తల్లిదండ్రుల సంయోగమున దేహ ముత్పత్తిల్లునటులే సృష్ట్యాదియందు మనుష్యాది శరీరాకారములు కర్తయగు పరమేశ్వరుని వినా యెన్నఁడును కలుగనేరవు మదమువలె చైతన్య మొదవుటయు నశించుటయుఁగాదు. మదము చైతన్యున కుదయించునేకాని జడమున కుదయింపదు. పదార్థములు నశించునఁనగా నదృశ్యములగును. కాని యే వస్తువునకు నభావము కలుగదు. అట్లే యదృశ్యుఁడగుటవలన జీవుని యభావముకూడ నొప్పుకొనఁదగదు. జీవాత్మ దేహి యయినప్పుడే యాతఁడు ప్రకటమగును. శరీరమును విడిచినప్పుడు, మృత్యువు నొందిన ఈ శరీరము పూర్వము చైతన్య యుక్తముగ నుండిన ట్లుండనేరదు. ఇటులే బృహదారణ్యకమునందు వచింపఁబడియున్నది.

"నాహం మోహం బ్రవీమి అనుచ్ఛిత్తి ధర్మాయమాత్మేతి" బృ. ౪. ౫. ౧౪॥

యాజ్ఞవల్క్యుఁడు "ఓ మైత్రేయీ! నేను మోహములోఁ జెప్పుచున్నానవి భావింపకుము; యథార్థముగ నాత్మ నశించునది కాదు. దాని యోగముననే శరీరము చేష్టలు చేయుచున్నది. జీవుఁడు శరీరమునుండి వేఱగునప్పుడు శరీరమునందు జ్ఞానమేమియు నుండదు. దేహమునకంటె నాత్మ వేరుగానుండకున్న, దేని సంయోగమున చేతనత్వమును, వియోగమున జడత్వమును కలుగుచున్నదో యది దేహమునకంటె వేరై యుండుటయే స్పష్టము. నేత్రమన్నిఁటిని జూచుఁగాని తన్నుదాఁ జూడదు. అటులే ప్రత్యక్షము చేసికొనువాఁడు తన్ను ఇంద్రియములకు ప్రత్యక్షము చేసికొనేరఁడు. తనకన్నులతో నమస్తఘటపటాది పదార్థములు గాంచుచున్నట్లు తన్నుఁదాను జ్ఞానముతోఁగాంచును. ద్రష్టయగువాఁడు ద్రష్టగానే యుండును. దృశ్యమెన్నటికినిఁ గాఁడు. ఆధారములేకున్న నాధేయమును, కారణములేకున్న గార్యము, అవయవి లేకున్న నవయవము, కర్తలేకున్న కర్మయు వర్తింపనటులే కర్త వినా ప్రత్యక్ష మెట్లుకాఁగలదు? సుందరీ కామినీ సంతో

గమే పురుషార్థఫలమని తలంచిన, క్షణకాల సౌఖ్యమును, దానివలన దుఃఖము గూడఁగలుగుచున్నది. అదియును పురుషార్థఫలమే కాఁబోదు. అటులయినచో స్వర్గహానికలిగి దుఃఖ మనుభవింపవలసివచ్చును. ఇఁక దుఃఖమును దూరపఱచుటకును, సుఖాభివృద్ధికొఱకును యత్నింపవలయునన్న ముక్తియందలి సుఖమునకు హానికలుగును గాన నది పురుషార్థ ఫలము కాదని వచించుచున్నాఁడు.

చారవాకుఁడు—దుఃఖముతోఁ గూడిన సుఖమును బోఁగొట్టుకొనువారు మూర్ఖులు. ధాన్యార్థి ధాన్యము గ్రహించి పొట్టు విడిచినట్లు బుద్ధిమంతుఁడు సంసారమునందలి సుఖమును గ్రహించి దుఃఖము విడువవలయును. ఏలయన నీ ప్రపంచమం దుపస్థిత సుఖము వదలి యనుపస్థిత స్వర్గసుఖము నిచ్ఛగించి, ధూర్తులు రచించిన వేదోక్తమగు నగ్నిహోత్రాది కర్మోపాసనా జ్ఞాన కాండల యనుష్ఠానము, పరలోక ప్రాప్తికొఱకు జేయుచున్నవా రజ్ఞానులు. పరలోకమే లేనపుడు దాని నాశించుట మూర్ఖత్వము. ఏలయన—

అగ్నిహోత్రం త్రయో వేదా స్త్రిదండం భస్మగుంఠనమ్,
బుద్ధిపౌరుషహీనానాం జీవికేతి బృహస్పతిః॥ స. ద. చార. ద॥

అగ్నిహోత్రము, త్రివేదములు, త్రిదండము, భస్మలేపనములను బుద్ధిహీనులు, పురుషార్థ రహితులునగు పురుషులు జీవికగా నేర్పఱచుకొన్నారు. కాని ముండ్లుగ్రుచ్చుకొనుట మొదలగువానివలనఁగలుగు దుఃఖమే నరకమనియు, లోకప్రసిద్ధుఁడగు రాజే పరమేశ్వరుఁడనియు, శరీరనాశనమే మోక్షమనియు, నంతకన్న మరేమియు లేదనియు చారవాక మతప్రచారకుఁడైన బృహస్పతి వక్కాణించుచున్నాఁడు.

ఉత్తరము—విషయభోగమను సుఖమునే పురుషార్థఫలమని తలఁచి, కేవల విషయరూప దుఃఖనివారణమును కృతకృత్యతయనియు, స్వర్గమనియు నమ్ముట మూర్ఖత్వము. అగ్నిహోత్రాది యజ్ఞములవలన వాయుశుద్ధి, వృష్టిజలశుద్ధి గలుగును. వానిద్వారా ఆరోగ్యముకలిగి ధర్మార్థకామమోక్షములను సిద్ధించును. వీనిఁదెలిసికొనక వేదమును, ఈశ్వరుని, వేదోక్త ధర్మమును నిందించుట ధూర్తకృత్యము. త్రిదండమును, భస్మధారణమును ఖండించుట బాగుగనేయున్నది. ముల్లు మొదలగువానివలనఁ గలుగు దుఃఖమే నరకమగు నేని అంతకంటె నధికములగు మహారోగాదు లేల నరకములు గావు? ఐశ్వర్య

వంతుడై ప్రజాపాలన సమర్థుఁడగుటవలన రాజును శ్రేష్ఠుడనుటయుచితమే. కాని యన్యాయకారియుఁ బాపియునగు రాజునుగూడఁ బరమేశ్వరునిగాఁదలఁతు రేని మీవంటి మూర్ఖు లెవరు నుండరు. కేవల శరీరవిచ్ఛేదమే మోక్షమయిన, కుక్క. గాడిద మొదలగువానికిని మీకునుగల భేదమేమి: ఆకృతిభేదమేకరః

చారవాకుఁడు:-అగ్నిరుష్ణో జలం శీతం శీతస్పర్శ స్తథానిలః।
కేనేదం చిత్రితం తస్మాత్ స్వభావా త్తద్వ్యవస్థితిః॥ ౧॥
సర్వదర్శన సంగ్రహే చారవాక దర్శనము॥

అగ్ని ఉష్ణము, జలము శీతము; అట్లే యనిలము శీతస్పర్శముగలది. ఎవనిచే నిది చిత్రింపబడినది? కావున దీని యీ వ్యవస్థితి స్వభావము వలననే గలిగినది. చారవాకులు, ఆభాణకులు, బౌద్ధులు, జైనులు, నయితము జగదుత్పత్తిస్వాభావికమని నమ్ముచున్నారు. స్వాభావికములై యున్న యా యా గుణములతో ద్రవ్యముల సంయోగమువలన సకల పదార్థములు కలుగుచున్నవి. జగత్కర్త యెవ్వఁడునులేడు. వీరిలోని చారవాకుఁడిట్లు నమ్ముచున్నాఁడే కాని బౌద్ధులు, జైనులు పరలోకమును, జీవాత్మను ఒప్పుకొనుచున్నారు. చారవాకుఁ డొప్పుకొనఁడు. కొన్ని మాటలందుఁ దప్ప తక్కిన విషయములలో నీ ముగ్గురిమత మొక్కటియే.

న స్వర్గో నాపవర్గో వా నైవాత్మా పారలౌకికః।
నైవ వర్ణాశ్రమాదీనాం క్రియాశ్చ ఫలదాయికాః॥ ౨॥

(స్వర్గములేదు; నరకములేదు. పరలోకములోవు నాత్మలేదు. వర్ణాశ్రమ క్రియలు ఫలదాయకములు కావు.)

పశుశ్చేన్నిహతః స్వర్గం జ్యోతిష్టోమే గమిష్యతి।
స్వపితా యజమానేన తత్ర కస్మాన్న హింస్యతే॥ ౩॥

(యజ్ఞమున పశువునుజంపి హోమమొనరించుటచే నది స్వర్గమున కేగునని, యజమానుఁడు తనతండ్రి మొదలగువారిని జంపి హోమముచేసి ఏల స్వర్గమున కంపఁడు?)

మృతానామపి జంతూనాం శ్రాద్ధం చేత్తృప్తికారణమ్।
గచ్ఛతామిహ జంతూనాం వ్యర్థం పాథేయకల్పనమ్॥ ౪॥

(చచ్చిన జీవులకు శ్రాద్ధతర్పణములు తృప్తి కారకములగునేని, పరదేశమునకుఁ బోవువారు మార్గనిర్వాహార్థ మన్న వస్త్రాదులు నేలగొనిపోవ

దురు? ఏలన, చచ్చినవారిపేర నర్పణముచేయఁబడిన పదార్థములు స్వర్గమునకు జేరునట్లు, పరదేశము పోవువారికొఱకు వారి బంధువు లింటనే వారిపేర నర్ప ణముచేసి దేశాంతరముల కంపవలయును. ఇదిచేరకున్న స్వర్గమునక దెట్లు చేర కలదు?

స్వర్గస్థితా యదా తృప్తిం గచ్ఛేయు స్తత్ర దానతః।
ప్రాసాదస్యోపరిస్థాన మత్ర కస్మాన్న దీయతే ॥౫॥

(మర్త్యలోకమున దానముచేయుటచే స్వర్గవాసులు తృప్తులగుదురేని, క్రిందదానముచేసిన మేడపైనున్న వాఁడేల తృప్తినొంద గూడదు?)

యావజ్జీవేత్సుఖం జీవే దృణం కృత్వా ఘృతం పిబేత్।
భస్మీభూతస్య దేహస్య పునరాగమనం కుతః ॥౬॥

(కాన బ్రతికియుండినంతవఱకు సుఖముగ బ్రతుకవలయును. ఇంటఁ బదార్థములులేకున్న ఋణమొనర్చియయినను సుఖపడవలెను. ఋణమియ్య వలసి రాదు. ఏశరీరమున జీవుఁడు తినెనో త్రాగెనో యా యిరువురకు పున రాగమనమే లేదు. ఇఁక నెవని నెవఁ డడుగును? ఎవఁడిచ్చును?)

యది గచ్ఛేత్పరం లోకం దేహా దేష వినిర్గతః।
కస్మాద్భూయో న చాయాతి బంధుస్నేహసమాకులః ॥౭॥

(కొందఱు. చచ్చువేళ జీవుఁడు వెడలి పరలోకమునకుఁ బోవునను చున్నారు. ఆ మాట యబద్ధము.ఏలయన నటులైనచో కుటుంబ మోహబద్ధుఁడై మఱల నేల యింటికిఁ రాఁడు?)

తతశ్చ జీవనోపాయో బ్రాహ్మణై ర్విహిత స్త్విహ।
మృతానాం ప్రేతకార్యాణి నత్వన్యద్విద్యతే క్వచిత్ ॥౮॥

(కాఁబట్టి బ్రాహ్మణులు దీనినంతయుఁ దమ జీవనోపాయము కొఱకు కల్పించియున్నారు. దశగాత్రాది మృతక క్రియలాచరించుట యంతయు వారి జీవనోపాయమే.)

త్రయో వేదస్య కర్తారో భండధూర్తనిశాచరాః।
జర్ఫరీతుర్ఫరీత్యాది పండితానాం వచః స్మృతమ్ ॥౯॥

వేదముల రచించినవారు భాండ, ధూర్త, నిశాచరులను ముప్వురు రాక్షసులు."జర్ఫరీతుర్ఫరీ" ఇత్యాదులు పండితులు కల్పించిన దూర్తాలాపములు.

అశ్వస్యాత్ర హి శిశ్నం తు పత్నీగ్రాహ్యం ప్రకీర్తితమ్।
తంద్వై సర్వత్పరం చైవ గ్రాహ్యజాతం ప్రకీర్తితమ్॥౧౦॥

ధూర్తరచనల నిరీక్షింపుఁడు ఘోటకలింగమును పత్ని గ్రహించుట. దానితో యజమానుని భార్యకు సమాగమము చేయించుట. కన్యతోఁ బరిహాసాదులాడుట మున్నగువానిని ధూర్తులుతప్ప మఱెవరు వ్రాయగలుగుదురు.

మాంసానాం ఖాదనం తద్వన్నిశాచరసమీరితమ్॥౧౧॥

ఇఁక మాంసము తినవచ్చునని వ్రాసియున్న వేదభాష్యముగూడ రాక్షసులచే రచింపఁబడినదే.

ఉత్తరము:—చైతన్యుఁడగు పరమేశ్వరుఁడు నిర్మాణము చేయకున్న జడపదార్థములు స్వాభావికముగఁ దమంతట దాము నియమ పూర్వకముగా కలిసి యుత్పన్నము కానేరవు. స్వభావముననే కలుగునన్న, రెండవసూర్యుఁడు చంద్రుఁడు, పృథివి, నక్షత్రాది లోకములు తమంతటఁ దామేల కలుగవు.॥౧॥

(సుఖభోగమునకు స్వర్గము, దుఃఖభోగమునకు నరకము అని పేరు) జీవాత్మయే లేకున్న, సుఖదుఃఖముల నెవరనుభవింపఁగలుగుదురు? ఇప్పుడెట్లు జీవుఁడు సుఖదుఃఖముల ననుభవించుచున్నాఁడో యటులే పరజన్మమందుకూడ ననుభవించును. వర్ణాశ్రమీయం సత్యభాషణము, పరోపకారము మొదలగు క్రియలుగూడ నిష్ఫలములగునా? ఎన్నఁటికి కానేరవు.॥౨॥

(పశువులఁ జంపి హోమ మొనరించుమని వేదాది సత్యశాస్త్రములం దెచ్చటను వ్రాయఁబడలేదు. చచ్చినవారలకు శ్రాద్ధతర్పణముల నొనర్చుటయు కపోలకల్పితమే) ఇది వేదాది సచ్ఛాస్త్ర విరుద్ధమగుటఁబట్టి భాగవతాదుల నంగీకరించుచున్న పౌరాణికులమతము. కాన దీనిఖండనమఖండనీయము.॥౩.౪.౫॥

ఏ వస్తువుకలదో దానికి నభావమెన్నఁడును కలుగదు. విద్యమానుఁడై యున్న జీవున కభావము కలుగనేరదు. (దేహము భస్మమైపోవునేకాని జీవుఁడు కాఁడు. జీవుఁడు మఱొక శరీరమునఁ బ్రవేశించును కావున నెవరు ఋణాదులు చేసి పరపదార్థములచే నీలోకమున సుఖమనుభవించి మరల ఋణము దీర్పరో వారు నిశ్చయముగ పాపాత్ములై పరజన్మమున దుఃఖ రూప నరక మనుభవింతురు. ఇందు సందియమేమియులేదు.)॥౬॥

జీవుఁడు దేహమునుండి వెడలి స్థానాంతరమును, మరొక శరీరమును బొందును; కాన మరల కుటుంబములోనికి రానేరఁడు. వానికిఁ బూర్వజన్మ పూర్వకుటుంబముల జ్ఞానమేమియు నుండదు. ॥౭॥

బ్రాహ్మణులు ప్రేతకర్మములను తమ జీవికార్థ మేర్పఱచుకొని యున్నారనుట నిజమేకాని, యవి వేదోక్తములు కానందున ఖండింపఁదగి యున్నవి. ॥౮॥

చారవాకులు వేదాది సత్యశాస్త్రములను జూచియు, వినియు, చదివియు యున్న వేదముల నెన్నఁడును దూషింపకపోదురు గద! భాండధూర్త నిశాచరులవంటి పురుషులు వేదములరచించినారనియు నిందింపరుగద.టీకల వ్రాసిన మహీధరాదులే నిజముగ భాండధూర్త నిశాచరులవంటివారు. వారి ధూర్తత్వమే కాని వేదములందట్లులేదు. అయ్యో! ఈ చారవాకులును, ఆభాణకులును, బౌద్ధులును, జైనులును నాల్గువేదముల మూల సంహితలనయినను వినలేదు. చూచలేదు. ఒక విద్వాంసుని యొద్దనయిన జదువుకొనలేదుగద. కాఁబట్టియే నష్ట భ్రష్ట బుద్ధికలవారై నిరర్థకముగా వేదముల దూషించిరి. దుష్టులైన వామమార్గీయుల ప్రమాణశూన్యములైన కపోల కల్పితములగు భ్రష్టటీకలఁగాంచి వేదవిరోధులై అవిద్యారూపమగు నగాధసముద్రమున బడి మునిఁగిరికద. ॥౯॥

హయలింగమును స్త్రీతో గ్రహింపఁజేసి దానితో సమాగమము చేయించుటయు, యజమానుని కొమార్తెతోఁ బరిహాసాదుల నొనర్చుటయు, వామమార్గీయుల పనియే కాని యితర మనుష్యుల పనికాదు. ఈ మహాపాపిష్ఠులగు వామమార్గీయులు తప్ప, వేదార్థమునకు విపరీతమైన భ్రష్టాశుద్ధ వ్యాఖ్యానముల నెవరు వ్రాసియుందురు! చారవాకాదులు కొంచెమైన నాలోచింపకయే వేదముల దూషించియుండుట కడువిచారకరము.కొంచెమైన దమ బుద్ధి నుపయోగించవలసి యుండెనుగా ! పాపము వారేమిచేయుదురు! వారియందు, సత్యాసత్యముల పరిశీలించి సత్యమండనమును అసత్యఖండనమును జేయునంతటి విద్యయు లేకుండెను. ॥౧౦॥

ఇఁక మాంసము దినవచ్చుననునది ఆ వామమార్గీయులైన టీకాకారుల లీలయే. దీనిఁబట్టి వారిని రాక్షసులనుట యుచితము. కాని వేదము

బందెచ్చటను మాంసము దినవచ్చునని వ్రాయబడలేదు. కాన నిట్టి దుష్ట వ్యాఖ్యలు వ్రాసిన పాప మా టీకాకారులకును, వేదమును కనక వినక యిష్టమువచ్చినట్లు దూషించిన నింవకులకును నిస్సందేహముగాఁ గలుగును. వా స్తవమున వేదవిరోధులనగాఁ వేదములను దూషించినవారును, దూషించు వారును, దూషింపఁబోవువారు నవశ్యముగ నవిద్యాంధకారమునబడి, సుఖము నకు మాటెంత దారుణదుఃఖ మనుభవించినను కొదవయే యనవచ్చును. కాని వేదానుకూలముగఁ బ్రవ ర్తించుటయే మనుష్యులందఱకు సముచితము. ॥౧౧॥

వామమార్గీయులు లేనిపోని మిథ్యాకల్పనలు చేసికొని వేదముల పేరఁ దమ ప్రయోజనములు నెరవేర్చుకొనుట కనఁగాఁ ఇష్టము వచ్చినట్లు మద్య పానము, మాంసభక్షణము, పరస్త్రీగమనము మొదలగు దుష్కర్మలను బ్రవ ర్తింపఁజేయుటకు వేదములకు కళంకము గలిగించిరి. ఈ మాటలనే చూచి చారవాకులును, బౌద్ధులును, జైనులును వేదముల నిందింపఁ దొడఁగి వేరుగా నొక వేదవిరుద్ధమగు ననీశ్వరవాదమును-నా స్తికమతమును నడిపించిరి. చారవాకులు వేదములలోని మూలార్థములను విచారించి తెలిసికొనినచో నీ మిథ్యాటీకలు చూచి సత్యమైన వేదో క్తమతమును నెందులకు పోగొట్టు కొందురు: (నీళ్ల వార్చియుందురు:) పాప మేమిచేయుదురు: 'వినాశకాలే విపరీతబుద్ధిః'(చా. నీ అ. ౧౬ శ్లో ౫) అనునట్లు నష్ట భ్రష్టులుకానున్న సమ యము తటస్థించినపుడు మనుష్యుల బుద్ధులు విపరీతములగును.

ఇఁకఁ జారవాకాదులయందుఁ గల భేదములు వ్రాయుచున్నాము. ఈ చారవాకాదు లనేకవిషయములం దొక్కటిగా నున్నారు కాని చారవాకులు దేహోత్ప త్తితోడనే జీవోత్ప త్తిని, తన్నాశముతో జీవుని నాశనము నొప్పు కొనుచున్నారు. పునర్జన్మమును, పరలోకమును నంగీకరింపరు. ఒక ప్రత్యక్ష ప్రమాణముఁ దప్పఁ దక్కిన యనుమానాది ప్రమాణములనుగూడ నంగీక రింపరు. చారవాకశబ్దార్థము :- "మాటలాడుటయందు ప్రగల్భుఁడనియు, విశేషార్థము వైతండికుఁడనియుఁ గలదు" ఇఁక బౌద్ధులును, జైనులును ప్రత్యక్షాది నాలుగు ప్రమాణములను, అనాది జీవులను పునర్జన్మమును, పర లోకమును, మోక్షమునుగూడ నొప్పుకొనుచున్నారు. చారవాకులకును, బౌద్ధ జైనులకును గల భేదమింతయే. కాని నా స్తికత్వము, వేదేశ్వరుల నింద, పర

మతద్వేషము. ఆరు యతనములు (ముందుచెప్పబోవు - జైన కుణపి...సూత్రమున అట్టి కర్మములు) జగత్కర్త యెవ్వఁడును లేఁడు. అను నిత్యాది విషయములం దందఱు సమానులు. ఇట్లే చారవాకమతమును సంక్షిప్తముగాఁ బ్రకటించినాఁడ.

ఇఁక బౌద్ధమత విషయము సంక్షేపముగా వ్రాయుచున్నాను.

కార్యకారణభావాద్వా స్వభావాద్వా నియామకాత్ ।
అవినాభావనియమో దర్శనాంతరదర్శనాత్ ॥

సర్వదర్శనసంగ్రహే బౌద్ధ దర్శనము ॥

కార్యకారణభావ మనఁగా కార్యదర్శనముచేఁ గారణము, గారణ దర్శనముచేఁ గార్యాదుల సాక్షాత్కారమును, ప్రత్యక్షమునుబట్టి శేషమునం దనుమానమును కలుగుచున్నది. దీనినంగీకరింపక జీవుల సమస్త వ్యవహారములు పూర్ణములు కానేరవు. ఇట్టి లక్షణములచేఁ అనుమానము నధికముగా నంగీకరించి. చారవాకులకంటె భిన్నముగ నేర్పడిన శాఖ బౌద్ధులది.

నాలుగువిధముల బౌద్ధులు కలరు. ఒకరు "మాధ్యమికులు" రెండవవారు "యోగాచారులు" మూఁడవవారు "సౌత్రాంతికులు" నాల్గవవారు "వైభాషికులు" (బుద్ధ్యా నిర్వర్త్యతే న బౌద్ధః) బుద్ధిచే సిద్ధమగునది బౌద్ధము; అనఁగా దనబుద్ధికిఁ దోఁచినమాటల నొప్పుకొనవలెననుట; తమబుద్ధికిఁ దోఁచని మాటల నొప్పుకొనఁగూడదనుట. వీరి యందు మొదటివారగు మాధ్యమికులు "సర్వము శూన్యమే" యని నమ్ముచున్నారు. అనఁగా నెన్ని పదార్థములు కలవో యవన్ని శూన్యములు. అనఁగా ఆదియందు లేకుండును. అంతమందు నుండవు. మధ్యకాలమున ప్రతీతమగునదియు ప్రతీతకాలమందే యుండును. పిమ్మట శూన్యమైపోవును; ఎట్లనఁగా నుత్పత్తికిఁ బూర్వము ఘటములేకుండెను. ప్రధ్వంసానంతరముండదు. ఘటజ్ఞానసమయమున నున్నట్లు గోచరమగును. ఇఁక నన్యపదార్థములమీఁదికి మనస్సుబోయిన ఘట జ్ఞానముండదు. కావున శూన్యమే యొక తత్వమై యున్నది.

రెండవ వారగు 'యోగాచారులు' బాహ్యశూన్యమును నమ్ముచున్నారు. అనగా పదార్థములు లోపల జ్ఞానమున నున్నట్లుగోచరముగు చున్నవే కాని బయటఁగావు. ఎట్లనగా:-ఘటజ్ఞాన మాత్మయందుండును. అపుడేకదా 'ఇది ఘటము

అని మనుజులు అనుచున్నారు. కేవలం జ్ఞానమేలేకున్న నట్లు చెప్పజాలక పోవును.

మూడవవారగు 'సౌత్రాంతికులు' వెలుపలి పదార్థము ననుమానింతురు. కారణమేమన:—బయటి చేపదార్థమును సాంగోపాంగముగా ప్రత్యక్షముగాక యేకదేశ ప్రత్యక్షమై శేషమందనుమానము కలుగుచున్నదని వారి మతము.

నాల్గవవారగు 'వైభాషికులు' పదార్థము బయట ప్రత్యక్షమగు చున్నదేగాని లోనఁ గాదనుచున్నారు. ఎట్లనఁగా (అయం నీలో ఘటః) ఈ ప్రతీతి యందు నీలయుక్తమైనఘటాకృతి బయటనే గోచరమగుచున్నదనివారిమతము.

వీరికి గురువొక బుద్ధుఁడే యయియున్నను శిష్యుల బుద్ధులలో భేదము కలిగి నాలుగు విధముల శాఖ లేర్పడెను. సూర్యుఁడ స్తమించిన సమయమున జారపురుషుఁడు పరస్త్రీగమనమును, విద్వాంసుఁడు సత్యభాషణాది సత్కర్మము లను గావించు సమయ మొక్కటియే కాని తమతమ బుద్ధి ప్రకారముగ భిన్న భిన్న చేష్ట లొనర్తురు. ఇఁక నీ పైఁ జెప్పఁబడిన నలువురలో "మాధ్యమికుఁడు" సమస్తమును క్షణికమనుచున్నాఁడు. అనఁగా క్షణక్షణమందు బుద్ధి పరిణామ మును బొందుటచేఁ బూర్వక్షణమునఁ దెలిసికోఁబడిన వస్తు వుత్తరక్షణమున నట్లుండదు. కావున్నటిని క్షణికములని యొప్పుకొనవలెనని చెప్పుచున్నాఁడు.

రెండవ వారగు యోగాచారుఁడు 'ప్రవృత్తి యంతయు దుఃఖరూప మైయున్నది. ఎందుకన ప్రాప్తియందు సంతుష్టుఁడుగా నెవఁడు నుండఁడు. ఒకటి లభించిన మఱియొకదాని కోరిక యుండియే తీఱునని' నమ్ముచున్నాఁడు మూఁడవవారగు సౌత్రాంతికుఁడు, 'ఎల్లపదార్థములు తమతమ లక్షణముంచే లక్షితములగుచున్నవి. గోచిహ్నములంచేగోవు. మోటక చిహ్నహములచే మోట కము తెలియనగునటులే లక్షణము లక్ష్యము నందెల్లప్పుడుండున'ని చెప్పుచు న్నాఁడు. నాల్గవవారగు వైభాషికుఁడు, శూన్యమునే యొక పదార్థమని నమ్ము చున్నాఁడు. సమస్తమును శూన్యమని నమ్ముచున్న మొదటి మాధ్యమికుని పక్ష మునేయీ వైభాషికుఁడును బూనియున్నాఁడు. ఇవ్విధముగ నీబౌద్ధులయందనేక వివాదాస్పదములైన పక్షములు కలవు. ఇట్లు నాలుగు విధముల భావనలు నమ్ముచున్నారు.

ఉత్తరము:-అంతయు శూన్యమేని శూన్యమును దెలిసికొను వాఁడు శూన్యము కాఁజాలఁడు. అంతయు శూన్యమేయైన శూన్యమును శూన్యము తెలిసికొన లేక పోవును. కానశూన్యమును తెలిసికొనువాఁడును (జ్ఞాత) దెలిసికొనఁదగిన శూన్యము (జ్ఞేయము)నను రెండు పదార్థములు సిద్ధమగుచున్నవి. ఇఁక యోగాచారుఁడనువాఁడు బాహ్యశూన్యత నంగీకరించునేని, పర్వతము వాని యంతస్సున నుండవలయునుగద. ఎవఁడేని యున్నదనిన నట పర్వతముండఁగలుగు నంతటి యవకాశ మెక్కడఁగలదు? కావున పర్వతము వెలుపల నుండు. పర్వతజ్ఞానమాత్మయందుండును. సౌత్రాంతికుఁడొక పదార్థమునైన ప్రత్యక్షమని యంగీకరింపఁడేని, స్వయముగఁ దానును దన వచనమునుగూడ ననుమేయము లనఁదగునే కాని ప్రత్యక్షములు కావు. ప్రత్యక్షమే లేదేని (అయం ఘటః) అను నీ ప్రయోగము నుండఁదగదు? కాని.(అయం ఘటైకదేశః) ఇది ఘటము యొక్క యేకదేశమని యుండవలెను గద? ఏకదేశమునకు ఘటమని పేరుకాదు. కాని సముదాయమునకు ఘటమని పేరు. "ఇది ఘటము" అనునది ప్రత్యక్షము;అనుమేయము కాదు.ఏలయన నవయవములన్నిటిలో నవయవి యొక్కటియే. అది ప్రత్యక్షమైన ఘటావయవములన్నిఁయు ప్రత్యక్షము లగును. అనగా సావయవమైన ఘటము ప్రత్యక్షమగుచున్నదని యొప్పుఁగొనఁదగును. ఇఁక నాల్గవవాడగు వైభాషికుఁడు బాహ్య పదార్థములను ప్రత్యక్షములని యంగీకరించుచున్నాఁడు. అదియును సరికాదు. ఏలయన నెక్కడ జ్ఞాతయు, జ్ఞానమునుండునో యక్కడనే ప్రత్యక్ష మగుచున్నది. ప్రత్యక్షమునకు విషయము బయటనున్నను తదాకారజ్ఞాన మాత్మకుఁ గలుగుచున్నది. పదార్థము క్షణికమై దాని జ్ఞానమును క్షణికమైనచో "ప్రత్యభిజ్ఞా" అనఁగా 'నేనామాట ననియుంటిని'నను జ్ఞాపకము లేకుండ వలెను. కాని పూర్వము చూచినది, వినినది స్మరణకు వచ్చును. కావున క్షణిక వాదముకూడ సరియైనదికాదు. అంతయు దుఃఖమై సుఖమేలేకున్న, సుఖము నపేక్షింపక దుఃఖము సిద్ధింపనేరదు ఎట్లనఁగా రాత్ర్యపేక్షఁజేసి దివసమును, దివసాపేక్షఁజేసి రాత్రియు గలుగుచున్నవి. కాననంతయు దుఃఖమే యనుట సరిగాదు.స్వలక్షణము మాత్రమే యంగీకరింపఁబడిన,నేత్రము రూపమునకు లక్షణము.రూపములక్ష్యము.ఎట్లన-ఘటరూపమను లక్ష్యమునకంటె, ఘట రూపమునకు లక్షణమగు చక్షువు

భిన్నము. గంధగుణము పృథివి కభిన్నము. ఈ ప్రకారమే లక్ష్యలక్షణములు భిన్నాభిన్నములని యొప్పుకొనఁ దగును. శూన్యమునుగూర్చి యింతకుము నుపే యుత్తర మీయఁబడినది. అనఁగా శూన్యమును దెలిసికొనువాఁడు శూన్యమునకంటె భిన్నుఁడై యుండును.

సర్వస్య సంసారస్య దుఃఖాత్మకత్వం సర్వతీర్థంకరసంమతమ్॥

సర్వ. ద. సం. బౌ. ద॥

సర్వజగత్తు దుఃఖమయమని తీర్థంకరుల మతము.

బౌద్ధులు తీర్థంకరులని నమ్మువారినే జైనులును నమ్ముచున్నారు. కావున నీ యుభయులునొక్కటే. పూర్వోక్తమగు భావనాచతుష్టయము అనఁగా నాలుగు భావనలచే సమస్త వాసనలు నివృత్తియగుటఁజేసి శూన్యరూపనిర్వాణము అనఁగా ముక్తికలుగుననుచున్నారు. తమ శిష్యులకు యోగాచారముల యుపదేశము చేయుచున్నారు. గురు వాక్యమును ప్రమాణముగా నంగీకరింప వలెననియు. అనాది బుద్ధియందు వాసనయుండుటఁజేసి బుద్ధియే యనేకాకారములుగా భాసిల్లుననియుఁ జెప్పుదురు. వానియందలి ప్రథమ స్కంధము—

రూపవిజ్ఞాన వేదనా సంజ్ఞాసంస్కార సంజ్ఞకః॥ సర్వ. ద. సం. బౌ. ద॥

మొదటిది:- ఇంద్రియములద్వారా రూపాది విషయములు గ్రహింప బడుట "రూపస్కంధము". రెండవది: ఆలయవిజ్ఞానప్రవృత్తి నెఱుఁగుట యనువ్యవహారము "విజ్ఞానస్కంధము". మూఁడవది: రూపస్కంధ విజ్ఞాన స్కంధములవలన గలిగిన సుఖదుఃఖాదుల ప్రతీతియను వ్యవహారము "వేదనాస్కంధము". నాల్గవది: గౌ అది సంజ్ఞాసంబంధము నామధారి (పదార్థము-సంజ్ఞ)తో నంగీకరించుట "సంజ్ఞాస్కంధము". ఐదవది: వేదనాస్కంధమున కలుగు రాగద్వేషాది క్లేశములును, క్షుధాతృషాద్యుపక్లేశములును, మదము, ప్రమాదము, అభిమానము, ధర్మాధర్మములు "సంస్కార స్కంధము" అని నమ్ముచున్నారు. సమస్త సంసారమును దుఃఖమనియు దుఃఖ గృహమనియు, దుఃఖసాధనమనియు, భావించి సంసారమునుండి విడిపోవలెనని బౌద్ధులందురు. ఇఁక చారవాకులు వీనినేకాక ముక్తిని, అనుమానమును, జీవులనుకూడ నమ్మరు.

దేవా లోకనాథానాం పశ్వాశయవశానుగాః

భిద్యన్తే బహుధా లోకే ఉపాయైర్బహుభిః కిల। ౧॥ సర్వ.ద.సం.బౌ.ద॥

జ్ఞానులు, విరక్తులు, జీవన్ముక్తులు, లోకనాథులు నగు బుద్ధుఁడు మొదలుగాఁ గల తీర్థంకరులు (బోధించిన) పదార్థముల స్వరూపములను గ్రహించి, భిన్నభిన్న విషయములను ప్రతిపాదించు నుపదేశకుఁడు ననేక భేదములతోడను, అనేకోపాయములతోడను జెప్పిన వాని నంగీకరింపవలెను.

గంభీరోత్తానభేదేన క్వచిచ్చోభయలక్షణా ।
భిన్నా హి దేశనా భిన్నా శూన్యతాఽద్వయలక్షణా ॥౨॥ సర్వ.ద.సం.బౌ.ద॥

అతిగంభీర, ప్రసిద్ధ భేదములతో, కొన్ని యెడల గుప్తముగను, కొన్నియెడల ప్రకటముగను, పూర్వము చెప్పబడిన శూన్యలక్షణ యుక్తములగు వేర్వేఱు గురువుల యుపదేశములను నంగీకరింపవలెను.

ద్వాదశాయతన పూజా శ్రేయస్కరీతి బౌద్ధా మన్యంతే:-

అర్థానుపార్జ్య బహుశో ద్వాదశాయతనాని వై ।
పరితః పూజనీయాని కిమన్యైరిహ పూజితైః ॥౩॥ సర్వ.ద.సం.బౌ.ద॥

ద్వాదశాయతనపూజయే మోక్షదాయకమైనది ఆ పూజనమున ననేక ద్రవ్యాది పదార్థముల గూర్చి, (ద్వాదశాయతనము) పంద్రెండు విధములగు స్థానవిశేషములను జేసి యెల్లవిధములఁ బూజింపవలయును. అన్యపూజనముచే నేమి ప్రయోజనము ?

జ్ఞానేంద్రియాణి పంచైవ తథా కర్మేంద్రియాణి చ
మనో బుద్ధిరితి ప్రోక్తం ద్వాదశాయతనం బుధైః ॥౪॥ సర్వ.ద.సం.బౌ.ద॥

వీరల ద్వాదశాయతన పూజన మేమనగా-(అయిదు జ్ఞానేంద్రియములు) శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములు, (అయిదు కర్మేంద్రియములు) వాక్, హస్త, పాద, పాయు, ఉపస్థలు, అను నీ పది ఇంద్రియములను, మనస్సును, బుద్ధిని, సత్కరించుట; అనఁగా వీనినానందమునఁ బ్రవర్తింపఁ జేయుట. బౌద్ధుల మత మిట్టిదియే.

ఉత్తరము:- సంసారమంతయు దుఃఖ రూపమైనచో నే జీవునికి ప్రవృత్తి కలుగకుండవలయును. సంసారమున జీవుల ప్రవృత్తి ప్రత్యక్షముగ గోచరమగుచున్నది. కావున సంసారమంతయు దుఃఖరూపము కాదు. కాని యందు సుఖదుఃఖములు రెండును గలవు. ఇదియే బౌద్ధుల సిద్ధాంతమైన నన్నపానాదుల ననుభవించుచు పథ్యముచేసి ఔషధములు మున్నగువాని సేవించుచు;

శరీర రక్షణమున ప్రవృత్తులయి సుఖము నేల వదయుచున్నారు? మేమును ప్రవృత్తులమగుచున్నాము; కాని దాని దుఃఖమనియే భావించుచున్నామనిన నా మాటయే సంభవము కాదు. ఏలయన జీవుఁడు సుఖమని తలఁచి ప్రవృత్తుఁడును. దుఃఖమని తలఁచి నివృత్తుడు నగుచున్నాఁడు. ప్రపంచమున ధర్మాచరణము, విద్య, సత్సాంగత్యాది శ్రేష్ఠ వ్యవహారములన్నియు సుఖకారకములై యున్నవి. బౌద్ధులుదప్ప వీని నేపండితుఁడును దుఃఖలింగములని నమ్మజాలఁడు.

పంచస్కంధములనునవియుఁ బూర్ణముగ నపూర్ణములై యున్నవి. ఏలయన నిట్టి స్కంధముల విచారింప మొదలిడిన నొక్కొక్కదాని కనేక భేదములు కలుగవచ్చును. ఈ తీర్థంకరుల నుపదేశకులనియు, లోకనాథులనియు నంగీకరించుచు ననాదియు. నాథులకును నాథుడును నగు పరమాత్మ నంగీకరింపరేని, యా తీర్థంకరు లెవరినుండి యుపదేశమును బొందిరి? స్వయముగనే ప్రాప్తించినదన్నచో నామాట సంభవము కాదు. ఎందులకన కారణములేకున్న గార్యముకాఁజాలదు. పోనీ వారి కథనానుసార మటులేయయిన నిప్పుడు కూడఁ జదువక జదివింపక, వినక వినిపింపక, జ్ఞానుల సహవాస మొనర్పక, జ్ఞాను లేల కారు? అట్లు కానప్పుడు ఇట్లనుట సర్వథా నిర్మూలము. యుక్తిశూన్యమునై సన్నిపాత రోగగ్రస్తుని వదరుబోతు సమానమగును. శూన్య రూపమే బౌద్ధుల యద్వైతోపదేశమైన, విద్యమానమగు పదార్థమెన్నఁడును శూన్యరూపము కాఁజాలదు; కాని సూక్ష్మకారణ రూపము కాగలదు. కాన నీకథనముకూడ భ్రమరూపమైయున్నది.

ద్రవ్యముల నార్జించి పూర్వోక్త ద్వాదశాయతన పూజన మొనరించుటయే మోక్షసాధనమన్న, పది ప్రాణములను పదునొకండవ జీవాత్మను ఏల పూజింపరు? ఇంద్రియాంతఃకరణముల పూజనముకూడ మోక్షప్రదమైయున్న నీ బౌద్ధులయందును, కాముకపురుషులందును భేదమేముండును? బౌద్ధులు వానిఁ దప్పించుకొనలేరేని, యట ముక్తియు నెక్కడిది? ఇట్టి సంగతులు గలచోట ముక్తిలో నేమి ప్రయోజనము? భళీ! వీరి యవిద్యకు సాదృశ్యము వీరియందుఁ దప్ప నితరులందు కాననేరము. వీరికి వేదములను, ఈశ్వరుని విరోధించుట వలన లభించిన ఫల మిదియే యని నిశ్చయమగుచున్నది. మొదట ప్రపంచ

మంతయు దుఃఖరూపమని భావించిరి. సరుపు ద్వాదశాయతన పూజనమును స్థిరపఱచిరి. వీరల ద్వాదశాయతనార్చనము ముక్తిగలుగఁ జేయునుగదా! అది ప్రపంచమందలి పదార్థములకంటె వేఱయినదా? సరి! ఒకఁడు కన్నులు మూసి కొని రత్నములు వెదుకఁదలచినను, వెదకినను అవి యెప్పుడైన లభింపఁ గలవా? వేదమును, ఈశ్వరుని నంగీకరింపనందున వీరి లీలయు నిట్టిదే యయ్యెను. ఇప్పుడైనను సుఖాపేక్షకలదేని, వేదేశ్వరుల నాశ్రయించి తమ జన్మముల సఫలము చేసికొనవచ్చును.

వివేకవిలాస గ్రంథ (అష్టమవిలాస) మందు బౌద్ధుల మతమిట్లు వ్రాయబడియున్నది—

బౌద్ధానాం సుగతో దేవో విశ్వం చ క్షణభంగురమ్ ।
ఆర్యసత్త్వాఖ్యయా తత్వచతుష్టయమిదం క్రమాత్ ॥౧॥

బౌద్ధుల సుగతదేవుఁడను బుద్ధభగవానుఁడు పూజనీయుఁడైన దేవుఁడు క్షణభంగుర జగత్తు, ఆర్యులగు స్త్రీపురుషులు, తత్వముల సంజ్ఞాదిప్రసిద్ధియు సను నీ నాలుగు తత్వములు బౌద్ధులకు మంతవ్యములగు పదార్థములు.

దుఃఖమాయతనం చైవ తతః సముదయో మతః ।
మార్గశ్చేత్యస్య చ వ్యాఖ్యా క్రమేణ శ్రూయతామతః ॥౨॥

ఈ విశ్వమును దుఃఖములకు గృహ మనుకొననగును. తదనంతరము సముదయము-ఉన్నతి కలుగును. (మార్గము) క్రమముగ వీని వ్యాఖ్య నాలకింపుఁడు.

దుఃఖసంసారిణః స్కంధాస్తే చ పంచ ప్రకీర్తితాః ।
విజ్ఞానం వేదనా సంజ్ఞా సంస్కారో రూపమేవ చ ॥ ౩॥

సంసారమునందు దుఃఖమే కలదు. పూర్వము చెప్పఁబడిన పంచ స్కంధముల నెఱుఁగుడు.

పంచేంద్రియాణి శబ్దా వా విషయాః పంచ మానసమ్ ।
ధర్మాయతనమేతాని ద్వాదశాయతనాని తు ॥ ౪॥

పంచజ్ఞానేంద్రియములు, వాని శబ్దాది పంచ విషయములు, మనస్సు, బుద్ధి (అంతఃకరణములు,) ఈ పండ్రెండు ధర్మస్థానములు.

రాగాదీనాం గణో యః స్యాత్సముదేతి నృణాం హృది ।
ఆత్మాత్మీయ స్వభావాఖ్యః సస్యాత్సముదయః పునః ॥ ౫॥

మనుజుల హృదయములందు రాగద్వేషాది సమూహ ముత్పత్తియగు సముదయము; ఇఁక నాత్మయు, నాత్మ సంబంధమగు స్వభావము ఆలయమన బడును. వీని వలననే మఱల సముదయమగుచున్నది.

క్షణికాః సర్వసంస్కారా ఇతి యా వాసనా స్థిరా ।
స మార్గ ఇతి విజ్ఞేయః స చ మోక్షోఽభిధీయతే ॥ ౬ ॥

సంస్కారములన్నియు క్షణికములను వాసన స్థిరపడుటయే బౌద్ధుల మార్గము. ఇఁక నా శూన్యతత్త్వమే-శూన్యరూపము దాల్చుటమోక్షము.

ప్రత్యక్షమనుమానం చ ప్రమాణం ద్వితయం తథా ।
చతుఃప్రస్థానికా బౌద్ధాః ఖ్యాతా వైభాషికాదయః ॥ ౭ ॥

బౌద్ధులు ప్రత్యక్షానుమానములను రెండు ప్రమాణములనే యంగీకరింతు చున్నారు. వీరిలో వైభాషికులు, సౌత్రాంతికులు, యోగాచారులు, మాధ్యమికులు అను నాలుగు భేదములు కలవు.

అర్థో జ్ఞానాన్వితో వైభాషికేణ బహు మన్యతే ।
సౌత్రాంతికేన ప్రత్యక్షగ్రాహ్యోఽర్థో న బహిర్మతః ॥ ౮ ॥

వీరిలో వైభాషికుఁడు, జ్ఞానమునగం అర్థమునే (విద్యమానమై) యున్నట్లు నమ్ముచున్నాఁడు. ఏలయన జ్ఞానమున లేని దాని యస్తిత్వమును సిద్ధపురుపఁ డంగీకరింపనేరఁడు సౌత్రాంతికుఁడు ప్రత్యక్ష పదార్థములోపలఁ గలదు; వెలుపల లేదని నమ్ముచున్నాఁడు.

ఆకారసహితా బుద్ధిర్యోగాచారస్య సమ్మతా ।
కేవలాం సంవిదం స్వస్థాం మన్యంతే మధ్యమాః పునః ॥ ౯ ॥

యోగాచారుఁడు బుద్ధిని ఆకారసహితముగ, విజ్ఞానయుక్తముగ నంగీకరించుచున్నాఁడు. మాధ్యమికుఁడు తనలో కేవల పదార్థముల జ్ఞానమునే నమ్ముచున్నాఁడు, కాని పదార్థముల నంగీకరింపఁడు.

రాగాది జ్ఞానసంతానవాసనాచ్ఛేదసంభవా ।
చతుర్ణామపి బౌద్ధానాం ముక్తిరేషా ప్రకీర్తితా ॥ ౧౦ ॥

రాగాది జ్ఞానముల ప్రవాహరూపమగు వాసనా నాశనమువలననే ముక్తి యగునని బౌద్ధుల నలుగురును నమ్ముచున్నారు.

కృత్తిః కమండలు ర్మౌండ్యం చీరం పూర్వాహ్ణ భోజనమ్ ।
సంఘో రక్తాంబరత్వంచశిశ్రియే బౌద్ధభిక్షుభిః ॥ ౧౧ ॥ స.ద.సం.బౌ.ద ॥

మృగాదుల చర్మము, కమండలము, వెండ్రుకలు గొరిగించుట, వల్కల వస్త్రము, పూర్వాహ్ణము అనఁగా ౯ గంటలకు పూర్వము భోజనము, ఒంటరిగా నుండకుండుట, రక్తవస్త్రధారణము అను నివి బౌద్ధసాధువుల వేషములు.

ఉత్తరము:—బౌద్ధులకు సుగతుఁడను బుద్ధుడే దేవుఁడైన నతనికి గురు వెవఁడై యుండెను? విశ్వము క్షణభంగురమన్న 'నిది యదియే' యని, చిర దృష్టపదార్థజ్ఞాపక ముండకపోవలయును. మఱి క్షణభంగురమైయెయున్న నాపదార్థమే యుండకుండును. ఇఁక దేని జ్ఞాపకముండును ॥౧॥ క్షణికవాదమే బౌద్ధులమార్గమైన, వీరలమోక్షముకూడ క్షణభంగురమే కావచ్చును. ॥౨॥ జ్ఞానయుక్తార్థమే ద్రవ్యమైన జడవస్తువునందును జ్ఞానముండవలయును; అందుచే జ్ఞానములో సర్వము ప్రతిబింబమువలెనుండును. అంతర్జ్ఞానములో ద్రవ్యమున్నచో నది బాహ్యమున నుండజాలదు. ఇఁకదేని మీఁదనది చలనము మొదలుగాఁగల క్రియలుచేయును? మంచిది. వెలుపలఁగానవచ్చునది మిథ్య యెట్లు కాఁగలదు?॥౩॥ బుద్ధి సాకారము కలదన్ననది దృశ్యముగావలెను. కేవలజ్ఞానమే హృదయమునం దాత్మస్థమై యుండుననియు, బాహ్యపదార్థములు జ్ఞానమాత్రములే యనియు నంగీకరింపఁబడునేని, జ్ఞేయమను పదార్థములేనిది జ్ఞానమేకలుగ నేరదు॥౯॥ వాసనాచ్ఛేదమే ముక్తియైన సుషుప్తియందును ముక్తి నొప్పుకొనవలయును. ఇట్లొప్పుకొనుట విద్యావిరుద్ధమైయున్నందునఁ దిరస్కరింపఁదగియున్నది.॥౧౦॥ బౌద్ధమతస్థుల సంగతులు సంక్షేపముగా ప్రదర్శింపఁబడినవి. ఇప్పుడు వీరి విద్య వీరి మతము ఎట్లున్నవో బుద్ధిమంతులు, విచారశీలురు నగు పురుషులు కనుగొనవచ్చును. దీనిని జైనులుగూడ నంగీకరించుచున్నారు.

## జైనమతవర్ణనము

ప్రకరణ రత్నాకరము ౧ వ భాగము, నయచక్రసారమునందీ క్రింది సంగతులు వ్రాయఁబడియున్నవి—

బౌద్ధులు సమయసమయమున నూతనముగ (౧) ఆకాశము (౨) కాలము (౩) జీవములు (౪) పుద్గలము అను నీ నాల్గుద్రవ్యములు నమ్ముచున్నారు. మఱి జైనులు ధర్మాస్తికాయము, అధర్మాస్తికాయము, ఆకాశాస్తికాయము, పుద్గలాస్తికాయము, జీవాస్తికాయము, కాలము అను నీ యాఱు ద్రవ్యములను నమ్ముచున్నారు. వీనియందలి కాలమును అస్తికాయమని యంగీకరింపరు. వారు కాల ముపచారమున ద్రవ్యమై యున్నదేకాని వస్తుతః

ద్రవ్యము కాదని యనుచున్నారు. వీనిలో గతి పరిణామత్వముచే పరిణామము పొందిన జీవు(డు, పుద్గలమును, సమీపముననుండి దాని గతిని స్తంభన మొనర్చు హేతువును "ధర్మాస్తికాయము" అయియున్నది. మరియు నయ్యది యసంఖ్య ప్రదేశ పరిమాణములలోను, లోకములందును వ్యాపకమైయున్నది. (రెండవది) "అధర్మాస్తికాయము" అన(గా స్థైర్యముచే పరిణమిల్లిన జీవపుద్గలముల స్థితికి ఆశ్రయమైన దానికి హేతువై యుండునది. (మూడవది) "ఆకాశాస్తికాయము" అనగా సమస్త ద్రవ్యముల కాధార భూతమును, అవగాహన ప్రవేశనిర్గమాదిక్రియల నొనరించు జీవపుద్గలముల కవగాహన హేతువును, సర్వవ్యాప్తియునై యుండునది. (నాల్గవది) "పుద్గలాస్తి కాయము." అన(గా కారణరూపసూక్ష్మమును, నిత్యమును. ఏకరసమును, వర్ణమును, గంధమును, స్పర్శమును, కార్యలింగమును. నిండెడు కరగెడు స్వభావముకలదియునై యుండునది. (అయిదవది) "జీవాస్తికాయము." చైతన్యజ్ఞాన లక్షణములు కలిగి దర్శనమం దుపయుక్తమై, అనంత పర్యాయములుగా పరిణామ మం(దెడి కర్తయు భోక్తయు నగునది. (ఆఱవది) "కాలము." అన(గా( బూర్వోక్తములగు పంచాస్తికాయముల పరత్వాపరత్వ, నవీనత ప్రాచీనత్వములకు చిహ్నరూపమై ప్రసిద్ధముగా వర్తమాన రూపములను పర్యాయములచే యుక్తమైయుండునది.

సమీక్షకు(డు:-నాల్గుద్రవ్యములను సమయ సమయమునందు క్రొత్తవిగా నెంచు బౌద్ధులు సత్యదూరులు. ఏలయన నాకాశము, కాలము, జీవులు, పరమాణువు లనునివి క్రొత్తవిగాని, పాతవిగాని యెప్పుడును కానేరవు. ఇవి యాదిలేనివి; కారణరూపముగ ననశ్వరములునై యున్నవి. కావున నవీనత్వము ప్రాచీనత్వము అనునది యెట్లు ఘటిల్లగలదు? మరియైనను యొప్పుదలయు దాగుగలేదు. ఏలయన ధర్మాధర్మములు ద్రవ్యములు కావు; కాని గుణములై యున్నయని. ఈ రెండును జీవాస్తి కాయమునందు ఘటిల్లుచున్నవి. కావున నాకాశమును, పరమాణువులన, జీవులను, కాలమును నంగీకరించిన బాగుగా నుండెడిది. వైశేషికమునందంగీకరింప(బడిన తొమ్మిది ద్రవ్యములే సరియైనవి. ఏమన పృథివ్యాది పంచతత్వములు, కాలము, దిక్కు, ఆత్మ, మనస్సు అనునవి తొమ్మిది వేఱువేఱు పదార్థములుగా నిశ్చయింప(బడినవి. జీవుండు

మాత్రము చైతన్యులుగా నంగీకరించి యీశ్వరు నంగీకరింపకపోవుట. జైన
బౌద్ధుల మిథ్యా పక్షపాతయుక్తమగు కథనమే యననొప్పును.

ఇఁక బౌద్ధులును జైనులును సప్తభంగియు. స్యాద్వాదము నంగీకరించు
చున్నారు. అది యెట్లన (సన్ ఘటః) దీనిని ప్రథమభంగమందురు. ఎందువల్ల
నన ఘటము తన వర్తమానత్వముతో యుక్తము. అనఁగా ఘటమున్నది.
యను నిది యభావమును నిషేధించుచున్నది.

(అసన్ ఘటః) ఘటములేదు. మొదటి ఘటభావమును బట్టి ఈ ఘట
మున కసద్భావము అనుటఁ రెండవ భంగము. మూఁడవ భంగము:-(సన్న
సన్నఘటః) అనఁగా నిది ఘటము, పటముకాదు. ఏలయన నా రెంటి
కంటె నిది వేఱు నాల్గవభంగము: (ఘటో౽ఘటః) ఎట్లు (అఘటః పటః)
రెండవ పటాభావమునుబట్టి; తన యందుండుటఁజేసి ఘటము అఘట మన
బడును. ఒక్కమాటుగానే దానికి ఘటమనియు, అఘటమనియు గూడ రెండు
సంజ్ఞలు కలుగును. అయిదవ భంగము:—ఘటమును పటమనుటయోగ్యము
కాదు. ఏమనఁగా దానియందు ఘటత్వము వక్తవ్యమును, పటత్వమవక్తవ్యము
నయియున్నవి. ఆఱవ భంగము:-అనగా ఘటమే లేకున్న నది చెప్పబడుటకు
యోగ్యమైనదికాదు. ఉన్నదనునది యున్నది. అది చెప్పఁబడుటకు యోగ్య
మైన దనుట. ఏడవ భంగము:-చెప్పబడిశిష్టమున్నది కాని యదిలేదు. ఘట
మని చెప్పబడకూడ యోగ్యముకాదు. ఇదియే సప్తమ భంగ మనఁబడుచున్నది.

స్యాదస్తి జీవో౽యం ప్రథమో భంగః ॥ ౧ ॥ స్యాన్నాస్తి జీవో ద్వితీయో
భంగః ॥ ౨ ॥ స్యాదవక్తవ్యోజీవస్తృతీయో భంగః ॥ ౩ ॥ స్యాదస్తి నాస్తి నాస్తిరూపో
జీవశ్చతుర్థో భంగః ॥ ౪ ॥ స్యాదస్తిఅవక్తవ్యోజీవః పంచమోభంగః ॥ ౫ ॥ స్యాన్నాస్తి
అవక్తవ్యో జీవః షష్ఠో భంగః ॥ ౬ ॥ స్యాదస్తినాస్తి అవక్తవ్యోజీవ ఇతి సప్తమో
భంగః ॥ ౭ ॥

'జీవుడున్నాడు' అని యనినపుడు జీవునకు విరుద్ధములైన జడపదార్థ
ములా జీవునియందు లేవను భంగము ప్రథమ మనబడుచున్నది ఇఁక జడము
నందు జీవములేదనిగూడ చెప్పఁబడుటకలదు; కాన నిది రెండవ భంగమనఁ
బడును. జీవుఁడు కలదుకాని చెప్పనలవికాదు; ఇది మూఁడవభంగము. జీవుడు
శరీరమును ధరించునపుడు ప్రసిద్ధుఁడుగను, శరీరమునుండి వేఱగునపుడు అప్ర

సిద్ధుఁడుగాను నుండునని చెప్పఁబడునుగద: దీనిని నాల్గవభంగమందురు. జీవుఁడు కలఁడు గాని చెప్పఁబడుటకు యోగ్యుఁడు కాఁడనినది పంచమభంగ మనఁబడును. జీవుఁడు కలఁడని ప్రత్యక్షప్రమాణముతోఁ జెప్పుటకు సాధ్యముకాదు. చక్షుః ప్రత్యక్షముగాఁడు అను వ్యవహారముకలదు. కాన దీనిని షష్ఠభంగమందురు. ఒక సమయమందనుమానమున జీవుఁడున్నట్లును అదృశ్యత్వమున లేనట్లును, ఒకేరీతిగా నుండక క్షణక్షణమున పరిణామము నొందుటయి అస్తినాస్తి యనునది లేకపోవుటయు, నాస్తి అస్తియను వ్యవహారముకూడఁ గలుగకుండుటయు ననునది సప్తమభంగమనఁబడును.

ఈ ప్రకారముగనే నిత్యత్వసప్తభంగి, అనిత్యత్వసప్తభంగి, అట్లే సామాన్యధర్మము విశేషధర్మము అను గుణ పర్యాయములఁబట్టి ప్రతివస్తువునందు సప్తభంగి తటస్థించుచున్నది. అటులే ద్రవ్య గుణ స్వభావములును, పర్యాయములు ననంతములగుటవలన సప్తభంగియు ననంతమేయనుట బౌద్ధులయు, జైనులయు స్యాద్వాదమనియు, సప్తభంగీన్యాయమనియు ననఁబడును.

సమీక్షకుఁడు:- ఈ కథన మొక యన్యోన్యాభావమందును, సాధర్మ్య వైధర్మ్యములందును చరితార్థము కాఁగలదు. ఈ సరళ ప్రకరణమును వదలి కఠినజాలమును రచియించుట కేవల మజ్ఞానులఁ జిక్కించుకొనుటకేకద. చూడుఁడు: జీవాభావమజీవమందును, అజీవాభావము జీవమందును, యందియే యుండును ఎట్లన-జీవజడములు వర్తమానములగుటఁజేసి వానియందు వర్తమానత్వరూప సాధర్మ్యము కలదు. మరియు నవి చైతన్యజడములగుటఁజేసి వానియందు వైధర్మ్యము-అనఁగా జీవమందు చేతనత్వము (అస్తి) కలదు. జడత్వము (నాస్తి) లేదు. ఇవ్విధముగనే జడమున జడత్వము గలదు; చేతనత్వము లేదు. దీనిఁజేసి గుణకర్మ స్వభావముల సమాన—విరుద్ధ ధర్మముల యాలోచనముఁ బట్టి వీరల సప్తభంగియు, స్యాద్వాదము అంతయు సులభముగాఁ దెలియనగును. ఇఁక నిట్లు ప్రపంచమును పెంచుటచే నేమి ప్రయోజనము? ఈ విషయమున బౌద్ధులయు జైనులయు మతమొక్కటియే. కొంచెము వేరగుటవలన భిన్న భావముకూడఁ గలుగుచున్నది. ఇఁక దీని కనంతరము కేవల జైనమతమును గూర్చి వ్రాయబడును:-

చిదచిద్వే పరే తత్వే వివేక స్తద్వివేచనమ్ ।
ఉపాదేయముపాదేయం హేయం హేయంచ కుర్వతః ॥ ౧ ॥

వ.ద. సం. అర్హతదర్శనము.

జైనులు చిత్తు అచిత్తు అనఁగా చేతనము, జడము అను రెండే పర తత్వముల నంగీకరించుచున్నారు. ఆ రెంటి వివేచనయే వివేకమనఁబడును. గ్రహింపఁదగినవాని గ్రహించి, త్యజింపఁదగినవానిఁ ద్యజించువానిని వివేకి యందురు.

హేయం హి కర్తృరాగాది తత్కార్య మవివేకినః ।
ఉపాదేయం పరం జ్యోతి రూపయోగై కలక్షణమ్ ॥ ౨ ॥

వ.ద. సం. అర్హతదర్శనము.

జగత్కర్త,రాగాదులు, జగత్తునీశ్వరుడు రచియించెను అను నీ వివేక శూన్యమైన మతమును త్యజించి, యోగముచే లక్షితుఁడగు పరమ జ్యోతిస్స్వ రూపుడైన యా జీవుని గ్రహించుటయే యుత్తమము.

అనఁగా జీవుడుకాక రెండవచేతన తత్వమగు నీశ్వరు నొప్పుకొనరు. అనాది సిద్ధుడైన ఈశ్వరుఁడెవఁడును లేఁడని బౌద్ధులును జైనులును నమ్ము చున్నారు. దీనినిగుఱించి రాజా శివప్రసాదుగారు "ఇతిహాస తిమిరనాశక" మను గ్రంథమునందు. 'వీరికి బౌద్ధులు, జైనులు అని రెండు నామములు కలవు. ఇవి పర్యాయపదములు, మద్యమాంసాహారము చేయు వామమార్గియు లైన బౌద్ధులతో జైనులకు విరోధముకలదు; కాని మహావీరుఁడని గౌతమగణ ధరుఁడని అనఁబడు వారికి, బౌద్ధులు బుద్ధుఁడనియు, జైనులు గణధరుఁ డనియు, జినవరుఁడనియుఁ బేరులు పెట్టిరని' వ్రాసియున్నారు. జైనమత పరం పరలోని వారగు రాజాశివప్రసాదగారు, 'శంకరాచార్యుల కించుమించు వేయి సంవత్సరములకుఁ బూర్వము వీరుండిరనియు, శంకరునికిముం దీభారతవర్షము నందంతట జైనమో, బౌద్ధమో యను నొకమతము వ్యాపించియుండెనని'యుఁ దమ 'ఇతిహాస తిమిరనాశక'మను గ్రంథమున మూఁడవఖండమున వ్రాసి యున్నారు. దీనిమీద శివప్రసాద గారే యక్కడ తన గ్రంథములో నిట్లు (నోటు) టిప్పణి వ్రాసియున్నారు. "బౌద్ధమనగా మాయాశయము మహావీర గణధర గౌతమ స్వామివారి కాలమునుండి శంకరస్వాముల కాలమువఱకు

భారత దేశమంతట వ్యాపించియున్న వేదవిరుద్ధమైన మతమే. ఆ మతము నశోకుఁడు సంప్రతి మహారాజును నంగీకరించిరి. దీనినుండి జైనులెంత మాత్రము వేఱు కాజాలరు. జినశబ్దమునుండి జైన, బుద్ధశబ్దమునుండి బౌద్ధ అనురూపము లేర్పడును. ఈ రెండును పర్యాయ వాచక శబ్దములు. కోశము నందీ రెంటి కొకే యర్థము వ్రాయఁబడియున్నది. గౌతముని నుభయు లొప్పు కొనుచున్నారు. లేనిచో దీపవంశాది పురాతనములగు బౌద్ధగ్రంథములందు శాక్యమునియైన గౌతమబుద్ధుని తరుచు మహావీరుఁడను నామముతో వ్రాసి యుండరు. కాన నతని సమయమునందు వారల మతమొక్కటియే యైయుండ వచ్చును. మేము గౌతమ మతస్థులను జైనులని వ్రాయక, బౌద్ధులని వ్రాసిన ప్రయోజనమేమన, వారల నితర దేశస్థులు బౌద్ధులనియే వ్రాసియున్నారు.'' అమరకోశమునఁగూడ నటులే వ్రాయఁబడియున్నది.

> సర్వజ్ఞః సుగతో బుద్ధో ధర్మరాజస్తథాగతః
> సమన్తభద్రో భగవాన్మారజిల్లోకజిజ్జినః
> షడభిజ్ఞో దశబలోఽద్వయవాదీ వినాయకః ।
> మునీన్ద్రః శ్రీఘనః శాస్తా మునిః శాక్యమునిస్తు యః ॥
> స శాక్యసింహః సర్వార్థసిద్ధశ్శౌద్ధోదనిశ్చ సః ।
> గౌతమశ్చార్కబన్ధుశ్చ మాయాదేవీసుతశ్చ సః ॥
>
> అమరకోశము. కాం. ౧. వర్గ. ౧. శ్లో. ౮-౧౦.

ఇప్పుడు చూడుఁడు: బుద్ధ, జిన అట్లే బౌద్ధ, జైన, అనుపేరు లొకటి కేనా, కావా? అమరసింహుఁడు కూడ బుద్ధుఁడు, జినుఁడు ఒకడే యనిమఱచి వ్రాసెనా, యేమి? అవిద్వాంసులగు జైనులు తమది యెఱుఁగరు. ఇతరులది యెఱుఁగరు. కేవల హఠ మొనరించుచు వదరుచుందురు. కాని జైనులందు విద్వాంసులగువారందఱు, బుద్ధ జిన, అట్లే బౌద్ధ జైన శబ్దములు పర్యాయ వాచకములని యెఱుఁగుదురు. ఇందు సందేహమేమియు లేదు. జీవుఁడే పర మేశ్వరుఁ డగునని జైను లనుచున్నారు. వారు తమ తీర్థంకరులకే కైవల్య ముక్తి లభించినదని, వారే పరమేశ్వరులని నమ్ముచున్నారు. అనాదిగా పర మేశ్వరుఁ డెవ్వఁడును లేఁడందురు. సర్వజ్ఞ, వీతరాగ, అర్హన్, కేవలీ, తీర్థం కృత, జిన అను నీ యాఱును నాస్తికుల దేవతలను పేరులు. ఆదిదేవుని

స్వరూపమును చంద్రసూరి యనువాఁడు "అ ప్తనిశ్చయాలంకార" గ్రంథము నందు వ్రాసియున్నాఁడు—

సర్వజ్ఞో వీతరాగాదిదోషస్త్రైలోక్యపూజితః ।
యథాస్థితార్థవాదీ చ దేవోర్హన్ పరమేశ్వరః ॥౧॥

రాగాది దోషరహితుఁడును, త్రిలోకములందు పూజ్యుఁడును, యథా వస్థార్థ వ క్తయు, సర్వజ్ఞుఁడును నగు అర్హన్ దేవుఁడే పరమేశ్వరుఁడు

అటులే లౌకాతికులు గూడ వ్రాసియున్నారు—

సర్వజ్ఞో దృశ్యతే తావన్నేదానీ మస్మదాదిభిః ।
దృష్టో న చైకదేశోఽస్తి లింగం వా యోఽనుమాపయేత్ ॥౨॥

మేమీ సమయమున పరమేశ్వరునిఁ జూచుటలేదు. కాఁబట్టి సర్వజ్ఞుఁడు, అనాదియగు పరమేశ్వరుఁడు ప్రత్యక్షముకాఁడు. ఈశ్వరునందు ప్రత్యక్ష ప్రమాణము ఘటింపనపుడు తదనుమానప్రమాణమును ఘటింపఁజాలదు. ఏలయన నేకదేశ ప్రత్యక్షముగాకున్న ననుమానమే కలుగదు.

న చాగమవిధిః కశ్చిన్నిత్యసర్వజ్ఞబోధకః ।
న చ తత్రార్థవాదానాం తాత్పర్యమపి కల్ప్యతే ॥౩॥

ప్రత్యక్షానుమానములే లేకున్న నిత్యుఁడు, అనాది, సర్వజ్ఞుఁడునగు పరమాత్మబోధక-ఆగమమను శబ్దప్రమాణమును స్థిరపడనేరదు. మూఁడు ప్రమాణములును స్థిరపడనప్పుడు అర్థవాదము అనఁగా స్తుతి, నిందా, పరకృతి యను పరచరిత్రవర్ణనము, పురాకల్పము అనఁగా ఇతిహాస తాత్పర్యముకూడ స్థిరపడనేరదు.

న చాన్యార్థప్రధానైస్తైస్తదస్తిత్వం విధీయతే।
న చానువాదితుం శక్యః పూర్వమన్యైరబోధితః॥౪॥స.ద.సం.ఆర్హతదర్శనము॥

అన్యార్థప్రధానమగు బహువ్రీహి సమానమువలె పరోక్షమునఁగ పరమాత్మను సిద్ధింపఁచేయు విధానము కూడ ఘటింపనేరదు. ఇఁక నీశ్వరోప దేష్టలనుండి వినకున్న ననువాదముకూడ నెట్లుండును ?

దీని ప్రత్యాఖ్యానము అనఁగా ఖండనము—అనాదియైన యీశ్వరుఁడు లేకున్న సర్వజ్ఞ దేవుని తల్లి తండ్రి మొదలగువారి శరీరముల మచ్చుల నెవరు చేయఁగలిగియుందురు : సంయోగక ర్త లేక యథాయోగ్యముగ సర్వా

వయవ సంపన్నమై యథోచితకార్యముల నొసర్చునసయుక్తమగు శరీరమే యేర్పడఁజాలదు. ఏ పదార్థములతో శరీర మేర్పడినదో యవి జడములయి నందున, తమంతటఁ దామీ ప్రకారముగ సుత్తమరచనాయుక్తములగు శరీర రూపములు కాఁజాలవు. ఏలయన వానియందు యథాయోగ్యముగ నేర్పడఁ దగు జ్ఞానమే లేదు. రాగాది దోషసహితుఁడయి పిమ్మట దోషరహితుఁడగు వాఁడెన్నఁడు నీశ్వరుఁడు కాఁజాలఁడు. ఏలయనః— ఏ నిమిత్తమున నతఁడు రాగాదులనుండి విముక్తుఁడగుచున్నాఁడో యానిమిత్త మనిత్యమగుటవలన తజ్జనిత ముక్తియు ననిత్యమగుచున్నది. అల్పుఁడును, అల్పజ్ఞుఁడును నగు వాఁడు సర్వవ్యాపకుఁడును, సర్వజ్ఞుఁడును నెన్నఁడునుగాఁజాలఁడు. ఏలయన జీవుని స్వరూప మేకదేశీయమును, పరిమిత గుణకర్మ స్వభావముల కలదియు నగుచున్నది. అతఁడు సర్వవిధముల సమస్త విద్యలందు యథార్థ వక్త కాఁజాలఁడు. కాన మీ తీర్థంకరు లెప్పుడును పరమేశ్వరులు కానేరరు॥౧॥

మీరు ప్రత్యక్షములగు పదార్థములనే యంగీకరించుచున్నారా? అప్రత్యక్షముల నంగీకరింపరా? చెవులచే రూపగ్రహణమును, కన్నులచే శబ్దగ్రహణమును కానేరనటులే యనాది పరమాత్మను కనుగొనుసాధములగు శుద్ధాన్తఃకరణ, విద్యా, యోగాభ్యాసములచే పవిత్రాత్ముఁడు పరమాత్మను ప్రత్యక్షముగాఁ గాంచుచున్నాఁడు. చదువక విద్యాప్రయోజనము లభించనట్లు, యోగాభ్యాస విజ్ఞానములు లేక పరమాత్మయు నగపడఁడు. భూమియొక్క రూపాదిగుణము లనుగాంచి, యెఱిఁగి గుణముల చేత అవ్యవహిత సంబంధముగల పృథివిప్రత్యక్షమగు చున్నట్టులే సృష్టియందలి పరమాత్ముని రచనావిశేషములగు చిహ్నములఁగాంచిన పరమాత్ముఁడు ప్రత్యక్ష మగుచున్నాఁడు. పాపమలాచరింపదలచినపుడు భయము, శంకలజ్జయనునవి కలుగుచున్నవి. అవి యంతర్యామియయిన పరమాత్మవల్లనే కలుగుచున్నవి. దీనఁజేసియు పరమాత్ముఁడు ప్రత్యక్షమగుచున్నాఁడు. ఇఁక అనుమాన ప్రమాణముచే సిద్ధించుటలో సందేహమేమి? ॥౨॥

ప్రత్యక్షానుమానములు స్థిరపడినందున ఆగమ ప్రమాణముకూడ "నిత్యుఁడు, అనాది, సర్వజ్ఞుఁడు" నగు ఈశ్వరుని బోధించుచున్నదగును. కావున శబ్దప్రమాణము కూడ నీశ్వరునియందు సంఘటిల్లును. త్రివిధ ప్రమా

ణములచే జీవుఁడు ఈశ్వరుని దెలిసికొనగలిగినపుడు, అర్థవాదము అనఁగా పరమేశ్వరుని గుణప్రశంసచేయుట నయితము యథార్థముగా సంఘటిల్లును. ఎందులకన నిత్యములయిన పదార్థముల గుణకర్మస్వభావములు నయితము నిత్యము లేయగును. వాని ప్రశంస చేయుటయందే ప్రతిబంధకమును లేదు ॥౩॥

మనుష్యులలో కర్తలేకున్న నేకార్యమును గానటులే యీ మహాకార్యము కూడ కర్తలేనిదే కలుగుననుట సర్వథా యసంభవము.కాన ఈశ్వరుఁడు కలఁడనుటకాక మూర్ఖునికయిన సందేహము కలుగనేరదు. ఈశ్వరుఁడు కలఁడని యుపదేశించు వారినుండి వినినపిమ్మట దాని యనువాదముఁ జేయుటకూడ సులభమే ॥౪॥జైనుల కిట్లు ప్రత్యక్షాది ప్రమాణములచే నీశ్వరుని ఖండింపఁబూనుట యుచితముకాదు.

ప్రశ్న :— అనాదేరాగమస్యార్థో న చ సర్వజ్ఞ ఆదిమాన్ ।
కృత్రిమేణ త్వసత్యేన స కథం ప్రతిపాద్యతే ॥౧॥

సర్వజ్ఞుఁడు మధ్యనయ్యెననుట, అనాదిశాస్త్రార్థము కాఁజాలదు. ఏమన అసత్యవచనముచే నతఁడెట్లు ప్రతిపాదింపఁబడఁగలఁడు.

అథ తద్వచనేనైవ సర్వజ్ఞోఽన్యైః ప్రతీయతే ।
ప్రకల్ప్యేత కథం సిద్ధి రన్యోన్యాశ్రయయో స్తయోః ॥౨॥

పరమేశ్వరుని వచనము చేతనే పరమేశ్వరుఁడు సిద్ధించుచున్నననాదియీశ్వరుని వల్ల ననాది శాస్త్రసిద్ధియు, అనాది శాస్త్రములవల్ల ననాది పరమేశ్వరుని సిద్ధియునై యన్యోన్యాశ్రయదోషము సంభవించుచున్నది.

సర్వజ్ఞోక్తతయా వాక్యం సత్యం తేన తదస్తితా।
కథం తదుభయం సిద్ధ్యేత్ సిద్ధమూలాంతరాదృతే ॥౩॥ వ.ద.సం.ఆ.ద॥

ఏలయన సర్వజ్ఞుని కథన మగుటఁబట్టి, ఆ వేదవాక్యము సత్యమని తద్వేదవచనమువల్లనే ఈశ్వరుని సిద్ధింపజేఁయుచున్నారు కదా! అదియెట్లు సిద్ధించును! ఆ శాస్త్రము యొక్కయు, పరమేశ్వరుని యొక్కయు సిద్ధికి మూఁడవ ప్రమాణమేదైనఁ గావలయును. అట్లొప్పుకొందురేని యనవస్థా దోషము సంప్రాప్తమగును.

ఉత్తరము:—మేము పరమేశ్వరుని, పరమేశ్వరునిగుణకర్మస్వభావము లను, అనాదియని యంగీకరించుచున్నాము. అనాది, నిత్యములగు పదార్థము

లందు అన్యోన్యాశ్రయదోషము రాఁజాలదు. ఎట్లన కార్యము నుండి కారణ జ్ఞానమును, కారణమునుండి కార్యబోధయు నగుచున్నది. కార్యమునందుఁ గారణస్వభావమును, కారణమునందుఁ గార్యస్వభావమును నిత్యములు. అటులే పరమేశ్వరుఁడును, పరమేశ్వరుని యనంత విద్యాది గుణములును నిత్యములై యుండున, ఈశ్వరప్రణీతమగు వేదమునందు అనవస్థాదోషమురాదు.౧.౨ ౩॥

మీరు తీర్థంకరులను పరమేశ్వరుఁడని నమ్ముచున్నారు. అది యెన్నఁటికిని ఘటిల్ల నేరదు. ఏమన తల్లిదండ్రులులేక వారి శరీరములే యేర్పడకున్న, వారు తపశ్చర్యలను, జ్ఞానమును, ముక్తిని ఎట్లు పొందగలరు? ఆ ప్రకారమే సంయోగమునకు ఆది యవశ్యముగా నుండియేతీరును. ఏలయన వియోగము లేనిది సంయోగముకలుగనేకలుగదు. కావున ననాదిసృష్టికర్తయగు పరమాత్మ నొప్పుకొనుఁడు. చూడుఁడు! ఎంతటి సిద్ధపురుషుఁడైనను శరీరాదుల రచనను పూర్ణముగా నెఱుఁగఁజాలఁడు. సిద్ధుఁడగు జీవుఁడు సుషుప్తిదశయందుండు నపుడు అతనికి భానముండదు. జీవుఁడు దుఃఖమును బొందియున్నప్పుడు, అతని జ్ఞానముకూడ తగ్గిపోవుచున్నది. ఇట్లు పరిచ్ఛిన్న సామర్థ్యము కలిగి యేకదేశీయుఁడగు వానిని ఈశ్వరుఁడని యంగీకరించువారు భ్రాంతి బుద్ధియుక్తులగు జైనులు తప్ప మఱియెవ్వరును నుండరు. ఆ తీర్థంకరులు తమ తల్లిదండ్రులకుఁ బుట్టిరని మీరందురు కాఁబోలు. సరి! వారును వారి తల్లిదండ్రులును ఎవ్వరికిఁబుట్టిరి? మఱి వారి తల్లిదండ్రులుకూడ నెవరికిఁబుట్టిరి? ఇత్యాది యనవస్థాదోషము సంభవించును.

## ఆస్తిక నాస్తికుల సంవాదము

దీని కనంతరము గొప్పగొప్ప జైనులు తమ సమ్మతిపూర్వకముగ నంగీకరించి బొంబాయిలో నచ్చువేయించిన, ప్రకరణరత్నాకరములోని రెండవ భాగమందలి యాస్తిక నాస్తిక సంవాదరూప ప్రశ్నోత్తరముల నిట వ్రాయుచున్నాము.

నాస్తికుఁడు:—ఈశ్వరేచ్ఛవలన నేమియు కాదు. కర్మమునుండియే యంతయునగుచున్నది.

ఆస్తికుఁడు:—అంతయు కర్మమునుండియే యగుచున్నదేని, కర్మమెవని నుండి కలుగుచున్నది? జీవాదులనుండి కలుగుచున్నదందురేని ఏశ్రోత్రాది సాధ

నముచే జీవుఁడు కర్మమొనరించుచున్నాఁడో, యవి యెవనినుండి కలిగినవి, అనాదికాలమునుండి స్వాభావికముగానే కలుగుచున్నవందురేని, అనాదియైనది వేఁగుట యసంభవమై మీమతమున ముక్తికి నభావము కలుగును. ప్రాగభావమువలె, అనాది, సాంతములందురేని, యత్నము లేకయే యెల్లర కర్మములు నివృత్తిఁజెందును. ఈశ్వరుఁడు ఫలప్రదాత కాకున్న, పాపఫలమగు దుఃఖమును జీవుఁడు తన యిష్టముతో నెన్నఁటికి ననుభవింపకుండును. ఎట్లన దొంగలు మున్నగు వారుదొంగతనపు ఫలమగు శిక్షను తమ యిష్టముతో పొందరు. కాని రాజ్య వ్యవస్థచేఁ బొందుదురు. అటులే పరమేశ్వరుఁడు అనుభవింపఁజేయుటచే జీవులు పాపపుణ్యఫలముల ననుభవించుచున్నారు. లేనిచో కర్మములు సంకరములగును. ఒకని కర్మముల నొకఁడనుభవింప వలసివచ్చును.

నాస్తికుఁడు:-ఈశ్వరుఁడు అక్రియుఁడు; ఏలయన కర్మమొనర్చువాఁడైన కర్మఫలమునుగూడ ననుభవింప వలసినవాఁడగును. కావున మేము "కేవలీ" ముక్తిని బొందినవారలను అక్రియులని నమ్ముచున్నటులే మీరుకూడ నమ్ముఁడు.

ఆస్తికుఁడు:-ఈశ్వరుఁడు అక్రియుఁడు కాఁడు; కాని సక్రియుఁడు. చైతన్యుఁడగునపుడు కర్తకాఁడెందులకు? కర్తయగునేని క్రియనుండియెవ్వఁడు వేరు కాఁజాలఁడు. జీవుడు తీర్థంకరుడైన మీదట నతని నీశ్వరుడని మీరు నమ్ముచున్నారు. కృత్రిమముగా నిర్మింపబడిన అట్టి యీశ్వరుని విద్వాంసుఁ డెవఁడైన నంగీకరింపనేరఁడు. ఏమన నిమిత్తముచే నీశ్వరుఁడగునన్న అనిత్యుఁడు, పరాధీనుఁడు నైపోవును. ఏలయన నీశ్వరుఁడగుటకుఁ బూర్వము జీవుఁడై యుండెను. పిమ్మట నొకానొక నిమిత్తముచే నీశ్వరుఁడయ్యెనేని మరలఁగూడ జీవుఁడై పోవును. తన జీవత్వమనెడి స్వభావము నెన్నఁడు వదలనేరఁడు. ఎందులకన ననంతకాలమునుండి జీవుఁడై యున్నాఁడు, అనంతకాలమునకు కర్లేయుండును. కానసీయనాది స్వతఃసిద్ధుఁడగు నీశ్వరు నొప్పుకొనుటయే యోగ్యము చూడుఁడు! వర్తమానసమయమున జీవుఁడు పాపపుణ్యములనొనరించుచు, సుఖదుఃఖముల ననుభవించునట్లు ఈశ్వరుఁ డెన్నఁడును కాఁడు. ఈశ్వరుఁడు క్రియావంతుఁడుకాకుండిన నీ జగత్తునెట్లు చేయఁగలిగియుండును? కర్మములను, ప్రాగభావమువలె, అనాది, సాంతములని యంగీకరింతురేని కర్మ సమవాయ

సంబంధము కలిగియుండకుండును. సమవాయ సంబంధముతో నుండనిది సంయోగజమయి యనిత్యమగుచున్నది. ముక్తియందు క్రియయే యంగీకరింపఁ బడదేని యా ముక్త జీవులు జ్ఞానవంతులా? కారా? జ్ఞానవంతులని నంతః క్రియావంతులైరి. ఏమి? ముక్తియందు పాషాణమువలె జడములై పోదురా? ఒకచోట పడియుండి యేమియు క్రియలొనర్ప రేని. ముక్తిఏమయ్యెను? అంధకారము నందును, బంధమునందును బడిరనుట.

నాస్తికుడు:- ఈశ్వరుఁడు వ్యాపకుఁడు కాఁడు. వ్యాపకుఁడేయైన వస్తువులన్నియు చేతనము లేల గావు? బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యశూద్రాదులలో ఉత్తమ, మధ్యమ నికృష్టములను వ్యవస్థ లెందులకుఁగలిగినవి? ఏలయన నందఱియందు నీశ్వరుఁడు ఒకటిగా వ్యాప్తుడై యున్న గొప్పతనము, చిన్నతనము ననునవి యుండఁదగదు.

ఆస్తికుఁడు:- వ్యాప్యవ్యాపకము లొక్కటి కావు కాని వ్యాప్యమేకదేశీయమును, వ్యాపకము సర్వదేశీయము నగుచున్నది. ఎట్లన ఆకాశము అన్నిటియందు వ్యాపకము. భూగోళము, ఘటపటాదులన్నియు వ్యాప్యములు-ఏకదేశీయములు. పృథివియు, ఆకాశము నొక్కటి కానట్లు, ఈశ్వరుఁడును జగత్తు నొక్కటి కావు. ఘటపటాదులం దంతట ఆకాశము వ్యాపకమయియున్నను, ఘటపటాదులు ఆకాశము కానట్టులే చేతనుడైన పరమేశ్వరుఁ డన్నిటియం దున్ననునవి యన్నియు చేతనములు కావు. విద్వాంసులు, అవిద్వాంసులును, ధర్మాత్ములు, అధర్మాత్ములును సమానులు గారు. విద్యాది సద్గుణములును, సత్యభాషణాది కర్మములును, సుశీలతాది స్వభావములును న్యూనాధికము లగుటవలన బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, అంత్యజులు, పెద్దలు, చిన్నలు అని యనఁబడుచున్నారు. వర్ణవ్యవస్థ చతుర్థ సముల్లాసమున వ్రాయబడినది. అక్కడ చూచుకొనుఁడు.

నాస్తికుఁడు:- ఈశ్వర రచనవల్ల సృష్టి యేర్పడియున్న మాతాపిత్రాదుల ప్రయోజనమేమి?

ఆస్తికుడు:- ఈశ్వరుఁడు ఈశ్వరీయ సృష్టికి కర్తయయియున్నాఁడు. జీవసృష్టికి కాఁడు. జీవుల కర్తవ్యకర్మముల నీశ్వరుఁడొనరింపఁడు. జీవుఁడే యొనరించుచున్నాఁడు. ఎట్లన ఈశ్వరుఁడు వృక్షములను, ఫలములను, ఓష

దులను, అన్నాదులను బుట్టించియున్నాఁడు. వానిఁగైకొని మనుజులు విసరక, దంచక రొట్టెలు మున్నగునవి చేయక, తినకయున్న నీశ్వరుఁడు వారికి బదులుగా నీకార్యముల నెన్నఁడైనఁ జేయునా? చేయఁడేని జీవుల జీవనముకూడ జరుగనేరకుండును. కావున నాదిసృష్టియందు జీవుల శరీరములను, ఆకృతులను జేయుట ఈశ్వరాధీనము, పిమ్మట వానినుండి పుత్రాదుల నుత్పన్నముఁ జేయుట జీవుల కర్తవ్యకర్మమైయున్నది.

నాస్తికుఁడు:-పరమాత్ముఁడు, శాశ్వతుఁడు, అనాది, చిదానందుఁడు, జ్ఞానస్వరూపుఁడునై యున్నప్పుడు జగజ్జాలమునందు, దుఃఖమునందు నెందులకుఁ బడెను? ఆనందమును వదలి దుఃఖమును బొందునట్టి కార్యము నొక సాధారణ మనుష్యుఁడుకూడఁ జేయునపు డీశ్వరు డెందులకుఁ జేసెను?

ఆస్తికుఁడు:- పరమాత్ముఁడు గంధరగోళమునందు, దుఃఖమునందు బడఁడు. తన యానందమును విడువఁడు. ఏలయన నేకదేశీయుఁడగువాఁడు గంధరగోళమునందు, దుఃఖమునందుఁ బడగలఁడు. సర్వదేశీయుఁడు బడఁడు. అనాది, చిదానందుఁడు, జ్ఞానస్వరూపుఁడునగు పరమాత్మ జగత్తును జేయకున్న నన్యుఁడెవఁడు చేయఁగలుగును? జగత్తును జేయు సామర్థ్యము జీవునియందు లేదు. జడమునందు స్వయముగా నేర్పడు సామర్థ్యమును లేదు. ఇందువలన పరమాత్ముఁడే జగత్తును జేయుచు సదా యానందమున వసించుచున్నాఁడనుట సిద్ధము. పరమాత్ముఁడు పరమాణువులచే సృష్టిని నిర్మించుచున్న యటులే తల్లి దండ్రులనఁబడు నిమిత్త కారణముచేత నరదే యుత్పత్తియేర్పాటులను నియమములను స్థిరపఱచి యున్నాఁడు.

నాస్తికుఁడు:- ఈశ్వరుఁడు ముక్తిరూప సుఖమును విడనాడి సృష్టిని రచించుట, ధరించుట, ప్రళయమొనర్చుట యను నీ జంజాటమునందేల పడెను?

ఆస్తికుఁడు:- ఈశ్వరుఁడు సదాముక్తుఁడు. మీ తీర్థంకరులు సాధనములచే సిద్ధిని బొంది బంధపూర్వకమైన ముక్తిచే యుక్తులై ఏకదేశము నందుండున ట్లా సనాతనుఁడైన పరమాత్ముఁడు కాఁడుగదా! అనంత స్వరూప గుణకర్మ స్వభావయుక్తుఁడగు పరమాత్ముఁడే యీ కించిన్మాత్ర మాయను జగత్తును రచించుచు, ధరించుచు, ప్రళయము గావించుచు నుండియు బంధనమందుఁ బడఁడు. ఏలయన బంధమోక్షములు సాపేక్షములు. ఎట్లన ముక్తి

పేక్షఁజేసి బంధనమును, బంధాపేక్ష జేసి ముక్తియుఁ గలుగుచుండును. ఎన్నఁడును బద్ధుడుగా నుండనివాఁడు ముక్తుఁడని యెట్లు చెప్పఁబడఁగలఁడు. ఏక దేశీయులైన జీవులే సదా బద్ధులును, ముక్తులు నగుచుందురు. అనంతుఁడు, సర్వదేశీయుఁడు, సర్వవ్యాపకుఁడు నగు ఈశ్వరుడు మీతీర్థంకరులవలె బంధనమునఁగాని, నైమిత్తిక ముక్తి చక్రమునఁగాని యెన్నడును బడఁడు. కాన నా పరమాత్మ సంతతము ముక్తుఁడని బడుచున్నాఁడు.

నాస్తికుఁడు:- భంగుత్రాగి తమంతటఁ దామే మత్తులెందుచున్న యట్లే జీవులు కర్మ ఫలము ననుభవింపఁ గలుగుదురు. ఇందీశ్వరుని పని లేదు.

ఆస్తికుఁడు:- రాజు లేకున్న దొంగలు, దోపిడికాండ్రు, లంపటులు మున్నగు దుష్టులైన మనుష్యులు స్వయముగ ఉరిబోసికొని ; కారాగృహమునకును బోరు; పోఁగోరరు; కాని రాజ్యసంబంధమగు న్యాయ వ్యవస్థానుసారము బలవంతముగాఁ బట్టుపడి యథోచితముగ రాజుచే దండింపబడునటులే పరమేశ్వరుఁడు తన న్యాయవ్యవస్థచే, జీవులకును వారి కర్మానుసారముగ యథాయోగ్యమైన దండన విధించు చున్నాఁడు. ఎందులకన నే జీవుఁడయినను తన దుష్కర్మఫలము ననుభవింపఁగోరఁడు కాన నవశ్యముగ పరమాత్మ న్యాయాధీశుఁడు గానుండవలసినదే.

నాస్తికుఁడు:- జగత్తునం దున్నది ఒక్కఁడీశ్వరుడుకాదు. కాని, ముక్తినొందిన జీవులందఱు నీశ్వరులే.

ఆస్తికుఁడు:- నీమాట సర్వథా వ్యర్థము. ఎందులకన మొదట బద్ధులుగా నుండి ముక్తినొందినప్పుడు , మరల బంధనమునం దవశ్యము పడుదురు. ఏలయన వారుస్వాభావికముగ నిత్యముక్తులుగారు. ఎట్లన మీయిఱువది నలుగురు తీర్థంకరులును మొదట బద్ధులుగానుండి పిదప ముక్తులయిరి. మరల తప్పక బంధనమందుఁ బడుదురనుట స్పష్టము. ఈశ్వరులనేకులు కలరేని, జీవులనేకు లయియున్నందున పోట్లాడుచు, నెదురాడుచుఁ దిరుగుచు నున్నటులే యీశ్వరులును పోట్లాడుచు నెదురాడుచు నుండఁగలరు.

నాస్తికుఁడు:-ఓమూఢుఁడా! జగత్కర్త యెవ్వడును లేఁడు. ఈ జగత్తు స్వయముగా సిద్ధమైయున్నయది.

ఆస్తికుఁడు:- ఇది జైనులదెంత గొప్పపొరపాటని చెప్పవలెను. ఏమి? కర్తలేక యొక కర్మముకాని, కర్మములేక యొక కార్యము గాని, జగత్తునఁ గలుగుచున్నట్లు గోచరమగునా? లేవా? కర్త. గోధుమ పొలమునందు స్వయముగాఁ బిండి విసరఁబడి, రొట్టెలు సిద్ధమై జైనులకడుపులోఁ బడుచున్నటులే యున్నదిగదా? దూది, నూలు, వస్త్రము, అంగరఖా, దుప్పటి, దోవతి, పాగ మొదలైనవి యెన్నడైన సిద్ధమై వచ్చునా? అట్లుకాదేని, ఈశ్వరుఁడు కర్తగా లేకున్న నీ వివిధజగత్తునందలి నానావిధ రచనావిశేషము లెట్లు కలుగ నగును? జగత్తు స్వయముగానే సిద్ధమైనదని మొండితనముగ నమ్ముదురేని, ఉపర్యుక్త వస్త్రాదులు కర్తలేక, స్వయముగ సిద్ధమగునట్లు ప్రత్యక్షముగా చేసి చూపుఁడు: ఇట్లు నిరూపింపలేరేని, ఇఁక మీ ప్రమాణశూన్యమగు వాక్యము లను బుద్ధిమంతుఁడెవఁ డంగీకరింపఁగలఁడు?

నాస్తికుఁడు:—ఈశ్వరుఁడు విరక్తుఁడా? మోహితుఁడా? విరక్తుఁడయిన, జగజ్జాలము నందేల పడెను? మోహితుఁడయిన, జగత్తును నిర్మించుటకు సమర్థుఁడు కానేరకుండును.

ఆస్తికుఁడు:-పరమేశ్వరునియందు వైరాగ్యముకాని, మోహము కాని యెన్నటికిని ఘటిల్లనేరవు. ఏలయన సర్వవ్యాపకుఁడయినవాఁడు దేనిని విడుచును; మఱిదేనిని గ్రహించును. ఈశ్వరునికంటె నుత్తమమైనది గాని, అతని కప్రాప్తమైనదిగాని యేపదార్థమునులేదు. కాన నొకదానియందు మోహమును గలుగదు. మోహవైరాగ్యములు జీవుని యందు సంఘటిల్లుచున్నవి. ఈశ్వరు నియందు సఘటిల్లవు.

నాస్తికుఁడు:-ఈశ్వరుని జగత్కర్తయనియు, జీవులకు కర్మఫలము లొసంగువాఁడనియు నమ్ముదురేని యీశ్వరుఁడు చిక్కులఁబడి, దుఃఖితుఁడగును.

ఆస్తికుఁడు:- ఓరీ! అనేకవిధములయిన కర్మముల నొనర్చువాఁడు, ప్రాణులకు ఫలముల నొసంగువాఁడు, ధర్మాత్ముఁడు న్యాయాధీశుఁడునగు విద్వాంసుఁడే కర్మములందు లిప్తుఁడయి చిక్కులఁ బడకున్న అనంతసామర్థ్యముగల పరమేశ్వరుఁడు చిక్కులఁబడి దుఃఖితుఁడెట్లు కాఁగలఁడు? సరి: మీరజ్ఞానము చేత పరమేశ్వరునికూడ మీవలెనో లేదా మీతీర్థంకరులవలెనో భావించుచున్నా

రుగా! ఇది మీ యవిద్యాలీలయే. అవిద్యాదోషమునుండి విడఁగోరుదురేని, వేదాది సత్యశాస్త్రముల నాశ్రయింపుఁడు. భ్రమలోఁబడి యెందులకు లభ్భిడ్ద్రు లగుచున్నారు?

ఇఁక జైనులు జగత్తును నమ్ముచున్నరీతిని,వారిసూత్రములఁబట్టి కనఁబఱచుచున్నాము. సంక్షేపముగా మూలమున కర్థముచేసి పిదప సత్యాసత్యముల సమీక్ష వ్రాసి తెలుపుదుము.

మూలము—సామి అణాఇ అణన్తే చఉగఇ సంసార ఘోరకాన్తారే।
మోహాఇ కమ్మగురుఠిఇ। వివాగ వసఉ భమఇ జీవో॥

ప్రకరణరత్నాకరము ౨వ భాగము, షష్టిశతకము ౬౦. సూత్రము ౭౨॥

ఈ ప్రకరణ రత్నాకరమను పేరుగల గ్రంథమందలి సమ్యక్త్వ ప్రకాశమను ప్రకరణమందు గౌతమ మహావీరుల సంవాదము కలదు.

సంక్షేపముగ నందలి యుపయోగకరమైన యర్థమేమన, ఈప్రపంచము అనాదియు ననంతమునుకాదు. దీని కెన్నడు నుత్పత్తికలుగలేదు. ఇది యెన్నడు వినాశమును బొందదు. అనఁగా నొకనిచే నీజగత్తు చేయఁబడలేదు. అనునదియే ఆస్తికనాస్తిక సంవాదరూపకముగ "ఓ మూర్ఖుఁడా! జగత్కర్త యెవ్వఁడును లేఁడు; అదియెన్నఁడును నిర్మింపఁబడలేదు. ఎన్నఁడును నశింపదు." అని కలదు.

సమీక్షకుడు:-సంయోగముచేత నుత్పన్నమగునది అనాదియు ననంతము నెన్నఁటికిని గాఁజాలదు. ఉత్పత్తివినాశములులేని కర్మముండదు. జగత్తునం దుత్పన్నములగు పదార్థములన్నియు సంయోగజములు. అవి ఉత్పత్తి వినాశములఁ బొందునవిగా గోచరమగుచున్నవి. అట్లైన జగత్తుత్పత్తి వినాశములఁ బొందునదేలఁ గాకుండును? కావున మీ తీర్థంకరులకుఁ దగిన జ్ఞానమునుండకుండెను. వారికి సమ్యక్ జ్ఞానమున్న నిట్టి యసంభవములగు విషయములనెందులకు వ్రాసియుందురు? శిష్యులగు మీరును మీగురువులవలెనే యున్నారు.మీ మాటలు వినువానికి పదార్థజ్ఞానమెన్నఁటికిని కలుగనేరదు చూఁడుడు: ప్రత్యక్షముగాఁ బదార్థము సంయోగజమై యున్నట్లు గోచరమగుచుండఁగా దాని నుత్పత్తి వినాశములు కలుగునని యంగీకరింపరెందులకు?అనఁగా వీరి యాచార్యులకుఁగాని, జైనులకుఁగాని, భూగోళ ఖగోళ విద్యకూడ తెలి

యకుండెను. వీరియం దిప్పుడుకూడ నట్టి విద్యలేదు. ఒండియేయున్న నీ క్రింద వ్రాయఁబడినట్టి యనంతవర్తం నేల యంగీకరింతురు?ఏల చెప్పకొందురు?

చూడుఁడు! ఈ సృష్టియందు పృథివీకాయము అనఁగా పృథివి కూడ జీవునికి శరీరమఁట. అట్లే జలకాయాది జీవులను గూడ నమ్ముచున్నారు. దీని నెవ్వఁడు నంగీకరింపనేరఁడు. ఇంకను వీరి మిథ్యావర్తలను గమనింపుఁడు. ఏతీర్థంకరులను జైనులు సమ్యక్ జ్ఞానులనియుఁ పరమేశ్వరులనియు నమ్ముచున్నారో వారి మిథ్యావచనముల కివి సాదృశ్యములు. "రత్నసారభాగము" ప్రథమభాగము ఈ గ్రంథమును జైనులంగీకరించుచున్నారు. ఇది ౨౮ ఏప్రియల్ ౧౮౭౯ వ క్రీ.శకమునందు కాశీపురినుండు జైనప్రభాకరప్రెస్సులో నానక చంద్ జతీగారివల్ల నచ్చువేయింపఁబడి ప్రచురింపఁబడినది) అందలి ౧౪౫ వ పుటలో సమయమునకు సూక్ష్మకాలమనియు, అసంఖ్యాత సమయములకు "ఆవలి" యనియుఁ బేర్కొని యున్నారు. ఒకకోటి యఱువదియేడు లక్షల డెబ్బదియేడు వేల రెండువందల పదియాఱు ఆవలులకొక ముహూర్తమఁట. అట్టి ముప్పది ముహూర్తములకొక "దివసము" అట్టి పదియైదు దివసములకొక "పక్షము" అట్టి రెండుపక్షములకొక "మాసము". అట్టి పండ్రెండు మాసములకొక "సంవత్సర"మగునట. ఇఁక నట్టి డెబ్బదిలక్షల (కోట్ల)యేబదియాఱువేల కోట్ల సంవత్సరముల కొక పూర్వమనియు, అట్టి యసంఖ్యాత పూర్వముల కొక పల్యోపమ కాలమనియు నందురు. అసంఖ్యాత కాలమనఁగా నాలుగు క్రోసుల పొడవును వెడల్పును లోతునుగల యొక చదరపు బావిని త్రవ్వి దానిని "జుగలియే" అనఁగా సూక్ష్మ రోమములుగల మనుష్యుని శరీరములోని వెండ్రుకలను నాని ముక్కలు ముక్కలుగాఁ జేసి యీ క్రింద వ్రాయఁబడునట్లు నింపవలెనఁట. ఇఁట గమనింపవలసినదే మనఁగా వర్తమానకాలపు మనుష్యుని వెండ్రుకలకంటె "జుగలియే" మనుష్యుని వెండ్రుకలు నాలుగువేల తొంబదియాఱు రెట్లు సూక్ష్మమై యుండునఁట. అనఁగా నామనుష్యుని నాలుగువేల తొంబదియాఱు వెండ్రుకలనొకచోటఁజేర్చిన నిప్పటి మనుష్యులదొకవెండ్రుకయగును. ఇట్టి జుగలియే మనుష్యుని యొక్కొక్క వెండ్రుకలోనియొక్కొక్క యంగుళభాగమున నేమపాళ్లనినిదేసిముక్కలుచేసిన ౨౦౮౭౧౫౨ పదిలక్షలతొంబదియేడు వేల యొకపంద యేబది రెండు ముక్కలగును. ఇట్టి ముక్కలనుండి పూర్వోక్త

మగు బావిని నింపవలెనఁట. అందులో నుండి శతవర్షములకొక పర్యాయ మొక్కొక్క వెంట్రుకను దీయుచుఁ బోవలెను. ఇట్లు ముక్కలు తీయగా బావి వట్టిదై పోయినప్పటికి నది సంఖ్యాతకాలమే యగునఁట. అందలి యొక్కొక్క ముక్కలో నసంఖ్యాతములైన ముక్కలుచేసి యాముక్కలనుండి యా బావిని "చక్రవర్తి రాజుగారి సైన్యము దానిమీఁదినుండి నడిచిపోయిన నణఁగకుండ" నొత్తి నింపవలెనట. ఇఁక దానిలోనుండి నూరు సంవత్సరముల యంతరమును బట్టి అనఁగా నూఱేండ్ల కొకసారి యొక్కొక్క ముక్కను దీయుచుఁ బోఁగా నాబావి వట్టిదగుటకు ఎంతకాలము పట్టునో యది యసంఖ్యాతము. ఇట్టి యసంఖ్యాత పూర్వములు గడచిపోవలెను. అప్పుడొక పల్యోపమకాల మగును. ఆ పల్యోపమకాలము నీ బావి దృష్టాంతమును బట్టి యెఱుఁగవలెనఁట. ఇఁక దశ కోటి కోట్ల పల్యోపమ కాలములు గడిచిపోయినప్పుడొక సాగరోపమ కాలమును. దశకోటి కోట్ల సాగరోపమకాలములు గడచిపోయిన నొక ఉత్సర్పిణీకాలమును, ఒక ఉత్సర్పిణీయు అవసర్పిణీకాలమును గడిచిపోయిన నొక కాలచక్రమును. ఇట్టి యనంతకాల చక్రములు గడచిపోయిన నొక పుద్గలపరావర్తము సగునఁట ఇఁక ననంతకాలము మేమన సిద్ధాంత పుస్తకములందు తొమ్మిది దృష్టాంతములచే నేకాలసంఖ్యను నియమించి యున్నారో దాని కుపరాంతమైనదే అనంతకాలమఁట. అట్టి అనంతపుద్గల పరావర్తకాలములు జీవునికి సంచరించుచు గడచినవి' అను విశ్వాదులు వ్రాయఁబడియున్నవి. గణిత విద్య నెఱుఁగు సోదరులారా: గమనింపుఁడు. జైనులపుస్తకములందలి కాల సంఖ్యను లెక్కింపఁగలుగుదురా. లేదా: అట్లే మీరు దీనిని సత్యమనియు నమ్మగలుగుదురా, లేదా, చూడుఁడు: ఈతీర్థంకరు లిట్టి గణితవిద్య నెఱిఁగి యుండిరి వీరిమతమున నిట్టిగురుశిష్యులు గలరేని. వారి యవిద్య కంతమే లేదన నొప్పునుగద:

ఇంకను వీరివిపరీతములనుగమనింపుఁడు. రత్నసారభాగము [౧] ౧౩౪వ పుట మొదలుకొని 'బూటావాలే' అను జైనుల సిద్ధాంతగ్రంథము లేనిదలవో. అవియన్నియు వారి ఋషభదేవుఁడు మొదలుకొని మహావీరుని పర్యంతమై యున్న" ౨౪తీర్థంకరుల వచనముల సారసంగ్రహ మనఁబడును. అందలి రత్నసారభాగము [౧] ౧౪౮వ పుటలో "పృథివీకాయ మందలి జీవులు, మన్ను

పాషాణాది పృథివీ భేదముల నెఱుఁగవలెనని" వ్రాయఁబడియున్నది. వాని యందుండు జీవముల శరీరపరిమాణ మొక యంగుళములో నసంఖ్యాతభాగ మని యెఱుఁగ వలెను. అనఁగా నత్యంత సూక్ష్మములగు ననుట. వాని ఆయువు మానము అనఁగా ఎక్కువలో నెక్కువ ఇరువది రెండు వేల సంవత్సరముల పర్యంతము బ్రతుకునఁట.

రత్న-౧౪౯ వ పుటలో ఒక్కొక్క వనస్పతి శరీరమునందు అనంతములయిన జీవము లుండుననియు అవియును సాధారణమైన వనస్పతులనఁ బడుననియు. కందమూల ప్రముఖములు, అనంతకాయ ప్రముఖములనగు వానిని సాధారణ వనస్పతీ జీవము లనఁదగుననియుఁ"గలదు. ఇఁక వాని ఆయువుమానము అనంత ముహూర్తముకలదు. అనఁగా నిటవారి పూర్వోక్త ముహూర్తమని తెలియనగును. స్పర్శేంద్రియమను నొక యింద్రియమే వీని శరీరములందుఁ గలదు. అందొక జీవమేయుండును కాన నది ప్రత్యేకమైన వనస్పతి యనఁబడును. దాని దేహపరిమాణ మొక సహస్ర యోజనములు. అనఁగా పౌరాణికులయోజనము ౪ క్రోసుల దగునుగాని జైనులయోజనము పదివేల క్రోసుల గలదగును. అట్టినాల్గువేల క్రోసుల శరీరము కలదగుననుట. ఇఁక దాని ఆయుఃపరిమాణము అధికాధికము పదివేల సంవత్సరములు.

ఇఁక రెండింద్రియములుగల జీవములు అనఁగా శరీరము, ముఖము, గల్గియుండు శంఖము, గవ్వ, పేను మొదలగునవి. వీని దేహపరిమాణము అధికాధికము నలువదియెనిమిది క్రోసుల స్థూలశరీరము గలది. వీని ఆయుః పరిమాణము అధికాధికము పన్నెండు సంవత్సరములు. ఇక్కడ మిక్కిలి తప్పుచేసినారు. ఎందులకన నింతగొప్ప శరీరముగల జీవములకు ఆయువెక్కువ వ్రాయవలసియుండెను. నలుబదియెనిమిది క్రోసుల స్థూలపరిమాణముగల పేలు జైనుల శరీరములందు పడుచుండవచ్చును. వారే చూచియుందురు. ఇంత పెద్ద పేనులను చూచెడు భాగ్య మితరులకబ్బునా!

రత్నసారభాగ॥౧॥౧౩౦ వ పుటలో ఇంకను విపరీతము గమనింపుఁడు. "తేలు, దోమ, ఈగ, జోరీగ, ఒక యోజనపు శరీరములు గలవగుననియు, వాని ఆయువు ఎక్కువలో ఎక్కువ ఆరుమాసములనియు" వ్రాయఁబడియున్నది. నాలుగుక్రోసుల తేలును అన్యు(లెవ్వ)రునుచూచి యెఱుఁగరు. ఎవి

మిదిమైళ్ళ విస్తారపు శరీరములుగల తేళ్ళు. ఈగలు జైనుల మతములో నుం
డును. అట్టి తేళ్లను ఈఁగలును వారి యిండ్లయందే వసించుచుండవచ్చును.
వారే చూచియుందురు. అన్యులెవరును ప్రపంచమునఁజూచియుండరు. ఇట్టి
తేళ్ళు ఎన్నఁడయిన నొక జైనుని కుట్టిన వానిగతి యేమైయుండును! జలచర
ములగు మత్స్యాదుల శరీరపరిమాణ మొక సహస్రయోజనములఁట. ౧౦౦౦౦
క్రోసులకొక యోజనమను వారిలెక్క చొప్పున ౧౦౦౦౦౦౦౦ ఒకకోటి
క్రోసుల విస్తారపు శరీరములు గలవగును. మఱి వాని ఆయుఃపరిమాణ మొక
కోటి పూర్వముల సంవత్సరములఁట. ఇంతటి స్థూల జలచరముల నీ జైనులు
తప్ప మఱెవ్వరును చూచియుండరు. అట్లే యేనుగు మున్నగు చతుష్పాద
జంతువులనునవి రెండుక్రోసుల మొదలుకొని తొమ్మిదిక్రోసుల విస్తారపు శరీ
రములు గలవగునఁట. ఇఁక వాని యాయువు ఎనుబదినాలుగు వేల సంవత్స
రములఁట. ఇఁక నిట్టివెన్నియో కలవు. ఇంతటి గొప్ప శరీరములు, ఆయువు
గల జీవములను జైనులే చూచియుందురు. కాబట్టి వారేబొసనుచున్నారు. బుద్ధి
మంతుఁడెవ్వఁడు నంగీకరింపనేరఁడు. రత్నసారభాగము॥౧॥౧౨౧వపుట-జల
చరములనుగర్భజములగుజీవములదేహపరిమాణ ముత్కృష్టముగనొకసహస్ర
యోజనములు అనఁగా నొకకోటి క్రోసులఁట. వాని ఆయువు ఒక కోటిపూర్వ
ముల సంవత్సరములఁట ఇంత గొప్ప శరీరములును, ఆయువును గల జీవు
లనుగూడ వీరి యాచార్యులు స్వప్నమందే చూచియుండవచ్చును ఎన్నఁటికిని
సంభవము కానేరని యీ వార్తలు నితాంత మసత్యములని యెఱుఁగఁదగును.

ఇఁక భూమిపరిమాణమును వినుఁడు. రత్నసారభాగము॥౧॥౧౫౨వ
పుట-ఈ వంకరగానున్న ప్రపంచమునం దసంఖ్యాతములయిన ద్వీపములును.
అసంఖ్యాతములయిన సముద్రములును కలవు. ఈ యసంఖ్యాతముల ప్రమాణ
మెంతయనిన "రెండున్నఱ సాగరోపమకాలమందెంత సమయము-ఎన్నిదిన
ములు-పట్టునో అన్ని ద్వీపములును సముద్రములును గలవని యెఱుఁగవలెను.
ఇఁక నీ పృథివియందు మొదట జంబూ ద్వీపమనునది అన్నిద్వీపముల మధ్య
నున్నది. దాని పరిమాణ మొక లక్షయోజనములు-ఒక యర్బుదము క్రోసులు.
దీనికి నలువైపుల లవణ సముద్రము కలదు. దాని పరిమాణము రెండు లక్షల
యోజనముల క్రోసులు,— రెండు అర్బుదముల క్రోసులు. ఈ జంబూద్వీప

మునకు నలువైపుల ధాతకీఖండ మను ద్వీపముకలదు. దాని పరిమాణమునాల్గు లక్షల యోజనములు—నాల్గు అర్బుదముల క్రోసులు. దాని వెనుక "కాలోదధి" సముద్రము కలదు. దానిపరిమాణము ఎనిమిది లక్షలయోజనములు—ఎనిమిది అర్బుదముల క్రోసులు-దానికిఁ బిమ్మట 'పుష్కరావర్త' ద్వీపము కలదు. దానిపరిమాణము పదియాఱుక్రోసులు గలదు.

ఆ ద్వీపమునకు లోభాగములు కలవు తద్ద్వీపమందలి యర్థభాగమున మనుష్యులు వసింతురు. దానికి తరువాత అసంఖ్యాకములయిన ద్వీపములును సముద్రములును కలవు. వానియందు తిర్యగ్యోని సంభూత జీవులు కలరు. రత్న—భా. ॥౧॥ ౧౫౩ వ పుటమున—జంబూద్వీపమునందు హిమవంత, ఐరణ్యవంత, హరివర్ష, రమ్యక, దేవకురు, ఉత్తరకురు అను నీ యాఱు క్షేత్రములు గలవు.

సమీక్షకుఁడు:— భూగోళవిద్యఁ నెఱుఁగు సోదరులారా! వినుఁడు! భూగోళపరిమాణము లెక్కించుటకు మీరు మఱచితిరా? లేక జైనులా, జైనులు మఱచిపోయిన మీరు వారికిఁ దెలుపుఁడు? మీరే మఱచియున్న వారినుండి తెలిసికొనుఁడు. కొంచెము విచారించిచూచిన జైనుల యాచార్యులను వారి శిష్యులును భూగోళఖగోళ విద్యలను, గణితవిద్యను, ఎంతమాత్ర మెఱుఁగ కుండిరని నిశ్చయమగుచున్నది. ఎఱిగియేయున్న నింతటి గొప్పయసంభవ మయిన దంభాలాపముల నేల వచించియుందురు? సరి! ఇఁక నిట్టి విద్యా విహీనులగు పురుషులు జగత్తును అకర్తృకమనియు, నీశ్వరుఁడు లేఁడనియు నన్న నందాశ్చర్యమేమి? కావున జైనులు తమ పుస్తకములను అన్యమతస్థుల విద్వాంసులకు నీయరు. ఏలయన వీరికి ప్రామాణికము లనఁబడు-తీర్థంకరు లచే రచింపఁబడిన-సిద్ధాంత గ్రంథములందే ఇవ్విధమైన అవిద్యాయుక్త వార్తలు నిండియున్నవి. కాన నెవరిని చూడనీయరు. చూడనిత్తురేని వారి రహస్యము బయల్పడును. వీరు దప్ప కొంచెము బుద్ధిగల ఏ మనుష్యుఁ డయిన నిట్టి గప్పాలను సత్యమని యంగీకరింపకుండును. జైనులు జగత్తును అనాదియని నిరూపించుటకే ఈ ప్రయత్నముల నన్నిటిని చేసియున్నారు. కాని ఇది పూర్ణముగ నసత్యము. ఐన జగత్కారణము మాత్రము అనాది. ఏల యన నది పరమాణువులు మున్నగు తత్వస్వరూపము కలదై అకర్తృకముగా

నున్న యది. కాని వానియందు నియమపూర్వకముగ సంయోగ వియోగములఁ బొందు సామర్థ్య మేమియులేదు. ఏమన పరమాణువు ద్రవ్యమని యొకదానికి నామము. ఇఁక నా పరమాణువులు స్వభావముగ వేర్వేరు రూపములు కలిగి జడములయియున్నపుడు అవి తమంతట దాము యథాయోగ్యముగా సంయోగముఁ బొందనేరవు. కాన వీని సంయోగపఱచువాఁడు చైతన్యుడు తప్పక యున్నాఁడు. మఱి యతఁడు జ్ఞానస్వరూపుఁడు చూడుఁడు! పృథివిని, సూర్యాది సమస్తలోకములను నియమమందుంచుట, అనంతుడును, అనాదియు, చేతనుఁడు నగు నా పరమాత్ముని పనియే. దేనియందు సంయోగరచనా విశేషము గోచరమగుచున్నదో యట్టి స్థూలజగత్తుఎప్పటికిని అనాది కానేరదు. కార్యజగత్తును నిత్యమందురేని, దానికిఁ గారణమేదియు నుండకపోవును. అదియే కార్యకారణరూపమగునందురేని, తమకుఁదామే కార్యము, గారణమునగుటఁ జేసి అన్యోన్యాశ్రియ దోషమును, ఆత్మాశ్రయ దోషమును సంభవించును. తన భుజముమీఁదఁ దానెక్కుటయు, తనకుఁదానే పుత్రుఁడు తండ్రియు నగుటయు నెట్లసంభవమో యదియు నట్లే యనుట స్పష్టము. కాఁబట్టి జగత్కర్తకలఁడని అవశ్యముగ నంగీకరింపఁ దగును.

ప్రశ్న:— ఈశ్వరుని జగత్కర్తయని యంగీకరింతురేని ఈశ్వరుని జేసినవాఁడెవఁడు?

ఉత్తరము:— కర్తకుఁ గర్తయుఁ, కారణమునకుఁ గారణమునెన్నటికి నుండవు. ఏలయనఁగా మొదటఁ గర్తయుఁ గారణము నుండుటఁజేసి యే కార్యమగుచున్నది. ఎవనియందు సంయోగమును, వియోగమును సంభవింపవో, ఎవఁడు మొదట సంయోగ వియోగములకు కారణుఁడయి యున్నాఁడో యతనికొక కర్తకాని, కారణముకాని యుండ నెట్లును శక్యము గాకుండును. దీని విశేషవ్యాఖ్య ఎనిమిదవ సముల్లాసమునందు సృష్టివిషయమున వ్రాయఁబడియున్నది: చూడఁదగును. ఈ జైనులకు స్థూలవిషయ జ్ఞానముకూడ యథాయోగ్యముగా లేకున్నఁ బరమసూక్ష్మమగు సృష్టి విద్యాజ్ఞాన మెట్లు కలుగ నగును? కావున జైనులు సృష్టిని అనాద్యనంత మనియు, ద్రవ్యపర్యాయములను గూడ ననాద్యనంతములనియు ప్రతిగుణమునకు, ప్రతిదేశమునకు పర్యాయములను, ప్రతిపదార్థమునందు ననంతపర్యాయములను, అంగీకరించు

చున్నారు. ఇట్లు ప్రకరణ రత్నాకరమందలి ప్రథమభాగమున దేవచంద్ర విరచిత నయచక్రసారము, ప్రథమముద్రణము ౧౧౦-౧వ పుటలో వ్రాయఁబడియున్నది. ఈ మాటకూడ నెన్నటికిని సంఘటిల్ల నేరదు. ఏమన నేవస్తువులకంతము-మేర-కలదో తత్సంబంధములగునవన్నియు నంతము గలవే యగును. అనంతమును ఆసంఖ్యాతమని వచింతురేని యదియును సంఘటిల్ల నేరదు. కాని యిది జీవుని విషయమందు ఘటిల్లును. పరమేశ్వరుని విషయమందుఁగాదు. ఏలయన నొక్కొక్క ద్రవ్యమునందు "దాని దాని యొక్కొక్క కార్యకారణ సామర్థ్యమును. విభాగము కానట్టి పర్యాయములనుబట్టి" అనంత సామర్థ్యము నంగీకరించుట కేవల మవిద్యాయుక్తమైనమాటయే. ఒక పరమాణు ద్రవ్యము సీమకలదేని దానియం దనంతవిభాగములను పర్యాయము లెట్లుండఁ గలుగును? ఇటులే యొక్కొక్క ద్రవ్యమున ననంతగుణములను. ఒక గుణప్రదేశమున విభాగము కానట్టి యనంత పర్యాయములను సయిత మనంతములని యంగీకరించుట కేవలము పసితనపు మాటయే. ఏమన దేని యధికరణమున కంతము కలదో దాని యందుండువాని కంతమేల యుండదు. ఇట్టి విస్తారములగు మిథ్యావార్తలెన్నియో వ్రాయఁబడియున్నవి. ఇఁక జీవాజీవములను రెంటిని జైనులీ క్రింద వ్రాయఁబడినట్లు నమ్ముచున్నారు:—

చేతనాలక్షణో జీవః స్యాదజీవ స్తదన్యకః ।
సత్కర్మపుద్గలాః పుణ్యం పాపం తస్య విపర్యయః ॥ న.చ. అర్థ. ౫८ ॥

ఇది జినదత్తసూరి వచనము. ఇటులే ప్రకరణ రత్నాకర ప్రథమ భాగమందలి నయచక్రసారమునందు ౧౫౮వ పుటలో కూడ వ్రాయఁబడియున్నది. ఏమన-చేతనాలక్షణము కలది జీవము; చేతనారహితమైనది అజీవము అనఁగా జడము సత్కర్మరూపపుద్గలము పుణ్యమనియు, పాపకర్మరూప పుద్గలము పాపమనియు ననఁబడును.

సమీక్షకుఁడు:—జీవజడముల లక్షణములు బాగుగనే యున్నవికాని జడరూపపుద్గలములనునవి పాపపుణ్యయుక్తము లెన్నటికిఁ గానేరవు. ఏలయన పాపపుణ్యము లొనరించు స్వభావము చైతన్యమునది. చూడుడు, ఈ జడ పదార్థములెన్నికలవో యవి యన్నియు పాపపుణ్యములనుండి వేఱై యున్నవి. జీవుల ననాదియని నమ్ముటసరియేకాని అల్పజ్ఞుఁడునగు నాజీవుని ముక్తి దశయందు

సర్వజ్ఞులని యంగీకరించుట మాత్రము మిథ్యయే. ఎందులకన పల్పుడును అల్పజ్ఞుడునగు నతని సామర్థ్యము కూడ సర్వదాననీమస్థమైయుండును. జైనులు జగత్తును, జీవులను, జీవుల కర్మములను, బంధములను అనాదియని నమ్ము చున్నారు. జైనుల తీర్థంకరులిప్పుడుగూడ మఱచిపోయియున్నారు. ఏలయన సంయుక్తమైయున్న జగత్తులోని కార్యకారణములు, ప్రవాహరూపమగు కార్యము, జీవునికర్మములు, బంధముల సంయుక్త మనాది కానేరవు. అటులేయని యంగీకరింతురేని మఱికర్మములును బంధములును విడిపోవునని యేల నమ్ము చున్నారు? ఏమన ననాదియైన పదార్థ మెన్నటికిని విడిపోదు. అనాదియైనదియు నశించునందురేని మీరనాదియని నమ్మినట్టి పదార్థములన్నియు నశించున నుమాట స్థిరపడగలదు. అట్లే యనాదిపదార్థములను నిత్యములందురేని, కర్మములు, బంధములు సంయుక్తము నిత్యములే యగును. ఎప్పుడన్నికర్మములు నశించు ప్రసంగము కలుగునో మఱియు, అనాది (పదార్థములను) నిత్యములని యంగీకరింతువో అప్పుడు కర్మములు, బంధములుకూడ నిత్యములనియే తేలును. అన్ని కర్మములు విడిపోవుటచే ముక్తికలుగుననినమ్ముచున్న, నన్ని కర్మముల నుండి విడిపోదురనుట ముక్తికి నిమిత్తమయ్యెను. అట్లయిన ముక్తినైమిత్తిక మనఁబడును. ఇఁక నది యెల్లప్పుడుండునది కాఁజాలదు. కర్మకర్తల సంబంధము నిత్యమగుటవలన కర్మములెన్నటికిని విడిపోకుండును మీరు నిత్యముగా నమ్మినమీముక్తి, మీతీర్థంకరుల ముక్తియు కలుగనేరదు.

ప్రశ్న:-దాన్యపు పొట్టును దీసివేయుటవలనఁగాని, దాన నగ్నిసంయోగ మగుటవలనఁగాని యావిత్తుతిరిగి మొలవనట్లు ముక్తినొందిన జీవుఁడు మరల జన్మమరణరూపమైన సంసారమునకు రాఁడు.

ఉత్తరము:- జీవులయు కర్మలయు సంబంధము పొట్టు విత్తువలెఁ గాదు. కాని వీనికి సమవాయసంబంధము కలదు. కాన ననాది కాలము నుండి జీవుఁడుగలఁడు: అతనియందుఁ గర్మము కలదు: అట్లే కర్తృత్వ శక్తి సంబంధమును గలదు. అతనియందు కర్మమొనర్పు శక్తి కూడ లేదందురేని జీవులందఱు పాషాణసమానులగుదురు. ఇఁక ముక్తి ననుభ వించు సామర్థ్యముకూడ నుండకపోవును. ఎట్లన ననాదికాల సంబంధమగు కర్మబంధనము విడిపోయి జీవుఁడు ముక్తినొందుచున్న, మీ నిత్యముక్తి

నుండియు విడి బంధనమునఁ జిక్కును. ఏలయన కర్మరూపములను ముక్తి సాధనములనుండి సయితము దూరమై జీవుఁడు ముక్తినొందునని నమ్ముచున్నట్లే నిత్యముక్తినుండియు విడిబంధనమునఁ బడును. సాధనములచే సిద్ధమైన పదార్థ మెన్నటికిని నిత్యము కానేరదు. సాధనములచే సిద్ధింపనట్లు ముక్తిని నమ్ముదురేని కర్మము లేకయే బంధమును సంప్రాప్తమగును. వస్త్రములందు మట్టికిచేరినమదుకుటచేదూరమైపోవును తిరిగిమట్టికిఅటులేచేరును. మిథ్యాత్వాది హేతువులఁబట్టి రాగద్వేషాదుల యాశ్రయముచేత జీవునకు కర్మరూపఫలము కలుగును. ఇఁక సమ్యక్ జ్ఞానము, దర్శనము, చరిత్ర అనువీనిచే నిర్మలుఁడగునని యు, మలమంటు కారణములను బట్టి కల్మషుఁడగుననియు నమ్ముచున్నారేని ముక్తజీవులు సంసారులగుదురనియు సంసారమందలి జీవులు ముక్తులగుదురనియు నవశ్యము నంగీకరింపవలసి వచ్చును. ఏమన నిమిత్తముద్వారా మాలిన్యము దూరమగునటులేనిమిత్తములచేత మాలిన్యముకూడ నంటుకొనును. కాన జీవునకు బంధమోక్షములు ప్రవాహరూపమున అనాదులని యొప్పుకొనుఁడు. అవి (స్వరూపముతో) అనాది అనంతములుకావు.

ప్రశ్న:— జీవుడు నిర్మలుఁడుగా నెన్నఁడును లేడు. మలసహితుఁడయి యేయున్నాఁడు.

ఉత్తరము:- నిర్మలుఁడుగా నెన్నడుఁను లేకుండిన నిర్మలుఁడెన్నటికి గానేరకుండును. శుద్ధమైన వస్త్రమునకు తగిలిన మలము నుతికి దూరము చేయ వచ్చునుకాని దాని స్వాభావికమైన శ్వేతవర్ణమును దూరపఱుప శక్యము కాదు. మలము మరల వస్త్రమున నంటుకొనును. ఆ ప్రకారమే ముక్తియందును సంభవించును.

ప్రశ్న:- జీవుడు పూర్వ మార్జించిన కర్మములవలననే శరీరమును ధరించుచున్నాఁడు. ఈశ్వరు సంగీకరించుట వ్యర్థము.

ఉత్తరము:- కర్మములే శరీరధారణమునకు నిమిత్తమై ఈశ్వరుఁడు కారణము గాకున్న, జీవుఁడు దుఃఖ మధికముగల దుర్జన్మమును నెన్నఁడును ధరింపకపోవును. సదా యుత్తమమైన జన్మములనే ధరించుచుండును. కర్మ ప్రతిబంధకమై యుండునని వచించినను చూడుము : దొంగ స్వయముగ కారాగృహమునకుఁ బోఁడు. స్వయముగ నురిబెట్టు కొనఁడు; కాని రాజుశిక్షించుచున్నాఁడు.

అటులే జీవునకు శరీరమును ధరింపజేయు వాఁడును, వానికిఁ గర్మానుసారము ఫలమొసంగువాఁడును పరమేశ్వరుఁడు గలఁడని మీరుగూడ నంగీకరింపుఁడు.

ప్రశ్న:- మత్తువలె కర్మము స్వయముగఁ బ్రాప్తమగుచున్నది. ఫలమొసంగుటకు రెండవవాని యవసరములేదు.

ఉత్తరము:- అటులేని సదా మత్తుపదార్థములు సేవించువానికి మత్తు అంతగాఁ గలుగక అభ్యాసములేని వానికి విశేషముగ కలుగుచున్నట్లు, నిత్య మనేక పాపపుణ్యము లొనరించువారలకు ఫలము తక్కువగును, ఒకానొకప్పుడు కొద్దికొద్దిగా పాపపుణ్యము లొనరించువారల కధికముగను లభింపవలెను. మరియు నల్ప కర్మముల నొనర్చు వారలకు ఫల మధికముగా లభించును.

ప్రశ్న:- ఎవని స్వభావమెట్లున్నదో వాని కటులే ఫలము లభించును.

ఉత్తరము:- స్వభావమువలనఁ గలుగునన్న, స్వభావమునకు వియోగము కానీ, లేక సంయోగముకానీ కలుగనేరదు. కాని, పరిశుభ్రమైన వస్త్రమునకు నిమిత్తములచే మలమంటుకొనునట్లును, అది విడజేయు నిమిత్తముచే వీడి పోవునట్లును అంగీకరించుట సమంజసము.

ప్రశ్న:- సంయోగము లేక, కర్మము పరిణామము నొందదు. ఎట్లన పాలతో పులుపునకు సంయోగము గాకున్నఁ బెరుగు కాదు. ఆ ప్రకారమే జీవ కర్మముల యోగముచేతనే కర్మము పరిణామము నొందును.

ఉత్తరము:- పాలలో పులుసును చేర్చువాఁడు మూఁడవవాఁ డగును. అటులే జీవులను కర్మఫలములతోఁ జేర్చుటకు మూఁడవవాఁ డీశ్వరుఁ డుండవలయును. ఎందులకన జడపదార్థములు తమంతటఁదాము నియమ పూర్వకముగ సంయుక్తములు కానేరవు. జీవులుకూడ నల్పజ్ఞులగుట వలన స్వయముగ దమ కర్మఫలములఁ బొందనేరరు. ఈశ్వరస్థాపిత సృష్టిక్రమము లేనిచో కర్మఫలవ్యవస్థ కలుగజాలదు.

ప్రశ్న:-కర్మమునుండిముక్తుఁడగువాఁడే ఈశ్వరుఁడనఁ బడుచున్నాఁడు.

ఉత్తరము:— అనాదికాలమునుండి జీవులకుఁ గర్మము లంటియున్నవి. కాన వానినుండి జీవులెన్నఁడును ముక్తులు కాఁజాలరు.

ప్రశ్న:— కర్మబంధము సాదియై యున్నది.

ఉత్తరము:— సాదియైన కర్మసంబంధ మనాది కాదు. సంయోగము నకుఁ బూర్వము జీవుఁడు నిష్కర్ముఁడగును. నిష్కర్ముఁడగు వానికి కర్మము తగులుకొనెనేని ముక్తులుఁగూడఁదగులుకొనును. కర్మకుకర్తకు సమవాయసను నిత్యసంబంధ ముండును. అది యెన్నఁడును వేరుగాదు; కానదొమ్మిదవ సము ల్లాసమున మేము వ్రాసియున్నటు లంగీకరింపుచు మేము. జీవుఁడు తన జ్ఞాన సామర్థ్యముల నెంత వృద్ధిఁజేసికొనినను అతనియందు పరిమితజ్ఞానమును, పరిమితసామర్థ్యము నుండును. ఈశ్వర సమానుఁ డెన్నఁడును గానేరఁడు. ఎంత సామర్థ్యము వృద్ధిపొందుట యుచితమో, యంతయే యోగముద్వారా వృద్ధిపొందఁగలదు. మఱి జైను లందలి అర్హతులు, దేహపరిమాణమును బట్టి జీవపరిమాణమును నమ్ముచున్నారు. ఇటులైన హస్తియందలి జీవుఁడు పిపీలికయందును పిపీలికయందలి జీవుఁడు హస్తియందును, ఎట్లు సరిపోఁ గలుగునని వారల నరుగవలయును. ఇదియు నొక మూర్ఖత్వపు మాటయే. ఎందుంతన జీవుఁడన నొక సూక్ష్మపదార్థము ఒక పరమాణువునందు నుండఁ గలదు. కాని యతని శక్తులు శరీరమందలి ప్రాణము, విద్యుత్తునాది మున్నగు వానితో సంయుక్తమైయుండును. వానివల్ల శరీరస్థితి నెఱుఁగుచున్నాఁడు. మంచి సహవాసముచే మంచివాఁడు, చెడు సాంగత్యముచే చెడ్డవాఁడు నగు చున్నాఁడు.

ఇఁక జైనులు ధర్మము నిట్లు నమ్ముచున్నారు.

మూలము.— రే జీవ భవ దుహాఇం ఇక్కం చియ హరఇ జిణమయం ధమ్మం ।
ఇయరాణం షణమంతో సుహ కయ్యే మూఢ ముసి ఓసి ॥
ప్రకరణరత్నాకరము. భా. ౨. షష్ఠిశతకము ౬౧. సూత్రాంకము. ౩॥

ఓరి జీవుఁడా! ఒక జినమతమను శ్రీవీతరాగ భాషిత ధర్మమే సంసార సంబంధముంగు జన్మ, జరా, మరణాది దుఃఖములు హరించును. కావున జైన మతస్థులైన వారినే సుదేవ సుగురువులని యెఱుఁగుము. ఇతర వీతరాగు లను ఋషభదేవుఁడు మొదలుకొని మహావీరుని పర్యంతపు వీతరాగ దేవుం కంటె భిన్నులయిన అన్య హరిహరబ్రహ్మాది కుదేవతలను తమ కల్యా ణార్థము పూజించు జీవులు-మనుజులందఱు-మోసపోయినవారే యనఁదగుము. అనఁగా జైనమతస్థ సుదేవులను, గురువులను, సుధర్మమును సేవింపక అన్య

కుదేవులను, కుగురువులను కుధర్మమును సేవించుటవలన నేమియు లాభము లేదని దీని భావము.

సమీక్షకుడు:— ఇప్పుడు వీరి ధర్మపుస్తకము చెట్టి నిందలతోఁగూడి యున్నవో విద్వాంసులు విచారింతురు గాక.

మూలము—అరిహం దేవో సుగురూ సుద్ధం ధమ్మం చ పంచ నవకారో ।
ధన్నాణకయచ్ఛాణం నిరంతరం వసఇ హియయమ్మి ॥
ప్రక. భా. ౨. షష్ఠీ ౬౧. సూ. ౧ ॥

అరిహన్, దేవేంద్రులచే బూజింపఁబడుటకు యోగ్యుఁడు. అతని కంటె నుత్తమ పదార్థము మరియొకటిలేదు. ఇట్లు దేవతలకు దేవుఁడయి శోభాయమానుఁడగు అరిహంత దేవుఁడు జ్ఞానక్రియావంతుఁడు, శాస్త్రోపదేష్టయు, శుద్ధుఁడు కషాయమలరహితుఁడు, సమ్యక్త్వవినయములు గలవాఁడు దయామూలుఁడునగు నా శ్రీజిన దేవునిచే భాషితధర్మమే దుర్గతిలోఁబడు ప్రాణుల నుద్ధరింపఁజేయును. అన్య హరిహరాదుల ధర్మము సంసారము నుండి యుద్ధరింపఁజేయునదికాదు. పంచ అరిహన్తాదులకు పరమేష్ఠి తత్వం బందులకు నమస్కారము దయ, క్షమ, సమ్యక్త్వజ్ఞానము, దర్శన, చారిత్ర లను నాలుగు పదార్థములు శ్రేష్ఠములు. ఇదియే జైనుల ధర్మము.

సమీక్షకుఁడు:— మనుష్యమాత్రులపైన దయ లేదేని యది దయకాని, క్షమకాని కాదు. జ్ఞానదర్శనములకు మారుగా నజ్ఞానాంధకారమును, చారిత్రకు మాఱుగా నుపవాసముండుటయు మేలయినవిషయమా?

## జైనమతమందలి ధర్మప్రశంస :—

మూలము—జఇ న కుణసి తవ చరణం న పఢసిన గుణేసి దేసి నో దాణమ్ ।
తా ఇత్తియం న సక్కసి జం దేవో ఇక్క అరిహంతో ॥
ప్రకరణ. భా. ౨. షష్ఠీ. ౬౦ సూ. ౨ ॥

ఓ మనుష్యుఁడా! నీవు తపశ్చారిత్రల నలుపఁజాలవేని, సూత్రములను పఠింపలేవేని, ప్రకరణాదులు విచారింపనేరవేని, సుపాత్రాదులకు దానమీయఁజాలవేని; ఆరాధింపఁ బడుటకు యోగ్యుఁడైన అరిహంత దేవుఁడను సుగురువునందును,సుధర్మమును జైనమతమునందును. నీవు శ్రద్ధగలవాఁడవగుదువేని. అదియే సర్వోత్తమమును, నీయుద్ధారమునకుఁ గారణమునునగును

సమీక్షకుఁడు:—దయాక్షమములు మంచివై యున్నను, పక్షపాతమునఁ జిక్కుపడుచే దయ అదయగాను, క్షమ అక్షమగాను మారును. దీని ప్రయోజన మేమన, జీవమాత్రులకు దుఃఖము గలిగింపకుండుట యనునది సర్వథా సంభవముకాదు. ఏలయన దుష్టులను దండించుటఁ గూడ దయగా నెంచఁబడును. ఒక దుష్టుని దండింపకున్న వేలకొలఁది మనుష్యులకు దుఃఖము గలుగును. కాన నట్టి దయ దయకాదు. మఱి క్షమ క్షమకాదు. సర్వప్రాణుల దుఃఖము నశించుటకు, సుఖ మలవడుటకు, నుపాయము జేయుటయే దయ యనఁబడు చున్నది (అది మంచిదే; కాని జలము వడియఁగట్టి త్రాగుట, క్షుద్రజంతువులను గాపాడుట మాత్రమే దయ కాదు. ఇట్టి దయ జైనులమాటలు మాత్రమేయన వలెను. ఎందులకన నట్లు వర్తింపనేరరు. ఏమిః మనుష్య మాత్రులపై "వారే మతమువారే కానిండు"-దయ చూపుచు వారల నన్నపానాదులచే సత్కరించుటయు, అన్యమతస్థులైన విద్వాంసులను గౌరవించుచు వారిసేవ నొనరించుటయు, దయకాదా? వీరియందు నిజమైన దయగలదన్న వివేక సారమందలి (ప్రథమము ద్రణము) ౨౨౧ వ పుటలో (సమ్యక్త్వోత్పత్తి ప్రకరణమున) నేమి వ్రాసియున్నదో జూడుఁడు. (ఒకటి) "పరమతస్థుని స్తుతి" అతని గుణకీర్తన మెన్నఁడును చేయఁగూడదు (రెండవది) వారికి 'నమస్కారము'—వందనము—గూడ చేయవలదు (మూఁడవది) "ఆలాపనము" అన్య మతస్థులతోఁ దక్కువగా మాటలాడవలెను. (నాల్గవది) "సంలపనము" వారితోఁ బలుమార్లు ముచ్చటింపఁదగదు. (ఐదవది) "వారి కన్నవస్త్రాదులదానము" వారికి దినుత్రాగువస్తువులయిన నీయఁగూడదు. (ఆఱవది) "గంధపుష్పాది దానము" అన్యమతప్రతిమా పూజనమునకై గంధపుష్పాదులను నయిన నీయఁగూడదు. ఇట్లీ యాఱు 'యతనాలను' "ఈ యాఱు విధములైన కర్మములను జైనులెన్నఁడును జేయఁగూడదు.

సమీక్షకుఁడు:—ఇప్పుడి జైనుల యన్యమతస్థుల మీఁద నెంత నిర్దయ, కుదృష్టి, ద్వేషము గలిగియున్నారో బుద్ధిమంతులే విచారింపవలయును. అన్యమతస్థులయిన మనుష్యులమీఁద నింత నిర్దయ కలదేని, ఈ జైనులు దయావిహీనులే యనఁబడదగును. ఏలన దమ యింటివారి సేవచేయుట యొకగొప్ప ధర్మముకాదు. తమ మతస్థులు తమ యింటి వారివంటివారు, అందువలననే

వారు వారిసేవ చేయుచున్నారు. అన్యమతస్థుల సేవ చేయరు. ఇఁక వారిని దయావంతులని యే బుద్ధిమంతుఁడనఁగలఁడు; మథురానగర రాజుగారి నముచి నామక మంత్రిని జైనమతస్థులు తమవిరోధియని యెఱిఁగి చంపివేసిరి. పిదప ఆలోయణా (ప్రాయశ్చిత్తము) చేసికొని శుద్ధులైరి. యని "వివేకసారము" ౧౦౮వ పుటలో వ్రాసియున్నది ఏమి; ఇదికూడ దయాక్షమల నశింపఁజేయు కర్మముకాదా? అన్యమతస్థుల మీఁద, ప్రాణము దీయువఱకు వైరబుద్ధి నుంతు రేని, వీరలను దయావంతులనుటకు మారుగా హింసకులనుటయే సార్థకము. ఇఁక సమ్యక్త్వదర్శనాదుల లక్షణములు "అర్హత ప్రవచన సంగ్రహ పర మాగమసార"మందుఁ జెప్పఁబడినవి. సమ్యక్ శ్రద్ధాన, సమ్యక్‌దర్శన, జ్ఞాన, చారిత్రలను నీ నాలుగు మోక్ష మార్గమునకు సాధనములు. వీని వ్యాఖ్య యోగ దేవుఁడు వ్రాసియున్నాఁడు. ఏ రూపముతో జీవాదిద్రవ్యము లవస్థితములై యున్నవో ఆరూపముతోనే జినప్రతిపాదిత గ్రంథానుసారముగ, విపరీతమగు నభినివేశాది రహితమైనట్టి శ్రద్ధ-జినమతము నందుఁగల ప్రీతి—'సమ్యక్ శ్రద్ధాన'మనియు 'సమ్యక్ దర్శన' మనియు ననఁబడును.

రుచిర్జినో క్త తత్వేషు సమ్యక్ శ్రద్ధానముచ్యతే ॥ ప.ద.సం. అర్హత. ద॥

జినోక్త తత్వములందే సమ్యక్ శ్రద్ధనుంచఁదగును. అనఁగా మరి యొందును శ్రద్ధనుంచఁదగదనుట.

యథావస్థితతత్వానాం సంక్షేపాద్విస్తరేణ వా ।
యోఽవబోధస్తమత్రాహుః సమ్యక్ జ్ఞానం మనీషిణః ॥ ప.ద.సం. అర్హత. ద॥

జీవాది తత్వముల యథార్థమైన బోధ, సంక్షేపముగనో లేక విస్తారముగనో కలుగుటను బుద్ధిమంతులు సమ్యక్ జ్ఞానమందురు.

సర్వథాఽవద్యయోగానాం త్యాగశ్చారిత్రముచ్యతే।
కీర్తితం తదహింసాది వ్రతభేదేన పంచధా।
అహింసాసూనృతాస్తేయ బ్రహ్మచర్యాపరిగ్రహాః ॥ ప.ద.సం.అర్హత.ద॥

సర్వథా నిందనీయమైన యన్యమతసంబంధత్యాగమే చారిత్రమనఁబడు చున్నది. అహింసాది భేదమువలన వ్రతమైదువిధములదై యున్నది. ఒకటి: (అహింసా) ప్రాణిమాత్రులఁ జంపకుండుట. రెండవది: (సూనృత) మధుర భాషణముఁజేయుట. మూఁడవది: (అస్తేయ) దొంగిలింపకుండుట. నాల్గవది:

(బ్రహ్మచర్య) ఉపస్థేంద్రియ సంయమము. ఐదువది: (అపరిగ్రహః) అన్ని వస్తువుల త్యజించుట. ఇందు పెక్కు మంచిమాటలు కలవు; అవి యెవ్వి యనఁగా, హింస, స్తేయము మొదలగు నిందితములైన కర్మముల త్యజించుట మంచిదే కాని పరమతముల నిందించుట మొదలు గాఁగల దోషములతోఁ గూడి యందలి యీ మంచిమాటలను దోషయుక్తము లయిపోయినవి. ఏమన నన్య హరిహరాదుల ధర్మము సంసారమును ఉద్ధరింపఁజేయునది కాదని ప్రథమ మాత్రమున వ్రాయఁబడి యున్నది. ఏమి? ఇదియొక చిన్న నిందయా? వారి గ్రంథముల నవలోకించుటవలన విద్యయు, ధర్మమును బూర్థముగఁ బ్రకట మగుచుండఁగా, వానిచెడ్డ వనుటయు, పైఁజెప్పఁబడిన మహా అసంభవములగు మాటల నుఱుపు తమ తీర్థంకరుల స్తోత్రముచేయుటయుఁ గేవలము దురాగ్రహ మనియే చెప్పనొప్పును. ఇఁక జైనులు చారిత్ర మొనర్చుటకుఁగాని, చదువు టకుఁగాని, దానమిచ్చుటకుగాని సామర్థ్యము లేనివారై యున్నను జైనమతము మాత్రము సత్యమయినదట. ఏమి? ఏతన్మాత్రకథనముచేత వారు ఉత్తము లగుదురా? అన్యమతములందలి శ్రేష్ఠులుకూడ నశ్రేష్ఠులగుదురా? ఇట్టి మాటల నుఱుపుమనుష్యులను భ్రాంతులనియు, బాల బుద్ధిగలవారనియు ననక నింకే మనవచ్చును? దీనివలన వీరిఆచార్యులు స్వార్థులయి యుండిరనియు, విద్వాం సులు కాకుండిరనియు విదితమగు చున్నది. ఏలయన నందరిని నిందింపకున్న నిట్టి యబద్ధపు మాటలయం దెవఁడును జిక్కకనే యుండును. మరి వారి ప్రయో జనమును నెఱవేరక పోవును. చూడుఁడు! దీనివలన జైనులమతము ముంచివేయు నదనియు, వేదమత మందరిని తరింపఁజేయునదనియు సిద్ధమగుచున్నది. ఇఁక హరి హరాది దేవతలు సుదేవతలనియు వీరి ఋషభదేవాదులందరు కుదేవత లనియు, నితరులన్న వారి కటులే చెడ్డగాఁ దోఁచదా? ఇఁకను వీరి ఆచార్యు లయు, అనుచరులయు పొరపాటులు గమనింపుడు:-

మూలము:— జినవర ఆణా భంగం, ఉమగ్గ ఉస్సుత్త లేస దేసణఓ
ఆణా భంగే పావం తా జిణమయ దుక్కరంధమ్మమ్ ॥
ప్రకర. భాగ. ౨. షష్ఠిశ. ౬౧. సూ. ౧౧

ఉన్మార్గ ఉత్సూత్రములను లేశమాత్రము చూపుట వలనను, జిన వరుల-వీతరాగ తీర్థంకరులయాజ్ఞకు భంగము కలుగును కాన నది దుఃఖము

నకు హేతువగు పాపము. జినేశ్వరులచేఁ జెప్పఁబడిన సమ్యక్త్వాది ధర్మమును గ్రహించుట మిక్కిలి కఠినము. కాఁబట్టి జినులందరు లింగము కలుగనట్లు నడచుకొనవలెను.

సమీక్షకుఁడు:— తననోటితో తన్నుఁ దాఁబొగడుకొనుటయు, తన ధర్మమే గొప్పదనుచు నితరుల నిందఁజేయుటయు, మూర్ఖత్వముగాక మఱియే మగును. ఏమన నితర విద్వాంసు లెవనిఁబొగడుదురో వానిఁగూర్చి ప్రశంస చేయుట సమంజసమే. దొంగలుకూడఁ దమనోటితో దమ్ముప్రశంస చేసికొను చున్నను వారు ప్రశంసనీయులు కాఁగలరా? వీరి సంగతులు నిట్టివే యనుట స్పష్టము.

మూలము:— బహుగుణవిజ్జా నిలఓ ఉస్సుత్తభాసీ తహా విముత్తవ్వో।
జహ వర మణి జుత్తో విహు విగ్ఘకరో లోఏ॥

ప్రక. భా.౨.షష్టి.సూ.౧౨.

విషముగల సర్పమందున్న మణి త్యజింపదగినదై యున్నట్లు జైన మతమందు లేనివాఁ డెంతగొప్ప ధర్మాత్ముఁడు, పండితుఁడు నయిన నతనిఁ ద్యజించుటయే జైనుల కుచితము.

సమీక్షకుఁడు:— చూడుఁడు! ఇది యెంత గొప్ప పొరపాటు! వీరి శిష్యులును, ఆచార్యులును విద్వాంసులే యైయున్న విద్వాంసులఁ బ్రేమించి యుండెడివారు. వీరి తీర్థంకరులే యవిద్వాంసులయి యున్నప్పుడు విద్వాంసుల నెందులకు మన్నింతురు! మట్టిలోఁగాని ధూళిలోఁగాని పడిన సువర్ణము నెవఁడయినఁ ద్యజించునా? ఇంతటి పక్షపాతముకలవారు, హఠులు, దురాగ్రహులు, విద్యావిహీనులు నగువారు జైనులు దప్ప మఱి యెవ్వరు నుండఁ బోరనియే దీనివల్ల సిద్ధమగుచున్నది.

మూలము:— ఐసయ హాణియపావా తమ్మిఅ వవ్వే సు తోవి పావ రయా।
న చలన్తి సుద్ధ ధమ్మా ధన్నా కివిపావ పవ్వేసు॥

ప్రక. భా.౨.షష్టి.సూ.౨౯

అన్య దర్శనముల నంగీకరించు కులింగుల— జైనమతవిరోధులగు వారి దర్శనముగూడ జైనులు చేయఁగూడదు.

సమీక్షకుఁడు:— ఇది యెంతటి పామరత్వపు మాటయో బుద్ధిమంతులు కనుఁగొనఁగలరు. వాస్తవముగ నెవని మతము సత్యమో యతఁడెవనికిని

దయపడరు. వీరి ఆచార్యులు తమమతము కపోలకల్పితమైనదనియు, నితరులచే జెప్పిన ఖండింపఁబడునినియు నెఱిఁగియుండిరి. కాన నందఱిని నిందించుచు మూర్ఖజనులను తమవలలోఁ జిక్కించుకొనుచని వ్రాసియున్నారు

మూలము.—నామంపి తస్స అసుహం జేణ నిదిఠాఇ మిచ్ఛ పవ్వాఇ।
జేసిం అణుసంగాఓ ధమ్మీణవి హోఇ పావ మఈ॥

ప్రకర.భా.౨.షష్ఠీ.సూ.౨౭॥

జైనధర్మమునకు విరుద్ధములయిన ధర్మములన్నియు మనుష్యులను పాపాత్ములఁజేయున వయియున్నయవి. కాన నెవరును నన్యధర్మమును స్వీకరింపక కేవలం జైనధర్మమును స్వీకరించుటయే శ్రేష్ఠము.

సమీక్షకుఁడు:— నందరితో వైరము-విరోధము, గలుఁగజేయుచు నింద, ఈర్ష్య. మొదలగు దుష్కర్మరూపసాగరమున ముంచివేయున దీ జైనమతమనియే దీనిచే సిద్ధమగుచున్నది. జైనులు సర్వజన నిందకులయినట్లు అన్యమతస్థు లెవరును మహానిందకులు, అధర్ములనుకొరు. ఒకవైపు నుండి యందఱను నిందించుటయు మఱి తమ్మెతాము అతిగా పొగడుకొనుటయు శఠులైన మనుష్యుల పనులే కాని వేరు కాదు. వివేకము గలవారు "ఎవరేమతస్థులే కానిండు" మంచివారిని మంచివారనియుఁ, జెడ్డవారిని చెడ్డవారనియు నందురు

మూలము:—హాహా గురుఅ అకజ్జం సామీ న హు అత్థి కస్స పుక్కరిమో।
కహ జిణ వయణ కహ సుగురు సావయా కహ ఇయ అకజ్జం॥

ప్రకర.భా.౨ షష్ఠీ సూ.౩౫॥

సర్వజ్ఞభాషితములగు జినవచనములు, జైనుల సుగురువులు జైనధర్మము నెక్కడ, తద్విరోధులయిన కుగురువులు, అన్యమార్గోపదేశకు లెక్కడ: అనఁగా మాకు సుగురువులు, సుదేవతలు, సుధర్మములు గలవు. అన్యులకు కుదేవతలు, కుగురువులు, కుధర్మములు గలవు.

సమీక్షకుఁడు:— ఈవార్త రేఁగుఁబండ్ల నమ్ముకొని బ్రతుకు నొకస్త్రీ విషయమువలె నున్నది. అది తన పుల్లని రేఁగుఁబండ్లను తియ్యనివనియు, నితరుల తియ్యనిపండ్లను పుల్లనివనియు, అవి మంచివిగావనియు ననునటులే యీ జైనుల సంగతులును కలవు. వీరు తమకంటె భిన్నులగు మతస్థులసేవ నొనర్చుటను గొప్ప యకార్యముగా-పాపముగా-భావించుచున్నారు.

మూలము:—సప్పో ఇక్కం మరణం కుగురు అణంతాఇ దేఇమరణాఇ।
తో వరిసప్పం గహియం మా కుగురుసేవణం భద్దమ్॥
ప్రకర.భా ౨ సూ.౩౭॥

సర్పమునందలి మణినిగూడ త్యజించుట యుచితమని మొదట వ్రాయఁబడినది. అటులే యన్యమార్గులందలి శ్రేష్ఠులు, ధర్మాత్ములగు పురుషులఁగూడ త్యజింపవలెను. ఇంతకు దీనికంటె సరికముగ నన్యమతస్థుల నిందించుచున్నారు. ఎట్లన జైనమతమునకు భిన్నులగు వారందఱు కుగురువులు-వారు సర్పముకంటెను చెడ్డవారు-వారి దర్శనముకావి, సేవకావి, సాంగత్యముగాని యెన్నఁడును చేయఁగూడదు. ఏమన సర్పముతో సహవాసము చేయుటవలన నొకప్పుడు మరణమే కలుగును. అట్లే యన్యమార్గులయిన దుష్టగురువుల సాంగత్యముచే ననేక పర్యాయములు జన్మమరణముల నొంద వలసివచ్చును కాన నో భద్రా! అన్యమార్గులగు దుష్టగురువుల దగ్గఱను నిలువకుము. ఏలయన నీవు కొంచెమైన నన్యమార్గుల సేవజేసితివా, దుఃఖమునఁ బడుదువు.

సమీక్షకుఁడు:—చూడుఁడు. జైనులవంటి కఠినులు, భ్రాంతులు, ద్వేషులు, నిందకులు, సన్మార్గమును మఱచినవారు నన్యమతస్థు లెవ్వరు నుండరు అన్యమతనింద, దమ ప్రశంసయు జేయుకున్న, తమకు సేవయు, ప్రతిష్ఠయు గలుగునని వా రాలోచించి యుందురు. కాని ఇది వారి దౌర్భాగ్యమనియే చెప్పనగును. ఏలయన నుత్తమవిద్వాంసుల సేవాసాంగత్యములు చేయకుండు నంతవఱకు, వీరికి యథార్థమైన జ్ఞానమును, సత్యధర్మ ప్రాప్తియు నలవడ కుండును. కాన విద్యా విరుద్ధములయిన మిథ్యావిషయముల త్యజించి వేద మందుఁ జెప్పఁబడినట్టి సత్యములైన మాటల గ్రహించుట జైనుల కుచితము; కడు శ్రేయస్కరము నయియున్నయది.

మూలము:—కిం భణిమో కిం కరిమో తాణ హయాసాణ ధిట్ఠ దుట్ఠాణం।
జే దంసిఊణ లింగం ఖివంతి నరయమ్మి ముద్ధజణం॥
ప్రకర.భా ౨.షష్ఠీ సూ.౪౦॥

ఎవని యభ్యుదయాశ నష్టమైపోయినదో, ఎవఁడు దురాగ్రహుఁడు, చెడుకార్యములనొనర్చునియందతిచతురుఁడును, దుష్టుఁడును, దోషయుక్తుఁడునై

యున్నాఁడో యట్టిపురుషున కేమిచెప్పవలెను? ఏమిచేయ నగును? ఏమన, నుప కారముచేసిన వానికి మాఱుగా వాఁడపకారమే చేయును. ఎట్లన, నొకఁడు దయఁ బూని గ్రుడ్డిసింహమునకు కన్నులిచ్చిన నది వానినే తినివేయునన్నట్లు దుష్ట గురువులకు-అన్యమార్గుల కుపకార మొనరించుట, తన్నుఁదాను నశింపఁ జేసి కొనుటయే యైయున్నది. కాఁబట్టి వారినుండి సదా దూరముగ నుండఁదగును.

సమీక్షకుఁడు:- జైనులు దలఁచుచున్నట్లే అన్యమతస్థులుకూడఁ దలఁతు రేని జైనుల కెంతటి దుర్దశ సంప్రాప్తమగును? మఱి వారల కెవరును నేవిధ మైన యుపకారమును జేయకున్న, వారి యనేక కార్యములు నష్టమై, వారికెంత దుఃఖము కలుగవచ్చును? ఆప్రకారమే జైను లన్యులవిషయమై యేం విచా రింపరు?

మూలము:—జహ జహ తుట్టఇ ధమ్మో జహ జహ దుట్టాణ హోఇ అఇ ఉదఓ
సమద్దిట్ఠి జియాణం తహతహ ఉల్లసఇ సమత్తం ॥
ప్రకర. భా. ౨ షష్ఠీ. సూ. ౮౨

దర్శనభ్రష్ట, నిహ్నవ, పాసత్థా, ఉసన్నా, కుసీలియాదులకును, అన్య దర్శని, త్రిదండి, పరివ్రాజక విప్రాదిక దుష్టులకున్ను సత్కార పూజాదు లమరు సంతగా సమ్యక్ దృష్టి జీవులకు సమ్యక్త్వము విశేషముగ ప్రకాశితమగును. ఇది గొప్ప యాశ్చర్యము.

సమీక్షకుఁడు:- ఇప్పుడు చూడుఁడు! ఈ జైనులనుమించిన ఈర్ష్యా ద్వేష వైరబుద్ధులు గలవా రన్యుఁ డెవఁడైన నుండునా? అన్యమతములందును ఈర్ష్యాద్వేషములు గలవు. కాని యీజైనులందున్నంతటి వెందును లేవు. మఱి ద్వేషమే పాపమునకు మూలముగాన జైనులయందుపాపాచరణమేలలేకపోవును?

మూలము:—సంగోవి జాణ అహిఓ తేసిం ధమ్మాఇ జే పకువ్వంతి।
ముత్తూణ చోర సంగం కరంతి తే చోరియం పావా॥
ప్రకర. భా. ౨. షష్ఠీ. సూ. ౭౫

మూర్ఖజనులు దొంగల సహవాసమందుండుటచే నాసికాచ్ఛేదనాది దం డనలకు భయపడనట్లు జైనమతేతరములగు దొంగమతములందుండెడు జనులు తమ శిక్షమునకు భయపడరనియే దీని ముఖ్యాభావము.

సమీక్షకుఁడు:- మనుష్యుఁడు తరుచుగాఁ దనవలెనే యితరులను గూడ భావించును. అన్యమతము లన్నియు, జైనులది సాహంకారి మతమనియు ననుట సత్యము కాఁగలదా? మనుష్యుని యందు మిక్కిలి అజ్ఞానమును, దుష్టసహవాసముచే భ్రష్టబుద్ధియు నుండునంతవఱకు తఁ దితరులతో నసూయాద్వేషాది దుష్టత్వముల నొనర్పక మానఁడు. ఈ జైనమతమునందు పరమతద్వేష మున్నట్లు మఱి యేమత మందునులేదు.

మూలము:— తత్ర పసుమాహిసలకఖా షవ్వం హోమంతి పావ నవమీఏ।
పూఅ న్తి తంపి సద్ధా హా హీలా వీయరాయస్స॥
(ప్రక. భా. ౨. షష్ఠి. సూ. ౩౬

పూర్వసూత్రమునఁ జెప్పఁబడినట్లు (మిథ్యాత్వీ) జైనమతభిన్నులగువారందఱును మిథ్యాత్వులు. తాముమాత్రమే సమ్యక్త్వులు. అనఁగా నితరులందఱు పాపాత్ములు జైనులందఱును పుణ్యాత్ములే. కావున నెవఁడు మిథ్యాత్వుల ధర్మమును స్థాపించునో వాఁడు పాపాత్ముఁడే.

సమీక్షకుఁడు:- అన్యుల తీర్థస్థానములందుఁ బ్రముఖములయి యున్న, చాముండా, కాళికా, జ్వాలాప్రముఖుల యెదుటఁ జరుపఁబడు పాపనవమి, దుర్గానవమి తిథులు మున్నగునవన్నియు చెడ్డవై యున్నటులే మీపజూసణాది వ్రతములు చెడ్డవికావా? వానివలన, మహాకష్టము కలుగుచున్నది. ఇట వామమార్గుల లీలలను ఖండన చేయుట యుక్తమే కాని మీరు నమ్ముచున్న శాసనదేవీ. మొదలగు వానిఁగూడ ఖండన చేసియున్న మేలై యుండెడిది. "మా దేవి హింసకురాలు కా" దందురేని, అదియు నబద్ధమే. ఏలయన శాసనదేవి ఒకపురుషుని నేత్రములు, మేఁక నేత్రములు దీసికొని యుండెను. ఇఁక నామె రాక్షసియు, దుర్గా కాళికాదులకు సొంత సోదరియు నేల గాకయుండును? మఱి తమ పచ్చఖాణాది వ్రతములను శ్రేష్ఠములనియు నవమీ మున్నగు వ్రతములను నికృష్టములనియు ననుట మౌర్ఖ్యము. ఏలయన నితరుల ఉపవాసాది వ్రతముల నిందింపఁదియుఁ, దమ ఉపవాసాదుల గూర్చి పొగడుకొనుటయు మూర్ఖత్వపు మాటయే. పత్యభాషణాది వ్రతము లాచరించుటమాత్రము సర్వహితకరము. కాఁబట్టి జైను లాగాని యన్యులుగాని యొనర్చెడు నుపవాసములు సత్యములు కావు.

మూలము:—వేసాణ బందియాణయ మాహణ డుంబాణ జక్కసిరకాణం ।
భత్తా భక్ఖట్ఠాణం వియాణం జంతి దూరేణం ॥

(ప్రక. రా. ౨. షష్ఠీ. సూ. ౮౨ ॥)

ఎవఁడు వేశ్యలకును, చారణులకును, భట్టుల మన్నగువారికిని, బ్రాహ్మణులకును, యక్షులకును గణేశాదులకును మిథ్యాదృష్టికల దేవీ దేవతాదులకును భక్తుఁడో వాని నెవరంగీకరింతురో వారందఱు ముంచివేయువారు, మునుఁగు వారు నై యున్నారనుటయే దీని ముఖ్యాభిప్రాయము. ఏమన, వారి నుండియే తామన్ని వస్తువులు పొందఁగోరుచు వీతరాగ పురుషులనుండి దూరమైయుండుట.

సమీక్షకుఁడు:—అన్యమార్గుల దేవతలను మిథ్య యనుటయు, తమ దేవతలను సత్యమని చెప్పుటయు కేవల పక్షపాతమైన మాటయే. వామమార్గుల దేవియున్నగు వానిని నిషేధించుచున్నారు. కాని, శ్రాద్ధదినకృత్యమందలి ౪౬ వ పుటలో "శాసనదేవి రాత్రియందు భోజనము చేసినందుల కొక పురుషుని చెంపమీఁదఁ గొట్టెననియు, వాని కన్నును దీసివేసెననియు మరల వానికి మారుగా మేఁకకన్నులను దీసి ఆ మనుష్యునికిఁ బెట్టె" ననియు వ్రాయఁబడియున్నది. ఈ దేవిని హింసకురాలని యంగీకరింపరేల? రత్నసార ప్రథమభాగమున ౭౦ వ పుటలో నేమివ్రాసియున్నరో చూడుఁడు! మరుదేవి పథికులకు శిలావిగ్రహమై సహాయ మొనరించుచుండెనఁట. ఈమెను గూడ నటులే యేల యంగీకరింపరు?

మూలము:—కింసోసి జణణి జాఓ జాఓ జణణీఇ కిం గఓవిద్ధిం ।
జఇ మిచ్ఛరఓ జాఓ గుణేసు తహ మచ్ఛరం వహఇ ॥

(ప్రక. రా. ౨. షష్ఠీ. సూ. ౮౧ ॥)

జైనమత విరోధులగు, మిథ్యాత్వులగు, మిథ్యాధర్మము గల వారేల జన్మించిరో! జన్మించిరా, ఏం వృద్ధిఁబొందిరో కదా! అనగాఁ గర్భమే నష్టమై పోయిన మేలయి యుండెడిది!!

సమీక్షకుఁడు:- చూడుఁడు. వీరి వీతరాగభాషిత దయా ధర్మము. ఇతర మతస్థుల జీవించియుండుటనుగూడ అంగీకరింపరు. వీరి దయా ధర్మమనునది కేవలము మాటమాత్రమే యగును. దయా ధర్మమున్నదన్న నది క్షుద్రజీవుల

కొఱకు. పశువులకొఱకు నున్నదేకాని జైనమత భిన్నులగు మనుష్యులకొఱ కెంతమాత్రమును కాదు.

మూలము:—సుద్ధే మగ్గే జాయా సుహేణ గచ్ఛంతి సుద్ధమగ్గండు ।
జే పుణ అమగ్గ జాయా మగ్గే గచ్ఛంతి తే చుయ్యం ॥
ప్రక. భా. ౧. షష్ఠీ. సూ. ౭౩॥

జైనకులమునఁ బుట్టినవాఁడు ముక్తినొందిన నాశ్చర్యము కాదు గాని జైనభిన్నకులమునఁ బుట్టిన మిథ్యాత్వులగు నన్యమార్గులు ముక్తినొందుదురనుట కదు నాశ్చర్యమనియే దీని ముఖ్యాభిప్రాయము. అనఁగా జైనమతస్థులే ముక్తినొందుదురు. అన్యులెవరును ముక్తినొందరు. కాన జైనమతము నంగీకరింపనివారు నరకముగాములని ఫలితార్థము.

సమీక్షకుఁడు:-ఏమిఁ జైనమతమునందు దుష్టుఁడుగాని, నరకగామిఁడుగాని యొకఁడూ నుండఁడా? అందఱును ముక్తినొందుదురా? అన్యులెవ్వరును ముక్తినొందరా? ఇది యున్మత్తాలాపము కాక మఱియే మగును? అమాయకులు తప్ప నిట్టిమాటల నెవరంగీకరింపఁగలరు?

మూలము:—తిత్థయరాణం పూఆ సమ్మత్త గుణాణ కారిణీ భణియా ।
సావియ ఒచ్ఛత్తయరీ జిణ సమయే దేసియా పూఆ ॥
ప్రక. భాగ. ౧. షష్ఠీ. సూ. ౯౦॥

ఒక జినమూర్తులపూజనమే సారము. ఏతద్భిన్నమార్గుల మూర్తిపూజనము సారవంతము. అష్టే జినమార్గమందలి యాజ్ఞలఁ బాలించువాఁడే తత్వజ్ఞాని. వానిఁ బాలింపనివాఁడు తత్వజ్ఞాని కాఁడు.

సమీక్షకుఁడు:—మేలయ్యా మేలు! ఏమి చెప్పవలెను! వైష్ణవాదులు మూర్తులవలె మీ మూర్తులును పాషాణాది జడపదార్థములతోఁ జేయఁబడినవి కావా? మీ మూర్తిపూజన మెట్లు మిథ్యయై యున్నదో యటులే వైష్ణవాదుల మూర్తిపూజనము కూడ మిథ్యయే. మీరు తత్వజ్ఞానులనుకొనుచు నన్యులను తత్వజ్ఞులు కారని చెప్పుచుండుటవలన మీ మతమందు తత్వజ్ఞానమే లేదని విదితమగుచున్నది.

మూలము:—జిణ ఆణాఏ ధమ్మో ఆణా రహిఆణ ఫుడం అహమ్ముత్తి ।
ఇయ ముణిఊణయ తత్తం జిణ ఆణాఏ కుణహ ధమ్మమ్ ॥
ప్రక. భా. ౨. షష్ఠీ. సూ. ౯౨॥

జినదేవుని యాజ్ఞయె దయాక్షమాది రూపమైన ధర్మము. దానికంటె భిన్నమగునాజ్ఞలన్నియు నధర్మములు.

సమీక్షకుడు:- ఇది యెంత గొప్ప యన్యాయము! జైనమతమునకు భిన్నుడుగానున్న పురుషుడెవ్వడును సత్యవాదియు ధర్మాత్ముడును లేనే లేడా? ఏమి? అందలి ధర్మాత్ములనుగూడ మన్నింపగూడదా? జైనమతస్థ మనుష్యుల ముఖజిహ్వలు తోలువికాక యితరులవే తోలువై యున్న నిది సంగతమగుచుండెడిది. కాన తమ నోటితో, దమ మతగ్రంథములను, దమ వచనములను, తమ సాధువులు మొదలగువారలను గొనియాడుటయం దీజైనులు భట్టురాజులకు బెద్దన్న లనియె తెల్లమగుచున్నది.

మూలము:—వన్నేమి నారయా తవి జేసిం దురకాళ సంభరం తాణం
తవ్వాణ జణశ హరిహర రిద్ధి సమిద్ధీవి ఉద్ధోసం ॥

(ప్రకర. భా-౨. షష్ఠీ-సూ. ౧౨౦)

దీని ముఖ్యతాత్పర్య మేమన, హరిహరాదిదేవతల విభూతియనునది నరక హేతువయి యున్నది. దానిజూచి జైనుల రోమములు గగ్గురుపా టొందుచున్నవి. రాజాజ్ఞాభంగము చేసినమనుష్యుడు మరణపర్యంతము దుఃఖమును బొందునట్లే జినేంద్రాజ్ఞాభంగము చేసినవా డేల జన్మమరణ రూపదుఃఖములను బొందకుండును?

సమీక్షకుడు:- జైనులయాచార్యాదుల మానసికవృత్తులను, కపటాంతర యుక్తములగు బాహ్యలీలలను చూడుడు. ఇప్పుడు వీరి యాంతరిక విషయమును బయల్పడినదికద. వీరు హరిహరాదుల-వారి యుపాసకుల యైశ్వర్యమును, వృద్ధిని జూడజాలరు. ఇతరులకు వృద్ధియేల కలిగెననియె వారి రోమములు గగుర్పొడుచుచున్నవి. ఇతరుల ఐశ్వర్యమంత తమకు లభించి వారు దరిద్రులయిపోయిన బాగుగ నుండురనియె వీరు తలచుచుండవచ్చును. ఈజైనులు రాజకీయ విషయమునందు నరుతియ్యని మాటలాడువారు. మిథ్యావాదులు, పతితులైయున్నందుననే రాజాజ్ఞా దృష్టాంతము నిచ్చియున్నారు. ఏమి? రాజు మిథ్యల మాటలనయిన నంగీకరింపవలయునా? కాన జైనులను మించిన ఈర్ష్యాద్వేషములు గలవా రితరు లెవ్వరు నుండ రనుట స్పష్టము.

మూలము:— జో దేఇ సుద్ధ ధమ్మం సో పరమప్పా జయమ్మి నహు అన్నో
కిం కప్పద్దుమ సరిసో ఇయర తరూ హోఇ కఇయావి ॥

ప్రక. భా. ౨. షష్టి. సూ. ౧౦౧ ॥

జైనధర్మమునకువిరోధులగువారుమూర్ఖులు. జినేంద్రభాషితధర్మోపదేశకులగు సాధువులుగాని, గృహస్థులుగాని, గ్రంథకర్తలుగాని, తీర్థంకరులకు తుల్యులే. వారికి తుల్యుడెవ్వడును లేడు.

సమీక్షకుడు:- ఓరా! జైనులు బాలబుద్ధిగలవారు గాకున్న నిట్టి మాటల నెందు కంగీకరించియుందురు? వేశ్య తన స్తుతియే కాని అన్యుల స్తుతి గానదన్నట్లు ఈ విషయము గోచరమగుచున్నది.

మూలము:— జే అముణిఅ గుణ దోసా తే కహ అ బుహాణ హుంతి మజ్ఝత్థా ।
అహ తే వి హు మజ్ఝత్థా తా విస అమిఅణ తుల్లత్తం॥

ప్రక. భా. ౨. షష్టి. సూ. ౧౦౨

జినేంద్రదేవుని, తదుక్తసిద్ధాంతములను, జినమతోపదేశకులను, త్యజించుట జైనుల కుచితముకాదు.

సమీక్షకుడు:— ఇది జైనుల హఠమును, పక్షపాతమును, అవిద్యావంతమును ప్రకటించునది గాక మరేమగును? కాబట్టి జైనులవి కొన్ని మాటలు దప్ప దక్కినవన్నియు త్యక్తవ్యములే. కొంచెము బుద్ధిగలవాడైనను, జైనుల దేవతలను జూచినచో సిద్ధాంత గ్రంథములను వినినచో ఉపదేశకులను గూర్చి విచారించినచో నిస్సందేహముగ నప్పుడే త్యజించును.

మూలము:— వయణే వి సుగురు జిణవల్లహస్స కేసిం న ఉల్లసఇ సమ్మం ।
అహ కహ దిణమణి తేయం ఉలుఆణం హరఇ అంధత్తం ॥

ప్రక. భా. ౨. షష్టి. సూ. ౧౦౮॥

జినవచనానుసారముగ ప్రవర్తించువారు పూజ్యులు. తద్విరుద్ధముగ వర్తించువారు అపూజ్యులు. కాన జైనగురువులనే నమ్మవలెను. కాని అన్య మార్గుల నమ్మవలదు.

సమీక్షకుడు:— జైనులు జ్ఞానహీనులగువారిని పశువులతో సమానమైన శిష్యులుగా జేసి కట్టుదిట్టము లేర్పఱచుకొనియుండకున్నచో వారు వీరి వలలో జిక్కక దాము ముక్తికొఱకు పురుషార్థము చేసి తమ జన్మముల సఫలము జేసికొనియుండెడివారు. మఱియిమ్ముల నెవరయిన కుమార్గులనియు,

దుష్టగురువులనియు, మిథ్యాత్వులనియు, దురుపదేశకులనియు నన్న మీకెంత దుఃఖము కలుగును? అటులే మీరు నితరులకు దుఃఖదాయకులయి యున్నారు. కాన మీమతమం దసారములైన సంగతులెన్నియో నిండియున్నవి?

మూలము — ఇహ అల జణం మరంతం దట్ఠూణ నిఅంతి జే న అప్పాణం।
విరమంతి న పాఉ ధిద్ధీ ధిట్ఠత్తణం తాణం॥

ప్రక. భా. ౨ షష్ఠి. సూ. ౧౦౮॥

మృతినొందునంతటి దుఃఖము సంప్రాప్తమైనను జైనులు కృషి, వ్యాపారము మున్నగుకార్యములు చేయఁగూడదు. ఏలయన నీకార్యములే నరకమునఁ బడవేయును.

సమీక్షకుఁడు:— అటులేయైన "మీరు వ్యాపారాది కార్యముల నేం చేయుచున్నారు? ఈకార్యములను విడువరెందులకు? విడుతురేని మీ శరీర పాలనము పోషణము నెట్లు జరుగును? ఇఁక మీ మాట వినియందఱును విడిచి పెట్టినచో మీరేమి తిని జీవింతురని జైనుల నడుగవలెను. ఇట్టి అత్యాచారమైయున్న యుపదేశము చేయుట సర్వథా వ్యర్థము. పాపము వారేమి చేయుదురు? విద్యాసత్సంగములు లభింపనందున మనస్సునకు వచ్చినట్లు వదరి యున్నారు.

మూలము — తఇయా హమాణ అహమా కారణ రహియా అనాణ గబ్వేణ।
జే జంపంతి ఉసుత్తం తేసిం ధిద్ధిత్థ పండిచ్చం॥

ప్రక. భా. ౨. షష్ఠి. ౧౨౧॥

జైనాగమములకు విరుద్ధములయిన శాస్త్రముల నొప్పుకొనువారు అధమాధములు; ఏదేని ప్రయోజనముకూడ సిద్ధింపనున్నను జైనమతమునకు విరుద్ధముగ జెప్పఁగూడదు; నమ్మనుకూడదు. ఒకానొక ప్రయోజనము నెఱవేరుచున్నను, అన్యమతమును త్యజింపవలయును.

సమీక్షకుఁడు:— మీ మూలపురుషులు మొదలుకొని నేఁటివఱకెందఱు కాగురువులయిరో సున్నారో వారు అన్యమతముల దిట్టుటఁదప్ప మరొక కేమియు నుడువలేదు. నుడువఁబోరు. ఇఁక నెక్కడ తమ ప్రయోజనము నెఱవేఱునని దలఁచుచున్నారో యక్కడ నీ జైనులు శిష్యులకును శిష్యులయి పోవుచున్నారు. ఇట్టి వ్యర్థాలాపములు వ్రాయుటకుఁ గొంచెమైన లజ్జ కలుగక పోవుట కడు శోచనీయము.

మూలము.—జం వీర జిణస్స జీఓ మరఇ ఉస్సుత్త పదేస ణఓ ।
సాగర కోడా కోడిం హిండఇ అఇ భీమ భవ రణ్ణే ॥
ప్రక. భా. ౨. షష్ఠి. సూ. ౧౨౨.

ఎవఁడేని జైనసాధువులయందును ధర్మము కలదు; మాయందును అన్యుల యందును ధర్మము కలదు అని చెప్పిన నతఁడు కోట్లకొలఁది సంవత్సరముల వఱకు నరకమనుభవించి నీచజన్మమునే పొందుచున్నాడు.

సమీక్షకుఁడు:- భళిరే! భళీ! ఓ విద్యాశత్రువులారా! మీరు మీ మిథ్యా వచనముల నెవరును ఖండింపకుందురనియే కాఁబోలు ఇట్టి భయంకరములయిన వచనములు వ్రాసియున్నారు. కాని అది యసంభవము. మీరు కేవలము లేని పోని నిందలు చేయుచు నన్యమతములతో విరోధము బూనుటకే సంసిద్ధులై యుండి, తమ ప్రయోజనముల నెఱవేర్చుకొనుటయే మోహన భోగమనుకొని యున్నారు గదా! ఇఁక మీకెంతవరకు బోధింపవలెను!

మూలము.—దూరే కరణం దూరమ్మి సాహణం తహ పభావణా దూరే ।
జిణధమ్మ సద్దహాణం పి తిరకదుక్ఖాఇ నిట్ఠవఇ ॥
ప్రక. భా. ౨. షష్ఠి. సూ. ౧౨౭.

ఏ మనుష్యునివల్ల జైనధర్మానుష్ఠానమేమియుఁ గానేరకపోయినను జైన ధర్మమే సత్యమనియు, నన్యధర్మమేదియు సత్యము కాదనియు, ఇంత మాత్రము శ్రద్ధకలవాఁడయి యున్న నతఁడు దుఃఖముల నుండి తరించు చున్నాఁడు.

సమీక్షకుఁడు:- ఆహా! మూర్ఖులను తమ మతమను వలలోఁ జిక్కించు కొనుటకింతకంటె నధికమేముండును? ఏలయన ఇంచుకేని కర్మముచేయ వలసిన పనిలేక ముక్తి కలుగనే కలుగునను నింతటి పామరమతము వేరొక టుండునా?

మూలము.—కఇయా హోహీ దివసో జఇయా సుగురూణ పాయమూలమ్మి ।
ఉస్సుత్త లవ విస లవ రహిఓ నిసుణేసు జిణధమ్మం ॥
ప్రక. భా. ౨. షష్ఠి. సూ. ౧౨౮.

నేను మనుష్యుఁడనయినచో ఉనాగమములను. జైనుల శాస్త్రములనే విందును. కాని ఇతరశాస్త్రములను, అన్యమత గ్రంథముల నెన్నడు వినను; అవి కోరువారు ఆ అకోరికలోనే దుఃఖసాగరమునుండి తరించు చున్నాఁరు.

సమీక్షకుఁడు:- ఈ మాటగూడ సమాయకులను జిక్కించుకొనుటకే కల్పించియున్నారు. ఏమన పైఁజెప్పఁబడిన కోరికతో నిక్కడి దుఃఖసాగరము నుండియైన తరింపనేరఁరు. అట్లేపూర్వజన్మమందలి సంచిత పాపముల దుఃఖరూపఫలమునుగూడ బొందవలసియే వచ్చును. ఇట్టిసత్యములైన విద్యావిరుద్ధములగు విషయముల వ్రాయకపోయిన, వేదాదిశాస్త్రములఁ జూచియో, వినియో సత్యాసత్యముల దెలిసికొని యవిద్యతోఁ గూడిన వీరి కపోలకల్పిత గ్రంథములఁ వారు త్యజించియుందురు. కాని వీరవిద్వాంసులను బిగించినట్టి తమ వలలోఁ జిక్కించుకొనియున్నారు. దీనినుండి సత్సాంగత్యమువల బుద్ధిమంతుఁడెవఁడో విడివడవచ్చునేకాని మందబుద్ధిగలవారు విడివడుట గడుదుస్తరము.

మూలము.—జహ్నా జిణేహిం భణియం సుయ వవహారం విసోహియం తస్స ।
జాయఇ విసుద్ధ బోహీ జిణ ఆణా రాహగత్తాఓ ॥

ప్రక. భా. ౨. షష్ఠి. సూ. ౧౩౮॥

జినాచార్యులచేఁ జెప్పఁబడిన సూత్ర, నిరుక్తి, వృత్తి, భాష్య చూర్ణుల నొప్పుకొనువారే శుభ వ్యవహారములను, దుస్సహ వ్యవహారముల నొనర్పుచు చారిత్రయుక్తులయి సుఖములను బొందుచున్నారు. అన్యమత గ్రంథముల నవలోకించుటవలనఁ బొందఁజాలరు.

సమీక్షకుఁడు:- ఏమి? అత్యంతోపవాసాది కష్టముల సహనమే, చారిత్ర యనఁబడునా? ఆకఁలి దప్పిగొనియుండుట మొదలయినదే చారిత్ర యనఁబడినచో ననేక మనుష్యులు కరువు వలననో లేక నన్నాదులు లభింపకనో ఆఁకలిగొని పీడితులగుచుందురు. వారును పవిత్రులయి శుభఫలముల నొందవలసినదే కదా! అట్లు వారును శుద్ధులు గారు. మీరును గారు. కాని పిత్తాదుల ప్రకోపములచే రోగులయి సుఖమునకు మారు దుఃఖమనుభవింతురు; న్యాయాచరణము, బ్రహ్మచర్యము, సత్యభాషణము మొదలయినది ధర్మము. అసత్యభాషణము, అన్యాయాచరణము మొదలయినది పాపము. అందఱితోఁ బ్రీతిపూర్వకముగఁ బరోపకారార్థము వర్తించుట శుభచరిత్ర యనఁబడును. కాన, జైనమతస్థులవలె నాకలి దప్పి గొనియుండుట మొదలైనది ధర్మముకాదు. ఇఁక నీసూత్రాదుల నొప్పుకొనుటవలన కించిన్మాత్ర సత్యమును, అధికముగా నసత్యమును బొంది దుఃఖసాగరమునఁబడి మునుఁగుదురు.

మూఢము—ఇడి ణాదిసి జిణ నావహో రోయా యారా వివరకపి బాటి ।
రా తం తం మన్నంతో కహ మన్నసి రోఅ ఆయారం ॥
ప్రక. భా. ౨. షష్ఠీ. సూ. ౧౪౮॥

మంచి యదృష్టవంతులయిన మనుష్యులే జినధర్మమును సంగీకరించు చున్నారు. అనఁగా జినధర్మము నంగీకరింపని వారి ప్రారబ్ధమే నష్టమైనదని యెఱుఁగవలెను.

సమీక్షకుఁడు:- ఏమి? ఇది ప్రమాదముతోఁగూడిన మిథ్యాలాపము కాదా? అన్యమతమందు మంచి యదృష్టవంతుఁడును, జైనమతమం దదృష్ట హీనుఁడును ఎవ్వఁడును లేఁడా? సధర్ములనేడి జైన ధర్మావలంబులగువారు తమలోఁ దాము కలహించుకొన రాదనియు, ప్రీతి పూర్వకముగ వర్తింప వలెననియుఁ జెప్పఁబడియున్నది. ఇతరులతోఁ గలహించుట జైనులు చెడ్డ దని భావింపరనియె కదా? దీనిభావము. కాన నిదికూడ అయుక్తమే. ఏలయన సజ్జనులు సజ్జనులతోఁ బ్రీతిపూర్వకముగ వర్తించుచు, దుష్టులకు శిక్షనొసంగి సుశిక్షితులఁ జేయుచున్నారు. ఇఁక బ్రాహ్మణులు, త్రిదండి, పరివ్రాజ కాచార్యులు అనఁగా సన్యాసులు, తపస్వులను బైరాగులు మున్నగు వారంద ఱును జైనమత శత్రువులని వ్రాయఁబడియున్నది. గమనించితిరా? అంద ఱను శత్రుభావముతోఁ జూచుచు నందఱ నిందచేయుచున్నప్పుడు జైనుల దయారూపమును, క్షమారూపమునను ధర్మమెక్కడ నిలిచెను? ఏమన నితరుల మీఁద ద్వేష ముంచుటయు దయాక్షమలనునవి నశించి, దానివంటి హింసా రూపమైన దోషమే మఱొకటుండకుండును. జైనులవంటి ద్వేషముగలవారు ఇత రులు కొద్దిగానే యుందురు. మఱి ఋషభదేవుఁడు మొదలుకొని మహావీరుని వఱకుఁగల ౨౪ తీర్థంకరులను, రాగద్వేషములు గలవారనియు, మిథ్యాత్వు లనియు, జైనమతమును స్వీకరించినవారు సన్నిపాత జ్వరగ్రస్తులయి యున్నా రనియు, వారిధర్మమును నరకముతో - విషముతో - బోలినదిగా యెఱుగవలె ననియు నన్న జైనుల కెంత వికారముగఁ దోచును? అందులకే జైనులు నిందా రూపము పరమతద్వేషరూపమునగు నరకమునఁబడి మహాక్లేశ మనుభవించు చున్నారు. దీనిఁ ద్యజింతురేని మేలగును.

మూలము—ఏగో అ గురూ ఏగో వి సావగో చేఇఆణి విబహాణి ।
తచ్ఛయ జం జిణదవ్వం పరుప్పరం తం న విచ్చంతి ॥
ప్రక. రా. ౨. షష్ఠీ. సూ. ౧౫౦॥

శ్రావకు లందఱకు దేవగురు ధర్మమొక్కటియే. చైత్యవందనము అనఁగా జినప్రతిబింబములనెడి విగ్రహములను, దేవాలయములను, జినద్రవ్య ములను గాపాడుటయు విగ్రహములను బూజించుటయు ధర్మము.

సమీక్షకుఁడు:- ఇప్పుడు గమనింపుఁడు! మూర్తి పూజా సంబంధమైన గందరగోళమంతయు నీ జైనుల యింటినుండియే బయల్వెడినది. పాషండము నకు మూలముకూడ నీ జైనమతమే యనవొప్పును. ఇఁక "శ్రాద్ధదినకృత్యము" మొదటి పుటలో మూర్తిపూజకు ప్రమాణములు గలవు.

నవకారేణ విబోహో॥ ౧॥ అణుసరణం సావఓ॥ ౨॥ వయాఇం ఇమే॥ ౩॥ జోగో॥ ౪॥ చియ వన్దణగో॥ ౫॥ పచ్చరకాణం తు విహి పుబ్వం॥ ౬॥ ఇత్యాది.

౧. శ్రావకులు మొదటి ద్వారమున నవకార జపము చేయవలెను. ౨. రెండవ ద్వారమున నవకారజప మొనరించిన పిదప తాను శ్రావకు'డని స్మరించుకొనవలెను. ౩. మూఁడవద్వారమున అణువ్రతాదులు తమకెన్ని యని యాలోచింప వలెను. ౪. నాల్గవ ద్వారమున చిట్టాలోచింపవలయును. నాల్గ వర్గము లందు అగ్రగామి మోక్షము. దానికొఱకు జ్ఞానాదు లావశ్యకములను టయేయోగ్యము. ఆ సమస్తాతిచారములను పవిత్ర పఱచుటకు అవశ్యకమైన కారణము లాఱుగలవు. అదియు నుపచారయోగ మనఁబడు చున్నది. ఆయో గము వర్ణింపఁ బడును. ౫. ఐదవది చైత్యవందనము అనఁగా విగ్రహమునకు నమస్కారము. ద్రవ్యభావపూజనములు. ౬. ఆఱవది ప్రత్యాఖ్యానముద్వారా నవకారసీప్రముఖములను విధిపూర్వకముగా వర్ణింతును; ఇత్యాదులు. ఈ గ్రంథ మునందే మున్ముందుగా ననేకవిధులు వ్రాయఁబడి యున్నవి. అనఁగా సాయం కాం భోజన సమయమునందు జినబింబములను-తీర్థంకరుల విగ్రహములను [శ్రా. ది. కృ. పుట. ౧] పూజింపవలెననియు, ద్వారములను బూజింపవలె ననియు. గలదు. ఆద్వార పూజనమందు పెక్కు చిక్కులు గలవు. ఇఁక మంది రములఁ గట్టించు నియమములు ప్రాఁత మందిరముల గట్టించుటచేఁను, బాగు చేయుటచేతను, [శ్రా. ది. కృ. పుట. ౨౦] ముక్తికలుగుననియు, మందిరముల

చుండీయి గూర్చుండి [శ్రా. వి.కృ. పుట.౨౪] యీ ప్రకారముగా కరు శ్రద్ధా భక్తులతో పూజన మొనరింపవలెననియు. నమో జినేంద్రేభ్యః" ఇత్యాది మంత్రములతో స్నానాదులను [శ్రా.ది.కృ.పుట. ౫-౬] జేయింపవలెననియు. "జలచందన పుష్పధూపదీపనై:" ఇత్యాదులతో గంధము మున్నగువాని నెక్కింపవలెననియు; గలదు. రత్నసార భాగము ౧౨వ పుటలో మూర్తి పూజాఫలము"పూజారిని రాజుకాని, ప్రజలు కాని యెవ్వరు నడ్డగించుట కర్తలు కా"రని వ్రాసియున్నది.

సమీక్షకుడు:- ఈ సంగతులన్నియు కపోలకల్పితములే. ఏమన ననేక పూజారులను రాజులున్నగు వారడ్డగించుచున్నారు. రత్నసార భాగము ౧౩వ పుటలో మూర్తిపూజలవలన రోగములు, పీడలు, మహాదోషములు దూరమగు చున్నవని వ్రాయబడియున్నది. ఒకడు ఐదుగవ్వల పువ్వుల నెక్కించినందు లకు పదునెనిమిది దేశములకు రాజయ్యెనట. అతనిపేరు కుమారపాలుడు. ఇత్యాది విషయములన్నియు నబద్ధము లనియు, మూర్ఖులకు లోభము కలుగ జేయునవనియు జెప్పనగును. ఏమన నెందఱో జైనులు పూజలు చేసి చేసి రోగులయి కృశించుచుందురు. పాషాణాది మూర్తిపూజవలన నొక ఎకరపు రాజ్యమయినను లభించుటలేదు. ఐదుగవ్వలపువ్వుల నెక్కించుటవలన రాజ్యము దొరకునన్న నైదేసి గవ్వల పూల నెక్కించి భూగోళమునంతటిని దమ రాజ్య ముగా నేలజేసికొనరు? రాజదండన నెందులకు బొందుచున్నారు? మూర్తి పూజచేసి భవసాగరము నుండి తరింతురేని, జ్ఞానసమ్యగ్దర్శనచారిత్రల నొనర్పు టెందులకు? రత్నసారభాగము [౧] ౧౩వ పుటలో 'గౌతముని యంగుష్ఠ మున నమృతము కలదు. అతని స్మరించిన మనోవాంఛిత ఫలములు పొందు చున్నా'రని వ్రాయ బడియున్నది.

సమీక్షకుడు:- ఇటులయిన, జైనులందఱు నమరులు గావలసినదే కదా! అట్లగుటలేదు. కాబట్టి ఇది కేవలము మూర్ఖులను భ్రమింపజేయు మాటయే కాని యిందు వేఱొక తత్వమేమియు లేదు.

వీరు పూజ చేయునపుడు పఠించు శ్లోకము. వివేకసారము ౫౨వ పుటలో నిట్లు వ్రాయబడియున్నది—

జలచందన పుష్ప ధూపనై శ్చ దీపాక్షతై ర్నైవేద్యవస్త్రైః।
ఉపచారవరైర్వయం జినేంద్రాన్ రుచిరై రద్య ముదా యజామహే॥

మనము జల, చందన, అక్షత, పుష్ప, ధూప, దీప, నైవేద్య, వస్త్రాది, అతిశ్రేష్ఠోపచారములచే జినేంద్రులను తీర్థంకరులఁ బూజింపవలయును. ఇందులకేకద: మేమీ మూర్తిపూజ జైనులనుండి ప్రచలితమయినదని చెప్పుచున్నారము. (వివేకసారము ౨౧వ పుట) జిన మందిరమున మోహ ముత్పత్తిల్లదు. అది భవసాగరమునుండి తరింపఁజేయును. (వివేకసారము ౫౧వ పుటనుండి ౫౨) మూర్తిపూజనమువలన ముక్తి కలుగుచున్నది. జిన మందిరమునకు బోవుటచే సద్గుణములు సంప్రాప్తమగును. జలచందనాదులచే తీర్థంకరులకు పూజజేసినవాఁరు నరకమునుండి విడుదలఁ బొంది, స్వర్గమునకుఁ బోవును. (వివేకసారము ౫౫ వ. పుట) జినమందిరము లందలి ఋషభదేవాదుల విగ్రహములఁ బూజించిన, ధర్మార్థ కామ మోక్షములు సిద్ధించును. (వివేకసారము ౬౧వ పుట) జినవిగ్రహములఁ బూజించిన జగత్తులోని క్లేశము లన్నియు దూరమైపోవును.

సమీక్షకుఁడు:- ఇప్పుడు వీరి యవిద్యతోఁ గూడియున్న నసంభవము లగు మాటలు గమనింపుడు: ఈ ప్రకారముగ పాపాది దుష్కర్మములు దూరములగుననియు, మోహము కలుగదనియు, భవసాగరమునుండి తరించుదనియు, సద్గుణములు సంప్రాప్తములగుననియు, నరకమును వీడి స్వర్గమునకుఁ బోదురనియు, ధర్మార్థ కామమోక్షములు లభించు ననియు, క్లేశములన్నియు, దూరమైపోవుననియుఁ జెప్పుచున్నారే: జైనులందఱు సుఖమును, సకల పదార్థసిద్ధిని బొందుటలే దెందులకు ?

వివేకసారము ౩వ పుటలో జినమూర్తులను స్థాపించినవారు, నముక్తి చము కుటుంబమువారికి జీవికను స్థిరపఱచినవారలని వ్రాయఁబడి యున్నది. (వివేకసారము ౨౨౫ పుట) శివవిష్ణ్వాది విగ్రహములఁ బూజించుట విడు నకుభకరము; అనఁగా నరకమునకు సాధనము.

సమీక్షకుఁడు:- మేలు ! శివాది విగ్రహములు నరకమునకు సాధనము లన్న, జైనుల విగ్రహము లటువంటివి కావా ? మీ విగ్రహములు త్యాగము, శాంతి, శుభముద్ర అను వానితోఁ గూడియున్నఁదున మంచివనియు, శివాది

విగ్రహము లట్టివి కానందున చెడ్డవనియు నందురేని "మీవిగ్రహములు లింగ రూప్యములు విలువగల మందిరములుండుటి వానికి చందన కేసరాదు లెక్కు చుండునపుడు, అవి త్యాగము తో గూడిన పెటులగు" నని వారల నడుగ వల యును : మఱి యీవాటి విగ్రహములు నీడలేకయు నుండును. అవి వైరాగ్య ముతో గూడిన వేలకాపు: ఇక శాంతములంటిరా, జడ పదార్థములన్నియు నిశ్చలము లయినందున శాంతముతో గూడియే యున్నవి. కాబట్టి అన్ని మతములందలి మూర్తిపూజ వ్యర్థమే.

ప్రశ్న:- మా విగ్రహములు వస్త్రములను, భూషణాదులను ధరింపవుగాన మంచివి.

ఉత్తరము:- అందఱు జూడగల నగ్నములయిన విగ్రహము లుయు టయు, వాని నట్లుంచుటయు బకువులవంటి వ్యవహారము.

ప్రశ్న:- స్త్రీల చిత్రపటముంగాని రూపములగాని చూచుటచే గామో త్పన్నమగునట్లు సాధువులయు, యోగీశ్వరులయు విగ్రహములను జూచుటచే శుభగుణములు సంప్రాప్తమగును.

ఉత్తరము:- పాషాణాది విగ్రహములను జూచుటనం [illegible]పరిణామము కలుగునని నమ్ముదురేని, వాని జడత్వాది గుణములుగూడ దప్పక మీయందు నిలుచును. మీరప్పుడు జడబుద్ధిగలవారయి బొత్తిగ చెడిపోదురు. ఇక నట్లే యుత్తమ విద్వాంసుల సేవాసాంగత్యములనుండి విముఖులయి గొప్ప మూర్ఖుల నయిపోదురు. కాబట్టి పాషాణాది విగ్రహములను బూజించువారలకు నదు నొకిండవ సముల్లాసమున వ్రాయబడిన దోషములన్నియు గలుగును. ఈజై నులు విగ్రహారాధనమునుగూర్చి వ్యర్థమైనకోలాహలమునుజెంబియున్నట్లుగనే వీరి మంత్రములందు ననేకాసంభవములైన విషయములు వ్రాయబడియున్నవి.

వీరి యీ మంత్రము రత్నసారభాగము ౧ వ పుటలో గలదు:-

నమో అరిహన్తాణం నమో సిద్ధాణం నమో ఆయరియాణం నమో ఉవజ్ఝాయాణం
నమో లోఏ సబ్బ సాహూణం ఏసో పంచ నముక్కారో సవ్వ పావప్పణా
సణో మంగలాచరణం సబ్బేసిం పఢమం హవఇ మంగలం ॥౧॥

ఈ మంత్ర మాహాత్మ్యము గొప్పగ వ్రాయబడియున్నది జైనులందర కిది గురుమంత్రము. తంత్రపురాణములనే కాదు, బట్టువాజాల కథలనుగూడ

నోధించుననంతటి మాహాత్మ్యము నిందుఁగల్పించియున్నారు. ఇఁక శ్రాద్ధ దిన కృత్యము ౩వ పుటలో:—

> నముక్కారం తఓఫదే ॥ ౯ ॥ జఓకద్వం మన్తమస్తో
> పరమో ఇమున్తి దేయాణదేయం పరమం ఇమున్తి
> తత్తాణతత్తం పరమం పవిత్తం సంసారసత్తాణ దుహాహయాణం ॥ ౧౦ ॥

ఈ మంత్రము పవిత్రమయిన పరమ మంత్రము. ధ్యానయోగ్యమగు వానిలోనిది పరమధ్యేయము తత్వములందు పరమతత్వము. దుఃఖములచేఁ బీడితులైయున్న ప్రపంచమందలి జీవులకీ నవకారమంత్రము సముద్రమును దాఁటించు నోడవలె నున్నయది.

> తాణం అన్ననుతో అత్థి జీవాణం భవసాయరే ।
> బుడ్డుం తాణం ఇమం ముత్తుం నముక్కారం సుపోయయమ్ ॥ ౧౧ ॥

ఓడవలె నున్నట్టి యీ నవకారమంత్రమును త్యజించువారు భవసాగరమున మునిఁగిపోదురు. దీని గ్రహించువారు దుఃఖములనుండి దూరమగుదురు. కాఁబట్టి యీ మంత్రమే అందఱిని దుఃఖరహితులఁ జేయును. అట్లే సకల పాపముల నశింపఁజేసి ముక్తినిగూడఁ బొందఁజేయును. దీని వంటి మంత్రము మఱొకటేదియు లేదు.

> కల్పం । అణేగజమ్మంతరసంచిలాణం దుహాణం సారీరిఅమాణుసాణం ।
> కత్తోయ భవ్వాణ భవిజ్జనాసో న జావపత్తో నవకారమన్తో ॥ ౧౨ ॥

ఈ నవకారమంత్రము అనేక భవాంతరములలోఁ గలిగిన శరీరసంబంధమయిన దుఃఖమును దూరపఱచి, భవ్యజీవులను భవసాగరము నుండి తరింపఁ జేయునది. ఈ మంత్ర మమరసంతవరకు భవసాగరమును జీవుఁడు దాఁటనేరఁడనియు పై సూత్రమునందుఁ జెప్పఁబడినది. ఇఁక నగ్ని ప్రముఖములగు నష్ట మహాభయములందు నీ నవకారమంత్రముదప్ప మఱేదియుఁ దోడ్పడదు మహారత్నవైడూర్యములను మణులను గ్రహించుచున్నట్లు, శత్రుభయమునం దమోఘశస్త్రమును గ్రహించుచున్నటు లీ శ్రుతకేవలిని గ్రహింపఁ దగును ద్వాదశాంగము లన్నిటియం దీ నవకారమంత్రమే రహస్యమట. ఈ మంత్రార్థము (నమో అరిహన్తాణం) తీర్థంకరులకందఱకు నమస్కారము. (నమో సిద్ధాణం) జైనమతసిద్ధులకందఱకు నమస్కారము. (నమో ఆయరియాణం) జైనమతా

చార్యుల కందఱకు నమస్కారము. (నమో ఉవజ్ఝాయాణం) జైనమతోపాధ్యాయుల కందఱకు నమస్కారము. (నమో లోఏ సవ్వ సాహూణం) ఈ లోకమునఁగల జైనమతసాధువుల కందఱకు నమస్కారము. మంత్రమునందు జైనయను పదము లేదు. కాని జైనుల యనేక గ్రంథములందు జైన మతస్థులకుఁదప్ప మఱెవ్వరికిని నమస్కారముకూడఁ జేయవలదని వ్రాయఁబడియున్నందున నీ యర్థమే సరియైనది

(తత్త్వవివేకము [illegible]వ పుట) కఱ్ఱలను, ఱాలను దేవతలుగా భావించి పూజించు మనుష్యుఁడు మంచి ఫలములు పొందుచున్నాఁడు.

సమీక్షకుఁడు:- అటులేని, వాని దర్శించుచు నందఱును సుఖరూపములైన ఫలములఁ బొందుట లేదెందులకు? (రత్నసారభాగము ౧౦వ పుట) పార్శ్వనాథమూర్తిని దర్శించిన పాపములన్నియు నశించును. కల్పభాష్యము ౫౦వ పుటలో జీర్ణములయిన లక్షయిఱువదయిదువేల మందిరములను బాగుచేయించెను. అని వ్రాసియున్నది. అట్లే విగ్రహారాధనమును గూర్చి విశేషముగ వ్రాయఁబడియున్నది. కాఁబట్టి విగ్రహారాధనమునకు మూలకారణమీ జైనమతమేయని విదితమగుచున్నది. ఇఁక నీ జైనసాధువులీలలు గమనింపుఁడు: (వివేకసారము ౨౨౮వ పుట) ఒక జైనమత సాధువు కోశయను వేశ్యతో రమించుచుండి, తదనంతరము విరక్తుఁడయి స్వర్గమునకుఁ బోయెను. (వివేకసారము ౧౦వ పుట) అర్ణకముని చారిత్రను వదలి యనేక సంవత్సరముల వఱకు దత్తసెట్టి యింట విషయభోగములు సేవించి పిదప దేవలోకమునకు బోయెను. శ్రీకృష్ణుని పుత్రుఁడగు ఢంఢణ మునిని (స్యారియా నక్క యెత్తుకొనిపోయెను. పిమ్మట వాఁడు దేవతయయ్యెను. (వివేకసారము ౧౫౬వ పుట) జైనమతసాధువు లింగధారి—కేవల వేషధారి—యయినను శ్రావకు లతనిని సత్కరింపవలయును. అ సాధువులు శుద్ధచారిత్రులే కానిండు, అశుద్ధ చారిత్రులే కానిండు అందఱును పూజనీయులు. (వివేకసారము ౧౬౮ పుట) జైనమత సాధువు చారిత్ర హీనుఁడయినను, అన్యమత సాధువుల కంటె శ్రేష్ఠుఁడు. (వివేకసారము ౧౭౧ వ పుట) శ్రావకులు జైనమత సాధువులను చారిత్రరహితులుగాను—భ్రష్టాచారులగాను—జూచినను గూడ వారిసేవ చేయవలయును. (వివేకసారము ౨౧౬వ పుట) ఒక తస్కరుఁడు అయిదు పిడికిళ్ళ వెంట్రుకల నూడఁబెఱికి చారిత్రను గ్రహిం

చెను. కరు కష్టమును పశ్చాత్తాపము నొందెను. ఆతని మానమున గేవల జ్ఞాన మునుబొంది సిద్ధుఁడయ్యెను.

సమీక్షకుఁడు:- ఇప్పుడు వీరి సాధువులయు గృహస్థులయు లీలఁ గమ నించితిరా! వీరి మతమున ననేక దుష్కర్మముల నొనర్చు సాధువు కూడ సద్గ తిని బొందునుగా! వివేకసారము ౧౦౬వ పుటలో "శ్రీకృష్ణుఁడు మూఁడవ నరకమునకుఁ బోయినాఁడని" వ్రాయఁబడియున్నది. వివేకసారము ౧౪౫వ పుటలో, "ధన్వంతరి నరకమునకుఁబోయి నాఁడని" వ్రాసియున్నది. వివేక సారము ౪౮వ పుటలో "జోగులు, జంగములు, కాజీమల్లాలు అజ్ఞానముచే ననేక కష్టములకోర్చి తపములనొనరించినను దుర్గతినేపొందుచున్నారని" వ్రాయఁ బడియున్నది. రత్నసారభాగము ౧౬౦ వ పుటలో తొమ్మండుగురు వాసు దేవులు అనఁగా త్రిపృష్ఠ వాసుదేవుఁడు, ద్విపృష్ఠ వాసుదేవుఁడు, స్వయంభూ వాసుదేవుఁడు, పురుషోత్తమ వాసుదేవుఁడు, సింహపురుష వాసుదేవుఁడు, పురుషపుండరీక వాసుదేవుఁడు, దత్తవాసుదేవుఁడు, లక్ష్మణవాసుదేవుఁడు, శ్రీకృష్ణవాసుదేవుఁడు అను వీరందఱు, పదునొకండవ, పండ్రెండవ, పదు నాల్గవ, పదునైదవ, పదునెనిమిదవ, యిరువదవ, ఇరువదిరెండవ తీర్థంక రుల సమయములందు నరకమునకుఁ బోయినారు. అట్లే తొమ్మండుగురు ప్రతి వాసుదేవులు అనఁగా అశ్వగ్రీవప్రతి ప్రతివాసుదేవుఁడు, తారకప్రతి వాసు దేవుఁడు, మోరకప్రతివాసుదేవుఁడు, మధుప్రతివాసుదేవుఁడు, నిశుంభప్రతి వాసుదేవుఁడు, వలిప్రతివాసుదేవుఁడు, ప్రహ్లాదప్రతివాసుదేవుఁడు, రావణ ప్రతి వాసుదేవుఁడు, జరాసింధుప్రతివాసుదేవుడు అను వీరందఱును నరకమునకుఁ బోయినారు' అని గలదు. మఱి కల్పభాష్యమున [మోక్ష కల్పానక ౫౩-౭౬వ పుట] ఋషభదేవుఁడు మొదలుకొని మహావీరుని పర్యంతము ౨౪ తీర్థం కరులందరు మోక్షమును బొందినార'ని వ్రాయఁబడియున్నది.

సమీక్షకుఁడు:—బారా! అనేక వేశ్యాగాములును, పరస్త్రీగాములును, తస్కరాదులునగు జైనమతస్థులందఱు స్వర్గమునకుఁబోయి ముక్తిని బొంది నారనియు, శ్రీకృష్ణాది గొప్ప ధర్మాత్ములయిన మహాత్ములందఱు నరకము నకుఁ బోయినారనియు వ్రాయుట యెంత చెడుగో బుద్ధిమంతు లూహింప దగును. ఆలోచించి చూచినచో జైనుల సహవాసము కావి, వారిని జూచుట

గాని సజ్జనుల కెంతమాత్రము నుచితము కాదని తెలుపుచున్నది. ఏలయన వీరి సహవాసమువలన నిట్టి మిథ్యోక్తులు వారి హృదయములందును నాటుకొనును. ఎందువలననగా:- ఈ మహాహఠులు దురాగ్రహులనగు మనుజుల సహవాసముచే గిడుమూటుట తప్ప మరేమియుఁ జిక్కదు. ఇక జైనులలో నుత్తము * లగు వారితో సత్సంగాదుల నాచరించిన దోషమునులేదు. వివేకసారము [illegible] వ పుటలో "గంగాది తీర్థములకుఁ బోయినను, కాశీ మొదలగు యాత్రలు చేసినను పరమార్థమేమియు సిద్ధింపదు. కాని [రత్నసార [illegible] వ పుట] మా గిరినార, పాలీటాణా, ఆబూ మున్నగు తీర్థక్షేత్రములు మాత్రము ముక్తిని గూడ లభింపఁజేయు"నని వ్రాయబడియున్నది.

సమీక్షకుఁడు:- ఇట విచారింపవలసినదేమన శైవవైష్ణవాదుల తీర్థక్షేత్రములు జలస్థలములును జడరూపములునై యున్నయటులే జైనులవియు నున్నవిగా! ఇందొకదాని నిందించుటయు మరొకదానిని స్తుతిచేయుటయు మౌర్ఖ్యము కాక మఱేమగును.

## జైనుల ముక్తి వర్ణనము

(రత్నసార భా-పుట 23.) "ఊర్ధ్వలోకమున నొక సిద్ధశిలయను స్థానముకలదు. అది స్వర్గపురికిఁ బైన నలుబదైదులక్షల యోజనముల వైశాల్యమును, అంతయే అవకాశమును, లోతును, ఎనిమిది యోజనముల మందమును, తెల్లని ముత్యముల హారమువలె-ననగాఁ గోదుగ్ధమునకంటె తెలుపును, బంగారువంటి మెఱుపును, స్ఫటికమువంటి పరిశుభ్రతయుఁ గలిగి యున్నది. ఆ సిద్ధశిల పదునాల్గవలోక శిఖరము మీదఁ గలదు. ఆ సిద్ధశిల మీదనున్న శివపురమను ధామమందుగూడ ముక్తపురుషులు అంతరిక్షమున వసించుచున్నారు. అట జన్మమరణాది దోషములు సంభవింపవు. ఆనందముగ నుందురు. వారు తిరిగి జన్మమరణముల నొందరు. ఏమన వారికర్మము లన్నియు వినశించును" అని మహావీరుఁడను తీర్థంకరుఁడు గౌతమునితోఁ జెప్పుచున్నాఁడు. ఇది జైనుల ముక్తి.

సమీక్షకుఁడు:- విచారింపవలసిన దేమన నన్యమతములందలి వైకుంఠము, కైలాసము, గోలోకము, శ్రీపురము మున్నగుననియే మోక్షధామము

* [illegible] జైనమతమునం దెప్పుఁడు నుండరు.

లని పౌరాణికులును, ఇతర క్రైస్తవులు నాల్గవ యాకాశమునను, ముసల్మాను లేడవ యాకాశమునను మోక్షస్థలములు కలవని నమ్ముచున్న యటులే యీ జైనుల సిద్ధశిలయు శివపురమును గలవు ఇతర జైనులు దేనిని పైభాగమని నమ్ముచున్నారో, దానినే క్రింద నున్నవారు, ఎవరీ భూగోళమున మాకంటె క్రిందనున్నారో వారు తమ దృష్టియందు దానిని క్రిందిభాగమని భావించు చున్నారు. కాన పైభాగము, లోభాగము అనునదొక వ్యవస్థిత పదార్థముకాదు. ఆర్యావర్తనివాసులగు జైనులు పైభాగముగా భావించుదానినే, అమెరికా నివాసులు లోభాగముగా భావించుచున్నారు. ఆర్యావర్త నివాసులు లోభాగముగా భావించుదాని నమెరికావాసులు పైభాగముగా నెంచుచున్నారు. ఆశిల నలువది రెండు లక్షలేకాదు, దానికి రెండింతలు అనగా తొంబది లక్షల క్రోసులు గలదయియున్నను, అము క్తపురుషుల కది బంధనమే యగును. ఏలయన నాశిలనుండికాని ఆ శివపురమునుండికాని బయటికి వెడలిరా. ము క్తివిడిపోవును. సదా అందే యుండు ప్రీతి, దాని నుండి వెడలుట కప్రీతి యుండును గాదా. ఆటంకమును, ప్రీతియు, నప్రీతియు కలుగుచోటు మోక్షదామ మనబడనేరదు. నవమసముల్లాసమునందు ము క్తినిగూర్చి వ్రాసియున్నాము. అట్లంగీకరించుటయే శ్రేయస్కరము. ఈ జైనుల ము క్తికూడ నొకవిధమైన బంధనముగా నున్నది. ఈ జైనులును, ము క్తియను భ్రమలోబడియే చిక్కి యున్నారు. కాని వేదముల యథార్థమైన యర్థము బోధ పడనందువలన వారు ము క్తిస్వరూపము నెన్నటికి నెఱుగజాలరనుట నిక్కము.

ఇంకను వీరి యసంభవములైన కొన్నిమాటల నాలకింపుడు: (వివేక సారము ౬౦వ పుట) మహావీరుడు జన్మించినపుడు, అతనిని ఒకకోటి యఱువది లక్షల కలశములతో స్నానము జేయించిరి. (వివేక. ౧౩౬వ పుట) దశార్ణుడను రాజు మహావీరుని దర్శించుటకు వెళ్లి కొంత యభిమానమును గనబఱచెను. అతని యభిమానమును నివారించుటకు ౧౬౭౭,౭౨,౧౬౦౦౦ ఇంద్రస్వరూపులు ౧౩,౩౭,౦౫,౭౨౮౦,౦౦,౦౦౦౦౦. ఇంద్రాణులు అక్కడికి వచ్చిరి. అప్పుడు రాజు చూచి యాశ్చర్యము నొందెను.

సమీక్షకుడు:- ఆ యింద్ర, ఇంద్రాణులకు నిలుచుటకిట్టివెన్నియో భూగోళములు కావలసి యుండు నవియె కద విచారింపదగి యున్నది. (శ్రాద్ధదిన

కృత్యము' ఆత్మనింద భావన ౩౧వ పుటలో) బావులు, కూపములు, చెఱువులు కట్టింపఁగూడదని వ్రాయఁబడియున్నది.

సమీక్షకుఁడు:- సరి! మనుష్యులంతయు జైనమతమునఁ గలిసి కూపములను, తటాకములను, బావులు మున్నగువాని నెవ్వరును గట్టింప కుండురేని వారంతయు నెక్కడినుండి నీళ్ళు త్రాగఁగలుగుదురు?

ప్రశ్న:- తటాకాదులఁ గట్టించిన నందు జీవములు పుట్టును. దానిచేఁ గట్టించినవానికిఁ బాపము సంభవించును గాన జైనులమగు మేమీ కార్యములను జేయము.

ఉత్తరము:- మీ బుద్ధియేల నష్టమై పోయినది? ఏలయన క్షుద్రజీవములు చచ్చుటవలన పాపము కలుగునని భావించుచున్న గొప్ప గోవులు మున్నగు పశువులును, మనుష్యాది ప్రాణులును జలపానాదులఁ జేసిన నెంతయో గొప్ప పుణ్యము కలుగుననియు నేల భావింపరుత? (తత్త్వ వివేక. ౧౯౬-౧౯౭వ పుట) 'ఈ నగరమునందొక నందమణికారుఁడను సెట్టి బావిని గట్టించినందులకు ధర్మభ్రష్టుఁడయి పదియారు మహారోగముల చేతఁ బీడితుఁడయ్యెను. తదుపరి మృతి నొంది యా బావిలోనే గోదురుకప్పయై పుట్టెను. మహావీరుని దర్శించుటవలన వానికి జాతిస్మరణ కలిగినది. నారాకను విని నన్ను పూర్వజన్మ ధర్మాచార్యుఁడని తెలిసికొని, వందన మాచరించుటకు దగ్గఱకు రాగా మార్గమునఁగల శ్రేణికుని గుఱ్ఱము కాలిక్రిందఁబడి శుభధ్యాన యోగమునఁ జచ్చి దర్దురాంకనామము గల మహార్ధికదేవత యయ్యెను. అవధిజ్ఞానముచే నేనిక్కడికి వచ్చినానని యెఱింగి వందనముచేసి బుద్ధిని గనఁబఱచి పోయినాఁ'డని మహావీరుఁడు చెప్పుచున్నారు.

సమీక్షకుఁడు:- ఇత్యాది విద్యావిరుద్ధములును అసంభవములును మిథ్యయునగు మాటలఁ జెప్పెడు మహావీరుని, సర్వోత్తముఁడని భావించుట మహాభ్రాంతి యనియె చెప్పనొప్పును. (శ్రాద్ధదినకృత్య ౩౬వ పుటలో) ప్రేతవస్త్రములను సాధువులు తీసికొనవలెనని వ్రాయఁబడియున్నది.

సమీక్షకుఁడు:- చూడుఁడు! వీరి సాధువులుకూడ మహాబ్రాహ్మణుల వలెనైరి. వస్త్రములను సాధువులు తీసికోవలెనన్న మరి యామృతి నొందిన

వారి యాభూషణముల నెవడు తీసికొనవచ్చెను? బహుమూల్యమైన వస్తువులచే నింట నుంచుకొనుచున్నారే అపుడు వారెవరయిరి?

(రత్నసార ౧౦౫వ పుట) క్రేపుట, వంచుట, పసరుట, అన్నము వండుట మున్నగువానివలనఁ బాపము గలుగుచున్నది.

సమీక్షకుఁడు:- సరి! ఇప్పుడు వీరల విద్యావిహీనతను గనుగొనుఁడు. ఈ కర్మముల నొనరింపనిచో మనుష్యాది ప్రాణులెట్లు జీవింపఁగలుగును? మఱి జైనులు సయితము పీడితులయి చావనే చత్తురుగద.

(రత్నసార ౧౦౪వ పుట) తోఁటలు వేయుటవలన దోఁటకాపున కొక లక్షపాపములు గలుగుచున్నవి.

సమీక్షకుఁడు:- తోఁటకాపునకు లక్షపాపములు గలుగుచున్నవన్న దానిచే ననేక జీవములు పత్ర, ఫల, పుష్ప, ఛాయాదులఁబొంది యానందితు లగు చున్నందున కోట్లకొలఁది పుణ్యములుకూడ గలుగుచునేయున్నవి; దీని విస్మరింపఁజేయుట గొప్ప యన్యాయమేకద.

(తత్త్వవివేక...౨౦౨వ పుట) ఒక దినమున నందిషేణ సాధువు మఱి వేశ్యయింటికిఁబోయి ధర్మమునేర భిక్షమడిగెను. ఇక్కడ ధర్మముతోఁ బనిలేదు. అర్థమే కావలసియున్నదని ఆవేశ్యచెప్పెను. అప్పుడా సాధువు ౧౨ లక్షల యేఁబదివేల యసరంజీలను ఆమె యింటఁ గురిపించెను.

సమీక్షకుఁడు:- ఈవార్తను సత్యమని బుద్ధిహీనుఁడు తప్ప మఱొకఁ డెవఁడంగీకరించును?

(రత్నసారభాగము ౬౭వ పుటలో) ఒక శిలావిగ్రహము గుఱ్ఱమునెక్కి యెవరెప్పుడు స్మరించిననప్పటికివచ్చి వారిని రక్షించుచున్నదని వ్రాసియున్నది.

సమీక్షకుఁడు:- జైన మహాశయులారా! వర్తమాన సమయమున మీవద్ద దొంగతనములు మొదలగునవి జరుగుచు శత్రుభయము గలుగు చుండునుగద. దానిని స్మరించి మీరేల రక్షింపఁబడుటలేదు? అటు నిటు పోలీసు మొదలుగాఁగల రాజకార్యాలయములకు దిక్కులేక యేల దిరుగుచున్నారు?

ఇఁక వీరి సాధువుల లక్షణములు:-

సరజోహరణా భైక్ష్యభుజో లుంచితమూర్ధజాః ।
శ్వేతాంబరాః క్షమాశీలా నిఃసంగా జైనసాధవః ॥ స.ద.అధ్యా. ౪ శ్లో. ౧ ॥

జైనసాధువుల లక్షణములను, జిన దత్తసూరియను నతఁడీ శ్లోకము లందు వివరించియున్నాఁడు. (రజోహరణా) చామరము నుంచుట, భిక్ష మడిగి తినుట, తలవెంట్రుకలు పెరికికొనియుండుట, శ్వేతవస్త్రములు ధరించుట, క్షమకలిగి యుండుట, నిస్సంగుఁడై యుండుట, అను నీలక్షణములు గల జైన శ్వేతాంబరులే యతు లనఁబడుదురు.

లుంచితాః పిచ్ఛికాహస్తాః పాణిపాత్రా దిగంబరాః ।
ఊర్ధ్వాశినో గృహే దాతు ర్ద్వితీయాః స్యు ర్జినర్షయః ॥ ౨ ॥

రెండవవారు దిగంబరులు, అనఁగా వస్త్రములు ధరింపకయుండు వారును, తలవెంట్రుకలను పెఱికివేయువారును, ఉన్నిపోగులతోఁ జేయఁబడిన పిచ్ఛికయను ఊడ్చుకొను సాధనమును చంకనుంచువారును, ఎవఁడేని భిక్ష మిచ్చిన చేతియందుంచుకొని తినువారును దిగంబరు లనఁబడుదురు. వీరు రెండవ విధమైన సాధువులు. భిక్షమిచ్చు గృహస్థుఁడు భోజనముచేసిన తరువాత భోజనముచేయువారు జినర్షులు అనఁగా మూఁడవ విధమయిన సాధువు లనఁబడుదురు.

భుంక్తే న కేవలీ న స్త్రీ మోక్షమేతి దిగంబరః ।
ప్రాహురేషామయం భేదో మహాన్ శ్వేతాంబరైః సహ ॥ ౩ ॥

ఇఁక దిగంబర శ్వేతాంబరులందు భేదమేమన, దిగంబరులు, కేవలి [కైవల్యార్థి] భోజనముచేయదు-స్త్రీల కపవర్గము లేదందురు. శ్వేతాంబరులు కలదందురు. ఇత్యాది విషయముల వల్లనే వీరు ముక్తిని పొందుచున్నారు.

ఇదియే వీరి సాధువులలోఁగల భేదము. కావున జైనులలోఁగల కేశ లుంచనము సర్వత్ర ప్రసిద్ధమైయున్నది. ఐదు పిడికిళ్ళు వెంట్రుకల నూడఁ బెరుకుట మున్నగు మాటలు వ్రాయఁబడియున్నవి.

వివేకసారము పా-౨౧౬ వ పుటలో అయిదు పిడికిళ్ల వెంట్రుకల నూడబెఱికి చారిత్రను గ్రహించెను. అనఁగా నైదు పిడికిళ్ళు తలవెంట్రుకల నూడబెఱికి సాధువయ్యెనని వ్రాసియున్నది. (కల్పసూత్ర భాష్యము ౧౦౮ వ పుట) కేశలుంచన మొనరించి గోకేశములవలె నుంచఁదగును.

సమీక్షకుఁడు:- జైనులారా! చెప్పరు: మీ దయాధర్మమిఁక నెక్కడ నుండెను? ఏమి! ఇది హింస యనఁబడదా? అనఁగాఁ దనచేతితోఁ దానేకాని

అతని గురువేకాని యన్యుఁడెవఁడేకాని వెండ్రుకల నూడఁబెరికినచో నా జీవి
కెంత కష్టము కలుగవచ్చును? జీవికి కష్టము కలుగఁజేయుటయే హింసయనఁ
బడుచున్నది.

వివేకసారము ౬౮వ పుట—౧౯౩౯వ విక్రమ సంవత్సరమున శ్వేతాం
బరులలో ఢూంఢియాలనువారును, ఆ ఢూంఢియాలలో పదుమూఁడు పంథీయులు
మున్నగు వేషధారులును వెడలియున్నారు. ఢూంఢియాలు పాషాణాది మూర్తుల
నంగీకరింపరు. వారు భోజనమును స్నానమును చేయునప్పుడే కాక తక్కిన
సమయములందు సదా నోటిపై పట్టియఁ గట్టుకొనెదరు. యతులు మున్నగు
వారుగూడఁ బుస్తకములు చదువునపుడు మాత్రమే ముఖము మీఁద పట్టియఁ
గట్టుకొనియుందురు. అన్యసమయములందుఁ గట్టుకొనరు.

ప్రశ్న:- ముఖము మీఁద నవశ్యముగఁ బట్టి కట్టుకొనవలయును. ఏల
యన "వాయుకాయము" అనఁగా గాలిలోనుండు సూక్ష్మశరీరములు కల జీవులు
నోటిగాలి వేడిమివల్ల చచ్చిపోవును. అట్టి పాపము ముఖము మీఁద పట్టియ
గట్టుకొననివారికిఁ గలుగును. కావుననే మేము ముఖము మీఁద పట్టియ గట్టు
కొనుటను మంచిదనిఁ దలఁచుచున్నాము.

ఉత్తరము:- ఈ మాటయు విద్యకును, ప్రత్యక్షాది ప్రమాణములకును
విపరీతమై యున్నయది. ఎందులకన జీవములు అజరామరములు, అవి నోటి
కాక కెన్నటికిని చావనేరవు. వీనిని మీరును అజరామరములనియే యొప్పుకొను
చున్నారు కదా!

ప్రశ్న:- జీవములు చావవు కాని నోటియందలి యుష్ణవాయువు వల్ల
వానికిఁ బీడ గలుగుచున్నది. అట్టి పీడను కలుగఁజేయువారికిఁ బాపము కలు
గును. కాన ముఖముమీఁద పట్టియ గట్టుకొనుట మంచిది.

ఉత్తరము:- మీ యీమాటగూడ సర్వథా యసంభవమే. ఏలయనఁ
బీడఁ గలిగింపకయుండవలెనన్న నొకజీవుని వ్యాపారముకూడ గించిత్తైనను
జరుగనేరకుండును. నోటివాయువువలననే జీవులకుఁ బీడగలుగుచున్నదని మీ
మతమునఁగలదేని నడచుట, తిరుగుట, కూర్చుండుట, చేతులనెత్తుట, ఱెప్ప
వాల్చుట మున్నగువానియందు నవశ్యముగఁ బీడగలుగుచుండవచ్చును. కాఁబట్టి
మీరుకూడ జీవములకుఁ బీడగలుగకుండునట్లు వర్తింపనేరరు.

ప్రశ్న:- ఔను. అయినంతవఱకు జీవులను రక్షింపవలయును. మీ మెప్పుడు రక్షింపలేమో యప్పుడు నశక్తులము. ఏలయన వాయువుమున్నగు పదార్థములందంతట జీవులు నిండియున్నవి. మేము ముఖము మీఁద పట్టియ కట్టుకొనకున్న ననేక జీవములుచచ్చును. బట్టకట్టుకొనుటవలన సంతగా 'జావవు.

ఉత్తరము:-మీ యీవాక్యమును యుక్తిశూన్యమైనదే. ఏలయన బట్టి కట్టుకొనుటవలన జీవుల కధికదుఃఖము కలుగును. ఒకఁడు ముఖము మీఁద బట్టకట్టుకొనినచో నతని ముఖవాయు వాచక అది క్రిందికో, పార్శ్వమునకో లేక మౌనముగానున్న సమయమున నాసిక ద్వారా కుంఠితమయి వేగముగనో వెడలుచుండును. దానిచే నుష్ణత యధికమై మీ మతానుసారముగ జీవులకు విశేషముగ పీడ కలుగవచ్చును. చూడుఁడు! ఇంటికి, గదికిఁగల తలుపులన్నియు మూయఁబడిన పక్షమందుఁగాని, లేక తెరకట్టఁబడిన పక్షమందుగాని, యుష్ణత యధికమగుచున్నది. తెఱవఁబడియున్న నంత యధికము కాఁజాలదు అటులే ముఖముమీఁద పట్టి గట్టుకొనుటవలన నుష్ణత యధికమగును. తెఱచియుంచిన న్యూనమగును. ఆ ప్రకారమే మీరు మీ మతానుసారముగ జీవుల కధికదుఃఖమును గలుగఁజేయుచున్నారు. నోరు మూయఁబడినపుడు ముక్కు పుటముల నుండి వాయు వొకచోటఁజేరి కుంఠించి వేగముగ వెడలుచు, జీవుల కధికాపాయమును, పీడను కలిగింపవచ్చును. చూడుఁడు! ఒక మనుష్యుఁడు నోటితోను, మఱొకఁడు గొట్టముతోను అగ్ని నూఁదునేని నోటితో నూదిన వాయువు విస్తరించి వెడలుటఁజేసి యగ్నిని తక్కువగాను, గొట్టముతో నూఁదినవాయు వొకచోటఁజేరి వెడలుటవలన నగ్ని నధికముగాను రగులుకొనఁజేయును. ఆ ప్రకారమే ముఖముమీఁద పట్టి గట్టుకొని వాయువునాపుటచే నది నాసికద్వారా మిక్కిలి వేగముగ వెడలి జీవములకధికదుఃఖమును కలిగించును. కాన ముఖము మీఁద పట్టి గట్టుకొనువారికంటెఁ గట్టుకొననివారే ధర్మాత్ములు. ముఖముమీఁద పట్టిగట్టుటచేఁ దగిన స్థానప్రయత్నములతో నక్షరముల యుచ్చారణ కూడ జరుగదు. నిరనునాసికములైన యక్షరములను సానునాసికములుగా యుచ్చరించుటఁజేసి మీకు దోషమును కలుగును. ఇఁక ముఖముమీఁద పట్టి కట్టుకొనుటచేత దుర్గంధమధికమగును. ఏలయన శరీరములోపల దుర్గంధము నిండియున్నది. శరీరము లోపలినుండి వెడలు వాయువంతయు దుర్గంధయుక్తమగుట ప్రత్య

క్షము. దాని నధ్గగించిన దుర్గంధ మధికమగును. ఎట్లన బంధింపఁబడియున్న (జాబురూర్) ప్రదేశ మధిక దుర్గంధయుక్తమును. తెఱచియున్న ప్రదేశమల్ప దుర్గంధయుక్తమునగును. అట్లే ముఖముమీఁద పట్టి కట్టుకొనుటవలనను, దంతధావన ముఖప్రక్షాళన స్నానాదులను చేయకపోవుటవలనను, వస్త్రములు శుభ్రపఱచుకొనక పోవుటవలనను మీ శరీరములం దధిక దుర్గంధ ముత్పన్నమై ప్రపంచమునందు రోగము నధికమగును. ఇట్లు మీరు జీవుల కెంతటి పీడ కలిగించుచున్నారో యంత యధికముగ మీకు పాపము కలుగుచున్నది. జాతరయు మున్నగు వానియం దధికముగా దుర్గంధము వ్యాపించుటచేత "విశూచిక-కలరా" మొదలగు ననేకవిధ-రోగము లుత్పత్తిల్లి జీవులకు దుఃఖదాయకములగునట్లే దుర్గంధము తక్కు-వై యున్న రోగములును దక్కు-వగాఁ బుట్టి జీవులకు విశేషదుఃఖమును సంభవింపదు. కాఁబట్టి మీరధికముగా దుర్గంధమును బెంచుటచేత గొప్ప నేరగాండ్రయియున్నారు. ఇఁక ముఖముమీఁదపట్టి కట్టుకొనక దంతధావనమును, ముఖప్రక్షాళనము, స్నానములను జేసి స్థాన, వస్త్రములను శుభ్రముగా నంచుకొనువారు మీకంటె మిక్కిలి మంచివారు. దుర్గంధములోఁ గూడియుండు అంత్యజుల సహవాసమందుండని వారును మిక్కిలి మంచివారే. దుర్గంధయుక్తులగు నంత్యజుల సహవాసముచేత నిర్మలమైన బుద్ధి కలుగనటులే మీ, మీసాంఘికుల సహవాసమున నుండువారిబుద్ధియు వృద్ధిఁబొందదు. ఇఁక రోగాతిశయముచేతను ధర్మానుష్ఠానమునందు విఘ్నములు గలుగునటులే మీ, మీసంఘమువారి స్థితికావచ్చును.

ప్రశ్న:- మూయఁబడిన గృహమునందు రగులఁజేసిన అగ్నిజ్వాల వ్యాపించినందున బయటనున్న జీవులకు దుఃఖము గలిగింపనేరదు. అటులే మేము ముఖముమీఁద పట్టి గట్టుకొని వాయువు నాపుచు వెలుపలిజీవుల కల్పదుఃఖము మాత్రమే కలుగఁజేయుచున్నారము. కాన ముఖముపై పట్టి గట్టుటవలన బయటవాయువులోనున్న జీవములకుఁ బీడ గలుగదు. ఇఁక నెదుట రగులుచున్న నగ్నికర్షముగఁజేయునుంచినదో కాక తక్కు-వగాఁ దగులును. గాలిలోఁగల జీవములు శరీరములు కలవై యున్నందున వాని కవశ్యముగఁ బీడ గలుగును.

ఉత్తరము:—ఇదియును మీ పసితనపుమాటయే. మొదట గమనింపుఁడు. ఎక్కడ ఛిద్రముండదో, ఎక్కడ లోపలివాయువు వెలుపలివాయువుతోఁ గలియకుండునో యక్కడ నగ్నియు రగులుకొననేరదు. దీనిఁ బ్రత్యక్షముగాఁ జూడఁగోరుదురేని యొక లాంతరులో దీపమును ముట్టించి ఛిద్రము లన్నియు మూసివేసి చూడుఁడు: దీప మప్పుడే ఆఱిపోవును. భూమిపై సంచరించు మనుష్యాది ప్రాణులకు బయటిగాలి దొరకకున్న జీవింపనేరనట్లే అగ్నియు రగులుకొననేరదు. ఒకవైపునుండి అగ్నివేగము నడ్డగించిన నది రెండవవైపున కతివేగముతో వెడలును. అట్లే చేతి నడ్డముగా నుంచిన ముఖమునకు మంట తక్కువగా తగులును. కాని చేతి కెక్కువగాఁ దగులును. కాన మీమాట సరియైనది కాదు.

ప్రశ్న:—ఒక పెద్దమనుష్యుని కొక చిన్నమనుష్యుఁడు దగ్గరగా చేరి చెవిలో మాటఁ జెప్పునపుడు "నోటినుండి తుంపరలు రాలకుండుటకును, దుర్గంధ మతనికి కలుగకుండుటకును" ముఖముమీఁద బట్టనో లేక చేతినో యుంచును. పుస్తకము చదువునపుడు నవశ్యముగ దానిమీద నుమ్మిపడి యది యుచ్ఛిష్టమై చెడిపోవును. దీని నంద తెలుఁగుదురు. గాన ముఖముమీఁద పట్టి కట్టుకొనుట మంచిది.

ఉత్తరము:— జీవులు రక్షింపఁబడుదను నుద్దేశముతో ముఖము మీఁద పట్టి గట్టుకొనుట వ్యర్థమని దీనిమూలమున సిద్ధమైనది. ఇఁక పెద్దమనుష్యునితో నొకఁడు మాటలాడునపుడు, "ఆ గుప్తమైనమాట నితరుఁడు వినకుండుటకుగాను ముఖముమీఁద గుడ్డనో, చేతినో యుంచును ప్రసిద్ధముగా మాటలాడునపుడు ముఖముమీఁద గుడ్డనుగాని చేతినిగాని యెవఁడు నుంచఁడు. కాఁబట్టి గుప్తమైన మాటకొఱకే యట్లు తటస్థించునని విదితమగుచున్నది. ఇఁక దంతధావనాదు లొనరింపనందున మీ ముఖము మున్నగు నవయవములనుండి యత్యంత దుర్గంధము వెడలుచున్నది. కాన మీరొకని సమీపమునఁగాని, యొకఁడు మీ సమీపమునఁగాని కూర్చుండిన దుర్గంధముతప్ప మరియేమి వచ్చును? ముఖమున కడ్డముగా చేతినో లేక కొంగునో యుంచెడు ప్రయోజనము లితరము లనేకములు కలవు. అనేక మనుష్యులయెదుట గోప్యమైన మాటఁ జెప్పునపుడట్లు చేతినో, కొంగునో యుంచకున్న నితరుల దిక్కునకు వాయువు

వ్యాపించి ఆమాట వినఁబడును. వారిద్దఱు నేకాంతమున మాటలాడునప్పుడు మూఁడవ వాడుండరు. కాన నట్లు చేయవలసియుండదు. ఇఁక పెద్దంమీఁదనే యుమ్మివడకుండవలెనన్న, చిన్నలమీఁద నుమ్మి పడవచ్చునా? ఆ యుమ్మి నుండియు తప్పించుకొనఁజాలరు. ఏలయన మేము దూరమునుండి మాట లాడినను గాలి మాదిక్కునుండియు యితరుల దిక్కునకుబోవు సూక్ష్మరూపము దాల్చి త్రసరేణువు లావాయువుతోఁ గలిసి వాని శరీరముమీఁద నవశ్యముగాఁ బడును. దానినిగూడ దోషమని భావించిన నది యవిద్యయే యనఁబడును. మఱి నోటివేఁడిమికి జీవులు చచ్చుననియో లేక వానికి పీడ గలుగుననియో నమ్ము చున్న వైశాఖ జ్యేష్ఠ మాసములందు సూర్యుని తీక్ష్ణమైన వేఁడిమి కావాయు కాయ జీవము లొకటియు మిగులక నన్నియు జచ్చిపోవును. కాని యావేఁడిమి కాజీవులు చావనేరవు. కాన మీ యీ సిద్ధాంతమును మిథ్యయే. ఏలయన మీతీర్థం కరులు పూర్ణవిద్వాంసులై యున్న నిట్టి వ్యర్థమైన మాటల నెందులకు వచించి యుందురు. చూడుడు! ఏ జీవులు సర్వావయవములతో విద్యమానమై యున్నవో వానికే పీడ కలుగుచున్నది. ఇందులకు ప్రమాణము:—

పంచావయవయోగాత్ సుఖసంవిత్తిః ॥ సాంఖ్య. అ. ౫. సూ. ౨౭ ॥

పంచేంద్రియములకు పంచవిషయములతో సంబంధము కలుగునప్పుడే జీవులకు సుఖమో లేక దుఃఖమో కలుగుచున్నది. చెవిటివాని కొకఁడు తన్ను తిట్టుచున్నాడను జ్ఞానముకాని, అంధునకు రూపజ్ఞానము కాని అథవా వాని యెదుటనుండి సర్పవ్యాఘ్రాది భయంకరము లయిన జంతువులు పోవుచున్నను వాని జ్ఞానముకాని, పక్షవాతరోగము కలవానికి స్పర్శజ్ఞానముకాని, పీనసరోగము కలవానికిఁ బరిమళజ్ఞానముగాని, శూన్యజిహ్వగలవానికి రుచిజ్ఞానముగాని గలుగ నేరనటులే ఆ జీవుల స్థితియుఁ గలదు. చూడుడు. మనుజుని జీవము సుషుప్తిదశ యందుండునప్పు డాజీవికి సుఖదుఃఖము లేవియుఁ గలుగవు. ఎందులకన జీవము శరీరములోపల నుండునుగాని దాని కప్పుడు బాహ్యావయవములతో సంబంధ ముండకపోవుటవలన సుఖదుఃఖములు కలుగవు. వైద్యులును ఇప్పటి డాక్టరులును, మత్తుపదార్థముల దినిపించియో, లేక వాసన చూపించియో రోగుల శరీరావయవములఁ గోయుచు, ఛేదించుచున్నప్పుడు వారికి దుఃఖమేమియు విదితముకానటులే వాయుకాయజీవములకును, అన్యస్థావర శరీరములఁగల

జీవులకును సుఖదుఃఖము లెన్నటికిని గలుగనేరవు. ఎట్లన మూర్ఛితదశలో నున్న జీవులకు సుఖదుఃఖములు కలుగనట్లే అత్యంత మూర్ఛితదశలో నున్నవీ వాయుకాయ జీవులకు, సుఖదుఃఖములు కలుగ నేరవనుట స్పష్టము. అట్లయిన వీనికి పీడ గలుగ కుండ వీనిఁ గాపాడవలెనను నదెట్లు సిద్ధింపఁగలదు వానికి సుఖదుఃఖములు గలవనునది ప్రత్యక్షముకానపుడు మీ యనుమానాదు లెట్లెట్లు సంగతముంగును?

ప్రశ్న:— అవి జీవులేకద వానికి సుఖదుఃఖము లెందులకుఁ గలుగ కుండును?

ఉత్తరము:— వెఱ్ఱి తమ్ములారా! వినుఁడు! మీరు సుషుప్తిలో నుండునపుడు మీకు సుఖదుఃఖము లేలకలుఁగవు? సుఖదుఃఖములు కలుగుటకు ప్రసిద్ధ సంబంధమే కారణముకద. మత్తుపదార్థముల వాసన చూపించి డాక్టర్లు అంగములఁ గోయుచు, చీల్చుచు, ఛేదించుచునున్నపుడు వారికి దుఃఖముకలుగుటలేదని దీనికుత్తరమిప్పుడే యిచ్చియున్నాము; ఆప్రకారమే అతిమూర్ఛితులై యున్న జీవులకు సుఖదుఃఖములెట్లు కలుగును? ఏలయన వానిఁబొందుటకక్కడ సాధనమే లేదు.

ప్రశ్న:— చూడుఁడు! నిలోతి-పచ్చని కొమ్మలు, పత్రములు, కందమూలములు-వానిని మేము తినము. కారణమేమన నిలోతియందు ననేకములు, కందమూలములం దనంతములునైన జీవములు కలవు. వానిఁ దింటిమా ఆ జీవములఁ జంపినందున, వానిఁ దుఃఖింపఁజేసినందున మేము పాపాత్ములమగుదుము.

ఉత్తరము:— ఇదియును మీ తెలివితప్పినమాటయే. ఏలయన పచ్చని కొమ్మలను దినుటవలన జీవములు చచ్చుననియు, వానికిఁ బీడగలుగుననియు ఏలతలచుచున్నారు? ప్రత్యక్షముగ పీడ గలుగుచున్నట్లుమీకుగోచరమగుటలేదుగద. గోచరమగుచున్న మాకును జూపింపుఁడు. మీ రెన్నఁడును ప్రత్యక్షముగఁ జూడఁజాలరు. మాకుఁ జూపనులేరు ప్రత్యక్షమే కానపుడు అనుమానోపమానశబ్ద ప్రమాణములుకూడ నెన్నటికిని ఘటిల్లనేరవు. పైఁ జెప్పఁబడిన యుత్తరమే దీనికి నన్వయించును. ఏలయన నత్యంతాంధకారమను మహాసుషుప్తిలో నున్నప్పుడును, గొప్ప మత్తులో నున్నప్పుడును జీవులకు సుఖదుఃఖములు గలుగునని లావించుట "మీకెట్టి యుక్తిశూన్యములైన విద్యా విరుద్ధములగు మాటల

బోధించిన" మీ తీర్థంకరుల పొరపాటేయని విదితమగుచున్నది. మఱి అంత ముసలం గృహమునం దనంతజీవము లెట్లుండఁ గలుగును? కుండములు అంత ముకలమై యుండుట మనము చూచుచున్నప్పుడు వానియందలి జీవము లంత మెందులకు లేకపోవును? కాన నిదియును మీ యవివేకమే యనవొప్పును.

ప్రశ్న:— చూడుఁడు! మీరు నీళ్లను కాఁచక అట్లే త్రాగుచు గొప్ప పాపభాగు లగుచున్నారు. మేము నీళ్లను గాఁచి త్రాగుచున్నట్లే మీరును త్రాగవలెను.

ఉత్తరము:— ఈ మీమాటయు భ్రమతోఁగూడినదే. ఏలయన మీరు నీళ్లను కాఁచునపు డా జలమందలి జీవులన్నియు చావనేచచ్చును గద. మఱి వాని శరీరములుకూడ నీటఁగలసిపోవు ద్రావకమువలె నగును. కాన మీరు వాని శరీరముల కషాయము త్రాగుచు గొప్ప పాపాత్ము లగుచున్నారనుట నిశ్చయము. శీతజలమునుఁ ద్రాగువారు పాపభాగులు కారు. ఏలయన శీతజలమును ద్రాగినపుడుదరములోనికిఁ బోయి కొంత యుష్ణతను బొందఁగా నా జీవులు శ్వాసముద్వారా వెలుపలికి వెళ్లవచ్చును. ఇఁక జలకాయ జీవులకుఁ బై చెప్పఁ బడినట్లు సుఖదుఃఖములు కలుగనే కలుగవు. కాఁబట్టి యిందెవ్వరికిని పాపము కలుగనేరదు.

ప్రశ్న:— జాఠరాగ్ని వేఁడిమికి వెడయనట్లే వెచ్చఁబెట్టిన జలములో నుండియు నా జీవములేల వెలువడకుండును?

ఉత్తరము:— ఔను, వెడలిపోవచ్చును. కాని మీరు నోటి వాయువు వేఁడిమికి జీవులుచచ్చునని నమ్ముచున్నారుగద. జలమును కాఁచినప్పుడును మీ మతానుసారముగ జీవులు చచ్చిపోవును. లేదా యధికబాధనొంది వెడలిపోవును. ఇఁక నట్లే వాని శరీరములును నా జలమున మిశ్రమయి పోవును. కాఁబట్టి మీరు గొప్ప పాపకారులగుచున్నారా? లేదా?

ప్రశ్న:— మేము స్వయముగ నీటిని వెచ్చచేయము. ఒక గృహస్థుని నైన 'జలమును వెచ్చచేయుము' అని యాజ్ఞాపింపము. కాన మాకుఁ బాపము కలుగదు.

ఉత్తరము:— మీరు వేఁడినీళ్లను గ్రహింపకయుఁ, ద్రాగకయు నున్న గృహస్థులెందులకు వెచ్చచేయుదురు? కాఁబట్టి ఆ పాపమునకుఁ బాత్రులుమీరే.

మీరంతకంటె నెక్కువపాపకారులయి యున్నారు. ఏలయన నొకానొక గృహస్థునకేనిమీరు సెలవిచ్చియున్న నొకచోటనే వెచ్చచే యఁబడుచుండును. కాని ఆగృహస్థులు సాధువు లెవరియింటికి విచ్చేయుదురోయను ననుమానముతో గృహస్థులందఱును తమతమ గృహములందు జలమును వెచ్చచేసియుంచుదురు. కాన నీ పాపమునకుఁ బాత్రులు ముఖ్యముగా మీరే యననొప్పును. రెండవది:- అధికముగా కట్టెలును అగ్నియు గాలుటచేతను వానిఁగాల్చుటచేతను పై నుదహరింపఁబడినట్లు వంట, పొలము, వ్యాపారము మున్నగువానిఁ జేయుటచేత నయితము గొప్ప పాపకారులును, నరకగాములు నగుదురు. జలమును వెచ్చఁ జేయించుటకు ముఖ్యముగా మీరే కారణము. అట్లే 'మీరు వేడినీటిని ద్రాగవలెను; చన్నీటిని ద్రాగఁగూడదు.' అని బోధించుచున్నందున ముఖ్యముగా నా పాపమునకును మీరే పాత్రులయియున్నారు. ఇఁక మీ యుపదేశముఁగొని యట్లాచరించు వారును పాపాత్ములే. ఇఁక నది మీ యవిద్యయో, కాదో గమనింపుఁడు ! మీరు చిన్నచిన్న జీవులమీఁద దయఁ జూపుచున్నారు. కాని అన్యమతస్థుల నిందఁ జేయుచు వారి కపకారము చేయుచున్నారే; ఇది చిన్నపాపమాయేమి ! మీ తీర్థంకరులమతమే నిజమన్న సృష్టియం దింతవర్షమును,పాఱుచున్న యిన్ని నదులును, ఇంత జలమును ఈశ్వరుఁ డెందులకు కలుగజేసెను ? సూర్యుని గూడఁ జేయవలసిలేకుండెను. ఏలయన నందు కోట్లకొలఁది జీవములు మీ మతము ననుసరించి చచ్చుచుండ వచ్చునుగద. మఱి మీరెవరిని ఈశ్వరులని నమ్ముచున్నారో వారు విద్యమానులై యున్నప్పుడు దయఁజూపి సూర్యుని తాపమును, మేఘములను నిలిపివేయలే దెందులకు ? పూర్వము చెప్పఁబడినట్లు ప్రాణులు విద్యమానమై యుండవన్న కందమూలాది పదార్థము లందుండు జీవులకు సుఖదుఃఖములు కలుగకుండును. సకలప్రాణులమీద నిశాంతముగ దయగలిగియుండుటగూడ దుఃఖమునకు హేతువగును. ఎట్లన మనుష్యులందరును మీ మతమునే యంగీకరించినవారై దొంగలను, దోపుడుగాండ్రను ఎవరును దండింపకపోదురేని ఎంత గొప్పపాపము జరుగఁదొడఁగును ? కానఁ దగురీతిని దుష్టుల దండించుచు శ్రేష్ఠులఁ బాలించుటయే దయ యనఁబడును. దీనికి విపరీతముగ నాచరించుట దయాక్షమా రూప ధర్మమును నశింపఁజేయుటయే. ఎందఱో జైనులు దుకాణములు పెట్టుదురు. ఆ వ్యవహారములం దబద్ధ

ములు పలుకుదురు. పరుల ధన మపహరింతురు. దీనుల మోసపుచ్చుట మున్నగు దుష్కర్మముల నొనర్తురు. వీని దూరపఱచుట కుపదేశ మొందుట కుంజేయరు. నోటిమీఁద పట్టి కట్టుకొనుట మున్నగు చర్య లెందులకు నటించుచున్నారు? మీరెందఱినో శిష్యులనుగాను, శిష్యురాండ్రనుగాను జేసికొనునపుడు కేశలుంచనమును అనేక దినముల యుపవాసమును జేయుచు, చేయించుచు మీకు, నితరులకుఁ బీడ కలిగించుచున్నారు. ఇట్లు అన్యులకు దుఃఖముఁ గలుగఁజేయుచు నాత్మహత్య యను ఆత్మ దుఃఖము గలుగఁజేయువారలయి హింసకు లేల యగుచున్నారు? మఱి ఏనుగులమీఁదనో, గుఱ్ఱములమీదనో, ఎద్దులమీదనో, ఒంటెలమీఁదనో యెక్కుట, మనుష్యులచేతఁ గూలిపనులు చేయించుట జైనులు పాపమని యేలభావింపరు? మీశిష్యులు తల తోఁకలేని మాటలను నిరూపింపరేని మీతీర్థంకరులు కూడ నిరూపింపజాలరు; ఇఁక మీరు కథ చెప్పఁబోవునపుడును, శ్రోతలు వినుటకు వచ్చునపుడును మార్గమునందు మీమతానుసారముగ జీవులు చచ్చుచునే యుండవచ్చును కాన మీరీ పాపమునకు ముఖ్యకారకులేల యగుచున్నారు? ఈ కొలదిమాటల మూలమున సరిగముగా నూహించి గ్రహింపఁదగును. అనఁగా నాజల, స్థల, వాయువులందలి స్థావరశరీరములలో అత్యంత మూర్ఛితదశయందుండు జీవులకు దుఃఖముకాని, సుఖముకాని యెన్నటికిని గలుగనేరదనుట స్పష్టము.

ఇంకను జైనుల యసంభవములయిన కొన్ని మాటలను వ్రాయుచున్నాము; గమనింపవలయును. తనచేతితో మూఁడున్నర చేతుల కొలతగల ధనస్సుండుననియు, పూర్వము వ్రాయఁబడినటులే కాలసంఖ్య కలదనియుఁగూడ జ్ఞాపకముంచుకొనవలయును.

(రత్నసారభాగము ౧వ పుట ౧౬౬-౧౬౭వ పుటలలో వ్రాయఁబడియున్నది.) (౧) ఋషభదేవుని శరీరపరిమాణము ౫౦౦ (అయిదువందల) ధనస్సులపొడుగు, ఆయువు ౮౪౦౦౦౦౦ (ఎనుబదినాలుగు లక్షల) పూర్వములను సంవత్సరములు. (౨) అజితనాథుని శరీరపరిమాణము ౪౫౦ (నాలుగు వందల యేఁబది) ధనస్సుల పొడుగు. ఆయువు ౭౨౦౦౦౦౦ (డెబ్బదిరెండు లక్షల) పూర్వములను సంవత్సరములు. (౩) సంభవనాథుని శరీరపరిమాణము ౪౦౦ (నాలుగు వందల) ధనస్సులపొడుగు; ఆయువు ౬౦౦౦౦౦౦ (అరువది

లక్షల) పూర్వములను సంవత్సరములు. (౪) అభినందనుని శరీరపరిమాణము ౩౫౦ (మూఁడువందల యేఁబది) ధనస్సుల పొడుగు; ఆయువు ౫౦౦౦౦౦౦ (ఏబది లక్షల) పూర్వములను సంవత్సరములు. (౫) సుమతినాథుని శరీరపరిమాణము ౩౦౦ (మూడువందల) ధనస్సుల పొడుగు; ఆయువు ౪౦౦౦౦౦౦ (నలువది లక్షల) పూర్వములను నంవత్సరములు. (౬) పద్మప్రభ శరీరపరిమాణము ౧౪౦ (వందనలుబది) ధనస్సుల పొడుగు. ఆయువు ౩౦౦౦౦౦౦ (ముప్పదిలక్షల) పూర్వములను సంవత్సరములు (౭) పార్శ్వనాథుని శరీరపరిమాణము ౨౦౦ (రెండువందల) ధనస్సులవిస్తారము; ఆయుఃపరిమాణము ౨౦౦౦౦౦౦ (ఇరువదిలక్షల) పూర్వములను సంవత్సరములు. (౮) చంద్రప్రభ శరీరపరిమాణము ౧౫౦ (వందయేఁబది) ధనస్సుల విస్తారము. ఆయువు ౧౦౦౦౦౦౦ (పదిలక్షల) పూర్వము లను సంవత్సరములు. (౯) సువిధినాథుని శరీరపరిమాణము ౧౦౦ నూఱుధనస్సుల పొడుగు; ఆయువు ౨౦౦౦౦౦ (రెండు లక్షల) పూర్వము లను సంవత్సరములు. (౧౦) శీతలనాథుని శరీరపరిమాణము ౯౦(తొంబది)ధనుస్సుల పొడుగు, ఆయువు ౧౦౦౦౦౦ (ఒకలక్ష) పూర్వము లను సంవత్సరములు.(౧౧)శ్రేయాంసనాథునిశరీరపరిమాణము ౮౦ (ఎనుబది) ధనుస్సుల పొడుగు,ఆయువు ౮౪౦౦౦౦౦ (ఎనుబది నాలుగులక్షల సంవత్సరములు. (౧౨) వాసుపూజ్య స్వామి శరీరపరిమాణము ౭౦ (డెబ్బది) ధనుస్సుల పొడుగు, ఆయువు ౭౨౦౦౦౦౦ (డెబ్బదిరెండు లక్షల) సంవత్సరములు. (౧౩) విమలనాథుని శరీరపరిమాణము ౬౦ (అఱువది) ధనుస్సులు. ఆయువు ౬౦౦౦౦౦౦ (అఱువదిలక్షల) సంవత్సరములు.(౧౪)అనంతనాథుని శరీరపరిమాణము ౫౦ (ఏబది) ధనుస్సులు, ఆయువు ౩౦౦౦౦౦౦ (ముప్పది లక్షల) సంవత్సరములు. (౧౫) ధర్మనాథుని శరీరపరిమాణము ౪౫ (నలువదైదు) ధనుస్సులు; ఆయువు౧౦౦౦౦౦౦ (పదిలక్షల) సంవత్సరములు. (౧౬) శాంతినాథుని శరీర పరిమాణము ౪౦ నలువది ధనుస్సులు; ఆయువు ౧౦౦౦౦౦ (ఒకలక్ష) సంవత్సరములు. (౧౭) కుంథునాథుని శరీరపరిమాణము ౩౫ (ముప్పదియైదు) ధనుస్సులు, ఆయువు ౯౫౦౦౦ (తొంబదియైదు వేల) సంవత్సరములు. (౧౮) అమరనాథుని శరీర విస్తారము ౩౦ (ముప్పది) ధనుస్సులు. ఆయువు ౮౪౦౦౦ ఎనుబదినాలుగు వేల సంవత్సరములు. (౧౯)

మల్లినాథుని శరీర విస్తారము ౨౫ (ఇరువదియైదు) ధనుస్సులు; ఆయువు ౫౫౦౦౦ (ఏబదియైదు వేల) సంవత్సరములు (౨౦) ముని సువ్రతుని శరీర విస్తారము (ఇరువది) ధనుస్సులు. ఆయువు ౩౦౦౦౦ (ముప్పదివేల) సంవత్సరములు. (౨౧) నమినాథుని శరీర విస్తారము ౧౪ (పదునాల్గు) ధనుస్సులు. ఆయువు ౧౦౦౦ (ఒక వేయి) సంవత్సరములు. (౨౨) నేమినాథుని శరీరవిస్తారము ౧౦(పది)ధనుస్సులు,ఆయువు ౧౦౦౦(వేయి)సంవత్సరములు. (౨౩) పార్శ్వనాథుని శరీరపరిమాణము తొమ్మిదిచేతులు. ఆయువు ౧౦౦ (నూరు) సంవత్సరములు. (౨౪) మహావీరస్వామి శరీర పరిమాణము ఏడు చేతులు. ఆయువు ౭౨ (డెబ్బదిరెండు) సంవత్సరము లయియుండెను. ఈ యిరువదినలుగురు తీర్థంకరులు జైనమతసంచాలకులు; జైనుల కాచార్యులు గురువులును వీరే జైనులు వీరినే పరమేశ్వరులని నమ్ముచున్నారు. వీరంచరును ముక్తిని బొందినారట! "ఇంత గొప్ప శరీరములును, ఇంతటి ఆయువును మనుష్యుల కబ్బుట సంభవమా?" అని బుద్ధిమంతులూహించి కనుఁగొనవలయును. ఈ భూగోళమున నిట్టిజనులు కొందఱే నివసింపఁగలుగుదురు. పౌరాణికులు నీ జైనుల గప్పాలను జూచియే ఒకలక్ష పదివేల సంవత్సరముల ఆయువనియు, వేయి సంవత్సరముల ఆయువనియు వ్రాసినదికూడ ననంభవమే. కాన జైనుల కథనమెట్లు సంభవము కాఁగలదు? ఇంకను వినుఁడు! కల్పభాష్యము ౪ వ పుట: నాగకేతనుఁడనువాఁడు గ్రామ మంతటి యొకశిలను వ్రేలిమీఁద నెత్తికొనెను. కల్పభాష్యము ౩౫ వ పుట: మహావీరుఁడు అంగుష్ఠముతో పృథివినొత్తగా శేషనాగుడు గడగడ వణకెను. కల్పభాష్యము ౪౬ వ పుట: మహావీరుని సర్పము కఱువఁగా రక్తమునకు మాఱు పాలు కారెను. ఆసర్పము నెనిమిదవ స్వర్గమునకుఁ బోయెను. కల్పభాష్యము ౪౭ వ పుట: మహావీరుని కాళ్ళమీఁద పరమాన్నము వండఁబడెను. ఆయన కాళ్ళు కాలలేదు. కల్పభాష్యము ౧౬ వ పుట: ఒక చిన్న పాత్రలో నొంటెను నిలిపెను. రత్నసారభాగము ౧. ౧౪ వ పుట: ఒడలిమీఁద ముఱికిమన్నును దీయఁగూడదు. గోకను గూడదు. వివేకసార భా. ౧. ౨౧౫ వ పుట: జైనులలో నొక దమసారసాధువు క్రోధావేశుఁడై ఉద్వేగజనక సూత్రములఁ బఠించి యొక నగరమును తగులఁబెట్టెను. మహావీరుఁడను తీర్థంకరున కతఁడు మిక్కిలి

ప్రియుఁడై యుండెను. వివేక. భా-౧. పుట ౨౨౬: రాజాజ్ఞ సవశ్యముగఁ బాలింపవలయును. వివేక. భా-౧. పుట ౨౨౬: కోశయను నొకవేశ్య పళ్ళెములో ఆవాలను కుప్పగాఁబేర్చి. దానిమీఁదఁ బుష్పములతోఁ గప్పఁబడిన యొకసూదిని నిలువఁబెట్టి, దానిమీఁదఁ దగురీతిని నాట్యమాడెను. కాని సూది కాలికి గ్రుచ్చుకొనలేదు. ఆయావాల కుప్పకూడ చెదరలేదు: తత్వవివేకము ౨౨౮ వ పుట: ఈ కోశావేశ్యతో స్థూలముని యను నతఁడు ౧౨ సంవత్సరముల వరకు సంభోగముచేసెను. పిమ్మటఁ దీక్షనుపొంది సద్గతి నొందెను. ఆ కోశావేశ్యకూడ జైనధర్మము నాచరించుచు సద్గతి నొందినది. వివేక-భా-౧. ౧౮౪ పుట: మెడలో వేసికొనఁబడు నొక సిద్ధునికంఠ ౩౦౦ అపరంజీల నొక వైశ్యునకు ప్రతిదిన మిచ్చుచుండెను. వివేక-భా-౧. పుట ౨౨౮: బలవంతుని యాజ్ఞవలనను, దేవాజ్ఞవలనను కారడవిని గష్టముతోఁ గాలము గడుపునపుడు, గురువు, తల్లి, తండ్రి, కులాచార్యుఁడు, జ్ఞాతులు, ధర్మోపదేశకులు అను నీ యాఱుగురిని విరోధించుటవలనను ధర్మమునకుఁ గొంత న్యూనతకలుగునేని ధర్మము నష్టము కాదు.

సమీక్షకుఁడు:-ఇప్పుడు వీరి యీ మిథ్యా వార్తలు గమనింపుఁడు ఒక మనుజుఁడు గ్రామమంతటి గొప్పశిలను వ్రేలిమీఁద నెన్నఁడయిన నెత్తికొనఁగలుఁగునా॥౧॥అంగుష్ఠముతోఁ బృథివినొత్తిన నది యణఁగిపోఁగలదా! శేషనాగుఁడే లేనపుఁడు వదఁకునదెవఁడు॥౨॥సరి: శరీరమును గోయుటవంన పాలు వెడలుట నెవ్వారును జూచియుండరు.ఇంద్రజాలముగాక మఱేమియుఁ గాకుండును. అతనిఁగఱచిన సర్పమును స్వర్గమునకుఁ బోయెనట. కాని మహాత్ములయిన శ్రీకృష్ణుఁడు మున్నగువారు మూఁడవనరకమునకుఁబోయిరనుటయెంత యబద్ధము॥౩ ౪॥ మహావీరుని కాళ్ళమీఁద పరమాన్నము వండబడినప్పుడతని పాదములు కాలిపోలేదెందులకు: ॥౫॥ ఔరా! ఒకచిన్న పాత్రలో నెన్నఁడయిన నొంటె పట్టఁగలదా॥౬॥ఒడలిమీఁద ముఱికి నున్నను దీయరయు.గోకరయు నుండురేని దుర్గంధ రూపమగు మహానరకము ననుభవించుచుండవచ్చును.॥౭॥ నగరమును తగులబెట్టిన సాధువుయొక్క దయాక్షమలెక్కడికి లేచిపోయెనో గదా: మహావీరుని సాంగత్యముచేతనే యతని యాత్మ పవిత్రముగానపుడు, మరణానంతర మాతని యాశ్రయముఁగొను జైను లెన్నడును పవిత్రులు కానే

రరు.॥౮॥రాజాజ్ఞ సంగీకరింపవలసినదే. కాని జైనులు వైశ్యులయినందునగాఁ దోఁబ రాజానకులయపడి యీ మాటను వ్రాసియున్నారు.॥౯॥కోశావేశ్య శరీర మెంత చులకనగానున్నను ఆవాలకుప్పమీఁద సూదిని నిలువఁబెట్టి దానిపై నాట్యమాడెననుట. సూది గ్రుచ్చుకొనకపోవుట. ఆవాలును చెదరకపోవుట యనునవి వట్టిమిథ్యోక్తులుకాక,మఱియేమగును?॥౧౦॥ఎట్టిస్థితిలోనున్నను,ఏమి సంభవించినను,ధర్మమునెవ్వఁడును త్యజింపఁగూడదు.॥౧౧॥ఇఁక గంగ యను నది జోలెబట్టతోఁ జేయఁబడునుగద-అది ప్రతిదినము ౩౦౦ అపరంజీల నెత్తి యఁగలుగునా?॥౧౨॥ఈరీతియసంభవములయినవీరిమాటలువ్రాయుచుఁబోపుదు మేని జైనుల కల్పితగాథలతోఁ గూడిన గ్రంథమువలె నిదియును మిక్కిలి పెరిగిపోవును; కావున నధికముగా వ్రాయుటలేదు. అనగా వీ జైనులవి కొన్ని సంగతులు తప్ప తక్కినవన్నియుమిథ్యోక్తులేయనియెఱుఁగఁదగును చూడుఁడు:

దో ససి దో రవి పఢమే దుగుణా లవణంమి ధాయ ఈసండే ।
బారస ససి బారసరవి తప్పభిఇ నిదిఠ ససి రవిణో ॥
తిగుణా పువ్విల్లజుయా । అణంతరాణంతరంమి ఖిత్తమ్మి ।
కాలోఏ బయాలా బిసత్తరి పుక్ఖరద్ధంమి ।
ప్రకరణ-రా-౪-సంగ్రహణీ సూత్రము. ౭౭-౭౮॥

జంబూద్వీపము లక్షయోజనములు అనఁగా నాల్గులక్షల క్రోసుల విస్తారముకలదని వ్రాయఁబడియున్నది ద్వీపములలో నిది మొదటి ద్వీపమఁట. ఇందు నిద్దఱు చంద్రులు నిద్దఱు సూర్యులును గలరఁట. అటులే లవణ సముద్రమున నంతకు ద్విగుణము అనఁగా నలువురు చంద్రులును. నలువురు సూర్యులునుగలరఁట. ఆ ప్రకారమే ధాతకీఖండమునందు పన్నిద్దఱు చంద్రులు పన్నిద్దరు సూర్యులునుగలరు.॥౧౩॥వీనిమూఁడింతలుచేసినముప్పదియాఱుగురగుదురు ఇం దఱును,జంబూద్వీపమందలిఇరువురును,లవణసముద్రమునందలి నలుగురునుకలి సిననలువదియిరువురుచంద్రులును నలువదియిరువురు సూర్యులును కాళోదధి సముద్రమునఁ గలరు. ఇవ్విధముగనే ముందటి ద్వీపములందును సముద్రములందు కూడ "పూర్వము చెప్పఁబడిన నలువదిరెంటిని మూఁడింతలు చేసిన" వంద యిరువదాఱుగు రగుదురు. వానిలో ధాతకీఖండమందు పన్నిద్దఱును, లవణ సముద్రమందు నలుగురును, జంబూద్వీపమం దిద్దఱును. వీరి నందఱుచేర్చి

లెక్కించిన ౧౪౪ గురు చంద్రులును, ౧౪౪ గురు సూర్యులును పుష్కరద్వీప మునవున్నారు. ఇదియుఁ గేవల మర్త్యమనుష్య క్షేత్రగణనయే. ఇక నెచ్చట మనుష్యులు నివసింపరో యచ్చట ననేక సూర్యులును చంద్రులును గలరనుట. వెనుకటి యర్ధపుష్కరద్వీపమునందుఁగల యనేక సూర్యచంద్రులు స్థిరముగా నున్నారు. పూర్వము చెప్పఁబడిన వంద నలువది నాల్గింటిని మూఁడింతలు చేసిన ౪౩౨ సంఖ్యాకులును అట్టి జంబూద్వీపమందిద్దఱిద్దఱును లవణ సముద్రమందు నలుగురు నలుగురును, ధాతకీఖండమందు ౧౨గురు ౧౨ గురును, కాలోదధి సముద్రమందు నలువదియిరువురును వీని నన్నిటిని జేర్చి లెక్కించిన ౭౨ చంద్రులును, ౭౨ సూర్యులును పుష్కర సముద్రమునఁ గలరు. అని శ్రీజినభద్రగణిక్షమాశ్రమణునిచే బృహత్ "సంఘయణీ" యందును, "యోతిసకరండక పయన్నా"యందును, "చంద్రపన్నతి" "సూరపన్నతి"యను ప్రముఖములైన సిద్ధాంతగ్రంథములందును గూడ నిటులే చెప్పఁబడినది ॥౬౮॥

సమీక్షకుఁడు:- భూగోళ ఖగోళవేత్తలారా! ఇక నాలకింపుఁడు! ఈయొక్క భూగోళమున నొక విధముగ ౭౨ సూర్యచంద్రులను, మఱొక విధముగ ననంఖ్య చంద్రసూర్యుల నీజైను లంగీకరించుచున్నారు గదా! మీరే గొప్ప భాగ్యవంతులు. ఎందులకనమీరు వేదపురాణానుయాయులయి సూర్యసిద్ధాంతాది జ్యోతిషగ్రంథములఁ బఠించుచున్నందున మీకు యథార్థముగ భూగోళ ఖగోళములు విదితమైనవి. ఒకవేళ నీజైనుల గందరగోళ మను మహాంధకార మునవున్నచో ఇప్పటి జైనులవలె మీరును అజన్మ మంధకారమునందే యుండి యుందురు. జంబూద్వీపమునం దొక్కొక్క సూర్యచంద్రునితో పని సాగదనియే కాఁబోలు: "ఏలయన నింతగొప్ప భూమండలమునకు ముప్పది గడియలలో సూర్యచంద్రు లెట్లు రాఁగలుగుదురని" ఈ యవిద్వాంసులకు సందేహము కలిగినది. పృథివిని సూర్యాదులకంటె గొప్పదని భావించుట వారల గొప్ప పొరపాటు.

> కో నసి ఠో ఎవి వంతి ఏగంతరియా భసతి సంధాయా।
> మేయం పయాహిణంతా। మాణుసఖిత్తె పరిఅడంతి॥
>
> ప్రకరణ.రా-౪.సంగ్రహ సూ. ౬౮.

మనుష్యలోకమునఁగల చంద్రసూర్యుల పంక్తులను లెక్కించుచున్నాము. రెండేసి చంద్రులయు రెండేసి సూర్యులయు వరుసలు కలవు. అవి యొక్కొక లక్ష యోజనములు "అనఁగా నాల్గులక్షల క్రోసుల" దూరమున నుండి తిరుగుచున్నవి. సూర్యపంక్తిలో నొక చంద్రపంక్తి యున్నటులే చంద్రపంక్తిలో సూర్యపంక్తియుఁగలదు. ఇవ్విధముగ నాల్గుపంక్తులుగలవు. ఆ యొక్కొక్క చంద్రపంక్తియందు ౬౬ చంద్రులును, ఒక్కొక్క సూర్యపంక్తియందు ౬౬ సూర్యులును గలరు. ఆ నాల్గుపంక్తులు జంబూద్వీపమందలి మేరుపర్వతము చుట్టుఁదిరుగుచు, మనుష్య క్షేత్రమునందును దిరుగుచుందురు. అనఁగా జంబూద్వీపమందలి మేరువునుండి యొక సూర్యుఁడు దక్షిణమునకుఁ దిరుగుచుండునపుడు, రెండవ సూర్యుడుత్తరమునకుఁ దిరుగుచుండును అలాగే లవణసముద్రమందలి యొక్కొక దిక్కునకు నిద్దఱిద్దఱు సంచరించుచుందురు ధాతకీఖండమందు ౧౨ గురు, కాలోదధియందు ౪౨ గురు, పుష్కరార్ధమందు ౭౨ గురు ఇవ్విధముగా నందఱుగలసి ౬౬ గురు సూర్యులు దక్షిణదిశయందును ౬౬ గురు సూర్యులు ఉత్తరదిశయందును తమతమ క్రమానుసారముగ సంచరించుచున్నారు. ఈ రెండు దిశలయందలి సూర్యచంద్రుల వరుసలను జేర్చి లెక్కించితిమేని ౧౩౨ మంది సూర్యులును, ౧౩౨ చంద్రులును మనుష్యలోకమున సంచరించుచున్నారు. ఇవ్విధముగనే చంద్రునితోడ ననేక నక్షత్రాదుల పంక్తులునుగలవని యెఱుఁగఁదగును.

సమీక్షకుఁడు:— సోదరులారా! గమనించితిరా, ఈ భూగోళమునా ౧౩౨ సూర్యులును, ౧౩౨ చంద్రులును ఈ జైనుల యిండ్లనే తపింపఁజేయుచుండవచ్చును. అట్లయిన వారెట్లు జీవింపఁగలుగుదురో గదా! రాత్రులందును శీతాతిశయమునకీ జైనులు నిట్టనీల్గి పడియుందురు కాఁబోలు. భూగోళ ఖగోళ విద్య నెఱుఁగని వారే యీయసంభవములయిన మాటలకు మోసపోదురు కాని యన్యులుకాదు. ఒక సూర్యుఁడే ఈభూగోళమంతటి యనేక భూగోళములఁ బ్రకాశింపఁజేయుచున్నపుడు, ఈ చిన్న భూగోళమెంత? పృథివి తిరుగుటలేదు; సూర్యుఁడే పృథివిచుట్టుఁ దిరుగుచున్నాఁడన్న నెన్నియో సంవత్సరముల కొకదినము నొక రాత్రియును నేర్పడును. సుమేరు వనునది హిమాలయ పర్వతమే. మఱొకటి లేనేలేదు. మఱి పుటమునకెదుట అవగింజంతగా

గూడ నిది సూర్యునియొదల లెక్కకురాదు. ఈ విషయములను జైను లాప తమునం దున్నంతవఱకు నెఱుగఁజాలరు. అంధకారమునందే పడియుందురు.

> సమత చఉ ఇ సహియా సవ్వం లోగం ఫుసే నిరవసేసం ।
> సత్తియ చ ఉప సలాపే పంచయ సమయదేసవిరి లఆ ॥
>
> ప్రక.భా.౫.సంగ్రహ సూ. ౧౩౫॥

సమ్యక్ చారిత్ర సహితులైన కేవలీ లనువారు కేవల సముద్ఘాతావస్థచే పదునాల్గు రాజ్యలోకములు తమ ఆత్మ ప్రదేశముచేసి సంచరింతురు.

సమీక్షకుఁడు:- జైనులు పదునాల్గు రాజ్యములున్నవని నమ్ముచున్నారు. ఇఁక వానియందలి పదునాల్గవవాని శిఖరముమీద సర్వార్థసిద్ధి యను విమాన ధ్వజముపైఁ గొంతదూరమున నుండు సిద్ధశిలా, దివ్యాకాశములను శివపుర మందురు. కేవలజ్ఞానమను సర్వజ్ఞత్వమును, పూర్ణ పవిత్రతను బొందిన కేవలీ లను వారే ఆలోకమునకుఁబోయి స్వాత్మప్రదేశముచే సర్వజ్ఞులై యుందురఁట. ప్రదేశము కలవాఁడు విభువుకానేరఁడు. విభువు కానివాఁడు సర్వజ్ఞుఁడను కేవ లజ్ఞాని యెన్నటికినిఁ గానేరఁడు. ఏలయన నెవని యాత్మ యేకదేశీయమో యదియే వచ్చుచుఁ బోవుచు నుండును. అట్లే వాఁడు బద్ధుఁడును, ముక్తుఁడును, జ్ఞానియు నజ్ఞానియు నగుచుండును సర్వవ్యాపకుఁడును, సర్వజ్ఞుఁడునయిన వాఁడగునెన్నఁడును గానేరఁడు. జైనుల తీర్థంకరులు జీవరూపులును, అల్పులును అల్పజ్ఞులు నయియుండిరి. వారు సర్వవ్యాపకులును, సర్వజ్ఞులును నెన్నటికిని గానేరరు. కాని యెవనియందు సర్వజ్ఞత్వాది గుణములు యథార్థముగ ఘటిల్లు చున్నవో యట్టి అనాద్యనంతుఁడును, సర్వవ్యాపకుఁడు, సర్వజ్ఞుఁడును, పవి త్రుఁడు, జ్ఞానస్వరూపుఁడునగు పరమాత్మను జైనులంగీకరించుట లేదు.

> గబ్భనర తిపలియాఊ । తిగాఉ ఉక్కోసతే జహన్నేణం ।
> ముచ్ఛిమ దుహావి అంతముహూ । అంగుల అసంఖ భాగతణూ ॥
>
> ప్రక.భా.౫.సం.సూ.౨౪౧॥

ఇట రెండువిధముల మనుష్యులు గలరు. ఒకరుగర్భజులు; మఱొకరు గర్భమునఁగాక యుద్భవించినవారు. వారిలో గర్భజులగు మనుష్యుల కుత్కృ ష్టమైన మూఁడు పల్యోపమముల ఆయువును, మూఁడుక్రోసుల శరీరమయి నుం డునని యెఱుఁగవలెను.

రేని వారికి వాయువు గూడ దగులకుండవచ్చును. ఇది పామర జనులను మోసపుచ్చుటకు కల్పింపఁబడిన వట్టిబూటకమే, అని కనుఁగొనదగును.

> జోయణ సహస్స మహియం ఏగింద్రియ దేహముక్కొసం ।
> వీరి చఉరిం దిస సరీరం । వార సజోయణం తికోస చఉకోసం
> జోయణసహస పణింపియ । ఉహే వుచ్ఛంతి విసేసంతు ॥

ప్రకరణ భా.౪, సంగ్రహ-సూ.౨౬౪॥

సామాన్యముగ నొక ఇంద్రియముగల శరీరము సహస్రయోజనముల విస్తారముగల యుత్కృష్టమైన శరీరమని యెఱుఁగవలయును. రెండింద్రియములుగల శంఖాదుల శరీరపరిమాణము పంద్రెండు యోజనములని యెఱుఁగవలయును. అట్లే మూడింద్రియములుగల క్రిమికీటాదుల శరీరములు మూడు క్రోసులని యెరుగవలెను. నాలుగింద్రియములు గల భ్రమరాదుల శరీర పరిమాణము నాల్గు క్రోసులు. అట్లే పంచేంద్రియములుగల వాని శరీరపరిమాణ మొక సహస్ర యోజనములు; అనఁగా నాల్గువేల క్రోసులని యెఱుగఁదగును.

సమీక్షకుఁడు:— నాలుగేసి వేలక్రోసుల పరిమాణము శరీరములు గల వారుండురన్న నీభూగోళమునఁ గొందఱు మాత్రమే యుండఁగలుగుదురు. అనగా వందల మనుష్యులతోడనే భూగోళమంతయు క్రిక్కిఱిసి నిండిపోవచ్చును. ఒకనికి నడుచుటకైన వీలులేకపోవును. ఇఁక వారు, నడుచుటకు మార్గమును, నివసించు స్థలమును చూపుఁడని జైనులనే విచారింపవలసినది కద : అప్పుడు దీని వ్రాసిన జైనులే తమయింట నుంచుకొందురు కాబోలు. కాని నాల్గువేలఁ క్రోసుల పరిమాణపు శరీరము గల యొక్కనికొఱకే ౩౨ (ముప్పదిరెండు) వేల క్రోసుల వైశాల్యముగల గృహము నిర్మింపఁ బడవలసి వచ్చును. జైనుల వద్దనున్న ధనమంతయు వెచ్చ పెట్టినను ఇట్టిదొక్క గృహమైన నిర్మింపఁబడ నేరకుండును. దానిపై నెనిమిదివేల క్రోసుల వైశాల్యము గల కప్పును నిర్మించుటకు యింత పెద్ద కఱ్ఱల నెక్కడినుండి తేగలుగుదురు. మఱిదానిలోపల స్తంభములు నిలుపఁ బెట్టిన నతఁడు లోనికే పోఁజాలకుండును. కావున నివన్నియును మిథ్యాలాపములే.

> తేఘూలా వల్లే విహాంపం తిజ్జాచే వహంతి సవ్వేవి ।
> తే ఇక్కిక్క అసంఖే । సుహామే ఖమ్మే వతిప్పేహ ॥

ప్రకరణ-౮. ౪. లఘుక్షేత్ర సమాన ప్రకరణ సూత్రము. ౪॥

పూర్వము చెప్పఁబడినట్లొక యంగుళపు లోమ ఖండములతో కాలసంఖ్యా నిధానము - నాల్గుక్రోసుల చౌకమును అంతేలోఁతును గలయొక బావి యుండ వలెను. ఒక అంగుళపు లోమములో మొత్తము ఇరువది లక్షల యేఁబదియేడు వేల నూటయేఁబదిరెండు ఖండములగును; కాని అధికాధికము (౩౩౦౭౨౭౧ ౦౪, ౨౪౨౫౬౨౫, ౪౨౧౯౯౨౦, ౯౭౫౩౬౦౦, ౦౦౦౦౦౦౦) ముప్పది మూడు కోటానకోట్లును, ఏడులక్షల యిరువదియేడు వేల నూట నాల్గు కోటానకోట్లును, ఇరువదినాల్గులక్షల యిరువదియైదువేల ఆఱువందల యిరువదైదు కోటానకోట్లును, నలువది రెండు లక్షల పందొమ్మిదివేల తొమ్మిదివందల యిరువది కోటానకోట్లును, తొంబదియేడులక్షల యేఁబది మూఁడువేల యాఱు వందల కోటానకోట్లును కాఁగలవు. పెదల్పయిన ఘనయోజన పల్యోపములో సమస్త స్థూల లోమఖండములు గణింపఁబడును. ఇది కేవల సంఖ్యాతకాలము. పూర్వము చెప్పఁబడి నట్లొక లోమఖండమును అసంఖ్యాత ఖండములను మనస్సుతో కల్పించిన నసంఖ్యాత సూక్ష్మ లోమాణువు లగును.

సమీక్షకుఁడు:- ఇప్పుడు వీరి గణితరీతిని గమనింపుము. ఒక యంగుళ లోమములో నెన్ని ఖండములు చేసితి. ఇవి యెన్నఁడయిన నొకని చెప్పుటకు రాగలవా? దాని తరువాత మనస్సుతో నసంఖ్యాత ఖండములు కల్పించు చున్నారు. పైనఁ జెప్పఁబడిన ఖండములను చేతితోఁ జేసి యుండుట కాఁబోలు: చేతితోఁ జేయజాలనపుడు మనస్సులోఁ గనఁబఱచి యుందురని దీనివలన సిద్ధ మగుచున్నది. ఔరా! ఒక యంగుళపు రోమమందు నసంఖ్యాతఖండములగు ననుట యెన్నఁడయిన సంభవమగునా?

> జంబూద్వీపప్రమాణం గురుజోయణం లక్ఖం వట్ట విసంబీ।
> లవణాఈ యాసేసా బలయాభా దుగుణ దుగుణాయ॥
>
> ప్రకరణ. ౮. ౪. లఘుక్షేత్ర సమా. సూ. ౧౨॥

జంబూద్వీప వైశాల్యమును, దాని గొల్లయాకారమును లక్ష యోజన ములు. తక్కిన లవణాది సప్తసముద్రములును సప్తద్వీపములును. జంబూ ద్వీపమునకంటె రెండు రెండింతలనియు. మొదటఁ జెప్పఁబడినట్లు ఈ పృథివి

యందే జంబూద్వీపాది సప్తద్వీపములును, సప్తసముద్రములును గలవని యెఱుఁగవలెను.

సమీక్షకుఁడు:-ఇప్పుడు జంబూద్వీపమునకు రెండింతలు రెండవ ద్వీపమన్న నది రెండులక్షల యోజనములనియు, దానికి రెండింతలు మూఁడవదన్న నది నాల్గులక్షల యోజనములు కలదనియు, నాల్గవది యెనిమిదిలక్షం యోజనములును, అయిదవది పదియాఱు లక్షల యోజనములు, ఆఱవది ముప్పదిరెండు లక్షల యోజనములును, ఏడవది యఱువదినాల్గులక్షం యోజనములుగలవని యెఱుఁగదగును. అటుపైన నింతటి వైశాల్యముగల ద్వీపములును, అంతకంటె నెంతయో మించిన వైశాల్యము గల సముద్రములు నీ పదియేనువేల విస్తారపు పరిధిగల భూగోళమునం దెట్లుండఁ గలుగును! కావున నిది వట్టి మిథ్యాలాపమేయననొప్పును.

కురు సఱ చులసీ సహసా ఛచ్చే వంరనఈ ఉవఇ విజయం ।
దో దో మహా నఈఉ చనుదస సహసా ఉవత్తే యం ।
ప్రకరణ రా. ౪. లఘుక్షేత్రసమా. సూ. ౬౮ ॥

కురుక్షేత్రమునందు ౮౪ (ఎనుబదినాల్గు) వేల నదులు కలవు.

సమీక్షకుఁడు:-మేలు! కురుక్షేత్ర మనునదొక చిన్నదేశము. దానిఁ జూడక యిట్టి మిథ్యాలాపమును వ్రాయుటకైనను వీరికి లజ్జ కలుగలేదుగదా!

యాముత్తరాఉ తాఉ । ఇగేగ సింహాసణాఉ అఇపువ్వం ।
చఉసు వి తాసువియాసణ, దిసి భవజిణ మజ్జణం హోఇ ॥
ప్రక౦ర. రా. ౪, లఘుక్షేత్రసమా. సూ. ౬౪ ॥

ఆ శిలకు దక్షిణోత్తర పార్శ్వముల యందొక్కొక్క సింహాసనము కలదని యెఱుఁగవలయును. దక్షిణముననున్నది అతిపాండుకంబలాశిల. ఉత్తరమున నున్నది అతిరక్త కంబలాశిల. ఈశిలలను సింహాసనములమీఁద తీర్థంకరులు కూర్చుందురు.

సమీక్షకుఁడు:- గమనించితిరా! వీరు తీర్థంకరుల జన్మోత్సవాదుల జరుపునపు డటనుండు శిలగూడ ముక్తిదాయక సిద్ధశిలయే కావచ్చును. వీరి యందిట్టి గందరగోళము లెన్నియో గలవు. ఎంతవఱకని వ్రాయవలెను. ఐనను నీ

వడియఁగట్టుకొని త్రాగుట, అల్పజీవులపై నామమాత్రపు దయనుజూపుట, రాత్రియందు భోజనముఁ జేయకపోవుట యను నీ మూఁడు మాటలు కొంత మంచివే కాని, తక్కిన వీరి గాథలన్నియు నసంభవములని యెఱుంగఁదగును. ఇంతటిలో బుద్ధిమంతు లధికముగా నూహించికొనఁగోవలెను. ఇట్లు దృష్టాంతరూపముగ కొంచెమే వ్రాయఁబడినది. వీరి యసంభవములగు గాథలనన్నిటిని వ్రాసిన నొకపురుషుఁడు తన జీవిత కాలమంతయైనను జదువఁజాలనన్ని పుస్తకములు కావచ్చును. కాన నొక పాత్రలో బియ్యముడుకు నప్పుడందలి యొక మెతుకును పరీక్షించిన తక్కిన బియ్యము పచనమైనది, కానిది విదితమగునట్లే యీ కించిల్లేఖనుండి సజ్జను లనేక విషయముల నూహించి గ్రహింపఁదగును. బుద్ధిమంతుల యెదుట నధికముగా వ్రాయవలసిన యవసరములేదు. ఏలయన దిగ్దర్శన మాత్రమున సంపూర్ణాశయమును బుద్ధిమంతులు గ్రహించియుందురు. దీని కనంతరము క్రైస్తవుల మతమును గూర్చి వ్రాయఁబడును.

శ్రీ మద్దయానంద సరస్వతీస్వామి నిర్మితము, సుభాషా విభూషితమునగు సత్యార్థప్రకాశమున నాస్తికమతాంతర్గత చారవాక బౌద్ధ జైన మతఖండన మంతన విషయములుగల ద్వాదశ సముల్లాసము సంపూర్ణము.



ఓమ్

# అనుభూమిక

క్రైస్తవులు మాత్రమే కాక యూదాదులును, ఈ బైబిలు మతాను యాయులై యున్నట్లు విదితమగుచున్నది. కాని యీ ౧౩వ సముల్లాసమున క్రైస్తవ మతమును గూర్చి వ్రాయఁబడినది. అనఁగా నిప్పుడు బైబిలుమతమున క్రైస్తవులు ముఖ్యులు, యూదాదులు గౌణులు నగుచున్నారు. ముఖ్యగ్రహణముచే గౌణముగ్రహింపబడును; కాన దీనిచే యూదులును గ్రహింపఁబడుదురని యెఱుఁగఁదగును. వీరి ఈ విషయము బైబిలునుండియే యిక్కడ వ్రాయబడినది. ఈ గ్రంథమును క్రైస్తవులు, యూదాదులందఱు నొప్పుకొనుచు దీనినే తమ ధర్మమునకు మూలకారణమని భావించుచున్నారు. వీరి మతగురువులయిన గొప్పగొప్ప పాదిరీలు ఈ గ్రంథమును పెక్కుభాషలలోనికి భాషాంతరీకరించి యున్నారు. అందలి సంస్కృత దేవ నాగరీ భాషాంతరమును జూచుటవలన నాకీ బైబిలునం దనేక సందేహములు గలిగినవి. వానిలోనుండి కొన్నిటి నీ ౧౩వ సముల్లాసమున నందఱును బరికింపఁగలందులకు వ్రాసినాఁడను. కేవలము సత్య వృద్ధికొఱకు, అసత్య క్షయముకొఱకు దీని వ్రాసితినే కాని యొకరికి దుఃఖము కలుగఁజేయ వలెననిగాని, హానిఁ గలిగింపవలెననిగాని, యొకరిపై మిథ్యాదోషమును మోపవలెననిగాని వ్రాయలేదు. ఇఁక తరువాతి విషయమును జూచి "ఈ గ్రంథమెట్లున్నది, వీరి మత మేమి?" అను నంశములు సందఱు గనుఁగొనవచ్చును. మనుష్యులందఱు సులభముగా జూఁడ, విన, వ్రాయఁగలుగుటయు, పక్ష ప్రతిపక్షములఁబూని క్రైస్తవమతమును పరికించి ఆందోళన చేయగలుగుటయు నీలేఖ ప్రయోజనము. మనుష్యులకు ధర్మసంబంధమైన జ్ఞానము వర్ధిల్లి వారు సత్యాసత్యమతమును, కర్తవ్యాకర్తవ్య కర్మసంబంధములగు విషయములు (ఆచార వ్యవహారములను) యథాయోగ్యముగాఁ దెలిసికొనఁగలిగి, సత్యమును, కర్తవ్యములైన కర్మముంప

స్వీకరించుచు నసత్యమును, అకర్తవ్యములను సులభముగాఁ బరిత్యజింపఁ
గలుగుటయు నీ వ్రాఁతవలని ప్రయోజనము. అందఱు మతగ్రంథములను
జూచి, తెలిసికొని, అనుకూల ప్రతికూలాభిప్రాయమును వాఙ్మూలముగనో,
వ్రాఁతమూలముగనో ప్రకటించుట మనుష్యులందఱ కుచితము. లేనిచో వారు
వినుచుండవలసినదే. ఏమనఁగా చదువుటవలనఁ బండితుఁడగునట్లు వినుట
వలన బహుశ్రుతుఁడగును ఒకవేళ వినునతఁడు మఱొకనికి వినఁజెప్పఁజాలకో
పోయినను తానుమాత్రము అవశ్యముగఁ దెలిసికొనఁగలుగును. ఎవరు పక్ష
పాత మను వాహనముపై నారూఢులై చూతురో, వారికిఁ దమ గుణదోష
ములు కాని, పరుల గుణదోషములు కాని తెలియఁజాలవు. మనుష్యుని యాత్మ
సత్యాసత్యములను యథాయోగ్యముగ నిశ్చయింపఁగలుగును. దాని కాసామ
ర్థ్యము కలదు. చదివినంతవఱకో, వినినంతవఱకో అది నిశ్చయింపఁగలదు.
ఒకానొక మతమునుగూర్చి యొకనికిఁ దెలిసి మఱియొకనికిఁ దెలియకున్నఁ
దగురీతిని చర్చ జరుగనేరదు. కాని యజ్ఞానులు భ్రమజాలమునఁ జిక్కి-
యుందురు. అట్లు గాకుండుటకే యీ గ్రంథమున వారుకలోనున్న సమస్త
మతవిషయములను కొంచెము కొంచెముగా వ్రాసినాఁడను. ఇంతటిలోఁ మిగి
లిన విషయములు సత్యములా ? అసత్యములా? అని యూహింపవచ్చును.
సర్వమాన్యములయిన సత్యవిషయములన్నియు నంతట నొకేవిధముగనున్నవి.
కాని వివాద మసత్య విషయములందే కలుగుచున్నది. ఇఁక నొకఁడు సత్య
వాదియు, మఱొకఁ డసత్యవాదియు నయ్యేనేని కొంత చర్చ జరుగవచ్చును.
వాదిప్రతివాదులు సత్యాసత్య నిర్ణయముకొఱకు వాద ప్రతివాదములు గావించిన
నవశ్యముగ నిశ్చయము కాఁగలదు. ఇఁక నేనీ పదమూఁడవ సముల్లాసము
నందు క్రైస్తవమత విషయములు గొన్నిటి నుల్లేఖించి విచారణార్థమందఱ
యెదుటఁ బెట్టుచున్నాఁడను. ఎట్లున్నదో కనుఁగొనుఁడు.

విచక్షణాపరులకు వివరింప నక్కఱయుండదు.



# త్రయోదశ సముల్లాసము

## క్రైస్తవ మతవిషయ సమీక్ష

ఇక క్రైస్తవ మతమును గూర్చి "వీరి మతము నిర్దోషమా? కాదా? వీరి బైబిల్ పుస్తకము ఈశ్వరకృతమా, కాదా?" అని విదితమగుటకు వ్రాయుచున్నాము. మొదట బైబిలులోని 'తౌరేతు-'సంగల విషయములు వ్రాయఁబడును.

౧. ఆరంభమందు దేవుఁడు భూమ్యాకాశములను సృజించెను. భూమి అసమానముగాను (నిరాకారముగాను) శూన్యముగా నుండెను. చీఁకటి అగాధ జలము పైన కమ్ముకొనియుండెను. దేవునియాత్మ జలములపైన అల్లాడుచుండెను.

ఆ: ౧: ౧—౨॥

సమీక్షకుఁడు :— దేని నారంభమని చెప్పుచున్నారు?

క్రైస్తవుఁడు :— సృష్టి ప్రథమోత్పత్తిని.

స:—ఇదియే ప్రథమసృష్టియా? దీనికి మునుపెప్పుడును సృష్టికాలేదా?

క్రై:— అయినదో కాలేదో మాకు తెలియదు; ఈశ్వరుఁడెరుగు.

స :— తెలియదేని ఈ పుస్తకముపై విశ్వాస మెందులకు? దేనిచే సందేహనివృత్తికాఁజాలదో, యటువంటిదాని నాశ్రయముగాఁ గొని బోధించుచు అనుచరులను ఈ సందేహముతోఁగూడిన మతమునఁ నెందులకు బడవేయు చున్నారు? ఇక నేవిధమయిన సందేహము లేని సర్వసందేహములు నివారించునట్టి వేదమతము నేల స్వీకరింపరు? ఈశ్వరసృష్టి సమాచారమే మీకుఁ దెలియనపుడు ఈశ్వరునెట్లు తెలిసికొనఁగలుగుదురు? ఆకాశమని దేనిని నమ్ముచున్నారు?

క్రై:— మనపైనున్నదానిని. ఖాళీ ప్రదేశమును.

స :— ఈ బట్టబయలగు విభుపదార్థ మతిసూక్ష్మమై క్రింద మీఁద నేక రీతిగానున్నదే దీనియుత్పత్తియెట్లు? ఆకాశము సృజింపఁబడనపుడు బయలు,

ఆకాశము నుండెనా లేదా? లేకుండెనేని ఈశ్వరుఁడు, జగత్కారణము, జీవులు నెచ్చటనుండిరి? ఆకాశమే లేకున్న నొకపదార్థమైన నుండజాలదు. కాఁబట్టి మీ బైబిలులోఁ జెప్పినమాట సరికాదు. ఈశ్వరుఁడు, అతని జ్ఞాన[illegible]ములు దేవాలు అసమానములా? లేక యన్నియు సమానములేనా?

క్రై:— సమానములు.

స:— అట్లైన నిచట ఈశ్వరునిచేఁ జేయఁబడిన సృష్టి యసమానమై యుండెనని యేల వ్రాయఁబడెను?

క్రై:— అసమాన మన మిట్టపల్లములు గలదిగ నుండెను; సమానముగా లేకుండెను అని యర్థము.

స:— మఱల సమానముగాఁ జేసినదెవరు? ఏమి, యిప్పుడు మిట్టపల్లములు గలిగిలేదా? కాన నీశ్వరుని పని యసమానమయినది కాఁజాలదు. అతఁడు సర్వజ్ఞుడు. అతనిపనిలో మఱపుకాని, తప్పు కాని యెన్నటికిని నుండ నింపదు. బైబిలునందు ఈశ్వరసృష్టి అసమానమైనదని వ్రాయఁబడియున్నది; కాన నీపుస్తక మీశ్వరకృతము కానేరదు. మొట్టమొదట ఈశ్వరుని యాత్మ ఏమి పదార్థము?

క్రై:— చేతనము.

స:— అది సాకారమా? నిరాకారమా? ఏకదేశియమా? వ్యాపకమా?

క్రై:— నిరాకారము, చేతనము, వ్యాపకమైనది; కాని యొకానొ సీనాయి పర్వతమందును, నాలుగవ యాకాశ స్థానమునందును ఏకదేశముగ నుండును.

స:— నిరాకారమైనచో దానిని జూచినదెవరు? వ్యాపకమైన జలముపై నల్లాడుచుండెననుట నితాంతమసంగతము. మంచిది; ఈశ్వరుని యాత్మ నీటిపై నల్లాడుచున్నప్పుడు ఈశ్వరుఁ డెచ్చట నుండెను? ఈశ్వరుని శరీరము మరి యొకచోట నుండి యుండెను. లేక తన యాత్మలో నొక్కభాగమును నీటిపై నల్లాడఁజేసి యుండునని యేకదేశ సిద్ధమగుచున్నది? అట్లైన విభుఁడును, సర్వజ్ఞుఁడు నెప్పటికిఁ గాఁజాలఁడు. విభుఁడు కాదేని జగత్తును రచించుటకు, ధరించుటకు, పాలించుటకు, జీవుల కర్మ వ్యవస్థచేయుటకు, ప్రళయము

చేయుటకు నెప్పటికిని సమర్థుఁడు గాకుండును. ఏలయనఁగా నేపదార్థస్వరూప మేకదేశీయమో, దాని గుణకర్మ స్వభావములు నయిత మేకదేశీయములే యగును. అటులేని యతడు ఈశ్వరుఁడే కాఁజాలడు. ఏమన ఈశ్వరుఁడు, సర్వవ్యాపకుఁడు. అనన్త గుణకర్మ స్వభావయుక్తుఁడు. సచ్చిదానన్దస్వరూపుఁడు నిత్యుఁడు, శుద్ధుఁడు, బుద్ధుఁడు ముక్తస్వభావుఁడు. అనాద్యనంతాది లక్షణ యుక్తుఁడని వేదమందుఁ జెప్పఁబడెను. అతనినే నమ్మకొనుఁడు. అప్పుడే మీకు శుభము చేకూరును. లేనిచో నది సిద్ధింపనేరదు. ॥౧॥

౨. దేవుఁడు వెలుఁగు కమ్మని ఆజ్ఞనియ్యఁగా వెలుఁగు కలిగెను. వెలుఁగు మంచిదైనట్లు దేవుఁడు చూచెను. ఆ : ౧ : ౩-౪॥

స:- ఏమి? ఈశ్వరుని మాట జడరూపమయిన వెలుతురు వినెనా? వినినచో నీ సమయమందును సూర్య దీపాగ్న్యుల వెలుతురు మనమాటల నేల వినదు? వెలుతురు జడము; అది యెప్పుడు నొకరిమాట వినఁజాలదు. ఏమి? దేవుఁడు వెలుఁగును జూచినప్పుడే దానిని మంచిదని తెలిసికొనెనా? అంతకు మునుపాతనికిఁ దెలియకుండెనా? తెలిసియున్న దానిఁజూచి మంచిదని యేల యనును? తెలియకయుండెనేని యతఁడు దేవుఁడే కాఁడు. కావున మీబైబిలు ఈశ్వరోక్తముకాదు. అందుఁ జెప్పఁబడిన యీశ్వరుఁడును సర్వజ్ఞుఁడు కాఁడు. ॥౨॥

౩. మఱియు దేవుఁడు జలముంమధ్య నొక యాకాశమేర్పడిఁ (విశాలముకలిగి) 'ఆజలముం నీజలములను వేఱుపఱచుఁగాక' యని ఆజ్ఞనిచ్చెను. అప్పుగు దేవుఁడు (ఆవిశాలము) ఆకాశమునుచేసి (విశాలము) ఆకాశముక్రింది జలములను, (విశాలము) ఆకాశముమీఁది జలములను వేఱుపఱుపఁగా నీప్రకారమాయెను. (దేవుఁడు ఆవిశాలమునకు ఆకాశమని పేరు పెట్టెను.) దేవుఁ డాకాశమును స్వర్గమనెను. అస్తమయమును, ఉదయమును కలుగగా రెండవ దినమాయెను. ఆ: ౧: ౬-౭-౮॥

స:—ఏమీ? ఆకాశము, జలము నయిత మీశ్వరుని మాటలు వినెనా? జలముల మధ్య నాకాశము లేకున్న నాజలమెక్కడనుండఁ గలుగును. మొదటి ఆయతునందు ఆకాశమును సృజించియే యుండెనని చెప్పి మరల నాకాశ

మును రచించెననుట వ్యర్థము. ఆకాశమునే స్వర్గమని చెప్పినప్పు డది సర్వ వ్యాపక మైనందున విశ్వమంతయు స్వర్గమయ్యెను. ఇక స్వర్గము పైన నున్నదనుట నిరర్థకము. అప్పటికి సూర్యుఁడే సృష్టింపఁబడలేదు. మఱి దివా రాత్రు లెట్లు కలిగెను? ఇట్టి యసంభవోక్తులు చెప్పఁబోవు అయుక్తుండు పిండి యున్నవి. ॥౩॥

౪. అటుపిమ్మట దేవుఁడు తన స్వరూపమున, తన పోలిక చొప్పున ఆదామును చేయుదునని పలికెను. దేవుఁడు తన స్వరూపమందు ఆదామును సృజించెను. దేవుని స్వరూపమందు వాని సృజించెను. స్త్రీనిగాను పురుషుని గాను వారిని సృజించెను. దేవుఁడు వారి నాశీర్వదించెను.

ఆ: ౧: ౨౬: ౨౭. ౨౮

స :— ఒకవేళ ఈశ్వరుఁడు ఆదామును తన స్వరూపమునఁ జేసెనేని ఈశ్వరుఁడు పవిత్రుఁడు, జ్ఞానస్వరూపుఁడు, ఆనన్దమయాది లక్షణయుక్తుఁడు గదా; అతనితో సదృశుఁడు ఆదా మేల కాలేదు? కాలేదు గనుక సతనిని స్వరూపమునఁ జేయఁబడలేదు. ఆదామును పుట్టించెనన్న ఈశ్వరుఁడు తన స్వరూపమునే ఉత్పత్తిగలదిగఁ జేసెను. ఇక నది అనిత్య మెందులకు గాకుండును? మఱి ఆదాము నెక్కడనుండి పుట్టించెను?

క్రై :— మట్టినుండి చేసెను.

స :— మట్టి నెక్కడినుండి చేసెను?

క్రై :— తన సామర్థ్యముచేత.

స :— ఈశ్వరుని సామర్థ్య మనాదియా? నవీనమా?

క్రై :— అనాది.

స :— అనాదియైన జగత్కారణము సనాతనమగును. మఱి అభావము నుండి భావమునేల నమ్ముచున్నారు?

క్రై :— సృష్టికి పూర్వము ఈశ్వరుఁడు తక్క యేవస్తువును లేదు.

స :— లేకుండెనేని యీ జగత్తెక్కడనుండి చేయఁబడెను? ఈశ్వరుని సామర్థ్యము ద్రవ్యమా? లేక గుణమా? ద్రవ్యమందురేని ఈశ్వరుని కంటె వేరుగ రెండవ పదార్థముండెననుట. గుణమందురేని గుణము నుండి ద్రవ్య

మెన్నటికిని గాఁజాలదు. ఎట్లనఁగా రూపమునుండి అగ్నియు, రసమునుండి జలమును కాఁజాలవు ఈశ్వరునుండియే జగత్తుచేయఁబడియున్న నది ఈశ్వరునివంటి గుణకర్మస్వభావములు గలిగియుండెడిది అతని గుణకర్మ స్వభావములతోఁ దుల్యమైనది కానందున ఈశ్వరునుండి చేయఁబడలేదనియే నిశ్చయము. కాని జగత్కారణము పరమాణువులనఁబడు జడపదార్థము నుండి చేయఁబడినది. కాఁబట్టి ఈశ్వరుఁడు జగత్తును రచించుచున్నాఁడని వేదాది శాస్త్రములందు వ్రాయఁబడినటులే యొప్పుకొనుఁడు. ఆదాము లోపలి స్వరూపము జీవముగను, వెలుపలి స్వరూపము మనుష్యునివలె నుండెనన్న నీశ్వరుని స్వరూపమటులెందులకు లేదు? ఏలయన ఆదాము ఈశ్వరునితో సమానముగఁ జేయఁబడినప్పుడు ఈశ్వరుఁడవశ్యముగ ఆదామునుబోలియుండవలయును.॥౪॥

౫. దేవుఁడయిన సర్వేశ్వరుఁడు నేలమంటితో నరుని (ఆదామును) నిర్మించి వాని నాసికారంధ్రములో జీవవాయువును ఊఁదగా నరుఁడు(ఆదాము) జీవాత్మ ఆయెను. దేవుఁడైన సర్వేశ్వరుఁడు తూర్పున ఏదెనులో నొకతోఁటవేసి తాను నిర్మించిన నరుని దానిలో నుంచెను. ఆ తోఁటమధ్యను జీవవృక్షమును, మంచిచెడ్డల తెలివినిచ్చు వృక్షమును నేలనుండి మొలిపించెను. ఆ:౨-౭-౯॥

స:- ఈశ్వరుఁడు ఏదెనులోఁ దోఁటవేసి దానిలో నాదాము నుంచి నప్పుడితనిని మరల నిక్కడినుండి తీసివేయవలసి వచ్చునని ఈశ్వరునకు తెలియకయుండెనా? మరియు నీశ్వరుఁడు ఆదామును మంటితోఁ జేసినప్పుడత డీశ్వర స్వరూపుఁడు కాలేదు. అయినాఁడన్న నీశ్వరుఁడు సయితము మంటితోఁ జేయఁబడియుండవలసివచ్చును. ఈశ్వరుఁడతని ముక్కుపుటములలో నూపిరి యూఁదినప్పుడా యూపిరి ఈశ్వరస్వరూపమా? లేక భిన్నమా? భిన్నమై యుండెనేని ఈశ్వరుఁడాదాము స్వరూపమునలేఁడు. ఏకమైన ఆదామును ఈశ్వరుఁడును ఒక్కటైరి. ఒక్కటిగ నున్నచో జన్మము, మరణము, వృద్ధి, క్షయము, ఆఁకలి, దప్పిక మొదలగు దోషము లాదామునకు వలెనే ఈశ్వరునియందును కలుగును. ఇఁక నాఁడెట్లు ఈశ్వరుఁడు కాఁగలఁడు? ఇందు వలన నీ తౌరేతు నందలి మాట సరియని తోఁచదు. మరియు నీ పుస్తకము నయితము ఈశ్వరకృతము కాదు.

౬. అప్పుడు దేవుఁడైన సర్వేశ్వరుఁడు ఆదామునకు గాఢనిద్ర కలుగఁ జేసి అతఁడు నిద్రించుచున్నప్పుడతని ప్రక్కటెముకలలో నొక దానిని దీసి యాచోటినున్న మాంసమును పూడ్చివేసెను. తరువాత దేవుఁడయిన సర్వేశ్వరుఁడు తాను ఆదామునుండి తీసిన ప్రక్కటెముకనుండి యొక్క స్త్రీని నిర్మించి ఆమెను ఆదామునొద్దకు తీసికొని వచ్చెను. ఆ: ౨. ౨౧-౨౨॥

ప్ర:- ఈశ్వరుఁడాదామును మంటితోఁ జేసినచో నతని స్త్రీని మంటితో నేల చేయలేదు? స్త్రీని ఎముకతోఁ జేసినచో నాదాము నెముకతోఁ జేయలేదేల? నరునినుండి వెలువడినందున నారీనామము కలిగినచో నారినుండి నరనామము కూడ కలుగవలసియుండును. మఱి నారియందు సహజముగ ప్రేమయు నుండ వగును. స్త్రీనిఁ బురుషుడు ప్రేమించునటులే పురుషుని స్త్రీ యధికము ప్రేమింప వలయును. విద్వాంసులారా: ఈశ్వరుని పదార్థ విద్య (ఫిలాసఫి) ఎట్లు చిలుకు చున్నదో చూడుడు! ఆదాము ప్రక్కటెముక నొకదానిని తీసి నారిని (స్త్రీని) జేసినచో మనుష్యులందరికిని ప్రక్కటెముక యొకటి తక్కువగ నుండదేల? మఱి స్త్రీ శరీరమందు ప్రక్కటెముక యొకటే యుండవలదగును. ఏలయన నదియొకటే ప్రక్కటెముకనుండి చేయబడినది. ఏమి! ఆ జగత్తంతయు నే సామగ్రితో జేయఁబడెనో యాసామగ్రితోనే స్త్రీ శరీరము చేయఁబడ నేరకుండెనా! కాన యీ బైబిలులో జెప్పబడిన సృష్టిక్రమము సృష్టివిద్యకు విరుద్ధము. ॥౬॥

౭. దేవుఁడయిన సర్వేశ్వరుఁడు చేసిన సమస్త భూజంతువులలో సర్పము యుక్తి (ధూర్తస్వభావము) కలదై యుండెను. అది ఆ స్త్రీని చూచి 'ఇది నిజమా? ఈ తోఁట చెట్లలో దేనిఫలములనైనను మీరు తినఁగూడ దని దేవుఁడు చెప్పెనా?' యని యడిగెను. అందులకు స్త్రీ "యీ తోఁటచెట్ల ఫలము లను మేము తినవచ్చును. అయితే తోఁట మధ్యనున్న చెట్టు ఫలములనుగూర్చి దేవుఁడు 'మీరు చావకుండునట్లు వానిని తినఁగూడ దనియు, వానిని ముట్టఁ గూడ' దనియు చెప్పె"నని సర్పముతో ననెను. అందులకు సర్పము 'మీరు చావనే చావరు. ఏలయనగా మీరు వానిని తినుదినమున మీకన్నులు తెఱవఁ బడు ననియు, మీరు మంచిచెడ్డల నెఱిఁగినవారై దేవతలవలె నుందురనియు దేవునికి తెలియు'నని స్త్రీతోఁ జెప్పఁగా స్త్రీ ఆవృక్షఫలము ఆహారమునకు మంచి

దనియు,కన్నుల కందమైనదనియు వివేక మిచ్చునదనియు నెఱిఁగి ఆ వృక్షమును జూచి నప్పుడు ఆమె దానిఫలములలో గొన్ని తీసికొని తిని తనతోఁబాటు తన భర్తకునిచ్చెను. అతఁడుకూడ తినెను. అప్పుడు వారిద్దఱ కన్నులు తెఱువఁబడెను. వారు తాము దిగంబరుల మనుకొని అంజూరపు ఆకులను కుట్టి తమకు కచ్ఛదములను చేసికొనిరి. అందులకు దేవుడైన సర్వేశ్వరుఁడు సర్పమును జూచి 'నీవుదీనిచేసినందున పశువులన్నిటిలోను, భూజంతువు లన్నిటిలోను నీవే శపింపఁబడినదానవై నీకడుపుతో నడుచుచు నీవు బ్రతుకు దినములన్నియు మన్నుతిందువు. మరియు నీకును, స్త్రీకిని, నీసంతానమునకును, ఆమె సంతానమునకును, వైరము కలుగఁజేసెదను. అది నిన్ను తలమీఁదకొట్టును. నీవు దానిమడెమును కఱచెద'వని చెప్పెను. ఆయన స్త్రీని చూచి 'నీప్రయాసమును గర్భవేదనను నేను మిక్కిలి హెచ్చించెదను. వేదనతో పిల్లలకందువు. నీ భర్తయెడల నీకు వాంఛ కలుగును. అతఁడు నిన్ను ఏలు'నని చెప్పెను. ఆయన ఆదామునుచూచి 'నీవు నీభార్యమాటవిని నేను తినవద్దని నీకాజ్ఞాపించిన వృక్షఫలములను తింటివి, కనుక నీ నిమిత్తము నేల శపింపబడియున్నది. ప్రయాసముతోనే నీవు బ్రతుకు దినములన్నియు దాని పంట తిందువు. అది ముండ్లతుప్పలను, గచ్చపొదలను మొలిపించును. పొలములోని పంట తిందువు' అనెను. ఆ: ౩.౧-౨-౩-౪-౫-౬-౮-౧౪-౧౫-౧౬-౧౭-౧౮॥

స:— క్రైస్తవుల దేవుఁడు సర్వజ్ఞుఁడుగానున్న నీ ధూర్తసర్పమును సైతానునేల సృజించి యుండును. సృష్టించెనేని ఆ దేవుఁడే యపరాధియనఁదగును. ఏలయన నతఁడు దానిని దుష్టస్వభావము గలదిగ సృజింపకున్ననది దుష్టత్వ మెందులకుఁ జేసియుండును ? పూర్వ జన్మము సంగీకరింపనిచో అపరాధములేక దానిని పాపస్వభావముగలదిగ నేల సృజించెను? నిజము విచారించి చూచిన నది సర్పముగాక మనుష్యుఁడై యుండెను ; ఏలయన మనుష్యుఁడు గాకున్న మానుషభాష నెట్లు చెప్పఁగలిగియుండును ? తానసత్యవంతుఁడై యితరుల నబద్ధమార్గమున నడిపించువానినే సైతాననవలెను. ఇచట సైతాను సత్యవాది గనుక నతఁడా స్త్రీకి విపరీతములు బోధింపలేదు. సత్యమే చెప్పెను. ఈశ్వరుఁ డాదాము హవ్వలతో దీనిని తినుటవలన మీరు చనిపోదు

రని యబద్ధమాడెను. ఆచెట్టు జ్ఞానమును, అమరత్వము నిచ్చునదిగ నుండెనేని దాని ఫలములను తినఁగూడ దని యెందులకు నిషేధించెను ? అట్లు నిషేధించిన యీశ్వరుఁడే అసత్యవాదియు మోసగాఁడు నయ్యెను. ఏమనఁగా నా వృక్ష ఫలములు మనుష్యులకు జ్ఞానసుఖముల నిచ్చునవై యుండెనేకాని అజ్ఞానమును, మృత్యువును గలుగఁజేయునవి కాకుండెను. ఈశ్వరుఁడు ఆ ఫలమును తినవలదని చెప్పెనుగద: మఱి ఆ వృక్షమును సృష్టించినదెందులకు ? తనకొఱకే సృష్టించెనన్న తానజ్ఞానియు మృత్యు ధర్మము గలవాఁడునై యుండెనా ? ఇతరులకొఱకు సృష్టించెనన్న ఫలములను దినుటయం దపరాధమేమియులేదు. వర్తమాన సమయమందు జ్ఞానకారకమును, మృత్యు నివారకము నగు వృక్ష మొకటియుఁ గనఁబడుట లేదు. ఈశ్వరుఁడు దాని విత్తనమును గూడ నశింపఁ జేసెనా యేమి ? ఇట్టి పనులు చేసిన మనుష్యుఁడు మోసగాఁడును, కపటియు నగునేని యీశ్వరుఁడు నటువంటివాఁడేల గాకుండును ? ఏమనఁగా పరులను టక్కులఁబన్ని మోసపుచ్చువారు మోసగాఁడును, టక్కరియు నేల గాకుండును ? అపరాధములేనిదే ఈ ముగ్గురకు శాపము పెట్టెను గాన ఆ యీశ్వరుఁ డన్యాయకారియు నయ్యెను. ఈ శాపమీశ్వరునకు చెందవలసినదే. ఏమన నతఁడే యబద్ధముచెప్పి వారిని మోసపుచ్చియుండెను. ఈ తత్త్వవిజ్ఞానమును (ఫిలాసఫీని) కనుగొనుఁడు ! దార కలుగకుండ గర్భధారణకాని, శిశువు పుట్టుటగాని సంభవమైయుండునా ? శ్రమపడక నెవ్వరయిన జీవనము గడుపఁగలుగుదురా? మొదట ముండ్లచెట్లు లేకుండెనా ? కూరగాయలు దినుట మనుష్యుల కందఱకు నీశ్వరుని యాజ్ఞవలన నుచితమేని తిరిగి బైబిలునందు మాంసము తినవలెనని వ్రాసినది యబద్ధముకాదా? అది నిజమేని ఇది యబద్ధము. ఆదామునందేమియు నపరాధము సిద్ధింపదేని క్రైస్తవులు జనులందఱును "ఆదాము చేసిన యపరాధమునుబట్టి యతని సంతానమైనందున పాపు"లని యెందులకు చెప్పుచున్నారు. బళే ! ఈలాటి పుస్తకము కాని యిట్టి యీశ్వరుడుకాని బుద్ధిమంతుల కొప్పిదములా ! ॥౩॥

ఆ.- అప్పుడు దేవుఁడయిన సర్వేశ్వరుఁడు చెప్పెను. ఇదిగో మంచి చెడ్డం నెఱుఁగునట్లు ఆదాము మనలో నొకనివంటివాఁడాయెను; కాఁబట్టి అతఁ

దొంతవేళ తన చేతినిచాచి జీవవృక్ష ఫలములనుగూడ తీసికొని తిని నిరంతరము జీవించునేమో అనుకొని అతఁడాదామును వెళ్ళఁగొట్టి ఏదేను తోఁటకు తూర్పు దిక్కున 'కెరూబు'లను జీవవృక్షమునకు పోవుమార్గమును కాచుటకు ఇటు అటు తిరుగుచున్న ఖడ్గజ్వాలను నిలువబెట్టెను. ఆ. ౩: ౨౨-౨౪॥

స:- మంచిది. జ్ఞానమందు మాతో సమానుఁడయ్యెనని ఈశ్వరునకిట్టి యీర్ష్యాభ్రమలెందులకుఁగలిగెను. ఇదేమి చెరుగా? ఇట్టి శంక యేలకలిగెను? ఈశ్వరునికి సమానుఁడౌటకుఁ యెన్నటికిని గాఁజాలరు. ఇసస్వ్రాఁతవలన నతఁ డీశ్వరుఁడు గాక మనుష్యమాత్రుఁడై యుండెననియే తేటపడుచున్నది. బైబిలు నందు వర్ణింపఁబడిన యీశ్వరుఁడు మనుష్యునివంటి వాఁడేయని విదితమగు చున్నది. ఇంకను గమనింపుఁడు. ఈశ్వరుఁడాదాము జ్ఞానోన్నతినిజూచి దుఃఖి తుఁడగుటయేగాక అమరవృక్షఫలములను తినునని యెంతయో యీర్ష్యకలవాఁ డయ్యెను. మొదట తోఁటలో నుంచినప్పుడు తిరిగి యితనిని వెళ్ళగొట్టవలసి వచ్చునను భవిష్యత్ జ్ఞానమతనికి లేకయుండెను. కావున క్రైస్తవుల యీశ్వ రుఁడు సర్వజ్ఞుఁడుగాకుండెను. ఇఁక మెఱయుచుండు ఖడ్గమును ధరింపఁజేసి కాపలాను కావలియుంచెను. ఇదికూడ మనుష్యుని పనియే కాని యీశ్వరునిది కాదు. ॥౮॥

౯. కొంతకాల మయినతరువాత కయీనుపొలము పంటలో కొంత యెహోవాకు అర్పణగా తెచ్చెను. హేబేలుకూడ తనమందలో తొలి చూలున పుట్టినవానిలో క్రొవ్వినవానిని కొన్ని తెచ్చెను. యెహోవా అతని అర్పణను లక్ష్యపెట్టెను. కయీనును అతని అర్పణను, ఆయన లక్ష్యపెట్టలేదు. కాఁబట్టి కయీనునకు మిక్కిలి ఆగ్రహమువచ్చి తన ముఖము చిన్నపుచ్చుకొనఁగా యెహోవా కయీనునుచూచి. నీకు ఆగ్రహమేల. ముఖము చిన్నపుచ్చుకొని యున్నావేమి? అనెను. ఆ: ౪: ౩-౪, ౫-౬॥

స:- దేవుఁడు మాంసాహారి కాఁడేని గొఱ్ఱెల అర్పణను, హేబేలు నాదరించి, కయీనును, అతని అర్పణ నెందులకు తిరస్కరించి యుండును? మఱియు: ఏ జగడమునకును, హేబేలు మరణమునకును, దేవుఁడే కారణుఁడయ్యెను. మనుష్యులొకరితో నొకరు మాటలాడునట్లే క్రైస్తవుల దేవుఁ

దును మాటలాడును. తోఁటలో వచ్చుచు పోవుచుండుటయు, దానిని వేయుట నయితము, మనుష్యుల పనియే గనుక నీ బైబిలు మనుష్యులచేఁ గల్పింపఁ బడినదే కాని ఈశ్వరోక్తము కాదు. ॥౯॥

౧౦. దేవుఁడు, (యెహోవ) 'నీతమ్ముఁడయిన హేబేలు ఎక్కడ నున్నా'డని కయీనునడుగఁగా నతఁడు 'నేనెఱుఁగను. నాతమ్మునికి నేను కావలివాఁడనా'యనెను. అప్పుడాయన 'నీవుచేసినపని యేమిటి? నీతమ్ముని రక్తపుస్వరము నేలలోనుండి నాకు మొఱపెట్టుచున్నది. ఈ నేలమీఁద నుంత కుండ నీవు శపింపఁబడినవాఁడవు.' అనెను. ఆ. ౪:౯-౧౦-౧౧॥

స:—ఏమి! హేబెలు గతి యేమైయుండునది ఈశ్వరుఁడెఱుఁగక కయీను నడిగెనా? రక్తనాదము భూమిలోనుండి యెప్పుడైన నొకరని బిలువఁ గలుగునా? ఇవన్నియు పామరుల మాటలే. కావున నీ పుస్తకమీశ్వర కృతము కాని యొకవిద్వాంసునిచే వ్రాయఁబడినది కాని కాఁజాలదు. ॥౧౦॥

౧౧ హనోకు, మతూషెలహును కనిన తరువాత మున్నూఱేండ్లు దేవునితో నడుచుచుండెను. ఆ: ౫: ౨౨॥

స:—బలే! క్రైస్తవుల దేవుఁడు మనుష్యుఁడుగాకున్న హనోకు అతని వెంబడి యెట్లు నడచియుండును? కనుక వేదమందుఁ జెప్పఁబడిన నిరాకారుఁడగు పరమేశ్వరుని నమ్ముటయే క్రైస్తవులకు శ్రేయస్కరము. ॥౧౧॥

౧౨. వారికి కుమార్తెలు పుట్టినప్పుడు, దేవుని కుమారులు, నరుల కుమార్తెలు చక్కనివారని చూచి వారందఱిలో తమకు మనస్సువచ్చిన స్త్రీలను వివాహము చేసికొనిరి. ఆదినములలో దానవులు భూమిమీఁద నుండిరి. తరువాతకూడ దేవుని కుమారులు నరుల (ఆదాము) కుమార్తెలతో సంతోషించి నప్పుడు, వారికి పిల్లలను కనిరి. వారు పూర్వపువారి కంటె పేరు పొందిన వారు. నరుల చెరుతనము భూమిమీఁద గొప్పదనియు, వారి హృదయమునం దలి తలంపులలోని ఊహ యంతయు నెల్లప్పుడు కేవలము చెడ్డదనియు దేవుఁడు చూచి తాను భూమిమీఁద నరులను సృష్టించినందు "యెహోవా" సంతాపమునొంది తన హృదయములో నొచ్చుకొనెను. అప్పుడు దేవుఁడు నేను సృజించిన నరులను, నరులతోఁగూడ జంతువులను పురుగులను, ఆకాశ

పశ్వాదులను, భూమిమీఁదనుండకుండ తుడిచివేయుదును; ఏలయనఁగా నేను వారిని సృజించి పశ్చాత్తాపము పొందియున్నా ననెను.

అ: ౬: ౧-౨-౪-౫-౬-౭॥

స:— క్రైస్తవులను "దేవుని కుమారులెవరనియు, దేవునిభార్య అత్త, మామ, బావమఱఁది, సంబంధులెవరెవరనియు" నడుగవలయును; ఏలయన ఇప్పుడా నరుల కుమార్తెలతో వివాహమైనందున దేవుఁడు వారికి వియ్యంకుఁడయ్యెను. అట్లే వారికిఁ బుట్టిన పుత్రులు పౌత్రులయిరి. ఏమి; ఇవి దేవ వాక్యములా? దేవపుస్తకమందలి వాక్యములా కాఁగలవా; కావున నీ పుస్తకము ననాగరకులు రచించిరనియే స్పష్టమగుచున్నది. సర్వజ్ఞుఁడు గాని వారును; ముందురాఁగలమాటల నెఱుఁగని వారును ఈశ్వరుఁడేకాఁడు. అతఁడు జీవుఁడు సృష్టిని రచించినప్పుడు ముందు ముందు మనుష్యులు దుష్టులగుదురనుమాట యతనికి దెలియకుండెనా; ఇట్లు పశ్చాత్తాపపడుట, అతిశోకాదుల భరించుట, పొరపడి పనిచేసి పిమ్మట పశ్చాత్తాప పడుట మొదలగునవి యీ క్రైస్తవుల దేవునియందే పుట్టియున్నవి. ఏమనఁగా వీరి దేవుఁడు పూర్ణ విద్వాంసుఁడుగాఁడు. ఒక యోగియునుగాఁడు. ఐనచో శాంతియుక్తుఁడును విజ్ఞానయుక్తుఁడునయి శోకాదులనుండి దూరమైయుండెడివాఁడు. సరి; పశుపక్షులు నయితము దుష్టస్వభావములు గలవయ్యెనా! ఈశ్వరుఁడు సర్వజ్ఞుఁడైనచో నింతటి విషాదము నేల పొందియుండును; ఇందువలన నితఁ డీశ్వరుఁడు కాఁడు. ఈ పుస్తకము నీశ్వరకృతము కాఁజాలదు. వేదమందు చెప్పఁబడి యున్నట్లు సమస్తపాపక్లేశదుఃఖ శోకాది రహితుఁడును, సచ్చిదానందస్వరూపుఁడునగు పరమేశ్వరుని నీ క్రైస్తవు లిప్పుడయిన నమ్ముదురేని తమ మనుష్య జన్మమును సఫలపరుచు కొనఁగలుగురు. ॥౧౨॥

౧౫. ఆ యోడ మున్నూఱు మూరల పొడుగును, ఏఁబది మూరల వెడల్పును, ముప్పదిమూరల యెత్తును గలదై యుండవలెను. నీవును నీతోడ నీకుమారులును, నీ భార్యయు నీకోడండ్రు ఆ యోడలో ప్రవేశింపవలెను. నీతో కూడ వానిని బ్రతికించి యుంచుకొనుటకు, సమస్తజీవులలో అనఁగా, సమస్త శరీరులలో—ప్రతి జాతిలోనివి—రెండేసిచొప్పున నీవు ఓడలోనికి తేవలయును.

వానిలో మగదియు నాఁడుదియు నుండవలెను; నీవు వానిని బ్రతికించి యుంచు కొనుటకై వానివానిజాతుల ప్రకారము పక్షులలోను, వానివాని జాతుల ప్రకారము జంతువులలోను, వానివాని జాతుల ప్రకారము నేలప్రాఁకువాని యన్నిటిలోను, ప్రతిజాతిలో రెండేసి చొప్పున నీయొద్దకు అవి వచ్చును. మఱియు నీవు తినుటకు నానావిధమైన ఆహార పదార్థములను కూర్చుకొని నీదగ్గర నుంచుకొనుము. అది నీకును వానికిని, ఆహారమగునని చెప్పెను. నోవహు ఈశ్వరాజ్ఞానుసార మట్లంతయు చేసెను.

ఆ: ౬. ౧౫, ౧౮, ౧౯, ౨౦, ౨౧, ౨౨॥

స:— వీరా! ఇట్టి జ్ఞానవిరుద్ధమగు అసంభవమైనమాట చెప్పిన వానిని దేవుఁడని ఏ విద్వాంసుఁడైనను నమ్మఁగలుగునె? ఇఁక నింతగొప్ప పెద్దబాను. ఎత్తుసుగల నావయందు, ఏనుఁగులు, లొట్టిపిట్టలు, మొదలుగాగల కోట్లకొలది జంతువుల జతలను, వానికొఱకును, తన కుటుంబముకొఱకును అన్నపానాది సామగ్రులన్నియు నిముడఁగలుగునా? కావున నీపుస్తకము మనుష్యనిచే వ్రాయఁబడినది దీనిని వ్రాసినవాఁడయినను విద్వాంసుఁడుగాక యుండెను. ౪౧౩॥

౧౪. అప్పుడు నోవహు యెహోవాకు బలిపీఠము కట్టి పవిత్ర పశువు లన్నిటిలోను, పవిత్రపక్షులన్నిటిలోను, కొన్ని తీసికొని, ఆ పీఠముమీఁద దహనబలి నర్పించెను. అప్పుడు యెహోవా యింపయిన సువాసన నాఘ్రాణించి, ఇఁకమీఁదట నరులనుబట్టి భూమిని మరల శపింపను; ఏమనఁగా నరుల హృదయాలోచన వారి బాల్యమునుండి చెడ్డది. నేనిప్పుడు చేసిన ప్రకారముగా సమస్త జీవులను సంహరింపను. అని యనుకొనెను.

ఆ: ౮: ౨౦, ౨౧॥

స:— వేదికట్టుట, హోమమొనరించుట యను నీ మాటలు వేదము నుండి యెత్తిబైబిలునందు చేర్పఁబడినట్లు తోఁచుచున్నది; ఏమి! సువాసన నాఘ్రాణించుటకు పరమేశ్వరునికి ముక్కుకలదా? ఈ క్రైస్తవుల దేవుఁడు మనుష్యుని వలె నల్పజ్ఞుఁడుకాఁడా?ఒకప్పుడు శపించుటయు,పిదపపశ్చాత్తాప పడుటయు, ఒప్పుడు శపింపననియు ననుచున్నాఁడు.మొదట శపించినట్లే మరల

కూడ శపింపఁగలఁడు. మొదటనందఱను చంపివేసెను; ఇప్పుడో యింక నెప్పుడును చంపననుచున్నాఁడు!!! ఇవన్నియు పిల్ల కాయలమాటలవంటివి. ఈశ్వరుని పనులెట్లు? ఒక విద్వాంసునివైనను కావు. ఏలయన విద్వాంసుని మాటకాని ప్రతిజ్ఞ కాని స్థిరపడియుండఁ గలుగును. ॥౧౪॥

౧౫. మఱియు దేవుఁడు నోవహును, అతని కుమారులను, ఆశీర్వదించి....'ప్రాణముగల ప్రతిజంతువు మీకు ఆహారమగును; పచ్చని కూర మొక్కల నిచ్చినట్లు వానిని మీకిచ్చియున్నాను; అయినను మాంసమును దాని రక్తముతో మీరు తినఁగూడదు. రక్తమే దాని ప్రాణము, అనెను.

ఆ: కా: ౧—౩—౪॥

స:—ఒకరి ప్రాణము దీయించి యితరుల నానందింపఁజేసినందున నీ క్రైస్తవుల దేవుఁడు దయావిహీనుఁడుకాఁడా? తల్లి దండ్రులు ఒకపుత్రుని జంపించి మఱొకనికి దినఁబెట్టుదురేని వారు మహాపాపులుకారా? ఇదియు నట్లేయున్నది. ఏలయన ప్రాణులన్నియు నీశ్వరునకు పుత్రులవంటివే. అట్లు భావింపనందుననే కద వీరల దేవుఁడు కటిక వానివలె వర్తించుచున్నాఁడు. ఇఁక మనుష్యులందఱను హింసకులుగఁ గూడ నితఁడే చేసియున్నాఁడు. కాఁబట్టి క్రైస్తవుల దేవుఁడు దయలేని వాఁడయినందున పాపాత్ముఁ డెందుఁ గాకుండును? ॥౧౫॥

౧౬. భూమియందంతట నొక్కభాషయు నొక్క పలుకును నుండెను. మఱియువారు ''మనము భూమియందంతట చెదరిపోకుండ నొక పట్టణమును ఆకాశమునంటు శిఖరముగల యొక గోపురమును కట్టుకొని పేరు సంపాదించి కొందమురండ''ని మాటలాడు కొనఁగా యోహోవా నరుల కుమారులు కట్టిన పట్టణమును, గోపురమును చూడ దిగివచ్చెను. అప్పుడు దేవుడు, 'ఇదిగో జనము ఒకటే; వారికందఱికి భాషయొక్కటే. వారీపని యారంభించియున్నారు. ఇఁకమీఁదట వారుచేయఁదలంచు నే పనియైనను చేయకుండ వారి కాటంకమేమియు నుండదు గనుక మనము దిగిపోయి వారిలో నొకని మాట యొకనికి తెలియకుండ అక్కడ వారి భాషను తారుమారుచేయుదము రండ'ని అనుకొనెను. అలాగు యోహోవా అక్కడనుండి భూమియందంతట వారిని చెదరఁ

గొట్టెను. కనుక వారు ఆ పట్టణమును కట్టుటమానిరి.

ఆ:౧౧:౧-౪-౫-౬-౭-౮॥

స:-పృథివియందంతట నొక్క భాషయునొక్క పలుకును నుండినప్పుడుమను ష్యులందఱకు పరస్పర మత్యంతానందము ప్రాప్తమై యుండవచ్చునుకాని చేయుచ దేమి? ఈ క్రైస్తవుల ఈర్ష్యగల దేవుఁడు వారి భాషను తారుమారుచేసి యంద ఱను పాడుచేసెను! అతడట్లు చేయుట గొప్పతప్పు? అది సైతాను పనికంటెను చెడ్డపని కాదా? ఇఁక క్రైస్తవుల దేవుఁడు సీనాయిపర్వతము మొదలగు వాని మీఁద నివసించు చుండెననియు, జీవుల యున్నతినైనఁజూడనేరకుండెననియుఁ గూడ దీనివలన విదిత మగుచున్నది. ఇదియొక పామరుని మాటగాక ఈశ్వర వాక్యమనికాని ఇది ఈశ్వరోక్త పుస్తకమనికాని యెట్లంగీకరింపఁబడఁగల గును? ॥౧౬॥

౧౭. అప్పుడతఁడు తన భార్యయయిన సారయినిచూచి 'ఇదిగో నీవు చక్కని దానవని యెఱుఁగుదును. ఐగుప్తీయులు నిన్నుచూచి యీమె అతని భార్యయని నన్నుచంపి, నిన్ను బ్రతుక నిచ్చెదరె. నీవలన నాకు మేలు కలుగు నట్లును, నిన్నుబట్టి నేను బ్రతుకునట్లును, నీవు నా సహోదరివని దయచేసి చెప్పుమ'నెను. ఆ: ౧౨: ౧౧-౧౨-౧౩॥

స:-ఇప్పుడు చూడుఁడు ! అబ్రాహామును క్రైస్తవులు, ముసల్ మానులు గూడ గొప్పపైగంబరు (దేవదూత) అని భావించుచున్నారు. అతని మిథ్యాభాషణాది కార్యములు అనుచితములేకద. పైగంబరు లిట్టివారైన వారి యనుచరులకు విద్యకాని మంచిమార్గముకాని యెట్లు లభింపఁగలదు? ॥౧౭॥

౧౮. మఱియు దేవుఁడు 'నీవును నీవేకాదు: నీతరువాతవారి తరములలో నీ సంతతియు నా నిబంధన గైకొనవలెను. నాకును నీకును నీతరువాత నీ సంతతికిని మధ్యను మీరు గైకొనవలసిన నానిబంధన యేదనఁగా మీలో ప్రతి మగవాఁడును సున్నతి పొందవలెను. మీరు మీ గోప్యాంగ చర్మమున సున్నతి పొందవలెను. అది నాకు నీకు మధ్యనున్న నిబంధనకు సూచనగా నుండును. ఎనిమిది దినముల వయస్సుగలవాఁడు అనఁగా నీ యింట పుట్టిన వాఁడయినను నీసంతానముకాని, అన్యునియొద్ద వెండిచేత కొనఁబడిన వాఁడయినను మీ

తరములలో ప్రతి మగవాఁడు మీలో సున్నతి పొందవలెను. నీయింటిలో పుట్టిన వాఁడును, నీ వెండిచేత కొనఁబడినవాఁడును తప్పక సున్నతి పొందవలెను. అప్పుడు నానిబంధన మీశరీరమందు నిత్యనిబంధనగా నుండును. సున్నతి పొందని మగవాఁడు అనఁగా నెవని గోప్యాంగచర్మము సున్నతిచేయఁబడదో అట్టివాడు తన జనులలోనుండి కొట్టివేయఁబడును. వాఁడు నానిబంధన మీఱియున్నాఁడ'ని అబ్రాహాములో చెప్పెను.

ఆ. ౧౭:౯-౧౦-౧౧-౧౨-౧౩-౧౪॥

స:-ఇప్పుడీశ్వరుని విపరీతమైన యాజ్ఞ చూడుఁడు! ఈ సున్నతియను గోప్యాంగ చర్మఖండనము గావించుట యతనికిష్టమై యున్నచో సృష్ట్యాది యందాచర్మము కలిగింపకయే యుండెడివాఁడు. అది కంటికి రెప్పవలె రక్షణార్థము కలిగింపఁబడియున్నది. ఏలయనఁగా నా గోప్యాంగ మతికోమలమైనది. అట్లది చర్మముతోఁగూడి యుండకున్న నొకపురుగు కాటువలననో, కొంచెము దెబ్బ తగులుట వలననో మిక్కిలి నొప్పి కలుగును. ఇంక నది లఘుశంకానంతరము కొంత మూత్రాంశమును బట్టలకు తగులకుండఁజేయుట ఇత్యాది పనుల కుపయుక్తమై యున్నదికాన దానిని ఛేదించుట తప్పు. మఱియును, ఇప్పుడు క్రైస్తవు లీయాజ్ఞను పాలించుటలేదెందులకు? సర్వదా పాలింపఁబడవలెనను నీ యాజ్ఞ పాలింపఁబడుటలేదు. కాన వ్యవస్థాపుస్తకమును బైబిలు నందొక బిందుమాత్ర మసత్యోక్తి లేదని యేసుచెప్పిన సాక్ష్యము మిథ్యయయ్యెను. దీనిని క్రైస్తవు లెంతమాత్రము కనుఁగొనుట లేదుగదా!

॥౧౮॥

౧౯. దేవుఁడు అబ్రాహాముతో మాటలాడుట చాలించినతరు వాత అతని యొద్దనుండి (పరమునకు) పైకి వెళ్లెను. ఆ: ౧౭:౨౨॥

స:-క్రిందినుండి మీఁదికిని, మీఁదినుండి క్రిందికిని పోవుచువచ్చుచు నుండెనన్న నీదేవుఁడొక మనుష్యుఁడో లేక పక్షియో యై యుండెనని దీనివలన నిరూపితమగుచున్నది. కాన నితఁడొక ఇంద్రజాలకునివలె నుండెననుటయే నిశ్చయము. ॥౧౯॥

౨౦. మఱియు మమ్రేదగ్గరనున్న సింధూరవనములో అబ్రాహాము ఎండవేళను గుడారపు ద్వారమందు కూర్చుండి యున్నప్పుడు పరమేశ్వరుఁడ తనికి కనఁబడెను. అతఁడు కన్నులెత్తి చూచినప్పుడు ముగ్గురు మనుష్యులతని యెదుట నిలువఁబడి యుండిరి. అతఁడు వారినిచూచి గుడారపు వాకిటనుండి వారి నెదుర్కొనుటకు పరుగెత్తి నేలమట్టుకు వంగి ప్రభువా ! నీకటాక్షము నామీఁదనున్న యెడల నిప్పుడు నీదాసుని దాఁటిపోవద్దు. నేను కొంచెము నీళ్ళు తెచ్చెదను. దయచేసి కాళ్ళుకడుగుకొని యీ చెట్టుక్రింద అలసట తీర్చుకొనుఁడి. కొంచె మాహారమును తెచ్చెదను. మీ ప్రాణములను బలపరచుకొనుఁడి. తరువాత మీరు వెళ్ళవచ్చును. ఇందునిమిత్తముగ తామీదాసుని యొద్దకు వచ్చితిరనెను. వారు నీవుచెప్పినట్లు చేయుమనఁగా అబ్రాహాము గుడారము లోనున్న శారాయొద్దకు త్వరగవెళ్ళి నీవు త్వరపడి మూఁడుమానికల మెత్తని పిండి తెచ్చి పిసికి రొట్టెలు చేయుమనిచెప్పెను. మఱియు అబ్రాహాము పశువుల మందకు పరుగెత్తియొక లేఁతదూడనుతెచ్చి యొక పనివాని కప్పగించెను. ఆపనివాఁడు దానిని త్వరగా సిద్ధపఱచెను. తరువాత అతఁడు వెన్నయును, పాలను, తాను సిద్ధముచేయించిన దూడనుతెచ్చి వారియెదుటఁబెట్టె వారు భోజనము చేయుచుండఁగా వారియొద్ద ఆ చెట్టుక్రింద నిలుచుండెను.

ఆ: ౧౮: ౧-౨-౩-౪-౫-౬-౭-౮॥

స:—సజ్జనులారా ! చూచితిరా ! దేవుఁడే దూడమాంసమును దినుచున్నాఁ డతని యుపాసకులావులు దూడలు మొదలగు పశువుల నేల విడుతురు ? కొంచెమైన దయలేక మాంసము దినుటకు సిద్ధముగా నుండువాఁడు హింసకుఁడగు మనుష్యుఁడుగాక యెప్పుడైన నీశ్వరుఁడు కాఁగలఁడా? మఱి ఈశ్వరుని వెంబడి నిద్దఱు మనుష్యు లెవరుండిరో తెలియదు. అనాగరికుల సముదాయ మొకటి యుండెననియు అందులో ముఖ్యుఁడుగా నుండినవాఁడే యీ బైబిలునందు ఈశ్వరుడని పేర్కొనబడఁవచ్చుననియు దీనివలన తెలియుచున్నది. కాన బుద్ధిమంతులు వీరి పుస్తకమును ఈశ్వరకృతమనికాని, అందు వర్ణింపఁబడిన యీశ్వరుని నీశ్వరుడనికాని యంగీకరింప నేరరు ॥౨౦॥

౨౧. అంతట పరమేశ్వరుడు అబ్రాహాముతో "వృద్ధురాలనైన నేను నిశ్చయముగా ప్రసవించెదనాయని శారా నవ్వనేల? పరమేశ్వరున కసాధ్యమైన దేదైన నున్నదా" అనెను. ఆ. ౧౮. ౧౩-౧౪॥

స:— ఈక్రైస్తవుల దేవుని చిత్రములు కనుగొనుడు. పిల్లకాయవలెనో లేక స్త్రీలవలెనో చిరాకుపడుచు ఎత్తిపొడుచుచున్నాడు ॥౨౧॥

౨౨. అప్పుడు పరమేశ్వరుడు సొదొమ మీదను గొమొఱ్ఱా మీదను పరమేశ్వరుని యొద్దనుండి గంధకమును, అగ్నిని ఆకాశమునుండి కురిపించి, ఆ పట్టణములను, ఆ మైదానమంతను, ఆ పట్టణములో నివసించినవారి నందఱను నేల మొలకలను నాశము చేసెను. ఆ. ౧౯: ౨౪-౨౫॥

స:— బైబిలునందు వర్ణింపబడిన దేవునే యీలీలను కూడ గనుగొనుడు: బాలకాదుల మీదనయిన నించుకేనియు దయరాలేదుగా? భూమిని బొరలించి యందఱ నొత్తి చంపెనన్న వారందఱు నపరాధులుగ నుండిరా? ఈమాట న్యాయ దయావివేకములకు విరుద్ధమైనదే కద. దేవుడే యిట్టి పనుల నొనరించిన నాతని యుపాసకు లట్టిపనులను జేయకుందురా? ॥౨౨॥

౨౩. మనతండ్రి ద్రాక్షారసము త్రాగించి అతనితో శయనించి మన తండ్రివలన సంతానమును కలుగజేసికొందము రమ్మని చెప్పెను. ఆ రాత్రి వారు తమతండ్రికి ద్రాక్షారసము త్రాగించిన తరువాత అతని పెద్దకుమార్తె లోపలికి వెళ్లి తనతండ్రితో శయనించెను. మనము నేటి రాత్రియు ద్రాక్షారసము త్రాగించెదము. నీవువెళ్లి శయనింపుము. చిన్నది వెళ్లి యతనితో శయనించెను. అలాగున లోతుకుమార్తెలిద్దఱు తమ తండ్రివలన గర్భవతులైరి. ఆ: ౧౯: ౩౨-౩౩-౩౪-౩౬॥

స:— చూడుడు: ఏ మద్యపానపు మత్తు తండ్రికిని కుమార్తెకును సంపర్కము కలుగజేసెనో యట్టి దుష్టమగు మద్యమును క్రైస్తవాదు లిప్పటికిని త్రాగుచునే యున్నారుగా? ఇక వారి దుష్టత్వమునకొక మేరయుండునా? కాన సజ్జనులు దుష్టమద్యమును త్రాగనుగాదు. ॥౨౩॥

౨౪. దేవుడు తాను చెప్పిన ప్రకారము శారానుగూర్చి చేసెను. మఱి శారా గర్భవతి యాయెను. ఆ: ౨౧: ౧-౨॥

స:—ఇపుడు శారానుగూడి గర్భవతిగాఁ జేసెనను శారీరమెట్లయ్యెనో గమనింపుడు: ఏమి పరమేశ్వరుడును శారాయుఁగాక మూఁడవ వాఁడెవఁడైన గర్భస్థాపకుడుగ నగపడుచున్నాడా: శారాపరమేశ్వరుని కృపవలననే సట గర్భవతి యయ్యెనని విదితమగుచున్నది: ॥౨౪॥

౨౫. కాఁబట్టి తెల్లవాఱునప్పుడు అబ్రాహాములేచి ఆహారమును నీళ్ల త్తిని తీసికొని ఆపిల్లవానితోఁ గూడ హాగరునకప్పగించి ఆమె భుజముమీఁద వానిని పెట్టి ఆమెను పంపివేసెను ఆమె పిల్లవాని నొకపొదలోఁ బడవేసి యెదురుగా కూర్చుండి యెలుగెత్తి యేడ్చెను. అప్పుడు దేవుఁడు ఆ చిన్నవాని మొఱ వినెను. ఆ: ౨౧: ౧౪-౧౫-౧౬-౧౯॥

స:—చూచితిరా! మొదట వారాకు పక్షపాతియై హాగరనువాని సప్పుడ నుండి వెళ్ళఁగొట్టించిన క్రైస్తవుల దేవుని చిత్రములు: ఎలుఁగెత్తి యేడ్చు వది హాగరు. విన బడినది బాలుని శబ్దమట. ఇదియునొకవింతయే. బాల కుఁడే యేడ్చుచున్నాఁడని యీశ్వరునకే భ్రమ కలుగవచ్చును కాఁబోలు. ఇది యీశ్వర వాక్యమని కాని. ఈశ్వరకృత గ్రంథస్థ వాక్యమనిగాని చెప్పఁబడ గలదా: ఒక సాధారణమైన మనుష్యునివంటి మాటలే యీ పుస్తకమునఁదుఁ గలవు. వానిలోఁ గొన్ని మాత్రము సత్యములై తక్కినవన్నియు అసారో క్తులై నిండియున్నవి ॥౨౫॥

౨౬. ఆ సంగతులు జరిగిన తరువాత దేవుఁడు అబ్రాహామును శోధిం చెను ఎట్లనగా ఆయన "అబ్రాహామా!"యని పిలువఁగా అతఁడు "చిత్తము ప్రభువా"యనెను. అప్పుడాయన—నీకు ఒక్కఁడైయున్న నీ కుమారుని అనఁగా: నీవు ప్రేమించు ఇస్సాకును తీసికొని.........దహనబలిగా నతని నర్పింపుమని చెప్పెను. తనకుమారుఁడగు ఇస్సాకును బంధించి ఆపీఠముపై నున్న కట్టెలమీఁద నుంచెను. అప్పుడు అబ్రాహాము తనకుమారుని వధింప టకు తనచేయి చాపి కత్తి పట్టుకొనఁగా సర్వేశ్వరుని దూత పరలోకము నుండి "అబ్రాహామా అబ్రాహామా!" అని యతనిఁబిల్చెను అందులకతఁడు "చిత్తము ప్రభువా"యనెను. అప్పుడాయన "ఆచిన్నవానిమీఁద చేయి వేయ కుము; అతని నేమియు చేయకుము......నీవు దేవునికి భయపడువాఁడవని

ఇందువలన నాకు కనబడుచున్నది.

ఆ: ౨౨: ౧-౨-౯-౧౦-౧౧-౧౨॥

స:—ఇప్పుడు బైబిలునందలి దేవుడల్పజ్ఞుడనియు, సర్వజ్ఞుడు కాడనియు స్పష్టమైనది. అబ్రాహామును నతడు నొక అమాయకుడయియుండెను లేనిచో నిట్టిచేష్టనెందులకు జేసియుండును. బైబిలునందలి దేవుడు సర్వజ్ఞుడేయైన అతని భవిష్యద్వృత్తిని తన సర్వజ్ఞత్వముతో తెలిసికొనియే యుండును. కావున క్రైస్తవుల దేవుడు సర్వజ్ఞుడు కాడనుటయే నిశ్చయము.

॥౨౮॥

౨౦. మా శ్మశాన భూములలో అతిశ్రేష్ఠమైన దానియందు మృతి బొందిన నీభార్యను పాతిపెట్టుము. ఆ: ౨౩: ౨౮॥

సమీ:—శవములను పాతిపెట్టుటవలన ప్రపంచమునకు గొప్ప హాని కలుగుచున్నది. ఎట్లన నవి మురిగి వాయువును దుర్గంధపఱచి రోగములను వ్యాపింపజేయుచున్నవి.

ప్రశ్న:—చూడుడు! ప్రీతి యెందుగానుండు వానిని కాల్చుట మంచిది కాదు. పాతిపెట్టుట వానిని పరుండబెట్టినట్లగును. కాన పాతిపెట్టుటయే మంచిది.

ఉత్తరము:—మృతినొందినవారి ప్రేమించుచున్న తమ యింట నేల యుంచుకొనరు? మరియు నెందులకు పాతిపెట్టుచున్నారు? ఏ జీవాత్మయందు ప్రీతియుండెనో యది వెళ్ళిపోయెను. ఇక దుర్గంధ యుక్తమగు మంటియందేమి ప్రీతి? ప్రీతియుంచుచున్నచో దానిని మంటిలో నేల పూడ్చి పెట్టుచున్నారు? చూడుడు! ఒకడొకనితో "నిన్ను మంటిలో పూడ్చి పెట్టవలె" నని చెప్పినేని యతడు విని ప్రసన్నుడెప్పటికి కాడు. అట్లే యతని ముఖనేత్ర శరీరములపై దూళిని, రాలను, ఇటికలను, సున్నమునువేయుట, రొమ్ముమీద బండపెట్టుట యనునదొక ప్రీతియా? మఱి పెట్టెలో నునిచి పాతిపెట్టుటవలనను దుర్గంధమధికమై భూమి నుండివెడలి వాయువును చెఱచి దారుణమైన రోగములను బుట్టించును. (రెండవది) ఒక శవమును పూడ్చిపెట్టుటకు కనిష్ఠపక్షమందు ఆఱుమూరల పొడవును, నాలుగుమూరల వెడల్పునుగల భూమి

కావలసివచ్చును. ఈ లెక్క చొప్పున నూఱుశవములనో, వెయింటినో లక్ష సంఖ్యాకము లనో లేక కోటిసంఖ్యాకములనో పూడ్చిపెట్టిన నెంతయో భూమి వ్యర్థముగ పనికిరానిదై పోవును. ఇక నది పొలమునకుగాని తోటకుగాని కాపురమునకుగాని యుపయోగపడకుండును కావున పాతిపెట్టుట యన్నిటి కంటె చెడ్డది. జలములలో వేయుట దానికంటె కొంచెము చెడ్డది. ఏల యన దానినప్పుడే జలజంతువులు చీల్చి పీల్చి తినును. కాని జలమున మిగిలిన ఎముకలు, మలము మునిగి ప్రపంచమునకు హాని కలిగించును. ఇక అడవిలో పాఱవేయుట యంతకంటెను చెడ్డది. ఏలయన దానిని మాంసాహారియైన పశు పక్షులు కొఱికి తిన్నను, దాని ఎముకలలోని మజ్జ మలము, ముఱుగుటచే నెంత దుర్గంధము పుట్టునో యది జగత్తునకంత యపకారమే చేయును. కాన దహనముచేయుట సర్వోత్కృష్టము. ఏలయన దానియందలి పదార్థములన్నియు సణు రూపమై వాయువులో నెగసి పోవును.

ప్రశ్న:—దహనముచేయుటవలనకూడ దుర్గంధము కలుగును ?

ఉత్తరము :—విధ్యుక్తముగ దహనము చేయనిపక్షమందు కొంచెము కలుగును కాని పూడ్చి పెట్టుట మున్నగువానికంటె నది చాలా తక్కువ యగును. ఇక విధిపూర్వకముగ వేదమందు చెప్పబడినట్లు 3 మూరల లోతును, మూడున్నఱ మూరల వెడల్పును, అయిదుమూరల పొడుగును, క్రిందిభాగ మొకటిన్నర జేనెడు నెత్తును, వంపునుగల వేదికనుత్రవ్వించి శరీరపు బరువు గల ఘృతమును, అందు సేరునకు రతియెత్తు కస్తూరి, మాషయెత్తు కేసరి చేర్చి అధమపక్షమం దణమణుగు చందనమును. (అధికమెంతైన తీసికోవచ్చును) అగరు, తగరు, కర్పూరము పలాశాదులగు కట్టెలను తెచ్చి వేదియందు పేర్చి దానిపై శవమునుంచి పిదప నాలుగుదిక్కులను వేదికాముఖమునుండి జేనెడువఱకు నిండుగ పేర్చి ఘృతాహుతుల నిచ్చుచు దహనము చేయవల యును. ఈ ప్రకారముగా దహనమొనరించిన కొంచెమైనను దుర్గంధము కలుగదు. దీనికే అంత్యేష్టి యనియు, నరమేధ (పురుషమేధ) యాగమనియు నామములు. దరిద్రుడయినచో ఇరువదిసేర్ల ఘృతముకంటె తక్కువగ నాచితిమీద వేయదగదు. భిక్షమెత్తియో, బంధువులనుండియో లేక రాజా

నుండియో సంపాదించి ఈ ప్రకారముగా దహనమే చేయవలయును. ఎవ్వర ముగానైన పుష్పాదులు చిక్కని పక్షమందు పాతిపెట్టుట మున్నగు వాని కంటె వట్టి కట్టెలతో శవమును దహనము జేయుటయే యుత్తమము. ఏల యనగా నొక యెకరపు భూమియందో లేక ఒక వేదియందో లక్షల కోట్ల శవములను దహనము చేయవచ్చును. భూమికూడ పాతిపెట్టుట వలన వానకునట్లు దహనమువలన సంతగా గాదు. ఇక సమాధులను చూచుటవలన గూడ భయము కలుగుచున్నది. కాన పాతిపెట్టుట మొదలగునవి సర్వథా నిషిద్ధములని గ్రహింపవలెను. ॥౨౭॥

౨౮-అబ్రాహామను యజమానుని దేవుడయిన సర్వేశ్వరుడు స్తుతింపబడుగాక. ఆయన నా యజమానునికి తన కృపను, తన సత్యమును చూపుట మానలేదు. నేను త్రోవలోనుండగానే దేవుడు నా యజమానుని బంధువులయింటికి నన్ను నడిపించెను. ఆ: ౨౪: ౨౭

స:-అతడు అబ్రాహామునకు మాత్రమే సర్వేశ్వరుడై యుండెనా, ఇప్పటి కాలివాండ్రుగాని, ముందునడచువారుగాని ముందునడుచుచు త్రోవ చూపునట్లు ఈశ్వరుడును చూపెనన్న నప్పుడెందులకు మార్గము చూపుట లేదు. మనుష్యులతో మాటలాడదెందులకు? కావున నిట్టి మాటలు ఈశ్వరుని కాని ఈశ్వరకృతగ్రంథముందలివికాని కాజాలవు. ఇవి యనాగరికుల మాటలే యగునొప్పును. ॥౨౮॥

౨౯-ఇష్మాయేలు పుత్రుల పేరులు.-ఇష్మాయేలు జ్యేష్ఠకుమారుడయిన నెబాయోతు. కేదారు. అద్బయేలు. మిబ్శాము. మిష్మా. దూమా. మశ్శా. హదదు. తేమా. యెతూరు. నాపీషు. కెదమా. ఆ: ౨౫:౧౩-౧౪-౧౫॥

స:-ఈ యిష్మాయేలు అబ్రాహామువలన హాగరు అను దాసికి బుట్టినవాడు. ॥౨౯॥

౩౦-నేను నీ తండ్రికిష్టమైన రుచిగల భోజ్యము లతనికి చేసెదను. నీతండ్రి మృతిపొందక మునుపు అతడు వానిని తిని నిన్నాశీర్వదించునట్లు నీవు వానిని నీతండ్రియొద్దకు తీసికొని పోవలె ననెను. మరియు తన జ్యేష్ఠ కుమారుడగు ఏశావుయొక్క సొగసైన వస్త్రములు ఇంటిలో తనయొద్ద

సుండెను గనుక రిబ్కా వానిని తీసి తన చిన్నకుమారుఁడగు యాకోబునకు తొడిగించి ఆ మేఁకపిల్లల చర్మములతో అతని మెడల మీఁద నునుపు రాగ మును కప్పెను. అందులకు యాకోబు నేను ఏశావును. నీజ్యేష్ఠకుమారుఁడను, నీవు నాతో చెప్పినప్రకారము చేసియున్నాను. నీవు నన్ను దీవించుటకై దయ చేసి లేచికూర్చుండి. నేను వేఁటాడి తెచ్చినదానిని తిను మనెను.

ఆ: ౨౭:౯-౧౦-౧౩-౧౬-౧౯॥

స:- గంమనింపుఁడు! ఇట్టు కల్లలాడి. కపటవేషమూని ఆశీర్వాదము పొందినవారే పిదప సిద్ధులు. పైగంబరులు నయిరనుట యాశ్చర్యముకాదా, ఇటువంటివారు క్రైస్తవులకు మార్గదర్శకులై యుండిన నిక వీరిమతమందు పొరపాటుండుటకు కొదువయేమి? ॥౩౦॥

౩౧-తెల్లవారినప్పుడు యాకోబు లేచి తాను తలగడగా చేసి కొనిన రాయి తీసి దానిని స్తంభముగా నిలిపి దానికొనమీఁద నూనె పోసెను. మఱియు నతఁడా స్థలమునకు "బేతేలు" అని పేరుపెట్టెను. స్తంభముగా నేను నిలిపిన యీ రాయి దేవుని మందిరమగును. ఆ: ౨౮: ౧౮-౧౯-౨౨॥

స:- ఇప్పుడే అనార్యుల పనులను చూడుఁడు! రాల పూజించినది. పూజింపఁజేసినది వీరేకద. దీనినే యిప్పుడు ముసల్మానులు "బయితుల్ ముక ద్దస్" అనియెదరు. ఏమి? ఈ రాయియే ఈశ్వర మందిరమా? ఈరాయి యందే ఈశ్వరుఁడు వసించుచుండెనా? మేల్మేలు! ఏమిచెప్ప వలెను! క్రైస్త వులారా! మీరే గొప్ప విగ్రహారాధకులనుట స్పష్టము. ॥౩౧॥

౩౨-దేవుఁడు రాహేలును జ్ఞాపకము చేసికొని ఆమె మనవి విని ఆమె గర్భము తెఱచెను. అప్పుడు ఆమె గర్భవతియై కుమారుని కని దేవుఁడు నా నింద తొలగించె ననుకొనెను. ఆ: ౩౦: ౨౨-౨౩॥

స:-ఆహాహా! క్రైస్తవుల దేవు డెంత గొప్ప డాక్టరనవలెను! స్త్రీల గర్భములను తెఱచుటకు నెట్టి శస్త్రౌషధములున్నవో కదా! ఇవన్నియు పొంతపొందులేని మాటలే ॥౩౨॥

౩౩- ఆరాత్రి స్వప్నమందు దేవుఁడు విశ్రాంతియుతుడైన లాబాను నొద్దకువచ్చి నీవు యాకోబుతో మంచిగాని చెడుగాని పలుక కుము. జాగ్రత్త

నుమీ! అని యతనితో చెప్పెను. నీతండ్రి యింటిమీఁద బహు వాంఛగల వాఁడవై ...నాదేవతల నేల దొంగిలితివి? ఆ: ౩౧: ౨౪-౩౦॥

స:—మేమిటఁగొన్ని మాటలు నుదాహరించుచున్నాము. గమనింపుఁడు! వేంకొలఁది మనుష్యులకు స్వప్నమందు వచ్చెననియు. వారితో మాటలాడె ననియు; జాగ్రదవస్థలోఁగూడఁ బ్రత్యక్షముగవచ్చి కలిసె ననియు, తినె ననియు, త్రాగెననియు, వచ్చుచుఁబోవుచు నుండెననియు నిట్టిమాట లెన్నియో బైబిలునందు వ్రాయఁబడియున్నవి. కాని యిప్పుడతఁడున్నాడో లేఁడో తెలి యుటలేదు. ఏమనఁగా నిప్పుడా దేవుఁడెవ్వరి కిని స్వప్నమందుఁగాని, జాగ్రదవస్థయందుఁగాని వచ్చి కలియఁడు. మఱి ఈ యనార్యులు పాషాణాది మూర్తులను దేవతలని నమ్మి పూజించు చుందురని కూడ దీనినుండి తేఁటపడి నది. ఇఁక క్రైస్తవుల దేవుఁడుకూడ జాతినే దేవుఁడని నమ్ముచున్నాఁడు. లేనిచో దేవతలు దొంగిలింప బడుటయెట్లు ఘటించును? ॥౩౩॥

౩౪-యాకోబు తనత్రోవను వెళ్లుచుండఁగా దేవదూతలతని నెదుర్కొనిరి. యాకోబు వారినిచూచి ఇది దేవుని సేన అని చెప్పెను. ఆ:౩౨:౧-౨॥

స:-ఇప్పుడు క్రైస్తవుల దేవుఁడు మనుష్యుఁడనుట కేమి సందే హము? ఏమనఁగా-సైన్యమునుకూడ నుంచుకొనియున్నాఁడుగదా! సైన్యమున శస్త్రములుకూడ నుండవచ్చును. మఱిఏవైపుననో యుద్ధముకూడ చేయుచుండ వచ్చునుగద! లేనిచో సైన్యముతో నేమి ప్రయోజనము? ॥౩౪॥

౩౫-యాకోబు ఒక్కఁడు మిగిలిపోయెను. ఒకనరుఁడు తెల్లవాఱు పర్యంతమతనితో పెనఁగులాడెను. తానతని గెలువకుండుటఁజూచి తొడగూటి మీఁద నతనిని కొట్టెను.అప్పుడతఁడు.ఆయనతో పెనుగుఁలాడుటవలన యాకోబుతొడగూడు వదిలెను. ఆయన తెల్లవారుచున్నది గనుక నన్ను పోనిమ్మ నఁగా అతఁడు నీవు నన్నాశీర్వదించినగాని నిన్ను పోనియ్యననెను. ఆయన నీపేరేమని యడుగఁగా యాకోబని చెప్పెను. అప్పుడాయన నీవు దేవునితోను, మనుష్యులతోను పోరాడి గెలిచితివి గనుక ఇఁకమీఁదట నీపేరు ఇశ్రాయేలే గాని యాకోబు అనఁబడదని చెప్పెను. అప్పుడు యాకోబు నీపేరు దయచేసి తెలుపుమనియనెను. అందుకాయన నీవు ఎందునిమిత్తము నాపేరు అడిగితివని

చెప్పి అక్కడి అతని నాశీర్వదించెను. యాకోబు నేను ముఖాముఖిగా దేవుని చూచితిని; ఆయినను నా ప్రాణము దక్కినదని అస్థలమునకు పెనీయేలు అని పేరు పెట్టెను. అతడు పెనీయేలునుండి సాగిపోయినప్పుడు సూర్యోదయమాయెను. అప్పుడతడు తొడ కుంటుచు నడిచెను. అందుచేత ఆయన యాకోబు తొడ గూటిమీది తుంటినరము కొట్టినందున నేటివరకు ఇశ్రాయేలీయులు తొడగూటి మీదనున్న తుంటినరము తినరు.

ఆ: ౩౨: ౨౪-౨౫-౨౬-౨౭-౨౮-౨౯-౩౦-౩౧-౩౨॥

స:-క్రైస్తవుల దేవుడు మల్లుడయినందుననే కదా దయగలిగి నేరకును, హేబేలును, పుత్రింను కలుగజేసెను! అహా! ఇట్టివాడెప్పుడయిన సీశ్వరుడు కానేరడా! ఒకడు పేరడుగగా నతడు తన పేరే తెలుపడు. ఇదియు నొకవింతమేకదా! ఇక సీశ్వరుడతని నరమును తెలికించి గెలిచెనే కాని దార్ఢ్యరేయైన తొడసంధినుగూడ బాగుపఱచియుండును. ఇట్టి యీశ్వరుని భక్తుడయిన యాకోబు కుంటుచుండినట్లే అన్యభక్తులును కుంటుచుండగలరు. ఈశ్వరుని ముఖాముఖిగ జూచి యతనితో మల్లయుద్ధము చేసెనన్నసతడు శరీరసహితుడే యననొప్పునుగద. లేనిచో నది సంభవమగునా? కాన నిది కేవలము క్షుద్రదనపు చేష్టలనుట స్పష్టము. ॥౨౫॥

౨౬-యూదా జ్యేష్ఠకుమారుడైన ఏరు సర్వేశ్వరుని దృష్టికి చెడ్డవాడు గనుక సర్వేశ్వరుడతనిని చంపెను. అప్పుడు యూదా ఓనానుతో నీ అన్న భార్యయొద్దకువెళ్ళి మఱిది ధర్మ (నియోగ)ము జరిగించి నీఅన్నకు సంతానము కలుగజేయుమని చెప్పెను. ఓనాను ఆసంతానము తనది కానేరదని యెఱిగి ఆమెతోపోయినప్పుడు తన అన్నకు సంతానము కలుగకుండునట్లు తన రేతస్సును నేలను విడిచెను. అతడు చేసినది సర్వేశ్వరునిదృష్టికి చెడ్డదిగనుక ఆయన అతనినిగూడ చంపెను. ఆ: ౩౮.౭-౮-౯-౧౦॥

స:-ఇప్పుడు గమనింపుడు! ఈపనులు మనుష్యునివా, ఈశ్వరునివా? ఆమెతో నియోగమై యునప్పుడతని చంపిన దెందులకు? అతని బుద్ధిని శుద్ధి చేయలేడేం? దీనివలన పూర్వకాలమందంతట వేదోక్తనియోగ పద్ధతులు ప్రచారమందుండెననుటయే నిశ్చయము. ॥౨౬॥

## నిర్గమకాండము

౩౭-మోషే పెద్దవాఁడైనప్పుడు తన జనులలో నొక ఇబ్రీయుని నొక ఐగుప్తీయుఁడు కొట్టఁగా చూచెను. అతఁడు ఇటునటు తిరిగి చూచి యెవఁడును లేకపోఁగా ఆ ఐగుప్తీయునిచంపి, ఇసుకలో వానిని కప్పిపెట్టెను. మఱునాఁడు అతఁడు బయలుపడిచి వెళ్ళుచుండఁగా ఇబ్రీయులైన మనుష్యులిద్దఱు పోట్లాడుచుండిరి. అప్పుడతఁడు అన్యాయము చేసిన వానిని చూచి నీవేల నీపొరుగు వానిని కొట్టుచున్నావని యడుగఁగా-అతఁడు మామీఁద నిన్ను అధికారినిగాను తీర్పరినిగాను నియమించిన వాఁడెవఁడు ? నీవు ఐగుప్తీయుని చంపినట్లు నన్ను చంపవలెనని అనుకొనుచున్నావా ? అనెను. అందులకు మోషె భయపడి పరుగిడెను. నిర్గ: ౨:౧౧-౧౨-౧౩-౧౪-౧౫॥

స:—ఇప్పుడు విచారింపుఁడు ! బైబిలులోని ముఖ్య సిద్ధ పురుషుఁడు మతాచార్యుఁడగు మోషేయను నతనిచరిత్ర క్రోధాది దుర్గుణములతోఁ గూడినదియు. నరహత్యచేసి దొంగవలె రాజదండనను దప్పించుకొనునదియు నయియుండెను. ఈ సంగతిని మఱుఁగుపరచేసినచో నతఁడవశ్యముగ నసత్యవాదియై యుండవచ్చునుగద. ఇట్టివానితోఁ నీశ్వరుఁడు కలిసెను ఇఁక నతఁడు పైగంబరుగా గణింపఁబడి యూదాదుల మతమును బ్రవర్తింపఁజేసినవాడు అదికూడ నామోషేను బోలియేయుండవచ్చును. దీనివలన క్రైస్తవులకు మూలపురుషులగు మోషే మొదలగు వారందఱును అటవికులై యుండిరనియు విద్యావంతులు గాకుండిరనియుఁ దేఁటపడుచున్నది. ॥౧౩॥

౧౪—పస్కాపశువును వధింపుఁడి: మరియు హిస్సోపు కుంచెతీసికొని పళ్ళెములోనున్న రక్తములో దానిని ముంచి ద్వారబంధపు పైకమ్మికిని, రెండు నిలువుకమ్ములకును పళ్ళెములోని రక్తము తాకింపవలెను. తరువాత మీలో నెవఁడు ఉదయకాలము వఱకు తనయింటి ద్వారమునుండి బయలు వెడలకూడదు. సర్వేశ్వరుఁడు ఐగుప్తీయులను హతముచేయుటకు దేశసంచారము చేయుచు ద్వారబంధపు పైకమ్మిమీఁదను రెండు నిలువుకమ్ములమీఁదనున్న రక్తముఁజూచి సర్వేశ్వరుఁడా తలుపును దాఁటిపోవును సంహారకుని హతము చేయ

టకు మీ యిండ్లలోనికి సంహారకుని చొరనీయఁడు.

నిర్గ: ౧౨: ౨౧-౨౨-౨౩-౨౭॥

న:—అహా! ఇట్టి కట్టుబోతువలెనున్న యీశ్వరుఁడు ఎన్నఁడైన సర్వజ్ఞుఁడనఁబడఁగలఁడా! రక్తముద్రను చూచినపుడే కదా ఇది ఇశ్రాయేలీయుల వంశము వారి యిల్లని గుర్తించును. లేనిచో గుర్తింపనేరకుండును. ఇదియు నొక క్షుద్రబుద్ధిగల మనుష్యునివంటి పనియే. కాన నిది యొకా నొక అవివేకునిచే వ్రాయఁబడిన మాటలేయని విదితమగుచున్నది. ॥౩౮॥

౩౯. అర్ధరాత్రి వేళ జరిగినదేమనఁగా—సింహాసనము మీఁద కూర్చున్న ఫరోయు మొదలుకొని చెఱసాలలోనున్న ఖైదీయొక్క తొలిపిల్ల పర్యంతము ఐగుప్త దేశమందలి తొలిపిల్లలనందఱిని. పశువుల తొలిపిల్లల నన్నిటిని సర్వేశ్వరుఁడు హతముచేసెను. ఆ రాత్రి ఫరోయు, అతని సేవకులందఱును ఐగుప్తీయులందఱును లేచినప్పుడు శవములేని యిల్లొకటియు లేకపోఁగా. ఐగుప్తులో మహాఘోష పుట్టెను. నిర్గ: ౧౨: ౨౯-౩౦॥

న:—అకటా! అర్ధరాత్రివేళ దొంగవలె దయలేని క్రైస్తవుండేవుఁడు ఏయపరాధములేని ఆ బాలవృద్ధులను, స్త్రీలను, పశువులను, చంపివేసెను. ఎంతమాత్రము దయరాలేదుగా! ఐగుప్తదేశమందు మహాఘోష పుట్టినప్పుడును ఈ క్రైస్తవుల దేవుని చిత్తమునుండి క్రోధము నశింపకుండెనా! ఇది యీశ్వరుని పనియా? ఒక సామాన్యపురుషుఁడైనను చేయఁదగినదికాదు. కాని యిది ఆశ్చర్యమునుగాదు. ఏలయన "మాంసాహారిణః కుతో దయా" అనునట్లు క్రైస్తవుండేవుండు మాంసాహారి కాఁబట్టి యతనికి దయయెక్కడిది! ॥౩౯॥

౪౦. 'సర్వేశ్వరుఁడు మీపక్షమున యుద్ధముచేయును. సాగిపొండు' అని ఇశ్రాయేలీయులతో చెప్పుము. నీవు నీకఱ్ఱను ఎత్తి ఆ సముద్రముపై నీ చెయ్యిచాపి దానిని పాయలుచేయుము అప్పుడు ఇశ్రాయేలీయులు సముద్ర మధ్యమున ఆరిన నేలను నడిచిపోదురు. నిర్గ: ౧౪: ౧౪-౧౫-౧౬॥

న:—ఏమయ్యా! మొదట నీశ్వరుఁడు గొఱ్ఱెంపెనుకనుండు గొఱ్ఱెంకాఁపరివలె ఇశ్రాయేలీయుల వెనువెంటఁ దిరుగుచుండెను. ఇప్పుడెక్కడికి మాయ

మైపోయెనో తెలియకున్నదిగా? అట్లుగాకున్న నదిసముద్రమునుండి సర్దె నలకు (రైలుబండ్లు ఇనుపదారులు చేయించుకొని యుండురుగద. దానివలన సమస్త జగత్తునకు లాభము కలుగుచుండెడిది. అట్లే నావలు మొదలగు వానిని జేయుశ్రమయు దప్పిపోవుచుండెడిది. కాని ఏమి చేయవలెను? క్రైస్తవుల దేవుడు వృద్ధుడాగియున్నాడోగదా? ఈ క్రైస్తవులందరి ఈశ్వరుడు మోషేతోనిట్టు వంటివెన్నియో యసంభవములైన లీలలు గావించియున్నాడు. క్రైస్తవుల దేవుడెట్లున్నాడో యటులే యతని సేవకులును గలరనియు, నతడు రచించిన పుస్తకమునకట్లే యున్నదనియు విదితమగుచున్నది. ఇట్టి పుస్తకమును, ఈలాటి దేవుడును మననుండి దూరముండుటయే మేలు. ॥౪౦॥

౪౧. ఏలయనగా నీ దేవుడనైన పర్వేశ్వరుడనగు నేను రోషముగల దేవుడను. నన్ను ద్వేషించువారి విషయములో మూడు నాలుగు తరముల వారు పర్యంతము తండ్రుల దోషమును కుమారుల మీదికి రప్పించుచు న్నాను. నిర్గ: ౨౦-౫॥

స:—సరి! తండ్రిచేసిన యపరాధమును బట్టి యతని నాలుగు తరముల వారిని దండించుట న్యాయమేనా? మంచితండ్రికి దుష్టులును, దుష్టునికి మంచి సంతానమును కలుగుటలేదా? అటులేని నాలుగుతరములవారి నెట్లుదండింపగలు గును. ఇతనైదవతరము వారు దుష్టులయినను వారిని దండింపనేరకుండును. కావున్ అపరాధము లేనివానిని దండించువాడు అన్యాయకారి యనబడును. ॥౪౧॥

౪౨. విశ్రాంతిదినము పరిశుద్ధదినముగా నాచరించుటకు జ్ఞాపకముంచు కొనుము. ఆఱు దినములు నీవు కష్టపడి నీపనియంతయు చేయవలెను. ఏడవ దినము నీదేవుడయిన సర్వేశ్వరునికి విశ్రాంతి దినము. సర్వేశ్వరుడు విశ్రాం తిదినమును ఆశీర్వదించెను. నిర్గ: ౨: ౮-౯-౧౦-౧౧॥

స:—ఒక ఆదివారమే పవిత్రమై తక్కిన ఆఱుదినములు నపవిత్ర ములా? పరమేశ్వరుడు ఆఱుదినముల వఱకు గొప్ప పరిశ్రమ చేసి యుం డెనా? దానివలన నలసి యేడవదినము నిద్రపోయెనని చెప్పబడినది. ఇక ఆదిత్యవారము నాశీర్వదించెనన్న సోమవారము మొదలగు నాఱుదినముల

కేమియిచ్చెను. వానిని శపించియే యుండవచ్చుఁగద. ఇట్టివని నొక విద్వాంసు డైనఁ జేయఁడేని ఈశ్వరుఁడెట్లు చేయఁగలఁడు? మంచిది! ఒకఁ దానిని పరిశుద్ధ దినమని యాశీర్వదించి తదితరములను వ్యర్థముగా నపరిశుద్ధములని చెప్పె నేని యాదిత్యవారమందేమి గుణము కలదు? మఱి సోమవారమా మున్నగు వాని యందేమి దోషములున్నవి? ॥౪౨॥

౪౩. నీపొరుగు వానిమీఁద అబద్దసాక్ష్యము పలుకకూడదు. నీ పొరుగు వానియిల్లు ఆశింపగూడదు. నీపొరుగువాని భార్యనైనను అతని దాసునైనను, అతని దాసినయినను, అతని యెద్దనయినను, అతని గాడిదనైనను; నీ పొరుగువానిదగు దేనినైనను ఆశింపఁగూడదు. నిర్గ: ౨౦-౧౬-౧౭॥

స:— చూ! ఆఁదుల కేకద దప్పిగలవాఁరు జలము, ఆఁకలిగలవాఁరు అన్నము నాశించునట్లు ఈ క్రైస్తవుల పరదేశీయుల సొమ్ము కొఱకు పడి యున్నారు. ఇది తమ ప్రయోజనము సిద్ధింపఁ జేయునదియు, పక్షపాతము తోఁ గూడినదియునై యున్నటులే ఈ క్రైస్తవుల దేవుఁడునుండవచ్చును. మేము మనుష్యమాత్రులను పొరుగువారుగా భావించుచున్నామన్న మనుష్యులు గాక-పొరుగువారునుండి-స్త్రీలు, దాసీలుగలవారు ఇతరులెవరుందురు? కాన నివి స్వార్థసాధకులచే వ్రాయఁబడిన మాటలేకాని ఈశ్వరవాక్యములు కావు. ॥౪౩॥

౪౪. మీరు పిల్లలలో ప్రతిమగవానిని, పురుష సంయోగమునెఱిఁగిన ప్రతిస్త్రీని చంపుఁడి. పురుషసంయోగము నెఱుఁగని ప్రతి ఆఁడుపిల్లను మీ నిమిత్తము బ్రదుకనిండు. సంఖ్యా ౩౧: ౧౭-౧౮॥

స:—భళిరే! పైగంబరగు మోషేయు, మీదేవుఁడును ధన్యులు! స్త్రీలను, బాలురను, వృద్ధులను పశ్వాదులను సయితము చంపిరిగా! ఇఁక మోషే బాలుఁడుగ నుండెననియే దీనివలన స్పష్టమగుచున్నది. ఏమనఁగా, బాలుఁడు గాకుండిన అక్షతయోనికన్యలను అనఁగా-పురుషసంగమ మెఱుంగని కన్య లను-తనకొఱకు తెప్పించి యుండఁడదు. అట్లే వారికి దయారహితమై విషయా సక్తితోఁ గూడిన ఆజ్ఞయునొసంగి యుండఁరు. ॥౪౪॥

౪౫. నరుని చావఁగొట్టిన వానికి నిశ్చయముగా మరణశిక్ష విధింప వలెను. అయితే వాఁడు చంపవలెనని పొంచి యుండకయే దైవికముగా వాని

వేళ ఆ హత్య జరిగినయెడల అప్పుడు పారిపోఁగల యొక్క స్థలము నీకు నిర్ణయించెదను. నిర్గ: ౨౧: ౧౨-౧౩॥

స:—ఈ దేవుని న్యాయము సత్యమేని మోషెయొక్క మనుష్యునిచంపి పూడ్చిపెట్టి పారిపోయి యుండెను. వానికి దండన విధింపలే దెందులకు? ఈశ్వరుఁడు వానిం జంపుమని మోషెకొప్పగించె నన్న నీశ్వరుఁడు పక్షపాతి యయ్యెను. ఏలయన మోషేకు రాజుచే నేల న్యాయము చేయింపలేదు? ॥౪౫॥

౪౬. సర్వేశ్వరుని సమాధానబలులుగా కోడెలను వధించిరి. అప్పుడు మోషే ఆ రక్తములో సగము తీసికొని పళ్ళెములో పోసి ఆ రక్తములో సగము బలిపీఠముమీద ప్రోక్షించెను. అప్పుడు మోషే రక్తము తీసికొని ప్రజలమీఁద ప్రోక్షించి ఇదుగో యీ సంగతు లన్నిటి విషయమున సర్వేశ్వరుఁడు మీతో చేసిన నిబంధన రక్తము ఇదే అని చెప్పెను. అప్పుడు సర్వేశ్వరుఁడు మోషేతో నిట్లనెను:- నీవు కొండెక్కి నాయొద్ద వచ్చి అచ్చటనుండుము. నీవు వారికి బోధించునట్లు నేను వ్రాసిన ఆజ్ఞలను ధర్మశాస్త్రమును రాతి పలకలను నీకిచ్చెదను. నిర్గ: ౨౪: ౫-౬-౮-౧౨॥

స:—ఇప్పుడు చూడుఁడు! ఇవన్నియు నడవిమనుష్యుల మాటలే కదా! పరమేశ్వరుఁడు కోడెలబలిదానము నంగీకరించెను. బలిపీఠముమీఁద రక్తమును ప్రోక్షించెను అనుమాట లనాగరికతాసభ్యతలనే బోధించుచున్నవి! క్రైస్తవుల దేవుఁడుకూడ దూడల బలిదానమును పుచ్చుకొనుచున్నప్పుడతని భక్తులు గోవుల బలిదానము ప్రసాదముగాఁగొని తమ పొట్టల నేల నింపుకొన కయుందురు? ఇఁక జగత్తున కెందులకు హాని కలుగఁజేయకుందురు? ఇటువంటి చెడ్డమాట లెన్నియో యీ బైబిలునందు నిండియున్నవి. ఆ కుసంస్కారములు పొందియున్నందుననే కద వేదములందు సయితము మట్టి మిథ్యాదోషముల నారోపింపఁగోరుచున్నారు గాని వేదములం దిట్టి విషయములు పేరుకు కూడ లేవు. మరి క్రైస్తవుల దేవుఁడొక గుట్టమీఁద వసించుచుండెననియు, నొక యడవిమనుష్యుఁడుగ నుండెననియుఁగూడ నిశ్చయమైనది ఇఁక నా దేవుఁడుకలము, కాగితములు, సిరా అను వాని నెఱుఁగనివాఁడయి యుండుననే

కద జాతిపలకపయి వ్రాసి యిచ్చుచుండెను. ఇటువంటివాఁడా యదవి మనుష్యుల కీశ్వరుఁడయ్యెనః ॥౪౬॥

౪౭. ఆయన నీవు నాముఖమును చూడఁజాలవు. ఏనరుఁడును నన్ను చూచి బ్రతుకఁడనెను. మరియు సర్వేశ్వరుఁ డిట్లనెను. ఇదిగో సమీపమున ఒక స్థలమున్నది. నీవు ఆ బండమీఁద నిలువ వలెను. నా మహిమ నిన్నుదాఁటి వెళ్ళుచుండఁగా ఆబండ సందులో నిన్నుంచి నిన్నుదాఁటి వెళ్ళువఱకు నాచేతితో నిన్ను కప్పెదను. నేను నాచెయ్యితీసిన తరువాత నావెనుక పార్శ్వమును చూచెదవుగాని నాముఖము నీకు కనఁబడదని మోషేతో చెప్పెను.

నిర్గ. ౩౩: ౨౦-౨౧-౨౨-౨౩॥

స:-ఇప్పుడు క్రైస్తవుల దేవుఁడు మనుష్యునివలెనే శరీరముకలవాఁడై యుండినను మోషెను మోసపుచ్చి తానెట్లు దేవుఁడయ్యెనో కనుగొనుడు. వెనుకటి పార్శ్వమును చూడఁగలవు. కాని రూపమును చూడలేవని చెప్పినప్పుడు చేతితో నతని కప్పకయునుండవచ్చును. దేవుఁడు తనచేతితో మోషేమకప్పి నప్పుడతనికాచేతిరూప మగపడకుండునా। ॥౪౭॥

## లేవీయ కాండము.

౪౮. సర్వేశ్వరుఁడు మోషేను పిలిచి ప్రత్యక్షపు గుడారములో నుండి అతని కీలాగుపిసెలవిచ్చెను. నీవు ఇశ్రాయేలీయులతో నిట్లనుము—ఎవఁడైన నను సర్వేశ్వరునికి బలియర్పించునప్పుడు గోవులమందలో నుండి గాని. గొఱ్ఱెలమందలో నుండిగాని. మేకలమందలో నుండిగాని దానిని తీసికొనిరావలెను.

లేవీయకాండము. ౧. ౧-౨॥

స: ఇప్పుడు విచారింపుఁడు. క్రైస్తవుల దేవుఁడు గోవృషభాదులను బలిగా పుచ్చుకొనువాఁడై నందులకేకద వానిని తనకు బలిగా నర్పింపుఁడని యుపదేశించుచున్నాఁడు. ఇఁకనతఁడు గోవృషభాది పశువుల రక్తమాంసముల కాశలిడప్పి కలవాఁడా? కాఁడా? దీనివలన నతఁడహింసకుఁడు? గాఁడు ఈశ్వరుఁడునుగాఁడు కాని మాంసాహారియగు మానవుఁడే యననొప్పును ॥౪౮॥

౪౯. అతఁడు సర్వేశ్వరుని సన్నిధిని ఆకోడెదూడను వధించిన తరువాత యాజకులైన అహరోను కుమారులు దానిరక్తమును తెచ్చి ప్రత్యక్షపు

గుడారము నెదుటనున్న బలిపీఠముచుట్టు ఆరక్తమును ప్రోక్షింపవలెను. అప్పు డతఁడు దహన బలియాపమైన అపశు చర్మము నొలిచి దాని అవయవములను విడఁదీసినతరువాత యాజకుఁడయిన అహరోను కుమారులు బలిపీఠముమీఁద అగ్నినుంచి అగ్నిమీఁద కట్టెలను చక్కఁగా పేర్పవలెను. అప్పుడు యాజకులైన అహరోను కుమారులు అవయవములను, తలను, క్రొవ్వును బలిపీఠము మీద నున్న అగ్నిమీది కట్టెలపైని చక్కఁగా పేర్పవలెను దాని ఆంత్రములను, కాళ్లను నీళ్లతో కడుగవలెను. అది సర్వేశ్వరుని కింపైన సువాసనగల దహన బలియగునట్లు యాజకుఁడు అదంతయు బలిపీఠముమీఁద దహింపవలెను.

లేవీయకాండము. ౧. ౫-౬-౭-౮-౯॥

స:-కొంచెము విచారింపుఁడు! దేవుని సమ్ముఖమునందు తన భక్తులు దూడను చంపుట, తాను చంపించుట, రక్తమును వారు నలువైపుల చిలుక రించుట, అగ్నియందు హోమము చేయుట. దేవుఁడా సుగంధమును పీల్చుట అను నివి కటికవానియింట జరుగు కృత్యముల కంటెఁ గరుసీచములుకావా! కాన నైబిలు ఈశ్వరకృతము కాదు. అందు వర్ణింపఁబడిన అడవి మనుష్యుని వంటి చరిత్రగల వాఁడీశ్వరుఁడును గానేరఁడు. ॥౪౯॥

౫౦. మరియు సర్వేశ్వరుఁడు మోషేకునీలాగు సెలవిచ్చెను. ప్రజలు అపరాధులగునట్లుగా అభిషిక్తుఁడైన యాజకుఁడు పాపముచేసిన పక్షమున తానుచేసిన పాపమునకై నిర్దోషమైన కోడెదూడను సర్వేశ్వరునికి పాపపరి హారార్థము బలిగా నర్పింపవలెను. మరి కోడె తలమీఁద చెయ్యియుంచి సర్వే శ్వరుని సన్నిధి కోడెను వధింపవలెను.

లేవీయకాండము ౪: ౧-౩-౪॥

స:—ఇప్పుడు చూడుఁడు! స్వయముగ పాపకార్యములఁ జేయుచు నా పాప పరిహారార్థము ఆవు మున్నగు శ్రేష్ఠమైన పశువులఁ జంపుటయు, పరమేశ్వ రుఁడు వానిఁ జంపుమనుటయు నివి పాపములఁ దొలఁగఁ జేయుటకు ప్రాయ శ్చిత్తములఁట. ఇట్టి పనులను చేయుచు, చేయించు వానిని సయిత మీశ్వ రుఁడనిభావించి తమకు ముక్తికలుగుననుకొను క్రైస్తవులు ధన్యులేగదా!

॥౫౦॥

౩౧. అధికారి అపరాధియైనయెడల అతఁడు నిర్దోషమైన మగమేక పిల్లను అర్పణముగా తీసికొనివచ్చి సర్వేశ్వరుని సన్నిధిని దాని వధింప వలెను. ఇది పాపపరిహారార్థమైన బలి. లేవీయకాం: ౪.౨౨-౨౩-౨౪॥

స:—సరి! ఇటులేని వీరి యధికారు లను న్యాయాధీశులును, సేనాధిప తులు మొదలగువారును పాపము చేయుట కెంత మాత్రము జడియకుందురు. ఏమనఁగా తామిష్టమై పాపములఁ జేయవచ్చునఁట. మరి వానికి బదులుగా ఆవు. కోడె. మేఁకమున్నగువాని ప్రాణముల. దీయుచు ప్రాయశ్చిత్తము చేసి కొనవచ్చునఁట! అందుకేకద క్రైస్తవులొక పశు ప్రాణమునుగాని. పక్షిప్రాణ మును గాని తీయుటకు శంకింపకుందురది. క్రైస్తవులారా! వినుడు! ఇప్పు డైన నీయనార్యమతమును విడిచి సుసత్యకారి ధర్మయుక్తమగు వేదమతమును స్వీకరింపుఁడు. దానిచేతనే మీకు శుభము చేకూరును. ॥౩౧॥

౩౨. అతఁడు గొఱ్ఱెపిల్లను తేఁజాలని పక్షమున అతఁడు తాను జేసిన అపరాధ విషయమై రెండు తెల్లగువ్వలనుగాని, రెండు పావురము పిల్లలను గాని సర్వేశ్వరు సన్నిధికి తీసికొనిరావలెను. దానిమెడనుండి దాని తలను నుల మవలెను. కాని దాని నూడదీయఁగూడదు. అతఁడు చేసిన పాపము విషయమై ప్రాయశ్చిత్తము చేయఁగా అతనికి క్షమాపణ కలుగును. రెండు తెల్లగువ్వ లైనను రెండు పావురపుపిల్లలయినను తనకు దొరకని యెడల తూమెఁడు గోదుమపిండిలో పదియవవంతును పాపపరిహారార్థ బలిరూపముగా తేవలెను. *దానిమీద నూనెపోయవలదు. అతనికి క్షమాపణ కలుగును.

---

*కోడెను, గొఱ్ఱెను, మేఁకపిల్లను, పావురములు మొదలగు పిండినైనను పుచ్చుకొందును ఎయుఱుండినట్టి యీ యాజ్ఞలవలన దమ్మవారము! పావురపుపిల్లలను "మెరుగుమురిపిండి" పుచ్చు కొనుచుండెను. అనఁగా మెదను ద్రుంచి వేయుటయు చేయువంటివి క్రమము, దప్పిపోయెను. ఇదియు నొక యద్భుతమయిన చింతయే. వీని నన్నింటిని విచారించుటవలన నరుని మనస్సులో నొకానొక దయుడఁగు వ్యాపము దుండెననియు అతఁడు సర్వతోముఖ్య కూర్పుంచి తన్ను ఈశ్వ రుఁడని ప్రసిద్ధపఱుచుకొనెననియు. అజ్ఞానముగ నున్న యితర మనుష్యులతోనే ఈశ్వరుఁడని నమ్మకొనిరనియు విదితమగుచున్నది. ఈ నరుఁడు తనయుక్తులచే నా సర్వతము మీఁదికి తీసుకొని పశువులను పక్షులు అన్నాది పదార్థములను తెప్పించుకొనుచు పాలించుచుండెను. అతనియాజ్ఞ (ఏలిక్తాఱ) వినిచేయుచుండిరి. సజ్జనులారా! దైవమునందలి కోడెలను, గొఱ్ఱెలను, మేఁకపిల్ల లను, పావురపుపిల్లలను మంచిపిండిని తిను ఈశ్వరుఁడెక్కడ! మఱి సర్వవ్యాపకుఁడు, సర్వ జ్ఞుఁడు అజన్ముఁడు, నిరాకారుఁడు, సర్వశక్తిమంతుఁడు, న్యాయకారి అను దిర్యాదియుక్తమగు ముంతో గూడిన వేదోక్తమగు ఈశ్వరుఁడెక్కడ! విచారించుడుగాక.

లేవీయకాం ౫: ౬-౮-౧౦-౧౧-౧౨-౧౩

స:—ఇప్పుడు వినుఁడు! క్రైస్తవులలో నొకదరిద్రుఁడుని ధనవంతుఁడు కాని పాపము చేయుటకు జంకకుండవచ్చును. ఏలయన వీరి యీశ్వరుఁడు పాపములకుప్రాయశ్చిత్తము సులభముగా చూపించియున్నాఁడు. కష్టపడవలసిన పనిలేక పాపమునుండియే పాపము దూరమగునని యీక్రైస్తవుల బైబిలునం దుండునది మిక్కిలి యద్భుతమైన సంగతి. ఏమనఁగా మొదట పాపము చేసెను. రెండవతూరి (తన్నివారణార్థము) పరిహారార్థమై జీవుల హింసించెను. ఇట్లు యథేష్టముగ మాంసము దిన లభించెను. పాపమును దొలఁగిపోయెను! అబ్బా! పావురపు పిల్ల మెడ విఱిచి వేయుటవలన నది యెంతో తపవిలవిలఁ దన్ను కొనవచ్చునుగద. అప్పటికి నీ క్రైస్తవులకు దయరాదుగా! దయవచ్చున దెట్లు-వీరి యీశ్వరుఁడే హింసచేయుట కుపదేశించుచున్నాఁడు. ఇఁక పాపములన్నియు నిట్టి ప్రాయశ్చిత్తముల వలననే తొలఁగుచున్న యేసును విశ్వసించిన పాపపరిహారమగుననుట నాడంబరములేల! ॥౫౨॥

౫౩. దహన బలి పశుచర్మము ఏయాజకుఁడు అర్పించునో అది అతనిదగును. పొయ్యిమీఁద వండిన ప్రతినైవేద్యము, కుండలోఁగాని పెనముమీఁదఁగాని కాల్చినది యావత్తును దాని నర్పించిన యాజకునిది అది అతనిదగును.

లేవీయకాం: ౭: ౮-౯.

స:—మేమిచ్చట దేవీరోపుల (శక్తిపూజకుల) యు. మందిరముల నుండు పూజారులయు, పోపురీలలనెరు టక్కుల నెఱిగియుంటిమి. కాని క్రైస్తవుల యీశ్వరునియు. వారి పూజారులయు. పోపురీల లంతకంటె వేయి రెట్లు మించియున్నవి. ఏలయన, చర్మపువెల, తినుటకు భోజనపదార్థములు చిక్కినపుడు క్రైస్తవులు బాగుగా నానందించియే యుందురు ఇప్పుడు కూడ నానందించు చుండవచ్చును ఔరా! ఏమనుష్యుఁడైన నొక బాలుని చంపించి మఱియొక బాలునికి వాని మాంసమును తినిపించునా? ఇటు లెన్నఁడైనను జరుగునా? అట్లే ఈశ్వరునికి మనుష్యులందఱును, పశుపక్ష్యాదులగు జీవులన్నియు పుత్రతుల్యమును కాఁబట్టి పరమేశ్వరుఁ డిట్లెన్నఁడును చేయఁబోనఁడు. కావున ఏ బైబిలు ఈశ్వరకృతము కాని అందు వ్రాయఁబడినవాఁ

దీశ్వరుఁడు గాని, దాని నమ్మువారు ధర్మజ్ఞుఁడు గాని యెన్నఁటికిని గానేరరు. కాని లేవీయ వ్యవస్థాది పుస్తకములందిట్టిమాట లెన్నియో నిండియున్నవి. ఎంతవఱకును వివరింపవలెను. ॥౫౩॥

## సంఖ్యాకాండము

౫౪. సర్వేశ్వరుని దూత కత్తిని దూసి చేతపట్టుకొని త్రోవలో నిలిచి యుండుట ఆగాడిద చూచెను గనుక అది త్రోవవిడచి పొలములోనికి పోయెను. బిలాము ఆగాడిదను దారికి మలుపవలెనని దానిని కొట్టెను. అప్పుడు సర్వేశ్వరుఁడు ఆగాడిదకు వాక్కునిచ్చెను కనుక అది నీవు నన్ను ముమ్మారు కొట్టితివి. నేను నిన్నేమిచేసితి నని బిలాముతోననెను.

సంఖ్యా: ౨౨-౨౩-౨౮॥

స:-పూర్వము గాడిదలును దేవదూతలను చూచుచుండెను. కాని యిప్పుడో బిషప్, పాదిరి మున్నగు శ్రేష్ఠపురుషులకుఁగాని పామర పురుషులకుఁగాని యాదేవుఁడో యతని దూతలో యగపడుటలేదు. ఏమి, ఇప్పుడా పరమేశ్వరుఁడు నతని దూతలు నున్నారా? లేరా? ఉన్నారేని గాఢనిద్రలో పడుండి యున్నారా? రోగగ్రస్తులై యున్నారా? లేక యన్యభూగోళమునకు వెళ్ళి పోయిరా? లేక మఱియొక వ్యవహారమునఁ బ్రవేశించిరా? లేక యిప్పుడు క్రైస్తవులమీఁద నలిగిపోయిరా, లేక చనిపోయిరా? ఏమై పోయిరోకద తెలియకున్నది ఇప్పుడు లేరు. వారగపడుటలేదు గాన నప్పుడును లేకుండ వచ్చును. అగపడకుండ వచ్చును. అని యనుమానింపఁబడుచున్నది. కావున నివి వట్టి కల్పనలే యనవొప్పును. ॥౫౪॥

## సమూయేలు రెండవ పుస్తకము

౫౫. అయితే ఆరాత్రి సర్వేశ్వరుని వాక్కు నైతానుకు ప్రత్యక్షమై సెలవిచ్చిన దేమనఁగా నీవు పోయి నాసేవకుఁడగు దావీదుతో నిట్లనుము-సర్వేశ్వరుఁడు నీకాజ్ఞనిచ్చినదేమనఁగా-నాకు నివాసముగా నొక మందిరము కట్టించుటకు నీవు తగినవాఁడవా? ఐగుప్తులోనుండి నేను ఇశ్రాయేలీయులను రప్పించిన నాఁటినుండి నేఁటివరకు మందిరములో నివసింపక డేరాలోను, గుడారములోను నివసించుచు సంచరించితిని. సమూ. రెండవ పు. అ. ౭: ౪-౫-౬॥

స:-ఇప్పుడు క్రైస్తవుల దేవుఁడు మనుష్యునివలె దేహధారి యేయని స్పష్టమైనదిగా : చూడుఁడు నేను బహు పరిశ్రమచేసితిని. అప్పటప్పటసంత రించితిని. ఇప్పుడువారీడు యిల్లుకట్టించునేని యందు విశ్రాంతి పొందుదును అని యెగ్గాడుచున్నాఁడు. ఇలాటి దేవుని. ఇట్టి పుస్తకమును విశ్వసించుటకి క్రైస్తవులు లజ్జితులగుటలేదే : పాపము వారేమిచేయఁగలరు : చిక్కిపోయిరి వద : తప్పించుకొనుటకు గొప్ప పురుషార్థము చేయఁదగును. ॥౫౫॥

## రాజుల పుస్తకము

౫౬. మరియు బాబెలు రాజైన నెబుకద్నేజరు ఏలుబడిలో పందొమ్మిదవ సంవత్సరమందు ఐదవనెల ఏడవదినమున రాజదేహసంరక్షకులకు అధిపతియు, బాబెలురాజు సేవకుఁడు నగు నెబూజరుద్దాను యెరూషలేముకు వచ్చి సర్వేశ్వరుని మందిరమును, రాజనగరును, యెరూషలేమునందున్న యిండ్లన్నిటిని, గొప్పవారి యిండ్లన్నిటిని అగ్నిచేత కాల్పించెను. మరియు రాజదేహ సంరక్షకుల అధిపతియొద్దనున్న కల్దీయుల సైనికులందఱును యెరూషలేము చుట్టునున్న ప్రాకారములను పడఁగొట్టిరి.

౨. రాజు అ: ౨౫: ౮-౯-౧౦॥

స:-చేయునదేమి ! క్రైస్తవుల దేవుఁడు తన సుఖము కొఱకే పద దావీదులచేనిల్లు కట్టించుకొని యందు విశ్రాంతి పొందుచుండఁగా నెబూజరు నుద్దానువాఁడే ఆ దేవుని యింటిని పడఁగొట్టి పాడుచేసెను. అప్పుడు ఈశ్వ రుఁడుగాని యాతనిదూతల సైన్యముకాని యేమియుఁజేయ లేకపోయిరి. మొదట నీరిదేవుఁడు గొప్ప యుద్ధములఁజేయుచు విజయముల బొందుచుండెను- గాని యిప్పుడు తనయింటిని కాల్చిపడగొట్టినను ఎందుల కొరకద యూరక కూర్చుండియుండెను. అతనిదూతలు నెక్కడికి పాఱిపోయిరోగదా : ఇట్టి సమ యమున నెవ్వఁడు నక్కరకు రాకపోయెనే ! ఇఁక నీశ్వరుని పరాక్రమము నయిక్కడికి లేచిపోయెనో తెలియదు. ఒకవేళ ఈసంగతి జరిగినది నిజ మేని మొదట వ్రాయఁబడిన విజయపు సంగతులన్నియు వట్టివే యనుట నిక్కము ఏమి జగుప్తునండలి బాలబాలికలఁ జంపుటచే వీరుఁడయి యుండెనా ఇప్పుడు వీరులయెదుట మౌన ముద్ర ధరించెనా : ఇట్టి క్రైస్తవుల దేవుఁడు

నిందితుఁడయి తనకు అగౌరవములు గలుగఁజేసికొనెనుగద. ఈపుస్తకము నందిట్టి నిందాస్పదములగు వేలకొలఁది కథలు నిండియున్నవి ॥౨౬॥

## బైబిలు రెండవభాగము

### దిన వృత్తాంతము మొదటి పుస్తకము

౨౭. కావున సర్వేశ్వరుఁడు ఇశ్రాయేలీయుల మీఁదికి తెగులు పంపఁగా ఇశ్రాయేలీయులలో డెబ్బదివేల మంది చచ్చిరి.

దిన వృత్తాంతము. ౨౧: ౧౪॥

౨౮:-ఇప్పుడి ఇశ్రాయేలీయులను క్రైస్తవుల దేవుని లీలఁజూడుఁడు: ఏఇశ్రాయేలీయ కులమునకు బహువరము లొసంగి యుండెనో, ఎవరిని పాలింప సహస్రకలు ప్రయత్నించుచుండెనో యట్టి దేవుఁడిప్పు డంతలోనే కోపించి తెగులు పంపి ఆకులమందలి డెబ్బదివేలమందిని జంపించెను. ఈవింత యొక కవివ్రాసిన దానికి సరిపోయినట్లే యున్నది.

క్షణే రుష్టః క్షణే తుష్టో రుష్టస్తుష్టః క్షణే క్షణే।
అవ్యవస్థితచిత్తస్య ప్రసాదోఽపి భయంకరః॥

సు. ర. భాండాగారము. ప్రక. ౩. శ్లో. ౧౩౫॥

ఒక మనుష్యుఁడొక క్షణమందు ప్రసన్నుఁడును మఱియొక క్షణ మందప్రసన్నుఁడునగునేని యతని ప్రసన్నతయు భయదాయక మగునట్లే యీక్రైస్తవుల దేవుని సమాచారమునుగలదు. ॥౨౯॥

### యోబు గ్రంథము

౩౦. దేవదూతలు సర్వేశ్వరుని సన్నిధిని నిలుచుటకై వచ్చిన మఱి యొకదినము తటస్థింపఁగా వారితోకూడ అపవాది సర్వేశ్వరుని సన్నిధిని నిలుచుటకై వచ్చెను. సర్వేశ్వరుఁడు-నీవు ఎక్కడనుండి వచ్చితివని వాని నడుగ'గా అపవాది-భూమిలో ఇటునటు తిరుగులాడుచు అందులో సంచ రించుచు వచ్చితినని సర్వేశ్వరునికి ప్రత్యుత్తరమిచ్చెను. అందులకు సర్వే శ్వరుఁడు—నీవు నాసేవకుఁడైన యోబునంగతినాలోచించితివా : అతఁడు యథార్థవర్తనుఁడు. న్యాయవంతుఁడై దేవునియందు భయభక్తులు గలిగి చెడుతనము విసర్జించినవాఁడు. భూమిమీఁద అతనివంటివాఁ డెవఁడును లేడు. నిష్కారణముగా అతనిని పాడుచేయుటకు నీవు-నన్ను ప్రేరేపించి నను

అతఁడు ఇంతను తనయథార్థతను వదలక నిలకడగా నున్నఁడనఁగా అపవాది-చర్మమునకు కాపాడు కొనుటకై చర్మమును, తన ప్రాణము కాపాడుకొనుటకై రనకు కలిగినది యావత్తును నరుఁడిచ్చును గదా. ఇంకొకసారి నీవుచేయిచాపి అతనియెముకను, అతని దేహమును మొత్తినయెడల అతఁడు నీముఖము నెదుటనే దూషించి నిన్ను విడిచి పోవును. అందులకు సర్వేశ్వరుఁడు-అతఁడు నీవశముననున్నాఁడు అతని ప్రాణమును మాత్రము నీవు ముట్టవద్దని సెలవిచ్చెను. కాఁబట్టి అపవాది సర్వేశ్వరుని సన్నిధినుండి బైలువెడలి అఱికాలు మొదలుకొని నెత్తి వఱకు బాధగల కురుపులతో యోబును మొత్తెను.

జబూరు: యోబు: ౨: ౧-౨-౩-౪-౫-౬-౭॥

స:- ఇప్పుడు క్రైస్తవుల యీశ్వరుని సామర్థ్యముఁ జూడుఁడు: సైతాను తనయెదుటనే తన భక్తులను దుఃఖ పెట్టుచుండఁగాఁ దాను సైతానును శిక్షించి తన భక్తుల రక్షింపనేరకపోయెను మరి దూతలలో సైతానుతో నెదురాడఁ గలుగునంతటి సమర్థుఁడు లేఁడు. ఈయొక్క సైతానే యందఱను భయభీతులను జేసియుండునది. ఇక క్రైస్తవుల ఈశ్వరుఁడు సర్వజ్ఞుఁడయిన యోబు పరీక్ష సైతానుచే నేల చేయించి యుండును? ॥౫౮॥

## ప్రసంగి ఉపదేశ పుస్తకము

౫౯. జ్ఞానమును విద్యను నేను పూర్ణముగా సభ్యసించితినని నా మనస్సులో నేననుకొంటిని. నామనస్సు నిలిపి జ్ఞానాభ్యాసమును, వెఱ్ఱితనమును, మతిహీనతను తెలిసికొనుటకు ప్రయత్నించితిని. అయితే ఇదియు గాలికి ప్రయాసపడుటేయని తెలిసికొంటిని. విస్తారమైన జ్ఞానాభ్యాసముచేత విస్తారమైన దుఃఖము కలుగును. అధికవిద్య సంపాదించిన వానికి అధిక శోకముకలుగును.

జబూ. ప్రసం. అ. ౧: ౧౬-౧౭-౧౮॥

స:-గమనించితిరా: బుద్ధి జ్ఞానములను పదములు పర్యాయవాచకములు. వానిని వేర్వేరుగ నమ్ముచున్నారే. ఇఁక బుద్ధి వృద్ధి నొందినకొలఁది శోకమును దుఃఖమును కలుగుసని. మూర్ఖులుగాక నిట్లు మఱియెవ్వరు వ్రాయఁగలుగుదురు: కాన నీబైబిలు ఈశ్వరకృత మనుటెట్లు: విద్వాంసునిచే వ్రాయఁబడినదియును గాదు. ॥౫౯॥

ఇట్లు సంక్షిప్తముగ తౌరేతు జబూరులలోని సంగతులు వ్రాయబడినవి. ఇకమీద క్రైస్తవులు మిగుల ప్రమాణముగా నెంచెడి మత్తయి రచితాది (ఇంజీలు) సువార్తలలోని సంగతు లిందు వ్రాయబడును. (ఇంజీలు) సువార్త యనున దెట్టిదో కొంతపరీక్షగా వ్రాయుచున్నాము గమనింపుడు!

## మత్తయి సువార్త

౬౦. యేసుక్రీస్తు జన్మవిధ మెట్లనగా ఆయన తల్లియైన మరియ, యోసేపుకు ప్రదానము చేయబడిన తరువాత వారేకము కాకమునుపు ఆమె పరిశుద్ధాత్మవలన గర్భవతిగా నున్నట్లు కనబడెను. సర్వేశ్వరుని దూత స్వప్న మందతనికి ప్రత్యక్షమై దావీదుకుమారుడవైన యోసేపూ! నీ భార్యయైన మరియను చేర్చుకొనుటకు భయపడకుము. ఆమె గర్భము ధరించినది. పరిశుద్ధాత్మవలన కలిగినది. మత్త. ౧: ౧౮–౨౦॥

స:—ప్రత్యక్షాది ప్రమాణములకును, సృష్టిక్రమమునకును విరుద్ధము లగుటవలన నీ మాటలే విద్వాంసుడయినను నమ్మజాలడు. ఇటువంటి మాటలు మూర్ఖజనులు నవివేకులు నిజమని నమ్ముదురే కాని సభ్యులయిన విద్వాంసులు నమ్మజాలరు. ఈశ్వరనియమము నెవరయిన ఖండింపగల సుదురా? పరమేశ్వరుడే తన నియమము నతిక్రమించిన నాతని యాజ్ఞ నెవరును పాలింపకుందురు. ఇక నతడు సర్వజ్ఞుడును నిర్భ్రాంతుడు నయి నందున గర్భవతులగు కన్యలందఱు నానర్వేశ్వరునివలననే గర్భిణులగు చున్నారని సర్వసాధారణులు చెప్పవచ్చును. అట్లే పరమేశ్వర దూత నాతో "స్వప్నమందీ. గర్భ మీశ్వరునివలన నిలిచె"నట్లు చెప్పినాడని యొకడు అబద్ధముల బలుకవచ్చును. ఈ యసంభవమైన వార్త కల్పింపబడినట్లే, సూర్యునివలన కుంతి గర్భవతి యయ్యెనని పురాణములందు వ్రాయబడి నదియు ససంభవమే. ఈలాటి మాటలను వివేక శూన్యులగు విత్తవంతులు నిజమనుకొనుచు భ్రమజాలమున చిక్కుపడి యుందురు. ఇక నీసంగతి యిట్లు జరిగియుండవచ్చును. ఎట్లనగా నొకా నొక పురుషునితో సమాగమ మగుట వలన మరియ గర్భవతిగావచ్చునని ఆమెయో లేక మరియొకడో

ఈమెతు గర్భమీశ్వరునివలన నిలిచినదను ససంభవ వార్తను వెల్లడించి యుండుననియు తేఁటపడుచున్నది ॥౬౦॥

౬౧. అప్పుడు యేసు సైతానుచేత శోధింపబడుటకు ఆత్మవలన అరణ్యమునకు కొనిపోఁబడెను. నలువది దినములు దివారాత్రి యుపవాస ముండినపిమ్మట ఆయన ఆఁకలి గొనఁగా ఆశోధకుఁడాయనయొద్దకు వచ్చి నీవు దేవుని కుమారుఁడవైన ఈ రాలు రొట్టెలగునట్లు ఆజ్ఞాపింపుమనెను.
మత్త ౪: ౧-౨-౩॥

స:–క్రైస్తవుల యీశ్వరుఁడు సర్వజ్ఞుఁడు కాఁడని దీనివలన స్పష్టముగ సిద్ధమగుచున్నది. ఏలయన సర్వజ్ఞుఁడేయైన నతనిఁ బరీక్షించుటకు సైతాను నెందులకుఁ బంపియుండును; స్వయముగనే తెలిసికొనియుండును. మంచిది యిప్పుడొక క్రైస్తవుని నలువది రాత్రిందివములు నిరాహారముగ నుంచితిమేని యతఁడు బ్రతికియుండఁగలుగునా; మరియతఁడీశ్వరకుమారుఁడు గాని యతఁడొక సిద్ధినిబొందినవాఁడుగాని కాకుండెననియే దీనివలన సిద్ధమైనది. లేనిచో నా సైతాను సమ్ముఖమున రాలను రొట్టెలుగా నేల చేయకుండును; తానేఁతరితో నుండుటెందులకు; కాన పరమేశ్వరుఁడు చేసిన రాల నెవ్వఁడును రొట్టెలుగా చేయఁజాలఁడనుటయె సిద్ధాంతము ఈశ్వరుఁడుగూడ పూర్వకృత నియమము నతిక్రమింపఁజాలఁడు. ఏలయన అతఁడు సర్వజ్ఞుఁడు. అతని పనులన్నియు తప్పులుగాని మఱపులుగాని లేనివి. ॥౬౧॥

౬౨. ఆయన 'నా వెంబడి రండి నేను మనుష్యులను పట్టువాలరులుగా మిమ్ము చేయుదు'నని వారితో చెప్పిన వెంటనే వారు తమ వలలు విడిచిపెట్టి ఆయనను వెంబడించిరి.
మత్త ౪: ౧౯-౨౦-౨౧॥

స:– లో రేతునవ్రాయఁబడిన పదియాజ్ఞలలో నొకటగు "బిడ్డలు తల్లిదండ్రులకు సేవయు,మన్ననయు తమయాయుర్వృద్ధినిమిత్తము చేయవలెను." [౨౦.అ.౧౨]దీనిఁ బాలింపలేదనియే విదితమగుచున్నది.ఏలయన ఏసు తన తల్లిదండ్రులకు సేవచేయలేదు ఇతరులను సయితము తమ తల్లిదండ్రుల సేవలో నుండి విడఁదీసెను. ఈయపరాధమను పాపముచేసినందులకే కద యతఁడు చిరంజీవుఁడు కాలేదు. ఇఁక వలలో చేపలను చిక్కించుకొనునట్లు ఏసు మను

మ్యులను స్వమతమున చిక్కించుకొని తన ప్రయోజనమును సాధింపవలెనను ఉద్దేశముతో నొక మతమేర్పఱచె ననిగూడ తేటపడినది. ఏసే యిట్లుండి నపుడు ఇప్పటి పాదిరీలు తమవలలో మనుష్యులను చిక్కించుకొనుట యేమి యాశ్చర్యమా! పెద్దపెద్ద చేపలను పెక్కు వలలలో చిక్కించుకొనువాడు అధిక ప్రతిష్ఠావంతుఁడును, జీవనము గడుపఁగలవాఁడును నగునట్లే అనేకు లను తమ మతములో చిక్కించుకొనువారు అధిక ప్రతిష్ఠావంతులును, జీవ నము గడుప గలుగువారు నగుదురు. కావుననేకద వీరు వేదశాస్త్రములను చదు వని-వినని-యమాయక జనులను మోసపుచ్చి దమవలలో చిక్కించుకొనుచు వారిని తల్లి, తండ్రి, బాంధవులు మున్నగువారినుండి వేఱుపఱచుచున్నారు. కాబట్టి వీరి భ్రమజాలములోఁ జిక్కుక యమాయకులైన యితర సోదరులను వీరినుండి తప్పించుటయే విద్వాంసులగు నార్యులకు కర్తవ్యము. ॥౬౨॥

౬౩. ఏసు వారి సమాజమందిరములలో బోధించుచు రాజ్యమును గూర్చిన సువార్తను ప్రకటించుచు ప్రజలలోని ప్రతివ్యాధిని, రోగమును స్వస్థపరచుచు గలిలయ్యయం దంతట సంచరించెను. నానావిధములయిన రోగ ములచేతను, వేదనలచేతను పీడింపఁబడిన వ్యాధిగ్రస్తుల నందఱను, దయ్యము పట్టిన వారిని, చాంద్రరోగులను, పక్షవాయువుగల వారిని వారాయనయొద్దకు తీసికొనిరాఁగా ఆయనవారిని స్వస్థతపరచెను. మత్త. ౪: ౨౩-౨౪॥

స:-సోఫురీలను, టక్కులను చిన్న మంత్రపురశ్చరణమును, ఆశీర్వా దాదులను గావించువారు చిటికెఁడు భస్మమునిచ్చి భూతములను పాఱద్రోలు దురనుట గాని రోగములను మాన్పఁగలుగుదురనుట గాని నిజమైనచో ఈ సువార్తయందలి మాటయు నిజము కావచ్చును. కాఁబట్టి యివి యమాయ కులను భ్రమలోపడఁద్రోయు మాటలే. క్రైస్తవులు యేసుమాటలను నమ్ము చున్నారేనియిప్పటి (దేవీలోవుల) శక్తి పూజకుల మాటలనుగూడ నెందులకు నమ్మరు? ఏలయన నామాటలు వీరిమాటలవలెనే యున్నవి. ॥౬౩॥

౬౪. ఆత్మవిషయమై దీనులైనవారు ధన్యులు. పరలోకరాజ్యము వారిది. ఆకాశమును, భూమియు గతించిపోయిననే కాని ధర్మశాస్త్రమంతయు నెర వేఱువఱకు దానినుండి యొక పొల్లయినను, ఒక సున్నయైనను తప్పిపోదని

నిశ్చయముగా మీతో చెప్పుచున్నాను. కాఁబట్టి యీయాజ్ఞలలో మిక్కిలి అల్ప మయిన యొకదానినైనను మీఱి మనుష్యులకాలాగున చేయబోధించువాఁడు పరలోక రాజ్యములో మిక్కిలి అల్పుఁడనఁబడును. మత్త. ౫:౩-౧౮-౧౯

స:- స్వర్గ మొకటియేగద దానికి రాజుగూడ నొక్కఁడేకాఁగలఁడు. కాఁబట్టి దీనులయిన వారందఱును స్వర్గమునకేగుదురన్న నాస్వర్గమందు రాజ్యాధికార మెవరి కబ్బును? అనఁగా నొండొరులు జగడమాడఁజొత్తురు. ఇఁక రాజ్యవ్యవస్థయంతయు అస్తవ్యస్తమై పోవును. దరిద్రులగువారే దీను లనఁబడుదురన్నను సరికాదు; లేక నిరభిమానులను దీనులందురన్న నుపయోగములేదు ఏలయన దీనశబ్దమునకు, అభిమానశబ్దమునకు నర్థ మొకటికాదు. ఇఁక మనస్సులో దీనుఁడగువానికి సంతోష మెన్నటికిని కలుగదు కాఁబట్టి యీమాట యుపయుక్తముకాదు ఆకాశమును, భూమియు నుండఁగలుగు నప్పుడే యీవ్యవస్థయు నష్టమైపోవును ఇటువంటి యశాశ్వతమైన యేర్పాటు మనుష్యులు చేయుదురేకాని సర్వజ్ఞుఁడైన యీశ్వరుఁడు గాడు. కాని నీ యాజ్ఞలను నమ్మనివాఁడు స్వర్గమున సందఱకంటె నల్పుఁడనఁబడునని భయ ప్రలోభనములు గలిగించుటకు వ్రాయఁబడినదని యెఱుఁగవలెను. ॥౬౪॥

౬౫. మా అనుదినాహారము నేఁడు మాకు దయచేయుము... భూమి మీఁద మీకొఱకు ధనముగూర్చుకొనవద్దు మత్త. ౬:౧౧-౧౯॥

స :- యేసు జన్మించిన కాలమందు జను లనాగరికులుగను, దరిద్రులుగ నుండిరనియు, యేసునయిత మట్లే దరిద్రుఁడుగనుండెననియు అందు వలననే తాను దినాహార నిమిత్తమీశ్వరుని ప్రార్థించుచునట్లే యన్యులకు నేర్పె ననియు దీనివలన విదితమగుచున్నది. అట్లైన నిఁక నీ క్రైస్తవులు ధన సంచయమేల చేయుచున్నారు? మఱివారు యేసు వాక్యమునకు విరుద్ధముగఁ బోక దాన ధర్మములుచేసి దీనులగుటయే మేలు. ॥౬౫॥

౬౬. ప్రభువా! ప్రభువా! అని నన్ను పిలుచు ప్రతివాఁడు పరలోక రాజ్యములో ప్రవేశింపఁడు. మత్త: ౭: ౨౧॥

స :- ఇప్పుడు గమనింపుఁడు! గొప్పగొప్ప పాదిరీలును, బిషప్పులను క్రైస్తవులునువారును యేసుచెప్పిన యీమాట సత్యమేయని నమ్ముదురేని

యేసును ప్రభువు-నీశ్వరుఁడు అని యెప్పటికిని చెప్పఁగూడదు. మఱి ఈ మాట నంగీకరింపరేని వారెప్పటికిని పాపమునుండి తొలఁగి యుండజాలరు. ॥౬౬॥

౬౩- ఆదినమందనేకులు నన్నుచూచి చెప్పుదురు. అప్పుడు "నేను మిమ్మెన్నఁడును ఎఱుఁగను. అక్రమము చేయువారలారా! నాయొద్దనుండి పొండ"ని వారితోఁ జెప్పుదును. మత్త: ౭: ౨౨,౨౩॥

స :- చూడుఁడు: యేసు అడవిమనుష్యులను విశ్వసింపఁజేయుటకే కద స్వర్గమందు న్యాయాధీశుఁడగుట కిష్టపడు చుండెను. ఇది కేవల మమాయకులకు ప్రలోభనము గలుగఁజేయుమాటయే. ॥౬౭॥

౬౮-అప్పుడొక కుష్ఠరోగివచ్చి ఆయనకుమ్రొక్కి- ప్రభువా! నీకిష్టమైన నన్ను శుద్ధునిగా చేయఁగల"వనెను. అందుల కాయన తనచేయి చాపి వానిని ముట్టి నాకిష్టమే; నీవు శుద్ధుఁడవుకమ్మని చెప్పఁగా తక్షణమే వాని కుష్ఠరోగము శుద్ధియాయెను. మ: ౮. ౨౩॥

స :- ఇవి కేవలమమాయకులను వశపఱచుకొను మాటలే. మఱి క్రైస్తవులీ జ్ఞానవిరుద్ధములును, సృష్టి క్రమవిరుద్ధములు నగు మాటలను సత్యములని నమ్ము చున్నపుడు, శుక్రాచారి, ధన్వంతరి, కశ్యపుఁడు మున్నగు వారు చచ్చిన యనేక దైత్యుల సైన్యమును బ్రతికించిరనియు, బృహస్పతి పుత్రుఁడగు కచుని నఱికి ముక్కలు ముక్కలుగాఁజేసి పశువులకును చేఁపలకును తినబెట్టినను శుక్రాచార్యుఁడు వానిని మరల బ్రతికించెననియు, పిమ్మట కచుని జంపి శుక్రాచార్యునికి తినిపింపఁగా కడుపులోనే యతనిని బ్రతికించి బయటికి రప్పించెననియు, తాను మృతిఁజెందఁగా కచుఁడతని బ్రతికించెననియు, కశ్యప ఋషి తక్షకునివలన మనుష్యసహితముగ భస్మమైపోయిన వృక్షమును, ఆ మనుష్యుని సజీవులు గావించెననియు, ధన్వంతరి లక్షలకొలఁది శవములను బ్రతికించెననియు, లక్షల కొలఁది కుష్ఠు మొదలుగాఁగల రోగములను మాన్పెననియు, లక్షల కొలఁది గ్రుడ్డివాండ్రకు కన్నులను, చెవిటివాండ్రకు చెవులను నిచ్చెననియు పురాణములందును, మహాభారతము నందును వ్రాసియున్నవి. ఇటువంటి కథలను మిథ్యయని యేల యనుచున్నారు? పైఁ జెప్పఁబడినమాట

లసత్యములన్న యేసు మాటలేల యసత్యములు కాకుండును? అన్యులమాటల నబద్ధములనియు తమ ఎబ్బఅపలుకులనుగూడ సత్యములనియుఁ జెప్పువారు దురాగ్రహంలేల కాకుండురు? కాన నీ క్రైస్తవుల మాటలు కేవలము హఠముతోఁగూడిన బాలుర మాటలవంటివే యగునొప్పును. ॥౨౮॥

౨౯. దయ్యములు పట్టిన మనుష్యులు సమాధులలోనుండి బయలుదేఱి అయన కెదురుగా వచ్చిరి. వారు మిక్కిలి యుగ్రులయినందున నెవఁడును ఆ మార్గమున వెళ్ళలేకపోయెను. వారు దేవుని కుమారుఁడా ! నీతో మాకేమి ? కాలము రాకమునుపే మమ్మును బాధించుటకు ఇక్కడికివచ్చితివా ? అని కేకలువేసిరి. దూరమున గొప్పపందుల మంద మేయుచుండఁగా ఆ దయ్యములు 'నీవు మమ్ము వెళ్లఁగొట్టినయెడల ఆ పందుల మందలోనికి పోనిమ్మని అయనను వేఁడుకొనెను. ఆయన వానిని పొమ్మనఁగా అవి మనుష్యులను వదలిపెట్టి ఆపందులలోనికి పోయెను. అంతట అ మందఅంతయు ప్రపాతము నుండి సముద్రములోనికి వడిగా పరుగెత్తిపోయి నీళ్ళలోబడి చచ్చెను.

మత్త: ౮. ౨౮-౨౯-౩౦-౩౦-౩౨

స:—సరి యిచటకొంచెము విచారించిన నీమాటలన్నియు నబద్ధములే యని తేలును. ఎట్లన మృతినొందిన మనుష్యుఁడు సమాధులలో నుండి లేచి రాఁజాలఁడు. ఇఁక నవి యొకరిపై యావేశముగావు. ఒకరితో సంవాదమును జేయనేరవు. ఇవన్ని విద్యావిహీనులచేఁ గల్పింపఁబడినమాటలు. వీని నిజమని మహాపామరులైనవారే యంగీకరింపగలరు ఇఁక పందులఁ జంపించి యాపందులవాండ్రకు నష్టము కలిగించిన పాపము యేసునకు తగులవచ్చునుగద. క్రైస్తవులు యేసును పాపవిమోచనుఁడు పవిత్రపఱుచువాఁడు అని నమ్మదున్నారు. అటులేని ఆయన యాఘాతముల నేల పవిత్రపఱుపలేక పోయెను ? పందులవాండ్ర నష్టమును భరింప లేదెందులకు ? ఏమి ? ఇప్పటి సుశిక్షితులైన క్రైస్తవులగు అంగ్లేయులు గూడ నీ వట్టిమాటలను నిజమని నమ్ముచుండవచ్చునా ? నమ్ముచున్నారేని భ్రమజాలమున చిక్కియున్నారనుట. ॥౨౯॥

౩౦. జనులు పక్షవాయువుతో మంచము పట్టియున్న యొకనిని ఆయన యొద్దకు తీసికొనివచ్చిరి. యేసు వారి విశ్వాసముచూచి కుమారుఁడా !

దైర్యముగానుండుము. నీపాపములు పరిహరింపబడి యున్నవని పక్షవాయువు గల వానితో చెప్పెను. నేను నీతిమంతులను పిలువరాలేదు గాని పాపులను పశ్చాత్తాప నిమిత్తము పిలువవచ్చితిని. మత్త: ౯:౨ ౧౩॥

స:— ఇదికూడ నింతకుముందు వ్రాయఁబడినటువంటి యసంగతమైన మాటయే. ఇఁక పాపమును క్షమించుననెడి మాట కేవల సమూయుకులను. ప్రలోభనమును గలిగించి వలలో చిక్కించుకొనుటకే చెప్పంబడినది. ఒకఁడు మద్యమునో, భంగునో నల్లమందునో సేవించినపుడు వాఁడుగాక మరొకఁడు మత్తును బొందనేరఁడు. ఒకఁడు చేసిన పాపము మరియొకనికి [illegible] చేసిన వాఁడే యా పాప మనుభవించును ఇదియే యీశ్వరుని న్యాయము. ఒకఁడు చేసిన పాపపుణ్యములను మరొకఁడో లేక స్వయముగ న్యాయాధీశుఁడో పొందునన్న లేదా చేసినవారలకు దగిన ఫల మీశ్వరుడీయక పోవునన్న నతఁడన్యాయకారి యే యగును. ఇఁక మేలొనగూర్చునది ధర్మమే కాని యేసుగాఁడు. మరియు వ్వఁడునుగాఁడు. కాన ధర్మాత్ములకే కాని పాపాత్ములకే కాని యేసుమున్నగు వారి యవసర మేమియు లేదు. ఏమనఁగా పాపాసురల మెప్పటికి తప్పదు. ॥౬౦॥

౬౧— యేసు తన పండ్రెండుమంది శిష్యులను పిలిచి అపవిత్రాత్మలను వెళ్లఁగొట్టుటకును, ప్రతిరోగమును, స్వస్థపఱచుటకు వారికి అధికార మిచ్చెను. మీతండ్రి ఆత్మ మీలోనుండి మాటలాడుచున్నాఁడే గాని మాటలాడువారు మీరు కారు. నేను భూమిమీఁదికి సమాధానమును పంపవచ్చితినని తలంపకుఁడి కాని ఖడ్గమును సుపయోగింపఁ జేయుటకు వచ్చితిని ఒక మనుష్యునికిని వాని తండ్రికిని, కుమార్తెకును ఆమె తల్లికిని, కోడలికిని ఆమె అత్తకును విరోధము పెట్టవచ్చితిని ఒక మనుష్యుని యింటిలోని వారే అతనికి శత్రువులగుదురు.

మత్త: ౧౦:౧-౨౦-౩౪-౩౫-౩౬॥

స:- ఈ శిష్యులలోని వాఁడొకఁడు ముప్పది రూప్యముల లోభములోఁ బడి యేసును బట్టించుచుండఁగా తక్కినవారందఱు తప్పించుకొని పాఱి పోయిన వారలే. ఈ శిష్యులు వయ్యములు పట్టుట, వానిని పాఱద్రోలుట, ఔషధ పథ్యాదులులేక రోగములు మాన్పుట అనునీమాటలు విద్యాహీనులమూలే

గాక సృష్టిక్రమ విరుద్ధములు నసంభవములునై యున్నవి. కావున నిట్టిమాటలు నజ్ఞానులే నిజమనుకొందురు. జీవులు మాటలాడువారు కారు. ఈశ్వరుఁడే మాట్లాడునన్న జీవులేలవని చేయుదురు. ఇఁక సత్యానత్యములకు ఫలమగు సుఖమునో, దుఃఖమునో ఈశ్వరుఁడే యనుభవించుచుండవచ్చునుగా! ఈ మాటగూడ మిథ్యయే. యేసు ఏభేదమును, జగడమును కలుగఁ జేయుటకు వచ్చియుండెనో ఇప్పుడదియేలా లోకుల నంటియుండునది! భేదము కలిగించుట మంచిదికాదు. దానివలన మనుష్యులకు నిరంతర దుఃఖమే సంభవించును. కాని క్రైస్తవులు మాత్రము దీనినే గురుమంత్రమని గ్రహించి యుండవచ్చును. ఏలయన ఒండొరులలో భేదము కలిగించుటను యేసే మంచి దనుకొనునపుడు వీరెందుల కనుకొనకపోదురు. ఇంటివారితో నింటివారిని శత్రువులుగఁజేయుట యేసుచేసినదే కావచ్చును. ఐన నిది శ్రేష్ఠపురుషుల పని కాదు. ॥౯౧॥

౯౨. యేసు–మీయొద్ద ఎన్నిరొట్టెలున్నవని వారినడుగఁగా వారు–ఏడు రొట్టెలు, కొన్ని చిన్న చేఁపలు నున్నవని చెప్పిరి. అప్పుడాయన నేలమీఁద కూర్చుండుఁడని జనసమూహమునకు ఆజ్ఞాపించి ఆయేడు రొట్టెలును, ఆ చేఁపలును పట్టుకొని కృతజ్ఞ తాస్తుతులను చెల్లించి వానిని విఱిచి తన శిష్యులకిచ్చెను. శిష్యులు జన సమూహములకు పంచిపెట్టిరి. వారందఱు తిని తృప్తిపొందినమీఁదట మిగిలిన ముక్క లేడుగంపలనిండ ఎత్తిరి–స్త్రీలను పిల్లలనుగాక తినినవారు నాలుగువేల మందిపురుషులు.

మత్త ౧౫: ౩౪–౩౫–౩౬–౩౭–౩౮॥

స:—ఇప్పుడు గమనింపుఁడు! ఏమి! ఇది యిప్పటి అబద్ధపు సిద్ధుల ఐంద్రజాలికులు మున్నగు వారల మోసకృత్యముల వంటిదికాదా? ఆఖొట్టెలో నితరములగు రొట్టెలెక్కడనుండిరా గలిగెను? యేసునందిట్టి సిద్ధులుండెనన్న తానాకలి గొనినపుడు మేడిపండ్లఁదినుట కేల నెపకుచుండెను? మట్టినీరు, పాలు మొదలగువానితో మోహనభోగునో, రొట్టెలనో తన కొఱకు చేసికొనదే దేఁడులకు? ఈమాటలన్నియు పిల్లల మాటలగనున్నవి: ఎందరో సాధువులు, బైరాగులు ఇట్టి మోసకృత్యములచేత నమాయకుల నెట్లు మోసపుచ్చుచుందురో యివియు నటువంటివే. ॥౯౨॥

౨౩—అప్పుడాయన "ప్రతిమనుష్యునకు " నెవని క్రియలచొప్పున వానికి ఫలమిచ్చును. మత్త ౧౬:౨౭॥

స:—కర్మానుసారముగ ఫలమియ్యఁబడునన్న విం క్రైస్తవుల పాపము క్షమింపఁబడునని బోధించుట వ్యర్థము. అదియే సత్యమేని యిది మిథ్యయగును. ఎవరేని, క్షమింపఁబడఁ దగినవారే క్షమింపఁబడుదురనియు, క్షమింపఁ బడదగనివారు క్షమింపఁ బడరనియు నన్న నది సరికాదు. కర్మము లన్నిటికిఁ దగిన ఫలము నిచ్చుటయే న్యాయము. అదియే పూర్ణదయయు నగును. ॥౨౩॥

౨౪—విశ్వాసములేని మూర్ఖతరమువారలారా ! ఆవగింజంత విశ్వాసము మీకుఁ గలిగియుండిన యెడల యీకొండనుచూచి యిక్కడినుండి యక్కడికి పొమ్మనఁగా అదిపోవును. మీకసాధ్యమైన దేదియునుండదని నిశ్చయముగా మీతో చెప్పుచున్నానని వారితోననెను. మ: ౧౭:౧౯-౨౧॥

స:-ఇప్పుడు క్రైస్తవులు-"మామతమున ప్రవేశింపుఁడు, పాపపరిహారముఁ బొందుఁడు, ముక్తులుకండు" అని యితరులకు బోధించుచుండున దంతయు మిథ్యయేయని తేఁటపడినది. ఏమనఁగా యేసునందు పాపములను తొలఁగించునట్టియు, విశ్వాసము దృఢపఱచునట్టియు, పరిశుద్ధులఁ గావించు నట్టియు సామర్థ్యమే యుండియున్న స్వశిష్యుల యాత్మలను పాపరహితములు గాను, విశ్వాసార్హములుగాను పరిశుద్ధములుగాను ఏల చేయకుండును ! తేను తన వెంట తిరుగుచుండినవారినే పరిశుద్ధులుగను, విశ్వాసార్హులుగను, కళ్యాణయుక్తులుగను చేయలేక పోయినపుడు మరణించినపిదప అతఁడెక్కడ నుండు నది తెలియదే ఏమి చేయఁగలడుః ఇప్పుడొక్కనినైన పవిత్రునిఁజేయలేఁడు. ఆవగింజంత విశ్వాసము లేని యేసు శిష్యులచే రచియింపఁబడిన యీ నువార్తల పుస్తకము ప్రమాణ యోగ్యము కాఁజాలదు. ఏమనఁగా విశ్వాసములేని వారు, అపవిత్రులు, అధర్మపరులు నగు మనుష్యులచే వ్రాయఁబడిన లేఖలను శుభము గోరువారు విశ్వసింపవలసిన యవసరము లేదు. ఇఁక ఏ యేసువాక్యము సత్యమేని యేక్రైస్తవునియందు నొకయావగింజంత విశ్వాసము-సత్యము-లేదనియు సిద్ధమగును. ఒకానొకరు మాయందు కొంచెమో, గొప్పయో విశ్వాసమున్నదందు రేని వారితో మీరీపర్వతమును మార్గములోనుండి తొలఁ

గింపుదని యనవలెను; వారిచే నది తొలఁగింపఁబడిన మీయందు పూర్ణవిశ్వాసములేదుగాని ఆవగింజంత గలదనియు, తొలఁగింపఁ బడకపోయిన నొక బిందుమాత్రము విశ్వాసము-సత్యము-మీక్రైస్తవులయందు లేదనియు యెఱుఁగఁదగును. కొందఱు నభిమానాది దోషములను పర్వత నామముతో నుదాహరించినారనవచ్చు గాని యందువలన నుపయోగములేదు. మృతులను గ్రుడ్డివారిని, కుష్ఠురోగులను భూతగ్రస్తులను బాగుపఱచినాఁడనుసది సయితము అలసులకో, అజ్ఞానులకో, కాముకులకో, భ్రాంతియుక్తులకో నేర్పించి సజీవులుగాను, స్వస్థచిత్తులుగానుచేసి చూపవచ్చును. కాని యిదియును నిజమని తోఁచదు. ఏలయన స్వశిష్యుల నిర్దోషులనుఁ జేయలేకుండును : కావున నీయసంభవమైన వార్త యేసు అవివేకమును ప్రకటింపఁ జేయుచున్నది. మంచిది యేసు కొంచెమైన విద్యకలిగియున్న నిట్టి తెలివిదప్పిన మాటలనెందులకుఁజెప్పియుండును:[నిరస్తపాదపే దేశే ఏరండోఽపి ద్రుమాయతే] చెట్టు లేని దేశమందు ఆముదపుచెట్టే శ్రేష్ఠమైనదిగా గణింపఁబడుచున్నట్లుగొప్ప మొటులును, విద్యావిహీనులును గల దేశమున యేసుకూడ నొక శ్రేష్ఠుఁడుగా గణింపఁబడెనని ఏర్పడెను. కాని యిప్పుడు యేసు ఏతరగతిలో గణింపఁబడ గలుగును? ॥౭౪॥

౭౫-మీరు మనస్సు మార్పునొంది పిల్లలవంటి వారైనఁగాని పరలోక రాజ్యములో ప్రవేశింపరని నిజముగా మీతో చెప్పుచున్నాను. మత్త: ౧౮:౩॥

స:-స్వేచ్ఛగా మనస్సును త్రిప్పుకొనుట స్వర్గమునకుఁ గారణమనియు, మనుస్సును త్రిప్పుకొనకపోవుట నరకమునకుఁ గారణమనియుఁ జెప్పఁబడినప్పుడొకని పుణ్యపాపములను మఱియొకఁడు దీసికొనఁజాలఁడని యేర్పడుచున్నది. యేసువాక్యములు బాలకుల మాటలవంటి వని సందుసనవివిద్యకును, సృష్టిక్రమమునకును బహు విపరీతమైయున్నవనియు, లోకు లతనిమాటలను విని బాలకులవలె మారేమియు నరుగక కన్నులు మూసికొని యొప్పుకోవలె నని సయిత మతని మనుస్సులో నుండెననియు విదితమగుచున్నది. క్రైస్తవం అనేక చేష్టలు బాలబుద్ధితోఁ గూడినవే యనవచ్చును. లేనిచో నీ విద్యావిరుద్ధమును, యుక్తిశూన్యము నగు మాటల నేల యంగీకరింతురు? యేసు తాను విద్యాహీనుఁడును, బాల బుద్ధిగలవాఁడును గాకున్న నన్యులను బాలురుగాఁ

తేయుట తేల బోధించియుండును ; ఏమనఁగా నెవఁడెట్లుండునో వాఁడితరులను సయితము తన వలెనే జేయఁగోరును. ॥౨౫॥

౨౪. ధనవంతుఁడు పరలోకరాజ్యములో ప్రవేశించుట దుర్లభమని నిశ్చయముగా మీతో చెప్పుచున్నాను ఇదిగాక ధనవంతుఁడు పరలోక రాజ్యములో ప్రవేశించుటకంటె సూదిబెజ్జములో ఒంటెదూరుట సులభమని మీతో చెప్పుచున్నాననెను. మత్త: ౧౯: ౨౩-౨౪॥

గ:-యేసు దరిద్రుఁడుగ నుండెననియు, ధనవంతు లతని గౌరవింపక పోవచ్చుననియు. అందులకే యిట్లు వ్రాసియుండ వచ్చుననియు దీనివలన తేటపడుచున్నది. కాని యిది సత్యముకాదు. ఏలయన ధనికులలోను, దరిద్రులలోను మంచినా ను, చెడ్డవారునుండురు. మంచికర్మము చేయువాఁడు మంచిఫలమును, చెడుకర్మము చేయువాఁడు చెడుఫలమును పొందుచున్నాఁడు. ఈశ్వరుని రాజ్యము సర్వత్రగాం యేదో యొక దేశమున నున్నదని యేసు నమ్ముచుండెననిగూడ దీనివలన స్పష్టమైనది. అటు లేని యటువంటివాఁ డీశ్వరుఁడే కాఁడు. ఎవఁడీశ్వరుఁడో యతని రాజ్య మంతటఁ గలదు. అతఁడొక చోటఁ ప్రవేశింపఁగలఁగనికాని ప్రవేశింపఁజాలఁడని కాని చెప్పుట కేవల మవివ్యయే. ఇఁక క్రైస్తవులలోని ధనాఢ్యులందఱు నరకమునకును, దరిద్రులందఱు స్వర్గమునకును పోవుదురాఏమి: ధనాఢ్యుల వద్ద నుండునంత సామగ్రి దరిద్రులవద్ద నుండదు. ధనికులు వివేకముతో ధర్మమార్గమున వ్యయపఱుతు రేని యుత్తమ గతిని బొందఁ గలుగుదురు. మఱిదరిద్రులు నీచగతినే పొంది యుందురని యేసు కొంచెమైన నాలోచింప వలసియుండెను. ॥౨౬॥

౨౮. యేసు వారితో నిట్లనెను- ప్రపంచ పునరుత్థానకాలమందు మనుష్యకుమారుఁడు తన మహిమగల సింహాసనమీఁద కూర్చుండునపుడు నన్ను వెంబడించిన మీరును పండ్రెండు సింహాసనముల మీఁద కూర్చుండి ఇశ్రాయేలుల పండ్రెండు గోత్రములవారికి తీర్పు చేయుదురు. నా నామము నిమిత్తము అన్నదమ్ములనైనను, అక్కచెల్లెండ్రనైనను, తండ్రినైనను, పిల్లలనైనను, ఇండ్లనైనను విడిచిపెట్టిన ప్రతివాఁడు నూఱంతలు పొందును. అదిగాక నిత్యజీవమును స్వతంత్రించుకొనును. మత్త:౧౯: ౨౮-౨౯॥

౦డరేదు. గనుక దానినిచూచి ఇఁకమీదట నెన్నటికిని నీవు కాఁపుకాయకుందువు అని చెప్పెను. తక్షణమే ఆ అంజూరపుచెట్టు ఎండిపోయెను.

మ: ౨౧: ౧౮-౧౯॥

స:—అతఁడు గొప్ప శాంతశమాన్వితుఁడయి క్రోధాది దోషరహితుఁడుగ నుండెనని పాదిరీలను, క్రైస్తవులందఱును చెప్పుచుయుకాని యీ మాటలను బట్టి చూడఁగా యేసు క్రోధియు, ఋజుజ్ఞానము లేని వాఁడును, తెలివితప్పిన యనాగరికులవంటి ప్రవర్తనము కలవాఁడు నయియుండెనని తేలుచున్నది. పోనిమ్ము! వృక్షము జడపదార్థముకదా? ఎండిపోవునట్లు శపించుటకా వృక్షమేమి యపరాధముఁ జేసియుండెను? అది యతని శాపమువలన ఎండిపోకుండ వచ్చునుగాని యొకానొక యౌషధప్రయోగమువలన నెండిపోయిన నాశ్చర్యముకాదు. ॥౭౮॥

౭౯. ఆదినము శ్రమ ముగిసినవెంటనే చీఁకటి సూర్యుని క్రమ్మును. చంద్రుడు తనకాంతి నీయఁడు, నక్షత్రము లాకాశమునుండి రాలును. ఆకాశమందలి సైన్యము, శక్తులు కదలింపఁబడును.       మ: ౨౪: ౨౯॥

స:—ఓరీ యేసు! నక్షత్రములు రాలిపడుననుట నీవేవిద్యచే తెలిసికొంటివో? కదలిపడునను ఆకాశసైన్యమెయ్యది? ఆహా! యేసు కొంతవిద్యావంతుఁడేయయియున్న నక్షత్రములన్నియు గోళములు, అవి యెట్లు కదలిపడఁగలవు అని యవశ్యముగఁ దెలిసికొనఁగలిగియుండును! యేసు వడ్రంగికులమున నుత్పన్నుమైనందున నెప్పుడును కట్టెంపేడిల్చుచు, చెక్కుచుఁ గోయుచు తోడించుచు నుండవచ్చును. కాని యతఁడా యనార్య దేశమున తానును సైగంబరు గావచ్చునను తలంపు కలుగఁగా నిట్లుచెప్పఁబోదఁగెనని విదితమగుచున్నది. అతని నోటితో నెన్నియో మంచిమాటలును చెడ్డమాటలును వెడలియున్నవి. అచ్చటి జనులు తెలివిమాలినవారుగాన నంగీకరించిరి. ఇప్పుడు ఐరోపాదేశమున్నతిలో నున్నట్లు పూర్వమునున్న నితని గొప్పతన మేమియు సాగకుండెడిది. ఇప్పుడు కొంత విద్యావంతులయినను వ్యవహారపు చిక్కులవలనను, హఠములవలనను వారీనిరర్థకమతమును విడువనొల్లక సర్వథా సత్యమైన వేద మార్గమునకు రాఁబడయత్నించుటలేదు. ఇదియే వారి యందుఁగల కొఱత. ॥౭౯॥

౪౦.-ఆకాశమును, భూమియు గతించునుగాని నామాటలే మాత్రము గతింపవు. మ: ౨౪: ౩౫॥

స:-ఇది కూడ సవిద్యతోఁగూడిన తెలివితప్పినమాటయె. ఏలా? ఆకాశము కడరి యెక్కడికిపోఁగలదు? ఆకాశమతిసూక్ష్మమైనందున కంటికి కానరానపుడు దానికడలిక నెవరు చూడఁగలుగుదురు? ఇఁక యిన్ని'దా గొప్ప చేసికొనుట శ్రేష్ఠుల పనికాదు. ॥౪౦॥

౪౧. అప్పుడాయన యెడమ వైపుననుండువారిని చూచి "శపింపఁబడినవారలారా! నన్నువిడిచి సైతానునకును, వానిదూతలకును సిద్ధపఱుపఁబడిన నిత్యాగ్నిలోనికిపొండి." అనెను. మ: ౨౫: ౪౧॥

స:-సరి! తనశిష్యులను స్వర్గమునకుఁబంపుచు నితరులను నిత్యాగ్నిలోఁబడ వేయుట గొప్పపక్షపాతమేకద. మఱియాకాశమే లేకయుండునపుడు నిత్యాగ్నియు, నరకమును, స్వర్గము నెక్కడ నుండఁగలుగును? సైతానును, అతని దూతలను ఈశ్వరుఁడు పుట్టింపకున్న నిట్టి నరకము నేల నిర్మింపవలసి వచ్చును? ఒక సైతానే యీశ్వరునకు భయపడనిచో నతఁడీశ్వరుఁడనుట యెట్లు? ఏమనిన నతని దూతయే యతనికి ద్రోహియయ్యెను. ఈశ్వరుఁ గలని మొదటనే పట్టి చెఱసాలలో నుంచలేకపోయెను. చంపసుఁజాలక పోయెను. యేసును నయితము నలువది దినములు దుఃఖపెట్టెను. ఇఁకనతని యీశ్వరత్వమేమని చెప్పవలెను? యేసునయిత మతని నేమియుఁ జేయఁజాలకపోయెను. కాన నీశ్వరపుత్రుఁడనుట వ్యర్థమని తేలుచున్నది. కాఁబట్టి యేసు ఈశ్వరుని కుమారుఁడుగాని దైవమునందు వర్ణింపబడిన యీశ్వరుఁడుగాని కాఁజాలఁడు. ॥౪౧॥

౪౨. అప్పుడు పన్నిద్దరుమందిలో ఇస్కరియోతుయూదా అను నొకఁడు ప్రధాన యాజకులయొద్దకు వెళ్ళి నేనాయనను మీకప్పగించిన యెడల నాకేమి యిత్తురని వారి నడిగెను. అందులకు వారు ముప్పది వెండినాణెములు వానికి తూచియిచ్చిరి. మ: ౨౬: ౧౪-౧౫॥

స:-ఇప్పుడు యేసుయొక్క సిద్ధులు, ఈశ్వరత్వము అంతయుఁ బ్రకటమయ్యెను! ఏమనిన వెంటనున్న యతని ప్రధానశిష్యుఁడైన నతని సాంగత్యముచేఁ బవిత్రాత్ముఁడు కానపుడు మరణానంతర మతఁడితరులఁ

దవిత్రాత్ములగ నేమి చేయఁగలరు? అతని విశ్వసించువారలెంతటో మోస
పోవు చున్నారు. ఏలయనఁ దన్ననుసరించియుండిన శిష్యునికే మేలు చేయని
వాఁడు మరణానంతర మొకని కేమిమేలు చేయఁగలుగును? ॥౮౨॥

౮౩. వారు భోజనము చేయుచుండఁగా యేసు ఒకరొట్టె పట్టుకొని
దాని నాశీర్వదించి విఱిచి తన శిష్యులకిచ్చి మీరు తీసికొని తినుఁడి; ఇది
నా శరీరమని చెప్పెను. మఱియు ఆయన గిన్నె పట్టుకొని కృతజ్ఞ తాస్తుతులను
చెల్లించి వారికిచ్చి దీనిలోనిది మీరందఱు త్రాగుఁడి—ఇది నా రక్తము. అనఁగా
పాపపరిహారములకగుటకై ......చిందింపఁబడుచున్న నిబంధనరక్తము.
మ: ౨౬: ౨౬-౨౭-౨౮॥

ప్ర:-సరి! ఇట్టిమాటనొక విద్యావిహీనుఁడయిన అడవిమనుష్యుఁడు
గాక సత్పురుషుఁడెవఁడేని చెప్పునా? శిష్యులతో భోజనపదార్థమును తన
మాంసమనియు, పానీయములను రక్తమనియుఁ జెప్పఁజాలునా? దీనినే
యిప్పుడు క్రైస్తవులు ప్రభుభోజనమనుచున్నారు. అనఁగా దిను త్రాగు వస్తు
వులనే యేసు మాంసరక్తములని భావించి తినుచు, త్రాగుచు నున్నారు. ఇదెంత
వికారమైనమాట! తమగురువు రక్తమాంసములతో దిను త్రాగు భావనను విను
వరేవేని యుదరముల నెట్లు విరువఁగలుగుదురు? ॥౮౩॥

౮౪. పేతురును, జెబెదయి యుద్దఱు కుమారులను వెంటఁబెట్టుకొని
పోయి దుఃఖపడుటకు, చింతాక్రాంతుఁడగుటకు నారంభించెను. అప్పుడు యేసు
నాప్రాణము మరణమగునంతగా బహుదుఃఖము కలిగియున్నది. మీరిక్కడ
నిలిచి నాతోకూడ మెలఁకువగా నుండుఁడని వారితోచెప్పి కొంతదూరముపెళ్ళి
సాగిలపడి "నాతండ్రి సాధ్యమైన నీగిన్నె నాయొద్దనుండి తొలఁగిపోనిమ్ము
........." అని ప్రార్థించెను. మ: ౨౬: ౩౭-౩౮-౩౯॥

ప్ర:—చూడుఁడు: అతఁడు కేవలము మనుష్యుఁడుగాక, ఈశ్వరుని
కుమారుఁడుగాని త్రికాలజ్ఞుఁడుగాని యొక విద్వాంసుఁడేగాని యైయున్న నిట్టి
యయోగ్యమైన చేష్టలు చేయకయే యుండును. అతఁడీశ్వరుని కుమారుఁడు,
భూతభవిష్యదాదుల నెఱుఁగువాఁడు, పాపపరిహార కర్తయను నిత్యాది కల్ల
మాటలను, యేసో యతని శిష్యులో కల్పించి ప్రకటింపఁ జేసిరనియె. దీని
వలన తేఁటపడుచున్నది. ఇతఁడు కేవల మొక సామాన్యమైన మనుష్యుఁడు

అమాయకుఁడు. అవిద్వాంసుఁడునయి యుండెనేకాని యొక విద్వాంసుఁడుగాని యోగిగాని, సిద్ధుఁడుగాని కాక యుండెనని యెఱుఁగఁదగును. ॥౮౪॥

౮౫. ఆయన యింతను మాటలాడుచుండఁగా పంన్రెండు మందిలో నొకఁడైన యూదా వచ్చెను. వానితోఁగూడ బహుజనసమూహము కత్తులు, గుదియలుపట్టుకొని ప్రధానయాజకుల యొద్దనుండియు, ప్రజల పెద్దలనుండియు వచ్చెను. ఆయన నప్పగించువాఁడు-నేనెవరిని ముద్దుపెట్టుకొందునో ఆయనే యేసు; ఆయనను పట్టుకొనుఁడనుమాట వారికి గుఱుతుగాచెప్పి-వెంటనేయేసు నొద్దకువచ్చి గురువా వందనమని చెప్పి ఆయనను ముద్దుపెట్టుకొనెను...... ......వారు దగ్గరకు వచ్చి యేసును బలవంతముగా పట్టుకొనిరి. అప్పుడు శిష్యులందఱు ఆయనను విడిచిపాఱిపోయిరి.........తుదకిద్దఱు అబద్ధ సాక్షులు వచ్చి-వీఁడు దేవాలయమును పడగొట్టి మూఁడుదినములలో దాని కట్టఁగలనని చెప్పెననిరి. ప్రధానయాజకుఁడు లేచి-నీవు త్తరమేమియు చెప్పవా? వీరు నీమీఁద పలుకుచున్న సాక్ష్యమేమని అడుగఁగా యేసు ఊరకుండెను. అందులకు ప్రధానయాజకుఁడు ఆయననుచూచి-నీవు దేవుని కుమారుఁడవైన క్రీస్తువైన ఆమాటమాతో చెప్పుమని జీవముగల దేవునితోడని నీ కానపెట్టు చున్నాననెను. అందులకు యేసు-నీవన్నట్లే అనెను. ప్రధాన యాజకుఁడు తన వస్త్రముచించుకొని-వీఁడు దేవదూషణచేసెను. మనకిఁక సాక్షులతో పని యేమి? ఇదిగో ఈ దూషణపుమాట మీరిప్పుడు విన్నారు గదా; మీకేమితోఁచు చున్నదని అడిగెను. అందులకువారు-వీఁడుమరణమునకు పాత్రుఁడనిరి. అప్పుడువారు ఆఁయన ముఖముమీఁద ఉమ్మివేసి ఆయనను గ్రుద్దిరి. కొందఱు ఆయనను చేతులతో కొట్టి-క్రీస్తూ! నిన్ను కొట్టిన వాఁడెవఁడో మాతో చెప్పు మనిరి. పేతురు వెలుపటి ముంగిట కూర్చుండఁగా నొకచిన్నది అతని యొద్దకు వచ్చి-నీవును గలిలయ్యుఁడగు యేసుతో కూడనుంటివిగదా యనెను. అందుం కతఁడు నేనుండలేదు; నీవు చెప్పినది నాకు తెలియదని అందఱియెదుట ననెను. అతఁడు నడవ లోనికి వెళ్ళిన తరువాత మరియొక చిన్నది అతని చూచి వీఁడును నజోరియుఁడగు యేసుతోకూడ నుండెనని అక్కడివారితో చెప్పఁగా అతఁడొట్టుపెట్టుకొని-నేనుండలేదు; ఆమనుష్యుని నేనెఱుఁగనని మరల చెప్పెను. అందుం కతఁడు-ఆమనుష్యుని నేనెఱుఁగనే యెఱుఁగనని శపించు

కొనుటకు, ఒట్టు పెట్టుకొనుటకు నారంభించెను. మ: ౨౬: [illegible]

స:—ఇప్పుడు ఏసుక్రీస్తు తన శిష్యులను వ్యభిచారిణులుగఁ జేయఁగలుగునంతటి సామర్థ్యముగాని, ప్రతాపముగాని అతనియందు లేక యుండెను. ఉండియుండిన నాశిష్యులు ప్రాణములు పోయినను తమ గురువును లోక ముచేఁ బట్టింపకుందురు. అబద్ధ మాడుచు కొనకయు, దొంకులు పొంకకయు, ఒట్టుపెట్టుకొనకయు నుందురు. ఏసు సయితము చమత్కారిగాకుండెను. కుంటి, గ్రుడ్డి మున్నగువారిని చంపుటకు సేకులులోకు అనువాని యింటిమీఁదికి వచ్చి యుండగా నట దేవదూతలిద్దఱు వారిని గ్రుడ్డివారగునట్లు చేసిరని తౌరేతునందు వ్రాయబడిన మాటయు నసంభవమే. ఐన నేసునందింతటి సామర్థ్యమైన లేక యుండెనే. క్రైస్తవు లిప్పుడతని నెంతయో గొప్పగఁ బొగడుచున్నారు. అతటాః ఇట్టి దుర్దశచేఁ జచ్చుటకంటె యుద్ధముచేసిగాని సమాధిస్థుఁడైగాని మరియొక విధమునఁగాని ప్రాణత్యాగముఁజేసియున్న మేలై యుండెడిదిగాః కాన యవిద్వాంసునకట్టి బుద్ధి యెక్కడనుండి పొడముసు? ఆయేసు ఇంకను జెప్పినదేమనఁగా:—౹౹౭౪౹౹

౭౬. ఈ సమయమున నేను నాతండ్రిని వేఁడుకొన లేననియు వేఁడుకొనిన నక్షణమున ఆయన పండ్రెండు సేనలకంటె ఎక్కువమంది దూతలను నాకు పంపఁడనియు నీవనుకొనుచున్నావా: మ. ౨౬. ౬౩౹౹

స:—ఇతరులను బెదరించుచు తన, తనతండ్రి గొప్పతనములను వెల్లడించుచున్నాఁడేకాని యేమియుఁజేయలేఁడు. ఆశ్చర్యమేమన వీరు నీకు విరుద్ధముగ సాక్ష్యమిచ్చుచున్నారు. దీనికి ప్రత్యుత్తరమిమ్మని మహాయాజకుఁడడిగినప్పుడు యేసు ఊరక యుండెను. ఏసు ఇట్లుండుటయు సముచితమే. ఏల యన యథార్థమైనమాట నచట నవశ్యముగఁ జెప్పియుండిన బాగుండెడిది. ఇట్లు తన గొప్పతనపుమాటల నెన్నియో చెప్పుకొనుట యతని కుచితముగాదు. యేసుపై వట్టినేరముమోపి చంపించుటకూడ వారి కుచితముగాదు. ఏమన యేసుపై మోపఁబడిన నేరము మరణదండనకు తగినదికాదు. వారు నవాగరికులై యుండిరికాన వారికి న్యాయమేమి తెలియును? కాన యేసు కాసీశ్వరుని

కుమారుఁడనని ప్రకటించుకొనకుండిన వారతనితో నింతకఠినముగ వర్తింపక పోదురు. ఉభయులకు శ్రేయస్కరమై యుండెడిది. కాని వారి కింతటివిద్య, ధర్మభావము, న్యాయశీలత్వము యెచటనుండి వచ్చును ? ॥౧౬॥

౧౭. యేసు అధిపతి యెదుట నిలిచినప్పుడు అధిపతి—యూదాదుల రాజువు నీవేనా అని ఆయన నడుగఁగా యేసు అతనిఁజూచి—నీవన్నట్టే అనెను. ప్రధాన యాజకులును, పెద్దలును ఆయనమీఁద నేరము మోపినప్పుడాయన ప్రత్యుత్తర మేమియు నీయలేదు. కాఁబట్టి పిలాతు—నీ మీఁద వీరెన్ని నేరములు మోఁపుచున్నారో నీవు వినలేదా అని ఆయన నడిగెను. అయినను ఆయన యొక్క మాటకైనను అతనికి ఉత్తరమీయ లేదుగనుక అధిపతి మిక్కిలి ఆశ్చర్యపడెను. పిలాతు-అలాగైన క్రీస్తనఁబడిన యేసు నేమిచేయుదునని వారినడుగఁగా-సిలువ వేయుమని అందఱు చెప్పిరి.........యేసును కొరడాలతో కొట్టించి సిలువవేయ నప్పగించెను. అప్పుడు అధిపతియొక్క రాణువవారు యేసును అధికారమందిరములోనికి తీసికొనిపోయి ఆయనయొద్ద తమ స్తోమమంతయు సమకూర్చిరి. వారు ఆయన వస్త్రములు తీసివేసి ఆయనకెఱ్ఱని అంగీతొడిగించి ముండ్ల కిరీటమునల్లి ఆయనతలకుపెట్టి యొకరెల్లు ఆయనకుడి చేతనుంచి ఆయన యెదుట మోకాళ్ళూని-యూదులరాజా ! నీకు శుభమని ఆయన నపహసించి, ఆయనమీఁద ఉమ్మివేసి, ఆరెల్లును తీసికొని దానితో ఆయనను తలమీఁదకొట్టిరి. ఆయన నపహసించిన తరువాత ఆయన మీఁదనున్న ఆ అంగీతీసి వేసి ఆయన బట్టలాయనకు తొడిగించి సిలువ వేయుటకు ఆయనను తీసికొనిపోయిరి. వారు కపాలస్థలమను అర్థమిచ్చుగొల్గొతా అనఁబడినచోటికివచ్చి చేఁదుకలిపిన ద్రాక్షారసము ఆయనకు త్రాగ నిచ్చిరిగాని ఆయనదాని రుచిచూచి త్రాగ నొల్లకపోయెను. అప్పుడు వారు ఆయనను సిలువ వేసిరి. ఆయన మీఁద మోఁపఁబడిన నేరము వ్రాసి ఆయనకుతలపైఁగా ఉంచిరి. మఱియు కుడివైపుననొకఁడును ఎడమవైపున నొకఁడును ఇద్దఱు దొంగలాయనతోకూడ సిలువ వేయఁబడిరి. ఆమార్గమున వెళ్ళుచుండిన వారు తలలూచుచు "దేవాలయమును పడఁగొట్టి మూఁడు దినములలో కట్టువాఁడా ! నిన్ను నీవే రక్షించుకొనుము. నీవు దేవుని కుమారుడవైన సిలువమీఁదనుండి దిగు" మని చెప్పుచు ఆయనను దూషించిరి. అలాగే శాస్త్రులును, పెద్దలును,

ప్రధాన యాజకులుకూడ ఆయన నపహసించుచు-"ఇతరులను రక్షించెను. తన్ను తానే రక్షించుకొనలేడు: ఇశ్రాయేలు రాజుగదా: ఇప్పుడు సిలువమీఁద నుండి దిగిన యెడలవాని నమ్ముదుము వాఁడు దేవునియందు విశ్వాసముంచెను. నేను దేవుని కుమారుఁడనని చెప్పెనుగనుక ఆయనకిష్టుఁడైన ఆయన యిప్పుడు వాని తప్పించు"నని చెప్పిరి. ఆయనతోకూడ సిలువవేయఁబడిన దొంగలును అలాగే ఆయనను నిందించిరి. మధ్యాహ్నము మొదలు కొని మూఁడు గంటల వఱకు ఆదేశమంతట చీకటి క్రమ్మెనుఇంచుమించుమూఁడుగంటలప్పుడుయేసు: "ఏలీఏలీలామా సబక్తానీ" అని బిగ్గఱగా కేక వేసెను ఆమాటకు నాదేవా నాదేవా! నన్నెందులకు చెయ్యివిడిచితి వన అర్థము. అక్కడ నిలిచియున్న వారిలో కొందఱామాట విని-ఇతఁడు ఏలీయాను పిలుచుచున్నాఁడనిరి వెంటనే వారిలో నొకఁడు పరుగెత్తిపోయి స్పంజీ తీసికొని సిరకాలో ముంచి కెల్లున తగిలించి ఆయనకు త్రాగ నిచ్చెను. తక్కినవారు 'ఊరకుండు'డి, ఏలియా అతనిని రక్షింప వచ్చునేమో చూత'మనిరి. ఏసు మరల బిగ్గరగా కేకవేసి ప్రాణము విడిచెను. మ: ౨౭. ౧౧-౧౨-౧౩-౧౪-౨౨-౨౩-౨౬-౨౮-౨౯-౩౦-౩౧-౩౩-౩౪-౩౫-౩౬-౩౮-౩౯-౪౦-౪౧-౪౨-౪౩-౪౪-౪౫-౪౬-౪౭-౪౮-౪౯-౫౦॥

స:-అదుష్టులు వ్యర్థముగ ఏసునకు చెరువు గలగ జేయుట నిజమే కాని ఏసునందును దోషముకలదు. ఏదన నీశ్వరున కొకఁడు పుత్రుఁడు లేఁడు. అతఁడొకనికి తండ్రియు కాఁడు. ఏలయన ఒకనికి తండ్రియైన వాఁడు మరొకనికి మామ, బావ, బంధువు-మొదలగువాఁడును గావలసివచ్చును. అర్యఁడు దడిగినప్పుడు యథార్థమైన యుత్తర మీయవలసి యుండెను. ఇఁక పూర్వము చూపబడిన యాశ్చర్యకరములగు కార్యములన్నియు సత్యములేని యిప్పుడు కూడ సిలువమీఁదినుండి దిగివచ్చి యందఱను తనశిష్యులుగాఁ జేసికొని యుండినను మరి అతఁడీశ్వరుని పుత్రుఁడేయయిన నీశ్వరుఁడతనిని కాపాడక యుండునా? అతఁడు త్రికాలజ్ఞుఁడుగానున్న పిత్తము కలసియున్న సిర్కాను రుచిచూచి విడుచుటెందులకు? పూర్వమే తెలిసికొని యుండెడివాఁడు. ఇక మహిమగలవాఁడే యయిన ఆఱచి యఱచి ప్రాణత్యాగమేల చేసియుండును? కాన నెవఁడెంత చాతుర్యముల నగుపఱచినను తుదకు సత్యము సత్యమే.

అసత్య మసత్యమే యగునని యెఱుగఁదగును. కాని ఇఁక నక్కాలపు టదవి మనుష్యులలో యేసు కొంత మంచివాఁడయి యుండెనే కాని, యతఁడు మహిమగలవాఁడు గాని. ఈశ్వర పుత్రుడుఁగానీ విద్వాంసుఁడగానీ కాకుండె ననియు దీనివలన సిద్ధమైనది. అటులేయుండిన నతఁడిట్టి దుఃఖము నేల యను భవించియుండును ? ॥౨౬॥

౨౮. సర్వేశ్వరునిదూత పరలోకమునుండి దిగివచ్చి ఱాయిపొర లించి దానిమీఁద కూర్చుండెను. అప్పుడు మహాభూకంపము కలిగెను. ఆయన యిక్కడలేఁడు. తాను చెప్పినట్టే లేచియున్నాఁడు ఆయ.. శిష్యుల కావర్త మానము తెలుప పరుగెత్తుచుండఁగా యేసు వారి నెదుర్కొని మీకు శుభమని చెప్పెను. వారు ఆయన యొద్దకు వచ్చి ఆయన పాదములఁబట్టి ఆయనకు మ్రొక్కిరి. అంతట యేసు భయపడకుఁడి. మీరు వెళ్ళి నాసహోదరులు గలిలయ్యకు వెళ్ళవలెననియు వారక్కడ నన్ను చూతురనియు వారికి తెలుపుఁడనెను. పదునొకండుమంది శిష్యులు యేసు తమకు నిర్ణయించిన గలి లయ్యలోని కొండకువెళ్ళిరి. వారు ఆయనను చూచి ఆయనకు మ్రొక్కిరి. గాని కొందరు సందేహించిరి. యేసు వారి యొద్దకు వచ్చి పరలోకమందును, భూమి మీఁదను నాకు సర్వాధికార మీయబడినదని వారితో చెప్పెను. ఇదిగో నేను యుగసమాప్తి పర్యంతము సర్వదా మీతోకూడ నున్నాను.

మ. ౨౮. ౨-౬-౯-౧౦-౧౬-౧౮-౧౯-౨౦॥

స:- ఈ మాటకూడ సృష్టి క్రమమునకును. విద్యకును విరుద్ధ మగుట వలన నమ్మదగినదికాదు. మొదట నీశ్వరునియొద్ద దూత యుండురు. వారి నటునిటుఁ బంపును, మీదినుండి దిగుదురని ఒక తహసీలుదారు కలెక్టరువలె ఈశ్వరుని చేసిరాఏమి ? యేసు అదే శరీరముతో స్వర్గమునకుఁబోయి బ్రతి లేచెనా: స్త్రీలతని పాదములుపట్టి మ్రొక్కి నప్పుడు శరీరమదియే యుండినదా మూఁడుదినములకే యది క్రుళ్ళిపోలేదెందులకు ? తన నోటితో సర్వాధికారి ననుట కేవల దంభాలాపమే అట్లే శిష్యులతోఁ గలిసెను, వారితో మాట లాడెను. ఆనువార్త లసంభవములే. ఈమాటలన్ని యథార్థములేని ఇప్పుడు

ఇట్లు సువార్తలో మత్తయి వ్రాసినదాని సమీక్ష వ్రాయఁబడినది. ఇఁక మార్కుచే లిఖియింపఁబడిన దానిఁగూర్చి వ్రాయఁబడును. ||౮౮||

## మార్కు సువార్త

౮౯. ఇతఁడు వడ్రంగికాఁడా? 　　మార్కు: ౬:౩||

సః-యథార్థముగ యోసేపు వడ్రంగియయి యుండెను. కావున యేసు కూడ వడ్రంగియె. అతఁడెన్నియో సంవత్సరములవఱకు వడ్రంగము చేయుచుండెను. ఆటువెనుక (పైగంబరు) ప్రవక్తగా మాఱి తన కీర్తియని కుమారుఁడయదేయి కూర్చుండెను. దన దేవవిమనుష్యుల సాక్షీసులఁగుఱపంనదే గదా తండమును సాగించుకొనఁగలిగినది. కొసికోసి పనిఁజేయుట యతని వృత్తి యెగా. ||౮౯||

## లూకా సువార్త

౯౦. అందులకు యేసు నేను సత్పురుషుఁడనని ఏల చెప్పుచున్నావు? దేవుఁ డొక్కఁడే తప్ప మఱియెవఁడును సత్పురుషుఁడు కాఁడు. లూ: ౧౮: ౧౯||

సః-అద్వితీయుఁడైన పరమేశ్వరుఁ డొక్కఁడేయని యేసు చెప్పుచుండగా సిక్కైస్తవులు పవిత్రాత్మ, పిత, పుత్రులను మువ్వుర నెక్కడి నుండి కల్పించిరి? ||౯౦||

౯౧. హేరోదునొద్దకు ఆయనను పంపెను. హేరోదు యేసునుచూచి మిక్కిలి సంతోషించెను. ఆయననుగూర్చి పెక్కు సంగతులు విన్నందున ఆయన యేదైన నొక సూచకక్రియను చేయఁగా చూడ నిరీక్షించి బహుకాలమునుండి చూడఁగోరెను. ఆయనను చూచినప్పుడు చాలమాటలతో ప్రశ్నలు వేసినను అతని కుత్తర మేమియు నీయలేదు.

లూ: ౨౩. ౮-౯||

సః-కనుక మత్తయి సువార్తలో లేదు గాన నీసాక్షులు విరోధాభిప్రాయులైరి. పిలయాతు సాక్షులు సమానాభిప్రాయులై యుండవలసి యుండెను. యేసు చతురుఁడు, మహిమగలవాఁడు నయియున్న తత్క్షణమే హేరోదునకు ఉత్తరమిచ్చి సిద్ధులనుగూడ చూపియుండును. దీనివలన యేసునందు విద్యకాని, యొకసిద్ధిగాని యించుకమాత్రము లేకుండెననియె విదితమగుచున్నది ||౯౧||

## యోహాను సువార్త

౯౨. ఆదియందు వాక్యముండెను. వాక్యము దేవునియొద్దనుండెను. వాక్యము దేవుఁడై యుండెను. ఆవాక్యము ఆదియందు దేవుని యొద్ద నుండెను. సమస్తమును ఆయనమూలముగా కలిగెను. కలిగియున్నదేదియు ఆయన లేకుండఁ గలుగలేదు. ఆయనలో జీవముండెను. ఆజీవము మనుష్యులకు వెలుగై యుండెను. యో: ౧: ౧-౨-౩-౪॥

స:—ఆదియందు పలుకువాఁడే లేకున్న వచన ముండనేరదు. వచనమీశ్వరుని యొద్దనుండెనన్న నట్లు చెప్పుట వ్యర్థమయ్యెను. మఱి వచనమెప్పటికైన పరమాత్మ కా జాలదు. ఏలనన అది ఆదియందు ఈశ్వరుని యొద్ద నుండెనన్న తెలుప వచనముండెనా? లేక ఈశ్వరుఁడా? అన్వయించుట లేదు. కారణ మంతనంతవఱకు వచనముద్వారా సృష్టి యెప్పటికిని గాఁజాలదు. వచనముతోఁ బనిలేక నిర్తమానముగా సృష్టిని జేయఁగలుగును. మరి జీవమనసెద్ది? అది దేనియందుండెను? ఈ వచనమువలన జీవము అనాదినుండి యున్నదని యొప్పుకొందుముగద. అనాదియము అయ్యేదేది ఆదాము ముక్కుతొట్టలో నూపిరి యూదుట మిథ్యయయ్యెను. జీవము మనుష్యులకే వెలుఁగు అయ్యెనా? పశ్వాదులకు కాలేదా? ॥౯౨॥

౯౩. వారు భోజనము చేయుచుండఁగా ఆయన నప్పగింపవలెనని సీమోను కుమారుఁడగు ఇస్కరియోతు యూదా హృదయములో సైతాను ఇంతకుముందు ఆలోచన పుట్టించియుండెను. యో. ౧౩: ౨॥

స:—ఈ మాట సత్యముకాదు. ఏమనఁగా సైతానే యందఱను బురికొలుపునన్న నాసైతాను నెవరు పురికొలుపుచున్నారని క్రైస్తవులనడుగవలెను. సైతాను తనంతటతానే పురికొనునన్న మనుష్యులు సైతమును తమ్ముతామే పురికొనఁగలుగుదురు. సైతానన నవసరమేమి? సైతానును సృజించినవాఁడు, పురికొలుపువాఁడు, పరమేశ్వరుఁడేయైన నీ క్రైస్తవుల దేవుఁడే ఆ సైతానునకు సైతానై నిలుచును. ఏమియనఁగా నతఁడే యాసైతానుద్వారా యందఱను బురికొలిపించును. సరి! ఇవి యీశ్వరుని పనులు కాఁగలవా? క్రైస్తవుల పుస్తకము ఈశ్వరకృతమనియు. యేసు ఈశ్వర కుమారుఁడనియు కల్పించినవారే సైతానులై యుండుదురుట నిశ్చ

యము కాని ఇది ఈశ్వరకృతముకాదు. ఇందుఁ జెప్పబడినవాఁ డీశ్వరుఁడు
గాని, యేసు ఈశ్వరుని కుమారుఁడు గాని కాఁజాలరు. ॥౯౩॥

౯౪. మీ హృదయము కలవరపడనీకుఁడి; దేవునియందు విశ్వాస
ముంచుచున్నారు. నాయందును విశ్వాసముంచుఁడి. నా తండ్రియింటిలో ననేక
నివాసములు కలవు, లేని పక్షమున మీతో చెప్పుదును; మీకు స్థలము సిద్ధపఱుప
వెళ్ళుచున్నాను. నేను వెళ్ళి మీకు స్థలము సిద్ధపఱచినపుడు నేనుండు స్థలములో
మీరుండులాగున మరలవచ్చి నాయొద్దనుండుటకు మిమ్మును తీసికొని పోవు
దును. యేసు అతనిచూచి నేనే మార్గమును, సత్యమును, జీవమునై యున్నాను.
నాద్వారానేకాని యెవఁడును తండ్రియొద్దకు రాఁడు. మీరు నన్నెఱిఁగియున్న
నాతండ్రి నెఱిఁగియుందురు. యో. ౧౪: ౧-౨-౩-౪-౬-౭॥

స:- ఇప్పుడు చూడుఁడు: యేసు వాక్యములు పోపులీలకంటె నేమైన
తక్కువగానున్నవా: ఇట్టి వాక్యములను రచియించుచున్న నతని మతమందెవరు
చిక్కుకొందురు: యేసు తనతండ్రిని గుర్తెగానియున్నాఁడా: అతఁడేసువా
మందున్నచో పరాధీనుఁడగుట వలన నతఁడీశ్వరుఁడేకాఁడు. ఏలయన నీశ్వ
రుఁడొకని వాక్యహాయము [సహాయము] వినఁడు. యేసునకుఁ బూర్వమెవ్వఁ
డును నీశ్వరునిఁ బొందకుంటెనా: ఇట్లు స్థానాదుల ప్రలోభము కలిగించుచు
తన నోటితో తానే సత్యమార్గమును, జీవనమును గలవాఁడనని చెప్పుకొను
వాఁడు వట్టి దాంభికుఁడే యగుఁదును. కాన నీ మాట యెన్నఁటికిని సత్యము
కాఁజాలదు. ॥౯౪॥

౯౫. నేను చేయుక్రియలు నాయందువిశ్వాసముంచువాఁడునుచేయును.
వానికంటె గొప్పవికూడ అతఁడు చేయునని మీతో యథార్థము చెప్పుచున్నాను.
యో. ౧౪. ౧౨॥

స:- ఇప్పుడు చూడుఁడు: యేసునందు పూర్ణవిశ్వాసము కలిగియున్న
క్రైస్తవులు పీనుఁగులను బ్రతికించుట మున్నగు పనులఁ జేయలేరెందులకు:
విశ్వాసము కలిగియుండియు నాశ్చర్యము గొలుపు కార్యములఁ జేయలేరేని
యేసు నయితమట్టి కార్యములఁ జేయకుండెననియె గట్టిగఁ జెప్పవచ్చును.
ఏమన యేసుతానే "మీరును నాశ్చర్యము గొలుపు కార్యములను చేయవచ్చు
ననుచున్నాఁడు." అట్లయిన నిప్పుడు క్రైస్తవులొకరైన వానిని చేయలేరేని

యేసు పీనుఁగులను బ్రతికించుచుండెను. అను నిత్యాదిమాటలు జ్ఞాన విహీనుఁడుతప్ప మఱి యెవ్వఁడంగీకరింపఁ గలఁడు? ॥౯౭॥

౯౮. అద్వితీయ సత్యదేవుఁడై నవాఁడవు. యో: ౧౭: ౩॥

స:- అద్వితీయుఁడయిన ఈశ్వరుఁ డొక్కఁడేయైన క్రైస్తవులు చెప్పెడు త్రిత్వమబద్ధము. ॥౯౮॥

ఇట్లే సువార్తలలోననేక స్థలముల విరుద్ధ విషయములు నిండియున్నవి.

## యోహాను ప్రకటన వాక్యములు

ఇఁక యోహాను అద్భుత వాక్యముల నాలకింపుఁడు :-

౯౯. తమ తలలమీఁద సువర్ణ కిరీటములు పెట్టుకొన్నవారై కూర్చుండిరి. మఱియు ఆ సింహాసనము ఎదుట ఏడు దీపములు ప్రజ్వలించుచున్నవి. అవి దేవుని యేడాత్మలే. మఱియు ఆ సింహాసనము నెదుట స్ఫటికమును పోలిన గాజువంటి సముద్రమున్నట్లుండెను. ఆ సింహాసనముకు మధ్యను సింహాసనముచుట్టు ముందు వెనుక కన్నులతో నిండిన నాలుగు జీవులుండెను.

యో. ప్ర. ౪. ౪-౫-౬॥

స:- ఇఁక జూడుఁడు! క్రైస్తవుల స్వర్గ మెంత నగరమువలెనున్నది. వీరి యీశ్వరుఁడును దీపాగ్నివలె నున్నాఁడు. సువర్ణ కిరీటాది భూషణములను ధరించుటయు, వెనుకముందు నేత్రములుకల్గియుండుటయు అసంభవము. ఈ మాటల నెవరొప్పుకొనఁ గలుగుదురు? అచ్చట సింహాది మృగములుకూడ నాలుగుండెనని వ్రాసియున్నారు. ॥౯౯॥

౧౦౦. మఱియు లోపలను, వెలుపలను వ్రాఁతకలిగి యేడుముద్రలు గట్టిగా వేసియున్న యొక గ్రంథము సింహాసనముమీఁద కూర్చుండు వాని చేతఁజూచితిని. దానిముద్రలుతీసి ఆ గ్రంథము విప్పుటకు యోగ్యుఁడైన వాఁడెవఁడు?... ........పరలోకమందుఁ గాని భూమి మీఁదఁగాని భూమి క్రిందఁగాని ఆ గ్రంథమును విప్పుటకైన. చూచుటకైన నెవనికిశక్తి లేక పోయెను. ఆ గ్రంథము విప్పుటకు చూచుటకును యోగ్యుఁడెవఁడును కనఁబడ నందున నేను మిక్కిలి యేడ్చుచుండఁగా............

యో. ప్ర. ౫. ౧-౨-౩-౪॥

స:- ఆహా! క్రైస్తవుల స్వర్గమందు సింహాసనములు, మనుష్యుల సొగసులు ననేకముద్రలతో నిండిన పుస్తకము నుండుట, ఆ పుస్తకమును స్వర్గమందును, భూమిమీఁదను విప్పిచూచుటకును తగినవాఁడెవఁడును చిక్కక పోవుట అను మాటలు కనుగానుఁడు: యోహాను ఏడ్చుచుండఁగా దానిని యేసే విప్పునని యొక ప్రాచీనుఁడు చెప్పెనఁట. ప్రయోజనమేమన వివాహమెవనిదో పాటయు నతనిఁ గూర్చియె యుండును గదా: ఇట్లు యేసునందే మాహాత్మ్య మంతయు నారోపింపఁబడినది. కాని యివన్నియు వట్టిమాటలే. ॥౯౮॥

౯౯. మఱియు సింహాసనమునకు, ఆ నాలుగుజీవులకు పెద్దలకు మధ్య వధింపబడినట్లుండిన గొర్రెపిల్ల యొకటి నిలిచియుండఁగా చూచితిని. దాని కేడుకొమ్ములు నేడుకన్నులునుండెను. ఆ కన్నులు భూమియంతటికి పంపఁబడిన దేవుని యేడాత్మలు. యో. ప్ర. ౫-౬॥

స:-ఇప్పుడీ యోహాను స్వప్నమందలి మనోవ్యాపారమును చూడుఁడు: ఆ స్వర్గమున నందఱు క్రైస్తవులును, నాలుగు పశువులును, యేసు నయి తము నుండి యితరులెవ్వరును లేనట్లున్నది. ఇఁక యేసునకిచ్చట రెండు నేత్రములు మాత్రమేయుండెను. కొమ్ములసేరుకూడలేదు కాని స్వర్గమున కేగిన తరువాత నేడుకన్నులు, నేడుకొమ్ములును కలవాఁడయ్యెను ఇది గొప్ప యద్భుతమే. ఈశ్వరుని యా యేడాత్మలే యేసు నేత్రములు, కొమ్ములు నయ్యెనట. అకటా! ఇట్టిమాటలను క్రైస్తవులెట్లు నమ్మియున్నారోగా? వారు కొంచెమైన నాలోచింపవలసియుండెను. ॥౯౯॥

౧౦౦. ఆయన పుస్తకమును తీసికొనినప్పుడు ఆనాలుగు జీవులును, వీణెలును ధూప ద్రవ్యములతో నిండిన సువర్ణపాత్రలను పట్టుకొనియున్న ఆ యిరువది నలుగురు పెద్దలును ఆ గొఱ్ఱెపిల్ల యెదుట సాగిలపడిరి.

యో. ప్ర. ౫: ౮॥

స:- సరి: యేసు స్వర్గమందు లేకున్నపుడు వీరుధూపదీప నైవేద్య హారతి మొదలగు పూజ లెవనికి సలుపుచుండవచ్చును: ఇచ్చట ప్రొటెస్టెంటు క్రైస్తవులు విగ్రహారాధనను నిరాకరించుచున్నారుగాని వీరిస్వర్గము మాత్రము విగ్రహారాధన కిల్లయి యున్నది. ॥౧౦౦॥

౧౧౧. ఆ గొఱ్ఱెపిల్ల ఏడుముద్రలలో మొదటిదానిని విప్పినప్పుడు నేను చూడఁగా ఆనాలుగు జీవులలో నొకటి-రమ్మని యురుమువంటి స్వరముతో చెప్పుట వింటిని. మఱియు నేను చూడఁగా నొకతెల్లని గుఱ్ఱము కనఁబడెను. ఒకఁడు విల్లుపట్టుకొని దానిమీఁద కూర్చుండియుండెను. ఆయనకొక కిరీట మీయఁబడెను. ఆయన జయించువాఁడును తాత్పర్యముతో జయశాలిగా బయలువెళ్ళెను. ఆయన రెండవ ముద్ర విప్పినప్పుడు ఎఱ్ఱనిదైన వేరొక గుఱ్ఱము బయలువెళ్ళెను. భూలోకములో సమాధానము లేకుండచేయుటకు వాని కధికార మియ్యఁబడెను. ఆయన మూఁడవ ముద్రవిప్పినప్పుడు ఒక నల్లని గుఱ్ఱము కనఁబడెను. ఆయన నాలుగవముద్ర విప్పినప్పుడు పాండు వర్ణముగల గుఱ్ఱము కనఁబడెను. దానిమీఁదఁ గూర్చున్న వాని పేరు మృత్యువు. ఇత్యాదులు. యో. ప్ర. ౬. ౧-౨-౪-౫-౭-౮॥

స:—ఇప్పుడు చూడుఁడు! ఇది పురాణములను మించిన మిథ్యాలాపమా, కాదా? ఔరా! ఆపుస్తక బంధనములను ముద్రలలో గుఱ్ఱపు రౌతు లెట్లుండఁ గలిగిరో కదా! ఈ స్వప్నాలాపములను గూడ సత్యమని నమ్మిన వారి యుపదేశమునందు పట్టుబడినను అటువలయేగదా! ॥౧౧౧॥

౧౧౨. వారు—నాథా! సత్యరూపీ! పరిశుద్ధుఁడా! ఎందాక తీర్పు చేయకయు, మా రక్తము నిమిత్తము భూనివాసులకు ప్రతిదండన చేయకయు నుండుదవని బిగ్గఱగా కేకలువేసిరి. తెల్లని వస్త్రము వారిలో ప్రతివాని కీయఁబడెను; మఱియు వారివలెనే చంపఁబడఁబోవువారి సహదాసులయు సహోదరులయు లెక్క పూర్తియగు పర్యంతము ఇంక కొంచెము కాలము విశ్రమింపవలెనని వారితో చెప్పఁబడెను. యో. ప్ర. ౬. ౧౦-౧౧॥

స:—క్రైస్తవులిటువంటి న్యాయముకొఱకేకద యట చెఱసాల వంటి ఇబ్బందిలోఁ బడియుండి యేడ్చుచుండురు. వేదమార్గమును స్వీకరించు వానికి న్యాయము తక్షణమేయగును. ఇప్పుడీశ్వరుని కార్యాలయము (కచ్చేరి) మూయఁబడియున్నదా? విమర్శింపవలసిన పనిలేక న్యాయాధీశులును నిష్క్రియులై యున్నరా యేమి? అని యీక్రైస్తవుల నడుఁగవలయును. సరియైనయుత్తరమేమియుఁ జెప్పఁజాలకపోదురు వీరి యీశ్వరునికిఁగూడ మత్సరము కలుగుచుండును. ఏమన వీరిప్రార్థనల ప్రకారము తక్షణమే వీరిశత్రువులను పీడింప

యీశ్వరుఁడు రాత్రియందు నిద్రకూడ పోఁడుగద. పడుచునేని రాత్రియందు పూజలెట్లు చేయఁగలుగుదురు? అట్లనని నిద్రపట్టఁగమును గలుగవచ్చును. ఇఁక దివారాత్రములు మేల్కొను చుండునేని విశిష్ఠుఁడో, అతిరోగియో యైపో వచ్చును. ॥౧౦౫॥

౧౦౬. మరియు సువర్ణ ధూపార్తి చేఁబట్టుకొనియున్న వేరొక దూత వచ్చి బలిపీఠము నెదుట నిలువఁగా అతనికి బహుధూప ద్రవ్యము లియ్యఁబడెను. అప్పుడాధూప ద్రవ్యములపొగ పరిశుద్ధుల ప్రార్థనలతో కలసి దూతచేతిలోనుండి పైకిలేచి దేవుని యెదుటికి చేరెను. ఆదూత ధూపార్తి తీసి కొని బలిపీఠముపైనున్న నిప్పులతో దానినింపి భూమిమీఁద పడవేయఁగా ఉరుములు. ధ్వనులు. మెఱుపులు భూకంపమును కలిగెను.

యో. ప్ర. ౮. ౩. ౪. ౫॥

స:—ఇఁక చూడుఁడు! స్వర్గమందును వేదిక, ధూపదీప నైవేద్యములు, బూరగొమ్ము నాదములు గలవుగా! అటులేని బైరాగుల మందిరముకంటె నీ క్రైస్తవుల స్వర్గము తక్కువైనదా? కొంత యల్లరి యెక్కువగానే యుండును. ॥౧౦౬॥

౧౦౭. మొదటిదూత బూర యూఁదినప్పుడు రక్తముతో మిశ్రమైన వడగండ్లును. అగ్నియు పుట్టి భూమిపైన పడవేయఁబడెను. అందువలన భూమిలో మూఁడవభాగము కాలిపోయెను. యో. ప్ర. ౮॥

స:— భళిరే క్రైస్తవుల భవిష్యద్వక్తా! నీయీశ్వరుఁడు నీ యీశ్వర దూతలుఁ బూరలగోలలు ప్రళయలీలలు అనునవి కేవలము పిల్లలయాటలే యని తేటపరుచున్నవి గదా! ॥౧౦౭॥

౧౦౮. అయిదవదూత బూర ఊదినప్పుడు ఆకాశమునుండి భూమి మీఁద రాలిన యొకనక్షత్రమును చూచితిని. పాతాళపుగుంటవు తాళపు చెవి వానికీయబడెను: అతడు పాతాళపుగుంటము తెఱవఁగా పెద్ద కొలిమిలో నుండి లేచుపొగవంటిపొగ అగుంటములోనుండి లేచెను. ఆ గుంటపు పొగచేత సూర్యుని. ఆకాశమును చీకటికమ్మెను. ఆపొగలోనుండి మిడుతలు భూమి మీఁదికివచ్చెను. భూమిలోనుండు తేళ్ళకు బలమున్నట్టువానికి బలమియ్యఁబడెను. మరియు నొసళ్ళయందు దేవుని ముద్రలేని మనుష్య

లను అయినను సెలలవఱకు బాధించుటకు వానికి అధికారమును ఆజ్ఞయు నియ్యఁబడెను.

యో. ప్ర. ౯. ౧. ౨. ౩. ౪. ౫॥

స:—ఏమి! తూరాదారం శబ్దము విని నక్షత్రము లాదూరం మీఁద నా స్వర్గమందే పడవచ్చునా? ఇక్కడమాత్రము పడలేదు. మంచిది. ఆ గుంతమునుగాని, మిడుతలనుగాని ప్రళయముగావించుటకే ఈశ్వరుఁడు చేసి యుంచెనా? ముద్రగలవారిని గఱవవలదని యవి ముద్రలు చూచి చదువు కొనునా? ఇది "మీరు క్రైస్తవులుగారేని మిమ్ములను మిడుతలుకరుచు" నవి లయము ఱూపి సామాన్యజనులను క్రైస్తవులలో గలుపుకొనుటకు దప్పిన దక్కులే. ఇట్టిమాటలు విద్యాశూన్యమగు దేశమందు సాగునేకాని యార్యావర్తమందు సాగనేరవు. ప్రళయ మన్లేయగునా? ॥౧౦౮॥

౧౦౯. గుఱ్ఱపు రౌతుల సైన్యముల లెక్క ఇరువది కోట్లు.

యో. ప్ర. ౯. ౧౬॥

స:—అహో! ఇన్ని గుఱ్ఱములు స్వర్గమున నెట్లుండగలుగునో అవి యెచ్చట మేయునో? ఎచ్చట నివసించునో? ఎచ్చట లద్దెపెట్టునో గద! ఇవదాని దుర్గంధముగూడా స్వర్గమున విశేషము వ్యాపించియుండును. చాలు చాలు. ఇట్టిస్వర్గమునకు, ఈ దేవునికి ఈనాటి మతమునకు అయ్యల మంవరము నీళ్ళు వదలి యున్నారము. సర్వశక్తిమంతుని కృపవలనఁ క్రైస్తవులందలి యీ గందరగోళమంతయు దూరమై పోయిన నెంతయో మేలౌనగూర వచ్చును. ॥౧౦౯॥

౧౧౦. బలాఢ్యుఁడైన వేరొకదూత పరలోకమునుండి దిగి వచ్చుట చూచితిని. ఆయనశిరస్సుమీద మేఘము ఇంద్రధనుస్సునుండెను ఆయన ముఖము సూర్యబింబమువలె, ఆయన పాదములు అగ్నిస్తంభమువలె నుండెను. ఆయన తనకుడిపాదము సముద్రము మీదను ఎడమ పాదము భూమి మీదను మోపెను.

యో. ప్ర ౧౦. ౧. ౨. ౩॥

స:—ఇప్పుడు చూడుఁడు! ఈ దూతలకథలు పురాణగాథలను బట్టుల పొగడ్తలనుగూడా మీరియున్నవి. ॥౧౧౦॥

౧౧౧ మరియు నాకొకఁడు చేతికఱ్ఱ నాకిచ్చి—నీవులేచి దేవుని యాలయమును, బలిపీఠమును కొలతవేసి యాలయములో పూజించువారిని లెక్కపెట్టుము. యో. ప్ర. ౧౧. ౧॥

స:—ఇక్కడనేకాదు క్రైస్తవుల స్వర్గమందును మందిరములునిర్మింపబడుటకు కొలతవేయఁబడుచున్నదిగా ! వారిస్వర్గమెట్లున్నదో వారిమాటలు నట్లేయున్నవి. ఇందువలన నిచట ప్రభుభోజనకాలమున నేసుశరీరావయవములను రక్తమాంసములని భావించి తినుచుఁ ద్రాగుచున్నారు. ఇఁకవీరు గుడిలోఁ గూడ* సిలువయాకారముల జేసియుండుట నయితము ప్రతిమారాధనయే యనవొప్పును. ॥౧౧౧॥

౧౧౨. మరియు పరలోకమందు దేవుని యాలయము తెఱువఁబడఁగా దేవుని నిబంధనము ఆయన ఆలయములోకనఁబడెను. యో. ప్ర. ౧౧. ౧౯॥

స:—స్వర్గమందుఁగల మందిరమెల్లప్పుడు మూయఁబడియేయుండును గాఁబోలు. అదియెప్పటో యొకప్పుడు తెఱువఁబడుచుండ వచ్చును. ఏమి ! పరమేశ్వరునికికూడా నొకమందిరముగలదనుట సంభవమా ! వేదమందుఁ జెప్పఁబడినట్లు పరమాత్ముఁడు సర్వవ్యాపకుఁడుగాన నతనికొక మందిరము కలదనుట సంభవమేకాదు. కాని క్రైస్తవుల ఈశ్వరుఁడు సాకారుఁడు గదా ! అతఁడు స్వర్గమందో భూమిమీదనో యొక్కడనున్న నేమి ! ఏప్రకారముగ నిట 'తంతంపూఁ పూఁ' లీలలు జరుగుచున్నవో యటులే యాక్రైస్తవుల స్వర్గమందును జరుగుచుండవచ్చును. అప్పుడప్పుడువారా నిబంధన మందసమును గూడ చూచుచుండవచ్చును. ఇఁక దానినుండి యేమిప్రయోజనము నెఱవేర్చు కొందురో తెలియదుగా. సత్యమేమన నివన్నియు మనుష్యులను లోభమునఁ బడవేయు మాటలే యనుమాట స్పష్టము. ॥౧౧౨॥

౧౧౩. అప్పుడు పరలోకమందు గొప్పవింత కనఁబడెను. అదేమనఁగా సూర్యుని ధరించుకొనిన యొకస్త్రీ కనఁబడెను. ఆమె పాదముల క్రింద చంద్రుఁడును, శిరస్సుమీఁద పండ్రెండు నక్షత్రముల కిరీటమును ఉండెను. ఆమె గర్భిణియైన ప్రసవవేదన పడుచు ఆ నొప్పులకు కేకలు వేయుచుండెను.

* క్రైస్తు లేక దానిని నిలువుగా నుంచి దానికడ్డముగా నొకదానిని లేక క్రైస్తునుంచుట 'సిలువయాకార' మనఁబడును.

అంతట పరలోకమందు నొకవింత కనఁబడెను. ఇదిగో యెఱ్ఱని మహాఘట సర్పము: దానికి ఏడుతలలు, పదికొమ్ములు నుండెను. దాని తలమీద ఏడు కిరీటములుండెను. దానితోఁక ఆకాశ నక్షత్రములలో మూఁడవభాగము నీడ్చి వానిని భూమిమీద పడవేసెను. యో. ప్ర. ౧౨. ౧. ౨. ౩. ౪॥

స:— ఈ గొప్ప కట్టుకథల నెవ్వరు చూడుఁడు! వీరి స్వర్గమున నొకానొక స్త్రీ కేకలుపెట్టుచుండఁగా ఆమె దుఃఖమును వినువారుగాని దూరపఱచు వారుగాని లేరైరి. ఆ యజగరముతోఁక యెంత నిడివి గలిగియుండెనో కాని నక్షత్రములలో మూఁడవభాగమును దానితో భూమిమీఁద పడవైచెనుగా! మఱి పృథివియనునదొక చిన్నలోకము. నక్షత్రము లంతకంటె గొప్పలోకములు. అట్టి నక్షత్రము లీభూమిమీఁద నొకటికూడఁ బట్టదాండు. కాఁబట్టి వానిలోని మూఁడవభాగ మీ మాటను కల్పించినవాని యింటిమీఁదనే పడియుండి వచ్చునని యనుమానింపఁదగియున్నది. ఇఁక నక్షత్రములలోని మూఁడవ భాగమును తన నిడివిగల తోఁకతో చుట్టి భూమిమీఁద బడవైచిన ఆయజగరము కూడ తన యింటియందే నివసించుచుండ వచ్చును.

౧౧౪. అంతట పరలోకమందు యుద్ధము జరిగెను. మీఖాయేలును, అతని దూతలును ఆఘటసర్పముతో యుద్ధము చేయవలెనని యుండఁగా ఆ ఘటసర్పమును, వాని దూతలును యుద్ధము చేసిరి. యో. ప్ర ౧౨. ౭ ౮॥

స:— ఈ క్రైస్తవుల స్వర్గమున కేగు ప్రతివాఁడు యుద్ధమందు దుఃఖమును పొందుచుండవచ్చును! అట్టి స్వర్గముమీఁది యాశ విడ్చుటనే విరిచి చేతులు జోడించుకొనుఁడు. ఏమన శాంతికి భంగమును, ఉపద్రవమును గలుగఁజేయుస్థానమీ క్రైస్తవులకే తగును. ॥౧౧౪॥

౧౧౫. కాఁగా సర్వలోకమును మోసపుచ్చుచు అపవాది యనియు సైతానని యు పేరుగల పురాతన సర్పమైన ఆ మహాఘట సర్పము పడద్రోయఁబడెను. యో. ప్ర. ౧౨. ౯॥

స:— ఏమి, ఆసైతాను స్వర్గమందుండినప్పుడు లోకులను మోసపుచ్చు చుండలేదా? వాని నా మరణాంతము కారాగారమందో లేక చంపి యో వేయ లేరెందులకు? వానిని భూమిమీఁద నేలఁబడవైచెను? ఇఁక లోకుల సందఱను భ్రమింపఁజేయునది సైతానేని సైతానును భ్రమింపఁజేయువాఁడెవఁడు? సైతాను

తనంతటతానే భ్రమపడునన్న సైతాను లేకపోయినను భ్రమపడువారు పడనే పడుదురు. ఇట్టి యీశ్వరుఁడా సైతానును భ్రమింపఁజేయునన్న నతఁడీశ్వరుఁడే కానేరఁడు. మఱి దీనివలన క్రైస్తవుల యీశ్వరుఁడుకూడ సైతానునకు భయపడవచ్చునని విదిత మగుచున్నది. ఏమనఁగా యీశ్వరుఁడు సైతానుకంటె మించినవాఁడేని యపరాధము చేయునపు డా సైతానును శిక్షింపలేదెందులకు? క్రైస్తవుల యీశ్వరుని రాజ్యమా సైతానురాజ్యములోనొక సహస్రాంశమైనను లెక్కకురాదు. ఇందువలననే క్రైస్తవుల ఈశ్వరుఁడా సైతానును తొలఁగింపలేక పోవచ్చును. ఇక్కాలపు రాజ్యాధికారులయిన క్రైస్తవులు, బందిపోటు దొంగలు మున్నగువారిని బట్టి తక్షణమే శిక్షించునట్లును నీ క్రైస్తవుల ఈశ్వరుఁడు శిక్షింపకుండెనని తెలుపడుచున్నది. కావున వైదిక మతమును విడిచిపెట్టి యీ క్రైస్తవుం వట్టి కల్పిత మతమును స్వీకరించునట్టి బుద్ధిహీనుఁడెవఁడుండును?

౧౧౮. పృథివి సముద్రముల నివాసులారా! శోకము. ఎందుకన అపవాది మీయొద్దకు దిగివచ్చియున్నాఁడు. యో. ప్ర. ౧౨. ౧౨॥

స:—ఏమి: ఆ యీశ్వరుఁడక్కడికి మాత్రమే స్వామియు రక్షకుఁడునై యున్నాఁడా? పృథివికిని, మనుష్యాది ప్రాణులకును రక్షకుఁడును స్వామియుఁగాఁడా? భూమికి నతఁడే రాజయినచో నా సైతానునేల చంపలేకపోయెను? సైతాను లోకులనందఱను భ్రమింపఁజేయు చున్నను ఈశ్వరుఁడూరకచూచుచుండునేకాని వానివి తొలఁగింపలేడు. కాన మంచియీశ్వరుఁ డొకఁడును; సమర్థుఁడయిన దుష్టుఁ డగు నీశ్వరుఁడు మఱొకఁడు నున్నట్లు విదితమగుచున్నది.

౧౧౯. మఱియు నలుబదిరెండు నెలలు (తనకార్యము) జరుపుటకధికారము దానికేర్పాటాయెను. కనుక దేవుని నామమును, ఆయన గుడారమును, పరలోక నివాసులను, దూషించుటకై దేవుని దూషింపవలెనని యది తన నోరు తెరచెను. మఱియు పరిశుద్ధులతో యుద్ధముజేయను. వారినిజయింపను దానికధికార మీయఁబడెను. ప్రతిగోత్రము మీఁదను, ప్రతిప్రజమీఁదను, ఆయా భాషలు మాటలాడు వారిమీఁదను, ప్రతిజనము మీఁదను అధికారము దానికియ్యబడెను. యో: ప్ర: ౧౩: ౫-౬-౭॥

స:-సరి! భూమిమీఁది లోకులను భ్రమింపఁజేయుటకు సైతానును పశ్వాదులను పంపి పరిశుద్ధులయిన మనుష్యులతో యుద్ధముఁజేయించుటయను కార్యము బందిపోటుదొంగల యజమానునిదే యననొప్పును. కాదా: ఇటువంటి కార్యమీశ్వరునిదికాని, యీశ్వరభక్తులది కాని కాఁజాలదు. ॥౧౧౬॥

౧౧౭. మరియు నేనుచూడఁగా ఆ గొఱ్ఱెపిల్ల సీయోను పర్వతముమీఁద నిలువఁబడియుండెను. ఆయన నామమును, ఆయన తండ్రినామమును నొసళ్లయందు లిఖింపఁబడియున్న నూటనలుబది నాలుగువేలమంది ఆయనతో కూడా నుండిరి. యో: ప్ర: ౧౪-౧॥

స:-ఇదిచూడుడు: యేసుతండ్రి నివసించియుండెడు సీయోను పర్వతముమీఁదనే యతనిపుత్రుఁడును నివసించుచుండవచ్చును కాని యితఁడు ఒక లక్ష నలుబది నాలుగువేల మనుష్యుల నెట్లు లెక్కింపఁ గలిగెనో కదా! మరియొక లక్షనలుబదివేల జనులుమాత్రమే స్వర్గవాసులైరి. ఇఁక తక్కిన కోట్లకొలది క్రైస్తవుల శిరస్సులమీఁద ముద్రలుపడినట్లేకద. వారందఱును నరకమునకే పోయిరా! ఇప్పుడు యేసుతండ్రియు వతని సైనికులు నక్కడనున్నారో లేరో? యను సంగతికనుఁగొనుటకు క్రైస్తవులు సీయోను పర్వతముమీఁదికి పోయి చూడవలసినదే. ఉండురేని నీ లేఖ సత్యమగును. లేనిచో నబద్ధము. ఒకానొక చోటినుండి వచ్చియుండి రందురేని ఇంతగొప్ప సైన్యము దాను క్రిందికిని మీఁదికిని ఎగిరివచ్చుచుఁబోవుచు నుండుటకు వారుపక్షులా యేమి! ఇంతనతఁడు వచ్చుచుఁబోవుచు నుండునేని ఒకజిల్లా న్యాయాధిపతి వలెనయ్యెను. మరి యతఁడొకఁడేనో ఇద్దఱో లేక ముగ్గురో యున్న నదికూడ సంభవము కాదు. కాని కనిష్ఠ పక్షమందు ప్రతిభూగోళమున కొక్కొక్క యీశ్వరుడు కావలసియుండును. ఏలయన ననేక బ్రహ్మాండములను ఒకరు, ఇద్దరు, ముగ్గురు పాలించుటకుఁగాని సర్వత్ర కలిసి సంచరించుటకుఁగాని సమర్థు లెప్పటికిని కాఁజాలరు. ॥౧౧౭॥

౧౧౮. వారు తమ ప్రయాసములు మాని విశ్రాంతి పొందుదురు: వారి క్రియలు వారివెంట పోవునని ఆత్మ చెప్పుచున్నాఁడు. యో: ప్ర: ౧౪-౧౩॥

స:-చూచితిరా! క్రైస్తవుల యీశ్వరుఁడిది 'వారికర్మములు వారివెంట పోవును-అనఁగా నందఱకు కర్మానుసారమే ఫలమొసంగును'నని చెప్పుచున్నారు.

అట్లుకాక పాపములను యేసు తీసుకొనఁగలఁడు. పాపములు క్షమింపఁబడును. అనివీరేమో చెప్పుచున్నారు. ఇప్పుడీశ్వరుని మాటసత్యమా లేక క్రైస్తవులదా? బుద్ధిమంతులూహించి కనుఁగొనఁదగును. ఒకే విషయమందిట్టి రెండుమాటలు సత్యములు కావు. ఇందొకటి తప్పక యబద్ధమైపోవును. ఐనమాకేమి? క్రైస్తవుల యీశ్వరుఁడో క్రైస్తవులో యసత్యవంతులగుదురుగాక. ॥౧౧౯॥

౧౨౦ మరియు దానిని దేవునికోపమను ద్రాక్షల పెద్దతొట్టిలోవేసెను. ఆ ద్రాక్షల తొట్టి పట్టణమునకు వెలుపట త్రొక్కఁబడుచుండెను. నూఱు క్రోసుల దూరము గుఱ్ఱములకళ్లెము మట్టుకు ద్రాక్షల తొట్టిలోనుండి రక్తము ప్రవహించుచుండెను. యో. ప్ర. ౧౪-౧౯-౨౦॥

స:-ఇక చూడుఁడు! వీరి గప్పాలు పురాణములకన్నను మించినవి కావా? క్రైస్తవుల యీశ్వరుఁడు కోపపడునపుడు మిగుల దుఃఖితుఁడు నగు చుండవచ్చును అతనికోపకుండములు నిండియున్న వన్న నతని కోపమును నది జలమా? లేక యింకొక ద్రవపదార్థమా? మఱియు నూఱు క్రోసుల వఱకు రక్తము ప్రవహించుచుండెననుటయు నసంభవమే. ఏమనఁగా రక్తము గాలి తగులుటవలన వెంటనే గడ్డకట్టుకొనును. కాన నది యెట్లు ప్రవహింపఁగలదు. ఇందువలన నిదన్నియు వట్టిమాటలే యని యెఱుగవలెను. ॥౧౨౦॥

౧౨౧. నేను చూడఁగా సాక్ష్యపు గుడారమునకు సంబంధమైన గర్భాలయము పరలోకమందు తెఱవబడెను. యో: ప్ర: ౫-౫॥

స:-క్రైస్తవుల దేవుఁడు సర్వజ్ఞుఁడయియున్న సాక్ష్యులతో నేమిపని? తనంతటఁదానే తెలిసికొని యుండును. వీరిదేవుఁడు సర్వజ్ఞుఁడు కాఁడనియే దీనివలన నిశ్చయ మగుచున్నది ఏలయన నతఁడు మనుష్యునివలె నల్పజ్ఞుఁడయినందున ఈశ్వరీయ కార్యము నెట్లు చేయఁగలుగును? ఇంతియేకాదు గొప్ప యసంభవములగు దూతల వార్తలెన్నియో యీ ప్రకరణమున వ్రాయఁబడి యున్నవి. కాని వానిని సత్యములని యెవ్వరును నమ్మఁజాలరు. ఎంతవఱకని ఈ ప్రకరణమునందన్నియు నిటువంటి మాటలే నిండియున్నవి. ॥౧౨౧॥

౧౨౨. దాని దోషమును దేవుఁడు జ్ఞాపకము చేసికొనియున్నాఁడు. అది యిచ్చిన ప్రకారము దానికియ్యండి. దాని క్రియల చొప్పున దానికి రెట్టింపు చేయుండి. యో. ప్ర. ౧౬-౫-౬॥

స:- చూడుఁడు! క్రైస్తవుల దేవుఁడు అన్యాయకారియగుట ప్రత్యక్షమయ్యెను. ఎవఁడెట్లు ఎంతకర్మము చేసెనో వానికట్లే యంతటి ఫలమునే యిచ్చుట న్యాయమనఁబడును. కాని దానికంటె తక్కువగనో, ఎక్కువగనో ఫలములనిచ్చుట యన్యాయము అన్యాయకారినుపాసించు వారు నన్యాయకారు లేల కాకుందురు? ॥౧౨॥

౧౩. గొఱ్ఱెపిల్ల వివాహోత్సవ సమయము వచ్చినది. ఆయన భార్యతన్ను తాను సిద్ధపఱచుకొని యున్నది. యో. ప్ర ౧౯-౭॥

స:- ఆలకించితిరా! క్రైస్తవుల స్వర్గమందు వివాహములుకూడ జరుగుచున్నవిగా. ఏమన నట యేసునకు వివాహ మీశ్వరుఁడే చేసెను గద! మఱి అతని అత్తమామలు బావమఱఁదులు మొదలగువా రెవరనియు, బిడ్డ లెందరనియు నడుగవలయును. ఇక వీర్యనాశమువలన బలము, బుద్ధి, పరాక్రమము, ఆయువు మున్నగునవికూడ తగ్గిపోవునే! దానివలన నిప్పటికి ఏసు అచ్చట శరీరత్యాగమును చేసియుండవచ్చును. ఏమన సంయోగజన్య పదార్థము అవశ్యముగ వియోగమును బొందును. ఇప్పటివఱకును క్రైస్తవు లతని విశ్వాసమున మోసపోయిరి. ఇంక నెంతవఱకు మోసపోవుదురో తెలియదు. ॥౧౩॥

౧౪. అతఁడు ఆదియందున్న సర్పమును అనఁగా అపవాదియు సైతాను అను ఆ ఘట సర్పమును పట్టుకొని వేయి సంవత్సరములు వాని బంధించెను. ఆ వేయి సంవత్సరములు గడచు పర్యంతమును ఇంక జనులను మోసపఱుపకుండుటకై పాతాళమునుమూసి దానికి ముద్రవేసెను.

యో. ప్ర. ౨౦. ౨-౩॥

స:- చూడుఁడు. వచ్చుచు బ్రతుకుచు నెటులో సైతానును పట్టి వేయేండ్ల వఱకు బంధించెను. కాని విడుదల యయిన పిదప మఱల భ్రమింపఁ జేయకుండునా? ఇట్టి దుష్టుని కారాగారము నందే యుంచవలసి యుండెను. లేదా చంపి వేయవలసి యుండెను. కాని సైతానుగలఁ డనుకొనుట యీ క్రైస్తవుల వట్టిభ్రమయే. యథార్థమం దేమియులేదు. భయముచూపి లోకులను తమ వలలో వేసికొనుటకై ఈ యుపాయమును బన్నియుందురు. ఎట్లన నొకదూర్తుఁడమాయకులైన కొందఱు మనుష్యులతో "రండు మీకు దేవదర్శ

నము( జేయింతు"నని చెప్పి యొక యేకాంత స్థానమునకుఁ దోడ్కొనిపోయి యొక మనుష్యునకు నాలుగు భుజము లేర్పరచి చెట్లపొదలలో నిలువఁబెట్టి "మీరు కన్నులు మూసికొనుడు. చెప్పినప్పుడు తెఱువుఁడు. మరల నేను చెప్పి నప్పుడు చప్పున మూసికొనుఁడు. మూసికొననివాఁ డంధుఁడగు"ను అని చెప్పి నట్లు "మా మతమును నమ్మనివాఁడు శైతానుచే భ్రమింపఁబడిన వాఁడని చెప్పుఁడు" అను నీ మతస్థుల దోషములను గలవు ఎట్లన అతఁడు ముందటికి వచ్చినప్పుడు చూడుఁడనియు. మరల తక్షణమే మూసికొనుఁడనియు. తిరిగి పొదలో దాఁగినప్పుడు తెఱువుండనియు చెప్పి మీరందఱును నారాయణుని దర్శించి ధన్యులయితిరని యన్నట్టులే ఈ మతానుయాయుల లీలలను యెఱుఁగ వలెను. కావున వీరిమాయలో నెవరును చిక్కకూడదు. ॥౧౨౪॥

౧౨౫. భూమియు, ఆకాశమును ఆయన సమ్ముఖమునుండి పారి పోయెను. వానికి నిలువచోటు కనఁబడకపోయెను. మఱియు గొప్పవారేమి, కొద్దివారేమి మృతులయినవారు దేవుని యెదుట నిలువఁబడి యుండుటఁ జూచి తిని. అప్పుడు గ్రంథము విప్పఁబడెను. మఱియు జీవగ్రంథమను వేరొక గ్రంథము విప్పఁబడెను ఆ గ్రంథముల వ్రాయఁబడియున్న వానినిబట్టి తమ క్రియలచొప్పున మృతులు తీర్పుపొందిరి. యో. ప్ర. ౨౦:౧౧-౧౨॥

సః— ఈ పసితనపు మాటలు చూడుఁడు. భూమియు నాకాశము నెట్లు పరుగెత్తఁగలుగును? మఱి దేనిమీఁద నిలువఁగలుగును? ఎవని సమ్ముఖము నుండి పరుగిడెనో యతని సింహాసనమును, అతను ఎచ్చట నిలిచియుండఁ గలిగిరి? మఱి చనిపోయినవారు దేవునియెదుట నిలువఁ బెట్టబడినపుడు దేవుఁడుకూడ కూర్చుండి యుండెనా లేక నిలిచి యుండెనా? ఇప్పటికచేరీల లోను, దుకాణములలోను వ్యవహారిక విషయములన్నియు పుస్తకములందు వ్రాయఁబడునటులే ఈశ్వరునియొద్దకూడ వ్రాయఁబడునా? జీవులందఱి స్థితి గతులు వ్రాయున దీశ్వరుఁడా. యతని గుమాస్తాలా? ఇలాటిమాటలబట్టియే కద అనీశ్వరుని ఈశ్వరునిగాను, ఈశ్వరుని అనీశ్వరునిగాను ఈ క్రైస్త వాదులు చేసిపెట్టిరి. ॥౧౨౫॥

౧౨౬. వారిలో నొకఁడువచ్చి ఇటురమ్ము పెండ్లికుమార్తె గొఱ్ఱె పిల్లయొక్క భార్యను నీకు చూపెదనని నాతో చెప్పెను. యో. ప్ర. ౨౧:౯॥

స:- ఓహో! యేసునకు స్వర్గమందు పెండ్లికూఁతురు-మంచిభార్య-లభించెనుకా! ఆనందించు చుండవచ్చును. ఇంకనేమి క్రైస్తవు లచ్చటికి పోదురో వారికిని స్త్రీలు లభింతురు గాఁబోలు! బిడ్డలుకూడ పుట్టుచుండవచ్చును. జనమెక్కు వగుటవలన రోగములు ప్రబలి చనిపోవుచునుండవచ్చును. ఇట్టి స్వర్గమునకు దూరమునుండియే చేతులుజోడించుట యుచితము. ||౧౭౬||

౧౭౭. అతఁడు ఆకొలకఱ్ఱతో పట్టణము కొలవఁగా దానికొలత యేడునూర్ల క్రోసులైనది. దానిపొడుగును, ఎత్తును, వెడల్పును సమముగా నున్నది. మరియు అతఁడు ప్రాకారమును కొలువఁగా అది మనుష్యుని కొలత చొప్పున నూటనలుబది నాలుగు మూరలు అయినది. ఆ కొలత దూతలకొలతయే. ఆపట్టణపు ప్రాకారము సూర్యకాంతములతో కట్టఁబడెను; పట్టణము స్వచ్ఛమగు స్ఫటికముతో సమానమైన శుద్ధసువర్ణముగా నున్నది. ఆపట్టణపు ప్రాకారపు పునాదులు అమూల్యమైన నానావిధ రత్నములతో అలంకరింపఁ బడియుండెను. మొదటి పునాది సూర్యకాంతపుఱాయి. రెండవది నీలము. మూడవది కెంపు. నాలుఁగవది మరకతము. అయిదవది గోమేధికము. ఆఱవది మాణిక్యము. ఏడవది పచ్చ. ఎనిమిదవది వైడూర్యము. తొమ్మిదవది పుష్యరాగము. పదియవది సువర్ణలశునీయము. పదునొకండవది పద్మరాగము. పన్నెండవది సుగంధము. దానిపన్నెండు గుమ్మములు పన్నెండు ముత్యములు. ఒక్కొక గుమ్మము ఒక్కొక ముత్యముతో కట్టఁబడియున్నది. పట్టణపు రాజవీధి శుద్ధసువర్ణమయమై స్వచ్ఛమైన స్ఫటికమును పోలియున్నది.

యో. ప్ర: ౨౧: ౧౬-౧౭-౧౮-౧౯-౨౦-౨౧

స:- క్రైస్తవుల స్వర్గవర్ణనవినుఁడు! క్రైస్తవులు పుట్టుచు గిట్టుచు నుందురేని యింతగొప్పపట్టణ మందెట్లిముడఁగలరు? ఏమనఁగా నందు మనుష్యుల ఆగమనము కలదు. కాని తిరిగి వెళ్ళిపోవుటలేదు. ఈ పట్టణము బహుమూల్య రత్నములచే నిర్మింపఁబడియున్నట్లు నమ్మియున్నారు. కావి బంగారుతోఁ జేయఁబడినది అను మున్నగు వ్రాతలన్నియు కేవలము మాయకులైన మనుష్యులను మోసపుచ్చి తమవలలోఁ జిక్కించు కొనుటకు గల్పింపఁబడిన లీలలే. ఆహా! ఆపట్టణపు వెడల్పు నిడివి వ్రాసినది సంభవమా, ఎత్తు

ఏరువందల యేఁబది క్రోసులునునదెట్లు సంభవమగును? ఇది పట్టి మిథ్యాలాపమే. ఇంత పెద్ద ముత్యమలెట్లు చిక్కియుండును? ఆ లేఖ వ్రాసినవాని యింటికుండలలో నుండెనేమో! ఈ గప్పాలు పురాణముల కబ్బులై యున్నవి. ||౧౨౩||

౧౨౮. దుష్టవస్తువునుగాని, నింద్యకార్యమునుగాని చేయువాఁడు, అసత్యవాది దానిలోనికి ప్రవేశింపనే ప్రవేశింపరు. యో. ప్ర. ౨౧.౨౭||

స:- అటులేని, పాపులుకూడ క్రైస్తవమతములోఁ జేరుటవలన స్వర్గమునకు పోఁగలుగుదురని క్రైస్తవులెందులకుఁ జెప్పుచున్నారు. అది సరి కాదు. అటులయినచో (స్వప్నమందలి) మిథ్యావాక్యములు చెప్పు యోహా నెప్పుడును స్వర్గమున ప్రవేశింపనేరఁడు. యేసుకూడా స్వర్గమునకుఁ బోకుండ వచ్చును. ఏమనిన నొకపాపియే స్వర్గమును పొందనేర నప్పు డనేకపాపుల పాపములఁ బొందువాఁడు స్వర్గవాసుఁడెట్లు కాఁగలఁడు? ||౧౨౮||

౧౨౯. ఇఁక మీఁదట శాపగ్రస్తమైన దేదియు నుండదు. దేవునియు గొఱ్ఱెపిల్లయు, సింహాసనము దానిలో నుండును. ఆయనదాసులు ఆయనను సేవించుచు ఆయన ముఖావలోకనము చేయుచుందురు. ఆయన నామము వారినొసళ్ళయందుండును. రాత్రి యిఁక నెన్నఁడునుండదు; దీపకాంతికాని, సూర్యకాంతి కాని వారికక్కఱలేదు. దేవుఁడైన సర్వేశ్వరుఁడే వారి మీఁద ప్రకాశించును. వారు యుగయుగములు రాజ్యము చేయుదురు.

యో. ప్ర. ౨౨.౩.౪.౫||

స:- చూడుఁడు! ఇదియేకద క్రైస్తవుల స్వర్గము. ఏమి! ఈశ్వరుఁడును, యేసును నిరంతరము సింహాసనముపై కూర్చుండియుందురా! మరి వారిదాసులు వారియెదుట సర్వదా ముఖావలోకనమే చేయుచుందురు! మీదేవుని ముఖము యూరోపియనులవలె తెల్లనిదా? ఆఫ్రికనులవలె నల్లనిదా? లేక అన్యదేశీయులఁ బోలినదా? చెప్పుఁడు! ఈ స్వర్గము సయిత మొకబంధనమే యనఁదొప్పును. ఏమన నచ్చట కనిష్ఠ జ్యేష్ఠత్వములుండి ఆనగరమందే నివసింపవలసి వచ్చునో యట దుఃఖమేల కలుగకుండును? ఇఁక ముఖముగల యాశ్వరుఁడు సర్వజ్ఞుఁడు, సర్వేశ్వరుఁడు నెప్పుడును కాఁజాలఁడు. ||౧౨౯||

౧౩౦. ఇదిగో త్వరగా వచ్చుచున్నాను. వానివానిపనిచొప్పున ప్రతి వానికిచ్చుటకు నేను సిద్ధపఱచినజీతము నాయొద్దనున్నది.

యో. ప్ర. ౨౨. ౧౨॥

స:-కర్మానుసారమే ఫలములభించుననుట నిజమైనప్పుడు పాపము లెప్పటికిని క్షమింపఁబడనేరవు, క్షమింప బడునన్న నీ దూతలమాటయబద్ధము. ఎవరేని క్షమింపఁబడు ననుమాటగూడ సువార్తలలో వ్రాయఁబడియున్న దందు రేని పూర్వాపరవిరుద్ధమైన మిథ్యాసాక్ష్యమయ్యెనుకాన ఏ మిథ్యోక్తుల సంగీక రించుట మానుఁడు. ఇఁక నెంతవఱకని వ్రాయుదుము. వీరి బైబిలునందు లక్షలకొలఁది విషయములు ఖండింపఁదగినవి కలవు. కాని వానిలోనుండి కొన్ని టిని మాత్రమే అందఱకు బోధపడుటకు ఇందుదాహరించి యున్నాఁడను. ఇంతటితోనే బుద్ధిమంతులధికముగ నూహించి తెలిసికొనఁగలరు. ఈ బైబిలు నందు కొన్ని మాటలు మాత్రమేకాక తక్కినవన్నియు మిథ్యోక్తులే నిండి యున్నవి. అసత్యములోఁ గూడియున్న సత్యముగూడ పరిశుద్ధముగ నుండ నటులే యీ బైబిలుకూడ మాననీయము కాఁజాలదు. కాని ఆ సత్యమనునది వేదములను స్వీకరించునపుడే యలవడును.

శ్రీ మద్దయానన్ద సరస్వతీస్వామి నిర్మితమును
సుభాషావిభూషితమునగు సత్యార్థప్రకాశమున
క్రైస్తవమత విషయముగల త్రయోదశ
సముల్లాసము సంపూర్ణము



ఓమ్

# అనుభూమిక (౧౪)

ఈ పదునాల్గవ సముల్లాసము ముసల్మానుల మతమునుగూర్చి. అస్య గ్రంథమునుండికాక కేవలము వారి కురానునుబట్టియే వ్రాయఁబడినది. ఏమన ముసల్మానులు కురానునందే పూర్ణముగ విశ్వాసముంతురు. వీరిలో సంప్రదాయములున్నందున శబ్దార్థాది విషయములలోఁగొంత విరోధమున్నను కురాను విషయమున నెల్లరు నేకమతులు. అరబ్బీ భాషయందున్న కురానునకు మౌల్వీలు ఉర్దూభాషయందర్థము వ్రాసియున్నారు. ఆయర్థమే ఆర్యభాషాంతరీకరణ మొనరింపఁబడి గొప్పగొప్ప అరబ్బీ పండితులచే శోధింపఁబడిన పిదప దేవనాగరి యక్షరములలో వ్రాయింపఁబడెను. ఎవ్వరేని యీయర్థము బాగుగలేదన్న. మొదట మౌల్వీ సాహెబుల యనువాదములను రద్దుపఱచి పిమ్మట నీ విషయము మీఁద వ్రాయవచ్చును. ఏలయన నిది కేవలము మనుష్యుల యున్నతి కొఱకు సత్యాసత్యముల నిర్ణయము కొఱకును వ్రాయఁబడినది. దీనివలన ఎల్లమత విషయములు కొంత బోధపడుటయేకాక మనుష్యులకు పరస్పరము విచారించుకొనుట కవకాశముచిక్కి యొకరు మఱొకరి దోషములు ఖండించుచు గుణములు గ్రహింపఁగలుదురు. మఱొకమతమందో లేక యీ మతమందో వ్యర్థముగ గుణదోషముల నారోపించుటలేదుకాని గుణములు గుణములుగాను దోషములు దోషములుగాను ఎల్లరకు విదితమగును. ఒకఁడొకనితో నబద్ధము ప్రచారము చేయుటకుఁగాని సత్యము నవరోధించుటకుఁగాని సమర్థుఁడు గాకుండును. సత్యాసత్యములు తేఁట పడినను ఇష్టమున్న వాఁడంగీకరింప వచ్చును, లేదా అంగీకరింపకపో వచ్చును. ఎవ్వనియెడను బలాత్కారము జరుగదు. తమవే కాని ఇతరులవే కాని దోషములను. దోషములుగాను, గుణములను గుణములుగాను దెలిసికొని గుణములను గ్రహించి దోషములను బరిత్యజించుటయే సజ్జనులకు విహితము. అట్లే హఠజనుల హఠమును మొండి

పసమును తగ్గింప వలెను. తగ్గింపఁజేయవలయును. ఏమనఁబక్షపాతముచే నేమేమి యనర్థములు జగమున, జరిగియుండలేదు? జరుగకుండఁబోవును? అనిశ్చయము-క్షణభంగురము-నైన యీ జీవనమందు పరులకు హాని కలిగించి తాను లాభము వదలుకొనుటయు, అన్యుల నట్లుంచుటయు, మనుష్యత్వమునకు దూరము అన నొప్పును. దీనియందు విరుద్ధమేమయిన వ్రాయఁబడియున్న దానిని సజ్జనులు తెలియపఱతురుగాక! అది యుచితముగానున్న నంగీకరింపఁబడును. ఇది హఠమును, దురాగ్రహమును, ఈర్ష్యా ద్వేషములను, వాదవివాదములను, విరోధమును తగ్గించుటకు వ్రాయబడినదే కాని వీనిఁ బెంచుటకుఁగాదు. ఒకరికొకరు హాని కలుగనట్లు వర్తించుటయు, లాభము గలుగఁజేయుటయు మాముఖ్యకార్యము. కాన నీ పదునాల్గవసముల్లాసమునందు, ముసల్మానుల మతమునుగూర్చి సజ్జనులందఱ యెదుట నివేదించుచున్నాఁడ. ఇష్టమైనదాని గ్రహింపుఁడు. ఇష్టము కానిదానిఁద్యజింపుఁడు.

బుద్ధిమద్వర్యులకు విస్తరింప నేల?



# చతుర్దశ సముల్లాసము

## ముసల్మానుల మత విషయము

౧. క్షమించు వాఁడు, దయాళువునగు అల్లాహ నామముతో నారంభము. మంజిల ౧. సిపారా ౧ సూరత ౧.

సమీక్షకుఁడు — ఈకురాను ఖుదావలన చెప్పఁబడినదని ముసల్మానులనుచున్నారుకాని దీనిని రచించినవాఁడు వేఱొకఁడు గలఁడని యీ మాటవలన విదిత మగుచున్నది. ఏమనఁగ పరమేశ్వరునిచే రచింపఁబడి యుండిన "అల్లా నామముతో నారంభము" అనక యుండును. కాని "మనుష్యుల కుపదేశార్థము ఆరంభము" అని యుండును; మీరిట్లు చెప్పుఁడని మనుష్యులకు నేర్పుచున్నాఁడన్న నదియు సరికాదు. ఏలయన దీని వలన ఖుదానామముతోఁ బాపముకూడ నారంభమయి యతని నామమును దూషితమై పోవును. అతఁడు క్షమించు వాఁడు, దయాకరుఁడు నగునేని, తన సృష్టియందతఁడు మనుష్యుల సుఖముకొఱకు అన్యప్రాణుల చంపుటకు దారుణమైన పీడ కలుఁగజేసి, చంపించుచు మాంసముఁదినుటకు నాజ్ఞయేల యిచ్చెను? ఏమి? ఆప్రాణులు అపరాధ మెఱుఁగనివియు. పరమేశ్వరునిచే సృజింపఁబడినవియు గావా? ఇఁక పరమేశ్వర నామముతో మంచిమాటల యారంభము; చెడ్డమాటలదికాదు. అనియు వచింపవలసియుండెను. ఈమాట గోలగానున్నది. ఏమి: దొంగతనము, జారత్వము, మిథ్యాభాషణము మొదలగు నధర్మకార్యముల యారంభము కూడ పరమేశ్వర నామముతోఁ జేయబడవలయునా? దీనిఁ జేసియే కటికలు మొదలగు ముసల్మానులు, ఆవు మున్నగు పశువుల గొంతులు గోయునపుడు "బిస్మిల్లాహ" అను వచనమునే పఠించు చున్నారు. చూడుఁడు! దీనికిఁ బై వ్రాయఁబడిన యర్థమే వచ్చునుగాన చెడుకార్యముల యారంభముకూడ నీ ముసల్మానులు పరమేశ్వరుని పేరుతోఁ జేయుచున్నారు. ఇటులేని ముసల్మానుల "ఖుదా" దయాళువుగానుండఁడు. ఏమన నతని దయ యా పశువులమీఁద లేకపోయినది.

మూసల్మానులు దీనియర్థము నెఱుఁగరేని యీ మాట వెల్లడియగుట వ్యర్థము. మూసల్మానులు దీనికి వేఱర్థముఁ జేయుదురేని, సరియైన యర్థమేమి? అను వితర్కాదులు ప్రశ్నలు గలుగును. ॥౧॥

౨. అన్నిస్తుతులు "పరవరదిగార్" అనఁగా సకలప్రపంచమును పాలించునట్టి పరమేశ్వరుని కొఱకే "అవరు" క్షమించునట్టి దయాళుఁడు.

మం. ౧. సి. ౧. సూరతుల్ఫాతిహా. ఆ.౧.౨॥

సమీక్షకుఁడు:- కురానులో ఖుదా ప్రపంచమును పాలించువాఁడు. అందఱిపై క్షమాదయలను చూపువాఁడునై యున్న యెడల నితరమతస్థులను పశ్వాదులనుగూడ ముసల్మానుల చేతఁ జంపించుటకు నాజ్ఞనొసంగియే యుండఁడు. క్షమించువాఁడేని పాపులనుకూడ క్షమించునా? అటులైన ముందుఁ జెప్పఁబోవునట్లు "కాఫిరులను చంపుఁడు" (కురాను. వైగంబరుల నంగీకరింపని వారు కాఫిరులు) అని యెందులకు వ్రాసి యుండును? కావున కురాను ఈశ్వరకృతమని తోఁచదు. ॥౨॥

౩. న్యాయదినమునకు స్వామివి. నీశక్తినే మేము సేయుచున్నాము. నీ సహాయమునే కోరుచున్నాము. మాకు చక్కని మార్గముఁజూపుము.

మం-౧-సి-౧. సూ.౧.ఆ-౩-౪-౫॥

సమీక్షకుఁడు—ఖుదా యెల్లప్పుడు న్యాయముఁజేయఁడా? ఏదో యొక దినమున న్యాయముఁజేయునా? ఇది యన్యాయమేయని తోఁచుచున్నది. అతనినే భజింపవలయును. అతని నుండియే సహాయము గోరవలయును అనుట సరియేకాని చెడు కార్యములందును సహాయమును గోరవలయునా? ఏమి? చక్కని మార్గము కేవలము ముసల్మానుల దేనా లేక యితరుల దగదా? చక్కని మార్గమును ముసల్మాను లేల గ్రహించుటలేదు? ఏమి? చక్కని మార్గము కీడుగలుగ చేయుటకే కోరుటలేదుగదా? మేలంతటను నొకటేయైన ముసల్మానులందే యను విశేష మేమియు నుండకుండును. ఇటులే మేలు నొప్పనివారు పక్షపాతము కలవారే యగుదురు. ॥౩॥

౪. ఎవరిమీద నీవు దయఁజూపితివో, వారిమార్గమును జూపుము. నీవెవరి నత్యంత క్రోధముగఁ జూచితివో వారిమార్గము గాని త్రోవ తప్పినవారిమార్గముగానిమాకుఁజూపకుము. మం-౧.సి-౧.సూ-౧ఆ.౬-౭॥

సమీక్షకుఁడు-ముసల్మానులు పూర్వజన్మమును, పూర్వకృత పాపపుణ్యములను నొప్పుకొనరేని కొందఱియెడ దయఁజూపి కొందఱియెడ దయఁజూపకపోవుట వలన ఖుదా పక్షపాతి యయిపోవును. ఏమనఁగా పుణ్యములే లేనపుడు సుఖదుఃఖములఁ బొందఁజేయుట కేవల మన్యాయము. నిష్కారణముగా నొకనిపై దయను, మఱొకనిపై క్రోధమునుజూపుటకూడ స్వభావమునకు విరుద్ధము అతఁడుదయనో, క్రోధమునో చూపనేరఁడు ఏమనవారికిఁబూర్వసంచితపుణ్యపాపములే లేనపు డొకనిపై దయను, మఱొకనిపై క్రోధమును జూపుటయుఁ సంభవింపదు. ఇంకనీసూరతునకు టిప్పణము "ఈప్రకారముగ సర్వదా చెప్పుచుండుఁడని యీసూరతును అల్లాసాహెబు మనుష్యుల నోటితో నుచ్చరింపఁజేసెనని" వ్రాయఁబడియున్నది. అది నిజమేని 'అలీఫ్' 'బే' మొదలుగాఁగల యక్షరములనుకూడ ఖుదా చదివించి యుండవచ్చును. అక్షరజ్ఞానము లేనివారీ సూరతునెట్లు చదువఁగలిగిరి? ఏమి, నోటితోనే చదివింపఁబడుచుఁ జదువుచుఁబోయిరా? అటులేని కురానునంతటిని నోటితోనే చదివించియుండవచ్చును. పక్షపాతముతో కూడిన మాటలుండు పుస్తక మీశ్వరకృతము కాఁజాలదని దీనివలన గ్రహింపవలయును. అరబ్బీభాష యందు దించుటవలన నరేబియులకుఁ దీనిఁజదువుట సులభమును. అన్యభాష నెఱుగువారలకుఁగఠినము నగుటచేఁగాన ఖుదాయందు పక్షపాతము సంభవించుచున్నది. పరమేశ్వరుఁడు సృష్టిలోని సమస్తదేశము లందలి మనుష్యులయెడ న్యాయపూర్వకముగ నెల్లదేశభాషలకంటె విలక్షణమైయెల్ల దేశీయులకు సమాన పరిశ్రమచే విదితము కాఁగల సంస్కృతభాషయందే వేదములను ప్రకాశ పఱచి యున్నట్లు రచియించి యున్న నీదోషము సంభవింప కుండెడిది. ॥౪॥

౫. ఈ పుస్తకము నిస్సందేహముగ పరహేజుగారులకు మార్గముఁ జూపుచున్నది. విశ్వాసము గలవారు (పరోక్షముగ) నమాజు చదువువారు. మేమిచ్చిన వస్తువునే వెచ్చ పెట్టుచున్నవారు. ఆ పుస్తకమును విశ్వసించువారు. నిన్నును. నీకంటెముందుగా వచ్చినదానిని (పుస్తకమును) ఉంచువారు. ప్రలయమును (కయామతు) నమ్ముకొనువారును తమ ప్రభువు శిక్షలోనున్నవారును విడుదల బొందుదురు. కాఫిరులను నీవు భయపెట్టుటయు, భయపెట్టకుండుటయు నొక్కటియే. వారువిశ్వాసము నుంపరు. దేవుడు వారిహృదయ

సమీక్షకుఁడు-ముసల్మానులు పూర్వజన్మమును, పూర్వకృత పాపపుణ్య
ముల నొప్పుకొనరేని కొందఱియెడ దయఁజూపి కొందఱియెడ దయఁజూపక
పోవుట వలన ఖుదా పక్షపాతి యయిపోవును. ఏమనఁగా పాప పుణ్యములే లేన
పుడు సుఖదుఃఖములఁ బొందఁజేయుట కేవల మన్యాయము. నిష్కారణముగా
నొకనిపై దయను. మఱియొకనిపై క్రోధమునుజూపుటకూడ స్వభావమునకు విరుద్ధము
అతఁడుదయనో, క్రోధమునో చూపనేరఁడు ఏమనవారికిఁ బూర్వసంచితపుణ్యపాప
ములే లేనపు డొకనిపై దయను, మఱియొకనిపై క్రోధమును జూపుననుట
సంభవింపదు. ఇంకనీసూరతునకు టిప్పణము "ఈప్రకారముగ సర్వదా చెప్పు
చుండుఁడని యీసూరతును అల్లాసాహెబు మనుష్యుల నోటితో నుచ్చరింపఁ
జేసెనని" వ్రాయఁబడియున్నది. అది నిజమేని 'అలిఫ్' 'బే' మొదలుగాఁ
గల యక్షరములనుకూడ ఖుదా చదివించి యుండవచ్చును. అక్షరజ్ఞానము
లేనివారి సూరతునెట్లు చదువఁగలిగిరి? ఏమి, నోటితోనే చదివింపఁబడుచుఁ
జదువుచుఁబోయిరా? అటులేని కురానునంతటిని నోటితోనే చదివించియుండ
వచ్చును. పక్షపాతముతో కూడిన మాటలుండు పుస్తక మీశ్వరకృతము
కాఁజాలదని దీనివలన గ్రహింపవలయును. అరబ్బీభాష యందు దించుటవలన
నరేబియులకుఁ దీనిజదువుట సులభమును, అన్యభాష నెఱుగువారలకుఁగఠి
నము నగుసుగాన ఖుదాయందు పక్షపాతము సంభవించు చున్నది. పరమేశ్వ
రుఁడు సృష్టిలోని సమస్తదేశము లందలి మనుష్యులయెడ న్యాయపూర్వకముగ
నెల్లదేశభాషలకంటె విలక్షణమైయెల్ల దేశీయులకు సమాన పరిశ్రమచే విది
తము కాఁగల సంస్కృతభాషయందే వేదములను ప్రకాశ పఱచి యున్నట్లు
రచియించి యున్న నీదోషము సంభవింప కుండెడిది. ||౪||

౩. ఈ పుస్తకము నిస్సందేహముగ పరహేజగారులకు మార్గముఁ
జూపుచున్నది. విశ్వాసము గలవారు (పరోక్షమును) నమాజు చదువువారు,
మేమిచ్చిన వస్తువునే చెప్పి పెట్టుచున్నవారు. ఆ పుస్తకమును విశ్వ సించు
వారు, నిన్నును. నీకంటెముందుగా వచ్చినదానిని (పుస్తకమును) ఉంచువారు.
ప్రళయమును (కయామతు) నమ్ముకొనువారును తమ ప్రభువు శిక్షలోనున్న
వారును విడుదల బొందుదురు. కాఫిరులను నీవు భయపెట్టుటయు, భయపెట్ట
కుండుటయు నొక్కటియే. వారువిశ్వాసము నుంపరు. దేవుఁడు వారిహృదయ

కలుగనేరవు. మఱి వారి నేల శిక్షించుచున్నారు? ఏమన వారు పాపమో, పుణ్యమో స్వతంత్రముగ చేయనేరరుగా! ॥౫-౬॥

౬ — వారిహృదయములందు రోగము కలదు. అల్లావారి రోగమును హెచ్చించెను. మం-౧-సి-౧.సూ-౨-ఆ.౯॥

సమీక్షకుఁడు — చూచితిరా! అపరాధము లేనిదే ఖుదా వారి రోగముల బెంచెను. దయరాలేదే! ఆ దీనజను లెంతో దుఃఖపడవచ్చును గదా! ఇది సైతానుకంటె మించిన సైతానుతనపు పనికాదా? ఒకని మనస్సుమీఁద ముద్ర వేయుట ఒకని రోగమును బెంచుట, అనుపనులు ఖుదాని కాఁదాలవు. ఏలయన రోగము తన పాపమువలననే పెరుగును. ॥౬॥

౭ — మీ కొఱకు పృథివీశయ్య, ఆకాశాచ్ఛాదనమును చేసి యున్నాఁడు. మం-౧-సి-౧-సూ-౨-ఆ.౨౨॥

సమీక్షకుఁడు — మంచిది ఆకాశ మొకని కాచ్ఛాదనము కాఁగలదా! ఇది యవిద్యతోఁగూడిన మాట. ఆకాశము నొకకప్పుగా నమ్ముటయు, హాస్యపుమాటయేకద-ఏదోయొక పృథివినే ఆకాశమని నమ్ముదురేని అది వారి యింటిమాటయే యగును. ॥౭॥

౮. మేము మాపైగంబరు మీఁద దించినట్టి వస్తువునెడ మీకు సందేహమున్న దానివంటి యొకసూరతును తెండు - మరి యల్లాకాక మీకే సత్యవంతులేని మీ సాక్షులను పిలువుఁడు. మీరట్లు చేయక పోవుదురేని మనుష్యులను కాఫిరుల కొఱకు తయారు చేయఁబడిన కాలనుకాల్చివేయు నగ్నికి భయపడుఁడు. మం-౧-సి-౧-సూ-౨-ఆ-౨౩-౨౪॥

సమీక్ష — చూరా! దానిపంటిదొక సూరతయిన రచియింపఁబడనేరదను నది యొప్పునా? అకబరు బాదశాహ కాలమందు. మౌలవీ పైజీయను వాఁడు నున్నలేని కురానును రచించి యుండలేదా? అది యే నరకపుటగ్ని? ఈయగ్నికి భయపడవలదా? దీనిలోఁ బడుసదంతయు ఇంధనమే యగును. కాఫిరులకొఱకు కాలు సిద్ధపరుపఁబడి యున్నవని కురానునందు వ్రాయఁబడి నట్లే, మ్లేచ్ఛుల కొఱకు ఘోర నరకము సిద్ధమయి యున్నదని పురాణములందు వ్రాయఁబడి యున్నది. ఇప్పుడెవని మాట నిజమని నమ్మవలెనో చెప్పుఁడు? వారివారి వచనముల వలన నిద్దఱు స్వర్గగాములును ఒండొరుల

మత భేదమువలన యిద్దరు నరకగాములు నగుచున్నారు. కాని పై వ్యర్థా లాపములన్నియు వట్టివే. కాని సకలమతములలోఁగల ధర్మాత్ములందఱు సుఖమును, పాపాత్ములందఱు దుఃఖమును తప్పక పొందుదురు. ॥౮॥

౯. మఱి విశ్వసించిన వారికిని, మంచిపనులాచరించినవారికి ఏ శుభ వార్త వినఁజెప్పుము. అదేమనఁగా మీకొఱకు స్వర్గములు కలవు. వాని క్రిందుగా నదులు పాఱుచుండును, అందుఁదినుటకు ఫలము లియ్యఁబడునప్పుడు ఇవి మాచే దీనికి ముందీయఁబడిన వస్తువులే యనఁగలరు; మఱి మీకొఱకు పవిత్రస్త్రీలు నక్కడసర్వదా యుందురు. మం-౧-సి-౧-సూ-౨-ఆ-౨౫॥

సమీక్ష :— మంచిది! ఈ కురానునందలి స్వర్గమున జగత్తులో లేని యుత్తమ పదార్థమేమి కలదు? ఏలయన జగత్తులోఁగల పదార్థములే ఈ ముసల్మానుల స్వర్గమందునుగలవు. కాని విశేషమేమన ఇచ్చట పురుషులు పుట్టుచు, గిట్టుచు, వచ్చుచు పోవుచునున్నట్లు స్వర్గమందు జనించుటలేదు. ఇచ్చట స్త్రీ లెల్లప్పుడు నుండుటలేదు. కాని యక్కడ చక్కని స్త్రీలు సర్వదా యుందురేని కయామతు రాత్రి రానంత వఱకు పాపమా స్త్రీలెట్లు కాలము గడుపఁగలుగుదురోగదా? ఖుదాయే వారిపై దయఁజూపుచుండ వచ్చును. ఖుదా నాశ్రయించియే వారు కాలము గడుపుచుండవచ్చునన్న బాగుగనే యున్నది! ఈ ముసల్మానుల స్వర్గము, గోకులపు గోసాయీల గోలోకము వలెను, వారి మందిరమువలెను నగపడుచున్నది. అచ్చట స్త్రీలకున్నంత మాన్యత పురుషులకు లేదు. అటులే ఖుదా గృహమందును స్త్రీలకు మాన్యత యెందుగాఁ గలదు. వారిపై ఖుదా ప్రేమకూడ యెందుగనున్నది. ఆ పురుషులమీఁదలేదు. ఏలయన ఖుదా బీబీలను స్వర్గమందెల్లప్పుడు నుంచెను. పురుషులనుంచలేదు. ఆ బీబీలు ఖుదా యంగీకారములేక స్వర్గమందెట్లుండఁ గలుగుదురు? ఈ వార్త నిజమేని, ఖుదా స్త్రీలోలుఁడయిపోవును. ॥౯॥

౧౦. ఆదామున కన్ని నామములను నేర్పెను. మఱల ((ఫరిశ్తాల), దేవదూతల) యెదుట మీరు సత్యవంతులయిన నాకు వారి నామములు తెలుపుఁ డనెను:— ఓ ఆదాము! వారికి వారి నామములు తెలుపుమనెను, అప్పుడతఁడు తెలుపఁగా "నేను యథార్థముగ పృథివియందును. ఆకాశమందును గుప్తముగా

సున్న వస్తువులను, పవిత్రితములు. సత్తములునగు కర్మములను ఎఱుఁగుదునని మీతోఁజెప్పియుండలేదాయని ఖుదా పరిశ్తాలతో ననెను.

మం-౧-సి-౧సూ-౨-౪-౨౯-౩౦॥

సమీక్షకుఁడు — మంచిది పరిశ్తాల నిట్లు మోసపుచ్చి తన్ను పొగడుకొనుట, ఖుదా పనియా? ఇదియొక దాంభికమేకదా. దీని నే విద్వాంసుఁడు నంగీకరింపనేరఁడు. ఇఁక నిట్టి యభిమానమును జూపఁడు. ఇటువంటిమాటల వలననే ఖుదా తన గొప్పతనమును చాటుకొనఁగోరుచున్నాఁడా ఏమి? తెలివి తప్పిన లోకులలో నొకఁడెట్టి యక్రమము నయినను సాగించుకొనఁగలుగు నుట నిశ్చయమేకాని యవి సభ్యజనులలో సాగనేరవు. ॥౧౦॥

౧౧. మేము పరిశ్తాలతో బాబా ఆదామునకు దండముఁ బెట్టుఁడన్నపుడు, నందరు దండము పెట్టిరిగాని, సైతాను నంగీకరింపక యభిమానపడెను. ఎందులకన నతఁడొక కాఫిరుఁడై యుండెను.

మం-౧-సి-౧-సూ-౨-ఆ-౩౨॥

సమీక్ష—దీనివలన ఖుదా సర్వజ్ఞుఁడు కాఁడు. అనఁగా భూతభవిష్యద్వర్తమానముల నన్నిటి నెఱుఁగనివాఁడు నున్నాఁడు. ఎఱిఁగియున్నవాఁడేని సైతానును పుట్టింపనేల? ఇంత ఖుదాయందు పరాక్రమము కొంతయైనలేదు. సైతాను ఖుదా యాజ్ఞను పాలింపలేదు. ఐనను ఖుదా వానినేమియుఁ జేయలేకపోయెను. ఒక సైతానును కాఫిరుఁడే. ఖుదానుకూడ లాఖమాఱు పలుచెనన్న నిఁక ముసల్మానుల కథనానుసారము కోట్లకొలఁది కాఫిరులున్న చోట ముసల్మానులఖుదాదికాని, ముసల్మానులదికాని, యేమి సాగఁగలదు? ఇఁక నప్పుడప్పుడు ఖుదాకయిన మొకని రోగమును పెంచుచు. నొంక్రమింపఁజేయుచు నున్నాఁడుగదా! ఈమాటలను ఖుదా సైతానునుండియే నేర్చియుండ వచ్చునుగదా. ఏమన సైతానునకు పంతులు ఖుదాకాక మరి యెవ్వరు కాఁగలఁడు. ॥౧౧॥

౧౨. ఆదామూ! నీవు నీ పెండ్లాము నానందపూర్వకముగ స్వర్గమున నుండి యిష్టమైనచోట తినుఁడు. కాని యాచెట్టుదగ్గఱకుఁ బోకుఁడు. పాపాత్ములగుదురని మేము చెప్పితిమి. సైతాను వారిని మోసపుచ్చెను. మఱి వారిని స్వర్గానందమునుండి తొలగఁజేసెను. అప్పుడు మీలో నొకానొక శత్రువు

కలదు; ఇక నీ నివాసము పృథివి. కొంతకాలమువఱకు లాభము కలదు. దిగుఁడని మేమనఁగా ఆదాము తన స్వామిమాటలు కొన్నిటిని నేర్చుకొని పృథివిమీదికి వచ్చిచేరెను. మం-౧-సి-౧-సూ-౨-అ-౩౩-౩౪-౩౫॥

సమీక్షకుఁడు — ఇక నీ ఖుదా యల్పజ్ఞత్వమును కనుగొనుఁడు: అప్పుడే స్వర్గమందుండుమ లాశీర్వదించెను. మఱి కించిత్కాలానంతరము వెళ్ళుమని చెప్పెను. భవిష్యద్వార్తల నెఱిఁగినవాఁడయిన పక్షమే యెందుల కొసంగియుండును; భ్రమింపఁజేసెడి సైతానును గూడ దండింప నేరనట్లు గోచరమగుచున్నది. మఱి ఆ చెట్టు నెవరికొఱకు పుట్టించి యుండెను; తన కొఱకేనా అన్యులకొఱకా; అన్యుల కొఱకేది యాటంకపఱచిన దెందులకు; కనుక నిట్టి మాటలు 'ఖుదా'విగాని, యతఁడు రచించిన పుస్తకమందలివి గాని కానేరవు. ఖుదానుండి ఆదామెన్ని మాటలు నేర్చికొనివచ్చెను: ఆదాము పృథివిమీదికి వచ్చినప్పుడు ఏప్రకారముగ వచ్చెను: ఆ స్వర్గము పర్వతము మీఁద నున్నదా. ఆకాశముమీఁదనా: దానినుండి యెట్లు దిగివచ్చెను. పక్షివలె వచ్చెనా; లేక మీఁదినుండి ఱాలు పడినట్లా; ఇక ఆదాము మంటితోఁ జేయఁబడెనన్న వీరి స్వర్గమందును, మన్నుండెననికదా దీనివలన విదితమగుచున్నది: ఇక నక్కడ గలవారు నటులే పవిత్రాలు మొదలయినవారు గావచ్చును. ఏల యన మంటిశరీరము లేకున్న ఇంద్రియభోగ మేర్పడఁడాలదు. మఱి పార్థివ శరీరమేని, మృత్యువుగూడ గలుగనే కలుగును. మృత్యువు కలుగు నపుడు, వారక్కడనుండి యెక్కడికి బోవుదురు; మృత్యువు కలుగదన్నవారు పుట్టను లేదనుట స్పష్టము. ఏమన పుట్టిన వారు చావనేరత్తురు. అట్లయిన నిక బీబీలు స్వర్గమం దెల్లప్పుడుందురని, ఖురానునందు వ్రాసినదబద్ధము. ఏలయన వారి కిని మృత్యువు అవశ్యముగా కలుగును. కావున స్వర్గమునకుఁ బోవువారలకుఁ గూడ మృత్యువు కలుగనే కలుగుననుట స్పష్టము. ॥౧౨॥

౧౩. ఒక జీవి వేఱొక జీవియొక విశ్వాసముంచని దినమును గూర్చి భయపడుఁడు. వాని సిఫారసు స్వీకరింపఁబడదు. వానినుండి బదులు తీసికొనఁ బడదు. మఱివారు సహాయము పొందరు.

మం-౧-సి-౧-సూ-౨-అ-౪౮॥

సమీక్షకుఁడు—వర్తమాన దినములందును భయపడ వలదా : క్రీడాస క్తించుట కన్ని దినములందును భయపడవలయును. సిఫారసంగీకరింపఁ బడ నపుడు మరిపైఁగంబరు సాక్ష్యముతోఁగాని సిఫారసుతోఁగాని ఖుదా స్వర్గమిచ్చు ననుమాట యెట్లు సత్యము కాఁగలదు ? ఖుదా స్వర్గస్థులకే సహాయకుఁడా ? నరకస్థులకు గాఁడా ? అటులేని ఖుదా పక్షపాతి యయ్యెను. ॥౧౩॥

౧౪. మేము మూసాకు పుస్తకమును (మోజిజాలను చమత్కార ములను) ఇచ్చితిమి ! నీవు నిందితమైన కోతివికమ్మని ఆయనతోఁ జెప్పి తిమి. ఇటులాయన కెదురుగా వెనుక నుండినవారల కొరకు భయమును, విశ్వాసు లకు బోధను గలిగించితిమి. మం-౧-సి౧-సూ-౨-ఆ-౫౦-౬౧॥

సమీక్ష—మూసాకు పుస్తకము నిచ్చియున్నప్పుడు కురాను అవసరమే యుండఁబోదు. ఇఁక నతని కాశ్చర్యశక్తి నిచ్చెనని బైబిలులోనే కాక కురాను నందును వ్రాయఁబడియున్నది. కాని యీమాట నమ్మఁదగినదికాదు. ఏమన నట్లయియున్న నిపుడు నగుచుండెడిది. ఇప్పుడగుట లేదేని పూర్వమును గాలేదు. స్వార్థులిప్పుడును అవిద్వాంసులలో నెట్లుమేమే విద్వాంసులమని యని పించుకొనుచున్నారో యక్కాలమందును టక్కులుచేసి యుండవచ్చును. ఖుదాయు, నతనిసేవకులు నిప్పుడును గలరు గదా ! ఇఁక నీసమయమున ఖుదా ఆశ్చర్యశక్తినెందులకియ్యఁడు? ఇతరులు చేయఁజాలరనిన మూసాకుపుస్తకము నిచ్చియుండెనుగదా, మరల కురాను నియ్యవలసిన యవసరమేమి యుండెను? శుభాశుభములు చేయుటకు జేయకుండుటకు నుపదేశము సర్వత్ర ఏకవిధముగ నున్నపుడు వేర్వేఱు పుస్తకములు రచించుట వలనఁ బునరుక్తదోషము కలుగు చున్నది. మూసా మొదలగువారికిచ్చిన పుస్తకములందు ఖుదాకొంత మఱచి పోయి యుండెనాయేమి ? ఖుదా నిందితమైన కోతివి గమ్మని కేవలము భయ పెట్టుటకే పలికియున్న నతనిమాట యబద్ధమాయెనా ? లేక యతఁడు టక్కు చేసెనా ? ఇట్టిమాటలు చెప్పువాఁడు ఖుదా కాఁజాలఁడు. ఇఁక దేనియందిట్టి మాటలు గలవో యాపుస్తకము ఖుదా రచితమును కాఁజాలదు. ॥౧౪॥

౧౫. ఈప్రకారము ఖుదా శవములను, మిమ్ములను బ్రతికించు చున్నారు. మీ రెఱుంగుఁదని తన చిహ్నముల గనుఁబఱచుచున్నారు.

మం. ౧-సి-౧సూ-౨-ఆ-౬౫॥

సమీక్షకుఁడు— ఖుదా శవములను బ్రతికించుచుండెనేని యిప్పుడెందులకు బ్రతికించుటలేదు? ఏమి? కయామతు (ప్రళయము) రాత్రి వఱకు సమాధులలోనే పడియుందురా? ఇప్పుడు విచారణార్థమిట్టుండిలో నున్నారాయేమి? ఈశ్వర చిహ్నము లివియేనా? పృథివి, సూర్యుఁడు, చంద్రాదులు ఇవి చిహ్నములు కావా? ప్రపంచములో ప్రత్యక్షముగ నగపడుచున్న నీ వివిధ రచనా విశేషములను చిహ్నములు గాలవా! ॥౧౫॥

౧౬. వారెల్ల కాలము బహిశ్త అను వైకుంఠమందు వసించు వారలు.
మం-౧-సి-౧-సూ-౨-ఆ ౭౫॥

సమీక్షకుఁడు—ఏజీవుఁడయిన ననంతపాపములఁ జేయనేరఁడు కాఁబట్టి యెల్లప్పుడు స్వర్గ నరకములం దుండఁజాలరు. ఖుదా యట్లుంచునేని, యాతఁడన్యాయకారియు, అవిద్వాంసుఁడు నగును. కయామతు రాత్రియందే న్యాయము చేయునేని, మనుష్యుల పాపపుణ్యములు సమాసములై యుండఁదగును. కర్మమనంతమైనది కానపుడు దానిఫల మనంత మెట్లు కాఁగలదు? ఏడెనిమిదివేం సంవత్సరముల కిటీవలనే, సృష్టి నిర్మింపఁబడినట్లు తెలుపుచున్నారు. ఏమి? దీనికి పూర్వము ఖుదా పని లేక కూర్చుండి యుండెనా? కయామత్తను ప్రళయానంతరము నక్లే యూరక గూర్చుండి యుండెనా? ఇవన్నియు పిల్లల మాటలవంటి మాటలే. ఏలయనఁ బరమేశ్వరుని పనులు సర్వదా జరుగుచుండును. ఎవనికేకాని వాని పాపపుణ్యములకుఁ దగినంతటి ఫలమునే యొసంగుచున్నాఁడు. కనుక కురానులోఁ జెప్పబడిన యీమాట సత్యముకాదు. ॥౧౬॥

౧౭—పరస్పరము మీలో మీరుగాని. మీలోనియొకానొక గృహములోనుండిగాని రక్తమును బ్రవహింపఁజేయరాదని మేము మీతోఁ బ్రతిజ్ఞ చేయించినపుడు మీరు ప్రతిజ్ఞఁజేసితిరి. దానికి సాక్షులును మీరే. మరల మీరే మీలో మిరొకరి నొకరు చంపుకొను చున్నారు. మీలోని యొక తెగవారిని వారియిండ్లనుండి వెడలఁగొట్టుచున్నారు. మం-౧-సి ౧-సూ-౨ ఆ ౭౭-౭౮॥

సమీక్షకుఁడు—సరి: ఇట్లు ప్రతిజ్ఞచేయుట, చేయించుట అల్పజ్ఞుల పనియా? లేక పరమేశ్వరునిదగునా? పరమేశ్వరుఁడు సర్వజ్ఞుఁడయిన పుడు సాంసారిక మనుష్యునివలె నిట్టి కఠినవిబంధన నెందుల కేర్పఱచి యుండును? ఇఁక నొండొరులు రక్తముఁ బ్రవహింపఁ జేయరాదు. తమ మతస్థులనిండ్ల

నుండి వెడలఁగొట్టరాదు. అనుట యితరమతస్థుల రక్తమును ప్రవహింపఁజేసి వారి నిండ్లనుండి వెడలఁగొట్టి వచ్చుననుటయేకద. ఇది మంచిమాటయా? ఇది పక్షపాతముతోను పక్షపాతముతోను గూడినమాటయే. మఱి వీరు ప్రతిజ్ఞ నుల్లంఘింతురని మొదటనే పరమేశ్వరునకుఁ దెలిసి యుండకుండెనా? ముసల్మానుల ఖుదాకూడ ననేకాంశములందు క్రైస్తవుల ఖుదాను బోలియే యున్నాఁడు. ఇఁక నీ కురాను స్వతంత్రముగ రచింపఁబడలేదు ఏలయన దీని లోఁగొన్ని మాటలు తప్ప తక్కిన వన్నియు బైబిలులోనివే కలవు. ॥౧౭॥

౧౮—పరలోకమునకు మాఱుగా యిహలోక జీవనమును. ఖరీదు గ్రహించి యున్నవారే వీరు. వారిపాప మెప్పటికిని తగ్గింపఁబడదు. మఱి వారికి సహాయమును చేయఁబడదు. మం-౧-సి-౧-సూ-౨-ఆ-౨౯॥

సమీక్షకుఁడు—మంచిది : ఇటువంటి ఈర్ష్యాద్వేషములతోఁగూడిన మాటలు. ఈశ్వరునివి కాఁగలవా? మఱి ఎవరి పాపములు తగ్గింపఁబడునో, లేక యెవరికి సహాయము చేయఁబడునో వారెవరు? పాపముచేసినవారిని శిక్షింపక వారి పాపములు తగ్గింపఁబడునేని అన్యాయమగును. వారు శిక్షింపఁబడుచు వారి పాపములు తగ్గింపఁబడునన్న నీ ఆయతునఁ జెప్పఁబడిన వారును శిక్షింపఁబడిన వారి పాపములను తగ్గింపఁబడవచ్చును. మఱి దండింపబడిన వారిపాపములు తగ్గింపఁబడనిచో నన్యాయమేయగును. పాపములు తగ్గింపఁబడుననువారు ధర్మాత్ములని యభిప్రాయమేని వారి పాపములు సహజముగనే తగ్గియుండును. ఖుదాచేయునదేమి? కాన నిదియొక విద్వాంసునిచే వ్రాయఁబడినది కాదు. నిశ్చయముగ ధర్మాత్ములకు దుఃఖమును వారి కర్మముల ననుసరించి సదా కలుగ జేయుచుండ వలయును. ॥౧౮॥

౧౯- మేము మూసాకు నిశ్చయముగ పుస్తకము నిచ్చితిమి. అటు వెనుక పిమ్మట మేము పైగంబరును బంపితిమి. మరియము పుత్రుండగు నీసు నీసునకు ప్రకటమైన మోజిజాలను - దైవీశక్తిని - సామర్థ్యము నిచ్చితిమి. *"రూహల్‌కుదస్" తో మీయొద్దకి తద్వస్తు సహితముగ పైగంబరు వచ్చి

* పరిశుద్ధాత్మ యేసు వెంటనుండిన పవిత్రాత్మను రూహల్ కుదస్ అందురు.

నప్పుడు వానిని మీ మనస్సు ఒప్పుకొనలేదు. మరల మీరభిమానించిరి. ఒక మతమును నస్వత పరిచి యొకని బంపుచున్నారు.

మం-౧. సి-౧. సూ-౨. ఆ-౮౭॥

సమీక్షకుఁడు—మూసాకు పుస్తకము నిచ్చెనని కురానునందు సాక్ష్యమున్నప్పుడు దానినొప్పుకొనుట ముసల్మానుల కావశ్యకమయ్యెను. ఆ పుస్తకమునఁగల దోషములుకూడా ముసల్మానుల మతమందు వచ్చిపడెను. మోజిజాలను-దైవీశక్తిని-ప్రకటించు వార్తలన్నియు నసంభవములు. అమాయకులగు మనుష్యులను మోసపుచ్చుటకు వట్టిటక్కులుగ నున్నవి. ఏలన సృష్టిక్రమమునకు, విద్యకును, విరుద్ధమగు వార్తలన్నియు నబద్ధములే. ఆసమయమున "మోజిజా" లుండిన నీసమయమున నేలలేవు? ఈసమయమున లేవేని యాసమయమునను లేక యుండెననుటకు సందేహమేమియు నుండదు.॥౧౯॥

౨౦— దీనికి బూర్వము కాఫిరులను జయింపఁ గోరుచుండిరి. కొంత గుర్తెరింగి నప్పుడతఁడు వారివద్దకు వచ్చెను. తత్క్షణమే కాఫిరులయిరి. కాఫిరులకు (అల్లా) దేవుని ధిక్కారము (లానతు).

మం-౧-సి-౧ సూ-౨-ఆ-౮౨॥

సమీక్షకుఁడు — మీరు అన్యమతస్థులను కాఫిరులనునట్లు వారును మిమ్ముల కాఫిరులనకుందురా? అట్లే వారు తాము నమ్మిన యీశ్వరుని ధిక్కారము (లానతు) మీ మీఁదఁగల దందురు. ఇంక నిప్పుడు సత్యవంతుఁ డెవఁడో, యసత్యవంతుఁడెవఁడో చెప్పుడు? విచారించి చూచిన, సకల మతస్థులలో నసత్యమున్నట్లు గోచరమగుచున్నది. ఇంక సత్యమైనది, సర్వత్రైకవిధముగానే యున్నది కాన నీ వాదములన్నియు మూర్ఖత్వముతోఁ గూడినవే. ॥౨౦॥

౨౧. అల్లా అసంభవసందేశము విశ్వాసులకు మాత్రము ఫరిశ్తాలకు పైగంబరులకు, జిబిరయీలులకు, మికాయీలులకు, శత్రువగు కాఫిరులకు అల్లాకూడ శత్రుఁడు. మం-౧—సూ—౨—ఆ—౯౧॥

సమీక్షకుఁడు — ఖుదా (లాశరీక్) అసమ్మిళితుఁడని ముసల్మానులు చెప్పుకొనుచున్నారే. ఈ సైన్యమునంతటి నెక్కడనుండి (శరీక్) సమ్మిళిత పఱచిరి? ఏమి? అన్యులకు శత్రుఁడయినవాఁడు, ఖుదాకుకూడ శత్రుఁడా?

అటులేని యది సరికాదు. ఏలయన నీశ్వరుఁడెవ్వనికిని శత్రుఁడు కానే రఁడు. ॥౨౧॥

౨౨. క్షమాపణ గోరుచున్నారని చెప్పుఁడు. మేము మీరు మిక్కిలి మేలుచేయువారు చేసిన పాపములు క్షమింతుము.

మం—౧. సి—౧. సూ—౨. ఆ—౩౪॥

సమీక్షకుఁడు—సరి: ఖుదా యీయుపదేశ మందఱను పాపులను చేయుటదియా? కాదా? ఏమన, పాపములు క్షమింపఁబడుననునాశ్రయము మనుష్యులకు లభించునప్పుడు, పాపములు చేయుట కెవ్వఁడును వెఱవకుండును. కావున నిట్లు చెప్పువాఁడు ఖుదాకాని, యిది ఖుదాచే నిర్మింపఁబడిన పుస్తకము కాని కాఁజాలదు. ఏమన సతఁడు న్యాయకారి. అన్యాయ మొకప్పుడును నియఁడు. పాపములు క్షమించుచున్న నన్యాయకారి యగును. ౨౨॥

౨౩. మూసా తనజాతివారికొఱకు నీటి నడిగినపుడు నీ "అసా" చేతి కఱ్ఱను కాతిమీద కొట్టుమని మేమంటిమి. అందులోనుండి పంౘ్రెండు చెంమలు వెల్లువలై పాఱెను. మం-౧. సి-౧-సూ-౨. ఆ-౩౬॥

సమీక్షకుఁడు—ఇప్పుడు చూడుఁడు: ఇటువంటి యసంభవములయిన మాటల నితరుఁడెవఁడయినను చెప్పునా? ఒకానొక రాతిమీద కఱ్ఱను కొట్టుటచే పంౘ్రెండు చెలమలు వెల్లువలై పాఱెననుట సర్వథాయసంభవము కాని ఆ రాతిని లోపలనుండి తొలచి, యందు నీటినినింపి దానికి పంౘ్రెండు రంధ్రములు చేసియుంచిన నదిసంభవము కాఁగలదు. లేనిచో కానేరదు. ॥౨౩॥

౨౪. అల్లా దయతో తనకిష్టమయిన వానిని ముఖ్యునిఁ జేయుచున్నాఁడు. మం—౧-సి—౧. సూ—౨.ఆ—౯౯॥

సమీక్షకుఁడు—ఏమి! ముఖ్యుఁడగుటకును, దయచూపఁ బడుటకును యోగ్యుఁడు కాని వానినికూడ ప్రధానునిగా చేసి వానిపై దయఁజూపునా! అటులేని ఖుదా కడు గందరగోళముఁ జేయువాఁడై యున్నాఁడు. ఏమన నింక మంచి కార్యముల నెవఁడు చేయును? మఱి చెడుకార్యముల నెవఁడు మానును? ఏలయనఁ గర్మఫలమునుగాక ఖుదా ప్రసన్నతనే ముఖ్యమని భావించుచున్నారు. దీనివలన నందఱి ప్రతిష్ఠకు హానికలిగి కర్మోచ్ఛేదము కాఁదొడఁగును. ॥౨౪॥

౨౫. కాఫిరులు ఈర్ష్యచే మిమ్ములను "ఈమాన్" విశ్వాసము నుండి తొలఁగఁ జేయకుందురుగాక. వారియందనేకులు విశ్వాసులకు స్నేహితులై యున్నారు. మం—౧. సి—౧. సూ—౨. ఆ—౧౦౧॥

సమీక్షకుఁడు—ఇప్పుడు చూడుఁడు! మీ విశ్వాసమును కాఫిరులు తొలగింపకుందురు గాక యని ఖుదాయే వారిని హెచ్చరించుచున్నాడు. ఏమి! అతఁడు సర్వజ్ఞుఁడుకాఁడా! ఇట్టి మాటలు ఖుదావి కాఁజాలవు. ॥౨౫॥

౨౬. మీరెటు ముఖముపెట్టిన నటు అల్లా ముఖము కలదు.
మం—౧. సి—౧. సూ—౨. ఆ—౧౦౯॥

సమీక్షకుఁడు— ఈమాట సత్యమేని ముసల్మానులు "కిబలా" పశ్చిమదిక్కునకు ముఖమునేల పెట్టుచున్నారు? మాకు కిబలా దిక్కునకే ముఖము నుంచవలయునను ఆజ్ఞగలదందురేని ఇష్టమైన దిక్కునకును ముఖ ముంచ వచ్చునను నాజ్ఞకూడగలదుగద ఏది? ఒక మాటసత్యమై మఱొకటి యసత్య మగును? అల్లాకు ముఖము కలదేని యది యన్ని దిక్కులకు నుండనేరదు. ఏమన నొకముఖ మొక దిక్కున నుండగలుగునుగాని అన్ని దిక్కులకు నెట్లుండఁగలుగును? కాన నిది యసంగతము. ॥౨౬॥

౨౭. ఆకాశమును భూమిని ఉత్పన్నము చేయువాఁడగు నతఁడు దేని నయిన చేయఁగోరుచున్నప్పుడు అతనికి దానిని చేయవలసిన యగత్యముండదు. కాని 'కమ్మ' అని యనినంత మాత్రమున నది యగుచున్నది.
మం—౧. సి—౧. సూ—౧. ఆ—౧౧౭॥

సమీక్షకుఁడు— సరి! కమ్మఅని ఖుదా ఆజ్ఞాపించినపుడు ఆ యాజ్ఞ నెవఁడు వినెను? అతఁడెవనికి వినిపించెను? మఱి యేమయ్యెను? ఏకారణమునుబట్టి చేసెను? సృష్టికి పూర్వము ఖుదా తప్ప మఱి యేవస్తువును లేక యుండెనని వ్రాయుచున్నారే! ఈ సంసార మెక్కడనుండి రాఁగలిగెను? కారణములేక యేకార్యమును కానేరదేని యింతగొప్ప జగత్తు కారణములేక యెక్కడనుండి గలిగెను? ఇది కేవలము పసిబిడ్డల మాటయే. (పూర్వపక్ష) కాదుకాదు. ఖుదా యిచ్ఛనుండి. (ఉత్తరపక్ష) ఏమి. మీ యిచ్ఛవలన నొక యాఁగకాలమునను కాఁగలదా? ఖుదా యిచ్ఛనుండియే ఈ జగత్తంతయు నయ్యెనసుచున్నారు? (పూర్వపక్ష) ఖుదా సర్వశక్తిమంతుఁడుగనుక కోరిన

దానిఁ జేసివేయుచున్నాఁడు. (ఉత్తరపక్షి) సర్వశక్తి మంతుఁడనగా నర్థ మేమి? (పూర్వపక్షి) కోరినదానిఁ జేయఁగలవాఁడు. (ఉత్తరపక్షి) ఖుదా మరియొక ఖుదాను కూడఁ జేయఁగలఁడా? తనంతటదానే చావఁగలఁడా? అటులే మూర్ఖుఁడును రోగియు నజ్ఞానియు కాఁగలఁడా? (పూర్వపక్షి) ఇటు లెన్నఁడును గాఁజాలదు. (ఉత్తరపక్షి) అందులకే పరమేశ్వరుడు తన — యితరుల గుణకర్మ స్వభావములకు విరుద్ధముగ నేమియుఁ జేయఁజాలఁడు. సంసారమున నొకవస్తువు గలుగుటకును కలుగఁ జేయుటకు మొదట మూఁడు పదార్థము లుండి తీరవలయును:-ఒకటి చేయువాఁడు కుమ్మరివాఁడు. రెండవది ఘటముచేయుటకు మన్ను. మూఁడవది దేనిచే నాఘటము చేయఁబడునో అసాధనము. కుమ్మరివాఁడు, మన్ను, సాధనములు వీనిచే ఘటము తయారగును. ఆ చేయఁబడు ఘటమునకుఁ బూర్వము కుమ్మరివాఁడు, మన్ను, సాధనము లుండునటులే జగత్తు చేయఁబడుటకుఁ బూర్వమును జగత్కారణంబను ప్రకృతియు, వాని గుణకర్మ స్వభావములును, అనాదులే కావున నీకురాను నందుఁ జెప్పినది సర్వదా అసంభవము. ॥౨౭॥

౨౮. మేము లోకులకొఱకు కాబా అను పవిత్రస్థానమును సుఖకరముగా చేసియున్నాము. మీరు నమాజుకొఱకు ఇబ్రహీము స్థానమును గైకొనుఁడు. మం. ౧-సి-౧-సూ-౨-౧౧౮॥

సమీక్షకుఁడు—ఖుదా కాబాకు పూర్వమొక పవిత్రస్థానమును చేయనే యుండెనా? చేసెనన్న కాబాను చేయవలసిన యావశ్యక మేమియు లేక యుండెను. చేయలేదందురేని పూర్వోత్పన్నులను పవిత్ర స్థానము లేకయే ఉంచియుండెనా? మొదట నీశ్వరునకు పవిత్రస్థానము చేయవలెనను స్మరణ లేకుండ వచ్చును. ॥౨౮॥

౨౯. ఇబ్రహీము 'దీన్' మతమునుండి తిరుగు మనుష్యులెవరు? కాని తనజీవమును మూర్ఖమైనదిగా చేసికొన్న వానినే ప్రపంచమందు నిశ్చయముగ మేము మెచ్చితిమి. నిశ్చయముగ పరమందు వాఁడే ధర్మాత్ముఁడు. మం ౧-సి-౧-సూ-౨-౧౨౨॥

సమీక్షకుఁడు—ఇబ్రహీము మతము నొప్పని వారందఱు మూర్ఖులనుట సంభవమగునా? ఇబ్రహీమునే ఖుదా మెచ్చుకొనెనన్న దీనికి కారణమేమి?

ధర్మాత్ముఁడయినందున మెచ్చునేని ధర్మాత్ములింక నెంతతో కావచ్చును— ధర్మాత్ముఁడు కాకున్నను మెచ్చుకొనెనేని అన్యాయమయ్యెను. ధర్మాత్ముఁడే యీశ్వరునకు ప్రియుఁడగుననుట మాత్ర ముచితమేకాని ధర్మహీనుఁడగుననుట యుచితముగాదు. ॥౨౯॥

౩౦. నిశ్చయముగ మేము నీ ముఖము నాకసమునఁ దిరుగుచున్నట్లు చూచుచున్నాము. అవశ్యముగ మేము నిన్నాకిబలా దిక్కునకు త్రిప్పుదుము. దానిని మెచ్చుకొందువుకాక. కాన నీ ముఖమును మస్జిదుల్హరాం దిక్కునకు త్రిప్పుము. మీరెక్కడనున్నను మీ ముఖము నా వైపునకు త్రిప్పుకొనుఁడు.

మం-౧-సి-౨-సూ-౨ఆ-౧౩౪॥

సమీక్షకుఁడు—ఏమి ? ఇది చిన్న విగ్రహారాధనమా ? కాదు పెద్దదే. (పూర్వపక్షి) ముసల్మానులమగు మేము (బుత్పరస్త్) విగ్రహారాధకులము కాము కాని (బుత్శికన్) విగ్రహభంజకులము. ఏలయన మేము కిబలాను ఖుదా యనుకొనము. (ఉత్తరపక్షి) మీరెవరిని విగ్రహారాధకు లనుచున్నారో వారుకూడ నా విగ్రహముల నీశ్వరుఁడని యనుకొనరు. కాని వాని యెదుట నాపరమేశ్వరుని భజించుచున్నారు. మఱి మీరు విగ్రహభంజకులేని ఆ మస్జిదు కిబలా అను పెద్ద విగ్రహము నెందులకుఁ బడద్రోయరేదు ? (పూర్వపక్షి) ఏమండీ ! కిబలా దిక్కునకు ముఖముంచవలెనను నాజ్ఞ మాకు కురానునఁగల దుగాని వీరలం దట్లువేదమందు యాజ్ఞ లేదు. కాన వీరు విగ్రహారాధకులేం గారు ? మేమెట్లగుదుము ? ఏలయన ఖుదా యాజ్ఞను పాలించుట మా కావశ్యకమేకద. (ఉత్తరపక్షి) మీకు కురానునం దాజ్ఞ యున్నట్లు వీరికి పురాణములం దాజ్ఞకలదు. మీరు కురానును (ఖుదా) దేవవాక్యమని భావించు చున్నట్లు ఈ పౌరాణికులు ఖుదా యవతారమను వ్యాసులవారు రచించిన పురాణములను దేవవాక్యములని భావించుచున్నారు. మీయందును వీరియందును, (బుత్పరస్తీ) విగ్రహారాధనమందు భేదమేమియులేదు. కానమీరు పెద్ద విగ్రహారాధకులు వీరు చిన్న విగ్రహారాధకులు అగుదురు. ఏమన నొకానొక మనుష్యుఁడు తన యింటఁ బ్రవేశించిన పిల్లి ని తీయఁగా నింటిలో లొట్టపిట్ట ప్రవేశించెనన్నట్లు మహమ్మదుసాహెబు చిన్న విగ్రహారాధనమును ముసల్మానులలోనుండి తొలఁగించెను. కాని పర్వతమువంటి మక్కామసీదను పెద్దవిగ్రహమును అతఁడు

ముసల్మానుల మతమందు ప్రవేశింపజేసెనే ! ఏమి ; ఇది చిన్న విగ్రహారాధనమా ? కాబట్టి మేము వైదికులమై యున్నట్లు మీరుకూడా వైదికులుగుదురేని, ఈ విగ్రహారాధనము మొదలగు దోషములనుండి తొలఁగియుండఁ గలుగుదురు. లేనిచోఁ దొలఁగి యుండనేరరు. మీరు మీ యీ పెద్ద విగ్రహారాధనమును దూరముచేసికొనని సంతవఱకు నితర చిన్న విగ్రహారాధనము నుండి దూరమై పవిత్రులు కాఁదగుదు. ॥౩౦॥

౩౧. ఎవరు అల్లా మార్గమునఁ జంపఁబడుచున్నారో వారు మృతి నొందిరని తలఁపకుఁడు. వారు జీవితులే. మం-౧-సి-౨-ఆ౧౪౪॥

సమీక్షకుఁడు—సరి ! ఈశ్వరమార్గమందు జచ్చుటకుఁగాని చంపుటకుఁగాని యవసర మేమికలదు ? ఈమాట తమ ప్రయోజనమును సిద్ధింపఁజేసికొనుటకేయని యెందులకు చెప్పరు ! అనఁగా నిట్టిలోభమును కల్పించిరేని, లోకులు బాగుగా పోట్లాడఁగలుగుదురు. తమకు విజయము కలుగును. చంపుటకును వెఱవకుందురు. దోపిడిచేయించుట వలన నైశ్వర్యము లభించును. అటుపిమ్మట విషయానందముఁ బడయవచ్చును అనునిత్యాది తమ ప్రయోజనములు సిద్ధించుననియేకద యీ విపరీతములు కల్పించియున్నారు. ॥౩౧॥

౩౨. అల్లా కఠినదుఃఖముఁ గలుగఁజేయు వాఁడయి యున్నాఁడు. సైతాను ననుసరించి చనకుఁడు. నిశ్చయముగ నతఁడు మీకు ప్రత్యక్షశత్రువు. చెఱుపును సిగ్గుమాలిన పనులను చేయుటకుఁ దప్ప మఱేమియు నాజ్ఞాపింపఁడు ఇంక మీరు అల్లాపైన వేసి మేమెఱుగమని చెప్పఁడు.

మం-౧-సి-౨-సూ-౨౮-౧౬౪-౧౬౮॥

సమీక్షకుఁడు—ఏమి ; దయాళువయిన ఖుదా పాపాత్ములకును, పుణ్యాత్ములకును గూడ కఠిన దుఃఖమును కలుగఁజేయునా ? లేక ముసల్మానుల మీఁద దయగలిగిన, అన్యులమీఁద దయలేని వాఁడయి యున్నాఁడా ? అటులయినచో నతఁడీశ్వరుఁడే కాఁజాలఁడు. ఇంక పక్షపాతము చేయఁడేని ఎవఁడెక్కడ నున్ననేమి, ధర్మము చేయువానిమీఁద నా ఈశ్వరుఁడు దయతలవాఁడు, అధర్మము చేయువానిని శిక్షించువాఁడునగును, అటులయిన నడుమ మహమ్మదు సాహెబునుగాని, ఖురానునుగాని, నమ్మవలసిన యవసరమే యుండదు. మఱి మనుష్య మాత్రులకు (శత్రువు (సైతాను)) అందఱకుఁగీడు గలుగఁ జేయుచు

న్నాఁడన్న నాసైతానును ఖుదా పుట్టించుట యెందులకు? అతఁడు భవిష్యద్వా ర్తల తెలియకుండెనా? తెలియుచునే యుండెను. కాని పరీక్షించుటకు పుట్టించెననన్న సరిగాదు. ఏమన పరీక్షించుట యల్పజ్ఞునిపని. సర్వజ్ఞుఁడగువాఁడు యథార్థముగ జీవులందఱి మంచిచెడు కర్మముల సర్వదా తెలిసికొనుచునే యున్నాఁడు. సైతానందఱను భ్రమింపఁజేయునన్న నా సైతాను నెవఁడు భ్రమింపఁజేసెను? సైతాను స్వయముగ మార్గభ్రష్టుఁడయ్యెనంటిరేని యితరులుకూడ తమంతటఁదామే మార్గభ్రష్టులగుదు రనవచ్చునుగదా? నడుమ సైతాను నవసరమేమి? ఖుదాయే సైతానును భ్రమింపజేసెనేని ఆఖుదా సైతానుకు మించిన సైతానగును. కాన నిది ఈశ్వర వాక్యము గాఁజాలదు. ఇంక నెవ్వఁడేకాని దుస్సంగతి, అజ్ఞానము అను వీనిచేఁదప్పక భ్రాంతిలోఁ బడుచున్నాఁడనుట స్పష్టము. ॥౩౨॥

౩౩. (ముర్దారు) శవము, పంది మాంసము, రక్తము మఱి ఆలక్ష్యములు (హరాము). అల్లామీదఁగాక మఱొకనిమీఁద బిలువబడు నదియును హరామే. మం. ౧ సి-౨-సూ ౨. ఆ-౧౭౩॥

సమీక్షకుఁడు—ఇచట విచారింపవలసియున్నదే మన దేహి తనంతటఁ దాఁజచ్చినదేమి. ఒకనిచే చంపఁబడినదేమి? ఈ రెండువిధముల నది (ముర్దారే) శవము నేయగునుగదా? ఇంత వీనియందు కొంత భేదమున్నను. ప్రకృతతత్త్వమందు మాత్రము భేదమేమియు లేదు. ఒక పంది మాంసమే నిషేధించఁబడెనేని మనుష్యుని మాంసము తినవచ్చునా? పరమేశ్వరుని పేరుమీఁద శత్రువులు మొదలగు వారి కత్యంత దుఃఖము గలుగఁజేయుచు ప్రాణహత్య చేయుచు నుండెదేని? దీనివలన ఈశ్వరనామమునకు కళంకము కలుగుచున్నది. మంచిది. "పూర్వజన్మ" మందలి యపరాధములచే లేనపుడు దారుణమగు దుఃఖము నీశ్వరుఁడు ముసల్మానుల కెందులకు కలుగఁజేసెను? వారిమీఁద దయగల వాఁడుకాఁడా? వారిని పుత్రులవలె నెంచఁడా? మహోపకారమొసఁగు నావు మున్నగు పశువుల వధింపఁగూడదని నిషేధింపక పోవుటవలన నా ఖుదా హత్యలు చేయించుచు జగత్తునకు హాని కలుగఁజేయువాఁడై యున్నాఁడనుట స్పష్టము. ఇది హింసా రూపపాపముచే గళంకితుఁడగుచున్నాఁడు. ఇట్టి మాటలు ఖుదావికాని ఖుదాపుస్తకమందలివిగాని యెన్నటికినికాఁజాలవు. ॥౩౩॥

౩౪. (రోజాలు) ఉపవాస దినములు మీకు హలాలు. మీస్త్రీలతో మదనోత్సవము జరుపుడు. వారు మీకు పర్దా (తెర) గాను మీరు వారికి పర్దా (తెర) గానున్నారు. మీరు దొంగతనము చేయుచున్నారు అనగా వ్యభిచరించుచున్నారని యల్లాకు దెలిసెను. కాని అల్లా మిమ్ముల క్షమించెను-వారితో కలియుడు: నల్లదారము తెల్లగానగ పడు వఱకుగాని రాత్రిగడచి దినము ప్రకటమగువఱకుగాని అల్లా మీ కొఱకు వ్రాసినదానిని (సంతానమును) వెదకుడు, తినుడు, త్రాగుడు. మం ౧-సి-సూ-౨-ఆ ౧౮౭॥

సమీక్షకుడు—ముసల్మానుల మతము కొనసాగినపుడో లేక అంతకు పూర్వమో ఒకానొకడొక పౌరాణికునితో ఒక నెలవఱకు జరుపబడు చాంద్రాయణ వ్రతవిధి యెట్లని యడిగి యుండవచ్చును. అతడు చంద్రునికి హెచ్చుతగ్గులు చెందునట్లు కబళముల నెక్కువగను తక్కువగను చేయుచు మధ్యాహ్న సమయమందే తినవగునని వ్రాయబడియున్న శాస్త్రవిధిని తెలిసికొనలేక, చంద్రుని దర్శనము చేసికొని తినవలెనని చెప్పియుండవచ్చును. దానిని ముసల్మానులీప్రకారముగ సర్థము చేసికొనిరి. ఇక ప్రతిదినమందు స్త్రీ సమాగమము కూడదని యుండగా మీరు నిరాటంకముగా స్త్రీలతో సమాగమము చేయుడనియు, రాత్రులందు దిష్టమైనన్ని సార్లు తినుడనియు, ఖుదా యీమాటనొకదానిని విశేషముగా చెప్పియున్నాడుగా! సరి యిదియొక వ్రతమా? దినమందు తినుట లేదుగాని రాత్రియందు తినుచున్నారు. ఇట్లు దినమందు తినక, రాత్రియందుతినుట సృష్టిక్రమమునకు విపరీతము.॥౩౪॥

౩౫- అల్లా మార్గమున మీతో పోట్లాడు వారితో పోట్లాడుడు, మీరు వారిని దొఱకినచోట చంపివేయుడు "కతల్" హత్య చేయుటకంటె "కుఫ్ర్" పాపము పెద్దది. కుఫ్ర్ దూరమయి అల్లా మతము (దీన్) స్థిరపడువఱకు పోట్లాడుడు. మీ యెడ వారు చేసినన్ని యత్యాచారములు మీరువారి యెడ చేయుడు.

మం-౧-సి-౨. సూ-౨-౧౯౦-౧౯౧-౧౯౨-౧౯౩॥

సమీక్షకుడు—కురానునందిట్టిమాటలు వ్రాయబడకున్న ముసల్మానులన్యమతస్థులయెడ నంతటి గొప్ప యత్యాచారములు చేసి యుండరుగద! అపరాధము లేనివారిని జంపుట వారికి గొప్పపాపమే. ముసల్మానుల మత

౩౪. (రోజాలు) ఉపవాస దినములు మీకు హలాలు. స్త్రీలతో సంభోగోత్సవము జరుపుఁడు. వారు మీకు పర్దా (తెఱ) గాను మీరు వారికి పర్దా (తెర) గానున్నారు. మీరు దొంగతనము చేయుచున్నారు అనఁగా వ్యభిచరించుచున్నారని యల్లాకుఁ దెలిసెను. కాని అల్లా మిమ్ముల క్షమించెను-వారితోఁ గలియుఁడు: నల్లదారము తెల్లగానగ పడు వఱకుఁగాని రాత్రిగడచి దినము ప్రకటమగువఱకుఁగాని అల్లా మీ కొఱకు వ్రాసినదానిని (సంతానమును) వెదకుఁడు, తినుడు, త్రాగుడు. మం ౧-సి-సూ-౨-ఆ ౧౮౭॥

సమీక్షకుఁడు—ముసల్మానుల మతము కొనసాగినప్పుడో లేక అంతకు పూర్వమో ఒకానొకఁడొక పౌరాణికునితో ఒక నెలవఱకు జరుపఁబడు చాంద్రాయణ వ్రతవిధి యెట్లని యడిగి యుండవచ్చును. అతఁడు చంద్రునికి హెచ్చుతగ్గులు చెందునట్లు కబళముల నెక్కువగను తక్కువగను చేయుచు మధ్యాహ్న సమయమందే తినఁదగునని వ్రాయఁబడియున్న శాస్త్రవిధిని తెలిసికొనలేక, చంద్రుని దర్శనము చేసికొని తినవలెనని చెప్పియుండవచ్చును. దానిని ముసల్మానులీప్రకారముగ నర్థము చేసికొనిరి. ఇంక వ్రతదినమందు స్త్రీ సమాగమము కూడదని యుండగా మీరు నిరాటంకముగా స్త్రీలతో సమాగమము చేయఁదగినదియు, రాత్రులం దిష్టమైనన్ని సార్లు తినఁదగినదియు, ఇంకా యీమాటనొకదానిని విశేషముగాఁ జెప్పియున్నారుగా : ఇది యిదియొక వ్రతమా ? దినమందుఁ దినుట లేదుగాని రాత్రియందుఁ దినుచున్నారు. ఇట్లు దినమందు తినక, రాత్రియందుతినుట సృష్టిక్రమమునకు విపరీతము.॥౨౪॥

౩౫- అల్లా మార్గమున మీతోఁ బోట్లాడు వారితోఁ బోట్లాడుఁడు, మీరు వారిని దొఱికినచోట చంపివేయుఁడు "కతల్" హత్య చేయుటకంటె "కుఫ్ర్" పాపము పెద్దది. కుఫ్ర్ దూరమయి అల్లా మతము (దీన్) స్థిరపడువఱకు పోట్లాడుఁడు. మీ యెడ వారు చేసినన్ని యత్యాచారములు మీరువారి యెడఁ జేయుఁడు.

మం—౧—సి—౨. సూ—౨—౧౦౪—౧౮౫—౧౮౬—౧౮౭—౧౮౯॥

సమీక్షకుఁడు—కురానునం దిట్టిమాటలు వ్రాయఁబడకున్న ముసల్మానులన్యమతస్థులయెడ నంతటి గొప్ప యత్యాచారములు చేసి యుండరుగద : అపరాధము లేనివారిని జంపుట వారికి గొప్పపాపమే. ముసల్మానుల మత

౨౮. నిన్ను ప్రశ్నింతురు. రజస్వలయైన స్త్రీతో "నీవు మాలిన్యముతోఁ గూడియున్నావు" అనిచెప్పుము. ఋతుసమయమందు కొంచెము యుండుఁడు. వారు మాలిన్యమునుండి దూరముకానంత వఱకు వారికడకు పోకుఁడు జలకమాడినపుడు వారికడకు అస్థానమునకుఁ జనుఁడు. ఖుదా ఆజ్ఞఇచ్చియున్నాఁడు. మీ స్త్రీలు మీకు పొలముల వంటివారు. కాన నిష్టమైనట్లు తమ పొలములకుఁ జనుఁడు. మిమ్ములను అల్లా (ఁగటు) వ్యర్థశపథమందు) పట్టుకొనఁడు:

మం-౧-సి-౨-సూ-౨౦౪-౨౦౬-౨౦౭.

సమీక్షకుఁడు — రజస్వలను తాకుటయుఁ, గూడుటయు తగదని వ్రాయుటమంచిదే. కాని స్త్రీలను పొలమువంటి వారనియు, వారితో నిష్టమైనట్లు వర్తింపుడనియు వ్రాయుట మనుష్యులను విషయలంపటులుగా జేయుటకుఁ గారణమైయున్నది. ఖుదా వ్యర్థశపథములు చేసినఁబట్టఁదేని యందఱు నబద్ధముఁబలుక గలుగుదురు. శపథమును భంగపఱుప గలరు. దీనివలన ఖుదా అబద్ధమునుఁ బ్రవర్తింప జేయువాఁడగును. ॥౨౮॥

౨౯. అల్లాకు ఋణమిచ్చు మనుష్యుఁడెవఁడు? మంచిది; కావిందు అల్లావానికి తన్నిమిత్తము రెండింతలు కలుగఁజేయును.

మం-౧-సి-౨-సూ-౨౪-౨౨౫.

సమీక్షకుఁడు—భలా! ఖుదాకు అప్పు (ఉద్దెర) *పుచ్చు కొనవలసిన యవసరమేమి? సమస్త ప్రపంచమును రచించినవాఁడు మనుష్యునినుండి యప్పు తీసికొనుచున్నాఁడా? ఇది యెన్నటికిని సంభవింపదు. ఎఱుగనివారు చెప్పవలసినదే. ఏమన అతనికోశము రిక్తమై యుండెనా? ఋణము పుచ్చుకొన నుద్యుక్తుఁడయ్యెనా? అతఁడు హుండీలు చెల్లించుచు వ్యాపారాది వ్యవహారములందుఁ దగులుకొని యున్నందున నష్టపడియుండెనా? యేమి? ఒకటికి రెండింతలీయ స్వీకరించుచున్నాఁడు. ఇది సాహుకారులవంటిపనియా?

* ఈ ఆయతు వాక్యమందు తపసీర్ హుసేనీలో నిట్లు వ్రాయబడెను. ఒక మనుష్యుఁడు మహమ్మదు సాహెబుదగ్గరకు వచ్చి ఓ రసూలల్లాహ! ఖుదా అప్పు ఎందుల కడుగుచున్నాఁడని యడిగెను. మిమ్ముల స్వర్గమునకు తీసికొని పోవుటకని వారుత్తరమిచ్చిరి. అతడు మీరు హామీయున్నా యనుచనెను. మహమ్మదుసాహెబు జామీనుండెను. దేవుని ('ఖుదా') యందు విశ్వాసము కలుగలేదు. కాని యతని దూతయందుఁ గలిగినది.

ఐన నిట్టిపని దివాలాదీయువా ను. అధికముగా వ్యయపఱచువారును న్యూనా దాయము కలవారును చేయవలసినదేకాని యీశ్వరుఁడుగాదు. ॥౩౯॥

౪౦-వారిలో నొకానొకనికి "ఈమాన్" విశ్వాసము కుదిరెను. మఱొకఁడు కాఫిరు అయ్యెను. అల్లాకిష్టమైయున్న కొట్లాడకయుందురు. అల్లా తనకిష్టమైన దానిని చేయుచున్నాఁడు.

మం—౧సి—౩—సూ—౨—ఆ—౨౩౫॥

సమీక్షకుఁడు—ఏమి? జరిగెడుయుద్ధము ఈశ్వరేచ్ఛ వలననే జరుగు చుండునా? అతఁడధర్మ మొనరింపఁగోరిన నొనరింపఁగలఁడా? అటులయిన నతఁడీశ్వరుఁడేకాఁడు. ఏలయన నిట్లు శాంతిభంగము కలుగఁజేసి యుద్ధము చేయించుట సజ్జనుల పనికాదు. దీనివలన నీ "కురాన్" ఈశ్వర నిర్మితము కాదు. ఒకధార్మిక విద్వాంసునిచే రచింపఁబడినదియు కాదని విస్పష్ట మగు చున్నది. ॥౪౦॥

౪౧. ఆకాశమందు భూమియందు నున్నదంతయు నతనికొఱకే యున్నయది. అతని (కురిసీ) భూమ్యాకాశముల నాక్రమించుకొన్నది.

మం—౧—సి—౩—సూ—౨ ఆ—౨౩౭॥

సమీక్షకుఁడు—భూమ్యాకాశములందుఁగల పదార్థముల నన్నిటిని, పరమాత్ముఁడు జీవులకొఱకుఁ బుట్టించియున్నాఁడేకాని తనకొఱకుఁగాదు. ఏమన నతఁడు పూర్ణకాముఁడగుటచే నతనికొక పదార్థాపేక్షలేదు. అతనికి కురిసీ కలదేని యతఁడేకదేశియుఁడగును. ఏకదేశీయుఁడయిన వాఁడు ఈశ్వరుఁడనఁ బడనేరఁడు. ఈశ్వరుఁడు సర్వవ్యాపకుఁడు. ॥౪౧॥

౪౨. అల్లాసూర్యుని తూర్పు దిక్కునుండి తెచ్చుచున్నాఁడు గాన నీవు పడమర దిక్కునుండి తీసికొనిరమ్ము. అప్పుడు కాఫిరు చిక్కుఁబడెను. అల్లా పాపులకు నిశ్చయముగ మార్గముఁజూపఁడు.

మం—౧—సి—౩—సూ—౨—ఆ—౨౪౦॥

సమీక్షకుఁడు—ఈ యజ్ఞాన యుక్తమగు విషయమును గమనింపుఁడు! సూర్యుఁడొకప్పుడైనను తూర్పునుండి పడమరకుఁగాని పడమరనుండి తూర్పునకుఁగాని వచ్చుచు పోవుటలేదు. కాని అతఁడు తనపరిధియందు మాత్రము తిరుగు చుండును. దీని వలన కురానును రచించినవానికి భూగోళవిద్యగాని,

భూగోళవిద్యగాని యెంతమాత్రము తెలియక యుండెననియే నిశ్చయమగు చున్నది. పాపులకు మార్గముఁజూపఁడేని. ఈ ముసల్మానుల ఖుదా యావశ్యకత పుణ్యాత్ములకునులేఁదు. ఏమన ధర్మాత్ములు ధర్మమార్గమందే నడతురు. గాన మార్గముఁజూపవలసిన యవసరము ధర్మముదప్పిన వారికే కలదు. కాఁబట్టి తన కర్తవ్యమును పాలింపనందున కురాను చేసినవానిది గొప్ప పొరపాటనియే విదిత మగుచున్నది. ॥౪౨॥

౪౩. పక్షులలోనుండి నాలుగింటిని తీసికొనుము. వాని ముఖముల బుత్తిలో నుంచుకొనుము. ప్రతి పర్వతముమీఁద వాని యొక్కొక్కముక్కను పెట్టియుంచుము. తిరిగి వానిఁ బిలువుము. నీయొద్దకిఁ బరుగెత్తుచు వచ్చునవెను. మం-౧-సి-౩-సూ-౨-ఆ-౨౪౨॥

సమీక్షకుఁడు—మేల్మేలు ! ముసల్మానుల ఖుదా, భానుమతి వింతలు చేయుచున్నాఁడు ! ఖుదా ఖుదాలనమిటువంటి కార్యముల వలననే బోధపడునా ఏమి ? బుద్ధిమంతులిట్టి ఖుదాకు తిలాంజలి యిచ్చి దూరముగా నుందురు. కాని మూర్ఖులు మాత్రము చిక్కిపోదురు. ఇంక దీనివలను ఖుదా గౌరవమునకు హానికలిగి అతఁడు బెఱుపునకుఁ బాత్రుఁడగును. ॥౪౩॥

౪౪. ఇష్టమయినవానికి నీతి నొసంగుచున్నాఁడు.
మం-౧-సి-౩-సూ-౨-ఆ-౨౫౦॥

సమీక్షకుఁడు-ఇష్టమయిన వానికి నీతి నొసంగు చున్నాఁడేని, ఇష్టము కానివానికి అనీతి నొసంగు చుండవచ్చునుగద. ఇది ఈశ్వరత్వపు మాట కాదు. కావున పక్షపాతమును వదలి యందఱకు నీతితోఁగూడిన యుపదేశముఁ జేయువాఁడీశ్వరుఁడు.అతఁడే ఆప్తుఁడునుకాగలఁడుకాని అన్యుఁడు కానేరఁడు.

౪౫. అతఁడిష్టమయిన వానిని క్షమించును. ఇష్టమయిన వానిని దండించును. ఏమన నతఁడన్ని వస్తువులను లోబఱచుకొనియున్నవాఁడు.
మం-౧-సి-౩-సూ-౨-ఆ-౨౭౭॥

సమీక్షకుఁడు—ఏమి ! క్షమింపఁబడుటకు యోగ్యుఁడగు వానిని క్షమింపక క్షమింపఁబడుటకు యోగ్యుఁడు కాని వానిని క్షమించుట యన్యాయకారి యగు రాజువంటిపనికాదా ? ఈశ్వరుఁ డిష్టమయినవానిని పాపాత్ముడుగనో, పుణ్యాత్ముడుగనో, జేయునన్న జీవులకుపాపపుణ్యముల నారోపింపఁగూడదు. ఈశ్వరుఁడే వారి నట్లుచేసినపుడు జీవులకు సుఖదుఃఖములు గలుగఁగూడదు.

భూగోళవిద్యగాని యెంతమాత్రము తెలియక యుండెననియే నిశ్చయమగు
చున్నది. పాపులకు మార్గముఁజూపఁడేని, ఈ ముసల్మానుల ఖుదా యావశ్య
కత పుణ్యాత్ములకునులేఁడు. ఏమన ధర్మాత్ములు ధర్మమార్గమందే నడతురు.
గాన మార్గముఁజూపవలసిన యవసరము ధర్మముదప్పిన వారికే కలదు.
కాఁబట్టి తన కర్తవ్యమును పాలింపనందున ఖురాను చేసినవానిది గొప్ప పొర
పాటనియే విదిత మగుచున్నది. ॥౪౨॥

౪౩. పశువులలోనుండి నాలుగింటిని తీసికొనుము. వాని ముఖములు
జ్ఞప్తిలో నుంచుకొనుము. ప్రతి పర్వతముమీఁద వాని యొక్కొక్కముక్కను
పెట్టియుంచుము. తిరిగి వానిఁ బిలువుము. నీయొద్దకిఁ బరుగెత్తుచు వచ్చు
ననెను. మం-౧-సి-౩-సూ-౨-అ-౨౪౩॥

సమీక్షకుఁడు—మేల్మేలు ! ముసల్మానుల ఖుదా, భానుమతి వింతలు
చేయుచున్నాఁడు ! ఖుదా ఖుదాయనమిటువంటి కార్యముల వలననే బోధపడునా
ఏమి ? బుద్ధిమంతులిట్టి ఖుదాకు తిలాంజలి యిచ్చి దూరముగా నుందురు. కాని
మూర్ఖులు మాత్రము చిక్కిపోదురు. ఇంక దీనివలను ఖుదా గౌరవమునకు
హానికలిగి అతఁడు చెఱుపునకుఁ బాత్రుఁడగును. ॥౪౩॥

౪౪. ఇష్టమయినవానికి నీతి నొసంగుచున్నాఁడు.

మం-౧-సి-౩-సూ-౨-అ-౨౭౦॥

సమీక్షకుఁడు—ఇష్టమయిన వానికి నీతి నొసంగు చున్నాఁడేని, ఇష్టము
కానివానికి అనీతి నొసంగు చుండవచ్చునుగద. ఇది ఈశ్వరత్వపు మాట
కాదు. కావున పక్షపాతమును వదలి యందఱకు నీతిలోఁగూడిన యుపదేశముఁ
జేయువాఁడీశ్వరుఁడు. అతఁడే ఆప్తుఁడునుకాఁగలఁడుకాని అన్యుఁడు కానేరఁడు.

౪౫. అతఁడిష్టమయిన వానిని క్షమించును. ఇష్టమయిన వానిని
దండించును. ఏమన నతఁడన్ని వస్తువులను లోఁబఱచుకొనియున్నవాఁడు.

మం-౧-సి-౩-సూ-౨-అ-౨౬౬॥

సమీక్షకుఁడు—ఏమీ ! క్షమింపఁబడుటకు యోగ్యుఁడగు వానిని క్షమించక
క్షమింపఁబడుటకు యోగ్యుఁడు కాని వానిని క్షమించుట యన్యాయకారి యగు
రాజువంటిపనికాదా ? ఈశ్వరుఁ డిష్టమయినవానిని పాపాత్ముఁడుగనో, పుణ్యా
త్ముఁడుగనో, చేయునన్న జీవులకుపాపపుణ్యముల నారోపింపఁగూడదు.
ఈశ్వరుఁడే వారి నట్లుచేసినపుడు జీవులకు సుఖదుఃఖములు గలుగఁగూడదు.

౭౦. ప్రతిజీవుని కతఁడార్జించినంత పూర్తిగ నియ్యబడును. వారి కన్యాయముచేయఁబడదు: ఓ అల్లా! జగత్తున కధిపతివి నీవే. ఇష్టమయిన వాని కొసంగుచున్నాఁడవు. ఇష్టమైనవాని దోఁచుకొనుచున్నాఁడవు. ఇష్టమయినవానికి ప్రతిష్ఠ గలుగచేయుచున్నాఁడవు. ఇష్టమైనవాని కప్రతిష్ఠ గలుగ చేయుచున్నాఁడవు. అంతయు నీచేతనే యున్నది. ప్రతివస్తువుపై నీయధి కారమే కలదు అని చెప్పుము. రాత్రిని దినమందును, దినమును రాత్రి యందును చొప్పించుచున్నాఁడవు. మృతుని జీవితునిగాను, జీవితుని మృతుని గాను జేయుచున్నాఁడవు. ఇష్టమైనవాని కపారముగ నన్నము నొసంగు చున్నాఁడవు. మునల్మానులతో దప్ప కాఫిరులతో మునల్మానులు స్నేహము చేయఁగూడదు. అట్లు చేసినవాఁడు అల్లా పక్షపువాఁడు గాఁడుదును. మీరల్లాను కోరువారేని నాపక్షముందురు. అల్లా మిమ్ముల మెచ్చుకొనును. మీ పాపములు క్షమించను. నిశ్చయముగ నతఁడు దయగలవాఁడు. అని చెప్పుము.

మం-౧. సి-౩. సూ-౩. ఆ-౨౧-౨౨-౨౩-౨౪-౨౫-౨౬॥

సమీక్షకుఁడు—ప్రతి జీవునకు కర్మఫలము పూర్తిగ నియ్యఁబడు నపుడు. క్షమింపఁబడనేరరు. క్షమింపఁబడుదురన్న ఫలము పూర్తిగ నియ్యఁ బడకపోవును; అన్యాయమే యగుననుట స్పష్టము. ఉత్తమ కర్మముల చేయ కున్న నొకనికి రాజ్యమొసంగినచో నన్యాయకారియేయగును. మరి: జీవితుని మృతునిగాను, మృతుని జీవితునిగాను చేయుట యెన్నఁటికయిన సంభవ మగునా? ఏమన నీశ్వరుని వ్యవస్థ అచ్ఛేద్యము నభేద్యమైయున్నయది. కాన నదెప్పుడును అస్తవ్యస్తము కానేరదు. ఇఁక పక్షపాతముగల మాటలు చూడుఁడు. మునల్మానుల మతమందు లేనివారలను కాఫిరులనుటయు. వారిలో నున్న మంచివారితోఁగూడ స్నేహము చేయరాదనుటయు. మునల్మా నులలోనున్న దుష్టులతోఁగూడ స్నేహము చేయవలయుననియు ఉపదేశము చేయుట యీశ్వరుని యీశ్వరత్వమును రద్దుపఱచుచున్నది. దీనివలన కురాను. ఈ కురాను చెప్పిన ఖుదా. మునల్మానుల కేవల పక్షపాతములోఁ గూడిన యవిద్యలో మునిఁగి యున్నవారలు. కాఁబట్టి మునల్మానులు అంధ కారములోఁబడియున్నారు. ఇఁక మీరు నా పక్షమునుండిన ఖుదా మీ పక్ష మగుననియు. పక్షపాతముతో మీరు పాపమొనరించినను దానిని క్షమించు ననియు బోధించిన మహమ్మదు సాహెబు లీలలను కనుగొనుఁడు. దీనివలన

౪౭. ప్రతిజీవుఁడు తనకు రావలసినంత పూర్తిగ నియ్యఁబడును. వారి కన్యాయముచేయఁబడదు; ఓ 'అల్లా!' జగత్తున కధిపతివి నీవే. ఇష్టమయిన వాని కొసంగుచున్నాఁడవు, ఇష్టమైనవాని దోఁచుకొనుచున్నాఁడవు. ఇష్టమయినవానికి ప్రతిష్ఠ గలుగచేయుచున్నాఁడవు. ఇష్టమైనవాని కప్రతిష్ఠ గలుగ చేయుచున్నాఁడవు. అంతయు నీచేతనే యున్నది. ప్రతివస్తువుపై నీయధి కారమే కలదు అని చెప్పుము. రాత్రిని దినమందును, దినమును రాత్రి యందును చొప్పించుచున్నాఁడవు. మృతుని జీవితునిగాను, జీవితుని మృతుని గాను జేయుచున్నాఁడవు. ఇష్టమైనవాని కపారముగ నన్నము నొసంగు చున్నాఁడవు. ముసల్మానులతో దప్ప కాఫిరులతో ముసల్మానులు స్నేహము చేయఁగూడదు. అట్లు చేసినవాఁడు అల్లా పక్షపువాఁడు గాఁడు. మీరల్లాను కోరువారేని నాపక్షముందురు. అల్లా మిమ్ముల మెచ్చుకొనును. మీ పాపముల క్షమించును. నిశ్చయముగ నతఁడు దయగలవాఁడు. అని చెప్పుము.

మం-౧. సి-౩, సూ-౩, ఆ-౨౧-౨౨-౨౩-౨౪-౨౫-౨౭॥

సమీక్షకుఁడు—ప్రతి జీవునకు కర్మఫలము పూర్తిగ నియ్యఁబడు నపుడు, క్షమింపఁబడనేరదు. క్షమింపఁబడుచున్న ఫలము పూర్తిగ నియ్యఁ బడకపోవును; అన్యాయమే యగుననుట స్పష్టము. ఉత్తమ కర్మముల చేయ కున్న నొకనికి రాజ్యమొసంగినచో నన్యాయకారియేయగును. సరి! జీవితుని మృతునిగాను, మృతుని జీవితునిగాను చేయుట యెన్నఁడయిన సంభవ మగునా? ఏమన నీశ్వరుని వ్యవస్థ అచ్ఛేద్యము నభేద్యమైయున్నయది. కాన నదెప్పుడును అస్తవ్యస్తము కానేరదు. ఇఁక పక్షపాతముగల మాటలు చూడుఁడు. ముసల్మానుల మతమందు లేనివారలను కాఫిరులనుటయు, వారిలో నున్న మంచివారితోఁగూడ స్నేహము చేయరాదనుటయు. ముసల్మా నులలోనున్న దుష్టులతోఁగూడ స్నేహము చేయవలయుననియు ఉపదేశము చేయుట యీశ్వరుని యీశ్వరత్వమును రద్దుపఱచుచున్నది. దీనివలన కురాను, ఈ కురాను చెప్పిన ఖుదా. ముసల్మానుల కేవల పక్షపాతములోఁ గూడిన యవిద్యలో మునిఁగి యున్నవారలు. కాఁబట్టి ముసల్మానులు అంధ కారములోఁ బడియున్నారు. ఇఁక మీరు నా పక్షమునుండిన ఖుదా మీ పక్ష మగుననియు, పక్షపాతముతో మీరు పాపమొనరించినను దానిని క్షమించు ననియు బోధించిన మహమ్మదు సాహెబు లీలలను కనుగొనుఁడు. దీనివలన

సమీక్షకుడు-మూడువేల ఫరిశ్తాలతో ముసల్మానులకు సహాయము చేయునట. ఇప్పుడు ముసల్మానుల రాజ్యము చాల నష్టమై పోయినది. ఉన్నదికూడ నష్టమేయగుచున్నది. మఱి సహాయము చేయుట లేదెందుకు? కాన నిది కేవలము ప్రలోభనము కలుగజేసి, మూర్ఖులను తమ వలలోఁ జిక్కించుకొనుటకు బన్నిన గొప్ప యన్యాయముతోఁ గూడిన తంత్రమే. ॥౫౦॥

౫౧. మఱి కాఫిరుల విషయమున మాకు సహాయమొసంగుము. మీరు అల్లా మార్గమున జంపబడినను లేక చచ్చినను అల్లా మీకు మంచి సహాయకుడును, ప్రయోజనకారియు నయియున్నాడు. అల్లావయ మిక్కిలి మంచిది. మం-౧-సి-౪-సూ-౩-ఆ-౧౩౦,౧౩౩,౧౪౦

సమీక్షకుడు-ఇప్పుడే ముసల్మానుల పొరపాటును గమనింపుడు: తమ మతస్థులు కానివారిని చంపుట కీశ్వరుని బ్రార్థించుచున్నారే. వీరిమాట నొప్పుటకు బరమేశ్వరుడు వెఱ్ఱివాడా యేమి? కేవలమల్లాయే ముసల్మానులకు ప్రయోజనకర్తగానున్నచో నీముసల్మానుల కార్యములేల నష్టమగుచున్నవి? ఖుదాకూడా ముసల్మానులకు మోహమున చిక్కియున్నట్లు గోచరమగుచున్నాడు. ఆ ఖుదా యిట్లు పక్షపాతము చేయువాడేనని ధర్మాత్ముల కెంతమాత్ర ముపాసనీయుడు గానేరడు. ॥౫౨॥

౫౩ అల్లా మిమ్ములను పరోక్షజ్ఞానము గలవానిగా చేయడు. కాని తనపైగంబరులలో నష్టపడిన వానిని మాత్రము చేయును. కాన అల్లాయందును అతని రసూలునందును విశ్వాసముంచుడు.

మం-౧-సి౪-సూ-౩-ఆ-౧౭౯

సమీక్షకుడు-ముసల్మాను లీశ్వరునిదప్ప మఱొకని విశ్వసింపనప్పటికిని, మఱియొకని నీశ్వరునితో చేరికగల వానినిగా నమ్మనప్పటికిని 'ఈమాన్' విశ్వాసమునందు పైగంబరును తనతో నేల చేర్చుకొనెను? అల్లా పైగంబరును విశ్వసింపుడని వ్రాసియున్నందున పైగంబరుకూడా తనవిలో సమ్మిళితుడయ్యెను. ఇక "లాశరీక్" అసమ్మిళితుడని చెప్పుట వ్యర్థము. మహమ్మదుసాహెబ్ పైగంబరుగా విశ్వసింపబడవలెననియే దీని భావమందు రేని అట్లు మహమ్మదుసాహెబు కావలసిన యవసరమేమి యను ప్రశ్నకలుగును. ఖుదా అతనిని పైగంబరుగా చేయకున్నచో నేమి

సమీక్షకుఁడు-మూఁడువేల ఫరిశ్తాలతో ముసల్మానులకు సహాయముచేయునఁట. ఇప్పుడు ముసల్మానుల రాజ్యము చాల నష్టమై పోయినది. ఉన్నదికూడ నష్టమేయగుచున్నది. మఱి సహాయము చేయుట లేదేందుకు? కాన నిది కేవలము ప్రలోభనము కలుగఁజేసి, మూర్ఖులను తమ వలలోఁ జిక్కించుకొనుటకు బన్నిన గొప్ప యన్యాయముతోఁ గూడిన తంత్రమే. ॥౫౦॥

౫౨. మఱి కాఫిరుల విషయమున మాకు సహాయము నొసంగుము. మీరు అల్లా మార్గమునఁ జంపబడినను లేక చచ్చినను అల్లా మీకు మంచి సహాయుఁడును, ప్రయోజనకారియు నయియున్నాఁడు. అల్లావద్ద మిక్కిలి మంచిది. మం-౧-సి-౪-సూ-౩-ఆ-౧౩౦,౧౩౩,౧౪౦॥

సమీక్షకుఁడు-ఇప్పుడీ ముసల్మానుల పొరపాటును గమనింపుఁడు! తమ మతస్థులు కానివారిని చంపుట కీశ్వరుని ప్రార్థించుచున్నారే. వీరిమాట నొప్పుటకు పరమేశ్వరుఁడు వెఱ్ఱివాఁడా యేమి? కేవలమల్లాయే ముసల్మానులకు ప్రయోజనకర్తగానున్నచో నీముసల్మానుల కార్యములేల నష్టమగుచున్నవి? ఖుదాకూడా ముసల్మానులకు మోహమున చిక్కియున్నట్లు గోచరమగుచున్నాఁడు. ఆ ఖుదా యిట్లు పక్షపాతము చేయువాఁడేసని ధర్మాత్ముల కెంతమాత్ర ముపాసనీయుఁడు గానేరఁడు. ॥౫౨॥

౫౩ అల్లా మిమ్ములను పరోక్షజ్ఞానము గలవానిగా చేయఁడు. కాని తన పైగంబరులలో నష్టపడిన వానిని మాత్రము చేయును. కాన అల్లాయందును అతని రసూలునందును విశ్వాసముంచుఁడు.

మం-౧-సి౪-సూ-౩-ఆ-౧౭౬॥

సమీక్షకుఁడు-ముసల్మాను లీశ్వరునిఁదప్ప మఱొకని విశ్వసింప నప్పుడును, మఱియొకని నీశ్వరునితో చేరికగల వానినిగా నమ్మనప్పుడును 'శిర్క' విశ్వాసమునందు పైగంబరును తనతో నేల చేర్చుకొనెను? అల్లా పైగంబరును విశ్వసింపుఁడని వ్రాసియున్నందున పైగంబరుగూడా తనలో సమ్మిళితుఁడయ్యెను. ఇఁక "లాశరీక్" అసమ్మిళితుఁడని చెప్పుట వ్యర్థము. మహమ్మదుసాహెబ్ పైగంబరుగా విశ్వసింపఁబడవలెననియే దీని భావమందు రేని అట్లు మహమ్మదుసాహెబు కావలసిన యవసరమేమి యను ప్రశ్నకలుగును. ఖుదా అతనిని పైగంబరుగా చేయుచున్నాఁడా? చేయ

సమీక్షకుఁడు—ఒక త్రసరేణువంతయైనను ఖుదా అన్యాయము చేయఁ దేని పుణ్యమునకు రెండింత లిందుకిచ్చును; ముసల్మానులకు పక్షపాత మెందులకు చేయుచున్నాఁడు? నిజమేమన కర్మములకు రెండింతలుగాని తక్కువగాని ఫలమిచ్చునేని ఆ ఖుదా అన్యాయకారియేయగును. ||౪౯||

౫౦. నీదగ్గఱనుండి వేఱుగుచున్నప్పుడు నీమాటను విపరీతముగ నాలోచించుచున్నారు. అల్లా వారి సలహాను వ్రాయుచున్నాఁడు వారి అర్థిత మునుబట్టి అల్లా వారిని విముఖులచేసెను. ఏమి? ఎవని నల్లా (గుమరాహ్) పథ విముఖునుగా చేసియున్నాఁడో వానిని మీరు మార్గమునకుఁ దేఁగోరు చున్నారా? ఎవనినల్లా గుమరాహ్ చేయునో వానికెప్పుడును మార్గముబ్బదు.

మం-౧.సి-౫సూ-౩-ఆ-౧౭౦-౧౭౩||

సమీక్షకుఁడు—వార్తల నన్నిటిని వ్రాయుచు "బహీఖాతా" దప్తముల నేర్పఱచుచుఁబోవుచున్నాఁడేని అల్లా సర్వజ్ఞుఁడు కాఁడు. సర్వజ్ఞుఁడేని వ్రాయవలసిన యవసరమేమి? ఇఁక సందఱను భ్రమింపఁజేయుచున్నందున సైతానే నుష్టుఁడని ముసల్మానులనుచున్నారుగద. ఖుదాకూడా జీవులను గుమరాహ్ చేయుచున్నప్పుడు ఖుదాయును సైతానునగును. వేదమే ముండెను? కాదు. భ్రమింపఁజేయువాఁడే సైతానని ముసల్మానులు వక్కా ణించుచున్నారు. కాబట్టి ఖుదా పెద్ద సైతానువనియు, అతఁడు చిన్న సైతానునియు మాత్రమే తేటమున నొప్పును గాననీప్రతిజ్ఞ ఖుదానుకూడ సైతానుగాఁ జేసినది. ||౫౦||

౫౧. ఇంకను తమచేతుల నాపుకొనలేని పక్షమున వారిని పట్టుకొని ఎటఁజిక్కినను చంపివేయుఁడు. ముసల్మానుని ముసల్మానుఁడు మాత్రము చంపుటయోగ్యముకాదు. తెలియక ఒకఁడొకనిఁ జంపినచో ఆ చంపినవాఁడు మహమ్మదీయుఁడైనప్పుడును, ఏరోత జాతివారు దిమ్ము క్షమించినప్పుడును ముసల్మానుని మాత్రము తల నఱకక విడిచి పెట్టుటయే యుత్తమము. ఒకఁడు తెలిసి ముసల్మానుని చంపినచో వాఁడు సదా నరకమందేయుండును వానిమీఁద అల్లా క్రోధమును (లానత్) ధిక్కారమును కలదు.

మం-౧సి-౫-సూ-౪ఆ-౯౦-౯౧-౯౨||

సమీక్షకుఁడు-ఇప్పుడు చూచితిరా ముసల్మానులు కాని వాని నెట్టి ఇక్కట్టయినఁ జంపివేయుఁడనియు ముసల్మానుని మాత్రము జంపకుఁడనియు ననుట గొప్ప పక్షపాతమే కదా. తెలియక ముసల్మానుడొక ముసల్మానునిఁ జంపిన ప్రాయశ్చిత్తమును బొందవలెననియు నన్యునిఁజంపిన స్వర్గమును బొందుననియు చేయబడిన ఈ యుపదేశములను బావిలోఁ ద్రోయవలసినదే. ఇటువంటి పుస్తకములు, పైగంబరులు, ఖుదాలు, మతములు అను వీని వలన హాని కలుగుటదప్ప లాభమేమియుఁ గలుగదు. కాననివి యుండకుండుటయే మేలు. ఇట్టి ప్రమాదముతోఁ గూడిన మతములను త్యజించి వేదోక్త విషయములనన్నిటి నంగీకరించుటయే బుద్ధిమంతులకు యోగ్యము. అందసత్యము కించిత్తయినను లేదు. ఇంక నిటు ముసల్మానునిఁ జంపినవాఁడు నరకమునకుఁ బోవునన్నట్లే ముసల్మానుని జంపినఁవాడు స్వర్గమునకు బోవునని యన్యమతస్థులనుచున్నారు. ఈ రెంటిలో దేనిని నమ్మవలెనో దేనిని త్యజింపవలెనో చెప్పుడు. కావున నీమూఢ ప్రకల్పిత మతములు త్యజించి, వేదోక్త మతమును స్వీకరించుటయే మనుష్యులందఱకును యోగ్యము. అందు ఆర్యుల-శ్రేష్ఠపురుషుల-మార్గమునఁ బ్రవర్తింపుఁడనియు, దస్యుల-దుష్టుల-మార్గము నుండి దూరముండుఁడనియు, వ్రాయబడియున్నది. కాన నదియే సర్వోత్తమము. ॥౫౮॥

౫౯. ఇంక శిక్ష ప్రకటమయిన పిమ్మట రసూలుతో విరోధముచేసిన వానిని, ముసల్మానులతో విరుద్ధపక్షము బూనిన వానిని మేము వశ్యముగ నరకమునకు బంపుదుము. మం-౧.సి-౫-సూ-౪-ఆ-౧౧౩॥

సమీక్షకుఁడు—ఇప్పుడు ఖుదా, రసూలుల పక్షపాతపు మాటల గమనింపుడు ! ఖుదా పేర తామిట్లు వ్రాయకున్న తమ మతము వృద్ధి బొందదనియు, పదార్థములు లభింపవనియు, ఆనంద మనుభవింపకుందు మనియు, మహమ్మదు సాహెబు మున్నగువారు తలంచుచుండిరి. వారు అన్యుల కార్యములఁ జెఱచుట యందును, తమ యభీష్టములను సిద్ధింప చేసికొనుట యందును పూర్ణులయి యుండిరని దీనివలన విదితమగుచున్నది. కావుననే వీరు ఆప్తులు కాకుండిరి. కాన వీరిమాట, ఆప్తులగు విద్వాంసులయెదుట ప్రమాణార్హ మెన్నటికిని గానేరదు. ॥౫౯॥

౬౦. ఎవఁడల్లాను, ఫరిశ్తాలను, పుస్తములను, రసూలును. (కయామతు) ప్రళయమును అంగీకరింపఁడో యతఁడు నిశ్చయముగ మార్గము దప్పినవాఁడు. ఎవరు నిశ్చయముగ విశ్వసించినపిమ్మట కాఫిరులయి మరల నట్లే విశ్వసించుచు విరిగిపోవుచు విశ్వాసఘాతకు లగుదురో అల్లా వారి నెంత మాత్రము క్షమింపఁడు. ఇంక వారికి మార్గమునుఁ జూపఁడు.

మం ౧-సి-౫-సూ-౪.అ-౧౩౪-౧౩౫॥

సమీక్షకుఁడు:—ఏమి ? ఇప్పుడుకూడ ఖుదా [లాశరీక్] అసమ్మితుఁడని చెప్పఁబడగలఁడా ? లాశరీకని చెప్పుచు నతనితో చేరికగలవారి నసేకులను నమ్ముచుఁబోవుట పరస్పర విరుద్ధము కాదా ? ఏమి ? మూఁడు సార్లు క్షమించినపిమ్మట నిఁక ఖుదా క్షమింపనే క్షమింపఁడా ? మఱి మూడుసారులు విశ్వాసఘాతము చేసినను మార్గముఁజూపునా ? లేదా ? నాల్గవ పర్యాయము నకుఁ బిమ్మట చూపకపోవునా ? నాలుగేసి పర్యాయములయిన నందఱును (కుఫ్ర్) ద్రోహము చేసినచో మిక్కిలి యెక్కువయే యగును. ॥౬౦॥

౬౧. అల్లా దుష్టులను. కాఫిరులను నిశ్చయముగ నరకమునఁ జేర్చుచున్నాఁడు. నిశ్చయముగ దుష్టులు అల్లాను మోసపుచ్చుచున్నారు. అట్లే వారి నల్లా మోసపుచ్చుచున్నాఁడు: ఓ విశ్వాసవంతులారా ! ముసల్మానులఁదప్ప కాఫిరులను మిత్రులుగా చేసికొనకుఁడు.

మం-౧-సి-౫సూ-౪అ-౧౩౮-౧౪౧-౧౪౪॥

సమీక్షకుఁడు—ముసల్మానులు స్వర్గమునకుఁ బోవుదురు, అన్యులు నరకమునకుఁ బోవుదురు. అనుటకు ప్రమాణమేమి ? బళిరే ! దుష్టులకు మోసపోవువాఁడును, ఇతరుల మోసపుచ్చువాఁడునగు ఖుదా మాకు దూరమయి యుండుఁగాక. కాని మోసగాండ్రతో నతఁడును, అతనితో మోసగాండ్రును గూడియుందురు గాక. ఏలయన—

(యాదృశీ శీతలాదేవీ తాదృశః ఖరవాహనః)

ఎటువంటివాని కటువంటివాఁరు కూడినప్పుడే నిర్వాహమగును. ఎవరి ఖుదా మోసగాఁడో యతని యుపాసకులట్లెందులకుఁ గాకుందురు ? ఏమి ; ఒక ముసల్మాను దుష్టుఁడుగానున్నను వానితో మిత్రత్వమును, ముసల్మానుఁడు

కాని యన్యుఁడొకఁడు శ్రేష్ఠుఁడుగా నున్నను వానితో శత్రుత్వమును చేయుమనుట. యెవరికైన నొప్పిదమగునా ? ॥౬౧॥

౬౨. జనులారా ! నిశ్చయముగ మీవద్దకు దేవునివైపునుండి సత్యముగల పైగంబరు వచ్చియున్నాఁడు. కాన మీరు ఆయనను నమ్ముకొనుఁడు. (మాబూదు) ఉపాస్యుఁడొక అల్లాయే.

మం౦-౧ సి౦౬ సూ౦౪-౧౬౩-౧౬౮॥

సమీక్షకుఁడు:— పైగంబరును నమ్ముకొనుఁడని వ్రాసినపుడు విశ్వాసమందు పైగంబరు ఖుదాతో చేరికగలవాఁడు—భాగస్థుడు—అయ్యెనా. లేదా ! అల్లా ఏక దేశీయుఁడయి వ్యాపకుఁడు కానప్పుడే తన యతనివద్దనుండి పైగంబరులు వచ్చుచుఁ బోవుచునున్నారు. అటులయిన నతఁడీశ్వరుఁడుకూడఁ గాఁడు. కొన్నిచోట్ల. సర్వదేశీయుఁడని కొన్నిచోట్ల ఏకదేశీయుడని వ్రాసియున్నందున ఈ కురాను ఒకనిచే వ్రాయఁబడలేదు. కాని యనేకులచే వ్రాయఁబడినదనియే విదితమగుచున్నది. ॥౬౨॥

౬౩. హరాముగాఁ జెప్పఁబడిన (ముర్దార్) ● రక్తము. పందిమాంసము. అల్లాకాక వేరేమో చదివి కోయఁబడిన పశుమాంసము. గొంతు నులిమియో. శస్త్రదెబ్బ కొట్టియో. కొమ్ముతో పొడిచియో చంపిన. మీదినుండి పడిచచ్చిన—దాని మాంసము. మృగములచే తినఁబడినదాని మాంసము. మీకు (హరాం) నిషిద్ధములు.

మ—౨. సి-౬. సూ-౫-౩॥

సమీక్షకుఁడు——ఏమీ : ఇవి మాత్రమే నిషిద్ధములా : ఇంక నెన్నియో పశువులు. తిర్యక్ జీవములు కీటకములు మున్నగునవియుకలవు. అవి యన్ని ముసల్మానులకు (హలాల్) భక్ష్యములగునా ? ఇందువలన నిది మనుష్యుల కల్పితమేకాని ఈశ్వరునిది కాదు. కాన నిది ప్రమాణార్హము గాదు.

౬౪. అల్లాకు మంచి బదులు ఒసంగుఁడు. నే నవశ్యముగ మీ కీడును దూరపఱతును. మిమ్ముల స్వర్గమున కంపుదును.

మం—౨-సి-౬. సూ-౫-౮-౧౦॥

● ముర్దార్ అనగా ప్రాణములేనిదని యర్థము. కాని యిది కలమాచదివి ముసల్మానులు గోసిన పశువులమాంసము హలాల్. ముసల్మానేతరులు గోసిన పశువుల మాంసము ముర్దార్ అని దీని భావము. నిజమేమన ముసల్మానులచేఁగాని అన్యులచేఁగాని గోయఁబడినదేమి ? ఎట్లు చచ్చినదేమి అది ముర్దార్ జీవము లేదనియే గ్రహింపవలెను. [అనువాదకుఁడు]

సమీక్షకుఁడు—మేలండి! ముసల్మానుల ఖుదా యింతఁ గిందిస్వాత్ర మైన ధనము లేకుండవచ్చునుగడ. విశేషముగ నున్నప్పుడు ఖుదాలెందుల కదు గును? అల్లా మీకీదును దూరముచేసి, మిమ్ముల స్వర్గమున కంపుదునని వారి సేల భ్రమింపఁజేసియుండును? ఇచ్చట మహమ్మదు సాహెబు ఖుదాపేరు చెప్పి తన యభిమతమును దీర్చుకొనినాఁడనియే విదితమగుచున్నది. ॥౬౪॥

౬౫. ఇష్టమైనవానిని క్షమించుచున్నాఁడు. ఇష్టమైనవానిని దుఃఖపెట్టు చున్నాఁడు. ఎవనికి సెయనిదానిని మీకిచ్చెను.

మం-౨ సి-౬-సూ-౩ ఆ-౧౬-౧౮॥

సమీక్షకుఁడు—ఏమి; సైతాను ఇష్టమైనవానిని పాపాత్మునిగాఁ జేయు చున్నటులే ముసల్మానుల ఖుదాకూడ నా సైతానువంటి పనిచేయుచున్నాఁడా? అటులయిన నిఁకనా స్వర్గనరకములకు ఖుదా పోవలసినదే కద. ఏలయన నతఁడే పాపపుణ్యములఁ జేయువాఁడయ్యెను; జీవుఁడు పరాధీనుఁడు. సైన్యము సేనాపతి యధీనమందుండి కాపాడుచు నొకని జంపుచునుండును. తత్పుణ్యపా పము లా సేనాపతికి కలుగునేకాని సైన్యమునకుఁ గలుగవుగదా!

౬౬. అల్లా యాజ్ఞను పాలింపుఁడు. రసూలు ఆజ్ఞను పాలింపుడు.

మం-౨. సి-౭ సూ-౩. ఆ-౮౯॥

సమీక్షకుఁడు—చూడుఁడు! ఖుదా పొత్తుగలవాఁడనియే యిట విదితమ గుచున్నది. ఇఁక నతని (లాశరీక్) అని నమ్ముట వ్యర్థము. ॥౬౬॥

౬౭. జరిగిపోయినవాని నల్లా క్షమించెను. ఎవఁడు మరల చేయునో వాని నల్లా దండించును. మం-౨—సి-౭-సూ-౫౦. ౯౨॥

సమీక్షకుఁడు—(చేయఁబడిన పాపములు క్షమింపబడునను మాట పాప ములఁజేయుట కాజ్ఞాపించి వానిని బెంచుటయనియే యర్థము.) ఏ పుస్తకము నందు పాపములు క్షమింపబడుననుమాట యుండునో యది ఈశ్వరరచితము కాని, యొక విద్వాంసునిచే రచియింపబడినది కాని కానేరదు. అది పాపములఁ బెంచునదనుట మాత్రము నిక్కము. ఇఁక జరుగఁబోవు పాపములఁ దొలఁ గించుట కొఱకని ప్రార్థించుటయుఁ దాను వానిని విడచుటకుఁ బురుషార్థము చేయుచుఁ బశ్చాత్తాపపడుటయు సుచితమే! కాని కేవలము పశ్చాత్తాపపడుచు వాని విడువఁడేని ఫలమేమియు లేదు. ॥౬౭॥

౬౮. వహీ (అల్లాచే(వాలు) ఆతనియందుటలేదు కాని అల్లా పేర రొంతులు రొంతుడు వహీ నాకు అందుచున్నదనియు, సర్లే అల్లా పంపురు న్నట్లు నేనుగూడ బంపగలననియు చెప్పునట్టి మనుష్యునికంటె నధిక పాపాత్ముడు మరొకడుండునా ?

మం. ౨-సి-౭-సూ-౬-ఆ-౯౪॥

సమీక్షకుడు:— నాకు అల్లా వద్దనుండి ఆయతులందుచున్నవని మహమ్మదుసాహెబు చెప్పుకొనుచుండినట్లే అన్యుడెవడో నాకును ఆయతులందుచున్నవనియు, నన్నుకూడ పైగంబరుగా నమ్ముడనియు మహమ్మదు సాహెబువంటి లీలను గల్పించి యుండవచ్చును. అప్పుడు వాని మాటను రద్దు పరచుటకును, తన ప్రతిష్ఠను గొప్పజేయుటకును మహమ్మదు సాహెబు తమయుపాయమును బన్నియుండవచ్చుననియే దీనివలన విదితమగుచున్నది. ॥౬౮॥

౬౯. మేమే మనుష్యముగ మిమ్ము బుట్టించితిమి. మరల మీయాకృతులం జేసితిమి. పిదప మేము ఫరిశ్తాలతో ఆదామునకు సిజ్దా (నమస్కారము) చేయుడనగా వారు సిజ్దా చేసిరి. కాని సైతాను సిజ్దా చేయువారి యందు లేకుండెను. నేను నిన్నాజ్ఞాపించినపుడు నీవు సిజ్దా చేయనైతివి. మరి నిన్ను వర్ణగించిరనగా-నేనతనికంటె మంచివాడను. నీవు నన్నగ్నితోను అతనిని మంటితోను పుట్టించితివనెను. నీ వంత యభిమానించుట కది నీకు యోగ్యముకాదు. దానిలోనుండి దిగుమనెను. కాటిలోనుండి లేపబడు దినమువఱకు పడియుండుమనెను. నీవు నిశ్చయముగ పడియున్న వారిలోని వాడవనెను. నీవు నన్ను విముఖుని (గుంరాహ) చేసితివి. నే నవశ్యముగ వారి పనులపై నీ చక్కని మార్గమును గూర్చుచున్నను 'ఒట్టు' అనెను. వస్తువారి మొసర్పు చున్నట్లు వారిని బలముగా నీవు చూడకుండుము. దుర్గతితో వెళ్ళిపొమ్ము. దానిలోనుండి నిన్ననుసరించిన వారితోగూడ మీయందఱితో నరకమును నింపుదుననెను.

మం-౨-సి-౮-సూ-౭-ఆ-౧౦,౧౧,౧౨,౧౩,౧౪,౧౫,౧౬,౧౭॥

సమీక్షకుడు:—ఖుదాకును సైతానునకు జరిగిన జగడము విన్నారు నిదానముగ నాలకింపుడు, పరిచారకుడుగానున్న యొక ఫరిశ్తా కూడ ఖుదాకు లొంగలేదు. ఖుదా యయిన నరని ఆత్మను పవిత్రపఱుపలే పోయెను. ఆన్నే

పాపకారులఁజేసి ఉపద్రవములు గలుఁగఁజేయునా ద్రోహిని ఖుదా విడిచిపెట్టెను. ఇది ఖుదా గొప్ప పొరపాటే యనవొప్పును. సైతానందఱను భ్రమింపఁజేయువాఁడు ఖుదా సైతానును భ్రమింపజేయువాఁడునగుటఁ బట్టి ఖుదా సైతానునకు మించిన సైతానని సిద్ధమగుచున్నది. ఏలయన-నీవు నన్ను గుంరాహ చేసితివని సైతాను ప్రత్యక్షముగఁ జెప్పుకొనుచున్నాఁడు. కాఁబట్టి ఖుదాయందు పవిత్రతయు నగపడుటలేదు. కీడుల నన్నిటిని కల్పింపఁజేసెడి మూలకారణము ఖుదా యయ్యెను. ఇట్టి ఖుదా కేవల ముసల్మానులకిష్టమగునేకాని శ్రేష్ఠులగు నితర విద్వాంసులకుఁగాదు. ఇఁక ఫరిశ్తాలతో మనుష్యునిమాదిరిగ వార్తాలాపముఁ జేసియుండిన ముసల్మానుల ఖుదా దేహధారియు నల్పజ్ఞుఁడు. న్యాయరహితుఁడునయ్యెను కావుననే విద్వాంసులు ఇస్లామీ మతము నిష్టపడరు. ॥౬౯॥

౭౦. నిశ్చయముగ అల్లా మీకు ప్రభువు, అతఁడాఱు దినములలో ఆకాశములను, పృథివిని ఉత్పన్నము చేసెను. అనంతరము అర్శ్మీఁద శయనించెను. నమ్రతతో తమ ప్రభువును పిలువుఁడు.

మం-౨ సి-౮ సూ-౭ ఆ౫౪-౫౫॥

సమీక్షకుఁడు — భాగు! ఎవఁడాఱు దినములలో జగత్తునుచేయునో, అర్శ (మీదియాకాశమున) సింహాసనముమీఁద శయనించునో అట్టి యీశ్వరుఁడెన్నఁడయిన సర్వశక్తిమంతుఁడును, వ్యాపకుఁడును కాఁగలఁడా? అట్లు కానిచో నతఁడు ఖుదా అనిగూడఁ జెప్పఁబడఁజాలఁడు. ఏమి? పిలువగా విను నేని మీ ఖుదా బధిరుఁడా? ఈ మాటలన్నియు నీశ్వర కృతములే: కావున కురానీశ్వర కృతము కానేరదు. ఆఱుదినములలో జగత్తునుచేసి, ఏడవదినము, అర్శ మీఁద శయనించెనన్న అలసియు పోవచ్చును. ఇప్పటికి నిద్రించుచున్నాఁడా? మేలుకొని యున్నాడా? మేలుకొని యున్నాఁడేని ఇప్పుడే మయిన పనిచేయుచున్నాఁడా? లేక నిరర్థకముగ, నిక్కనిక్కఁదిరుగుచు, యానందించుచున్నాఁడా? ॥౭౦॥

౭౧. పృథివిమీఁద ఝగడముజేయుచుఁ దిరుగకుఁడు.

మం-౨. సి-౮. సూ-౭-ఆ-౭౪॥

సమీక్షకుఁడు — ఈమాట మంచిదేకాని, దీనికి విపరీతముగఁగొన్ని చోట్ల జిహాదు చేయుఁడనియు, కాఫిరులను చంపుఁడనియుఁగూడ వ్రాయఁ

బడియున్నదే. ఇదిపూర్వాపర విరుద్ధముకాదా. చెప్పుడు! మహమ్మదు సాహెబు, నిర్బలుఁడయి యుండినపు డిట్లు చెప్పియుండ వచ్చుననియు. బల వంతుఁడయి యుండినపుడు, జగడము చేయించి యుండవచ్చుననియుఁగూడ దీనివలన విదితమగుచున్నది. కాన నీవార్తలు పరస్పర విరుద్ధములగుటవలన సత్యములుఁ గావు ॥౩౧॥

౩౨. ఒకసారి తన అసా (చేతికఱ్ఱ)ను పాఱవేయఁగా నది నిజముగా కొండచిలువ యయ్యెను. మం-౨-సి-౯-సూ-౭-ఆ-౧౦౭

సమీక్షకుఁడు—ఇట్లువ్రాయుటవలన నిట్టియబద్ధపు వార్తలనుకూడ సాహెబును, మహమ్మదుసాహెబును నమ్ముచుండిరనియు, వీరిద్దఱును విద్వాంసులు కారనియు విదితమగుచున్నది. కంటితోఁ జూచుటను, చెవితో వినుటను ఎవ్వఁడును నిరాకరింపనేరఁడు. కాన నివి ఇంద్రజాలపుమాటలే యనుట స్పష్టము. ॥౩౨॥

౩౩. మేమువారిమీదికి గాలి వాన (తుపాను)ను, మిడుతలను, పిరుగులను, కప్పలను, రక్తమును పంపితిమి. మేము వారియెడల పగతీర్చుకుని వారిని సముద్రములో ముంచివేసితిమి. మేము బనియిస్రాయీలును సముద్రమునుండి తరింపఁజేసితిమి. వారున్న మతము నిశ్చయముగ నబద్ధము వారి కార్యమున బద్ధమయినదే.

మం-౨-సి-౯-సూ-౭-ఆ-౧౩౦-౧౩౩-౧౩౬-౧౩౭

సమీక్షకుఁడు—ఇప్పుడు చూడుఁడు! ఒక మోసగాఁడొకనిని — "మేము నీమీదికిఁ జంపుటకు సర్పములఁ బంపుదుమని" భయపెట్టినట్లేకద యీమాటకూడ నయ్యెను. మంచిది పక్షపాతముతో నిస్లాక జాతివారిని ముంచివేసి, మఱొకజాతివారినిఁ దరింపఁజేసినట్టి అదాధర్మము దప్పినవాఁడేల గాకుండును? వేలకొలందియు-కోట్లకొలఁదియు మనుష్యులతోఁ గూడియున్న యితరమతములన్నియు నబద్ధములనియు తనమతమే సత్యమనియునెవఁడను చున్నాఁడో, దానికంటె నబద్ధమైనది మఱొక మతముండునా! ఏలయన నేమతమందైనను మనుష్యులందఱును చెడ్డవారుగనో, మంచివారుగనో యుండఁజాలరు. ఇట్లు ఏకపక్షపు పరిష్కారము చేయుసది మహామూర్ఖుల మతమే యగును. ఏమి? ఎపరిమతము తౌరేతుజబూరుల ననుసరించియుండెనో యది యబద్ధమేనా? లేక దాని నబద్ధమని చెప్పుటకు వారిమతము మఱి యొకటి

యుండెనా ? మఱొక మతముండెనన్న నేమతముండెను ? కురానునందు దానిపేరున్నట్లు చూపుఁడు ? ॥౬౩॥

౬౪. నిన్ను చూడవచ్చును కాఁబోలు. అనఁగా-అతని ప్రభువు పర్వతపు దిక్కునకు తన తేజమును బ్రకాశింపఁజేసి దానిని దునాతునుఁకలు చేయఁగా మోసే మూర్ఛితుఁడై పడిపోయెను.

మం-౨-సి-౯-సూ-౭-ఆ-౧౪౨॥

సమీక్షకుఁడు—ఇట్లు ఆగపడువాఁడు వ్యాపకుఁడు కాఁజాలఁడు. ఇవ్విధముగ చమత్కారములు చూపుచుండెనన్న నిప్పుడొకరికైన నట్టి చమత్కారమునా ఏల చూపుటలేదెందులకు ? ఈమాట నితాంత మసత్యము కాన నంగీకారార్హము కాదు. ॥౬౪॥

౬౫. నీ ప్రభువును భయభక్తులు కలవాఁడవై హీనస్వరముతో ప్రాతఃకాలమునను సాయంకాలమునను మనస్సునందు స్మరింపుము.

మం—౨. సి-౯. సూ-౭. ఆ-౨౦౪॥

సమీక్షకుఁడు - కురాను నందు కొన్నిచోట్లఁ దన ప్రభువును ఎలుగెత్తి పిలువుమనియు, మఱికొన్నిచోట్ల హీనస్వరముతో నీశ్వరుని స్మరింపుమనియు వ్రాయఁబడియున్నది గదా ! వీనిలో నేమాటనిజమో యేమాట యబద్ధమో చెప్పుఁడు. ఇట్లొకమాట మఱొకమాటను రద్దు పఱచుచున్న నది ప్రమత్తాలాపము వంటిదే యనఁబడును. భ్రమచే నొకమాట విరుద్ధముగఁ జెప్పఁబడెనన్న నొప్పుకొనవచ్చును. చింత యేమియులేదు. ॥౬౫॥

౬౬. దోఁచుకోఁబడిన సొత్తునుగూర్చి నిన్ను అడుగుదురు. నీవు దోఁచుకోఁబడిన సొత్తు అల్లాదనియు, రసూలుదనియు, నల్లాకు భయపడుఁడనియుఁ జెప్పుము.

మం-౨. సి-౯. సూ-౩. ఆ-౧॥

సమీక్షకుఁడు — దోపిడివ్యవహారము - దోపురుగాండ్రి పనులు - చేయుచు జేయించువారే 'ఖుదాపైగంబరులు' ఈమానదారులు నగుదురన్న నిదిగొప్ప యాశ్చర్యకరమగు వార్తయే యననొప్పును, అల్లా భయముఁ జూపుచు దోపిడి మున్నగు దుష్కార్యములను జేయువారు గూడ "మాది యుత్తమ మతము" అని చెప్పుకొనుట లజ్జాస్పదము కాదా ! కాన హఠమును త్యజించి వేదమతమును గ్రహింపబోవుటకంటె మించిన మేలువు మఱియేదియు నుండదనుట స్పష్టము. ॥౬౬॥

౨౩. కాఫిరులను నిర్మూలము చేయవలెను. నేను వేయిమంది పరిశ్తాలను వెంటఁబెట్టుకొనివచ్చి మీకు సాయముఁజేయుదును. నేసవశ్యముగ కాఫిరుల హృదయములయందు భయము గలుగఁజేయుదురు గాన వారి మెడలమీఁదను వారి యొక్కక్క కీలుమీఁదను గొట్టుఁడు.

మం-౨. సి-౯. సూ-౮. ఆ-౨-౯-౧౨॥

సమీక్షకుఁడు—మేలయ్యా మేలు. ఈ ఖుదాను, పైగంబరులను ఎంతటి దయాహీను లనవలెను ? ముసల్మానుల మతమునుఁ జేరనివారిని కాఫిరు లని యేకద వారిని నిర్మూలము చేయుట కా ఖుదా ఆజ్ఞాపించు చున్నాఁడు. అంతియ గాదు ; వారిమెడల నఱకుఁడు. వారి కాళ్ళుచేతుల కీళ్ళు తెగఁ గోయుటకును తోడ్పడుదునని సమ్మతిగూడ నిచ్చుచున్నాఁడే! ఇటువంటి ఖుదా లంకేశుని కంటెనేమైన తక్కువవాఁడనఁబడునా ! ఈ గందరగోళ మంతయు కురాను కర్తదేకాని ఖుదాచే కాదు. ఖుదాదేని ఇటువంటి ఖుదామాకు దూరమై యుండుఁ గాక. మేముగూడ నతనికి దూరమై యుండుముగాక. ॥౨౨॥

౨౮. అల్లాముసల్మానులకు సహాయకుఁడు. ఓ విశ్వసించినవారలారా ! అల్లాయని, రసూలని పిలుచుటకు స్వీకరింపుఁడు. ఓ విశ్వసించిన లోకులారా! అల్లాకును రసూలునకును దొంగలుగాక యుండుఁడు. అల్లే తమ (అమానతును) నిలువ యుంచినదాని దొంగిలింపకుఁడు. అల్లా తంత్రముఁ జేయుచుండెను. తంత్రముజేయు వాండ్రకు మంచివాడు.

మం-౨. సి-౯-సూ-౮-ఆ-౧౯-౨౪-౨౭-౩౦॥

సమీక్షకుఁడు—యేమి ? అల్లా ముసల్మానుల పక్షపాతియా ? అటులేని అధర్మము చేయువాఁడగును. ఏమన నీశ్వరుఁడు ప్రపంచమున కంతటికిఁ గలఁడు. ఖుదాపిలువబడున్న వినఁజాలఁడా ? బధిరుఁడా ? ఇంక నతనితో రసూలును ఏకముచేయుట గదు నిందనీయమైన యంశము కాదా? దొంగిలించుకనుటకు అల్లా ఖజానా (కోశము) ఏది నిండియున్నది? రసూలు దొంగతనమును తన అమానతుసందలి దొంగతనమును మాత్రమే మాని తక్కిన దొంగతనములన్నియుఁ జేయవచ్చునా ? ఇట్లు విద్యావిములులను. ధర్మవిహీనులునగువారే యుపదేశింపఁ గలుగుదురు. మంచిది ! తంత్రముఁజేయు వాఁడును. తంత్రముఁ జేయువాండ్రకు సహాయకుఁడునయి యున్నాఁడేని ఆ ఖుదా మోసగాఁడు. గపటియు నధార్మికుఁడు నేలగాకుండును? ఇందువలన

నీ కురాను ఖుదాచే రచియింపఁబడినదికాదు. ఒకానొక మోసగాఁడు, గపటియు నగువానిచే రచింపఁ బడవచ్చును. లేనిచో నిట్టి విపరీతములెందులకు వ్రాయ బడియుండును? ॥౫౮॥

౫౯. వారి ఉద్రేకములుగనంతవఱకు—కాఫిరుల బలము తగ్గనంతవఱకు (౭౯) అల్లా మతమంతటను స్థిరపడువరకు వారితో పోట్లాడుఁడు. మీరు కోఁచు కొన్న ప్రతివస్తువులో నైదవభాగము నిశ్చయముగ అల్లాదనియు, రసూలు దనియు నెఱుఁగుఁడు. మం. ౨ సి. ౯. సూ. ౮. ఆ. ౩౯-౪౦॥

సమీక్షకుఁడు—ఇట్లు అన్యాయముగఁ బోట్లాడుచు, పోట్లాడఁ జేయునట్టి ముసల్మానుల దాకంటె నన్యుఁడు శాంతిభంగముఁ జేయువాఁడితరుఁ డెవఁడగును? ఇంతమతమును చూడుఁడు! అల్లా కొఱకును, రసూలుకొఱకును, జగత్తునంత దోచుట, దోపించుట అనునది దోపుడుగాండ్ర పనికాదా? అపహరింపఁబడిన సొత్తులో ఖుదా భాగస్థుఁడై యున్నపుడు దోపుఁడు గాఁడనియే అర్థము. మఱి ఖుదా దోఁపుడు గాండ్రకుఁ బక్షపాతియై తన ఖుదాతనమున కొఱఁతను కలుగఁ జేసికొనుచున్నాఁడుగదా! ఈలాటి పుస్తకము, ఈ ఖుదా పైగంబరు అను ఉపాధిదారులు ప్రపంచమున శాంతిభంగము చేసి, మనుష్యులకు దుఃఖము కలుగఁ జేయుట యెక్కడినుండి వచ్చిరో గొప్ప వింతగా నున్నది! జగత్తున నిట్టి మతములే ప్రచలితములు కాకుండిన జగత్తంతయు నానందముతోఁ గూడియుండెడిది. ॥౫౯॥

౬౦—కాఫిరుల ప్రాణములఁ దీయఁగాఁ జూచుచేని ఫరిశ్తాలు వారి ముఖములమీఁదను వీపులమీఁదను, కొట్టుచు దగ్ధమనెడు సాపరుచిని గ్రహించుటకు సరువుఁడని యందురు. మేము వారిని, వారి పాపములఁ బట్టి దంపితిమి. మరిపిరవూను జాతివారిని ముంచివేసితిమి. మీరు వారికొఱకు చేయఁగలుగు నంతటి ప్రయత్నము చేయుఁడు.

మం. ౨. సి. ౯. సూ. ౮. ఆ. ౫౦-౫౪-౫౯॥

సమీక్షకుఁడు — ఏమండి! వర్తమాన సమయమందు రూసు వారు రోము మున్నగు దేశవాసులకును, ఇంగ్లాండువారు మిశ్ర దేశ వాసులకు దుర్దశ పాలఁజేసిల్లరే ఫరిశ్తా లెక్కడ నిద్రపోయి రో? సదా! పూర్వకాలమున ఖుదా తన సేవకుల శత్రువులను జంపుచు ముంచివేయుచు నుండెడ ననువార్తలు నిజమైన నిప్పుడుకూడ నటులే చేయవలని

యుండెను; వారిదళ యిట్లుగాక యుండెడిది. ఇందువలన నీమాట యొప్పఁ దగినది కాదు. ఇఁకనితర మతస్థులతో మీరు చేయఁగలుగునంతటి దౌర్జన్యము చేయుఁడను నీ దురాజ్ఞను గమనింపుఁడు ! ఒక విద్వాంసుఁడో, ధర్మాత్ముఁడో, దయాళువో అయిన నిట్లాజ్ఞాపింపనేరఁడుగద. మరల ఖుదా దయాళుఁడనియు, న్యాయకారియనియుఁగూడ వ్రాయుచున్నారు. ఇటువంటి మాటలవలన ముస ల్మానుల ఖుదాయందు న్యాయము, దయ మున్నగు సద్గుణము లెంతమాత్రము స్థిరపడనేరవు. ॥౭౦॥

౭౧. ఓ నబీ : నీకును అల్లాకును ముసల్మానుల పక్షముఁ బూనిన వారికిని లాభముకలదు. ఓ నబీ ! యుద్ధముచేయుట కుత్సాహమును కోరికను ముసల్మానులందు జనింపఁజేయుము. మీలో సంతోషభరితు లిరువదిమంది అయినను రెండువందల జనము నోడింపవచ్చును. మీరు దోఁచిన వస్తువుల ననుభవింపుఁడు. అవి భక్ష్యములు, పవిత్రములు. అల్లాడు మాత్రము భయపడుఁడు. అతఁడు దయాళువు, క్షమించును.

మం-౨. సి-౧౦-సూ-౭౮-౬-౬౫-౬౯-౬౭॥

సమీక్షకుఁడు—తన పక్షపువాఁడన్యాయము చేసినను వానికిఁ దోడయి వానికే లాభము కలుగఁజేయుదనుసదెట్టి న్యాయమో ! ఎట్టి విద్వత్తో ! ఏమి ధర్మమో ! తెలియుటలేదు. ప్రజలందు శాంతిభంగము గలుగఁజేయుటకు యుద్ధముఁ జేయుఁడనియు, జేయింపుఁడనియు, దోఁచిన పదార్థములు సేవనీయములనియు, అల్లా దయాళువు కాన క్షమించుననియు ననుమాటలు ఖుదా లిఖితము లెట్లు కాఁగలవు ! ఒక సరమునిచే వ్రాయఁబడినవియుఁ గానేరవు. ఇట్టి మాటలుగల కురాను ఈశ్వరోక్త మెన్నటికిని కానేరదు. ॥౭౧॥

౭౨. సదా వానియందుండుటకు. అల్లా కాని సమీపమున నుండును. పుణ్యము గొప్పది. ఓ విశ్వసించిన లోకులారా ! మీరుంద్రులను, మీ యన్న లను, (తమాషా) విశ్వాసము దెచ్చుకొనక దోషమును ప్రేమించు మిత్రులను చేపట్టకుఁడు. ఇంకను తన రసూలుమీఁదను, ముల్లానులమీఁదను అల్లా తన విశ్వాసమును స్థిరపఱచెను. మరి సేనలఁబంపెను. ఏమి ! మీరు వానిని పాపము చేసినవానిని చూడలేదా ! కాఫిరులకిదియే శిక్ష. పిమ్మట విష్టమైన వానిమీఁద అల్లా మరల దయఁ జూపును. విశ్వసింపని వారితో కొట్లాడుఁడు.

మం-౨.సి-౧౦.సూ-౯-ఆ-౨౧-౨౨-౨౩-౨౪-౨౬-౨౭॥

సమీక్షకుఁడు—సరి ; అల్లా స్వర్గవాసుల సమీపమున నుండుచున్న సర్వవ్యాపకుఁ డెట్లుకాఁగలఁడు ? సర్వవ్యాపకుఁడు కాఁడేని, సృష్టి కర్తయు, న్యాయాధీశుఁడును గాఁజాలఁడు. ఇఁక తమ తలిదండ్రులను, బంధుమిత్రులను విడిపించుట కేవల మన్యాయమేకద. ఒకవేళ వారు చెడ్డ యుపదేశము చేయుదురేని, యంగీకరింపవలదు. కాని వారిసేవ మాత్రము సర్వదా చేయవలసినదే. పూర్వకాలమున ఖుదా ముసల్మానులమీఁద సంతోషభరితుఁడై యుండెను. వారి సహాయమునకై సేనలఁ బంపుచుండెను. అను మాటలు నిజమైయున్న నిప్పుడక్కల చేయకుండును ; మొదట కాఫిరుల దండించుచు, మఱల వారి మీఁద దయఁజూపుచు నుండెనన్న నిప్పుడెక్కడికిఁ బోయెను ? ఖుదా యుద్ధము చేయింపక విశ్వాసము కలుగఁ జేయనేరఁడా ? ఇటువంటి ఖుదాను మేము సర్వదా తిలాంజలి చెప్పుచున్నాము. ఖుదా యన నొక యాటకాఁడే యనవచ్చును. ॥౮౨॥

౮౩. అల్లా తనదిక్కునుండి కాని మా చేయులతోఁగాని యెప్పుడు మీకు పీడను గలుగఁజేయునోయని మేము మీ విషయమై యెదురుచూచుచున్నాము.

మం-౨. సి-౧౦. సూ-౯. ఆ-౫౨॥

సమీక్షకుఁడు—ఏమి ? తనచేతనో ముసల్మానులచేతనో అన్యమతస్థులకు పీడఁగలుగఁజేయుచున్న ముసల్మానులే యీశ్వరునికి (పోలీసువారు) బంట్లు అయి నిలిచిరా ? ఇతర కోట్లకొలఁది మనుష్యులు ఈశ్వరునకు ప్రియులు కారా ? ముసల్మానులందు పాపకారులున్నను వారు ప్రియులేనా ? అటులైన (అంధేర్ నగరీ గవరగండరాజా) అధర్మరాజ్యములో సన్యాయపురాజా యను సామెతను బోలిన వ్యవస్థయేయని తెలుపబడుచున్నది. బుద్ధిమంతులయిన ముసల్మానులు కూడ నిట్టి నిరాధారమును, అయుక్తమునగు మతము నంగీకరించుట యాశ్చర్యకరము. ॥౮౩॥

౮౪. స్వర్గములను వానిలో నెల్లప్పుడు ప్రవహించెడు నదులు గలవనియు, అదనులోని స్వర్గములందు పవిత్రములైన గృహములు గలవనియు విశ్వసించిన స్త్రీపురుషులతో నల్లా ప్రతిజ్ఞ చేసియున్నాఁడు. అల్లా ప్రసన్నుఁడు మెండుగాఁగలఁడు. దాన గొప్ప ప్రయోజనములు పడయవచ్చును. ఇఁక వారితోఁ బరిహాసముఁ జేయుదురు. అల్లా వారితోఁ బరిహాసముఁ జేసెను.

మం-౨. సి-౧౦. సూ-౯. ఆ-౭౨-౭౮॥

సమీక్షకుఁడు—దన ప్రయోజనము నెఱవేరుటకు ఇట్లు ఖదా పేరిట, స్త్రీపురుషులకు ప్రలోభముఁ గలుగఁజేయుటకే కల్పింపఁబడిన దననొప్పును. ఏలన నిట్టి ప్రలోభనమును కలుగఁజేయుకున్న ముహమ్మదు సాహేబు వలలో నెవ్వఁడు చిక్కకుండును. ఇటులే యన్యమతస్థులును చేయుచున్నారు. మనుష్యులమాత్ర మొకరితోనొకరు పరిహాసము చేయుట సహజమేకాని ఖదా కూడ నొకరితో పరిహాసము చేయుననుట యుక్తముకాదు. ఈ పురానన్ను నొక గొప్ప యాటగానున్నది. ॥౮౪॥

౮౫. రసూలు. అతనిని విశ్వసించినవారలుఅను వీరు తమ ధనముల తోను, ప్రాణములతోను జిహాదొనరించిరి. ఈ జనులకే మేలుకలదు. అల్లా వారి హృదయములమీఁద ముద్రలు వేసియున్నాఁడు గాన వారెఱుఁగనేరరు.

మం-౨. సి-౧౦. సూ-౯. ఆ-౮౯-౯౨॥

సమీక్షకుఁడు—చూఁడుడు ! మహమ్మదుసాహెబును విశ్వసించిన వారు మంచివారనియు, నతని విశ్వసింపనివారు చెడ్డవారనియు, ననుట స్వార్థముతోఁగూడిన మాటయేకద. ఈమాట పక్షపాతముతోను, అవిద్యతోను గూడినది కాదా ! ఖదా ముద్రలు వేసియున్నందున నేకద, వారు పాపమొనరించుచున్నారు. అందు వారి యపరాధమేమియు లేదు. కాని ఆ యపరాధము ఖదాదే యననొప్పును ఏలయన వారి హృదయములమీఁద ముద్రలు వేసి ఆ యమాయకులను సన్మార్గమునుండి తొలఁగ జేసియున్నాఁడే. ఇది యెంత గొప్ప యన్యాయము !!! ॥౮౬॥

౮౭. వారిని వెలుపలి శుద్ధిఁజేయుటకుఁగాను నీవు వారిసొత్తులో నుండి దానము పుచ్చుకొనుము. అట్లే దానితో నీవు వారిలోపలి శుద్ధిఁజేయుము. నిశ్చయముగ అల్లా ముసల్మానులనుండి వారి ప్రాణములను, వారి సొత్తును "వీనికి మాఱుగ వారికి స్వర్గము చిక్కఁగలద"ను భావమున కొనియున్నాఁడు కాన నల్లామార్గమందు పోట్లాడుచు చంపుదము; చంపఁబడుదుము.

మం-౨. సి-౧౧. సూ-౯. ఆ-౧౦౨-౧౧౧॥

సమీక్షకుఁడు—మేలయ్యా మహమ్మదుసాహెబు ! మేలు ! తామ గోరువు గోసాయిలతో సమానులయితిరే ! ఏమన వారిసొత్తు గై కొని వారిని పవిత్రపఱతురనునది గోసాయీలవంటి సమాచారమే ! మేలయా ఖదా ! తామ

మంచిబేరము కనిపెట్టితిరే ! ముసల్మానులచేత తక్కిన బీదజనుల ప్రాణమును దీయించుటయే లాభమను కొంటిరా ! ఇట్లా యనాధుల( జంపించి, యీ దయా విహీనులగు మనుష్యులకు స్వర్గ మబ్బునని చెప్పుట ముసల్మానుల కూడా దయా న్యాయములకు దూరమై తన కూదాతనమున కొఱ(తను కలుగ(జేసికొని. బుద్ధి మంతులను ధర్మాత్ములలో నిందితు(డై నిలిచెనుగా ! ॥౮౬॥

౮౭. ఓ విశ్వసించిన లోకులారా ! మీయందు దృఢత్వము కలిగిన ప్పుడు మీరు మీదగ్గఱనున్న కాఫిరులను వారితో( బోట్లాడు(డు. ప్రతి సంవ త్సరమందు నొక పర్యాయమో రెండు పర్యాయములో వారు సంకటములలో, బడుచుండుట మీరు చూచుటలేదా ! అట్లైనను వారు చెంపలు వేసికొనరు( శిక్షను గ్రహింపరు. మం. ౨:సి-౧౧.సూ-౯.ఆ-౧౨౨-౧౨౩॥

సమీక్షకు(డు—ఈ విశ్వాసఘాతపు మాటలనుగూడ గమనింపు(డు మీ పొరుగువారేకాని పరిచారకులేకాని అవసరము చిక్కినప్పుడెల్ల వారితో బోట్లా డు(డనియు వారి కపాయము గలుగ( జేయు(డనియు కూడా ముసల్మానులకు నేర్పుచున్నా(డు. ఇటువంటిమాట లెన్నియో ముసల్మానులచే( గల్పింప(బడి నవి. ఈకురాను లేఖనుబట్టియే యిప్పుడైనను ముసల్మానులూహించి తెలిసికొని కురానునందలి దురాచారముల( ద్యజింతురేని కడుమేలౌన(గూడును ॥౮౭॥

౮౮. నిశ్చయముగ మీపోషకు(డు (అల్లా) దేవు(డే: ఆయన ఆఱు దినములలో నాకాశములను, బృథివిని సృజించెను పిమ్మట వాల్గవ ఆకాశము (అర్శ) మీ(ద శయనించెను. అత(డు కార్యముల యేర్పాటు చేయుచుండును. మం-౨. సి_౧౧. సూ-౧౦_ఆ-౩॥

సమీక్షకు(డు—ఆకాశమొక్కటియే. అది చేయ(బడక అనాదియైయు న్నది. దానిన్నిర్మించెనని వ్రాయుటవలన నీ కురానును రచించిన వారికి పదార్థ విద్యయొంతమాత్రము తెలియకుండెననుటయే స్పష్టము. ఏమి ! పరమేశ్వరు నికి ఆరు దినములవఱకు చేయవలసి వచ్చెనా ! మఱి "నా ఆజ్ఞవలనకమ్ము అన(గా నయ్యెను" అని కురానునందు వ్రాయ(బడియున్నపుడు ఆఱుదినముల పట్టవలసిన యవసరమే లేదుగదా ! కా(బట్టి ఆఱుదినములు పట్టెననుట యసత్య తమే. ఆయన వ్యాపకు(డే యైయున్న నాకాశము మీ(ద నెందులకు శయనించి యుండును ! ఇ(క కార్యముల యేర్పాటు చేయుచుండునన్న నిజమగు. మీ

ఖుదా మనుష్యునితో సమానుఁడే యనఁబడును. ఏమన సర్వజ్ఞుఁడైన వాఁడు కూర్చుండియుండి యేమి యేర్పాటు చేయుచుండును ? కావున నీశ్వరుఁడెఱుంగని యవివేకు లీ పుస్తకమును రచియించ వచ్చునని దీనివల్ల విదితమగుచున్నది. ||౮౮||

౮౯. దయాశీలు ముసల్మానులకొఱకే.

మం-౩. సి-౧౧. సూ-౧౦, ఆ-౫౫||

సమీక్షకుఁడు—ఏమి ! ఈ (ఖుదా) దేవుఁడు ముసల్మానులకు మాత్ర మేనా ? ఇతరులకుఁ గాఁడా ? ఇంత ముసల్మానులమీఁద దయచూపుచు నన్యుల మీఁద దయ చూపదేని పక్షపాతము గలవాఁడే యగును. విశ్వాసపాత్రులను (ఈమాందారులనే) ముసల్మానులందురన్న వారికి శిక్ష యవసరమేలేదు. ఇంక ముసల్మానులు గానివారికి ఉపదేశము చేయఁదేని ఖుదా విద్యయే వ్యర్థము. ||౮౯||

౯౦. కర్మములందు మీలో నెవఁడు మంచివాఁడో పరీక్షించుటని నీవు చెప్పుము. (ఏలయన) అవశ్యముగ మీరు చచ్చిన పిమ్మట లేపఁబడు దురు. మం-౩. సి-౧౧. సూ-౧౧-ఆ-౭||

సమీక్షకుఁడు—ఇట్లు కర్మములఁ బరీక్షించువాఁడు సర్వజ్ఞుఁడే కాఁడు. చచ్చిన పిదప లేపుచున్న వారిని నిర్బంధములో పెట్టువాఁడే యగును. మఱి చచ్చినవారు జీవితులుకాకుండెడి తననియమును దానే భంగపఱచు వాఁడగు నుగా ! కాన నిది ఖుదాత్వమున కొఱతను గలుగ జేయుచున్నది. ||౯౦||

౯౧. ఓ పృథివీ ! నీ జలముఁ బీల్చుకొనుము. ఓ ఆకసమా ! చాలిం చుము. అని చెప్పఁబడగా నీ రెండిపోయెను. ఓ కులమా ! యీ అల్లా యొఁడు ఒంటె మీకు గుఱుతుగనున్నది. కాన దాని వదలి పెట్టుఁడు. అల్లా భూమిమీఁదఁదినుచు సంచరించుగాక.

మం-౩. సి-౧౨ సూ-౧౧: ఆ-౪౪-౬౩||

సమీక్షకుఁడు—ఇదియెంత పసిబిడ్డపుమాట ! పృథివ్యాకాశము లెవ్వరైన మాటలు వినఁగలవా ! మేలయా మేలు ! ఖుదాకు నొక ఆఁడుఒంటెయు గలదేని మగదికూడ నుండవచ్చును. అట్లే ఏనుఁగులు, గుఱ్ఱములు, గాడిదలు మున్నగు నవియు నుండవచ్చును. ఖుదా యొఁడు ఒంటెచేఁ బొలమును

మేయించుట మంచిదేనా? ఆ ఒంటెమీద నెక్కుచు న్నుండా ఏమి? ఇటులేని సమికాని పంటి గందరగోళమే ఖుదా యింటనయ్యెను. ॥౯౧॥

౯౨. పృథివ్యాకాశము లుండువఱకు వానిమర్య నెల్లప్పుడుండు వారును గలరు. ఇంక భాగ్యవంతులైన వారు పృథివ్యాకాశములందు వఱకు సదా స్వర్గమున నుండువారై యున్నారు.

మం-౩ సి-౧౨-సూ౧౧ ఆ-౧౦౫-౧౦౬॥

సమీక్షకుడు:- ప్రళయమునకు విమ్మట నరకస్వర్గములకునందఱు పోవుదురన్న నిక నాకసమును, పృథివియు నెందుకొఱకుండును? మఱి నరక స్వర్గములు, భూమ్యాకాశము లుండువఱకే యుండునన్న స్వర్గ నరక ములందు నెల్లప్పు డుండురనుమాట యసత్యమయ్యెను. ఇది విద్యా విహీ నుల మాటయే కాని యీశ్వరునిది కాని యొక విద్వాంసునిదైనను కాని కానేరదు. ॥౯౨॥

౯౩ యూసుపు తన తండ్రితో "ఓ నాయనా! నేనొక స్వప్నములోఁ జూచితి" ననెను. మం-౩, సి-౧౨-సూ-౧౨-ఆ౪ నుండి ౫౬॥

సమీక్షకుడు:—ఈ ప్రకరణమంతయు తండ్రి కొడుకుల సంవాద మను కథతో నిండియున్నది. కావున కురాను ఈశ్వరకృతము గాదు. కాని యొకానొక మానవుఁడే మనుష్యుల యితిహాసమును వ్రాసియున్నాడు. ॥౯౩॥

౯౪. ఆకసమును స్తంభములులేకుండ నిలువఁబెట్టినవాడే (అల్లా) దేవుడు. దాని మీరు చూచుచున్నారుగదా! మఱల నతఁడు చర్శమీద నిలిచెను. సూర్యచంద్రుల నాజ్ఞానువర్తులఁ జేసెను? పృథివిని పఱచినవాఁడు నతఁడే ఆకాశమునుండి నీటిని గురిపింపఁగా నది స్వచ్ఛందముగ కాలువలై పాఱెను. అల్లా ఇష్టమైనట్లు సమృద్ధిగ భోజనము నిచ్చుచున్నాడు. సంకుచితముగను నిచ్చుచున్నాఁడు. మం-౩-సి-౧౩-సూ-౧౩-ఆ౧-౩-౧౭-౨౬॥

సమీక్షకుడు—ముసల్మానుల ఖుదా పదార్థవిద్య నెంతమాత్రి మెఱుఁగ కుండెను: ఎఱిఁగియేయుండిన గురుత్వము కలిగియుండని యాకాశమును స్తంభములు లేక నిలవబెట్టితినన్న గాథలనెంతమాత్రము వ్రాయక యుండును. ఇఁక ఖుదా (అర్శ) నాల్గవ ఆకాశము అను నొక స్థానమునందు వసించు చున్నాఁడేని యతఁడు సర్వశక్తి మంతుఁడును, సర్వవ్యాపకుఁడును గానే

రాదు. అట్లే ఖుదా మేఘవిద్య నెఱిగియున్న ఆకాశమునుండి నీటిని గురి యించితినని వ్రాయునే కాని పృథివినుండి నీటిని పైకెక్కించితినని వ్రాయ లేదెందులకు? దీనివలన, కురానును రచియించినవాఁడు మేఘవిద్యనుకూడా నెఱుఁగకుండెనని నటయే నిశ్చయము. మఱి సుకృత, దుష్కృతములులేక సుఖదుఃఖములు గలుగఁజేయు చున్నాఁడేని పక్షపాతియు, నన్యాయకారియు, నిరక్షర కుక్షియయి నిలుచును. ॥౯౪॥

౯౫. అల్లా నిశ్చయముగ నిష్టమైనవాని. భ్రోపదప్పించు చున్నాఁడ నియు. ఇష్టమైన వానిని తనదిక్కునకుఁ లాగుచు మార్గముఁ జూపుచున్నాఁ డనియుఁ జెప్పుము. మం-౩-సి-౧౩-సూ-౧౩-ఆ-౨౩॥

సమీక్షకుఁడు—అల్లా భ్రోపదప్పించు చున్నాడేని, ఖుదాకు, సైతానునకు నింక భేదమేముండెను? సైతాను ఇతరులఁ భ్రోపదప్పించుట భ్రమింపఁజేయుట వలననేకదా దుష్టుఁ డనబడుచున్నాఁడు. ఖుదా సయితము పట్టిపనియే చేసినచోఁ గడు పెద్ద సైతానెందులకు గాకుండును? మఱి భ్రమింపఁజేసెడి పాపమును బట్టి నరకవాసుఁడెందులకుఁ గాఁగూడదు? ॥౯౫॥

౯౬. ఈ ప్రకారముగ మేమీ కురాను నరబీభాషయందు దించితిమి. నీకు కల్గిన విమ్మటను నీవు వాని యభిప్రాయముల ననుసరించి వర్తింపఁ గలవు. ఇంక నింతకంటె నెక్కువ సమాచార మందఁజేయు నవసరములేదు. మామీఁద రెక్కతీసికోలేదు. మం-౩-సి-౧౩-సూ-౧౩-ఆ-౩౭-౪౦॥

సమీక్షకుఁడు—కురాను నేపైపునుండి దించెను? ఖుదా మీఁద నివ సించు చున్నాఁడా యేమి? ఈ వార్త నిజమేని అతఁ డేక దేశీయుఁడై నందున ఈశ్వరుఁడే కానేరఁడు. ఏమనగా నీశ్వరుఁడు సర్వత్ర నిరంతరముగ వ్యాపకుఁడయి యున్నాఁడు ఇంక సమాచారము నందఁజేయుట రాయబారి పనియే యనవొప్పును. మనుష్యునివలె నేక దేశీయుఁడగు వాని కేగద రాయ బారి యావశ్యకత కలదు. అట్లే రెక్కచూచుట. యొప్పఁజెప్పుకొనుట సయితము మనుష్యునిపనియే కాని యీశ్వరునిది కాదు. ఏలయన నతఁడు స్వల్పజ్ఞుఁడు కాక యొకానొక అల్పజ్ఞుఁడయిన మనుజుఁడే ఈ కురానును రచి యించెను సన్ను నిర్మించెను. ॥౯౬॥

౯౭. సూర్యచంద్రుల నెల్లప్పుడు సంచరించువారలఁ జేసెను. మను ద్యుఁజువశ్యముగ సన్యాయమును. పాపమును చేయుననుట నిశ్చయము.

మం౧-సి__సూ-౧౪-అ-౩౩-౩౪॥

సమీక్షకుఁడు - ఏమి: సూర్యచంద్రులే సదా తిరుగుచున్నారా? భూమి తిరుగుట లేదా? భూమి తిరుగకున్న నెన్నియో సంవత్సరముల కొక దినమును, రాత్రియు నేర్పరుచుండెడిది. మనుష్యుఁడు నిశ్చయముగ సన్యాయమును, పాపమును చేయువాఁడేని కురానుద్వారా ఉపదేశము చేయుట వ్యర్థమే. ఏమనఁగా వారి స్వభావమే పాపమొనరించునదయి యున్నప్పుడు వారిలో పుణ్యాత్ముఁ డెన్నటికి లేకుండును। కాని జగత్తున పుణ్యాత్ములు, పాపాత్ములు సర్వదా కనబడుచున్నారు. కాఁబట్టి యిది యీశ్వరకృత పుస్తకమందలి వాక్యము కానేరదు. ॥౯౭॥

౯౮. నేను వానిని జక్కఁగాఁజేసి నాలోనుండి వానిలోపలికి ప్రాణము నూఁదినపుడు నతనికి మీరు(సిజ్దా)సాగిలపడి దండముఁబెట్టుడు. ఓ నా రక్షకా। నీవు నన్ను ఇట్లు త్రోవఁ దప్పించితివి. నేనవశ్యముగ వారికి జగమున వృది కలుగఁజేయుదును. మరి త్రోవఁదప్పింతును అనెను.

మం-౧-సి-౧౪-సూ-౧౫-అ-౩౯ నుండి ౪౧॥

సమీక్షకుఁడు - ఖుదా తనప్రాణమును. ఆదామునందు ఊంపెనన్న నతడుకూడ ఖుదాయయ్యెను. ఖుదా కాకుండినచో (సిజ్దా) నమస్కారాది భక్తి పలుపుటకుగాను తనతోఁ(జే)యున్నవానిగ నెందులకుఁ జేసెను। సైతానును త్రోవదప్పఁజేయువాఁడు ఖుదాయేయయిన, ఆయనే సైతానునకు సైతానును, పెద్దన్నయు, గురువునేలఁగాఁడు? ఏలయన భ్రమింపఁజేయువానిని మీరు సైతానని యంగీకరించుచున్నచో ఖుదా సయితము సైతానును భ్రమింపఁ జేసెనుకదా. తాను ముఖాముఖిగ నేను భ్రమింపఁ జేయుదుననియన్ననుసై వానిని దండించి చెఱలో నెందులకుంచలేదు? మఱి చంపివేయరే దెందులకు? ॥౯౮॥

౯౯. నిశ్చయముగ మేము ప్రతి తెగయందు పైగంబరును పంపి యున్నాము. మే మెప్పుడేది కోరుచున్నామో. మేము దానిని 'కమ్ము' అని యనఁగా నది యగుచున్నది. మం-౧-సి-౧౪-సూ-౧౬-అ-౩౫-౩౯॥

సమీక్షకుఁడు—అన్ని తెగలందు పైగంబరులఁ బంపినపుడు సందఱును పైగంబరుల యనుమతి ప్రకారముగనే ప్రవర్తించుచున్నారు. ఇంక వారు కాఫిరులెట్లయిరి? మీపైగంబరునకుఁ దప్ప మిగిలిన పైగంబరులకు మాన్యత లేదా యేమి? అట్లయిన నిది కేవలము పక్షపాతముతోఁగూడిన విషయమే. సరి: అన్ని దేశములందు పైగంబరులఁ బంపియున్నచో నార్యావర్తమందె వరినిఁ బంపెను? కాన నీమాట యొప్పఁదగినది కాదు. ఖుదా కోరినప్పుడు పృథివీః కమ్మ్ర అని యనుటగద"—సరిఁ ఎన్నఁడును వినరేని యాఖతము. ఖుదా యాజ్ఞనెట్లు వినగలుగును? ఖుదాతప్ప మతొకవస్తువే లేనపుడు వినిన దెవరు? కలిగిన దేమిటి? ఇవన్నియు జ్ఞానశూన్యములగు వార్తలే. కాఁబట్టి ఇట్టివార్తల నవివేకులు మాత్రమే యొప్పుకొనుచున్నారు. ॥౯౯॥

౧౦౦. అల్లా కొంఱకు కామార్తెలను నియమించుచున్నాము. ఆతని యందు పవిత్రత కలదు. కోరినదెల్ల వారికిఁజిక్కును. అల్లా సాక్షిగ మేము వశ్యముగఁ బైగంబరులను బంపియున్నాము.

మం—౩—సి—౧౪—సూ—౧౬—అ—౫౬—౬౨॥

సమీక్షకుఁడు—అల్లా కామార్తెంతో నేమిచేయును? ఒకానొక మనుష్యునకు కామార్తెలు కావలసియుండును. కుమారులు నియమింపఁబడక కామార్తెలే నియమింపఁబడుచున్నారా యేమి? దీనికిఁ గారణ మేమొచూపుఁడు! ఒట్టుపెట్టుకొనుట యసత్యవాదులపనియేకాని ఖుదాది కాదు. ప్రపంచమునఁ దఱచుగా నబద్ధములాడువాఁడే యొట్టుపెట్టుకొనుచుండుట కనఁబడుచున్నది. సత్యవంతుడైన వాఁడెందుల కొట్టుపెట్టుకొనును? ॥౧౦౦॥

౧౦౧. ఈ లోకులెవరనఁగా — అల్లా ఎవరి హృదయముం మీఁదను, చెవులమీఁదను, కన్నులమీఁదను ముద్రల వేసినాడో వారే. యామతి మఱచిన వారలు, ప్రతి ప్రాణికి చేసినంత ఫలము పూర్తిగ నీయఁబడును. అన్యాయ మెంతమాత్రము చేయఁబడదు.

మం—౩—సి—౧౪—సూ—౧౬—అ—౧౧౫—౧౧౯॥

సమీక్ష—(ఖుదా) దేవుఁడే ముద్రలను వేసినపుడు. ఆయమాయకు లపరాధము చేయవిదే పిడింపఁబడిరిగదా! వారిని పరాధీనులఁజేసిన దెంత గొప్ప యపరాధ మనవలెను! ఇఁక సెవ దెంత చేసి యున్నాఁడో వానికి న్యూనాధిక భేదము లేక యంతటిఫలమే యీయఁబడుననియు ననుచున్నారు.

మఱి వారు స్వతంత్రముగఁ బాపము చేసినవారు గారు కాని ఖుదాచేయించుట
వలనఁ జేసియున్నారు. కాఁబట్టి వారి యపరాధమేమియు లేదు. ఇఁకవారికా
ఫలముకూడ లభింపఁగూడదు కర్తలమా ఖుదాకు లభించుటయే యుచితము.
చేసినంతఫలమే యీయఁబడుచున్న క్షమింపఁబడున దేమి? మఱి క్షమింపఁ
బడుదు రేని న్యాయము లేచిపోవును. కాన నిట్టి పోలు పొందులేని ప్రసంగ
మీశ్వరున కెన్నటికిని గానేరదు. కాని బుద్ధిలేని పిల్లలది కాఁగలదు. ॥౧౦౧॥

౧౦౨. మేమునరకమును కాఫిరులకొఱకు చెఱసాలను బోలిన
స్థానముగాఁ జేసియున్నాము. అల్లేప్రతిమనుష్యునిమెడలో వానికర్మ పత్రమును
గట్టియుంచినాము. వాని కొఱకుఁ బ్రళయదినమున నొక పొత్తమును తీయఁ
గలము. అది తెఱచి యున్నట్లు వాని కగపడును. నూహకుఁబిమ్మట మేము
మానవ సముదాయములలో ననేకులఁ జంపియున్నాము.

మం-౪-సి-౧౫-సూ-౧౭-ఆ-౮-౧౨-౧౮॥

సమీక్ష—కురానును, పైగంబరులను, కురానునందలి ఖుదాను, ఏడవ
యాకాశమును, నమాజు మున్నగు వాని నొప్పుకొనని వారే కాఫిరులు.
వారికే నరకముకలదు అను మాటలు కేవలము పక్షపాతముతోఁ గూఁడిన
వేయనొప్పును. ఏమనఁగా కురానునుమాత్ర మొప్పుకొను వారందఱును
మంచివారుగాని, ఇతరముల నొప్పుకొను వారందఱును చెడ్డవారుగానీ యెన్నఁ
డేని కాఁగలరా? ఒక్కొకని మెడలోఁ గర్మపత్రమును గట్టియుంచినా మను
నదియుఁ గడుపసితనపుమాటయేకద. మే మొకని మెడలోనయినను జూచుట
లేదు. కర్మఫలం బిచ్చునెనుటయే దాని అభిప్రాయమన్న మఱి మనుష్యుల
హృదయముల మీఁదను నేత్రాదుల మీఁదను ముద్రలు వేసినాఁడు, పాపముల
క్షమించును, అనుస వన్నియు వట్టిమాటలేనా ఏమి? ప్రళయరాత్రినే ఖుదా
అపుస్తకమును దీయునేని యిప్పుడా పుస్తక మెక్కడనున్నది? ఒకసాహుకారి
వద్దనుండు లెక్క పుస్తకమువలె వ్రాయుచుండునా యేమి? పూర్వజన్మమే
లేదేని జీవుల కర్మములు నుండఁజాలవుగదా! మఱికర్మరేఖ నేమి వ్రాయఁగలు
గును. కర్మములు లేనిదే వ్రాసెనన్న వారిపైనన్యాయ మొనరించెనసుట
స్పష్టము. ఏలయన శుభాశుభ కర్మములే లేకున్న వారికి సుఖదుఃఖముల నెట్లు
కలుగఁ జేసెను? ఖుదాయిష్టమున్నటో నటఁచన్యాయమే చేసెను. శుభాశుభ
కర్మములు లేనిదే సుఖదుఃఖము లను ఫలముల నెక్కువతక్కువలుగ నిచ్చుట

యన్యాయమే యనబడును. ఇంక నాసమయమునందు (ఖుదా) దేవుడే పుస్తకమును చదువునా? లేకయొక సిరస్తాదారుడను అధికారి వినిపించునా? మఱి ఖుదా దీర్ఘకాలంబందముగల జీవుల నపరాధము లేనిదే చంపెనన్న నతఁడ న్యాయ కారియే యయ్యెనుగద. అన్యాయకారి యయినవాఁడీశ్వరుఁడే కాఁజాలఁడు. ॥౧౦౨॥

౧౦౩. మేము సమూదునకు ఆడులొట్టిపిట్టను నిదర్శనముగానిచ్చినాము. శ్రమింపఁజేయఁగలిగిన వానివి శ్రమింపఁజేయుము. మేమందఱును వారిమార్గ దర్శకులతోఁ బిలిచిననాఁడు ఇయ్యఁబడిన ఆయా కర్మపత్రము ప్రతి వానికుడిచేతి యదుండుసు. మం-౪ సి-౧౫-సూ-౧౩-ఆ-౫౩-౬౨-౬౫॥

సమీక్ష—మేలండి మేలు! ఖుదాను దెలియఁజేయు ఆశ్చర్యకరములగు నెన్నిగుఱుతులు కలవో వానిలోనొక ఆఁడులొట్టిపిట్టయు. ఖుదా యున్నాఁడనుటకు ప్రమాణముగనో లేక ఖుదాను గుర్తించుటకు సాధనముగనో యున్నదిగా! శ్రమింపఁజేయుమని ఖుదా యాజ్ఞనొసంగినచో, ఖుదాయే సైతానును ప్రేరేపించువాఁడును సమస్త పాపముల నొనరింపఁజేయువాఁడు నయ్యెను. ఇటువంటివానిని ఖుదాయనుట కేవల మవివేకమే. (కయామత్) ప్రళయమునాఁడే న్యాయ విమర్శనముకొఱకు పైగంబరులను, వారి యుపదేశముల నంగీకరించువారలను పిలుచునన్న ప్రళయము కానంతవఱకు నందఱును నిర్బంధమును నిబ్బందిలో నుండవలసివచ్చును. న్యాయము చేయఁబడ నంతవఱకు నిర్బంధమున నుండుట యెల్లరకు దుఃఖదాయకమే యగును. కాన శీఘ్రముగ న్యాయ మొనరించుటయే న్యాయధీశున కుచితము. ఇది పోపాంబాయి న్యాయమయ్యెను. ఎట్లనఁగా నొకన్యాయాధీశుడు, ఏఁబదేండ్లకాలవు దొంగలును, సాహుకార్లును, ప్రోగుగా నంతవఱకు నెవరికిని శిక్షకాని, ప్రతిష్ఠకాని కలుగఁగూడదని యుత్తరవు చేసినట్లే యిదియునయ్యెను. గమనింపుఁడు! ఒకఁడో ఏఁబది సంవత్సరముల వఱకు నిర్బంధములో నుండెను. ఒకరు నేఁడే పట్టుపడెను. కాఁబట్టి న్యాయమన్న నిట్లుకాదు. వేదమునను, మనుస్మృతియందో చూడుఁడు: క్షణమాత్రమైన నట ఆలస్యముకాదు. తమ తమ కర్మానుసారముగ జీవులు దండనవో, ప్రతిష్ఠనో సదా పొందుచునే యుందురు. ఇఁక రెండవది పైగంబరులను సాక్షులవలె నుంచుటవలన నీశ్వరుని సర్వజ్ఞత్వమునకును హాని కలుగుచున్నది. సరి! ఇటువంటి పుస్తక

మీశ్వరకృతము కాఁగండా? కానేరదు. అట్లే యిటువంటి పుస్తకము నుపదేశించువాఁడెన్నఁడేని ఈశ్వరుఁడు కాగలఁడా? ఎన్నటికిని గానేరఁడు. ॥౧౦౩॥

౧౦౪. ఈ లోకులకొఱకు-ఎల్లప్పుడుండుటకు-తోఁటలు కలవు. వాని క్రిందగా నదులు ప్రవహించుచుండును. ఇంక నట బంగారులో చేయఁబడిన కంకణములు-నగలు-తొడిగింపబడును. ఆకుపచ్చ వన్నెగల సన్నని వస్త్రములు దొడుగుదురు. అచ్చట మంచి పట్టుమెత్తలపై నొఱగి మంచములమీద గూర్చుందురు; పుణ్యముచే మంచి లాభము-స్వర్గము-పొందవచ్చును.

మం-౪-సి-౧౩సూ-౧౮-ఆ-౩౦.॥

సమీక్ష—మేలయా మేలు! కురానునందలి స్వర్గము నేమి చెప్పవలెను! అందు తోఁటలు. నగలు. వస్త్రములు. మెత్తలు. దూదిపఱుపులు. ఆనందించుటకు గలవుగా! ఒకానొక బుద్ధిమంతుఁ డూహించునేని. ఈ ముసల్మానుల స్వర్గమునందు నన్యాయముదప్ప నిక్కడికంటె నెక్కువ యక్కడ నేమియు లేదనియే తేఁటపడును. ఏమియనఁగా నంతముగల కర్మములకు అనంత ఫలము లభించునని వ్రాయఁబడి యున్నది. ఇదిగాక యక్కడఁ బ్రతినిత్యము తియ్యని పదార్థమే తిందురన్న కొద్ది దినములలోనే యది విషమువలెఁ దోచును. ఇంక వారెల్లప్పుడు సుఖము ననుభవింతురేని ఆసుఖమే వారికి దుఃఖరూపమగును. కావున మహాకల్పపర్యంతము ముక్తిసుఖము ననుభవించి పునర్జన్మ మెత్తుదురనుటయే సత్యమయిన సిద్ధాంతము. ॥౧౦౪॥

౧౦౫. అన్యాయము చేసినందులకు మేమీ గృహస్థులను పట్టణములకు పట్టణములు నాశనముచేసితిమి. మఱి మేము వారిని జంపవలెనని ప్రతిజ్ఞ చేసియుంటిమి. మం-౪-సి-౧౩-సూ-౧౮-ఆ౩౭॥

సమీక్ష—ఏమి! జనులందఱుఁ బాపాత్ములు కాగలరా! తదుపరి ప్రతిజ్ఞ చేసియున్నందున నీశ్వరుఁడు సర్వశక్తిమంతుఁడును గాకపోయెనుగద. ఏమియన వారి యన్యాయవర్తనమునఁ జూచినపుడు ప్రతిజ్ఞ చేసియుండెనే కాని తత్పూర్వము వీరన్యాయము చేయఁగలరని యెఱుగకుండెనా! దీనివలన దయావిహీనుడు నయ్యెనుగదా! ॥౧౦౫॥

౧౦౬. ఎవఁడు పిల్లవాఁడుగా నుండెనో వాని తల్లిదండ్రులు విశ్వాసపాత్రులై యుండిరి. ఇఁక నీ పిల్లవాఁడు హఠమునందును (కుఫ్ర్) మత విరుద్ధాచరణమునందున వారిని జయించునని మే మతనికి భయపడుదుము

గాక. సూర్యుఁడు మునుఁగు చోటునకు వెళ్ళి ఆ సూర్యుఁడు బురదగల చెలమలో మునుఁగుచుండుట నతడు చూచెను. ఓ జుల్కర్నైన్) సర్వరక్షకా! నిశ్చయముగ యాజూజు మాజూజులు ప్రపంచమున కలహము కలుగఁ జేయువారై యున్నారు. మం-౪-సి-౧౬-అ౧౮-౮౪-౯౫॥

సమీక్ష-సరి! ఖుదాది తెలివిమాలినతనమని చెప్పవలెను. పిల్లకాయల తల్లిదండ్రులు. తన మార్గమునుండి తొలఁగింపఁబడి తనకు ద్రోహము చేయువారు గాకుండురనియేగద అతనికి సందేహము కలిగినది. కాన నిది యీశ్వరవాక్య మెన్నటికిని కానేరదు. ఇఁక సూర్యుఁడు రాత్రియందొక చెలమలో మునిఁగి, తిరిగి ప్రాతఃకాలమున నుదయించునని భావించిన ఈ గ్రంథకర్త యజ్ఞానముతోఁగూడిన ఈ వచనమునుగూడ గమనింపుఁడు. సూర్యుఁడన పృథివికంటె చాల గొప్పవాఁడు. అతడొక నదిలోఁగాని. చెలమలోఁగాని. సముద్రములోఁగాని ఎట్లు మునుఁగగలుగును? ఈ ఖురానును రచించినవాఁడు భూగోళ ఖగోళ విద్య నెఱుఁగకుండెననియే దీనివలన విదిత మయ్యెను. ఎఱిఁగియేయున్న నిట్టి విద్యా విరుద్ధమైన మాట నెందులకు వ్రాసి యుండును? ఇక నీపుస్తకముపై విశ్వాసముగలవారియందును విద్యలేదు. విద్యయేయున్న నిట్టి దబ్బరపలుకులతోఁ గూడియున్న పుస్తకము నెందుల కొప్పుకొని యుందురు? ఇదిగాక ఖుదా యన్యాయమును చూడుఁడు! తానే పృథివిని సృజించువాఁడు. రాజు. న్యాయాధీశుఁడుగా నుండి మఱి తానే యాజూజు మాజూజులను ప్రపంచమున కలహముఁగూడఁజేయనిచ్చుచున్నాఁడు. ఇది యీశ్వరత్వమునకు కడు విరుద్ధము. కాన నీపుస్తకము నడవి మనుష్యులు నమ్ముదురేకాని విద్వాంసులెంత మాత్రమంగీకరింపరు. ॥౧౦౬॥

౧౦౭. మరియము తూఱుపింటఁ దనవారినుండి వేఱయి కూర్చుండి నప్పటి ప్రసంగమును పుస్తకమున నుదాహరింపుము. ఆమె వారికి తెఱచాటై యుండఁగా మేము మా జీవమును ఆమె దగ్గఱకుఁ బంపితిమి గాన నాజీవము ఆమెకొఱకు ఆరోగ్యమైన మనుష్యరూపముఁదాల్చెను. ఆమె నీవు సదాచారి వయినచో నిశ్చయముగనే దయాసాగరుని శరణు చొచ్చుచున్నానని పలుక మొదలిడెను. అప్పుడాయన నేను నీఁకుఁబవిత్రమైన కొడుకును గలుగఁజేయుటకు. సర్వరక్షకుఁడగు నీ ప్రభువుచేఁ బంపఁబడినవాఁడనే కాని వేఱుగా భావింపఁగూడదనెను. నేను నిందిత కార్యము చేయుదానను కాను. నన్నే

మనుష్యుఁడును రాఁడలేదు. కొడుకు నాకెట్లు కలుగుననెను: కాని యతనిచే గర్భిణియయ్యెను. ఆమె యతనితోఁగూడ తనయింటికి దూరముగా అడవిలో నికిఁబోయిపడెను.

మం-౪-సి-౧౬-సూ-౧౯-ఆ-౧౬-౧౭-౧౮-౧౯-౨౦-౨౧॥

సమీక్ష—పరిశుద్ధాత్మలందఱును దేవుని జీవములైన. అవి ఆ (ఖుదా) దేవునికంటె వేఱయినవి కాఁజాలవనియేకద. బుద్ధిమంతులిట విచారింపవలసి యుండునది. (రెండవది) మరియమను కన్యకకు కొడుకు గలుగుటయు దౌర్జన్యమే. ఏమియనఁగా ఆమె ఒకనితో సంభోగముఁ జేయగోరకుండెను. కాని ఖుదా ఆజ్ఞఁబడసి ఆపరిశుద్ధాత్మ ఆమెకు గర్భము కలుగఁజేసెను. ఇది అన్యాయమేయనుట స్పష్టము. ఇంక నిట అసభ్యతతోఁగూడిన యనేక వార్తలను వ్రాయబడియున్నవి. వానినిట వ్రాయుట యుచితము కాదను కొంటిని. ॥౧౦౩॥

౧౦౪. ఏమి: మేము కాఫిరులమీఁదికి శైతానులఁ బంపినది నీవు చూడలేదా, వారిని మోసపుచ్చి భ్రమింపఁజేయుచున్నారు.

మం-౪.సి-౧౬.ఆ-౮౧॥

సమీక్ష—(ఖుదా) దేవుఁడే శైతానులను మోసపుచ్చుటకు నంపు చున్నాఁడేని మోసపోవువారు నేరస్థులు కానేరరు. ఇఁక వారికిఁగాని ఆ శైతానులకుగాని దండన కలుగగూడదు. ఏమనఁగా నిరంతయు ఖుదాయాజ్ఞ వలన జరుగుచున్నది. కాన దీనిఫలము నా (ఖుదా) దేవుఁడే పొందదఁగును. ఆయన నిజమైన న్యాయకారియయి యున్నదాని ఫలమగు నరకమును దానే యనుభవింపఁదగును, న్యాయమును వదలి యన్యాయ మొనరించునేని యన్యాయకారియే యగును. మఱి అన్యాయ మొనర్చువాఁడే పాపాత్ముఁడనఁబడు చున్నాఁడు. ॥౧౦౪॥

౧౦౫. పశ్చాత్తాపపడుచు విశ్వసించినవానిని, మంచి కర్మముల నొన రించుచు మరల శిక్షను. తిరిగి మార్గము గ్రహించినవానిని నేను నిశ్చయముగ క్షమింపఁగలను. మం-౪.సి-౧౬.సూ-౨౦-ఆ-౮౨॥

సమీక్ష—పశ్చాత్తాప పడుటవలన-పాపములు క్షమింపఁబడునని తురాననందుగల యీ వార్తయందఱును పాపకారులఁ జేయునదే యన

నొప్పును. ఏమనఁగా దీనిఁజేసి పాపాత్ములకు పాప మొనరించుటకు సాహసమధికముగ నుప్పొంగుచున్నయది. ఇందువలన నీగ్రంథమును నేతద్గ్రంథకర్తయు పాపకారులకు పాపమొనర్చుట కధిక సాహసమును గలుగఁ జేయును. కాన నీపుస్తక మీశ్వరకృతము కానేరదు ఇందు జెప్పఁబడిన వాఁడీశ్వరుఁడును గాఁజాలఁడు. ॥౧౦౯॥

౧౧౦. కదల కుండుటకు మేము భూమిమీఁద పర్వతముల నిలిపి యున్నాము. మం-౪. సి-౨౧. సూ-౩౧, ఆ-౧౦॥

సమీక్ష - కురాను కర్త భూమి తిరుగుచున్నదను నిత్యాది విషయముల నెఱిఁగియున్న పర్వతములు నిలుపుటవలన భూమి కదలకుండునని యెప్పుడును వ్రాయకుండెడివాఁడు. పర్వతముల నుంచకున్న భూమి కదలఁగలదని అతనికి శంక గలిగినది. మఱి అట్లుంచియున్నను భూకంపము కలుగు నప్పుడెల్ల నీభూమి యెందులకు కదులుచున్నది? ॥౧౧౦॥

౧౧౧. మే మా స్త్రీ కుపదేశముఁజేసితిమి. ఆమె తన గోప్యాంగములు గాపాడు కొనెను. కాన మేము ఆమెలోనికిఁదమ జీవము నూఁదితిమి. మం-౪-సి-౧౭-సూ-౨౧-౯౧॥

సమీక్ష—ఇట్టి యశ్లీల వాక్యములు ఖుదావనువెట్లు? సభ్య పురుషుల వయిన గానేరవు. మానవులే యిటువంటి మాటలను వ్రాయుట యనుచితమని తలఁచునప్పుడవి ఈశ్వరున కెట్లు మంచివగును? కురాను ఇట్టి వార్తలతోఁ గూడియున్నందులకే దూషితమగుచున్నది. వేదములవంటి మంచిమాటలతోఁ గూడియున్న నిది మిగుల ప్రశంసనీయమై యుండెడిది. ॥౧౧౧॥

౧౧౨. పృథివ్యాకాశముల మధ్యనున్న జనులును, సూర్య చంద్ర నక్షత్రములును, పర్వతములును, పశువులు నల్లాకు (సిజ్దా) నమస్కారము చేయుచుండుట నీవు చూడలేదా? ఇఁక నక్కడివారికి బంగారు కంకణములు, ముత్యములు తొడిగింపఁబడును. అక్కడివారు పట్టు దుస్తులు కట్టుకొనియుందురు. చుట్టుఁదిరుగు వారికొఱకును నిలుచుండు వారికొఱకు నాయింటిని పవిత్రముగ నుంచుము. ఇఁక తన మాలిన్యమును దూరము చేయవలెను. తమ కానుకల జెల్లింపవలెను. పురాతనమైన యింటిచుట్టుఁ దిరుగవలెను. అల్లే యల్లానామము స్మరించవలెను.

మం-౪-సి-౧౭-సూ-౨౨-ఆ-౧౮-౨౩-౨౫-౨౬-౨౯॥

మాత్ర మంగీకరింప నేరరు. సరి : పాప పుణ్యములు మార్పఁ బడుననుటయు నొక మంచి న్యాయమే. ఆ పాపపుణ్యము లనునవి నువ్వులు మినుములవలె నొకటికొకటి మార్ప నగునా యేమి? పశ్చాత్తాపము వలనఁ బాపవిమోచనమై, ఈశ్వరుఁడు లభింపునన్న పాప మొనరించుట కెవఁడును వెనుదీయఁడు. కాన నీమాట లన్నియు విద్యా విరుద్ధములే యనుట స్పష్టము. ॥౧౧౬॥

౧౧౭. మేము (వహి) పుస్తకమును మూసా పరముగఁ బంపితిమి. దీనిని దీసికొని రాజునులఁగూడకు వెళ్ళుము. నిశ్చయముగ నీ వెంటఁ బడు దురు. కాన పిరూను నగరమునను నకీబుల (ప్రోగుచేయువారి) నంపెను. ఏ పురుషుఁడు నన్ను సృజించినాఁడో యతఁడే మార్గముఁ జూపుచున్నాఁడు. అతడే నాకు తినిపించుచు, త్రాగించుచున్నాఁడు. ఆయన మహాప్రళయ దిన మున నా యపరాధములు క్షమించునని యాశపెట్టుకొని యున్నాను.

మం-౫-సి-౧౯. సూ-౭౬-ఆ.౫౦-౫౧-౮౬-౮౮-౭౦॥

సమీక్ష — ఖుదా మూసాపరముగ వహి (పుస్తకము) పంపినపుడు మరల దావూదు పరముగను, ఏసుపరముగను, మహమ్మదు సాహెబు పరము గను, పుస్తకముల నెందుకంపెను? ఈశ్వరవాక్యము సర్వదా యొకేరీతిగను, మఱుపు చెందనిదిగ నుండును. దానికిఁ బిమ్మట కురానువఱకు పుస్తకముల బంపుటవలన మొదటి పుస్తకము లపూర్ణములనియు, మఱుపులో కూడిన వనియు నమ్మఁబడును. ఈ మూఁడు పుస్తకములును సత్యములేని కురానను నది మిథ్యయగును. ఇట్లే నాలుగును ఒకదాని కొకటి విరుద్ధములై యున్నం దున సర్వదా సత్యమైనవి కాఁజాలవు. ఖుదా (రూహులను) జీవములను సృజించెనన్న నవి చావనే చచ్చును. అట్లయిన వానికొకప్పుడు అభావము కలుగకపోదు గదా? పరమేశ్వరుఁడే మనుష్యాది ప్రాణులకుఁ దినిపించుచుఁ త్రాగించుచున్న నెవరికిని రోగము సంభవింపఁగూడదు. అట్లే అతఁడు అందఱకు సమానముగ భోజన మొసంగవలయును. రాజునకును, దరిద్రు నకును శ్రేష్ఠ నికృష్ట భోజనము లక్కునట్లు. పక్షపాతముతో నొకనికి శ్రేష్ఠ భోజనము, మరొకనికి నికృష్టభోజనము లభింపఁగూడదు. పరమేశ్వరుఁడే తినిపించువాఁడును, త్రాగించువాఁడును, పథ్యము చేయించువాఁడు నయి యున్న, రోగములే సంభవింపకుండెడివి. కాని ముసల్మానాదులకుఁ గూడ

రోగములు సంభవించుచునే యున్నవి. ఖుదాయే రోగము మాన్పి శమనము కలుగఁజేయువాఁడయిన, ముసల్మానుల శరీరములందు రోగములే యుండఁదగవు. రోగములుండునేని యీ ఖుదా పూర్ణవైద్యుఁడు. కాఁడు. పూర్ణవైద్యుఁడే యైన ముసల్మానుల శరీరములందు రోగము లెందుల కున్నవి? అతఁడే పుట్టించుచు గిట్టించుచునున్న నాఖుదాకే పాపపుణ్యము లంటవచ్చును. జన్మ. జన్మాంతరముల కర్మానుసారముగ వ్యవస్థ చేయుచున్నాఁడేని యతని యపరాధ మేమియులేదు ఖుదా పాపముల క్షమించువాఁడును, మహాప్రళయ రాత్రిని న్యాయము జేయువాఁడును, నయియున్న నతఁడు పాపములఁ బెంచువాఁడును పాపసంయుక్తుఁడు నగును. క్షమింపఁదన్న నీ ఖురానులో వ్రాయఁబడినమాట మిథ్యయనక తప్పదు. ||౧౧౭||

౧౧౮. మావంటి మనుష్యుఁడవు నీవు కావు గాని సత్యవంతుఁడవయిన నిదర్శనము' జూపుము. దాని కీ యాఁడులొట్టిపిట్ట గలదు. ఒకసారి నీక్కుత్రాగవలసియున్న దనెను.

మం-౬-సి-౧౯-సూ-౨౬-ఆ-౧౫౦-౧౫౧||

సమీక్ష - మేలు! ఱాతిలోనుండి యాఁడు లొట్టిపిట్ట వెళ్ళెననుమాట నెవఁడయిన నమ్మగలఁడా? ఈమాట నంగీకరించిన వారడవిమనుష్యులై యుండిరి. ఆఁడులొట్టిపిట్టను నిదర్శనముగాఁ జూపుట పామరత్వమే. కాన ఈశ్వరకృతముకాదు. ఈపుస్తక మీశ్వరకృతమైయున్న నిట్టి వ్యర్థమైన విషయము లిందుండకుండెడివి. ||౧౧౮||

౧౧౯. ఓ మూసా! నేను నిశ్చయముగఁ బ్రముఖుఁడనయిన యల్లాను నీ చేతికఱ్ఱను పాఱవేయుమనెను. పాఱవేయఁగా నది పామువలె కదలుచున్నట్లగపడెను. ఓ మూసా! వెఱవకుము. నిశ్చయముగ పైగంబరులు నా సమీపమున వెఱవరు. అల్లాయొక్క ఆరాధ్యుఁడు కాఁడు. కాని యతఁడు గొప్ప (అర్శ) పీఠవ ఆకాశమున కధిపతి. నామీఁద హఠము చేయకుఁడు. ముసల్మానులయి నాదగ్గఱకు రండు.

మం-౫-సి-౧౯-సూ-౨౭-ఆ-౧౦-౨౬-౩౧||

సమీక్ష - ఇంతను చూడుఁడు! అల్లా తననోటితోఁ దానే గొప్పయని చెప్పుకొనుచున్నాఁడు. తన నోటితో తన ప్రశంసఁ జేసికొనుట శ్రేష్ఠపురుషుల

పనియైనను గానపుడు ఖుదాదెట్లు కాఁగలదు? అందులకేకద ఇంద్రజాలపు తంత్రములఁ జూపించి యరవిమనుష్యులను వశపఱచుకొని దానరణ్యమున ఖుదాయయి నిలిచినది. ఇటువంటిమాట యీశ్వరకృతపుస్తకమం దెప్పుడు నుండనేరదు. గొప్ప (అర్శ) ఏడవ యాకాశమున కధిపతియయి యున్నవాఁ డేకదేశీయుఁ డగుటఁజేసి యీశ్వరుఁడే కానేరఁడు. హతమొనరించుట మంచిది కాదేని, ఖుదాయు, మహమ్మదుసాహెబును దమ స్తుతులచే నా పుస్తకము నెందులకు నింపిరి? మహమ్మదుసాహెబు అనేకులను జంపెనుగదా! అది హతమయ్యెనా కాదా? ఈ కురాను పునరుక్తులతోను, పూర్వాపర విరుద్ధ విషయములతోను నిండియున్నది. ॥౧౧౯॥

౧౨౦. ఇఁక నీవు పర్వతములఁ జూతువు. అవి స్థిరముగ నిలిచి యున్నందుల కనుమానపడుదువు. అవి చలించుమేఘములవలెఁ బోవుచున్నవి. ఇది అల్లా పనితనము. ఆయన ప్రతివస్తువును దృఢపఱచియున్నాఁడు. నిశ్చయముగ నతఁడు మీరు చేయుచుండుకార్యముల నెఱుఁగువాఁడయియున్నాఁడు.

మం-౫-సి-౨౦-సూ, ౨౭-ఆ-౮౮॥

సమీక్ష - పర్వతములు మేఘములవలె చలించుననుట కురాను వ్రాసిన వారి దేశమున గానవచ్చునేమో కాని అన్యత్రకాదు. ఇఁక ఖుదా యెఱుఁగు వాఁడనుట ద్రోహియైన సైతానును పట్టి దండింపక పోవుటవలన విదితమే కద. అతఁ డింతవఱకొక ద్రోహినైనను బట్టి దండింపలేక పోయెనుగదా! ఇంతకు మించిన ప్రమాదము మఱేమి యుండఁగలదు? ॥౧౨౦॥

౧౨౧. మూసా వానిని గ్రుద్దగా వాని అయువు సమాప్తమయ్యెను. ఓ రక్షకా! నిశ్చయముగ నేను తమ ప్రాణి కన్యాయము చేసితినిగాన నన్ను క్షమింపుమనెను. అంత నతని క్షమించెను. నిశ్చయముగ నతఁడు క్షమించు వాఁడును దయాళువు నయియున్నాఁడు. ఏ ప్రభువు దేనిఁ గోరుచున్నాఁడో అల్లే దేని నిష్టపడుచున్నాఁడో దాని సృజించుచున్నాఁడు.

(మం-౫-సి-౨౦-సూ-౧౮-ఆ-౧౪-౩-౬౬॥

సమీక్ష - ముసల్మానులయు, క్రైస్తవులయు, పైగంబరులయు ఖుదాయు దయను చూడుఁడు! పైగంబరగు మూసా మనుష్యుని చంపఁగా ఖుదా

క్షమించెను: వీరిరువురు నన్యాయకారులై నిలిచిరా లేదా; తన యిష్టము వలననే కోరుచున్నట్లు పుట్టించుచున్నాఁడా ; ఆయన తన యిష్టమువలననే యొకని రాజుగను, మఱొకనిదరిద్రుఁడుగను, ఒకని విద్వాంసుఁడుగను, మఱొకని మూర్ఖుఁడుగను చేసియున్నాడా ఏమి ; అటులేని ఈ కురాను సత్యముకాదు. ఇఁక నన్యాయకారి యయినందున నతఁడు ఖుదాయే కాఁజాలఁడు. ॥౧౨౧॥

౧౨౨. తల్లిదండ్రులకు మేలు గలుగ జేయవలయునని మనుష్యులకు మే మాజ్ఞాపించియున్నాము. ఒక వేళ తల్లిదండ్రు లిరువురు నీతో జగడమాడి నాతో వారిని చేర్పుకోమన్న నీవావిషయము నెఱుఁగవు కాన వారిరువురిమాట యంగీకరింపకుము. నీవు నాదిక్కునకు రావలసియే యున్నది. మే మవశ్యముగ నూహను సంపము దిక్కునకుఁ బంపియున్నాము. కాన వారియందు తొమ్మన్నూట యేఁబది సంవత్సరములుండెను.

మం-౫-సి-౨౦-౨౧-సూ-౨౯-అ-౬-౧౪॥

సమీక్షకుఁడు— తల్లిదండ్రుల సేవచేయుట మంచిదే ఖుదాతోఁ జేర్చుకొను మన్నప్పుడు వారి యామాట వినకపోవుటయు మంచిదేకాని తల్లిదండ్రులు మిథ్యాభాషణాదులు చేయుట కాజ్ఞాపించిన నంగీకరింపవలయునా యేమి; కాన ఏమాట సగము మంచిదిగను, సగము చెడ్డదిగనున్నది. ఇఁకనూహ మొదలగు పైగంబరులనే ఖుదా ప్రపంచములోని కంపుచున్న నన్యజీవముల నెవఁడంపుచున్నాఁడు ; అందఱ నతఁడే యంపుచున్నాఁడే ని యందఱును పైగంబరు లెందులకుఁగారు ; మొదట మనుష్యులకు వేయి సంవత్సరముల ఆయువుండిన నిప్పుడెందులకు లేదు : కావున నీమాట నిజము కాదు. ॥౧౨౨॥

౧౨౩. మొదటి తూరి యల్లా యుత్పన్నము చేయుచున్నాఁడు. మఱల దానిని రెండవతూరియు నుత్పన్నము చేయగలఁడు. అతనివైపునకే తిరిగి పోదురు. ఏదినము వర్షము-మహాప్రళయము-దటస్థించునో ఆ దినము పాపాత్ములు నిరాశులగుదురు. విశ్వసించినవారు, మంచికార్యములు చేసినవారు తోఁటయందు శృంగారింపఁ బడుదురు.. మేమొక వాయువును పంపినపు డా పొలము పసుపువన్నె దాల్చుటను చూతురు. ఈ ప్రకారమే యాలోకుం హృద

యములమీఁద యల్లాముద్రలు వేయుట వారెఱుఁగరు.

మం-౫-సి-౨౧-సూ-౩౦-ఆ-౧౦-౧౧-౧౪-౫-౫౮॥

సమీక్ష — అల్లా రెండుపర్యాయములే యుత్పన్నము చేయువాఁడై మూఁడవ పర్యాయము చేయఁడేని యుత్పన్నము చేయుటకు పూర్వమును, రెండవతూరి యుత్పన్నముచేసిన పిమ్మటను అప్రయోజకుఁడయి కూర్చుండ వలసివచ్చును ; ఒక పర్యాయముగాని, రెండుపర్యాయములుగాని యుత్పన్నము చేసిన పిమ్మట నతని సామర్థ్య ప్రయోజనము లేనిది వ్యర్థమైనది అయిపోవును. న్యాయమొనరించు దినమున పాపాత్ములు నిరాశులయి యున్న యుండవచ్చును కాని ముసల్మానులు దప్ప తక్కిన వారందఱును పాపాత్ములుగా నెన్నఁబడి నిరాశులై యుందురని మాత్రము దీని భావము కాదుగదా ! ఏమనఁగా నీ కురానునందు పలుచోట్ల వ్రాయఁబడినట్లు పాపాత్ములన్న నితరులనియే అభిప్రాయము. తోఁటలో నుంచఁబడుట శృంగారింపఁబడుట మాత్రమే ముసల్మానుల స్వర్గమయిన నది ఈ ప్రపంచము వంటిదే యయ్యెను. అచ్చట తోటకాఁపులును, కమసాలులు నుండవచ్చును. లేదా ఖుదాయే తోటకాఁపు. కమసాలి మున్నగువారి పనులు చేయుచుండవచ్చును. ఇఁక నొకవి కాభూషణములు తక్కువగనున్న నట దొంగతనముకూడ జరుగుచుండవచ్చును. స్వర్గమున దొంగలించు వారలను నరకమునందుగూడ వేయుచుండవచ్చును. అట్లయిన సదా స్వర్గమున నుందురనుమాట మిథ్యయగును. కృషికుల పొలము మీఁదకూడ ఖుదా దృష్టికలదుగద. అవిద్య పొలముఁజేసెడి యనుభవమును బట్టియే కలుగును. ఇఁక ఖుదా తన విద్యచే నన్నిసంగతుల నెఱుంగుచున్నాఁ నని యంగీకరించినను ఇట్లు భయము చూపుట మాత్రము తన యభిమానమును ప్రసిద్ధి నొనరుటకే యన నొప్పును. మఱి అల్లా జీవుల హృదయములపై ముద్రలువేసి పాపము చేయించినప్పుడా పాపము నతఁడే పొందవలెను. జీవులు పొందరాదు. జయాపజయములు నేనొసఁగునటుఁ గలుగునట్లు ఈ పాపములన్నియు ఖుదాకే తగులును. ॥౧౨౩॥

౧౨౪. ఈ ఆయతులు బుద్ధిమంతుని పుస్తకమందలివి. ఆకాశములను స్తంభములు లేకుండ నుత్పన్నముచేసి యుండుట మీరు చూచుచున్నారు.

కదలకుండ పృథివిమీఁద పర్వతములనుంచి యున్నాఁడు. రాత్రిని దినమందును, దినమును రాత్రియందును అల్లా ప్రవేశింపఁ జేయుచుండుట నీవు చూడలేదా ? సముద్రమధ్యమున నోడలు అల్లా అద్భుతశక్తితో-మీకు తన నిదర్శనములఁ జూపుటకు-నడచుచుండుట చూచుటలేదా ?

మం-౫-సి-౨౧-సూ౩౧-౬-౧-౯-౨౮-౩౦॥

సమీక్ష——మేల్కొలు : సర్వథా జ్ఞానవిరుద్ధములగు నాకాశాదులఁబుట్టించి యున్నాఁడనుటయు వానిని స్తంభములచే నిలువఁబెట్టినాఁడనుటయు, భూమి కదలకుండు నటులఁ బర్వతముల నేర్పఱచి యుంచినాఁడనుటయు బహుచమత్కారములుగలవాని పుస్తకమందలి మాటలే : కొంచెము చదివినవాఁడయిన నిట్లు వ్రాఁత నెన్నఁడు వ్రాయఁడు. నమ్మఁడు. ఇంకను చమత్కారము చూడుఁడు—దినమున్నప్పుడు రాత్రి లేదు. రాత్రియున్నప్పుడు దినములేదు. కాని ఇట నొకదాని యందొకదానిని ప్రవేశింపఁ జేయుచున్నాఁడని వ్రాయబడి యున్నది. ఇది గొప్ప పామరుల మాటయే కావున నీకురాను జ్ఞానపుస్తకము కానేరదు. ఇది జ్ఞానవిరుద్ధమైన మాట కాదా ? ఓడలు మనుష్యులనుండియు క్రియాకౌశలాదుల వలన నడచుచున్నావా, లేక ఖుదా శక్తి వలననా ? ఇనుములోగాని రాతితోగాని యోడలచేసి సముద్రమున నడిపించితిమేని ఖుదా నిదర్శనము మునిగిపోవునా లేదా ? కాన నీ పుస్తకమొక విద్వాంసునిచేఁగాని ఈశ్వరునిచేగాని రచియింపఁబడినది కాఁజాలదు. ॥౧౨౪॥

౧౨౫. ఆకాశమునుండి పృథివిమీఁద కార్యముల నేర్పఱచుచున్నాఁడు. మరల నొక దినమందే అక్కడి కెక్కి పోవుచున్నాఁడు. ఆదిన పరిమాణము మీరు లెక్కపెట్టు సంవత్సరములను బట్టి వేయి సంవత్సరములు. అతఁడు పరోక్షమును ప్రత్యక్షము లెఱుఁగువాఁడు. దయాళువు. ప్రముఖుఁడునై యున్నాఁడు. మరివాని ఇక్కఁగఁజేసి వానియందు తనలోనుండి జీవమును ఊఁదెను. "మీకొఱకు నియమింప బడియున్న మృత్యుదేవత" మీ ప్రాణమును హరించునని చెప్పుము. మేము కోరిన యెడల అవశ్యము ప్రతిప్రాణికి శిక్షనొసంగుదుము. కాని నేను నరకమును (జన్నుం లోను) భూతపిశాచములోను మనుష్యులలోను నింపుదునను" నాప్రతిజ్ఞ మాత్రము నిశ్చయమే.

మం-౫-సి-౨౧-సూ-౩౨-౬-౫-౬-౭-౧౧॥

సమీక్షకుఁడు— ముసల్మానుల ఖుదా మనుష్యునివలె నేక దేశీయుండని స్పష్టముగ సిద్ధమయ్యెను. వ్యాపకుఁడయిన నొక స్థానమున నుండి యేర్పాట్లు చేయుటయు నెక్కుట దిగుటయు లేకుండెడిది. ఖుదా పరిశ్తాను వంపుచు న్నాఁడన్నను తానేక దేశీయుఁడే యయ్యెను. అసనముపై ప్రతిష్ఠించుచుఁ గూర్చుండి పరిశ్తాలను పరుగెత్తించుచున్నాఁడు ! పరిశ్తాలు లంచము దీసికొని యొక వ్యవహారము చెడగొట్టినను లేదా యొక పీనుఁగును విడిచిపెట్టిపోయి నను ఖుదాకేమి తెలియఁగలదు ? సర్వజ్ఞుఁడును సర్వవ్యాపకుఁడునగు నతనికే తెలియఁగలదు. అతఁడట్లు లేడుగదా ! అటులయియున్న పరిశ్తాలను సంపవల సిన అనేక విధముల ననేకుల బరీక్షింపవలసిన పనియే లేకుండెడిది. ఇఁక బోవుటకు నొక వేయి సంవత్సరములు పట్టుటయు వచ్చుటకుఁబోవుటకు నేర్పాట్లు చేయుటవలన నతఁడు సర్వశక్తిమంతుఁడును గాఁడు. ప్రాణముఁ గొనిపోవువాఁడు పరిశ్తాయన్న నాపరిశ్తాను చంపువాఁడెవఁడు ? అతఁడు నిత్యుఁడన్న అమరుఁడయి ఖుదాతో సమానుఁడయ్యెను. ఒక పరిశ్తా యొకే సమయమందు నరకమును నింపుటకు జీవులకు శిక్ష యొసంగఁ జాలఁడు. పాపములు లేక వారిని తన ఇష్టము వచ్చినట్లు నరకమునఁ బడద్రోసి వారిని దుఃఖ పెట్టుచు సంతోషించుచున్నటో నాఖుదా పాపకారియు, నన్యాయ కారియు, దయాహీనుఁడు నగును. ఏ పుస్తకమున నిట్టి మాటలు కలవో యది యొక విద్వాంసునిచేఁగాని, ఈశ్వరునిచేగాని రచింపబడినదికాదు. అట్లే దయా న్యాయములులేని వాఁడీశ్వరుఁ డెన్నఁడును కాఁజాలఁడు ॥౧౨౫॥

౧౨౬. మీరు మృత్యువునకు జంకియో లేదా నఱకులాటకు వెఱ చియో పరుగెత్తుటవలన మీ కెంతమాత్రము లాభములేదని చెప్పుము. ఓనబీ స్త్రీలారా ! మీలో నెవరయిన లజ్జవిడిచి వత్తురేని మీకు రెండింతలు పాపము తగులును. ఇది అల్లాకు సులభము.

మం-౫-సి-౨౧-సూ-౩౩-ఆ-౧౬-౩౦॥

సమీక్ష—యుద్ధమున నెవఁడును పరుగెత్తకుండుటకు, తమకు విజ యము కలుగుటకు ; చచ్చుటకైనను భయపడకుండుటకు, ఐశ్వర్య మభి వృద్ధి నొందుటకు, తమ మతము వృద్ధినొందుటకుగాను మహమ్మదు సాహెబు

ఇట్లు వ్రాసియు, వ్రాయించియు నుండవచ్చును. సరి! స్త్రీల లజ్జవిడిచి రాఁగూడదన్న పైగంబరు సాహెబు లజ్జవిడిచి రావచ్చునా? స్త్రీలకుఁ బాపము తగులుట పైగంబరునకుఁ బాపము తగులక పోవుట అనునదే యింటి న్యాయమో?

౧౨౩. మీ యిండ్లలోనే యుండుఁడు. అల్లారసూలుల యాజ్ఞను బాలింపుఁడు. అన్యమునుకాదు. పైబనువాఁడు ఆమెతోఁ దన ప్రయోజనమును నెఱవేర్చుకొనినప్పుడు స్వమతమందు విశ్వాసముగలవారికి తమ పోషణమున నున్నవారి స్త్రీలతో ప్రయోజనము నెఱవేర్చు కొనునప్పుడాటంకము కలుగ కుండుటకును, పెండ్లి (నికాహ) చేసికొనుట పాపమని తలపకుండుటకును ఆమెను అతనికిఁ బెండ్లి చేసితిమి. ఖుదా అజ్ఞ ఆ విషయమునందు నబీకి నేమియు నిబ్బందిలేదు. మహమ్మదెవరికిని దండ్రికాఁడు. తన నబీకొఱకు మెహరు చెల్లింపకయే ప్రాణమిచ్చు నట్టి - విశ్వాసార్హురాలయిన - స్త్రీని బొందవచ్చును. వారిలో నీవు ఒకానొకతె నపేక్షింప వచ్చును. లేదా ఇష్టమయిన దానితో సంబంధముఁ జేసికోవచ్చును. నీకిందు పాపము కలుగదు. ఓ లోకులారా! విశ్వాసవంతులగు మీరు పైగంబరుని యిండ్లలో ప్రవేశింపకుఁడు.

మం-౫-సి-౨ ౨-సూ-౩౩-౪-౩౩-౩౯-౩౮-౪౦-౪౬-౪౮-౫౦॥

సమీక్ష—స్త్రీలు చెఱసాలలోనుండు నేరస్థులవలె గృహము లందుండ వలెననియుఁ బురుషులట్లుగాక స్వేచ్ఛాపరులయి యుండవలెననియు వ్రాయుట యెంత అన్యాయము! ఏమి! స్త్రీలచి త్తము శుద్ధవాయు సేవనమును శుద్ధ దేశ సంచారమును, సృష్టియందలి యనేక పదార్థములఁ జూచుటనుగోరదా! దీనిఁ జేసియే కాఁబోలు ముసల్మానుల పిల్లలు విశేషముగఁ దిరుగువారు, విష యాసక్తులునగుచున్నారు. అల్లారసూలుల దొక్కటే యాజ్ఞయా! లేక పర స్పర విరుద్ధమైనవా! ఒక్కటందు రేసినిద్దఱయాజ్ఞల బాలింపుఁడనుట వ్యర్థము. పరస్పర విరుద్ధమై వేర్వేఱన్న నొకటిసత్యమై రెండవది యసత్య మైనదా! అట్లయిన ఒకఁడు ఖుదా, మఱొకఁడు పైశాచగును. సహాయోగి యునై నిలుచును. మేల్మేలు! కురాను సందలి ఖుదాను, పైగంబరులను,

రుఠానును, ఏమని చెప్పవలెను. ఇతరులకు హానికలుగఁజేసి తన ప్రయోజన మును సిద్ధింపఁజేసి కొనఁగోరువారవశ్యముగ నిట్టి టక్కులే పనుచున్నారు గాన మహమ్మదుసాహెబు గొప్ప విషయాసక్తుఁడయి యుండెననికూడ దీని వలన సిద్ధమైనది. రేనిచో (రేపాలకను) పుత్రునిభార్యను-తన భార్యగ నెందు లకుఁ జేసికొనును ? ఇఁక నిట్టి పనులను జేసినవానికి ఖుదాకూడ సహాయ కుఁడై అన్యాయమును న్యాయమని నిలిపెనుగా ! మనుష్యులలో నెంతతెలివి మాలినవాఁడయినను కొడుకు పెండ్లామును గోరుటలేదు ! ఇట్టి విషయా సక్తమగు లీలలు చేయుటకు నబీకి నేయాటంకములు కలుగకపోవుట కడు విపరీతమే. నబీ యొకనికి దండ్రిగాకుండిన రేపాలకుడను జైదు ఎవనికి కొడుకయి యుండెను ? ఇట్లు పైగంబరు సాహెబు కొడుకు భార్యనుకూడా వదలకున్న నితరులను వదలి యుండునా ? ఎంత చమత్కారము చేసినను దుష్కార్యము చేయువాఁడొకప్పుడయినను నిందితుఁడు గాకపోఁడు. ఒకానొక పురుషుని భార్య నబీను మెచ్చి (నికాహ) పెండ్లి చేసికొనఁగోరినను అది హలాలే యగునా ! నబీ ఇష్టమయిన స్త్రీని దర్శింప వచ్చునఁట కాని మహ మ్మదు సాహెబు స్త్రీలు మాత్రము పైగంబరు నేరస్థుఁడయినను అతని నెంట మాత్రము విడువఁగూడ దనుట గొప్ప యధర్మము. పైగంబరు గృహము లందున్న రెవ్వరయినను వ్యభిచార దృష్టితోఁ బ్రవేశింపఁ గూడదు గదా ! నబీ ఎవనియింటఁ బ్రవేశింపఁ గోరిన నిరాటంకముగఁ బ్రవేశింపవచ్చునా. ఏమి ! మఱి గౌరవార్హుఁడును గాఁగలుగునా ! మేర్మెయి ! ఈకురా నీశ్వరోక్త మనియు, మహమ్మదు సాహెబును పైగంబరనియు, ఖురాను చెప్పిన యాశక్తు రుని పరమేశ్వరుడనియు నమ్మఁగలుగునంతటి మూర్ఖుఁడెవడైన నుండునా ? ఇట్లు యుక్తిశూన్యమును ధర్మవిరుద్ధమునగు విషయములతోఁగూడిన యీ మతమును అరేబియా దేశవాసులు అంగీకరించియుండుట కడుఆశ్చర్యమే.

||౧౨౭||

౧౨౮. రసూలునకు దుఃఖము కలిగించుటగాని. అతనిఁ విమ్మట నతని స్త్రీలను పెండ్లి (నికాహ) చేసికొనుటగాని మీకెంతమాత్రము సుచితము కాదు. నిశ్చయముగ నది అల్లాకు గొప్ప పాపమని తోఁచకపోదు. అల్లా

కును అతని రసూలునకును దుఃఖము కలిగించు వారల నల్లా ధిక్కరించు ననుట నిశ్చయము; దోషులుగాని ముసల్మానులకును, వారి స్త్రీలకును దుఃఖము కలుగఁ జేయువారు నిశ్చయముగ నిందమోపువారును. వృథా పాపమును బ్రచురింపఁ జేయువారునగుదురు. ధిక్కారార్హులైరి చిక్కినను పట్టుకొనఁ బడవలయును. చంపఁబడ వలయును. ఓ నా రక్షకా! వారికి రెండింతల పాపము కలుగఁజేయుము. వారిని విశేషముగ ధిక్కరించుము.

మం—౫-౨—సి-౨-సూ-౧౩-ఆ౫౦—౫౪—౫౫-౫౭-౬౫॥

సమీక్ష—ధరరే ధర! ఏమి ఇట్లు బుడా తనఖుదాతనమును తనఁ బఱచు చున్నది ధర్మపూర్వకమేనా? యేలయన రసూలునకు దుఃఖము కలిగింపరాదని చెప్పుట మంచిదేకాని ఇతరులకు దుఃఖముఁ కలిగింప రాదని రసూలునకూడా నాజ్ఞాపింపవలసియుండెను. అట్లాజ్ఞాపింపలే దెందులకు? ఒకనికి దుఃఖము కలిగించుట వలన నల్లాకూడ దుఃఖితుఁడగుచున్నాఁడా. యేమి? అటులయిన నతఁడీశ్వరుఁడు కాఁజాలఁడు. అల్లాకును రసూలున కును దుఃఖము కలిగింపరాదని నిషేధింపఁబడి యున్నందున నల్లాయును రసూలును, ఇష్టమయిన వానికి దుఃఖము కలిగింప వచ్చుననుట సిద్ధముకాదా? వీరికిఁగాక మఱి యెవ్వరికైనను దుఃఖము కలిగింప వచ్చునా? ముసల్మానులకును. ముసల్మానుల స్త్రీలకును దుఃఖము కలిగించుట మంచిది కానట్లే అన్యమతస్థులకు దుఃఖము కలుగఁ జేయుటయుఁగరు దౌర్జన్యమేకద. "ఇఁక దీని నంగీకరింప రేని వారు పక్షపాతముకలవారని గ్రహింపుఁడు" మేల్కొని! సంసారమున ద్రోహము కలుగఁజేయునో ఖుదా! ఓ నబీ! మీఁటోటి దయా ళున్యులు ప్రపంచమున చాలతక్కువనే యుందురు: అన్యజనులెటఁ జిక్కినను వారిని బట్టుకొని చంపుఁడని వ్రాయఁబడి యున్నది: ఆ ప్రకారమే అన్య మతస్థులు మునల్మానులయెడ వర్తింప వలెనన్న ముసల్మానులకది చెడ్డగ దోఁచునా లేదా? పైగంబరులెంతటి నిర్దయులనవలెను. అన్య మతస్థులకు రెండింతల దుఃఖము కలిగింప వలెనని పరమేశ్వరుని బ్రార్థించు చున్నారుగా! ఇదియుఁ బక్షపాతములోఁ గూడినట్టియు, స్వప్రయోజనమును సిద్ధింప జేసిఁ కొనునట్టియు గొప్పయధర్మము కద. ఇందువలననే యిప్పటివఱకును, ముస

ల్మానులందనేక శతులు ఇట్టిపనులు చేయుట కెంతమాత్రము వెనుదీయరు. శిక్షితుఁడుకాని మనుష్యుఁడు పశుసమానుఁడయి యుండుననుట స్పష్టమేకద. ॥౧౨౮॥

౧౨౯. అల్లా అనువాఁడే వాయువుల నంపెను. అవి మేఘములను లేపుచున్నవి. మరల మేము పీనుఁగులుగల నగరము దిక్కునకు వానిని తఱిమి వానితో మృతినొందియున్న యాపృథివిని జీవింపఁజేసితిమి. ఈప్రకారమే సమాధులలో నుండి పీనుఁగులు లేపఁబడును. అతఁడు ఎల్లప్పుడుండు నింటియందు దయతో మమ్ములదించెను. మాకు దానియందు శ్రమకలుగదు. దాని యందు రోగములును సంభవింపవు.

మం-౫-సి-౨౨-సూ-౩౫..అ-౬-౩౫॥

సమీక్ష——ఔరా! ఖుదా వాయువుల నంపఁగా నవి మేఘముల లేఁపుచున్నవనియు, అట్లే వానితో పీనుఁగుల బ్రతికించు చున్నాడఁనియు ననెడి ఖుదా (ఫిలాసఫీ) తత్వవిద్య నేమని చెప్పవలెను! ఇవి యీశ్వర వాక్యము లెంతమాత్రము కానేరవు. ఏలన నీశ్వరునిపని నిరంతర మొకేవిధముగ జరుగుచుండును. గృహములందున్నను జేయఁబడక యుండ నేరవుకద. మఱిచేయఁబడినవి సర్వదా యుండనేరవు; శరీరము గలవాఁడు పరిశ్రమ చేయనిచో దుఃఖితుఁ డగును. శరీరధారియైన వాఁడు ఒకప్పుడైనను రోగగ్రస్తుఁడు గాకపోఁడు. ఒకస్త్రీతో సమాగమ మొనరించువాఁడే రోగములఁ దప్పించుకొనకున్న ననేక స్త్రీలతో విషయానంద మనుభవించువాని దుర్దశ యేమికావచ్చును! కాన ముసల్మానుల నిరంతర స్వర్గవాసముకూడా నుభకరమెన్నటికిని గాఁజాలదు. ॥౧౨౯॥

౧౩౦. కురాన్ సాక్షిగ పంపఁబడిన వారలలో నిన్నుచక్కనిమార్గము చూపుఁవానిగా నా దయాళువయిన ఖుదాదించి యున్నాఁడనుట నిశ్చయము.

మం-౫-సి-౨౨-సూ-౩౬-అ-౧-౨॥

సమీక్ష——ఇప్పుడు వీక్షింపుఁడు! ఈ కురాను ఖుదాచే రచియింపఁబడిన నతఁడేల యొట్టు పెట్టుకొని యుండును: నబీ ఖుదాచే నంపఁబడిన వాఁడేని (లేపాలకుడను) కొడుకు భార్యనెందులకు మోహించి యుండును?

ఖురాను నంగీకరించు వారు చక్కని మార్గమునఁ గలరనుట వట్టిమాటయే. ఏమనఁగా సత్యము నొప్పుట, సత్యముఁబలుకుట, సత్యము నాచరించుట, పక్షపాత రహితమగు న్యాయధర్మములు సేవించుట మున్నగున వెందుకలవో యదియే చక్కనిమార్గము. ఇఁక దీనికి విపరీతమైనదాని ద్యజింపఁ దగునని ఖురానునందుఁగాని, ముసల్మానులందుఁగాని, వీరి ఖుదా యందుగాని లేనే లేదు. అందఱకంటె మించిన పైగంబరు, మహమ్మదు సాహెబేవి అటఁ దందఱకంటె నధికవిద్వాంసుఁడు సకలగుణ యుక్తుఁడు నెందులకు గాక యుండును? కాన పండ్లనమ్ముస్త్రీ తన రేఁగుఁబండ్లు పుల్లని వననట్లే యీ మాటయు నయ్యెను ॥౧౩౦॥

౧౩౧. కొమ్మూఁదఁగా నకస్మాత్తుగ వారు సమాధులలో నుండి లేచి తన ప్రభువు దిక్కునకు పరుగెత్తుదురు. వారేమేమి సంపాదించి యుండిరో వారి పాదములు సాక్ష్యము పలుకును; ఒక వస్తువును పుట్టింపఁ గోరినపుడు అతని యాజ్ఞతప్ప వేఱేమియు లేకుండును. గాన దానిని కమ్ము అని అనఁగా నదియై నిలుచును. మం-౫-సి-౨౩సూ-౩౬-ఆ-౪౯-౬౧-౭౯॥

సమీక్ష—ఇప్పుడివోలు, పొందులేని మాటల నాలకింపుఁడు! పాదము లెన్నడైన సాక్ష్యము బలుకఁగలుఁగునా? ఖుదా తప్ప నాసమయమం దాజ్ఞాపింపఁబడుట కెవ్వఁడుండెను? ఏమయ్యెను? ఏవస్తువును లేకుండెనన్న నిది యబద్ధమగును. ఉండెనన్న "ఖుదాతప్ప వేఱువస్తువు లేదు. ఖుదాఅన్నిటిని జేసెను" అను మాట యబద్ధమైపోవును. ॥౧౧౩॥

౧౩౨. (శ్రాగువారికొఱకు) తెల్లనిరంగుగల మంచిసారాయి గిన్నెలోఁ బోసి యీయఁబడును. సుందరమైన నేత్రములుగల చక్కనిస్త్రీలు క్రిందికిఁ జూచుచు వారిదగ్గఱ కూర్చుండియుందురు. వారు దాఁచిపెట్టిన గ్రుడ్లవంటి వారని గ్రహింపఁదగును. ఏమి? ఇఁక మేము చావమా? నిశ్చయముగ యూను పైగంబరులలోని వాఁడే. కాన మేము వానికిని వాని జనులందఱకు ముక్తిని గలుగఁ జేసితిమి. కాని యొకవృద్ధురాలు వారిలో తప్పి పోయెను. మఱల మేమితరులను జంపితిమి.

మం-౬-సి-౨౩సూ-౩౭ఆ౪౩-౪౪-౪౫-౪౭-౫౬-౧౨౬-౧౨౭-౧౨౮-౧౩౭-౧౩౮॥

సమీక్షకుఁడు—ఏమండీ: ఇట ముసల్మానులు సారాయి చెడ్డదను చున్నారు. కాని వీరి స్వర్గమందో సారాయి నదులే ప్రవహించుచున్నవి: ఇక్కడ సురాపానమును నిషేధించుట మంచిదేకాని దీనికిబదులుగ నక్కడ-వీరిస్వర్గమందు మాత్రము కరు చెఱుపు కలదు. స్త్రీలు, మిక్కిలిగ నున్నందున నొకని చిత్తమైన స్థిరముగ నుండక పోవచ్చును. గొప్పరోగములు కూడా సంభవించు చుండవచ్చును: అక్కడి మనుష్యులు శరీరధారులయి యుందురేని పావనేచత్తురు. శరీరదారులు గారేని భోగవిలాసములననుభవింప లేక పోదురు. ఇఁకవారిని స్వర్గమునకుఁ గొనిపోవుటయు వ్యర్థమే. లూతును పైగంబరని యంగీకరింతు రేని, యతనితో నతని కుమార్తెలు సమాగమ మొనరించి యిరువురు కొడుకులఁ గనిరని బైబిలునందు వ్రాయబడి యున్నదే దానిని కూడా నంగీకరింతురా, లేదా, అంగీకరింతు రేని యతనిఁ బైగంబరని భావించుట వ్యర్థము. ఇటువంటివాని సహచరులకును ఖుదా ముక్తి గలుగఁజేయునన్నా ఖుదా నయితమట్టివాఁడే యగును. ఏలయన వృద్ధురాలి వృత్తాంతముఁ జెప్పువాఁడును పక్షపాతముతో నితరులఁ జంపువాఁడు నెన్నటికి ఖుదా కానేరఁడు. ఇట్టిఖుదా ముసల్మానులయింట నుండఁదగునే కాని అన్యత్ర కాదు ॥౧౩౨॥

౧౩౩. ఎల్లప్పుడుండుటకు స్వర్గములు కలవు. వాని తలుపులు వారి కొఱకుఁ దెఱవఁబడి యుండును. అందు మెత్తలు వేయఁబడి యుండును. అటపండ్లను పానీయ పదార్థములను తెప్పింప గలుగుదురు. క్రిందికి దృష్టి నుంచెడు సమాన వయస్సుగల స్త్రీలు వారిదగ్గఱ నుందురు. పరిశ్రాలందఱును (సిజ్దా) సాష్టాంగ నమస్కారము చేసిరి. కాని సైతాను గర్వపడి సిజ్దా చేయ లేదు. అతఁడు కాఫిరుల లోనివాఁడయి యుండెను. ఓ సైతానూ! నేను నా రెండు చేతులతోఁ జేసిన యావస్తువును సిజ్దా చేయకపోవుటకు నిన్నడ్డగించిన దేది: నీవు గర్వపడితివా, లేక గొప్ప యధికారము గలవారిలోని వాఁడనను కొంటివా అనియడుగఁగా. నేనతని కంటె శ్రేష్ఠుఁడను. నీవునన్ను అగ్నితోను అతనిని మంటితోను జేసియున్నావనెను. నీఁవశ్యముగ నుతిచలించినది. కాన నీవాకాశములో నుండి వెళ్ళిపొమ్ము. (అజా) న్యాయముపొందెడి దినము వఱకు నాదిక్కు నుండి నీకు ధిక్కారము అనెను. ఓనా ప్రభువా: పీనుఁగులు లేఁచు దినమువఱకు నిదానించు మనెను. నిశ్చయముగ నీవు నిదానింపఁ

బడిన వారలలోని వాఁడవే యనెను. అ (తెలిసియున్న) దినము వఱకు నీ గౌరవసాక్షిగ నేనవశ్యముగ వారినందఱను త్రోవ తప్పింతునని యొట్టు పెట్టుకొనెను.

మం-౬-సి-౨౫-సూ-౫౮-౪-౪౩-౪౪-౪౫-౬౩-౬౪-౬౫-౬౬-౬౭-
౬౮-౬౯-౭౦-౭౧-౭౨॥

సమీక్ష—కురానునందట ఉద్యానవనములు, నదులు, గృహములు మున్నగునవి యున్నట్లు వ్రాయఁబడియున్నదే. అవి సనాతనము నుండి యుండినవి కావు. సర్వదా యుండఁబోవు. ఏలయన సంయోగముచేఁగలుగు పదార్థము సంయోగమునకుఁ బూర్వము లేకుండెను. దాని పదార్థము వియోగాంతమున నుండదు. ఆ స్వర్గమే యుండదన్న నందుండఁగలవను పదార్థము లెల్లప్పుడు నెట్లుండఁ గలుగును ; ఏలయన పటుపులు, మెత్తలు, ఫలములు పానీయములను పదార్థము లక్కడ చిక్కునని వ్రాయఁబడియున్నది. కాన మునల్మానుల మతము వ్యాపించిన కాలమున నరేబియా దేశము విశేష ధనము గంది గాదనియు, అందువలననే ముహమ్మదుసాహెబు పటుపులు మున్నగు వాని కథలు వినిపించి బీదలను తనమతమందు చిక్కించుకొనెననియు దీని వలన సిద్ధమగుచున్నది. స్త్రీలు గంచోట నిరంతర సుఖమెక్కడిది ; ఆ స్త్రీ లక్కడి కెక్కడినుండి వచ్చిరి; లేక వారు స్వర్గముననే యుండువారా; వచ్చిన వారేని వెళ్ళిపోదురు. అక్కడనే యుండువారన్నఁ బ్రళయమనకుఁ బూర్వమేమి చేయుచుండిరి ; నిరర్థకముగ కాలము గడుపు చుండిరా; ఇఁక ఖుదా ప్రతాపము చూడుఁడు : అతఁడాజ్ఞాపింపఁగా ఫరిశ్తాలందఱు నంగీకరించి ఆదామునకు నమస్కారము చేసిరి కాని సైతా నంగీకరింప లేదఁట. ఖుదా సైతానుతో నేను నా రెండు చేతులతో వాని జేసితిని, నీవు అభిమాన పడకుమని యనెనఁట. దీనినుండి కురానునందలి ఖుదా రెండు చేతులు గల మనుష్యుఁడయి యుండెనని సిద్ధమగుచున్నది. కాన నతరు వ్యాపకుఁడుఁ గాని, సర్వశక్తిమంతుఁడుగాని కానేరఁడు. నేను ఆదాము కంటె నుత్తముఁడనని సైతాను పలికినది నిజమే; ఖుదా అతనిమీద కోపపడిన దెందులకు; చెప్పరేమి; ఖుదా గృహము ఆకాశమునందే కలదా ; పృథివిమీఁద లేదా ; అటులేని మొదట

కాబాను ఖుదా గృహమని యెందులకు వ్రాసెను? మఱి పరమేశ్వరుఁడు తన సృష్టిలోనుండి సైతానునెట్లు వేఱుపఱువఁ గలఁడు? సృష్టియంతయుఁ బరమేశ్వరునిదేకదా. దీనివలన కురానునందలి ఖుదా స్వర్గమునకు మాత్రమే ప్రభువని విదితమయ్యెను. ఇఁక ఖుదా యతని ధిక్కరించి జెయిలోనుంచఁగా "ఓ ప్రభువా! నన్ను ప్రళయదినమువఱకు విడచి పెట్టుమని సైతానన్నప్పుడు ముఖస్తుతిచే సుప్పొంగి వానిని ఖుదా ప్రళయ దినమువఱకు విడిచిపెట్టెను. సైతాను విడుదలఁబొంది. ఇఁకనేను జనులను విశేషముగ భ్రమింపజేయుదు ననియు, వారిలో ద్రోహము కలిగింతుననియు ననెను. అప్పుడు ఖుదా ఏ పేవరిని భ్రమింపఁజేయుదువో వారిని, నిన్నును నరకమునఁ బడవేయుదు ననెను. సజ్జనులారా ! ఇట్టి సైతానును ఖుదా భ్రమింపఁజేసెనా ? లేక తనంత తానే భ్రమించెనా? గమనింపుడు! ఖుదా భ్రమింపఁ జేసినచో సైతానునలమించిన నతఁడు సైతానయ్యెను. సైతాను స్వయముగనే భ్రమించెనన్న నన్యజీవులును దమంతట దామే భ్రమింతురు సైతాను యవసరమే యుండదు. ఇఁకద్రోహియైన యా సైతానును ఖుదా విడిచి పెట్టినందున నతఁడుకూడ నధర్మ మొనరింపఁ జేయుచు నా సైతానునకు భాగస్థుఁడయ్యెననుట స్పష్టము. తానే దొంగిలింపఁజేసి దండించునేని యతని యన్యాయమున కొకమేర యుండునా? ॥౧౩౩॥

౧౩౪. అల్లా నిశ్చయముగ సకల పాపములు క్షమించుచున్నాడు. అతఁడు క్షమించునట్టి దయాళువు. ప్రళయదినమున భూమియంతయు నతని పిడికిలిలోను, ఆకాశములతని కుడిచేతిలోను జుట్టఁబడి యుండును. ఇఁక ప్రభువు ప్రకాశముచేఁ పృథివి ప్రజ్వలిత మగును. కర్మపత్రములు వ్రాయఁ బడును. పైగంబరులును, సాక్షులును రప్పింపఁబడి న్యాయపూర్వకముగ తీర్పు చేయఁబడును. మం-౬-సి-౨౪-సూ-౩౯-ఆ-౫౪-౬౮-౭౦॥

సమీక్ష—ఖుదా సకలపాపములను క్షమించునన్న సంసారమునంత పాపమొనరింపఁ జేయుచున్నాఁడనియు, దయావిహీనుఁడనియు నెఱుఁగఁ దగును. ఏమియన దుష్టునియెడ దయఁజూపి యతనిని క్షమించిన నతఁడధిక దౌష్ట్యమే చేయును, అట్లే ధర్మాత్ములైన వారికెందఱకో దుఃఖము కలిగించును కించి దపరాధమైనను క్షమింపఁబడునేని జగత్తునందంతట నపరాధములే

వర్ధిల్ల సాగును. ఏమి? పరమేశ్వరుఁ డగ్నివంటి ప్రకాశముకలవాఁడా? మఱి కర్మపత్రములు పోగుచేసి యెక్కడనుండఁబడును? వానిని వ్రాయు వాఁడెవడు? ఇదా పైగంబరుల మాటలను, సాక్షుల మాటలను విశ్వసించి న్యాయ మొనరించునేని అతఁడు సర్వజ్ఞుఁడు గాఁడు. సమర్థుఁడునుగాఁడు. అతఁడ న్యాయము చేయఁడు న్యాయమే చేయుననన్న కర్మములకుఁ దగినట్లే చేయుచుండవచ్చునుగదా? ఇఁక నాకర్మము లనునవికూడ పూర్వ పర పర్యాయమాన జన్మముల ననుసరించియే యుండును. మఱి క్షమించుట, హృదయములమీఁద ముద్రలు వేయుట, శిక్షింపకపోవుట, సైతానుద్వారా భ్రమింపఁజేయుట, ప్రతిబంధమం దుంచుట మున్నగు మాటలన్నియు న్యాయవిరుద్ధములనుట స్పష్టము.॥౧౩౪॥

౧౩౫. జ్ఞానియు భ్రమఁబడుఁడునగు అల్లాచే నీవు స్తకము దింపఁబడినది. అతడు పాపములు క్షమించువాఁడును, పశ్చాత్తాపముల స్వీకరించువారు నై యున్నాఁడు.  మం-౬-సి-౨౪-సూ-౪౦-ఆ-౧-౨॥

సమీక్ష — అల్లా పేర నమాయకు లీ పుస్తకము నొప్పుకుందు రనియే యిట్లుకల్పింపఁ బడినది. కాని అందలి కొన్ని మాటలు దప్పతక్కిన పుస్తకమంతయు మిథ్యోక్తులతో నిండియున్నది. సత్యమైన మాటలను మిథ్యోక్తులతోఁగూడి కలుషితమై యున్నవి. కావున నీ కురాను, కురాను చెప్పిన అల్లా, వీని నొప్పుకొను వారందఱును పాపమును వృద్ధి పఱచువారు పాపములు చేయుచుఁ జేయించువారు నయి యున్నారు. ఏలయనఁ బాపమును క్షమించుటయే గొప్ప యధర్మము. ఇందువలననే కదమునల్మానులు పాపోపద్రవముల నొనర్చుట కంతగా భయపడకుందురు. ॥౧౩౫॥

౧౩౬. రెండు దినములలో నాకాశముల నేడింటిని జేసెను. ఒక్కొక్క యాకాశమున వాని వాని పని నుంచెను. ఇంకనతని దగ్గరకు బోయినపుడు వారి వారి చెవులును, కన్నులు, చర్మమును పనులు చేసినట్లు వారిమీఁద సాక్ష్యముఁ బలుకును. వారు "మీరవ్యాంగములతో మీ రెందులకు మామీఁద సాక్ష్యము బలికితి" రందురు. అందులకవి "ప్రతివస్తువును బలికినట్లే యల్లా మమ్మును బలికి యున్నాఁ" డని బదులు చెప్పును. అతఁడు అవశ్యముగఁ బీనుఁగులను బ్రతికించు చున్నాఁడు.

మం-౬-సి-౨౪-సూ-౪౧-ఆ-౧౨-౨౦-౨౧-౩౯॥

సమీక్ష—మేర్మేలు ముసల్మానులారా! మీరు సర్వశక్తిమంతుఁడని నమ్ముచున్న మీ ఖుదా సప్తాకాశములను రెండుదినములందా చేయఁగలిగి నది! వస్తుతః సర్వశక్తిమంతుఁడైన వాఁడు క్షణములో సమస్తమును జేయఁ గలుగును కదా! పోనిందు చెవులను, కన్నులను, చర్మములను ఈశ్వరుఁడు జడములుగఁ జేసియున్నాడు. అవి సాక్ష్యమై పలుకఁగలుగును? సాక్ష్యమిప్పించునన్న, మొదట సతఁడు వానిని జడములుగ నెందులకుఁజేసెను? అప్పుడు వానిని శక్తినిచ్చునన్న ఏమి? తన నియమమును తానే రదుతేపి కానునా? ఇక జీవులమీఁద సాక్ష్య... ...ములు పలికినప్పుడా జీవులు తమ తమ చర్మాంగములతో మీరు మామీఁద సాక్ష్యమెందులకుఁ బలికితిరని యడుగఁగా నవి "మేమేమి చేయగలము "మేమును రప్పింపఁబడితిమి" అనునిత్యాది మాటలెన్నఁడేని సంభవము లగునా? ఒకానొకఁడు నేనొక గొడ్రాలి పుత్రుని ముఖముఁ జూచితినన్నట్లియ్యెనుగదా! పుత్రుఁడు గలిగినప్పుడు ఆమె గొడ్రాలెట్లు? గొడ్రాలన్న నామెకు పుత్రుఁడే కలుగ నేరఁడుగద. ఇదియు నటువంటి మిథ్యాలోపమే. కాన నిది యాలకంటె నబద్ధము. అట్లే అతఁడు పినుఁగుల బ్రతికించునన్న, మొదట చంపుట యెందులకు? తానుకూడ చావఁగలఁడా, లేదా? చావఁడన్న చచ్చుట చెడ్డదని యెందులకు భావించుచున్నాఁడు? మఱి ప్రళయ రాత్రి వఱకు, చచ్చిన జీవములు ఏ ముసల్మానునింట నుండును? అపరాధము లేనిదే వానినట్లు ఖుదా ప్రతిబంధములో నెందులకుంచును? శీఘ్రముగ న్యాయము చేయఁడెందులకు? ఈశ్వరుని ఈశ్వరత్వమునకు కలంకము కలుగఁ జేయునవి యిటువంటి మాటలేకద. ॥౧౩౬॥

౧౩౭. పృథివ్యాకాశముల తాళపు చెవులు అతనివద్ద గలవు. కోటిన సామగ్రిని ఒకనికెక్కువగ ఒకనికిఁ దక్కువగ తన ఇష్టానుసారము కలుగఁ జేయుచున్నాఁడు. కోరిన దానిని సృజించుచున్నాఁడు. ఇష్టపడిన వానికి బిడ్డ నిచ్చుచున్నాఁడు. కొందఱకు కొడుకులను — బిడ్డలను — గలుగఁ జేయుచున్నాఁడు. తన యిష్టానుసార మొకరెను గొడ్రాలుగఁ జేయుచున్నాఁడు. అల్లాలో

మాటలాడఁగల శక్తిమంతుఁడెవఁడును లేఁడు. *తెఱచాటున నుండియో సందేశముఁ దెలుపుటకు పరిక్తా అను రాయబారి నంపుచున్నాఁడు.

మం—౬-సి—౨౫—సూ-౪౨—౮—౧౦—౪౭-౫౮-౪౯॥

సమీక్షకుఁడు—ఖుదా యొద్ద శాశపుదెవులదొక నిలయమే యుండవచ్చును. ఏమనఁగా సతనిచే నన్నిచోట్ల యందలి శాశములు విప్పఁబడుచుండవచ్చును. ఇదియుఁ బసితసముమాటయే. పుణ్యకర్మముల నొనర్పని వానికిఁ గూడ వాని యిష్టానుసార మైశ్వర్య మొసంగుచున్నాఁడా! అట్లే యిష్టమైనవాని నష్ట పెట్టుచున్నాఁడా! అటులేని యతడు గొప్ప యన్యాయకారియే యగును. స్త్రీల సంయతము మోహితలయి చిక్కుటకు ఆ ఖురాను కర్త చతురప్పమింపనుఁ జూచుఁడు! ఇష్టమైన దానిఁ బుట్టింపఁ గలుగునఁట. అట్లయిన రెండవఖుదాను కూడఁ బుట్టింపఁ గలుగునా లేదా? పుట్టింపఁజాలఁడన్న నతని సర్వశక్తిమత్త్వమున కాటంకము గలుగును. బలా! మనుష్యులలో నిష్టమైన వానికి కొడుకులను — బిడ్డలనిచ్చుచున్నాఁడేని కోళ్ళు. చేపలు. పందులు మున్నగువానికి పెక్కు కొడుకులు—బిడ్డలు—పుట్టుచున్నవే. వానికెవఁడిచ్చుచున్నాఁడు? స్త్రీ పురుషులకు సంపర్కము లేకుండ నెందులకియ్యఁడు? తన యిష్టానుసార మొకరెను గొడ్రాలుగాఁజేసి ఏల దుఃఖింపఁజేయుచున్నాడు? ఆహా! అతని సముఖమున నెవఁడును మాటలాడ నేరఁడన్న నాఖుదా యెంతటి తేజము గలవాఁడని చెప్పవలెను? ఆయన మొదటఁజెప్పియున్నట్లు తెఱవేసి మాటలాడుననియు, పరిక్తాలుగాని పైగంబరులుగాని ఖుదాతో మాట్లాడఁగలరనియు వ్రాయఁబడిన యీవార్తలే నిజమయిన పరిక్తాలును, పైగంబరులును, తమ ప్రయోజనములు బాగుగ నెరవేర్చుకోవచ్చును.

* ఈ విషయమును రాష్ట్రము "... ..." యను గ్రంథమున "మహమ్మదు ..." ... ... ... ... ... వ్రాయఁబడియున్నది. ఒక తెఱ ... ... ... ... ... ... ... సంవత్సరములు ... ... ... ... ... ... తెఱచాటునుండి మాటలాడు స్త్రీయై యుండెనా? ... విచారింపవలెను గాక. మీరు ఈశ్వరుని ... ... ... ... ... ... ... ... ... ... తెఱచాటునుండి మాటలాడు ఖుదా ... ... అదేవిధముగా ... ... ... ... ... ... పెట్టుకొనియును.

ఒకానొకఁడు ఖుదా సర్వజ్ఞుఁడనియు, సర్వవ్యాపకుఁడనియునన్న. "తెలియ బడిన మాటలను, తపాల వార్తవలె సమాచారములు దెలిసికొనును" అని వ్రాయఁబడిన మాటలన్నియు వ్యర్థములే. అటువంటివాఁడేని యతఁడు ఖుదా కాఁడు, కాని యొక యుక్తిపరుఁడయిన మనుష్యుఁడు గావచ్చును. కాన నీ కురా నీశ్వరకృత మెన్నటికిఁ గానేరదు. ॥౧౩౭॥

౧౩౮. ఏను ప్రత్యక్ష ప్రమాణముతోఁ వచ్చినప్పుడు.

మం—౬—సి—౨౫—సూ—౪౩ ఆ—౨౨॥

సమీక్ష—ఏసుతూఁ ఖుదాచే పంపఁబడినవాఁడేని ఆతని యుపదేశమునకు విరుద్ధముగ నా ఖుదా కురాను రచించిన దెందులకు? మఱి అంజీలునకది కురానునకు విరుద్ధముగా నున్నది. కావున నీ పుస్తకము లీశ్వరకృతములు కానేరవు ॥౧౩౮॥

౧౩౯—వానిఁబట్టి నరకమధ్యమున కీడ్చుకొనిరండు. ఇక్లేయఁను. ఇఁక మేము మంచి నేత్రములుగల చక్కని స్త్రీలను వారికిఁ బెండ్లి జేసి యిత్తుము. మం—౭—సి—౨౫—సూ—౪౪—ఆ—౪౭—౫౦॥

సమీక్షకుఁడు—ఔరా! ఖుదా న్యాయకారియయి, జీవులఁబట్టించి యీడ్చుచునా? ముసల్మానుల ఖుదాయే యిటులున్న నతని యుపాసకులగు ముసల్మానులు అనాథులయిన నిర్బలులఁబట్టి యీడ్చిన నందాశ్చర్యమేమి? ప్రపంచమందలి మనుష్యులవలె నతఁడు పెండ్లి గూడఁ జేయించుచున్నాఁడే. అతఁడు ముసల్మానులకుఁ బురోహితుఁడే యన నొప్పును. ॥౧౩౯॥

౧౪౦—కాఫిరులయిన వారు మీకెదురైనపుడు వారి మెడల నఱికి వేయుఁడు. అయినంతవరకు వారిని మెత్తగ మొత్తి తదుపరి చెఱవేయించు టకుఁ బ్రయత్నింపుడు. అనేక గ్రామములుండెను. శక్తియందవి మిన్నుమించి యున్నవి. నీవు వారిచేఁ దొలగింపఁబడఁగా మేము వారిని వధించితిమి. వారికి సహాయము చేయువాఁడెవఁడును లేకుండెను. అది (స్వర్గమున) నిర్మ లోదకముగల నదులును, రుచిచెడని పాలనదులును గలవనియుఁ ద్రాగఁగోరు వారికొఱకు సారానదులును, చక్కని తేనె నదులును గలవనియు, నన్నివిధ ముల ఫలములుగూడఁ గలవనియు వారికవి ప్రభువుచే నుచితముగ నియ్యఁ

బడుననియు మేమినకుతే స్వర్గాతిశయమునుగూర్చి సదాచారులకు (పరహేజు గారులకు) ప్రతిజ్ఞాపూర్వకముగఁ జెప్పియున్నారము.

మం-౬-సి-౨౬-సూ-౪౬-౫-౪-౧౩-౧౫॥

సమీక్ష—దీనివలన నీ కురాను, కురాను చెప్పిన ఖుదా, ముసల్మానులు ద్రోహ మొనర్చుచు నందఱికి దుఃఖము కలుఁగఁజేయువారు స్వార్థమును సిద్ధింపఁ జేసికొనువారు దయావిహీనులునయి యున్నారనుట స్పష్టము. అహా! అన్య మతస్థుఁడొకఁడు-ముసల్మానులతో నిట్లు వ్రాయఁబడినట్లే వర్తించిన నితరులకు దుఃఖముకలుగునట్లు ముసల్మానులకును దుఃఖముకలుగునా, లేదా! మహమ్మదు సాహెబును దొలఁగఁగొట్టిన వారిని ఖుదా చంపినాఁడన్న నాఖుదా గొప్ప పక్షపాతియే యనవొప్పును. మంచిది ఎందు నిర్మలోదకము, పాలు, సారా, తేనె నదులు కలవోయది యీ ప్రపంచమునకంటె మించిన దగునా! పాలనదు లెన్నఁడయిన నుండఁగలుగునా! ఏమనఁగా నవి కొద్ది కాలములోనే చెడి పోవును. బుద్ధిమంతులీకురాను మతము నంగీకరింపనేరరు. ॥౧౪౦॥

౧౪౧. భూమి విశేషముగ కదలింపఁబడునప్పుడు పర్వతములు చితికి దుత్తునియలయి పైకెగురును. ఇంక కుడివైపువారు కుడివైపునను, ఎడమ వైపువారు ఎడమవైపునను జలతారుతో నల్లఁబడిన మంచముల మీఁద నెదు రెదురుగ తివాచీలనంటి కూర్చుండియుందురు. వానియందుండెడు బాలకులు ఉదకపాత్రలను, అర్ఘ్యపాత్రలను, శుద్ధమైన సారా పాత్రలను బట్టుకొని తిరుగుచుందురు. దానివలన తలనొప్పి కలుగదు. వారు మైమఱచి వదలక యుందురు. ఇంపైన ఫలములును, ఇష్టమైన పక్షుల—పక్షుల మాంసమును వారికిఁ జిక్కును. ఇఁక వారికి దాఁచిన ముత్యములవంటి మంచి నేత్రములు గల స్త్రీలును, పెద్ద పణ్యవులును చిక్కును. నిశ్చయముగ మేమా స్త్రీలను ప్రతేకవిధముగ సృజించియున్నాము. కాన వారు సర్వదా పడుచులుగా ముత్తైదువలుగా సమాన వయస్సు గలవారుగా నుందురు. దానివలన ఉదరపోషణ చేసి కొనఁగలుగుదురు. కాన రాలినదు చుక్కలు క్రిందఁబడినట్లులని యొట్టుపెట్టు కొనుచున్నాను.

మం-౭-సి-౨౭-సూ-౫౬-౫-౪-౫-౬-౮-౯-౧౫-౧౬-౧౭-౧౮-౧౯-౨౦-౨౧-౨౨-౨౩-౨౪-౨౫-౨౬-౨౭-౨౮-౨౯-౫౪-౭౫

సమీక్ష—ఇప్పుడు కురాను రచించినవాని లీలయు గమనింపుడు ! భూమి కదలుచునేయున్నది. అప్పుడును కదలుచుండును. కాన కురాను వ్రాసినవాఁడు భూమిస్థిరముగ నున్నదనుకొనుచుండెనని. దీనివలన సిద్ధమైనది. సరా ! పర్వతములను పక్షులవలె నెగురఁగొట్టునా? తుత్తునియలై పోవునన్నను. అవి సూక్ష్మ శరీరములు ధరించునేని వానికది రెండవ జన్మమెందులకుఁగాకుండును? ఏమండీ! ఇనా శరీరధారిగాకున్న సతని దక్షిణోత్తర పార్శ్వము లందెట్లు నిలవఁగలుగుదురు ? జలతారుతో నల్లఁబడిన మంచములపై నున్నపుడు వత్రంగులు స్వర్ణకారులుగూడ నట నివసించుచుండవచ్చును. మఱి నల్లులు కుట్టుచు రాత్రులంతు వారిని నిద్రపోనియ్యకుండవచ్చును. వారుతివాచీ నంటిపెట్టుకొని స్వర్గమున నిరర్థకముగఁ గూర్చుండియే యుందురా ? లేక ఏమైన పనిచేయుచుందురా? కూర్చుండియే యుండుటన్న. వారి కన్నము బాగుగా జీర్ణముగాక రోగములపాలై వారు శీఘ్రకాలములోనే చచ్చుచు నుండవచ్చు. పనులు చేయుచుందురేని, ఇక్కడఁగూలి, కష్టములు చేయుచున్నటులే యక్కడను కష్టపడుచు నిర్వాహము చేసికొనుచుండవచ్చును. ఇఁక స్వర్గమునం దిచ్చటికంటె నచ్చట విశేషమేమికలదు ? ఏమియు లేదనుటయే. పిల్లలక్కడ సర్వదా యుందురన్న. వారలకుఁ దల్లిదండ్రులుకూడ నుండ వచ్చును. అత్తమామలు కూడ నుండియుందురు కాఁబోలు. అనఁగా నది యొకగొప్ప నగరమేయై వెలయుచుండవచ్చును. ఇంత మలమూత్రాదులధికము లగుటవలన ననేక రోగములుకూడఁ బుట్టుచుండ వచ్చును. ఏమన, ఫలములు దినుచు, పాత్రలలో నీళ్ళుద్రాగుచు, తలనొప్పి కలిగింపని మైమఱచి పడఁజేయని సారానుగూడఁ ద్రాగుచు, ఇష్టమైన ఫలములను, పశువుల పక్షులమాంసము సయితము దినుచుందురేని యటఁదప్పక నానావిధ దుఃఖములును, పక్షులు పశువులు నుండియే యుండును, హత్యలు జరుగుచు నక్కడక్కడ నెముకలును బడియుండవచ్చునే. కటిక దుకాణములుకూడ నుండవచ్చును గదా ! అహా వీరి స్వర్గాతిశయము నేమని వర్ణింపవలెను. అరేబియా దేశమునకంటె మించియున్నటులే గోచరమగుచున్నది!!! మద్యమాంసములు దినుచు ద్రాగుచు నున్మత్తులగుచుందురేని వారికొరకట చక్కని స్త్రీలును, యువకులు దప్పక యుండవలసినదేకద. లేనిచోఁ దలపుత్తెలందుష్ట మదిపై ఆత్రాగుఁబోతులు ప్రమత్తుంయి

పోదురు. ఇఁక ననేక స్త్రీ పురుషులఁకు గూర్చుంరుచుకు. పరుండుదుకు. అవశ్య ముగ నట గొప్పగొప్ప పఱుపులను, కావలసియుండును. స్వర్గమున జదా పరుచు స్త్రీల నుత్పన్నము చేయుట వలననే యువకులనుగూడ నుత్పన్నము చేయుచున్నా(రు. సరి; ఇక్కడ నుండి, ఆశపెట్టుకొని పోయినవారా పరుచు స్త్రీలను వివాహమాడుదురని జదా వ్రాసియున్నాఁడే. అట నిరంతరముండెడు యువకులు ఫలానా పరుచులను వివాహమాడుదురనియుమాట వ్రాయలేదు. కాఁబట్టి పరుచు స్త్రీలతోఁబాటా పరుచువాంరుకూడ నాయాశా బద్ధులకే యియ్యఁబడుదురా యేమి; దీని వ్యవస్థ యేమియు వ్రాయలేదు. ఇదా కింతటిగొప్ప మఱపేల గలిగెను; సమానావస్థగల ము త్తయిదువలు పతులఁబొంది, స్వర్గమున నుందురన్న నది మంచిదికాదు. ఏలయన స్త్రీలకంటెఁ బురుషుల వయస్సు రెండింతలో రెండింతలన్నరయో యుండఁదగును. ఇది కేవలము మసల్మానుల స్వర్గమును గూర్చిన కథయే. ఇఁక నరకవాసులు (సింహూడ) వలకఱమ్మది వృక్షముఁలదిని కడుపు నింపుకొనెదరేని, నరకమున కంటక వృక్షము లుండుట వలన ముండ్లుగూడ గ్రుచ్చుకొను చుండవచ్చును. ఉడుకునీళ్లు త్రాగుట యిత్యాది దుఃఖములను నరకమం దనుభవింతురు. ప్రాయికముగా నొట్టుపెట్టుకొనుట యసత్యవాదులపనియే కాని సత్యవంతులదికాదు. ఖుదానయిత మొట్టుపెట్టుకొను చున్నాఁడేని యతఁడుకూడ ననత్యవంతుఁడనియే గ్రహింపనగును ॥౧౪౦॥

౧౪౨. అతని మార్గమునఁ బోట్లాడు వారితో నిశ్చయముగ నల్లా మిత్రత్వము కలిగియుండును. మం-౨-సి-౨౮-సూ-౮౯-౯-౪॥

సమీక్ష—సరి బాగుగానున్నది; ఇటువఁటి మాటలఁ బోధించి యమా యకులయిన యరేబియా దేశస్థుల కందఱతోఁ బోట్లాటలు పెట్టి వైరము గలిగించి యెల్లరను దుఃఖముల పాలుచేసియున్నాఁడుగా; ఇట్లు మతధ్వజమును నిలువఁబెట్టి కలహము గావించువాని నీశ్వరుఁడుని బుద్ధిమంతుఁడెవ్వరు నంగీకరింపనేరఁడు. జాతిలో విరోధముఁ బెంచువాఁడే యందఱకు దుఃఖము గలుగఁజేయువాఁడగును. ॥౧౪౨॥

౧౪౩. ఓ నబీ! అల్లా నీకొఱకు పవిత్రము (హలాల్) నొసంగిన వస్తువును నీవు నింద్యము (హరాం) అని నిషేధించుచున్నావెందులకు; నీవు నీభార్యల సమ్మతిని గోరుచున్నావేని క్షమించునట్టి ప్రభువు (అల్లా) దగ్గఱనే యున్నాఁడు. వారేమియ్యబిడిచి పెట్టినను కొంచరలేదు. వారికి మీకంటె

మేలయిన-విశ్వసింపఁదగిన-మునల్మాన్ స్త్రీలు బదులుగా నొసంగఁబడుదురు. ఆ స్త్రీలు సేవచేయువారు, పశ్చాత్తాపపడువారు, భక్తిసలుపువారు, ఉపవాస వ్రతము సలుపువారు, పురుషముఖము జూచినవారు, చూడనివారును అగుదురు.

మం. ౬. సి. ౨౮. సూ. ౬౬. ౭-౧-౫॥

సమీక్ష—ధ్యానపూర్వకముగ గమనించితిమేని, అతఁడు ఖుదా కాఁడు గాని, మహమ్మద్ సాహేబు గృహములోపల వెలుపల పనులుచేయు భృత్యుఁడేయని తేఁటపడును. మొదటి ఆయతునుగూర్చి రెండు కథలు కలవు. (ఒకటి) మహమ్మదు సాహేబునకు తేనె ద్రావకము ప్రియమనియు, అతని కనేక స్త్రీ లుండిరనియు, వారిలో నొకదాని యింటఁ ద్రాగుటయందు దాలస్యమై నందున నితరులకది అసహ్యముగఁదోఁచెననియు వారి జాడింపులు వినిన పిమ్మట మహమ్మదుసాహేబిక త్రాగననిశపథము చేసెననియు వ్రాయఁబడి యున్నది. (రెండవది) అతని కనేక భార్యలుండిరనియు, వంతుగా నెవతి యొద్దకుఁబోవలసి యుండెనో ఆమెవద్దకు రాత్రియందు వెళ్ళఁగా నామె యింటలేక తనతండ్రి యొద్దకుఁబోయి యుండెననియు, మహమ్మదుసాహేబు ఒక దాసిని బిలిచి పవిత్రము చేసెననియు, భార్యకీసంగతి తెలియఁగా నామె యప్రసన్నురాలయ్యెననియు, అప్పుడు మహమ్మదు సాహేబిఁకనే నట్లు చేయనని ప్రమాణముచేసి నీవీ సంగతి నెవరికిఁ దెలియఁజేయకుమని భార్యతోఁ జెప్పగా నామె చెప్పనని యొప్పుకొనెననియు, మఱల నతడు రెండవ భార్య వద్దకుఁబోయి చెప్పననియు వ్రాయఁబడియున్నది. దీనిఁగూర్చియే మేము నీకొఱకు హలాల్ చేసియున్న వస్తువును, నీవు హరామని యేలయందుకొనుచున్నావని ఈ ఆయతును ఖుదా దించెను. ఓరీ ! ఎక్కడనైన ఖుదా యొకని యింటిని చక్కఁబెట్టుచుఁ దిరుగుచుండునా ? బుద్ధిమంతులు విచారింతురు గాక. ఇఁక నీమాటలవలన మహమ్మదుసాహేబు నడవడి తేట పడినదికద. ఏమనఁగా ననేక స్త్రీలనుంచుకొను వాఁడీశ్వరభక్తుఁడుగాని-పైగంబరు కాని యెట్లు కాఁగలఁడు ? ఒక స్త్రీ నవమానపఱచి మఱొక స్త్రీని గౌరవించువాఁడు పక్షపాతియు, ధర్మహీనుఁడు నేలఁగాడు ? అనేక స్త్రీలున్నను సంతుష్టుఁడు గాక దాసిలకు లోబడు వానికి లజ్జ, భయము, ధర్మము అనునవెక్కడనుండును ? (కామాతురాణాం న భయం న లజ్జా) కాముకులగు మనుష్యులు అధర్మమునకు భయపడరు, లజ్జితులును గారు అనియొక అనుభ

నమ్ముటమునకు తప్పింపఁబడుదురు. గుప్తమైన యొకవాఁడుండినను దాఁగి యుండ కుండును. ఎవని కుడిచేతికి అతని కర్మపత్రమియ్యఁబడునో వాఁడు "ఇదిగో నాకర్మ పత్రమును జదువు" మనును. ఇఁక నెవని యెడమచేతికి అతని కర్మపత్ర మియ్యఁబడునో వాఁడు "అయ్యో! ఈ కర్మపత్రము నాచేతి కీయకున్న మేలయియుండెడిగా" అని యనుకొనును.

మం-౭ సి-౨౯-సూ-౬౯-ఆ-౧౬-౧౭-౧౮-౨౫॥

సమీక్ష—ఓహో! ఏమి తత్త్వవిజ్ఞానము ఎంత న్యాయమైన ప్రసంగ మని పొగడవలెను! బొరా! ఆకాశ మెన్నఁడయినఁ బ్రద్దలయి పోవునా? ఏమి? బ్రద్దలగుటకది వస్త్రము వంటిదా? మీఁది లోకమును ఆకాశమందు రేని అది జ్ఞానవిరుద్ధమగు మాటయే యగును. ఇప్పుడు ఖురానునందలి ఖుదా శరీరధారియేయని స్పష్టముగ విదితమయ్యెనుగద. ఏలనఁ బీఠముమీఁద గూర్చుండి ఎనమండుగురు బోయీలచే మోయఁబడు మూర్తిమంతుఁడుకాని మఱియేమగును? ఇదిగాక ముందునకు వెనుకకు వచ్చుట పోవుటగూడ మూర్తిమంతునియందే మటిల్లఁగలదు. అతఁడు మూర్తిమంతుఁడేయైనచో నేక దేశియుఁడగుటవలన సర్వజ్ఞుడు సర్వవ్యాపకుఁడ సర్వశక్తిమంతుఁడు గానేరఁడు. అట్లే సకల జీవులకర్మముల నన్నింటి నెన్నఁడు నెఱుఁగఁజాలఁడు. పుణ్యాత్ముల కుడిచేతులలోఁ గర్మపత్రము లిచ్చి చదివించుట, స్వర్గమునకుఁ బంపుట, అట్లే పాపాత్ముల యెడమచేతులలోఁ గర్మపత్రములిచ్చి నరకమునఁ బడవేయుట, కర్మపత్రములఁ జదివి న్యాయ మొనరించుట అను నీమాటలు గడువింతగా నున్నవి. ఏమి ఇదియొక సర్వజ్ఞుని పనియగునా? ఎన్నటికి కానేరదు. ఇవన్నియు పిల్లల యాటలవంటి మాటలే యననొప్పును.॥౧౪౫॥

౧౪౬. పరిశ్రాంత జీవములు నతనిపై పునకుఁ బోవును. ఆ పాపము ఏఁబదివేల సంవత్సరముల పరిమాణముగల దినమంతటిదై యుండును. ఒకా నొక గమ్యస్థానమునకుఁ బరుగిడునట్లు దినము సమాధులలోనుండి లేచి పరుగిడుదురు. మం-౭-సి-౨౯-సూ-౭౦, ఆ-౪-౪౨॥

సమీక్ష—దినపరిమాణ మేఁబదివేల సంవత్సరములన్న రాత్రి పరిమాణము నేఁబదివేల సంవత్సరములుగాదా? ఇంత గొప్పరాత్రి యుండదందు రేని యంత గొప్పదినము నెప్పటికినుండదు. ఏఁబదివేల సంవత్సరముల

వలెకా ఖుదా, పరిశ్తాలు, కర్మపత్రధారులు అందఱును నిలువఁబడి యుందురా, లేక కూర్చుండి యుందురా? మఱి వారందఱును మేలుకొనియే యుందురా ఏమి? అటులయిన నిక నందఱును రోగగ్రస్తులయి చావనే చత్తురు. వారు సమాధులలోనుండి లేచి ఖుదా కచ్చేరివైపునకుఁ బరుగెత్తుదురా? ఏమి? ఆ దొందరలోని వారికి సూచనాపత్రములు (సమనులు) నెట్లందును? పాపమా పుణ్యాత్ములను పాపాత్ములనందఱి నింతకాలము వఱకు ప్రతిబంధరూపకముగా దొందలలో నెందులకు చెఱవేసియుంచెను? ఇప్పుడు ఖుదా కచ్చేరీ మూయఁబడి యుండవచ్చునా ఏమి? ఆ ఖుదా పరిశ్తాలు నిరర్థకముగఁ గూర్చుండియుందురా? లేక ఏమయిన పని చేయుచుందురా? తమ స్థానములందు కూర్చుండి, అటుఁనిటుదిరుగుచు, పరుండుచు, నాట్యములను వేడుకలనుఁ జూచుచు, ఆనంద మనుభవింపుచు నుండవచ్చును గద. ఇంత అన్యాయ మేరాజ్యమున నుండదు. కాన నీవా ర్తల నడవిమనుష్యులు తప్ప నన్యులెవ్వరు నంగీకరింపనేరరు. ॥౧౪౬॥

౧౪౭. నిశ్చయముగ మిమ్ము నానావిధములఁ బుట్టించియున్నాఁడు. పైభాగమున నల్లా ఏడాకాశముల నెట్లుత్పన్నము చేసియున్నాఁడో మీరు చూచుట లేదా? వానిమధ్య చంద్రునిఁ బ్రకాశకుఁడుగను సూర్యుని దీపముగను యున్నాఁడు. మం-౭-సి-౨౯-సూ-౬౧-౦-౧౪-౧౩-౧౬॥

సమీక్ష—ఖుదా జీవుల నుత్పన్నము చేసియున్నాఁడన్న వారు నిత్యులు అమరులు నెన్నటికిని గానేరరు. ఇఁక స్వర్గమున సర్వదా నెట్లుండఁగలుగుదురు? ఉత్పన్నమగు పదార్థ మవశ్యముగ నశించుచున్నది; పై భాగమందాకాశము నెట్లు చేయఁగలుగును? ఏమనఁగా నిది నిరాకారమై విభువైన పదార్థము. వేరొక వస్తువున కాకాశమను పేరిడుచున్నారేని, దాని కాకాశమను పేరిడుటయు నిరర్థకమే. పైభాగమున నాకాశములఁజేసి యున్నాఁడేని వాని యన్నిటిమధ్య సూర్యచంద్రు లెన్నడు నుండఁజాలరు. మధ్య నుంపఁబడిరన్న, మీదిదొకటి క్రిందిదొకటి మాత్రము ప్రకాశితమగును. రెండవది మొదలుకొని యన్నిటియం దంధకారమే యుండును. ఇట్లు గోచర మగుట లేదు. కావున నీవార్త సర్వథా మిథ్యయే. ॥౧౪౭॥

౧౪౮. మసీదులు అల్లా కొఱకే కలవు గాన నల్లాతోఁగూడ మఱొకనిఁ బిలువకుఁడు. మం-౭-సి-౨౯-సూ-౭౨-౦-౧౮॥

సమీక్ష—ఈ మాట నిజమేని ముసల్మానులు "లాయిలాహ ఇల్లల్లా! మహమ్మదర్రసూల్లా!" అను "కలమ" వాక్యమున ఖుదాతోఁగూడ మహమ్మదు సాహేబు నెందులకుఁ బిలుచుచున్నారు? ఇట్లు పిలుచుటకు కురానునకును విరుద్ధమేకదా. విరుద్ధము కాదందురేని, ఈకురాను వాక్యము నబద్ధము చేయుచున్నారు. మసీదులు ఖుదా గృహములయిన ముసల్మానులును విగ్రహారాధకులయిరి. చిన్న చిన్న విగ్రహములను. ఈశ్వర మందిరములని నమ్ము జైనులును, పౌరాణికులును విగ్రహారాధకు లనఁబడునటులే వీరేల యనఁబడకుందురు? ॥౧౪౮॥

౧౪౯. సూర్యచంద్రులు ఒక చోటఁగూర్పఁ బడుదురు.

మం-౫-సి-౨౯-సూ-౫౫-౧-౬॥

సమీక్ష—సరి! సూర్యచంద్రు లెన్నఁడయిన నొకచోటఁ గూర్పఁబడఁగలరా? ఇదెంతటి యవివేకమయిన వార్తయో గమనింపుడు! సూర్యచంద్రులనే యొకచోటఁ జేర్చుట కేమిప్రయోజనా ముండెను? అన్యలోకములన్నింటి నొక చోటఁ జేర్పక పోవుట కేమియుక్తి కలదు? ఈలాంటి యసంభవ విషయము లెన్నఁడైన నీశ్వరకృతములు కాఁగలవా? పామరులవిదప్ప విద్వాంసులవైన నెప్పటికి కానేరవు. ॥౧౪౯॥

౧౫౦. వారి సమీపమున నెల్లప్పుడుండెడు పిల్లకాయలు తిరుగుచుందురు. నీవు వారిని జూచినప్పుడు చెదరిపడియున్న ముత్యములని యనుమానింతువు. వారికి వెండికంకణములు తొడిగింపఁబడును. ప్రభువు వారికి పవిత్రమయిన సారా ద్రాగించును. మం-౫-సి-౨౯-సూ-౫౯ ఆ-౧౯, ౨౧॥

సమీక్ష—ఏమండీ! ముత్యములవంటి కాంతిగల పిల్లకాయలచట నెందులకుంచఁబడుచున్నారు? ఏమి, యువకులు వారిసేవఁ జేయలేరా? స్త్రీజనము వారికి తృప్తి గలుగఁ జేయజాలందా? దుష్టులు పిల్లకాయలతో నేయే గొప్ప దుష్కర్మల నొనరించుచున్నారో, దానికి మూల మీకురాను వచనమే కావచ్చుననుట కాశ్చర్యమేమి? ఇఁక స్వర్గమున స్వామి సేవక భావముండట్టి స్వామి కానందమును, సేవకునికిఁ బరిశ్రమ చేయుట వలన దుఃఖమును కలుగునుగద. ఈ పక్షపాతమట నెందులకుఁగలదు? ఖుదాయే సారా ద్రాగించు నన్న నతఁడుకూడ వారికి సేవకునివంటివాఁడేయై నిలుచును. ఇక ఖుదా గొప్పతనమెట్లు స్థిరపడఁగలుగును? స్వర్గమందు. స్త్రీపురులకు నంప

క్కమును అట్లు గర్భస్థితియుగలిగి వారు సంతానవంతులు గూడ నగుటకలదా. లేదా ? లేదన్న వారి విషయభోగములు వ్యర్థమయ్యెను. కలదన్న నాజీవము లెక్కడినుండి వచ్చును ? ఖుదా సేవజేయువారే వారు స్వర్గమున నెందులకు జన్మించిరి ? జన్మించిరిపో ! (ఈమాన్) మతవిశ్వాసము కలుగకున్నను ఖుదా భక్తి సలుపకున్నను వారికనాయాసముగనే స్వర్గము లభించెగదా ! కొందఱకు (ఈమాన్) మతవిశ్వాసము కలుగుటవలనను, మఱికొందఱకు ధర్మము నాచరింపకున్నను సుఖము లభించుచున్న దింతకంటె గొప్ప యన్యాయమేమి కాఁగలదు ? ॥౧౫౦॥

౧౫౧. కర్మానుసారముగ ప్రతిఫలము లీయఁబడును. గిన్నెలు నిండి యుండును. రూహులను జీవమును, పరిశ్తాలను వరుసగా నిలుపఁబడు దినమున. మం-౭-సి-౩౦-సూ-౭౮-ఆ-౨౬-౩౪-౩౮॥

సమీక్ష—కర్మానుసారముగా ఫలమొసంగఁబడునన్న. "స్వర్గమున నుండెడు చక్కని స్త్రీలకు, పరిశ్తాలకు, ముత్యముల వంటి పిల్లకాయలకు, నేకర్మమున్నట్టి యెల్లప్పుడుండుటను స్వర్గములభించెను ?" గిన్నెలు నింపు కొనుచు సారా త్రాగుదురేని మత్తెక్కియేల పోట్లాడకుందురు ? ఇట (రూహ్) పరిశ్తాలో నొకగొప్ప పరిశ్తాఅని భావము ఏమి ? ఖుదా రూహును అన్య పరిశ్తాలను వరుసగా నిలువఁబెట్టి సైన్యమును ప్రోగుచేయునా ? సైన్యము ద్వారా జీవులందఱకు శిక్ష గలుగఁజేయునా ? మరి ఖుదా ఆసమయమున నిలువఁబడి యుండునా ? లేక కూర్చుండి యుండునా ? ఖుదా ప్రళయకాలము వఱకైనను తన సైన్యమునంత ప్రోగు జేసి యీ సైతానును పట్టు కొనునేని యతని రాజ్యము నిష్కంటకముగ సాగఁగలుగును. దీనినే ఖుదా తనమందురుగాఁబోలు ॥౧౫౧॥

౧౫౨. సూర్యుఁడు చుట్టఁబడుచున్నప్పుడు చుక్కలు మాఁగువాఱి నప్పుడు. పర్వతములు చలించినపుడు. ఆకాశచర్మ మూడఁదీయఁబడునపుడు. మం-౭-సి-౩౦-సూ-౮౧-ఆ-౧-౨-౩-౧౧॥

సమీక్ష—గుండ్రముగానున్న సూర్యలోకము చుట్టఁబడుననుట గడు [illegible] మాటయేకద. చుక్కలు మాఁగువాఱుట యెట్లు ? జడములైన పర్వతము లెట్లు చలించును ? చర్మ మూడఁదీయఁబడుననుట కాయాకాశము

నొక పశువనుకొనెనా యేమి? ఇవి యజ్ఞానముతోఁ గూడిన గొప్ప పామరత్వపు మాటలే యననొప్పును. ॥౧౫౨॥

౧౫౩. ఆకాశము బ్రద్దలయిపోవునపుడు. చుక్కలు రాలిపడునపుడు. సముద్రములు చీల్పఁబడునపుడు : సమాధులు బ్రతికింప లేపఁబడునపుడు.

మం-౭-సి- ౩౦-సూ-౮౨ ఆ. ౧-౨-౩-౪॥

సమీక్ష—కురానును రచించు తత్వవేత్త! సెబాస్ సెబాస్!! ఆకాశమును బ్రద్దలుగ నెట్లు చేయఁగలుగును? చుక్కలనెట్లు రాల్పఁగలుగును? ఏమి? సముద్రములు చీల్పఁబడుటకవి కఱ్ఱలా? బ్రతికింపఁ గలుగుననుట కాసమాధులే పీనుగులా? ఇవన్నియు పసిపిల్లలవంటి మాటలే యగును. ॥౧౫౩॥

౧౫౪. బురుజులుగల ఆకాశసాక్షిగఁ జెప్పుచున్నాను. కాని ఆ మహా కురానమునది లూహునందు సురక్షితముగా నున్నది.

మం-౭-సి-౩౦-సూ-౮౫-ఆ-౧-౨౧॥

సమీక్ష—ఈ కురానును రచించినవాఁడు ఖగోళ భూగోళముల నెంత మాత్ర మెఱుఁగకుండెను. లేనిచో నాకాశమును కోటవంటి బురుజులుగలదని యెందులకనియుండును? మేషాది రాసులను బురుజులందురేని తక్కిన వేల బురుజులు గాకుండును? కాన నవి బురుజులుకావు. కాన యీ చుక్కలన్నియు లోకములే. మఱి ఆకురాను ఖుదావద్దనున్నదా యేమి? ఆ కురాను అతని రచితమేయైన నదియు నింతకంటె నధిక జ్ఞానశూన్యము. యుక్తిశూన్యమునగు నవిద్యతోఁ గూడియుండవచ్చును. ॥౧౫౪॥

౧౫౫. నిశ్చయముగ వారొక టక్కును బన్నుచున్నారు. నేనుకూడ నొక టక్కును బన్నుచున్నాను. మం-౭ సి-౩౦-సూ-౮౬-ఆ౧౫-౧౬॥

సమీక్ష—మొనపుచ్చుటయే టక్కనఁ బడునుగద. ఖుదా సయితము టక్కరియేనా యేమి? దొంగతనము దొంగతనమే. అబద్ధమున కబద్ధమే యుత్తరమా! ఒక దొంగ యొక సజ్జన పురుషునింట దొంగతనము చేసిన నా సజ్జనపురుషుఁడు సయిత మాతని యింటికిఁబోయి దొంగతనముఁ జేయవలయునా? కురానును రచియించినవాఁడా సెబాస్!! సెబాస్!! ॥౧౫౫॥

౧౫౬. నీ ప్రభువును, పంక్తి పూర్వకముగ ఫరిశ్తాలును వచ్చినపుడు, ఇఁక నాదినము నరకము తెప్పింపఁబడును.

మం-౭-సి-౩౦-సూ-౮౯-ఆ-౨౧-౨౨॥

సమీక్ష—చెప్పరు! కోతవాలుకుఁడుగాని సేనాధ్యక్షుఁడుగాని. తన సైన్యమును పంక్తి పూర్వకముగ వెంటఁగొని తిరుగునట్లే వీరి ఖుదాకూడఁ దిరుగునా యేమి? నరకము నెక్కడికిఁ బట్టిన నక్కడి కెత్తుకొని పోవుటకు దానిని కడవయనుకొనెనా? ఇంత చిన్నదేని, అసంఖ్యాకులగు ఖైదీ లెట్లు పట్టగలదు? ॥౧౫౬॥

౧౫౭. దేవదూతయగు పైగంబరు వారితో "మీరు దేవునియాఁడు ఒంటెపిల్లను రక్షింపుఁడు దానికి నీళ్ళు త్రాగింపుఁడు" అని చెప్పియుండెను. అంత నతనిమాట నబద్ధముచేసి దానికాళ్ళు తెగనఱకఁగా వారి రక్షకుఁడు వారి మీఁదికి మారిని బంపెను. మం-౭-సి-౩౦-సూ-౯౧-ఆ-౧౩-౧౪॥

సమీక్ష—ఏమి! ఖుదాసైతము ఒంటెపిల్లమీఁద నెక్కి తిరుగుచుండునా? లేనిచో నుంచినదెందులకు? ప్రళయముగాకుండుటకుఁ బూర్వమే తన నియమమును రద్దుపరచి మారియను రోగమును వారికేల గలుగఁజేసెను? అట్లు గలుగఁజేసినపుడు వారిని దండించినవాఁడే యయ్యెను. ఇఁక ప్రళయమునాఁటి రాత్రి న్యాయము చేయుననుటయు, ఆ రాత్రి కాఁబోవుననుటయు నబద్ధమేనా? ఈయొంటె విషయమై వ్రాయఁబడిన లేఖనముఁజూచి అరేబియా దేశమునందు ఒంటెపిల్లలుతప్ప, ఇతర వాహనములు చిక్కుట యరుదుగాన నీకురాను నొక యరేబియా దేశవాసుఁడు రచించినాఁడని యనుమానింపఁబడుచున్నది ॥౧౫౭॥

౧౫౮. వినకపోయిన పక్షమున మేమవశ్యముగ వానిముందు వెంట్రుకలఁబట్టి యీడ్తుము. వాని నొసలబద్ధము పలుకును. అపరాధ మొనరించును. నరకము ఫరిశ్తాను మేము పిలుతుము.

మం-౭-సి-౩౦-సూ-౯౬-ఆ-౧౫-౧౬-౧౮॥

సమీక్ష—ఈదుర్బుద్ధియను నీ నీచమైన పరిచారక వృత్తిని చేయుటకుఁ గూడ ఖుదా బాధ్యుఁడయ్యెనే. ఔరా! జీవుఁడుదప్ప నొసలెన్నఁడయిన నబద్ధముఁ బలుకునా? అట్లే అపరాధ మొనరించునా? వెబాన్! చెరసాల సంరక్షకుని బిలిపించు నటువంటి వాఁడెన్నఁడయిన ఖుదా కాఁగలఁడా? ॥౧౫౮॥

౧౫౯. నిశ్చయముగ మేము రాత్రియందు కురాను దించితిమి. ఖదర్ అను రాత్రి యేమయినది నీకేమి తెలియును? ప్రతి కార్యమునకై తమ ప్రభువు నాజ్ఞగొని ఫరిశ్తాలును, పవిత్రాత్మలును గాని యందు దిగుచున్నారు.
మం-౭-సి-౩౦-సూ-౯౭-ఆ-౧-౨-౪॥

సమీక్ష— ఏకరాత్రిని కురానును దించెనన్న "ఫలానా ఆయతును, ఫలానా సమయమందు నిట్లు క్రమక్రమముగా దించె" ననుటెట్లు సత్యమగును? రాత్రి చీకటితో గూడినదేగా! ఇంక నందరుగ వలసిన దేమున్నది. క్రిందు మీఁదు లెంతమాత్రము కానేరవని, మేము వ్రాసి యున్నారము. ఇంక నిక్కడ "ఫరిశ్తాలును, పవిత్రాత్మలును, ఖుదా యాజ్ఞగొని, సంసారమున నేర్పాటులు చేయుటకు వచ్చుచున్నా"రని వ్రాయుచున్నారు. దీనివలన ఖుదా ఏకదేశియుఁడనియే స్పష్టమయ్యెను. ఖుదా, ఫరిశ్తాలు, పైగంబరులను నీ ముగ్గురి కథయే కలదని యింతవఱకుఁ దెలిసికొనియుంటిమి కాని పవిత్రాత్మ యను నాల్గవవాఁడొకఁడు బయలు దేఱినాఁడు. ఈనాల్గవ పవిత్రాత్మయనున దేమో తెలియకున్నది. ఇది క్రైస్తవ మతస్థులు నమ్ము పితా, పుత్ర, పవిత్రాత్మలను మూటికంటె నాల్గవ దొకటి యెక్కువయే యయ్యెనుగద. మేమీమూఁటిని ఖుదాయని యంగీకరింపమందురేని యట్లే కానిండు. కాని పవిత్రాత్మ వేఱయియున్నప్పుడు ఖుదా, ఫరిశ్తా పైగంబరులను పవిత్రాత్మ లనవలయునా, లేదా? పవిత్రాత్మకలదేని యొకరికే పవిత్రాత్మయను పేరెందులకు? మఱి ఖుదా గుఱ్ఱములు మున్నగు పశువులమీఁదను, దినరాత్రులమీఁదను, కురాను మున్నగు వాని మీఁదను ప్రతిజ్ఞ చేయుచున్నాఁడు. శపథము సజ్జనుల పని కానేరదు. ॥౧౫౯॥

ఇట నీ కురానువిషయమును వ్రాసి "ఈపుస్తక మెటులున్నదో చూచు గొనుటకుగాను" బుద్ధిమంతుల యెదుటఁ బెట్టుచున్నాఁడను. నన్నడుగుదు రేని యీ పుస్తక మీశ్వర రచితము కాని, యొక విద్వాంసునిచే రచియింపఁ బడినదికాని కాదు. ఇదియొకరు జ్ఞానము నిచ్చు పుస్తకమును గాఁజాలదు. మనుష్యులు భ్రమలోఁబడి తమ జన్మములు వ్యర్థము చేసి కొనకుండుటకు ఇంఁ గొన్ని దోషములను మాత్రమే ప్రకటించి యున్నాఁడను. ఇంక నిందుఁగల కించిన్మాత్ర సత్యము వేదాదివిద్యా పుస్తకముల కనుకూలమై యున్నందున నా కెట్లు గ్రాహ్యమో యటులే యన్యమతము లందలి హఠములుకూడఁ లక్ష

పాత రహితులైన విద్వాంసులకును, బుద్ధిమంతులకును గ్రాహ్యమగును. ఇదియుఁ గాక నిందఁగల దంతయు నవిద్యా భ్రమజాలములతోఁ గూడినట్టియు, మనుష్యుని యాత్మను పశువుతో సమానముగాఁ జేసి శాంతిభంగము గలుగఁజేయునట్టియు, ఉపద్రవముల నుత్పత్తిల్లఁజేసి మనుష్యులందు ద్రోహమును గలుగఁజేసి పరస్పర దుఃఖములఁ బెంచునట్టియు యంశమేయని యెఱుఁగఁదగును. అట్లే పునరుక్త దోషములకు నీకురాను నిలయమైయున్నది. అందఱితో నందఱకు ప్రీతి కలుగునట్లును, పరస్పర సంఘీభావము స్థిరపడి ఒండొరుల సుఖాభివృద్ధి కొఱకు నందరు పాటుపడునట్లును ఆ పరమేశ్వరుఁడు మనుష్యులందఱిమీఁదఁ గృపజేయునుగాత. నేను నాదోషములగాని యితర మతపుతాంతరములందలి దోషములనుగాని పక్షపాత రహితుఁడనయి యెట్లు ప్రకాశపఱచుచున్నానో యట్లే విద్వాంసులందఱు నొనర్తురేని పరస్పర విరోధమూడి మిత్రత్వము కుదిరి ఆనంద పూర్వకముగ నొక్క మతమే స్థిరపడి సత్యము చేకూరవచ్చును. ఇట్లు సంక్షిప్తముగ కురాను విషయమందు వ్రాసియున్నాఁడను. బుద్ధిమంతులైన ధర్మాత్ములు, గ్రంథకర్త యొక్క యభిప్రాయమును గుర్తెఱిఁగి దీనినుండి లాభము పొందుదురు గాక. అట్లే ఎక్కడనయిన భ్రమతో నన్యథా వ్రాయఁబడిన దానిని సవరించు కొందురుగాక.

ఇంక నొక విషయము శేషించియున్నది. అదేమన అనేక మునల్మానులు 'మామతసమాచార మథర్వణ వేదమున వ్రాయఁబడియున్న' దని చెప్పుచు వ్రాయుచుఁ బ్రచురింపఁ జేయుచునున్నవారు. కాని అథర్వణ వేదమందు దాని నామచిహ్నముగూడ లేదనుటయే దీనికు త్తరము.

ప్రశ్న:–మీరు అథర్వణవేదమంతయుఁ జూచియున్నారా? చూచియున్న నల్లోపనిషత్తును జూడుఁడు. సాక్షాత్తుగ నందు వ్రాయఁబడియే యున్నది! మరల అథర్వణవేదమందు మునల్మానుల నామచిహ్నము గూడ లేదని యెందుల కనుచున్నారు?

## అల్లోపనిషదం వ్యాఖ్యాస్యామః

అస్మాల్లాం ఇల్లే మిత్రావరుణా దివ్యాని ధత్తే। ఇల్లల్లే వరుణో రాజా పునర్దదుః। హయామిత్రో ఇల్లాం ఇల్లల్లే ఇల్లాం వరుణో మిత్రస్తేజస్కామః ॥౧॥ హోతారమింద్రో హోతార మింద్ర మహాసురింద్రాః ॥ అల్లో జ్యేష్ఠం శ్రేష్ఠం పరమం పూర్ణం బ్రహ్మాణం అల్లామ్ ॥౨॥ అల్లో రసూల మహామదరకబరస్య అల్లో అల్లామ్ ॥౩॥ ఆదల్లాబూక మేకకమ్। అల్లాబూకం నిఖాతకమ్ ॥౪॥ అల్లో యజ్ఞేన హుతహుత్వా అల్లా సూర్యచంద్ర సర్వనక్షత్రాః ॥౫॥ అల్లా

ఋషీణాం సర్వదివ్యాం ఇంద్రాయ పూర్వం మాయాపరమ మంత్రరిక్షాః ॥౬॥ అల్లః పృథివ్యా అంతరిక్షం విశ్వరూపమ్ ॥౭॥ ఇల్లాంకబర ఇల్లాంకబర ఇల్లా ఇల్లల్లేతి ఇల్లల్లాః ॥౮॥ ఓం అల్లా ఇల్లల్లా అనాది స్వరూపాయ అథర్వణా శ్యామాహూం హ్రీం జనాన పశూన్సిద్ధాన్ జలచరాన్ అదృష్టం కురు కురు ఫట్ ॥౯॥ అసుర సంహారిణీహూం హ్రీం అల్లో రసూల మహమదరకబరస్య అల్లో అల్లాము ఇల్లల్లేతి ఇల్లల్లాః ॥౧౦॥

ఇత్యల్లోపనిషత్ సమాప్తా ॥

ఇందు ప్రత్యక్షముగ మహమ్మదు సాహెబును రసూలని వ్రాయబడినది. కాన ముసల్మానుల మతము వేదమూలకమనియే దీనివలన సిద్ధమగు చున్నది.

ఉత్తరము :- మీరు అథర్వణవేదమును జూచియున్న మాదగ్గరకు రండు. అదినుండి యంతము వఱకు జూడుడు. లేదా ఇఱువది కాండములతోఁ గూడియున్న 'మంత్రసంహిత' అథర్వణవేదమును ఏయథర్వణ వేదీయుని యొద్దనున్నను బోయి చూచుకొనుఁడు. మీ పైగంబరు సాహెబు నామము గాని మత చిహ్నముగాని యందుఁ గాంచకుందురు. ఈయల్లోపనిషత్తను నది అథర్వణవేద మందుఁగాని, దాని గోపథ బ్రాహ్మణ మందుఁగాని శాఖయందుఁగాని లేదు. అకబరు బాదశాహ కాలమున నొకఁడు దీనిని రచియించె నని మాత్ర మనుమానింపఁ బడుచున్నది. దీనిని రచియించినవాఁడు కొంతయరబ్బీ కొంత సంస్కృతము గూడఁ జదివి యున్నట్టు గోచరమగుచున్నది. ఏమఁనగానిందు అరబ్బీ పదములును, సంస్కృత పదములును ప్రయోగింపఁబడి యున్నవి. చూడుఁడు: "అస్మాల్లాం ఇల్లే మిత్రావరుణా దివ్యానిధత్తే" ఇత్యాదులు పదియంకములలో వ్రాయఁబడి యున్నవి. ఎట్లనఁగా "అస్మాల్లాం ఇలాఇల్లే" అనునది అరబ్బీ పదములు. "మిత్రావరుణా దివ్యానిధత్తే" ఇవి సంస్కృత పదములు. ఇటులే యంతట వాడఁబడి యున్నందున దీనిని సంస్కృత అరబ్బీ భాషలు చదివిన వాఁడొకఁడు రచించె ననుట స్పష్టము. దీని యర్థము చేసిచూచినయది కృత్రిమమును, అయుక్తమును వేదవ్యాకరణములకు విరుద్ధమునై యున్నది. ఈ యుపనిషత్తును రచించినటులే పక్షపాతముగల వివిధమత సాంప్రదాయులు ననేకో పనిషత్తులు వ్రాసియున్నారు. అనఁగా స్వరూపో పనిషత్తు, నృసింహతాపని, రామతాపని, గోపాలతాపని మొదలగునవెన్నియో వ్రాయఁబడినవి.

ప్రశ్న :— నేటిపర్యంత మొక్కఁడయిన నిట్లు చెప్పలేదే. ఇప్పుడు మీరే యనుచున్నారు. మీమాటను మేమొప్పుకొనుట యెట్లు ?

ఉత్తర :— మీరొప్పుకొన్నను ఒప్పుకొనకపోయినను. మా మాట యబద్ధము కాఁజాలదు. ఇది అయుక్తముగా నున్నదని నేనెట్లు కనఁబఱచి యున్నానో ఆప్రకారమే. మీరును అథర్వణ వేదమునఁగాని, గోపథమందుఁ గాని దానిశాఖలుగా వ్రాయఁబడిన ప్రాచీనపుస్తకములందుఁగాని, దీనిని జూపి అర్థము ( సంగతమగునట్లుకూడ ) నిరూపింతురేని యది సప్రమాణము కాఁగలదు.

ప్రశ్న :— మామత మెంతమంచిదో చూడుఁడు ! అంతన్ని విషముల సుఖమలవడుటయే గాక యంతమందు ముక్తికూడ లభించును.

ఉత్తర :— "మామతమే మంచిది తక్కినవన్నియుచెడ్డవి. మా మత మందుఁదప్ప మఱేమతమందును ముక్తిలభింపదు" అని యిట్లు వివిధ మతస్థు లందఱును జెప్పుకొనుచున్నారు. మీ మాటను సత్యమని నమ్మవలయునా ! లేక వారిమాటనా ! మేము మాత్రము సత్యభాషణము, అహింస దయ మొద లగు శుభగుణములు అన్ని మతములందును మంచివనియు. తక్కిన వాద వివాదముల ఈర్ష్యా ద్వేషములు మిథ్యాభాషణాది కర్మములు అన్నిమత ములందును చెడ్డవనియు, నమ్ముచున్నాము. మీరు సత్యమతమును స్వీకరింపఁ గోరుదురేని వేదమతమునే స్వీకరింపుఁడు.

స్వమన్తవ్యామన్తవ్యములు సంక్షేపముగ వ్రాయఁబడును.

శ్రీమద్దయానన్ద సరస్వతీస్వామి కృతము
సుభాషావిభూషితమగు సత్యార్థప్రకాశమున
యవనమత విషయమునందు
చతుర్దశ సముల్లాసము సంపూర్ణము.



చుండవలయును. ఇంతియకాదు, తన సర్వశక్తులచే ధర్మాత్ములగువారు అనాథులు, నిర్బలులు గుణరహితులుగా నున్నను వారిని రక్షింపవలయును. వారి యున్నతికిఁ దోడుపడవలయును. వారియెడఁ బ్రియముగా వర్తిల్లవలయును. అధర్మాత్ముఁడు, చక్రవర్తిగ సనాథుఁడుగ మహాబలవంతుఁడుగ గుణవంతుఁడుగా నున్నను వానిని నష్టపఱుపవలయును. వానికవనతి గలిగింపవలయును. వానియెడ ప్రేమతో వ్యవహరింపరాదు. అనగా చేతనయినంతవఱకు నన్యాయకారుల బలమునకు హానిని, న్యాయకారుల బలమున కున్నతిని గలిగించుచుండవలెను. ఈకారణమున మనకెంత దారుణ దుఃఖము గలిగినను, మరణము తటస్థించినను, ఈ మనుష్యత్వము ధర్మమునుండి యెన్నఁడును వేఱు కాఁగూడదు. ఈ విషయమందు భర్తృహరి మహారాజులుగువారలు శ్లోకములు చెప్పియున్నారు. వాని నిట వ్రాయుట ఉపయుక్తమని తలఁచుచున్నాఁడను.

నిన్దన్తు నీతినిపుణా యది వా స్తువన్తు
లక్ష్మీః సమావిశతు గచ్ఛతు వా యథేష్టమ్ ।
అద్యైవ వా మరణమస్తు యుగాన్తరే వా
న్యాయ్యాత్పథః ప్రవిచలన్తి పదం న ధీరాః ॥౧॥ భర్తృహరి.నీ.శ.౮౪.
న జాతు కామాన్న భయాన్న లోభాద్. ధర్మం త్యజేజ్జీవితస్యాపి హేతోః ।
ధర్మో నిత్యః సుఖదుఃఖే త్వనిత్యే.
జీవో నిత్యో హేతురస్య త్వనిత్యః ॥౨॥ మహాభార.ఉ.ప.ప్రజాగర.౪౦.౧౧-౧౨.॥
ఏక ఏవ సుహృద్ధర్మో నిధనే ప్యనుయాతి యః ।
శరీరేణ సమం నాశం సర్వమన్యద్ధి గచ్ఛతి ॥౩॥ మను.౮-౧౭.
సత్యమేవ జయతే నానృతం సత్యేన పన్థా వితతో దేవయానః
యేనాక్రమన్త్యృషయో హ్యాప్తకామా యత్ర తత్సత్యస్య పరమం నిధానమ్ ॥౪॥
నహి సత్యాత్పరో ధర్మో నానృతాత్పాతకం పరమ్ ।
నహి సత్యాత్పరం జ్ఞానం తస్మాత్సత్యం సమాచరేత్ ॥౫॥ ఉపనిషత్.

ఈ మహాశయుల శ్లోకాభిప్రాయమును తమకనుకూలముగ నందఱు నిశ్చయము కలిగియుండుట యోగ్యము. ఇఁక నేయే పదార్థముల నేనెట్లు నమ్ముచున్నాఁడనో, వాని నిట సంక్షేపముగ వర్ణించుచున్నాఁడను। వీని విశేష వ్యాఖ్య ఈ గ్రంథమునం దాయా ప్రకరణములయందు వ్రాసియున్నాఁడను.

ఈశ్వరుఁడు :—

౧. "ఈశ్వరుఁడు" బ్రహ్మ, పరమాత్మ మున్నగు నామములు గల వాఁడు సచ్చిదానందాది లక్షణయుక్తుఁడు, పవిత్ర గుణకర్మ స్వభావములు గలవాఁడు, సర్వజ్ఞుఁడు, నిరాకారుఁడు, సర్వవ్యాపకుఁడు, అజన్మానంతుఁడు, సర్వశక్తిమంతుఁడు, దయాళువు, న్యాయకారి, సకలసృష్టికర్త, ధర్త, హర్త కర్మానుసారముగ సత్యన్యాయములతో జీవులకు ఫలప్రదాత మొదలగు లక్షణయుక్తుఁడు పరమేశ్వరుఁడని నమ్ముచున్నాఁడను.

ప్రమాణములు:—

2. నాలుగు "వేదములను" (విద్యాధర్మయుక్తమై యీశ్వర ప్రణీత మగు సంహితా-మంత్రభాగమును) నిర్భ్రాంత స్వతఃప్రమాణములని నమ్ము చున్నాఁడను. అవి స్వయముగ ప్రమాణరూపములుగ నున్నవి. అవి ప్రమాణము లగుట కితర గ్రంథాపేక్షలేదు. సూర్యుఁడుగాని, దీపముగాని తమ స్వరూపములకుఁదామే ప్రకాశములయి, పృథివ్యాదులను కూడా ప్రకాశింపఁ జేయుచున్నటులే యీ నాలుగు వేదములును గలవు. నాలుగువేదములకు బ్రాహ్మణ గ్రంథములు, షడంగములు, షడుపాంగములు, నాలుగుప వేదములు, ౧౧౨౭ (పదునొకండు వందల యిరువదియేడు) వేదశాఖలు అను నవి యన్నియు వేదములకు వ్యాఖ్యానరూపములుగ బ్రహ్మాది మహర్షులచే వ్రాయఁబడిన గ్రంథములు. ఇవి పరతఃప్రమాణములు. అనఁగా వేదానుకూలములై యుండునవి ప్రమాణములుగా వానిలోఁగల వేదవిరుద్ధములైన వచనములను అప్రమాణములుగా నంగీకరించుచున్నాడను.

ధర్మాధర్మములు:—

౩. సత్యభాషణాదియుక్తము, ఈశ్వరాజ్ఞయను వేదమున కవిరుద్ధము పక్షపాత రహితమగు న్యాయాచరణమును ధర్మమనియు. మిథ్యాభాషణాది యుక్తము ఈశ్వరాజ్ఞాభంగమును వేదవిరుద్ధమునగుపక్ష పాతసహిత అన్యాయా చరణమును అధర్మమనియు నమ్ముచున్నాఁడను.

౪. జీవుడు:—ఇచ్ఛా, ద్వేష, సుఖ, దుఃఖ, జ్ఞానాది గుణములతో, గూడినవాఁడు అల్పజ్ఞుఁడు నిత్యుడగు నతనిని "జీవుఁడని" నమ్ముచున్నాఁడను.

౫. జీవేశ్వర సంబంధము:—జీవేశ్వర స్వరూపములు వైధర్మ్యముచే భిన్నములును, వ్యాప్య వ్యాపకములును: సాధర్మ్యముచే నభిన్నములు

నయియున్నవి. అనఁగా నాకాశమునకంటె మూర్తిమంతమగు ద్రవ్యమెవ్వరును వేఱుగ నుండలేదు. ఉండదు. ఉండబోదు. అట్లే యొకటయియుండలేదు. ఉండదు. ఉండఁబోదు ఆ ప్రకారమే జీవేశ్వరులను, వ్యాప్యవ్యాపక, ఉపాస్య ఉపాసక, పితాపుత్రాది సంబంధ యుక్తముగ నమ్ముచున్నాడను.

౬. అనాది పదార్థములు:—అనాది పదార్థములు మూడు (ఒకటి) ఈశ్వరుఁడు (రెండవది) జీవుఁడు (మూఁడవది) ప్రకృతి—జగత్కారణము. వీనినే నిత్యములనియుఁ జెప్పుచున్నాను. ఏ పదార్థములు నిత్యములై యున్నవో వాని గుణకర్మ స్వభావములును నిత్యములేయని యెఱుఁగదగును.

౭. ప్రవాహ రూపమగు అనాది:—సంయోగముచే నేద్రవ్య గుణకర్మము లుత్పన్నములగుచున్నవో యవి వియోగమునకుఁ బిమ్మటనుండవు. కాని ప్రథమ సంయోగము దేనిచే నగుచున్నదో దానియందా సామర్థ్యము మాత్రమనాది. కాన మరల మరల సంయోగము వియోగము కూడనగును. ఈ మూఁడింటిని ప్రవాహ రూపమగు ననాది యని నమ్ముచున్నాఁడను.

౮. సృష్టి:—వేర్వేఱు ద్రవ్యములు జ్ఞానపూర్వకముగ, యుక్తిపూర్వకముగఁ గలసి నానారూపములు దాల్చుట సృష్టియనఁబడుచున్నది.

౯. సృష్టి ప్రయోజనము:—సృష్టించుటయందే ఈశ్వరుని గుణకర్మ స్వభావములు సఫలము లగుచున్నవి. కాన నదియే సృష్టించుటవలని ప్రయోజనము. ఎట్లనగా ఒకడొకనితో నేత్రములెందులకుఁ గలవని యడుగఁగా నతఁడు చూచుటకని యుత్తరమిచ్చును. ఆ ప్రకారమే సృష్టింపగల యీశ్వర సామర్థ్య సాఫల్యము సృష్టించుట యందేగలదు. జీవులకుదగురీతిని కర్మ భోగముల ననుభవింపఁజేయుట మొదలగునవి కూడఁ గలవు.

౧౦. సృష్టికర్త:—"సృష్టి సకర్తృకము" దీనికి పైఁజెప్పిన యీశ్వరుఁడే కర్త. సృష్టి రచనను జూచుటవలనను, జడపదార్థములందుఁ దమంతటఁ దామే (తగురీతిని) బీజాది స్వరూపముల దాల్చు సామర్థ్యము లేకపోవుట వలనను "సృష్టికర్త" అవశ్యముగాఁ గలడని నొప్పుదును.

౧౧. బంధము:—సనిమిత్తకము అనఁగా అవిద్యా నిమిత్తము వలన కలుగును. పాపకర్మములనఁబడు ఈశ్వర భిన్నోపాసనము, అజ్ఞానాదులు. అనునవన్నియు దుఃఖముల కారకములు. అందుకే కద కోరిక లేనిదాని ననుభవింపవలెనని వచ్చుచున్నది కాన నదియే బంధము.

౧౨. "ముక్తి-అనఁగా సమస్త దుఃఖముల నుండి విడివడి బంధ రహితుఁడు, సర్వవ్యాపకుఁడునగు నీశ్వరునియందు అతని సృష్టియందు స్వేచ్ఛాపూర్వకముగ సంచరించుట; నియత సమయమువఱకు ముక్త్యానంద మనుభవించి మరల సంసారమునకు వచ్చుట.

౧౩. ముక్తి సాధనములు:—ఈశ్వరోపాసనము అనఁగా యోగాభ్యాసము, ధర్మానుష్ఠానము, బ్రహ్మచర్యముచే విద్యాప్రాప్తి, ఆప్త విద్వాంసుల సాంగత్యము, సత్యవిద్య, సువిచారము, పురుషార్థము మొదలయినవి.

౧౪. అర్థము:—ధర్మపూర్వకముగ సాధింపఁబడునదియే 'అర్థము' అధర్మముచే సిద్ధమగుదాని ననర్థమందురు.

౧౫. కామము:—ధర్మార్థములచే ప్రాప్తమగునది "కామము."

౧౬. వర్ణాశ్రమములు:—వర్ణాశ్రమములను గుణకర్మముల యోగ్యతనుబట్టి నమ్ముచున్నాఁడను.

౧౭. రాజు:—శుభగుణ, కర్మస్వభావములచేఁ బ్రకాశమానుఁడు, పక్షపాత రహితుఁడు, న్యాయధర్మముల సేవించువాడును, ప్రజలలో పితృతుల్యముగ వర్తించుచు వారిని పుత్రులవలె భావించి వారి యున్నతి కొఱకు సుఖాభివృద్ధికొఱకు సర్వదా ప్రయత్నము చేయువాఁడునగు నతఁడే రాజనఁబడును.

౧౮. ప్రజలు:—మంచి గుణ కర్మ స్వభావములుగల వారు, పక్షపాత రహితమగు న్యాయ ధర్మములను సేవించుచు రాజప్రజలయున్నతిని గోరువారు, రాజ విద్రోహరహితులయి, రాజుతోఁ బుత్రులవలె వర్తించువారును "ప్రజ"లనఁబడెదరు.

౧౯. న్యాయకారి:—సర్వదా ఆలోచించుచు అసత్యమును త్యజించి, సత్యమును గ్రహించువాఁడు, అన్యాయకారులఁ దొలఁగించువాఁడు, న్యాయకారులను వర్ధిల్ల జేయువాఁడు, తన ఆత్మవలె సందఱ సుఖముల గోరువాఁడు నగునతఁడే న్యాయకారి యనఁబడును. వానిని నేనుగూడ యథాయోగ్యముగ నంగీకరించుచున్నాఁడను.

౨౦. దేవాసురులు:—విద్వాంసులను "దేవత"లని, పామరులను "అసురు"లని పాపాత్ములను "రాక్షసు"లని, అనాచారులను "పిశాచు"లని నమ్ముచున్నాఁడను.

సిద్ధాంతములనే స్వీకరించుచున్నాఁడను. మతమతాంతరములందుఁగల పరస్పర విరుద్ధములు నాకనిష్టములు, ఏమనఁగా నీ మతస్థులే తమతమ మతప్రచారము చేయుచు మనుష్యులఁ జిక్కించుకొని యొకరికొకరిని శత్రువులఁ జేయుచున్నారు కాన నీయంశమును ఖండించి సత్యమును ప్రచురింపఁ జేయుచు నందఱ నేక మతమున గూర్చుటకుఁ ద్వేషములఁ ద్యజింపఁ జేసి పరస్పర దృఢప్రీతి యుక్తులఁ గావించి యందఱితో నందఱకు లాభము గలుగఁ జేయుటకు మాత్రము నా ప్రయత్న మనియు నదియే నాయభిప్రాయమనియు గ్రహింప దగును. సర్వశక్తిమంతుఁడగు పరమేశ్వరుని కృపాసహాయముల చేతను ఆప్త పురుషుల సహాయము మూలముచేతను "ఈ సిద్ధాంతము" భూగోళమందంతట శీఘ్రముగ వ్యాపింపుఁగాక. దానివలన లోకులందఱు సనాయాసముగ ధర్మార్థ కామమోక్షములు సిద్ధింపఁ జేసికొని సదా వృద్ధిఁబొందుచు నానందము ననుభవింతురుగాక, ఇదియే నాముఖ్య ప్రయోజనము.



బుద్ధిమత్సుహృద్వరేషు కిమధిక మస్తి లేఖనీయమ్.

ఓం శన్నో మిత్రః శం వరుణః । శన్నో భవత్వర్యమా ।
శన్న ఇన్ద్రో బృహస్పతిః । శన్నో విష్ణు రురుక్రమః । నమో
బ్రహ్మణే । నమస్తే వాయో । త్వమేవ ప్రత్యక్షంబ్రహ్మాసి ।
త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మావాదిషమ్ । ఋతమవాది షమ్ ।
సత్యమవాదిషమ్ । తన్మామావీత్ । తద్వక్తారమావీత్ ।
ఆవీన్మామ్ । ఆవీద్వక్తారమ్ ॥ ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులు పరమవిద్వాంసులు
శ్రీ విరజానంద సరస్వతీ స్వాముల శిష్యులునగు
శ్రీమద్దయానంద సరస్వతీ స్వామి విరచితములు-
స్వమంతవ్యామంతవ్య సిద్ధాంత సమన్వితము,
సుప్రమాణ యుక్తమును సుభాషా విభూషితమునగు
సత్యార్థ ప్రకాశము సంపూర్ణము

౨౧. దేవపూజ:-విద్వాంసులు, మాత, పిత, ఆచార్యుడు, అతిథి న్యాయకారియగురాజు, ధర్మాత్ములగు జనులు, పతివ్రతాస్త్రీ, స్త్రీవ్రతుడైన పతి వీరిని సత్కరించుటయే "దేవపూజ" దీనికి విపరీతమైనది అదేవపూజ యనియు. మొదటివారి మూర్తులు పూజ్యములనియు, ఇతరపాషాణాది జడమూర్తులు సర్వథా అపూజ్యము లనియు నమ్ముచున్నాడను.

౨౨. శిక్ష:- "శిక్ష" విద్య, సభ్యత, ధర్మాత్మత, జితేంద్రియత మొదలగువాని వృద్ధిఁబొందించుచు అవిద్యాది దోషములను నశింపఁజేయునదియే శిక్ష.

౨౩. పురాణములు:- బ్రహ్మాదులచే రచింపఁబడిన ఐతరేయాది బ్రాహ్మణ గ్రంథములనే పురాణ, ఇతిహాస, కల్ప, గాథ, నారాశంసీయము లనిగ్రహించుచున్నాడను. ఇతర భాగవతాదులనుగాదు.

౨౪. తీర్థములు:-సత్యభాషణము, విద్య, సత్సంగత్వము, యమాదు, యోగాభ్యాసము, పురుషార్థము, విద్యాదానాది శుభకర్మములు అనునవే దుఃఖసాగరమునుండి తరింపఁజేయును. కాన వీనినే తీర్థములని నమ్ముచున్నాడను. ఇతర జలస్థలాదులనుగాదు.

౨౫. పురుషార్థము:- "పురుషార్థము ప్రారబ్ధముకంటె గొప్ప" ఏలనగా దానివలననే సంచిత ప్రారబ్ధము లేర్పడుచున్నవి. అది సవరింపఁబడిన సర్వమును సవరింపఁబడును. అదిచెడిన సర్వమును చెడును. కాన ప్రారబ్ధముకంటె పురుషార్థమే గొప్ప.

౨౬. ప్రవర్తన:- మనుష్యుడు అందఱితో యథాయోగ్యముగ, తన యట్లుగను సుఖ, దుఃఖ, హాని, లాభములందు వర్తించుట శ్రేష్ఠమనియు వేఱుగా వర్తించుట చెడుదనియు దలంచుచున్నాడను.

౨౭. సంస్కారములు:- దేనిచే శరీరము, మనస్సు, ఆత్మ అనునవి ఉత్తమములగునో దానిని "సంస్కార" మందురు. అవి నిషేకాది శ్మశానాంతము పదునాఱు విధములయియున్నవి. దీనిఁగర్తవ్యమని తలంచుచున్నాడను. దహనానంతరము మృతినొందినవాని కొఱకేమియుఁ జేయఁగూడదు.

౨౮. యజ్ఞము:- ఎందు విద్వాంసులకు సత్కారము యథాయోగ్య మైన శిల్పము-రసాయనమను పదార్థవిద్య, దాని ఉపయోగము, విద్యాది

కులగుణముల దానము, అగ్నిహోత్రాదుల వాయు వృష్టి, జల ఓషధు పవిత్రపఱచి, జీవులందఱకు సుఖముగలుగఁజేయుట అనునవి గలఁగ యదియే యజ్ఞమనఁబడును. కాన దాని సుత్తమమని దలంచుచున్నాఁడను.

౨౯. ఆర్యదస్యుయః:- శ్రేష్ఠపురుషులను "ఆర్యు" లనియు ఽ లను "దస్యు" లనియు నందురు. నేనుకూడ నట్లే నమ్ముచున్నాఁడను.

౩౦. ఆర్యావర్తము :- ఆది సృష్టినుండి ఆర్యులిందు నివసిం చున్నారు. గాన నీభూమికి "ఆర్యావర్త" దేశమని పేరు. కాని దీని య. ఉత్తరమున హిమాలయము వఱకు, దక్షిణమున వింధ్యాచలమువఱకు పశ్చి మున అటకు వఱకు పూర్వమున బ్రహ్మపుత్రినది వఱకు గలదు. ఈనాల్గి మధ్యనున్న భూభాగమునకు ఆర్యావర్త దేశమనిపేరు. ఇంక నిం దెల్లప్పుడుఁ వారినికూడ నార్యులనుట గలదు.

౩౧. ఆచార్యుఁడు:- సాంగోపాంగముగ వేదవిద్యలను జదివించువా సత్యాచారమును గ్రహింపజేయువాఁడు, మిథ్యాచారమును ద్యజింపఁ వాఁడునగు నతఁడే ఆచార్యుఁడనఁబడును.

౩౨. శిష్యుఁడు:- సత్యమైన శిక్షను, విద్యను గ్రహింపదగి ధర్మాత్ముఁడు విద్యాగ్రహణమం దిచ్ఛగలవాడు, ఆచార్యునకుఁ బ్రియుఁ వాఁడు నగు నతనిని "శిష్యు" డందురు.

౩౩. గురువులు:- తల్లి, దండ్రియు సత్యమును గ్రహింపఁజేఁ వాఁడును "గురువుల" అసత్యమునుఁ ద్యజింపఁ జేయువాఁడు గూడ "గురు వనంబడుచున్నాడు.

౩౪. పురోహితుఁడు:- యజమానునకు హితమొనర్చు వాఁడు, సత్యో పదేష్టయునగు నతఁడే "పురోహితుడు"

౩౫. ఉపాధ్యాయుఁడు:- వేదములందలి యొక భాగమును గాని, అం ములనుకాని చదివించువాఁడు "ఉపాధ్యాయుఁడు."

౩౬. "శిష్టాచారము" ధర్మాచరణ పూర్వకముగ బ్రహ్మచర్యమున విద్యను గ్రహించి, ప్రత్యక్షాది ప్రమాణములచే సత్యాసత్యముల నిర్ణయిం కొని, సత్యమును గ్రహించి. అసత్యమును బరిత్యజించుటయే శిష్టాచారః దీని నొనరించువాడు శిష్టుఁడనఁబడును.

౩౭. ప్రమాణములు:– ప్రత్యక్షాది 'అష్టప్రమాణములను' గూడ నంగీకరించుచున్నాఁడను.

౩౮. "ఆప్తుఁడు" యథార్థము చెప్పువాఁడు, ధర్మాత్ముఁడు. అందఱ సుఖముకొఱకుఁ బ్రయత్నము చేయువాఁడునగు నతనినాప్తుఁడని చెప్పుచున్నాఁడను.

౩౯. పరీక్ష:- అయిదు విధములగుచున్నది. (మొదటిది) ఈశ్వరుఁడు, అతని గుణకర్మ స్వభావములు, వేదవిద్య (రెండవది) ప్రత్యక్షాదులగు నెనిమిది ప్రమాణములు, [మూఁడవది] సృష్టిక్రమము, [నాల్గవది] ఆప్తుల వ్యవహారము, (ఐదవది) తన యాత్మ పవిత్రత, మఱియువిద్య అను నీ పంచ విధపరీక్షలచేత సత్యాసత్యములు నిర్ణయించుకొని సత్యమును గ్రహించి, అసత్యమును బరిత్యజింపఁ దగును.

౪౦. పరోపకారము:- దేనిచే మనుష్యులందఱ దురాచారములు, దుఃఖములు దూరమై శ్రేష్ఠాచారములు, సుఖములు వర్ధిల్లునో యటువంటి కార్యమును చేయుటయే పరోపకారమని భావించుచున్నాఁడను.

౪౧. స్వతంత్రుఁడుపరతంత్రుఁడు:-జీవుఁడు తన కార్యములందు స్వతంత్రుఁడు ఇఁకనీశ్వర వ్యవస్థానుసారము కర్మఫల మనుభవించుటయందు పరతంత్రుఁడు అటులే ఈశ్వరుఁడు తన సత్యాచారాది కర్మములందు స్వతంత్రుఁడని యెఱుఁగదఁగును.

౪౨. స్వర్గము:- సుఖవిశేషభోగమును, తత్సామగ్రి ప్రాప్తిని "స్వర్గ" మని యందురు.

౪౩. నరకము — దుఃఖవిశేషభోగమును, తత్సామగ్రి ప్రాప్తిని "నరక" మని యందురు.

౪౪. జన్మములు:—శరీరములు ధరించి ప్రకట మగుట 'జన్మము' అది పూర్వ, పర, మధ్య, భేదములఁబట్టి మూఁడువిధములని నమ్ముచున్నాడను.

౪౫. జన్మమరణములు:-శరీర సంయోగమునకు 'జన్మ' మనిపేరు. అట్లే వియోగమే మృత్యువనఁబడుచున్నది.

౪౬. వివాహము:- నియమపూర్వకముగ ప్రసిద్ధముగ స్వేచ్ఛాను సారముగ పాణిగ్రహణము చేయుటయే "వివాహ" మనఁబడును.